శ్రీరస్తు

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

శ్రీ వ్యాసమహర్షి ప్రణీత

# శ్రీమద్భాగవతము

## ఏకాదశ, ద్వాదశ స్కంధములు

విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రి విరచిత

తత్త్వదర్శినీ వ్యాఖ్యా సమేతము

శ్రీ బమ్మెర పోతరాజ పద్యానువాద సహితము




ప్రకాశకులు

శ్రీమద్భాగవత పరిషత్

హైదరాబాదు

1985

ప్రథమ ముద్రణము - 1985 రక్తాక్షి - వైకుంఠ ఏకాదశి.

ప్రతులు : 1000

**మూల్యము : 40/-**



**Paper used for Printing of this book was made available by Government of India, at cancessional rate.**

*గ్రంథము దొరుకుచోట్లు :*

**1. శ్రీ చదలువాడ జయరామశాస్త్రి**
ఉస్మాన్ సాహెబ్ పేట,
నెల్లూరు - 2

**2. శ్రీ Y. S. నారాయణ**
కార్యదర్శి, శ్రీమద్భాగవత పరిషత్,
3-6-687, 10వ వీధి, హిమయత్ నగర్,
హైదరాబాదు.

**3. శ్రీ P. శ్రీరఘురామ్, అడ్వకేట్**
ఆర్షవిజ్ఞాన ట్రస్ట్, 2-2-18/52,
దుర్గాబాయ్ దేశముఖ్ కాలనీ,
హైదరాబాదు - 500 013.

*ప్రకాశకులు :*

**శ్రీమద్భాగవత పరిషత్,**
హైదరాబాదు.

*ముద్రాపకులు :*

**దక్షిణ భారత్ ప్రెస్సు,**
ఖైరతాబాదు,
హైదరాబాదు - 500 004.




గురువాయూరప్ప

సాంద్రానందావబోధాత్మక మనుపమితం కాలదేశావధిభ్యాం
నిర్ముక్తం నిత్యముక్తం నిగమశతసహస్రేణ నిర్భాస్యమానమ్,
అస్పష్టం దృష్టమాత్రే పున రురుపురుషార్థాత్మకం బ్రహ్మతత్త్వం
తత్తావద్భాతి సాక్షా ద్గురుపవనపురే హంత భాగ్యం జనానామ్.

శ్రీరస్తు

శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.
శ్రీ గణేశ శారదా హయగ్రీవ దక్షిణామూర్తి గురుభ్యో నమః.

# తొలి పలుకు

శ్లో. మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః,
ఏతద్ధి దుర్లభం లోకే దైవానుగ్రహ కారకమ్.

మానవుడై జన్మించుట, మోక్షమును కోరుట, సద్గురుని యాశ్రయము లభించుట యీ త్రయమును దైవానుగ్రహము వలన లభించును. భూదేవికి శిరోభూషణమైన భారతదేశమందు గీర్వాణవాణీ ఝరి, వేద దర్శన స్మృతీతిహాస పురాణ కావ్య ప్రపంచమున సర్వతోముఖముగ ప్రవహించినది. ప్రాజ్ఞులు మన సారస్వతమును శ్రుతి పురాణ కావ్యరూపముగ మూడుగ విభజించిరి.

పురాణములు - శ్రీమద్భాగవతము

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ,
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్.

సృష్టి,లయము, దేవదానవుల వంశములు, వైవస్వతుడు లోనగు పదునలుగురు మనువుల చరిత్రలు, సూర్యచంద్ర వంశములందు జనించిన రాజులు లోనగు వారి చరిత్రమును వచించునది పురాణము. పురాణములు పదునెనిమిది.

వేదవ్యాసుడు వేదములు విభాగించి, భారతమును రచించి, పురాణములను పరిష్కరించి, బ్రహ్మసూత్రములను విరచించి చరితార్థుడై పూర్ణచంద్రుని పగిది శోభిల్లుచున్నాడు. ఇంత వాఙ్మయమును గ్రంథరూపమున రచించినను మనశ్శాంతి లేక సరస్వతీ తీరమున వ్యాకులుడై సంచరించుచుండగా దేవర్షి నారదుడు వ్యాసుని కుశల ప్రశ్నము చేసి, మనో వ్యాకులత నెఱింగి, ఓ పరాశరనందనా! అన్ని విధములగు సారస్వతమును ప్రకటించితివి. భగవంతుని గుణనామకీర్తనము చేయనైతివి కావున శ్రీ మహావిష్ణువు మహిమను ప్రకటించు నొక పురాణము రచింపుము అని బోధించి చనెను.

అందు మీదట వ్యాసుడు శ్రీమద్భాగవతమును రచించి, భగవదనుగ్రహము గాంచి, మనశ్శాంతి నొంది, తన పుత్రుడు శుకునిచే పరీక్షిత్తునకు చెప్పుట ద్వారా రాబోవు మన వంటి జిజ్ఞాసులగు భక్తులకు, యోగులకు, జ్ఞానులకు, కర్మఠులకు, ఉపాసకులకు భక్తిప్రపత్తుల మూలమున చక్కని రాజమార్గమును కల్పించి ప్రపంచము నందు యోగ్యులగు ప్రజలనెల్ల ధన్యులను చేయుచున్నారు.

ఇట్టి పురాణతల్లజమగు శ్రీమద్భాగవతమున కాంధ్రమున టీకాతాత్పర్యములు వ్రాసిన బాగుగా నుండునను తలంపు దైవానుగ్రహమునకలిగినది. అందుమీదట పట్టుదలతో ప్రారంభించి శ్రీమద్భాగవతమునకు ప్రతిశ్లోకమునకు టీకాతాత్పర్యము వ్రాసితిని. ఇట్లు ప్రథమస్కంధము మొదలు ద్వాదశస్కంధము వఱకు 12 స్కంధములకు టీకాతాత్పర్యములు వ్రాయబడినవి.

భాగవతనాయకు డగు శ్రీకృష్ణభగవానుని చరిత్రమును దశమస్కంధము వచించును. కావున ఆదశమస్కంధము ముద్రింప నెంచి, రెడ్డికులావతంసులు, నెల్లూరు తాలూకా వరకలి పూడి గ్రామ వాస్తవ్యులు, శ్రీమంతులు శ్రీశ్రీమారంరెడ్డి రామస్వామిరెడ్డిగారి నాశ్రయించితిని. వారు తమ మాతృదేవి స్మరణార్థము 22 వేల రూప్యములు వ్యయించి భాగవతము దశమ స్కంధము పూర్వభాగము ముద్రింపించి ప్రకటించిరి. వారి కెంతయో కృతజ్ఞుడనై యున్నాను.

దైవకృపవలన నాకు శ్రీశ్రీశ్రీ పమిడిఘంటం కోదండరామయ్య, న్యాయవాది (ఇప్పుడు హైకోర్టు న్యాయమూర్తులుగ నున్నవారు) గారితో పరిచయము కలిగినది. వారును ఏకాదశ ద్వాదశస్కంధములు రెంటిని, తమతండ్రిగారు స్వర్లోకనివాసి పమిడిఘంటం శ్రీరాములుగారి పేర ముద్రింపించి గురుపవన పురాధీశ్వరుడైన శ్రీకృష్ణభగవానునకు సమర్పించిరి. ఇట్టి మహాభాగ్యము శ్రీకోదండరామయ్యగారివలన నాకు కలిగి ధన్యుడనై వారిని వినయవిధేయత లతో ప్రశంసించుచు, వారి కీర్తిలక్ష్మి ఆంధ్రదేశముననే కాక యావద్భారతమునను శోభిల్లవలె నని ఆకాంక్షించుచున్నాను.

ఈ గ్రంథమాతృకాపర్యవేక్షణముద్రణలలో ఎనలేని సహాయ మందజేసిన కళాప్రపూర్ణ డా దివాకర్ల వెంకటావధాని శ్రీ చలమచర్ల వేంకటశేషాచార్యులు గార్లకు నాకృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

శ్రీమద్భాగవతము దశమస్కంధము ఉత్తరభాగముప్రచురణనిమిత్తమై ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి వారు ఆర్థిక సహకారము చేసియున్నారు. మెసర్స్ స్టెన్సిల్స్ అండ్ స్టెన్సిల్సు లిమిటెడ్ వారును ముందుగనే కొంత ధనసహాయముచేసియున్నారు. ఇపుడే ఏకాదశ, ద్వాదశస్కంధముల ప్రచురణ పూర్తియైనది కనుక త్వరలోనే అదియు వెలువడునని మనవి చేయుచున్నాను. ఆగ్రంథ ప్రకటన భారముగూడ శ్రీ కోదండరామయ్య గారి పైనే యుంచి యున్నాను శ్రీ కోదండరామయ్య సకుటుంబముగ దీర్ఘాయుష్మంతులై సిరిసంపదలలో నితోధిక శ్రేయస్సుల నంది ప్రకాశించుగాక యని మఱి మఱి పరమేశ్వరుని ప్రార్థించు చున్నాను.

| | |
|---|---|
| ఉస్మాన్ సాహెబుపేట | ఇట్లు |
| నెల్లూరు-2 | *సర్వ పండిత కవి భక్త సుధీజన విధేయుడు,* |
| స్వస్తి శ్రీ రక్తాక్షి నామ సం॥ | **చదలువాడ జయరామశాస్త్రి** |
| మార్గశిర కృష్ణపక్షము తృతీయ- | |
| జయవారము. ది. 11-12-1984. | |



'స్వర్లోకవాసి' పమిడిఘంటం శ్రీరాములుగారు.

# ప్రస్తావన

శ్రీమన్మహాభారతమును, పురాణములను రచించియు విషణ్ణుడై సరస్వతీ నదీతీరమున కూర్చుండిన వ్యాసుని కడకరిగి నారదుడు "విష్ణువు ధర్మముల్ ప్రపంచించిన మెచ్చునే గుణ విశేషము లెన్నినఁగాక" అని తెల్పి అతనిని భాగవత పురాణ రచనకు ప్రేరేచెను, వ్యాసుడు శ్రీమద్భాగవతమును రచించి తన కుమారుడైన శుకునకు బోధించెను. శ్రీశుకు డా భాగవతమును విప్రశాపసంతప్తుడై ప్రాయోపవేశమున నుండిన పరీక్షిన్మహారాజున కెఱింగించి ఆతనికి మోక్షమార్గమును చూపెను.

మహాభక్తుడైన బమ్మెర పోతన శ్రీరామచంద్రుని యానతిచే భాగవతము నాంధ్రీకరించెను. కారణాంతరములచే నందలి కొన్ని భాగములు శిథిలములై పోగా, వాని నాతని శిష్యులో మిత్రులో యైన సింగన గంగన నారయలు పూరించిరి. పోతనయే వారిచే నా భాగములను పూరింపజేసె నని కొందఱు చెప్పుదురు. సత్యాసత్యములు నిరూపించుట కాధారములు లేవు. అం దేకాదశ ద్వాదశ స్కంధముల నాంధ్రీకరించినవాడు వెలిగందల నారయ. పోతన భాగవతము నాంధ్రీకరించుచు పెక్కుచోట్ల తన సొంత భావములు చొప్పించి చాలా చోట్ల మూలమును పెంచెను. నారయ యే కారణము చేతనో యేకాదశ ద్వాదశ స్కంధములను చాలవఱకు సంగ్రహించెను. పూర్వ కవులును ఆధునికులును కొందఱా రెండు స్కంధములను ద్విపదరూపముననో చంపూరూపముననో ఆంధ్రీకరించియుండిరి. కాని వాని కంత ప్రచారము లభింపలేదు. భక్త శిరోమణియైన పోతన ఆ స్కంధముల నాంధ్రీకరింపని కొఱత కొఱతగానే యుండి పోయినది.

సంస్కృత భాగవతమును వచనరూపమున ఆంధ్రీకరించినవారుకూడ కొందఱున్నారు. కొందఱు దానికి టీకాతాత్పర్యములు వ్రాసియున్నారు. కొంద ఱింకను వ్రాయుచున్నారు. పోతన చెప్పినట్లు భాగవతము బ్రహ్మతుల్యము. అది నిగమ కల్పతరువునుండి గళితమైన ఫలము. శుక ముఖోద్గత మగుటచే మధుర ద్రవ సమ్మితము. దాని నెందఱో యెన్నో విధముల నాస్వాదింప యత్నించుటలో నాశ్చర్యములేదు. నెల్లూరు వాస్తవ్యులు, మహాపండితులు, బహుగ్రంథకర్తలు నైన బ్ర. వే. శ్రీ చదలువాడ జయరామశాస్త్రిలుగారు శ్రీమద్భాగవతమునకు టీకా తాత్పర్యములు వ్రాసి, యందు ఆ యా శ్లోకములకు సంబంధించిన పోతన పద్యములను కూడా చేర్చియున్నారు. అందలి దశమస్కంధము నందలి పూర్వభాగము మాత్రము ముద్రితమై అశేషాంధ్రలోక సన్నుతు లందినది. ఆవిధాన మత్యంత విశిష్టమైనది కదా! దానిని చూచిన పిమ్మట ప్రస్తుతము ఆంధ్రప్రదేశ-ఉన్నత న్యాయస్థానమున న్యాయమూర్తులును, సారస్వత ప్రియులును, ఔదార్యమూర్తులును, తత్వజిజ్ఞాసువులు నైన శ్రీ పమిడిఘంటం కోదండ

రామయ్యగారికి శిష్ట భాగములను కూడ నా విధముగా ముద్రింపించుట లోక శ్రేయస్కర మగునను నభిప్రాయ ముదయించినది. వారు శ్రీ జయరామశాస్త్రిగారిని హైదరాబాదు రప్పించి వారు రచించిన గ్రంథము పరిశీలించి వారిని యథోచితముగ సత్కరించియుండిరి. ఆంధ్రభాగవతమున ఏకాదశ ద్వాదశస్కంధము లతి సంగ్రహముగా నుండుట చేతను వారు తొలుత చివరి రెండు స్కంధములను ప్రకటించుట యెక్కువ సమంజసముగా నుండు నని ఊహించిరి. తమ పితృపాదులైన కీ. శే. పమిడిఘంటం శ్రీరాములుగారి సంస్మరణార్థము హైదరాబాదు నందలి శ్రీ భాగవత పరిషత్తు పక్షమున వానిని ప్రకటింపవలె నని వారి సంకల్పము. ఆ సంకల్ప మిప్పుడు సఫల మగుచుండుట ముదావహము.

ఏకాదశ ద్వాదశ స్కంధములకు వ్యాఖ్యాతలైన శ్రీజయరామ శాస్త్రులవారు వృద్ధులగుటచే మొదట వారి నివాసమైన నెల్లూరుననే ముద్రణము చేయింపవలెనని అచ్చటి ముద్రణాలయమునకు కాగితము పంపుటయు ఆముద్రణాలయము వారు రెండుఫారములు ముద్రించుటయు జరిగినది. కాని అవి బహుదోషభూయిష్ఠములుగా నుండుటచే కాగితముతో పాటు ముద్రణకార్యము మరల హైదరాబాదునకు తరలించుట సంభవించినది. కొంత కాగితమును, కాలమును వ్యర్థములైనవి. 'శ్రేయాంసి బహువిఘ్నాని' అనులోకోక్తి సత్యమైనది. శ్రీశాస్త్రులవారు చిన్న చిన్న అక్షరములు వ్రాయుటచే గ్రంథము మరల విశదముగా వ్రాయింపవలసి వచ్చినది. ముద్రణము హైదరాబాదునందలి దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారి ముద్రణాలయమున జరిగినది. గ్రంథము సరిచూచి ప్రూపులు దిద్దు క్లేశకరమైన భారమును పండితాగ్రగణ్యులైన శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులుగారు వహించిరి. ఈ సందర్భమున వారు కావించిన సాహాయ్యమునకై కృతజ్ఞత వెల్లడించుటకు మాటలు చాలవు. స్కంధద్వయ సహితమైన యీ గ్రంథమీవిధముగా రూపు దాల్చుటకు నిరవధికమైన వారి కృషియే కారణము.

ఏకాదశస్కంధమున 31 అధ్యాయము లున్నవి. భూభారావతరణార్థము విష్ణువు కృష్ణుడుగా యదువంశమున నవతరించి వివిధ లీలల నొనరించుట దశమస్కంధమున వర్ణింపబడినది ఇం దాతడు యోగమాయా వైభవము నుజ్జగించి, దేవాంశజు లగు యాదవులను మౌసల వ్యాజమున తమ తమ అధికారస్థానములకు పంపి, బ్రహ్మాదుల ననుగ్రహించుటకై తాను నిజపదము చేరుట నిరూపింపబడినది. ఋషభునికి నిమికిని జరిగిన సంవాదము ద్వారా పరమాత్మతత్త్వము సమగ్రముగ వివరింపబడినది. తరువాత భగవంతు డగు కృష్ణుడుద్ధవునకు తత్త్వమును సవిస్తరముగా బోధించెను. 30, 31 అధ్యాయములలో మౌసలక్రీడ వర్ణింపబడినది. మొదటి యై దధ్యాయములలో నారదుడు వసుదేవునికి కర్మచే కర్మనిర్హారమెట్లగునో సమగ్రముగా తెల్పియున్నాడు. ధర్మమార్గమున లభించిన విత్తముతో నిష్కామముగా కర్మముల నాచరించుటచే కర్మబంధ విముక్తి యగునని అందలి సారాంశము.

ద్వాదశ స్కంధమున 13 అధ్యాయము లున్నవి. ఇందా అధ్యాయములను శుకుడు పరీక్షిత్తునకును, ఖిలము లనబడు మిగిలిన యే డధ్యాయములను సూతుడు శౌనకాదులకును చెప్పియుండిరి. వీనిలో ఆశ్రయము (ఉత్పత్తి స్థితిలయము లెందగుచు ప్రకాశితము లగునో

అది ఆశ్రయము) అను దశమ పురాణ లక్షణమును, కాలవైషమ్యమును, లయావధికములైన ప్రళయములును వాని కధిష్ఠానమైన మహాపురుషుని లక్షణములును వివరింపబడినవి. ఇందు మాగధవంశ భూపతుల చరిత్రయు, సంకరాది దోషములచే నావంశము చివర మలినమైన విధమును చెప్పబడినవి.

దశమస్కంధమందలి ఉత్తర భాగమును, మొదటి తొమ్మిది స్కంధములను కూడ భాగవత పరిషత్తు వారిట్లే అచిరకాలమున ప్రకటించుటకు యత్నించుచున్నారు. ఈ రెండు స్కంధములను విశదముగా ముద్రించి యిచ్చిన దక్షిణ భారత ముద్రణాలయమువారికి మా కృతజ్ఞతలు.

కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వెంకటావధాని

శ్రీరస్తు

# శ్రీమద్భాగవతము - ఏకాదశ స్కంధము

ఆంధ్ర టీకా తాత్పర్య సహితము

## ప్రథమాధ్యాయము

### సంగ్రహ శ్లోకములు

శ్లో. విజయంతే పరానంద కృష్ణపాదరజస్స్రజః,
యా ధృతా మూర్ధ్ని జాయంతే మహేంద్రాదిమహస్స్రజః.
ఉక్తైక త్రింశతాధ్యాయై ర్ముక్తి రేకాదశే తతః,
జాయంతేయేతిహాసాద్యైః సమాసవ్యాసరూపతః.
నారదో వసుదేవాయ సమాసేన న్యవర్ణయత్
భగవా నుద్ధవాయాథ విస్తరే ణోపపత్తిభిః.
తత్ర తు ప్రథమేఽధ్యాయే యదువంశస్య సంక్షయః,
ఉపక్షిప్తో విరాగాయ మౌసలవ్యపదేశతః
ప్రవృత్తితః పరానంద కృష్ణక్రీడాఽనువర్ణితా
తన్నివృత్త్యా పరానంద పదారోహోఽను వర్ణ్యతే.

ఏ పూదండలు తల దాల్పబడినవై దేవేంద్రాదులకు తేజోమాలిక లగుచున్నవో అట్టి పరమానంద స్వరూపుడగు శ్రీకృష్ణుని పాదధూళులు అను పూదండలు సర్వోత్కర్షతో మెఱయు చున్నవి.

ఈ ఏకాదశస్కంధమున ముప్పదియొక్క అధ్యాయములలో జాయంతేయుల (జయంతి పుత్రుల) ఇతిహాసము మున్నగువానిచే సంక్షేపముగను, విపులముగను గూడ ముక్తి మార్గము వివరింపబడినది.

నారదుడు వసుదేవుని కీ ముక్తిమార్గమును సంగ్రహముగ వర్ణించెను. శ్రీకృష్ణభగవాను డుద్ధవునకు యుక్తియుక్తముగ దీనినే విపులముగ వివరించెను.

అందు ప్రథమాధ్యాయమున విరక్తి కొఱకై మౌసల మను నెపముతో యదువంశ వినాశము విశదీకరింపబడినది.

ఇంతవఱకు అవతారోచితప్రవృత్తి (వ్యాజము) తో పరమానందకారణమగు శ్రీకృష్ణుని క్రీడ వర్ణితమైనది. దానిని (అవతారోచిత ప్రవర్తనరూప మగు యోగమాయా వైభవము) ఉజ్జగించిన శ్రీకృష్ణుని పరమానందమగు నిజపదారోహణ మిటుపై వర్ణింపబడు చున్నది.

అవతారిక. దశమస్కంధమునందు భూభారనివారణార్థమై, స్వవైభవముచే యదు వంశము నలంకరించినవాడు, యదుకులమునం దవతరింపజేయబడిన సకలదేవకాంశలు కల్ల

వాడగు శ్రీకృష్ణభగవానుడు తన యవతారమునకు తగినట్లుగ ప్రవర్తించుట యను నెపముతో తన్ను గూర్చి ధ్యానాదులు చేయుటయందాసక్తులైన వారికి పరమానందము కలిగించుచు క్రీడించుట వర్ణింపబడినది. ఇటుపై, యోగమాయావైభవము నజ్జగించిన శ్రీకృష్ణుడు, తన భక్తుల కాత్మతత్త్వోపదేశపూర్వకముగా క్రీడార్థము భూతలమం దవతరింపజేయబడిన అధికారులు, దేవాంశలగు వారిని మౌసలవ్యాజమున తమ తమ అధికారస్థానములకు పంపివేయుటద్వారా, బ్రహ్మాదుల ననుగ్రహించుటకై నిజపదారోహణము (వైకుంఠమున కేగుట) నిరూపించబడుచున్నది.

అందు కురుక్షేత్రయాత్రచే విరక్తుడు గానట్టి వసుదేవుడు 'కర్మణా కర్మనిర్హారో యథా స్యాన్నస్తదుచ్యతామ్' (స్కం. 10- అ. 84. శ్లో. 29) కర్మచే కర్మబంధము తొలగు ప్రకారము మాకు చెప్పుము అని నారదాదులను ప్రశ్నింప,

శ్లో. కర్మణా కర్మనిర్హార ఏష సాధు నిరూపితః,

.... .... ... .... ....

యచ్ఛ్రద్ధయాప్తవిత్తేన శుక్లే నేజ్యేత పూరుషే.

(స్కం. 10- అధ్యా. 84- శ్లో. 35, 37)

(కర్మచే కర్మబంధవిముక్తి కలుగుట యను నీ మార్గ మిట చక్కగా నిరూపితమైనది. నిష్కామనచే శుద్ధమై, లభించిన విత్తముతో ఈశ్వరు నారాధించుటే ఆ మార్గము) ఇత్యాదులచే వసుదేవునకు కర్మయోగము నిరూపింపబడినది. దానిచే శ్రీరామకృష్ణులు పరమేశ్వరు లని యెఱింగిన వసుదేవునకు షడ్గర్భానయనాధ్యాయమున (స్కం. 10; అధ్యా. 85; శ్లో. 25 నుండి 59 వఱకు) శ్రీకృష్ణుడు—

శ్లో. వచో వస్సమవేతార్థం తాతైత దుపమన్మహే,

యన్నః పుత్రాన్ సముద్దిశ్య తత్త్వగ్రామ ఉదాహృతః. (10-85-22)

"ఓ తండ్రీ! మీరు వచించిన అర్థవంతమగు వచనము సరియైనదని తలంచుచున్నాము. మీరు పుత్రుల మగు మమ్ముల నుద్దేశించి యనేక తత్త్వములను చక్కగా నిరూపించితిరి." అని మొదలిడి ఆత్మతత్త్వము నుపదేశించెను. ఆ తత్త్వము అధికమగు విషయభోగముచే మఱల తిరోహిత మయ్యెను. అదియే ఇపుడు నారదముఖమున మొదటి ఐదధ్యాయములచే నిరూపించబడుచున్నది. అందు ప్రథమాధ్యాయమున వైరాగ్యము కలుగు కొఱకు యదువంశమునకు బ్రాహ్మణశాపము నెపమున, అత్యున్నతమైన విషయసుఖములకును అనిత్యత ప్రతిపాదింపబడుచున్నది. తరువాతి నాలుగధ్యాయములచే ఋషభునికి జయంతియందు జనించుటచే జాయంతేయు లనబడు తొమ్మండ్రకును, విదేహరాజగు నిమికిని జరిగిన సంవాదముద్వారా సమగ్రముగ పరమాత్మతత్త్వము నిరూపింపబడినది. తర్వాత షష్ఠాధ్యాయమందు భగవంతునికి-ఉద్ధవునికి జరిగిన సంవాద ప్రస్తావమును, అనంతరము ఇరువదిమూ డధ్యాయములచే భగవంతు డుద్ధవునికి తత్త్వ నిరూపణ మొనర్చుటయు, పదంపడి రెండధ్యాయములలో మౌసలక్రీడయు (ముసలము వలన చెఱుపు గలుగుట) తెలుపబడినవి. అని ఇట్లు ముప్పదియొక్క అధ్యా

యములతో ఏకాదశ స్కంధ మేర్పడినది. దీనికి నా బుద్ధికి గోచరించినంతమాత్రముగ వ్యాఖ్యానము ప్రారంభించబడుచున్నది (శ్రీధరస్వామి చెప్పినది). అందు మౌసలప్రసంగము కొఱకు పూర్వస్కంధవిషయమును రెండు శ్లోకములతో అనువదించుచున్నారు—

* శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకులు చెప్పిరి

శ్లో. కృత్వా దైత్యవధం కృష్ణ స్సరామో యదుభి ర్వృతః,
భువోఽవతారయ ద్భారం జవిష్ఠం జనయన్ కలిమ్. 1

అ. సరామః కృష్ణః = బలరామునితోఁ గూడి కృష్ణుఁడు; దైత్యవధం కృత్వా = దైత్యుల వధను గావించి; యదుభిః వృతః = యదువులతో గూడినవాఁడై; జవిష్ఠం = వేగవత్తమమైన; కలిం = కలహమును; జనయన్ = పుట్టించుచు; భువః భారం = భూమియొక్క భారమును; అవతారయత్ = తొలగించెను.

తా. బలరామునితోఁ గూడి శ్రీకృష్ణుఁడు దైత్యులను వధించి యదువులతోఁ గూడియుండి, అతి శీఘ్రముగా కౌరవ పాండవులకు కలహము పుట్టించి భూభారమును నివారించెను.

శ్లో. యే కోపితా స్సుబహు పాండుసుతా స్సపత్నై
ర్దుర్ద్యూత హేళన కచగ్రహణాదిభి స్తాన్,
కృత్వా నిమిత్త మితరేతరత స్సమేతాన్
హత్వా నృపా న్నిరహర త్క్షితిభార మీశః. 2

అ. యే పాండుసుతాః = ఏ పాండురాజు కుమారులు; సపత్నైః = తమకు శత్రువులైన దుర్యోధనాదులచే; దుర్ద్యూత హేళన కచగ్రహణాదిభిః = కపటపు జూదము; అవమానము, దుశ్శాసనుఁడు ద్రౌపది జడను బట్టుట లోనగు అపకారములచే; సుబహు = అత్యధికముగా; కోపితాః = కోపమొంద జేయబడినవారైరో; తాన్ నిమిత్తం కృత్వా = ఆ యపకృతులను నిమిత్తముగాఁ జేసికొని; ఇతరేతరతః = ఉభయ పక్షములందును; సమేతాన్ నృపాన్

శ్రీమదాంధ్ర మహాభాగవతము – ఏకాదశ స్కంధము

కం. శ్రీ సీతాపతి! లంకేశాసుర సంహార! చతుర శాశ్వత సుతవాణీ సత్యధిభూభవ వృత్రాసురరిపు దేవజాల! రామనృపాలా! 

వ. మహనీయగుణగరిష్ఠు లగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుం డైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డయ్యై జన్మ కర్మ వ్యాధి విమోచనంబునకుం గారణం బగు దివ్యౌషధంబు గావున, శ్రీమన్నారాయణ కథామృతంబు గ్రోలు మని యిట్లనియె. 2

మ. బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁడై
కలనన్ రాక్షస వీరవర్యుల వడిన్ ఖండించి భూభారము
జ్జ్వలమై యుండఁగ నక్షకేళి కతవన్ గౌరవ్యుఁ డోడ్డోన త
ద్బలమున్ పాండవ సైన్యము న్నడఁచె భూభాగంబు కంపింపఁగన్. 3

వ. అంత. 4

కం. మునివరులు సంతసిల్లిరి, యనయము నందాములకును హర్షం బయ్యెన్
దన నిజభక్తులు యాదవ ఘనవీర సమూహ మఘను గడు కొప్పెరగన్. 5

= కూడిన రాజులను; హత్వా = వధించి, ఈశః = ఈశ్వరుఁడు, శ్రీకృష్ణుడు; క్షితిభారం = భూభారమును; నిరహరత్ = హరించెను

తా. తమ వంశమువారై సోదరులైన దుర్యోధనాదులు, కపటపుజూదము, అవమానము, దుశ్శాసనుఁడు ద్రౌపది జడఁబట్టి యీడ్చుట, విషము పెట్టుట, లక్కయిల్లు గాల్చుట లోనగు పెక్కు అపకారములు చేయఁగా పాండుకుమారులు(ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు) మిగుల కోపము పొందినవారై ఆ యపకారములను నిమిత్తముగాఁ బురస్కరించుకొని కౌరవులతో యుద్ధముచేయఁగా ఇరుపక్షములందు సహాయులుగా వచ్చిన రాజులను వధించి తద్ద్వారా పరమేశ్వరుఁడగు కృష్ణుఁడు భూభారమును నివారించెను.

ఎవ్వరు ప్రసిద్ధులైన పూతనాది దైత్యులు గలరో వారిని భగవంతుఁడు తానే స్వయముగా వధించెను. ఇతరులగు ప్రలంబాదులను బలభద్రునిచే చంపించెను. బంధువులను నెపముతో నున్న దైత్యులను పరస్పరము నిమిత్తము (కలహకారణము) పుట్టించి యాదవులచే చంపించి భూభారమును నివారించెను. అని అర్థము.

శ్లో. భూభారరాజపృతనా యదుభి ర్నిరస్య
గుప్తైః స్వబాహుభి రచింతయ దప్రమేయః,
మన్యేఽవనే ర్నను గతోఽప్యగతో హి భారః
యద్యాదవం కుల మహో అవిషహ్య మాస్తే. 3

అ. భూభారరాజపృతనాః = భూమికి భారభూతమైన రాజుల సేనలను; స్వబాహుభిః గుప్తైః = తన బాహువులచే రక్షితులగు; యదుభిః నిరస్య = యాదవులచే వివాహాది వ్యాజముచ చంపి; బాహుభిః అను బహువచనము చతుర్భుజము లను అభిప్రాయముచే చెప్పఁబడినది. ఓయీ ! ఈ ప్రకారము శ్రీకృష్ణుఁడు చేయగోరుచుండ తెలిసి యాదవులు శ్రీ కృష్ణునిపై కోపము చెంద కెట్లుండిరి? అనిన అందుకు చెప్పుచున్నారు. అప్రమేయః=ఇంతటి వాఁడని నిశ్చ

---

మ. విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారమున్ మాన్ప దు
ర్మద సంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదిముట్టన్ వధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమిమోవఁగ నసహ్యం బయ్యె వత్యుగ్రమై. 6

సీ. ఈ రీతిఁ గృష్ణుండు నేపారఁ బూతనా శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక దైత్యాఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి యటమీఁదఁ గురుబలం బణఁచి మఱియు
ధర్మజు నభిషిక్తుఁ దవరగాఁ జేసిన నతఁడు భూపాలనం బమరఁ జేసె

తే. భక్తులగు యాదవేంద్రులఁ బరఁగఁ జూచి,
యన్య పరిభవ మెఱుఁగ రీ యదువు లనుచు,
వీరిఁ బరిమార్ప నేఁ దక్క వే ఱొకండు,
దైవమిఁక లేదు త్రిభువనాంతరములందు. 7

వ. అని వితర్కించి జగదీశ్వరుం డత్యున్నత వేణుకాననంబు వాయువశంబున నొఱసికొన నవలం బుద్భవంబై దహించు చందంబున యదుబలంబుల కన్యోన్యవైరానుబంధంబులు కల్పించి హతం బొనర్పెద నని విప్రశాపంబు మూలకారణంబుగాఁ దలచి యదుబలంబుల నడంచె.... 8

యించి చెప్పుటకు శక్యము కానివాఁడు, ఇంతటి వాఁడని కల్పించుటకు అశక్యుఁడు; అచింతయత్ = ఆలోచించెను వను = ఏమిది; అవనేః భారః = భూమియొక్క భారము; గతః అపి = లోకము తీఱునుబట్టి గతించినదై వను; అగతః హి మన్యే = నివారణము కాలే దనియే తలంతును; యత్ = ఏలయనఁగా; యాదవకులం = యాదవవంశము; అవిషహ్యం = సహింప శక్యము గానిదై; అహో = గొప్పగా నున్నది. దానిచే స్వవంశమును నాశము చేయకూడదని సూచింపఁబడెను.

తా. భూమికి భారమైన భూరాజన్యుల సేవలను తనబాహురక్షణముననున్న యాదవులచే చంపించెను, ఆవల ఇంతటివాఁడని తెలియుటకు శక్యముగానివాఁడగు భగవంతుఁడు తానిట్లు చింతించెను. కౌరవపాండవసంగ్రామముద్వారా ఒక విధముగా లోకము తీఱును బట్టి భూభారము గతించినట్లు గన్పట్టినను నిజముగ పూర్తిగా భూభారము నివారణము కాలేదనియే నేను తలంచుచున్నాను. ఏలయన శత్రువు లెదుర్కొనుటకు సాధ్యముకాని (సహింపరాని) బలిష్ఠమైన యాదవవంశము నిల్చియున్నది. ఇదియును భూభారమే యగును. కాని తన వంశమును తాను నాశము చేయుట ధర్మము కాదని సూచించెను.

అవ. అట్లయిన నిపు డన్యులచే జయింపఁ దగునా అనగా నందుకుఁ జెప్పుచున్నారు.

శ్లో. నైవాన్యతః పరిభవోఽస్య భవే త్కథంచి
న్మత్సంశ్రయస్య విభవోన్నహనస్య నిత్యమ్,
అంతఃకలిం యదుకులస్య విధాయ వేణు
స్తంబస్య వహ్నిమివ శాంతి ముపైమి ధామ. 4

అ. మత్సంశ్రయస్య=నేను ఆశ్రయముగ గలది; విభవ+ఉన్నహనస్య = రథగజతురగ పదాతులచే నిరంకుశమైన; అస్య = ఈ యాదవకులమునకు; అన్యతః అపి = ఇతరులైన ఇంద్రాదులగు దేవతల వలనను; పరిభవః = తిరస్కారము; న భవేత్ ఏవ=జరుగనే జరుగదు; ఇప్పుడు ఏమి చేయఁదగు ననఁగా; యదుకులస్య = యదుకులమునకు అంతఃకలిం = అంతఃకలహమును; వేణుస్తంబస్య = వెదురుగుబురునకు; వహ్నిం ఇవ = అగ్నిని వలె. విధాయ =కావించి; శాంతిం ఉపైమి = శాంతిని పొందెదను; (అటుపైని) ధామ = నా స్థానమగు వైకుంఠమున కేగెదను.

తా నన్ను ఆశ్రయించి, చతురంగబలముచే బలిష్ఠమై, అభేద్యమైన యదుకులమునకు ఇతరులగు ఇంద్రాది దేవతల వలన సైతము పరాభవము కలుగనేరదు. కాబట్టి వెదురు పొదయందు అగ్ని జనించి ఆపొదనే దహించునట్లు యాదవులకు వారిలో వారికి అంతః కలహము పుట్టించి యదుకులము నంతను రూపుమాపి శాంతిని పొందుదును. తర్వాత స్వధామమగు వైకుంఠమునకు బోయెదను.

శ్లో. ఏవం వ్యవసితో రాజన్ సత్యసంకల్ప ఈశ్వరః,
శాపవ్యాజేన విప్రాణాం సంజహ్రే స్వకులం విభుః. 5

అ. రాజన్ = రాజా ! సత్యసంకల్పః, ఈశ్వరః = సత్య సంకల్పము గలవాడు; విభుః = ప్రభువగు కృష్ణుడు; ఏవం వ్యవసితః = ఇట్లు నిశ్చయమును పొందినవాడై; విప్రాణాం = విప్రుల యొక్క; శాపవ్యాజేన = శాపమను నెపమున; స్వకులం సంజహ్రే = తన కులమును హరించెను.

తా. ఓ రాజా ! సత్యసంకల్పుఁడు, ఈశ్వరుఁడు ప్రభువు అగు శ్రీకృష్ణుఁడు ఇట్లు నిశ్చయించు కొన్నవాఁడై విప్రుల శాపము నెపమున తన కులమును సంహారము కావించెను.

అవ. ఈ ప్రకారము తన యవతార ప్రయోజనమును సర్వమును సంపాదించి తన లోకమునకు బోయెనని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. స్వమూర్త్యా లోకలావణ్యనిర్ముక్త్యా లోచనం నృణామ్,
గీర్భి స్తాః స్మరతాం చిత్తం పదై స్తా నీక్షతాం క్రియాః. 6

అ. లోకలావణ్యనిర్ముక్త్యా = లోకముల లావణ్యమును త్రోసిరాజను; ఎవనిమూర్తిని బట్టి లోకమునకు లావణ్యమో అని; స్వమూర్త్యా = తన మూర్తిచే; నృణాం లోచనం = నరుల లోచనములను = నరుల దృష్టిని ఆకర్షించి, అప్పుడున్న ఎల్లవారి చక్షుః ప్రవృత్తులను స్వైకనిష్ఠలనుగా (తనయందే నిల్చిన వానినిగా); ఆచ్ఛిద్య = ఆకర్షించి; ఆ ప్రకారము; గీర్భిః = తన వాక్కులచే; తాః స్మరతాం చిత్తం = ఆ వాక్కులను స్మరించువారి చిత్తమును ఆకర్షించి; పాదైః = అట నట చిహ్నితములైన తన అడుగుల జాడలచే; ఈక్షతాం క్రియాః = చూచువారి క్రియలను; ఇతరముగాఁ బోవు గమనాది క్రియలను ఆకర్షించి.

తా. సర్వలోకముల లావణ్యమును త్రోసిరాజను లావణ్యము గల తన మూర్తిచే నరుల లోచనములను ఆకర్షించి, తన వాక్కులచే ఆ వాక్కులను స్మరించువారి చిత్తమును ఆకర్షించి, తాను నడచిన మార్గమునందు చిహ్నితములైన తన అడుగుల జాడలచే ఆ జాడల నీక్షించు వారల యొక్క గమనాది క్రియలను ఆకర్షించి అని పైకి అన్వయము.

శ్లో. ఆచ్ఛిద్య కీర్తిం సుశ్లోకీం వితత్య హ్యంజసా ను కౌ,
తమోఽనయా తరిష్యంతీ త్యగా త్స్వపద మీశ్వరః. 7

అ. సుశ్లోకీం = కవుల సుశ్లోకములు గల; కీర్తిం = తన కీర్తిని; కౌ = పృథివి యందు వితత్య = విస్తరించి; అనయా = ఈ కీర్తి చేత జనులును; తమః = అజ్ఞానమును; అంజసా = శీఘ్రముగాః తరిష్యంతి ను = నిశ్చయముగా దాటగలరని; ఈశ్వరః = భగవంతుడు; స్వపదం = స్వస్థానమును గూర్చి; అగాత్ = పోయెను.

తా. శోభనములైన కవుల శ్లోకములు గలదైన (కవులు భగవంతుని గుణగణములను శ్లోకములచే వర్ణించుచు ఆయన కీర్తిని వెల్లడింతు రనుట) తన కీర్తిని భూమియందు విస్తరింపఁజేసి ఈ నా కీర్తిని స్మరించుటచే మానవులు అజ్ఞాన సంసారవారిధిని దాటగలరని తెలిపి ఈశ్వరుఁడు స్వస్థానమును జేరెను.

రాజోవాచ = రాజు వచించెను.

అవ. అబ్రహ్మణ్యులు, అదాతలు, అసేవకులునైన వారలపై విప్రులు తమ కోపమును జూపుదురు. వృష్ణివంశ్యులు అట్టివారు కారని చెప్పుచున్నారు—

శ్లో. బ్రహ్మణ్యానాం వదాన్యానాం నిత్యం వృద్ధోపసేవినామ్,
విప్రశాపః కథ మభూ ద్వృష్ణీనాం కృష్ణచేతసామ్. 8

అ. బ్రహ్మణ్యానాం = బ్రాహ్మణులందును, వేదము లందును భక్తులు; వదాన్యానాం = దాతలు; నిత్యం = ఎల్లప్పుడు; వృద్ధోపసేవినాం = పెద్దలను సేవించువారు; కృష్ణచేతసాం = కృష్ణునియందు చిత్తము గలవారు నగు; వృష్ణీనాం = యాదవులకు; విప్రశాపః కథం అభూత్ = బ్రాహ్మణుల శాపము ఎట్లు కలిగెను?

తా. వేద బ్రాహ్మణ భక్తులై, దాతలై, వృద్ధులను సేవించువారై కృష్ణునియందు నిల్చిన చిత్తము గలవారైన యాదవులకు విప్రశాప మెట్లు కలిగినది ?

శ్లో. యన్నిమిత్త స్స వై శాపో యాదృశో ద్విజసత్తమ,
కథ మేకాత్మనాం భేద ఏత త్సర్వం వదస్వ మే. **9**

అ. ద్విజసత్తమ = ఓ ద్విజశ్రేష్ఠుడా; సః శాపః = ఆ శాపము; యాదృశః = ఎట్టిదియో; యన్నిమిత్తః వై = ఏది కారణముగా కలదియో; ఏకాత్మనాం = ఏకమనస్సులు కలిగిన వారికి; భేదః = అంతఃకలహము; కథం = ఎట్లు కలిగినది, ఏతత్ సర్వం = ఇది యంతయు; మే వదస్వ = నాకు చెప్పుము.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! ఆశాప మేమి? దాని కేమి కారణము? ఏకాభిప్రాయముగల యాదవుల నడుమ కలహ మెటులు కలిగెనో నాకు తెలుపుము.

శ్రీశుక ఉవాచ = శ్రీశుకుడు వచించెను.

శ్లో. బిభ్ర ద్వపు స్సకలసుందరసన్నివేశం
కర్మాచరన్ భువి సుమంగళ మాప్తకామః,
ఆస్థాయ ధామ రమమాణ ఉదారకీర్తి
స్సంహర్తు మైచ్ఛత కులం స్థితకృత్యశేషః. **10**

అ. సకల సుందర సన్నివేశం = ఎల్ల రమ్య వస్తువుల కూడిక గల; వపుః = శరీరమును; బిభ్రత్ = ధరించుచు; ఆప్తకామః = సకల కామములు పొందినవాడు; భువి = భూమియందు; సుమంగళం కర్మ ఆచరన్ = శుభకరమైన కర్మను ఆచరించుచు; ధామ ఆస్థాయ = స్వధామమును అధిష్ఠించి; రమమాణః = రమించుచు; ఉదారకీర్తిః = గొప్ప యశస్సు గలవాడు; స్థితకృత్యశేషః = నిల్చియున్న భూభార హరణ కర్మశేషము గలవాడై; కులం = స్వకులమును; సంహర్తుమ్ + ఐచ్ఛత = సంహరింపగోరెను.

తా. జగత్తునగల యెల్ల రమ్యమైన వస్తువుల సన్నివేశము గలదైన అనగా మిగుల సౌందర్యవంతమైన శరీరమను ధరించుచు సౌందర్యము వలన విషయసుఖపరుడయ్యెనా? లేదు, జగత్తునకు మంగళకరమైన కర్మ చేయుచున్నవాడై; ఏదేని కోరికచేతనా ? కాదు; పూర్ణకాముడై; అట్లయిన కర్మాచరణ మేల ? ద్వారకయందు గృహముననే యుండి విహరించుచున్నవాడై కర్మ గ్రహింపజేయుటకు, ఓయీ! ఆప్తకాముడైనవానికి గృహాభిలాషచే నేమి ప్రయోజనము అనగా విస్తరించిన కీర్తిగలవాడై తన కీర్తిని విస్తరించుటకొఱకు ఈ ప్రకారము పరమైశ్వర్యమునందు వర్తించుచున్నవాడై భూభారహరణశేషము నిల్చియున్నందున దానిని, నివారింపగోరి, తన యదుకులమును సంహారము చేయగోరెను.

---

వ. ....అని పలికిన మునివరునకు రాజేంద్రుం డిట్లనియె. 8

కం. హరిపాదకమలసేవాపరులగు యాదవుల కెట్లు బ్రాహ్మణశాప,
స్ఫురణంబు సంభవించెనొ యరయంగ సంయమివరేణ్య! యావతి యీవే. 9

కం. అనిన జనపాలునకు నిట్లని సంయమికులవరేణ్యుం డతిమోదముతో
వినుమని చెప్పంగం దొడంగెను ఘనతరగంభీరవాక్ప్రకాశ స్ఫురణన్.

అవ ఈశ్వరేచ్ఛచే కలిగిన బ్రాహ్మణ శాప నిమిత్తమును వచించుచున్నారు.

శ్లో. కర్మాణి పుణ్యనివహాని సుమంగళాని గాయజ్జగత్కలిమలాపహరాణి కృత్వా,
కాలాత్మనా నివసతా యదుదేవగేహే పిండారకం సమగమన్ మునయో నిసృష్టాః 11

అ. పుణ్యనివహాని = పుణ్యము కలిగించునవై; సుమంగళాని = మంగళము కల్గించునవై (మంగళకరములై); గాయత్, జగత్, కలిమల + అపహరాణి = కీర్తించు లోకుల కలి దోషమును హరించునవైన; కర్మాణి కృత్వా=కర్మలను చేసి; యదుదేవగేహే = వసుదేవుని గృహమునందు; కాలాత్మనా నివసతా=కాలస్వరూపుడుగా నివసించు కృష్ణునిచే; నిసృష్టాః= పిడొకల్పబడిన; మునయః = మునులు; పిండారకం సమగమన్ = పిండారకమను తీర్థమును గూర్చి పోయిరి.

తా. కర్మల కొఱకు ఆహ్వానింపఁబడి, కర్మలను చేసి, పొందని శ్రీకృష్ణుడు వీడ్కొలుపగా మునులు పిండారకమునకు పోయిరి అని అన్వయము. పిండారక మనునది తీర్థవిశేషము. వారు కొంత దూరములో నున్న ఆ ప్రదేశమునకు బయలుదేరి పోయిరి. పూర్వశ్లోకము నందు చెప్పఁబడిన శ్రీహరికీర్తివైభవమును వివరించుచు కర్మలను విశేషించి చెప్పుచున్నారు. పుణ్యాని అను మూడు పదములచే అశ్వమేధాదులగు కొన్ని కర్మలు కేవలము పుణ్యమునే కలిగించుచున్నవి పుత్రులను బాలించుట లోనగునవి తాత్కాలిక సుఖమునే కలిగించుచున్నవి. ద్వాదశ వర్షసత్రయాగ ప్రాయశ్చిత్త కర్మలు కేవలము పాపమునే హరించుచున్నవి. ఇవియో అన్నిటికంటె ముఖ్యమైనవని చెప్పెను. కీర్తించుటచే పుణ్యమును ప్రాప్తింపజేయును. అవి సుమంగళములు అనగా అతిసుఖాత్మకముగా గానము చేయుటచే నీ జగత్తుయొక్క కలి దోషము హరించునవి. కాలస్వరూపుఁడు అనఁగా సంహారకరూపుఁడగు కృష్ణుడు మునుల ప్రయాణమునకు హేతువు.

శ్లో. విశ్వామిత్రోఽసితః కణ్వో దుర్వాసా భృగు రంగిరాః,
కాశ్యపో వామదేవోఽత్రి ర్వసిష్ఠో నారదాదయః. 12

అర్థము సుగమము.

తా. విశ్వామిత్రుఁడు, అసితుఁడు, కణ్వుఁడు, దుర్వాసుఁడు, భృగువు, అంగిరుఁడు, కాశ్యపుఁడు, వామదేవుఁడు, అత్రి, వసిష్ఠుఁడు, నారదుఁడు లోనగువారు.

---

వ. నిరుపమ సుందరంబైన శరీరంబు ధరియించి సమస్త కర్మతత్పరుండై పరమేశ్వరుండు యదువుల నడంగింప దలంచు సమయంబున జటావల్కల కమండలు ధారులును, రుద్రాక్షభూతి భూషణ ముద్రా ముద్రితులును, కృష్ణాజినాంబరులును నగు విశ్వామిత్రాసిత కణ్వ దుర్వాసో భృగ్వంగిరః కాశ్యప వామదేవ వాలఖిల్యాత్రి వసిష్ఠ నారదాది మునివరులు స్వేచ్ఛా విహారంబున ద్వారకానగరంబున కరుదెంచి. 11

సీ. ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణునిఁ గర్ణకుండల యుగ్మఘనకపోలుఁ
బుండరీకాక్షు నంభోధరశ్యామునిఁ గలితనానారత్న ఘన కిరీటు
నాజానుబాహు నిరర్గళాయుధహస్తు శ్రీవత్సుఁ బీతకౌశేయవాసు
రుక్మిణీ నయనసరోజ దివాకరు బ్రహ్మాది సురసేవ్య పాదపద్ము

తే. దుష్టనిగ్రహ శిష్టసంతోషకరణుఁ
గోటిమన్మథ లావణ్య కోమలాంగు
నార్తజనరక్షణైక విఖ్యాతచరితు
గనిరి కరుణాసముద్రుని ఘనులు మునులు. 12

శ్లో. క్రీడంత స్తా నుపవ్రజ్య కుమారా యదునందనాః
ఉపసంగృహ్య పప్రచ్ఛు రవినీతా వినీతవత్,
తే వేషయిత్వా స్త్రీవేషైః సాంబం జాంబవతీసుతమ్ 13

అ. యదునందనాః = యాదవులపుత్రులు; కుమారాః = కుమారులు; క్రీడంతః = క్రీడించుచు; జాంబవతీసుతం సాంబం = శ్రీకృష్ణునకు జాంబవతి యందు పుట్టిన సాంబుని; స్త్రీవేషైః = స్త్రీ అలంకారములచే; వేషయిత్వా = వేషము వేసి; తాన్ = ఆ మునులను; ఉపవ్రజ్య = సమీపించి; అవినీతాః = అవినయము గలవారయ్యు; వినీతవత్ = వినయము గలవారి వలె; ఉపసంగృహ్య = పాదములకు నమస్కరించి; పప్రచ్ఛుః = ప్రశ్నించిరి.

తా. యదువంశ జనితులు యదుకుమారులు కొందఱు క్రీడించుచు జాంబవతీసుతుడగు సాంబునకు స్త్రీవేషము వేసి అలంకరించుకొని వచ్చి వినయవిధేయతలు లేనివారైనను వినయము గలవారివలె ఆ ఋషుల పాదములకు నమస్కరించి ఇట్లు అడిగిరి.

శ్లో. ఏషా పృచ్ఛతి వో విప్రా అంతర్వ త్న్యసితేక్షణా,
ప్రష్టుం విలజ్జతీ యుష్మాన్ ప్రభూతామోఘదర్శనాః,
ప్రసోష్యంతీ పుత్రకామా కింస్వి త్సంజనయిష్యతి. 14

---

కం. వచ్చిన ముని సంఘములకు, విచ్చలవిడి నర్ఘ్య పాద్యవిధు లొనరింపన్
మెచ్చుగ కనకాసనముల, నచ్చుగఁ గూర్చుండ వనరుహాక్షుని తోడన్. 18

కం. జనములు నిను సేవింపని, దినములు వ్యర్థంబు లగుచుఁ దిరుగుచునుండున్
దనువులు నిలుకడ గావట, వనములలో నున్ననైన వనరుహనాథా. 14

కం. శరణంబులు భవజలధికి, హరణంబులు దురితలతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు, శరణంబులు నీ పదాబ్జసంస్మరణంబుల్. 15

మత్త. ఒక్కవేళను సూక్ష్మరూపము నొందు దీ వణుమాత్రమై
యొక్కవేళను స్థూలరూపము నొందు దంతయు నీవయై
పెక్కురూపులఁ దాల్తు నీదగు పెంపు మాకు నుతింపఁగా
నక్కజం బగుచున్న దేమన నంబుజాక్ష! రమాపతీ. 16

కం శ్రీనాయక! నీనామము, నానాభవరోగ దుఃఖనాశమునకు వి
న్నాణం బగు నౌషధ మిది, గానరు దుష్టాత్ము లకట కంజదళాక్షా. 17

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించిన, మునివరులఁ గరుణాకటాక్ష వీక్షణంబుల నిరీక్షించి, పుండరీకాక్షుం డిట్లనియె మదీయధ్యాన నామస్మరణంబులు భవరోగహరణంబులును, బ్రహ్మరుద్రాది శరణంబులును, మంగళకారణంబులును నగు. అని మఱియు, నా రూపంబులయిన మేదినీసురుల పరితాపం బపహరించు పురుషుల నైశ్వర్య సమేతులఁ గాఁ జేయుదు. అని యోగీశ్వరేశ్వరుం డానతిచ్చి యవంతరంబు మీర లిచ్చటికి వచ్చిన ప్రయోజనంబేమి? అనిన, వారలు భవదీయ పాదారవింద సందర్శనార్థంబు కంటె మిక్కిలి విశేషం బొం డెద్ది? అని వాసుదేవ వదనాబ్జామృతంబు నిజనేత్రచకోరంబులం గ్రోలి యథేచ్ఛావిహారులై ద్వారకానగరంబున కనతిదూరంబున నుండు పిండారకం బనునొక్క పుణ్యతీర్థంబున కరిగిరి. అంత, 18

అ. హే అమోఘదర్శనాః = విఫలము గాని దర్శనములు గల మునులారా; ఏషా = ఈ స్త్రీ; అసితేక్షణా = నల్లని కన్నుగవ గలది; అంతర్వత్నీ =గర్భిణి; యుష్మాన్ = మిమ్ము లను; ప్రష్టుం = అడుగుటకు; విలజ్జతీ = సిగ్గుపడుచున్నదై; పృచ్ఛతి = మా ద్వారా అడుగుచున్నది; పుత్రకామా = పుత్రుని కోరునదై; ప్రసోష్యంతీ = ఆసన్న ప్రసవయై: కిం స్విత్ + సంజనయిష్యతి = పుత్రుని కనునా, కన్యను కనునా; ప్రబ్రూత = చెప్పుడు.

తా. ఓ సఫలదర్శనులారా! ఈ స్త్రీ నీలోత్పలాక్షి, గర్భవతి. స్వయముగా మిమ్ముల నడుగుటకు సిగ్గుపడుచున్నదై మద్వారా అడుగుచున్నది. పుత్రునిగోరు నీమె ఆసన్న ప్రసవయై యున్నది. ఈమె పుత్రుని కనునా లేక పుత్రికను కనునా వచింపుడు.

శ్లో. ఏవం ప్రలబ్ధా మునయ స్తా నూచుః కుపితా నృప,
జనయిష్యతి వో మందా ముసలం కులనాశనమ్. **15**

అ. ఏవం = ఈ ప్రకారము; ప్రలబ్ధాః = అపహసింపబడినవారై; కుపితాః = కోప మొందినవారై; మునయః = మునులు; తాన్ ఊచుః = వారలకు చెప్పిరి; మందాః = మూఢు లారా; వః = మీ యొక్క; కులనాశనమ్ = కులము నాశనము చేయు; ముసలం = రోకలిని; జనయిష్యతి = కనఁగలదు,

తా. ఈప్రకారము యదుకుమారులచే నపహసింపఁబడినవారై మునులు కుపితులై ఇట్లు వచించిరి. "ఓమూఢులారా! మీయొక్క యదుకులమును నాశనముచేయు ముసలము నీమె ప్రసవింపగలదు".

శ్లో. తే తచ్ఛ్రుత్వాఽతిసంత్రస్తా విముచ్య సహసోదరమ్
సాంబస్య దదృశు స్తస్మిన్ ముసలం ఖల్వయస్మయమ్. **16**

అ. తే = ఆ యదుకుమారులు; తత్ + శ్రుత్వా = ఆ మునుల మాటలు విని; సంత్రస్తాః = మిగుల భయపడినవారై; సాంబస్య ఉదరం = సాంబుని ఉదరమును; సహసా విముచ్య = త్వరగా వదిలించి; తస్మిన్ = ఆ యుదరమునందు; అయస్మయమ్ = ఉక్కుచే నిర్మింపబడిన; ముసలం = రోకలిని; దదృశుః ఖలు = దర్శించిరి.

తా. ఆ యదుకమారులు ఆ మునులు చెప్పిన మాటలను విని సాంబుని ఉదరమును గర్భాకారమును తీసివైచి అగర్భమునందు ఉక్కుతోఁ జేయఁబడిన రోకలిని జూచిరి.

---

కం. దర్పించి యాదవులు దమ నేర్పునఁ గొమరారు సాంబు నెలతుక రూపం
బేర్పడ శృంగారించుక కర్పూర సుగంధి పోల్కిఁ గావించి రొగిన్. 19

ఉ. మూఁకలు గూడి యాదవులు ముందటఁ బెట్టుక యార్చి నవ్వుచున్
బోకలఁ బోవుచున్ మునిసమూహము కొయ్యెవ సాఁగి మ్రొక్కుచున్,
ప్రాకటమైన యీ సుదతి భారపు గర్భమునందుఁ బుత్రుఁడో
యేకతమందు బాలిక యొ యేర్పడఁ జెప్పుఁ డటన్న నుగ్రులై. 20

కం. యదు డింభకులను కనుఁగొని, మదయుతు లై వచ్చి రనుచు మదిలో రోషం
బొదవి కనుఁగొనల నిప్పులు, సెదరఁగ హాస్యంబు చనునె చేయఁగ ననుచున్. 21

కం. వాలాయము యదుకులని, ర్మూలకరంబయిన యట్టి ముసలం బొకటీ
బాలిక కుదయించును బొం,డాలస్యములే దటంచు వట పల్కుటమున్. 22

శ్లో. కిం కృతం మందభాగ్యైర్నః కిం వదిష్యంతి నో జనాః
ఇతి విహ్వలితా గేహ మాదాయ ముసలం యయుః. **17**

అ. మందభాగ్యైః=దురదృష్టవంతులమగు మనచే; కిం కృతమ్=ఎంతచెడ్డపని చేయఁబడినది; నః+జనాః=మనబంధువులు; నః = మనలను గూర్చి; కిం వదిష్యంతి=ఏమి వచింపగలరో; ఇతి విహ్వలితాః =అని నివ్వెరపొందినవారై; ముసలం ఆదాయ=రోకలిని తీసికొని; గేహం, యయుః = ఇంటికి పోయిరి.

తా. మందభాగ్యుల మగు మనము ఎంత చెడ్డపని చేసితిమి ? మనవారు మనల నేమన గలరో అని నివ్వెఱ పొందినవారై వారు ఏమియు తోచక ఆముసలమును తీసికొని గృహమునకుఁ బోయిరి.

శ్లో. తం చోపనీయ సదసి పరిమ్లానముఖశ్రియః,
రాజ్ఞ ఆవేదయాంచక్రు స్సర్వయాదవసన్నిధౌ. **18**

అ. తం చ + ఉపనీయ = ఆ రోకలిని తీసికొని వచ్చి; సదసి = రాజసభయందు; పరిమ్లానముఖశ్రియః = మాసిన ముఖము చెలువుగలవారై; సర్వయాదవసన్నిధౌ = ఎల్ల యాదవుల సమ్ముఖమునందు; రాజ్ఞః = రాజగు ఉగ్రసేనునకు; ఆవేదయాంచక్రుః = నివేదించిరి.

తా. ఆ రోకలిని రాజసభకు గొనివచ్చి మాసినమొగము చెలువు గలవారై సకల యాదవుల సన్నిధియందు రాజగు ఉగ్రసేనునకు జరిగిన సంగతి యంతయు నివేదించిరి.

శ్లో. శ్రుత్వాఽమోఘం విప్రశాపం దృష్ట్వా చ ముసలం నృప,
విస్మితా భయసంత్రస్తా బభూవు ర్ద్వారకౌకసః. **19**

అ. నృప = ఓ రాజా ! ద్వారకా + ఓకసః = ద్వారకావాసులు; అమోఘం, విప్రశాపం = విఫలము కాని విప్రశాపమును; శ్రుత్వా = విని; ముసలం దృష్ట్వా చ = ముసలమును చూచి; విస్మితాః = అచ్చెరువు పొందినవారై; భయసంత్రస్తాః = భయముచే దిగులొందినవారు; బభూవుః = అయిరి.

తా. ఓ రాజా ! ద్వారకావాసులు విప్రులశాపమును విని ముసలమును కని అచ్చెరువు పొంది భయముచే దిగులొందిరి.

---

వ. మదోద్రేకులైన యాదవ బాలకులు మునిశాపభీతులై వడవడ వడంకుచు సాంబకుక్షినిబద్ధ చేలగ్రంథి విమోచనంబు సేయుసమయంబున ముసలం బొకటి భూతల పతితంబైన విస్మయంబు నొంది దాని గొని చని దేవకీనందను సన్నిధానంబునం బెట్టి యెఱింగించిన, నతం డాత్మకల్పితమాయారూపం బగుట నెఱింగియు, నెఱుంగని విధంబున వారలం జూచి యిట్లనియె. 23

కం. మది చెడి కన్నుం గానక, మదయుతులై మునులఁ గల్ల మాటలఁ జెనయం
గదిసి కులక్షయ కారణ విదితం బగు శాప మొందు వెఱ్ఱులుఁ గలరే. 24

కం. ధరణీసురశాపమునకు, హరిహర బ్రహ్మాదులైన నడ్డము గలరే
వరు లనఁగ నెంత వారలు, కర మరుదుగఁ బూర్వజన్మ కర్మముఁ ద్రోపన్. 25

శ్లో. తం చూర్ణయిత్వా ముసలం యదురాజ స్స ఆహుకః,
సముద్ర సలిలే ప్రాస్య ల్లోహం చాస్యావశేషితమ్. 20

అ. యదురాజః సః ఆహుకః = యదురాజగు ఆ ఉగ్రసేనుఁడు; తం, ముసలమ్ = ఆ రోకలిని; చూర్ణయిత్వా=పొడిచేయించి దానిని; అస్య = ఈ రోకలియొక్క; అవశేషితం లోహం చ=శేషించిన ఉక్కుముక్కను; సముద్రసలిలే = సముద్రజలమునందు; ప్రాస్యత్= వేయించెను.

తా. ఆయదురాజు ఉగ్రసేనుడు ఆముసలమును పొడిచేయించి ఆపొడిని సముద్రములో వేయించెను. శేషించిన ఉక్కుముక్కను కూడ సముద్రములో వేయించెను.

శ్లో. కశ్చి న్మత్స్యోఽగ్రసీ ల్లోహం చూర్ణాని తరళై స్తతః
ఉహ్యమానాని వేలాయాం లగ్నా న్యాసన్ కిలై రకాః. 21

అ. కశ్చిత్ + మత్స్యః = ఒక చేప; లోహం + అగ్రసీత్ = ఆ ఉక్కుముక్కను మ్రింగెను; చూర్ణాని = ఆ పొడులు; తరళైః = తరంగములచే; తతః = అటునిటు; ఉహ్యమానాని = వహించఁబడుచున్నవై; వేలాయాం = చెలియలికట్టయందు; లగ్నాని = కూడినవై; ఏరకాః + ఆసన్ = తుంగలు ఆయెను.

తా. ఒక చేప ఆలోహపుతునకను మ్రింగెను. ఆముసలచూర్ణములు అలలచే కొట్టుకొని వచ్చి సముద్రపు గట్టునందు తుంగలుగా నయ్యెను.

శ్లో. మత్స్యో గృహీతో మత్స్యఘ్నై ర్జాలై రన్యైః సహార్ణవే,
తస్యోదరగతం లోహం సశల్యే లుబ్ధకోఽకరోత్. 22

అ. మత్స్యఘ్నైః = జెస్తవారిచే; అర్ణవే = సముద్రమునందు; జాలైః = వలలతో; అన్యైః సహ = ఇతర మత్స్యములతో; మత్స్యః, గృహీతః =ఆ మత్స్యము గ్రహింపబడెను; తస్య + ఉదరగతం + లోహమ్ = దానికడుపులోనున్న ఉక్కుతునకను; లుబ్ధకః = బోయవాఁడు; శల్యే = శరాగ్రమునందు; అకరోత్ = మొనగాగూర్చెను.

---

వ. అది గావున, యతినిందాపరత్వంబున యదువంశనాశం బగు, సందియంబు లేదు. అని బరమేశ్వరుండు వారలం జూచి సముద్రతీరంబున నొక మహాపర్వతం బున్నది. అందు నుండు నత్యుచ్ఛ్రయ విశాల భీషణం బగు పాషాణంబున మీ భుజాబలంబు చేత ఈ ముసలంబుఁ దివిచి దీని చూర్ణంబు మహార్ణవ కబంధంబులఁ గలపి రండు. పొండు. అని జగద్విభుండైన కృష్ణుం డానతిచ్చిన వారును నట్లు చేసి తత్కీలితంబైన లోహఖండంబును సరకు గొనక సాగరంబునం బడవైచిన నొక్క ఝషకంబు గ్రసించిన దాని నొక్క లుబ్ధకుండు జాల మార్గంబునఁ బట్టికొని తదుదరగతంబైన లోహఖండంబుఁ దెచ్చి బాణాగ్రంబున ముల్కిగా నొనర్చె, అనియు దత్కథావృత్తాంతంబు సెప్పినఁ బాదరాయణిం గనుంగొని, రాజేంద్రుం డిట్లనియె.

కం. చిత్తం బే క్రియ నిలుచుం, జిత్తజగురు పాదపద్మసేవ సదా య
త్యుత్తమ మని వసుదేవుడు, చిత్తముఁ దగ నిల్పి యెట్లు చెందె మునీంద్రా! 27

వ. అని యడిగిన 28

తా. జాలరులు వలలచే సముద్రమునందున్న చేపలతోఁగూడ ఆచేపను పట్టిరి. ఆచేప కడుపులోని ఉక్కుముక్కను ఒక బోయవాడు బాణము కొనగా చేసెను.

శ్లో. భగవాన్ జ్ఞాతసర్వార్థ ఈశ్వరోఽపి తదన్యథా
కర్తుం నైచ్ఛద్విప్రశాపం కాలరూ ప్యన్వమోదత. 23

అ. భగవాన్ + ఈశ్వరః = భగవానుడగు ఈశ్వరుఁడు; జ్ఞాతసర్వార్థః = ఎల్ల విషయములు తెలిసినవాఁడు (కావున); విప్రశాపం = బ్రాహ్మణ శాపమును (మునుల శాపమును) అన్యథా కర్తుమ్ = వేఱు విధముగా చేయుటకు; న + ఐచ్ఛత్ = ఇచ్ఛగించలేదు; కాలరూపీ = కాలస్వరూపుడైన, అతడు; అన్వమోదత = అమోదించెను.

తా. సర్వవిషయముల నెఱిగిన భగవంతుఁడు ఈశ్వరుడైనను ఆవిప్రశాపమును దొలగింప నిచ్ఛగించలేదు. కాలస్వరూపుడు గనుక అమోదించి యుండెను.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే, ప్రథమోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతము నందు ఏకాదశస్కంధమున ప్రథమాధ్యాయము

# ద్వితీయాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. ద్వితీయే నిమిజాయంతసంవాదే నాహ నారదః,
ధర్మాన్ భాగవతాన్ భక్త్యా వసుదేవాయ పృచ్ఛతే.

ఈ ద్వితీయాధ్యాయమందు నారదుడు తన్ను ప్రశ్నించిన వసుదేవునికి నిమి అను విదేహపతికిని ఋషభునికి జయంతి యనుస్త్రీయందు జనించిన ఋషభపుత్రులకును జరిగిన సంవాదము ద్వారా భాగవతధర్మములను వచించెను.

శ్రీ శుక ఉవాచ=శ్రీ శుకుఁడు వచించెను.

శ్లో. గోవిందభుజగుప్తాయాం ద్వారవత్యాం కురూద్వహ,
అవాత్సీ న్నారదోఽభీక్ష్ణం కృష్ణోపాసనలాలసః. 1

అ. గోవిందభుజగుప్తాయాం = శ్రీకృష్ణబాహురక్షితమైన; ద్వారవత్యాం = ద్వారవతియందు; కురూద్వహ ! = ఓ కురుశ్రేష్ఠుఁడా; నారదః = నారదుఁడు; కృష్ణ + ఉపాసన లాలసః = కృష్ణు నుపాసించుటయందు ఆసక్తుడై ; అభీక్ష్ణం = మాటిమాటికి బయలుదేర దీయబడియు మఱలివచ్చి; అవాత్సీత్ = నివసించెను.

తా. శ్రీ కృష్ణ బాహుబలరక్షితమైన ద్వారవతియందు కృష్ణుని సేవింప నాసక్తిగలవాఁడై నారదుఁడు మాటిమాటికి బయలుదేర నుద్యమించియు మరలి వచ్చి నివసించెను.

అవ. ఎవని భజనయందు ముక్తులకు సైతము ఇట్టి ఔత్సుక్యము గలదో ఆ కృష్ణుని భజింపనివాఁ డెవ్వఁడు అని చెప్పుచున్నారు.

శ్లో. కో ను రాజ న్నింద్రియవాన్ ముకుందచరణాంబుజమ్,
న భజేత్ సర్వతోమృత్యు రుపాస్య మమరోత్తమైః. 2

అ. రాజన్ ! = రాజా; కః = ఎవఁడు; ఇంద్రియవాన్ = చక్షురాదీంద్రియముల పటుత్వము గలవాఁడు; సర్వతఃమృత్యుః = అన్నిలోకములందు అన్నివైపులయందును మృత్యువుగలవాఁడు; అమర + ఉత్తమైః = దేవశ్రేష్ఠులచే; ఉపాస్యం = ఉపాసించఁదగు, ముకుంద + చరణ + అంబుజం = ముకుందునిపాదపద్మమును; న భజేత్ = భజింపఁడు ? (ప్రతివాడును భజించును )

---

వ. రాజునకు శుకయోగీంద్రుం డిట్లనియె.
కం. వినుము నృపాలక ! చెప్పెద, ఘనమై విలసిల్లు పూర్వకథ గల దదియున్
మును ద్వారకకేతెంచియు, నొనరఁగ నారదుఁడు కృష్ణు నొయ్యన గాంచెన్.

తా. ఓ రాజా ! ఎల్ల లోకములందును అన్నివైపులందును మృత్యు వున్నదని తెలిసిన వాఁడు, ఇంద్రియ పటుత్వము గలవాఁడు సురేంద్రులచే నుపాస్యములైన హరి పాదపద్మముల నెవ్వఁడు సేవింపకుండును ? ప్రతివాఁడు సేవించు నని యర్థము.

శ్లో. త మేకదా తు దేవర్షిం వసుదేవో గృహాగతమ్,
అర్చితం సుఖ మాసీన మభివా ద్యేద మబ్రవీత్. 3

అ. వసుదేవః = వసుదేవుఁడు; ఏకదా = ఒకప్పుడు; గృహం + ఆగతం = తన గృహమునకు వచ్చిన; అర్చితం = పూజింపఁబడిన; సుఖం, ఆసీనం = సుఖముగా కూర్చుండిన; దేవర్షిం=నారదుని; అభివాద్య=ప్రణమిల్లి; ఇదమ్+అబ్రవీత్=ఈ వాక్యమును వచించెను.

తా. ఒకనాడు తన గృహమునకు వచ్చిన నారదుని అర్చించి వసుదేవుఁడు సుఖాసీను డైన ఆ దేవర్షితో నీ మాటలు చెప్పెను.

వసుదేవ ఉవాచ = వసుదేవుఁడు వచించెను.

శ్లో. భగవన్ భవతో యాత్రా స్వస్తయే సర్వదేహినామ్,
కృపణానాం యథా పిత్రో రుత్తమశ్లోకవర్త్మనామ్. 4

అ. భగవన్ = ఓ నారదా !; యథా = ఏ ప్రకారముగ; పిత్రోః, యాత్రా = తల్లిదండ్రుల ఆగమనము సంతానమునకు; స్వస్తయే = మంగళముకొఱకగునో; కృపణానాం = దీనులైన; సర్వదేహినాం = సర్వప్రాణులకు; ఉత్తమశ్లోకవర్త్మనాం = ఉత్తమ కీర్తిశాలియగు; భగవంతుని మార్గమును వర్తించు దొడ్డవారి యొక్క; యాత్రా = ఆగమన మును; స్వస్తయే = మంగళముకొఱకు అగునో, అట్లే; భవతః యాత్రా = నీ ఆగమనము; సర్వదేహినాం = సర్వప్రాణులకు; స్వస్తయే భవతి = మంగళముకొఱకగును.

తా. ఏ ప్రకారము తండ్రి రాక తత్సంతానమునకు శుభప్రదమగునో ఏ ప్రకారము విష్ణుభక్తులైన దొడ్డవారి ఆగమనము దాసుల మేలునకై అగునో. ఆ ప్రకారము భగవత్స్వ రూపుడవైన నీ రాక ఎల్ల ప్రాణులకు మంగళకర మగుచున్నది.

అవ. మఱియు దొడ్డవారిని దేవతలతో గూడ సరిపోల్చుట తగినది కాదు. అని అనుచున్నారు.

శ్లో. భూతానాం దేవచరితం దుఃఖాయ చ సుఖాయ చ,
సుఖాయైవ హి సాధూనాం త్వాదృశా మచ్యుతాత్మనామ్. 5

అ. భూతానాం = ప్రాణులకు; దేవచరితం = ఇంద్రాదుల ప్రవర్తనము; దుఃఖాయ = (అతివృష్టిచే, అనావృష్టిచే) దుఃఖమునకును; సుఖాయ = సుఖముకొఱకును అగును; అచ్యుత + ఆత్మనాం = విష్ణువునందు మనస్సుగల; త్వాదృశాం = మీవంటి; సాధూనాం = సాధువుల యొక్క ప్రవర్తనము (ఆగమనము); సుఖాయ + ఏవ = సుఖము కొఱకే యగును.

తా. ఇంద్రాది దేవతల ప్రవర్తనము ప్రాణులకు అతివృష్టి అనావృష్టులచే దుఃఖమును, సమవృష్టిచే సుఖమును గలిగించును. విష్ణుభక్తులగు మీవంటి సాధువుల ప్రవర్తనము (ఆగమ నము) ప్రాణులకు సుఖమే కలిగించును.

అవ. మఱియు సుఖమునిచ్చు దేవతలు భజనానుసారముగనే సుఖము నిత్తురు. సాధువు లట్లు కాదు అనుచున్నారు. —

శ్లో. భజంతి యే యథా దేవాన్ దేవా అపి తథైవ తాన్,
ఛాయేవ కర్మసచివా స్సాధవో దీనవత్సలాః. 6

అ. యే = ఎవరు; యథా = ఏ ప్రకారము; దేవాన్ + భజంతి = దేవతలను భజించుచున్నారో; తథైవ = ఆ ప్రకారమే; ఛాయేవ = నీడవలె; కర్మసచివాః = కర్మాను గుణసహాయులైన; దేవాః + అపి = దేవతలును; తాన్ = వారిని; భజంతి = భజించు చున్నారు; సాధవః = సాధువులు మాత్రము; దీనవత్సలాః = దీనులయందు దయగలవారై యుందురు.

తా. ఎవరు దేవతల నెట్లు భజింతురో కర్మానుగుణ ప్రవృత్తులైన దేవతలును శరీర చ్ఛాయవలె అంతమాత్రమే భజింతురు. శరీరమెంతయున్న నీడయు అంతే యుండును. అట్లు గాక సాధువులు భగవద్భక్తులు దీనులందరియందు మిగుల దయగలవారై యుందురు.

శ్లో. బ్రహ్మం స్తథాపి పృచ్ఛామో ధర్మాన్ భాగవతాం స్తవ,
యాన్ శ్రుత్వా శ్రద్ధయా మర్త్యో ముచ్యతే సర్వతో భయాత్. 7

అ. బ్రహ్మన్ = ఓ విప్రా! తథాపి = నీ ఆగమనమాత్రముచే మేము కృతార్థులము అయినప్పటికిని; తవ = నీకు సంబంధించిన; భాగవతాన్ + ధర్మాన్ = భాగవతధర్మ ములను చెప్పుమని; పృచ్ఛామః = ప్రశ్నించుచున్నాము; యత్ = వేనిని; మర్త్యః = మర్త్యుడు; శ్రద్ధయా శ్రుత్వా = శ్రద్ధతో విని; సర్వతః భయాత్=సర్వవిధముల సంసార బంధముల నుండి; ముచ్యతే = విముక్తు డగుచున్నాడు.

తా. మీ రాకవలననే మేము ధన్యులమైనను నిన్ను భాగవత ధర్మములను చెప్పుమని అడుగుచున్నాను. ఈ ధర్మమును శ్రద్ధతో విను మర్త్యుఁడు సర్వవిధముల సంసారభయము నుండి విముక్తుఁ డగుచున్నాఁడు.

అవ. 'ఓయీ! నీకంటెను భగవత్ప్రసాదమునకు పాత్రుఁ డన్యుఁ డెవ్వఁ డున్నాఁడు' అనగా దాని కిట్లనుచున్నారు.

శ్లో. అహం కిల పురానంతం ప్రజార్థం భువి ముక్తిదమ్,
అపూజయం న మోక్షాయ మోహితో దేవమాయయా. 8

అ. అహం = నేను; పురా = పూర్వము; భువి = భూమియందు; ముక్తిదం = మోక్షమునిచ్చు; అనంతం = విష్ణుని; ప్రజార్థం = సంతానము కొఱకు; అపూజయం = పూజించితిని; దేవమాయయా = విష్ణుమాయచే; మోహితః = మోహింపఁబడినవాఁడనై; మోక్షాయ = మోక్షముకొఱకు; న + అపూజయం = పూజించలేదు.

తా. సూతికా గృహమున భగవంతుఁడు చెప్పిన దానిని స్మరించుచున్నారు. ఆర్యా! పూర్వజన్మమునందు నేను ఈ భూతలమున బుట్టియుండి ముక్తిప్రదుని విష్ణువును సంతానము కొఱకు పూజించితిని. విష్ణుమాయకు లోబడి మోహము పొంది మోక్షముకొఱకు పూజింపనైతిని.

శ్లో. యథా విచిత్రవ్యసనా ద్భవద్భి ర్విశ్వతోభయాత్,
ముచ్యేమ హ్యంజసై వాద్ధా తథా న శ్శాధి సువ్రత. 9

అ. సువ్రత = మంచివ్రతము కలవాడా! నారదా! విచిత్రవ్యసనాత్ = వివిధములైన వ్యసనములు గల సంసారము నుండి; విశ్వతః + భయాత్ = అంతట భయము గలదాని నుండి; భవద్భిః = మీచేత, యథా = ఏప్రకారము; అంజసా = శీఘ్రముగా; అద్ధా = సాక్షాత్తుగ; ముచ్యేమహి = విముక్తి పొందుదుమో, తథా = ఆ ప్రకారముగ; నః + శాధి = మమ్ములను శిక్షింపుము.

తా. ఓ సువ్రతుఁడా! వివిధములైన వ్యసనములు గలదై అన్ని విధముల భయము గల ఈ సంసారమునుండి అనాయాసముగ సాక్షాత్తుగ మీ వంటివారిచే ఎట్లు విముక్తులమగుదుమో అట్లు మాకు జ్ఞానమును, భక్తిని బోధింపుము.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకుడు వచించెను.

శ్లో. రాజ న్నేవం కృతప్రశ్నో వసుదేవేన ధీమతా,
ప్రీత స్తమాహ దేవర్షి ర్హరే స్సంస్మారితో గుణైః. 10

అ. రాజన్! = ఓ రాజా; ఏవం = ఈ ప్రకారముగ; ధీమతా = బుద్ధిమంతుడైన; వసుదేవేన = వసుదేవునిచేత; కృతప్రశ్నః = ప్రశ్నచేయబడి; దేవర్షిః = నారదుడు; ప్రీతః = సంతసించి; హరేః = హరి యొక్క; గుణైః = గుణములచేత (వర్ణనీయుడగుటచే) సంస్మారితః = సంస్మరింపజేయబడినవాడై; తం + ఆహ = ఆ వసుదేవుని గూర్చి యిట్లనెను.

తా. ఓ రాజా! ఈ ప్రకారము బుద్ధిమంతుఁడగు వసుదేవుఁడు ప్రశ్నింప, గుణములచేత శ్రీహరి వర్ణింపదగినవాఁడని స్మరింపఁజేయఁబడినఁవాడై నారదుడు వసుదేవుని కిట్లు వచించెను.

---

వ. దేవముని కృష్ణ సందర్శనార్థం బరుగుదెంచి, తద్భవనాభ్యంతరమున కరిగిన, వసుదేవుం డమ్మునీంద్రుని నర్ఘ్యపాద్యాది విధులం బూజించి, కనకాసనాసీనుం గావించి, యుచిత కథా వినోదంబులం బ్రొద్దు పుచ్చుచు నిట్లనియె. ఏ నరుఁడు నారాయణ సరసీరుహ భజన పరాయణత్వంబు నిరంతరంబు నొందఁ డట్టివానికి మృత్యువు సన్నిహితంబై యుండు. నీ దర్శనంబునం గృతార్థుండ నైతి. అచ్యుతానంత గోవిందాది నామస్మరణైకాగ్రచిత్తులైన మీవంటి పుణ్యపురుషుల సమాగమంబున లోకులు సుఖాశ్రయులై యుండుదురు. దేవతాభజనంబు సేయువారిని గీర్వాణులు ననుగ్రహింతురు. అట్లు సజ్జనులును, దీనవత్సలులు నగువారలు పూజనాదిక్రియలచే నా దేవతలను భక్తి చేయుదురు. కావున శ్రీమన్మహాభాగవత కథాసమూహంబు లడిగెద. ఏ ధర్మంబులు శ్రవణసుఖంబులుగా వినిన దండధర కింకర తాండవంబులం బడక, ముకుంద చరణారవింద వందనాభిలాషులై, పరమపద ప్రాప్తు లగుదు రా ధర్మంబు లానతిమ్ము. తొల్లి గోవిందునిం బుత్రునిఁగాఁ గోరి, ముక్తిమార్గం బెఱుంగలేక దేవతామాయం జేసి, చిక్కి, చిత్తవ్యసనాంధకారం బగు సంసారంబునం దగులుపడి యున్నవాఁడ. హరికథామృతంబు వెల్లి గొల్పుము. అట్లైన సుఖంబు గల్గు ననిన, వసుదేవ కృతప్రశ్నుండైన నారదుండు వాసుదేవ కథా ప్రసంగ సల్లాప హర్ష సమేతుండై, సంతసం బంద నిట్లనియె

నారద ఉవాచ = నారదుఁడు వచించెను.

శ్లో. సమ్యగేతద్వ్యవసితం భవతా సాత్వతర్షభ,
యత్పృచ్ఛసే భాగవతాన్ ధర్మాం స్త్వం విశ్వపావనాన్. **11**

అ. సాత్వతర్షభ = విష్ణుభక్తులలో శ్రేష్ఠుడా; భవతా = నీచే; ఏతత్ = ఇది; సమ్యక్ + వ్యవస్థితం = చక్కగా నిశ్చయింపఁబడినది; యత్ = ఏ కారణమున; త్వమ్ = నీవు; విశ్వపావనాన్ = లోకపావనములైన; భాగవతాన్, ధర్మాన్ = భాగవత ధర్మములను; పృచ్ఛసే = ప్రశ్నించుచున్నావో.

తా. ఓ విష్ణుభక్త శ్రేష్ఠుఁడా ! నీవు సర్వశోభనకరములై లోకపావనములైన భాగవత ధర్మములను వినగోరుచు చక్కగా నిశ్చయించినావు.

శ్లో. శ్రుతోఽనుపఠితో ధ్యాత ఆదృతో వానుమోదితః,
సద్యః పునాతి సద్ధర్మో దేవ విశ్వద్రుహోఽపి హి. **12**

అ. దేవ = ఓ వసుదేవా; సత్ + ధర్మః = శ్రేష్ఠమైన భాగవత ధర్మము; శ్రుతః = విన్నను; పఠితః = చదువఁబడినను: ధ్యాతః వా = ధ్యానింపఁబడినను; విశ్వద్రుహః + అపి = లోకమునకు ద్రోహము చేయువారినైనను; సద్యః = అ క్షణమే; పునాతి = పవిత్రము చేయును.

తా. ఓ వసుదేవా ! ఉత్తమమగు భాగవత ధర్మము విన్నను పఠించినను ధ్యానించినను ఆదరించినను ఆమోదించినను లోకద్రోహులను సైతము తత్క్షణమే పవిత్రులను చేయును.

శ్లో. త్వయా పరమకల్యాణః పుణ్యశ్రవణకీర్తనః,
స్మారితో భగవా నద్య దేవో నారాయణో మమ. **13**

అ. త్వయా = నీచే; అద్య = ఇప్పుడు; పరమకళ్యాణః = అతిమంగళకరుడు; పుణ్యశ్రవణ కీర్తనః = పవిత్రమైన శ్రవణ సంకీర్తనములు కలవాడు అగు; భగవాన్ నారాయణః = భగవంతుడైన విష్ణువు; మమ = నాకు; స్మారితః = స్మరింపఁజేయబడెను.

తా. ఓ వసుదేవా ! పరమ కల్యాణుఁడు, పుణ్యములైన నామశ్రవణ కీర్తనములు గలవాఁడు, భగవానుఁడగు నారాయణుఁడు నీచే నాకు స్మరింపఁజేయబడినాఁడు.

శ్లో. అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్,
ఆర్షభాణాం చ సంవాదం విదేహస్య మహాత్మనః. **14**

అ. అత్ర = ఈ విషయమై; ఆర్షభాణాం = ఋషభుని పుత్రులకు; మహాత్మనః విదేహస్య = మహాత్ముడైన విదేహరాజునకు; సంవాదం = జరిగినసంవాదము; ఉదాహరంతి = ఉదాహరింతురు.

---

కం. నను నీవు సేయు ప్రశ్నము, జనసన్నుత, వేదశాస్త్ర సారాంశంబై,
శివమగు హరిగుణ కథనము, వినుమని వినుపింపఁ దొడఁగె వేడ్క దలిర్పన్. 81

కం. అతి పాపకర్ములైనను, సతతము నారాయణాఖ్య శబ్దము మదిలో,
వితతంబుగఁ బఠియించిన, చతురులఁ గొనియాడఁ గమలసంభవువశమే. 82

వ. అట్లు గావునఁ బరమేశ్వర భక్తి జననంబై, కైవల్యపద ప్రాప్తికరంబై యొప్పుచున్న విదేహార్షభ సంవాదంబు నాఁబరగు నొక పురాతన పుణ్యకథా విశేషం బెఱింగించెద సావధాన మనస్కుండవై యాకర్ణింపుము. అని యిట్లనియె.

తా. ఆర్యా! భగవద్ధర్మనిర్ణయమునందు ఋషభుని పుత్రులకును మహాత్ముడు, విదేహరాజగు నిమికిని జరిగిన సంవాదము చెప్పెదరు.

శ్లో. ప్రియవ్రతో నామ సుతో మనోః స్వాయంభువస్య యః,
తస్యాగ్నీధ్ర స్తతో నాభి ఋషభ స్తత్సుతః స్మృతః. **15**

అ. స్వాయంభువస్య మనోః=స్వాయంభువమనువుయొక్క; యః సుతః ప్రియవ్రతః=పుత్రుడైన ఏ ప్రియవ్రతుఁడు కలడో; తస్య=వానికి, ఆగ్నీధ్రః=పుత్రుఁడు ఆగ్నీధ్రుడు; తతః నాభిః= వాని పుత్రుఁడు నాభి; తత్ సుతః = ఆనాభిపుత్రుఁడు; ఋషభః=ఋషభుడు: స్మృతః=చెప్పఁబడెను.

తా. స్వాయంభువమనువు పుత్రుఁడు ప్రియవ్రతుఁడు, అతని పుత్రుఁడు ఆగ్నీధ్రుఁడు, వాని కుమారుఁడు నాభి, వాని పుత్రుఁడు ఋషభుఁడు అయ్యెను.

శ్లో. తమాహు ర్వాసుదేవాంశం మోక్షధర్మవివక్షయా,
అవతీర్ణం సుతశతం తస్యాసీ ద్బ్రహ్మపారగమ్. **16**

అ. మోక్షధర్మవివక్షయా=మోక్షధర్మవివక్షచే (మోక్షధర్మములను ప్రవర్తింపఁజేయు నిచ్ఛచే) అవతీర్ణం=అవతరించిన; వాసుదేవాంశం=వాసుదేవునంశముగా; తం+ఆహుః=ఆ ఋషభుని పేర్కొందురు; తస్య = అతనికి; బ్రహ్మపారగం = వేదములు బాగుగా నెఱిగిన; సుతశతం = నూర్గురు కుమారులు; ఆసీత్ = కల్గిరి.

తా. ఆ ఋషభుని మోక్షధర్మములను ప్రవర్తింపఁ జేయునిచ్ఛచే అవతరించిన విష్ణ్వంశము కలవానిగా చెప్పుదురు. అతనికి వేదపారంగతులైన నూరుగురు పుత్రులు జనించిరి.

అవ. ఋషభుని సుతులగు నూర్వురిలో నవయోగీశ్వరుల చరిత్రమును చెప్పుటకు ఇతరుల చరిత్రమును విశదీకరించుచున్నారు.

శ్లో. తేషాం వై భరతో జ్యేష్ఠో నారాయణపరాయణః,
విఖ్యాతం వర్ష మేత ద్యన్నామ్నా భారత మద్భుతమ్. **17**

అ. ఏతత్, వర్షం = ఈ భరత వర్షము; తేషాం వై = ఆ నూరుగురు సుతులలో; యత్ నామ్నా = ఎవని పేరుచే; భారతం = భారతమని; విఖ్యాతం = ప్రసిద్ధమైనదో; నారాయణ పరాయణః = విష్ణుభక్తుడైన; భరతః = ఆ భరతుడు; తేషాం = వారలలో; జ్యేష్ఠః = పెద్దవాడు.

తా. ఆ నూర్వురు సుతులలో జ్యేష్ఠుఁడు భరతుఁడు, నారాయణ పరాయణుఁడు. విష్ణు భక్తుఁడు. వానిపేరనే ఈ వర్షము భారతమని అద్భుతముగా ప్రసిద్ధి కెక్కెను. దీనిచే ధర్మాతిశయము చెప్పఁబడినది.

---

తే. వినుము స్వాయంభువుం డను మనువునకును
రమణ నుదయించె నట ప్రియవ్రతుఁ డనంగ
దనయుఁ డాతని కాగ్నీధ్రుఁ డనగఁ సుతుఁడు
జాతుడయ్యెను భువనవిఖ్యాతుఁ డగుచు, 34

శ్లో. స భుక్తభోగాం త్యక్త్వేమాం నిర్గత స్తపసా హరిమ్,
ఉపాసీన స్తత్పదవీం లేభే వై జన్మభి స్త్రిభిః. 18

అ. సః, భుక్తభోగాం = ఆ భరతుఁడు అనుభవింపఁబడిన భోగములు కల; ఇమాం = ఈ భూమిని; త్యక్త్వా = త్యజించి, నిర్గతః = గృహాము నుండి బయలుదేరి; తపసా=తపస్సుచే; హరిమ్ = హరిని (విష్ణువును); ఉపాసీనః = సేవించుచు, త్రిభిః + జన్మభిః = మూఁడు జన్మలచే; తత్పదవీం = ఆ విష్ణుపదమును; లేభే = పొందెను.

తా. ఆ భరతుడు, రాజ్యభోగము అనుభవించి భూరాజ్యమును త్యజించి గృహము నుండి నిర్గమించి విష్ణువును సేవించుచు మూడు జన్మలచే వైష్ణవధామమును పొందెను.

శ్లో. తేషాం నవనవద్వీపపతయోఽస్య సమంతతః,
కర్మతంత్రప్రణేతార ఏకాశీతి ర్ద్విజాతయః. 19

అ. తేషాం = వారలలో; నవ = తొమ్మండుగురు; అస్య = ఈ భారతదేశమందలి; నవ ద్వీపపతయః = జంబూ ద్వీపాదులగు తొమ్మిది ద్వీపములకు పతులైరి; ఏకాశీతిః = ఎనుబది యొక్క మంది, కర్మతంత్ర ప్రణేతారః = కర్మమార్గమును ప్రవర్తింపజేయు; ద్విజాతయః = బ్రాహ్మణు లయిరి.

తా. వారిలో తొమ్మండుగురు ఈ భారతవర్షము నందలి జంబూద్వీపము లోనగు తొమ్మిది ద్వీపములకు ప్రభువులైరి. ఎనుబది యొక్క మంది కర్మమార్గ ప్రవర్తకులైన బ్రాహ్మణులైరి.

శ్లో. నవాభవ న్మహాభాగా మునయో హ్యర్థశంసినః,
శ్రమణా వాతరశనా ఆత్మవిద్యావిశారదాః. 20

అ. నవ = ఆ తొమ్మండ్రు; మహాభాగాః = మహాత్ములు; అర్థశంసినః = పరమార్థ నిరూపకులు; శ్రమణాః = ఆత్మాభ్యాసమందు కృతశ్రములు; వాతరశనాః = దిగంబరులు; ఆత్మ విద్యా విశారదాః = ఆత్మవిద్యలో నిష్ణాతులును; అభవన్ = అయిరి.

తా. ఆ తొమ్మండుగురు మునులు మహాభాగులు, పరమార్థనిరూపకులు, ఆత్మాభ్యాస మందు శ్రమచేసినవారు, ఆత్మవిద్యయందు నిష్ణాతులైరి.

శ్లో. కవి ర్హరి రంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయనః,
ఆవిర్హోత్రో ద్రమిళశ్చ చమసః కరభాజనః. 21

తా. కవి, హరి, అంతరిక్షుఁడు, ప్రబుద్ధుఁడు, పిప్పలాయనుఁడు, ఆవిర్హోత్రుఁడు, ద్రమిళుడు, చమసుఁడు, కరభాజనుఁడు అని తొమ్మండుగురి పేర్లు.

శ్లో. త ఏతే భగవద్రూపం విశ్వం సదసదాత్మకమ్,
ఆత్మనో వ్యతిరేకేణ పశ్యంతో వ్యచరన్ మహీమ్. 22

అ. తే, ఏతే = ఆ ఈ తొమ్మండుగురు; సత్ + అసత్ + ఆత్మకం = స్థూల సూక్ష్మ రూప మైన; విశ్వం = విశ్వమును; భగవత్ + రూపం = భగవంతుని రూపము గాను; ఆత్మనః = తన ఆత్మకంటె; అవ్యతిరేకేణ = అవ్యతిరేకముగాను; పశ్యంతః = చూచుచు; మహీం, వ్యచరన్ = భూమిని సంచరించిరి,

తా. ఆ తొమ్మండుగురు స్థూల సూక్ష్మరూపమైన ఈ విశ్వమును భగవంతుని రూపముగను, ఆ రూపమును తమ ఆత్మకంటె వ్యతిరిక్తము గాకుండునదిగను దర్శించుచు భూమిపై సంచరించిరి.

శ్లో. అవ్యాహతేష్టగతయ స్సురసిద్ధసాధ్య గంధర్వయక్షనరకిన్నరనాగలోకాన్,
ముక్తా శ్చరంతి మునిచారణభూతనాథవిద్యాధర ద్విజగవాం భువనాని కామమ్. 23

అ. అవ్యాహత + ఇష్ట గతయః = అప్రతిహతమై ఇచ్ఛ వచ్చిన నడక గలవారై; ముక్తాః = అనాసక్తులై; సుర...లోకాన్ = దేవతలు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, యక్షులు, నరులు, కిన్నరులు, నాగుల లోకములను; ముని...గవాం భువనాని = మునులు, చారణులు, భూతనాథులు, విద్యాధరులు, ద్విజుల లోకములందును, గోలోకమందును; కామం = స్వేచ్ఛగా; చరంతి = సంచరింతురు.

తా. ఋషభ పుత్రులు అప్రతిహత గమనము గలవారై ఇచ్ఛవచ్చినట్లు (యథేచ్ఛగా) సురసిద్ధ సాధ్య గంధర్వ యక్షుల లోకములను, నర కిన్నర నాగ లోకములను మునిచారణ భూతనాథ, విద్యాధర, ద్విజ, గోలోకములను అనాసక్తులై సంచరించిరి.

శ్లో. త ఏకదా నిమే స్సత్ర ముపాజగ్ము ర్యదృచ్ఛయా,
వితాయమాన మృషిభి రజనాభే మహాత్మనః. 24

అ. తే = వారు; ఏకదా = ఒకప్పుడు; అజనాభే = భారతవర్షమందు; మహాత్మనః నిమేః = మహాత్ముఁడగు నిమి అను విదేహరాజు యొక్క; ఋషిభిః = ఋషులచే; వితాయమానమ్ = అనుష్ఠింపఁబడుచున్న; సత్రం = సత్రయాగమును గూర్చి; యదృచ్ఛయా = స్వేచ్ఛతో; ఉపాజగ్ముః = సమీపించిరి.

తా. వారొకప్పుడు భారతవర్షమందు మహాత్ముఁడగు విదేహరాజు నిమి ఋషులతో గూడి సత్రయాగము గావించుచుండగా ఆ యాగము కడకు వచ్చిరి.

---

తనూభవుం డుదయించి, బలి చక్రవర్తితో
వ, ఆ యాగ్నీధ్రునకు నాభి యను ప్రాజ్ఞుండగు సహితరాజన్యరాజ్యంబుల
మైత్రిం జేసి, ధరణీభారంబు పూని యాజ్ఞాపరిపాలనంబున ఋషభుండు పుట్టె.
స్వవశంబులు గావించుకొని యుండె- అంత నా నాభికి సత్పుత్రుడై భరతుండను మహాను
అతండు హరిదాసుండై సుతశతకంబు వడసె. అందగ్రజుండైన బరిహరించి, జన్మత్రి
భావుండు నారాయణ పరాయణుండై, ఇహలోక సుఖంబులం విముక్తుండై
తయంబున ఘోరతపం బాచరించి, నిర్వాణసుఖ పారవశ్యంబున సకలబంధ భూఖండనామవ్యవహారంబు
వాసుదేవపదంబుం బొందె. అతని పేర భారతవర్షం బను కుమారులు బలపరా
నెగడి జగంబులం బ్రసిద్ధం బయ్యె. మఱియు నందుఁ దొమ్మండ్రు అధిష్ఠాతలైరి. వెండియు వారలలో
క్రమ ప్రభావరూప సంపన్నులై, నవఖండంబులకు విప్రత్వం బంగీ
వెనుబది యొక్కండ్రు కుమారులు నిత్యకర్మానుష్ఠాన పరతంత్రులయి, ప్రబుద్ధ పిప్పలాయన
కరించిరి. అందుఁ గొందఱు శేషించిన వారలు, కవి హర్యంతరిక్ష ఊర్ధ్వరేతస్కులయి
హవిర్హోత్ర ద్రమీళ చమస కరభాజను లనంబరఁగు తొమ్మండుగు తెలియుచు
బ్రహ్మవిద్యావిశారదు లగుచు, జగత్త్రియ మును బరమాత్మ స్వరూపంబుగాఁ నాగ
ముక్తులై, యవ్యాహతగమను లగుచు, సుర సిద్ధ యక్ష గంధర్వ కిన్నర కింపురుష వడసియుండ నొక్క
లోకంబులందు స్వేచ్ఛావిహారంబు సేయుచు నిరంతరానందంబు ౮౬
నాఁడు.

శ్లో. తాన్ దృష్ట్వా సూర్యసంకాశాన్ మహాభాగవతాన్ నృప,
యజమానోఽగ్నయో విప్రా స్సర్వ ఏ వోపతస్థిరే. 25

అ. నృప = రాజా! సూర్యసంకాశాన్ = సూర్యునితో సమానమైనవారిని; మహాభాగవతాన్ = మహాభాగవతులైన; తాన్ = వారలను; దృష్ట్వా = చూచి, యజమానః = యజమాని యగు నిమి; విప్రాః = విప్రులగు ఋషులు; అగ్నయః = ఆకృతిదాల్చిన ఋషులును; సర్వే + ఏవ = అందరును; ఉపతస్థిరే = సమీపించిరి.

తా. సూర్యప్రతిమతేజులై మహాభాగవతులైన వారలను చూచి యజమానుడగు నిమి ఆహవనీయాదులగు అగ్నులు, విప్రులగు ఋత్విజులు ఎల్లరును ఎదురు వచ్చిరి.

శ్లో. విదేహ స్తా నభిప్రేత్య నారాయణ పరాయణాన్,
ప్రీత స్సంపూజయాంచక్రే ఆసనస్థా న్యథార్హ తః. 26

అ. విదేహః = విదేహుఁడగు నిమి; తాన్ = వారలను; అభిప్రేత్య = ఎదుర్కొని; ప్రీతః = సంతోషించినవాఁడై; ఆసనస్థాన్ = పీఠములందు కూర్చుండినవారిని; యథార్హతః = తగినట్లుగా; సంపూజయాంచక్రే = చక్కగా పూజించెను.

తా. విదేహుఁడగు నిమి, వారలను నారాయణపరాయణులనుగా (విష్ణుభక్తులను) ఎఱింగి పీఠములందుఁ గూర్చుండినవారిని సంతోషముతో తగినట్లు చక్కగా పూజించెను.

శ్లో. తాన్ రోచమానాన్ స్వరుచా బ్రహ్మపుత్రోపమాన్ నృప,
పప్రచ్ఛ పరమప్రీతః ప్రశ్రయావనతో నృపః. 27

అ. స్వరుచా = తమశోభచేతనే; (ఆభరణములచేత గాక తమశోభచేతనే) రోచమానాన్ తాన్ = ప్రకాశించుచున్నవారిని; బ్రహ్మపుత్ర + ఉపమాన్ = బ్రహ్మమానసపుత్రులైన సనకాదులతో సాటివచ్చువారిని; నృపః = ఆ రాజు; ప్రశ్రయ + అవనతః = వినయముతో తల వంచుకొని; పరమ = మిక్కిలి; ప్రీతః = ప్రీతుఁడై; పప్రచ్ఛ = ఈ విధముగా ప్రశ్నించెను.

తా. ఓ రాజా! ఆభరణములచే గాక తమ దేహశోభచేతనే ప్రకాశించుచున్న వారలను బ్రహ్మమానసపుత్రులైన సనకాదులతో సాటి వచ్చిన వారిని గాంచి నిమి వినయముతో శిరము వంచి మ్రొక్కి ఇట్లు ప్రశ్నించెను.

శ్లో. మన్యే భగవత స్సాక్షా త్పార్షదాన్ వో మధుద్విషః,
విష్ణో ర్భూత్తా హి లోకానాం పావనాయ చరంతి హి. 28

---

కం. జగదేకనాథు గుణములు, మిగులఁగ సంస్మరణతోడ మీఱిన భక్తిన్
బగలును రాత్రియు సంధ్యలు, దగిలి జితేంద్రియులునైన తపసులు ధాత్రిన్. 36

కం. ఊహింపఁ బుణ్యుఁడయిన వి,దేహుని యజ్ఞాంతమందు నేతెంచినచో
గేహము వెడలి యెదుర్కొని, మోహవివర్జితులఁ బుణ్యమునిసంఘములన్. 37

తే. గీ. అర్ఘ్యపాద్యాది విధులను నర్థితోడ, బూజగావించి వారలఁ బొలుపు మిగుల
నుచిత పీఠంబులందుల నునిచి యెలమి నవముని శ్రేష్ఠులను భూమినాయకుండు. 38

కం. వారల కిట్లను, మీరలు గారవమున విష్ణుమూర్తిఁగయికొన్న మహా
భూరితపోధన వర్యులు సార విహీనంబులయిన సంసారములన్. 39

కం. ఏరీతిఁ గడవ నేర్తురు, క్రూరులు బహుదుఃఖరోగకుత్సితబుద్ధుల్
నీరసులు నరులు గావున, నారయ సుజ్ఞానబుద్ధి నానతియీరే! 40

అ. మధుద్విషః భగవతః = మధుసూదనుడైన; విష్ణుభగవానుని; సాక్షాత్ = ప్రత్యక్షమైన; పార్షదాన్ = భక్తులనుగా; వః మన్యే = మిమ్ము తలంతును; విష్ణోః భక్తాః = విష్ణు భక్తులు; లోకానాం పావనాయ = లోకములను పవిత్రము చేయుటకు; చరంతి + హి = చరింతురు గదా!

తా. మీరు మధుసూదనుడైన భగవంతుడగు విష్ణువుయొక్క సాక్షాత్తు పార్షదులు (భక్తులు). వైకుంఠము నుండి వచ్చిన వారని తలంచుచున్నాను. విష్ణుభక్తులు లోకములను పావనము చేయుటకు చరించుచున్నారు.

**శ్లో. దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః,**
**తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనమ్.** **29**

అ. దేహినాం = జీవులకు; క్షణభంగురః = క్షణములో నశించునదైన; మానుషః + దేహః = మనుష్యదేహము; దుర్లభః = లభించుట కష్టము; తత్రాపి = అందును; వైకుంఠప్రియదర్శనం = విష్ణుప్రియులైన భక్తుల దర్శనము; దుర్లభమ్ = దుర్లభము అని; మన్యే = తలంచెదను.

తా. జీవులకు క్షణములో నశించిపోవునదైనను మనుష్యదేహము లభించుట కష్టము. అందును అట్టి మనుజులైన విష్ణుభక్తుల దర్శనము లభించుట కడుంగడు కష్టము అని తలంచెదను.

**శ్లో. అత ఆత్యంతికం క్షేమం పృచ్ఛామో భవతోఽనఘ,**
**సంసారేఽస్మిన్ క్షణార్ధోఽపి సత్సంగ శ్శేవధి ర్నృణామ్.** **30**

అ. అతః = అందువలన; అనఘాః = పాపరహితులారా! భవతః = మిమ్ములను; ఆత్యంతికం క్షేమం = నాశరహితమై నిత్యమైన క్షేమమగు మోక్షమును గూర్చి; పృచ్ఛామః = ప్రశ్నించుచున్నాము; అస్మిన్ సంసారే = ఈ సంసారమునందు; క్షణార్ధః + అపి = అర్థక్షణమైనను; సత్సంగః = సాధుసంగమము; నృణాం = నరులకు; శేవధిః = నిధియే గదా.

తా. ఓ పాపరహితులారా! దుఃఖదూరమైన నిత్యమైన క్షేమమును గూర్చి, మిమ్ములను అడుగుచున్నాము. ఈ సంసారము నందు అర్థక్షణమైనను సాధుసంగమము నరులకు పెన్నిధియే గదా!

**శ్లో. ధర్మాన్ భాగవతాన్ బ్రూత యది నః శ్రుతయే క్షమమ్,**
**యైః ప్రసన్నః ప్రపన్నాయ దాస్యత్యాత్మాన మప్యజః.** **31**

అ. నః = మాకు; శ్రుతయే = వినుటకు; క్షమం యది = తగినదైనచో; భాగవతాన్ ధర్మాన్ = భాగవత ధర్మములను; బ్రూత = వచింపుడు; యైః = వేనిచేత; ప్రసన్నః = ప్రసన్నుడై; ప్రపన్నాయ = తన్ను శరణుపొందినవానికి; ఆత్మానం + అపి = తన్ను సైతము; అజః = అజుఁడు (విష్ణువు); దాస్యతి = ఈయగలడో!

తా. ఏ భాగవత ధర్మములచే ప్రసన్నుడై విష్ణువు తన భక్తులకు తన్ను సైతము ఇచ్చునో అట్టి భాగవత ధర్మములను మేము వినదగుచో మాకు వచింపుడు.

నారద ఉవాచ = నారదుడు వచించెను.

**శ్లో. ఏవం తే నిమినా పృష్టా వసుదేవ మహత్తమాః,**
**ప్రతిపూజ్యాబ్రువన్ ప్రీత్యా ససదస్యర్త్విజం నృపమ్,** **32**

అ. ఏవం = ఈ విధముగా; నిమినా పృష్టాః = నిమిచే ప్రశ్నించబడిన; తే = వారు మహాత్తమాః = గొప్పవారు; ససదస్యర్త్విజం = సదస్యులతో ఋత్విజులతోఁ గూడిన: నృపం = రాజును; ప్రతిపూజ్య = బదులు ఆదరించి; ప్రీత్యా = ప్రీతితో; అబ్రువన్ = ఇట్లు చెప్పిరి.

తా. వసుదేవా! ఇట్లు నిమి ప్రభువు ప్రశ్నించగా విని మిగుల దొడ్డవారు, మహాత్ములగు వారు, సదస్యులతో, ఋత్విజులతో గూడిన రాజును ఆదరించి ప్రీతితో ఇట్లు చెప్పిరి.

సంగ్రహ శ్లో. భగవద్ధర్మ తద్భక్త మాయా తత్తరణానిచ
బ్రహ్మకర్మావతారేహా భక్త ప్రాప్యయుగక్రమాన్,
జ్ఞాతుం క్రమేణ కృతవా న్నవ ప్రశ్నా న్నిమి ర్నవ
ఏకైక స్యోత్తరం ప్రోచుః కవిముఖ్యా మునీశ్వరాః.

తా. భగవద్ధర్మము, తద్భక్తులు, మాయాతరణము, బ్రహ్మము, కర్మము, వాంఛ, భక్తప్రాప్యము, యుగక్రమము అనువానిని తెలియుటకు క్రమముగా నిమి తొమ్మిది ప్రశ్నల నడిగెను. ఒక్కొక్కదానికి ఒక్కొక్కరు కవిముఖ్యులగు మునీశ్వరులు తొమ్మండ్రు ఆ ప్రశ్నలకు ఒక్కొక్క ప్రకారము ఉత్తరములు చెప్పిరి.

కవి రువాచ = కవి వచించెను.

అవ. తొలుత ఆత్యంతికమైన క్షేమమును చెప్పుచున్నారు.

శ్లో. మన్యేఽ కుతశ్చి ద్భయ మచ్యుతస్య పాదాంబుజోపాసన మత్ర నిత్యమ్,
ఉద్విగ్నబుద్ధే రసదాత్మభావా ద్విశ్వాత్మనా యత్ర నివర్తతే భీః. 33

అ. అసత్ + ఆత్మభావాత్ = అసత్తగు దేహాదికమునందు ఆత్మభావము వలన; నిత్యం = ఎల్లప్పుడును; ఉద్విగ్నబుద్ధేః = కలత పొందిన బుద్ధిగల పురుషునికి; విశ్వ + ఆత్మనా = పూర్తిగా; యత్ర = ఏ పాదాంబుజోపాసనయందు; భీః నివర్తతే = భయము నివర్తించుచున్నదో; అత్ర = ఈ సంసారమునందు; అచ్యుతస్య = అచ్యుతుని యొక్క; పాద + అంబుజ + ఉపాసనం = పాదకమలముల ఉపాసనము; అకుతశ్చిద్భయం = దేనివలనను భయములేనిదని; మన్యే = తలంచెదను.

తా. ఈ సంసారమునందు అచ్యుతుని పాదపద్మముల నుపాసించుచో దేనివలనను భయము లేదని తలంచెదను. ఆ ఉపాసనచే అసత్తగు దేహాదికమునందు ఆత్మభావము వలన ఎల్లప్పుడును కలత పొందిన బుద్ధిగల పురుషుని భయము తొలగును.

---

వ. మఱియు సకలజంతు సంతానంబుకంటె మానుషాకారంబు నొందుట దుర్లభంబు. అంతకంటె నారాయణ చరణయుగళస్మరణపరాయణు లగుట దుష్కరంబు. కావున నాత్యంతికంబైన క్షేమం బడుగవలసె. పరమేశ్వరుండు ప్రవృత్తినిష్ఠులకు సారూప్యం బెట్లొసంగు నత్తెఱం గానతిండు, అనిన విని విదేహభూపాలునకు హరికథామృతపానాతిపరవశులయిన మునిసమాజంబునందుఁ గవియను మహానుభావుం డిట్లని చెప్పం దొణంగె. అరిషడ్వర్గంబువందు నేషణత్రయంబుచేతం దగులువడి మాత్సర్యయుక్తచిత్తుం డగువట్టివాని కెవ్విధంబున నచ్యుత పాదారవింద భజనంబు సంభవించు? విశ్వంబును నాత్మయు వేఱుగా భావించువానికి భీరుత్వం బెట్లు లేదు? అవిద్యాంధకారమగ్నులకు హరిచింతనం బెట్లు సిద్ధించు? అట్టి నరుండు తొంటి కళేబరంబు విడిచి పరతత్త్వం బెట్లుంగిఁ జేరు? ముకుళీకృత నేత్రుండయిన నరుండు మార్గభ్రమణంబునఁ దొట్రుపాటుపడి చనుచందంబున విజ్ఞానవిమల హృదయభక్తి భావనావశంబు లేకున్నఁ బరమపదంబు వీరి కెవ్విధంబునం గల్గు? అని యడిగితివి గావునఁ జెప్పెద, సావధానుండవై యాకర్ణింపుము. 41

శ్లో. యే వై భగవతా ప్రోక్తా ఉపాయా ఆత్మలబ్ధయే,
అజః పుంసా మవిదుషాం విద్ధి భాగవతాన్ హి తాన్. 34

అ. యే వై =ఏవి; ఆత్మలబ్ధయే=ఆత్మప్రాప్తికి; ఉపాయాః=ఉపాయములు; ప్రోక్తాః= చెప్పబడినవో; అవిదుషాం=అజ్ఞులైన; పుంసాం=పురుషులకు; అంజః=సుఖముగా ప్రాప్తించు; తాన్ హి = వానినే; భాగవతాన్ = భాగవతధర్మములుగా; విద్ధి=ఎఱుంగుము.

తా. మనువుమున్నగు ధర్మశాస్త్రకారులు వర్ణాశ్రమధర్మములను గూర్చి తెలిపియే యున్నారు. అవి అతిరహస్యము లగుటచే సామాన్యజ్ఞానము కలవారికి సరిగ బోధపడవు. అందుచే భగవంతుడు స్వయముగ సామాన్యజ్ఞానము కలవారికి సులభముగా ఆత్మలాభమునకై కొన్ని ఉపాయములు పేర్కొనెను. అవియే భాగవతధర్మములని యెఱుంగుము

అవ. అంజ పదముచే చెప్పబడిన సుఖకరత్వమును వివరించుచున్నారు.

శ్లో. యా నాస్థాయ నరో రాజన్ న ప్రమాద్యేత కర్హిచిత్,
ధావన్ నిమీల్య వా నేత్రే న స్ఖలే న్న పతే దిహ. 35

అ. రాజన్ =ఓరాజా; నరః =నరుడు, యాన్ =ఏధర్మములను; ఆస్థాయ=ఆశ్రయించి; కర్హిచిత్=ఒకప్పుడును యాగాదులందువలె; న ప్రమాద్యేత=ప్రమాదముపొందడో; కించ= మఱియు; నేత్రే నిమీల్య=నేత్రములను మూసికొని; ధావన్నపి=పరుగెత్తుచున్నవాడైనను; ఇహ=ఈభాగవతధర్మములందు, న స్ఖలేత్ =జాఱడో, న నిపతేత్ =పడడో.

అవ. నిమీలన మనగా అజ్ఞానము ఇందులకు ప్రమాణము—

శ్లో శ్రుతిస్మృతీ ఉభే నేత్రే విప్రాణాం పరికీర్తితే,
ఏకేన వికలః కాణో ద్వాభ్యా మంధః ప్రకీర్త్యతే

తా. శ్రుతిస్మృతులు (వేదము, మన్వాది స్మృతి) యను నీ రెండును విప్రుకు నేత్రము లని చెప్పబడును. ఒకటి లేనివాఁడు ఒంటికంటివాఁడు. రెండును లేనివాఁడు గ్రుడ్డివాఁడు. ఈ భాగవతధర్మములను ఆశ్రయించిన నరుఁడు ఎప్పుడును దేనివలనను ప్రమాదమును పొందడు. కన్నులు మూసికొని పరుగెత్తుచున్నను ఈ భాగవత ధర్మములందు జారిపడఁడు. అజ్ఞుడైనను భ్రష్టుఁడు కాఁడని (కన్నులు మూసికొనుట అనగా అజ్ఞానమని) అర్థము.

శ్లో. కాయేన వాచా మన సేంద్రియై ర్వా బుద్ధ్యాత్మనా వా నుసృతస్వభావాత్,
కరోతి యద్య త్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయే త్తత్. 36

అ. కాయేన=శరీరముచేత; వాచా=వాక్కుచేత, మనసా=మనస్సుచేత; ఇంద్రియైః వా=ఇంద్రియములచేత; బుద్ధ్యా=బుద్ధిచేత; ఆత్మనా=చిత్తము లేక అహంకారముచేతను; అనుసృతస్వభావాత్ =అనుసరింపబడిన స్వభావము వలన; యత్ + యత్ =ఏది ఏది; కరోతి= చేయుచున్నాడో! తత్ + సకలం=అసర్వమును; పరస్మై=పరమాత్మయైన; నారాయణాయ ఇతి =నారాయణునికొరకు అని (తనకొఱకు కాదనుట) సమర్పయేత్ =సమర్పించవలెను.

తా. కేవలము విధివిహితము కాకున్నను స్వభావానుసారముగా, అనగా లౌకికముగానైనను శరీరముచే, వాక్కుచే, మనస్సుచే, ఇంద్రియములచే, బుద్ధిచే, చిత్తముచే లేక అహంకారముచేత అనుసరింపఁబడిన స్వభావముచే ఏదేది చేయుచున్నాడో అదియంతయు పరాత్పరుడైన నారాయణుని కొఱకు సమర్పించవలెను.

---

కం. కరణత్రయంబు చేసను నరుఁ డే కర్మంబు సేయు నయ్యై వేళన్,
హరి కర్పణ మని సలుపుట పరుపడి సుజ్ఞానమంద్రుడు పరమమునీంద్రుల్. 42

అవ. ఈ ప్రకారము పరమేశ్వరభజనచే నేమి ప్రయోజనము? అజ్ఞానకల్పితమైన భయము కేవలము జ్ఞానముచేతనే నివర్తింపనగును కదా అని ఆశంకించి చెప్పుచున్నారు.

శ్లో. భయం ద్వితీయాభినివేశతః స్యా దీశా దపేతస్య విపర్యయోఽస్మృతిః,
తన్మాయయాఽతో బుధ ఆభజే త్తం భక్త్యైక యేశం గురుదేవతాత్మా. 37

అ. భయం = భయము; ద్వితీయ + అభినివేశతః = రెండవవస్తు వున్నదను చొరవ వలన; స్యాత్ = కలుగును; ఈశాత్ = ఈశ్వరునివలన; అపేతస్య = తొలగినవానికి; తత్ + మాయయా = ఆ దేవుని మాయచే; అస్మృతిః = భగవంతుని స్వరూపస్ఫూర్తి లేక పోవుట కలుగుచున్నది. అందువలన; విపర్యయః = దేహము నేను అను విపరీతభావము కలుగుచున్నది; అతః = ఇందువలన; బుధః = బుద్ధిమంతుఁడు; గురుదేవతా + ఆత్మా = గురువు దేవతాస్వరూపుఁడుగా గలవాఁడై, గురువును దైవరూపముగా భావించి యనుట; ఏకయా + భక్త్యా = ఏకాంతభక్తిచేత; తం = ఆ పరమేశ్వరుని; ఆభజేత్ = భజించవలెను.

తా. రెండవ వస్తువు ఉన్నదన్న భావము కలిగినప్పుడు భయము కలుగుచున్నది. అదియు ఈశ్వరుని భజింపక వైదొలగిన వానికి దేహమే నేను అను విపరీత భావము కలుగుచున్నది. అదియును మాయచేతనే కలుగును కావున బుద్ధిమంతుఁడు గురువే దేవుడని తలంచు మనస్సు గలవాఁడై ఏకాంతభక్తిచే ఆ పరమేశ్వరునే భజించవలెను. దేనివలన భయమో అది మాయచే కలుగుచున్నది. ఓయీ! ఆభయము దేహాభిమానమువలన కలుగుచున్నది. ఆ యభిమానము అహంకారము వలన కలుగుచున్నది కదా! అదియు స్వరూపస్మరణ లేనందునకలుగుచున్నది. ఈ పకారమే లౌకికమగు మాయయందును ప్రసిద్ధము. అట్లే గీతయందు చెప్పబడినది.

శ్లో. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

తా. త్రిగుణాత్మకమగు దైవమాయ అతిక్రమింపనలవికానిది ఎవరు నన్ను శరణు పొందుచున్నారో వారు మాయను దాటుదురు.

అవ. ఓయీ! విషయవిక్షిప్తచిత్తునకు అవ్యభిచారిణి యగు భక్తి ఎట్లు కలుగును? ఏ విధముగా భయమును దాటుదుము. అని శంక రాగా విషయ మనునది వాస్తవముగా లేదు మనోవిలాసము మాత్రమే. అందువలన మనోనియమముచే భజించుటవలన అభయము కలుగునని చెప్పుచున్నారు.

శ్లో. అవిద్యమానో ప్యవభాసతే ద్వయో ర్ధ్యాతు ర్ధియా స్వప్నమనోరథౌ యథా,
తత్కర్మ సంకల్పవికల్పకం మనో బుధో నిరుంధ్యా దభయం తతః స్యాత్. 38

అ. ద్వయః = ద్వైతప్రపంచము, ఇది; ప్రాక్ + అవిద్యమానః + అపి = పూర్వము లేకుండునదైనను; అవభాసతే = ఉన్నట్లు భాసించుచున్నది; ధ్యాతుః = ధ్యానించు పురుషుని యొక్క; ధియా = బుద్ధిచే; స్వప్నమనోరథౌ = స్వప్నము, కోరిక అనునవి; యథా = ఏ ప్రకారము జనించుచున్నవో; తత్ = అందువలన; కర్మసంకల్పవికల్పం = కర్మలను కల్పించుచు వికల్పించుచునుండు; మనః = మనస్సును; బుధః = విద్వాంసుడు; నిరుంధ్యాత్=నిరోధించవలెను; తతః + అభయం + స్యాత్ = అందువలన అభయము కలుగును.

తా. పూర్వము ఈ ద్వైత ప్రపంచము లేనిదైనను ఉన్నట్లు ప్రకాశించుచున్నది. ఏ ప్రకారము ధ్యానించు పురుషునికి స్వప్నము, మనోరథము అనునవి కల్గుచున్నవో అట్లే మనసు ఎప్పుడును కర్మలను సంకల్పించుచు వికల్పించుచు నుండును. కావున మనస్సును నిగ్రహించవలెను. అందువలన అభయము కలుగును.

* శ్లో. శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణే ర్జన్మానికర్మాణి చ యానిలోకే
గీతాని నామాని తదర్థకాని గాయన్విలజ్జో విచరే దసంగః॥ 39

అత్యంతాశక్యము అని శంకించి సుగమమార్గమును చెప్పుచున్నారు.

అ. రథాంగపాణేః=చక్రహస్తుడగు విష్ణువుయొక్క; సుభద్రాణి=మంగళ కరమగు జన్మాని=అవతారములను; కర్మాణి=ఆయవతారకృత్యములను; అవి సైతము సాకల్యముగా నెఱుంగ శక్యము కాదు కదా! అని ఆ శంకించి చెప్పుచున్నారు. యాని=ఏవి, లోకే=లోకమునందు, గీతాని=ప్రసిద్ధములై గానముచేయబడినవో; తాని=వానిని; శృణ్వన్=వినుచు; తదర్థకాని=ఆజన్మ కర్మములు విషయములుగాగల; నామాని=నామములను; గాయన్=పాడుచు; విలజ్జః=సిగ్గువిడిచినవాడై; అసంగః=సంగములేనివాడై; విచరేత్=చరించువది.

తా. చక్రము హస్తమునందు ధరించిన మహా విష్ణువు యొక్క మంగళకరమైన అవతారములను అవతార కృత్యములను, లోకమునందు ప్రసిద్ధములైన వానిని వినుచు ఆయవతారకృత్య విషయకములగు నామములనుపాడుచు సిగ్గువీడి ఏ సంగములేనివాడై చరించవలెను.

శ్లో. ఏవంవ్రత స్స్వప్రియనామకీర్త్యా జాతానురాగో ధృతచిత్తఉచ్చైః
హసత్యథో రోదితి రౌతి గాయత్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః॥ 40

ఈ ప్రకారము భజించుచు సంప్రాప్తమైన ప్రేమ లక్షణ భక్తి యోగము గలవానికి సంసార ధర్మమునకు అతీతమైన గతిని చెప్పుచున్నారు.

అ. ఏవం+వ్రతః=ఇట్టివర్తనము గలవాడును; స్వప్రియనామకీర్త్యా=తనకు ప్రియుడైన హరినామ కీర్తనముచే; జాత+అనురాగః=హరియందు జనించిన ప్రేమగలవాఁడును; దృఢచిత్తః=దృఢమైన మనస్సు గలవాడును అగు: అసౌ=ఈ భక్తుఁడు హసతి=నవ్వును: రోదితి=ఏడ్చును; రౌతి=కూయును: గాయతి=పాడును; ఉన్మాదవత్=పిచ్చివాడువలె లోకబాహ్యః=లోకరీతికివెలియై, వివశుడగుచు. నృత్యతి=ఆడును;

తా. ఈ ప్రకారము వర్తించువాఁడై ఈ భక్తుఁడు తనకుఁ బ్రియుడైన హరినామ సంకీర్తనముచే హరియందు జనించిన ప్రేమగలిగి నిశ్చలచిత్తుఁడై ఒకానొకప్పుడు భక్తి జితుడైన భగవంతుని ఆకళించుకొని నవ్వును. ఇంత కాలము ఉపేక్షితుడనైతినని ఏడ్చును. ఔత్సుక్యమువలనకూయును. ఓయని అఱచును. ఓ హరీనన్ను అనుగ్రహించుము అని ఆక్రోశించును. సంతోషముతోగానము చేయును. జయించితినని హర్షముతో నాట్యము చేయును. పిచ్చివాఁడువలె గ్రహము పట్టినవాఁడువలె లోక బాహ్యుఁడై వివశుఁడై నటింఛుచున్నాడేకాని దంభార్థము కాదు —

*వ. జ్ఞానాజ్ఞానంబులందు సంకలితుండైనప్రకృతి విపర్యయంబు నొందు. అట్లుగావున గురు దేవతాత్మకుండయి బుద్ధిమంతుడైన మర్త్యుండు శ్రీవల్లభునుత్తమోత్తమునిగాఁ జిత్తంబునఁ జేర్చి సేవింప వలయు; స్వప్న మనోరథేచ్ఛాద్యవస్థలయందు సర్వసంకల్ప నాశంబగుటం జేసి వానిం గుదియం బట్టి నిరంతర హరిధ్యానపరుండైన వానికిఁ గైవల్యంబు సులభముగాఁ గరతలామలకంబై యుండు.

శ్లో. ఖంవాయుమగ్నిం సలిలం మహీంచ జ్యోతీంషి సత్త్వానిదిశో ద్రుమాద్రీన్
సరిత్సముద్రాంశ్చ హరేశ్శరీరం యత్కించభూతం ప్రణమేదనన్యః॥ **41**

అ. యత్కించభూతం=ఏకించిత్తుప్రాణిమాత్రమునైనను. హరేఃశరీరం=హరిశరీరమని తలంచి; ప్రణమేత్=ప్రణమిల్లగా వలెను; అనన్యః=ఏకాంతభక్తుడై; ప్రణమేత్=నమస్కరింప వలెను.

తా. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, నక్షత్రములు, గ్రహములు, ప్రాణులు దిశలు, వృక్షములు, పర్వతములు, నదులు, సముద్రములు, ఇతరమగు ఏకించిత్తు ప్రాణియును ఇవి అన్నియు శ్రీహరియొక్క శరీరమని భావించి అనన్య భక్తుడై వానికి సమస్కరించవలెను. *

శ్లో. భక్తిః పరేశానుభవో విరక్తి రన్యత్రచైషత్రిక ఏకకాలః
ప్రపద్యమానస్య యథాశ్నత స్స్యు స్తుష్టిఃపుష్టిఃక్షుదపాయోనుఘాసమ్॥ **42**

ఓ యీ యోగులకుసైతము అనేకజన్మములచేనైనను ముక్తి దుర్లభము. అట్టిసద్గతి నామ సంకీర్తన మాత్రముననే ఒక్కజన్మమందే ఎట్లుకల్గునని ఆశంకించి దృష్టాంత సహితముగా చెప్పుచున్నారు.

అ. ప్రపద్యమానస్య=శ్రీహరిని భజించుభక్తునికి; భక్తిః=ప్రేమస్వరూపమైన భక్తి; పరేశ+అనుభవః=ప్రేమాస్పదుడైన భగవంతుని రూపము యొక్కస్ఫూర్తి (అనుభవము); అన్యత్రఏవ=దానికంటె అన్యమైన గృహాదుల యందు విరక్తి; ఏషః+త్రికః=ఈమూడును, ఏకకాలః=ఈభజన సమయమందే; స్యాత్=కలుగును; అశ్నతః=భుజించుచున్న వానికి; తుష్టిః =తృప్తి, పుష్టిః=ఉదరపూరణము; క్షుత్+అపాయః క్షున్నివృత్తి (ఆకలి నివర్తించుట), అనుఘాసమ్=ప్రతిక బళమును గూర్చి; యథా=ఎట్లు కలుగునో అట్లు

తా. ఏ ప్రకారము భుజించుచున్న వానికి తుష్టియు, పుష్టియు, క్షున్నివృత్తియు అనునవి మూడును ఏకకాలమునందే కలుగుచున్నవో. శ్రీహరిని భజించు వానికిని అట్లే ప్రేమ

---

* సీ. సంతతంబును గృష్ణసంకీర్తనంబులు
వీనులకింపుగ వినఁగవలయు
హర్షంబుతోడుత హరినామ కథనంబు
పాటల నాటలఁబరఁగ వలయు
నారాయణుని దివ్య నామాక్షరంబులు
హృద్వీథి సతతంబు నెన్నవలయుఁ
గంజాక్షులీలలు కాంతారములనైన
భక్తియుక్తంబుగాఁ బాడవలయు
తే. వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోకబాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెఱుఁగవలయు
భేదమొనరింప వలవదు మేదినీశ ! ॥ 44

స్వరూపమైన భక్తియు ప్రేమాస్పదుడైన భగవంతుని రూపస్ఫూర్తియు (అనుభవమున), ఇతరమునందు విరక్తియు అను ఈ మూఁడును ఏకకాలమందే కలుగుచున్నవి. పెక్కు అన్న కబళముల భోజనము, పరమ తృప్తికరమగునట్లు ఒక్కొక్క భజనమునందు ఇంచుకించుక ప్రేమాదికము కలుగ అనువృత్తిచే భజించు వానికి పరమప్రేమాదికము సర్వమును జనించు చున్నది.

శ్లో. ఇత్యచ్యుతాంఘ్రిం భజతోనువృత్త్యా భక్తిర్విరక్తిర్భగవత్ప్రబోధః
భవంతి వై భాగవతస్య రాజం స్తతఃపరం శాంతిముపైతిసాక్షాత్॥ 43

భగవత్ప్రసాదముచే కృతార్థుఁడగుననుచున్నారు.

అ. ఇతి = ఈ విధముగా, అచ్యుత + అంఘ్రి = విష్ణుపాదయుగమును; అనువృత్త్యా = అనువృత్తిచే; (మరల మరల), భజతః = భజించువానికి, భాగవతస్య = భక్తునికి; భక్తిః, విరక్తిః భక్తియు విరక్తియు = భగవత్ప్రబోధః = భగవంతుని ప్రసాదమును; భవంతివై = కలుగు చున్నవి; తతః పరమ్ = తరువాత; సాక్షాత్ + శాంతిం = సాక్షాత్తు శాంతిని, ఉపైతి = పొందు చున్నాడు.

తా. ఓ రాజా ఈ ప్రకారము అచ్యుతుని పాదపద్మమును అనువృత్తిచే మాటిమాటికిని భజించు భక్తునికి భక్తియు విరక్తియు భగవత్ ప్రసాదమును కలుగుచున్నవి. తరువాత సాక్షాత్తు శాంతిని పొందుచున్నాఁడు.

నిమిరువాచ = నిమివచించెను.

శ్లో. అథభాగవతంబ్రూతయద్ధర్మోయాదృశోనృణాం
యథాచరతియద్బ్రూతేయైర్లింగైర్భగవత్ప్రియః॥ 44

భక్తునికి శాంతి కలుగుచున్నదని చెప్పిన తరువాత ఆభక్తుని లక్షణమును ప్రశ్నించు చున్నారు.

అ. అథ = తరువాత; భాగవతం = భక్తునిగూర్చి; బ్రూత = చెప్పుడు; నృణాం = నరులలో; యత్ + ధర్మః = ఏ ధర్మముగలవాఁడు; యాదృశః = ఏస్వభావముగలవాడో; యథా = ఏ ప్రకారము; చరతి = చరించునో: యత్ + బ్రూతే = ఏమివచించునో; యైః + లింగైః = ఏలక్షణములచే; భగవత్ + ప్రియః = భగవంతునికి ప్రియుడై భక్తుఁడుండునో చెప్పుడు.

అనంతరము భక్తుని గూర్చివచింపుఁడు అని నిమిపలుకుచు ఈ విధముగా చెప్పెను. నరులలో అతఁడు ఏ ధర్మమునందు పరినిష్ఠితుఁడై యుండును? ఏ స్వభావము గలవాడై ఏ ప్రకారము చరించును ? ఏమి భుజించును ?, ఏమివచించును? ఏ లక్షణములచే భగవంతునికి ప్రియుఁడగు భక్తుఁడుడుండును. చెప్పుడు. *

హరిరువాచ = హరివచించెను.

---

*వ. అనిన నిదేహ భూపాలుండు-భాగవతుని ధర్మం బెద్ది? ఏప్రకారంబునం బ్రవర్తించు, వారల చిహ్నంబులెవ్వి? యంతయు నెఱింగింప నీవయర్హుండవనిన నందు హరియను మహాత్ముం డిట్లనియె. 45

శ్లో. సర్వభూతేషు యఃపశ్యే ద్భగవద్భావ మాత్మనః
భూతానిభగవత్యాత్మ న్యేషభాగవతోత్తమః॥ **45**

ఏ ధర్మపరినిష్ఠితుఁడు అను దానికి ఉత్తరమును చెప్పుచున్నాఁడు. (మూడు శ్లోకములచే).

అ. యః = ఎవడు; సర్వభూతేషు = సర్వభూతములయందు; ఆత్మనః = తనకును; భగవత్ భావం = బ్రహ్మ భావముచే సమన్వయమును; పశ్యేత్ = చూచునో; ఆ ప్రకారము బ్రహ్మ రూపమును; భగవతి = భగవంతునందు; ఆత్మని = తనయందును; భూతాని = ఎల్ల భూతములను చూచునో; ఏషః = ఈతఁడు; భాగవతోత్తమః = భాగవతోత్తముఁడు.

తా. ఎవడు సర్వభూతములందు బ్రహ్మభావమును ఆత్మభావమును చూచునో భగవంతుని యందును, ఆత్మయందును సర్వభూతములను చూచునో వాఁడు భాగవతశ్రేష్ఠుడు.

వివ: అధిష్ఠానమైన ఆత్మయందు భూతముల నెవఁడు చూచునో లేక "అతత్త్వాచ్చ ప్రమాతృత్వా దాత్మేహి పరమో హరిః" అని తంత్రమున చెప్పబడుటచే ప్రమాతయు సాక్షియును అగు హరియే ఆత్మ యగును. ఇట్లు ఆత్మయగు శ్రీహరి సర్వభూతములందును, మశకాదులందును నియంతయై వర్తించుచుండుటచే భగవద్భావమును నిరతిశయైశ్వర్యమును ఎవఁడు దర్శించునో వాని కెట్టి తారతమ్యము లేదు. అంతటను పరిపూర్ణమైన భగవత్తత్త్వమును చూచువాడే భాగవతోత్తముఁడు అని అర్థము. *

శ్లో. ఈశ్వరే తదధీనేషు బాలిశేషుద్విషత్సుచ
ప్రేమమైత్రీకృపోపేక్షా యఃకరోతి సమధ్యమః॥ **46**

ఈశ్వరునందును, ఈశ్వర భక్తులయందును, నీచులందును, శత్రువులందును వరుసగా ఈశ్వరునందు ప్రేమ, తద్భక్తులందు మైత్రి, మూఢులు లేక నీచులందు కృప, శత్రువులందు ఉపేక్ష చూపువాఁడు భాగవత మధ్యముఁడు.

శ్లో. అర్చాయామేవతుహరేఃపూజాంయఃశ్రద్ధ యేహతే
నతద్భక్తేషుచాన్యేషుసభక్తఃప్రాకృతఃస్మృతః॥ **47**

అ. అర్చాయాంఏవ = ప్రతిమయందు; హరేః, పూజాం = హరిపూజను; శ్రద్ధయా = శ్రద్ధతో; యః = ఎవఁడు; ఈహతే = కోరుచున్నాఁడో; తద్భక్తేషు = భగవంతుని భక్తులందు; న = పూజకోరఁడో; అన్యేషు = ఇతరులయందు కోరఁడో, సః = వాఁడు; ప్రాకృతః = ప్రారంభకుఁడు అని; స్మృతః = చెప్పబడును.

---

* తే. సర్వభూతమయుండైన సరసిజాక్షు
డతఁడె తనయాత్మయందుండు ననెడు వాఁడు
శంఖచక్రధరుండంచుఁ జనెడు వాఁడు
భక్తిభావాభిరతుఁడువో భాగవతుఁడు

తా. ఇప్పుడే ప్రారబ్ధ శక్తిగలిగినవాఁడు, మెల్లగా నుత్తముఁడు కాగలఁడని అర్థము. ఎవఁడు విష్ణుప్రతిమలను మాత్రమే శ్రద్ధతోఁ బూజింపగోరుచున్నాఁడో, విష్ణుభక్తులను పూజింపగోరఁడో ఇతరులను పూజింపగోరఁడో, అతఁడు ప్రారంభకుఁడు, క్రమముగా ఉత్తమభక్తుడు కాగలఁడు.

శ్లో. గృహీత్వాపీంద్రియై రర్థాన్ యో నద్వేష్టి నహృష్యతి
విష్ణో ర్మాయా మిదం పశ్యన్ సవై భాగవతోత్తమః. **48**

మరల ఎనిమిది శ్లోకములచే వాంఛనీయుఁ డగుటవలన ఉత్తమ భాగవతుని లక్షణ మును జెప్పుచున్నారు.

అ. యః = ఎవడు, ఇంద్రియైః = ఇంద్రియములచే; అర్థాన్ = ఇంద్రియార్థములను, శబ్దాదులను, గృహీత్వా + అపి = గ్రహించియును; నద్వేష్టి = (దుఃఖకరమైనపుడు) ద్వేషిం చడో; నహృష్యతి = (సుఖకరమైనపుడు) హర్షింపఁడో; ఇదం = ఈవిశ్వము, విష్ణోర్మాయాం = విష్ణుమాయఅని; పశ్యన్ = చూచువాడై; ప్రవర్తించునోయని యన్వయము; సవై = వాఁడే; భాగవతోత్తమః = భాగవతోత్తముఁడు.

తా. ఎవఁడు శ్రీనివాసదేవావిష్టచిత్తుఁడై, శ్రోత్రాదీంద్రములచే శబ్దాదులను నింద్రి యార్థములను గ్రహించియు అవి దుఃఖకరములైనప్పుడు ద్వేషించడో సుఖకరములైనపుడు హర్షించఁడో ఈ విశ్వమంతయు విష్ణుమాయా స్వరూపమని చూచుచున్నాఁడో అతఁడు భాగవతశ్రేష్ఠుఁడు

శ్లో. దేహేంద్రియ ప్రాణమనో ధియాం యో జన్మాప్యయక్షుద్భయతర్షకృచ్ఛ్రైః
సంసారధర్మైరవిముహ్యమానఃస్మృత్యాహరేర్భాగవతప్రధానః. **49**

అ. యః = ఎవఁడు; దేహ + ఇంద్రియ ప్రాణమనోధియాం = దేహము; ఇంద్రియ ములు, ప్రాణము, మనస్సు బుద్ధిఅనువానికి గల (క్రమముగా); జన్మ + అప్యయ = జన్మ మరణము; క్షుత్ = ఆకలి; భయ = భయము; తర్ష = తృష్ణ; కృచ్ఛ్రైః = శ్రమ రూపముగల; సంసారధర్మైః = సంసార ధర్మములచే; హరేః + స్మృత్యా = హరిస్మరణముచే; అవిముహ్య మానః = మోహమును పొందడో(వాడే) భాగవతప్రధానః = భాగవత శ్రేష్ఠుఁడు.

తా. దేహమునకు జన్మమరణములు, ప్రాణమునకు ఆకలి, మనస్సునకుభయము, బుద్ధికి తృష్ణ (అత్యాశ) ఇంద్రియములకు శ్రమ అను వానిని గల్గించు సంసార ధర్మములచే నెవఁడు హరిస్మరణమున మోహము పొందకుండుచున్నాఁడో అతఁడు, భాగవతశ్రేష్ఠుఁడు, ఉత్తమభక్తుఁడు.

శ్లో. నకామకర్మబీజానాం దృశ్యతే యత్రసంభవః
వాసుదేవైకనిలయః సవైభాగవతోత్తమః. **50**

అ. కామకర్మబీజానాం = కామము; కర్మలు, వాసనలు అనువాని; సంభవః = పుట్టుక; యత్ర = ఎవనియందు; నదృశ్యతే = కనుపించదో; వాసుదేవ + ఏకనిలయః = వాసుదేవుఁ

డొక్కఁడే ఆశ్రయముగల వాఁడగునో; సవై = భాగవతోత్తమః = అతఁడే సరియైన భగవద్భక్తుడు.

తా. ఎవనియందు కామకర్మ వాసనల సంభారము కన్పింపదో ఎవఁడు వాసుదేవు డొక్కఁడే ఆశ్రయము గలవాఁడో అతడే భాగవతోత్తముఁడు.

శ్లో. నయస్యజన్మకర్మాభ్యాం నవర్ణాశ్రమజాతిభిః
సజ్జతేస్మిన్నహంభావో దేహేవైసహరేః ప్రియః **51**

ఇప్పుడు వచించిన గృహీత్వాపి అనునది మొదలు శ్లోకత్రయముచే, ద్వేష హర్ష మోహ కామాది రహితుడై ఎట్లు చరించును? అనుదానికి ఉత్తరమీయబడినది. ఏ లక్షణములచే భగవత్ప్రియుడగునో, దానిని చెప్పుచున్నారు.

అ. యస్య = ఏవనికి; జన్మకర్మాభ్యాం = జన్మకర్మలచే (సత్కులము తపస్సు అనువానిచేత) వర్ణాశ్రమ జాతిభిః = బ్రాహ్మణాది వర్ణము; బ్రహ్మచర్యాది ఆశ్రమము, అనులోమ ప్రతిలోమజాతులు, అనువానిచే, అస్మిన్ దేహే = ఈ శరీరమునందు; అహంభావః = అహంభావము; నసజ్జతే = సక్తముకాదో; సః = అతఁడు; హరేః ప్రియః = విష్ణుభక్తుఁడు.

తా. ఎవనికి జన్మకర్మాదులచేతను వర్ణాశ్రమ జాతులచేతను ఈ దేహమునందు అహంభావము సక్తము కాదో. అతఁడు సత్కులము తపస్సు బ్రాహ్మణాది వర్ణము బ్రహ్మచర్యాది ఆశ్రమము అనులోమజాతులు, బ్రాహ్మణునకు, బ్రాహ్మణ స్త్రీయందు జనించినవాఁడు అనులోమ జాతి, బ్రాహ్మణునకు క్షత్త్రియ స్త్రీయందు జనించినవాడు ప్రతిలోమజాతి, ఇట్టివాని యందు ఆసక్తి లేనివాఁడు. *

శ్లో. న యస్య స్వః పర ఇతి విత్తేష్వాత్మని వా భిదా
సర్వభూతసమ శ్శాంతః స వై భాగవతోత్తమః. **52**

అ. యస్య = ఎవనికి: విత్తేషు = ధనకనకాదులయందు; ఆత్మని = ఆత్మయందును; స్వః + పరః + ఇతి = తాను, పరుడు, అనియు, నభిదా = భేదములేదో, సర్వభూతసమః = సర్వభూతములందు సమదృష్టిగలవాడో, శాంతః = శాంతుడో, సవై = అతడు; భాగవతోత్తమః = భాగవతోత్తముఁడు.

తా. ఎవనికి ధనకనకవస్తువాహనాదులయందు ఇవి నావి ఇవి పరులవి అను భావము లేదో వాడు భాగవతోత్తముఁడు.

శ్లో. త్రిభువనవిభవహేతవే ఒప్యకుంఠస్మృతిరజితాత్మసురాదిభి ర్విమృగ్యాత్
నచలతి భగవత్పదారవిందాల్లవనిమిషార్ధ మపిస్మ వైష్ణవాగ్ర్యః. **53**

---

*కం. వర్ణాశ్రమధర్మంబుల
నిర్ణయకర్మములఁ జెడక నిఖిలజగత్సం
పూర్ణుఁడు హరియను నాతఁడె
వర్ణింపఁగ భాగవతుఁడు వసుధాధీశా !.

అ. మరియు, యః = ఎవడు; త్రిభువనవిభవహేతవేఽపి = త్రైలోక్యరాజ్యలాభము కొఱకుకూడ, లవనిమిషార్ధం + అపి = లేశార్ధమైనను (అర్ధనిమిషమైనను), భగవత్ + పాదార విందాత్ = భగవంతుని పాదపద్మముల భజనమువలన, నచలతి = చలించడో, సః = వాఁడు, వైష్ణవాగ్ర్యః = వైష్ణవోత్తముఁడు, అకుంఠస్మృతిః = అతడు భగవత్పాదారవిందముకంటె అన్యము, సారమైనది లేదు అని, తొలగని స్మరణముగలవాఁడు గనుక చలించఁడు. ఇదియును ఎందువలన అనఁగా చెప్పుచున్నారు. అజిత + ఆత్మసురాదిభిః = అజితుఁడైన శ్రీకృష్ణపరమాత్మ రూపుడగు శ్రీహరియందు మనస్సుగల బ్రహ్మాదిదేవతలచే, విమృగ్యాత్ = వెదకఁబడునది.

తా. ఓయీ ఒక్క క్షణమాత్రము భజనము గావించినచో అంత గొప్ప లాభము కలుగును. అనగా దుర్లభమైనది ఆ పదారవిందము అగుటవలన, సర్వము తుచ్ఛము అని స్మరించుచు చలింపడు. ముల్లోకముల రాజ్యలాభము కొఱకైనను హరి యగు శ్రీకృష్ణుని యందే మనస్సుగల బ్రహ్మాది దేవతలచేతను వెదకఁబడునది–అనగా దుర్లభమైనది అగు భగవంతుని పాదపద్మముల భజనమునుండి నిమిషార్ధలేశమైనను (అర్ధనిమిషమైనను) ఎవఁడు వైదొలఁగని మొక్కవోని స్మరణము గలవాఁడై చలించఁడో, అతఁడు వైష్ణవోత్తముఁడు. విష్ణుభక్తులలో శ్రేష్ఠుడు. భగవత్పాదపద్మభజనమునుబట్టి చూచి ఇతరమైనది అంతయు సారము లేనిది సర్వపదార్థములు తుచ్ఛములని యెఱింగినవాఁడు, కావున ఆ భజనమునుండి చలించఁడు.

శ్లో. భగవతఉరువిక్రమాంఘ్రిశాఖానఖమణిచంద్రికయానిరస్తతాపే
హృదికథముపసీదతాంపునస్సప్రభవతిచంద్రఇవోదితేఽర్కతాపః॥ **54**

మఱియు విషయ సుఖములందు అభిలాషచే తను, కామముచేతను సంతాపముకలుగుచుండఁగా చలనము కలుగును. కాని ఆచలనము భగవత్సేవానందమునందు సంభవించదు.

అ. భగవతః = భగవంతుని యొక్క; ఉరువిక్రమ = భూమ్యాకాశములకు విక్రమించిన; అంఘ్రిశాఖానఖ = పాదములవ్రేళ్ళగోళ్ళు అను; మణిచంద్రికయా = మణుల యొక్క శీతల దీప్తిచే; నిరస్తతాపే = పోగొట్టబడిన సంతాపముగలదియగు; ఉపసీదతాం = భజించుచున్నవారి, హృది = హృదయమునందు; పునః = మరల; సః = ఆతాపము; చంద్రే ఉదితే = చంద్రుఁడు దయించినంతనే; అర్కతాపఇవ = సూర్యునితాపమువలె; కథం + ప్రభవతి = ఎట్లుజనించును?

తా. భగవంతుని ముల్లోకము లాక్రమించిన పాదముల వ్రేళ్ళయందలి గోళ్ళనెడు మణుల చంద్రికచే (వెన్నెలచే) నిరసించబడిన కామాదుల సంతాపముగల హృదయమందు భగవతుని భజించువారికి మరల కామాదికృత సంతాపము ఎట్లు కలుగును? చంద్రుఁడు దయించినంతనే సూర్యుని తాపమెట్లుండదో అట్లే ఆతాపముండదని భావము.

శ్లో. విసృజతిహృదయంనయస్యసాక్షాద్ధరిరవశాభిహితోఽప్యఘౌఘనాశః
ప్రణయరశనయాధృతాంఘ్రిపద్మస్సభవతిభాగవతప్రధానఉక్తః॥ **55**

ఈ చెప్పబడిన భాగవత లక్షణము యొక్క సారమును చెప్పుచున్నారు.

అ. యస్య,హృదయం = ఎవని హృదయమును; సాక్షాత్ = ప్రత్యక్షముగ; హరిః + నవిసృజతి = హరివిడువఁడో; అహరి ఎట్టివాడనగా; అవశ + అభిహితః + అపి = వశములేక (బుద్ధి

పూర్వముగాగాక) కీర్తింపఁబడిన వాఁడైనను; అఘ + ఓఘనాశః = పాపరాశిని నాశనముచేయు వాఁడు, ఎందుకువిడువడన, అభక్తుడు; ప్రణయరశనయా = ప్రేమరజ్జువుచే; ధృత + అంఘ్రి పద్మః = ధరింపఁబడిన హరిపాదపద్మములుగల; సః = వాడు, భాగవతప్రధానః = భగవద్భక్తులలో ముఖ్యుడుగా; ఉక్తః = చెప్పబడినాడు.

తా ఎవని హృదయమును సాక్షాత్తుగ శ్రీహరి వీడఁడో ఎట్టకేలకుబుద్ధి పూర్వకముగాగాక పోయినను స్మరించినంత మాత్రమున పాపరాశిని నాశనముచేయు వాఁడైన ఆ శ్రీహరి పాదపద్మములు ప్రేమపాశముచే ధరించినవాఁడు భాగవత ప్రధానుఁడు, ఉత్తమ భక్తుఁడుగా చెప్పబడును.*

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమునందు
ద్వితీయాధ్యాయము సమాప్తము.

---

వ. ఇట్లు సర్వసంగ పరిత్యక్తుండై నిఖిలాంతరాత్ముండై పరమేశ్వరుఁ డరుణ గభస్తి కిరణసహస్రంబుల లోకత్రయంబుం బావనంబు సేయు చందంబునం దన చరణార విందరజః పుంజంబుచేతం బవిత్రంబు సేయుచు సురాసుర జేగీయమాన సేవ్యంబైన జనార్దన పాదారవిందంబులకు వందనాభిలాషుడై భక్తియు లవమాత్రంబునుం జలింప నీక సుధాకరోదయంబున దివాకరజనిత తాపవారణంబయిన భంగి నారాయణాంఘ్రి నఖమణిచంద్రికా నిరస్తహృదయతాపుండై యాత్మీయ భక్తిరశనానుబంధబంధురంబైన వాసుదేవచరణ సరోరుహాధ్యానానంద పరవశుండగు నతండు భాగవతప్రధానుండు. 48

# తృతీయోఽధ్యాయః

శ్లో. మాయాతత్తరణబ్రహ్మకర్మప్రశ్నచతుష్టయే
తృతీయేతూత్తరందత్తమార్షభైర్మునిభిఃపృథక్.

తా. మాయ, దాని తరించుట, బ్రహ్మము, కర్మ అను నాలుగు ప్రశ్నలకు ఈ తృతీయాధ్యాయమందు మునులగు ఋషభపుత్రులచే ప్రత్యేకముగ నుత్తరమీయబడినది.

రాజోవాచ = రాజు నిమి వచించెను.

శ్లో. పరస్య విష్ణోరీశస్య మాయినామపి మోహినీమ్
మాయాం వేదితుమిచ్ఛామో భగవంతో బ్రువంతు నః. 1

ఈ విశ్వము విష్ణుమాయనుగా చూచుచున్నాను. అందువలన.

అ. మాయినాంఅపి = మాయగలవారికిని సైతము; మోహినీం = మోహముకల్గించునట్టి; పరస్య + విష్ణోః + ఈశస్య = ఈశ్వరుడు అగువిష్ణువు యొక్క; మాయాం = మాయనుగూర్చి; వేదితుమ్ + ఇచ్ఛామః = ఎఱుంగగోరుదుము; నః = మాకు; భగవంతః = భగవంతులారా! బ్రూత = వచింపుఁడు.

శ్లో. నానుతృప్యే జుషన్ యుష్మద్వచో హరికథామృతమ్
సంసారతాపనిష్టప్తో మర్త్యస్తత్తాపభేషజమ్. 2

అవ : ఓయీ ! ఉక్తలక్షణుఁడైన భాగవతుఁడవై కృతార్థుఁడవు గమ్ము. బహు ప్రశ్నలచే ఏమి ప్రయోజనము. అని శంకించి నిమి భాగవతోత్తములతో ఈ విధముగా పల్కెను.

అ. సంసారతాపనిష్టప్తః = సంసారతాపముచే మిగులతపింపఁబడిన; మర్త్యః = మరణధర్మములుగల మనుజుడను; తత్తాపభేషజమ్ = ఆతాపమునకు ఔషధమైన; యుష్మత్ + వచః + హరికథామృతం = మీవచనరూపమైన హరికథామృతమును; జుషన్ = అస్వాదించుచు; న + అనుతృప్యే = తృప్తినొందకున్నాను.

తా. అయ్యలారా ! నేను సంసారతాపముచే మిగుల తపింపఁబడిన మర్త్యుఁడనై యున్నాను. ఆ తాపమునకు ఔషధమైన మీ వచనరూపమగు హరికథయను అమృతమును సేవించుచు తృప్తిపడకున్నాను.

అంతరిక్ష ఉవాచ = అంతరిక్షుఁడు వచించెను.

అవ : మాయను దాని స్వరూపమును, సృష్ట్యాది కార్యము ద్వారా నిరూపించి చెప్పుచున్నారు.

శ్లో. నిర్గుణే కేవలే సాక్షాదాత్మనో యద్విపర్యయః
సైషా భగవతో మాయా యయేదం నిర్మమే విభుః. 3

అ: నిర్గుణే-కేవలే = గుణరహితుఁడై ఏకమైనబ్రహ్మమునందు; సాక్షాత్, ఆత్మనః = సాక్షాత్తుస్వస్వరూపమునకు; విపర్యయః = అన్యథాత్వముః ఇతరవిధము, సగుణత్వము సద్వితీయత్వమువగు తదవభాసము; యత్ = ఏకారణమువలన, కలుగుచున్నదో; సా + ఏషా = అదియే; భగవతః + మాయా = భగవంతునిమాయ; విభుః = ఈశ్వరుఁడు; యయా = ఏమాయచే; ఇదం నిర్మమే = ఈవిశ్వమునునిర్మించెనో.

తా. నిర్గుణమై ఏకమైన బ్రహ్మమునందు స్వస్వరూపమునకు అన్యథాత్వము (ఇతర విధముగా నుండుట) సగుణత్వము (గుణసహితుఁడగుట) సద్వితీయత్వము (రెండవది గల వాఁడగుట) అనునది ఏదిగలదో అదియే మాయ. ఈశ్వరుఁడు ఆ మాయచేతనే ఈ విశ్వమును నిర్మించెను.

శ్లో. ఇంద్రియార్థభ్రమో జాగ్రత్స్వప్నోఽన్తఃకరణభ్రమః
సుప్తం తద్వాసనాబీజం తుర్యామూర్తిస్తదన్వితః. 4

అవ: ఓయీ అర్జ్లేయగుగాక! స్వప్నము మిథ్యయగుట మాయాకారిత్వమగును. సుషుప్తి జాగ్రదవస్థలు స్పష్టముగా నుండుటవలన మాయాకార్యములెట్లగును అని ఆశంకించి చెప్పుచున్నారు.

అ. ఇంద్రియార్థభ్రమః = బాహ్యములైన చక్షురాదులగు నింద్రియములచేజనించిన అర్థవిషయభ్రమము శబ్దాదులవిషయమైవభ్రమ; జాగ్రత్ = జాగ్రద్దశ; (శత్రంతమగుటవలవ కర్మవచవము ఈభావముతెలుపుచున్నది.) ఓయీ ఈలక్షణము అవ్యాపకము; అనుమానాదులగు ప్రమాణములనుగూడ జాగరములగుటవలన; వానికి బహిరింద్రియ జన్యత్వములేవందువలన; వానికైనైతము బహిరింద్రియకారణకార్యదర్శనము సాపేక్షమగుటవలన; పరంపరగా బహిరింద్రియజన్యమగుటవలన; స్వప్నః = స్వప్నము; అంతఃకరణభ్రమః = కేవలము అంతఃకరణముచే జనితమైన భ్రమఅగును కాని, దానికి పరంపరగాకూడ బహిరింద్రియ జన్యత్వములేదు. స్వప్న హేతుసంస్కారజనకమైన పూర్వానుభవములోపల దోచుటవలవ; సుప్తం = నిద్రావస్థ; తత్ + వాసనాబీజమ్ = అజాగ్రత్స్వప్నములవాసనలైన సంస్కారములచేకూడివది. సర్వజ్ఞాన విరోధ రూపమువపరిణతమైనబీజము దానిఉపాదానకారణమేస్వప్నము, ఇందువలన-ఈ మూఁడునుదాని మిథ్యాస్వరూపములు; శ్రుతి. "అస్యత్రయఅవసథాస్త్రయస్వప్నాస్తు" (వీనికిమూఁడుస్థానములు మూడుస్వప్నములు) అందువలన ఇతఁడును (జీవుఁడు) ఆమాయాకార్యము మూఁడునుమిథ్యలగుటచే శేషించినదేది చేయలేనందున శ్రుతి. "సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ; తత్సత్యమ్" అని శంకించి చెప్పుచున్నారు. తుర్యామూర్తిః = చతుర్థస్వరూపము; తత్ + అన్వితః = అజాగరాదులందు అనువృత్తుఁడగు ఆత్మ; తుర్యామూర్తి, వానికంటె, వ్యతిరిక్తమై అవశిష్యమాణమగు, వస్తువే సత్యము, అని అర్థము.

తా. బాహ్యములైన చక్షురాదీంద్రియములచే జనితమైన శబ్దాదుల విషయమైన భ్రమ జాగ్రద్దశ అగును. కేవలము అంతఃకరణముచే జనితమైన భ్రమ స్వప్నమగును. అ స్వప్న

జాగరముల వాసన వలన సంస్కారములతోఁ గూడి సర్వజ్ఞాన విరోధిరూపమున పరిణతమైన వాని ఉపాదాన కారణమే సుప్తము. సుషుప్త్యవస్థ. ఆ జాగ్రత్స్వప్న సుషుప్తులందు అనువర్తించు చతుర్థమూర్తియే ఆత్మ. ఆజాగ్రదాదుల కంటె వ్యతిరిక్తమై శేషించియున్న వస్తువు (ఆత్మ) అదియే సత్యమగును.

అవ : ఓయీ అట్లేయగుఁగాక నిద్రనుండి జనించుచున్న బోధమునకుగల బాధ వలన స్వప్నమునకు మిథ్యాత్వము కలుగును. సుప్తజాగరములకు బాధలేనందున వానికి మిథ్యాత్వమెట్లని ఆశంకించి చెప్పుచున్నారు.

శ్లో. విశుద్ధం జ్ఞానమేవైకం మాయయా భాసతే త్రిధా
గ్రాహకాద్యై ర్యథా స్వప్నే యత్ర సంవిత్క్రియాఫలమ్. **5**

అ : విశుద్ధం + జ్ఞానం + ఏవ + ఏకం = విశుద్ధమైన జ్ఞానమొక్కటే; గ్రాహకాద్యైః = గ్రాహకుఁడు, గ్రహణము, గ్రాహ్యము అను భేదముచే; యథా = ఏప్రకారము; స్వప్నే = స్వప్నమునందో; అప్రకారము, త్రిధా = మూఁడు విధములుగా; భాసతే = తోఁచుచున్నది, యత్ర = ఏ మూఁడవస్థలందు; సంవిత్ = బుద్ధి, జ్ఞానము; క్రియాఫలమ్ = క్రియా సంవేదనము ఫలమై సంవేద్యమగును.

తా. విశుద్ధమైన జ్ఞానమొక్కటే గ్రహించువాఁడు, గ్రహించుట గ్రహింపదగినది అను భేదముచే. అట్లే కర్త, కర్మ, క్రియ అనువానితో కూడ మూఁడు విధములుగ స్వప్నమునందువలె భాసించుచున్నది. ఈ క్రియాఫలమైన సంవేద్యమును (ఎఱుగఁనగిన దానిని) ఎఱుంగునది.

శ్లో. వైతథ్యాద్వ్యభిచారాచ్చమాయాత్రైవిధ్యమాత్మని
యథామనోరథ స్వప్నఇత్యామృ శ్యోపశామ్యతి. **6**

అ : వైతథ్యాత్ = వైతథ్యమువలన (లేనిదగుటవలన) పరమార్థభావము పొందనిది; భావాభావములకు ప్రతియోగిత్వము విరోధి వ్యభిచారము.

తా. స్వప్న జాగరముల అభావము కాదాచిత్కమగుట వలన ఒకప్పుడే ఉండునది; మనోరథ పూర్వకమైన ప్రవృత్తి నివృత్తి వ్యవహారము వలన జాగరము మనోరథమని ఉపచరింపఁబడుచున్నది. (సామాన్యముగా చెప్పఁబడుచున్నది.) స్వప్నము = సుప్తము. స్వప్నావస్థయందు ఆత్మ అధిష్ఠానమగుచుండగా సంవిత్క్రియా ఫలము (గ్రాహకాదులచే ఏదిత్రివిధముగానున్నదో అది) యే ప్రకారము మాయ మిథ్యయగును. వ్యభిచారము వలనను ఒక్క రూపుగా నుండక మారునది యగుట వలన జాగరము మిథ్య అగును. నేహనానాస్తి అని ప్రాప్తమైన ఉపాధియందు శ్రుతిచే నిషేధింపబడినదగుట వలనను, కాదాచిత్కమగుట వలనను అట్లుగాక మనోరథ నిబంధనమైన ధ్యానము వలన ఎడబాసిన పుత్రాదులను అపరోక్షముగ (ఎదుట నున్నవారినిగా స్ఫురింపఁజేయుట మనోరథమని చెప్పఁబడును. మనస్సంకల్పమున పుత్రాదులను చూచుట) స్వప్నము మిథ్యయగును. ఏదిత్రైవిధ్యమో అది ఏ ప్రకారము

మిథ్యయో ఆ ప్రకారము అస్వప్నమగు జాగరమునందు, ఆత్మయంసు గ్రాహకాదులచే త్రైవిధ్యము మిథ్య అని— శేషము పూర్వము వలె జాగ్రత్ స్వప్నములకు అగమోక్తమైన యుక్తి బోధము యొక్క సద్భావము వలన మిథ్యాత్వము అని అర్థము. ఈ ప్రకారము విచారము వలన వీనికి మిథ్యాత్వమెట్లు అనుశంక నివర్తించుచున్నది.

దృశ్య ప్రపంచము నందు కన్పట్టు చతుర్విధ భూత గ్రామమేదియో, అది నిత్యముగా నుండకపోవుట వలన జన్మ స్థితి లయములకు అధీనమగుట వలన మఱి ఏ వస్తువును ఒక్క విధముగా నుండక దినదినమునకు మార్పు పొందుట వలనను ఆత్మయందు భాసించు జాగ్రత్స్వప్న సుషుప్తములు మూఁడును గ్రాహక గ్రహణ గ్రాహ్యములు మూఁడును మాయాకార్యములై మిథ్య అగుచున్నవి. మనస్సంకల్పమున ఎడబాసిన పుత్రులను చూచినట్లు మాట్లాడునట్లు స్ఫురించుట వలన స్వప్నమునందు సర్వేంద్రియ ప్రవృత్తి గలుగుట వలనను స్వప్న మనోరథముల వలె జాగ్రత్సుప్తులును మిథ్యలని నిశ్చయము. ఇట్లు విచారణ చేయుట వలన అవి ఎట్లు మిథ్య యను శంక నివర్తించుచున్నది.

అవ : ఈశ్వరుఁడే మాయచే నీవిశ్వమును సృజించును అని చెప్పబగినది. దానినే వివరించుచున్నారు.

శ్లో. ఏభి ర్భూతాని భూతాత్మా మహాభూతై ర్మహాభుజః
సససర్జో చ్చావచాన్యాద్య స్స్వమాత్రాత్మప్రసిద్ధయే. 7

అ : యయా = ఏ శక్తిచే; భూతాత్మా = భూతములకు ఆత్మయై కారణభూతుఁడైన; మహాభుజః = గొప్ప భుజములుగల; అద్యః = పురాణపురుషుఁడగు ఈశ్వరుఁడు; ఏభిః = తనచే సృజింపబడిన ఈ; మహాభూతైః = పృథివ్యాది మహాభూతములచేత; ఉచ్చావచాని = వివిధములైన; జరామరణాదులు ఈ వైవిధ్యమునకు కారణము; భూతాని = ప్రాణులను; ససర్జ = సృజించెను; ఎందుకొఱకు సృజించెననగా: స్వమాత్రాత్మప్రసిద్ధయే = తన్నెవఁడుపాసించుచున్నాడో వాఁడు స్వమాత; ఆత్మయైన జీవునకు, ప్రకృష్టసిద్ధికొఱకును, లేక, స్వ = స్వాంశభూతులైన జీవులకు, మాత్రాత్మప్రసిద్ధయే = విషయభోగముకొఱకును ఆత్మప్రసిద్ధమైన మోక్షము కొఱకును; సృజించెను.

అట్లే వేదస్తుతి—

"శ్లో. బుద్ధీంద్రియమనః ప్రాణాన్ జనానామ సృజత్ప్రభుః
మాత్రార్థం చ భవార్థం చ ఆత్మనే కల్పనాయ చ"

ఈశ్వరుఁడు జనులకు బుద్ధి ఇంద్రియములు మనస్సు ప్రాణము అనువానిని విషయభోగము కొఱకును కర్మానుష్ఠానము కొఱకును భోగముల కొఱకును, మోక్షము కొఱకును సృజించెను.

శ్లో. ఏవం సృష్టాని భూతాని ప్రవిష్టః పంచధాతుభిః
ఏకధాదశధాత్మానం విభజన్ జుషతే గుణాన్. 8

అ : ఏవం = ఈ ప్రకారము; పంచధాతుభిః = పంచమహాభూతములచే; సృష్టానిభూతాని = సృజింపఁబడిన భూతములను. ప్రవిష్టం = అంతర్యామి రూపమునఁ ప్రవేశించినవాడై; ఏకధా = ఒక్కటైన మనస్సుగను; దశధా = పదివిధములైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ రూపములుగను, ఆత్మానం = ఆత్మను, విభజన్ = విభజించుచు; గుణాన్ = ఆ మూర్తిని గూర్చిన గుణములను; జుషతే = భజించుచు ప్రీతి గలిగించుచున్నాడు.

తా. ఈ ప్రకారము పంచ మహా భూతములచే సృజింపబడిన భూతములను (ప్రాణులను) అంతర్యామి రూపమునఁ బ్రవేశించి ఆత్మను ఒక్క మనస్సుగా పదివిధములైన ఇంద్రియములుగాను విభజించి ఆయా విషయములను అనుభవింపజేయుచున్నాఁడు.

శ్లో. గుణై ర్గుణాన్ స భుంజాన ఆత్మప్రద్యోతితైః ప్రభుః
మన్యమాన ఇదం సృష్టమాత్మాన మిహ సజ్జతే. 9

అ ; సః = ఆ జీవుఁడు; ఆత్మప్రద్యోతితైః = అంతర్యామిచే ప్రకాశించు; గుణైః = ఇంద్రియములచే; గుణాన్ = విషయములను; భుంజానః = అనుభవించుచు; ఇదం సృష్టమ్ = ఈ సృజింపఁబడిన శరీరమును; ఆత్మానం + మన్యమానః = ఆత్మనుగాదలంచుచు, ఇహ = శరీరాదికములందు; సజ్జతే = ఆసక్తుఁడగుచున్నాఁడు.

తా. జీవుఁడు అంతర్యామియైన ఈశ్వరునిచే ప్రకాశింపఁ జేయబడిన ఇంద్రియములను, శబ్దాది విషయములను సేవించుచు (అనుభవించుచు) సృజింపఁబడిన ఈ శరీరమును ఆత్మగా దలంచుచు ఈ శరీరాదికము నందాసక్తుడగుచున్నాఁడు.

శ్లో. కర్మాణి కర్మభిఃకుర్వన్ సనిమిత్తాని దేహభృత్
తత్తత్కర్మఫలంగృహ్ణన్ భ్రమతీహసుఖేతరమ్. 10

అ : కర్మభిః = కర్మేంద్రియములచే; సనిమిత్తాని = వాసనల కారణముగ జనించిన కర్మాణి = కర్మలను; దేహభృత్ = దేహధారి; కుర్వన్ = చేయుచు; సుఖ + ఇతరం = సుఖదుఃఖాత్మకమైన; తత్ + తత్ + కర్మఫలం = ఆయా కర్మల ఫలమును, గృహ్ణన్ = గ్రహించుచు; ఇహ = ఈ సంసారము నందు; భ్రమతి = భ్రమించుచున్నాఁడు.

తా. దేహధారియగు జీవుఁడు తన పూర్వకర్మవాసనలఁ బట్టి జనించిన కర్మలను కర్మేంద్రియముల ద్వారా చేయుచు సుఖదుఃఖాత్మకమైన ఆయా కర్మఫలమును గ్రహించుచు ఈ సంసారమందు భ్రమించుచున్నాఁడు.

అవ : ఎంతకాలము భ్రమించుచున్నాడనఁగా.

శ్లో. ఇత్థంకర్మగతీర్గచ్ఛన్ బహ్వభద్రవహఃపుమాన్
ఆభూతసంప్లవాత్సర్గ ప్రళయావశ్నుతేఽవశః. 11

అ : ఇత్థం = ఈ ప్రకారము; కర్మగతీః + గచ్ఛన్ = కర్మ మార్గముల ననుసరించుచు: బహు + అభద్రవహః = పెక్కు అమంగళములను వహించు; పుమాన్ = పురుషుడు; అభూత

సంప్లవాత్ = ప్రళయ పర్యంతము: సర్గప్రళయా = జన్మ మరణములను; అశ్నుతే = పొందు చున్నాడు.

తా. ఇట్లు కర్మగతు లనుసరించుచు పెక్కు దుఃఖములను పొందుచు ఈ పురుషుడు ప్రళయ పర్యంతము జన్మ మరణములను పొందుచున్నాడు.

శ్లో. ధాతూపప్లవ ఆసన్నే వ్యక్తం ద్రవ్యగుణాత్మకం
అనాదినిధనః కాలో హ్యవ్యక్తా యాపకర్షతి. **12**

అ: ధాతు + ఉపప్లవే + ఆసన్నే = పంచ మహా భూతములకు నాశహేతువు సంప్రాప్తము కాగా; ద్రవ్యగుణ + ఆత్మకం = స్థూల సూక్ష్మ స్వరూపమైన; వ్యక్తమ్ = కార్యము అను జగత్తును; అనాదిని ధనః = ఆద్యంతములు లేనిదైన; కాలః = కాలము; అవ్యక్తాయ = అవ్యక్తమును (ప్రకృతిని) పొందుటకు; ఆకర్షతి = ఆకర్షించును.

తా. పంచ మహా భూతములకు నాశమును ప్రళయము సంభవించినంతనే స్థూల సూక్ష్మ రూపమై కార్యమైన ఈ జగత్తును ఆద్యంతములు లేని కాలము అవ్యక్తమగు ప్రకృతి యందు ప్రవేశ పెట్టుటకు ఆకర్షించుచున్నది.

శ్లో. శతవర్షాణ్యనావృష్టి ర్భవిష్యత్యుల్బణా భువి
తత్కాలోపచితోష్ణార్కో లోకాంస్త్రీన్ ప్రతపిష్యతి. **13**

అ: భువి = భూమి యందు; అనావృష్టిః = వర్షాభావము; ఉల్బణా = అధికమై; శత వర్షాణి = నూరు వత్సరములు, భవిష్యతి = కలుగగలదు; తత్కాల + ఉపచిత + ఉష్ణ + అర్కః = ఆ కాలమునందు వృద్ధిపొందిన వేడిమిగల సూర్యుడును; త్రీన్ + లోకాన్ = మూడులోకములను; ప్రతపిష్యతి = తపింపజేయును,

తా. అప్పుడు భూలోకమున అత్యధికమైన అనావృష్టి సంభవించును. ఆ కాలము నందు సూర్యుడు మిగుల ఉష్ణత పొంది మూడు లోకములను మిక్కిలి తపింపజేయు గలడు.

శ్లో. పాతాళతల మారభ్య సంకర్షణ ముఖానలః
దహన్నూర్ధ్వశిఖో విష్వగ్వర్ధతే వాయునేరితః. **14**

అ: పాతాళతలమారభ్య = పాతాళ లోకమునుండి; సంకర్షణ ముఖ + అనలః = సంకర్షణ రూపమున నున్న; శేషాహి ముఖమునుండి జనించిన అగ్ని; ఊర్ధ్వశిఖః = పైకెగురు జ్వాలలు గలదై; వాయునా + ఈరితః = గాలిచే పెంపబడినదై; విష్వక్ = అంతట; దహన్ = దహించుచు; వర్ధతే = వృద్ధి పొందును.

తా. పాతాళలోకమందలి సంకర్షణుని ముఖము నుండి జనించిన అగ్నిజ్వాలలు పైకెగ జిమ్ముచున్నదై అంతట వ్యాపించి గాలిచే పెంపొంది వృద్ధిగాంచుచు లోకమును దహించు చున్నది.

శ్లో. సంవర్తకోమేఘగణోవర్షతిస్మశతంసమాః।
ధారాభిర్హస్తిహస్తాభిర్లీయతేసలిలేవిరాట్॥ 15

అ : సంవర్తకః మేఘగణః=ప్రళయకర్తయగు మేఘముల గణము; శతంసమాః= నూఱు సంవత్సరములు; హస్తిహస్తాభిః ధారాభిః=ఏనుగు తొండమంత వర్షధారలతో; వర్షతిస్మ=వర్షించును: సలిలే=ఉదకము నందు; విరాట్=విరాట్ పురుష రూపమగు జగత్తు లీయతే=లీనమగును.

తా. సంవర్త నామక మేఘగణము ఏనుగు తొండమంత వర్షధారలతో నూరు సంవత్సరములు వర్షించును. ఆ జలమునందు విరాడ్రూపమగు జగత్తు లీనమగును

శ్లో. తతో విరాజ ముత్సృజ్య వైరాజః పురుషోనృప
అవ్యక్తం విశతే సూక్ష్మం నిరింధన ఇవానలః 16

అ : తతః=ఉపాధి లయము వలన; విరాజం=విరాట్టగు జనమును; ఉత్సృజ్య= వదలిపెట్టి: వైరాజః పురుషః=అందున్న వైరాజ పురుషుఁడు; నిరింధనః+అనలః ఇవ= కట్టెలు లేని అగ్నివలె; కారణమైన ప్రకృతిని; ప్రవిశతే=ప్రవేశించుచున్నాడు.

తా. అంత ఉపాధియగు జగత్తు లయించుట వలన దానిని వదలిపెట్టి అందున్న వైరాజ పురుషుఁడు కట్టెలు లేని అగ్నివలె కారణమైన ప్రకృతిని ప్రవేశించుచున్నాడు

శ్లో. బ్రహ్మణా సహితే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్.

అవ : ప్రళయము సంప్రాప్తమైనప్పుడు ఎల్ల అధికార పురుషులు బ్రహ్మతో కూడ జగదవసానమందు దేహధారులై యుండిన జీవరూపులే పరమపదమున ప్రవేశింతురు. అను స్మృతివలన

"యావదధికార మవస్థితి రాధికారికాణామ్" ఎంతవఱకు ఆధికారిక పురుషుల అధికారిక పురుషుల అధికారము నిల్చియుండునో అంతవఱకు. అను సూత్రమును బట్టి. వైరాజ శబ్దము నామముగా గల బ్రహ్మ పరమ భాగవతుఁడగుట వలన అత కి మోక్షమే సంభవించు చున్నది. ఇతరులగు ఆధికారిక పురుషులకు వలె (జీవులకును) కారణ మాత్రముగ ప్రకృతి ప్రవేశము కాదు. అన్నచో

సత్యము. అశ్వమేధాది యాగ ఫలముచే సత్యలోకమును పొందిన భక్తులు కాని వారలకు అవృత్తి వలన (మరల జన్మములు గలుగునని చెప్పుట వలన) భక్తుఁడు కానిచో బ్రహ్మకు సైతము ప్రకృతి యందే లయమును పునరుత్పత్తియు కలుగును. మోక్షము మిగుల దుర్లభమని ఈ ప్రకారము చెప్పఁబడినది. విరోధము లేదు. లేక మఱి ఏ ప్రమాణము చేతను

తెలియఁబడనిది, వ్యక్తము కానిది. అవ్యక్తము బ్రహ్మమే అందు ప్రవేశించుట మోక్షమే అని తెలియఁదగును *

అవ : ఈ ప్రకారము విరాజు నిలయమును చెప్పి తత్కారణములైన, మహదాది పృథివ్యంతములైన, వానికి లయమును, జెప్పుచున్నారు.

**శ్లో. వాయునా హృతగంధా భూ స్సలిలత్వాయ కల్పతే**
**సలిలం తద్ధృతరసం జ్యోతిష్ట్వా యోపకల్పతే.** **17**

అ ; వాయునా=వాయువుచే; హృతగంధా=హరింపఁబడిన గంధగుణము గలదైన (వాయువులకు, గంధరస హారిత్వము ప్రసిద్ధము.) గంధము యొక్క వ్యావర్తకత్వము గత మగుట వలన భూః=భూమి సలిలత్వాయకల్పతే=జలమగుటకు యోగ్యము అగుచున్నది అనగా భూమి జలముతో లీనమగుచున్నది. తత్+హృతరసం=ఆ వాయువు చేత హరింప;

---

*వ: అవ్యక్త నిర్గుణ పరబ్రహ్మంబునందుఁ దనకు విపర్యయంబుగాఁ జననంబైన జ్ఞానంబే విష్ణుమాయ యనంబడుఁ బరమేశ్వరుండట్టి మాయ చేత జగంబు నిర్మించి నిశ్చింతుండై యుండు ఇంద్రియార్థ భ్రమణంబు సేసెడు దుర్మతులకు సుషుప్త్యాద్యవస్థయుఁ గలుగు; స్వప్నంబు నందు గ్రాహ్యగ్రాహక గ్రహణంబులను త్రివిధ భేదంబులుం గలిగియుండు; ఈ చందంబున నవిద్యాంధకార సంవృతంబై మూఁడు విధంబులఁ బర్యవసించు మనోరథంబు స్వప్నావస్థయందణంగిన క్రియఁ ద్రివిధంబగు మాయయు నాత్మయందు లీనంబగు; పరమేశ్వరుండు మొదలం బృథివ్యాది మహాభూతమయం బయిన సృష్టిని గలుగఁజేసి యందుఁ బంచభూతాత్మకం బయిన యాత్మకే కాదశేంద్రియంబుల చేత భేదంబు పుట్టించుచు గుణంబులఁచేత గుణంబు లంగీకరించుచు నాత్మయందుఁ బ్రద్యోతిత గుణంబుల వలన గుణానుభావంబు జేయుచు నున్నవాఁడై సృష్టి నాత్మీయంబుగాఁ భావించు; దేహి కర్మమూలంబున నైమిత్తిక కర్మంబుల నాచరించుచుఁ దత్ఫలం బంగీకరించి దుఃఖైక పరుండై వర్తించు: పెక్కు దుఃఖంబు లంబడిన యా దేహి కర్మఫల ప్రాప్తుండగుచు భూత సంప్లవ పర్యంతంబు పరవశుండై జన్మమరణంబులం బొరలుచుండు; అంత్యకాలం బాసన్నంబయిన ద్రవ్య గుణ స్వరూపంబగు జగంబు ననాది నిధనంబగు కాలంబు ప్రకృతిం బొందించు; అటమీద శతవర్షంబులు వర్షంబు లేమిచేత సత్యుగ్రలోకలోచను తేజంబున సకల లోకంబులు దహింపంబడు; అంత నధోలోకంబున నుండి సంకర్షణ ముఖ జనితానలం బూర్ధ్వ శిఖాజాలంబుల వాయు సహాయంబై దిక్కులయందెల్లఁ బ్రవర్తించు; అటమీద సంవర్తక వలాహక గణంబులు నూఱు హాయనంబులు సలిల ధారాపాతంబుగా వర్షంబు గురియు; అందు విరాడ్రూపంబు లీనంబగు; నంత నీశ్వరుండు నిరింధనాగ్ని చందంబున నవ్యక్తంబు బ్రవేశించు; తదనంతరంబ ధరణీ మండలంబు వాయుహృతగంధంబై కబంధరూపంబుఁ దాల్చు; ఆ జలంబు హృతరసంబై తేజోరూపంబు నొందు; ఆ తేజంబు తమో నిరస్తంబై వాయువందడంగు; ఆ గంధవహుండు స్పర్శ విరహితుండయి యాకాశంబు నందు సంక్రమించు; ఆ విష్ణుపదంబును విగతశబ్దగుణంబు గలదియై యాత్మయందడంగు; ఇంద్రియంబులును మనంబును బుద్ధియు వికారంబుల తోడ నహంకారంబుఁ బ్రవేశించు; ఆ యహంకారంబును స్వగుణయుక్తంబై పరమాత్మునిం జేరు. ఇట్లు త్రివర్ణాత్మికయై సర్గ స్థితి లయ కారిణియగు మాయ యిట్టిది యని తత్స్వరూప మాహాత్మ్యంబులు వివరించిన నరపాలుం డిట్లనియె.

బడిన రసగుణము గలదైన, సలిలం = జలము; జ్యోతిష్ట్వాయ = అగ్ని యగుటకు; ఉపకల్పతే = శక్యమగును. అనగా అగ్నిలో లీనమగును.

శ్లో. హృతరూపంతు తమసా వాయౌ జ్యోతిః ప్రలీయతే
హృతస్పర్శో ౽వకాశేన వాయుర్నభసి లీయతే. **18**

అ : తమసా = సంవర్తకమైన తమస్సుచే (చీకటిచే); హృతరూపం = హరింపఁబడిన రూపముగలదై; జ్యోతిః = అగ్ని; వాయౌ ప్రలీయతే = వాయువునందు లీనమగుచున్నది; అవకాశేన = ఆకాశముచే; హృతస్పర్శః = హరింపబడిన స్పర్శగుణముగలదై; వాయుః = వాయువు; నభసి = ఆకాశమందు; లీయతే = లీనమగుచున్నది.

తా. సంవర్తక వాయువుచే హరింపఁ బడిన గంధగుణముగలదై భూమి జలమునందు లీనమగు చున్నది. ఆవాయువుచే హరింపఁబడిన రసగుణము గలదై జలము అగ్నియందు లీనమగును. ప్రళయకాల తమస్సుచే హరింప బడిన రూపము గలదై అగ్ని వాయువునందు లీనమగును. ఆకాశముచే హరింపఁబడిన స్పర్శ గుణముగలదై వాయువు ఆకాశమందు లీనమగు చున్నది.

శ్లో. కాలాత్మనా హృతగుణం నభ ఆత్మని లీయతే
ఇంద్రియాణి మనో బుద్ధి స్సహ వైకారకై ర్నృప
ప్రవిశంతి హ్యహంకారం స్వగుణై రహమాత్మని. **19**

అ : కాలాత్మనా = స్వకారణమైన కాలస్వరూపముచే, శబ్దమునకు కాలముననే నాశము ప్రసిద్ధము. ఇందువలన తద్రూపుఁడైన ఆత్మచే అనగా ఈశ్వరునిచే; హృతగుణం = హరింపబడిన శబ్దగుణముగలదై; నభః = ఆకాశము; ఆత్మని = తామసాహంకారమందు; లీయతే = లీనమగుచున్నది; ఇంద్రియాణి బుద్ధిః = పది ఇంద్రియములు బుద్ధియు రాజసాహంకారమందు లీనమగును. మనః = మనస్సు; వైకారికై స్సహ = ఇంద్రియాధిదేవతలతో; అహంకారం ప్రవిశంతి = సాత్త్వికాహంకారమందు లీనమగును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాధిదేవతలతోగూడ అహంకారమును ప్రవేశించుచున్నవి. అహం = అహంకారము; ఆత్మని = మహత్తత్వమందును, మహత్తత్వము ప్రకృతియందును, ఆ ప్రకృతి బ్రహ్మమునందును లీనమగుచున్నవి.

తా. కాలస్వరూపుఁడైన ఈశ్వరునిచే హరింపబడిన శబ్దగుణము గలదై ఆకాశము తామసాహంకారము నందు లీనమగుచున్నది. ఇంద్రియములు బుద్ధియు రాజసాహంకారము నందును, మనస్సును ఇంద్రియాధిష్ఠాన దేవతలును సాత్వికాహంకార మందును ప్రవేశించును. ఈ ప్రకారము త్రివిధములైన కార్యములతో అహంకారము మహత్తత్త్వమందు లీనమగుచున్నది. ఆమహత్తత్త్వము ప్రకృతి యందును ఆప్రకృతి బ్రహ్మమందును లీనమగు చున్నది.

శ్లో. ఏషా మాయా భగవత స్సృష్టిస్థిత్యంత కారిణీ
త్రివర్ణావర్ణితాస్మాభిః కింభూయ శ్రోతుమిచ్ఛసి. **20**

అ : ఏషా = ఇదియే ; సృష్టిస్థిత్యంతకారిణీ = సృష్టిస్థితిసంహారములను చేయునది; త్రివర్ణా = త్రిగుణములుగలది; అస్మాభిః = మాచేత; వర్ణితా = వర్ణింపబడినది; భూయః = మరల; శ్రోతుం = వినుటకు; కిం ఇచ్ఛసి = ఏమి కోరుచున్నావు.

తా. మాయాశ్రవణము వలన భీతుడైన రాజునకు తన్నివృత్త్యుపాయ శ్రవణమున ఇష్టముగలిగించుచున్నది. ఇదియే భగవంతునిమాయ. జగత్తుయొక్క సృష్టి స్థితి లయములు చేయునది. మూడు గుణములు గలది. అని మేము వర్ణించి చెప్పితిమి. ఇంకనేమి వినఁగోరుచున్నావు.

రాజోవాచ = రాజు వచించెను.

అవ. ఈప్రకారము భయకంపితుఁడై రాజు దాని నివృత్త్యుపాయమును ప్రశ్నించుచున్నాడు, "తన్మాయయాతో బుధ ఆభజేత్తమ్ —(అందువలన బుద్ధిమంతుడు మాయను తొలఁగుటకు ఆ ఈశ్వరుని భజించ వలెను.) అని, భక్తి, ఆమాయనుండి తరింపఁజేయునదిగా చెప్పబడినది. అట్లయినను, కేవలము భక్తియే గాక, అన్యమేమయిన ఓమహామునీ! ఉపాయమున్నదా ? అని తెలిసికొనుటకు మరల ప్రశ్నము.

శ్లో. యథైతామైశ్వరీం మాయాం దుస్తరామకృతాత్మభిః
తరంత్యంజః స్థూలధియో మహర్ష ఇద ముచ్యతామ్. 21

అ : మహర్షే = ఓమహాముని; యథా = ఏప్రకారము; ఏతాం = ఈ; ఐశ్వరీం మాయాం = ఈశ్వరమాయను; అకృతాత్మభిః = అంతఃకరణము వశము చేసికొనని వారిచే; దుస్తరాం = తరింపశక్యము కానిదానిని; స్థూలధియః = స్థూలశరీరమునందు నేను అను బుద్ధి గలవారును; అంజః = సులభముగా; తరంతి = తరింతురో, ఇదం + ఉచ్యతామ్ = ఇది చెప్పఁబడుఁగాక!

తా. ఓ మహర్షి ఈ ఈశ్వర మాయను మనో వశ్యత లేనివారలకు తరింప శక్యము కాని దానిని స్థూలశరీరమున నేనను బుద్ధిగల వారును, సులభముగా నెట్లు దాటుదురో దానిని వచింపుము.

ప్రబుద్ధ ఉవాచ = ప్రబుద్ధుఁడు వచించెను.*

అవ. భక్తికి వ్యతిరేకముగా ఏఉపాయము లేదు, అని అంగీకరించి సాధనసంపదతోఁ గూడిన భక్తిని నిరూపించుచున్నారు. అందు ప్రథమము వైరాగ్యముద్వారా గురువును ప్రాప్తించుటను చెప్పుచున్నారు.

---

*ఉ. జ్ఞానవిహీనులైన నరసంఘము గానఁగరానిమాయ దా
లోవ నడంచియెట్లు హరిలోకముఁ జెందుదురంతయున్ దగన్
భూనుత సత్యవాక్యగుణ భూషణ! యిక్కడ వేడ్క తోడుతన్
బూనికఁ జెప్పుమన్నను ప్రబుద్ధుఁడు నిట్లను గారవంబునన్. 68

శ్లో. కర్మాణ్యారభమాణానాం దుఃఖహత్యై సుఖాయ చ
పశ్యేత్పాక విపర్యాసం మిథునీచారిణాం నృణామ్. 22

అ : దుఃఖహత్యై=దుఃఖనాశనమునకు; సుఖాయచ=సుఖముకొఱకును; కర్మాణి=కర్మలను; ఆరభమాణానాం = ఆరంభించువారును; మిథునీచారిణాం=పరస్పరముకలిసికొని వర్తించువారును అగు; నృణాం=నరులకు; పాకవిపర్యాసం =ఫలవైపరీత్యమును; పశ్యేత్=చూడవలెను.

తా. దుఃఖనివృత్తికిని సుఖము కలుగుటకును కర్మలను ఆరంభించుచు పరస్పరము కలిసి యున్న నరులకు ఆకర్మల ఫలవైపరీత్యమును దర్శించవలెను.

అవ. కర్మలచే సాధింపఁబడిన వయ్యు విత్తాదులు సుఖహేతువులు కావు, అని దర్శించవలెను. అవి చెప్పుచున్నారు.

శ్లో. నిత్యార్తి దేన విత్తేన దుర్లభేనాత్మమృత్యునా
గృహాపత్యాప్త పశుభిః కా ప్రీతి స్సాధితై శ్చలైః॥ 23

అ : దుర్లభేన=దుర్లభమై; ఆత్మమృత్యునా =తనకు మృత్యుస్వరూపమైన; నిత్యార్తిదేన =నిత్యము ఆర్జించిన; విత్తేన=ధనము చేతను; సాధితైః=సంపాదింపబడినవై; చలైః=అనిత్యములైన; గృహ+అపత్యాప్తపశుభిః=గృహము; సంతానము మిత్రులు పశువులు అను వానిచే; కాప్రీతిః=ఏమి సంతోషము కలుగును.

తా. దుర్లభమై తనకు మృత్యుస్వరూపమై నిత్యమార్జించిన ధనము చేతను సంపాదించబడిన అనిత్యములైన ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు, మిత్రులు, పశువులు అను వానిచేతను ఏమి సంతోషము కలుగుచున్నది.

అవ. కర్మలచే సాధింపఁబడిన విత్తాదులు సుఖహేతువులు కావనియు వానివలన సంతోషము లేదనియు వచించుచు మఱియు— ఇట్లు తెల్పెను.

శ్లో. ఏవం లోకం పరం విద్యా న్నశ్వరం కర్మనిర్మితం
సతుల్యాతి శయ ధ్వంసం యథామండల వర్తినామ్॥ 24

అ : ఏవం =ఈప్రకారము; పరంలోకం=పరలోకమును; కర్మనిర్మితం=కర్మచే నిర్మింపబడిన దానిని; నశ్వరం=నశించునదియు; అట్లేశ్రుతి "తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవ మేవాముత్రపుణ్యచితో లోకః క్షీయతే' ఏ ప్రకారము కృష్యాదులచే సంపాదింప బడిన ధన ధాన్యాదికము భుక్తము వలన క్షీణించుచున్నదో అట్లే జ్యోతిష్టోమాది యజ్ఞకర్మలచే కలిగిన పుణ్యముచే నార్జింపఁబడిన స్వర్గమును. అనుభవమున క్షీణించుచున్నది. మఱియు వర్తమాన కాలమునందు దుఃఖసంయుక్తముఁగాఁ జూడవలెననుచున్నారు. సతుల్యాది శయధ్వంసం=సమానత్వమును ఆధిక్యమును ధ్వంసముచేయు వదనియు, ఇందు సమానత్వమందు స్పర్థ, అతిశయమందు అసూయ, ధ్వంసాలోచనమున భయమును అపరిహార్యములనియు; విద్యాత్=ఎఱుగవలయును;యథామండలవర్తినాం=అఖండ భూమండలమున వర్తించువారలకును; పరస్పరము

ఎట్లో అట్లు అఖండభూమండలమున వర్తించుచున్న రాజులకు పరస్పరము సమానత్వమున స్పర్థ, అధిక్యమందు అసూయ, గలిగి ఒకరి నొకరు నాశనము చేయవలెనను భావము ఎట్లు కలుగునో, అట్లని భావము.

తా. జ్యోతిష్టోమాది యాగఫలమైన పుణ్యమునలభించు స్వర్గమును నశించునదిగా పుణ్యానుభవమున క్షీణించునదిగా నెఱుంగవలెను.

శ్లో. తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసు శ్రేయ ఉత్తమమ్
శాబ్దే పరేచ నిష్ణాతం బ్రహ్మణ్యుపశమాశ్రయమ్. 25

అ : తస్మాత్ = అందువలవ; ఉత్తమం, శ్రేయః = ఉత్తమ శ్రేయస్సును; జిజ్ఞాసుః = తెలియఁగోరినవాడు; శాబ్దే బ్రహ్మణి = శబ్దబ్రహ్మమగు వేదమునందు; పరే బ్రహ్మణి = పరబ్రహ్మమువందు (అపరోక్షానుభావమున) నిష్ణాతం = తత్త్వజ్ఞుడగు; ఈ రెండు విశేషణములచే స్వానుభవము సుగమబోధనమును వ్యక్తము అగుచున్నవి. ఉపశమాశ్రయం = శాంతికి అశ్రయుడును అగు; గురుం = గురువును; ప్రపద్యేత = శరణుపొందవలెను.

తా. అందువలన ఉత్తమ శ్రేయస్సును గోరుజిజ్ఞాసువు శబ్దబ్రహ్మమగు వేదమునందునిష్ణాతుఁడు, లేదా తత్త్వమెఱింగినవాఁడును పరబ్రహ్మమునందు నిష్ణాతుఁడును, ఆ పరబ్రహ్మజ్ఞానము గలవాఁడును శాంతికి ఆశ్రయమైనవాఁడును అయిన గురువును ఆశ్రయించవలెను.

శ్లో. తత్ర భాగవతాన్ ధర్మాన్ శిక్షే ద్గుర్వాత్మదైవతః।
అమాయయాఽనువృత్త్యాయై స్తుష్యేదాత్మా త్మదో హరిః॥ 26

అ : గురు + ఆత్మ + దైవతః = గురువేతనకు దైవముగా గలవాఁడై; అమాయయా = కపటములేని; అనువృత్త్యా = సేవచే; యైః = ఏ ధర్మముల చేత; ఆత్మనః = తనకు; ఆత్మా = ఆత్మప్రియుఁడు; ఆత్మదః = ఆత్మప్రదుడును అగు; హరిః = భగవంతుడు, తుష్యేత్ = సంతోషము పొందునో; భాగవతాన్ ధర్మాన్ శిక్షేత్ = ఆ భాగవత ధర్మములను నేర్చుకొనవలెను.

తా. అట్టి జిజ్ఞాసువు ఆ గురువును తన దైవముగా భావించి, నిష్కపటమైన సేవచే గురువును సంతోషపెట్టి అతని వలన ఏ ధర్మములచే హరి సంతోషము పొందునో అట్టి భాగవతధర్మములను తెలియవలెను.

శ్లో సర్వతో మనసోఽసంగమాదౌ సంగం చ సాధుషు।
దయాం మైత్రీం ప్రశ్రయంచభూతేష్వద్ధా యథోచితమ్॥ 27

అ : సర్వతః = అంతట; మనసః = మనస్సునకు: అసంగః = ఆసక్తి లేకుండుట; ఆదౌ = మొదట; అద్ధా = చక్కగా, యథోచితం = తగినట్లు; శిక్షేత్ = బోధింపవలెను.

తా. గురువు మొదట శిష్యునికి దేనియందును మనస్సునకు సంగము కూడదని చెప్పవలెను. సాధుసంగము, ప్రాణులందునుసములందును మైత్రి, పెద్దలందు వినయము కలిగియుండవలెనని తగినట్లు బోధించవలెను.

శ్లో. శౌచం తప స్తితిక్షాంచ మౌనం స్వాధ్యాయ మార్జవం ।
బ్రహ్మచర్య మహింసాంచ సమత్వం ద్వంద్వ సంజ్ఞయోః ॥ 28

తా : మృజ్జలాదులచే బాహ్యశౌచము, అదంభ మౌనాదికము అభ్యంతర శౌచము, తితిక్ష, ఓర్పు, మౌనము, స్వాధ్యాయ వేదాంత శాస్త్రాదులందు ఋజుభావము, సత్ప్రవర్తన, బ్రహ్మచర్యము, అహింస, శీతోష్ణములందు, సుఖదుఃఖములందును సమత్వము అను వానిని తెలిసికొనవలెను. మృత్తు, జలము లోనగు వానిచే బాహ్యశౌచము, అదంభ మౌనాదికముచే అంతః శౌచము. స్వధర్మాచరణ రూపమగు తపస్సు, క్షమ, మౌనము (వ్యర్థముగా వాగుబ్బా రణము లేకుండుట)స్వాధ్యాయము (అధికారాను రూపమగు వేదపాఠాదికము) సత్ప్రవర్తనము, బ్రహ్మచర్యము. ఎవనికేది ఉచితమో అది, గృహస్థునకు ఋతుకాల స్వదార గమనాది నియ మాదికము బ్రహ్మచర్య మగును. అహింస, భూతములందు ద్రోహచింత లేకుండుట, శీతోష్ణ సుఖదుఃఖాది రూపములైన ద్వంద్వములందు సమత్వము హర్ష విషాదరాహిత్యము మున్నగు నవి తెలిసికొనవలెను.

శ్లో. సర్వత్రాత్మేశ్వరా న్వీక్షాం కైవల్యమనికేతతాం ।
వివిక్త చీరవసనం సంతోషం యేనకేన చిత్ ॥ 29

అ. సర్వత్ర = చేతనాచేతన రూప సకలవస్తు జాలమందును: ఆత్మేశ్వర + అన్వీక్షాం = సంవిద్రూపమున ఆత్మను జూచుటయు, నియంతృ రూపమున ఈశ్వరుని చూచుటయును, కైవల్యం = ఏకాంతశీలత్వము; అనికేతతాం = గృహాభిమాన రాహిత్యమును; వివిక్త చీరవసనం = శుభ్రములైన నారచీరలు ధరించుటయును; యేనకేనచిత్ = దైవికముగా ప్రాప్తించిన దాని తోనే; సంతోషం = సంతోషమును.

తా. విశ్వమంతట ఆత్మ, సంవిదుఁడుగా (జ్ఞానరూపమున) నున్నాఁడనియు. పరమే శ్వరుఁడు సర్వ నియామకుఁడుగా నున్నాడనియును తలంచుటయు, ఏకాంతస్థలమున నుండు టయు గృహాదులు నావియను మమకార రాహిత్యమును, శుభ్రమైన నారచీరలను ధరించుట యథాలాభ సంతోషమును అనునవి భాగవత ధర్మములని తెలియవలెను.

శ్లో. శ్రద్ధాం భాగవతే శాస్త్రేఽనిందా మన్యత్ర చైవహి ।
మనోవాక్కర్మదండంచ సత్యం శమదమావపి ॥ 30

అ. భాగవతేశాస్త్రే = భగవత్ప్రతి పాదకశాస్త్రమందు; శ్రద్ధాం = శ్రద్ధను; అన్యత్ర = ఇతర శాస్త్రములయందు; అనిందాంచ + ఏవ = నిందారాహిత్యమును: మనోవాక్కర్మ దండం చ = మనస్సువకుదండము ప్రాణాయామముచే, వాక్కునకు మౌనముచే, కర్మలకుదండము ఫల పరిత్యాగము చేతను, ఇట్లు త్రివిధదండములను; సత్యం = యథార్థ భాషణమును; అపి (చ) = మరియు; శమదమౌ = శాంతిని (ఓర్పును) ఇంద్రియ నిగ్రహమును: (అభ్యసింపవలెను.)

తా : భగవత్ ప్రతిపాదక శాస్త్రము నందు శ్రద్ధ, ఇతర తర్కాది శాస్త్రములను నిందించకుండుట, ప్రాణాయామముచే మనోదండము, మౌనముచే వాగ్దండము, ఫలాసక్తి రాహి

త్యముచే కర్మదండము, యథార్థభాషణము శమదమములు, ఆంతరింద్రియ నిగ్రహము బాహ్యేంద్రియ నిగ్రహము అనునివి భాగవత ధర్మములు, వీనికై యత్నింపవలెను.

శ్లో. శ్రవణం కీర్తనం ధ్యానం హరేరద్భుత కర్మణః ।
జన్మకర్మగుణానాం చ తదర్థే ఒఖిలచేష్టితమ్ ॥ 31

అ. అద్భుతకర్మణః=ఆశ్చర్యకరములగు కర్మలుగల; హరేః=హరి యొక్క; జన్మకర్మ గుణానాంచ=అవతారముల యొక్కయు సాధు రక్షణ దుష్ట శిక్షణాది కర్మల యొక్కయు ఐశ్వర్యాది గుణముల యొక్కయు; శ్రవణం=శ్రవణము, (వినుట); కీర్తనం=కీర్తనము చేయుట (గానము చేయుట); ధ్యాన=ధ్యానించుటయు, తదర్థే=హరి నుద్దేశించి; అఖిల చేష్టితమ్=సర్వకర్మలు చేయుట అనువానిని తెలియవలెను.

తా : అద్భుత కర్మలు చేయువాఁడైన శ్రీహరి యొక్క జన్మకర్మ గుణములను, అవతారములు, సాధురక్షణ దుష్టశిక్షణాది కర్మలు, జ్ఞానైశ్వర్యాది గుణములు అనువానిని, శ్రవణము చేయుట, (హరికథా శ్రవణము) తన్నామ సంకీర్తనము తత్స్వరూప ధ్యానము హరి ప్రీతికై సర్వకర్మలు చేయుట అనునవి భాగవత ధర్మములు.

శ్లో. ఇష్టం దత్తం తపో జప్తం వృత్తం యచ్చాత్మనః ప్రియమ్ ।
దారాంత్సుతాన్ గృహాన్ ప్రాణాన్ యత్పరస్మై నివేదనమ్ ॥ 32

అ. ఇష్టం=యాగాదికము; దత్తం=దానము; తపః=తపస్సు; జప్తం=జపము చేయుట; వృత్తం=సదాచారము; యత్ చ=ఏది; ఆత్మనః=తనకు; ప్రేయం=ఇష్టమో దానిని; దారాన్=భార్యను; సుతాన్=పుత్రులను; గృహాన్=గృహములను; ప్రాణాన్=ప్రాణములను; యత్పరస్మే నివేదనమ్=ఏ పరమాత్మకు నివేదించుటయు.

తా : ఇష్టమగు యజ్ఞయాగాదికము, ధన వస్త్రాది దానము, తపస్సు, ప్రణవాది జపము సదాచారము, భార్య, పుత్రులు, గృహము, ప్రాణము, గంధ పుష్పాదికము, పరమేశ్వరునికి తనకు ఇష్టమైనది సమర్పించుట భాగవత ధర్మముగా తెలియవలెను.

శ్లో. ఏవం కృష్ణాత్మ నాథేషు మనుష్యేషు చ సౌహృదమ్ ।
పరిచర్యాం చోభయత్ర మహాత్సు నృషు సాధుషు ॥ 33

అ. ఏవం=ఈ ప్రకారము, కృష్ణాత్మనాథేషు=కృష్ణుఁడే ఆత్మనాథుఁడు గాగల; మనుష్యేషు=మనుష్యులందు అనగా భగవద్భక్తుల యందు; సౌహృదం=సుహృద్భావము; మహాత్సు=తనకంటె విద్యాదులచే గొప్ప వారైన; నృషు=నరులయందు; సాధుషు=సాధువులందు; ఉభయత్ర=స్థావర జంగమములందును; పరిచర్యాం=సేవను; శిక్షేత్=అభ్యసింపవలెను,

తా : కృష్ణుఁడే ఆత్మనాథుఁడు లేక కృష్ణుఁడే నాథుఁడు, అని తలచు మనుష్యులందు భక్తులందు, సుహృద్భావమును, మంచితనము, స్థావరజంగమములందు దేవతలందు, నరులందు సాధువులందు స్వధర్మ శీలుర యందు మహాత్ములగు భాగవతులందును విశేషించి సేవా భావముతో ప్రవర్తించుట భాగవతుల లక్షణమని తెలియవలెను.

శ్లో. పరస్పరాను కథనం పావనం భగవద్యశః ।
మిథోరతిర్మిథస్తుష్టి ర్నివృత్తిర్మిథ ఆత్మనః ॥ 34

అ. పావనం=పవిత్రమైన; భగవత్+యశః=భగవంతుని కీర్తిని అవతారాది కృత్యములను, గుణములను; పరస్పర+అనుకథనం=ఒండొరులకు చెప్పుకొనుట; మిథఃరతిః=పరస్పరమాసక్తి; మిథః+తుష్టిః=పరస్పరము సంతృప్తి; మిథః+నివృత్తిః=అధ్యాత్మికాది తాపత్రయ నివృత్తి; ఆత్మనః=ఆత్మకు కోరవలెను.

తా : పావనమైన భగవత్కథాదికమును ఒండొరులకుఁ జెప్పుకొనుట, పరస్పరము ఆసక్తి, పరస్పరము సంతృప్తి ఆత్మకు సుఖము మఱియు గౌరవము ఇవి తెలియవలెను.

శ్లో. స్మరంతః స్మారయంతశ్చ మిథోఽఘౌఘహరం హరిమ్ ।
భక్త్యా సంజాతయా భక్త్యా బిభ్రత్యుత్పులకాం తనుమ్ ॥ 35

అ. అఘౌఘహరం=పాపరాశిని హరించు; హరిం=హరిని; స్మరంతః=స్మరించువారు; స్మారయంతశ్చ=ఇతరులను స్మరింపజేయు వారును; భక్త్యా=సాధన భక్తిచేత; సంజాతయా భక్త్యాచ=ప్రేమలక్షణ భక్తి చేతను; ఉత్పులకాం=గగుర్పొడిచిన; తనుమ్=శరీరమును: బిభ్రతి =ధరింతురు.

తా : సాధన భక్తిచేతను, ప్రేమలక్షణమగు భక్తిచేతను, సమస్త పాపములను హరించుహరిని స్మరించువారును, స్మరింప జేయువారును గగుర్పాటుతో కూడిన శరీరమును ధరించిన వారు కాదా ! భజనము ఆనందదాయక మగునని భావము.

శ్లో. క్వచిద్రుదంత్యచ్యుత చింతయా క్వచిద్ధసంతి నందంతి వదంత్యలౌకికాః ।
నృత్యంతి గాయంత్యనుశీల యంత్యజం భజంతి తూష్ణీం పరమేత్య నిర్వృతాః ॥ 36

అ. పరం=పరమేశ్వరుని; ఏత్య=పొంది; నిర్వృతాః=సుఖమొందిన భక్తులు; క్వచిత్ =ఒకప్పుడు; అచ్యుతచింతయా=హరి చింతచే, రుదంతి=ఏడ్తురు; క్వచిత్=ఒకప్పుడు;హసంతి =నవ్వుదురు; నందంతి=సంతోషింతురు; అలౌకికాః=లోకవిలక్షణులై ; వదంతి=పల్కుదురు; నృత్యంతి=ఆడుదురు; గాయంతి=పాడుదురు; అజం=భగవంతుని; అనుశీలయంతి= తత్స్వరూప స్వభావాదులను పరిశీలింతురు; తూష్ణీం=మిన్నకుండ, భజంతి=భజింతురు.

తా : పరమేశ్వరుని పొంది సుఖపరవశులైన భక్తులు ఒక్కచో అచ్యుతుని చింతచే ఏడ్తురు. ఒక్కచో నవ్వుదురు. ఒక్కచో సంతోషింతురు. పరవశులై నమస్కరింతురు, ఆడుదురు, పాడుదురు. ఆయన లీలలను అభినయింతురు. మిన్నకుందురు

శ్లో. ఇతి భాగవతాన్ ధర్మాన్ శిక్షేద్భక్త్యా తదుత్థయా ।
నారాయణపరో మాయా మంజస్తరతి దుస్తరామ్ ॥ 37

అ. ఇతి=ఇట్లు; తదుత్థయా=ఆ భాగవత ధర్మముల వలన బుట్టిన; భక్త్యా=భక్తిచేత భాగవతాన్ ధర్మాన్=భాగవత ధర్మములను; శిక్షేత్=నేర్వవలెను; నారాయణపరః=

నారాయణుని యందు ఆసక్తి గలవాడై; అంజః=శీఘ్రముగా: దుస్తరాం=తరింప కష్టమైన, మాయాం+తరతి=మాయను దాటుచున్నాడు.

తా : ఇట్లు భాగవత ధర్మములను అభ్యసించవలెను, భాగవత ధర్మముల వలన జనించిన భక్తిచే నారాయణ ధ్యాన పరుఁడైన భక్తుఁడు దుస్తరమైన మాయను దాటుచున్నాడు.*

రాజోవాచ = రాజు వచించెను.

శ్లో. నారాయణాభిధానస్య బ్రహ్మణః పరమాత్మనః
నిష్ఠామర్హథ నో వక్తుం యూయం హి బ్రహ్మవిత్తమాః ॥

అ. బ్రహ్మవిత్తమాః=బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠులగు ఓ మునులారా! నారాయణ+అభిధానస్య=నారాయణు డను పేరుగల; బ్రహ్మణః=బ్రహ్మ స్వరూపుడగు; పరమాత్మనః=పరమాత్మ యొక్క; నిష్ఠాం=స్వరూపధ్యానమును; నః=మాకు; వక్తుం=చెప్పుటకు; యూయంహి=మీరే; అర్హథ=యోగ్యులు (అగుచున్నారు).

తా. ఓ బ్రహ్మవిదులలో నుత్తములారా! నారాయణుఁడను పేరుగల బ్రహ్మమైన పరమాత్మ యొక్క స్వరూపమును మీరు మాకుఁ జెప్పఁదగుదురు.

శ్లో. వదంతి తత్తత్త్వవిద స్తత్త్వం యద్ జ్ఞానమద్వయమ్
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే ॥

---

వ. సూర్యోదయాస్తమయంబులం బ్రతిదినంబు నాయువు క్షీణంబు నొంద, దేహకళత్ర మిత్ర భ్రాతృ మమత్వ పాశబద్ధులై విడివడును పాయంబుగానక, సంసారాంధకార మగ్నులయి గతాగత కాలంబుల నెఱుంగక, దివాంధంబులగు జంతుజాలంబుల భంగి జన్మజరారోగ విపత్తి మరణంబు లందియు, శరీరంబు మేలనుచు బ్రమోద మోహమదిరాపాన మత్తులై, విషయాసక్తతం జిక్కి, తమ్ముఁ దా మెఱుంగక యుండి, విరక్తి మార్గంబు తెలియక వర్తించు మూఢులగు, జనంబుల పొంతలఁ బోవక కేవల నారాయణ భక్తి భావంబుగల సద్గురూత్తములఁ బ్రతిదినంబును భజియించి, సాత్త్వికంబు భూతదయయును, హరికథామృత పానంబును, బ్రహ్మచర్య వ్రతంబును, విషయంబుల మనంబు సేరకుండుటయు, సాధు సంగమంబును, సజ్జన మైత్రియు వినయ సంపత్తియు, శుచిత్వంబును, క్షమయు, మౌనవ్రతంబును, వహింసయు, సుఖదుఃఖాది ద్వంద్వ సహిష్ణుతయు, నీశ్వరుని సర్వగతునిగా భావించుటయు ముముక్షుత్వంబును, జనసంగవర్జనంబును, వల్కలాది ధారణంబును, యదృచ్ఛా లాభసంతుష్టియు, వేదాంత శాస్త్రార్థ జిజ్ఞాసయును, దేవతాంతర నిందా వర్జనంబును, గరణత్రయ శిక్షణంబును, సత్యవాక్యతయు, శమదమాది గుణ విశిష్టత్వంబును, గృహారామ క్షేత్ర కళత్ర పుత్ర విత్తాదుల హరి కర్పణంబు సేయుటయు, నితర దర్శన వర్జనంబు సేయుటయును, భాగవతోత్తమ ధర్మంబులని చెప్పి యిట్లనియె, 54

కం. హరిదాసుల మిత్రత్వము
మురరిపు కథలెన్నికొనుచు మోదము తోడన్
భరితాశ్రు పులకితుండై
పురుషుఁడు హరి మాయ గెల్పు భూపవరేణ్యా! 55

(తత్త్వవిదులు ఆ తత్త్వమును అద్వయమైన జ్ఞానమును బ్రహ్మము, పరమాత్మ, భగవంతుఁడు అను శబ్దములచే చెప్పుదురు.) ఆ ప్రకారము "నారాయణే భగవతి తదిదం విశ్వ మాహితమ్ గృహీత మాయోరు గుణ స్సర్గా దవగుణస్స్వతః" (నారాయణుఁడను భగవంతుని యందు ఈ విశ్వము నిల్చి యున్నది అగుణుఁడైన భగవంతుఁడు సర్గాది యందు మాయను గ్రహించి స్వయముగ గొప్పగుణములు గలవాఁడగుచున్నాఁడు. ఇందు ఈ శబ్దములచే నిర్విశేషమైన ఆ బ్రహ్మమే చెప్పఁబడుచున్నది) కాన మఱి యేదైన విశేషాంశము కలదా ? అని ప్రశ్నించెను.

*పిప్పలాయన ఉవాచ

శ్లో. స్థిత్యుద్భవ ప్రళయహేతు రహేతురస్య
యత్స్వప్న జాగరసుషుప్తిషు సద్బహిశ్చ ॥
దేహేంద్రియా సుహృదయాని చరంతి యేన
సంజీవితాని తదవైహి పరం నరేంద్ర ॥ 39

అ, నరేంద్ర = ఓ రాజా !; అస్య = ఈ విశ్వము యొక్క: స్థితి + ఉద్భవ ప్రళయహేతుః = స్థితి, ఉత్పత్తి, లయము అనువానికి కారణమైనవాఁడు; అహేతుః = స్వయము హేతు రహితుఁడు (సృష్టిస్థితి లయ కారకుఁడై తనకు హేతువు లేని ఆ నారాయణుఁడు;) తత్ + పరం + అవేహి = అతఁడే పర తత్త్వమని ఎఱుంగుము; తత్ = ఆ తత్త్వము; స్వప్న + జాగర + సుషుప్తిషు = స్వప్నము, జాగరము, సుషుప్తి అను మూఁటి యందు; సత్ = వర్తించుచున్నదై; 'తురీయంత్రిషు సంతతమ్' = ఆ మూఁడవస్థలయందు తురీయమైనది సంతతముండునదని చెప్పబడును; బహిః చ = సమాధి లోనగు వానియందును: ఏది ఉన్నదో, మఱియును; దేహ + ఇంద్రియ + అసుహృదయాని = దేహము, ఇంద్రియములు, ప్రాణము, హృదయము అనునవి; యేన = దేనిచేత; సంజీవితాని = జీవింపబడిన వయియే; చరంతి = చరించుచున్నవో; తత్ + పరం = అదియే పరతత్త్వమని; అవేహి = ఎఱుంగుము.

తా. ఓ రాజా విశ్వము యొక్క సృష్టి స్థితి లయములకు కారణమైన వాడు స్వయముగా తనకేదియు కారణమనునది లేనివాడు, ఎవఁడో అతఁడు నారాయణుఁడు, అతఁడే పరతత్త్వమని యెఱుంగుము. మఱియు స్వప్న జాగర సుషుప్తులందు వర్తించుచున్నదై, ఏది సమాధ్యాదికమునందును వర్తించుచున్నదో అదియే పరతత్త్వమని యెఱుంగుము. దేహేంద్రియ, ప్రాణ, మనస్సులు దేనిచే సంచాలితములై స్వవిషయములందు ప్రవర్తించుచున్నవో, అదియే పరమాత్మ పరతత్త్వమని యెఱుంగుము. ఈ ప్రకారము లక్షణ భేదములచే నారాయణాభిధానము చెప్పబడుచున్నది. కాని పరతత్త్వమొక్కటియే కాని అన్యమే లేదని ఎఱుంగుదుము. అవేహి అనుటచే జ్ఞాన విషయమగుటప్రాప్తము కాగా నిషేధించుచున్నారు.

---

*వ. అనిన రాజేంద్రుండు వారల కిట్లనియె. "భాగవతులారా! సకలలోక నాయకుండగు నారాయణుండనఁ బరఁగిన పరమాత్ముని ప్రభావంబు వినవలతు వానతిండనినఁ బిప్పలానుం డిట్లనియె.

శ్లో. నైతన్మనో విశతి వాగపి చక్షురాత్మా
ప్రాణేంద్రియాణి చ యథాఽనల మర్చిషస్స్వాః
శబ్దోఽపి బోధక నిషేధతయాఽఽత్మమూల
మర్థోక్తమాహ యదృతే ననిషేధ సిద్ధిః॥ 40

అ. ఏతత్ = ఈ పరతత్త్వమును; మనః = మనస్సు; నవిశతి = ప్రవేశించలేదు; వాక్ + ఉత = వాక్కును: చక్షుః = చక్షువును; ఆత్మా = బుద్ధియును; ప్రాణ + ఇంద్రియాణి = ప్రాణము, ఇంద్రియములును; నవిశంతి = ప్రవేశించలేవు; యథా = ఏ ప్రకారము; అనలం = అగ్నిని; స్వాః + అర్చిషః = స్వీయ విస్ఫులింగములు ప్రకాశింపఁజేయలేవో, దహింపఁజేయలేవో అట్లు.

శ్రుతి : ప్రాణస్య ప్రాణము త చక్షుషః చక్షుశ్శ్రోత్ర మన్న స్యాన్నం మనసో మనో విదుః) ప్రాణమునకు ప్రాణము, చక్షువునకు చక్షువు, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమునకు అన్నము, మనస్సునకు మనస్సు అని ఎఱుగుదురు.

శ్రుతి : యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ = వాక్కులు మనస్సుతోఁ గూడ నెవని నెఱుంగలేక నివర్తించుచున్నవో.

శ్రుతి : ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చ నేతి (తై. ఉ. ఆనం. అను : 8) బ్రహ్మము యొక్క ఆనంద మెఱింగినవాఁడు దేనివలనను భయము పొందఁడు. ఓయీ ! "తంత్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (ఉపనిషత్సంబంధి యగు పురుషుని ప్రశ్నించుచున్నాను) అను శ్రుతిచే శబ్ద గోచరత్వము (శబ్దముచే తెలియుట) తోచుచున్నది గదా అనిన అందుకు చెప్పుచున్నారు.

అ. శబ్దః + అపి = శబ్దమునైతము; ఆత్మమూలం = తన యందే ప్రమాణమైనదై అర్థాత్ + ఉక్తం = అర్థము వలన చెప్పబడిన ఏప్రకారము అగునో, అట్లు. కాని, సాక్షాత్తుగా గాదు. ఎందువలననగా; బోధకనిషేధతయా = తనయొక్క బోధకము (తన్ను బోధించు విధము) నిషేధ దూరమగుటవలన. శ్రు. యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ. శ్రు. యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మత్వం విద్ధి యన్మనో సమనుతే = ఏది వాక్కుచే చెప్పబడునో దేనిచే వాక్కు వచించునో అదియే బ్రహ్మమని నీవెఱుంగుము. దేనిని మనస్సు తలంచలేదో దేనిచే మనస్సు సంకల్పించునో దానిని బ్రహ్మముగా నీవెఱుంగుము. శ్రు. నచక్షు షా పశ్యతి కశ్చనైనమ్. ఎవఁడును ఈ ఆత్మను చక్షువులతో చూడలేడు. ఓయీ అట్లయిన ఇట్లు చెప్పరాదు. అనఁగా ఇది ఏమని చెప్పఁబడును అర్థోక్తం ఆహ = అర్థముచే చెప్పబడిన దానిని చెప్పుచున్నారు.

శ్రుతి : "అథాత ఆదేశో నేతి నేతి" "అస్థూలమనణు" "యతో వాచో నివర్తంతే, యద్వాచాఽనభ్యుదితమ్". అందువలన ఆదేశము ఇది కాదు. స్థూలము కాదు. సూక్ష్మము కాదు. దేనివలన వాక్కులు వర్తించుచున్నవో, ఏది వాక్కుచే చెప్పబడదో నిషేధమునకు ఏది అవధిభూతమో అది బ్రహ్మము. యత్ = ఏ బ్రహ్మము; ఋతే = నిషేధము వినాసిద్ధి లేదు. సర్వ నిషేధము. అవధితోఁ గూడిన దగుట దలన ఈ పరతత్త్వమును మనస్సు గోచరింపజేయలేదు, వాక్కు సైతము వచింపలేదు. చక్షువు సైతము చూడలేదు. బుద్ధి ఎఱుంగలేదు,

ప్రాణము క్రియాశక్తిచే పొందలేదు. అన్యములైన ఇంద్రియములు తెలుపలేవు. ఏ ప్రకారము అగ్నిని అగ్ని విస్ఫులింగములు ప్రకాశింపఁ జేయలేవో దహించలేవో అట్లే శబ్ద బ్రహ్మమగు వేదము సైతము ఆత్మమూలము, ఆత్మకు ప్రమాణము నగును. అనగా, అర్థోక్తము అర్థమును బట్టి చెప్పినట్లు చెప్పుచున్నది. నిషేధము లేక అన్యధా పరతత్త్వ సిద్ధి కలుగదు.

శ్లో. సత్త్వం రజస్తమ ఇతి త్రివృదేక మాదౌ
సూత్రం మహా నహ మితి ప్రవదంతి జీవమ్
జ్ఞానక్రియార్థ ఫలరూప తయోరుశక్తి
బ్రహ్మైవ భాతి సదస చ్చ తయోఃపరంయత్ ॥ 41

తా. ఓయీ ! ప్రమాణ విషయము కానందున బ్రహ్మము లేదు అని బ్రహ్మాభావము ప్రసక్తమగుచున్నది గదా అనఁగా ఇందుకుఁ జెప్పుచున్నారు

అ. అదౌ = మొదట; ఏకమ్ = ఏది ఏకమైన బ్రహ్మమో; అదియే; సత్త్వం + రజస్ + తమస్ + ఇతి త్రివృత్ = సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడు గుణములతో కూడిన ప్రధానముగా ప్రవదంతి = చెప్పుదురు; సూత్రం = (అప్రధానము వలన క్రియాశక్తిచే) సూత్రమును: మహాన్ జ్ఞానశక్తిచే; మహత్తత్త్వము = ఆ బ్రహ్మముగా వచింతురు; దానివలన అహమ్ + ఇతి = జీవునికి జీవనోపాధియైన అహంకారమును ఆ బ్రహ్మముగా వచింతురు. తతః = పిమ్మట; జ్ఞానక్రియార్థ ఫలరూపతయా = ఆయా దేవతలు, ఇంద్రియములు, అర్థములు, విషయములు అను ఫల ప్రకారమగుటచే; ఉరుశక్తి = గొప్ప శక్తిగల, బ్రహ్మమే; భాతి = ప్రకాశించుచున్నది; యత్ = ఏది; సత్ + అసత్ చ = స్థూలమైన కార్యము సూక్ష్మమైన కారణమును; తయోః = ఆ సదసత్తులకు; వరం = పరమై ఉన్నదో; అదియును బ్రహ్మమే ఉరుశక్తి దొడ్డదైన మాయాలక్షణాశక్తి గలది బ్రహ్మము, పెక్కు విధములుగా సర్వ స్వరూపములతో స్వయముగా భాసమానమగు బ్రహ్మమునకు స్వసిద్ధి యందు ప్రమాణాపేక్ష లేదు.

తా. సృష్ట్యాది యందు సత్త్వరజస్తమస్సులు మూడింటికిని స్థూలమైన కార్యము జగత్తు. సూక్ష్మమైనది కారణము. ఆ సర్వమునై బ్రహ్మమే భాసిల్లుచున్నది. ఏ కారణము వలన సదసత్తులకు రెంటికిని కారణమై తద్ద్వారా కార్యమై అందువలన కార్యకారణముల కంటె భిన్నమునై యున్నదో అందువలన అనేక శక్తులు గలది, దొడ్డదైన మాయా లక్షణా శక్తి గలది బ్రహ్మము. అట్లు ఒక్కటియైన బ్రహ్మము పెక్కు విధములుగా నగుటకు, అనేక శక్తులు గలది కావున నట్లు చెప్పబడినది. సృష్ట్యాదియందు ఏది ఏకమైన బ్రహ్మమో అదియే సత్త్వరజస్తమస్సులు అను త్రివిధ గుణ రూపమైన ప్రధానముగా వచింతురు. ఆ ప్రధానము యొక్క క్రియాశక్తిచే సూత్రాత్మ ప్రాణము జ్ఞానశక్తిచే మహత్తత్త్వము ఈ రెండును మహత్తత్త్వము (బ్రహ్మము) గానే చెప్పవలెను. ఆ మహత్తత్త్వము వలన జీవున కుపాధియైన అహంకారము ఇదియు ప్రధానము గనే చెప్పఁబడును సర్వస్వరూపమై స్వయముగా భాస

మానమగు బ్రహ్మమునకు స్వసిద్ధి యందు అనగా తాను సిద్ధించుటయందు ఇతర ప్రమాణముల ఆపేక్ష లేదు.*

శ్లో. నాత్మా జజాన న మరిష్యతి నైధతేఽసౌ
నక్షీయతే సవన విద్వ్యభి చారిణాం హి।
సర్వత్ర శశ్వ దనపా య్యుపలబ్ధి మాత్రం
ప్రాణో యథేంద్రియ బలేన వికల్పితం సత్ ॥ 42

అ. ఆత్మా=ఆత్మా; న, జజాన=పుట్టలేదు; న, మరిష్యతి=మృతి పొందదు; న, ఏధతే=వృద్ధిపొందదు; న, క్షీయతే=క్షయమును పొందదు; హి= ఏ కారణముచేతనన; వ్యభిచారిణాం=ఆగమాపాయములుగల వాని యొక్క; సవన, విత్=అయాకాలములకు ద్రష్టయై యుండును కావున, (బాలయువాది దేహాద్యవస్థలకు ద్రష్టయై యుండువాడా యా అవస్థలు కలవాడు కాడు. నిరవస్థుడు) సర్వత్ర=సర్వదేశములందును; శశ్వత్ = సర్వకాలములందును; అనపాయి=అపాయము లేకుండ అనువర్తమానమై, ఉపలబ్ధిమాత్రం=జ్ఞానరూపమై సత్=ఆత్మ; (తానొక్కటియే ఉండునదై): ప్రాణః, యథా=ప్రాణశక్తి వలె; ఇంద్రియ బలేన=చక్షుశ్శ్రోత్రాదీంద్రియముల బలముచే; వికల్పితం=వివిధముగా కల్పితమై ఉండును.

తా. ఆత్మ పుట్టలేదు. మరణించదు. వృద్ధిక్షయములను పొందదు. బాలయువాద్యవస్థలను ఆయా కాలములందు చూచునది మాత్రమై, యుండును. అది సర్వదేశములందును, సర్వకాలములందును, అపాయము లేకుండ అనువర్తమానమై, జ్ఞానమాత్ర స్వరూపమై, తానొక్కటియే ఉండునదై, ప్రాణశక్తివలె ఇంద్రియముల బలముచే వివిధముగా కల్పితమై ఒప్పారును. ప్రాణము అను దృష్టాంతము వివరించుచు, ఇంద్రియామల లయమందు నిర్వికారమైన ఆత్మోపలబ్ధిని తెలుపుచున్నారు.

---

*సీ. నరవర ! విను జగన్నాథుని చారిత్ర
మెఱిగింతు నీ మదికింపు మిగుల
లసదుద్భవ స్థితిలయ కారణంబైన
దేహేంద్రియాదులఁ దిరము గాఁగ
గొనువు నెప్పుడు పరంజ్యోతి స్వరూపంబు
జ్వాలల వనలుండు జనని పగిది
నింద్రియంబులు నాత్మనెనయవు శబ్దంబుఁ
బొరయక సుషిరంబుఁ బొందు సత్త్వ

తే. మనఁగ సత్త్వ రజస్తమో మయ గుణంబు
మహదహంకార రూపమై మహిమ వెలయఁ
జేతనత్వంబు గలదేని జీవమందు
రిదియ సదసత్స్వరూపమై యొన్నఁబడును

శ్లో. అండేషు పేశిషు తరు ష్వవినిశ్చితేషు
ప్రాణో హి జీవ ముపధావతి తత్ర తత్ర
సన్నే యదిన్ద్రియ గణేఽహమి చ ప్రసుప్తే
కూటస్థ ఆశయ మృతే తదనుస్మృతి ర్నః 43

అ. అండేషు=అండజములైన పక్షులు లోనగు వానియందు; పేశిషు=జరాయుజములగు; నరమృగాదులందు; తరుషు=ఉద్భిజ్జములైన తరువులందు; అవినిశ్చితేషు=స్వేదజములైన మశకాదులందు; తత్ర తత్ర=ఆయాభూత గణమునందు; ప్రాణః=ప్రాణము; జీవం+ఉపధావతి=జీవుని అనుసరించి పోవుచున్నది; ఈ ప్రకారము దృష్టాంతముచే నిర్వికారత్వమును ప్రదర్శించి దార్ష్టాంతికముచే తెలుపుచున్నారు— ఆ ఆత్మయే సవికారమువలె నెట్లు తోచుచున్నది. అనగా యథా=ఏ ప్రకారము జాగరము నందు ఇంద్రియ గణము; యథా=ఏప్రకారము న స్వప్నము నందు; యథాఅహమి=ఏప్రకారము తత్సంస్కారవంతమైన అహంకారమునందు ఎప్పుడు సుప్తమో తదా=అప్పుడు;తస్మిన్=ప్రసుప్తే=ఆ నిద్రావస్థయందు; ఇంద్రియ గణే, సన్నే=ఇంద్రియము లీనము కాఁగా; అహమి సన్నే=అహంకారము నంలీనము కాఁగా కూటస్థః=నిర్వికారుఁడగు ఆత్మయే రైయి ఉన్నాండు. ఎందువలన— ఆశయం ఋతే=లింగ శరీరోపాధి వినా- వికార హేతువులైన ఉపాధి అభావము వలన అని అర్థము.

వివ ;ఓ యీ అహంకార పర్యంతము సర్వము శూన్యము కాఁగా శూన్యమే శేషించును. అప్పుడు కూటస్థుడు ఎచ్చట నుండును. అనగా చెప్పుచున్నారు.

తత్+అనుస్మృతిః=అప్పుడు విశేష జ్ఞాన శూన్యమైన, సుఖాత్మకమైన సుషుప్తి సాక్షిత్వము నః, భవతి=మనకు కలుగుచున్నది. ఇంతకాలము నేను సుఖముగా నిద్రించితిని. ఏకించిత్తును ఎఱుంగకుంటిని అని. ఇందువలన అనుభూతమైన దాని స్మరణముచే తన సుషుప్తి యందు ఆత్మానుభవము ఉండనే ఉన్నది. విషయ సంబంధము లేనందువలన స్పష్టముగా లేదని భావము ఆ ప్రకారము శ్రుతిః "యద్వైతం న పశ్యతి న హి ద్రష్టు ర్దృష్టేర్విపరి లోపో విద్యతే =ఏ నిద్రావస్థ యందు ద్వైతమును చూడదో అప్పుడును ద్రష్ట యొక్క దృష్టిలోపము లేదు.

తా. జరాయుజయులగు నరమృగాదులందును, అండజములగు పక్షి సర్పాదులందును, ఉద్భిజ్జములగు తరులతాదులందు, స్వేదజలములగు మశకమత్కుణాదులందును, ప్రాణము ఏ ప్రకారము జీవుని అనుర్తించుచున్నదో, ఆ క్రారము జాగరమునందు ఇంద్రియగణము స్వప్నమునందు తత్సంస్కారవంతమై అహంకారము ఏ ప్రకారము లీనమగునో ఆ ప్రకారము ప్రసుప్తమో. అప్పుడు ఆ ప్రసుప్తమందు, ఇంద్రియ గణము లీనమైనను, అహంకారము లీనమైనను, ఆసుషుప్తి యందు లింగశరీరోపాధి లేకున్నను కూటస్థుఁడైన ఆత్మ తప్పక ఉండును. అందుకు కారణమేమనగా విశేషజ్ఞానశూన్యుడై, సుఖస్వరూపుఁడై సాక్షాత్తుగానున్న ఆత్మను స్మరణము మనకు కలుగుచున్నది. ఇంతకాలము నేను సుఖముగా నిద్రించితిని. ఏమియు నెఱుగకుంటిని అని, "అనుభవములేక స్మరణము కలుగదు" అందువలన సుషుప్తి యందు ఆత్మ సాక్షియై యున్నాఁడు. విషయ సబంధా భావమువలన స్పష్టము కాదని భావము.

శ్లో. యర్హ్యబ్జనాభచరణైషణయోరుభక్త్యా
చేతోమలాని విధమేద్గుణకర్మజాని,
తస్మిన్విశుద్ధ ఉపలభ్యత ఆత్మతత్త్వం
సాక్షాద్యథాఽమలదృశః సవితృప్రకాశః 44

ఓయీ—సుషుప్తి యందు కూటస్థాత్మానుభవము కలిగిన యెడల మరల సంస్కారము కలుగును. అవిద్యా, తత్సంస్కారము లున్నందు వలన అన్నచో... అట్లయిన ఆ సంసార నివర్తకమైన అనుభవము ఎప్పుడు కలుగును. అనగా,

అ. యర్హి = ఎప్పుడు; పురుషుడు; అబ్జనాభ, చరణ + ఈషణయా = పద్మనాభుని పాదాసక్తమైన; ఉరుభక్త్యా = గొప్ప భక్తిచే: గుణకర్మజాని = త్రిగుణము వలనను తద్ద్వారా చేసిన పుణ్యపాప కర్మల వలనను జనించిన; చేతస్ + మలాని = మనో మాలిన్యములను; విధమేత్ = నాశనము చేయుచున్నాడో (అప్పుడు); తస్మిన్ = ఆ చిత్తము; విశుద్ధే సతి = పరిశుద్ధమైనది కాగా అమల, దృశః = తిమిరాదిరోగములు లేక నిర్మలములై యుండు నేత్రములకు; సవితృప్రకాశః యథా = పూర్వసిద్ధమైన సూర్యుని ప్రకాశము వలె, సాక్షాత్ = అవ్యవధానముగా (అడ్డు లేక ప్రత్యక్షముగా); ఆత్మతత్త్వం = ఆత్మ స్వరూపము; ఉపలభ్యతే = పొందబడుచున్నది;

తా. పద్మనాభుని పాదారవిందము లందాసక్తమైన భక్తిచే గుణకర్మల వలన జనించిన చిత్తమలములను నాశనము చేయుట వలన, ఎప్పుడు చిత్తము శుద్ధమగుచున్నదో. అప్పుడే ప్రత్యక్షముగ ఆత్మ స్వరూపము పొందుచున్నాడు. అనగా ఎఱుంగుచున్నాడు. ఎట్లనగా నేత్రములు తిమిరాది రోగములు లేక నిర్మలములై యుండ పూర్వసిద్ధమైన సూర్యప్రకాశమెట్లు తోచునో అట్లు.

రాజోవాచ = రాజు వచించెను *

శ్లో. కర్మయోగం వదత నః పురుషో యేన సంస్కృతః,
విధూయేహాశు కర్మాణి నైష్కర్మ్యం విందతే పరమ్ 45

ఏవం ప్రశ్న మృషీ న్పూర్వ మపృచ్ఛం పితురంతికే,
నాబ్రువ న్బ్రహ్మణః పుత్రా స్తత్ర కారణ ముచ్యతామ్ 46

భక్తి, కర్మ యోగాధీన మగుట వలన ఆ కర్మను ప్రశ్నించుచున్నాడు.

---

*వ. దీనికిం బైకొనదగు పరమాత్మగా నెఱింగి కమల సంభవాదులు నుతియింతు; రిట్టి పరమాత్మ. స్థావర జంగమంబుల నధిష్ఠించి వృద్ధి క్షయంబులం బొందక నిమిత్త మాత్రంబునం దరులతాదులందు జీవంబు లేక తదంతరస్థుండై వర్తించు; నంత సర్వేంద్రియావృతంబైన యాకారంబు నష్టంబైన మనంబునుం గాని శ్రుత విరహితుండై తిరుగుచుండు; నిర్మల జ్ఞానదృష్టి గలవానికి భాను ప్రభాజాలంబు తోచిన క్రియను సుజ్ఞానవంతుండు హరిభక్తి చేత గుణకర్మార్థంబులైన చిత్తదోషంబులు భంజించి భగవత్పదవంబు చేరువనిన విని రాజిట్లనియె.

అ. నః = మాకు; కర్మయోగం = కర్మయోగమును; వదత = వచింపుడు; యేన = ఏ కర్మయోగముచే; పురుషః = పురుషుడు, సంస్కృతః = సంస్కారమును పొందినవాడై; ఇహ = ఇచ్చట; కర్మాణి = కర్మలను, ఆశు = శీఘ్రముగా; విధూయ = వదలించుకొని; పరం = పరమ పదమైన; నైష్కర్మ్యం = మోక్షమును; విందతే = పొందుచున్నాడో; ఏవం = ఈ విధముగా; ప్రశ్నమ్ = ప్రశ్నను; పూర్వం = పూర్వము; పితుః = మా తండ్రియైన ఇక్ష్వాకుని; అంతికే = సమీపమునందు; అపృచ్ఛం = ప్రశ్నించితిని; బ్రహ్మణః + పుత్రాః = బ్రహ్మ మానసపుత్రులైన, సనకాదులు; న + అబ్రువన్ = ఉత్తరము చెప్పరైరి; తత్ర, కారణమ్ + ఉచ్యతామ్ = అందుకు కారణముగూడ చెప్పగోరుచున్నాను.

తా. పురుషుఁడు దేనిచే సంస్కరింప బడుచున్నాడో అ కర్మయోగమును మాకుఁ జెప్పుడు. మఱి ఇచ్చట కర్మలను శీఘ్రముగా నశింపఁ జేసి, కర్మ సంబంధము లేని పరమును మోక్షమును ఎట్లు పొందునో అని ఈ ప్రకారము ప్రశ్నమును మా తండ్రి సమీపమున నుండి ప్రశ్నించితిని. కాని బ్రహ్మమానస పుత్రులగు సనకాదులు ఈ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పరైరి. అందుకు కారణమును వచింపఁగోరుచున్నాను.

ఆవిర్హోత్ర ఉవాచ = ఆవిర్హోత్రుడు వచించెను. *

శ్లో. కర్మాకర్మ వికర్మేతి వేదవాదో న లౌకికః
వేదస్య చేశ్వరాత్మత్వా త్తత్ర ముహ్యంతి సూరయః. **47**

గహనత్వద్యోతనము కొఱకు (తెలియుటకు మిగుల కష్టమైన దనుటకు) మొదట ద్వితీయ ప్రశ్నమునకు ఉత్తరము చెప్పుచున్నారు.

అ. కర్మ = వేదరహితమైన కర్మ; అకర్మ = తద్విపరీతము, నిషిద్ధము; వికర్మ = విహితాచరణమును; ఇతి = అని, (ఈ మూడును); వేదవాదః = వేదైకగమ్యములు); నలౌకికః = లౌకికశాస్త్రములు వేద్యములు కావనుట; వేదస్య = వేదము యొక్క; ఈశ్వరాత్మత్వాత్ = ఈశ్వరుని వలన ఉద్భవించిన దగుట వలన (అపౌరుషేయమగు వేదమునందు వాక్యము యొక్క పూర్వాపరములచే అర్థనిర్ణయము, తాత్పర్యము, నిశ్చయింప వలసి యుండుటచే ననుట) తత్ర = ఆ కర్మాదికమందు, సూరయః; ముహ్యంతి = విద్వాంసులు మోహమును పొందుదురు.

తా. అన్యుల సంగతి ఏమని చెప్పుదును. నీవు బాలుడవగుట వలన వారు నీ కుత్తరము చెప్పలేదు. వేదహితమైనది కర్మ. వేదనిషిద్ధమైనది. అకర్మ. వేదవిహిత కర్మ చేయకపోవుట, వికర్మ. ఈ మూడు కర్మలును వెదైకగమ్యములు, లౌకికములుకాదు. వేదము ఈశ్వరుని వలన

---

*కం. పురుషుండేయే కర్మము
పరువడి గావించి పుణ్యపరుఁడై మనుఁదా
దురితములఁ దొరఁగి మురరిపు
చరణ యుగంబెట్లు సేరు సన్మునివర్యా! **59**

వ. అనిన విని యంతావిర్హోత్రుం డిట్లనియె. **60**

ఉద్భవించిన దగుటవలని అపౌరుషేయమగుటచే కేవలము వాక్యము యొక్క పౌర్వాపర్యము చేతనే అర్థనిర్ణయము చేయదగియుండును అదియును దుష్కరము. విద్వాంసులు సైతము అది యెఱుంగుటకు మోహమును పొందుదురు. అప్పుడు నీవు బాలుఁడవగుట వలన నీకు ఆ సనకాదులు కర్మను గూర్చి ఉత్తరము చెప్పరైరి అని భావము.

శ్లో. పరోక్షవాదో వేదోఽయం బాలానా మనుశాసనమ్
కర్మమోక్షాయ కర్మాణి విధత్తే హ్యగదం యథా. **48**

వివరణము :— వేద తాత్పర్యము దుర్జ్ఞేయమనుచున్నారు. ఎచ్చట ఏ అర్థము అన్యవిధముగా నున్నదో, అన్యవిధముగా చేసి చెప్పబడుచున్నదో, అది పరోక్షవాదము. అట్లే.

శ్రుతి : తంవా ఏతం చతుర్హోతగ్ం సంతమ్ చతుర్హోతేత్యాచక్షతే పరోక్షేణ పరోక్ష ప్రియా హిదేవాః" ఇతి. చతుర్హోతగా నున్న వానిని చతుర్హోతగా చెప్పుచున్నారు. పరోక్షముగా దేవతలు చెప్పుదురు. పరోక్ష ప్రియులుగదా దేవతలు! పరోక్షవాదత్వమునే చెప్పుచున్నారు.

అ. అయంవేదః=ఈ వేదము; పరోక్షవాదః=ఏదేనొక విషయమును పరోక్షముగా చెప్పునది; అందువలన. కర్మమోక్షాయ ఏవ=కర్మ విమోచనము కొఱకే; కర్మాణి విధత్తే= కర్మలను చేయుఁడని విధించుచున్నది. కర్మలు స్వర్గాదుల కొఱకు గదా, కర్మ మోక్షము కొఱకు కాదు గదా అనగా చెప్పుచున్నారు. బాలానాం అను శాసనం=బాలుర యొక్క అనుశాసనము, అనుశాసనము, అనగా శాసించుటకు నియమించుట కనుట. ఇందు దృష్టాంతము. అగదం=ఔషధము; యథా=ఏ ప్రకారము గానో.

తా. తండ్రి బాలునికి ఔషధము త్రాగించ దలచి ఖండ లడ్డు కాదులచే ప్రలోభపెట్టి పానము చేయించుచు వానిని ఇచ్చుచున్నాడు. ఇంతమాత్రము ఔషధదానముచే వానికి లాభము లేదని కాదు. ప్రయోజనము ఆరోగ్యము. ఆ ప్రకారము వేదమును అవాంతర ఫలముచే ప్రలోభ పెట్టుచు కర్మమోక్షము కొఱకు కర్మలను విధించుచున్నది.

శ్లో. నాచరేద్యస్తు వేదోక్తం స్వయమజ్ఞోఽజితేంద్రియః
వికర్మణా హ్యధర్మేణ మృత్యోర్మృత్యు ముపైతి సః. **49**

అ. అజితేంద్రియః=ఇంద్రియములను జయించని వాడై; అజ్ఞః=అజ్ఞుఁడు; వేదోక్తం =వేదముచే చెప్పబడిన కర్మను; న+ఆచరేత్+యది=ఆచరింపనివాడైనచో; అధర్మేణ= అధర్మమైన, వికర్మణా=కర్మను ఆచరించని లక్షణము గల వికర్మచే; మృత్యోః=మృత్యువు నుండి; మృత్యుమ్=మృత్యువును; ఉపైతి=పొందుచున్నాడు.

తా. తమ కర్మలచే పీడింపఁ బడుచున్నవారై (అర్ద్యమానః, స్వకర్మభిః) కర్మ మోక్షమే పురుషార్థమైనచో అప్పుడు ప్రథమముననే కర్మను త్యజింపవచ్చును గదా, అనిన, ఇంద్రియములు జయింపనివాడై అజ్ఞుడు స్వయముగా వేదోక్తమైన దానిని చేయడేని కర్మనాచరించని లక్షణములు గలదైన అధర్మమైన వికర్మచే జనన మరణ రూపమైన సంసారమందు మరణించి తిరిగి సంసారమునే పొందును.

శ్లో. వేదోక్త మేవ కుర్వాణో నిస్సంగోఽర్పిత మీశ్వరే,
నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః. **50**

అ. నిస్సంగః=ఫలాసక్తి లేనివాడై; ఈశ్వరే, అర్పితం=ఈశ్వరునందు అర్పింపబడిన దైన; వేదోక్తం + కుర్వాణః + ఏవ = వేదోక్తకర్మము చేయుచునే; నైష్కర్మ్యం=నిష్కర్మ రూపమైన, సిద్ధిం=మోక్షసిద్ధిని; లభతే=పొందుచున్నాడు; ఫలశ్రుతిః = ఫలశ్రవణము; రోచన + అర్థా = అభిరుచిని పుట్టించుటయే ప్రయోజనముగా గలది.

తా. నిస్సంగుడై ఫలమును ఈశ్వరార్పణము చేసి వేదోక్తమైన కర్మనే చేయుచు నైష్కర్మ్యసిద్ధిని అనగా మోక్షమును పొందుచున్నాడు. ఈ కర్మమువలన ఫలము కలుగు ననుట కేవలము మనస్సంతోషము కొఱకు మాత్రమే చెప్పబడినది. అందువలన వేదోక్తమునే ఆచరించుచు దానియందు ఆసక్తి కలవాడైనచో తత్ఫలము పొందును. నైష్కర్మ్యరూప మగు సిద్ధి కలుగదు. అనగా నిస్సంగుడు ఫలమునందు అభిలాషలేక ఈశ్వరునందు అర్పింప బడినదైన ఫలము నుద్దేశించి కర్మ చేయడు. ఓయీ! ఫలము వచించుట చెప్పబడినది కనుక కర్మ చేయుటచే ఫలము కలుగనే కలుగును. కర్మయం దభిరుచిచే వేదార్థమును చక్కగా విచారించుచున్నాడు.

"యో వా ఏత దక్షర మవిదిత్వా గార్గ్యస్మా ల్లోకా త్ప్రైతి స కృపణః"

ఓ గార్గీ! ఎవడు ఈ అక్షర బ్రహ్మమును తెలిసికొనక ఈ లోకమునుండి చనిపోవు చున్నాడో వాఁడు కృపణుఁడు అని అనాత్మజ్ఞునికి కృపణత్వమును చెప్పుచున్నది శ్రుతి.

శ్రుతి. తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి బ్రహ్మచర్యేణ తపసా శ్రద్ధయా యజ్ఞే నానశకేన ... బ్రాహ్మణులు వేదాధ్యయనముచే, బ్రహ్మచర్యముచే, తపస్సుచే, శ్రద్ధచే, యజ్ఞముచే, ఉపవాసముచే ఆ బ్రహ్మమును ఎఱుంగుచున్నారు. తెలిసికొనఁగోరు చున్నారు. అని యజ్ఞాదుల జ్ఞానశేషములుగా లెక్కించి నిష్కామములైన కర్మలందు ప్రవ ర్తించుచున్నారు. అందువలన. శ్రుతి. స్వర్గకామో యజేత-స్వర్గకాముఁడు యజించవలెను. ఇత్యాది శ్రుతులచే కోరినవానికే స్వర్గాదికము ఫలముగా తెలియుటవలన ఇతఁడు అకాముఁ డయినచో నైష్కర్మ్యమే కలుగును.

అవ. వైదికమైన కర్మయోగమును చెప్పి తంత్రశాస్త్రము ప్రకారము ధ్యానము తెల్పుచున్నాడు.

శ్లో. య ఆశు హృదయగ్రంథిం నిర్జిహీర్షు రథాత్మనః,
విధినోపచరే ద్దేవం తంత్రోక్తేన చ కేశవమ్. **51**

అ. యః=ఎవడు; పరాత్మనః=పరుడుగా నున్న జీవుని యొక్క; హృదయగ్రంథిం= అహంకార బంధమును; నిర్జిహీర్షః = త్యజింప గోరుచున్నాడో; వాడు; తంత్రోక్తేన విధినా= ఆగమశాస్త్ర విధానముచే, దేవం, కేశవం, ఉపచరేత్ =దేవుఁడైన కేశవుని ఉపచరించవలెను, పూజించవలెను.

తా. ఎవఁడు పరుఁడైన జీవుని అహంకారబంధము వదలింపగోరుచున్నాడో వాఁడు ఆగమశాస్త్ర విధానమున వైదిక కర్మతోఁగూడ దేవుడైన విష్ణువును పూజించవలెను.

శ్లో. లబ్ధానుగ్రహ ఆచార్యా త్తేన సందర్శితాగమః,
మహాపురుష మభ్యర్చే న్మూర్త్యాఽభిమతయాఽఽత్మనః. **52**

అ. ఆచార్యాత్=గురువు వలన; లబ్ధ+అనుగ్రహః=పొందబడిన అనుగ్రహము గల వాడై; తేన=ఆ ఆచార్యునిచే; సందర్శిత+ఆగమః=తెలుపఁబడిన ఆగమోక్తమైన అర్చనా ప్రకారము గలవాడై; మూర్త్యా=మూర్తిచే; ఆత్మనః అభిమతం=తనకు ఇష్టమైన; మహాపురుషం+అభ్యర్చేత్=మహావిష్ణువును పూజింపవలెను.

తా. ఆచార్యుని అనుగ్రహమును పొందినవాడై ఆచార్యుడు తెలిపిన ఆగమోక్తమైన అర్చనాప్రకారముతో తన కిష్టమైన విష్ణుప్రతిమను ప్రతిష్ఠించి ఆ మహావిష్ణువును పూజించవలెను.

శ్లో. శుచి స్సమ్ముఖ మాసీనః ప్రాణసంయమనాదిభిః,
పిండం విశోధ్య షణ్న్యాసైః కృతరక్షోఽర్చయే ద్ధరిమ్. **53**

అ. శుచిః = స్నానాదికముచే శుచియై; సమ్ముఖ మాసీనః = మూర్తికి ఎదురుగా కూర్చుండి; ప్రాణసంయమనాదిభిః=ప్రాణాయామభూతశుద్ధ్యాదులచే; పిండం విశోధ్య=దేహమును శోధించి; షట్+న్యాస కృతరక్షః=ఆఱు విధములైన అంగన్యాసకరన్యాసములచే చేయబడిన ఆత్మరక్షణము గలవాడై; హరిం, అర్చయేత్=శ్రీహరిని పూజించవలెను.

తా. స్నానాదుల నాచరించి, పరిశుద్ధుడై, భగవత్ప్రతిమ కెదురుగా కూర్చుండి, ప్రాణాయామము, భూతశుద్ధి మున్నగువానిచే దేహమును శుద్ధి చేసికొని, ఆఱువిధములగు అంగన్యాసాదులచే నాత్మరక్ష చేసికొని విష్ణువును పూజింపవలెను.

శ్లో. అర్చాదౌ హృదయే వాఽపి యథాలబ్ధోపచారకైః,
ద్రవ్యక్షిత్యాత్మలింగాని నిష్పాద్య ప్రోక్ష్య చాసనమ్. **54**

అ. అర్చాదౌ=ప్రతిమ మున్నగువానియందు గాని; హృదయే వాఽపి = హృదయమందుగాని, (విష్ణువును); యథాలబ్ధోపచారకైః=(ఆ యా సమయములలో లభించు) ఉపచార సాధనములచే (పూజించవలెను. అందు మొదట) ద్రవ్య, క్షితి+ఆత్మ లింగాని, నిష్పాద్య= పుష్పాది ద్రవ్యములను కీటకాదులు లేకుండునట్లు శోధించి, సమ్మార్జనము (చిమ్ముట)చే భూమిని పరిశుద్ధము చేసి, స్నానముచే తన్ను శుద్ధునిగా చేసికొని, పూజా ప్రతిమను అనులేపన క్షాళనములచే పరిశుద్ధము గావించి, తగిన వానినిగా చేసి: ఆసనం ప్రోక్ష్య=పీఠమును ప్రోక్షించి.

తా. అర్చించు ప్రతిమ యందు గాని, హృదయమందు గాని విష్ణువును ఆ యా దేశ కాలములలో లభించు ఉపచార సాధనములచే పూజించవలెను. ముందుగా సాధకుడు పుష్పాది ద్రవ్యములను పురుగులు లేకుండునట్లు శోధించి, పూజా స్థలమును చిమ్మి పరిశుద్ధము చేసి,

తన్ను అవ్యగ్రునిగా, శుద్ధునిగా, నిశ్చలునిగా చేసికొని, పూజామూర్తిని అనులేపన, క్షాళనాదులచే శుద్ధము చేసి, పీఠమును ప్రోక్షించినవాడై (ముందరి శ్లోకముతో నన్వయము.)

శ్లో. పాద్యాదీ నుపకల్ప్యాథ సన్నిధాప్య సమాహితః,
హృదయాదికృతన్యాసో మూలమంత్రేణ చార్చయేత్. 55

అ. అథ=పిమ్మట; సమాహితః=అవ్యగ్రమగు మనసుగలవాడై; పాద్యాదిని+ఉపకల్ప్య=పాద్యము లోనగు పాత్రములు కల్పించి; సన్నిధాప్య=హృదయమందు పూజింపబడిన భగవంతుని ప్రతిమయందు నిలపి; హృద్+ఆదిభిః=హృదయము, శిరస్సు, శిఖ, కవచము, నేత్రము, అస్త్రము అను మంత్రములచే; కృతన్యాసః=అంగన్యాసము కావించి; మూలమంత్రేణ=మూలమంత్రముతో; అర్చయేత్=పూజింపవలెను.

తా. పాద్యాది పాత్రములను కల్పించి హృదయమందు పూజింపబడిన భగవంతుని శ్రీమూర్తి యందు (ప్రతిమయందు) ధ్యానించి, హృదయము, కవచము, శిఖ, నేత్రము, అస్త్రము అను మంత్రములచేతను, మూలమంత్రము చేతను దేవునందు అంగన్యాసము చేసి, మూలమంత్రముతో దేవుని పూజించవలెను.

శ్లో. సాంగోపాంగాం సపార్షదాం శాంతాం మూర్తిం స్వమంత్రతః,
పాద్యార్ఘ్యాచమనీయాద్యైః స్నానవాసోవిభూషణైః. 56

అ. సాంగోపాంగాం=హృదయాదులగు అంగములతోడను; సుదర్శనాదులగు ఉపాంగములతోడను కూడినదై; సపార్షదాం=పరివార దేవతలగు నందాదులతో గూడిన; శాంతాం, మూర్తిం=శాంతమగు విష్ణుప్రతిమను; పాద్యార్ఘ్య+ఆచమనీయ+ఆద్యైః = పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము లోనగు వానిచేతను, ఆది శబ్దముచే మధుపర్కము, ఆచమనము మున్నగునవి సూచితములు; స్నానవాసోవిభూషణైః=స్నానము, వస్త్రము, ఆభరణములు, లోనగువానిచేతను; స్వమంత్రతః = ఆ మూర్తియొక్క మూలమంత్రముతో; సంపూజ్య=పూజించి; ...

తా. హృదయాదులగు నంగములతోడను, సుదర్శనాదులగు ఉపాంగముల తోడను కూడినదియు, పరివారదేవతలగు నందాదులతో గూడినదియు అగు శాంతమైన విష్ణుమూర్తి ప్రతిమను పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, ఆభరణము, మధుపర్కము, ఆచమనము లోనగు వానిచేతను, విష్ణువుయొక్క మూలమంత్రము చేతను పూజించి. (ముందు శ్లోకముతో నన్వయము.)

శ్లో. గంధమాల్యాక్షతస్రగ్భి ర్ధూపదీపోపహారకైః,
సాంగం సంపూజ్య విధివ త్స్తవైః స్తుత్వా నమే ద్ధరిమ్. 57

అ. గంధమాల్యాక్షతస్రగ్భిః=గంధము, పుష్పము, అక్షతలు, పూలదండలు లోనగువానిచేతను; ధూపదీపోపహారకైః=ధూపము, దీపము, నైవేద్యము లోనగువానిచేతను (అక్షతలచే తిలకాలంకరణము మాత్రమే శ్లో. నాక్షతై రర్చయే ద్విష్ణుం న కేతక్యా సదాశివం — అక్షతలచే విష్ణువును పూజించకూడదు కేతకి అనగా మొగలి పూవులచే శివుని పూజించకూడదు. అని నిషేధము) సాంగం = సాంగోపాంగముగా; విధివత్=శాస్త్రవిధానమున; సంపూజ్య=పూజించి; స్తవైః=స్తోత్రములచే; స్తుత్వా=స్తుతించి, హరిం=విష్ణువును; నమేత్=నమస్కరించవలెను.

తా. గంధము, పుష్పములు, అక్షతలు, పూలదండలు అను వానిచేతను, ధూప దీప నైవేద్యముల చేతను సాంగముగా విధివంతముగ పూజించి, స్తోత్రములచే స్తుతించి విష్ణువునకు నమస్కరించవలెను. అక్షతలచే తిలకము అలంకరించవలెను. అక్షతల చేత పూజించకూడదు.

శ్లో. ఆత్మానం తన్మయం ధ్యాయ న్మూర్తిం సంపూజయే ద్ధరేః,
శేష మాదాయ శిరసి స్వధా మ్న్యుద్వాస్య సత్కృతమ్. 58

అ. ఆత్మానం=తన్ను; తన్మయం, ధ్యాయన్=ఆ విష్ణుస్వరూపునిగా ధ్యానించుచు; హరేః, మూర్తిం=విష్ణుమూర్తిని; సంపూజయేత్=చక్కగా పూజించవలెను; శేషం=నిర్మాల్యమును; శిరసి ఆదాయ=శిరస్సునం దుంచుకొని; సత్కృతమ్ = పూజించబడిన దేవుని; హృదయమందలి మూర్తిని; స్వధామ్ని=స్వస్థానమగు కరండకమందు; ఉద్వాస్య=స్థాపించి; (పూజావిధిని సమాప్తి చేయవలెను.)

తా. తన్ను విష్ణుస్వరూపునిగా ధ్యానించుచు శ్రీ విష్ణుమూర్తిని చక్కగా పూజించవలెను. నిర్మాల్యమును శిరస్సునం దుంచుకొని పూజింపఁబడిన దేవుని, హృదయమునందు నిల్పిన దేవుని, స్వస్థానమగు కరండకమందుఁ బరిణయందు ఉద్వాసన చేసి, పూజావిధిని సమాప్తి చేయవలెను.

శ్లో. ఏవ మగ్న్యర్క తోయాదా వతిథౌ హృదయే చ యః,
యజే దీశ్వర మాత్మాన మచిరా న్ముచ్యతే హి సః. 59

అ. ఏవం=ఈ ప్రకారము; అగ్ని+అర్క తోయ+ఆదౌ=అగ్ని. సూర్యుడు. జలము లోనగువానియందు; అతిథౌ=అతిథియందు; హృదయే=హృదయమునందు; యః=ఎవఁడు; ఆత్మానం+ఈశ్వరం=పరమాత్మయైన ఈశ్వరుని. యజేత్=యజించుచున్నాడో; సః=వాడు అచిరాత్=త్వరలో; ముచ్యతే హి=సంసారబంధ విముక్తిని పొందుచున్నాడు.

తా. ఎవడు ఈ ప్రకారము అగ్ని, సూర్యుడు, జలము లోనగువాని యందును, అతిథి యందును, హృదయమునందును, పరమాత్మయైన ఈశ్వరుని పూజించుచున్నాఁడో వాడు శీఘ్రముగా సంసారబంధ విముక్తిని గాంచును. *

ఇది శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమునందు
తృతీయాధ్యాయము
సమాప్తము.

*వ. కర్మాకర్మ వికర్మ ప్రతిపాదకంబులగు శ్రుతివాదంబులు, లౌకిక వర్జితంబు; లట్టి యామ్నాయంబులు సర్వేశ్వర స్వరూపంబులు గాన విద్వాంసులు నెఱుంగలే రని కర్మాచారంబు లనంబడు, మోక్షంబుకొఱకు నారాయణ భజనంబు పరమపావనంబు: వేదోక్తంబుల నాచరింపక ఫలంబులకు వాంఛసేయువార లనేక జన్మాంతరంబులం బడయుదురు; మోక్షంబు నపేక్షించువాఁడు విధిచోదిత మార్గంబున హరిం బూజింపవలయు; నట్టి పూజా ప్రకారం బెట్లనినఁ బవిత్ర గాత్రుండయి జనార్దను సన్నిధిం బూతచిత్తుండై షోడశోపచారంబులఁ జక్రధరు నారాధించి, గంధ పుష్ప దీప ధూప నైవేద్యంబుల సమర్పించి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, భక్తిభావనా విశేషం బగు నతండు హరిం జేరును.

# చతుర్థాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. చతుర్థే త్వవతారే హ ప్రశ్నస్యోత్తర ముక్తవాన్,
జయంతినందనో నామ్నా ద్రమీళో నవసప్తమః.

ఈ చతుర్థాధ్యాయమందు అవతారముల నెఱుంగు ప్రశ్నకు జయంతిపుత్రులు తొమ్మండుగురిలో నేడవవాడు ద్రమీళుఁ డను పేరుగలవాడు ఉత్తరమును చెప్పెను.

అవ. "మూర్త్యాఽభిమతయాఽఽత్మనః" (తనకు ప్రియమైన అవతారమును పూజించవలెను) అని చెప్పుటవలన అవతారముల నెఱుంగు కాంక్ష అపేక్షిత మగుచున్నది. "స్తవైః స్తుత్వాన మేద్ధరిమ్" (స్తోత్రములచే స్తుతించి వారికి నమస్కరించవలెను) అని చెప్పుటవలన గుణకర్మల జ్ఞానము అపేక్షితమైనది కావున ప్రశ్నించుచున్నాడు.

రాజోవాచ = రాజు వచించెను.

శ్లో. యాని యానీహ కర్మాణి యైర్యైః స్వచ్ఛందకర్మభిః,
చక్రే కరోతి కర్తా చ హరి స్తాని బ్రువంతు నః. **1**

అ. హరిః = విష్ణువు; యాని యాని కర్మాణి = ఏ యే కర్మలను; ఇహ = ఇచ్చట; యైః యైః = ఏ యే; స్వచ్ఛందజన్మభిః = ఇచ్ఛవచ్చిన జన్మములచే. అవతారములచే, చక్రే = చేసెనో; కరోతి = చేయుచున్నాడో; కర్తా = చేయగలడో; తాని = వానిని; నః = మాకు; బ్రువంతు = చెప్పుఁడు.

తా. అయ్యలారా! శ్రీహరి ఈ జగత్తునందు ఇచ్ఛవచ్చిన ఏ యే అవతారములచే ఏ యే కర్మలను చేసెనో, చేయుచున్నాఁడో, చేయగలఁడో— వానిని మాకు చెప్పుడు.

ద్రమీళ ఉవాచ = ద్రమీళుఁడు చెప్పెను:

అవ. నీచే ప్రశ్నింపబడినవైన కాలత్రయసంబంధులైన సకలావతారములు గుణకర్మలు వచించుట అశక్యము. సంక్షేపముగా మాత్రము కొన్నింటిని చెప్పగలను.

శ్లో. యో వా అనంతస్య గుణా ననంతా
ననుక్రమిష్యే త్స తు బాలబుద్ధిః,
రజాంసి భూమే ర్గణయే త్కథంచి
త్కాలేన నైవాఖిలశక్తిధామ్నః. **2**

అ. యః, వా = ఎవడైతే: అనంతస్య = అనంతుఁడైన హరి యొక్క; అనంతాన్ = అంతులేని; గుణాన్ = గుణములను; అనుక్రమిష్యేత్ = గణించగోరునో; సః, తు, బాలబుద్ధిః =

వాడు బాలుర బుద్ధి కలవాఁడు, మందమతి; కాలేన = చాలాకాలముచేత, (మహాబుద్ధిశాలి యొకడు భూమేః, రజాంసి = భూమి రేణువులను; కథంచిత్ గణయేత్ = ఎట్లైనను గణింప వచ్చును; కాని అఖిలశక్తిధామ్నః = సర్వశక్తియుతుడైన భగవంతుని యొక్క గుణములను; న ఏవ = గణింపలేడు.

తా. ఎవడు అనంతుఁడైన శ్రీహరియొక్క అనంతగుణములను గణింప దొంకొనునో వాఁడు బాలబుద్ధి. ఎవడైనను బుద్ధిమంతుఁడు చాలకాలమునకు భూమి ధూళిలేశముల లెక్కించిన లెక్కింపవచ్చును కాని సర్వశక్త్యాశ్రయుఁడైన హరి యొక్క గుణకర్మలు లెక్కింపఁజాలడు. *

అవ. అందు మొదట విరాట్పురుషావతారమును చెప్పుచున్నారు.

శ్లో. భూతైర్యదా పంచభి రాత్మసృష్టైః
పురం విరాజం విరచయ్య తస్మిన్,
స్వాంశేన విష్టః పురుషాభిధాన
మవాప నారాయణ ఆదిదేవః. 3

అ. ఆదిదేవః, నారాయణః = ఆదిదేవుడగు నారాయణుడు; యదా = ఎప్పుడు; ఆత్మ సృష్టైః = తనచే సృష్టింపబడిన, పంచభిః, భూతైః = పృథివ్యాది పంచభూతములచే; విరాజం పురం = బ్రహ్మాండమను పురమును; విరచయ్య = నిర్మించి; తస్మిన్ = అందు: స్వాంశేన, విష్టః = తన యంశముతో, లీలతో ప్రవేశించెనో అపుడు; (తాను భోక్తగా కాడు. ఏలయన అత్యధిక పుణ్యము గల జీవునకే భోక్తృత్వము కలదు;) పురుషాభిధానం = పురుషుఁడను నామమును; అవాప = పొందెను.

తా. ఆ హరియే తాను సృజించిన పంచభూతములచే బ్రహ్మాండ మను పురమును సృష్టించి, అందు స్వాంశముతో లీలతో ప్రవేశించెను. తాను భోక్త కాడు. అత్యధికపుణ్యుఁడగు జీవుడే భోక్త. అట్లు ప్రవేశించిన నారాయణుఁడు పురుషుఁడను నామము పొందెను. ఈతడే విరాట్పురుషుఁడు

అవ. ఈ పురుషుని గుణకర్మములను రెండు శ్లోకములచే జెప్పుచున్నాఁడు.

శ్లో. యత్కాయ ఏష భువనత్రయసన్నివేశో
యస్యేంద్రియై స్తనుభృతా ముభయేంద్రియాణి,
జ్ఞానం స్వత శ్శ్వసనతో బల మోజ ఈహా
సత్త్వాదిభిః స్థితిలయోద్భవ ఆదికర్తా. 4

---

*వ. ... ... .... ... ... .... అని చెప్పిన విని విదేహుం డిట్లనియె.
ఈశ్వరుం డే యే కర్మంబుల నాచరించె నంతయు నెఱింగింపుము; అనిన ద్రమీళుం డిట్లనియె. 60

కం. తారల నెన్నగ వచ్చును
భూరేణుల లెక్కపెట్టఁ బోలును ధాత్రిన్
నారాయణగుణకథనము
లారయ వర్ణింపలేరు హరబ్రహ్మాదుల్. 61

అ. యత్ + కాయః = ఎవని శరీరము; భువనత్రయ సన్నివేశః = స్వర్గమర్త్య పాతాళ లోకములకు స్థానమో; యస్య, ఇంద్రియైః = ఎవని యింద్రియములచే; తనుభృతాం = దేహధారులగు సమష్టి వ్యష్టి జీవులకు; ఉభయ + ఇంద్రియాణి = రెండు విధములగు ఇంద్రియములు అనగా జ్ఞాన కర్మేంద్రియములు కలుగునో; యస్య స్వతః = ఎవని యొక్క స్వతస్సిద్ధమై స్వరూపభూతమైన సత్త్వము వలన; తనుభృతాం = ఎల్ల జీవులకు; జ్ఞానం = జ్ఞానము కలుగునో, (యస్య = ఎవని యొక్క) శ్వసనతః = ప్రాణమువలన; బలం = దేహశక్తి; ఓజః = ఇంద్రియ శక్తి; ఈహా = క్రియ, కలుగునో; సః = అతడే; సత్త్వాదిభిః = సత్త్వాది గుణములచే; స్థితి, లయ ఉద్భవే = స్థితి లయోద్భవములందు; ఆదికర్తా = మూలకారణుడు, మొదట చేసినవాడు.

తా. ఎవని శరీరము ముల్లోకములకు స్థానమో, ఎవని యింద్రియములచే దేహధారులకు ఉభయవిధములగు జ్ఞానకర్మేంద్రియములు కలుగునో, ఎవని స్వరూపభూతమగు సత్త్వమువలన ఎల్లజీవులకు జ్ఞానమో, ఎవని ప్రాణము జీవులకు బలము, దేహశక్తి, యింద్రియములు, క్రియలు కలిగించుచున్నదో, ఎవని సత్త్వాదిగుణములచే సృష్టిస్థితిలయములు కలుగుచున్నవో ఆతడు ఆదిపురుషుడు.

శ్లో. **ఆదా వభూ చ్ఛతధృతీ రజసాఽస్య సర్గే**
**విష్ణు స్థ్సితౌ క్రతుపతి ర్ద్విజధర్మసేతుః,**
**రుద్రోఽప్యయాయ తమసా పురుష స్స ఆద్య**
**ఇత్యుద్భవస్థితిలయా స్సతతం ప్రజాసు.** **5**

అ. ఆదౌ = మొదట, (యస్య) రజసా = (ఎవని) రజస్సుచే, అస్య సర్గే = ఈ ప్రపంచము యొక్క సృష్టి కార్యమందు; శతధృతిః = బ్రహ్మ; అభూత్ = అయ్యెనో; (యస్య సత్త్వేన = ఎవని సత్త్వముచే): స్థితౌ = విశ్వస్థితి యందు; క్రతుపతిః = యజ్ఞఫలదాతయు; ద్విజ ధర్మసేతుః = ద్విజాతులకును; వారి ధర్మములకును పాలకుడగు; విష్ణుః = విష్ణువు; అభూత్ = అయ్యెనో; (యస్య) తమసా = (ఎవని) తమస్సుచే; అప్యయాయ = లయము కొఱకు; రుద్రః (అభూత్) = రుద్రు డయ్యెనో: ఇతి = అని ఇట్లు (నిమిత్త భూతులగు బ్రహ్మాదులచే); ప్రజాసు = జనుల యందు; సతతం = ఎల్లపుడు; ఉద్భవస్థితిలయాః = సృష్టి స్థితి లయములు; (యతః భవన్తి) = ఎవని వలన కలుగుచున్నవో) సః = అతడు; ఆద్యః పురుషః = ఆదిపురుషుడు.

తా. సృష్ట్యారంభసమయమున ఎవని రజోగుణముచే యజ్ఞఫలదాతయు, ద్విజులను, వారి ధర్మములను కాపాడువాడగు విష్ణువు స్థితికారకు డయ్యెనో, ఎవని తమోగుణముచే రుద్రుడు లయకర్త అయ్యెనో, ఈ విధముగ నా బ్రహ్మాదులు నిమిత్తభూతులుగా ఎల్లపుడు ప్రజలందు సృష్టిస్థితిలయములు గావించు నతడు ఆదిపురుషుడు.*

---

*వ. ఇట్లు గావున నాత్మసృష్టంబైన మనంబునఁ, బంచభూత నికరంబను పురంబొనరించి, యందు నిజాంశంబునం బ్రవేశించి' నగుణనిష్ఠుండై, నారాయణాభిధానంబును గల ఋషీశ్వరుం డగు పరమేశ్వరుండు వెలుఁగొందెను. అతని దశేంద్రియంబుల చేతఁ బాలితంబులైన దేహంబులు ధరియించి, జగద్రక్షకత్వ సంహారకత్వాది గుణంబులు గలుగుటం జేసి, గుణనిష్ఠుండై, రజస్సత్త్వ తమో గుణంబుల బ్రహ్మ విష్ణు రుద్ర మూర్తులవం బరఁగి త్రిగుణాత్మకుం డవంబడు నారాయణాఖ్యుని చరిత్రం బెఱింగించెద, ఆకర్ణింపుము. 62

శ్లో. ధర్మస్య దక్షదుహిత ర్యజనిష్ట మూర్త్యాం
నారాయణో నర ఇతి స్వతపఃప్రశాంతః,
నైష్కర్మ్యలక్షణ మువాచ చచార కర్మ
యోఽద్యాపి చాస్త ఋషివర్య నిషేవితాంఘ్రిః. **6**

అ. (అతడు) ధర్మస్య = ధర్మునకు; దక్షదుహితరి = దక్షుని పుత్రికయైన, మూర్త్యాం = మూర్తిదేవియందు; నారాయణః, నరః, ఇతి = నారాయణుడు, నరుడు అని ఇద్దరుగా; అజనిష్ట = జన్మించెను; స్వతపఃప్రశాంతః = తన తపస్సుచే మిగుల శాంతుడగు అతడు; నైష్కర్మ్య లక్షణం = ఆత్మ స్వరూప నిరూపకమగు; కర్మ = కర్మను గూర్చి; ఉవాచ = (నారదాదులకు) చెప్పెను; చచార = స్వయముగా ఆచరించెను; యః = ఎవడు; అద్య అపి = ఇప్పటికిని; ఋషివర్య నిషేవితాంఘ్రిః = మహర్షులచే సేవింపబడిన పాదములు కలవాడై కర్మల నాచరించుచునే (ఆస్తే = ఉన్నాడో).

ధర్మదేవుని భార్యయై, దక్షుని పుత్రియైన 'మూర్తి' యందు ఏ హరి నారాయణుడు, నరుడు అను ఇద్దరుగా జన్మించెనో, స్వతపస్సుచేఁ బ్రశాంతుడై, నారదాదులకు ఆత్మస్వరూపమును కర్మవిముక్తి రూపమును చెప్పెనో, అతడు నారాయణ నరఋషిరూపమున మహర్షులచే సేవింపబడు పాదములు కలవాడై కర్మల నాచరించుచు ఇపుడు నున్నాడు.

అవ. భగవదవతారద్యోతకమైన పరమశాంతిని దెలుపుటకు ఇతిహాసమును జెప్పుచున్నాడు:

శ్లో. ఇంద్రో విశంక్య మమ ధామ జిఘృక్షతీతి
కామం న్యయుంక్త సగణం సబదర్యుపాఖ్యమ్,
గత్వాఽప్సరోగణ వసంత సుమందవాతైః
స్త్రీప్రేక్షణేషుభి రవిధ్య దతన్మహిజ్ఞః. **7**

అ. ఇంద్రః = ఇంద్రుఁడు, మమ, ధామ = నా స్థానమును; జిఘృక్షతి ఇతి = (తపస్సుచే) గ్రహింపగోరుచున్నాడు అని: విశంక్య = శంకించి: కామం = మన్మథుని: సగణం = గణముతో బదరీ + ఉపాఖ్యం = బదరీ వృక్షములచేఁ బ్రసిద్ధమైన బదరికాశ్రమమునకు; న్యయుంక్త = నియోగించెను; సః = ఆ కాముఁడు; అప్సరోగణ వసంత సుమందవాతైః = అప్సరలగణము, వసంతుఁడు, మందమారుతము అను వారలతో; గత్వా = పోయి; అతన్మహిజ్ఞః = ఆ మహర్షుల మహిమను తెలియనివాడై; స్త్రీ ప్రేక్షణ + ఇషుభిః = స్త్రీల చూపులను బాణములచే; అవిధ్యత్ = వేధించెను (ఆ ఋషిద్వయమును కొట్టెను).

తా. ఈ ఋషిద్వయము తపస్సుచే నా స్థానమును గ్రహింతురేమో అని ఇంద్రుఁడు శంకించి, కాముని, తద్గణమును బదరికాశ్రమమునకు బంపెను. అతఁడు అచ్చరలు, వసంతుఁడు, మలయమారుతము లోనగువారలతోఁ బోయి, యా ఋషిమహిమ నెఱుగనివాడై స్త్రీల చూపులను బాణములను ప్రయోగించి వారిని బాధించెను.

శ్లో. విజ్ఞాయ శక్రకృత మక్రమ మాదిదేవః
ప్రాహ ప్రహస్య గతవిస్మయ ఏజమానాన్
మా భై ర్విభో మదన ! మారుత ! దేవవధ్వో !
గృహ్ణీత నో బలి మశూన్య మిమం కురుధ్వమ్ 8

అ. ఆదిదేవః=ఆదిదేవుడగు నారాయణుడు; శక్రకృతం=ఇంద్రుడు కావించిన; అక్రమం=అక్రమమును, విజ్ఞాయ=ఎఱిఁగి ప్రహస్య=నవ్వి; గతవిస్మయః=గర్వములేనివాడై; విభో! మదన=సమర్థుడవగు ఓ మన్మథుడా! మారుత!=ఓ మారుతమా!; దేవవధ్వః=ఓ అచ్చరలారా!; మా భైః=భయపడకుడు; నః బలిం=మా ఆతిథ్యమును; గృహ్ణీత=గ్రహించుడు, ఇమం=ఈ మా ఆశ్రమమును; అశూన్యం కురుధ్వం=(ఆతిథ్యముచే) శూన్యము కాని దానినిగా చేయుడు, అని; ఏజమానాన్=శాపభీతిచే వణకుచున్న వారిని గూర్చి; ప్రాహ=పలికెను.

తా. ఆదిదేవు డగు నారాయణఋషి, యింద్రుడు చేసిన యక్రమము నెఱింగి, గర్వము లేనివాడై, శాపభీతిచే వడఁకుచున్న వారిని గాంచి, నవ్వి యిట్లు వచించెను. 'ఓ ప్రభూ! మన్మథా! మారుతమా! అచ్చరలారా! మీరు భయపడకుఁడు. ఇదే మా యాతిథ్యమును స్వీకరించి ఈ మా యాశ్రమమును సఫలము చేయుఁడు. మా యాశ్రమ మతిథులు లేనిచో శూన్యప్రాయ మగును. *

---

*కం. ధర్మునందు దక్షపుత్రిక
నిర్మలమతిఁ బెండ్లి యాడి నెఱిఁ బుత్రుని స
త్కర్ముని నారాయణ ఋషి
నర్మిలిఁ గనె నతఁడు బదరికాశ్రమ మందున్. 93

తే. అట్టి నారాయణాహ్వయుండైన మౌని
బదరికాశ్రమమందు నపారనిష్ఠఁ
దపముఁ గావింప బలభేది దలఁకి మదిని
మీనకేతను దివిజకామినులఁ బనిచె. 94

వ. వారు నారాయణాశ్రమంబునకు నతని తపోవిఘ్నంబు సేయ వచ్చునప్పు డవ్వనంబు సాల రసాల బిల్వ కదళీ ఖర్జూర జంబు జంబీర చందన పున్నాగ మందారాది వివిధ వృక్ష నిబిడంబును, పుష్ప ఫల భరిత శాఖావనమ్ర తరులతా బృందంబును మాధవీ కుంజమంజరీ పుంజ మకరంద పాన మత్త మధుకర నికర ఝుంకార రవ ముఖరిత హరిదంతరంబును, గగన కమల కల్హార విలస త్సరో విహరమాణ చక్రవాక బక క్రౌంచ మరాళ దంపతీ మండల మండితంబును, మృణాళ భోజనాసక్త సారచయ చంచూపుట విపాటిత కమల ముకుల కేసర విసర వితత ప్రశస్త సరోవరంబును నై, వెలయు. అవ్వనంబున నిందువదన లందంద మందగమనంబులం బెందు ఘర్మజలబిందుబృందంబులు. నఖాంతంబుల న్నోసరింపుచు డాయం జనునప్పుడు, 95

శ్లో. ఇత్థం బ్రువ త్యభయదే నరదేవ దేవాః
సవ్రీడనమ్రశిరస స్సఘృణం త మూచుః,
నైత ద్విభో త్వయి పరేఽ వికృతే విచిత్రం
స్వారామధీరనికరానతపాదపద్మే. 9

అ. నరదేవ ! = ఓ రాజా ! అభయదే = అభయమిచ్చువాడైన నారాయణుఁడు; ఇత్థం బ్రువతి = ఇట్లు వచించినంతనే; దేవాః = కామాదులు; సవ్రీడనమ్రశిరసః = సిగ్గుతో శిరస్సులు వంచుకొన్నవారై: తం సఘృణం, ఊచుః = ఆ ఋషికి కృప కలుగునట్లుగాఁ జెప్పిరి: విభో = ఓ ప్రభూ; స్వారామధీరనికర + ఆనతపాదపద్మే = ఆత్మారాములై ధీరులైన వారి సమూహముచే మ్రొక్కఁబడు పాదపద్మములు కలవాడవు: అవికృతే = వికారము పొందనివాడవును అగు; పరే త్వయి = పరాత్పరుడవగు నీ విషయమున; ఏతత్ న విచిత్రమ్ = ఇది విచిత్రము కాదు.

తా. ఓ రాజా ! అభయమిచ్చువాడై ఆ నారాయణఋషి ఇట్లు పలుకగా ఆ కాముఁడు లోనగువారు సిగ్గుతోఁ దలవంచుకొని మ్రొక్కుచు, ఆ ఋషితో నిట్లనిరి - "ఆత్మారాములై, ధీరులైన జ్ఞానులచే మ్రొక్కఁబడు పాదపద్మములు గలవాడవు, పరమాత్మవు నీవు. మా మాయలకు వికారము పొందకపోవుట యిది ఒక విచిత్రము గాదు.

శ్లో. త్వాం సేవతాం సురకృతా బహవోఽంతరాయా
స్స్వౌకో విలంఘ్య పరమం వ్రజతాం పదం తే
నాన్యస్య బర్హిషి బలీన్ దదతః స్వభాగాన్
ధత్తే పదం త్వ మవితా యది విఘ్నమూర్ధ్ని. 10

అ. త్వాం, సేవతాం = నిన్ను సేవించుచున్నవారై, స్వ + ఓకః = స్వస్థానమగు స్వర్గమును; విలంఘ్య = దాటి; తే = నీ యొక్క; పరమం పదం = పరమపదమును గూర్చి; వ్రజతాం = పోవుచున్నవారికి, సురాకృతాః బహవః అంతరాయాః = దేవతలు కావించు పెక్కు విఘ్నములు కలుగును; బర్హిషి = యజ్ఞమునందు, స్వభాగాన్ = తమ భాగములైన పురోడాశాదులను; బలీన్ = కప్పములను; దదతః = ఇచ్చునట్టి; అన్యస్య = ఇతరునికి; న = విఘ్నములు రావు. కృషీవలులు రాజునకు కప్పము కట్టినట్లు ఇంద్రాదులకు హవిర్భాగము నిచ్చువారికి విఘ్నములు రావు. అట్లయిన నా భక్తుఁడు విఘ్నములచే నాశనమగునా, అన్నచో కాదు. ఎందు

(65 వ పేజీ తరువాయి)

చం. మదనుని బాణజాలమున మగ్నతఁ బొందక ధైర్యవంతుఁడై
ముదితల వాడి చూపులకు మోహము నొందక నిశ్చలాత్ముఁడై
హృదయమునందు నచ్యుతు రమేశు ననంతు జగన్నివాసునిన్
వదలక భక్తి నిల్పుకొని వారికి నిట్లనె మౌని పెంపువన్. 66

క. జంభారి పంపువను మీ
రంభోరుహ వదనలార ! యరుదెంచితి రా
శంభద్విహార వాంఛా
రంభంబునఁ దిరుగుఁ డనిన లజ్జించి వెసన్, 67

వలన? త్వం = సర్వసురాధీశ్వరుఁడవగు నీవు; అవితా యది = నిశ్చయముగ రక్షకుఁడవు కాన; (అసౌ = ఈ నీ భక్తుడు) విఘ్నమూర్ధ్ని = విఘ్నముల శిరస్సునందు; పదం = పాదమును; ధత్తే = ఉంచుచున్నాడు.

తా. కృషీవలులు రాజునకుఁ గప్పము చెల్లించునట్లు, కర్మఠుడై యజ్ఞమునందు, హవిర్భాగములు ఇంద్రాదిదేవతలకు సమర్పించువానికి విఘ్నములు కలుగవు. ఇక నీ భక్తుడు విఘ్నములచే నాశనమగునా అనిన కాదు అనునది నిశ్చయము. నీవు సర్వసురాధీశ్వరుడవై, రక్షకుడవై యుండగా నతడు విఘ్నముల శిరస్సుపై పాదము ఉంచుచున్నాడు. అట్టిచో విఘ్నములు కలుగు శంకయే నీకు లేదు.

అవ. నీ భక్తులు కానివారై కేవలము తపస్సు చేయువారికి రెండు గతులు కలుగును. ఒకటి మాకు వశులై కామోపభోగముల ననుభవించుట. రెండు క్రోధమున శాపాదుల నిచ్చుట. వీరు కేవలము మూఢులగుచున్నారు–

శ్లో. క్షుత్తృట్త్రికాలగుణమారుత జైహ్వశైశ్నా
నస్మా నపారజలధీ నతితీర్య కేచిత్,
క్రోధస్య యాంతి విఫలస్య వశం పదే గో
ర్మజ్జంతి దుశ్చరతపశ్చ వృథోత్సృజంతి. 11

అ. క్షుత్తృట్ ... శైశ్నాన్—క్షుత్ = ఆఁకలి, తృట్ = దప్పి; త్రికాలగుణ = శీతోష్ణ వర్షములు; మారుత = ప్రాణము; జైహ్వ్య = జిహ్వోపభోగములు; శైశ్నాన్ = శిశ్నోపభోగ ములు అనువానిని; అస్మాన్ = మమ్ములను; అపారజలధీన్ = అంతములేని సముద్రము రూప మున నున్నవానిని; అతితీర్య = దాటి; కేచిత్ = కొందఱు; గోష్పదే మజ్జంతి = గోవు పాదము నందు మునుంగుచున్నారు; ఎందువలన? విఫలస్య క్రోధస్య వంశం = నిష్ఫలమైన క్రోధము యొక్క వశమును, యాంతి = పొందుచున్నారు కనుక. ఏ ప్రకారము జలమునందు మునుఁగు చున్నవారై శిరస్సునం దుంచిన భారమును వదలిపెట్టుదురో అప్రకారము; వృథైవ = వ్యర్థ ముగా (అటు మోక్షమునకుగాని, ఇటు భోగమునకుగాని కాక) దుశ్చరతపః = ఆచరింప నలవి కాని తపస్సును; ఉత్సృజంతి = శాపాదులచే విడచివేయుదురు.

తా. ఆకలిదప్పులను వీడి, చలి, వేడి, వర్షములు సహించి, ప్రాణమును నిరోధించి, జిహ్వేంద్రియము రుచులను త్యజించి, శిశ్నోపభోగ ప్రసంగమును వర్జించి, కామాదులు అను అపార సముద్రములను దాటి, కొందఱు గోవు పాదమంత జలమునందు మునుఁగుచున్నారు. ఎట్లనగా మిగుల కష్టపడి కావించిన తపస్సును శాపాదికమునకు వ్యర్థముగాఁ ద్యజించు చున్నారు.

శ్లో. ఇతి ప్రగృణతాం తేషాం స్త్రియోఽత్యద్భుతదర్శనాః,
దర్శయామాస శుశ్రూషా స్వర్చితాః కుర్వతీ ర్విభుః. 12

అ. ఇతి ప్రగృణతాం = ఇట్లు స్తుతించుచున్న; తేషాం = కామాదులకు; విభుః = భగవం తుడు; యోగవినిర్మితాః = యోగశక్తిచే నిర్మింపబడిన వారును; స్వర్చితాః = చక్కగా వలంక

రించుకొనిన వారై; శుశ్రూషాం=తమకు శుశ్రూషను; కుర్వతీః=చేయుచున్న; స్త్రియః= స్త్రీలను; దర్శయమాన=చూపెను.

తా. అప్పుడు ప్రభువగు నారాయణఋషి యోగశక్తిచే సృజింపబడి, చక్కగా నలంకరించుకొని, తమకు శుశ్రూషఁ జేయుచున్న స్త్రీలను- కామాదులకు, వారి సౌందర్యలావణ్యాదికృతమగు దర్పము శాంతించుట కొఱకుఁ జూపెను.

శ్లో. తే దేవానుచరా దృష్ట్వా స్త్రియః శ్రీరివ రూపిణీః,
గంధేన ముముహు స్తాసాం రూపౌదార్యహతశ్రియః. **13**

అ. దేవానుచరాః=ఇంద్రుని యనుచరులగు కామాదులు, అచ్చరలు; శ్రీః ఇవ= లక్ష్మివలె; రూపిణీః=రూపవతులైన; స్త్రియః=ఆ స్త్రీలను; దృష్ట్వా=చూచి; తాసాం, గంధేన=వారి దేహ పరిమళముచే; రూపౌదార్యహతశ్రియః=సౌందర్యము యొక్క గొప్పదనముచేఁ గొట్టబడిన కాంతిగలవారై; ముముహుః=మోహమును పొందిరి.

కాముఁడు, అచ్చరలు లోనగు నింద్రుని యనుచరులు, నారాయణఋషి సృజించిన ఆ స్త్రీలను, లక్ష్మివంటి రూపవతులను చూచి, వారి సౌందర్యాతిశయముచేఁ దమకాంతులు క్షీణించినవి కాగా, వారి దేహమునుండి వెలువడిన పరిమళముచే మోహమును పొందిరి.

శ్లో. తా నాహ దేవదేవేశః ప్రణతాన్ ప్రహస న్నివ,
ఆసా మేకతమాం వృఙ్ధ్వం సవర్ణాం స్వర్గభూషణామ్. **14**

అ. దేవదేవేశః=దేవదేవుఁడైన విష్ణువు; ప్రణతాన్ తాన్=ప్రణమిల్లిన వారిని గూర్చి; ప్రహసన్ ఇవ=నవ్వుచు; ఆహ=చెప్పెను; ఆసాం=ఈ స్త్రీలలో: సవర్ణాం=సమాసరూపను; స్వర్గభూషణాం = స్వర్గమున కలంకారమైన; ఏకతమాం = ఒక్కతెను; వృఙ్ధ్వం = కోరుకొనుడు.

తా అంత దేవదేవేశుఁడు ప్రణతులైన అచ్చరలను, కామాదులను గాంచి నవ్వుచు, వీరిలో మీకు సమానమగు రూపవతిని గోరుకొనుడు. మాకు సమానరూప వీరిలో నొక్కతెయు లేదందురా ? పోనిండు. స్వర్గమునకు భూషణమైన దానినిగా నేను సృజించిన స్త్రీలలో నొక్కతెను కోరుకొనుడు" అని చెప్పెను.

శ్లో. ఓమిత్యాదేశ మాదాయ నత్వా తం సురవందినః,
ఊర్వశీ మప్సరశ్శ్రేష్ఠాం పురస్కృత్య దివం యయుః. **15**

అ. ఆదేశం=ఆదేవుని యాజ్ఞను; ఓమితి+ఆదాయ=సరియని గ్రహించి; నత్వా= నమస్కరించి; సురవందినః=దేవభృత్యులు; అప్సరశ్శ్రేష్ఠాం=అప్సరలలో శ్రేష్ఠమైన: ఊర్వశీం పురస్కృత్య=ఊర్వశిని ముందిడుకొని; దివం యయుః= స్వర్గమునకు బోయిరి.

తా. అట్లే యాదేవుని యాజ్ఞను అంగీకరించి, దేవభృత్యులైన కామాదులు ఆయనకు నమస్కరించి, యచ్చరలందు మిన్నగాఁ గన్పట్టు ఊర్వశిని కోరి, యామెను ముందిడుకొని స్వర్గమునకుఁ బోయిరి.

శ్లో. ఇంద్రాయానమ్య సదసి శృణ్వతాం త్రిదివౌకసామ్,
ఊచు ర్నారాయణబలం శక్ర స్త్రత్రాస విస్మితః. **16**

అ. ఇంద్రాయ, ఆనమ్య=ఇంద్రునకు నమస్కరించి; త్రిదివౌకసాం+శృణ్వతాం = దేవతలు వినుచుండగా; సదసి = దేవసభయందు; నారాయణబలం+ఊచుః=నారాయణఋషి ప్రభావమును చెప్పిరి; శక్రః=ఇంద్రుడు; తత్రాస = భయపడెను; విస్మితః(చ)=(నారాయణ ఋషి బలమునకు) విస్మితుడయ్యెను కూడ.

తా. కామాదులు ఇంద్రునకు నమస్కరించి, దేవసభ యందు సురలందరు వినుచుండ నారాయణఋషి బలమును మహిమను వచించిరి. ఇంద్రుఁ డది విని భయపడెను. నారాయణ ఋషి బలమున కచ్చెరువందెను కూడ *

శ్లో, హంసస్వరూ ప్యవద దచ్యుత ఆత్మయోగం
దత్తః కుమార ఋషభో భగవాన్ పితా నః,
విష్ణు శ్శివాయ జగతాం కలయాఽవతీర్ణ
స్తేనాహృతా మధుభిదా శ్రుతయో హయాస్యే. **17**

అ. అచ్యుతః=విష్ణువు; హంసస్వరూపీ=హంసస్వరూపుడు; దత్తః=దత్తాత్రేయుడు; కుమారః=సనకాదులైన కుమార వర్గము; నః పితా=మాకుఁ దండ్రి యగు; ఋషభః+ భగవాన్=భగవానుడగు ఋషభుడునుగా; జగతాం శివాయ=జగముల క్షేమము కొఱకు; కలయా+అవతీర్ణః=తన యంశముతో నవతరించి; ఆత్మయోగం=ఆత్మజ్ఞాన యోగమును; అవదత్=చెప్పెను; అల్లే, మధుభిదా=మధుహంతయైన; తేన=ఆ విష్ణువుచే; హయాస్యే= హయగ్రీవావతారము నందు; శ్రుతయః=వేదములు; ఆహృతాః=కొనిరాబడినవి.

---

*సీ. దేవమౌనీశ ! నీ దివ్య చారిత్రంబు నెఱిగి సన్నుతి సేయ నెవ్వఁ డోపుఁ
బుత్ర మిత్ర కళత్ర భోగాదులను మాని తపము గావించు విద్వర్ములకును
విఘ్నముల్ చేదునే విశ్వేశుఁ గొల్చిన యతనికి నంతరాయంబు గలదె
కామంబు క్రోధంబు గలిగిన తపములు పల్వలోదకముల భంగిఁ గావె.

తే. నిన్ను వర్ణింప నలవియే నిర్మలాత్మ !
రమణ లోఁగొను మా యపరాధ మనుచు
సన్నుతించిన నతఁడు ప్రసన్నుఁ డగుచుఁ
దనను సామర్థ్య మెఱిఁగింపఁ దలచి యపుడు. 63

వ. అమ్మునీశ్వరుండు పరమాశ్చర్యవిధానంబుగా నిజతనూరుహంబుల వలనం ద్రికోటి కన్యకానివహంబుల నుద్భవింపజేసిన, గంధర్వవిబుధకామినీసముదయంబులు పరమాద్భుత భయంబులు మనంబులం బొడమ సన్నుతించి, యవ్విలాసినీసమూహంబులో నూర్వశి యను దానిం గొని చని, పాకశాసను సభాభవనంబునం బెట్టి, తద్వృత్తాంతం బంతయు విన్నవించిన, నాశ్చర్యయుక్తహృదయుండై సునాసీరుం డూరకుండె; ఇట్టి నారాయణమునీశ్వరు చరితంబు వినువారలు పరమకల్యాణగుణవంతు లగుదురు. అని చెప్పిన. 69

తా. అచ్యుతుఁడు - హంసరూపుఁడు, దత్తాత్రేయుఁడు, కుమారులైన సనకాదులు, మా తండ్రియగు ఋషభ భగవానుడునై యవతరించి భక్తులకు, ఆత్మయోగము నుపదేశించెను. మధువైరియైన ఆ విష్ణువు జగముల క్షేమమునకై యవతరించి హయగ్రీవావతారమందు వేదములు కొనివచ్చెను.

శ్లో. గుప్తోఽప్యయే మను రిలౌషధయశ్చ మాత్స్యే
క్రోడే హతో దితిజ ఉద్ధరతాంభసః క్ష్మామ్
కౌర్మే ధృతోఽద్రి రమృతోన్మథనే స్వపృష్ఠే
గ్రాహాత్ప్రపన్న మిభరాజ మముంచ దార్తమ్. 18

అ. అప్యయే=ప్రళయమునందు; మాత్స్యే=మత్స్యావతారమందు; మనుః+ఇలా+ఓషధయశ్చ=మనువు, పృథివి, ఓషధులును; గుప్తః=రక్షింపబడెను; క్రోడే=వరాహావతారమందు; అంభసః=జలములనుండి; క్ష్మాం=భూమిని; ఉద్ధరతా=ఉద్ధరించిన ఆ విష్ణువుచే; దితిజః=దైత్యుఁడు, హిరణ్యాక్షుఁడు, హతః=చంపబడెను; కౌర్మే=కూర్మావతారమందు; అమృత+ఉన్మథనే=అమృతమునకై క్షీరసముద్రమును మథించినప్పుడు; స్వపృష్ఠే=తన వీపుపై; అద్రిః=మందరగిరి; ధృతః=ధరింపబడెను; ఆవిష్ణువు—గ్రాహాత్=మొసలివలన; ఆర్తం=దుఃఖముపొందిన; ప్రపన్నం=తనను శరణుపొందిన; గజేంద్రుని; అముంచత్ = (ఆమొసలినుండి) విడిపించెను.

తా. ప్రళయకాలమందు విష్ణువు మత్స్యావతార మెత్తి, మనువును, పృథివిని ఓషధులను రక్షించెను. వరాహావతారమున హిరణ్యాక్షుఁ డను దైత్యుని వధించి సముద్ర జలమునుండి భూమిని పైకి లేవనెత్తి నిలిపెను. అమృతమునకై క్షీరసాగరమథనమున దు కూర్మావతారమెత్తి తన వీపు మీద మందరగిరిని ధరించెను. సాక్షాద్విష్ణువై, వైకుంఠమునుండి వచ్చి, మొసలిచేఁ బట్టుపడి యాపదనొంది తన్ను శరణుపొందిన గజేంద్రుని మొసలినుండి విడిపించి రక్షించెను.

(ఇట్టి పట్టులం దెచ్చట అవతారనామము లేదో యచట విష్ణువు జగముల క్షేమము కొఱకు స్వాంశముతో నవతరించెనని తెలియునది.)

శ్లో. సంస్తున్వతోఽబ్ధిపతితాన్ శ్రమణా నృషీంశ్చ
శక్రం చ వృత్రవధత స్తమసి ప్రవిష్టమ్,
దేవస్త్రియోఽసురగృహే పిహితా అనాథా
జఘ్నేఽసురేంద్ర మభయాయ సతాం నృసింహః. 19

అ. సంస్తున్వతః=తన్ను స్తుతించువారును; అబ్ధిపతితాన్=కశ్యపుని యాగము కొఱకు సమిధలు తెచ్చుచు గోష్పాద ప్రమాణమగు సముద్రమునందు మునిఁగిన వారును; శ్రమణాన్=నిస్సంగులును అగు; ఋషీన్=వాలఖిల్యాది ఋషులను; (ఉద్ధరించి యాపదనుండి విడుదల కావించెను) వృత్రవధతః=వృత్రుని వధించుటవలన; తమసి ప్రవిష్టం=బ్రహ్మహత్యయందు ప్రవేశించిన; శక్రం చ=ఇంద్రుని; (విముక్తుని చేసెను) అసురగృహే=హిరణ్యకశిపుని భవన

ముందు; పిహితాః = దాఁచఁబడి; అనాథాః = దిక్కులేని వారైన; దేవస్త్రియః = దేవతా స్త్రీలను; (విముక్తులను గావించెను) సతాం = సాధువులకు; అభయాయ = అభయమిచ్చుటకై; నృసింహః = నృసింహమూర్తియై; అసురేంద్రం = అసురప్రభువగు హిరణ్యకశిపుని; జఘ్నే = వధించెను.

తా. అంగుష్ఠప్రమాణదేహులై, కశ్యపుని యాగమునకొఱకు సమిధ లేరి తెచ్చుచు, గోవు పాదమంతటి గుంటలోఁ బడిన (లేక సముద్రమునందు మునింగినవారై యింద్రునిచే నప హసింపబడిన) నిస్సంగులగు వాలఖిల్యాది ఋషులను, ఆపదనుండి యుద్ధరించెను. అట్లే యింద్రుడు వృత్రాసురుని సంహరించి బ్రహ్మహత్యాపీడితుడు కాఁగా వానిని ఆ హత్యనుండి విముక్తుని చేసెను. అసురరాజైన హిరణ్యకశిపుని భవనమందు బందీలుగా దాఁచబడిన దేవాం గనలను విడిపించెను. సాధువుల కభయమిచ్చుటకై నరసింహమూర్తియై యసుర ప్రభువైన హిరణ్యకశిపుని వధించెను.

శ్లో. దైవాసురే యుధి తు దైత్యపతీన్ సురార్థే
హత్వాఽంతరేషు భువనా న్యదధా త్కలాభిః,
భూత్వాఽథ వామన ఇమా మహర ద్బలేః క్ష్మాం
యాచ్ఞాచ్ఛలేన సమదా దదితే స్సుతేభ్యః. 20

అ. దైవాసురే యుధి తు = దేవాసురుల సంగ్రామమందు; దైత్యపతీన్ = దైత్యప్రభువు లను; సురార్థే = దేవతలకొఱకు; హత్వా = వధించి; అంతరేషు = మన్వంతరముల యందు; కలాభిః = స్వాంశమూర్తులచే; భువనాని = జగములను; అదధాత్ = పాలించెను; అథ = మఱియు; వామనః భూత్వా = వామనమూర్తియై; యాచ్ఞాచ్ఛలేన = యాచననెపమున; బలేః = బలినుండి; ఇమాం క్ష్మాం = ఈ భూమిని; ఆహరత్ = గ్రహించెను. అదితేః = అదితిదేవి యొక్క; సుతేభ్యః = పుత్రులగు నింద్రాదులకు; సమదాత్ = ఇచ్చెను.

తా. దేవాసురులకు జరిగిన సంగ్రామమునందు, సురలపక్షమున నుండి, వారి ప్రయోజ నమునకై హరి, దైత్య ప్రభువులను వధించెను. తనయంశమూర్తులచే భువనములను పాలిం చెను. మఱియు, వామనమూర్తియై యాచించునెపమున బలినుండి ఈభూమిని గైకొని, యదితి దేవి పుత్రులగు నింద్రాదులకు నొసంగెను.

శ్లో. నిఃక్షత్రియా మకృత గాం చ త్రిఃసప్తకృత్వో
రామస్తు హైహయకులాప్యయ భార్గవాగ్నిః,
సోఽబ్ధిం బబంధ దశవక్త్ర మహన్ సలంకం
సీతాపతి ర్జయతి లోక మలంఘ్యకీర్తిః. 21

అ. హైహయకుల + అప్యయ భార్గవ + అగ్నిః = హైహయ వంశీయులగు రాజుల యొక్క నాశమునకు భార్గవరూపమగు నగ్నియైన; రామః = పరశురాముడు; త్రిస్సప్తకృత్వః = ఇరువది యొక్కమార్లు (దండయాత్ర చేసి); గాం = భూమిని; నిఃక్షత్రియాం = క్షత్రియ

లనువారు లేనిదానినిగా; అకృత = చేసెను; సః = ఆవిష్ణువు; సీతాపతిః, భూత్వా = దాశరథియై; అబ్ధిం బబంధ = సముద్రమును బంధించెను; సలంకం = లంకలో నున్న; దశవక్త్రం = దశ ముఖుని; అహన్ = వధించెను; అలంఘ్యకీర్తిః = ఇతరులకు అతిక్రమింపవలవి గాని కీర్తి గలవాఁడై; (లోకమలఘ్నకీర్తిః అని పాఠాంతరము = లోకముల యొక్క పాపములను పోగొట్టు కీర్తికలవాడై); లోకం = జగమును; జయతి = జయించుచున్నాడు.

తా. హైహయులగు రాజుల వంశనాశమునకు భార్గవుఁడను నగ్నియై తేజరిల్లిన పరశురాముఁడు, ఇరువదియొక్కమార్లు దండయాత్ర గావించి భూమండలమున క్షత్రియుఁడను వాఁడు లేకుండునట్లు చేసెను. అతడే దశరథనందనుఁడై జనించి సముద్రమునకు వారధి కట్టి లంకలోనున్న దశకంఠుని సంహరించెను. ఆ సీతాపతి వర్తమానకాలమునందలి యవతారమై ఇతరులకు నతిక్రమింపనలవికాని కీర్తికలవాడై నేఁడును సర్వోత్కర్షతో వర్తించు చున్నాడు.

శ్లో. భూమేర్భరావతరణాయ యదుష్వజన్మా
జాతః కరిష్యతి సురైరపి దుష్కరాణి,
వాదైర్విమోహయతి యజ్ఞకృతోఽతదర్హాన్
శూద్రాన్ కలౌ క్షితిభుజో న్యహనిష్యదంతే. 22

అ. (రాబోవు కృష్ణావతారము నిఁకముందు చెప్పుచున్నాఁడు.) అజన్మా = పుట్టుక లేని హరి; భూమేః = భూమి యొక్క; భర + అవతరణాయ = భారము దించుట కొఱకు; యదుషు = యదురాజులందు; జాతః = పుట్టినవాడై; సురైరపి = దేవతలచేతను; దుష్కరాణి = చేయ శక్యము గాని కార్యములను; కరిష్యతి = చేయఁగలఁడు; బుద్ధావతారమును చెప్పుచున్నాఁడు; యజ్ఞకృతః = యజ్ఞములు గావించుచున్నను; అతదర్హాన్ = ఆ యజ్ఞములు చేయ నర్హులు కాని దైత్యులను; వాదైః + విమోహయతి = హేతువాదములచే మోహపెట్టగలడు: మఱి కల్క్యవతారమును చెప్పుచున్నాడు; కలౌ = కలియుగమునందు: అంతే = చివర; క్షితిభుజః = భూపాలురైన; శూద్రాన్ = శూద్ర ప్రభువులను: న్యహనిష్యత్ = చంపగలఁడు.

తా జన్మరహితుఁడైన ఆమహావిష్ణువు యదురాజుల వంశమందు శ్రీకృష్ణు డను పేరుతో జన్మించి, దేవతలకు సైతము చేయుటకు సాధ్యముకాని దొడ్డకార్యములను చేయగలఁడు. అతడే కలియందు బుద్ధుఁడై యవతరించి యజ్ఞార్హులుగాక యజ్ఞములు చేయు దైత్యపతులను హేతు వాదములచే మోహపెట్టగలఁడు. అహరియే కలియుగాంతమున కల్కియై యవతరించి క్షితి పతులైన శూద్రప్రభువులను హతము చేయఁగలఁడు.

శ్లో. ఏవంవిధాని కర్మాణి జన్మాని చ జగత్పతేః.
భూరీణి భూరియశసో వర్ణితాని మహాభుజ. 23

అ. మహాభుజ = ఓ మహాబాహుడా !; భూరియశసః = గొప్ప యశస్సు గలవాఁడై; జగత్పతే = లోకప్రభువైన శ్రీహరి యొక్క; ఏవంవిధాని = ఇటువంటి; జన్మాని = అవతారములును; కర్మాణి చ = తత్కృత్యములును; భూరీణి = అనేకములు; వర్ణితాని = వర్ణింపబడినవి.

తా. ఓ మహాభుజుడా! దొడ్డ యశస్సు గలిగి జగత్ప్రభుఁడైన యా మహావిష్ణువు యొక్క యవతారములను, ఆ యవతారములందు చేసిన కార్యములను వర్ణించి నీకు వివరించితిని.*

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే చతుర్థోఽధ్యాయః.
ఇది శ్రీమద్భాగవతమందు ఏకాదశస్కంధమున నాల్గవ అధ్యాయము.

---

*తే. ఋషభునకు నాత్మయోగ మీ రీతిఁ జెప్పి
యచ్యుతుఁడు భూమిభారము నడఁప నంత
నొరిది నవతారములు దాల్చి సొంపుమీఱ
రాత్రిచరులను జంపె నీరసముతోడ. 70

వ. అట్టి పరమేశ్వరు లీలాగృహీతంబులగు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, రఘురామ, రామ, బుద్ధ, కల్క్యాద్యవతారంబు లనేకంబులు గలవు; శేష భాషాపతుల కైన వర్ణింపనలవి గాదు; మఱియును. 71

సీ. నవవికచసరసిరుహ నయనయుగ! నిజచరణ గగనచరనది! నిఖిలనిగమవినుత
జలధిసుతకుచకలశలలితమృగమదరుచిపరిమళితనిజహృదయ! ధరణిధరణ
ద్రుహిణముఖసురనికరవిహితమతికలితగుణ! కచఘటితరుచిరతరకనకవసన!
భుజగరిపువరగమన! రజతగిరిపతి వినుత సతతవృత జపనియమ సరణిచరిత!

తే. తిమి! కమఠ! కిటి! నృహరి! ముదితబలినిహి
తపద! పరశుధర! దశవదనవిదళన!
మురమథన! కలికలుష సుముదపహరణ!
కరివరద! మునివరసురగరుడవినుత! 72

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లిన శ్రీమన్నారాయణమూర్తి లీలావిలాసంబు లనంతంబులు గలవు. మనోవాక్కాయకర్మంబుల హరిపూజనంబు సేయక విపరీతగతులం దిరుగుచుండు జడుల కెవ్విధంబున గతి గలుగు? అనిన ... ... ... ...

# పంచమాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. పంచమే భక్తిహీనానాం కా నిష్ఠా కో యుగే యుగే,
విష్ణోః పూజావిధిః ప్రశ్నద్వయ స్యోత్తర ముచ్యతే.

ఈ పంచమాధ్యాయమందు భక్తిహీనులైనవారి నిష్ఠ మెట్టిది? ప్రతి యుగమునందును విష్ణుపూజ యేవిధముగా నుండును? ఈ రెండు ప్రశ్నలకు సమాధానము చెప్పబడును.

అవ. "త్వాం సేవతాం సురకృతా బహవోఽన్తరాయాః" = నిన్ను సేవించు భక్తులకు దేవతలు పెక్కు విఘ్నములు కావించుచుందురు. అని చెప్పుటచే, శ్రీహరి భక్తులు విఘ్నముల శిరస్సుపై తమ పాదముంచి బరమపదమును బొందుదురు. భక్తులుగాని వారికి విఘ్నములు కలుగుచుండును. అని చెప్పబడినది. అట్లయిన వారి కేమి గతి కలుగును? అని ప్రశ్నించుచున్నాడు—

నిమి రువాచ = నిమి పల్కెను.

శ్లో. భగవంతం హరిం యే వై న భజం త్యాత్మవిత్తమాః,
తేషా మశాంతకామానాం కా నిష్ఠాఽవిజితాత్మనామ్. **1**

అ. ఆత్మవిత్తమాః = ఆత్మనెఱిగినవారిలో నుత్తములారా!; యే వై = యెవరు; భగవంతం హరిం న భజంతి = భగవంతుడగు హరిని సేవింపరో; అశాంతకామానాం = శాంతించని కామము కలవారును; అవిజితాత్మనాం = జయింపబడని మనస్సు కలవారును అగు; తేషాం = ఆ భక్తులకు; కా నిష్ఠా = ఏమి గతి? ప్రాప్యమగు స్థావమేది?

తా. ఓ యాత్మవిదులలో నుత్తములారా! ఎవరు భగవంతుడగు శ్రీహరిని సేవింపరో, మనోనిగ్రహము కలవారు కారో, కామమును శాంతింప జేసికొనరో, యా యభక్తులకు ప్రాప్యమగు స్థాన మేది యగును?

చమస ఉవాచ = చమసుడు పల్కెను.*

అవ. తమకు జనకుడును (తమ్ము పుట్టించినవాడు), గురువును అగు భగవంతుని నాదరించక గురుద్రోహు లైనవారు దుర్గతులను పొందుదు రని చెప్పుటకై, ముందుగా భగవంతుని వలన వర్ణాశ్రమములు కలిగినవని చెప్పుచున్నారు—

---

* వ. ... ... ... అనిన నప్పుడమిఱేడ డప్పరమపురుషులం జూచి యట్టి జడులు ముక్తిఁ బొందు నుపాయం బెట్టులు? అంతయు నెఱింగింపుము; అనిన చమసుం డిట్లనియె.

శ్లో. ముఖబాహూరుపాదేభ్యః పురుష స్యాశ్రమైః సహ
చత్వారో జజ్ఞిరే వర్ణా గుణై ర్విప్రాదయః పృథక్. 2

అ. పురుషస్య = ఆ మహాపురుషుని యొక్క; ముఖబాహూరుపాదేభ్యః=ముఖము, బాహువులు, ఊరువులు, పాదములు అనువానివలన; చత్వారః వర్ణాః=నాలుగు వర్ణములైన బ్రాహ్మణాదిజాతులు; ఆశ్రమైః సహ=బ్రహ్మచర్యాద్యాశ్రమములతో గూడ; జజ్ఞిరే=జనించిరి; గుణైః=సత్త్వాదిగుణములచే; విప్రాదయః=బ్రాహ్మణులు లోనగువారు; పృథక్ వేరుగా; జజ్ఞిరే=జనించిరి.

తా. ఆ విరాట్పురుషుని ముఖమునుండి బ్రాహ్మణజాతియు, బాహువులనుండి క్షత్రియ జాతియు, ఊరువులనుండి వైశ్యజాతియు, పాదములనుండి శూద్రజాతియు జనించెను. వానితో గూడ బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అను నాశ్రమములును జనించెను. సత్త్వగుణముచే విప్రుడు, సత్త్వరజస్సులచే క్షత్రియుఁడు, రజస్తమస్సులచే వైశ్యుఁడు, కేవల తమోగుణముచే శూద్రుఁడును వేఱువేఱుగ జనించిరి.

శ్లో. య ఏషాం పురుషం సాక్షా దాత్మప్రభవ మీశ్వరమ్,
న భజం త్యవజానంతి స్థానా ద్భ్రష్టాః పతం త్యధః. 3

అ. ఏషాం=ఈ నాలుగు వర్ణముల వారిలో, యే=ఎవరు; పురుషం=ఆ పరమ పురుషుని; సాక్షాత్ =ప్రత్యక్షముగా; ఆత్మప్రభవం=తమ జన్మకారణమైనవానిని; న భజంతి=(తెలియక) సేవింపరో; యే=ఎవరు; అవజానంతి=(ఎఱింగియు) భజింపక యవమానింతురో వారు; స్థానాత్ =తమ వర్ణాశ్రమ ధర్మములనుండి; భ్రష్టాః=భ్రంశము నొందినవారై; అధః పతంతి =అధఃపతితు లగుదురు.

తా. ఈ నాలుగు వర్ణముల వారిలో పరమపురుషుడు, తమ జన్మములకు కారణమైన భగవంతుని, సాక్షాత్తుగా ఎవరు ఎఱుంగక భజింపరో, ఎవరు ఎఱింగియు భజింపక యవ మానింతురో వారు, వారి వారి వర్ణము, ఆశ్రమము అను స్థానములనుండి భ్రష్టులై యధఃపతితు లగుదురు.

అవ. వారియం దెవరు అజ్ఞానులో, వారు మీబోంట్లచే ననుగ్రహింపదగినవా రను చున్నారు-

శ్లో. దూరే హరికథాః కేచి ద్దూరే చాచ్యుతకీర్తనాః,
స్త్రియ శ్శూద్రాదయ స్సర్వే తేఽనుకంప్యా భవాదృశామ్. 4

అ. కేచిత్= కొందఱు; దూరే హరికథాః=దూరమున శ్రీ విష్ణుకథలు గలవారు; అనగా శ్రవణము చేయక, తెలియక దూరమున నుందురు; కేచిత్ =మఱికొందఱు; దూరే చ + అచ్యుతకీర్తనాః=దూరమున విష్ణునామసంకీర్తన కలవారై యుందురు; తే=ఆ; స్త్రియః =స్త్రీలు; శూద్ర+ఆదయః=శూద్రులు లోనగువారు; సర్వే=ఎల్లరు; భవాదృశాం=మీ వంటివారికి; అనుకంప్యాః=కనికరింపదగినవా రగుదురు.

తా. పైని పేర్కొనబడినవారిలోఁ గొందఱు ఏమియుఁ దెలియక శ్రీహరి కథాశ్రవణము నకు దూరు లగుచున్నారు. మఱికొందఱు శ్రీహరి నామసంకీర్తనకు దూరు లగుచున్నారు.

అట్టి స్త్రీలు, శూద్రులు లోనగువారు భక్తులగు మీవంటివారికి దయనీయు లగుదురు. అనఁగా మీబోంట్లు దయగలవారై వారికి శ్రీహరి భక్తిని బోధింపవలెనని భావము.

అవ. జ్ఞానలవదుర్విదగ్ధులైనవార లైనచో (ఇంచుక జ్ఞానముచే గర్వించిన వారైనచో) అచికిత్స్యు లగుదురు. చికిత్సచేయ సాధ్యముకాని వారగుదురు. బాగుపరచ వీలుకానివారు కనుక ఉపేక్షింపఁదగినవా రనుచున్నారు-

శ్లో. విప్రో రాజన్యవైశ్యౌ చ హరేః ప్రాప్తాః పదాంతికమ్,
శ్రౌతేన విద్యయా వాపి ముహ్యంం త్యామ్నాయవాదినః. **5**

అ. విప్రః=బ్రాహ్మణుడు; రాజన్యవైశ్యౌ=రాజు, వైశ్యుడు; శ్రౌతేన=శ్రుతి చోదితమైన యుపనయనము చేతను; హరేః పదాంతికం=శ్రీహరి పాదసాన్నిధ్యమును, ఆయనను భజించు నుత్తమాధికారమును; ప్రాప్తాః అపి=పొందినవా రయ్యును; అమ్నాయవాదినః =వేదమువందలి అర్థవాదములం దిచ్చగొన్నవారై ; ముహ్యంతి=కర్మఫలములందు ఆసక్తులై మోహమును పొందుచున్నారు. అట్లే భగవద్గీతయు—

'యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్య ద స్తీతి వాదినః' అని చెప్పుచున్నది.

ఆత్మజ్ఞానములేని పండితులు వేదములందలి స్వర్గాదిఫలములను పేర్కొనుచు అర్థవాదములందును తత్కర్మలందును ఆసక్తులై స్వర్గఫలము కంటె పొందదగిన ఫలము వేఱుగా లేదని వాదించుచు పుష్పమువలె శోభవమగు వాక్కును వచించుచుందురు.

తా. విప్రుడు, క్షత్రియుడు, వైశ్యుడు ప్రతిచోదితమైన యుపనయనకర్మను పొంది వేదాధ్యయనాదులు చేసినవారైకూడ, వేదములందు మోహింపజేయునవై యున్న స్వర్గాదిభోగము లగు వానిని ఉత్తమములని వాదించుచు మోహమును పొంది కర్మఫలములందు ఆసక్తులగుచున్నారు.

అవ. భక్తి దృఢపడుటకొఱకు వారి మోహమును వివరించుచు నిందించుచున్నారు-

శ్లో. కర్మ ణ్యకోవిదాః స్తబ్ధాః మూర్ఖాః పండితమానినః,
వదంతి చాటుకా న్మూఢా యయా మాధ్వ్యా గిరోత్సుకాః **6**

అ. కర్మణి=కర్మానుష్ఠానమునందు; అకోవిదాః=కర్మ బంధక మెట్లు కాదో. అట్లు చేయుట తెలియనివారు అభిజ్ఞులను సైతము అడిగి తెలిసికొనని వారును కావుననే: స్తబ్ధాః= వినయము కలవారు కారు; ఏలయన; మూర్ఖాః=ఏమియు తెలియని వారయ్యు; పండితమానినః=మేము పండితుల మను అభిమానము కలవారు.

శ్రుతి. 'అపామ సోమ మమృతా అభూమ అక్షయ్యగ్ం హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి యత్ర నోష్ణం చ శీతం స్యా న్న గ్లాని ర్నా ప్యరాతయః. మేము సోమపానము చేయుదుము; అమృత స్వరూపుల మగుదుము, చాతుర్మాస్యముల యజించినవాని సుకృతము అక్షయ్యమగును, ఎందు ఉష్ణము శీతము లేదో, బడలిక లేదో, శత్రువులు సయితము లేరో ఆ స్వర్గమును పొందుదుము' అని, ఇటువంటి ; యయా=ఏ; మాధ్వ్యా=మధువు వలె రుచి

పుట్టించు; గిరా=వాక్కుచే; ఉత్సుకాః=సంతోషము కలవారై; మూఢాః=మూఢులు, ఆ వాక్కుచే; చాటుకాన్=అప్సరసలను గూడి సంచరింతు మనునట్టి ప్రియములైన శబ్దములను, చాటువులను; వదంతి=చెప్పుదురు.

తా. కర్మను, బంధములేకుండ ఎట్లనుష్ఠింపవలెనో, యామార్గ మెఱుఁగనివారై దాని నెఱిఁగిన పండితులను అడిగి తెలిసికొనలేనివారై, నిపుణులుకానివా రగుచు వినయము చూపక, స్తబ్ధులై ఏమియుఁ దెలియని మూర్ఖు లయ్యు, మేమన్నియుఁ దెలిసిన పండితుల మని గర్వము, గలవారై, "సోమపానము చేయుదుము, అమృతస్వరూపుల మగుదుము, చాతుర్మాస్యములను యజించువాని సుకృతము అక్షయ్యమగును. ఎం దుష్ణము శీతము లేదో, ఐడలిక లేదో ఆ స్వర్గమును పొందుదు" మను మధువువలె రుచ్యమైన వేదవాక్కుచే సంతోషించువా రగుచు, ఆ మూఢులు అప్సరసలతోగూడి సంచరింతుమని ప్రియమైన చాటువాక్యములు చెప్పుదురు.

అవ. వారలకుఁ గర్మఫలాదులందు పట్టుదల యెక్కువ యగుటవలన కామక్రోధ దంభాదులు పెచ్చుపెరుగు ననుచున్నారు-

శ్లో. రజసా ఘోరసంకల్పాః కాముకా అహిమన్యవః,
దాంభికా మానినః పాపా విహసం త్యచ్యుతప్రియాన్. 7

అ. ఆ కర్మఠులు; రజసా=రజోగుణముచే; ఘోరసంకల్పాః=అభిచారము లేక మారణ క్రియ లోనగు ఘోరమగువానిని చేయ సంకల్పము గలవారై; కాముకాః=కాముకులై; అహిమన్యవః=సర్పమువలె క్రోధము గలవారై; దాంభికాః=కపటాచారులు; మానినః=అహంకారులు; పాపాః=పాపులునై; అచ్యుతప్రియాన్=విష్ణుభక్తులను; విహసంతి=పరిహసింతురు.

తా. ఆ కర్మఠులు రజోగుణముచే శత్రుమారణక్రియాదులు చేయు ఘోరసంకల్పములు గలవారును, కాముకులు, సర్పమువలె దీర్ఘక్రోధము గలవారును, ధాంభికులును, గర్విష్ఠులును, పాపాత్ములు నై విష్ణుభక్తులను పరిహసింతురు.

శ్లో. వదంతి తేఽన్యోన్య ముపాసితస్త్రియో
గృహేషు మైథున్యపరేషు చాశిషః
యజం త్యసృష్టాన్నవిధానదక్షిణం
వృత్త్యై పరం ఘ్నంతి పశూ నతద్విదః. 8

అ. ఉపాసితస్త్రియః=సేవింపఁబడినస్త్రీలుగల; తే=ఆ కర్మఠులు; మైథున్యపరేషు=దాంపత్యధర్మమే అనగా స్త్రీసంగమమే ఉత్కృష్టముగాగల; గృహేషు=గృహములందు; ఆశిషః=భోగవాంఛలను; అన్యోన్యం=పరస్పరము; వదంతి=ప్రధానముగా బలుకుదురు. అట్లే గీతా శ్లో.

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మ స్తీదమపి మే భవిష్యతి పున ర్ధనమ్.

"ఇప్పుడు నేను దీనిని సంపాదించితిని నేను మనోరథమును పొందఁగలను, ఇది నాకు గలదు. ఈ ధనాదికము నాకు గలుగఁగలదు," అనునట్టి దాంభికవచనముల నుగ్గడించును. అసృష్టాన్నవిధానదక్షిణం = సంపాదింపఁబడని యన్నప్రదానము, దక్షిణ కలుగునట్లుగా;

యజంతి=యాగాదులు చేయుదురు. అతద్విదః = హింసాదోషము తెలియనివారై; వృత్త్యై= కేవలము; జీవనముకొఱకై; పశూన్ = అజాదిపశువులను; ఘ్నంతి = చంపుదురు.

తా. ఆ కర్మఠులు నిరంతరము స్త్రీలను సేవించుచు ఆతిథ్యాదులు వీడి స్త్రీ సంగమమే ప్రధానముగాఁగల, గృహాదులందు నివసించుచు, ఆ మైథునమే ప్రధానమైన భోగమని యొండొరులతో జెప్పికొనుచు, నన్నప్రదానము, దక్షిణాదికములు లేని యజ్ఞము చేయుచు, హింసాదోషము తెలియనివారై, కేవలము జీవనము కొఱకుఁబశువుల వధించుచుందురు.

శ్లో. శ్రియా విభూత్యా ఒభిజనేన విద్యయా
త్యాగేన రూపేణ బలేన కర్మణా,
జాతస్మయే నాంధధియ స్సహేశ్వరాన్
సతోఽవమన్యంతి హరిప్రియాన్ ఖలాః. 9

అ. ఖలాః=దుష్టులు; శ్రియా=ధనాది సంపదచే; విభూత్యా=ఐశ్వర్యము (ప్రభుత్వము)చే; అభిజనేన= సత్కులమున పుట్టుటచే; విద్యయా=వేదాది విద్యలచే; త్యాగేన= ధనాది దానముచే; రూపేణ=సౌందర్యముచే; బలేన=దేహ మనోబలములచే; కర్మణా= సత్కార్మానుష్ఠానముచే; అంధధియః=గ్రుడ్డిదైన బుద్ధికలవారై; సహ+ఈశ్వరాన్=పరమేశ్వరుని ధ్యానించు; హరిప్రియాన్=హరిభక్తులగు; సతః=సాధుపురుషులను; అవమన్యంతే అవమానింతురు.

తా. ఆ కర్మఠులగు దుష్టులు సిరిసంపదలచే, నైశ్వర్యముచే, వేదాదివిద్యలచే, ధనాది దానముచే, సౌందర్యముచే, దేహమనోబలములచే, సత్కార్మానుష్ఠానముచే జనించిన గర్వముచే బుద్ధిచెడగా నజ్ఞానులై, పరమేశ్వరుని నిరంతరము చేరి ధ్యానించుచు, హరిభక్తులైన సాధువులను అవమానింతురు.

అవ. మఱియు నీ ప్రకారము వర్తించుచున్నట్టివారు వేదముయొక్క పరమార్థమును సయితము స్పష్టముగా నెఱుంగరని చెప్పుచున్నారు—

శ్లో. సర్వేషు శశ్వ త్తనుభృ త్స్వవస్థితం
యథా ఖమాత్మాన మభీష్ట మీశ్వరమ్
వేదోపగీతం చ న శృణ్వతేఽబుధా
మనోరథానాం ప్రవదంతి వార్తయా. 10

అ. సర్వేషు=సమస్తమైన; తనుభృత్సు=దేహధారులయందు; యథాఖం=ఆకాశము వలె; అవస్థితం=పదియు. నంటక యున్నట్టి; ఆత్మానం=పరమాత్మయు, అభీష్టం=మిక్కిలి యిష్టుఁడు నగు; వేద+ఉపగీతం=వేదముచే గీర్తింపబడిన స్వరూప స్వభావముకల; ఈశ్వరం =భగవంతుని; అబుధాః=అజ్ఞులై; న శృణ్వతే=వినిపించుకొనరు. ఎందువల్లననగా; మనోరథానాం=మైథునము, మాంసము, మద్యములోనగు విషయ సుఖముల యొక్క; వార్తయా =వృత్తాంతము చెప్పు వాక్కుచే; ప్రవదంతి=నివృత్తిపరమైన వేదమును ప్రవృత్తిపరముగా వచింతురు.

తా. ఎల్ల శరీరధారులందు ఆకాశము వలె నంటక యంతర్యామి రూపమున నుండు చున్నట్టి పరమాత్మయు, మిగుల నిష్టుఁడును, వేదములచేఁ గీర్తింపబడినవాడును అగు నీశ్వరునిగూర్చి చెప్పినను, అజ్ఞానులై వినిపించుకొనరు. మైథునము, మాంసభక్షణము, మద్యసేవనము లోనగు భోగము ననుభవించుటనే వేదములు వచించునని, ప్రధానముగా నివృత్తి పరమగు (పరమాత్మజ్ఞానమును చెప్పు) వేదమును ప్రవృత్తిపరముగాఁ (కర్మ ప్రధానముగా స్వర్గాది భోగములను వచించునని) వర్ణింతురు.

అవ. ఓయీ! "ఋతౌ భార్యా ముపేయాత్" = 'ఋతుకాలమునందు భార్యను పొందవలెను', "హుతశేషం భక్షయేత్" = 'హోమము చేయగా మిగిలిన దానిని భక్షింపవలెను' అనునిట్టి వాక్యములచే స్త్రీ సంగమము లోనగునవి సైతము వేదవిహితములై కన్పట్టుచుండగా నిఁకేల నిట్లు వానిని నిందింతు రనగా జెప్పుచున్నారు-

శ్లో. లోకే వ్యవాయామిష మద్యసేవా
నిత్యాస్తు జంతో ర్న హి తత్ర చోదనా,
వ్యవస్థితి స్తాసు వివాహ యజ్ఞ
సురాగ్రహై రాసు నివృత్తి రిష్టా. 11

అ. లోకే = ఇహలోకమునందు; జంతోః = ప్రాణిమాత్రమునకు; వ్యవాయ + ఆమిష మద్యసేవాః = మైథునము, మాంసాశనము, మద్యసేవనము అనునవి; నిత్యాః, తు = (వానియందలి అనురాగము వలననే) సదా ప్రాప్తించిన వగుచు; అందువలన; తత్ర = వానియందు చోదనా = వేదవిధి; నహి = లేదు; ఓయీ! ఋతౌ భార్యా ముపేయాత్ అని విధి తెలుపబడినది గదా యనిన సత్యమే, ఇది అనురాగము వలన ప్రాప్తించిన దగుట వలన అపూర్వవిధి కాదు. మఱి యేమనగా నియమవిధి రూపమున అట్టి రాగము కలవారికి అభ్యనుజ్ఞామాత్రము చేయఁబడుచున్నది.: తాసు = ఆ మైథునాదులందు; వ్యవస్థితిః = నిత్యత్వవ్యవస్థ; క్రియతే = కావింపఁబడుచున్నది; దేనిచే ననగా; వివాహ యజ్ఞ సురాగ్రహైః = వివాహ విషయముననే స్త్రీ సంగమము (కార్యము), యజ్ఞమునందే యామిషసేవ; 'సురాగ్రహాన్ గృహ్ణాతి' సురాకలశములను గొనుచున్నాడు' అని సౌత్రామణియను యాగము నందు వచించుటచే ఆ యాగము నందే మద్యసేవనము చేయవలయునని నియమము కావింపబడుచున్నది. ఆ నియమ పక్షమున సైతము ఆవశ్యమగుట వలన స్త్రీసంగాదులను నింద చేయుట యుక్తము కాదనగా చెప్పుచున్నారు — ఆసు = వీని యందు; నివృత్తిః = సేవింపకుండుట యనునది; ఇష్టా = వేద సమ్మతము.

తా. లోకమునందు స్త్రీ సంగమము, మాంసభక్షణము, మద్యసేవన మనునవి ప్రాణి మాత్రమునకు వానివాని యనురాగమును బట్టి నిత్యములై సంప్రాప్తించినవి. కాని వేదము విధించినవి కాదు. అట్లయిన ఋతుకాలము నందు భార్యను పొందవలెను. అను విధి వేదము నందు కనుపట్టుచున్నదందురా! సత్యమే. ఇది యపూర్వ విధి కాదు. ఇంతకు ముందు ప్రాప్తించని దానిని ప్రాప్తింపజేయునది యపూర్వవిధి. దాని వివరణము ముందు చెప్పుదుము. ఏలయన నిది యనురాగమునుబట్టి ప్రాప్తించునది కావున నియమ విధిరూపమున ననురాగ

వంతులకు అభ్యనుజ్ఞమాత్రము కావింపబడుచున్నది. ఆ మైథున మాంస మద్యసేవనములు కొన్నిచోట్ల మాత్రము పరిమితము చేయబడుచున్నవి. వివాహవిధియందు మాత్రము ఋతు కాలమున భార్యాసంగమము, యజ్ఞమునందు మాంసభక్షణమును, సౌత్రామణి యాగమునందు మద్యసేవయును చేయవలెను. కాని మఱెప్పుడును చేయకూడ దను నియమము చెప్పబడినది కావున మైథునాదుల నాచరింపకుండుటయే వేదసమ్మత మగును.

విశేషము. దీని భావ మిది. ఈ మైథునాదికము నిత్యముగ ప్రాప్తమైనది కనుక నిది నియమవిధియను కాదు. దీని నుండి (మైథునాదికము నుండి) నివృత్తి పరిసంఖ్యావిధి రూపమే ఈ మైథునామిషమద్యసేవలం దభిమతము. అట్లయిన వానియందు నియమ మెట్లు చెప్పిరి ? అనగా చెప్పెదను. పరిసంఖ్యాదులచే వీనినుండి శ్రౌతీనివృత్తి చెప్పబడలేదు. నివృత్తి అర్థసిద్ధము మాత్రమే. శ్రౌతీనివృత్తి చెప్పినచో స్వార్థత్యాగము పరార్థకల్పన, ప్రాప్తబాధ యను దోషత్రయము కలుగును. అందువలన నిది అపూర్వవిధి అనవలెను. ఒక్కొకచో సిద్ధింపబోవు అర్థమును మఱల విధించుట వ్యర్థమగును. కనుక అపూర్వవిధి అర్థమును బట్టి ఇతర నివారణఫలక మగును. అది ఎట్లనగా "ఇమా మగృభ్ణన్ రశనా మృతస్యే త్యశ్వాభిధానీ మాదత్తే" (శ్రుతి) అనుచోట రశనా లింగమును బట్టి గర్దభము, అశ్వముల యొక్క రశనాద్వయమును పొందింపజేయు మంత్రమునకు అపూర్వవిధి ద్వారా ఇతరనివృత్తి చెప్పబడు చున్నది. ఈ విషయమే తంత్ర వార్తికమునను చెప్పబడినది.

శ్లో. అప్రాప్తవిధి రేవాయ మతో మంత్రస్య నిశ్చయః
పరిసంఖ్యా ఫలే నోక్తా న విశేషః పునః శ్రుతేః.

అ. మరికొన్ని సందర్భములలో రాగమువలన నిత్యప్రాప్తమైన దానికి అప్రాప్తాంగ పూరణ లక్షణమగు నియమఫలము సైతము లేకపోవుటవలన నియమవిధి ద్వారా ఫలమును బట్టి పరి సంఖ్యావిధి యగును. ఎట్లనగా; "పంచ పంచనఖా భక్ష్యాః" (ఐదు గోళ్ళు కల జంతువులు ఐదుమాత్రము తినదగినవి) ప్రకృతమున రాగమును బట్టి నిత్యప్రాప్తమైన స్త్రీ సంగమాదికము నకు వివాహాది నియమముచే నభ్యనుజ్ఞద్వారా నివర్తనమే ఇష్టము.

శ్లో. విధి రత్యంత మప్రాప్తే నియమః పాక్షికే సతి,
తత్ర చాన్యత్ర చ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే.

1. అపూర్వవిధి యనగా ముందు ప్రాప్తించనట్టి ప్రయోజనమును ప్రాప్తింపజేయునది. ఉదా : వ్రీహులను ప్రోక్షింపవలెను. ప్రోక్షించినచో వ్రీహులకు ముందు లేనట్టి పారిశుద్ధ్యము చేకూరుచున్నది.

2. నియమవిధి — అప్రాప్తాంశమును పూరించునది. ధాన్యమును దంచి తండులము లను పొందవలెను. గోళ్ళతో ఒలిచి చేయరాదు.

3. పరిసంఖ్యావిధి – రెండింటిలో నొకదానిని గ్రహింపజేయునది. అశ్వరశన, గర్దభ రశన యను రెండింటిలో నశ్వరశనయే గ్రహింపవలెనని చెప్పునది.

శ్లో "ఋతుస్నాతాం తు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి,
ఘోరాయాం భ్రూణహత్యాయాం యుజ్యతే నాత్ర సంశయః."

"ఎవడు ఋతుస్నాతయగు భార్యను చేరి, సంగమ మాచరింపడో, వాడు ఘోరమైన భ్రూణ హత్యను చెందును. ఇందుకు సందేహము లేదు." అను దోషశ్రవణమే లేకపోవును కదా ! అనిన నిది దోషముకాదు. మనస్సునందు కామము కలిగియుండియు, భార్యయందు నభి రుచి లేకగాని, ద్వేషాదులచే గాని ఆమెను పొందని వానికి దోషశ్రవణము యుక్తమగు చున్నది.

అవ. ఈ ప్రకారము వ్యవాయములోనగు మనోరథములచే ఆకులత్వము పొందుట వలన, మానవులు అత్యంతము ఇష్టమైన పరమాత్మను గూర్చి వినరు అని చెప్పబడినది. ఇప్పుడు ధనము సైతము ధర్మము ద్వారా పరమాత్మ ప్రాపకమైనను, దృష్టములగు నుపభోగ ముల కొఱకు నా ధనమును విని యోగించుట వలన ఆత్మజ్ఞానగంధము సైతము లేదనుచున్నారు-

శ్లో. ధనం చ ధర్మైకఫలం యతోఽస్య జ్ఞానం సవిజ్ఞాన మను ప్రశాంతి.
గృహేషు యుంజంతి కళేబరస్య మృత్యుం న పశ్యంతి దురంతవీర్యమ్. **12**

అ. ధనం, చ, ధర్మ+ఏక ఫలం=ధనము ధర్మ మొక్కటే ముఖ్యఫలముగాగలది; యతః=ఏధర్మమువలన; సవిజ్ఞానం=అపరోక్షజ్ఞానముతోఁగూడిన దృఢఫలము నిచ్చునదై; అనుప్రశాంతి=వెనువెంటనే మోక్షరూపమగు గొప్పశాంతి; జ్ఞానం=పరోక్షజ్ఞానము కలుగు చున్నదో, అనగా ఇటువంటి ధనమును గృహేషు=గృహపశుదారాదులవిషయమున; కళేబరస్య (అర్థే)=తమశరీరము యొక్క సౌఖ్యము కొఱకు; యుంజంతి=వినియోగింతురు; దురంత వీర్యం=నిరంకుశమైన బలము గల: మృత్యుం=మృత్యువును; న పశ్యంతి=చూడరు.

తా. ధనము యాగాదిరూపమైన ధర్మము ముఖ్యఫలముగాఁ గలది. ఆ ధర్మమువలన అపరోక్షజ్ఞానము కలిగించునదైన పరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఆ పరోక్షజ్ఞానము కలిగిన తర్వాత యపరోక్షజ్ఞానము అనగా ఆత్మానుభవము కలిగి పిమ్మట పరమశాంతి, నిర్వాణరూప మైన నిత్యసుఖము కలుగున్నది. ఇట్టి పరంపరగా మోక్షసాధనమగు ధనమును గృహస్థులు గృహములందును పశు పుత్ర కళత్రాదులందును తమ దేహసౌఖ్యముకొఱకును సంపాదించి వినియోగింతురు. అనివార్యమై, బల్లిదమై వచ్చు మృత్యువును గాంచరు.

అవ. స్త్రీ సంగమాదుల యొక్క యభ్యనుజ్ఞ వేదవిహితమై యున్నందున యథేష్టముగా నాచరింపరాని దగును. మరేమనగా దానికి ఏ విధముగా ప్రయోజనము ఏర్పడినదో చెప్పు చున్నాఁడు-

శ్లో. యద్ఘ్రాణభక్షో విహిత స్సురాయా స్తథా పశో రాలభనం న హింసా,
ఏవం వ్యవాయః ప్రజయా న రత్యై ఇమం విశుద్ధం న విదు స్స్వధర్మమ్. **13**

అ. యత్ = ఎందువలన; సురాయాః = మద్యము యొక్క; ఘ్రాణభక్షః = నాసికచే మూర్కొనుట; విహితః = వేదవిహితమో, పానము చేయుట కాదో, తథా = ఆ ప్రకారము; పశోః = యాగపశువు యొక్క; ఆలభనం = విశసనము (వేదవిహిత మగుటచే); న, హింసా = హింస కాదు (దేవతల నుద్దేశించి పశువధ ఆలభన మనబడును).

శ్రుతి. "వాయవ్యగ్గ్ శ్వేత మాలభేత" 'తెల్లని పశువును వాయుదేవతాప్రీతికొఱకు ఆలంభించవలెను.' అను శ్రుతిని బట్టి ఇది హింస కాదు. శ్లో. 'యా వేదవిహితా హింసా న సా హింసేతి కీర్త్యతే', 'వేద విహితమైన హింస-హింస యని చెప్పబడదు.' అను వచనమును బట్టి భక్షించు నుద్దేశ్యముతోఁ జేయబడుచున్న పశుహింసయే హింసకాని ఆలభనము వేద విహితమగుటచే హింస కాదు. అందువలన, యథేష్టముగా భక్షణాభ్యనుజ్ఞ లేదు; ఏవం = ఈ ప్రకారము; వ్యవాయః = భార్యాసంగమము; ప్రజయా = సంతానము నిమిత్తము; విహితము; న రత్యై = కేవలము కామాభిలాష తీర్చుకొనుటకు గాదు; ఇమం = ఇటువంటి; విశుద్ధం = పరిశుద్ధమైన; స్వధర్మం = స్వధర్మమును; న విదుః = ఎఱుంగరు.

తా. సౌత్రామణి మొదలగు యాగములందు సురను మూర్కొనుటయే వేదవిహితము కాని పానము చేయుట కాదు. అట్లే కేవలము దేవత నుద్దేశించి యాదేవతాప్రీతికొఱకు పశువును ఆలభించుట వేదవిహిత మగుటచే నది హింస కాదు. కాని కేవలము జిహ్వాచాపలము దీర్చుకొనుటకై పశువధయే హింస యగును. అట్లే ఋతుకాలమునందు కేవలము సంతానము కొఱకగు భార్యాసంగమమే వేదవిహితము కాని, కామమగు రతి కాదు. ఇట్టి విశుద్ధములైన ధర్మములను ఆ కర్మవాదు లెఱుంగరు.

అవ. ఈ ప్రకారము భగవత్పరాఙ్ముఖులకు బహుదోషత్వము ప్రవచించి వారి నిష్ఠను అయిదు శ్లోకములచేత వివరించుచున్నారు-

శ్లో. యే త్వనైవంవిదోఽసంత స్స్తబ్ధా స్సదభిమానినః,
పశూన్ ద్రుహ్యంతి విస్రబ్ధాః ప్రేత్య ఖాదంతి తే చ తాన్. 14

అ. యే, తు = ఎవరయితే; అనైవంవిదః = విశుద్ధమైన స్వధర్మము ఇట్టిదని యెఱుంగనివారై; అసంతః = కామాసక్తులై; స్తబ్ధాః = అవినయవంతులై; సదభిమానినః = మిక్కిలి యహంకారము కలవారై; విస్రబ్ధాః = నిశ్శంకులై; దీనిచే మా మనోరథ మీడేరునని విశ్వసించినవారై; పశూన్ = పశువులను; ద్రుహ్యంతి = హింసించుచున్నారో; తే చ = ఆ హింసింపబడిన పశువులు: ప్రేత్య = పరలోకమందు: తాన్ = ఆ హింసకులను; ఖాదంతి = భక్షించుచున్నవి.

శ్లో. మాం స భక్షయితాఽముత్ర యస్య మాంస మిహాఽద్మ్యహమ్
ఏత న్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణః'

'మాంసభక్షయిత యగువాఁడు, దేని మాంసమును నేను తిందు ననుచున్నాఁడో వాడు ఆ పశువునకు, పరలోకమందు మాంస మగును.' అని విద్వాంసులు చెప్పుదురు.

తా. ఎవ్వరు ఇట్టి విశుద్ధమైన తమ ధర్మము నెఱుంగనివారై, యవినీతులై, దురహంకారులై, పశుమాంస భక్షణమే మాకు వాంఛనీయము అని విశ్వాసము కలిగి నిరంకుశులై పశువులను హింసించుచున్నారో, పరలోకమునందు వారిచే హింసింపబడిన పశువులు వారిని భక్షించును.

శ్లో. ద్విషంతః పరకాయేషు స్వాత్మానం హరి మీశ్వరమ్,
మృతకే సానుబంధేఽస్మిన్ బద్ధస్నేహాః పతం త్యధః. 15

అ. పరకాయేషు = ఇతర ప్రాణుల శరీరములందున్న: స్వాత్మానం = తమకు ఆత్మయైన: ఈశ్వరం = పరమేశ్వరుడైన; హరిం = విష్ణువును; ద్విషంతః = అభిచారికాది క్రియలచే హింసించుట ద్వారా ద్వేషించుచు; మృతకే = చనిపోవునట్టి స + అనుబంధే = పుత్రాదుల సంబంధము గల; అస్మిన్ = ఈ (తమ) శరీరమునందు; బద్ధస్నేహాః = దృఢస్నేహము గలవారై; అధః పతంతి = అధఃపతితు లగుదురు.

తా. ఇతర ప్రాణులను చంపుట ద్వారా వాని శరీరములందున్న వాడును, తమకును ఆత్మయైన పరమేశ్వరుడైన హరిని శత్రువని యెంచి ద్వేషించుచు, పుత్రాదులగువారి సంబంధము గలిగి, చనిపోవునట్టి, యీ శరీరమునందు మిక్కుటమగు నెయ్యము గలవారై, యధః పతితు లగుదురు.

అవ. అజ్ఞానులు తత్వజ్ఞులచేఁ గనికరింపబడినవారై తరింతురు తత్త్వజ్ఞులు స్వయముగాఁ దరింతు రనుచున్నారు-

శ్లో. యే కైవల్య మసంప్రాప్తాః యే వా నీతాశ్చ మూఢతామ్,
త్రైవర్గికా హ్యక్షణికా ఆత్మానం ఘాతయంతి తే. 16

అ. యే = ఎవరు: కైవల్యం = తత్త్వజ్ఞానమును; అసంప్రాప్తాః = పొందినవారు కారో; యే, వా = ఎవరు; మూఢతాం = మూఢత్వమును; ఆనీతాః = పొందింపబడినవారో, త్రైవర్గికాః = ధర్మార్థ కామములు ప్రధానముగా గలవారో; అక్షణికాః = క్షణము గూడ శాంతి రహితులో (దేహాదులందు స్థిరత్వబుద్ధి కలవారో); ఆత్మానం = స్వయముగా తమ్మును, పరమాత్మను; పరాజయంతి = చంపుకొనుచున్నారు. (ఆత్మఘాతుకు లనుట).

తా. ఎవరు తత్త్వజ్ఞానము పొందనివారో, ఎవరు అత్యంతము మూఢత్వము గలవారో, ఎవరు త్రివర్గముననే ప్రధానముగా ప్రవర్తించువారో, ఎవరు అశాంతహృదయులో లేక దేహములందు స్థిరత్వబుద్ధి కలవారో, వారు ఆత్మను పరమాత్మను హింసించుచు ఆత్మఘాతుకులు, ఆత్మజ్ఞానము లేనివారు నగుచున్నారు.

శ్లో. ఏత ఆత్మహనోఽశాంతా అజ్ఞానే జ్ఞానమానినః.
సీదం త్యకృతకృత్యా వై కాలధ్వస్తమనోరథాః. 17

అ. ఏతే = వీరు; ఆత్మహనః = ఆత్మను కప్పిపుచ్చువారు, ఆత్మఘాతుకులు; అశాంతాః = మనఃప్రశాంతి లేనివారు; అజ్ఞానే = అజ్ఞానదశయందు చేయు కర్మయందు; జ్ఞానమానినః = జ్ఞానమను అభిమానము కలవారు; కాలధ్వస్తమనోరథాః = కాలముచే ధ్వంసముచేయబడిన వాంఛలుకలవారు; అకృతకృత్యా వై = కృతకృత్యులు గాక; సీదంతి = నశింతురు.

తా. ఎవరు ఆత్మఘాతుకులై ఆత్మ నెఱుంగుటకు ప్రయత్నము చేయరో, అజ్ఞానకృతమైన కర్మను జ్ఞానమని యభిమానించుచు, గాలబలమున దమ కోరికలన్నియు విఫలముకాగా కృతకృత్యులుగాక పతితు లగుచున్నారు. శ్రు "అసుర్యా నామ తే లోకా అంధేన తమసా

వృతాః, తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే తే చాత్మహనో జనాః" – "ఎవరు ఆత్మజ్ఞానము లేనివారై యజ్ఞానులై మరణింతురో అవరు అసురసంబంధములై యజ్ఞానముతో గూడిన స్థావరాది జన్మములను పొందుదురు.

శ్లో. హిత్వా ప్రయాసరచితా గృహాపత్యసుహృచ్ఛ్రియః,
తమో విశంత్యనుచ్ఛావనం వాసుదేవపరాఙ్ముఖాః. **18**

అ. ప్రయాసరచితాః = శ్రమచే సంపాదింపఁబడిన; గృహ + అపత్య + సుహృత్ + శ్రియః = ఇల్లు, సంతానము, బంధువులు, సంపద యనువానిని; హిత్వా = వీడి; వాసుదేవపరాఙ్ముఖాః = విష్ణుభక్తులు కానివారు; అనుచ్ఛావనం = అంతము లేని; తమః = నరకమును; విశంతి = ప్రవేశించుచున్నారు.

తా. విష్ణుభక్తి లేనివారు తాము శ్రమపడి సంపాదించిన, యిల్లు, ఆలబిడ్డలు బంధువులు, సిరిసంపదలు అనువానిని వీడి, కడపట తీరని నరకమునకు లోనగుచున్నారు.

రాజోవాచ = రాజు పలికెను.

శ్లో. కస్మిన్కాలే స భగవా న్కింవర్ణః కీదృశో నృభిః,
నామ్నా వా కేన విధినా పూజ్యతే తదిహోచ్యతామ్. **19**

అ. సః + భగవాన్ = ఆ భగవంతుఁడు; కస్మిన్కాలే = ఏ కాలమునందు; కింవర్ణః = ఏ వర్ణము గలవాఁడు? కీదృశః = ఏ రూపము గలవాఁడు; నృభిః = నరులచే; కేన నామ్నా = ఏ పేరు చేత; కేన విధినా, వా = ఏ విధానము చేతను; పూజ్యతే = పూజింపబడుచున్నాడో; తత్ = దానిని; ఇహ + ఉచ్యతామ్ = ఇప్పుడు చెప్పుము.

ఏ కాలమునందు ఆ భగవంతుఁడు, ఏ వర్ణము, ఏ రూపము గలవాఁడై యుండును? మానవులు ఆ భగవంతుని ఏ నామమున, ఏ విధానమున బూజింతురో దానిని నాకు జెప్పుము. *

---

* సీ. హరిముఖబాహూరు వరపదాబ్జములందు వరుసఁ జతుర్వర్ణ వర్గసమితి
జనియించె; నందులో సతులును శూద్రులు హరిఁ దలఁతురు కలిహాయనముల
వేదశాస్త్రపురాణవిఖ్యాతు లయి కర్మకర్తలై విప్రులు గర్వమెసఁగ
హరిభక్తిపరులను హాస్యంబు సేయుచు నిరయంబు నొందుట నిజము గాదె;

తే. మృదులపక్వాన్నములను దా మెసఁగఁ గోరి
జీవహింసకుఁ జనువానిఁ జెందు వధము
హరి నుతింపక స్త్రీలోలుఁడైనవాడు
నరకవాసుండు నగుచుండు ననవరతము. 74

వ. అట్లు గావున గృహక్షేత్ర పుత్త్రికళత్ర ధనధాన్యాదులందు మోహితుండయి ముక్తిమార్గంబు లప్రత్యక్షంబు లని నిందించువాఁడును, హరిభక్తి విరహితుండును దుర్గతిం గూలుదురు; అని మునివరుం డానతిచ్చిన విదేహుం డిట్లనియె. 75

ఆ. ఏ యుగంబునందు నే రీతి వర్తించు
నెట్టి రూపువాఁడు నెవ్విధమున
మును నుతింపఁబడెను మునిదేవగణముచే
విష్ణుఁ డవ్యయుండు విశ్వవిభుడు. 76

కరభాజన ఉవాచ = కరభాజనుడు పలికెను.

శ్లో. కృతం త్రేతా ద్వాపరం చ కలి రిత్యేషు కేశవః,
నానావర్ణాభిధాకారో నానైవ విధి నేజ్యతే. **20**

అ. కేశవః = శ్రీహరి; కృత, త్రేతా, ద్వాపరం చ కలిః ఇతి = కృత త్రేతా, ద్వాపర కలి యుగములను; ఏషు = ఈ నాలుగు యుగములందు; నానావర్ణ + అభిధా + ఆకారః = వివిధములైన వర్ణములు, నామములు, రూపమును గలవాఁడై; నానావిధినా = వివిధములైన విధానముల చేత; ఇజ్యతే = పూజింపబడుచున్నాఁడు.

తా. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అను ఈ నాలుగు యుగములందును శ్రీహరి, నానావిధములైన వర్ణములు, రూపములు, నామములు గల వాఁడై యుండుచు మానవులచే నానావిధములైన మార్గములచే, పూజింపబడును.

శ్లో. కృతే శుక్ల శ్చతుర్బాహు ర్జటిలో వల్కలాంబరః,
కృష్ణా జినోపవీతాక్షాన్ బిభ్ర ద్దండకమండలూ. **21**

అ. కృతే = కృతయుగమునందు; శుక్లః = ధవళ వర్ణము గలవాఁడు; జటిలః = జడదారి; వల్కలాంబరః = నారచీరె కలవాఁడు; కృష్ణాజిన + ఉపవీత + అక్షాన్ = జింక చర్మము, జందెము, అక్షమాల అనువానిని; దండకమండలూ = దండకమండలములను, బిభ్రత్ = ధరిం చుచు; (బ్రహ్మచారి వలె నుండును.)

తా. కృతయుగమునందు విష్ణువు తెల్లనివర్ణము గలవాఁడును. నాలుగు చేతులు కల వాఁడును, జడలు దాల్చినవాఁడును, వల్కలములు ధరిం-నవాడును, జి కచర్మము, జందెము అక్షమాల, కమండలము అను వానిని ధరించిన వాడును అగుచు బ్రహ్మచారి వేషముననుండి పూజింపబడుచుండును.

శ్లో. మనుష్యాస్తు తదా శాన్తా నిర్వైరా స్సుహృదస్సమదర్శినః,
యజంతి తపసా దేవం శమేన చ దమేన చ. **22**

అ. తదా = ఆ కృతయుగమునందు; మనుష్యాస్తు = మానవులన్నచో; శాన్తాః = శాంతు లును; నిర్వైరాః = వైరము లేనివారు; సమదర్శినః (సంతః) = సమదర్శనులును అయి యుండుచు, దేవం = విష్ణువును తపసా = జ్ఞానముచేతను, శమేన, చ = మనో నిగ్రహముచేతను యజంతి = పూజింతురు.

తా. కృతయుగమునందు మానవులు శాంతచిత్తులై, వైరములేనివారు, సమదర్శనులై యుండుచు, మహావిష్ణువును జ్ఞానముచేతను, మనశ్శాంతిచేతను, ఇంద్రియనిగ్రహముచేతను పూజింతురు

శ్లో. హంస స్సుపర్ణో వైకుంఠో, ధర్మో యోగీశ్వరోఽమలః
ఈశ్వరః పురుషోఽవ్యక్తః పరమాత్మేతి గీయతే. **23**

అ. హంసః = విశుద్ధుడు; సుపర్ణః = చక్కని అవయవములు కలవాడు; వైకుంఠః = వికుంఠా తనయుడు; ధర్మః = ధర్మమును నిర్వహించువాడు; యోగేశ్వరః = యోగ నిర్వా

పాకుడు; అమలః = హేయవిరోధి, అవ్యక్తః = ప్రత్యక్షాదులచే తెలియబడనివాడు; పరమాత్మా = ముల్లోకములం దంతర్యామియై, నియామకుడై ధరించువాడు, ఇతి = అనునీ గుణములు కల; నామభిః = పేళ్ళచే; గీయతే = కీర్తింపఁబడుచున్నాడు.

తా. హంసుఁడు, సుపర్ణుఁడు, వైకుంఠుఁడు, ధర్ముఁడు, యోగీశ్వరుఁడు, అమలుఁడు, ఈశ్వరుఁడు, పురుషుఁడు, అవ్యక్తుఁడు, పరమాత్ముఁడు అని కృత యుగ మున కీర్తింపబడును.

శ్లో. త్రేతాయాం రక్తవర్ణోఽసౌ, చతుర్బాహు స్త్రిమేఖలః,
హిరణ్యకేశ స్త్రయ్యాత్మా స్రుక్స్రువాద్యుపలక్షణః. 24

అ. త్రేతాయాం = త్రేతాయుగమునందు; అసౌ = ఈ భగవంతుడు; రక్తవర్ణః = ఎఱ్ఱని వర్ణము గలవాఁడు; చతుర్బాహుః = నాల్గు బాహువులు గలవాఁడు; త్రిమేఖలః = త్రిగుణాత్మకమై దీక్షాంగమైన, ముప్పేట గల మొలత్రాడు గలవాఁడు, హిరణ్యకేశః = బంగారు వన్నె వెండ్రుకలు గలవాఁడు; త్రయ్యాత్మా = యజ్ఞమూర్తి; స్రుక్స్రువాది + ఉపలక్షణః = స్రుక్స్రువములు మొదలైన యజ్ఞ చిహ్నములు ధరించినవాడునై యుండును.

తా. త్రేతాయుగమునందు శ్రీవిష్ణువు ఎఱ్ఱని వర్ణమును, నాలుగు చేతులును, త్రిగుణాత్మకమై దీక్షాంగమైన ముప్పేట మొలత్రాడును, యజ్ఞస్వరూపమును గలవాఁడై స్రుక్స్రువములను యజ్ఞోపకరణములు చిహ్నములుగా ధరించి యుండును.

శ్లో. తం తదా మనుజా దేవం సర్వదేవమయం హరిమ్,
యజంతి విద్యయా త్రయ్యా ధర్మిష్ఠా బ్రహ్మవాదినః. 25

అ. తదా = ఆ త్రేతాయుగము నందు; సర్వదేవమయం = సర్వదేవతా స్వరూపుఁడైన; తం, హరిం, దేవం = ఆ విష్ణుదేవుని; మనుజాః = మానవులు: బ్రహ్మవాదినః = బ్రహ్మవాదులు; ధర్మిష్ఠాః = వేద ధర్మపరులును అగుచు; త్రయ్యా విద్యయా = వేదత్రయము నందు చెప్పబడిన కర్మలచేత; యజంతి = పూజింతురు

తా. ఆ త్రేతాయుగమునందు సర్వదేవతా స్వరూపుడైన శ్రీ మహావిష్ణువును, మానవులు, వేదధర్మపరులై వేదత్రయమునందుఁ జెప్పబడిన కర్మలచేఁ బూజింతురు.

శ్లో విష్ణు ర్యజ్ఞః పృశ్నిగర్భ స్సర్వదేవ ఉరుక్రమః,
వృషాకపి ర్జయంతశ్చ ఉరుగాయ ఇతీర్యతే 26

అ. యజ్ఞః = యజ్ఞ నిర్వాహకుడు; పృశ్నిగర్భః = పృశ్ని యను సాధ్వికిఁ బుత్రుడు; వృషాకపిః = తన్ను స్మరించువారికి అభీష్ట ములను వరించువాడు; లేక క్లేశములను కంపింప జేయువాఁడు; సర్వదేవః = సర్వదేవ స్వరూపుడును; ఉరుక్రమః = బహురీతుల సంచరించువాఁడు; వృషాకపిః = ధర్మతత్పరులైన వారిని కాపాడువాడు; జయంతః = సర్వదా జయమే కలవాఁడు ఇతి + ఈర్యతే = అని పేర్కొనబడును.

తా. విష్ణువు యజ్ఞుడు, సర్వదేవుడు, ఉరుక్రముడు, వృషాకపి, జయంతుడు, ఉరుగాయుడు అను పేరులచేఁ బిలువఁబడును.

శ్లో. ద్వాపరే భగవాన్ శ్యామః పీతవాసా నిజాయుధః.
శ్రీవత్సాదిభి రంకైశ్చ లక్షణై రుపలక్షితః. 27

అ. ద్వాపరే=ద్వాపరయుగమునందు; శ్యామః=నల్ల అగిసెపూవు వలె ఆకుపచ్చ లేక నీలవర్ణము గలవాఁడు; నిజాయుధః=తన యాయుధములైన శంఖ చక్రాదులు గలవాడు; శ్రీవత్సాదిభిః=వక్షము నందు దక్షిణ భాగమున (ప్రదక్షిణముగా) దిరిగిన వెంట్రుకలు గల శ్రీవత్సము అను పుట్టుమచ్చ, కర చరణాదులందలి పద్మము లోనగు; అంకైః=చిహ్నముల చేతను; లక్షణైః=బాహ్యములైన కౌస్తుభమణి లోనగువాని చేతను, ఉపలక్షితః=కూడిన వాఁడై (గోచరించును).

తా. ద్వాపరమునందు కృష్ణభగవానుఁడు, నీలమేఘ వర్ణమువాఁడును, పసుపువన్నె వస్త్రముగలవాఁడును, శంఖ చక్రాదుల ఆయుధములుగా ధరించినవాఁడును, శ్రీవత్సము, నాభి పద్మము, మొదలగు చిహ్నములు కలవాఁడును, కౌస్తుభాది బాహ్యలక్షణములు గలవాఁడును అయి కన్పట్టును.

శ్లో. తం తదా పురుషం మర్త్యా మహారాజోపలక్షణమ్,
యజంతి వేదతంత్రాభ్యాం పరం జిజ్ఞాసవో నృప. **28**

అ. తదా=ఆ ద్వాపర యుగమునందు, మర్త్యాః=మానవులు; మహారాజ+ఉపలక్షణం=ఛత్ర చామరాదులు లోనగు, మహారాజ లక్షణములు కల; పరం, పురుషం=ఆ పురుషోత్తముని, ఈశ్వరుని; జిజ్ఞాసవః=తెలియగోరుచున్నవారై; వేదతంత్రాభ్యాం=వైదిక శాస్త్రీయ విధానములతో; యజంతి=పూజింతురు.

తా. ఓ రాజా ! ద్వాపరయుగమునందు మానవులు ఛత్రచామరములతో గూడ మహా రాజలక్షణములతో గూడియున్న యా పరమేశ్వరుని, యీశ్వరునిఁ దెలియఁగోరుచు వేదవిధానమునను, ఆగమవిధానమునను పూజింతురు.

శ్లో. నమస్తే వాసుదేవాయ నమ స్సంకర్షణాయ చ
ప్రద్యుమ్నా యానిరుద్ధాయ తుభ్యం భగవతే నమః. **29**

శ్లో. నారాయణాయ ఋషయే పురుషాయ మహాత్మనే,
విశ్వేశ్వరాయ విశ్వాయ సర్వభూతాత్మనే నమః. **30**

అ. పై రెండు శ్లోకములకు అర్థము సుగమము.

తా. ఓ పురుషోత్తమా ! వాసుదేవుఁడవగు నీకు నమస్కారము. సంకర్షణుఁడ వగు నీకు నమస్కారము. ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, భగవంతుఁడు నగు నీకు నమస్కారము. నారాయణఋషి, పురుషుఁడు, మహాత్ముఁడు, విశ్వేశ్వరుఁడు, విశ్వుఁడు, సర్వభూతాత్ముఁడు నగు నీకు నమస్కారము.

శ్లో. ఇతి ద్వాపర ఉర్వీశ స్తువంతి జగదీశ్వరమ్,
నానాతంత్రవిధానేన కలావపి యథా శృణు. **31**

అ. ఉర్వీశ=ఓ రాజా !; ఇతి=ఈ ప్రకారముగా; ద్వాపరే=ద్వాపర యుగమునందు; జగదీశ్వరం=జగన్నాథుని; స్తువంతి=స్తోత్రము చేయుదురు; కలౌ+అపి=కలియుగము నందును; నానాతంత్ర విధానేన=వివిధములైన తంత్ర శాస్త్రమార్గములతో; యథా=ఏప్రకారము (పూజింతురో); శృణు=వినుము,

తా. ఓ రాజా ! ద్వాపరయుగమునందు, జగన్నాధుని ఈ ప్రకారము స్తుతింతురు కలియుగమం దన్ననో, వివిధములైన తంత్రమార్గములచే నే విధముగఁ బూజింతురో చెప్పెదను వినుము.

శ్లో. కలౌ కృష్ణం త్విషా కృష్ణం సాంగోపాంగాస్త్రపార్షదమ్,
యజ్ఞై స్సంకీర్తనప్రాయై ర్యజంతి హి సుమేధసః. **32**

అ. కలౌ = కలియుగమునందు; త్విషా = కాంతిచేతను; కృష్ణం = ఇంద్ర నీలమణి వలె ప్రకాశించుచు; స + అంగ + ఉపాంగ + అస్త్రపార్షదం = అంగములైన హృదయాదులతోను; ఉపాంగములయిన కౌస్తుభాదులతోను, అస్త్రములైన సుదర్శనాదులతోను, నందాదులగు పార్షదుల తోడను గూడినటువంటివాఁడైన; కృష్ణం = కృష్ణావతారమును; ఇట్లను టచే గలియుగమునందు శ్రీ కృష్ణావతారము నకుఁ బ్రాధాన్యముఁ దెలుపుచున్నారు: సంకీర్తనము ప్రధానముగాఁ గల; యజ్ఞైః = అర్చనల చేత; సుమేధసః = వివేకులు; యజంతి = పూజించుచున్నారు.

తా. కలియుగమునందు, ఇంద్రనీలమణి వలె ప్రకాశించు నీలవర్ణమైన శరీరముఁగల వాఁడును, హృదయాది అంగములు, కౌస్తుభాది యుపాంగములు, సుదర్శనాది యస్త్రములు, నందాది పార్షదులు, అను వారలతోఁ గూడిన శ్రీకృష్ణుని. వివేకవంతులు నామసంకీర్తనము, స్తుతి ప్రధానముగాఁగల అర్చనలచేఁ బూజింతురు.

శ్లో. ధ్యేయం సదా పరిభవఘ్న మభీష్టదోహం
తీర్థాస్పదం శివవిరించినుతం శరణ్యమ్,
భృత్యార్తిహం ప్రణతపాల భవాబ్ధిపోతం
వందే మహాపురుష తే చరణారవిందమ్. **33**

అ. ప్రణతపాల = భక్తులను పాలించువాఁడా ! ; మహాపురుష = పురుషోత్తమా !; సదా = ఎల్లప్పుడు; ధ్యేయం = ధ్యానము చేయఁదగినదియు: పరిభవఘ్నం = ఇంద్రియములచే నగు తిరస్కారముమ పోనడంచునదియు; అభీష్ట దోహం = మనోరథములను పూరించునదియు; తీర్థాస్పదం = గంగాది తీర్థములకు నాశయమగుటచేతఁ బరమ పావనమైనదియు; భృత్యార్తిహం = భృత్య మాత్రులైన వాని దుఃఖముమ పోగొట్టునదియు: భవాబ్ధిపోతం = సంసార సాగరమును, తెప్పయై దాటించునదియును అగు; తే, చరణారవిందం = నీ పాద పద్మములనుఁ గూర్చి; వందే = నమస్కరించుచున్నాను.

ఓ భక్తపాలకా ! ఓ మహాపురుషా ! నిరంతరము ధ్యానింపఁదగినదై; యింద్రియోద్రేకమును హతమార్చునదై, యభీష్టములను కురియునదై; గంగాది తీర్థములకు నాశ్రయమైనందున బరమపావన మైనదై, శివబ్రహ్మాదులచే స్తుతింపబడినదై, నాశ్రయయోగ్యమై యనగా సుఖాస్పదమై, భృత్యుఁడైనంత మాత్రమునవే వాని దుఃఖములను పోనడంచునదై సంసారసాగరమును తెప్పయై దాటించునదగు నీ పాదపద్మమునకు నమస్కరించుచున్నాము.

అవ. భగవంతుడు స్వయముగనే యాప్తకాముఁడు, నిరపేక్షుఁడునై యున్నను భక్తుల కొఱకు అపేక్షగలవాఁ డగుచున్నా డని శ్రీరామచంద్రుని స్తుతించుచున్నారు—

శ్లో. త్యక్త్వా సుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్యవచసా యదగా దరణ్యమ్,
మాయామృగం దయిత యేప్సిత మన్వధావత్
వందే మహాపురుష తే చరణారవిందమ్. 34

అ. మహాపురుష = ఓ మహాపురుషా!; యః = ఎవఁడు; సుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం = అన్యులఁ కుదృజింపశక్యము కానిదియు, దేవతలకు సయితము వాంఛింపదగినదియునగు రాజ్యలక్ష్మిని; త్యక్త్వా = త్యజించి; ధర్మిష్ఠః = ధర్మాత్ముడై; ఆర్యవచసా = తండ్రియైన దశరథుని వచనముచే; అరణ్యం + అగాత్ = అరణ్యమునకు పోయెనో; దయితయా = ప్రియురాలైన సీతచేత (ప్రేరితుడై); మాయామృగం = బంగారు వన్నెగల మాయలేడిని; అన్వధావత్ = వెంబడించి పోయెనో; ఆ దశరథరామ రూపుడవైన నీయొక్క; చరణారవిందం = పాద పద్మములను; వందే = నమస్కరించుచున్నాను.

తా. ఓ మహాపురుషా ! ఎవడు త్యజింపశక్యముగాని, దేవతలు వాంఛింపఁదగిన రాజ్యలక్ష్మిని త్యజించి, ధర్మాత్ముడై తండ్రియైన దశరథుని మాటమీద నరణ్యములకుఁ బోయెనో, యట్టి శ్రీరాముడవై యున్న నీ పాదపద్మములకు నమస్కారముఁ జేయుచున్నాను.

శ్లో. ఏవం యుగానురూపాభ్యాం భగవా న్యుగవర్తిభిః,
మనుజై రిజ్యతే రాజన్ శ్రేయసా మీశ్వరో హరిః. 35

అ. రాజన్ = ఓ రాజా ! ఏవం = ఈప్రకారము; యుగానురూపాభ్యాం = ఆ యా యుగములకుఁ దగిన నామరూపములతో; భగవాన్ = భగవంతుడు; శ్రేయసాం ఈశ్వరః = శ్రేయస్సులను గూర్చ సమర్థుడయిన; హరిః = హరి; యుగవర్తిభిః = ఆయాయుగములందు వర్తించు; మనుజైః = మనుజులచేత; ఇజ్యతే = పూజింపబడుచున్నాడు.

తా. ఓ రాజా ! ఈ ప్రకారము భగవంతుడు, భక్తులకు వాంఛితముల నిచ్చి శ్రేయస్సు గలిగించు ప్రభువు అగు శ్రీహరి – ఆ యా యుగములకు దగినట్టి నామరూపములు గలిగి యుండుచు, నా యా యుగములందు వర్తించు మానవులచేతఁ బూజింపబడుచున్నాడు.

శ్లో. కలిం సభాజయం త్యార్యా గుణజ్ఞా స్సారభాగినః,
యత్ర సంకీర్తనేనైవ సర్వై స్స్వార్థో హి లభ్యతే. 36

అ. ఆర్యాః = పెద్దలు; గుణజ్ఞాః = కలిగుణములు తెలిసినవారు; సారభాగినః = గుణాంశములనే గ్రహించువారును అగుటచే; కలిం = కలియుగమును; సభాజయంతి = ఆదరించుచున్నారు; యత్ర = ఏ కలియుగమునందు; సర్వైః = ఎల్లరచేతను; సంకీర్తనేన + ఏవ = నామ సంకీర్తనముచేతనే; స్వార్థః = స్వప్రయోజనము; లభ్యతే హి = పొందబడుచున్నదో.

తా. కలి ఎన్నో దోషములు కలదైనను దాని గుణములను తెలిసినవారు, సారమైన గుణమునే గ్రహించువారు నగు పెద్దలు, కలియుగమును ఎంతో శ్లాఘింతురు. ఎందుకనఁ ఈ కలియందు ఎల్లరు నామసంకీర్తనము చేతనే తమ యభీష్టమును పొందగలుగుచున్నారు కదా !

విశేషము. ఓయీ ! కలి పెక్కు దోషములు కలది యగుటవలన నెట్లు శ్లాఘింతు రనగా కలిగుణము లెఱింగినవారు దోషములను పరిత్యజించి గుణములనే గ్రహించుచున్నారు. ఆ గుణమేమి ? ఎట్టిది ? అనగా

శ్లో. ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞై స్త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్.

కృతయుగమునందు జ్ఞానముచేతను, త్రేతాయుగమునందు యజ్ఞములచేతను, ద్వాపరమునందు పూజలచేతను ఏ ఫలమును పొందుచున్నారో కలియుగమునందు సంకీర్తనలచే దానిని పొందుచున్నారు.

శ్లో. న హ్యతః పరమో లాభో దేహినాం భ్రామ్యతా మిహ,
యతో విందేత పరమాం శాంతిం నశ్యతి సంసృతిః. **37**

అ. ఇహ = ఈ లోకమునందు; భ్రామ్యతాం = సంసారమునందు భ్రమించు; దేహినాం = మానవులకు; అతః = ఈ నామసంకీర్తనముకంటె; పరమః + లాభః = ఉత్తమలాభము, న హి = లేదు; యతః = ఏ సంకీర్తనమువలన; పరమాం, శాంతిం = ఉత్తమమైన మనశ్శాంతిని; విందేత = పొందునో; సంసృతిః = సంసారబంధము; నశ్యతి = నశించునో;

తా. ఈ లోకమున సంసారమునందు భ్రమించు మానవులకు హరినామసంకీర్తనముకంటె నుత్తమమైన లాభములేదు. ఆ సంకీర్తనము వలననే యుత్తమమైన శాంతి లభ్యమగుచున్నది. సంసారబంధము నశించుచున్నది.

శ్లో. కృతాదిషు ప్రజా రాజన్ కలా విచ్ఛంతి సంభవమ్,
కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః. **38**

అ. రాజన్ = ఓ రాజా ! కృతాదిషు = కృతయుగము లోనగుయుగములందున్న; ప్రజాః = ప్రజలు; కలౌ = కలియుగమునందు; సంభవం + ఇచ్ఛంతి = పుట్టుకను కోరుదురు; కలౌ = కలియుగమునందు; నారాయణపరాయణాః = విష్ణుభక్తులు; భవిష్యంతి, ఖలు = కాగలరుకదా.

తా. కలియుగమునందు నామసంకీర్తనము వలననే విష్ణుభక్తులు సులభముగా నగుదురు అని కృత త్రేతా ద్వాపరములందున్న ప్రజలు కలియుగమునందు జన్మింపగోరుచున్నారు. *

---

*వ. అనిన విని, యందుఁ గరభాజనుం డిట్లనియె; నానావతారంబులును, నానారూపంబులును, బహువిధవర్ణంబులునుం గలిగి, రాక్షసులను సంహరించి, దుష్టజన నిగ్రహంబును, శిష్టజన పరిపాలనంబునుం జేయుచుం, గృతయుగంబున శుక్లవర్ణుండై చతుర్బాహుండై జటావల్కల కృష్ణాజినోత్తరీయ జపమాలికాదండకమండలుధరుండై, హరి, నిర్మల తపోధ్యానానుష్ఠానగరిష్ఠులైన పురుషశ్రేష్ఠులచేత, హంసుండు, సుపర్ణుండు, వైకుంఠుండు, ధర్ముండు, అమలుండు, యోగీశ్వరుండు, పురుషుండు, అవ్యక్తుండు, పరమాత్ముండు, అను దివ్యనామంబులం బ్రసిద్ధి వహించి, మొదటి యుగంబున, గణుతింపబడు; త్రేతాయుగమున రక్తవర్ణుండై, బాహుచతు

(తరువాయి 91 పుట చూడుడు.)

శ్లో. క్వచిత్ క్వచిత్ మహారాజ ద్రవిడేషు చ భూరిశః,
తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ. 39

శ్లో. కావేరీ చ మహాపుణ్యా ప్రతీచీ చ మహానదీ,
యే పిబంతి జలం తాసాం మనుజా మనుజేశ్వర,
ప్రాయో భక్తా భగవతి వాసుదేవేఽమలాశయాః. 40

అ. మహారాజా! ద్రవిడేషు = ద్రవిడజనపదములందు; క్వచిత్ + క్వచిత్ = అచ్చటచ్చట భూరిశః = అధికముగా; యత్ర = ఏ జనపదములందు; తామ్రపర్ణీ = తామ్రపర్ణీనది; పయస్వినీ = పవిత్రజలములుకల; కృతమాలా = కృతమాలానది: మహాపుణ్యా = మిగులపవిత్రమైన; కావేరీ చ = కావేరియు; ప్రతీచీ + చ = పశ్చిమమునందు; మహానదీ + చ = మహానదియు నున్నవో మనుజేశ్వర = రాజా! యే మనుజాః = ఏ మానవులు; తాసాం జలం = ఆ నదుల జలమును; పిబంతి = గ్రోలుచున్నారో, వారు; ప్రాయః = తఱచుగా; భగవతి వాసుదేవే = భగవంతుడైన వాసుదేవునియందు; అమలాశయాః = స్వచ్ఛమైనభావముకలవారై; భక్తాః + భవంతి = భక్తులగుచున్నారు.

తా. ఓ మహారాజా! ద్రవిడజనపదంబులందు, అచ్చటచ్చట ఎక్కువగా తామ్రపర్ణి యను నది, నిర్మల జలములు గల కృతమాలానది, పరమపావనమైన కావేరీనది. పశ్చిమదిశ నుండి వచ్చు మహానది యను పుణ్యనదులు గలవు. ఓ నరేంద్రా! ఏ మానవులు ఆ నదుల జలమును పానము చేయుచున్నారో వారు తఱచుగా భగవంతుడైన వాసుదేవునియందు శుద్ధ సాత్త్వికభావముగల భక్తు లగుచున్నారు.

శ్లో. దేవర్షిభూతాప్తనృణాం పితౄణాం న కింకరో నాయ మృణీ చ రాజన్,
సర్వాత్మనా యశ్శరణం శరణ్యం గతో ముకుందం పరిహృత్య కర్తమ్, 41

అ. రాజన్ = ఓ రాజా; యః = ఎవడు; కర్తం పరిహృత్య = కర్తవ్యమైన కర్మను పరిహరించి; సర్వాత్మనా = త్రికరణశుద్ధిగా; శరణ్యం = ఆశ్రయయోగ్యుడైన; ముకుందం = శ్రీహరిని; శరణం గతః = శరణుపొందినవాఁడో; అయం = ఇతడు; దేవర్షిభూతాప్తనృణాం = దేవత

(90 వ పేజీ తరువాయి)

ష్కమేఖలాత్రయవిశిష్టుండై హిరణ్యకేశుండును, వేదత్రయస్వరూపుండును, స్రుక్స్రువాద్యుపలక్షణ శోభితుండును నై, విష్ణు యజ్ఞ పృశ్నిగర్భ సర్వదేవోరుక్రమ వృషాకపి జయంతోరుగాయాఖ్యల బ్రహ్మవాదులచేత నుతియింపంబడు; ద్వాపరంబున శ్యామలదేహుండును, పీతాంబరధరుండును, బాహుద్వయోపశోభితుండును, దివ్యాయుధధరుండును శ్రీవత్సకౌస్తుభ వనమాలికావిరాజమానుండును, మహారాజోపలక్షణుండునునై జనార్దన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ ఋషి పురుష, మహాత్మ, విశ్వనారాయణ విశ్వరూప సర్వభూతాత్మకాది నామంబుల వెలసి, మూర్ధాభిషిక్తులచేత సన్నుతింపంబడు; కలియుగంబునఁ గృష్ణవర్ణుండును గృష్ణనామకుండునునై భక్తసంరక్షణార్థంబు పుండరీకాక్షుండు వివిధయజ్ఞంబులచే సంకీర్తనాదులచేతఁ బ్రస్తుతింపంబడు; హరి, రామ, నారాయణ, నృసింహ, కంసారి నళినోదరాది బహువిధనామములచే బ్రహ్మవాదులును, మునీంద్రులును నుతియింపుదురు; మఱియును,

లకు, ఋషులకు, ప్రాణులకు, బంధువులకు; పితౄణాం = పితృదేవతలకు; ఋణీ = ఋణముగ లవాఁడు; న = కాడు, అందువలననే, కింకరః న చ = వారికి కింకరుడై వారికొఱకు పంచయజ్ఞాదులను చేయువాడును కాడు.

తా. ఎవ్వడు విష్ణుభక్తుడు కాడో, వాఁడు దేవతలకు, ఋషులకు, నరులకు, బంధువులకు, పితృదేవతలకు ఋణపడినవాఁడును, కింకరుడును అగుచున్నాడు. ఎవడు కర్తవ్యమైన కర్మను పరిహరించి, యాశ్రయింపదగిన శ్రీహరిని త్రికరణశుద్ధిగా బూర్తిగా శరణు పొందుచున్నాఁడో, యా భక్తుఁడు దేవర్షులకు బితృదేవతలకు ఋణపడినవాఁడు గాడు. పంచమహాయజ్ఞకర్తయై వారికి కింకరుడు కాడు.

అవ. విష్ణుభక్తుడు వేదవిహితమైన కర్మచేయఁ బనిలేదని చెప్పి, యిప్పుడు నిషేధ కర్మనిమిత్తమైన ప్రాయశ్చిత్తమును చేయవలదని దాని నివృత్తిని చెప్పుచున్నారు —

శ్లో. స్వపాదమూలం భజతః ప్రియస్య త్యక్తాన్యభావస్య హరిః పరేశః,
వికర్మ యచ్చోత్పతితం కథంచి ద్ధునోతి సర్వం హృది సన్నివిష్టః. 42

అ. త్యక్తాన్యభావస్య = (దేహాదులయందును, ఇతర దేవతలయందును) త్యజింపబడిన స్నేహాదికము కలిగినవాఁడు కనుకనే యతనికి నిషేధకర్మయందు నివృత్తి కర్మ సంభవింపదు. ఒకవేళ ప్రమాదవశమున నిషేధప్రవృత్తి కలిగినచో అందుకు జెప్పుచున్నాఁడు— స్వపాదమూలం, భజతః = తన పాద సాన్నిధ్యమును జేరి భజించుచున్న; ప్రియస్య = భక్తుని యొక్క; హృది సన్నివిష్టః = హృదయమునందు నిల్చినవాడై; పరేశః = ఇతరులగు యమాదులను శాసించువాఁడగు; హరిః = శ్రీహరి; యత్ + చ = ఏది; వికర్మ = నిషిద్ధకర్మయే; కథంచిత్ ఉత్పతితం = ప్రమాదవశమున బుట్టినను; సర్వం = ఆ కర్మనంతను; ధునోతి = పోగొట్టుచున్నాఁడు.

తా. దేహమునందును, ఇతర దేవతలయందును అభిమానము వదలి తన పాదసామీప్యమును జేరి భజించు భక్తుని హృదయమునందు, యమాదిదేవతలను నియమించు నీశ్వరుఁడైన హరి సన్నిహితుడై నిలిచి ప్రమాదవశముచే ఆ భక్తుడు చేసిన నిషిద్ధకర్మను గూడ పోగొట్టుచున్నాడు.

నారద ఉవాచ = నారదుడు వచించెను.

శ్లో. ధర్మాన్ భాగవతా నిత్థం శ్రుత్వా స మిథిలేశ్వరః,
జాయంతేయా న్మునీ న్ప్రీత స్సోపాధ్యాయో౽భ్యపూజయత్. 43

అ. సః మిథిలేశ్వరః = ఆ మిథిలాపతి; ఇత్థం = ఈ ప్రకారము; భాగవతాన్ + ధర్మాన్ = భాగవత ధర్మములను; శ్రుత్వా = విని; మునీన్, జాయంతేయాన్ = మునులైన జయంతీ పుత్రులను; ప్రీతః = సంతోషించినవాడై; సోపాధ్యాయః = ఉపాధ్యాయులతో గూడినవాడై; అభ్యపూజయత్ = పూజించెను.

తా. ఆ మిథిలాధిపతి భాగవతధర్మములను ఈ ప్రకారము విని, సంతోషమును పొంది, యుపాధ్యాయునితోఁ గూడుకొని మునులైన యా జయంతీపుత్రులగు కవి లోనగువారినిఁ బూజించెను.

శ్లో. తతోఽంతర్దధిరే సిద్ధా స్సర్వలోకస్య పశ్యతః,
రాజా ధర్మా నుపాతిష్ఠ న్నవాప పరమాం గతిమ్. **44**

అ. తతః=అంతట; సిద్ధాః=సిద్ధులైన యా జయంతీపుత్రులు; సర్వలోకస్య పశ్యతః= ఎల్లప్రజలు చూచుచుండఁగా; అంతర్దధిరే=అంతర్ధానమై పోయిరి; రాజా=ఆ ప్రభువు నిమి; ధర్మాన్, ఉపాతిష్ఠన్=భాగవత ధర్మముల ననుష్ఠించుచు, పరమాం గతిం=పరమపదమును; అవాప=పొందెను.

తా. అంత జయంతీపుత్రులైన సిద్ధులు, ఎల్లవారు చూచుచుండఁగనే మాయమై పోయిరి. ఆరాజు నిమి భాగవతధర్మముల ననుష్ఠించుచు విష్ణుపదమును పొందెను.*

శ్లో. త్వ మప్యేతాన్ మహాభాగ ధర్మాన్ భాగవతాన్ శ్రుతాన్,
ఆస్థిత శ్శ్రద్ధయా యుక్తో నిస్సంగో యాస్యసే పరమ్. **45**

అ. మహాభాగ=ఓ పూజ్యుడా! త్వం+అపి=నీవును; శ్రుతాన్, భాగవతాన్ ధర్మాన్ =వినిన భాగవత ధర్మములను; ఆస్థితః=అనుష్ఠించుచు; శ్రద్ధయా యుక్తః=శ్రద్ధతో గూడు కొన్నవాఁడవై; నిస్సంగః=ఏ సంగము లేనివాడవై; పరం, యాస్యసే=పరమపదముఁ బొందఁగలవు.

తా. పూజ్యుడవైన యో రాజా! నీవును, వినిన భాగవత ధర్మములను శ్రద్ధతో నను ష్ఠించుచు యోగ్యుడవై, సంగరహితుండవై పరమపదమును పొందగలవు.

అవ. ఈ ప్రకారము శాస్త్ర ప్రక్రియఁ జెప్పబడినది. మీరు మాత్రము సంగము వలననే కృతార్థు లైతి రనుచున్నాడు—

---

* తే. ద్రవిడదేశంబు నందులఁ దామ్రపర్ణి
సహ్యజాకృతమాలాది సకలనదుల
నెవ్వఁ డేనియు భక్తితో నేగి యచట
బొదలి తర్పణ మొగిఁ జేయఁ బుణ్య మొదవు. 78

వ. ఇవ్విధంబునం బ్రశంసింపదగిన కావేర్యాదిమహానదీ పావన జలస్నాన పాన దానంబు లను; విష్ణుధ్యానకథా, సుధారసానుభవంబుల న్నిరూఢులగు భాగవతోత్తములు గలిగి రేనియుం బెడనిపదంబు బొందుదురు, అని ఋషభకుమారులు భగవత్ప్రతిబింబంబు లయిన పరమ పురుషులువోలె విదేహజనపాలునకు నిఃశ్రేయసపదప్రాప్తికరంబు లయిన భగవద్భక్తిధర్మంబు లుపదేశించి యంతర్ధానంబు నొందిరి; మిథిలేశ్వరుండును సుజ్ఞానయోగం బంగీకరించి నిర్వాణ పదంబు నొందె; ఈ యుపాఖ్యానంబు వ్రాసిన బఠించిన వినిన నాయురారోగ్యైశ్వర్యంబులు గలిగి పుత్త్రపౌత్రవంతు లయి సకలకలికల్మషరహితులై విష్ణులోకనివాసు లగుదురు; అని నార దుండు వసుదేవునకుం జెప్పి మఱియు.

శ్లో. యువయోః ఖలు దంపత్యో ర్యశసా పూరితం జగత్,
పుత్రతా మగమ ద్య ద్వాం భగవా నీశ్వరో హరిః. 46

అ. యత్ = ఏ కారణమువలన; భగవాన్ః ఈశ్వరః, హరిః = భగవంతుడు, ఈశ్వరుడగు హరి; వాం = మీ యొక్క; పుత్రతాం = పుత్రుఁడగుటను; అగమత్ = పొందెనో (అందువలన); దంపత్యోః + యువయోః = దేవకీ వసుదేవులను దంపతులైన మీ యొక్క; యశసా = కీర్తిచేత; జగత్ పూరితం = జగము నిండించబడినది.

తా. భగవంతుఁడు, ఈశ్వరుఁడు, హరి మీకుఁ బుత్రుఁడై జనించినందువలన దేవకీ వసుదేవు లను దంపతులైన మీ కీర్తి జగమంతయు నిండియున్నది.

అవ. పుత్రుని లాలించుటవలననే మీకు భాగవతధర్మముల సర్వస్వము ప్రాప్తించినది కనుక సర్వకర్మలను సమర్పించుట లోనగు భాగవతధర్మములచే నితరుల వలె మీరు సత్త్వసిద్ధి కలిగించుకొన బనిలే దనుచున్నారు—

శ్లో. దర్శనాలింగనాలాపశయనాసనభోజనైః,
ఆత్మా వాం పావితః కృష్ణే పుత్రస్నేహం ప్రకుర్వతోః. 47

అ. దర్శనాలింగనాలాపశయనాసనభోజనైః = దర్శించుట, యాలింగనము చేసికొనుట, సంభాషించుట, శయనించుట, కూర్చుండుట, భుజించుట యనువానిచే; కృష్ణే = కృష్ణునియందు; పుత్రస్నేహం ప్రకుర్వతోః = ఇతడు మా పుత్రుడని ప్రేమించుచున్న; వాం + ఆత్మా = మీ యొక్క ఆత్మ; పావితః = శోధితమైనది.

తా. మీరు కృష్ణుని దర్శనము చేయుట, యాలింగనము చేయుట, సంభాషించుట పరుండుట, కూర్చుండుట, భుజించుట మొదలగు క్రియలచే నితఁడు మా పుత్రుఁడని శ్రీకృష్ణుని ప్రేమించుటచేతనే మీకు సత్త్వసిద్ధి కలిగి మీ యాత్మ పావనమైనది.

అవ. దీనినే కైముతికన్యాయముచే స్పష్టము చేయుచున్నారు—

శ్లో. వైరేణ యం నృపతయ శ్శిశుపాల పౌండ్ర
సాల్వాదయో గతివిలాసవిలోకనాద్యైః,
ధ్యాయంత ఆకృతధియ శ్శయనాసనాదౌ
తత్సామ్య మాపు రనురక్తధియాం పునః కిమ్. 48

అ. శిశుపాల పౌండ్రసాల్వాదయః = శిశుపాలుఁడు, పౌండ్రకుఁడు, సాల్వుఁడు మొదలగు రాజులు: యం = ఏ కృష్ణుని; వైరేణ = వైరముచేత; గతివిలాసవిలోకనాద్యైః = గమనము, సౌందర్యము, చూపులు మొదలగువానిచేత; ఆకృతధియః = ఆయా యాకారకమైన బుద్ధిగలవారై; శయనాసనాదౌ = శయనించుట, కూర్చుండుట మున్నగు కృత్యములందు; ధ్యాయంతః = ధ్యానించుచున్నవారై; తత్సామ్యం = ఆకృష్ణుని సారూప్యమును, ఆపుః = పొందిరి; అనురక్తధియాం = ఆ కృష్ణుని యందు అనురాగము పొందినవారికి; కిం, పునః = సారూప్యము కలుగునని మరియేమి చెప్పనగును; అనగా తప్పక సారూప్యము కలుగునని భావము.

తా. శిశుపాలుడు, పౌండ్రకుఁడు, సాల్వుఁడు మొదలగు రాజులు కృష్ణుని ద్వేషించి పగ బూని కృష్ణుని యొక్క గమనము, సౌందర్యము, ఆలోకనము మొదలగువాని యాకారము పొందిన బుద్ధిగలవారై, శయనించునప్పుడు, కూర్చుండునప్పుడును, ఆ కృష్ణునే ధ్యానించుచు ఆ భగవంతుని సారూప్యమును పొందిరి. మఱి యా కృష్ణునందు అనురక్తమగు బుద్ధి గల వారికి ఆ కృష్ణుని సారూప్యము కలుగునని వేరుగ చెప్పవలయునా ? తప్పక కలుగును.

అవ. "పుత్రప్రేమయే మోక్షహేతు వైనచో నందులు మోక్షము పొందవచ్చును గదా?" యన్నచో నందులకుఁ జెప్పుచున్నాఁరు—

శ్లో. మాఽపత్యబుద్ధి మకృథాః కృష్ణే సర్వాత్మనీశ్వరే,
మాయామనుష్యభావేన గూఢైశ్వర్యే పరేఽవ్యయే. **49**

అ. గూఢ+ఐశ్వర్యే=నిగూఢమైన విభూతులు గలవాడైన; పరే=పరమాత్ముడై; అవ్యయే=నాశరహితుఁడై; మాయామనుష్యభావేన=లీలామానుషవిగ్రహుఁడై ప్రవర్తించు; సర్వాత్మని=సర్వాత్ముడైన; ఈశ్వరే=ఈశ్వరుఁడైన; కృష్ణే=కృష్ణునియందు; అపత్య బుద్ధిం=నా పుత్రుడు ఇత డను భావమును; మా కృథాః=చేయకుఁము.

తా. నిగూఢమైన విభూతులు గలిగి పరుఁడై, యవ్యయుఁడై, సర్వాత్ముఁడై, యీశ్వరుఁడై, లీలామానుష విగ్రహుఁడై ప్రవర్తించు కృష్ణునియందు "ఇతడు మా పుత్రు"డను భావము వలదు.

అవ. ఓయీ! ఈశ్వరుఁడు మనుష్యుఁ డెట్లగును? జగత్సృష్టి లోనగునవి చేయు నితడు పూతనాదులను సంహారము చేయుట నెట్టాశ్చర్యకరమగు కృత్యముగా పేర్కొనుచున్నారు అనగా నందులకుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. భూభారాసురరాజన్యహంతవే గుప్తయే సతామ్,
అవతీర్ణస్య నిర్వృత్యై యశో లోకే వితన్యతే. **50**

అ. భూభారాసురరాజన్యహంతవే=భూమికి భారమైన యసురులైన రాజులను వధించుటకును; సతాం గుప్తయే=సాధువులను రక్షించుట కొఱకును; నిర్వృత్యై=మోక్షము కొఱకును; అవతీర్ణస్య=అవతరించిన కృష్ణుని యొక్క; యశః=కీర్తి; లోకే=లోకము నందు; వితన్యతే=విస్తరించబడుచున్నది.

తా. భూమికి భారమై జనించిన యసురులగు రాజులను హతమార్చుటకును, సాధువులను రక్షించుటకును, మోక్షము నిచ్చుటకును అవతరించిన శ్రీకృష్ణుని కీర్తి లోకమంతయు విస్తరించియున్నది.

శ్రీశుక ఉవాచ = శ్రీ శుకులు వచించిరి.

శ్లో. ఏతత్ శ్రుత్వా మహాభాగో వసుదేవోఽతివిస్మితః,
దేవకీ చ మహాభాగా జహతు ర్మోహ మాత్మనః. **51**

అ. ఏతత్=ఇట్లు నారదుడు చెప్పిన విషయమును; శ్రుత్వా=విని; అతివిస్మితః=మిగుల నాశ్చర్యపడిన; వసుదేవః=వసుదేవుడును; మహాభాగా=మహాభాగ్యవతియగు; దేవకీ చ=

దేవకియు, భగవంతుని యందు పుత్రత్వరూపమగు; ఆత్మనః = తమ యొక్క; మోహం = అజ్ఞానమును; జహతుః = వీడిరి.

తా. ఇదియంతయు విని, మహాభాగుఁడైన వసుదేవుఁడును, పూజ్యురాలైన దేవకియు మిగుల నచ్చెరు వొందినవారలై, తమకు గల యజ్ఞానమును వీడిరి.

శ్లో. ఇతిహాస మిమం పుణ్యం ధారయే ద్య స్సమాహితః,
స విధూ యేహ శమలం బ్రహ్మభూయాయ కల్పతే. 52

అ. యః = ఎవడు; సమాహితః = చిత్తసమాధానముఁ గలవాడై; ఇమం, పుణ్యం = ఈ పావనమైన వృత్తమును; ధారయేత్ = ధరించుచున్నాఁడో; సః = అతడు; ఇహ = ఈ జన్మము నందే; శమలం, విధూయ = మోహమును పోగొట్టుకొని; బ్రహ్మభూయాయ కల్పతే = బ్రహ్మత్వము నందుచున్నాడు.

తా. ఎవడు చిత్త సమాధానముఁ గలిగి యీ పావనమైన చరిత్రమును మనస్సునందు నిలుపుకొనుచున్నాఁడో వాడీ జన్మముననే అజ్ఞానమును పోగొట్టుకొని బ్రహ్మభావము నందుచున్నాఁడు *

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే పంచమోఽధ్యాయః.
ఇది శ్రీమద్భాగవతమునందు, ఏకాదశస్కంధమున
నయిదవ అధ్యాయము సంపూర్ణము.

---

* సీ. కమలాక్షపదభక్తి కథనముల్ వసుదేవ ! విని యఘంబులఁ బాసి వెలసి తీవు
భువన ప్రసిద్ధిగాఁ బొలుపొందు సత్కీర్తి కైవల్య లక్ష్మియుఁ గలుగు మీఁద
నారాయణుండు నీ నందనుండను మోహ మేడలించి విష్ణుఁగా నెఱిఁగి కొలువు
మతఁడు నీ తనయుడై యవతరించుటఁ జేసి సిద్ధించె దేహసంశుద్ధి నీకు.

తే. సరససల్లాప సౌహార్ద సౌష్ఠవమునఁ
బావనం బైతి; శిశుపాల పౌండ్ర నరక
మురజరాసంధ యవనులు మదముతోడ
వాసుదేవునిఁ జేరిరి వైరు లయ్యు.

కం. దుష్టజన నిగ్రహంబును
శిష్ట ప్రతిపాలనంబు సేయన్ హరి దా
సృష్టి నవతార మొందెను
స్రష్ట్రృ ముఖానేక దివిజ సంఘము వొగడన్, 81

వ. అట్లు గావున లోక రక్షణార్థంబు కృష్ణుం డవతార మెత్తె; అన హరిభక్తిపరంబులగు నుపాఖ్యానంబులు నారదుం డుపన్యసించిన విని విస్మితచిత్తులై దేవకీవసుదేవులు కృష్ణునిం బరమాత్మునిగా విచారించిరి; అని శుకుండు రాజునకుం జెప్పిన నతండును – "మునీంద్రా ! యదువుల నే ప్రకారంబున హరి హరియించె. సపరివారులగు బ్రహ్మరుద్రేంద్రదిక్పాలక మునీంద్రులు ద్వారకా నగరప్రవేశం బెట్లు చేసిరి; ఏమయ్యె, మఱియుం బరమేశ్వర కథామృతంబు వీనులలరం జవిగొనియు నింకం దనివి సనదు; భక్తరక్షకుండగు హరి చారిత్రం బే రీతిం జాఁగె; తద్వ్యాప్తి వృత్తాంతం బంతయు వెలింగింపుము; అనిన శుకుం డిట్లనియె.

# షష్ఠాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. షష్ఠే బ్రహ్మాదిభిః స్తుత్వా గంతుం విజ్ఞాపితం హరిమ్,
ఉద్ధవః ప్రార్థయామాస స్వధామ నయ మా మితి.

ఈ షష్ఠాధ్యాయమందు బ్రహ్మాదిదేవతలచే స్వస్థానమునకు పోవుటకు స్తుతింపఁబడిన కృష్ణుని చేరి ఉద్ధవుఁడు—'శ్రీకృష్ణా! నన్ను గూడ నీతో నీస్థానమునకు గొనిపొమ్ము అని ప్రార్థించెను' అను వృత్తము వర్ణింపబడును.

అవ. ఇందుమీదట ఆత్మవిద్యను సవిస్తరముగా నిరూపించుటకు ముందు దాని ప్రస్తావన చెప్పుచున్నారు—

శ్లో. అథ బ్రహ్మాఽఽత్మజై ర్దేవైః ప్రజేశై రావృతోఽభ్యగాత్,
భవశ్చ భూతభవ్యేశో యయౌ భూతగణై ర్వృతః. **1**

అ. అథ=విప్రశాపము నామోదించిన పిమ్మట: బ్రహ్మ=చతుర్ముఖుఁడు; దేవైః= ఇంద్రాది దేవతలతోడను; ప్రజేశైః=ప్రజాపతులగు మరీచి మున్నగువారితోడను; ఆత్మజైః =పుత్రులగు సనకాదులతోడను; ఆవృతః=పరివృతుడై; (ద్వారకాం) అభ్యగాత్= ద్వారకకు పోయెను; భూతభవ్యేశః=భూత భవిష్యత్కాలములందు ప్రభువగు; భవః చ= రుద్రుఁడును; భూతగణైః వృతః=ప్రమథగణములతో గూడినవాడై; యయౌ=(ద్వారక) కేగెను.

తా. అనంతరము బ్రహ్మ ఇంద్రాదిదేవతలతో, మరీచ్యాది ప్రజాపతులతో, సనకాది పుత్రులతో గూడి ద్వారకకు పోయెను. భూతభవిష్యత్కాలములయందు ప్రభువగు శివుడు భూతగణములతో నటకు వెడలెను.

శ్లో. ఇంద్రో మరుద్భి ర్భగవా నాదిత్యా వసవోఽశ్వినౌ,
ఋభవోఽంగిరసో రుద్రా విశ్వే సాధ్యాశ్చ దేవతాః. **2**

శ్లో గంధర్వాప్సరసో నాగాః సిద్ధచారణ గుహ్యకాః
ఋషయః పితరశ్చైవ సవిద్యాధరకిన్నరాః,
ద్వారకా ముపసంజగ్ముః సర్వే కృష్ణదిదృక్షవః. **3**

అ మరుద్భిః=మరుత్తులతో కూడి; భగవాన్ ఇంద్రః=భగవంతుడగు దేవేంద్రుడు, ఆదిత్యాః, వసవః, అశ్వినౌ=ఆదిత్యులు, వసువులు, అశ్వినులు; ఋభవః, అంగిరసః, రుద్రాః=ఋభువులు, అంగిరసులు, రుద్రులు; విశ్వే, సాధ్యాః చ దేవతాః=విశ్వేదేవతలు,

సాధ్యాః; ఋషయః పితరః చ ఏవ=ఋషులు, పితరులు, సవిద్యాధరకిన్నరాః = విద్యాధరులు, కిన్నరులతో గూడినవారైన; సర్వే=ఎల్లరును; కృష్ణదిదృక్షవః=కృష్ణుని చూడఁ గోరినవారై; ద్వారకాం ఉపసంజగ్ముః=ద్వారకను చేరిరి.

తా. దేవేంద్రుఁడు, మరుత్తులు, ఆదిత్యులు, వసువులు, అశ్వినులు, ఋభువులు, అంగిరసులు, రుద్రులు, విశ్వేదేవతలు, సాధ్యులు, ఋషులు, పితరులు, విద్యాధరులు, కిన్నరులు, ఎల్లరును కృష్ణుని చూడగోరి ద్వారక కేగిరి.

అవ. ఓయీ ! ఆయింద్రాదిదేవతలు ఉపేంద్రాదిరూపమునను్న (వామనమూర్తిని) భగవంతుని దర్శించుదురే. వారలకి కృష్ణుని దర్శింప మిక్కుటమగు కోరిక ఏల? అనగా చెప్పుచున్నారు—

శ్లో. వపుషా యేన భగవా న్నరలోకమనోరమః,
యశో వితేనే లోకేషు సర్వలోకమలాపహమ్. 4

అ. భగవాన్; యేన వపుషా=ఏ శరీరముతో; నరలోకమనోహరః=మనుష్యలోకమునకు మనోహరుఁడై, సుందరుఁడై యుండుచు; లోకేషు=లోకములందు; సర్వలోకమల+అపహం=ఎల్ల జనుల పాపమును పోగొట్టునదైన; యశః, వితేనే=కీర్తిని విస్తరించెనో; (ఆ అతి సుందరమైన మూర్తిని చూచుటకు పోయిరి. అని భావము.)

తా. భగవంతు డే శరీరముతో నరలోకమున మనోహరుడై ఎల్ల జనుల పాపము నడఁప జాలు కీర్తిని వ్యాపింపజేసెనో ఆ మహాసౌందర్యమూర్తిని చూచుట కింద్రాదులు ద్వారక కేగిరి.

శ్లో. తస్యాం విభ్రాజమానాయాం సమృద్ధాయాం మహర్ధిభిః,
వ్యచక్ష తావితృప్తాక్షాః కృష్ణ మద్భుతదర్శనమ్. 5

అ. మహర్ధిభిః = గొప్ప సంపదలచే; సమృద్ధాయాం = సమృద్ధిమంతమై; విభ్రాజమానాయాం=తేజరిల్లుచున్న; తస్యాం=ఆ ద్వారక యందున్న; అద్భుత దర్శనం, కృష్ణం=వింత గొలుపురూపుగల కృష్ణుని; అవితృప్తాక్షాః=తనివి నొందని ఇంద్రియములు గలవారై; వ్యచక్షత=వీక్షించిరి.

తా. సకల సంపదలతో నిండి సమృద్ధిమంతమైన ద్వారకయందు నివసించుచున్న అచ్చరువుగొలుపు సౌందర్యముగల శ్రీకృష్ణుని తనివినొందని చక్షురాదీంద్రియములుగలవారై ఆ ఇంద్రాదులు దర్శించిరి.

శ్లో. స్వర్గోద్యానోద్భవై ర్మాల్యై శ్ఛాదయంతో యదూద్వహమ్,
గీర్భి శ్చిత్రపదార్థాభి స్తుష్టువు ర్జగదీశ్వరమ్. 6

అ. యదూద్వహం=యదుకుల శ్రేష్ఠుడగు కృష్ణుని; స్వర్గ+ఉద్యాన+ఉద్భవైః = స్వర్గమునందు నందనోద్యానమున జనించిన; మాల్యైః = కల్పవృక్ష ప్రసూన మాలికలచే, ఛాదయంతః=కప్పుచు; చిత్రపదార్థాభిః=సంకెలలవలె బంధించు పదములు, అర్థములుగల; గీర్భిః=వాక్కులచే; జగదీశ్వరం=ఆ జగన్నాథుని; తుష్టువుః=స్తుతించిరి.

తా. స్వర్గమున నందనోద్యానమునఁ బుట్టిన కల్పవృక్షపుష్పమాలికలచే పూజించుచు ఆ ఇంద్రాదులు యదుకులశ్రేష్ఠుడు జగన్నాథుడగు శ్రీకృష్ణుని సారవంతములైన పదములు, అర్థములు గల వాక్కులతో స్తుతించిరి.

దేవా ఊచుః = దేవతలు పలికిరి.

శ్లో. నతాః స్మ తే నాథ పదారవిందం
బుద్ధీంద్రియప్రాణమనోవచోభిః,
య చ్చింత్యతేఽంతర్హృది భావయుక్తై
ర్ముముక్షుభిః కర్మమయోరుపాశాత్. **7**

అ. నాథ = ఓ ప్రభూ; బుద్ధీంద్రియప్రాణ మనోవచోభిః — బుద్ధీంద్రియ = దర్శనాది క్రియలు గల జ్ఞానేంద్రియములచేతను; ప్రాణ = బలమిచ్చు ప్రాణముచేతను; మనస్-వచోభిః = మనస్సుచేతను; వాక్కులచేతను; తే పదారవిందం = నీ యొక్క పాదపద్మములను గూర్చి; నతాః స్మః = దండప్రణామములు చేయుచున్నాము; యత్ = ఏ నీ పాదపద్మము; కర్మమయ + ఉరుపాశాత్ = కర్మరూపమైన గొప్ప పాశమునుండి; భావయుక్తైః = భక్తియుక్తులగు; ముముక్షుభిః = మోక్షార్థులచే; అంతర్హృది = హృదయములోపల; చింత్యతే = చింతింపబడు చున్నదో; దర్శింపబడలేదో; (అట్టి నీ పాదారవిందమును చూచి నమస్కరించితిమి. ఔరా! మా భాగ్య మెంత దొడ్డది).

తా. ఓ ప్రభూ! దర్శనాదిక్రియలుగల చక్షురాదులగు జ్ఞానేంద్రియములచేత, శక్తి నిచ్చు ప్రాణముచేతను, మనోవాక్కులచేతను, నిన్ను స్తుతించుచు మేము నీ పాదారవిందము నకు దండప్రణామము చేయుచున్నాము. ఔరా! మా అదృష్టము ఎంత దొడ్డది! కర్మరూప మైన గొప్ప పాశమునుండి బంధవిముక్తిని గోరు నీభక్తులు సద్భావయుక్తులై హృదయములో పల నీ పాదపద్మములను ధ్యానించుచుందురు, గాని దర్శింపజాలరు. అట్టి నీ పాదపద్మమును మేము దర్శింపగలిగితిమి. మా భాగ్యము ఎంతయో మిన్నగదా!

అవ. ఓయీ నేనును దృష్టాదృష్ట కర్మల నాచరించుచుంటిని కదా! సపాతదృష్టములైన వివాహాదులను, అదృష్టములైన యజ్ఞాదికర్మలను చేయుచున్నాను గదా. అట్టి నా పాదారవిం దచింతనము కర్మపాశమునుండి విడుదల గోరు వారేల చేయుచున్నారు. అనగా అందుకు చెప్పుచున్నారు—

శ్లో. త్వం మాయయా త్రిగుణయాఽఽత్మని దుర్విభావ్యం
వ్యక్తం సృజ స్యవసి లుంపసి తద్గుణస్థః,
నైతై ర్భవా నజిత ! కర్మభి రజ్యతే వై
యః స్వే సుఖేఽవ్యవహితేఽభిరతోఽనవద్యః. **8**

అ. హే అజిత = ఓ జయింపబడనివాడా; నీ విపు డొనర్చు స్వల్పమగు కర్మ పటుండ నిమ్ము. త్వం = నీవు; త్రిగుణయా మాయయా = త్రిగుణాత్మకమైన మాయతో గూడి; ఆత్మని = మనస్సునందు; దుర్విభావ్యం = ఊహించుటకు శక్యముగాని; వ్యక్తం = మహదాది ప్రపంచ మును; తద్గుణస్థః = ఆ మాయ యొక్క గుణములందు నియంతవై యుండుచు; సృజసి, అవసి, లుంపసి = సృజించుచు, రక్షించుచు, లయము చేయుచున్నావు; మఱియు; భవాన్ = నీవు; ఏతైః, కర్మభిః = ఈ కర్మలచే; న + అజ్యతే = లిప్తుఁడవు కావు; ఎందువలన? యః = ఏ నీవు;

అనవద్య=రాగాదిరహితుఁడవై; అవ్యవహితే=అనావృతమగు; స్వే సుఖే=ఆత్మస్వరూప మైన సుఖమునందు; అభిరతః = ఆసక్తుఁడవో, (ఇందువలన నీవు కర్మను చేయుచున్న వాడవయ్యు ఆత్మారాముడవైన పరమేశ్వరుఁడవని ముముక్షువులచే ధ్యానింపబడుచున్నావు).

తా. నీవు త్రిగుణాత్మకమైన మాయతోఁ గూడి మనస్సుచే నూహింపశక్యముగాని మహత్తత్త్వము, పంచభూతములు లోనగు వానితోఁ గూడిన ప్రపంచమును సృజించుచు పాలించుచు లయము చేయుచున్నావు. మాయాగుణమునందు నియంతవైయుండుచు ఈ సృష్ట్యాది కర్మలచే నంటఁబడవు. మఱి నీవు రాగాదిరహితుఁడవై అనావృతమైన ఆత్మస్వరూపసుఖము నందు ఆసక్తుడవైయుందువు. అందువలన కర్మచేయుచున్నవాడవై యున్నను ఆత్మారాముఁడు పరమేశ్వరుఁడగు నిన్ను ముముక్షువులు ధ్యానించుచున్నారు.

అవ. ఆత్మారామునకు కర్మకరణముచే నేమి ప్రయోజనము అనగా చెప్పుచున్నారు.

శ్లో. శుద్ధి ర్నృణాం న తు తథేడ్య దురాశయానాం
విద్యాశ్రుతాధ్యయనదానతపఃక్రియాభిః,
సత్త్వాత్మనా మృషభ తే యశసి ప్రవృద్ధ
సచ్ఛ్రద్ధయా శ్రవణసంభృతయా యథా స్యాత్. 9

అ. హే ఈడ్య=స్తుతింపఁదగినవాడా; ఋషభ=కోర్కెలు నొసంగువాడా! దురాశయానాం=ఐహికాదులందు అనురక్తులైన; నృణాం=నరులకు; విద్యా, శ్రుత+అధ్యయన, తపః, క్రియాభిః=ఉపాసన, శ్రవణము, దానము, తపస్సు, యజ్ఞాదికర్మలు లోనగు వానిచే; శుద్ధిః=నిష్కల్మషత్వము; న, తు, తథా=ఆప్రకారము కాదు; సత్త్వాత్మనాం=సత్త్వమూర్తియైన శ్రీహరియందు మనస్సుగలవారికి, శుద్ధాంతఃకరణులకు, తే, యశసి=నీ కీర్తియందు, నీ కథయందు; శ్రవణసంభృతయా=శ్రవణముచే పరిపుష్టమై ప్రవృద్ధమైన; సత్+శ్రద్ధయా=ఉత్తమశ్రద్ధచే; యథా స్యాత్=ఏ ప్రకారము నిర్దోషత్వము కలుగునో అట్లు; (ఈ ప్రకారము పరమపావనమైన యశస్సును విస్తరించుటకు నీవు కర్మ నాచరింతువు అని భావము).

తా. ఓ శ్లాఘనీయుడా! ఇష్టప్రదుడా! యశఃప్రకాశకములగు నీస్తోత్రాదులను నిరంతరము శ్రవణము చేయుటచే సత్పురుషుల యుత్తమ శ్రద్ధ మఱింత వృద్ధినందుచున్నది. ఆ శ్రద్ధచే వారు మిగుల పవిత్రు లగుచున్నారు. విషయలోలను లెంతగా ఉపాసన, శ్రవణ, వేదాధ్యయన, దాన, తపో యజ్ఞాదుల నొనర్చినను వారి కట్టి శుద్ధి కలుగుటలేదు.

అవ. అందువలన ఈ ప్రకారము వర్ధిల్లు ఉత్తమశ్రద్ధయే శుద్ధిహేతువు కాని మాచే నైనచో నీ పాదము దర్శింపఁబడినది అని యిట్లనుచున్నాడు—

శ్లో. స్యా న్న స్తవాంఘ్రి రశుభాశయ ధూమకేతుః
క్షేమాయ యో మునిభి రార్ద్రహృదోహ్యమానః,
యస్సాత్వతైః స్సమవిభూతయ ఆత్మవద్భి
ర్వ్యూహేఽర్చిత స్సవనశ స్స్వరతిక్రమాయ. 10

అ. తవ+అంఘ్రిః=నీ పాదము; నః=మా యొక్క; అశుభాశయధూమకేతుః = విషయవాసనలకు దాహకము అగును; ఎట్టిదై అనగా; యః = ఏ నీ పాదము; క్షేమాయ=

మోక్షముకొఱకు; మునిభిః=ముముక్షువులచే; ఆర్ద్రహృదా=ప్రేమార్ద్రమైన మనస్సుచే; ఊహ్యమానః = చింతింపబడుచున్నదో; యః=ఏది; సాత్వతైః=భక్తులచే; సమవిభూతయే= సమానమైన ఐశ్వర్యము కొఱకు; వ్యూహే =శ్రీ వాసుదేవాది చతుర్వ్యూహమందు; అర్చితః =పూజింపబడునో; ఆత్మవిద్భిః= ఆత్మవిదులైన పండితులచే; స్వరతిక్రమాయ=స్వర్గము నతిక్రమించి వైకుంఠప్రాప్తి కొఱకు; సవనశః=త్రికాలము; అర్చితః=పూజింపబడినదో.

తా. నీ పాదము విషయవాసనలను దహించుచున్నది. మునులు ప్రేమచే మెత్తబడిన మనస్సుతో నీ పాదమును ధ్యానించుచున్నారు. నీ భక్తులు సమానమైన ఐశ్వర్యము కొఱకు, నీ సారూప్యము కొఱకు వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణాత్మకమగు చతుర్వ్యూహోపాసనయందు నీ పాదమును పూజించుచున్నారు. అట్టి నీ భక్తులందు కొందఱాత్మవిదులు, ధీరులు, పండితులు స్వర్గము నతిక్రమించి వైకుంఠప్రాప్తికొఱకు త్రికాలములందు నీ పాదమును పూజించుచున్నారు.

శ్లో. య శ్చింత్యతే ప్రయతపాణిభి రధ్వరాగ్నౌ
త్రయ్యా నిరుక్తవిధి నేశ హవి ర్గృహీత్వా,
అధ్యాత్మయోగ ఉత యోగిభి రాత్మమాయాం
జిజ్ఞాసుభిః పరమభాగవతైః పరీష్టః. **11**

అ. (మఱియు) ఈశ = హే ప్రభూ! యః=ఏ నీ పాదము; ప్రయతపాణిభిః = కేవల వైదికకార్యముల నాచరించుటలో తత్పరములైన చేతులుకల యాజ్ఞికులచే; హవిః, గృహీత్వా=హవిస్సు గ్రహింపబడి; అధ్వరాగ్నౌ, ఆహవనీయాదికమగు అధ్వరాగ్ని యందు; చింత్యతే = చింతింపబడుచున్నదో.

శ్రు. "యస్యై దేవతాయై హవి ర్గృహీతం స్యాత్తాం దేవతాం ధ్యాయే ద్వషట్కరిష్యన్" "ఏ దేవత కొఱకు హవిస్సు గ్రహింపబడుచున్నదో ఆ దేవతను వషట్కారము చేయబోవుచు ధ్యానించవలెను" అను వచనము వలన ఆ యా దేవతలు గదా చింతింపబడుదురు. అందుకు చెప్పుచున్నారు—

త్రయ్యా = వేదముచే; నిరుక్తవిధినా = చెప్పబడిన విధిచే, ఇంద్రాది రూపమున యజ్ఞపురుషుడే చింతింపబడుచున్నాడు అని అర్థము; ఉత = మఱియును; అధ్యాత్మయోగే = ఆత్మను యథాస్థితముగ నెఱుగుట యను యోగమునందు; ఆత్మమాయాం = అణిమాదిరూపమగు మాయను; జిజ్ఞాసుభిః = తెలియగోరుచున్న; యోగిభిః = యోగులచే గూడ; ఆయా కోరికలతో, చింత్యతే =ఏది చింతింపబడుచున్నదో, పరమ భాగవతైః=ఉత్తమ భక్తులచే, జీవన్ముక్తులచే; పరీష్టః = సర్వవిధముల పూజింపబడుచున్నదో.

తా. ఓ ప్రభూ! వైదికకార్యాచరణమునందే తత్పరములైన హస్తములుకల యాజ్ఞికులు, హవిస్సును గ్రహించి, అధ్వరాగ్నియగు ఆహవనీయమునం దుంచుచు ఏ నీ పాదమునే ధ్యానించుచున్నారో (వారు ఇంద్రాది రూపమున ధ్యానించు దేవతాస్వరూప మంతయు యజ్ఞపురుషుడవు నీవే అయి యున్నావని భావము.) ఆత్మయొక్క యాథాత్మ్యజ్ఞానరూపమగు యోగమునందు అణిమాది విభూతుల నాకాంక్షించుచు యోగులును ఏ నీ పాదమును ధ్యానించు

చున్నారో జీవన్ముక్తులగు పరమభాగవతులచే మాత్రము సర్వవిధముల పూజింపబడున దేదియో, ఆ నీ పాదము మాయొక్క విషయవాసనలను హతమార్చుగాక! అని పూర్వశ్లోకముతో అన్వయము.

అవ. ఈ విధముగా చెప్పబడిన మునులు, సాత్త్వతులు లోనగు అఱు విధములగు నీ సేవకులలో పరమభాగవతులపై లక్ష్మియందుకంటె నీ కధికప్రీతి అని స్తుతించుచున్నారు—

శ్లో. పర్యుష్టయా తవ విభో వనమాలయేయం
సంస్పర్ధినీ భగవతీ ప్రతిపత్నివ చ్ఛ్రీః,
యః సుప్రణీత మముయాఽర్హణ మాదదా న్నో
భూయా త్సదాంఘ్రి రశుభాశయధూమకేతుః. 12

అ. ఇయం = ఈ; భగవతీ శ్రీః = లక్ష్మీదేవి; పర్యుష్టయా = తనతోఁ గూడియున్న; వనమాలయా = వైజయంతీ మాలతో; ప్రతిపత్నివత్ = సవతి వలె; సంస్పర్ధినీ = ఈర్ష్యగలది; భవతి = అగుచున్నది; అట్లు ఈర్ష్యపడు లక్ష్మిని అదరింపక; యః = ఏ నీవు; అముయా = పూర్వము ధరించినదైన యీ వనమాల చేత, భక్తుల చేత నిది యర్పింపఁబడినదని ప్రీతి చేత; సుప్రణీతం = చక్కఁగా సంపాదింపబడునట్లుగా; అర్హణాం = పూజను; ఆదదాత్ = స్వీకరించితివి; అట్టి ; తవ అంఘ్రిః = నీ పాదము; నః = మాకు; అశుభాశయధూమకేతుః = మా దుష్టవాసనలను హతమార్చునది యగుగాక.

విశేషము. భగవంతుడు యశస్సుపై ప్రీతికలవాడు కాన భగవంతుని ధ్యానించువారికంటెను, పూజించువారికంటెను ఆయన యశస్సును పెంపొందింపజేయుటలో నత్యంతాసక్తులైనవారే కృతార్థు లని యందురు. వనమాల భగవంతుని సర్వాంగమునను వ్యాపించి, ప్రకాశించుచు స్వామి సౌందర్యరూపమగు యశస్సు నినుమడింపజేయుచు, స్వామి వక్షఃస్థలమున నొకభాగముననే నెలకొనియున్న లక్ష్మీదేవి కసూయ కలిగించుచున్నది. అట్లయ్యును, వేదములను తుమ్మెదలచే బహుప్రకారముగా వర్ణితమై కీర్తిమయమైన వైజయంతి యను వనమాల చేతనే నీవు చక్కఁగా కల్పింపబడిన పూజను స్వీకరించుచున్నావు. అట్టి నీ పదములు మా దుష్టవాసనల నంతమొందించుగాక!

అవ. నీ పాదమునకు భక్తపక్షపాతము ప్రసిద్ధమే యని స్తుతించుచుఁ బ్రార్థించుచున్నారు—

శ్లో. కేతు స్త్రివిక్రమయుత స్త్రిపతత్పతాకో
య స్తే భయాభయకరోఽసురదేవచమ్వోః,
స్వర్గాయ సాధుషు ఖలే ష్వితరాయ భూమన్
పాదః పునాతు భగవన్ భజతా మఘం నః. 13

అ. భూమన్ = ఓ భూమానందరూపా! మిగుల దొడ్డవాఁడా!; భగవన్ = ఓ భగవానుఁడా!; యః = ఏ; త్రివిక్రమయుతః = బలిబంధనము నందు మూఁడు విక్రమములతోఁ (అడుగులు వేయుటతో) గూడుకొన్నది; అందుఁ ద్వితీయవిక్రమమునందు సత్యలోకమును ప్రాఁచినది. (చాలా యున్నతమైనది) కేతుః = మిక్కిలి యున్నతమగు విజయధ్వజము వలె

నున్నదియు; త్రిపతత్పతాకః = మూడు విధములుగ లేదా మూడు లోకములందును ప్రసరించు గంగానది పతాకముగ కలది; అసుర దేవ చమ్వోః = రాక్షసులు, దేవతల సేనలకు; భయాభయకరః = క్రమముగా భయమును, అభయమును కలిగించునది; సాధుషు = సాధువులైన దేవతల యందు; స్వర్గాయ = స్వర్గము కొఱకును; ఖలేషు = దుష్టులైన అసురుల యందు; ఇతరాయ = అధోగతికిని; యః = (ఏ పాదము) కేతురూపము వందినదో, అట్టి; తే పాదః = నీ పాదము; భజతాం = సేవించునట్టి; నః = మా యొక్క; అఘం = పాపమును; పునాతు = శోధించుగాక; సేవించు మమ్ములను పాపము నుండి తొలగించి పవిత్రులను చేయుగాక !

శ్రుతి: చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరతి దుష్కృతాని
తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మాన మరాతిం తరేమ,
లోకస్య ద్వార మర్చిమ త్పవిత్రం జ్యోతిష్మ ద్భ్రాజమానం మహస్వత్
అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం నో లోకే సుధితాం దధాతు.

భగవంతుని యే చరణము పవిత్రమై, విస్తరించినదై, సనాతనమై యున్నదో, యే చరణముచే పురుషుడు పవిత్రుడై పాపములను గడచుచున్నాడో, అట్టి పవిత్రము; పరిశుద్ధమగు పాదముచే పవిత్రులమై మహాపాపమను శత్రువును దాటెదము. స్వర్గలోకమునకు ద్వారభూతము, జ్వాలలు కలది, పవిత్రమైనది, జ్యోతులు కలది, మిక్కిలి ప్రకాశించుచున్నది, అమృత ధారలను వర్షించుచున్నదగు ఆ చరణ మీ లోకమున మాకు సద్బుద్ధి నొసగు గాక !

తా. ఓ భూమానందరూపా! బలిబంధన సమయమునం దేది మూడు విక్రమములు కలిగి యున్నదో, ద్వితీయ విక్రమమునందు స్వర్గమును పొందినదో, మూడులోకములందును ప్రవహించు గంగయే పతాకముగా కలదియో, అట్టి విజయధ్వజమైన నీ పాదకేతువు అసురసేనకు భయమును, దేవసేనకు అభయమును కలిగించుచున్నదో సాధువులైన దేవతలకు స్వర్గమును, దుష్టులైన యసురులకు నధోగతిని ప్రాప్తింపజేయుచున్నదో, యా నీ పాదమను కేతువు నిన్ను లేక తన్ను సేవించు మా పాపముం బోనడంచి మమ్ములఁ బవిత్రులఁ జేయుగాక.

అవ. ఓయీ! యుద్ధమునందు దేవాసురులు లోనగువారు పరస్పరము జయించుచున్నారు. ఓడుచున్నారు. అందు నాతో నేమిపని యందువా? అందులకుఁ జెప్పుచున్నారు—

శ్లో. నసోత్యతగావ ఇవ యస్య వశే భవంతి
బ్రహ్మాదయ స్తనుభృతో మిథు రర్ద్యమానాః,
కాలస్య తే ప్రకృతిపూరుషయోః పరస్య
శ న్న స్తనోతు చరణః పురుషోత్తమస్య. 14

అ. మిథుః = పరస్పరము; అర్ద్యమానాః = యుద్ధాదులచేతఁ బీడింపబడుచున్నవారై; తనుభృతః = దేహధారులైన బ్రహ్మాది దేవతలు సైతము; యస్య = ఏ నీ యొక్క; వశే = అధీనమందు; నసోత్యతగావః ఇవ = ముక్కుత్రాడు గ్రుచ్చి బంధింపబడిన యెద్దులవలె; భవంతి = ఉందురో; యతః = ఎందువల్ల ననగా; కాలస్య = కాలమును ప్రవర్తింపఁజేయు నట్టియు; ప్రకృతి పూరుషయోః = ప్రకృతి పురుషులకు; పరస్య = పరుఁడవైన; పురుషోత్తమస్య = పురుషోత్తముఁడ వైన; తే, చరణః = నీ యొక్క పాదము; నః = మాకు; శం తనోతు = సుఖమును విస్తరించుగాక.

ఓ భగవానుడా! యుద్ధాదులందు బరస్పరము పీడింపఁబడుచుండు దేహధారులైన బ్రహ్మాదిదేవతలు సైతము ముక్కుత్రాడు గ్రుచ్చి బంధింపబడిన యెద్దులవలె నీకు ఆధీనులై యుందురు. వారెప్పుడును స్వతంత్రులుగారు. అహోరాత్రములగు కాలము ప్రవర్తింపఁజేయు కాలస్వరూపుఁడవై, ప్రకృతి పురుషులకుఁ బరుఁడవై, పురుషోత్తముఁడవైన నీ పాదము మాకు సుఖములను వర్ధిల్లఁజేయుగాక.

అవ. ప్రకృతిపురుషులకంటె పరుఁడుగా నుపపాదించుచుఁ గాలరూపుఁ డగుటఁచేత బురుషోత్తముఁ డని జెప్పుచున్నారు—

శ్లో. అస్యాపి హేతు రుదయస్థితిసంయమానా
మవ్యక్త జీవమహతా మపి కాల మాహుః,
సోఽయం త్రిణాభి రఖిలాపచయే ప్రవృత్తః
కాలో గభీరరయ ఉత్తమపూరుష స్త్వమ్.

అ. అస్య=ఈజగత్తునకు; ఉదయస్థితిసంయమానాం=సృష్టి స్థితి లయములకు; హేతుః అపి=కారణ మగుచున్నావు; ఎందువలన ? అవ్యక్తజీవమహతాం+అపి=ప్రకృతి పురుషుఁడు, మహత్తత్త్వము అను మూటికిని; కాలం=నియంతగను; (నిన్ను జెప్పుదురు).

శ్రుతి : ..........."అక్షరా త్పరతః పరః
మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః
పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః".

"చరమైన జగత్తునకుఁ కూటస్థమైన ప్రకృతి కంటె పరుఁడు, మహత్తత్త్వమున కంటె నవ్యక్తమైన ప్రకృతి పర మగును. ఆ యవ్యక్తమైన ప్రకృతికంటె పురుషుఁడు పరుఁ డగును. పురుషుని కంటె పరము లేదు. పురుషుఁడే పర్యవసానము. అతడే సంసారులగు జీవులకు బరమగతియై యున్నాడు".

సః+అయం=ఈ సంవత్సరాత్మకమైనది; త్రిణాభిః=మూఁడు చాతుర్మాస్యములు నాభులుగా గలది; అఖిలాపచయే=సమస్త జగత్తుయొక్క లయము నందు; ప్రవృత్తః=ప్రవర్తించినదైన; కాలః=కాలము; త్వం=నీవే; అందువలన; ఉత్తమ పూరుషః=ఉత్తమపురుషుఁడవని చెప్పబడుచున్నావు.

గీతా :- "యస్మా త్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః,
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః".

"ఏ కారణము వలన సర్వభూతాత్మకమగు జగత్తును అతిక్రమించి యున్నానో, యే కారణమువలన తత్కారణమైన ప్రకృతికంటెను ఉత్తముఁడనో. యిందువలన నీలోకము నందును, వేదమునందును పురుషోత్తముఁ డని ప్రసిద్ధి కెక్కియున్నాను".

తా. ఈ జగత్తు యొక్క సృష్టిస్థితిలయములకు నీవే కారణమగు చున్నావు. ఏలయన ప్రకృతి, పురుషుడు, మహత్తత్వము అను వానిని నియమించి కాలస్వరూపుఁడైన నిన్ను నియంతగాఁ జెప్పుదురు. ఆ యీ సంవత్సరాత్మకమగు చాతుర్మాస్యములు మూఁడు (మూఁడు నాల్గులు) గలదై సకలలోకములయొక్కయు లయమందు ప్రవృత్తమైన కాలము తీవ్ర వేగము గలది. అట్టి యా కాలము ఉత్తమ పురుషుఁడవైన నీవే యగుదువు.

అవ. ప్రకృతి లోనగువాని ద్వారా జగత్తుయొక్క సృష్ట్యాదులకు నీవే కారణమని చెప్పఁబడెను. అది యే ప్రకార మనఁగా జెప్పుచున్నారు—

శ్లో. త్వత్తః పుమాన్ సమధికృత్య యయాఽస్య వీర్యం
ధత్తే మహాంత మివ గర్భ మమోఘవీర్యః,
సోఽయం తయానుగత ఆత్మన అండకోశం
హైమం ససర్జ బహిరావరణై రుపేతమ్. **16**

అ. త్వత్తః = నీవలన; పుమాన్ = పురుషుఁడు, వీర్యం, సమధికృత్య = శక్తిని పొంది; యయా = ఏ మాయచేతను; అధిష్ఠితః = అధిష్ఠింపఁబడినవాఁడై; అమోఘవీర్యః = విఫలముగాని శక్తి గలవాఁడై; అస్య = ఈ విశ్వమునకు; గర్భమివ = గర్భమువలె; మహాంతం ధత్తే = మహత్తత్వమును ధరించుచున్నాఁడో, పుట్టించుచున్నాఁడో; సః, అయం = ఆ యీ మహత్తత్వము, తయా అనుగతః = ఆ మాయచేతఁ గూడిన దగుచు; ఆత్మనః = తనవలన; బహిరావరణైః, ఉపేతం = వెలుపలనున్న యహంకారాది యావరణములతోఁ గూడిన; హైమం, అండకోశం = హిరణ్మయమైన యండకోశమును; ససర్జ = సృజించెను; (త్వయానుగతః అనుపాఠమునందు 'నీచే నధిష్ఠించబడిన మాయచేత'నని యర్థము).

తా. నీ వలన పురుషుఁడు వీర్యమును పొంది మాయతో గూడి యమోఘమైన శక్తికల వాఁడై విశ్వమునకు గర్భమువలె మహత్తత్వమును సృజించుచున్నాడు. ఆ మహత్తత్వము, మాయతోఁ గూడినదై తనవలన నహంకారాది బహిరావరణములతోఁ గూడిన హిరణ్మయమైన యండకోశమును సృజించెను.

అవ. ఓయీ! ఈ ప్రకారముగా నున్నటువంటి నా యీశ్వరత్వము మీ కెట్లు తెలిసినది యనగా జెప్పుచున్నారు—

శ్లో. తత్తస్థుషశ్చ జగతశ్చ భవా నధీశో
యన్మాయయోత్థ గుణవిక్రియ యోపనీతాన్,
అర్థాన్ జుష న్నపి హృషీకపతే న లిప్తో
యేఽన్యే స్వతః పరిహృతా దపి బిభ్యతి స్మ. **17**

అ. తత్ = ఆ యండకోశము వలన; లేక యా కారణము వలన: తస్థుషః = స్థావరమునకు (చరించని వానికి); జగతః = జంగమమునకు (చరించెడి వానికి) భవాన్; అధీశః = నీవు ప్రభుఁడవు; యత్ = ఏ కారణమువలన; మాయయా = మాయచేతను; ఉత్థగుణవిక్రియయా = విజృంభించిన ఇంద్రియవృత్తిచేత; ఉపనీతాన్ = పొందఁబడిన; అర్థాన్ = విషయములను; జుషన్నపి = సేవించుచున్నవాఁడ వగుచుండియు; హే హృషీకపతే = ఓ యింద్రియముల కధిపతీ; న,లిప్తః అంటబడవు; యే, అన్యే = యితరులగు జీవులు, యోగులును; స్వతః = స్వయముగా; పరిహృతాత్ + అపి = లేనిదానివల్లను, పరిహరింపబడిన దానివలనను కూడ, విషయముల సేవనము వలన; బిభ్యతి స్మ = భయపడుచున్నారు. వాసనామాత్రముచేత బంధింపఁబడుచున్నారు, అందువలన స్థావరజంగమాత్మకమైన యండకోశమున్నకు నీవు ప్రభుఁడవు.

తా. ఓ యింద్రియాధిపతీ! ఏ యందకోశముపలన మాయచే నుత్పన్నమైన గుణ వికారములచేత, నింద్రియవృత్తులు అనగా పంచతన్మాత్రలు, శబ్దాదులు పలుకుచున్నవో ఆ యింద్రియవృత్తులతో గూడినవిషయములను సేవించుచున్నను నీవు వానిచే లిప్తుడవు కావు. మఱి యితరులు, జీవులుగాని, యోగులుగానీ, స్వయముగా బరిహరించబడినదైనను, స్వయముగా లేనిదైనను విషయములను సేవించుట వలన వాసనామాత్రముచే బంధింపబడుచున్నారు. లేక భయపడుచున్నారు.

అవ. భగవంతుడు విషయలిప్తుడు కాడని చెప్పుచున్నారు—

శ్లో. స్మేరావలోకలవదర్శిత భావహారి
భ్రూమండలప్రహిత సౌరతమంత్రశౌండైః,
పత్న్యస్తు షోడశసహస్ర మనంగబాణై
ర్యస్యేంద్రియం విమథితుం కరణై ర్న విభ్వ్యః. 18

అ. స్మేరావలోకలవదర్శిత భావహారి భ్రూమండల ప్రహిత సౌరత మంత్రశౌండైః — స్మేర + అవలోక = చిరునవ్వుతో ప్రకాశించు చూపుయొక్క; లవ = కటాక్షముచేత; దర్శిత = చూపబడిన; భావ = అభిప్రాయముచేత; హారి = మనోహరమైన; భ్రూమండల = కనుబొమల చేత; ప్రహిత = పంపబడిన; సౌరత మంత్ర = రతిక్రీడామంత్రములచేత; శౌండైః = ప్రగల్భములైన; అనంగబాణైః = మన్మథుని మోహనాస్త్రములైన; కరణైః = కామకళలు మున్నగువానిచేత; షోడశసహస్రం = పదునాఱువేల సంఖ్యగల; పత్న్యః = పత్నులు; యస్య = ఏ నీయొక్క; ఇంద్రియం = మనస్సును; విమథితుం = క్షోభిల్లచేయుటకు; న, విభ్వ్యః = సమర్థతగలవారు కాలేక పోయిరో (అట్టి నీవు లిప్తుడవు కావు).

తా. చిరునవ్వుతో గూడిన క్రీగంటి చూపులచేత ప్రకటింపబడిన హావభావములచే మనోహరమైన కనుబొమలనుండి పంపబడిన రతిక్రీడామంత్రములై, మన్మథుని సమ్మోహనాస్త్రములైన కామకళలచేత బదునాఱువేలమంది భార్యలు సైతము, ఎవని మనస్సును కలతపెట్ట లేకపోయిరో, అట్టి నీవు అలిప్తుడవు.

శ్లో. విభ్వ్యస్తవామృతకథోదవహా స్త్రిలోక్యాః
పాదావనేజసరిత శ్శమలాని హంతుమ్,
అనుశ్రవం శ్రుతిభి రంఘ్రిజ మంగసంగై
స్తీర్థద్వయం శుచిషద స్త ఉపస్పృశంతి. 19

అ. తవ = నీయొక్క; అమృతకథా + ఉదవహాః = అమృతరూపములైన కథలు అను ఉదకములను వహించునట్టి కీర్తినదులు, పాదావనేజసరితః = నీ పాదములు కడిగిన జలములైన గంగాది నదులు, త్రిలోక్యాః = మూడులోకముల యొక్క; శమలాని = పాపములను; కలుషములను, హంతుం = నాశము చేయుటకు; విభ్వ్యః = సమర్థములు; ఏ ప్రకారముగా? అనుశ్రవం = గురువు యొక్క యుచ్చారణము వెనువెంటనే వినిపించునట్టి వేదమువల్ల కలిగిన కీర్తిరూపమైన తీర్థమును; శ్రుతిభిః = శ్రవణేంద్రియములచేతను; అంఘ్రిజం = నీ పాదముల నుండి జనించినదైన గంగాతీర్థమును; అంగసంగైః = శరీరావయవసంబంధముల చేతను; ఈ ప్రకారము;

శుభిషదః = తమ యాశ్రమ ధర్మమం దున్నవారు; తే = నీ యొక్క; తీర్థద్వయం = రెండు తీర్థములను; ఉపస్పృశంతి = సేవించుచున్నారు.

తా. గురువుల ఉచ్చారణరూపమైన వేదమునుండి జనించిన నీ కీర్తిరూపమైన తీర్థమును, శ్రవణేంద్రియములచేతను, మీ పాదములనుండి జనించిన గంగాతీర్థమును, శరీరసంగముచేతను, (స్నానాదులచేతను) ఈ ప్రకారము తమ తమ యాశ్రమముల యందున్న సత్పురుషులు ఈ నీ రెండు విధములగు తీర్థములను సేవించుచున్నారు.

శ్రీశుక ఉవాచ = శ్రీశుకులు పలికిరి.

శ్లో. ఇ త్యభిష్టూయ విబుధై స్సేశ శ్శతధృతి ర్హరిమ్,
అభ్యభాషత గోవిందం ప్రణ మ్యాంబర మాశ్రితః. 20

అ. ఇతి = ఈ విధముగా; అభిష్టూయ = స్తుతించి; శతధృతిః = బ్రహ్మ. సేశః = శివునితోఁగూడి, విబుధైస్సహ = దేవతలతోఁగూడ; గోవిందం, ప్రణమ్య = కృష్ణునికి నమస్కరించి; అంబరం, ఆశ్రితః = ఆకాశమును ఆశ్రయించి; అభ్యభాషత = ఇట్లు సంభాషించెను.

తా. బ్రహ్మదేవుఁడు ఈశ్వరునితోను, దేవతలతోను కూడుకొని, శ్రీకృష్ణుని యీ ప్రకారము స్తుతించి యాకాశమును జేరి కృష్ణునికి నమస్కరించి యిట్లు సంభాషించెను.

బ్రహ్మోవాచ = బ్రహ్మ పలికిరి.

శ్లో. భూమే ర్భారావతారాయ పురా విజ్ఞాపితః ప్రభో,
త్వ మస్మాభి రశేషాత్మం స్తత్తథైవోపపాదితమ్. 21

అ. ప్రభో = ఓ ప్రభూ! అశేషాత్మన్ = సర్వమునకు ఆత్మయైనవాఁడా! త్వం = నీవు; అస్మాభిః = మా చేతను; పురా = పూర్వము; భూమేః భారావతారాయ = భూమి యొక్క భారమును నివారించుటకొఱకు; విజ్ఞాపితః = విన్నవింపబడితివి; తత్ = ఆయా కార్యము; తథైవ = ఆ ప్రకారమే; ఉపపాదితమ్ = సాధింపబడినది.

తా. ఓ ప్రభూ! ఓ సర్వాత్మస్వరూపా! పూర్వము మేము నిన్ను భూభారమును నివారింపుమని విన్నవించుకొనియుంటిమి. ఆ కార్యమును నీ వా ప్రకారముగనే నెరవేర్చితివి.

శ్లో. ధర్మశ్చ స్థాపిత స్సత్సు సత్యసంధేషు వై త్వయా,
కీర్తిశ్చ దిక్షు విక్షిప్తా సర్వలోకమలాపహా. 22

అ. త్వయా = నీచేత; ధర్మశ్చ = ధర్మమును; సత్యసంధేషు = సత్యనిష్ఠులైన; సత్సు = సాధువులందు; స్థాపితః = స్థాపింపఁబడినది; సర్వలోకమలాపహా = సర్వలోకముల కాలుష్యమును; పాపమును పోగొట్టునట్టి; కీర్తిశ్చ = కీర్తియును; దిక్షు విక్షిప్తా = దిక్కులందు విస్తరింపఁబడినది.

తా. ఓ ప్రభూ! నీచేత ధర్మము సత్యప్రవర్తకులైన సాధుపురుషులందు స్థాపింపబడినది. సర్వలోకముల కాలుష్యమును పోగొట్టునట్టి కీర్తి దిక్కులందు విస్తరింపఁబడినది.

శ్లో. అవతీర్య యదో ర్వంశే బిభ్ర ద్రూప మనుత్తమమ్,
కర్మా ణ్యుద్దామవృత్తాని హితాయ జగతోఽకృథాః. **23**

అ. యదోః వంశే=యదురాజు యొక్క వంశమందు; అవతీర్య=అవతరించి; అనుత్తమం=అత్యంతశ్రేష్ఠమైన; రూపం బిభ్రత్=రూపమును ధరించుచు; ఉద్దామవృత్తాని=ఉదాత్తములైన విక్రమములుగల; కర్మాణి=కార్యములను; జగతః, హితాయ, అకృథాః=జగత్తు యొక్క మేలుకొఱకుఁ జేసితివి.

తా. ఓ కృష్ణా! నీవు యదువంశమునం దవతరించి జగన్మోహన విగ్రహమును ధరించి యుదాత్తములైన పరాక్రమములతోఁ గూడిన సాహసకృత్యములను జగమునకు మేలుకలుగుట కొఱకై కావించితివి.

శ్లో. యాని తే చరితా నీశ మనుష్యా స్సాధవః కలౌ,
శృణ్వంతః కీర్తయంతశ్చ తరిష్యం త్యంజసా తమః. **24**

అ. ఈశ=ఓ ప్రభూ!; కలౌ=కలియుగమునందు; సాధవః, మనుష్యాః=సాధువులైన మానవులు; తే=నీ యొక్క; యాని చరితాని=ఏ యవతార చరిత్రములను; శృణ్వంతః, కీర్తయంతశ్చ=వినుచు గీర్తించుచున్నవారై; అంజసా=శీఘ్రముగా; తమః, తరిష్యంతి=అజ్ఞానరూపమైన సంసారమును దాటగలరో.

తా. కలియుగమునందు సాధువులైన మానవులు మీ యవతార స్వరూపములు వినుచుఁ గీర్తించుచు, అవిద్యారూపమైన సంసారమును దాటుదురు.

శ్లో. యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ,
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం ప్రభో. **25**

అ. పురుషోత్తమ=ఓ పురుషోత్తముడా! ప్రభో=ఓప్రభూ! యదువంశే, అవతీర్ణస్య=యదు వంశమునందు జనించిన; భవతః=నీకు; పంచవింశాధికం=యిరువదియైదు సంవత్సరములు అధికముగా గల; శరచ్ఛతం=నూఱు సంవత్సరములు; వ్యతీయాయ=గడచినవి.

తా. ఓ పురుషోత్తమా! ఓ ప్రభూ! యదువంశమునందు జనించిన నీకు, నూట యిరువదియైదు సంవత్సరములు గడిచినవి.

శ్లో. నాధునా తేఽఖిలాధార దేవకార్యావశేషితమ్,
కులం చ విప్రశాపేన నష్టప్రాయ మభూ దిదమ్. **26**

అ. అఖిలాధార=ఎల్లలోకములకు నాధారమైన వాఁడా; దేవకార్యే=దేవకార్యమువందు; తే=నీకు; అధునా=ఇప్పుడు; అవశేషితం+న=శేషించినది లేదు; ఇదం, కులం చ=ఈ యదుకులమును; విప్రశాపేన = విప్రశాపముచేత; నష్టప్రాయం = నశించిన దానితో సమానమైనది.

ఎల్లలోకములకు నాధారమైనవాఁడా! నీవు భూలోకమునందు దేవతలకు మేలు కలుగుట కొఱకై చేసిన కార్యము పూర్తియైనది. ఇప్పుడింక చేయవలసిన మిగిలిన కార్యమేదియు లేదు. నీ యదుకులమును విప్రశాపముచేత నశించినట్లే యైనది.

శ్లో. తత స్స్వధామ పరమం విశస్వ యది మన్యసే,
సలోకాన్ లోకపాలా న్నః పాహి వైకుంఠకింకరాన్. 27

అ. తతః=అందువలన; మన్యసే, యది=నీ కర్తవ్యము పూర్తియైనదని తలంచితివేని; పరమం, స్వధామ=పరమపదమైన నీ వైకుంఠధామమును; విశస్వ=ప్రవేశించుము; సలోకాన్=లోకములతోఁగూడిన; వైకుంఠకింకరాన్=విష్ణువుయొక్క సేవకులైన; లోకపాలాన్ నః=లోకపాలురమైన మమ్ము; పాహి=పాలించుము.

తా. ఓ కృష్ణా! నీ యవతారకృత్యము పూర్తియైనదని తలంచితివేని పరమపదమైన వైకుంఠధామమును ప్రవేశించుము. లోకములతోగూడి లోకపాలురమై విష్ణుసేవకులమైన మమ్ము పాలింపుము.*

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకులు వచించిరి.

శ్లో. సంస్తుతో భగవా నిత్థం విబుధైః పద్మజాదిభిః,
ప్రతినంద్యాహ తా న్రాజ న్మాయామనుజ ఈశ్వరః. 28

అ. ఇత్థం=ఈ ప్రకారము; పద్మజాదిభిః=బ్రహ్మాలోనగు; విబుధైః=దేవతల చేత; సంస్తుతః=స్తుతింపబడినవాడై; మాయామనుజః ఈశ్వరః=తన సంకల్పముచేతనే మనుజావతారము నందినవాడు ఈశ్వరుడగు, భగవాన్=కృష్ణుఁడు; తాన్=వారిని; ప్రతినంద్య=అభినందించి; ఆహ=చెప్పెను.

తా. ఓ రాజా! బ్రహ్మాదిదేవతలు ఈ ప్రకారము తన్ను స్తుతింపగా భగవంతుడు, లీలామానుష విగ్రహుడు, జగదీశ్వరుడైన శ్రీకృష్ణుఁడు వారల నభినందించి యిట్లు చెప్పెను.

---

*కం. సురగరుడ ఖచరవిద్యా
ధర హారపరమేష్ఠి ముఖసుధాశనులు మునుల్
సంసిజనయనుని గనుగొన
నరుదెంచిరి ద్వారవతికి నతిమోదమునన్,

కం. కని పరమేశుని యాదవ
వనశోభితపారిజాతు వనరుహనేత్రున్
జనకామిత ఫలదాయకు
వినుతించిరి దివిజు లపుడు వేదోక్తులతోన్.

తే. అఖిలలోకేశ !సర్వేశ !యభవ ! నీవు
నుదయమందుట భూభార ముడుపుకొఱకు
బంచవింశోత్తర శతాబ్దపరిమితంబు
నయ్యె విచ్చేయు వైకుంఠహర్మ్యమునకు.

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు వచించెను.

శ్లో. అవధారిత మేత న్మే యదాత్థ విబుధేశ్వర,
కృతం వః కార్య మఖిలం భూమే ర్భారో ఒవతారితః. 29

అ. విబుధేశ్వర=ఓ దేవతల ప్రభువా! బ్రహ్మదేవా; త్వం=నీవు యత్+అత్థ=నన్ను గూర్చి యేమి చెప్పితివో; ఏతత్=అదియంతయు; మే=నాచేత; అవధారితం=విచారణచేసి, నిశ్చయింపబడినట్టిది; వః=మీ యొక్క; అఖిలం, కార్యం=సమస్తకార్యము; కృతం=చేయఁబడినది; భూమేః+భారః+అవతారితః=భూమి యొక్క భారము దింపబడినది.

తా. ఓ బ్రహ్మదేవా! నీ వేదేది వచించితివో, ఆ కార్యమంతయు నట్లే చేయ నిశ్చయించి యాచరించితిని. భూభారము తొలగించితిని.

శ్లో. తదిదం యాదవకులం వీర్యశౌర్యశ్రియోద్ధతమ్,
లోకం జిఘృక్ష ద్రుద్ధం మే వేలయేవ మహార్ణవః. 30

అ. తత్=అట్లయ్యును; ఇదం, యాదవకులం=ఈ యాదవ వంశము; వీర్య, శౌర్య శ్రియా=బలము, పరాక్రమము, సంపదయను వానిచేత, ఉద్ధతం=ధర్మాతిక్రమణములచేత; వేలయా=చెలియలికట్టచే; మహార్ణవః+ఇవ=మహాసముద్రమువలె; లోకం జిఘృక్షతి=లోకమును మ్రింగివేయగోరుచున్నది.

తా. బలపరాక్రమములచేతను, సంపదచేతను పెచ్చుపెరిగియున్న యీ యాదవ కులము ధర్మము నతిక్రమించిన కార్యములచేత, చెలియలికట్ట దాటి యుప్పొంగివచ్చు మహా సముద్రమువలె, లోకమును కబళించివేయగోరు చున్నది.

శ్లో. య ద్యసంహృత్య దృప్తానాం యదూనాం విపులం కులమ్,
గంతాఒస్మ్యనేన లోకోఒయ ముద్వేలేన వినంక్ష్యతి. 31

అ. దృప్తానాం యదూనాం విపులం కులం=పొగరుబోతులైన, యాదవుల యొక్క విస్తరించిన కులమును; అసంహృత్య=సంహారము చేయక; గంతా+అస్మి+యది=నేను స్వధామమునకు పోయినయెడల; ఉద్వేలేన=చెలియలికట్ట దెంచుకొని యుప్పొంగివచ్చు సముద్రముచే వలె; అనేన=ఈ యాదవవంశముచే; అయం, లోకః. వినంక్ష్యతి=ఈ లోకము నాశము కాగలదు.

తా. మదించి, విజృంభించిన యాదవుల వంశమును సంహరించక నేను నా స్వధామమునకు పోయితినేని, హద్దుమీఱి యుప్పొంగిన సముద్రముచే వలె యదుకులముచే నీ లోకము నాశము కాగలదు.

శ్లో. ఇదానీం నాశ ఆరబ్ధః కులస్య ద్విజశాపతః,
యాస్యామి భవనం బ్రహ్మ న్నేతదంతే తవానఘ. 32

అ. అనఘ+బ్రహ్మన్=అనఘుఁడైన ఓ బ్రహ్మదేవా!; ఇదానీం=ఇప్పుడు; ద్విజశాపతః=విప్రశాపమువలన; నాశః, ఆరబ్ధః=నాశనము ప్రారంభమైనది; ఏతదంతే=ఈ నాశ

నము పూర్తియైనంతనే; తవ భవనం యాస్యామి = వైకుంఠమునకు బోవుచు నీలోకమునకు రాగలను.

తా. ఓ బ్రహ్మదేవా! విప్రశాపమువలన ఇప్పటికే యాదవకులమునకు నాశనము ప్రారంభమైనది. ఈ కులము పూర్తిగా నాశనమైనంతనే వైకుంఠమునకుఁ బోవుచు నీ లోకమునకు రాఁగలను.

శ్రీశుక ఉవాచ = శ్రీ శుకులు చెప్పుచున్నారు.

శ్లో. ఇత్యుక్తో లోకనాథేన స్వయంభూః ప్రణిపత్య తమ్,
సహ దేవగణై ర్దేవ స్స్వధామ ప్రత్యపద్యత. 33

అ. లోకనాథేన = లోకప్రభువుచేత; ఇత్యుక్తః = ఇట్లు చెప్పబడినవాడై; స్వయంభూః దేవః = బ్రహ్మదేవుడు; దేవగణైస్సహ = దేవగణములతోఁగూడి; ప్రణిపత్య = మ్రొక్కి; స్వధామ ప్రత్యపద్యత = తన స్థానమును చేరెను.

తా. లోకప్రభువు ఇట్లు వచింపగా విని బ్రహ్మదేవుఁడు దేవగణములతోఁగూడి యాయనకు సాగిలి మ్రొక్కి తన లోకమునకుఁ బోయెను.*

శ్లో. అథ తస్యాం మహోత్పాతాన్ ద్వారకాయాం సముత్థితాన్,
విలోక్య భగవా నాహ యదువృద్ధాన్ సమాగతాన్. 34

అ. అథ = తరువాత; తస్యాం, ద్వారకాయాం = ఆద్వారకయందు; సముత్థితాన్ మహోత్పాతాన్ = పుట్టిన గొప్పయుత్పాతములను; విలోక్య = చూచి; భగవాన్ = భగవంతుడు; సమాగతాన్ = తన వద్దకు వచ్చిన; యదువృద్ధులను గూర్చి; ఆహ = చెప్పెను.

తా. అంత ద్వారకయందు గొప్ప యుత్పాతములు పుట్టగా జూచి భగవంతుడైన కృష్ణుఁడు తన్ను కలిసికొన్న పెద్దలైన యాదవులను చూచి యిట్లు చెప్పెను.

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు చెప్పెను.

శ్లో. ఏతే వై సుమహోత్పాతా హ్యుత్తిష్ఠం తీహ సర్వతః,
శాపశ్చ నః కులస్యాసీ ద్బ్రాహ్మణేభ్యో దురత్యయః. 35

అ. ఇహ = ద్వారకయందు; సర్వతః = అంతటను; సుమహోత్పాతాః = గొప్పయుత్పాతములు; ఏతే వై = ఇవియే; సముత్తిష్ఠంతి హి = ఉప్పతిల్లుచున్నవి. చూచితిరా ? నః కులస్య = మన కులమునకు; బ్రాహ్మణేభ్యః = విప్రులవలన; దురత్యయః = దాటరాని; శాపశ్చ + ఆసీత్ = శాపముకూడ కలిగినది.

---

*వ. అనినఁ గమలభవ భవముఖ నిఖిలసురగణంబుల వచనంబు లియ్యకొని కృష్ణుండు వారలతోడ యాదవుల కన్యోన్య వైరానుబంధంబులు గల్పించి వారల హతంబు గావించి భూభారం బడంచి యిదె వచ్చెదఁ బొండని చెప్పి వీడ్కొలిపినఁ గమలాసనాదిబృందారకులు నిజస్థానంబులకుం జనిరి; అంత.

తా. ఓ పెద్దలారా! ఈ మన ద్వారకయందు గొప్ప యుత్పాతములు, పుట్టుచున్నవి. ఇవి చూచితిరా? మన కులమునకు విప్రుల వలనఁ దప్పించుకొనుటకు వీలుకాని శాపము కూడ కలిగియున్నది.

శ్లో. న వస్తవ్య మిహాస్మాభి ర్జిజీవిషుభి రార్యకాః,
ప్రభాసం సుమహాపుణ్యం యాస్యామోఽద్యైవ మా చిరమ్. **36**

అ. ఆర్యకాః = పెద్దలారా! జిజీవిషుభిః = జీవింపఁ గోరుచున్న; అస్మాభిః = మనచేత; ఇహ = ఈ ద్వారవతియందు; న వస్తవ్యం = వసింపఁదగదు; సుమహాపుణ్యం, ప్రభాసం = గొప్ప పుణ్యతీర్థమైన ప్రభాసతీర్థమును గురించి; అద్యైవ = ఇప్పుడే, మా, చిరం = ఆలస్యము చేయక; యాస్యామః = పోవుదము.

తా. ఓ పెద్దలారా! జీవింపగోరుచున్న మన కీ ద్వారకయందు నివసింపఁదగదు. గొప్ప పుణ్యతీర్థమైన ప్రభాసమునకు ఆలస్యము చేయక యిప్పుడే బయలుదేరి పోవుదము.

విశేషము : ప్రభాస తీర్థమునకుఁ బోవుదము అని చెప్పుటలో భగవంతుని యభిప్రాయ మిది. "ఈ యాదవులు దేవాంశసంభూతులు కావున వీరు తమ తమ అధికారపు పదవులను పొందుట కర్హులు. ద్వారవతి యందు మరణించిన వారికి సద్యోముక్తి లేదు. అందువలన ప్రభాస తీర్థమునందు స్నానాదులు చేసిన వారికి సద్యోమోక్షము కలుగును. కావున ప్రభాస తీర్థమునకుఁ దీసికొని పోయెదను." అని.

శ్లో. యత్ర స్నాత్వా దక్షశాపా ద్గృహీతో యక్ష్మ ణోడురాట్,
విముక్తః కిల్బిషా త్సద్యో భూయో భేజే కళోదయమ్. **37**

అ. ఉడురాట్ = నక్షత్రములకు రాజైన చంద్రుఁడు; దక్షశాపాత్ = దక్షుని శాపము వలన; యక్ష్మణా గృహీతః = క్షయరోగముచేత గ్రహింపబడినవాడై; యత్ర స్నాత్వా = ఏ ప్రభాస తీర్థమునందు స్నానము జేసి; కిల్బిషాత్ = పాపము నుండి; సద్యః = అక్షణమే; విముక్తః = విముక్తి పొందినవాఁడై; భూయః = మరల; కళా + ఉదయం = కళల యొక్క యభివృద్ధిని; భేజే = పొందెనో.

తా. పూర్వము అశ్విన్యాది నక్షత్రములకు ప్రభువైన చంద్రుఁడు దక్షుని శాపముచేత క్షయరోగపీడితుఁ డయ్యెను. అతఁడు ఈ ప్రభాసతీర్థమునందు స్నానముచేసి, పాపమునుండి విముక్తుఁడై, మరల కళల యభివృద్ధిని పొందెను.

శ్లో. వయం చ తస్మి న్నాప్లుత్య తర్పయిత్వా పితౄన్ సురాన్,
భోజయి త్వోశిజో విప్రా న్నానాగుణవతాఽంధసా. **38**

అ. వయం, చ = మనమును; తస్మిన్ = ఆ తీర్థమునందు; ఆప్లుత్య = స్నానముఁజేసి; పితౄన్, సురాన్ = పితరులను, దేవతలను; తర్పయిత్వా = తర్పణముచే తృప్తినొందించి, నానాగుణవతా = అన్ని గుణములు గల, షడ్రసోపేతమైన; అంధసా = అన్నముచేత; ఉశిజః = మనోహరులైన; విప్రాన్ భోజయిత్వా = బ్రాహ్మణులను, భుజింపఁజేసి.

తా. మన మందఱము ఆ ప్రభాసతీర్థమునందు మునిఁగి, దేవతలకుఁ, బితృదేవతలకుఁ దర్పణము విడిచి షడ్రసోపేతమయిన యన్నము విప్రులకుఁ బెట్టి భుజింపజేసి.

శ్లో. తేషు దానాని పాత్రేషు శ్రద్ధ యోప్త్వా మహాంతి వై,
వృజినాని తరిష్యామో దానై ర్నౌభి రి వార్ణవమ్. 39

అ. పాత్రేషు=పాత్రులైన; తేషు=ఆ విప్రులయందు; శ్రద్ధయా=శ్రద్ధతోడను; మహాంతి వై=గొప్పవైన; దానాని=దానములను; ఉప్త్వా=నాటి (ఉంచి); దానైః=దానములచేత; వృజినాని=పాపములను; నౌభిః=ఓడల చేతను; అర్ణవం, ఇవ=సముద్రమునువలె; తరిష్యామః=దాటుదము.

తా. పాత్రులైన యా బ్రాహ్మణులకు, శ్రద్ధతో గొప్పదానములు చేసి ఓడలచేత సముద్రమును దాటునట్లు మనము ఆ దానములచేతఁ బాపములను దాటుదము. సుక్షేత్రము నందు మంచి విత్తనము నాటినచోఁ జక్కగాఁ బండును. సత్పాత్రునికి దాన మిచ్చుట ఫల ప్రదము.

శ్రీశుక ఉవాచ = శ్రీ శుకుఁడు చెప్పెను.

శ్లో. ఏవం భగవతాఽఽదిష్టా యాదవాః కురునందన.
గంతుం కృతధియ స్తీర్థం స్యందనాన్ సమయూయుజన్. 40

అ. కురునందన! ఏవం=ఈ ప్రకారము; యాదవాః=యాదవులు; భగవతా, ఆదిష్టాః=భగవంతునిచే నాజ్ఞాపింపఁబడినవారై; తీర్థం, గంతుం=ఆ తీర్థమునకుఁ బోవుటకు; కృతధియః=నిర్ణయించుకొన్న బుద్ధికలవారై; స్యందనాన్=రథములను; సమయూయుజన్=గుఱ్ఱములను కట్టి సిద్ధపరచిరి.

తా. ఓ కురునందనా ! ఈ ప్రకారము భగవంతుఁడు తమ్ము ఆదేశింపఁగా నా తీర్థమునకుఁ బోవుటకు నిర్ణయించుకొనినవారై యాదవులు రథములను సిద్ధపఱచిరి. *

---

సీ. కాకఘూకంబులు కనక సౌధములలోఁ బగలు వాపోయెడి బహువిధముల
నశ్వవాలంబుల నవల ముద్భవ మయ్యె, వహ్నంబు మొలిచె మహాద్భుతముగ
శుకశారికలు రాత్రి నొగనె విస్వరముల జంతువు వేఱొక్క జంతుఁ గనియె;
నొగిఁ బౌరగృహముల నుల్కలు నుదయించె బెరసెఁ గావిరి రవిబింబ మపుడు,

తే. దాన నుత్పాతములు చాలఁ గానఁబడియె
నరయ నిం దుండ వలవదు యదువులార !
తడయ కిపుడ ప్రభాసతీర్థమున కరుగుఁ
డనుచు శ్రీకృష్ణుఁ డెంతయు నానతిచ్చె. 87

కం. నారాయణు వచనముల క
పారం బగు సమ్మదమున బలములతోడన్
దారసుతమిత్రయుతులై
వారణహయసమితితోడ వడి నేగి రొగిన్. 88

శ్లో. త న్నిరీ క్ష్యోద్ధవో రాజన్ శ్రుత్వా భగవ తోదితమ్,
దృష్ట్వాఽరిష్టాని ఘోరాణి నిత్యం కృష్ణ మనువ్రతః. **41**

అ. రాజన్ = ఓ రాజా! ఉద్ధవః = ఉద్ధవుడు; భగవతా, ఉదితం = భగవంతునిచేతఁ జెప్పఁబడిన దానిని; శ్రుత్వా = విని; నిరీక్ష్య = (ఆయన చేయు పనిని) కనిపెట్టియుండి; ఘోరాణి అరిష్టాని = భయంకరములైన యుత్పాతములను; దృష్ట్వా = చూచి; నిత్యం, కృష్ణం, అనువ్రతః = నిరంతరము కృష్ణుని యనువర్తించుచుండెను.

తా. ఓ రాజా ! ఉద్ధవుఁడు భగవంతుఁడు చెప్పిన మాటలు విని యతని యుద్యోగము పరికించి, ఘోరములైన యుత్పాతములను చూచి; విడువక కృష్ణు ననుసరించుచుండెను.

శ్లో. వివి క్త ఉపసంగమ్య జగతా మీశ్వరేశ్వరమ్,
ప్రణమ్య శిరసా పాదౌ ప్రాంజలి స్త మభాషత. **42**

అ. జగతాం ఈశ్వరేశ్వరం = లోకపాలురకును ప్రభువగు కృష్ణుని; వివిక్తే, ఉపసగమ్య = ఏకాంతమునందు దగ్గరచేరి; శిరసా,పాదౌ, ప్రణమ్య = శిరమువంచి, పాదములకుప్రణమిల్లి; ప్రాంజలిః = దోసిలి యొగ్గి; తం, అభాషత = ఆకృష్ణునితో సంభాషించెను.

తా. లోకపాలురకు గూడ ప్రభువైన యా కృష్ణు నేకాంతమునందు కలిసికొని చేతులు మోడ్చి శిరస్సుతోఁ బాదములకుఁ బ్రణమిల్లి యుద్ధవు డిట్లు పలికెను.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో. దేవ దేవేశ యోగేశ పుణ్యశ్రవణకీ ర్తన,
సంహృత్యైత త్కులం నూనం లోకం సంత్యక్ష్యతే భవాన్. **43**

అ. దేవ = స్వతేజముతో ప్రకాశించువాఁడా ! దేవేశ = దేవతలగు బ్రహ్మాదులకును ప్రభువా! యోగేశ = యోగనిర్వాహకా ! పుణ్యశ్రవణ కీ ర్తన = పుణ్యము గూర్చు నీ సంబంధమగు శ్రవణము, కీ ర్తనము కలవాఁడా ! ఏతత్కులం = ఈ యాదవకులమును; సంహృత్య = సంహరించి, భవాన్ = నీవు; నూనం = నిశ్చయముగా; లోకం = మర్త్యలోకమును; సంత్యక్ష్యతే = త్యజింపఁగలవు.

తా. ఓ దేవదేవేశ ! యోగీశ ! పుణ్య శ్రవణ కీర్తనా ! ఈ యాదవ కులమును సంహరించి నీవు నిశ్చయముగా మర్త్యలోకమును త్యజింపఁగలవు.

శ్లో. విప్రశాపం సమర్థోఽపి ప్రత్యహ న్న యదీశ్వరః. **44**
నాహం తవాంఘ్రికమలం క్షణార్ధమపి కేశవ,
త్యక్తుం సముత్సహే నాథ స్వధామ నయ మా మపి. **45**

అ. ఈశ్వరః సమర్థః + అపి = ఈశ్వరుడవు, సమర్థుఁడవైనను; విప్రశాపం, న, ప్రత్యహన్ = విప్రశాపమును ప్రతిహతముఁ జేయవైతివి; కేశవా ! నాథా ! క్షణార్ధమపి = అర్ధక్షణమైనను; తవ + అంఘ్రికమలం = నీపాదపద్మమును; త్యక్తుం = త్యజింప; న + సముత్సహే = సమర్థుడను కాను; మాం, అపి = నన్నుఁగూడ; స్వధామ, నయ = నీలోకమునకుఁ దీసికొనిపొమ్ము.

తా. నీవు జగదీశ్వరుఁడవు, సమర్థుడవు అయియుండియు విప్రశాపమును మరలింపవైతివి, అనగా పోగొట్టవైతివి. కేశవా ! నిన్ను విడిచి నేను ఒక యర్ధక్షణమైనను ఇచ్చట నుండ నిచ్చగింపను. ఓ ప్రభూ ! నన్నుఁగూడ నీలోకమునకుఁ గొనిపొమ్ము.

శ్లో. తవ విక్రీడితం కృష్ణ : నృణాం పరమమంగళమ్,
కర్ణపీయూష మాస్వాద్య త్యజం త్యన్యస్పృహాం జనాః. **46**

అ. కృష్ణ=కృష్ణా ! నృణాం=నరులకు; పరమమంగళం, కర్ణపీయూషం = మిగుల శుభకరమైన శ్రవణామృతమును; తవ విక్రీడితం=నీ క్రీడావర్తనమును; ఆస్వాద్య = ఆస్వాదించి, జనాః = జనులు; అన్యస్పృహాం = ఇతర వాంఛను; త్యజంతి=త్యజింతురు.

తా ఓ కృష్ణా ! నీ క్రీడా విలాస వర్తనములు నరులకు పరమమంగళము, శ్రవణానందము. దాని నాస్వాదించి జనులు ఇతరములను త్యజింతురు.

శ్లో. శయ్యాసనాటనస్థాన స్నానక్రీడాశనాదిషు
కథం త్వాం ప్రియ మాత్మానం వయం భక్తా స్త్యజేమహి. **47**

అ. శయ్యా-ఆసన-అటన-స్థాన-స్నాన-క్రీడా-అశనాదిషు=పరుండుట, కూర్చుండుట, నిలచుట సంచరించుట, స్నానము చేయుట, క్రీడించుట, భుజించుట లోనగు క్రియలందు; ప్రియం, ఆత్మానం=ప్రియుఁడవు, ఆత్మవునైన; త్వాం =నిన్ను; భక్తులమై సేవించిన; వయం=మేము; కథం, త్యజేమహి=ఎట్లు త్యజింపఁగలము ?

తా. శయనాసన సంచారములందును, స్నానక్రీడలందును, భోజనమునందును, ప్రియుడవై యాత్మవైన నిన్ను భక్తులమై సేవించిన మేము నిన్నెట్లు త్యజింపగలము.

అవ. త్యజించుటకు నశక్తుడనై నిన్నుఁ బ్రార్థించుచున్నాను. మాయయొక్క భయము వలనఁ గాదు అనుచున్నాడు—

శ్లో. త్వయోపభుక్తస్రగ్గంధవాసోఽలంకారచర్చితాః,
ఉచ్ఛిష్టభోజినో దాసా స్తవమాయాం జయేమహి. **48**

అ. త్వయా=నీ చేతను; ఉపభుక్తస్రగ్గంధ వాసోఽలంకార చర్చితాః–ఉపభుక్త=అనుభవింపఁబడిన; స్రక్=పూల మాలలు; గంధ=గంధము; వాసః=వస్త్రము; అలంకార= అలంకారము; చర్చితాః=మైపూతలు కలిగి; ఉచ్ఛిష్టభోజినః= శేషించిన దానిని భుజించువటు వంటి; దాసాః= దాసులమైన మేము; తవ, మాయాం, జయేమహి =నీ మాయను తప్పక జయింపఁగలము.

తా. నీ వనుభవించిన పూలమాలలు, చందనము, వస్త్రాలంకారాదులు దాల్చి, నీ యుచ్ఛిష్టముకు భుజించువారమై మేము నీ మాయను తప్పక జయింతుము.

శ్లో. వాతరశనా య ఋషయః శ్రవణా ఊర్ధ్వమంథినః,
బ్రహ్మాఖ్యం ధామ తే యాంతి శాంతా స్సంన్యాసినోఽమలాః. **49**

అ. వాతరశనాః = దిగంబరులు; శ్రమణాః =(కౌపీనమాత్రధారులు) ఆహారము తీసికొనక శ్రమనొందినవారు; ఊర్ధ్వమంథినః = ఊర్ధ్వరేతస్కులు; యే తే=ఎవరో అట్టి;

శాంతాః = రాగద్వేషాదిరహితులు; అమలాః = పరిశుద్ధులగు; సన్న్యాసినః = తురీయాశ్రమస్థులు; బ్రహ్మాఖ్యం, ధామతే, యాంతి = వారు బ్రహ్మ మను ధామమును (బ్రహ్మలోకమును) పొందు చున్నారు.

తా. నిర్మలమనస్కులు శాంతపురుషులగు దిగంబరులు, ఋషులు, శ్రమణులు, ఊర్ధ్వరేతస్కులు, సన్యాసులు, బ్రహ్మధామమును పొందుచున్నారు.

అవ. సన్న్యాసులు బ్రహ్మచర్యములోనగు పెక్కువిధములైన క్లేశములచే కష్టముచే నామాయను తరింతురు. మేము సునాయాసముగా దాటగల మనుచున్నాడు—

శ్లో. వయం త్విహ మహాయోగిన్ భ్రమంతః కర్మవర్త్మసు,
త్వద్వార్తయా తరిష్యామ స్తావకై ర్దుస్తరం తమః. 50

అ. మహాయోగిన్ = ఓ మహాయోగీ; వయం, తు = మేమైనచో; ఇహ = ఇచ్చట; కర్మవర్త్మసు, భ్రమంతః = కర్మమార్గము లందు తిరుగుచు; వర్తించుచు; త్వద్వార్తయా = నీ చరిత్రముచేత; దుస్తరం, తమః = దాటరాని సంసారమును. మాయను; తావకైః = నీభక్తులతో; తరిష్యామః = తరింపగలము.

తా. ఓ యోగీశ్వరా! మేము మాత్రము కర్మమార్గమునందుఁ బ్రవర్తించు నీ కథా శ్రవణముఁ జేయుచున్నవారమై నీ భక్తులతోగూడి తరింపశక్యముగాని సంసారమును, మాయను తరింపఁగలము.

శ్లో. స్మరంతః కీర్తయంత స్తే కృతాని గదితాని చ,
గత్యు త్స్మితేక్షణక్ష్వేలం య న్నృలోకవిడంబనమ్. 51

అ. తే, గదితాని = నీచేఁ జెప్పఁబడిన యుపదేశమును; కృతాని, చ = చేయబడిన కార్యములను; స్మరంతః, కీర్తయంతః = స్మరించుచు, కీర్తించుచు; యన్నృలోకవిడంబనమ్ = నరలోకమునకు నటనమైన; తే = నీ యొక్క; గత్యుత్స్మితేక్షణక్ష్వేలం గతి = గమనము; ఉత్స్మిత = హాసము; ఈక్షణ = దృష్టి; క్ష్వేలం = పరిహాసమును; స్మరతః = స్మరించుచు (తరించుము.)

తా. ఓ కృష్ణా! నీ వచనములను, నీ చరితములను, నరలోకమునకు విలాసప్రాయమైన నీ గమనము, హాసము, దృష్టి, పరిహాసము లోనగు వానిని స్మరించుచుఁ గీర్తించుచు మేము మాయను తరించగలము.

శ్లో. ఏవం విజ్ఞాపితో రాజన్ భగవాన్ దేవకీసుతః,
ఏకాంతినం ప్రియం భృత్య ముద్ధవం సమభాషత. 52

అ. రాజన్ = రాజా! భగవాన్ = భగవంతుడు; దేవకీసుతః = కృష్ణుఁడు; ఏవం విజ్ఞాపితః = ఇట్లు విన్నవింపబడినవాఁడై; ఏకాంతినం = ఒకే దైవము నుపాసించువాడును; ప్రియం, భృత్యం, ఉద్ధవం = ప్రీతిపాత్రుడు, సేవకుడు, ఉద్ధవుని గూర్చి; సమభాషత = సంభాషించెను.

తా. ఓ రాజా! ఇట్లుద్ధవునిచే విన్నవింపఁబడినవాఁడై, దేవకీసుతుఁడు, భగవంతుఁడు, ఏకాంతభక్తుఁడు, ప్రియుఁడు, భృత్యుఁడైన యుద్ధవుని గాంచి యిట్లు వచించెను.

ఇతి శ్రీమద్భాగవతే, ఏకాదశస్కంధే షష్ఠోఽధ్యాయః.

ఇది శ్రీభాగవతమున నేకాదశస్కంధమున

ఆఱవ యధ్యాయము

సంపూర్ణము.

---

* వ. అంత. 89

కం. జ్ఞానమున నుద్ధవుఁడు దన
మానసమున నెఱిఁగి శ్రీరమాధిప ! హరి ! యో
దీనజనకల్పభూజమ !
శ్రీనాయక ! దిక్కు నీవె శ్రితభయహరణా ! 90

వ. ఇట్లు నుతియించి, దేవా ! నీవు యదుక్షయంబు గావించి చన నేమే విధంబున నిర్వహింతుము; నీ సహచరులమై గడిపిన మజ్జన భోజన శయనాసనాది కృత్యంబులు మఱవవచ్చునే ? అని యుద్ధవుం డాడిన వాసుదేవుం డిట్లనియె.

# సప్తమాధ్యాయము

## సంగ్రహశ్లోకము

స ప్తమే తూద్ధవజ్ఞానసిద్ధ్యై పృష్ట స్స్వయం హరిః,
సోవధూతేతిహాసో క్తగురుష్వష్టా వవర్ణయత్.

ఈ స ప్తమాధ్యాయమందు ఉద్ధవుడు జ్ఞానసిద్ధి కొఱకు ప్రశ్నింపగా, శ్రీకృష్ణుఁడు స్వయముగా అవధూతేతిహాసమునందు చెప్పఁబడిన గురువులందు ఎనమండ్రను వర్ణించెను.

శ్రీ భగవా నువాచ = భగవంతుఁడు వచించెను *

శ్లో. యదాత్థ మాం మహాభాగ తచ్చికీర్షిత మేవ మే,
బ్రహ్మా భవో లోక పాలాః స్వర్వాసం మేఽభికాంక్షిణః. 1

అ. మహాభాగ = ఓ మహాభాగ్యశాలి! మాం = నన్నుగూర్చి; యత్ + ఆత్థ = ఏమని నీవు చెప్పితివో; తత్ = అది; మే చికీర్షితం ఏవ = నాచే చేయనిచ్ఛగించబడినదియే; బ్రహ్మా = బ్రహ్మ; భవః = శివుఁడు; లోకపాలాః = లోకపాలురు; మే = నా యొక్క; స్వర్వాసం అభికాంక్షిణః = శ్రీవైకుంఠవాసమును కోరుచున్నారు.

తా. మహాభాగ్యశాలివగు ఉద్ధవా! నీవు నన్నుగూర్చి ఏమి వచించితివో అది యంతయు నేను చేయదలచినదియే. ఇక బ్రహ్మ, శివుడు, ఇంద్రాదిలోకపాలురును నేను శ్రీ వైకుంఠము నకు రావలెనని కాంక్షించుచున్నారు.

శ్లో. మయా నిష్పాదితం హ్యత్ర దేవకార్య మశేషతః,
యదర్థ మవతీర్ణోఽహ మంశేన బ్రహ్మణాఽర్థితః. 2

అ. బ్రహ్మణా - అర్థితః = బ్రహ్మచే ప్రార్థింపఁబడి; యదర్థం = ఎందుకొఱకు; అహం = నేను; అంశేన అవతీర్ణః = నాయంశముచే అవతరించితినో; మయా = నా చే; అత్ర = ఈ లోకమునందు; (తత్) దేవకార్యం = ఆ దేవతలకు హితమైన కార్యము; అశేషతః = పూర్తిగా; నిష్పాదితం = నెరవేర్పఁబడినది.

తా. నేను బ్రహ్మ ప్రార్థించగా ఎందుకొఱకు ఈ జగమునందు స్వాంశముచే అవత రించితినో, ఆ దేవతలకు హితమైన కార్యమంతయుఁ బూర్తిగా నేను కావించితిని.

---

* వ. అని ఉద్ధవుం డాడిన వాసుదేవుం డిట్లనియె. బ్రహ్మాది దేవతాప్రార్థనంబువం జేసి ధాత్రీభారంబు నివారించితి.

అవ. నీవు మాత్రము సర్వత్యాగముచే ఆత్మనిష్ఠగలవాడవు కమ్ము అని చెప్పు చున్నారు—

శ్లో. కులం వై శాపనిర్దగ్ధం నంక్ష్య త్యన్యోన్యనిగ్రహాత్,
సముద్ర స్సప్తమే ఒహ్న్యేనాం పురీం సంప్లావయిష్యతి 3

అ. కులం, వై = ఈ యాదవకుల మన్ననో; శాపనిర్దగ్ధం = విప్రశాపముచే దగ్ధమైనది; అన్యోన్యనిగ్రహాత్ = ఒండొరులతో తలపడుటవలన, నంక్ష్యతి = నాశముకాఁగలదు; సముద్రః = సముద్రము; సప్తమే అహ్ని = ఏడవదినమున; ఏనాం పురీం = ఈ ద్వారకాపురిని; సంప్లావయిష్యతి = ముంచివేయఁగలదు.

తా. ఈ యదుకులము విప్రశాపముచే దగ్ధమై. యాదవుల పరస్పర నిగ్రహము వలన నశింపగలదు. నేటికి ఏడవనాడు సముద్ర మీ ద్వారకాపురమును ముంచివేయఁగలదు.

శ్లో. యర్హ్యేవాయం మయా త్యక్తో లోకో ఒయం నష్టమంగళః,
భవిష్య త్యచిరా త్సాధో కలినా ఒపి నిరాకృతః. 4

అ. యర్హి ఏవ = ఎప్పుడైనచో; అయం లోకః = ఈ లోకము; మయా త్యక్తః = నాచే త్యజింపబడునో—అప్పుడే; నష్టమంగళః భవిష్యతి = శుభములు నశించినది కాగలదు; సాధో = ఓ సజ్జనుడా! అచిరాత్ = సత్వరమే; కలినా + అపి = కలిచేతను; నిరాకృతః = నిరసింపఁబడును.

తా. నేనెప్పుడు ఈ లోకమును త్యజింతునో అప్పుడే ఈ లోకము శుభములు లేని దగును. త్వరగనే కలిపురుషుఁడు సైతము దీనిని ఆకుల పెట్టును.

శ్లో. న వ స్తవ్యం త్వయైవేహ మయా త్యక్తే మహీతలే,
జనో ఒధర్మరుచి ర్భద్ర ! భవిష్యతి కలౌ యుగే. 5

అ. మయా త్యక్తే మహీతలే = నాచే త్యజింపఁబడిన భూతలమందు; త్వయా = నీచే; ఇహ = ఇందు; న వస్తవ్యం ఏవ = వసింపదగినదే కాదు. భద్ర = ఓ మంగళశీలుడా! కలౌ యుగే = కలియుగమందు; జనః = జనము; అధర్మరుచిః = అధర్మమునందు అభిరుచి గలది; భవిష్యతి = కాగలదు.

తా. నేను ఈ భూతలమును త్యజించిన తర్వాత నీవు ఎంత మాత్రము ఇందు వసింపఁ తగదు. ఈ కలియుగమునందు ప్రజలు అధర్మమునందు అభిరుచిగలవారు కాగలరు.*

శ్లో. త్వం తు సర్వం పరిత్యజ్య స్నేహం స్వజనబంధుషు,
మయ్యావేశ్య మన స్సమ్య క్సమదృ గ్విచరస్వ గామ్. 6

త్వం తు = నీవు మాత్రము; స్వజనబంధుషు = దారపుత్ర బంధువులందు, సర్వస్నేహం (ఉన్న) సర్వమైత్రిని; పరిత్యజ్య = త్యజించి; మనః = మనస్సును; మయి + ఆవేశ్య = నాయందు నిలిపి; సమదృక్ = సమదృష్టిగలవాఁడవై ; గాం విచరస్వ = భూమిపై చరింపుము.

---

* ఇంక ద్వారకానగరంబు నిందుకు సప్తమదివసంబున సముద్రుండు ముంపంగలవాఁడు. యదుక్షయంబునుం గాఁగలయది అంతటం గలియుగంబు ప్రాప్తం బయ్యెడి.

తా. నీవు దారపుత్రాదులందును బంధుమిత్రులందును గల సమస్తమైత్రిని (ప్రేమను) త్యజించి, నా యందు మనస్సుంచి, భూమిపై నెల్లెడల సంచరింపుము.

అవ. ఓయీ! గుణదోషములతోఁ గూడిన లోకమందు సమదృష్టిగలవాఁడ నెట్లగుదును. అనగాఁ జెప్పుచున్నారు—

శ్లో. యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః,
నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్. **7**

అ. యత్=ఏది; మనసా, వాచా, చక్షుర్భ్యాం=మనస్సుచే వాక్కుచే నేత్రములచే; శ్రవణాదిభిః=చెవులులోనగు వానిచే; గృహ్యమాణం=గ్రహించఁబడునది. నశ్వరం విద్ధి=నశించునదిగా నెఱుంగుము; మాయామనోమయం=మనోమయమైనందున మాయ యని ఎఱుంగుము.

తా. ఏది మనస్సుచే వాక్కుచే నేత్రములచే శ్రవణములోనగు వానిచే గ్రహింపఁబడు చున్నదో అది యంతయు మనస్సుద్వారా తెలియఁబడుచున్నది. కావున నిదియంతయు నశించి పోవున దనియు, మాయామయమై యున్నదనియు గుర్తెఱుంగుము. మాయచేఁ గల్పితమైనది స్థిరము గాదు. మాయయు స్థిరతరముగాదు. అదియు నశ్వరమని యెఱుంగుము *

శ్లో. పుంసోఽయుక్తస్య నానార్థో భ్రమ స్స గుణదోషభాక్,
కర్మాకర్మవికర్మేతి గుణదోషధియో భిదా. **8**

అ. అయుక్తస్య పుంసః=విక్షిప్తమనస్సు గల పురుషునికి; నానార్థః, భ్రమః=భేద విషయకమగు భ్రమ ఏదియో; సః=ఆ భ్రమ; గుణదోషభాక్=గుణ దోషములకు స్థానము; గుణదోషధియః=గుణ దోషములు గల బుద్ధులు; కర్మ+అకర్మ=వికర్మ+ఇతి=కర్మ అకర్మ వికర్మ అని; భిదా=భేదము గలవగును.

తా. చంచలచిత్తుఁ డగు పురుషునికి వివిధ భేదములు గలదై గుణదోషములు గలదైన భ్రమయుండును. కర్మ అకర్మ, వికర్మ అని గుణదోషబుద్ధులు పెక్కు భేదము కలిగి యుండును.

విశేషము. ఓయీ! వేదమే విధినిషేధములకు భేదము సత్యము అని చెప్పినది కాని భ్రమవిజృంభిత గుణదోషబుద్ధి గల పురుషునికి కాదుగదా అనగా వేదవిహితమైనది కర్మ. దాని చేయకుండుట అకర్మ. నిషిద్ధమైన కర్మ వికర్మ. ఈ మూడును అవిద్యావంతు నుద్దేశించియే వేదమున కన్పట్టునని తెలియును.

---

* అందు మానవులు ధర్మవిరహితులును, వాచారహీనులును, వన్యాయపరులును, వతి రోషులును, మందమతులును, వల్పతరాయువులును, బహురోగపీడితులును, నిష్ఫలారంభులును, నాస్తికులునై, యొండొరుల మెచ్చక యుందురు. కావున నీవు సుహృద్బాంధవ స్నేహంబు వర్జించి, యింద్రియ సౌఖ్యంబులఁ గోరయక, క్షోణితలంబునం గల పుణ్యతీర్థావగాహనంబు సేయుచు, మానస వాగక్షిశ్రోత్ర ఘ్రాణేంద్రియ గృహ్యమాణం బగు వస్తుజాతంబు నశ్వరంబుగా నెఱుంగుము.

అవ. పరిచ్ఛిన్నుడైన ఆత్మయొక్క విస్తారమైన జగత్తు నెట్లు గ్రహింపదగును అనగా జెప్పుచున్నారు—

శ్లో. తస్మా ద్యుక్తేంద్రియగ్రామో యుక్తచిత్త ఇదం జగత్,
ఆత్మ నీక్షస్వ వితత మాత్మానం మ య్యధీశ్వరే. 9

అ. తస్మాత్ = అందువలన; యుక్తేంద్రియగ్రామః = నియుక్తమైన ఇంద్రియవర్గము కలిగి; యుక్తచిత్తః = నియమితచిత్తుడవై; ఇదం జగత్ = ఈ జగత్తును; ఆత్మని ఈక్షస్వ = నీ ఆత్మయందు చూడుము; వితతం ఆత్మానం = ఇట్లు జగద్రూపముగ విస్తరించిన ఆత్మను; అధీశ్వరే = జగదీశ్వరుడైన; మయి = బ్రహ్మమైన నాయందు; ఈక్షస్వ = జగద్రూపముతో చూడుము.

తా. కాబట్టి నీవు శ్రోత్రాదీంద్రియముల నెల్ల నిగ్రహించి మనోనిగ్రహము గలవాడవై, ఈ జగత్తును నీ ఆత్మయందు వీక్షింపుము. పిమ్మట నీ ఆత్మను జగదీశుడనై బ్రహ్మమైన నా యందు జగద్రూపముతో వీక్షింపుము.

అవ. ఓయీ! ఈ ప్రకారము యుక్తచిత్తుడై కర్మాచరణము గావింపనిచో దేవతలు విఘ్నములు గావింతు రనగా - అంత నిట్లు చెప్పుచున్నారు—

శ్లో. జ్ఞాన విజ్ఞాన సంయుక్త ఆత్మభూత శ్శరీరిణామ్,
ఆత్మానుభవ తుష్టాత్మా నాంతరాయై ర్విహన్యతే. 10

అ. జ్ఞానవిజ్ఞానసంపన్నః = వేదతాత్పర్యనిశ్చయము, తదర్థానుభవము అను రెంటితోం గూడినవాడై; ఆత్మానుభవతుష్టాత్మా = ఆత్మానుభవముచేతనే సంతుష్టచిత్తుడై; శరీరిణాం = దేవతలు మున్నగు సర్వదేహులకు, ఆత్మభూత స్సన్ = ఆత్మయగువాడై; అంతరాయైః = విఘ్నములచే; న విహన్యతే = కొట్టువడడు.

తా. వేదతాత్పర్యనిశ్చయము తదర్థానుభవము అను రెంటినిగూడి ఆత్మానుభవముచే సంతుష్టచిత్తుడై సర్వశరీరధారులకు ఆత్మయైనవానికి విఘ్నములు బాధింపవు దీని భావ మిది. అపరోక్షానుభవము గలవాడు యథేచ్ఛముగా కర్మలు చేయవలెను. అనంతరము ఎల్ల ప్రాణులు ఆత్మభూతు డగుటచే వానికెవ్వరును విఘ్నములు సేయరు.

విశే. "అస్య హ దేవాశ్చ నాభూత్యా ఈశతే ఆత్మా హ్యేషాం స భవతి— జ్ఞానికి దేవతలు తమ ఐశ్వర్యముచే విఘ్నము కలుగింప సమర్థులుకారు. ఏలయన ఈ జ్ఞాని ఎల్లభూతములకు ఆత్మ యగుచున్నాడు.

అవ. అపరోక్ష జ్ఞానము కలిగినవాడ యుక్తి వచ్చినట్లు కర్మాచరణప్రసక్తి కూడ దనుచున్నారు.

శ్లో. దోషబు ద్ధ్యోభయాతీతో నిషేధా న్న నివర్తతే,
గుణబుద్ధ్యా చ విహితం న కరోతి యథార్భకః. 11

అ. దోషబుద్ధ్యా = దోషము అను బుద్ధితో; ఉభయ + అతీతః = విధినిషేధములు రెండును అతిక్రమించినవాడు; నిషేధాత్ = నిషేధకర్మనుండి; న నివర్తతే = నివర్తించఁడు; గుణదోషబుద్ధులకు అతీతుఁడైనవాఁడు ప్రాక్తన సంస్కారమువలన నిషేధము నాచరింపక తప్పక నివర్తించువాఁడే యగును. మఱి ఏమన దోషబుద్ధితో మాత్రము గాదు. మఱియును అట్లే గుణబుద్ధ్యా = గుణబుద్ధిచే; విహితం చ న కరోతి = వేదవిహితమైన కర్మ చేయడు; అర్భకః యథా = బాలుఁ డెట్లు సంకల్పవికల్పరహితుఁడై ఒక దానిని చేయును. ఒక దానిని విడుచును అట్లే.

తా. అజ్ఞుఁడైన బాలకుఁడు సంకల్పవికల్పరహితుఁడై ఒక పనిచేయును. అట్లే జ్ఞాని నిషేధకర్మ యని నివర్తించడు. విహితకర్మ యని చేయడు. అనగా ఇది చెడ్డది అని నిషిద్ధకర్మను త్యజింపఁడు. ఇది మంచిది అని విహితకర్మను చేయఁడు. విధినిషేధములగు కర్మలు రెండును జ్ఞాని దృష్టికి దోషములే యగును. కావున రెంటిని అతిక్రమించినవాడు. ప్రాక్తన సంస్కారమును బట్టి నిషిద్ధమైనది చేయఁడు. విహితమైన కర్మను చేయును అని భావము.

అవ. ఇట్లు వర్తించువానికి మరల సంసారము లేదు. అ . చున్నారు—

శ్లో. సర్వభూతసుహృచ్ఛాంతో జ్ఞానవిజ్ఞాననిశ్చయః
పశ్యన్ మదాత్మకం విశ్వం న విపద్యేత వై పునః. **12**

అ. సర్వభూతసుహృత్ = అన్ని ప్రాణుల యెడ మైత్రీభావము కలవాడు, శాంతః = శమాన్వితుడై, జ్ఞానవిజ్ఞాననిశ్చయః = వేదతాత్పర్య నిశ్చయము, తదర్థానుభవము కలవాడు; విశ్వం = జగమును; మత్ + ఆత్మకం = నా స్వరూపముగా; పశ్యన్ = చూచుచు; పునః న విపద్యేత = మరల సంసారమునఁ బడడు.

తా. సర్వభూతహితుఁడై, శాంతుఁడై, జ్ఞానవిజ్ఞాననిశ్చయుఁడై, ఈ విశ్వమును నా స్వరూపమునుగాఁ జూచుచు నుండువాఁడు మరల నీ సంసారమునఁ బడడు.*

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకుడు వచించెను.

శ్లో. ఇత్యాదిష్టో భగవతా మహాభాగవతో నృప,
ఉద్ధవః ప్రణిపత్యాహ తత్త్వజిజ్ఞాసురచ్యుతమ్. **13**

అ. నృప = రాజా; ఇతి = ఇట్లు; భగవతా = భగవంతునిచే; ఆదిష్టః = ఆజ్ఞాపించబడినవాడై; మహాభాగవతః = మహాభాగవతుడగు; ఉద్ధవః = ఉద్ధవుడు; తత్త్వజిజ్ఞాసుః = తత్త్వము నెఱుంగఁగోరి; అచ్యుతం = అచ్యుతుని; ప్రణిపత్య = ప్రణమిల్లి; ఆహ = వచించెను.

---

* పురుషుండు నానార్థకామంబుల నంగీకరించి, నిజ గుణదోషంబుల మోహితుండై యుండు. కావున హస్తిపకుండు గంధనాగంబులను బంధించు చందంబున, నింద్రియములను మనోవికారంబులను నిగ్రహించి, యీషణత్రయమును వర్జించి, మోదఖేదంబుల సముండవుగా వర్తింపుచు, నీ జగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి, మాయాదుల నాత్మతత్త్వాధీనంబులుగఁ దెలియుచు, జ్ఞానవిజ్ఞాన యుక్తుండవై, యాత్మానుభవ సంతుష్టుండవై విశ్వంబును నన్నుగా భావించి వర్తింపవలయు.

తా. ఓ రాజా! ఇట్లు భగవంతుఁడు ఆదేశించఁగా విని మహాభాగవతుఁడగు ఉద్ధవుఁడు తత్త్వము నెఱుంగఁగోరి అచ్యుతునికి బ్రణమిల్లి యిట్లు వచించెను.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుఁడు వచించెను.

అవ. "నీవు సర్వమును పరిత్యజించి" అని చేసినయట్టి యుపదేశము తనకు అయోగ్యము అని తలంపుచుఁ బ్రశ్నించుచున్నాఁడు—

శ్లో. యోగేశ యోగవిన్న్యాస యోగాత్మన్ యోగసంభవ,
నిశ్శ్రేయసాయ మే ప్రోక్త స్త్యాగ స్సన్న్యాసలక్షణః. **14**

అ. యోగీశ = యోగఫల మిచ్చువాఁడా; యోగవిన్న్యాస = యోగవిదులం దుంచఁబడిన అతిగోప్యమైన నిక్షేపమైనవాఁడా! లేక యోగమునకు లక్ష్యమైనవాఁడా; యోగాత్మన్ = యోగమునందు ఆత్మను ప్రకటించువాఁడా లేక యోగస్వరూపుఁడా; యోగసంభవ = యోగమును సంభవింపఁజేయువాఁడా—ఈ నాలుగు సంబోధనములచే స్వమహిమచే కేవల తత్త్వము నీచే నుపదేశించఁబడినది. కాని నా అధికారమును పర్యాలోచించి చెప్పఁబడినది కాదు; నిశ్శ్రేయసాయ = మోక్షము కొఱకు; మే = నాకు, త్యాగః, సన్న్యాసలక్షణః = త్యాగ రూపమైన సన్న్యాస స్వరూపము; ప్రోక్తః = చెప్పఁబడినది; ఈ త్యాగము ఆరోగ్యాదికము కొఱకు సర్వస్వదానాదికము వలె కాక సన్న్యాసరూపము.

తా. ఓ యోగఫలదాయకా! యోగవిదులకు అతిగోప్యమై నిక్షేపమైనవాఁడా! యోగమందు ఆత్మను ప్రకటించువాఁడా! యోగస్వరూపా! యోగమును సంభవింపఁజేయువాఁడా! నీవు నీ మహిమను బట్టి నాకు త్యాగరూపమైన సన్న్యాసము నుపదేశించితివి. ఈ త్యాగము ఆరోగ్యాదులు గోరువానికి సర్వము దానము చేయుచున్నట్లు కాక సన్న్యాస రూపము అని భావము.

శ్లో. త్యాగోఽయం దుష్కరో భూమన్ కామానాం విషయాత్మభిః,
సుతరాం త్వయి సర్వాత్మ న్నభక్తై రితి మే మతిః. **15**

అ. భూమన్ = భూమానందరూపా; విషయ + ఆత్మభిః = విషయము లందు మనస్సు గలవారిచే; కామానాం = కోరికల యొక్క; అయం త్యాగః = ఈ త్యాగము; దుష్కరః = అసాధ్యము; సర్వాత్మన్ = ఓ సర్వుల కాత్మయైనవాఁడా; త్వయి అభక్తైః = నీ యందు అభక్తులైనవారిచే; సుతరాం న = ఏ మాత్రము సాధ్యము కాదు; ఇతి మే మతిః = అని నా అభిప్రాయము.

తా. ఓ భూమానందరూపా! ఓ సర్వప్రాణులకు ఆత్మయైనవాఁడా! విషయేచ్ఛలందు మనస్సుగలవారికి కోరికలను త్యజించుట అసాధ్యముగును. అందును నీయందు భక్తులు కానివారికి ఆ కామముల త్యాగము అత్యంతము అసాధ్యమని నా యుద్దేశము.

శ్లో: సోఽహం మమాహ మితి మూఢమతి ర్విగాఢ
స్త్వన్మాయయా విరచితాత్మని సానుబంధే,
తత్త్వంజసా నిగదితం భవతా యథాఽహం
సంసాధయామి భగవ న్ననుశాధి భృత్యమ్. **16**

అ. భగవన్ = ఓ భగవంతుడా! [illegible] అహం = (ఎవనికొఱకై నీవు త్యాగాదిక ముప దేశించితివో) ఆ నేను; [illegible] = [illegible] సహితముగు; త్వత్ + మాయయా, విరచి తాత్మని = నీ మాయచే కల్పింపబడిన [illegible]; అహం, మమ ఇతి = నేను, నాది అని; మూఢమతిః = మూఢమతినై : [illegible] = [illegible] యున్నాను; ఇందువలన; తత్ తు = నీ వుపదేశించిన త్యాగాదికమును, [illegible] = ఎట్లు; అహం = నేను; అంజసా = సుఖముగ; సంసాధయామి = సాధింతునో: (తథా = అట్లు), భృత్యం = సేవకుడ నగు నన్ను; అనుశాధి = మెల్లగా శిక్షితుని జేయుము.

తా. ఓ భగవానుడా! [illegible] భ్రాంతికి లోనై దేహము నే ననియు, పుత్రదారాదులు నా [illegible], [illegible] మమకారములకు వశుడనై మూఢ మతినై యున్నాను నీవు నా [illegible] నే నెట్లు సుఖముగ సాధింతునో యా విధానమును సేవకుడ[illegible] మెల్లగా [illegible].

అవ. "నేను సంక్షే[illegible] జెప్పి[illegible] విస్తరముగ తెలి[illegible]చో నన్యుల నడుగు" మని యెద వేమో అని [illegible] జెప్పుచున్నారు —

శ్లో. సత్యస్య తే స్వదృశ ఆత్మన ఆత్మనోఽన్యం
వక్తార మీశ విబుధే ష్వపి నానుచక్షే,
సర్వే విమోహితధియ స్తవ మాయ యేమే
బ్రహ్మాదయ స్తనుభృతో బహిరర్థభావాః 17

అ. ఈశ = ఓ ప్రభూ! స్వదృశః = స్వప్రకాశుడవు, సత్యస్య ఆత్మనః = సత్యస్వరూపు డవు. పరమాత్మవగు; తే = నీ[illegible]; అన్యం = [illegible]; ఆత్మనః = నాకు; వక్తారం = ఉప దేశకుని; విబుధేషు + అపి = దేవత[illegible]; న + అనుచక్షే = చూడకున్నాను; ఇమే బ్రహ్మా దయః = ఈ బ్రహ్మాదులగు; [illegible] = సకలశరీరధారులు; తవ మాయయా = నీ మాయచే; విమోహితధియః = మోహి[illegible]బడిన బుద్ధికలవారు; బహిరర్థభావాః = విషయ సుఖములందు ప్రయోజనబుద్ధి [illegible]. [illegible]ఖులు కారని భావము.

తా. స్వప్రకాశుడవై, సత్యస్వరూపుడవై, పరమాత్మవైన నీకంటె నన్యులు నా కుప దేశించువారు దేవతలందును [illegible]. ఏలయన నీవు స్వతస్సిద్ధ జ్ఞానసంపన్నుడవు. ఈ శరీరధారులగు బ్రహ్మాదిదేవత [illegible] నీ మాయామోహితులు. వారు బాహ్యములగు విషయసుఖములం దాసక్తులై [illegible] ముఖ్యప్రయోజన మని తలంచువారు. అంతర్ముఖులు కారు.

శ్లో. తస్మా ద్భవంత మనవద్య మనంతపారం
సర్వజ్ఞ మీశ్వర మకుంఠ వికుంఠ ధిష్ణ్యమ్,
నిర్విణ్ణధీ రహ ముహో వృజినాభి[illegible]
నారాయణం నరసఖం శరణం ప్రపద్యే. 18

అ. ఉహో = ఓ భగవానుడా! తస్మాత్ = అందువలన; అనవద్యం = దోషరహితుడవు; అనంతపారం = దేశకాలముల[illegible] శక్తికలవాడవు; సర్వజ్ఞం = సర్వము నెఱిగినవాడవు; ఈశ్వరం = ఈశ్వరుడవు; అకుంఠవికుంఠధిష్ణ్యం = కాలాదులచే మొక్కవోని వైకుంఠలోకము

నివాసముగ కలవాడవు; నారాయణం=నారాయణుడవు; నరసఖం=జీవునికి సఖుడవగు; భవంతం=నిన్ను; వృజిన+అఖిల ప్తః=పాపములచే సంతప్తుడనై; నిర్విణ్ణధీః=నిర్వేదము నొందిన బుద్ధికలవాడనై; అహం=నేను; శరణం ప్రపద్యే=శరణుపొందుచున్నాను.

తా. లోకమున కొందరు దుశ్శీలురుగ నున్నారు. కొందరు సేవితులయ్యు ఫలిత మీయ దగిన సమయమున నశింతురు. కొందరి కేమియు తెలియదు. కొందరు రక్షించుట కసమర్థులు. కొందఱు తమ స్థానమునుండి భ్రష్టులు. వీరిని తొలగించుటకు 'అనవద్యం' లోనగు నైదు విశేషణము లుద్దేశింపబడినవి. ఓ భగవానుడా! నీవు దోషరహితుడవు, దేశకాలములచే గొట్టు వడని శక్తి గలవాడవు, సర్వజ్ఞుడవు, ఈశ్వరుడవు, కాలాదులచే మొక్కవోని వికుంఠలోకము నివాసముగ గలవాడవు, నారాయణుడవు, జీవునికి సఖుడవు (జీవుడు నీకు వంచింపదగనివా డనుట) అందువలన నేను పాపములచే నీ సంసారమందు తాపత్రయ సంతప్తుడనై, నిర్వేద బుద్ధి కలవాడనై, ఏమియు తోచనివాడనై నిన్ను శరణు పొందుచున్నాను.*

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు వచించెను.

అవ. అందువలన నీ ప్రకారముగా సంశయ విపర్యయములచే ఉపదేశింపబడిన తత్త్వము నిశ్చయించుకొనలేని వ్యక్తి కా సంశయ విపర్యయనివృత్తికై గురూపదేశము లేకున్నను స్వప్రయత్నము చేతనే అన్వయవ్యతిరేకసహచారములచే తత్త్వజ్ఞానము కలుగునని చూపుటకు వచించుచున్నారు—

శ్లో. ప్రాయేణ మునయో లోకే లోకతత్త్వ విచక్షణాః,
సముద్ధరన్తి హ్యాత్మాన మాత్మనై వాశుభాశయాత్. **19**

అ. ప్రాయేణ=తఱచుగా; లోకే=లోకమునందు; లోకతత్త్వవిచక్షణాః=ఆయా వస్తువులలో స్థిరముగ నెలకొనియుండు గుణములను పరీక్షించెడి; మునయః=మునులు; ఆత్మానం=తమ్ము; ఆత్మనా+ఏవ=ఆత్మజ్ఞానముచేతనే; అశుభ+ఆశయాత్=విషయవాసనను౦డి; సముద్ధరన్తి=ఉద్ధరింపగలుగుచున్నారు.

తా. సాధారణముగ మును లీ లోకమున లోకతత్త్వ మెఱిగినవారై యున్నారు. వారు తమ ఆత్మజ్ఞానముచేతనే తమ్ము విషయవాసనలనుండి యుద్ధరించుకొనఁ గలుగుచున్నారు.

---

*వ. అని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తివినయంబులం గరంబులు మొగిడ్చి, 'మహాత్మా! సన్న్యస్తలక్షణంబు దుష్కరంబు. పామరులగువా రాచరింపలేరు. నీ మాయచే భ్రాంతులై చేయునది తెలియని సాంసారికులు భవాబ్ధిం గడచి, యెట్లు ముక్తి వడయుదురు. భృత్యుండనైన నామీద యనుగ్రహంబునం జేసి యానతిమ్ము. బ్రహ్మాది దేవతాసముదయంబును బాహ్యావస్తువుల భ్రాంతులై పర్యటనంబు సేయుదురు. నీ భక్తులైన పరమభాగవతులు నమ్మాయా విరసవంబు సేయుదురు. గృహిణీ గృహస్థులకైన, యతులకైనను నిత్యంబు నీ నామస్మరణంబు మోక్ష సామ్రాజ్యప్రదంబు. కావున పరమేశ్వర! నీదు చరణంబుల శరణంబు నొందెద. కృపారసంబు నాపై నిగుడింపుము.

అవ. దానినే నిరూపించుచున్నారు. —

శ్లో. ఆత్మనో గురు రాత్మైవ పురుషస్య విశేషతః,
యత్ప్రత్యక్షానుమానాభ్యాం శ్రేయోఽసా వనువిందతే. 20

అ. ఆత్మనః = (పశ్వాదిశరీరములం దున్నను) ఆత్మకు, విశేషతః + విశేషించి, పురుషస్య=పురుషునకు; ఆత్మా + ఏవ = ఆత్మయే; గురుః = (హితాహితజ్ఞానమున)గురువు; యత్ శ్రేయః=ఏ మోక్షరూపమగు శ్రేయమును; అసా=ఈ పురుషుడు; ప్రత్యక్షానుమానాభ్యాం=ప్రత్యక్షము, అనుమానము అను ప్రమాణములచే, అనువిదంతే = పొందునో.

తా. పశ్వాది శరీరమునం దున్నను ఆత్మకు, మీదు మిక్కిలి పురుషున కాత్మయే హితాహితపరిజ్ఞానమున గురు వగుచున్నాడు. కనుక నీ పురుషుడు మోక్షరూపమగు తన శ్రేయస్సును ప్రత్యక్షప్రమాణము (ఇంద్రియగోచర జ్ఞానము) చేతను, అనుమాన ప్రమాణము (కార్యకారణ హేతువు) చేతను పొందును.

అవ. అందు ప్రత్యక్షమును తెలుపుచున్నారు —

శ్లో. పురుషత్వే చ మాం ధీరా స్సాంఖ్యయోగవిశారదాః.
అవిస్తరం ప్రపశ్యన్తి సర్వశక్త్యుపబృంహితమ్. 21

అ. పురుషత్వే చ = మనుష్యజన్మమందును; సాంఖ్యయోగవిశారదాః = సాంఖ్యయోగదర్శనముల తత్త్వము నెఱిగిన, ధీరాః=పండితులు; సర్వశక్తి+ఉపబృంహితం=జ్ఞానైశ్వర్యాది సర్వశక్తులను విస్తరించు; మాం=నన్ను; అవిస్తరం=సూక్ష్మరూపునిగా; ప్రపశ్యన్తి=చూచుచున్నారు.

తా. సాంఖ్యయోగదర్శనముల తత్త్వ మెఱిగిన పండితులు, పురుషుడై ప్రవర్తించు జీవభావమందును జ్ఞానైశ్వర్యాది శక్తులను వర్ధిల్లజేయు సూక్ష్మరూపునిగా నన్ను దర్శింతురు.

విశే అట్లే శ్రుతియు — 'పురుషత్వే చావిస్తరోఽయ మాత్మా స హి ప్రజ్ఞానేన సంపన్నతమో విజ్ఞాతం వదతి, విజ్ఞాతం పశ్యతి, వేద శ్వస్తనం, వేద లోకాలోకా' మర్త్యేనామృత మీప్స త్యేవం సంపన్నోఽథేతరేషాం పశూనా మశనాయాపిపాసే ఏవాభిజ్ఞాన' మితి. అతడు (పరమాత్మ) ప్రకృష్టమైన జ్ఞానముతో కూడినవాడై - పురుషధర్మమందు సూక్ష్మరూపమున నుండును. అతడు ప్రజ్ఞానముతో సంపన్నతముడై విజ్ఞానమును (తెలియవచ్చు దానిని) వచించును. విజ్ఞానమును దర్శించును. రేపు కలుగబోవుదానిని ఎఱుంగును. దృశ్యప్రపంచమును అదృశ్యమగు మాయను ఎఱుంగును. లోకాలోకముల నెఱుంగును. మర్త్యరూపముచే అమృతము (మోక్షము)ను కాంక్షించుచు, ఈ ప్రకారముగ నున్నారు. ఇతరములగు పశువులకు, జంతువులకు అకలిదప్పులనే ఎఱుగు జ్ఞానమై యున్నాడు.

అవ. ఇందువలన మానవత్వమును స్తుతించుచున్నాడు. —

శ్లో. ఏక ద్వి త్రి చతుష్పాదో బహుపాద స్తథాఽపదః,
బహ్వ్యః సన్తి పుర స్సృష్టా స్తాసాం మే పౌరుషీ ప్రియా. 22

అ. ఏక - ద్వి - త్రి - చతుష్పాదః = ఒకటి, రెండు, మూడు, నాలుగు పాదములు కలవి; బహుపాదః = చాలపాదములు కలవి; తథా = అట్లే; అపదః = పాదములు లేనివి; బహ్వ్యః = అనేకములు; సృష్టాః = పుట్టించబడిన; పురః = శరీరములు; సన్తి = ఉన్నవి; తాసాం = వానిలో; మే = నాకు, పౌరుషీ = మనుష్యుని తనువు; ప్రియా = ఇష్టమైనది.

తా. నాచే సృజింపబడిన ప్రాణుల శరీరములు ఒక్కపాదముగల పిశాచాదుల శరీరములు, రెండు పాదములు గల నరపక్ష్యాదుల శరీరములు, మూడు పాదములు గల రాక్షసాదుల శరీరములు, నాల్గు పాదములుగల జంతువుల శరీరములు, బహుపాదములు గల వృక్షముల శరీరములు, పాదములు లేని సర్పాదుల శరీరములు గలవు. వానిలో నెల్ల వివేకము కలదగుటచే మానవుడు లోనగువారి శరీరమే నా కిష్టమైనది.

అవ. అనుమానప్రమాణమును చెప్పుచున్నారు.—

శ్లో. అత్ర మాం మృగయం త్యద్ధా యుక్తా హేతుభి రీశ్వరమ్,
గృహ్యమాణై ర్గుణై ర్లింగై రగ్రాహ్య మనుమానతః. 23

అ. అత్ర = ఈ పురుషశరీరమందు; యుక్తాః = అప్రమత్తతతో కూడిన జ్ఞానముకలవారై; అగ్రాహ్యం = గ్రాహ్యములైన అహంకారాదులకంటె వ్యతిరిక్తుఁడైన నన్ను; అద్ధా = సాక్షాత్తుగా; మృగయన్తి = వెదుకుచున్నారు. అన్వేషణయందు ప్రకారద్వయమును జెప్పుచున్నారు — గృహ్యమాణైః గుణైః = గ్రహింపబడుచున్న బుద్ధి లోనగువాని గుణములైన; హేతుభిః = కారణములచేత; జడాదులకు ప్రకాశము సర్వప్రకాశమగు వేఱొకటిలేక ఘటిల్లదు. అను ఉపపత్తిముఖమునఁ గలుగు లక్షణములచేతను ఆ ప్రకారము; లింగైః = వ్యాప్తిముఖమున గల కారణములచే; అనుమానతః = అనుమానమునుబట్టి; ఈశ్వరం = ఇంద్రియాదుల ప్రవర్తకుని; మృగయంతి = అన్వేషింతురు.

తా. బుద్ధ్యాదికరణములు కర్తృప్రయోజ్యములు. కరణము లగుటవలన తత్త్వజ్ఞాన సాధనములు 'ఉలి' లోనగువానివలె అగుచున్నది అట్లే చెప్పబడినది.

శ్లో. భగవాన్ సర్వభూతేషు లక్షిత స్స్వాత్మనా హరిమ్,
దృశ్యై ర్బుద్ధ్యాదిభి ర్ద్రష్టా లక్షణై రనుమాపకైః.

తా. భగవంతుఁడగు హరి సర్వభూతములందును స్వస్వరూపమున ఆత్మయై గోచరించుచున్నాడు. దృశ్యములై, బాహ్యములై, బాహ్యార్థములను గ్రహించు బుద్ధిలోనగువాని ధర్మముల చేత అనుమాపకుఁడు. వ్యాప్తిముఖమున అనుమానించు అనుమానాది ప్రమాణములచేత ద్రష్ట (సాక్షిభూతుఁడు) తెలియఁబడుచున్నాఁడు. ఇంతమాత్రముచేతనే ఆత్మ అనుమానికుఁడని తలంపఁగూడదు. దేహాదివ్యతిరిక్తు డని పదార్థశుద్ధిమాత్రమే అనుమానముచే వివక్షితమైయున్నది

ఈ పురుషశరీరమందు మానవాది దేహమును గూడి యుక్తులైన (వివేకవంతులు) మునులు అప్రమత్తులై అహంకారాస్పదములగు దేహేంద్రియాదులకంటె వ్యతిరిక్తుడైన,

నన్ను సాక్షాత్తుగా అన్వేషింతురు. ఎట్లనఁగా దానికి రెండుమార్గములు చెప్పుచున్నారు. శబ్దాదులను ఇంద్రియముల ద్వారా గ్రహించునవైన మనోబుద్ధ్యాదుల గుణములచే జడాదుల ప్రకాశము అనఁగా జడాదుల నెఱుఁగు జ్ఞానము స్వప్రకాశమగు ఆత్మ యొక్కటి లేకున్న ఘటిల్లదు. యుక్తియుక్తమగు వివేకముద్వారా ఏర్పడిన లక్షణములచేతను ఆ ప్రకారము అవే లక్షణములుగాగల (ఎక్కడ పొగయుండునో అక్కడ అగ్నియుండును ఇత్యాది) వ్యాప్తి లక్షణములచేనైన అనుమాన ప్రమాణములచేతను, ఇంద్రియప్రవర్తకుఁడగు ఈశ్వరు నన్వేషించుచున్నారు. బుద్ధ్యాదీంద్రియములు కర్తచే ప్రయుక్తములై వద్రంగిచే ఉలిలోనగు సాధనములవలె ప్రవర్తించునవియే గాని స్వతంత్రములు గావు.

అవ. ఇప్పటివఱకు ఉపదేశింపబడిన తత్త్వమును సంశయ విపర్యయములవలన నిశ్చయించుకొనలేని వ్యక్తిని గూర్చి ఆ సంశయ విపర్యయములు తొలగించుటకు ప్రయత్నశీలమగు ఆత్మయే తత్త్వ ప్రతిపత్తిని గురించి కారణమని తెల్పుచున్నాడు. మరల నన్వయ వ్యతిరేకముల ద్వారా అసంభావనానివృత్తి విషయమై ఇతిహాసమును జెప్పుచున్నారు. ఈశ్వరు డున్నందున జగము తోచుట అన్వయము. ఈశ్వరుఁడు లేకున్న జగము తోచకుండుట వ్యతిరేకము.

శ్లో. అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్,
అవధూతస్య సంవాదం యదో రమితతేజసః. 24

అ. అత్ర = ఈ ఆత్మజ్ఞానవిషయమై; ఇమం ఇతిహాసం = ఈ ఇతిహాసమును; అవధూతస్య=అవధూతకు (సన్న్యాసికి); అమితతేజసః=గొప్పపరాక్రమశాలియైన; యదోః = యదురాజునకు; సంవాదం, ఉదాహరంతి= సంవాదమును ఉదాహరణముగా వచింతురు.

తా. ఈ ఆత్మజ్ఞానము విషయమై పెద్దలు పురాతనమైన ఇతిహాసమైన తేజోవంతుఁడగు యదురాజునకును ఒక అవధూతకును జరిగిన సంవాదమును దృష్టాంతముగా బేర్కొందురు.*

శ్లో. అవధూతం ద్విజం కంచి చ్చరంత మకుతోభయమ్,
కవిం నిరీక్ష్య తరుణం యదుః పప్రచ్ఛ ధర్మవిత్. 25

*వ. అని ప్రియసేవకుం డైన యుద్ధవుండు పలికిన, నతనికిఁ గంసమర్దనుం డిట్లనియె. అట్లుపురుషున కాత్మకు నాత్మయె గురువని యెఱుంగుము. కుపథంబులకుం జనక సన్మార్గవర్తియై, పరమపదం బయిన మన్నివాసంబునకుం జనుము. సర్వమూలశక్తి సంపన్నుడనైన నన్ను సాంఖ్యయోగపరులు నిరంతరభావంబులందు బురుషభావంబుగా భావించి తలంపుచుండుదురు. మఱియు నేక ద్విత్రి చతుష్పాద బహుపాదాపాదంబులునై యుండు జీవజాలంబుల లోన ద్విపాదంబులు గల మనుష్యులు మేలు. వారలలోన నిరంతర ధ్యానగరిష్ఠులైన యోగీంద్రు లుత్తములు. వారలలో సందేహపరులచే నగ్రాహ్యుండగు నన్ను, సత్త్వగుణగ్రాహ్యునిగా నెఱిఁగి, నిజచేతఃపంకజంబునందు జీవాత్మపరమాత్మల నేకంబుగాఁ జేసి, శంఖ చక్ర గదాఖడ్గ శార్ఙ్గ మోదకీ కౌస్తుభాభరణ యుక్తుంగాఁ దలంపుచు నుండు వారలు, పరమయోగీంద్రు లనియును, పరమజ్ఞాను లనియును జెప్పి, మఱియు, నవధూత యదుసంవాదం బను పురాతనేతిహాసంబు గలదు, జెప్పెద నాకర్ణింపుము.

అ. ధర్మవిత్ = ధర్మ మెఱిగిన; యదుః = యదుమహారాజు; అకుతోభయం = దేనివలనను భయములేనివాడై; చరంతం = తిరుగుచున్నవాడును; కవిం = జ్ఞానియు; తరుణం = యువకుడును; ద్విజం = బ్రాహ్మణుడగు; అవధూతం = సన్న్యాసిని; నిరీక్ష్య = చూచి; పప్రచ్ఛ = అడిగెను.

తా. ఒకనాడు ధర్మములన్నియు నెఱింగిన యదురాజు, ఎందును భీతిలేక సంచరించుచు ద్విజుఁడు, యువకుఁడు, జ్ఞానియు నైన ఒక అవధూతను గాంచి యిట్లు ప్రశ్నించెను.

యదు రువాచ = యదువు వచించెను —

శ్లో. కుతో ను ధీరియం బ్రహ్మ న్నకర్తు స్సువిశారదా,
యా మాసాద్య భవాన్ లోకే విద్వాం శ్చరతి బాలవత్. 26

అ. బ్రహ్మన్ = ఓబ్రహ్మజ్ఞుడా! అకర్తవైన (ఏ పని చేయక కర్తృత్వము వహించని నీ యొక్క; ఇయం ధీః = ఈ బుద్ధి; సువిశారదా = అతి నిపుణమై యున్నది; కుతః ను = ఎందువలని కలిగినది; యాం ఆసాద్య = ఏ బుద్ధిని పొంది, భవాన్ = నీవు; లోకే = లోకమునందు; విద్వాన్ = జ్ఞానివయ్యు; బాలవత్ - చరతి = బాలునివలె సంచరించుచున్నావు?

తా. ఓ విప్రోత్తమా! దేనికిని కర్తృత్వము వహించక సంచరించు నీకు ఇంతటి సమర్థమైన బుద్ధి ఎట్లు కలిగినది? అట్టి బుద్ధిని పొందిన నీవు జ్ఞానివయ్యు బాలుని వలె సంచరించుచున్నావు.

అవ. సర్వలోకమునకు ముఖ్యమైన వైలక్షణ్యమును చెప్పుచున్నారు—

శ్లో. ప్రాయో ధర్మార్థకామేషు వివిత్సాయాం చ మానవాః,
హేతునేహ సమీహంతే ఆయుషో యశస శ్శ్రియః. 27

అ. ప్రాయః = తఱచుగా; మానవాః = మానవులు; ఇహ = ఈ జగమందు; వివిత్సాయాం = ఆత్మవిచారమందును; ఆయుషః యశసః శ్రియః = ఆయువు, కీర్తి, సంపద, అనువాని యొక్క; హేతునా = (కామన అను) కారణముచే; సమీహంతే = ప్రవర్తించుచున్నారు.

తా. తఱచుగా మానవులు ఈ జగమందు ధర్మార్థకామములను పురుషార్థములందును ఆత్మవిచారమందును, ఆయువు, యశస్సు, సంపద అను వాని యందును ఆసక్తులై ప్రవర్తింతురు (కామన చేతనే వర్తింతు రనుట.)

శ్లో. త్వం తు కల్పః కవి ర్దక్ష స్సుభగో మితభాషణః,
న కర్తా నేహసే కించి జ్జడోన్మత్తపిశాచవత్. 28

అ. త్వం తు = నీవుమాత్రము; కల్పః = యువకుడవు; కవిః = జ్ఞానివి; దక్షః = కార్యాచరణ సమర్థుడవు; సుభగః = సుందరుడవు; మితభాషణః = మితముగా మాటలాడువాడవు, న కర్తా = ఒక పనిచేయు కర్తవు కావు జడ-ఉన్మత్త-పిశాచవత్ = మందమతి, పిచ్చివాడు, పిశాచమువలె; కించిత్ న + ఈహసే = ఏ ఇంచుకయు వాంఛింపవు.

తా. అయ్యా! నీవు ఏ ఒక్క పని చేయు కర్తవు గాక ఏ కించిత్తు వాంఛింపక మందమతి, ఉన్మత్తుడు పిశాచము వలె చరించుచున్నావు. అశక్తుడు, అజ్ఞాని, అసమర్థుఁడు, కురూపి

అతిభాషివి కావు. సమర్థుడవు, జ్ఞానివి, శక్తిమంతుడవు, సుందరుడవు, మితభాషివి. ఇట్లు యుండియు ఏల ఔదాసీన్యము వహించియున్నావు. ఇది ఏమి ?

శ్లో. జనేషు దహ్యమానేషు కామలోభ దవాగ్నినా,
న తప్యసేఽగ్నినా ముక్తో గంగాంభస్థ ఇవ ద్విపః. 29

అ. జనేషు=జనులు; కామలోభదవ+అగ్నినా=స్త్రీసంగమాభిలాష, ధనవాంఛవలన జనించిన అగ్నిచే; దహ్యమానేషు=తగులుపడుచున్నవారగుచుండగా; గంగా+అంభస్థద్విపః ఇవ=గంగాజలములందు నిల్చియున్న ఏనుగువలె; ముక్తః=ముక్తుడవై; అగ్నినా న తప్యసే=ఆకామాగ్నిచే తపింపకున్నావు.

తా. లోకమునందు జనులు స్త్రీ సంగమాభిలాష రూపమైన కామము, ధనవాంఛ అను అగ్నిచే మిగుల దగ్ధులై పోవుచుండ నీవు మాత్రము ఆ కామాదులనుండి విడుదల పొంది చల్లని గంగాజలములం దున్న ఏనుగు వలె ఏ తాపము లేక హాయిగ నున్నావు.

శ్లో. త్వం హి నః పృచ్ఛతాం బ్రహ్మ న్నాత్మ న్యానందకారణమ్,
బ్రూహి స్పర్శవిహీనస్య భవతః కేవలాత్మనః. 30

అ. బ్రహ్మన్=ఓ బ్రాహ్మణుడా ! స్పర్శవిహీనస్య=విషయభోగరహితుడు; కేవల+ఆత్మనః=కళత్రాది శూన్యుడవైన; భవతః-ఆత్మని=నీయొక్క-చిత్తమునందు; ఆనంద కారణం=ఆనందమునకు హేతువును; పృచ్ఛతాం నః=ప్రశ్నించు మాకు; బ్రూహి= చెప్పుము.

తా. ఓ విప్రా ! నీకు విషయసుఖమును చేకూర్చు భోగవస్తువులు లేవు. తనూ్మలమగు భార్యాపుత్రులును లేక ఒంటరివాడవైన నీకు చిత్తమునందు ఇంతటి గొప్ప ఆనందము కలుగుటకు కారణమేమో అని ప్రశ్నించు మాకు దానిని వచింపుము.*

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు వచించెను.

శ్లో. యదు నైవం మహాభాగో బ్రహ్మణ్యేన సుమేధసా,
పృష్ట స్సభాజితః ప్రాహ ప్రశ్రయావనతం ద్విజః. 31

అ. బ్రహ్మణ్యేన=బ్రాహ్మణభక్తికలిగి; సుమేధసా=చక్కని ప్రజ్ఞగల; యదునా=యదు రాజుచే;ఏవం పృష్టః=ఇట్లు ప్రశ్నింపబడి; సభాజితః ద్విజః=పూజింపబడిన ద్విజుడు; మహా భాగః=మహానుభావుడు; ప్రశ్రయ+అవనతం=వినయముతో వంచిన శిరము గల యదువును గూర్చి; ప్రాహ=ఇట్లు చెప్పెను.

---

*ఉ. పంకజనాభుఁ డుద్ధవునిపైఁ గల కూర్మినిఁ జెప్పె నొప్ప నెం
దంకిలి లేక యన్ని దిశలందుఁ జరింపుచు నిత్యతృప్తుడై
శంకరవేషధారి యొక సంయమి యా యదురాజుఁ జేర నే
వంకనుండి వచ్చి తన వానికి నిట్లనె వర్థి నేర్పడన్.

తా. వేదమునందును, బ్రాహ్మణులందును భక్తి గలవాఁడును, చక్కని ప్రజ్ఞ గల ఆ యదురాజిట్లు ప్రశ్నించి తన్నుఁ బూజింపగా, ప్రసన్నుఁడై మహానుభావుఁడగు ఆ ద్విజుఁడు వినయావనతుఁడైన ఆ యదురాజునకిట్లు బదులు చెప్పెను.

బ్రాహ్మణః ఉవాచ = బ్రాహ్మణుడు చెప్పెను.

శ్లో. సంతి మే గురవో రాజన్ బహవో బుద్ధ్యుపాశ్రితాః,
యతో బుద్ధి ముపాదాయ ముక్తోఽటామిహ తాన్ శృణు. 32

అ. రాజన్ = ఓ రాజా; బుద్ధి + ఉపాశ్రితాః = బుద్ధిచే స్వీకరించఁబడినవారు; బహవః = పెక్కండ్రు గురువులు; మే = నాకు; సంతి = కలరు; యతః = ఏ గురువులవలన; బుద్ధిం = జ్ఞానమును; ఉపాదాయ = గ్రహించి (ఉపదేశముచే కాదు); ముక్తః = ముక్తుఁడనై; ఇహ + అటామి = ఇందు చరించుచున్నాను; తాన్ శృణు = వారలను గూర్చి వినుము.

తా. ఓ రాజా! నా బుద్ధిచే స్వీకరించబడినవారు (ఉపదేశముచే కాదు) గురువులు పెక్కండ్రు నాకుఁ గలరు. ఆ గురువుల వలన జ్ఞానమును గైకొని ముక్తుఁడనై ఈ జగమందు చరించుచున్నాను. ఆ గురువులను చెప్పెదను వినుము.

శ్లో. పృథివీ వాయు రాకాశ ఆపోఽగ్ని శ్చంద్రమా రవిః,
కపోతోఽజగర స్సింధుః పతంగో మధుకృ ద్గజః. 33
మధుహా హరిణో మీనః పింగళా కురరోఽర్భకః,
కుమారీ శరకృ త్సర్ప ఊర్ణనాభి స్సుపేశకృత్. 34

అ. సుగమము.

తా. భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, కపోతము (పావురము) అజగరము (కొండచిలువ) సముద్రము, పతంగము (పక్షి), మధుకరము, గజము, మధుహారి, హరిణము, మీనము, పింగళ, కురరము (డేగ), అర్భకుడు, కుమారీ మృగము, శరకృత్తు (బాణము చేయు కమ్మరి) సర్పము, ఊర్ణనాభి (సాలెపురుగు) సుపేశకృత్తు (పురుగునకు శోభనమగు రూపమును గలిగించునది) అనువారు (ఇరువది నాలుగుమంది) గురువులు గలిగిరి.

శ్లో. ఏతే మే గురవో రాజం శ్చతుర్వింశతి రాశ్రితాః,
శిక్షావృత్తిభి రేతేషా మన్వశిక్ష మిహాత్మనః. 35

అ రాజన్! = రాజా! ఏతే మే గురవః = వీరు నాగురువులు; చతుర్వింశతిః ఆశ్రితాః = ఇరువది నలుగురు ఆశ్రయించఁబడినవారు; ఏతేషాం వృత్తిభిః = వీరి వర్తనలచే; ఇహ = ఇందు; ఆత్మనః = నాచిత్తమునకు; అన్వశిక్షం = శిక్షణీయములైన అర్థములను హేయోపాదేయాదులను అనగా విడువఁదగినవానిని (గ్రహింపఁదగువానిని) నేర్చినవాడనైతిని.

తా. ఓ రాజా! ఈ ఇరువది నలుగురు నేనాశ్రయించిన గురువు లగుదురు. నేను

వీరి వర్తనలచే నా చిత్తమునకు త్యజింపఁదగినవియు గ్రహింపఁదగినవియునగు విషయములను నేర్చుకొనినవాఁడనైతిని.*

శ్లో. యతో యదనుశిక్షామి యథా వా నాహుషాత్మజ,
తత్తథా పురుషవ్యాఘ్ర నిబోధ కథయామి తే. **36**

అ. నాహుషాత్మజ! = ఓ యయాతిపుత్రుడా! యతః = ఏ గురువువలన, యత్ = ఏ గుణము; యథా వా = ఏ ప్రకారము; అనుశిక్షామి = అభ్యసించితినో; తత్ తథా = ఆ గుణము ఆ ప్రకారము; తే కథయామి, నిబోధ = నీకు చెప్పెదను తెలిసికొమ్ము.

---

*కం. అవధూత వల్కె నంతటఁ
ప్రవిమల విజ్ఞాననిపుణభవ్యులు గురువుల్
తవిలిన నిరువది నలువురు
నవనిన్ విజ్ఞానినైతి నని పల్కుటయున్. 93

వ. అంత యదుప్రవరుం డిట్లనియె. దేహి లోభమోహాదుల వర్జించి, జనార్దను నేవిధంబున జేరవచ్చు? నెఱింగింపుము. అనిన, నతం డిట్లనియె. 94

సీ. పరధన పరదార పరదూషణాదులఁ బరవస్తుచింతఁ దాఁ బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప కట మున్న తనువు చంచలతను దగులకుండ
బుద్ధి సంచలతచేఁ బొదలక యట మున్న శ్లేష్మంబు గళమునఁ జేరకుండ
శక్తియుక్తులు మది సన్నగిల్లకమున్న భక్తిభావనచేతఁ బ్రౌఢుఁ డగుచు
తే. దైత్యభంజను దివ్యపాదారవింద
భజన నిజభక్తిభావనఁ బ్రాజ్ఞుఁ డగుచు
నవ్యయానందమును బొందు ననుదినంబు
నతఁడు గర్మవిముక్తుఁ డౌ ననఘచరిత! 95

ఉ. దారలయందుఁ బుత్ర ధన ధాన్యములందు ననేకభంగులం
గూరిమి చేయు మర్త్యుఁ డతిఘోర వియోగజ దుఃఖమగ్నుఁ డై
నేరుపు దక్కి చిక్కువడి నేతి వివేకవిహీనుఁ డై మనో
భారముతోఁ గపోతపతి భంగి నిజంబుగఁ బోవు నష్టమై. 96

వ. ఇందు కొక్క యితిహాసంబుగలదు. మహారణ్యంబున నొక్క కపోతంబు దారసమేతంబుగా నొక్క నికేతనంబు నిర్మించి, యన్యోన్యమోహాతిరేకంబునఁ గొంతకాలంబునకు సంతాన సమృద్ధి గలదియై, యపరిమితంబులైన పిల్లలు దిరుగాడుచుండఁ, గొన్ని మాసంబులు భోగానుభవంబునం బొరలుచుండం, గాలవశంబున నొక్క లుబ్ధకుం డురులొడ్డిన నందు దారాపత్యంబులు దగులుపడిన, ధైర్యంబు వదలి, మోహాతిరేకంబునం గపోతంబు గళత్రపుత్రస్నేహంబునం దాను నందుఁ జొచ్చియు, నధికచింతాభరంబునం గృశీభూతం బయ్యె. కావున నతితీవ్రంబైన మోహంబు గొఱగాదు. అట్లుగాన, నిరంతర హరిధ్యాన పరుండై, భూమి పవన గగన జల కృపీటభవ సోమ సూర్య కపోత తిలిత్స జలధి శరభ ద్విరేఫ గజ మధుమక్షికా హరిణ పాఠీన పింగళా కురర డింభక కుమారికా శరకృ త్సర్ప లూతా సుపేశకృత్తుల సముదయంబునుండి వాని గుణంబు లెఱింగికొని, యోగీంద్రులు మెలంగుదురు. అనిన. 97

తా, ఓ నహుషుని కుమారుఁడైన యయాతిపుత్రుఁడా! పురుషశ్రేష్ఠుఁడా! నేను ఏ గురువు వలన ఏ గుణము నే ప్రకారము నేర్చుకొంటినో ఆ గుణమును ఆ ప్రకారముగ చెప్పెదను వినుము.

శ్లో. భూతై రాక్రమ్యమాణోఽపి ధీరో దైవవశానుగైః,
తద్విద్వాన్న చలే న్మార్గా దన్వశిక్షం క్షితే ర్వ్రతమ్. **37**

అ. దైవవశ + అనుగైః = విధివశమున వర్తించు; భూతైః = ప్రాణులచే; ఆక్రమ్యమాణః అపి = మిగుల పీడింపబడుచున్నవాడైనను; ధీరః = పండితుడు; తత్ విద్వాన్ = ఆ-భూతములు దైవవశమున వర్తించునని ఎఱింగినవాడై; మార్గాత్ = తన ధర్మపథమునుండి; న చలేత్ = చలింపఁగూడదు. (అని), క్షితేః = భూమినుండి; వ్రతం = క్షమారూపమైన వ్రతమును లేక నియమమును; అన్వశిక్షం = నేర్చికొంటిని.

తా. ఎన్ని ప్రాణులు తనపై చరించుచు పీడించుచున్నను భూమి ఎట్లు ఓర్చి యుండుచున్నదో అట్లే దైవవశమున వర్తించు ప్రాణులు తన్ను పైకొని మిగుల పీడించుచున్నను అవి స్వతంత్రములు గావు. విధివశమున నవి తన్నట్లు పీడించుచున్న వని ఎఱింగిన పండితుఁడు తన ధర్మము నుండి వైదొలఁగగూడదు. చలింపఁదగదు. అని ఆ క్షితినుండి క్షమారూపమైన వ్రతమును నేర్చితిని. *

---

* కం. ఇవి దెలియవలయు నాకును, బ్రవిమలమతి వానిఁ దెలియఁబలుకు మనంగన్
వివరము వినుమని కృష్ణుఁడు సవినయుఁ డగు నుద్ధవునికిఁ జయ్యన చెప్పెన్.

వ. ఇవ్విధంబున, భూమివలన స్థైరణయు, గంధవహుని వలన బంధురంబగు పరోపకారంబును, విష్ణుపదంబువలనఁ గాలసృష్ట గుణసాంగత్యంబు లేమియు, నుదకంబువలన నిత్యశుచిత్వంబును, నగ్నివలన నిర్మలత్వంబును, నిశాకర ప్రభాకరులవలన నధికాల్పసమత్వ జీవగ్రహణ మోక్షంబులును, గపోతంబువలనఁ గళత్రపుత్రస్నేహంబును, నజగరంబువలన స్వేచ్ఛాసమాగతాహారంబును, వననిధివలన ముత్యాహాశోషణంబులును, శలభంబువలన శక్త్యనుకూల కర్మాచరణంబును, భృంగంబువలన సారమాత్రగ్రహణ విశేషంబును, స్తంబేరమంబు వలనం గాంతావైముఖ్యంబును, సరఘువలన నిరంతర సార సంగ్రహ గుణంబును, హరిణంబువలనఁ జింతాపరత్వంబును, జలచరంబువలన, జిహ్వాచాపల్యంబును, పింగళవలన యథాలాభసంతుష్టియు, కురరంబువలన మోహపరిత్యాగంబును, డింభకు వలన విచారపరిత్యాగంబును, కుమారికవలన సంగత్యాగంబును, శరకారుని వలనం దదేకనిష్ఠయు, దందశూకంబువలనం బరగృహవాసంబును, నూర్ణనాభివలన సంసార పరిత్యాగంబును, గణుందురువలన లక్ష్యగత జ్ఞానంబు విడువకుండుటయు, ననంగల వీనిగుణంబు లెఱింగి, కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యంబు లను నరిషడ్వర్గంబుల జయించి, జరామరణ విరహితంబుగా వాయువు వశంబు చేసి, గాత్రపవిత్రత్వంబు కొఱకు షట్కర్మనిరతుండై, పురనగర గ్రామంబులు పరిత్యజించి, పర్వతారణ్యంబుల సంచరింపుచు, శరీరధారణార్థంబు నియమిత స్వల్పభోజనుండై, ఖేదమోదం

(మిగతా 134 వ పేజీ చూడుడు.)

అవ. పర్వత రూపము, వృక్షరూపము గలదైన పృథివి వలన నేర్చిన గుణమును చెప్పుచున్నారు.

శ్లో. శశ్వత్పరార్థసర్వేహః పరార్థైకాంతసంభవః,
సాధు శ్శిక్షేత భూభృత్తో నగశిష్యః పరాత్మతామ్. **38**

అ. శశ్వత్ = ఎల్లప్పుడు; పర + అర్థ సర్వ + ఈహః = పరోపకారము కొఱకు సర్వ వాంఛలు లేక కార్యములు కలిగి యుండుటయు; పరార్థ + ఏకాంతసంభవః = పరోపకారము కొరకే ముఖ్యముగ పుట్టుక కలుగుటయు; పరాత్మతాం = పరాధీనమైన శరీరముగలవాఁడై యుండుట అను దానిని; భూభృత్తః = పర్వతమునుండియు; నగశిష్యః = వృక్షమునకు శిష్యుఁడైన; సాధుః = సత్పురుషుఁడు; శిక్షేత = నేర్వవలెను.

తా. ఎల్లప్పుడు పరోపకారము కొఱకు సర్వవాంఛలు కలిగియు, పరోపకారమే తన జన్మకు ముఖ్య ప్రయోజనముగా కలిగియుండుటయు- పర్వతము నుండియు, పర్వతము నుండి జనించిన చెట్లు పొదలు తీగెలు గడ్డి సెలయేరులు నీటి ప్రవాహములు లోనగునవి పరోప కారమునకు ఉన్నవో అట్లే పర్వతము వలన బరోపకారమును— వృక్షమునకు శిష్యుఁడై పరాధీనతను (వృక్షము ఖండించినను, పెళ్ళగించినను కొనిపోయినను అనుమతించి పరాధీనమై యుండునట్లు వృక్షము వలన పరాధీనతను) సాధుపురుషుఁడు నేర్వవలెను. అట్లే నేను నేర్చితి నని భావము.

అవ. వాయువు సైతము ప్రాణము-బాహ్యము అని ద్వివిధము. వాని యందు ప్రాణమునకు గురుత్వమును చెప్పుచున్నారు—

శ్లో. ప్రాణవృత్త్యైవ సంతుష్యే న్మని ర్నైవేంద్రియప్రియైః,
జ్ఞానం యథా న నశ్యేత నావకీర్యేత వాఙ్మనః. **39**

అ. ప్రాణవృత్త్యా ఏవ = ప్రాణజీవనమగు ఆహారాదికమును గ్రహించుటచేత; సంతుష్యేత్ = సంతోషించవలెను; న + ఏవ + ఇంద్రియప్రియైః = ఇంద్రియములకు ప్రియమైన రూపరసాదులచేతఁగాదు. విషయములను ఆపేక్షింపకూడదు; మునిః = ఆ ప్రకారము ముని సైతము కావలెను. మఱి; జ్ఞానం యథా న నశ్యేత = జ్ఞానము ఏ ప్రకారము నశింపదో (అనఁగా ప్రాణమునకు జీవనమునకు ఆహారాదికము లేకున్నచో మనోవైకల్యముకలిగి జ్ఞానము నశించును. అందువలన దేహనిర్వాణము కర్తవ్యమగును.) యథా వాఙ్మనః = ఏ ప్రకారము వాక్కు మనస్సు; న + అవకీర్యేత = విక్షిప్తము కాదో (అట్లు వర్తించవలెను )

---

(133 వ పేజీ తరువాయి)

బులు సరియకా భావించి, లోభమోహంబులు వర్జించి, నిర్జితేంద్రియుండై, నన్నెకాని యొండెఱుంగక, యాత్మనిష్ఠచే బవిత్రాంతఃకరణుం డైన యోగి నాయందుఁ గలయు. కావున.

కం. మోహితుఁడై వసుకాంతా, వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁడై యెవ్వం
డూహాపోహ లెఱుంగక, దేహము నలఁగంగఁ జేయు దీనత నొందున్. 100

తా. ముని, ప్రాణవృత్తిచేతనే సంతోషించవలెను. ఇంద్రియములకు ప్రియములైనవాని చేతఁగాదు. అనఁగా ప్రాణమునకు జీవనమగు ఆహారాదిగ్రహణమాత్రమున వర్తించవలెను. ఇంద్రియములకు ప్రియములగు రూపరసాదుల నపేక్షించుటచేతఁగాదు - ప్రాణజీవనమగు ఆహారాదికము గ్రహించినచో మనోవైకల్యముచే జ్ఞానము నశించును. కావున దేహపోషణము కర్తవ్యము. శబ్దాది గుణముల యధికవాంఛ కలుగుచో వాక్కును అట్లే వాని సంకల్పవికల్పములందు మనస్సును విక్షేపము (చలనము) పొందును. కావున అట్లు కాకుండ వర్తించవలెను. అట్లు వీనిని బాహ్యవాయువు వలనను ప్రాణవాయువు వలనను నేర్చితిని అని భావము. (అధిక గుణవాంఛ కూడదనుట.)

అవ. శబ్దాది విషయములను సేవించుచున్నవాఁ డయ్యును వానియందు ఆసక్తి కావింప రాదు అని బాహ్యవాయువు వలన నేర్చితిని అనుచున్నారు—

శ్లో. విషయే ష్వావిశన్ యోగీ నానాధర్మేషు సర్వతః,
గుణదోషవ్యపేతాత్మా న విషజ్జేత వాయువత్. **40**

అ. యోగీ = యోగియైనవాడు; సర్వతః = అంతటను; నానాధర్మేషు = శీతోష్ణాది వివిధ ధర్మములుగల; విషయేషు = జలము, అగ్ని లోనగు విషయములందు; ఆవిశన్ = ప్రవేశించు (సేవించు) వాఁడయ్యు; గుణదోషవ్యపేత + ఆత్మా = మంచి, చెడ్డ అను గుణదోషములు లేని చిత్తముగలవాఁడై; వాయువత్ = వాయువువలె; న విషజ్జేత = ఆసక్తుఁడు కాఁగూడదు.

తా. శీతము, ఉష్ణము లోనగు పెక్కు ధర్మములుగల క్రమముగా జలము, అగ్ని లోనగుపదార్థములందు ఇది గుణము దోషము అను అపేక్ష లేనిదై వర్తించు వాయువు వలె యోగి శీతోష్ణములను సుఖదుఃఖాదులను సేవించును ఆసక్తుఁడుగాక వీని గుణదోషము లెంచక యుండుచున్నాడు. అట్టే బాహ్యవాయువువలన అనాసక్తిని నేర్చితిననుట.

అవ. ఏ ప్రకారము వాయువు గంధాదిధర్మయోగమునఁ దగులువడినట్లు తోచుచున్నను వానితో వాస్తవముగాఁ గూడుకొనినది కానేరదో ఈ ప్రకారము దేహాది ధర్మయోగముచే అహం ప్రత్యయముతో దేహమే నేనను భావముతో తోచుచున్నవాఁడైనను ఆత్మ దేహాదిధర్మ ములుగలవాఁడు కాఁడు. అని సంభావితమైన దానిని వాయువువలన నేర్చితినని చెప్పు చున్నారు—

శ్లో. పార్థివే ష్విహ దేహేషు ప్రవిష్ట స్తద్గుణాశ్రయః,
గుణై ర్న యుజ్యతే యోగీ గంధై ర్వాయు రివాత్మదృక్. **41**

అ. ఇహ = ఈ జగమునందు; పార్థివేషు దేహేషు = పృథివ్యాదిశరీరములందు; ప్రవిష్టః = ప్రవేశించినవాఁడై; తత్ + గుణ + ఆశ్రయః = ఆ దేహధర్మములగు బాల్యాదుల నాశ్రయించి వర్తించువాడయ్యును; ఆత్మదృక్ - యోగీ = ఆత్మను దర్శించు యోగి; గుణైః = ఆ దేహధర్మములతో; గంధైః = గంధాది గుణములతో; వాయుః ఇవ = వాయువువలె; న యుజ్యతే = కూడుకొనఁడు; అను గుణమును వాయువువలన నేర్చితిని.

తా. ఇహ లోకమందు పార్థివశరీరమునందు, ప్రవేశించి ఆ శరీరధర్మములగు బాల్య యౌవనాదుల నాశ్రయించిన వాడయ్యును జ్ఞానస్వరూపుఁడగు ఆత్మను దర్శించు యోగి ఆ దేహాదికమే నేనను భావముతోఁ గూడడు. ఎట్లనగా గంధాది గుణములతోఁ గూడినదయ్యు వాయువు వాస్తవముగాఁ గూడినది కాదో అట్లు.

అవ. ఒక్కఁడే అయిన ఆత్మకు అంతర్బహిర్భావమున (లోపల వెలుపల) వర్తించుచుండుట అను అసంగత్వము ఆకాశమువలన నేర్పఁబడినది అని ఆ సంభావనాద్వయమును చెప్పుచున్నారు—

శ్లో. అంతర్హితశ్చ స్థిరజంగమేషు బ్రహ్మాత్మభావేన సమన్వయేన.
వ్యాప్త్యా వ్యవచ్ఛేద మసంగ మాత్మనో ముని ర్నభస్త్వం వితతస్య భావయేత్. 42

అ. అంతర్హితః చ = దేహాంతర్గతుఁడైనను; మునిః = ముని; ఆత్మనః = ఆత్మకు (తనకు) అసంగం = దేహాద్యసంగమును; అవ్యవచ్ఛేదం చ = అపరిచ్ఛిన్నత్వమును; (వాని ధర్మముచే మార్పు పొందకుండుట) భావయేత్ = భావించవలెను; ఎట్లనగా- స్థిరజంగమేషు = స్థావర జంగమప్రాణులందు; సమన్వయేన = సమన్వయమగు (గూడుకొనుట); వ్యాప్త్యా = వ్యాపించుటచే; మణులందు సూత్రమువలె చొచ్చియుండు వ్యాప్తియా అనినకాదు; వితతస్య = సర్వగతుఁడైన; అది యెట్లు? బ్రహ్మాత్మభావేన = బ్రహ్మస్వరూపమును భావించుటచేత: "తత్త్వమసి" - ఆ యాత్మ నీవై యున్నావు. అను శ్రుతివలన; భావయేత్ = భావించవలెను. ఓయీ! ఇదియంతయు నెట్లు సంభవించును అనగా చెప్పుచున్నారు. నభస్త్వం = ఆకాశసామ్యమును భావించవలెను, ఏ ప్రకారము ఆకాశమునకు ఘటాదులతో సంగము పరిచ్ఛేదముగాని (విభాగము) కాదో ఆ ప్రకారము ఆత్మకును సంభవించదని.

తా. ముని దేహాదికముతో గూడినవాఁడయ్యు తనకు దేహాదికముతో సంగముగాని పరిచ్ఛేదముగాని లేదని భావించవలెను. ఎట్లనఁగా స్థావరజంగమ ప్రాణులందు కూడినదై వ్యాపించియున్న బ్రహ్మస్వరూపమును 'తత్త్వమసి'యను మహావాక్యము యొక్క అర్థమును భావించుటద్వారా సర్వగతుఁడైన ఆత్మకు దేహాదిసంగము పరిచ్ఛేదము ఎట్లు లేదో అట్లు లేదని భావించవలెను. ఇట్లు ఆకాశమువలన అసంగము, అపరిచ్ఛేదము అనువానిని నేర్చితిని అని.

అవ. మఱియు కూటస్థుఁడైన ఆత్మకు ఆగమాపాయి (రాకపోకలు) యగు దేహాదుల సంబంధము లేదని చెప్పుచున్నారు.

శ్లో. తేజోఽబన్నమయై ర్భావై ర్మేఘాద్యై ర్వాయునేరితైః.
న స్పృశ్యతే నభ స్తద్వ త్కాలసృష్టై ర్గుణైః పుమాన్. 43

అ. వాయునా ఈరితైః = వాయువుచే ప్రేరేపించఁబడిన; మేఘ = + ఆద్యైః = మేఘము లోనగువానిచే; నభః న స్పృశ్యతే = ఆకాశము ఏవిధముగను స్పృశించఁబడదు; తద్వత్ = ఆ ప్రకారము తేజస్ + అప్ + అన్నమయైః = అగ్ని, జలము, పృథివి, అనువాని స్వరూపములైన;

ఖావై = ధర్మములచేతను; కాలసృష్టైః గుణైః = కాలముచే సృజించఁబడిన గుణములచేత, దేహాదులచేత; క్షమ న్ = క్షరరుషుఁడు; న స్పృశ్యతే = స్పృశించఁబడడు అని ఆకాశమువలె నుండుచున్నాడని - ఆకాశము వలన నేర్చితిని.

తా. వాయువుచే ప్రేరేపించఁబడినవైన మేఘాదులచే (ఆదిపదముచే మెఱుపు-ఉఱుము చీకటి అనునవియు) ఆకాశ మెట్లు స్పృశించఁబడదో, అట్లే కాలముచే సృజింపబడినవైన అగ్ని, జలము, పృథివిలోనగు భూతములచే రూపొందిన దేహాదులచే పురుషుఁడు ఆత్మ స్పృశింపఁ బడఁడు అని ఆకసమువలన నేర్చితిని.

అవ. స్వచ్ఛత్వాది గుణములచే ఉదకము జగమును పవిత్రము చేయుచున్నది. ఆ గుణములు నేను నేర్చితినని చెప్పుచున్నారు-

శ్లో. స్వచ్ఛః ప్రకృతిత స్స్నిగ్ధో మాధుర్య స్తీర్థభూ ర్నృణామ్,
మునిః పునా త్యపాం మిత్ర మీక్షాస్పర్శనకీర్తనైః. 44

అ. స్వచ్ఛః = నిర్మలుఁడు; ప్రకృతితః = స్వభావమువలన; స్నిగ్ధః = జనులందు అనురాగము కలవాఁడు; మాధుర్యః = మధురభాషణుఁడు; నృణాం = నరులకు; తీర్థభూః = తీర్థస్థానము; అపాంమిత్రం = ఉదకతుల్యుఁడు అగు; మునిః = ముని; ఈక్షాస్పర్శనకీర్తనైః = దర్శన స్పర్శనకీర్తనములచే; పునాతి = ఎల్ల వారిని పవిత్రము చేయుచున్నారు; అఘాత్ మిత్రం- అను పాఠమునుబట్టి పాపమునుండి సఖుని పవిత్రుని చేయును. నిర్మలత్వము, మున్నగు గుణములచే ఉదకసాదృశ్య మర్థసిద్ధమని తెలియవలయును.

తా. తేటదనము కలిగినదై, సహజముగ చల్లనై, మధురమై నరులను పావనము చేయు తీర్థజలమువలె ముని నిర్మలుడై, స్వభావము చేతనే జనులం దనురాగము కలవాడై, మధుర భాషియై, తన దర్శనముచే, స్పర్శనముచే, వీక్షణముచే తన్నాశ్రయించిన మిత్రుని పాపము నుండి తొలగించి పావనుని చేయుచున్నాడు. ఇట్టి గుణము నుదకమునుండి అభ్యసించితిని.

అవ. అగ్నివలన నేర్చిన వేఱొక ఉపదేశమును చెప్పుచున్నారు—

శ్లో. తేజస్వీ తపసా దీప్తో దుర్ధర్షోదరభాజనః,
సర్వభక్షోఽపి యుక్తాత్మా నాదత్తే మల మగ్నివత్. 45

అ. తేజస్వీ = జ్ఞానాతిశయముచే తేజముగలవాడు; తపసా దీప్తః = విశేషించి తపస్సుచే జ్వలించువాడు, దుర్ధర్ష + ఉదరభాజనః = ఇతరులకు కలచరానివాడు; అపరిగ్రహుడు, (ఉదరము పాత్రముగ కలవాడు), సర్వభక్షః అపి = అన్నింటిని భక్షించువాడైనను, యుక్తాత్మా = యోగ్యమైన చిత్తముకలవాడైన ముని; అగ్నివత్ = అగ్నివలె; మలం న ఆదత్తే = కాలుష్యమును, పాపమును, వానినుండి పొందడు.

తా. తేజము కలిగి, వేడిమిచే వెలుగుచు, ఇతరులకు సమీపింపరాక, ఇతరులకు పట్టువడక, సర్వమును భక్షించు అగ్నివలె, జ్ఞానాతిశయమున తేజస్వియై, తపస్సుచే ప్రజ్వలించుచు, ఇతరులకు చెనకరాక, అపరిగ్రహుడై (ఇతరుల వలన దానాది పరిగ్రహము చేయనివాడై

భక్ష్యాభక్ష్యవిచారము లేక అన్నింటిని భక్షించువాడయ్యు, యుక్తచిత్తుడై ముని యే పాపమును ఎవ్వనినుండియు గ్రహింపడు. ఇట్లు అగ్నివలన నీ గుణమును నేర్చితిని.

అవ. అగ్ని వలననే నేర్చిన వేఱొక యుపదేశమును చెప్పుచున్నారు—

శ్లో. క్వచిచ్ఛన్నః క్వచిత్స్పష్ట ఉపాస్య శ్శ్రేయ ఇచ్ఛతామ్,
భుఙ్క్తే సర్వత్ర దాతౄణాం దహన్ ప్రాగుత్తరాశుభమ్. 46

అ. ఏ ప్రకారమగ్ని పరుల ఇచ్చు చేతనే హవిస్సును గ్రహించునో అట్లే మునియు అని చెప్పుచున్నారు. క్వచిత్ + ఛన్నః = ఒక్కచో బూది లోనగువానిచే కప్పఁబడినవాడు; క్వచిత్ స్పష్టః = ఒకచో ప్రకాశించుచు; శ్రేయః ఇచ్ఛతాం = శ్రేయస్సును కోరువారికి; ఉపాస్యః = ఉపాసింపదగినవాడై; దాతౄణాం = యజ్ఞములందు హవిస్సునిచ్చు యజమానుల యొక్క; ప్రాక్, ఉత్తర, అశుభం = సంచితము, ఆగామియగు పాపమును; దహన్ = కాల్చుచు; సర్వత్ర = యజ్ఞయాగాది క్రియలందెల్ల; భుఙ్క్తే = భుజించుచున్నాడు. హవిస్సును గ్రహించుచున్నాడు. అట్లే వర్తించు మునిగుణమును నేర్చితిని.

తా. అగ్ని యే విధముగ తానొక్కచో బూది లోనగువానిచే గప్పబడి కానరాక యుండును. ఒక్కచో ప్రకాశించుచు స్వర్గము, ఐశ్వర్యము లోనగు శ్రేయస్సు కోరువారికుపాస్యుఁ డగును. హవిస్సు సమర్పించు దాతలైన యాజ్ఞికుల యొక్క ఆగామి సంచితములైన పాపములను దహించునో, యజ్ఞయాగాది క్రియలందంతటను వారు సమర్పించు హవిస్సు నెట్లు భుజించుచున్నాడో, దహించుచున్నాడో అట్లే మునియు తనకు దాను కానరాక ప్రచ్ఛన్నుడై యుండుచు ఒక్కచో మహిమతో ప్రకాశించువాడై శ్రేయస్సు కోరువారిచే పూజింపబడుచు, వారి భూత భవిష్యత్తులందగు పాపమును నశింపజేయుచున్నాడో, అట్టి గుణము నగ్ని వలన నేర్చితిని.

అవ. ఆత్మకు దేహోపాధికమును బట్టియే ఉచ్చనీచత్వాదికము గన్పట్టును కాని స్వాభావికము కాదని యగ్ని దృష్టాంతముచేఁ జెప్పుచున్నారు—

శ్లో. స్వమాయయా సృష్టమిదం సదసల్లక్షణం విభుః,
ప్రవిష్ట ఈయతే తత్ర సరూపోఽగ్నిరివైధసి 47

అ. విభుః = పరమేశ్వరుడు; స్వమాయయా = తన మాయచే, తన యవిద్యచే; సృష్టం = సృష్టించబడిన; ఇదం = ఈ; సత్ + అసత్ + లక్షణం = దేవ తిర్యగాది రూపమును లేక విప్ర శూద్రాది రూపమగు ప్రాణుల దేహమును; ప్రవిష్టః = ప్రవేశించినవాడై; తత్ర = ఆ దేహాదిక మందు; ఏధసి = కొయ్యయందు; అగ్నిః ఇవ = అగ్నివలె; సరూపః = ఆ యగ్నితో సమానమగు రూపము గలవాడై; ఈయతే = చూపట్టుచున్నాడు.

తా. అగ్ని యెట్లు పొడుగు, పొట్టి, లావు, సన్నము, వంకర లోనగు ధర్మములు కల దారువు నందు చేరి దాగి ఆ దారువు యొక్క ఆకారముగ తోచుచున్నాడో అట్లే పరమేశ్వరుడు, పరమాత్మ తన అవిద్యచే దేవ తిర్యగాది రూపము లేక విప్ర శూద్రాది రూపమగు దేహ సమూహమును సృజించి, అందాయా దేహాకారమునకు అనురూపముగ సమానరూపుడై

తోచుచున్నాడో ఆ శరీరధర్మము లతనికి లేవు అట్లుండు అగ్ని వలన ఆ గుణము నేర్చితిని.

అవ. ఆత్మకు జన్మాది షడ్వికారాభాసము, చంద్ర దృష్టాంతముచే సంభావింపబడిన దనుచున్నారు—

శ్లో. విసర్గాద్యా శ్శ్మశానాంతా భావా దేహస్య నాత్మనః,
కలానా మివ చంద్రస్య కాలే నావ్యక్త వర్త్మనా. **48**

అ. విసర్గ + ఆద్యాః = జన్మము, వర్ధిల్లుట మొదలుగ గలవై; శ్మశాన + అంతాః = శ్మశానము లేక నాశము తుదగా గలవైన భావాః = ధర్మములు; అవ్యక్తవర్త్మనా = తెలియ రానిగతి గల; కాలేన = కాలముచే; చంద్రస్య = చంద్రునికి; కలానాం ఇవ = కళల యొక్క వృద్ధిక్షయములవలె; దేహస్య = దేహమునకుమాత్రము కలుగును గాని; న ఆత్మనః = ఆత్మకు కలుగవు.

తా. దురూహమై వర్తించు కాలముచేఁ గలుగు వృద్ధిక్షయములు కళలకే గాని చంద్రు నకు లేనట్లు అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే క్షీయతే, నశ్యతి = కలదు, జనించుచున్నది. పెరుగుచున్నది, పరిణమించు (ఎక్కువగు)చున్నది, క్షీణించుచున్నది, నశించుచున్నది. అను షడ్విధ వికారములు దేహమునకుఁ గలుగుచున్నవి గాని ఆత్మకు కలుగవని చంద్రుని వలన నభ్యసించితిని.

విశే. అప్యమండలము (జలమయుఁడు) చంద్రుడు. తేజోమండలము ఆదిత్యుడు వారిరువురు ఒక్క నక్షత్రస్థానమున నున్నపుడు చంద్రుడు కన్పట్టడు. కంటికి సమదేశస్థితమైన ఆదిత్య మండలముచే వ్యవధానము (అడ్డముగా ఆచ్ఛాదించుట) సంభవించుటవలన చంద్రుడు కన్నుల కగపడడు. అట్లు వా రిరువురి యేక నక్షత్రస్థితికలది అమావాస్య యగును. మఱి ము అరువది ఘడియల కాలములో చంద్రు డొక నక్షత్రము నుండి మఱియొక నక్షత్రమును జేరును ఆదిత్యుడైనచో పదమూ డహోరాత్రముల కాలముచే నొక నక్షత్రము నుండి మఱి యొక నక్షత్రమును జేరును. అందువలన శుక్లప్రతిపత్తు మొదలు విషమ స్థితిగల ఆదిత్యమండలము యొక్క పదునైదవ భాగము అప్యమండలమగు చంద్రమండల మందు ప్రతిబింబితమై కన్పట్టును. ఆ దృశ్యభాగము కళయని చెప్పబడును. ఈ ప్రకారము పదునైదవ దినము పదమూడు నక్షత్రములచే అంతరము (ఎడమ) ఏర్పడును. ఇరువదేడు నక్షత్రములతోఁ గూడిన రాశిచక్ర మధ్యభాగమందు ఎదు రెదురుగా సూర్యచంద్రు లెప్పు డుందురో అప్పుడు చంద్రమండలము ఆదిత్యుని పరిపూర్ణ ప్రతిబింబము కలదై, భూచ్ఛాయాలాంఛితమై (కళంకము-మచ్చ) కన్పట్టుచున్నది ఆ దినము పూర్ణిమ ఆ పూర్ణిమయందు సంపూర్ణ ప్రతిబింబముచే షోడశకళాపూర్ణుడై చంద్రుడు కన్ప ట్టును. తర్వాత మఱల కృష్ణపక్షము ప్రతిపత్తు ఆరంభించి చంద్ర సూర్యమండలముల యొక్క విషమగతిధర్మము వలన ఆ కళలు తగ్గుట సంభవించును. అందే ప్రకారము కళలకు మాత్రమే

ఉత్పత్తి హ్రాసములు కలుగును గాని అప్యమండలమగు చంద్రునికి కలుగవో ఆ ప్రకారము జన్మనాశాదులు దేహమునకే గాని ఆత్మకు లేవని చంద్రుని వలన నేర్చితిని.

అవ. సింహావలోకనము చేత అగ్ని దృష్టాంతము చేతనే దేహములు క్షణభంగురములని వైరాగ్య విషయమున శిక్షితుడ నైతి ననుచున్నారు—

శ్లో. కాలేన హ్యోఘవేగేన భూతానాం ప్రభవాప్యయౌ,
నిత్యా వపి న దృశ్యేతే హ్యాత్మనోఽగ్నే ర్యథార్చిషామ్. 49

అ. ఓఘవేగేన = ప్రవాహామువంటి వేగముగల; కాలేన = కాలముచేత; ప్రభవ + అప్యయౌ = జన్మనాశములు; నిత్యౌ అపి = ఎప్పుడును ఉండునవైయైనను; భూతానామ్ ఏవ = దేహములకు సంబంధించినవే; ఆత్మనః = ఆత్మకు సంబంధించినవి; న = కావు; యథా = ఎట్లు; అగ్నేః = అగ్నికి సంబంధించిన; అర్చిషాం = మంటలకే; ప్రభవ + అప్యయౌ = ఉత్పత్తివినాశములు; దృశ్యేతే = అగపడునో; అగ్నేః = అగ్నికి, న = కాదో (అట్లు).

తా. ప్రవాహము వలె వేగముగ గడచు కాలముచే ప్రాణులకు ఉత్పత్తి వినాశములు నిత్యము లయ్యు దేహములకు ఏర్పడును కాని ఆత్మకు కాదు ఎట్లన అగ్ని పుట్టుట, అగ్ని చల్లారుట అనగా అగ్నికి సంబంధించిన మంటలకు ఉత్పత్తి - వినాశములు నిత్యము లనియే గాని అవి యగ్నికి కలుగవు.

అవ. ఆదిత్యుని వలవ శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. గుణై ర్గుణా నుపాదత్తే యథాకాలం విముంచతి,
న తేషు యుజ్యతే యోగీ గోభి ర్గా ఇవ గోపతిః. 50

అ. యోగీ = ముని; గుణైః = గుణములగు ఇంద్రియములచే; గుణాన్ = శబ్దాది విషయములను; ఉపాదత్తే = గ్రహించును; యథాకాలం = కాలానుగుణముగా అర్థి వచ్చి యాచించినంతనే; విముంచతి = ధనాదికమును వదలుచున్నాడు; గోభిః = కిరణములచే గ్రహింపఁబడిన గాః = జలములను; గోపతిః ఇవ = సూర్యునివలె; తేషు = ఆ విషయములందు; న యుజ్యతే = దీనిని పొందితినని, ఇచ్చితినని అభినివేశమును చేయడు.

తా. సూర్యుఁడు తన కిరణముల ద్వారా ఆకర్షింపఁబడిన జలముల నంటకయే కాలమాసన్నమైనపుడు వానిని వర్షరూపమున విడచుచున్నాడు. అట్లే యోగి ఇంద్రియముల ద్వారా సంపాదించిన అర్థములను యాచకుడు వచ్చి, యాచించినంతనే కాలానుగుణముగా విడుచుచున్నాడు. లేక ఇంద్రియములచే గ్రహించిన విషయములను కాలానుగుణముగ వదలుచుండును కాని ఆ విషయములతో కూడడు. ఈ ధన మార్జించితిని, ఇచ్చితినని అభిమానము పొందడు. ఇది సూర్యుని వలన నేర్చితిని.

అవ. ఆత్మ స్వయముగా భేదరహితుఁడైనను భేదప్రతీతి ఉపాధివశమునఁ గలుగుచున్నదని ఆదిత్యదృష్టాంతము చేతనే సంభావించబడినదని చెప్పుచున్నారు—

శ్లో. బుధ్యతే స్వే న భేదేన వ్యక్తిస్థ ఇవ తద్గతః,
లక్ష్యతే స్థూలమతిభి రాత్మా చాంభఃస్థితార్కవత్. **51**

అ. స్వే=స్వస్వరూపమం దున్న; ఆత్మా=ఆత్మ; భేదేన=భేదముతో; న బుధ్యతే=ఎరగతుడు కాడు (భిన్నుడు కాడు); వ్యక్తిస్థః=ఉపాధిలో ప్రతిబింబించిన వస్తువు; తద్గత ఇవ=ఉపాధి ప్రవిష్టమైనట్లువలె; ఆత్మా=ఆత్మ; స్థూలమతిభిః=మందబుద్ధులచే; అంభఃస్థితార్కవత్=నీటిలోనున్న సూర్యునివలె; భేదేన=భేదముతో; లక్ష్యతే=చూడబడుచున్నది.

తా. 'జలములందు ప్రతిఫలించిన సూర్యుడు జలములను ప్రవేశించి అంటన్నవాని వలె కన్పించునట్లు స్వస్వరూపస్థితియందు భేదరహితుడై యుండు ఆత్మ దేహాదికమగు నుపాధియందు ప్రతిబింబితుడై ఆ ఉపాధిని ప్రవేశించినవాడు వలె స్థూలబుద్ధులకు గోచరించును' అని. అట్లు ఆత్మ భేదరహితుడని సూర్యుని వలన నేర్చితిని.

అవ. కపోతమువలన తాను నేర్చినది చెప్పుచున్నారు—

శ్లో. నాతిస్నేహః ప్రసంగో వా కర్తవ్యః కేనచిత్ క్వచిత్,
కుర్వన్ విందేత సంతాపం కపోత ఇవ దీనధీః. **52**

అ. కేనచిత్=ఎవ్వనితోగాని; క్వచిత్=ఎప్పుడుగాని; అతిస్నేహః=మిక్కిలి ప్రీతి; ప్రసంగః వా=ఉపలాలనము మున్నగు ఆసక్తి; న కర్తవ్యః=చేయదగదు; కుర్వన్=అట్లు గాక స్నేహాదికము చేయుచో; కపోతః ఇవ=పావురమువలె; దీనధీః=దిగులొందిన చిత్తము గలిగి; సంతాపం విందేత=వ్యథను పొందును.

తా 'ఎప్పుడు గాని, ఎవనితో గాని మిక్కిలి స్నేహము, మిక్కిలి సంబంధము, ఉపలాలించుట లోనగు ఆసక్తి గావింపగూడదు. అట్లు కాదని ఆసక్తుడగుచో కపోతము వలె దీనమానసుడై సంతాపమును పొందును' అని కపోతము వలన నేర్చితిని.

అవ. ఆ దృష్టాంతమును ప్రపంచించుచున్నారు —

శ్లో కపోతః కశ్చ నారణ్యే కృతనీడో వనస్పతౌ,
కపోత్యా భార్యయా సార్ధ మువాస కతిచి త్సమాః. **53**

అ. కశ్చన=ఒకానొక; కపోతః=పావురము; అరణ్యే=అడవియందు; వనస్పతౌ=ఒక మఱ్ఱి చెట్టుపై; కృతనీడః=నిర్మించినగూడుగలదై; భార్యయా కపోత్యా సార్ధం=భార్యయగు కపోతితో గూడి; కతిచిత్ సమాః=కొన్ని సంవత్సరములు; ఉవాస=నివసించెను.

తా. పూర్వ మొక పావుర మరణ్యమున నొక మఱ్ఱిచెట్టుపై గూడు కట్టుకొని, తన భార్యయగు ఆడుపావురముతోఁ గూడి కొన్నియేండ్లా మఱ్ఱిపై నివసించెను.

అవ. వాని పరస్పర స్నేహప్రసంగము తొలుతఁ జూపుచున్నారు. —

శ్లో. కపోతౌ స్నేహగుణితహృదయౌ గృహధర్మిణౌ,
దృష్టిం దృష్ట్యాఽంగ మంగేన బుద్ధిం బుద్ధ్యా బబంధతుః. **54**

అ. కపోతౌ=ఆ పోతు, పెంటియగు పావురములు రెండును; స్నేహగుణితహృదయౌ=నెయ్యముచే బె వబడిన మనస్సుకలవై; గృహధర్మిణౌ=సంసారధర్మము గలవై; దృష్టిం దృష్ట్యా=చూపును చూపుతో; అంగం అంగేన=శరీరమును శరీరముతో; బుద్ధిం బుద్ధ్యా=బుద్ధిని బుద్ధితో, బబంధతుః=బంధించినవయ్యెను.

తా. ఆ పోతు, పెంటి పావురములు రెండును పరస్పరము స్నేహముచేఁ బెంపొందిన మనస్సు కలవై, సంసారధర్మమును చేపట్టి, ఒండొరుల ప్రేమవీక్షణములను శరీరములను, బుద్ధులను ఏకము చేసి వర్తించెను. పరస్పర మిట్లు ప్రేమపాశమున గట్టుపడినవనుట

శ్లో. శయ్యాసనాటన స్థాన వార్తాక్రీడాశనాదికమ్,
మిథునీభూయ విస్రబ్ధౌ చేరతు ర్వనరాజిషు. 55

అ. శయ్యా... ఆదికమ్— శయ్యా=పరుండుట; ఆసన=కూర్చుండుట; అటన=సంచారము; స్థాన=ఉనికి, వార్తా=వృత్తాంతకథనము; క్రీడా=విహారము; అశన+ఆదికం=భోజనము లోనగువానిని గూర్చి; మిథునీభూయ=కలసికొని; విస్రబ్ధౌ=జంకులేనివై, వనరాజిషు=అరణ్యసీమలందు; చేరతుః=సంచరించినవి.

తా. పరుండుట, కూర్చుండుట, చరించుట, నివాసము నుండుట, వార్తలు చెప్పుకొనుట, విహరించుట, భుజించుట లోనగు క్రియలందు పరస్పరము కలసి మెలసి వర్తించుచు జంకు గొంకు లేనివై వనశ్రేణులందు సంచరించినవి

శ్లో. యం యం వాంఛతి సా రాజం స్తర్పయం త్యనుకంపితా,
తం తం సమానయత్ కామం కృచ్ఛ్రేణా ప్యజితేంద్రియః. 56

అ. రాజన్=రాజా; సా=ఆ ఆడపావురము; తర్పయంతీ=నగవు, చూపు, పలుకు లోనగు వానిచే తనివి నొందించుచు; అనుకంపితా=దయజూపబడినదై; యం యం వాంఛతి=దేని దేనినిఁ గోరునో; అజిత+ఇంద్రియః=గెలువబడని ఇంద్రియములు గల మగపావురము; కృచ్ఛ్రేణ అపి=కష్టముచేనైనను, తం తం కామం=ఆ యా వాంఛితమును; సమానయత్=సంపాదించి తెచ్చెను. రాజా అనుటచే నీవలెనే అని సూచింపబడినది.

తా. ఓ రాజా ! ఆ యాడు పావురము నవ్వుతోఁ గూడిన చూపు తోడి సంభాషణ చేయుచు, తనపై మిగుల ప్రేమ చూపుచున్నదై దేని దేని గోరుచున్నదో, ఇంద్రియములను గెలువలేని ఆ మగపావురము మిగుల కష్టపడియైన, తన భార్య కా యా వాంఛితములను తెచ్చి యిచ్చెను.

శ్లో. కపోతీ ప్రథమం గర్భం గృహ్ణతీ కాల ఆగతే,
అండాని సుషువే నీడే స్వపత్యుః సన్నిధౌ సతీ. 57

అ. కపోతీ=ఆడుపావురము; ప్రథమం గర్భం=మొదటి గర్భమును; గృహ్ణతీ సతీ=గ్రహించుచున్నదై; కాలే ఆగతే=ప్రసవకాలము వచ్చుటతోడనే; నీడే=గూడునందు; స్వపత్యుః సన్నిధౌ=తన పతి సమ్ముఖమందు; అండాని సుషువే=గ్రుడ్లు పెట్టెను.

తా. ఆ యాడు పావురము తొలుత గర్భము దాల్చి ప్రసవకాలము వచ్చినంతనే తన పతి సమ్ముఖమున నా గూటియందు కొన్ని గ్రుడ్లు పెట్టెను.

శ్లో. తేషు కాలే వ్యజాయన్త రచితావయవా హరేః,
శక్తిభి ర్దుర్విభావ్యాభిః కోమలాంగతనూరుహాః. 58

అ. తేషు=జలముతో నిండిన ఆ అండములందు; కాలే=కొంతకాలము గడచినంతనే; హరేః=(శ్రీ)హరియొక్క; దుర్విభావ్యాభిః=ఊహింపశక్యముగాని; శక్తిభిః=కాలకర్మస్వభావాదులచే; రచిత + అవయవాః=నిర్మితములైన పాదములు,పక్షములు లోనగు నవయవములు కలవి; కోమలాంగతనూరుహాః=మృదువులైన శరీరములు, రోమములు గల పిల్లలు; వ్యజాయంత=పుట్టినవి.

తా. జలము వంటి ద్రవము లోపల గల ఆ గుడ్లయందు కాలక్రమమున ఊహింపనలవి కాని కాల, కర్మ, స్వభావాదులచే నిర్మితములైన రెక్కలు మున్నగు అవయవములు గలవై మెత్తని మేను, రోమములు గలవైన పిల్లలు పుట్టెను.

శ్లో. ప్రజాః పుపుషతుః ప్రీతౌ దంపతీ పుత్రవత్సలౌ,
శృణ్వంతౌ కూజితం తాసాం నిర్వృతౌ కలభాషితైః. 59

అ. ప్రీతౌ=సంతోషముగల; దంపతీ=ఆలుమగలైన ఆ పావురములు; పుత్రవత్సలౌ=తమ కొడుకులు కూతులందు ప్రేమగలవై; కలభాషితైః=అవ్యక్తమధురములైన పలుకులతో; తాసాం కూజితం=ఆ పిల్లల కూతలను; శృణ్వంతౌ=వినుచు; నిర్వృతౌ=విప్పారిన హృదయముకలవై; ప్రజాః పుపుషతుః=తమ బిడ్డలను పోషించినవి.

తా. ఒండొంటిపై ప్రీతిగలవై ఆలుమగలైన ఆ పావురములు తమ కొడుకులు, కూతులందు ప్రేమగలవై, అవ్యక్త మధురములైన పలుకులచేనైన ఆ పిల్లల కూతలను వినుచు విప్పారిన హృదయము గలవై తమ పిల్లలను పోషించినవి.

శ్లో. తాసాం పతత్త్రైః సుస్పర్శైః కూజితై ర్వల్గు చేష్టితైః,
ప్రత్యుద్గమై రదీనానాం పితరౌ ముద మాపతుః. 60

అ. అదీనానాం=హర్షమును పొందిన; తాసాం=ఆ పిల్లల యొక్క; సుస్పర్శైః=మిగుల మృదువులైన; పతత్త్రైః=రెక్కలచేతను; తాసాం=ఆ పిల్లల యొక్క; వల్గు చేష్టితైః=అందమైన చేష్టల చేతను, కూజితైః=కూతల చేతను, ప్రత్యుద్గమైః=ఎదురొక్కని ఎగురుటల చేతను, పితరౌ=తల్లిదండ్రులైన ఆ పావురములు, ముదం ఆపుః=సంతోషమును పొందినవి.

తా. హర్షమును పొందిన ఆ పిల్లల మృదువైన రెక్కలతో, కూతలతో, అందమైన చేష్టలతో ఎదురొక్కని ఎగురుటలతో నానందింపజేయగా తల్లిదండ్రులైన ఆ పావురములు సంతోషమును పొందినవి.

శ్లో. స్నేహానుబద్ధహృదయా వన్యోన్యం విష్ణుమాయయా,
విమోహితౌ దీనధియౌ శిశూన్ పుపుషతుః ప్రజాః. 61

అ. విష్ణుమాయయా=విష్ణుమాయచే, అన్యోన్యం = పరస్పరము, స్నేహ + అనుబద్ధ హృదయౌ=నెయ్యముతో, కూడుకొన్న మనస్సు కలవై, దీనధియః = కృపతోడి మనస్సు కలవై, విమోహితౌ=మిక్కిలి మోహమును పొందినవై, శిశూన్=చిన్నవైన, ప్రజాః=తమ పిల్లలను; పుపుషతుః=పోషించినవి.

తా. విష్ణుమాయచే పరస్పరము స్నేహముచే కట్టువడిన మనస్సుగలవై, కృపతో గూడిన చిత్తము గలవై, మోహము నందినవై యా పావురములు తమ చిన్న పిల్లలను పోషించినవి.

శ్లో॥ ఏకదా జగ్మతు స్తాసా మన్నార్థే తౌ కుటుంబినౌ,
పరితః కాననే తస్మి న్నర్థినౌ చేరతు శ్చిరమ్. 62

అ. ఏకదా=ఒకప్పుడు; తౌ కుటుంబినౌ=సంతానము కలవైన ఆ పావురములదంపతులు; తాసాం=ఆ పిల్లలయొక్క; అన్నార్థే=ఆహారము కొఱకు; అర్థినౌ=కోరికగలవై; తస్మిన్ కాననే=ఆ కానయందు; పరితః=అంతట; చిరం=చాలకాలము; చేరతుః=చరించినవి.

తా. ఆలుమగలై, సంతానము కలవైన ఆ పావురములు రెండును ఒకనాడు తమ పిల్లల ఆహారము సంపాదించగోరి ఆ కానయం దంతట చాలతడవు చరించినవి.

శ్లో. దృష్ట్వా తాన్ లుబ్ధకః కశ్చి ద్యదృచ్ఛాతో వనేచరః,
జగృహే జాల మాతత్య చరతః స్వాలయాన్తికే. 63

అ. యదృచ్ఛాతః=స్వేచ్ఛమై వచ్చిన; వనేచరః=అడవిలో తిరుగాడునట్టి; లుబ్ధకః కశ్చిత్=ఒకానొక బోయవాడు; స్వ+ఆలయ+అంతికే=వాని గూటిచెంత; చరతః, తాన్, దృష్ట్వా=తిరుగుచున్న, వానిని, చూచి; జాలం=వలను; జగృహే=పన్నెను.

తా. ఒక బోయవాడు వనమున తిరుగుచు తమ గూటి చెంత సంచరించుచున్న ఆ పక్షి పిల్లలను గాంచి, వల పన్ని వానిని పట్టుకొనెను.

శ్లో. కపోతశ్చ కపోతీ చ ప్రజాపోషే సదోత్సుకౌ,
గతౌ పోషణ మాదాయ స్వనీడ ముపజగ్మతుః. 64

అ. కపోతః చ, కపోతీ చ=మగపావురము, ఆడుపావురము; ప్రజాపోషే=బిడ్డలను సాకుటయందు; సదా+ఉత్సుకౌ=ఎల్లప్పుడు ఉత్సాహము గలవి; గతౌ=అట్లు పోయినవై; పోషణం,ఆదాయ=ఆహారమునుగొని; స్వనీడం, ఉపజగ్మతుః=తమ గూటికి చేరినవి.

తా. ఆ మగ పావురము, ఆడు పావురము తమ బిడ్డల పోషణమున ఎల్లప్పుడు ఉత్సాహము గలవై, పోయి, ఆహారమును సంపాదించుకొని, తమ గూటి కడకు చనుదెంచెను.

శ్లో. కపోతీ స్వాత్మజాన్ వీక్ష్య బాలకాన్ జాలసంవృతాన్,
తా నభ్యధావత్ క్రోశంతీ క్రోశంతో బహుదుఃఖితాన్. 65

అ. కపోతీ=ఆడుపావురము; జాలసంవృతాన్=వలయందు చిక్కిన; స్వ+ఆత్మజాన్=తన పుత్రులగు; బాలకాన్=చిన్నవారిని; వీక్ష్య=చూచి; క్రోశన్తీ=కూతలు పెట్టుచు; బహుదుఃఖితాన్=మిగుల దుఃఖమును పొందిన; క్రోశతః తాన్=కూయుచున్న ఆ పిల్లలను గూర్చి; అభ్యధావత్=పరుగులు పెట్టెను.

తా. ఆడు పావురము వలలోఁ దగులుకొన్న తన చిన్న కుమారులను గాంచి, అయ్యో! అని కూతలిడుచు మిక్కిలి వెత నొంది, కూయుచున్న ఆ పిల్లలను వెంబడించి పరుగు వెట్టెను.

శ్లో. సాఽసకృత్ స్నేహగుణితా దీనచిత్తాఽజమాయయా,
స్వయం చాబధ్యత శిచా బద్ధాన్ పశ్యంత్యపస్మృతిః. 66

అ. సా= ఆ ఆడుపావురము; అజమాయయా=విష్ణుమాయచే; అసకృత్=మఱి మఱి; స్నేహగుణితా=నెయ్యమున కట్టువడి; దీనచిత్తా=దిగులొందిన మనస్సుకలదై; బద్ధాన్ పశ్యంతీ=వలలో చిక్కుకున్న శిశువులను చూచుచున్నదై; అపస్మృతిః=మఱవు నొందినదై; స్వయం చ=తానును; శిచా అబధ్యత=వలచే బంధింపబడెను.

తా. ఆ యాడుపావురము విష్ణుమాయచే మిక్కుటమైన స్నేహమున గట్టువడి దిగులొందిన యుల్లము గలదై, బంధింపబడిన తన శిశువులను చూచుచు, ఏమఱుపాటు పొందినదై తానుగూడ వలచే బంధింపబడెను.

శ్లో. కపోత శ్చాత్మజాన్ వీక్ష్య ఆత్మనోఽభ్యధికాన్ ప్రియాన్,
భార్యాం చాత్మసమాం దీనో విలలాప సుదుఃఖితః. 67

అ. కపోతః చ=ఆ మగపావురము; ఆత్మనః=తన ప్రాణముకంటె; అభ్యధికాన్=మిక్కిలి ఎక్కువై; ప్రియాన్=ఇష్టులైన; ఆత్మజాన్=పుత్రులను; ఆత్మసమాం భార్యాం=ప్రాణసమానయగు భార్యను; వీక్ష్య=చూచి; దీనః=దిగులుపడి; సుదుఃఖితః=మిగులదుఃఖము పొందినదై; విలలాప=ఏడ్చెను.

తా. ఆ మగపావురము తనకు ప్రాణాధిక ప్రియులైన తన పుత్రులను, ప్రాణసమానయు, తన కనురూపయు అగు భార్యను గూడ చూచి, దిగులొంది, కుందున వగచుచు నేడ్చెను.

అవ. పతివిలాపమును చెప్పుచున్నారు.

శ్లో. అహో మే పశ్యతాపాయ మల్పపుణ్యస్య దుర్మతేః,
అతృప్త స్యాకృతార్థస్య గృహ స్త్రైవర్గికో హతః. 68

అ. అహో=అక్కటా; అల్పపుణ్యస్య=తక్కువపుణ్యము కలిగి; దుర్మతేః=విషయాసక్తమగు బుద్ధికలిగి; అతృప్తస్య=దృష్టమగు సుఖమున తృప్తిచెందనట్టి; అకృతార్థస్య=అదృష్టమగు పరలోకసుఖము సంపాదించనట్టి; మే=నా యొక్క; అపాయం=కష్టమును; పశ్యత=చూడుడు; త్రైవర్గికః=ధర్మార్థకామములను త్రివర్గసాధనోపయోగియగు, గృహః=గృహస్థాశ్రమము; హతః=నశించినది.

తా. అక్కటా ! ఏమి నా దురదృష్టము ! కొఱనోములు నోచి, చెడుగఱనై ఇహలోకమున సంసారసుఖమున సైతము తనివినొందనివాడనై, పరలోకసుఖమును సంపాదించనివాడనై, ఈ భార్యాపుత్రులకు దాపురించిన యిక్కట్లు చూచుచున్న వాడనగు నా త్రివర్గమగు ధర్మార్థకామముల కునికి పట్టయిన గృహము నాశనమైనది.

శ్లో. అనురూపానుకూలా చ యస్య మే పతిదేవతా,
శూన్యే గృహే మాం సంత్యజ్య పుత్రైః స్వర్యాతి సాధుభిః. 69

అ. అనురూపా = నాకు తగినది; అనుకూలా చ = నన్ననుసరించునట్టిది; యస్యా మే పతి దేవతా = భర్తయే దైవముగా నెంచునది యగు ఏ నా యోగ్యభార్యా; శూన్యే, గృహే = శూన్యమైన యింట; మాం సంత్యజ్య = నన్ను విడచి; సాధుభిః పుత్రైః = మంచివారగు సుతులతో, స్వర్ యాతి = స్వర్గమునకు పోవుచున్నది.

తా. నా కనురూపయై, అనుకూలవతి, పతియే దైవముగా నెంచు నా భార్య ఈ శూన్య గృహమునందు నన్ను విడిచి, ప్రియమైన తన కొడుకులతో స్వర్గమునకు పోవుచున్నది.

శ్లో. సోఽహం శూన్యగృహే దీనో మృతదారో మృతప్రజః,
జిజీవిషే కిమర్థం వా విధురో దుఃఖజీవితః. **70**

అ. సః అహం = ఆ నేను; శూన్యగృహే = శూన్యమగు నింటిలో; మృతదారః = భార్య మరణించగా; మృతప్రజః = సంతానము వశించిన వాడనై; విధురః = పత్నీ రహితుడనై; కిమర్థం = ఎందులకు; జిజీవిషే = జీవి పగోరుదును?

తా. నే నీ శూన్యగృహమందు దిక్కులేక భార్యాపుత్రులను కోల్పోయి, విధురుడనై, దుఃఖమయజీవితము కలవాడనై ఏ సౌఖ్యము కొఱకు జీవింప గోరుదును.

శ్లో. తాం స్తథై వావృతాన్ సిగ్భి ర్మృత్యుగ్రస్తాన్ విచేతసః,
స్వయం చ కృపణ స్సిక్షు పశ్య న్నప్యబుధోఽపతత్. **71**

అ. తథా ఏవ = అ ప్రకారముగనే; సిగ్భిః ఆవృతాన్ = వలలచే చుట్టబడినవారై మృత్యుగ్రస్తాన్ = మృత్యువుచే బంధింపబడి; విచేతసః = ప్రాణములు కోల్పోవుచున్నవారిని; పశ్యన్ అపి = చూచుచున్; స్వయం చ = తానును; అబుధః = అజ్ఞుడై; కృపణః = దీనుడై; సిక్షు అపతత్ = వలలందు పడెను.

తా. అట్లు వలలోఁ జిక్కుకొని, మృత్యువుచే కబళింపబడి, యసువులు గోలుపోవు భార్యాపుత్రులను చూచుచు, ఆ మగపావురము తెలివి లేనిదై, దీనయై తానును ఆ వలలందు పడెను.

శ్లో. తం లబ్ధ్వా లుబ్ధకః క్రూరః కపోతం గృహమేధినమ్
కపోతకాన్ కపోతీం చ సిద్ధార్థః ప్రయయౌ గృహమ్. **72**

అ. గృహమేధినం = సంసారియైన; తం కపోతం = ఆమగపావురమును; కపోతకాన్ కపోతీం చ = పాపురము పిల్లలను, ఆడుపావురమును; లబ్ధ్వా = పొంది; సిద్ధార్థః = కృతకృత్యుడై; లుబ్ధకః = బోయవాడు; గృహం యయౌ = ఇల్లుచేరెను.

తా. క్రూరుడైన యా లుబ్ధకుడు ఇంటి యజమానుడైన ఆ మగ పావురమును, ఆ కపోతపు పిల్లలను, ఆ ఆడుపావురమును గైకొని కృతార్థుడై తన యింటికి పోయెను.

శ్లో. ఏవం కుటుంబ్యశాంతాత్మా ద్వంద్వారామః పతత్రివత్,
పుష్ణన్ కుటుంబం కృపణ స్సానుబంధోఽవసీదతి. **73**

అ. ఏవం=ఈ ప్రకారము; పతత్రివత్=ఆ పక్షి (పావురము) వలె; కుటుంబీ=సంసారి; అశాంతాత్మా=రాగతృష్ణాదులచే తృప్తుడై; ద్వంద్వ+ఆరామః=సుఖదుఃఖములందు క్రీడించుచు; కుటుంబం, పుష్ణన్=కుటుంబమును పోషించుచు; కృపణః=దీనుడై; సానుబంధః=పుత్రకళత్రాదులతో; అవసీదతి=నాశము పొందును.

తా. ఇట్లీ పావురము వలె కుటుంబియు, నిరంతరము రాగద్వేషాదులచే కలతనొందిన చిత్తము గలవాడై, దీనుడై, కుటుంబమును పోషించుచు కడపట ఆలుబిడ్డలతోఁ గూడ నాశము పొందును.

అవ. గృహాభిలాష తిర్యగ్జంతువులకు సైతము అనర్థహేతువై యున్నది. కావున అది మనుష్యునకు మిగుల నిందితమైన దని చెప్పుచున్నారు.

శ్లో. యః ప్రాప్య మానుషం లోకం ముక్తిద్వార మపావృతమ్,
గృహేషు ఖగవత్ సక్త స్తమారూఢచ్యుతం విదుః. 74

అ. అపావృతం=తెఱువబడిన (ప్రతిబంధరహితమైన); ముక్తిద్వారం=మోక్షమునకు సాధనమైన; మానుషం లోకం=మనుష్యలోకమును; ప్రాప్య=చేరియు; యః=ఎవడు; గృహేషు=ధనదారాదులందు; ఖగవత్=పావురమువలె; సక్తః=ఆసక్తుడో, తం=వానిని; ఆరూఢచ్యుతం=మోక్షపదమందు భ్రష్టునిగా; విదుః=ఎఱుంగుదురు.

తా. ఎవడు ప్రతిబంధరహిత మోక్షద్వార మగు మనుష్యలోకమున మనుష్యుడై పుట్టి ఆ పక్షివలె గృహాదులందు ఆసక్తుడో, వాడు మోక్షస్థానమునుండి భ్రష్టుడైనవాడని పెద్దలు చెప్పుదురు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే సప్తమోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధమున నేడవ అధ్యాయము.

ఓం తత్సత్.

# అష్టమాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. అష్టమే౽జగరాదిభ్యో నవభ్యః శిక్షితం హరిః,
అవధూతగిరా ప్రాహ వివేకా యోద్ధవం ప్రతి.

ఈ ఎనిమిదవ అధ్యాయమునందు అజగరాదులు తొమ్మిదింటినుండి నేర్చిన దానిని శ్రీకృష్ణుఁ డవధూతవాక్కుద్వారా వివేకము కొఱకు ఉద్ధవుని గూర్చి వచించెను.

బ్రాహ్మణ ఉవాచ - బ్రాహ్మణుడు చెప్పెను.

అవ. ప్రారబ్ధకర్మభోగము (అనుభవము) అవశ్యము కలుగునది కావున దానిని సాధించు ప్రయత్నములచే వ్యర్థముగా ఆయుర్వ్యయము చేయదగనిదని అజగరము నుండి నేర్చిన దానిని చెప్పుచున్నారు.

శ్లో. సుఖమైంద్రియికం రాజన్ స్వర్గే నరక ఏవ చ,
దేహినో యద్యథా దుఃఖం తస్మా న్నేచ్ఛేత తద్బుధః. 1

అ. రాజన్ = ఓ రాజా! యత్ = ఏది; ఐంద్రియికం సుఖం = ఇంద్రియములవలన లభించునో ఆ సుఖము; దేహినః = జీవునకు; స్వర్గే = స్వర్గమందును; నరకే ఏవ చ = నరకలోకమందును కలదో; తథా = అట్లే; దుఃఖం = ఇంద్రియజన్యమగు దుఃఖమును కలుగును; తస్మాత్ = అందువలన; బుధః = పండితుడు; తత్ = దానిని; న ఇచ్ఛేత = కోరదగడు.

తా. ఓ రాజా! ఇంద్రియ సుఖము, దుఃఖము స్వర్గనరకములు రెండింటను కలుగును. స్వర్గమున సుఖములతో బాటు, 'కొంతకాలము వఱకే యీ సుఖము, పుణ్యక్షయము కాగానే సుఖము కలుగ'దను దుఃఖము, అట్లే నరకమున క్లేశములతో బాటు అన్నపానాది లాభము వలన కలుగు సుఖము, 'యాతనానుభవము శాశ్వతము కా'దను సుఖము. ఇట్లు స్వర్గనరకములు రెండును ఇంద్రియజన్యములగు సుఖదుఃఖములు రెండింటికిని ఆలవాలములే. కావున పండితు డగువాడు దుఃఖ మెట్లు కోరరాదో, సుఖము కూడ అట్లే కోరరాదని, అవి రెండును ప్రారబ్ధ మూలములని తెలియును.

అవ. శరీర నిర్వహణ మాత్రము తనకు దానై లభించిన ఆహారముతో చేయదగు ననుచున్నారు.

శ్లో. గ్రాసం సుమృష్టం విరసం మహాన్తం స్తోకమేవ వా,
యదృచ్ఛయైవాపతితం గ్రసే దాజగరో౽క్రియః. 2

అ. గ్రాసం=కబళము, ఆహారము; సుమృష్టం =రుచిమంతముగాని; విరసం=రుచి లేనిది గాని; మహాంతం=ఎక్కువగాని; స్తోకం ఏవ వా =అల్పముగాని; యదృచ్ఛయా ఏవ =అప్రయత్నముగ తనకుతానై; ఆపతితం=చేతఁ బడిన ఆహారమును; ఆజగరః=కొండచిలువవృత్తి నవలంబించి; అక్రియః=ఏ క్రియలేనివాడై; గ్రసేత్=భుజించవలెను.

తా. తనకు తానై లభించిన ఆహారము, అన్నకబళము, షడ్రసోపేతము గాని, రుచి విహీనముగాని, ఎక్కువగాని, తక్కువగాని, ప్రయత్నము లేకయే గొనుచు, ఆజగర వృత్తి నవలంబించి ఏ క్రియ నాచరింపక ఆ యాహారాదికము భుజించవలెను. అని యిట్లు ఆజగరము వలన నేర్చితిని.

అవ. ఎప్పు డాహారము లభింపదో అప్పుడేమి చేయవలెననగా చెప్పుచున్నారు—

శ్లో. శయీ తాహాని భూరీణి నిరాహారోఽనుపక్రమః,
యది నోపనమే ద్గ్రాసో మహాహిరివ దిష్టభుక్. 3

అ. భూరీణి అహాని=పెక్కుదినములు; నిరాహారః=ఆహారము లేనివాడై; శయీత=పరుండియుండవలెను; గ్రాసః=ఆహారము; యది న ఉపనమేత్=తనకు దానై లభింపదేని; మహా+అహిః+ఇవ=గొప్ప సర్పము (కొండచిలువ) వలె, దిష్టభుక్=దైవమే ప్రాపకుడని ఆహార మొసగువాడని ధైర్యవంతుడు కావలెను.

తా. ఆహారము తనకు దానే లభింపదేని అజగరము అను గొప్ప సర్పమువలె దైవమే ఆహార మొసగునని ధైర్యము కలవాడై ఆహారము లభించుటకు ప్రయత్నపరుడు గాక ఆహారము లేనివాడై పెక్కుదినము లట్లే పరుండి యుండవలెను.

అవ. ఓయీ ! సమర్థుడయినను శయనించియే యుండవలయునా ? అనిన అవునని చెప్పుచున్నారు

శ్లో. ఓజస్సహోబలయుతం బిభ్రద్దేహ మకర్మకమ్,
శయానో వీతనిద్రశ్చ నేహేతేంద్రియవా నపి. 4

అ. ఓజస్సహోబలయుతం - ఓజః=ఇంద్రియబలము; సహః=మనోబలము; బల యుతం=దేహబలముతో కూడిన; దేహం అకర్మకం=దేహమును కనిపించు వస్తువులపై ప్రవర్తింపనట్లుగా; బిభ్రత్=ధరించుచు; శయానః=పరుండినవాడై; వీతనిద్రశ్చ=నిద్రలేనివాడై; (తత్త్వమును గమనించుటలో పారవశ్యము లేనివాడై); ఇంద్రియవాన్+అపి=ఆ యా అర్థము లందు ప్రవర్తింప గలిగిన యింద్రియ పాటవముండియు; న ఈహేత=ఇంద్రియ వ్యాపారము దర్శనాదికమును చేయఁ నిచ్ఛగింపనివాడు (లేదా దేహమును కోరని వాడు) కావలెను.

తా. మనోబలము, ఇంద్రియబలము, శరీరబలము అనువానితో కూడి, ఏ పనిని చేయని దేహమును ధరించుచు పరుండియుండి నిద్రలేనివాడై, ఆత్మజ్ఞానమున దృష్టినుంచి, ఇంద్రియ పాటవము కలవాడయ్యు, దర్శనాది వ్యాపార మేమియు చేయ వాంఛింపక యుండవలెను.

అవ. సముద్రమునుండి శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. మునిః ప్రసన్నగంభీరో దుర్విగాహ్యో దురత్యయః,
అనంతపారో హ్యక్షోభ్య స్తిమితోద ఇవార్ణవః. 5

అ. మునిః = ముని; ప్రసన్నగంభీరః = పైకి ప్రసన్నుడై లోపల గంభీరుడు; దుర్విగాహ్యః = ఇట్టివాడని తెలియరాని మనోభావములు కలవాడును; దురత్యయః = తేజస్వి యైనందున అనతిక్రమణీయుడును; అనంతపారః = ఆత్మ స్వరూపావిర్భావమువలన దేశకాలాదులచే కొలువరానివాడును; అక్షోభ్యః = రాగాదులు లేమిచే అవికార్యుడై; స్తిమిత + ఉదః = నిశ్చలమైన ఉదకముగల; అర్ణవః ఇవ = సముద్రునివలె; ఈ గుణములచేత సముద్రమువలె వర్తించవలెనని సముద్రుని వలన నేర్చితిని. పై విశేషములన్నియు సముద్రమునకుం దగును.

తా. సముద్ర మెట్లు పైకి ప్రసన్నమై, మిగుల లోతు కలదై, కలత నొందనిదై, నిలుకడ చెందిన నీరు కలదై యుండునో అట్లే ముని పైకి ప్రసన్నుడు, లోపల గంభీరుడు, లక్ష్యముతోడి అభిప్రాయము గలవాడు కాకపోవుట వలన ఇట్టివాడని కల్పించి చెప్పుటకు శక్యము గానివాడు, తేజస్వి యగుట వలన అనతిక్రమణీయుడు, దేశకాలములచేకొలువరానివాడు రాగాదులు లేనివా డగుటచే అవికార్యుడునై యుండును. అని యిట్టి గుణమును సముద్రుని వలన నేర్చితిని.

శ్లో. సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః,
నోత్సర్పేత న శుష్యేత సరిద్భి రివ సాగరః. 6

అ. సరిద్భిః = వర్షాకాలమందు నదులచే; సమృద్ధకామః = జలము సమృద్ధిగా కలిగినను; యథా = ఎట్లు; సాగరః = సముద్రము; న ఉత్సర్పేత = ఉప్పొంగదో; హీనః వా = గ్రీష్మమున జలసమృద్ధి లేనిదై; న శుష్యేత = ఎండిపోవదో, అట్లే; నారాయణపరః = (విషయపరుడు కాక) నారాయణ తత్పరుడగు; మునిః = ముని; సమృద్ధకామః = కోర్కెలు సమృద్ధిగా పొందియు; న ఉత్సర్పేత = విఱ్ఱవీగడు; హీనః వా = సంపదలు లేనవాడయ్యు; న శుష్యేత = క్రుంగిపోడు. అని నేర్చితిని.

తా. వర్షాకాలమున నదులు పొరలి ప్రవహించుచు తమ జలములు తెచ్చి తనపై గ్రుమ్మరించుచున్నను సముద్రు డెట్లు ఉప్పొంగడో, ఆట్లే వేసవికాలమున నదు లట్లు జలములను చేర్చకున్నను నీరెండి తగ్గిపోవడో, అట్లే మునియు సకల సంపదలు నిండుకొనుచున్నను పొంగి విఱ్ఱవీగడు. సంపదలు లేక లేమి వచ్చినను క్రుంగిపోవడు. కేవలము నారాయణపరాయణుడై (నారాయణునందు మనసు కలవాడై) విషయసుఖములందు మనస్సు నిల్పక ప్రవర్తించవలెను అని సాగరునివలన నేర్చితిని

అవ. రూప గంధ స్పర్శ శబ్ద రసములగు నయిదు విషయములచే సంమోహితములై పతంగ మధుకర గజ హరిణ మీనములు హతము లగుచున్నవి. అందువలన రూపాదులందనాసక్తములైన ఈ అయిదు నాకు గురువులు. అట్లు చెప్పబడినది కూడ—

శ్లో. పతంగ మాతంగ కురంగ భృంగ మీనా హతాః పంచభి రేవ పంచ,
ఏకః ప్రమాదీ స కథం న హన్యతే య స్సేవతే పంచభి రేవ పంచ.

మిడుత, ఏనుగు, లేడి, తుమ్మెద, చేప అను నీ యైదును క్రమముగా రూపము, స్పర్శము, శబ్దము, గంధము, రసము అను నైదు గుణములచే అనగా నొక్కొక్కటి ఒక్కొక్క గుణ

ముచే హతము లగుచున్నవి. అట్లు అయిదింద్రియములచే నయిదు గుణములను సేవించువా నొక్క డెట్లు హతుడు గాకుండును? అందు రూపవిలాసమోహితుడై నశించుచున్నా డనునది పతంగము లేక మిడుతవలన నేర్చితి ననుచున్నారు.

శ్లో. దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావై రజితేంద్రియః,
ప్రలోభితః పతత్యన్ధే తమస్యగ్నౌ పతంగవత్. **7**

అ. దేవమాయాం = దేవతలను సైతము మోహింపజేయు మాయయైన; స్త్రియం = స్త్రీని; దృష్ట్వా = చూచి; తద్భావైః = ఆ కాంత ప్రేమభావములచే; అజిత + ఇంద్రియః = ఇంద్రియములకు లొంగి; ప్రలోభితః = ఆశపెట్టబడినవాడై; అగ్నౌ = అగ్నియందు; పతంగవత్ = మిడుతవలె; అంధే తమసి = కటిక చీకటివంటి సంసారమువందు; పతితః = పడుచున్నాడు.

తా. మిడుత యెట్లు ధగధగ ప్రకాశించుచు జ్వలించుచున్న అగ్నిజ్వాలను గాంచి, అది యేదో అపూర్వభక్ష్యమని ఆశించి, దానిలోఁ బడి మడియునట్లు, పురుషుడు దేవమాయ యగు స్త్రీని గాంచి, ఆ చెలువ ప్రేమ కటాక్ష వీక్షణములకు లొంగిన ఇంద్రియములు గలవాడై, ఆ కాంతయం దత్యంతాసక్తుఁడై అంధతమోరూపమైన సంసారమున పడుచున్నాడని మిడుత వలన నేర్చితిని.

అవ. స్త్రీని ఉపలక్షణముగాఁ గొని ఈ విషయము నింకను ప్రపంచించుచున్నారు—

శ్లో. యోషిద్ధిరణ్యాభరణాంబరాది ద్రవ్యేషు మాయారచితేషు మూఢః,
ప్రలోభితాత్మా హ్యుపభోగబుద్ధ్యా పతంగవ న్నశ్యతి నష్టదృష్టిః. **8**

అ. మాయారచితేషు = మాయచే వంచించుటకై నిర్మించబడిన; యోషిత్ + హిరణ్య + ఆభరణ + ఆది ద్రవ్యేషు = స్త్రీయందును, ఆమె ధరించు బంగారము మున్నగు ఆభరణములు, వస్త్రములు, మాలలు, చందనాది ద్రవ్యములందు; ప్రలోభితాత్మా = ఆశపెట్టబడిన మనస్సు గలవాడై; మూఢః = మందమతియై; ఉపభోగబుద్ధ్యా = ఇష్టసుఖభోగ బుద్ధిచే; నష్టదృష్టిః = పరమార్థదృష్టి నశించినవాడై; పతంగవత్ = మిడుతవలె; నశ్యతి = నశించుచున్నాడు.

తా. మిడుత అగ్నిప్రకాశము చూచి, తన చూపు భ్రమించి, దానియం దాశగొని, కూలునట్లు పురుషుడు కంటిచూపును వంచింప నిర్మించబడిన స్త్రీయొక్క పసిడి తొడవులు, పట్టుచీరలు, సింగారపు వస్తువులచే అనగా వానిని వనిత అలంకరించుకొని కన్పట్టుటచే ఆమె తన కిష్ట సుఖభోగ ప్రదాయిని యని మూఢుడై, ఆ కామినియం దత్యంతాసక్తుడై గవసి నశించుచున్నాడు. రూపమును గూర్చి యిట్లు మిడుత వలన నేర్చితిని.

అవ. మధుకరమునుండి శిక్షితమును చెప్పుచున్నాడు. —

శ్లో. స్తోకం స్తోకం గ్రసే ద్గ్రాసం దేహో వర్తేత యావతా,
గృహా నహింస న్నాతిష్ఠేత్ వృత్తిం మాధుకరీం మునిః. **9**

అ. మునిః = ముని; గృహాన్ = గృహస్థులను; అహింసన్ = పీడించనివాడై; యావతా దేహః వర్తేత = ఎంతమాత్రముచే దేహము నిలువగలదో అంతమాత్రము; స్తోకం స్తోకం =

కొంచెము కొంచెము; గ్రాసం గ్రసేత్ = అన్నమును భుజింపవలెను; మాధుకరీం వృత్తిం = మధుకర మనగా తుమ్మెద. దాని వృత్తిని అనగా వ్యాపారమును; ఆతిష్ఠేత్ = అవలంబించవలెను.

తా. మధుకరము అధికమైన గంధగుణమునం దాసక్తమై ఒక్క పద్మము నందే నివసించుచు, అస్తమయ సమయమందు ఆ కమలము ముకుళించినంతనే దానిలో బంధింపబడుచున్నది. కావున ముని యొక్కచో నుండక, గృహస్థులను పీడించక, ఎంతమాత్రము దేహయాత్ర కొనసాగునో అంతమాత్రము గృహస్థుల వలన ఇంచించుక గొనుచు, భుజించుచు, మధుకర మెట్లు పూవులందున్న మకరందము నించించుక గ్రహించునట్లు మధుకరవృత్తి నవలంబించి జీవించవలెను.

అవ. మఱియును మధుకర శిక్షితము నింకను చెప్పుచున్నారు—

శ్లో. అణుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యః కుశలో నరః,
సర్వత స్సార మాదద్యాత్ పుష్పేభ్య ఇవ షట్పదః. 10

అ. కుశలః = నేర్పరియగు; నరః = మనుజుడు; అణుభ్యః = చిన్నవియు; మహద్భ్యః = దొడ్డవియు అగు; శాస్త్రేభ్యః = శాస్త్రములనుండి; సర్వతః = అంతటను; సారం = సారమును; పుష్పేభ్యః = పూవులనుండి; షట్పదః ఇవ = భ్రమరము వలె; ఆదద్యాత్ = గ్రహించవలెను.

తా. చిన్నవియు, పెద్దవియు అగు పూవులనుండి మధువును గ్రహించు భ్రమరమువలె మునియగు నరుడు చిన్నవగు సాంఖ్యయోగ శాస్త్రములను, పెద్దవగు తర్కవ్యాకరణములు పూర్వోత్తర మీమాంసలు అను శాస్త్రముల నభ్యసించి, వానిలోని సారమును గ్రహించి, దాని ననుష్ఠించవలె నని మధుకరము వలన నేర్చితిని.

అవ. మధుకృత్తు రెండు విధములు. అందొకటి మధుకృత్ (మధువును పూవు నుండి లాగి తీసికొనునది) అనగా తుమ్మెద. వేఱొకటి (మధువును ఆహారముగ స్వీకరించునది,) మధువును సంపాదించునది తేనెటీగ. అందు మొదటిదగు తుమ్మెదను గూర్చి నేర్చినది తెలిపినారు. ఇపుడు రెండవదగు తేనెటీగనుండి నేర్చినది చెప్పుచున్నారు—

శ్లో. సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్,
పాణిపాత్రోదరామత్రో మక్షికేవ న సంగ్రహీ. 11

అ. సాయంతనం = దినిని సాయంకాలము భుజింతుననియు; శ్వస్తనం వా = దానిని రేపు తిందుననియు; భిక్షితం = భిక్షగొన్న అన్నాదికమును; న సంగృహ్ణీత = సంగ్రహించి పెట్టవలదు; పాణిపాత్ర + ఉదర + అమత్రః = చేయియే పాత్రగా గలవాడును; (చేయి పట్టునంత గ్రహించు వాడు) కడుపే పాత్రముగా గలవాడును (ఒక భిక్షయందే ఉదరపాత్రము నింపుకొనువాఁడు కావలెను.) మక్షికా ఇవ = తేనెటీగవలె; న సంగ్రహీ = సంగ్రహించఁ రాదు.

తా. తేనెటీగ పూవులనుండి గ్రహించిన మధువును కూడబెట్టి, చివర మధువును కోల్పోవుటయే గాక, ప్రాణమును సైతము కోల్పోవుచున్నది. ఈ దృష్టాంతమును గాంచి

ముని యగువాడు 'ఈ భిక్షాన్నమును సాయంకాలము భుజింతును. ఈ భిక్షను రేపు తిందును.' అని భుజించు పదార్థమును కూడబెట్టఁగూడదు. హస్తమాత్రమే (హస్తమే పాత్రముగా) గ్రహించుచు, ఉదరమే పాత్రముగా, ఉదరము నిండునంత మాత్రము ఏకభిక్ష గొనుచు జీవించవలెను. తేనెటీగవలె సంగ్రహించగూడదని దానివలన నేర్చితిని.

అవ. దీనిని వివరించుచున్నారు—

శ్లో. సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్,
మక్షికా ఇవ సంగృహ్ణన్ సహ తేన వినశ్యతి. **12**

అ. సాయంతనం=ఉదయము సంపాదించినది సాయంకాలమునకు; శ్వస్తనం=సాయంకాలము ఆర్జించినది రేపటికి; భిక్షితం న సంగృహ్ణీత = భిక్షాన్నమును సంగ్రహించవలదు. సంగృహ్ణన్=సంగ్రహించువాడై, మక్షికా ఇవ=తేనెటీగవలె, సహ తేన వినశ్యతి=సంగ్రహించిన పదార్థముతో నాశమొందును.

తా. ఉదయము సంపాదించినది సాయంకాలమునకనియు, సాయంకాల మార్జించినది రేపటి కనియు, భిక్షాన్నము లోనగువానిని చేర్చిపెట్టఁగూడదు. అట్లు చేర్చిపెట్టినవాఁడు మధువును కూడబెట్టిన తేనెటీగ మధువుతోఁ జచ్చునట్లు కూడబెట్టిన దానితో తానును నశించును.

అవ. స్పర్శాసక్తి నాశహేతువని గజమునుండి నేర్చితి ననుచున్నారు—

శ్లో. పదాపి యువతీం భిక్షు ర్న స్పృశే ద్దారవీ మపి,
స్పృశన్ కరీవ బధ్యేత కరిణ్యా అఙ్గసఙ్గతః. **13**

అ. భిక్షుః=సన్యాసి, పదా అపి=పాదముచే సైతము, యువతీం=స్త్రీని, దారవీం అపి =కొయ్యబొమ్మను సైతము, న స్పృశేత్ =తాకకూడదు. స్పృశన్ =అట్లు తాకుచు, కరిణ్యాః =ఆడేనుగు యొక్క, అంగసంగతః=మేనితాకుడు వలన, కరీ ఇవ=ఏనుగువలె, బధ్యేత= బంధింపబడును.

తా. సన్యాసి జవరాలిని పాదముచే గూడ స్పృశింపగూడదు. అట్లు కొయ్యతోఁ జేయబడిన తరుణి ప్రతిమను సైతము స్పృశించరాదు. ఏనుగులను పట్టువారు ఒక పెద్ద గోతిని త్రవ్వి, దానిని గడ్డిగాదములతోఁ గప్పి, దాని సమీపమున ఒక ఆడు యేనుగును నిలుపుదురు. అపుడా మగఏనుగు ఆ ఆడు ఏనుగును స్పృశించుటకు వచ్చి నడుమనున్న గోతిలో దటాలున పడి బంధింపబడును. అట్లే సన్యాసి స్త్రీని స్పృశించునేని సంసారబంధమునకు లోనగునని గజమువలన నేర్చితిని.

శ్లో. నాధిగచ్ఛేత్ స్త్రియం ప్రాజ్ఞః కర్హిచి న్మృత్యు మాత్మనః,
బలాధికై స్స హన్యేత గజై రన్యై ర్గజో యథా. **14**

అ. ప్రాజ్ఞః=బుద్ధిమంతుడు; కర్హిచిత్ = ఒకానొకప్పుడును; ఆత్మనః మృత్యుం = తనకు మృత్యువుతో సమానమగు; స్త్రియం న + అధిగచ్ఛేత్ = స్త్రీని పొందగూడదు; బలాధికైః అన్యైః గజైః = ఎక్కువ బలము కల తక్కిన యేనుగులచే; సః=అట్లు పొందు

వాడు; గజః = ఆ ఆడేనుగను వెన్నంటిన ఏనుగ; యథా = వలె; హన్యేత = చంపబడును.

తా. ఆడేనుగను తాకిన మగ ఏను గెట్లు తనకంటె బలాధికములగు గజములచే కొట్టబడుచున్నదో అట్లు ప్రాజ్ఞుడు తనకు మృత్యువైన (మృత్యువువంటిదగు) యువతిని ఒకప్పుడును చేత జేర పొందగూడదు. అట్లు పొందెనేని బల్లిదులు వానిని ఏనుగును వలెనే చంపెదరని భావము.

అవ. త్యాగభోగములు లేని ధనసంచయము పరుల పాలగు నను విషయమున మధుహర్త గురు వనుచున్నారు—

శ్లో. న దేయం నోపభోగ్యం చ లుబ్ధై ర్యద్ దుఃఖ సంచితమ్,
భుంక్తే తదపి తచ్చాన్యో మధుహే వార్థవి న్మధు. **15**

అ. లుబ్ధైః = లోభులచే; దుఃఖసంచితం = మిగుల క్లేశములు సహించి కూడబెట్టబడినదై, యత్ = ఏ ధనము; న దేయం = వేఱొకరి కీయరానిదై; న ఉపభోగ్యం = తమ కనుభవమునకు రానిదగుచో; తత్ = ఆ ధనమును; అన్యః = వేఱొక; అర్థవిత్ = ఆ ధనమును గ్రహించు నుపాయ మెఱిగిన వాడును; తదన్యః = వాడును లుబ్ధుడగుచో వేఱొకడును; భుంక్తే = అనుభవించును; అర్థవిత్ = వస్తుసంగ్రహము నెఱిగిన; మధుహా = తేనె పట్టువాడు; మధు ఇవ = తేనెమువలె.

తా. తేనెటీగలు కూడబెట్టిన తేనెను, చెట్టుతొఱ్ఱలో నున్నదని దానిని గుర్తులను బట్టి హరించు నుపాయ మెఱిగినవాడు హరించును. వానికంటె బలవంతుడా మధువును తీసికొనును. అట్లే లుబ్ధులు ఒకరికి పెట్టక, తా మనుభవింపక కష్టపడి సంపాదించి, చేర్చిపెట్టిన ధనమును వారికంటె బలవంతు డొక్కడు గ్రహించును. వారికంటె బలాధికుడు మఱి యా ధనమును బలవంతముగా గ్రహించును.

అవ. తన ప్రయత్నము లేకున్నను భోగము (అనుభవము) కలుగు ననుటకును ఆ తేనె పట్టువాడే గురువనుచున్నారు—

శ్లో. సుదుఃఖోపార్జితై ర్విత్తై రాశాసానాం గృహాశిషః,
మధుహే వాగ్రతో భుంక్తే యతి ర్వై గృహమేధినామ్. **16**

అ. గృహాశిషః = గృహ, ధన, దారాపత్యములను; ఆశాసానాం, గృహమేధినాం = వాంఛించు గృహస్థుల యొక్క; సుదుఃఖ + ఉపార్జితైః = మిగుల శ్రమచే సంపాదించబడిన; ద్రవ్యైః = పదార్థములచే (సిద్ధమైన యన్నమును); యతిః వై = సన్న్యాసియే; మధుహా ఇవ = మధుహారకుడు వలె; అగ్రతః భుంక్తే = మొదట భుజించుచున్నాడు.

శ్లో. యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్న స్వామినా వుభౌ
తయో రన్న మదత్వా తు భుక్త్వా చాంద్రాయణం చరేత్.

తా. యతి, బ్రహ్మచారి వీ రిరువురు వంటచేసి సిద్ధ పరచిన అన్నమును గ్రహింప నధికారులు. వారి కన్న మిడక భుజించినవాడు చాంద్రాయణ వ్రత మాచరింపవలెను.

తా. ఇల్లు, సొమ్ము, పెండ్లాము, బిడ్డలు లోనగు వారిని లెస్సగా గోరు గేస్తులు మిగుల కష్టపడి సంపాదించి తెచ్చిన పదార్థములచే సిద్ధము చేసిన అన్నమును, యతి - మధుహారకుని వలె ముందు భుజించుచున్నాడని మధుహారకుని వలన నేర్చితిమి.

అవ. హరిణమువలన శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. గ్రామ్యగీతం న శృణుయా ద్యతి ర్వనచరః క్వచిత్,
శిక్షేత హరిణా ద్విద్ధా న్మృగయో ర్గీత మోహితాత్. 17

అ. వనచరః యతిః = అడవి దిమ్మరియైన సన్న్యాసి; క్వచిత్ = ఒకప్పుడును; గ్రామ్య గీతం న శృణుయాత్ = గ్రామము లోని పామరులు పాడు పాటను వినగూడదు; మృగయోః = వేటగాని యొక్క; గీత మోహితాత్ = పాటచే మోహ మొందినదై; విద్ధాత్ = కొట్టబడి, గాయపడిన; హరిణాత్ = జింక నుండి; శిక్షేత = నేర్వవలెను.

తా. వేటగాడు గోవును చాటు చేసికొని ఈలలు వేయుచు పాటలు పాడును. ఆపాట చెవుల కింపు కాగా ఆ జింక ఆ యావును సమీపించును. సమీపించినంతనే ఆ బోయవాడు బాణమున దానిని కొట్టి గాయపఱచినంతనే అది ప్రాణములు గోల్పోవును. కాన కానలో దిరుగు సన్న్యాసి యెప్పుడుగాని పల్లెటూరి పామరులు పాడు పాటలు వినగూడదు అని ఆ జింకవలన అభ్యసించితిని. ఆ గీతమును వినగూడదుగాని భగవద్గీతమును వినవలసినదే.

అవ. హరిణశబ్దముచే లేడికొడుకైన ఋశ్యశృంగుడు సైతము గురువని తెలియ దగునని చెప్పుచున్నారు—

శ్లో. నృత్తవాదిత్రగీతాని జుషన్ గ్రామ్యాణి యోషితామ్,
ఆసాం క్రీడనకో వశ్య ఋష్యశృంగో మృగీసుతః. 18

అ. మృగీసుతః = లేడికి జనించినవాడగు; ఋశ్యశృంగః = ఋశ్యశృంగుడు; యోషితాం = స్త్రీల యొక్క; గ్రామ్యాణి = గ్రామస్థులు గ్రహించునవైన; నృత్తవాదిత్రగీతాని = ఆట, వాద్యము, పాట అనువానిని; జుషన్ = సేవించుచు; ఆసాం = ఈ స్త్రీలకు; క్రీడనకః = ఆట వస్తువుగా; వశ్యః = లోబడెను.

తా. పూర్వము రోమపాదునిచే పంపబడిన వేశ్యలు, విభండకముని యాశ్రమమున కేగి, ఆ ఋషికి లేడిగర్భమున జనించిన ఋశ్యశృంగుడను ముని నాటపాటల చేతను, వాద్యముచేతను తమ కాటవస్తువునుగా వశముచేసికొనిరి.

అవ. రసమునం దాసక్తి నాశహేతు వని మీనమువలన నేర్చితిని అనుచున్నారు.

శ్లో. జిహ్వయాఽతిప్రమాథిన్యా జనో రసవిమోహితః,
మృత్యు మృచ్ఛ త్యసద్బుద్ధి ర్మీనస్తు బడిశై ర్యథా. 19

అ. అతిప్రమాథిన్యా = మిక్కిలి క్షోభ కలిగించు; జిహ్వయా = నాలుకచే; రసవిమోహితః = రసవంతములైన భోగ్య వస్తువులందు ప్రేమ కలదై; జనః = జనము; అసద్బుద్ధిః = క్షణ కాలపు రుచికి లోగిన బుద్ధి కలదై; మృత్యుం ఋచ్ఛతి = మృత్యువును పొందుచున్నది; బడిశైః

=పైకి మాంసము లోన ముల్లు గల అనగా ఎఱ్ఱలు గ్రుచ్చబడిన గాలములచే ఆపై మాంసమున కానపడిన; మీనః యథా=చేప వలె.

తా. రుచులకై మిగుల నాతురపడు జిహ్వచే రసవంతములైన పదార్థములందు తగులము పొందిన జనులు, తాత్కాలికమైన రుచికలిగించు పదార్థములం దిష్టము గలవారై ఎఱ్ఱలు గ్రుచ్చబడిన గాలముల పై మాంసమును తిన గోరి ఆగాలముల నోటబట్టిన మీనువలె నాశమను బొందుదురు.

అవ. జిహ్వను జయించుట అసాధ్యము, చాల కష్టమని రెండు శ్లోకములచే జెప్పుచున్నారు—

శ్లో. ఇన్ద్రియాణి జయ న్త్యాశు నిరాహారా మనీషిణః,
వర్జయిత్వా తు రసనం త న్నిరన్నస్య వర్ధతే. 20

అ. నిరాహారాః మనీషిణః=ఆహారము గైకొనని విద్వాంసులు; రసనం వర్జయిత్వా=నాలుకను (రుచిని) మాత్రము వర్జించి; ఇంద్రియాణి=తక్కిన శ్రోత్రాదీంద్రియములను; ఆశు జయంతి=శీఘ్రముగా జయింతురు; తత్=ఆ రసనేంద్రియము మాత్రము; నిరన్నస్య=నిరాహారికి; వర్ధతే=పెఱుగును గాని తఱుగదు.

తా. ఆహారము త్యజించిన యెడల ఇతరములగు శ్రోత్రాదీంద్రియముల జయము మాత్రము శీఘ్రముగ కలుగును. రసనేంద్రియము మాత్రము (నాలుక) వర్ధిల్లును. అన్నాదికమును భుజించిన యెడల మఱల రుచియం దాసక్తిచే సర్వేంద్రియములకు క్షోభ కలుగును. అందువలన రుచియం దాసక్తిని పరిత్యజించి, ఔషధమువలె అన్నాదికమును భుజించవలెను. అనగా జీవనము మాత్రముచే సంతోషించవలెను. అని ఇచ్చట చెప్పబడినను రసనేంద్రియ మతిదుర్జయ మను జ్ఞాపకమునకై చెప్పబడుచున్నది.

శ్లో. తావ జ్జితేంద్రియో న స్యా ద్విజితాన్యేంద్రియః పుమాన్,
న జయే ద్రసనం యావ జ్జితం సర్వం జితే రసే. 21

అ. పుమాన్=పురుషుడు; విజిత+అన్య+ఇంద్రియః=జయింపబడిన ఇతరములగు ఇంద్రియములు కలవాడైనను; యావత్=ఎంతవఱకు; రసనం న జయేత్=నాలుకను జయింపడో; తావత్=అంతవఱకు; జితేంద్రియః న స్యాత్=జితేంద్రియుడు కాడు; రసే జితే=రసనేంద్రియము జయింపబడగా; సర్వం జితం=అంతయు జయింపబడిన దగును.

తా. ఇతరములగు శ్రోత్రాదీంద్రియముల నన్నింటిని గెల్చినను పురుషు డెంతవరకు జిహ్వను జయించడో అంతవఱకు జితేంద్రియుడు గాడు. ఆ రసనేంద్రియమును (జిహ్వను) ఎపుడు జయించునో అపు డన్ని ఇంద్రియములను జయించినవా డగుచున్నాడు.

అవ. పింగళవలన నిరాశ నేర్వబడినదని చెప్పుటకు దాని కథను చెప్పుచున్నారు—

శ్లో. పింగళా నామ వేశ్యాఽఽసీ ద్విదేహనగరే పురా,
తస్యా మే శిక్షితం కించి న్నిబోధ నృపనందన. 22

అ. నృపనందన = రాజకుమారా! పురా = పూర్వము; విదేహనగరే = విదేహరాజు పట్టణమగు మిథిలయందు; పింగళా నామ వేశ్యా ఆసీత్ = పింగళ యను భోగముది యుండెను; తస్యాః = దానివలన; మే శిక్షితం = నాచే నేర్వబడినది; కించిత్ నిబోధ = ఇంచుక ఎఱుంగుము.

తా. రాజకుమారా! పూర్వము మిథిలానగరమున పింగళ యను పేరుగల వేశ్య యొక్కతె ఉండినది. దానివలన నేను నేర్చినదానిని కొంచెము చెప్పెదను. తెలిసికొమ్ము.

శ్లో. సా స్వైరి ణ్యేకదా కాంతం సంకేత ఉపనేష్యతీ,
అభూత్ కాలే బహిర్ద్వారే బిభ్రతీ రూప ముత్తమమ్. 23

అ. సా స్వైరిణీ = ఆ కామచారిణి (అంకుటాలు); ఏకదా = ఒకప్పుడు; కాంతం = ప్రియుని; సంకేతే = సంకేత స్థానమునకు; ఉపనేష్యతీ = కొనిపోవనుండినదై; కాలే = అదను నందు; ఉత్తమం రూపం = వస్త్రాభరణాదులచే నలంకృతమైన రూపమును; బిభ్రతీ = ధరించుచున్నదై; బహిర్ద్వారే = ఇంటి వెలుపలి ద్వారమందు; అభూత్ = నిల్చియుండెను

తా. ఇచ్ఛవచ్చినట్లు తిరుగు ఆ భోగము దాన ఒకప్పుడు తాను ప్రియుని గూడుటకైన సంకేతస్థానమునకు పోవగోరి, నగలు, పూలు, వలువలు మేని కలంకరించి, ఇంటి వెలుపలి ద్వారమున నిలువబడెను.

శ్లో. మార్గ ఆగచ్ఛతో వీక్ష్య పురుషాన్ పురుషర్షభ,
తాన్ శుల్కదాన్ విత్తవతః కాన్తాన్ మేనేఽర్థకాముకా. 24

అ. పురుషర్షభ = ఓ పురుష శ్రేష్ఠుడా! మార్గే = రాజమార్గమునందు; ఆగచ్ఛతః పురుషాన్ = వచ్చు పురుషులను; వీక్ష్య = చూచి; విత్తవతః = ధనవంతులును; శుల్కదాన్ = తన రతికి వెలనిచ్చువారినే; కాంతాన్ = సంగమార్హులైన వారినిగా; అర్థకాముకా = ధన కాముకయై; మేనే = తలంచెను.

తా. ఆ లంజియ ధనమును కామించునదై రాచబాట నేతెంచు పురుషులను చూచి; విత్తము కలిగి, తన కూటమికి తగు మూల్యము చెల్లించు యువకులను మాత్రము తనకు వలపుకాండ్రనుగా నెంచెను.

శ్లో. ఆగతే ష్వపయాతేషు సా సంకేతోపజీవినీ,
అప్యన్యో విత్తవాన్ కోఽపి మా ముపైష్యతి భూరిదః. 25

అ. ఆగతేషు = (విటులు) వచ్చువారును; అపయాతేషు = వెడలిపోయినవారును అగుచుండగా; సా = ఆ; సంకేత + ఉపజీవినీ = విటులకు సంకేతస్థానమున తన కూటమి నొసగి వారిచ్చు మూల్యమున జీవించు న వేశ్య; అన్యః విత్తవాన్ = ధనవంతుడగు వేఱొకడు; అపి = ఎవ్వడైన; భూరిదః = ఎక్కువ రొక్కమిచ్చువాడు; అపి మా ముపైష్యతి = నన్ను చేరగలడా! అని దురాశతో నుండునది. (అని తరువాతి శ్లోకముతో నన్వయము.)

తా. ఎందఱో విటులు వచ్చుచు, పోవుచున్నను విటులకు రతిసుఖ మొసగి, అందుకై వారిచ్చు రొక్కము గడించి బ్రదుకు ఆ వేశ్య - వెఱవాడు, మిక్కిలి రొక్కము కలవాడు, తన కెక్కువ సొమ్మిచ్చువా డెవడైన నా కడకు రాగలడా యని దురాశ గలదై.

శ్లో. ఏవం దురాశయా ధ్వస్తనిద్రా ద్వార్యవలంబతీ,
నిర్గచ్ఛన్తీ ప్రవిశతీ నిశీథం సమపద్యత. 26

అ. ఏవం=ఈ ప్రకారము; దురాశయా=మిక్కిలి చెడ్డ ఆశచే; ధ్వస్తనిద్రా=చెడిన నిద్దుర కలదై; ద్వారి=ద్వారమునందు; అవలంబతీ=అంటిపెట్టుకొని యున్నదై; నిర్గచ్ఛతీ=లోపలి నుండి వెలుపలికి వచ్చుచు; ప్రవిశతీ=వెలుపలినుండి యింటి లోపలికి బోవుచు; నిశీథం=అర్ధరాత్రిని; సమపద్యత=సమీపించెను.

తా. ఈ రీతి దురాశతో వర్తించు నా వేశ్య యొకనాడు నిద్దురబోగొట్టుకొని, వెలుపలి ద్వారము పట్టుకొని నిలుచుచు, ఇంటి లోపలి కేగుచు మఱల వెలుపలికి వచ్చుచు నుండ నాడు సగము రేయి అయ్యెను

శ్లో. తస్యా విత్తాశయా శుష్యద్వక్త్రాయా దీనచేతసః,
నిర్వేదః పరమో జజ్ఞే చిన్తాహేతుః సుఖావహః 27

అ. విత్తాశయా=ధనాశచే; శుష్యత్+వక్త్రాయాః=వాడిపోయిన మోము కలిగి; దీనచేతసః=దిగులొందిన చిత్తము గల; తస్యాః=ఆ పింగళకు; చింతాహేతుః=ధనచింతయే కారణముగ కలదై; సుఖావహః=సుఖమును కలిగించు; పరమః నిర్వేదః=ఉత్తమమైన వైరాగ్యము; జజ్ఞే=జనించెను.

తా. ఇట్లు ధనమందాశచే నెండుబాఱిన మొగము కలదై, దిగులొందిన చిత్తము గలదైన ఆ వేశ్య, పింగళకు ధనచింత కారణముగా సుఖము కలిగించునదై మేలైన వైరాగ్యము జనించెను.

శ్లో. తథా నిర్విణ్ణచిత్తాయా గీతం శృణు యథా మమ,
నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథా హ్యసిః. 28

అ. తథా=అ ప్రకారము; నిర్విణ్ణచిత్తాయాః=నిర్వేదము నొందిన చిత్తము గల దాని యొక్క; గీతం=కీర్తించు వాక్యము; యథా=ఏ ప్రకారమో; మమ శృణు=అ ప్రకారము నేను చెప్పెదను వినుము; ఆ నిర్వేద గీత శ్రవణమున నేమి ప్రయోజన మనఁగా చెప్పుచున్నారు— పురుషస్య ఆశాపాశానాం=పురుషుని యొక్క ఆశ లను పగ్గములకు; నిర్వేదః=వైరాగ్యము; యథా అసిః=ఖడ్గమెట్లో అట్లు (ఛేదించున దనుట); అజాతనిర్వేదః=జనించని వైరాగ్యము కలవాడు; అంగ=ఓ రాజా! న జిహాసతి హి=ఆశను త్యజించలేడు కదా!

తా. ఆ విధముగ నిర్వేదము పొందిన చిత్తముగల అ వేశ్య పాడిన గీతమును యథాతథముగ నేను వచింతును, వినుము. దాని వినికి వలన పురుషునకు ఆశ లను త్రాళ్లను ఖడ్గము వలె ఛేదించునట్టి వైరాగ్యము జనించును. ఓ రాజా! నిర్వేదము కలుగనివాడు ఆశ నెట్లును త్యజించలేడు. దేహాభిమానమును వదలుకొనలేడు.

పింగళోవాచ=పింగళ వచించెను.

శ్లో. అహో మే మోహవితతిం పశ్యతావిజితాత్మనః,
యా కాంతా దసతః కామం కామయే యేన బాలిశా. 29

అ. అహో = ఆశ్చర్యము; అవిజితాత్మనః = ఇంద్రియములను జయింపని; మే = నా యొక్క; మోహవితతిం = మోహవిస్తారమును; పశ్యత = చూడుడు; యా = ఏ నేను; అసతః = తుచ్ఛుడైన; కాంతాత్ = విటుని వలన; కామం = కామాభిలాషను; కామయే = కోరుచున్నాను; యేన = ఏ కామముచే; బాలిశా = మూఢనైతినో.

తా. ఔరా! ఇంద్రియముల గెలువలేని నా మోహవిస్తారమును చూడుడు. దీనివల్లనే కదా నేను మూఢురాలనై తుచ్ఛుడైన నరునివలన కామమును, రతిసుఖమును గోరుచున్నానో.

అవ. ఆ బాలిశత్వమును నాలుగు శ్లోకములచే ప్రపంచించుచున్నారు—

శ్లో. సంతం సమీపే రమణం రతిప్రదం విత్తప్రదం నిత్య మిమం విహాయ,
అకామదం దుఃఖ భయాధి శోక మోహప్రదం తుచ్ఛ మహం భజేఽజ్ఞా. 30

అ. సమీపే సంతం = అంతర్యామిరూపుడై చెంతనున్నవాడును; నిత్యం = నిత్యుడును, రమణం = మనస్సును కరగించువాడును; రతిప్రదం = రతిసుఖము నిచ్చువాడును; విత్తప్రదం = ధనము నిచ్చువాడు; ఇమం = అపరోక్షుడగు నీశ్వరుని; విహాయ = విడిచి; అకామదం = కామించినవాని నీయనివాడును; దుఃఖ....ప్రదం = దుఃఖము, భయము, వ్యథ, శోకము, మోహముల నొసగు; తుచ్ఛం = అల్పుడగు నరుని; అజ్ఞా = తెలియనిదాననై; భజే = సేవించుచున్నాను.

తా. ఔరా! నే నెంత అజ్ఞురాలను? చెంత నుండి నా మనస్సును రమింపజేయుచు, రతిసుఖము నొసంగి, ధనమిచ్చు, ప్రత్యక్షమైన ఈశ్వరుని వీడి, కామప్రదుడు కానివాడై, దుఃఖము, భయము, వ్యథ, శోకము, మోహములను కలిగించు తుచ్ఛుడైన నరుని సేవించుచున్నాను.

శ్లో. అహో మయాఽఽత్మా పరితోషితో వృథా
సాంకేత్యవృత్త్యా హ్యతిగర్హ్యవార్తయా,
స్త్రైణా న్నరా దర్థతృషోఽనుశోచ్యాత్
క్రీతేన విత్తం రతి మాత్మనేచ్ఛతీ. 31

అ. అహో = అయ్యో! స్త్రైణాత్ = స్త్రీలంపటుడు; అర్థతృషః = లోభియు; అనుశోచ్యాత్ = శోచనీయుడగు; నరాత్ = నరునివలన; క్రీతేన = కొనబడిన; ఆత్మనా = నా శరీరముతో; విత్తం = ధనమును; రతిం = సంగమమును; ఇచ్ఛతీ = కోరుచున్నదాననై; అతిగర్హ్యవార్తయా = మిక్కిలి నింద్యమైన జీవికగల; సాంకేత్యవృత్త్యా = వ్యభిచార వృత్తిచే; మయా = నాచే; ఆత్మా = మనస్సు; వృథా = వ్యర్థముగా; పరితాపితః = పరితపింప చేయబడినది.

తా. సంకేతస్థానమున పురుషుని కలియుట యను మిగుల నింద్యమైన జీవికకలదాననై స్త్రీలంపటుడు, లుబ్ధుడు, శోచనీయుడగు నరుని వలన ధనమును, రతిసుఖమును గోరుచు, వానిచే కొనబడిన యీ నా దేహముచే నా మనస్సును మిగుల పరితపింప జేసికొంటిని.

అవ. ఔరా! మిగుల నసహ్యమైన శరీరమును భజించుచున్న నన్ను కాల్చనా ఏమి? అనుచున్నది—

శ్లో. యదస్థిభి ర్నిర్మిత వంశ వంశ్య స్థూణం త్వచా లోమనఖైః పినద్ధమ్,
క్షర న్నవద్వార మగార మేత ద్విణ్మూత్రపూర్ణం మదుపైతి కాన్యా. 32

అ. యత్ = ఏది; అస్థిభిః = ఎముకలచే; నిర్మిత = నిర్మించబడిన; వంశము = నిట్రాడు లోనగు స్తంభములపై నడ్డముగా నుంచిన వెదురు. వంశవంశ్యము అనగా రెండు వైపుల జనించిన వెదుళ్ళు. అట్లు; వంశ = వెన్నెముకచేత; వంశ్య = ప్రక్క ఎముకలచేత; స్థూణం = కాలు చేతులు, ఎముకలు కలదియు; త్వచా = చర్మముచేతను; లోమనఖైః = రోమములు, గోళ్ళచేతను; పినద్ధం = కప్పబడినదై; క్షరత్ నవద్వారం = మలములు స్రవించు తొమ్మిది ద్వారములు గలట్టి; విట్ + మూత్రపూర్ణం = మలమూత్రములతో నిండిన; అగారం = ఇటువంటి ఇల్లు దేహము; మత్ = నాకంటె; అన్యా = పెరకాంత; కా = ఎవర్తుక; ఉపైతి = పొందును?

తా. రెండు నిట్రాడులు నాటి, దానిపై నడ్డముగా నొక పెద్ద కొయ్య దూలమువలె నుంచి, దాని కిరుపైపుల వెదుళ్ళను వాసములుగా వైచి, చుట్టు కాలిగుంజలు నాటి ద్వారము లేర్పఱచి, పైకప్పు కప్పి, పాక నేర్పఱతురు. అట్లే ఈ దేహము సైతము ఎముకలచే నిర్మింప బడినది; పెద్దది వెన్నెముక. దాని కిరుప్రక్కల ప్రక్కయెముకలును కాలుచేతుల యెముకలను గలదై, చర్మము, గోళ్లచేత కప్పబడినదై, నోరు, ముక్కు, కన్ను, చెవి లోనగు తొమ్మిది రంధ్రములనుండి మలములు స్రవించునదై, మలమూత్రములతో నిండినదైన ఇట్టి రోత శరీరమును నా కంటె పెఱకాంత యెవతె సుఖస్థానముగాఁ బొందును?

అవ. 'సత్సంగతికి సత్పురుషు లున్నను నేను చాల మోహము నందితిని' అనుచున్నారు—

శ్లో. విదేహానాం పురే హ్యస్మి న్నహ మేకైకమూఢధీః,
యాఽన్య మిచ్ఛ త్యసత్యస్మా దాత్మదా త్కాంత మచ్యుతాత్. 33

అ. అస్మిన్ విదేహానాం పురే = ఈ విదేహ రాజుల పురమందు; అహం ఏకైక మూఢ ధీః హి = నే నొక్కతెనే మందమతిని గాదా! యా అసతీ = ఏ నేను చెడిపనై; ఆత్మదాత్ అచ్యుతాత్ = ఆత్మజ్ఞాన మిచ్చు శ్రీహరికంటె; అన్యం కాంతం ఇచ్ఛతి = వేఱొక్కని కాంతుని కోరుచున్నాను.

తా. ఈ విదేహరాజుల పట్టణములో నే నొక్కతెనే మూఢ మనస్కురాలను. ఏలయన నేను అంకుటాలనై ఆత్మజ్ఞానము నొసగు శ్రీహరిని వదలిపెట్టి అన్యుని కాంతుని కోరుచున్నాను.

అవ. ఈ ప్రకారము నిర్విణ్ణ యగుచు ఇఁకమీద నే నిట్లు చేయఁగలనని తలంచెనను చున్నారు—

శ్లో. సుహృత్ప్రేష్ఠతమో నాథ ఆత్మా చాయం శరీరిణామ్,
తం విక్రీ యాత్మనై వాహం రమేఽనేన యథా రమా. 34

అ. అయం ఆత్మా = ఈ పరమాత్మ; నాథః = ఈశ్వరుఁడు; శరీరిణాం సుహృత్ = జీవులకు మంచి నెయ్యము; ప్రేష్ఠతమః = ప్రియతముడు; తం = ఆ హరిని; ఆత్మనా = ఈ శరీరముచే, మనస్సుచే; విక్రీయ = విశేష ప్రీతితో కొని; అహం = నేను; యథా రమా = లక్ష్మి వలె; అనేన రేమే = ఈ హరితో క్రీడింతును.

తా. మేలుఁగోరు చెలికాడు, ఎల్లవారి కంటె మిక్కిలి ప్రియుఁడు, ఎల్లవారికి దొర, ఈ దేహధారుల కెల్లను ఆత్మయై యున్నాడు. అట్టి ఆ విష్ణువును ఈ మేనిచే, మనస్సుచే కొని, నే నా యచ్యుతునితో సిరి వలెఁ గూడి రమింతును.

అవ. అన్యు డసేవ్యుడు = సేవింపదగినవాడు కాదని తెలుపుచున్నది—

శ్లో. కియ త్ప్రియం తే వ్యభజన్ కామా యే కామదా నరాః,
ఆద్యంతవంతో భార్యాయా దేవా వా కాలవిద్రుతాః. **35**

అ. యే కామాః = ఏ విషయ సుఖ వాంఛలు; కామదాః = కామితముల నొసగు; నరాః = మనుజులు; దేవాః వా = లేక దేవతలు; కాలవిద్రుతాః = కాలముచే తఱుమబడినవారు కావున; ఆద్యంతవంతః = జనన మరణములు కలవారు; తే = వారు; భార్యాయాః = భార్యకు; కియత్ ప్రియం = ఎంత మాత్రము ప్రీతిని; వ్యభజన్ = కలిగించిరి ?

తా. విషయసుఖము లన్నియు మొదలు, తుది కలవి. ఇంచుక తడవుండి వెంటనే నశించునవి. అట్లే ఈప్సితముల నిచ్చు ధనికులగు నరులును, వరము లిచ్చు దేవతలును కాలగతికి లోనైన జనన మరణములు గలవారు. వారెంత మాత్రము భార్యకు ప్రీతిని గూర్చిరి ? ఏమియు చేయలేరైరి. కావున ఇహమున గాని, పరమున గాని ఆ విష్ణువు కంటె సేవ్యు డొక్క డెవ్వడును లేడు. కావున నతడే సేవ్యు డగును.

అవ. ఈ ప్రకారము నిశ్చయించుకొని తన భాగ్యము నభినందించుచున్నది—

శ్లో. నూనం మే భగవాన్ ప్రీతో విష్ణుః కేనాపి కర్మణా,
నిర్వేదోఽయం దురాశాయా యన్మే జాతః సుఖావహః. **36**

అ. భగవాన్ విష్ణుః = భగవంతుడగు విష్ణువు. మే = నా యొక్క; కేన కర్మణా అపి = స్మరణాదికమగు ఏదైన అపూర్వ కర్మచే; నూనం ప్రీతః = నిశ్చయముగ సంతోషించెను; యత్ = ఏ సంతోషము కారణముగ; దురాశాయాః మే = దుష్టమైన ఆసగల నాకు; సుఖావహః = సుఖము కలిగించు; అయం నిర్వేదః = ఈ వైరాగ్యము; జాతః = కలిగినదో.

తా. నిజముగా భగవంతుడగు విష్ణువు నా పూర్వజన్మకర్మయగు దేనిచేతనో సంతుష్టుడైనాడు. ఆయన సంతోషము వలననే నా కీ సుఖప్రదమైన వైరాగ్యము కలిగినది.

అవ. ఓ పింగళా! ధనప్రాప్తి లేకుండుటచే నీవు క్లేశములకు లోనైతివి. విష్ణు వెట్లు నీ విషయమై ప్రీతిగలవాఁ డయ్యెను. అనగా అందుకు చెప్పుచున్నది.

శ్లో. మైవం స్యు ర్మందభాగ్యా చేత్ క్లేశా నిర్వేద హేతవః,
యే నానుబంధం నిర్హృత్య పురుష శ్శమ మృచ్ఛతి. 37

అ. మందభాగ్యా చేత్=నే నదృష్టహీనురాల నైనచో; ఏవం=ఇట్లు; క్లేశాః=కష్టములు; నిర్వేద హేతవః మా స్యుః=వైరాగ్యకారణములు కావు; యేన=ఏ నిర్వేదముచే; పురుషః=నరుడు; అనుబంధం=బంధమగు గృహాదికమును; నిర్హృత్య=త్యజించి; శమం ఋచ్ఛతి=శాంతిని పొందుచున్నాడు.

తా. నే నదృష్ట హీనురాల నగుచో నిట్టి క్లేశములు నాకు నిర్వేదము కలిగించెడివి కావు. ఇట్టి వైరాగ్యము చేతనే పురుషుడు సంసారబంధమగు గృహాదికమును విడచి శాంతిని పొందుచున్నాడు.

శ్లో. తే నోపకృత మాదాయ శిరసా గ్రామ్యసంగతా,
త్యక్త్వా దురాశాం శరణం వ్రజామి తమధీశ్వరమ్. 38

అ. గ్రామ్యసంగతా=గ్రామ్యసుఖములందు; (గ్రామ్యవరులందుగాని) ఆసక్తురాలైన నేను; తేన ఉపకృతం=ఆ విష్ణువుచే చేయబడిన ఉపకార మను నిర్వేదమును; శిరసా ఆదాయ=శిరస్సుచే గ్రహించి; దురాశాం త్యక్త్వా=దుష్టమైన ధనాదికమునుగూర్చిన ఆశను త్యజించి; తం అధీశ్వరం=ఆ పరమేశ్వరుని; శరణం వ్రజామి=శరణు పొందెదను.

తా. గ్రామ్య సుఖములగు సంభోగాదు లందును, కాముకు లందును ఆసక్తురాలనైన నేను, విష్ణువు నాకు గావించిన ఉపకారమగు నిర్వేదమును శిరముతో గ్రహించి, నా ధన సుఖాదుల దురాశను వీడి ఆ పరమేశ్వరుని శరణు పొందెదను

అవ. ఎట్లు పోదు వనగా చెప్పుచున్నారు—

శ్లో. సంతుష్టా శ్రద్దధ త్యేనం యథాలాభేన జీవతీ,
విహరా మ్యమునై వాహ మాత్మనా రమణేన వై. 39

అ. యథాలాభేన=లభించినంత ధనాది లాభముచే; సంతుష్టా=తృప్తినొందిన దాననై; జీవతీ=జీవించుచు; ఏనం=ఈ హరిని గూర్చి; శ్రద్దధతీ=శ్రద్ధగలదాననై; అహం=నేను; రమణేన ఆత్మనా=మనస్సు నావందింపజేయు పరమాత్మయగు; అమునా=ఈ విష్ణువుతో; విహరామి=విహరించుదును.

తా. నాకు లభించిన ధనాదులతోనే సంతసము నంది జీవించుచు, శ్రీ విష్ణువును గూర్చి శ్రద్ధ చూపుచు, నా మనోరమణుడగు ఆ శ్రీమహావిష్ణువును గూడి విహరించెదను.

అవ. ఓ పింగళా ! బ్రహ్మాదులను వీడి విష్ణువుతో మాత్రము కూడి యుండవలెనని ఏమి నియమము ? అనగా అందుకు చెప్పుచున్నారు—

శ్లో. సంసారకూపే పతితం విషయై ర్ముషితేక్షణమ్,
గ్రస్తం కాలాహినాఽఽత్మానం కోఽన్య స్త్రాతు మీశ్వరః. 40

అ. సంసారకూపే పతితం = సంసార మను నూతియందు పడినదై; విషయైః = విషయ సుఖములచే; ముషిత + ఈక్షణం + అపహరించబడిన వివేకము గలదై; కాల + అహినా గ్రస్తం = కాలసర్పముచే కబళింపబడిన; తం ఆత్మానం = ఆ ఆత్మను; జీవుని; త్రాతుం = రక్షించుటకు; అన్యః కః = అన్యు డెవడు; ఈశ్వరః = సమర్థుడు గలడు ?

తా. సంసార మను నూతి యందు పడి, విషయ సుఖములచే నపహరింపబడిన వివేకము కలవాడై, కాలసర్పముచే కబళింపబడి, శరీర సుఖదుఃఖము లనుభవించు ఈ జీవుని రక్షించుటకు విష్ణువు కంటె అన్యు డెవ్వడు సమర్థుడు కలడు ?

అవ. అట్లయిన ఆత్మ రక్షకోపాధితో పొందగలవా ఏమి ? ఈ సంసారమం దుండి ఐహిక - ఆముష్మిక సుఖము లన్నింటి నుండి నిర్వేదమును పొంది భగవంతుని భజనమందు ప్రవర్తించు ఆత్మయే సమర్థ డగుట వలన అని యనుచున్నారు—

ఆత్మైవ హ్యాత్మనో గోప్తా నిర్విద్యేత యదాఽఖిలాత్,
అప్రమత్త ఇదం పశ్యే ద్గ్రస్తం కాలాహినా జగత్. **41**

అ యదా = ఎప్పుడు; అఖిలాత్ = సమస్తమైన ఇహాముత్ర భోగముల నుండి; నిర్విద్యేత = నిర్వేదమును పొందుచున్నాడో అపుడు; ఆత్మా ఏవ = ఆ పరమాత్మ యగు హరియే; ఆత్మనః గోప్తా హి = తనకు రక్షకు డగును; అప్రమత్తః = జాగరూకుడై; కాల + అహినా గ్రస్తం = కాలసర్పముచే కబళింపబడినదిగా; ఇదం జగత్ = ఈ లోకమును; పశ్యేత్ = చూడగలుగును.

తా. ఎప్పు డైహికములు, ఆముష్మికములు అగు సమస్త సుఖముల నుండి విరక్తు డగునో, పరమేశ్వర భజనమందు ప్రవృత్తు డగునో, అప్పుడు ఆ పరమాత్మ విష్ణువే తనకు రక్షకుఁ డగును. అంత ప్రమాదమును బొరయక ఈ జగమంతయు కాలసర్పముచే కబళింపబడి జన్మజరామరణ రూప సంసారమును పొందియున్న దని చూడగలుగును, అట్లు చూడవలెను. అందువలన ప్రేమతో హరిని భజింతును.

బ్రాహ్మణ ఉవాచ = బ్రాహ్మణుడు వచించెను.

శ్లో. ఏవం వ్యవస్థితమతి ర్దురాశాం కాంతతర్షజామ్,
ఛిత్త్వోపశమ మాసాద్య శయ్యా ముపవివేశ సా. **42**

అ. ఏవం = ఈ ప్రకారము; వ్యవస్థితమతిః = నిశ్చితమైన చిత్తము కలదై; సా = ఆ పింగళ; కాంతతర్షజాం = ప్రియులందలి అభిలాషవలన జనించిన; దురాశాం = చెడ్డ ఆశను, ఛిత్త్వా = ఛేదించి; ఉపశమం ఆసాద్య = మనశ్శాంతి నొంది; శయ్యాం ఉపవివేశ = సెజ్జపై పరుండెను.

తా. ఇట్లు పింగళ మదిలో నిశ్చయించుకొని, విటులపై గల కామాభిలాషవలన జనించిన దురాశను ఛేదించి, మనశ్శాంతి నొంది, పోయి సెజ్జపై పరుండెను.

అవ. ఫలితమును చెప్పుచున్నారు—

శ్లో. ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్,
యథా సంఛిద్య కాంతాశాం సుఖం సుష్వాప పింగళా. 43

అ. ఆశా=ఆశ (కోరిక), పరమం దుఃఖం=తీవ్రమైన దుఃఖమునకు మూలము; నైరాశ్యం=ఆశ లేకుండుట; పరమం సుఖం=గొప్ప సుఖము; పింగళా=పింగళ యను నామె; యథా=ఎట్లు; కాంతాశాం=ప్రియులందలి యాశను; సంఛిద్య=ఛేదించి; సుఖం సుష్వాప=సుఖముగా శయనించినదో.

తా. ఆశయే మిక్కిలి దుఃఖకరము. ఆశలేమి పరమ సుఖము. కావున ప్రియులందరి ఆశను ఈప్రకారము విచారణచేసినదై పింగళ వానిని విడచి సుఖముగా నిదురించెను.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే అష్టమోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమం దేకాదశస్కంధమునం దష్టమాధ్యాయము.

ఓం తత్సత్

కం. మోహితుడై వసుకాంతా, వాహినిలోఁ జిక్కి క్రూరవశుఁడై యెవ్వం
డూహాపోహ లెఱుంగక. దేహము నలఁగంగ జేయు దీనత నొందున్. 100

వ. ఇందుకుఁ బురాతన వృత్తాంతంబు గలదు. సావధానచిత్తుండవై వినుము. మిథిలా నగరంబునఁ బింగళయను గణికారత్నంబు గలదు. దానివలనఁ గొంత పరిజ్ఞానంబు గొంటి. అదెట్లనిన, నమ్మానిని వసుకాంతుం జేసి, యాత్మసఖుని మొఱంగి, ధనం బిచ్చు వానినిం జేకొని, నిజనికేతనాభ్యంతరంబునకుం గొని, చని, రాత్రి నిద్రలే కుండుచుం; బుట భేదన విపణి మార్గంబులఁ బర్యటనంబు సలుపుచు; నిద్రాలస్య భావంబున జడలు వడి, యర్థాపేక్షం దగిలి తిరిగి, యలసి, యాత్మసుఖంబు సేయు నాతండే భర్త యని చింతించి, నారాయణు నిట్లు చింతింప, నతని కైవల్యంబు చేరవచ్చు నని విచారించి నిజ శయనాది స్థానంబులు వర్జించి, వేగిన వాసుదేవ చరణారవింద వందనాభిలాషిణి యై, దేహంబు విద్యుత్ప్రకారం బని చింతించి, పరమతత్త్వంబు నందుఁ జిత్తంబు గీలుకొలిపి ముక్తురా లయ్యె. అని యొఱింగించి.

# నవమాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. నవమే కురరాదిభ్యో దేహత శ్చోపశిక్షితమ్,
శ్రుత్వా యదుః కృతార్థోఽభూ దితి కృష్ణేన వర్ణితమ్.

ఈ నవమాధ్యాయమందు కురరము మున్నగువాని వలనను, దేహము వలన నేర్పబడిన దానిని విని, యదురాజు కృతార్థుఁ డయ్యెను అని కృష్ణునిచే వర్ణింపబడినది.

బ్రాహ్మణ ఉవాచ = బ్రాహ్మణుడు వచించెను.

అవ. కురరమృగము నుండి శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. పరిగ్రహో హి దుఃఖాయ యద్యత్ ప్రియతమం నృణామ్,
అనంతం సుఖ మాప్నోతి తద్విద్వాన్ య స్త్వకించనః. **1**

అ. నృణాం=నరులకు; యత్ యత్ ప్రియతమం=ఏది యేది మిగుల నిష్టమో; పరిగ్రహః హి=దానిని పరిగ్రహించుట; దుఃఖాయ=దుఃఖమునకు మూలము అని; తత్+విద్వాన్=ఇట్లు ప్రియతమమైన దానిని గ్రహించుట దుఃఖమని తెలిసినవాడై; యః అకించనః=ఎవడు ఎల్ల పరిగ్రహములను త్యజించినవాడో (దరిద్రుడు కాదు) వాడు; అనంతం సుఖం=నిత్య సుఖమును; ఆప్నోతి=పొందుచున్నాడు.

తా. నరుల కేది యేది మిగుల నిష్టమైనదో ఆ ద్రవ్యాదికమును గైకొనుటయే దుఃఖమునకు కారణము ఇట్లు ఇష్ట వస్తువులను గ్రహించుట దుఃఖమని యెఱింగి ఇష్ట పదార్థముల నెల్ల పరిగ్రహింపక వానియం దాశ వదలుకొన్నవాడు నిత్యసుఖమును పొందుచున్నాడు.

శ్లో. సామిషం కురరం జఘ్ను ర్బలినోఽన్యే నిరామిషాః,
తదామిషం పరిత్యజ్య స సుఖం సమవిందత. **2**

అ. స+ఆమిషం=కండలు బలసియున్న; కురరం=గొఱ్ఱెను (చూచి); అన్యే=తక్కిన బలినః=దానికంటె బలవంతులైన నరులు; (జంతువులును) నిరామిషాః=మాంసము లేక బక్కచిక్కినవారు; జఘ్నుః=మాంసముకొఱకు చంపుచున్నారు; తత్+ఆమిషం=ఆ మాంసమును; పరిత్యజ్య=వీడి; సః=ఆ కురరము; సుఖం సమవిందత=సుఖమును పొందెను.

తా. బాగుగా కండలు బలసిన గొఱ్ఱెను గాంచి మాంసము లేక బక్కచిక్కిన నరులు (జంతువులు) మాంసార్థులై ఆ గొఱ్ఱెను చంపుచున్నారు. అది తెలిసి అట్టి కండం బలుపును

పరిత్యజించి, ఆ కురర మృగము సుఖము పొందెను. ధనాదిక ముండిన ఇతరులు పీడింతురు. అది లేకున్న పీడ లేదని కురరము వలన నేర్చితిని

అవ. అర్భకుని వలన శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. న మే మానావమానౌ స్తో న చింతా గేహపుత్రిణామ్,
ఆత్మక్రీడో హ్యాత్మరతో విచరామీహ బాలవత్. 3

అ. మే=నాకు; మాన+అవమానౌ=గౌరవాగౌరవములు; న స్తః=లేవు; గేహపుత్రిణాం చింతా న=ఇల్లు బిడ్డలు గల సంసారులకు గల చింత లేదు; ఆత్మక్రీడః=ఆత్మయందు రమించువాడును; ఆత్మరతిః=ఆత్మయం దాసక్తియు గలవాడనై; బాలవత్=బాలుని వలె; విచరామి=చరింతును.

తా. నాకు మానావమానములు లేవు. ఇల్లు, బిడ్డలు గల సంసారులకు గల చింత నాకు లేదు. ఆత్మతో క్రీడించుచు, ఆత్మయం దాసక్తుడనై బాలుని వలె చరింతును. బాలునికి మానావమానము లున్నవా ? ఎవ రేమన్నను మిన్నకుండును, అతనికి సంసారమును లేదు గదా. చిన్నబాలుడు తనకు తానే ఆడుకొనుచు తనకు తానే ఆనందించుచున్నట్లు నేను నుందునని భావము.

అవ. ఓయీ ! అజ్ఞునికి, సర్వజ్ఞునికి ఏమి సాదృశ్యము ? అనగా నిశ్చింతు డగుటయే పరమసుఖ మనుచున్నారు—

శ్లో. ద్వా వేవ చింతయా ముక్తౌ పరమానంద ఆప్లుతౌ,
యో విముగ్ధో జడో బాలో యశ్చ బుద్ధేః పరం గతః. 4

అ. ద్వౌ ఏవ=ఇరువురే; చింతయా ముక్తౌ=చింతచే విడువబడినవారు; పరమానందే=బ్రహ్మానందమందు; ఆప్లుతౌ=మునిగినవారు; యః విముగ్ధః=ఎవడు అజ్ఞుడు; జడః=ఏ ఉద్యమము లేని, బాలః=బాలుడో, యః=ఎవడు, బుద్ధేః=ప్రకృతికంటె; పరః=ఉత్కృష్టుడైన ఈశ్వరుని, గతః=పొందినవాడో.

తా. ఈ జగమునం దిరువురే చింతను త్యజించి బ్రహ్మానంద సాగరమున మునిగిన వారు కలరు. వారిలో నొకడు అజ్ఞుడు, ఏ ప్రయత్నము చేయని బాలుడు. రెండవవాడు ప్రకృతి కంటె పరుడగు ఈశ్వరుని పొందినవాడు.

అవ. కుమారి వలని శిక్షితమును చెప్పుటకు ఆ కన్యకథను చెప్పుచున్నారు—

శ్లో. క్వచి త్కుమారీ త్వాత్మానం వృణానాన్ గృహ మాగతాన్,
స్వయం తా నర్హయామాస హ్యపయాతేషు బంధుషు. 5

అ. క్వచిత్=ఒకచో; కుమారీ=కన్య; ఆత్మానం=తన్ను; వృణానాన్=వరించువారై; గృహమ్+ఆగతాన్=తన గృహమునకు వచ్చినవారిని; బంధుషు అపయాతేషు=తన

తల్లిదండ్రులు లోనగు బంధువులు గతించిన వారు కాగా; స్వయం హి=తానే; తాన్ = అర్హయామాస=వారిని సత్కరించెను.

తా. ఒక్కచో ఒక కన్య తన్ను వరించుటకై తన గృహమున కేతెంచిన పురుషులను తన తల్లిదండ్రులు మున్నగు బంధువు లెవ్వరును తనకు లేకపోగా తానే వారలను సత్కరించెను

శ్లో. తేషా మభ్యవహారార్థం శాలీన్ రహసి పార్థివ,
అవఘ్నంత్యాః ప్రకోష్ఠస్థా శ్చక్రుః శ్శంఖాః స్వనం మహత్. 6

అ. పార్థివ=ఓ రాజా! తేషాం అభ్యవహారార్థం=ఆ వచ్చిన పురుషులకు భోజనాదికము నకు; రహసి=ఏకాంతమందు; శాలీన్+అవఘ్నంత్యాః=శాలిధాన్యమును (వడ్లు) దంచు చున్న ఆ కన్నె యొక్క; ప్రకోష్ఠస్థాః=ముంజేతులందున్న; శంఖాః=సంకుకడియములు (గాజులు); మహత్ స్వనం చక్రుః=పెద్ద ధ్వనిని చేసినవి.

తా. ఆ కన్నె అట్లు వచ్చిన పురుషులకు భోజనము కొఱకు ఏకాంతస్థలమందు వడ్లు దంచుచుండగా, ఆమె మోచేతులందున్న శంఖవలయములు (సంకులగాజులు) గల్లు గల్లు మని పెద్ద చప్పుడు చేసినవి.

శ్లో. సా త జ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః,
బభంజై కైకశ శ్శంఖాన్ ద్వౌ ద్వౌ పాణ్యో రశేషయత్. 7

అ. తత్=తానే స్వయముగా వడ్లుదంచుట వల్ల కలిగిన ధ్వనిని; జుగుప్సితం మత్వా= తన దారిద్ర్యమును తోపింపజేయునని తలచి; మహతీ=బుద్ధిమతియగు; సా=ఆమె; వ్రీడితా= సిగ్గుపొందినదై; తతః=తర్వాత; శంఖాన్=సంకుగాజులను; ఏక+ఏకశః = ఒక్కటొక్క టిగా; బభంజ=పగులగొట్టెను; పాణ్యోః=రెండు హస్తములందును; ద్వౌ ద్వౌ = రెండేసి గాజులను; అశేషయత్=మిగిల్చెను.

తా. బుద్ధిమంతురాలగు ఆ కన్నె ఆ చప్పుడువలన తాను స్వయముగా వడ్లు దంచుట తెలియవచ్చుననియు, అందువలన తన దారిద్ర్యము బయలు పడుననియు తలంచి, సిగ్గుపడినదై తన చేతులందలి సంకుగాజు లన్నింటిని ఒక్కొక్కటిగాఁ బగులగొట్టివైచెను. తన చేతులందు రెండేసి గాజులను మాత్ర ముంచుకొనెను.

శ్లో. ఉభయో రప్యభూ ద్ఘోషో హ్యవఘ్నంత్యాః స్మ శంఖయోః,
తత్రాప్యేకం నిరభిద దేకస్మా న్నాభవ ద్ధ్వనిః. 8

అ. అవఘ్నంత్యాః=ధాన్యము దంచుచున్న ఆ కన్నె హస్తములందలి; ఉభయోః శంఖయోః=రెండేసి సంకుగాజుల యొక్క; ఘోషః అపి అభూత్ స్మ=ధ్వని కలిగెను; తత్ర అపి=వానిలో; ఏకం నిరభిదత్=ఒక్కగాజును పగులగొట్టెను; ధ్వనిః న అభవత్=ధ్వని కాలేదు,

తా. అంతట అట్లు దంచుచున్న ఆ కన్నె చేతులందలి రెండేసి గాజులును ధ్వనింప దొడంగెను. అప్పు డా కన్నె వానిలో నొక్కొక్క గాజును పగులగొట్టెను. అంత శేషించిన ఒక్కొక్క చేతియందు ఒక్కొక్క గాజు చప్పుడు చేయని దయ్యెను.

అవ. ఓయీ ! కుమారికి నీకు సంగతి యెట్లనగా చెప్పుచున్నారు—

శ్లో. అన్వశిక్ష మిమం తస్యా ఉపదేశ మరిందమ,
లోకా ననుచర న్నేతాన్ లోకతత్త్వవివిత్సయా. 9

అ. అరిందమ=ఓ పగఱను మడియించువాడా ! లోకతత్త్వవివిత్సయా=లోకపు తత్త్వము తెలిసికొను కోరికతో; ఏతాన్ లోకాన్ అనుచరన్=ఈ లోకములం దిరుగుచు; తస్యాః=ఆ కన్యవలన; ఇమం=ఈ; ఉపదేశం=ఉపదేశమును; అన్వశిక్షం=నేర్చితిని.

తా. లోకముల తత్త్వ మెఱుంగు కోరికతో ఈ లోకమునం దంతట సంచరించుచు ఆ కుమారి వలన ఈ ఉపదేశమును నేర్చితిని.

శ్లో. వాసే బహూనాం కలహో భవే ద్వార్తా ద్వయో రపి,
ఏక ఏవ చరే త్తస్మాత్ కుమార్యా ఇవ కంకణః. 10

అ. బహూనాం వాసే=పెక్కుమంది కూడి వసించుటయందు; కలహః భవేత్=జగడము వచ్చును; ద్వయోః అపి=ఇద్దరు కూడియున్నను (కలహ మేర్పడును); తస్మాత్=అందువలన; కుమార్యాః కంకణః ఇవ=కుమారి కంకణమువలె; ఏకః ఏవ చరేత్=ఒక్కడుగనే చరించవలెను.

తా. పెక్కురతో గూడి ఒక్కచో వసించినచోఁ కయ్యమునకు తగ్గ వార్తలు మెండై కయ్యము పెరుగును. ఇద్దఱుగా కూడి యున్నను జగడము కలుగును. కావున కుమారి చేతి కంకటము వలె ఒంటరివాడనై చరించుట లెస్స అని నేర్చితిని.

అవ. చిత్తైకాగ్రత అద్వైతస్ఫూర్తి యగు సమాధికి హేతువని శరకారుని వలన శిక్షితమును చెప్పుచున్నారు. అందుల కుపాయమును చెప్పుచున్నారు —

శ్లో. మన ఏకత్ర సంయుఙ్జ్యా జ్జితశ్వాసో జితాసనః,
వైరాగ్యాభ్యాసయోగేన ధ్రియమాణ మతంద్రితః. 11

అ. జిత+ఆసనః=స్థిరముగా స్థిరాసనము లోనగు ఆసనమునందు కూర్చుండువాడును; జితశ్వాసః=ప్రాణాయామముచే శ్వాస వరికట్టినవాడై; వైరాగ్య+అభ్యాసయోగేన=వైరాగ్యముతోడి యోగము నభ్యసించుటద్వారా; అతంద్రితః=తొట్రుపాటులేనివాడై; ధ్రియమాణం=లక్ష్యమునందు స్థిరీకరణముగా జేయబడుచున్న; మనః=మనస్సును; ఏకత్ర సంయుఙ్జ్యాత్=ఒక్క లక్ష్యమునందే కూర్చవలెను.

తా. సిద్ధాసనమందు చక్కగా స్థిరముగా కూర్చుండుట ఆసనజయము. దానివలన శ్వాసలయము కలుగును. శ్వాసాధానమైన మనస్సు నిశ్చలమగును. అట్లు క్షణకాలము నిశ్చలమైన మనస్సు విషయవాసనలచే చలించిన దగునా లేక సుషుప్తియందువలె పూర్తిగా నిలీన

మగునా? అప్పు డేమగును? అనగా చెప్పుచున్నారు. అనుక్షణము విక్షిప్తముగా నుండు చిత్తమును వైరాగ్యముచే, అభ్యాసయోగముచే లక్ష్యమందు స్థిరపఱచి, ఏ తొట్రుపాటును లేనివాడై, ఆ మనస్సు నొక్క లక్ష్యమందే నిలుపవలెను.

అవ. ఒక్కచోట నుసున దెచ్చట ననగ( జెప్పుచున్నారు—

శ్లో. యస్మి న్మనో లబ్ధపదం యథైత
చ్ఛనై శ్శనై ర్ముంచతి కర్మరేణూన్,
సత్త్వేన వృద్ధేన రజ స్తమశ్చ
విధూయ నిర్వాణ ముపై త్యనింధనమ్. **12**

అ. ఏతత్ మనః = ఈ లయవిక్షేపాత్మకమైన మనస్సు; యస్మిన్ = ఏ పరమానందరూపుడగు భగవంతునందు; లబ్ధపదం = పొందబడిన స్థానము కలదై; కర్మరేణూన్ = కర్మవాసనలను, యదా = ఎప్పుడు; శనైః శనైః = మెల్లమెల్లగా; ముంచతి = వదలుకొనునో; (అయ్యా! కర్మవాసనలను వీడినను సుషుప్తియందువలె మనస్సునకు లయమగు ద్వారమగునా అనిన కాదు. ఎట్లనగా) వృద్ధేన సత్త్వేన = వర్ధిల్లిన ఉపరమరూపమైన సత్త్వగుణముచే; రజస్తమశ్చ = రజస్సును, తమస్సును, విధూయ = పడగొట్టి (వీని తిరస్కారము వలన విక్షేపలయములు లేని స్థితి కలుగును) అప్పుడు; వృత్తినిర్వాణః = శూన్యమైన ధ్యేయాకారముగా నుండుటను; అనింధనం = కట్టెలు లేనగువాని గుణమగు పొగయును లేనిదైన అగ్నినివలె; ఉపైతి = పొందుచున్నాడు. అట్లే యోగశాస్త్రమందు—

శ్లో. మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః,
యా సంప్రజ్ఞాతనామా సా సమాధి రభిధీయతే.

సంకల్ప వికల్ప రహితమై మనస్సు బ్రహ్మాకారమున నుండు స్థితి యేదియో అది సంప్రజ్ఞాత సమాధి యని చెప్పబడును.

తా. లయవిక్షేపాత్మకమైన (అనగా సుషుప్తియందు లయమును, జాగ్రత్స్వప్నములందు చలించుస్వభావమును) మనస్సు ఎప్పుడు పరమానందస్వరూపుడగు భగవంతునందు స్థానము పొందిన దగుచున్నదో, ఎప్పుడు కర్మవాసనలను మెల్లమెల్లగా వీడుచున్నదో అప్పుడు సర్వసంకల్పక్రియలయొక్క ఉపరమమును పొంది వర్ధిల్లిన సత్త్వగుణముచేత రజోగుణమును తమోగుణమును అధఃకరించి, (తిరస్కరించి) సర్వవృత్తిశూన్య మైన ధ్యేయాకారస్థితిని నిరింధనమైన (పొగలేని) అగ్నినివలె పొందుచున్నాడు.

అవ. అందువలన ద్వైతస్ఫూర్తి లేదనుచున్నారు—

శ్లో. తథైవ మాత్మ న్యవరుద్ధచిత్తో
న వేద కించి ద్బహి రంతరం వా,
యథేషుకారో నృపతిం వ్రజంత
మిషౌ గతాత్మా న దదర్శ పార్శ్వే. **13**

అ. తథా ఏవం=ఆ ప్రకారము; ఆత్మని అవరుద్ధచిత్తః=పరమాత్మయందు బంధింప బడిన చిత్తము కలవాడై; బహిః అంతరం=వెలుపలగాని లోపలగాని; కించిత్ న వేద=కించుకయు నెఱుంగడు; యథా=ఏ ప్రకారము; ఇషుకారః=బాణములుచేయు శిల్పి (కమ్మరవాడు); ఇషౌ గతాత్మా=బాణమునందు, దానికి చక్కదనము కలిగించుటయందు లగ్నమైన మనస్సు కలవాడై; పార్శ్వే వ్రజంతం నృపం=తన ప్రక్కను రాజవీధియందు పోవుచున్న రాజును; న దదర్శ=చూడలేదో.

తా. బాణమును దాగలిపై బెట్టి సుత్తితో చక్కబరచుచున్న శిల్పి (కమ్మరవాడు) భేరి లోనగు వాద్యఘోషలతో తనకు సమీపమున రాజవీధియందు చనుచున్న రాజు నేమాత్రము దర్శింపజాలడు (చూచినచో బాణము చక్కబడక చెడును. అట్లే పరమాత్మయందు స్థిరముగా నిల్పిన చిత్తము గల యోగి వెలుపలి జగత్తును గాని, లోపలి మనోవృత్తులను గాని యెఱుంగనివాడై యుండునని శరకారుని వలన నేర్చితిని.

అవ. సర్పమునుండి శిక్షితమును చెప్పుచున్నారు.

శ్లో. ఏకచా ర్యనికేతః స్యా దప్రమత్తో గుహాశయః,
అలక్ష్యమాణ ఆచారై ర్మని రేకోఽల్పభాషణః. **14**

అ. ఏకచారీ=ఒంటరిగ సంచరించుచున్నవాడై; (యోగుల గుంపును వీడుటలో కుమారియు, జనసంగమును విడుచుటలో సర్పమును గురువులు) సర్ప మెట్లు జనులను శంకించుచు, ఏకాకియై; ఆచారైః=తన నడవడులచే సర్పము సవిషమా, నిర్విషమా అని కన్పట్టనట్లు; అలక్ష్యమాణః=కన్పట్టనివాడై; ఏకః=అసహాయుడై; అల్పభాషణః=మితభాషియై; మునిః=ముని వర్తించును.

తా. ముని సర్పమువలె జనసంగమును త్యాగము చేసి చరించువాడును, ఒక్కచోట నిలుకడగ నుండనివాడును, (సర్పమువలె) తన కే సంగమును అంటకుండుటకై చాల జాగ్రత్త వహించువాడును, కొండ గుహ యందు శయనించువాడు (సర్పము పుట్టలో నుండు నట్లు), తన యాచార ప్రవృత్తులచే నిట్టివాడని తెలియరాని వాడును, సర్పము విషము కలదియా, విషము లేనిదియా యని తెలియనట్లు అసహాయుడు. (ఏకాకియు) మితభాషియై వర్తించువాడని సర్పము వలన నేర్చితిని.

శ్లో. గృహారంభో హి దుఃఖాయ విఫల శ్చాధ్రువాత్మనః,
సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖ మేధతే. **15**

అ. అధ్రువాత్మనః=నశ్వరదేహము కలవానికి; గృహ+ఆరంభః=గృహనిర్మాణము చేయుట; విఫలః=ప్రయోజనము లేనిది; దుఃఖాయ చ=దుఃఖమునకే అగును; సర్పః=పాము; పరకృతం=చెద పురుగు లేర్పరచిన; వేశ్మ=గృహమును (పుట్టను); ప్రవిశ్య=ప్రవేశించి; సుఖం ఏధతే=సుఖముగా వర్ధిల్లును.

తా. నశించిపోవు దేహమునకు ఇల్లు కట్టుట లోనగు పనులు గావించుట నిష్ప్రయోజనము. పైగా దుఃఖము తెచ్చిపెట్టును. సర్ప మేవిధముగా చెదపురుగులు, చీమలు నిర్మించిన

పుట్టను చొచ్చి సుఖముగా వర్ధిల్లుచున్నదో అట్లే యోగి పరగృహములందు గాని, కొండ గుహలందు గాని వాసము చేయుచు కాలము గడుపవలెను.

అవ. కారక సామగ్రి (సాధన) నిరపేక్షుడై కేవలుడైన ఈశ్వరుని వలన విశ్వసృష్టి సంహారములు జరుగును. అని ఊర్ణనాభి వృత్తాంతము నాచే సంభావింపబడినదని చెప్పుటకు తొలుత సంహార ప్రకారమును మూడున్నర శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. ఏకో నారాయణో దేవః పూర్వసృష్టం స్వమాయయా,
సంహృత్య కాలకలయా కల్పాంత ఇద మీశ్వరః. 16

అ. ఏకః = అద్వితీయుడును; ఈశ్వరః = సర్వనియంత యగు; నారాయణః దేవః = దేవుడైన నారాయణుడు; స్వమాయయా = తన మాయచే; పూర్వసృష్టం = ముందు సృజింపబడిన; ఇదం = ఈ జగమును; కల్పాంతే = ప్రళయమందు; కాలకలయా = కాలశక్తిచే; సంహృత్య = సంహరించి (యుండును).

తా. అద్వితీయుడై సర్వ నియంతయైన దేవుడగు నారాయణుడు తన మాయచే పూర్వము సృజింపబడిన ఈ విశ్వమును కల్పావసానమందు కాలశక్తిచే సంహారము చేయుచున్నాడు.

శ్లో. ఏక ఏవాద్వితీయో ఽభూ దాత్మాధారో నిరాశ్రయః,
కాలే నాత్మానుభావేన సామ్యం నీతాసు శక్తిషు.
సత్త్వాది ష్వాదిపురుషః ప్రధానపురుషేశ్వరః. 17

అ. ఏకః ఏవ = ఒక్కడే యగుచు; ఆత్మాధారః = తనకుతానే ఆధారమై; నిరాశ్రయః = ఇతరాశ్రయము లేనివాడై; ఆత్మ + అనుభావేన = తన సంకల్ప ప్రభావమున నడచు; కాలేన = కాలశక్తిచే; సత్త్వ + ఆదిషు-శక్తిషు = సత్వగుణము లోనగు వక్తులు; సామ్యం నీతాసు = గుణసామ్యమును, ప్రధానతను పొందినవి కాగా; ఆదిపురుషః = పురాణ పురుషుడు; అద్వితీయః = సజాతీయాది భేదరహితుడు; ప్రధాన పురుష + ఈశ్వరః = ప్రకృతి పురుషులకు ప్రభువు; అభూత్ = అయ్యెను.

తా. ఏకమై సజాతీయ స్వగత భేదరహితుడై, తన మహిమ యందే నిలిచియుండు వాడును, ఇతరములగు ఆశ్రయములు లేనివాడై, తన సంకల్ప ప్రభావమున ప్రవర్తించు కాలశక్తిచే సత్త్వాదిగుణములు లోనగు శక్తులు సామ్యమును పొందినవి కాగా, ఆ ప్రకృతి పురుషుల కధీశ్వరుడై ఆదిపురుషు డుండెను.

శ్లో. పరావరాణాం పరమ ఆస్తే కైవల్యసంజ్ఞితః,
కేవలానుభవానంద సందోహో నిరుపాధికః. 18

అ. పర + అవరాణాం = పరులగు బ్రహ్మాదులకును; అపరులు అనగా అన్యులైన ముక్తులైన జీవులకును; పరమః కైవల్యసంజ్ఞితః = ప్రాప్యమైన కైవల్యమను సంజ్ఞను పొందినవాడు; కేవల + అనుభవ + ఆనందసందోహః = నిర్విశేషుడై స్వప్రకాశుడై అనుభవైక వేద్యము లైన ఆనందముల సమూహమై; పరమానంద స్వరూపుడై; ఆస్తే = ఉండును.

తా. ఆ నారాయణుడు పరులగు బ్రహ్మాదులకు అన్యులగు ముక్తులైన జీవులకును పరమప్రాప్యమైన కైవల్యమను సంజ్ఞను పొందినవాడై నిర్విశేషుడై స్వయంప్రకాశుడై కేవలానుభవమునకు మాత్రము గోచరించు ఆనందమునకు మూలకందమై పరమానంద స్వరూపుడై యుండును.

అవ కేవలుడైన ఈ నారాయణుని వలననే సృష్టి కలుగుచున్నదని తెలుపుచున్నారు.

శ్లో. కేవలాత్మానుభావేన స్వమాయాం త్రిగుణాత్మికామ్,
సంక్షోభయన్ సృజత్యాదౌ తయా సూత్ర మరిందమ. **19**

అ. కేవల + ఆత్మానుభావేన = కేవలుడు; తన మహిమచే సృజింపబడిన కాలశక్తిచే; త్రిగుణాత్మికాం స్వమాయాం = త్రిగుణస్వరూపయగు తన మాయను; సంక్షోభయన్ = సామ్యావస్థనుండి గుణవ్యవస్థను మార్పుచేయుచు; అదౌ = ప్రథమమున; తయా = ఆ మాయచే; సూత్రం = మహత్తత్త్వమును; జీవుల సంసారమునకు హేతుభూతమైన దానిని; సృజతి = సృజించుచున్నాడు (క్రియాశక్తి ప్రధానమైన దానిని); జీవుల సంసారమునకు హేతువైన సూత్రము సృజింపబడిన దన్న మాత్రమున నీవు భయపడకుము. అని అరిందమ-శత్రువులైన రాగాదులను లయింపజేయువాడా అని సంబోధించినారు.

తా. ఓ రాగాదులగు శత్రువులను హతమార్చువాడా ! కేవలుడైన తన సంకల్ప ప్రభావముచే సృజింపబడిన తన కాలశక్తిచే త్రిగుణాత్మకయై సామ్యావస్థను పొందియున్న మాయను, గుణవ్యవస్థను మార్పు చేసి చలింపజేసి ఆ మాయచే జీవుల సంసారమునకు హేతుభూతమై క్రియాశక్తి ప్రధానమైన మహత్తత్త్వమును సృజించుచున్నాడు.

శ్లో. తా మాహు స్త్రిగుణవ్యక్తిం సృజంతీం విశ్వతో ముఖమ్,
యస్మిన్ ప్రోతమిదం విశ్వం యేన సంసరతే పుమాన్. **20**

అ. తాం = ఆ వ్యక్తిని; క్రియాశక్తినే; త్రిగుణవ్యక్తిం = గుణత్రయము యొక్క కార్యమును; విశ్వతోముఖం = నానావిధమై త్రిగుణాత్మకమైన విశ్వమును; సృజన్తీం = అహంకారము ద్వారా సృజించుదానినిగా; అహుః = చెప్పుదురు; త్రిగుణకార్యమునకు సూత్ర సంజ్ఞ వచ్చుటకు కారణమును చెప్పుచున్నారు — యస్మిన్ = ఏ కారణభూతమైన సమష్టిరూపమైన సూత్రమందు; ఇదం విశ్వం = ఈ విశ్వము; ప్రోతం = కూర్చబడియున్నదో; యేన = ఏ సూత్రముచే; పుమాన్ = పురుషుడు; సంసరతే = సంసారమువందు పరిభ్రమించుచున్నాడో.

తా. క్రియాశక్తి ప్రధానమగు ఆ సూత్రమును, మహత్తత్త్వము గుణత్రయము యొక్క కార్యముగను నానారూపమై, త్రిగుణాత్మకమైన విశ్వమును అహంకారము ద్వారా సృజించుదానిగను వచింతురు. సమష్టిరూపమైన ఈ సూత్రమందు ఈ విశ్వము జగత్తు ఓతప్రోతము పడుగుపేకలవలె కూర్చబడియున్నది. ఈ సూత్రముచేతనే జీవుడు ప్రాణరూపమున సంసారమునందు రాకపోకలతో తిరుగుచున్నాడు. అట్లే శ్రుతి — "వాయు ర్వై గౌతమత స్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చలోక స్సర్వాణి చ భూతాని సందృబ్ధాని" ఓ గౌతమా ! వాయువే ఆ సూత్రము. వాయువుచేతనే ఈ లోకము, పరలోకము,

సర్వభూతములు లోన జొచ్చి ధరింపబడి యున్నవి. ఆ వాయ్వాత్మకమైన ప్రాణరూపము చేత జీవుడు సంచరించును.

అవ. ఈ ప్రకారము శిక్షితమును చెప్పి దృష్టాంతమగు నర్థమును చెప్పుచున్నారు—

శ్లో. యథోర్ణనాభి ర్హృదయా దూర్ణాం సంతత్య వక్త్రతః,
తయా విహృత్య భూయస్తాం గ్రస త్యేవం మహేశ్వరః. 21

అ. యథా ఊర్ణనాభిః=ఏ ప్రకారము సాలెపురుగు; హృదయాత్ ఊర్ణాం=హృదయము నుండి వచ్చు లాలాద్రవమును; వక్త్రతః=నోటినుండి; సంతత్య=నూలుపోగులుగా ప్రసరింప జేసి; తయా=ఆ నూలుపోగులతో నిర్మించిన వలలో; విహృత్య=విహరించి, భూయః= మఱల; తాం=ఆ వలవంటి గూడును; గ్రసతే=కబలించుచున్నదో, ఏవం మహేశ్వరః=అట్లే పరమేశ్వరుడును.

తా. సాలె పురుగు తన కడుపులోపలనున్న ద్రవరూపమైన లాలను నోటినుండి నూలు పోగుల రూపమున వెలువరించి, దానితో వల వలె గూడుగా నల్లి, దానియందు విహరించి మఱల దాని నెట్లు కబళించివేయుచున్నదో, అట్లే పరమేశ్వరుడు తన మాయచే తనలో నున్న జగమును సృజించి, పాలించి సంహరించుచున్నాడు." అని సాలెపురుగు వలన నేర్చితిమి.

అవ. భగవద్ధ్యానపరులకు ఆ భగవత్సారూప్యము కలుగుట విచిత్రము గాదని పేశకారి (పట్టుపురుగు) అను భ్రమర దృష్టాంతముచే తెలియబడిన దనుచున్నారు—

శ్లో. యత్ర యత్ర మనో దేహీ ధారయే త్సకలం ధియా,
స్నేహా ద్ద్వేషా ద్భయా ద్వాపి యాతి తత్తత్సరూపతామ్. 22

అ. యత్ర యత్ర=ఎందెందు; దేహీ=జీవుడు; ధియా=బుద్ధి చేతను; స్నేహాత్= స్నేహము వలనను; ద్వేషాత్=ద్వేషమువలనను; భయాత్=భయము వలనను; మనః ధార యేత్=మనస్సు నిలువునో; తత్తత్సరూపతాం=దాని దానిసారూప్యమును; యాతి=పొందును.

తా. జీవు డే యే పదార్థములందు మనసు నేకాగ్రము చేసి నిలిపి, నెయ్యముచే గాని పగచే గాని, భయముచే గాని, చిత్తముతో నా యా వస్తువులను ధ్యానించుచున్నాడో ఆ యా పదార్థముల సమాన రూపమును పొందుచున్నాడు.

శ్లో. కీటః పేశస్కృతం ధ్యాయన్ కుట్యాం తేన ప్రవేశితః,
యాతి తత్సాత్మతాం రాజన్ పూర్వరూప మసంత్యజన్. 23

అ. రాజన్=రాజా! కీటః=పురుగు; కేశస్కృతం=పట్టుగూడు భ్రమరమును; ధ్యాయన్=ధ్యానించుచు; కుట్యాం=ఆ పట్టుగూడునందు; తేన=ఆ భ్రమరముచే; ప్రవేశితః =నిర్బంధించబడినదై; పూర్వరూపం అసంత్యజన్=తన తొంటి కీటరూపమును త్యజింపకయే; ఆమేనితోనే; తత్సాత్మతాం=ఆ పట్టుగూడు కట్టు తుమ్మెదరూపమును; యాతి=పొందును; ఎప్పుడును ఆ దేహము చేతనే అన్య సారూప్యము కన్పట్టుచున్నదో; దేహాంతరముచే సారూప్యము ఘటించునని వే రేల చెప్పవలయును (తప్పక ఘటించును.)

తా. ఒకానొక పురుగు పట్టుపురుగను భ్రమరముచే పట్టుబడి దాని పట్టుగూడులో ప్రవేశపెట్టి మేనితోనే వెంటనే ఆ భ్రమరముతో సమానమైన రూపమును పొందుచున్నది. ఇదియే భ్రమరకీట న్యాయము అని పట్టుపురుగు వలన నేర్చితిని.

అవ. తన దేహము వలన శిక్షితమును చెప్పుచున్నారు—

శ్లో. ఏవం గురుభ్య ఏతేభ్య ఏషా మే శిక్షితా మతిః,
స్వాత్మోపశిక్షితాం బుద్ధిం శృణు మే వదతః ప్రభో. **24**

అ. ప్రభో=ఓ రాజా; ఏవం=ఈ ప్రకారము; ఏతేభ్యః గురుభ్యః=ఈ గురువుల వలన; మే=నా యొక్క; ఏషా మతిః=ఈ మనస్సు; శిక్షితా=అభ్యసింపబడినది; స్వాత్మోపశిక్షితాం= నా దేహము వలన అభ్యసించిన; బుద్ధిం=బుద్ధిని గూర్చి; వదతః మే=చెప్పుచున్న నా వలన; శృణు=వినుము.

తా. ఓ రాజా! నే నీ ప్రకారము ఈ గురువుల వలన నా చిత్తముచే ఆయా గుణముల నభ్యసించితిని. మఱి నా దేహము వలన శిక్షితమును పొందిన బుద్ధిని గూర్చి చెప్పెదను వినుము.

శ్లో. దేహో గురు ర్మమ విరక్తివివేకహేతు
ర్బిభ్రత్ స్మ సత్త్వనిధనం సతతార్త్యుదర్కమ్,
తత్త్వా న్యనేన విమృశామి యథా తథాపి
పారక్య మిత్యవసితో విచరా మ్యసంగః. **25**

అ. గురుః దేహః=దేహము గురువై; మమ=నాకు; విరక్తి వివేకహేతుః=వైరాగ్య జ్ఞానములకు కారణమై యున్నది; సత్త్వనిధనం=ఉత్పత్తి నాశములను; సతత+ఆర్తి+ ఉదర్కం=ఎల్లప్పుడును దుఃఖమను ఉత్తరఫలమును; బిభ్రతి స్మ=భరించుచున్నది అనేన=ఈ శరీరముచే; తత్త్వాని=పంచవింశతి తత్త్వములను; యథా తథా అపి=యథాక్రమమున; విమృశామి=విమర్శించుచున్నాను. ఇట్లుపకారము చేయునదైన ఈ దేహమునందు ఆస్థ కర్తవ్యము కాదనుచున్నారు; పారక్యం ఇతి=కుక్క, నక్క లోనగు జంతువులకు భక్ష్యమని; అవసితః= నిశ్చయించుకొన్నవాడనై; అసంగః విచరామి=దేహమునందు సంగము వీడి చరించుచున్నాను.

తా. నా దేహమే నాకు జ్ఞాన వైరాగ్యముల బోధించు గురువై యున్నది. ఈ మేను జన్మ మరణంబు లందుచు, ఎల్లప్పుడుచు రాగల దుఃఖఫలము కలిగియున్నది. ఈ దేహము వలననే పరమాత్మ, మాయ, పంచవింశతి తత్త్వములు అనువానిని విమర్శించుచున్నాను. ఇట్టి ఉపకార హేతువైన ఈ శరీరము కడపట శ్వానము, జంబుకము లోనగు జంతువులకు భక్ష్య మగుచున్నది. అని ఇది నాది కాదను నిశ్చయము గలవాడనై దీని యందు సంగము వీడి చరించుచున్నాను.

అవ. సంతతము దుఃఖమే ఆయతిఫలముగా గల దనుటకు రెండు శ్లోకములచే వివరించుచున్నారు—

శ్లో. జాయాత్మజార్థ పశుభృత్య గృహాప్తవర్గాన్
పుష్ణాతి యత్ప్రియచికీర్షతయా వితన్వన్,
స్వాంతేన కృచ్ఛ్ర మవరుద్ధ ధన స్స దేహః
సృష్ట్వాఽస్య బీజ మవసీదతి వృక్షధర్మా. 26

అ. యత్ప్రియచికీర్షతయా=ఏ దేహమునకు భోగసంపాదనేచ్ఛ చేతను, పురుషుడు; జాయా...వర్గాన్ జాయా+ఆత్మజః=ఆలుబిడ్డలు; అర్థపశుభృత్యః=ధనము, పశువులు, భృత్యులు; గృహ+ఆప్తవర్గాన్=గృహము; బంధుమిత్రులు లోనగు సమూహములను; వితన్వన్=విస్తరించుచు; కృచ్ఛ్రం=మిక్కిలి కష్టపడుటచే; అవరుద్ధధనః=చేర్చిపెట్టబడిన ధనము కలవాడై; పుష్ణాతి=పోషించునో; సః దేహః=ఆ దేహము; స్వ+అంతే=తన ఆయువు అంతమైనపుడు; అవసీదతి=నశించుచున్నది, దేహనాశమునందు దుఃఖసమాప్తి లేదు. వృక్షధర్మా=వృక్షధర్మము కలదై; అనగా వృక్షము తనవంటి వృక్షము నుత్పత్తి చేయుటకు బీజముల సృజించునో అట్లే; అస్య=ఈ పురుషుని; బీజం=దేహాంతర బీజమును; సృష్ట్వా=సృజించి; అవసీదతి=నశించును.

తా. పురుషుడు తనదేహమునకు సుఖభోగమునకు సమకూర్ప నిచ్ఛ గలవాడై, భార్యా పుత్రులు, ధనము, పశువులు, భృత్యులు, గృహములు, బంధుమిత్రులు లోనగువారిని తాను దేహకష్టమును పొంది, సంతాపము చెంది, సంపాదించి కూర్చిన ధనముచే పోషించుచున్నాడు. అట్టి ఈ తన దేహము, తన కాయువు మూడినంతనే, తాను వృక్ష మెండిపోవుచు తన సంతతి వృక్షములు కలుగుటకు బీజములు సృజించినట్లు పురుషునికి మఱియొక దేహము కలుగుటకు కారణమైన కర్మబీజమును సృజించి నశించుచున్నది.

శ్లో. జిహ్వైకతోఽము మపకర్షతి కర్హి తర్షా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్,
ఘ్రాణోఽన్యత శ్చపలదృక్ క్వ చ కర్మశక్తి
ర్బహ్వ్యః సపత్న్య ఇవ గేహపతిం లునంతి. 27

అ. జిహ్వా=నాలుక; ఏకతః=ఒకప్రక్క (రసమును గూర్చి); అముం=ఈ దేహమును దేహాభిమానియగు పురుషుని గూర్చి; అపకర్షతి=మధురాదిరసమును రుచ్యమగు వానినిగూర్చి ఆకర్షించును. కర్హి=ఒకప్పుడు; తర్షా=దప్పి; అపకర్షతి=జలమును గూర్చి ఆకర్షించును. శిశ్నః=శిశ్నము; అన్యతః=ఇతరముగా మైథునమును గూర్చి ఆకర్షించును. త్వక్+ఉదరం=త్వగింద్రియము స్పర్శమును గూర్చియు; కడుపు బువ్వను గూర్చియు; శ్రవణం=చెవి; కుతశ్చిత్=ఏదేని శబ్దమును గూర్చి; ఘ్రాణం=ముక్కు గంధమును గూర్చియు; స్వతః=సహజముగా; చపలదృక్=చలించు దృష్టి రూపమాత్రమును గూర్చియు ఆకర్షించును. బహ్వ్యః సపత్న్యః=పెక్కురు సవతులు; గేహపతిం ఇవ=గృహ యజమానునివలె; లునంతి=పీడించుచున్నవి. క్వచ=ఒకప్పుడు; కర్మశక్తిః=వాగాది కర్మేంద్రియములు వాని వాని విషయములకు లాగుచు; లునంతి=పురుషుని తుత్తునకలు చేయుచున్నవి.

తా. దేహాభిమాని యగు పురుషు నొకవంక నాలుక రుచులకై లాగును. దప్పిక జలమునకు ఆకర్షించును. శిశ్నము మైథునమునకై పోవును. త్వగింద్రియము (చర్మము)

స్పర్శమునకు, ఉదరము అన్నమును గూర్చియు, శ్రవణము (చెవి) శబ్దమును గూర్చియు, ఘ్రాణము గంధమును గూర్చియు, చపలపు చూపు రూపమును గూర్చియు ఆకర్షించుచున్నవి. ఇతరములగు వాగాది కర్మేంద్రియములు సైతము వాని వాని విషయమును గూర్చి లాగుకొని పోవును. పెక్కురు సవతులు (ఒక్కనికి గల పెక్కండ్రు భార్యలు) గృహయజమానిని బాధించునట్లు ఈ ఇంద్రియము లన్నియు పురుషుని తునుకలు చేయుచున్నవి.

అవ. ఈ ప్రకారము దేహము గురువని మూడు శ్లోకములచే వ్యక్తి వివేక హేతువుగా; నుపపాదించి ఈ దేహ మతిదుర్లభ మని తెలుపుచు ఈశ్వరనిష్ఠను రెండు శ్లోకములచే విధించు చున్నారు —

శ్లో. సృష్ట్వా పురాణి వివిధా న్యజయాఽఽత్మశక్త్యా
వృక్షాన్ సరీసృప పశూన్ ఖగదంశ మత్స్యాన్,
తై స్తై రతుష్ట హృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముద మాప దేవః. **28**

అ. దేవః=పరమేశ్వరుడు, ఆత్మశక్త్యా అజయా = తన శక్తియగు మాయచే, వివిధాని పురాణి = అనేక విధములైన శరీరములను; వృక్షాన్=వృక్షములను; సరీసృపపశూన్=సర్పములను, పశువులను; ఖగదంశమత్స్యాన్=పక్షులు, దోమలు, మత్స్యములు అనువానిని సృష్ట్వా=సృజించి; తైః తైః=ఆయాశరీరములచే; అతుష్టహృదయః=తృప్తి నొందని మనస్సు కలవాడై ; బ్రహ్మ + అవలోకధిషణం = బ్రహ్మమును అపరోక్షముగ తెలియు బుద్ధిగల; పురుషం=పురుషశరీరమును; విధాయ=సృజించి; ముదం ఆప =సంతోషము నందెను.

తా. పరమేశ్వరుడు ఆత్మశక్తి యగు మాయచే వివిధములగు ప్రాణుల శరీరములను, వృక్షములను సర్పములను, జంతువులను, పక్షులను, దోమలను, మత్స్యములను సృజించి తృప్తిచెందనివాడై బ్రహ్మమును సాక్షాత్కరించుకొను బుద్ధిగల పురుషుని పురుషదేహమును సృజించి, నిర్మించి సంతోషమును పొందెను.

విశే. ఈ విషయమే 'తాసాం మే పౌరుషీ ప్రియా' = ఆ మృగాది తనువుల లోపల పురుషుని తనువు నాకు ప్రియమైనది అనియు, శ్రుతి - 'పురుషత్వే వా విస్తరా మాత్మా' = పురుష స్వరూపము (శరీరము) నందే పరమాత్మ ఆవిర్భవించును అనియు శ్రుతి— 'ఈశ్వరో హి కరణాధిష్ఠాత్రీ రగ్న్యాదిదేవతాః వాగాదిభి స్సహ సృష్టవాన్. తాశ్చ తం ప్రతి భోగార్థం శరీర మయాచంత. స చ తాభ్యో గోశరీరం అశ్వశరీరం పురుషశరీరం యథాక్రమ మానీతవాన్ — తత స్తా దేవతా స్సోఽబ్రవీ ద్యథాయతనం చక్షురాది స్థానం అస్మిన్ దేహే ప్రవిశతే " తి. "తాభ్యో గా మానయత్. తా అబ్రువ న్నవై నోఽయమల మితి. తాభ్యః పురుష మానయత్ తా అబ్రువన్ సుకృతం బతే"తి = ఈశ్వరుడు ఇంద్రియముల నధిష్ఠించు అగ్ని లోనగు దేవతలను, వాగాదులను నింద్రియములతోగూడ సృజించెను. ఆ దేవతలు పరమేశ్వరుని భోగసంపాదనము కొఱకు శరీరము నొసగుమని యాచించినవి. ఆ ఈశ్వరుడు వానికై గోశరీరమును, అశ్వ శరీరమును, పురుష శరీరమును క్రమముగా

సృజించి– అంత ఆ దేవతలను గూర్చి యత డిట్లు చెప్పెను— 'మీరు మీ మీ ఆయతనమగు చక్షురాది స్థానమును గూర్చి ఈ దేహమునందు ప్రవేశింపుడు' అనెను. ఈశ్వరు డా దేవతలకు గోవును సృజించెను. దేవతలు మా కీ గోశరీరము చాలదని చెప్పిరి. మఱి అశ్వమును సృజించెను. ఆ యశ్వశరీరమును మాకు చాల దనిరి. తర్వాత పురుషశరీరమును సృజించెను. అంత నా దేవతలు పుణ్యవంతమగు ఈ శరీరము మాకు చాలు ననిరి.

శ్లో. లబ్ధ్వా సుదుర్లభ మిదం బహుసంభవాన్తే
మానుష్య మర్థద మనిత్య మపీహ ధీరః,
తూర్ణం యతేత న పతే దనుమృత్యు యావ
న్నిఃశ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్. 29

అ. బహుసంభవ+అంతే=పెక్కు జన్మములకు చివర; సుదుర్లభం=మిగులదుర్లభమైన; ఇదం మానుష్యం=ఈమనుష్య జన్మము; అనిత్యం అపి=అనిత్య మైనను ఇహాముత్రమగు పురుషార్థము నిచ్చుదానిని; లబ్ధ్వా=పొంది; ధీరః=ధీరుడు, పండితుడు; అనుమృత్యు=నిరంతరము మృత్యువు కల ఈ శరీరము; యావత్ పతేత్=ఎంత వఱకు భూపతితము కాదో; తావత్=అంత లోపలనే; తూర్ణం=శీఘ్రముగా; నిఃశ్రేయసాయ=మోక్షము కొఱకు; యతేత=ప్రయత్నము చేయవలెను; విషయః=విషయసుఖము మాత్రము; సర్వతః స్యాత్ ఖలు=పశ్వాది జన్మములందును కలుగును కదా.

తా. అనేక జన్మములకు కడపట మిక్కిలి దుర్లభమైన మనుష్యజన్మమును, అనిత్యమైన దైనను ఇహాముత్ర భోగరూపమగు పురుషార్థము నొసంగుదానిని పొంది, పండితుడైనవాడు నిత్యమును మఱల మఱల మృత్యువు వెన్నంటు ఈ శరీరము ఎంతదనుక మరణము పొందదో అంత లోపలనే ధీరుడై శీఘ్రముగా మోక్షమునకు ప్రయత్నము చేయవలెను. విషయసుఖము పశువులు లోనగు తిర్యగ్జన్మంబులందును గలదు. కాని ఆ జన్మములు మోక్షప్రాప్తికి కొఱగావు. కావున మనుష్యుడు తన జన్మమును వృథా చేయదగదు.

అవ. ఈ ప్రకారము హేయోపాదేయ వివేకమును పెక్కు విధముల నిరూపించి మున్ను "నీవు కల్యుడవు, కవివి, దక్షుడవు" అని పలికిన దానికి ప్రత్యుత్తర మిచ్చుచున్నారు—

శ్లో. ఏవం సంజాతవైరాగ్యో విజ్ఞానాలోక ఆత్మని,
విచరామి మహీ మేతాం ముక్తసంగోఽనహంకృతిః. 30

అ. ఏవం=ఈ ప్రకారము; విజ్ఞాన+ఆలోకే=విశిష్ట జ్ఞానము అను దీపముగల; ఆత్మని=ఆత్మయందు ఉండుచు; సంజాతవైరాగ్యః=(పెక్కు గురువుల వలన శిక్షింపబడినవాడై) జనించిన విరక్తికలవాడనై; ముక్తసంగః=సంగమువీడి; అనహంకృతిః=అహంకారము లేనివాడనై ఏతాం మహీం విచరామి=ఈ భూమిపై చరించుచున్నాను.

తా. ఈ ప్రకారము పెక్కండ్రు గురువుల వలన గుణమును అభ్యసించి విశిష్టజ్ఞాన

మను దీపము గల పరమాత్మయందు మనస్సు నిల్పి, విరక్తుడనై, అన్నింటియందును సంగము వీడి, అహంకారము వీడి ఈ భూమిపై చరించుచున్నాను.

అవ. ఓయీ ! పెక్కుండ్రు గురువులతో పని యేమి ? శ్వేతకేతువు, భృగువు, లోనగు వారు పెక్కుండ్రు గురువుల నాశ్రయించినవారు కారు గదా అనగా అందులకు చెప్పుచున్నారు—

శ్లో. న హ్యేకస్మా ద్గురో ర్జ్ఞాన ముత్థితం స్యాత్ సుపుష్కలమ్,
బ్రహ్మైత దద్వితీయం హి గీయతే బహుధర్షిభిః. **31**

అ. ఏకస్మాత్ గురోః=ఒక్క గురువునుండి; సుపుష్కలం జ్ఞానం=సమృద్ధిమంతమైన జ్ఞానము; న ఉత్థితం స్యాత్ హి=జనించునది కాదు కదా. ఏతత్ అద్వితీయం బ్రహ్మ=ఈ అద్వితీయ బ్రహ్మము; ఋషిభిః=మహర్షులచే; బహుధా=సప్రపంచ నిష్ప్రపంచభేదాదులచే; గీయతే హి=కీర్తింపబడుచున్నది.

తా. ఒక గురువునుండి పుష్కలమగు జ్ఞాన ముత్పన్నము కాదు. అద్వితీయము (రెండవది లేనిది) అగు ఈ బ్రహ్మమును పెక్కుండ్రు మహర్షులు సప్రపంచస్వరూపుడు, నిష్ప్రపంచ స్వరూపు డనియు పెక్కు విధములుగా వర్ణించి యున్నారు.

విశే. దీని భావ మిది. ఏ రందఱును పరమార్థోపదేశగురువులు కారు. మఱి యేమనగా అన్వయవ్యతిరేకములచే ఆత్మయందు తోచు అసంభావనాదులను మాత్రము నివర్తింపజేయువారు. వారు పెక్కుండ్రుగా నుండుట యుక్తమే యగును. జ్ఞానప్రదుడగు గురు వొక్కడే యని "మదభిజ్ఞం గురుం శాంత ముపాసీత"=నన్నెఱింగిన శాంతు డగు గురువు నుపాసింపు" మని మున్ముందు చెప్పగలరు. అట్లే — 'తస్మా ద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసు శ్శ్రేయ ఉత్తమమ్' అందువలన ఉత్తమ శ్రేయస్సగు మోక్షమును గూర్చి ఎఱుగ గోరినవాడు ఉత్తము డగు గురువును శరణు పొందవలెను.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. ఇత్యుక్త్వా స యదుం విప్ర స్త మామంత్ర్యాంగ ధీరధీః
వందితోఽభ్యర్చితో రాజ్ఞా యయౌ ప్రీతో యథాగతమ్. **32**

అ. ధీరధీః=వికారమునొందని దొడ్డ బుద్ధికల; సః విప్రః=ఆ విప్రరూపుడగు దత్తాత్రేయుడు; శ్లో. యోగర్ధి మాపు రుభయీం యదుహైహయాద్యాః' యదువు, కార్తవీర్యుడు కర్మయోగమును, జ్ఞానయోగమును సమగ్రముగా దత్తాత్రేయు వలన నెఱింగిరి అని చెప్ప బడుట వలన, ఇతి+ఉక్త్వా=ఇట్లు పలికి; తం యదుం ఆమంత్ర్య=ఆ యదువును వీడ్కొని; రాజ్ఞా=రాజుచే; వందితః=నమస్కరింపబడి; అభ్యర్చితః=పూజించబడినవాడై; యథాగతం యయౌ=వచ్చిన మార్గమున వెడలిపోయెను.

తా. అని యిట్లు స్థిరబుద్ధి గల బ్రాహ్మణరూపధారియగు దత్తాత్రేయుడు యదువుతో పలికి, అతనిని వీడ్కొని, యాతనిచే నమస్కృతుడై, సత్కారంబు వడసి వచ్చిన దారిని పోయెను.

శ్లో. అవధూతవచ శ్రుత్వా పూర్వేషాం నః స పూర్వజః
సర్వసంగవినిర్ముక్త స్సమచిత్తో బభూవ హ. **33**

అ. నః పూర్వేషాం పూర్వజః=మా వంశము నందలి పూర్వీకులలో పూర్వుడు (ముందు వాడు) అగు యదువు; అవధూతవచః = ఆ యవధూత పలికిన వాక్కును; శ్రుత్వా = విని; సర్వసంగవినిర్ముక్తః=ఎల్ల సంగములనుండి విముక్తి చెంది; సమచిత్తః = సమచిత్తుడు; బభూవః = అయ్యెను.

తా. మా పూర్వులకు పూర్వుడు, మా వంశమునకు మూల పురుషుడగు యదురాజు ఆ యవధూత చేసిన యుపదేశమును విని సంగముల నెల్ల విడచి, ఎల్ల ప్రాణులందు ఒకే యాత్మను చూచు సమానచిత్తము కలవాడై వర్తించెను.

ఈ అధ్యాయాంతమున శ్రీధరస్వామి వారి సంగ్రహ శ్లోకములు :

శ్లో. కపోత మీనహరిణ కుమారీ గజపన్నగాః,
పతంగః కురర శ్చాష్టౌ హేయార్థే గురవో మతాః.
మధుకృ న్మధుహర్తా చ పింగళా చ ద్వయో స్త్రయః ,
ఉపాదేయార్థ విజ్ఞానే శేషాః పృథ్వ్యాదయో మతాః,
తదవాంతర భేదశ్చ తత్ర తత్ర స్ఫుటీకృతః,
అధ్యాయత్రితయే చాష్ట నవాష్టౌ హీరితాః క్రమాత్.

పావురము, చేప, జింక, కన్య, ఏనుగు, పక్షి, మిడుత, గొఱ్ఱె ఈ ఎనిమిదియు హేయార్థమునందు (విడువదగిన కామాదుల విషయమందు) గురువు లయ్యెను.

తేనె కూడబెట్టు తేనెటీగ, తేనెను హరించువాడు, పింగళ యను వేశ్య, ఉపాదేయమగు అర్థ విజ్ఞానమందు గురువులైరి. శేషించిన పృథివి లోనగు గురువులు వారి వారి అవాంతర భేదమగు విజ్ఞానమును స్పష్టపఱచిరి. ఈ ప్రకారము 7, 8, 9 అధ్యాయములు మూటియందును క్రమముగా 8, 9, 8 సంఖ్య గల గురువులు క్రమముగా చెప్పబడిరి.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే నవమోఽధ్యాయః
ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధము నందు నవమాధ్యాయము.

ఓం తత్సత్.

---

* కం. దేహము నిత్యము గా దని, మోహముఁ దెగఁగోసి శుద్ధమునివర్తనుఁడై
గేహము వెలువడి నరుఁ డు, శ్చాహమునం జెందు ముక్తిసంపద ననఘా. 102

* వ. మఱియు నొక్క పురాతన పుణ్యకథ వినుము. కనకవతీ పురంబున నొక్క ధరాసురుని కన్యకారత్నంబు కలదు. అవ్వధూతిలకంబు రత్నసమేతంబులగు కంకణంబులు ధరియించి బంధుజనంబులకు నాతిథ్యంబు గావించు కొఱకు శాలితండులంబులను రహస్యంబుగా ముసలంబు చేకొని దంచునప్పుడు, కంకణంబు లతిరావంబుగా మ్రోయుచుండ, నప్పరమ పతివ్రత యందుకు నసహ్యపడి యన్నియు దులిచి యొక్కటి నిలిపె ఆ శ్లేకచిత్తంబు నం దత్తఱపడక భగవచ్ఛాయత్తం బైన యేకచిత్తంబునం బ్రసన్నచిత్తులై , నరులు ముక్తు లగుదురు.

# దశమాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

చతుర్వింశతి గుర్వాఖ్యా లబ్ధ సంభావనా భువః,
ఉద్ధవ స్యాత్మతత్త్వాప్త్యై సాధనో_క్తిః పరేరితా.
దశమే దేహసంబంధా త్సంసృతి ర్నాత్మనః స్మృతా,
ఇత్యేత ద్వర్ణయామాస మతాంతరనిరాసతః.

ఈ పదియవ అధ్యాయమునందు చెప్పబడిన ఇరువది నలుగురు గురువుల వృత్తమును చక్కగా భావించు ఉద్ధవునికి ఆత్మతత్వ ప్రాప్తికై సాధనాదికవాక్యము చక్కగా చెప్పఁబడినది. ఈ దశమాధ్యాయమందు దేహసంబంధమువలన ఏర్పడిన సంసార మాత్మకు లేదని చెప్పబడినది. మతాంతరములను నివారించుట ద్వారా ఇది యంతయు వర్ణింపబడినది.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

అవ. ఈ ప్రకారము అన్వయవ్యతిరేకములచే నుత్పన్నమైన వివేకజ్ఞానము కలవానికి తత్త్వజ్ఞానమునకై ప్రారంభము నుండి సాధనముల నుపదేశించుచున్నారు.

శ్లో. మయోదితే ష్వవహిత స్స్వధర్మేషు మదాశ్రయః
వర్ణాశ్రమ కులాచార మకామాత్మా సమాచరేత్. 1

అ. మయా + ఉదితేషు = నాచే చెప్పబడిన; స్వధర్మేషు = పాంచరాత్రాద్యాగమములందు చెప్పబడిన శ్రేష్ఠమైన వైష్ణవ ధర్మములందు; అవహితః = జాగరూకుడవై; మత్ + ఆశ్రయః = నేనే ఆశ్రయముగా కలిగి; వర్ణాశ్రమకులాచారం = జాతి—ఆశ్రయము—వంశము అనువాని ఆచారమును; అకామాత్మా = ఫలకాంక్షలేని చిత్తము కలవాడై; సమాచరేత్ = ఆచరించవలెను.

తా. నాచే చెప్పబడినవగు పాంచరాత్రాగమము మున్నగు వానియందు విహితములైన శ్రేష్ఠమైన వైష్ణవ ధర్మములందు జాగరూకుడవై న న్నొక్కనినే ఆశ్రయించి, బ్రాహ్మణ క్షత్రియాది జాతి, బ్రహ్మచర్య గార్హస్థ్యాది ఆశ్రమము, యదువంశాది కులము అను వాని యాచారమును నిష్కాముడై ఆచరించవలెను.

అవ. ఎట్లు ఆత్మజ్ఞానము సంభవించు ననగా చెప్పుచున్నారు.

శ్లో. అన్వీక్షేత విశుద్ధాత్మా దేహినాం విషయాత్మనామ్
గుణేషు సత్యధ్యానేన సర్వారంభ విపర్యయమ్. 2

అ. విశుద్ధాత్మా=స్వధర్మముచే పరిశుద్ధమైన చిత్తము కలవాడై; గుణేషు=దేహేంద్రియాది గుణములందు; సత్యధ్యానేన=సత్య మను అభినివేశముచే; విషయ+ఆత్మనాం=విషయములం దభిలాషగల; దేహినాం=ప్రాణులయొక్క; సర్వ+అరంభవిపర్యయం=సకల కామ్యకర్మల ఫలవైపరీత్యమును; అన్వీక్షేత=సందర్శించవలెను.

తా. స్వధర్మాచరణమున విశుద్ధచిత్తుడై దేహేంద్రియాదులందు సత్యత్వబుద్ధితో విషయాభిలాష లగు ప్రాణులు గావించు సర్వ కామ్య కర్మలకు ఫలవైపరీత్యము కలుగు చుండుటను దర్శించవలెను.

అవ. మఱియు కామ్యములైన విషయములు మిథ్యాభూతములై యున్నవనుచున్నారు.

శ్లో. సుప్తస్య విషయాలోకో ధ్యాయతో వా మనోరథః
నానాత్మకత్వా ద్విఫలో బహి ర్నానార్థధీ ర్గుణైః. 3

అ. యథా=ఎట్లు; సుప్తస్య=నిదురించుచున్నవాని యొక్క; విషయ+ఆలోకః=ప్రియములు-అప్రియము లగు విషయముల అవభాసమును; యథా వా=ఎట్లు; ధ్యాయతః=విషయములనే తలంచుచుండువాని యొక్క; మనోరథః=కోరిక యును; విఫలః=వ్యర్థమో; తథా=అట్లే; గుణైః=ఇంద్రియగుణములచే; బహిః=బాహ్యప్రపంచమందు; నానార్థధీః=వివిధములైన పదార్థములను కాంచు బుద్ధి; నానాత్మకత్వాత్=శబ్దాది బహువిషయకమగుట వల్లను; ఇంద్రియజన్యమగుటవల్లను; విఫలా=నిష్ఫలమైనది

తా. నిద్రించువాని మనోవాసనారూపమగు స్వప్నము వలెను, మనస్సునందలి మనోరథము వలెను బహిర్వ్యాపకములైన ఇంద్రియములచే తెలియవచ్చు వివిధ పదార్థములను కాంచు బుద్ధి, బహువిషయక మగుటచే నిష్ఫలమే యగును.

శ్లో. నివృత్తం కర్మ సేవేత ప్రవృత్తం మత్పర స్త్యజేత్
జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్ కర్మచోదనామ్.

అ. నివృత్తం కర్మ=ఫల నివృత్తము(నిష్కామము)అగు కర్మను; సేవేత=సేవించవలెను; మత్పరః=నేనే పరమ పురుషార్థముగ కలవాడై; ప్రవృత్తం=కామ్యకర్మను; త్యజేత్=విడిచిపెట్టవలెను; జిజ్ఞాసాయాం=ఆత్మవిచారమందు; సంప్రవృత్తః=ప్రవర్తించిన వాడై; కర్మచోదనాం=వేదచోదితమగు ఉపాసనాది కర్మనుసైతము; న ఆద్రియేత=ఆదరించరాదు.

తా. నివృత్తిపరమై జ్ఞాన సంబంధమైన యోగకర్మ నభ్యసింపవలెను. నన్ను దిక్కుగ నెంచినవాడై ప్రవృత్తికర్మమగు యాగాదిక్రియను త్యజింపవలెను. ఆత్మ విచారమందు చక్కగా నెలకొన్నవాడై నివృత్తి ధర్మమైన ఉపాసనాది క్రియను సైతము ఆదరింపవలదు.

విశే. 'మోక్షార్థీ న ప్రవర్తేత తత్ర కామ్యనిషిద్ధయోః,
నిత్యనైమిత్తికే కుర్యాత్ ప్రత్యవాయజిహాసయా' అని స్మృతివాక్యము. మోక్షము నర్థించువాడు కామ్యనిషిద్ధములగు కర్మలందు ప్రవర్తించగూడదు. ప్రత్యవాయమును త్యజించు కోరికతో నిత్యనైమిత్తికములగు కర్మలను మాత్రము ఆచరింపవలెను.

శ్లో. యమా నభీక్ష్ణం సేవేత నియమాన్ మత్పరః క్వచిత్
మదభిజ్ఞం గురుం శాంత ముపాసీత మదాత్మకమ్. 5

అ. మత్పరః=నన్ను శరణముగా కలవాడై; క్వచిత్=యథాశక్తిగా; యమాన్=అహింసాదులగు యమములను; నియమాన్=తపస్స్వాధ్యాయాది నియమములను; అభీక్ష్ణం=అత్యాదరముతో; సేవేత=అనుష్ఠించవలెను; మఱియు యమాదులందు ఆదరము వీడి గురువు నుపాసింపవలె ననుచున్నారు—మత్+అభిజ్ఞం=నా తత్త్వమెఱిగినవా డగు; శాంతం గురుం=శాంతుడైన గురువును; మత్+ఆత్మకం=నా స్వరూపునిగా; ఉపాసీత=సేవించవలెను.

తా. నన్ను శరణ్యునిగా కలవాడై ఆదరముతో యథాశక్తిగా ఆత్మజ్ఞానమునకు విరోధము లేనట్టి అహింసాది నియమములను పంద్రెండింటిని, తపస్స్వాధ్యాయ-శౌచాది నియమములను అనుష్ఠించవలెను. నా తత్త్వ మెఱిగిన శాంతుడైన గురువును నా స్వరూపిగ నుపాసించవలెను.

అవ. గురు సేవకుని ధర్మములను చెప్పుచున్నారు—

శ్లో. అమా న్యమత్సరో దక్షో నిర్మమో దృఢసౌహృదః,
అసత్వరోఽర్థజిజ్ఞాసు రనసూయు రమోఘవాక్. 6

అ. శిష్యుడగువాడు— అమానీ=అహంకారము లేనివాడు; అమత్సరః=మచ్చరము లేనివాడు; దక్షః=సోమరితనము లేనివాడు; నిర్మమః=భార్యాపుత్రాదులందు మమకారము లేనివాడు; దృఢసౌహృదః=గురువునందు నిశ్చలభక్తి కలవాడు; అసత్వరః=వ్యగ్రతలేనివాడు; అర్థజిజ్ఞాసుః=వేదాంతార్థ మెఱుగగోరినవాడు; అనసూయుః=ఈసులేని వాడు; అమోఘవాక్=వ్యర్థములగు మాటలు పలుకని వాడును కావలెను.

తా. శిష్యుడగువా డభిమానరహితుడు, మచ్చరము లేనివాడు, భార్యాపుత్రాదులందు మమకారము లేనివాడు, నిశ్చలభక్తి గలవాడు, విహ్వలచిత్తుడు కానివాడు, వేదాంతార్థ మెఱుగగోరినవాడు, ఈసులేనివాడు, వ్యర్థమైన వాక్కులు వచింపనివాడై యుండవలెను.

అవ. ఓయీ! తన భార్యాపుత్రులందు మమకారము లేకుండు టెట్లు అనగా చెప్పుచున్నారు.

శ్లో. జాయాపత్య గృహక్షేత్ర స్వజన ద్రవిణాదిషు,
ఉదాసీనః సమం పశ్యన్ సర్వే ష్వర్థ మివాత్మనః. 7

అ. జాయా...ఆదిషు – జాయా=భార్య; అపత్య=బిడ్డలు; గృహ=ఇల్లు; క్షేత్ర=పొలము; స్వజన=బంధుమిత్రులు; ద్రవిణ=ధనము; ఆదిషు=మున్నగువానియందు; ఉదాసీనః=ఉపేక్ష గలవాడై; సర్వేషు=ఎల్లప్రాణులందు; ఆత్మనః అర్థం=ఆత్మ యొక్క ప్రయోజనమును; సమం ఇవ పశ్యన్=సమముగా చూచువాడై.

తా. ఆలు, బిడ్డలు, ఇల్లు, చుట్టములు, మిత్రులు, రొక్కము లోనగు నెల్ల వానియందు మమత వీడి మిన్నకుండుచు ఎల్లదేహులందు ఆత్మప్రయోజనము ఒక్కవిధమే యని సమదృష్టిగలవాడై వర్తించవలెను.

వి. ఇందు ఔదాసీన్యమునకు హేతువగు వివేకమును తెలుపుచున్నారు. సర్వత్ర ఆత్మకు ప్రయోజనము ఒక్కటిగనే చూచుట వివేకము. ఆత్మ ఒకడే అయినందున, భార్యాదుల దేహమందును, తదితరుల దేహమందును ఆత్మకు కలుగు సుఖాది ప్రయోజనము సమమే యగును. ఏ విశేష మధికమని వీనియందే మమతాబుద్ధి నుంచవలెను ? అని ఉదాసీనుడై గురువును శరణు పొందవలెను.

అవ. ఎవనికి ఏకత్వమువలన సర్వశరీరములందు సుఖాది ప్రయోజనము సమానమో అట్టి దేహవ్యతిరిక్తుడైన ఆత్మ యెట్టివాడు ? అనగా అతనిని గూర్చి చెప్పుచున్నారు—

శ్లో. విలక్షణః స్థూలసూక్ష్మా ద్దేహా దాత్మేక్షితా స్వదృక్,
యథాగ్ని ర్దారుణో దాహ్యా ద్దాహకోఽన్యః ప్రకాశకః. **8**

అ. స్థూలసూక్ష్మాత్ = స్థూలరూపము, సూక్ష్మరూపమగు; దేహాత్ = శరీరముకంటె; ఆత్మా = ఆత్మ; విలక్షణః = వేఱగువాడు. ఆ రెండు విధము లగు వైలక్షణ్యమును తెలుపుచున్నారు — ఈక్షితా = ద్రష్ట. దృశ్యముకంటె విలక్షణుడు; స్వదృక్ = స్వప్రకాశుఁడు, జడములకంటె విలక్షణుఁడు అని. ఆ రెండింటికిని అన్యు డనుటలో దృష్టాంత మేమన - యథా అగ్నిః = ఏ ప్రకారము అగ్ని; దాహకః = దగ్ధము చేయువాడు; ప్రకాశకః = వెలుగు నిచ్చువాడునై; దాహ్యాత్ = తగులబెట్టదగినదై ప్రకాశింపదగిన; దారుణః = కాష్ఠముకంటె; అన్యః = భిన్నుడై యున్నాడో (అట్లు).

తా. కాష్ఠాదులను దహించుచు వానిని ప్రకాశింపజేయువాడగు అగ్ని, దహింపదగినవై ప్రకాశింపఁజేయఁదగినవైన దారువులకంటె వేఱై యెట్లున్నాడో అట్లే స్థూలసూక్ష్మము లగు దేహములు రెండింటికంటె విలక్షణుడై వానిని చూచు ద్రష్టయై వానిని ప్రకాశింపజేయువాడై ఆత్మ వేఱై యున్నాడు.

అవ. ఈ దృష్టాంతము చేతనే ఆత్మకు నిత్యత్వము, అనాదిత్వము, విభుత్వము, ఏకత్వము లోనగు విశేషణములును సిద్ధించుచున్న వనుచున్నారు—

శ్లో. నిరోధోత్ప త్త్యణుబృహన్నానాత్వం తత్కృతాన్ గుణాన్,
అనుప్రవిష్ట ఆదత్తే ఏవం దేహగుణాన్ పరః. **9**

అ. (ఎట్లు - అగ్ని) అనుప్రవిష్టః = కాష్ఠములలోపల ప్రవేశించి; నిరోధ ... నానాత్వం — నిరోధ = వినాశమును; ఉత్పత్తి = పుట్టుకను; అణు = అల్పత్వమును; బృహత్ = మహత్త్వమును (ఇట్లు); నానాత్వం = అనేకత్వమును; తత్కృతాన్ = ఆ దారువులచే నైన; గుణాన్ = హ్రస్వవక్రతాది గుణములను; ఆదత్తే = (తాను నాశముగాక) గ్రహించుచున్నాడో; ఏవం = ఈ ప్రకారము; దేహగుణాన్ = దేహము యొక్క జన్మస్థితిలయాది గుణములను; పరః = దేహముకంటె వేఱగు ఆత్మ; ఆదత్తే = గ్రహించుచున్నాడు.

తా. దారువులలోపల ప్రవేశించియుండు అగ్ని ఆ దారువుల పొందు ఉత్పత్తి నాశములు, కృశత్వదార్ఢ్యములు లోనగు వివిధధర్మములను తాను నాశమొందకయే పొందుచున్నాడు. ఇట్లే ఆత్మ, దేహమున కనిత్యములై కలుగు ఉత్పత్తి, నాశ, కృశత్వాదులను

తా నవినాశియై గ్రహించుచున్నాడు. నిత్యత్వాదులచేగూడ వైలక్షణ్య ముండుట వలన ఆత్మ దేహముకంటె అన్యత్వము గలిగియున్నదని భావము.

అవ. ఓయీ ! అగ్నికి దారుసంయోగము వలన, దారుధర్మమును తన్నివృత్తిని పొందుటయు ఘటించుచున్నది. ఆత్మ అసంగుఁ డగుటవలన దేహముతో గాని దేహధర్మములతో గాని సంబంధ మెట్లు కలుగును ? ఒకవేళ అట్లు సంబంధము కలిగినను దాని నివృత్తి యెట్లు అనగా చెప్పుచున్నారు—

శ్లో. యోఽసౌ గుణై ర్విరచితో దేహోఽయం పురుషస్య హి,
సంసార స్తన్నిబంధోఽయం పుంసో విద్యాచ్ఛి దాత్మనః. **10**

అ. పురుషస్య గుణైః=పురుషుడైన ఈశ్వరుని కధీనములైన మాయా గుణములచే; యః అసౌ = ఏ ఈ సూక్ష్మ శరీరము; అయం దేహః = ఈ స్థూల శరీరమును; విరచితః = నిర్మింప బడినదో; పుంసః=జీవునికి; సంసారః=సంసారము; తన్నిబంధనః = ఆ స్థూలసూక్ష్మ శరీరములం దధ్యాసచే నైనది; హి = ఎందువలన నిట్లయినదో; అందువలన; ఆత్మవిద్య దానిని మఱల్చునట్టిది: ఆత్మనః విద్యా=ఆత్మ యొక్క విజ్ఞానము; ఛిత్ =అధ్యాసను ఛేదించునది అగును.

తా. పరమపురుషు డగు ఈశ్వరుని కధీనమైన మాయా గుణములచే నీ సూక్ష్మస్థూల శరీరములు సృజింపబడినవి. జీవున కీ సంసారబంధ మీ దేహద్వయాధ్యాసచేతనే కలిగినది. ఈ దేహమే నేనను భావన అధ్యాస యగును. ఆ మాయాధ్యాస నాత్మవిజ్ఞానము ఛేదించున దగును.

శ్లో. తస్మా జ్జిజ్ఞాస యాత్మాన మాత్మస్థం కేవలం పరమ్,
సంగమ్య నిరసే దేత ద్వస్తుబుద్ధిం యథాక్రమమ్. **11**

అ. తస్మాత్ = అందువలన; జిజ్ఞాసయా = ఆత్మ విచారముచే; ఆత్మస్థం=కార్యకారణ సంఘాతమగు దేహమం దున్నట్టి; కేవలం పరం=ఒక్కడై సర్వమునకు విలక్షణు డైన ఆత్మానం = పరమాత్మను; సంగమ్య= కూడి; చక్కఁగా నెఱింగి; ఏతత్ వస్తుబుద్ధిం = ఈ దేహాదికమునందు సత్యత్వ బుద్ధిని; యథాక్రమం = స్థూలసూక్ష్మక్రమమున; నిరసేత్ =నిరసించవలెను,

తా. ఈ సంసారము మాయాకార్య మగుట వలన కార్యకారణరూప మగు దేహేంద్రియాదిసంఘాతమం దున్నవాడు ఒక్కడును దేహేంద్రియాదుల కన్నను పరుడు నైన ఆత్మను చక్కఁగా నెఱింగి ఈ దేహాదికము సత్యము అనుబుద్ధని స్థూలసూక్ష్మక్రమమున త్యజించవలెను.

అవ. గురువునలన లభించిన ఆత్మవిద్య ఆవిద్యను, దాని కార్యమును నిరసింప సమర్థ మగుచున్నది అని దాని స్ఫుటీకరణమునకై విద్యోత్పత్తిని అగ్న్యుత్పత్తి రూపముగ నిరూపించుచున్నారు—

శ్లో. ఆచార్యోఽరణి రాద్య స్స్యా దంతేవా స్యుత్తరారణిః,
తత్సంధానం ప్రవచనం విద్యాసంధి స్సుఖావహః. **12**

అ. ఆచార్యః=గురువు; ఆద్యః అరణిః = మొదటిది క్రిందిదైన అరణి; స్యాత్= అగును; అంతేవాసీ = శిష్యుడు; ఉత్తరా+అరణిః = పైనుండు రెండవ అరణి; తత్సంధానం = ఆ రెండరణుల నడుమ నుండు మధించు ధాతువు; ప్రవచనం = ఉపదేశము; సుఖ+ఆవహః=సుఖమును కలిగించునది; విద్యా = ఆత్మవిద్య; సంధిః=వాని కలయిక వలన జనించు అగ్ని వంటిది.

తా. గురువు క్రింది అరణియు, శిష్యుడు పై అరణియు, ఉపదేశ మా రెండరణుల నడుమనుండు కౌయ్యయు అగును. ఆత్మవిద్య వాని కలయికయందు జనించు అగ్నివంటి దగును.

అవ. అగ్నిసాదృశ్యమునే చెప్పుచున్నారు—

శ్లో. వైశారదీ సాతివిశుద్ధబుద్ధి
ర్ధునోతి మాయాం గుణసంప్రసూతామ్,
గుణాంశ్చ సందహ్య యదాత్మ మేత
త్స్వయం చ శామ్య త్యసమి ద్యథాగ్నిః. **13**

అ. వైశారదీ=(విశారదుఁడైన) అతి నిపుణుఁడైన శిష్యునిచేత పొందబడినది లేక గురువుచే నుపదేశించబడిన దగు; సా అతివిశుద్ధబుద్ధిః=ఆ మిగుల స్వచ్ఛమైన బుద్ధి (కామాది మలములు లేనిది); గుణసంప్రసూతాం మాయాం = సత్త్వాది త్రిగుణములచే దేహాది కార్యము లను మాయను; ధునోతి=నివర్తింప జేయుచున్నది; యత్+ఆత్మం ఏతత్=గుణముల స్వరూప మైన ఈ విశ్వమును; గుణాంశ్చ=సంసార నిమిత్తములైన ఆ త్రిగుణములను; సందహ్య= దహించి; అసమిత్ యథా అగ్నిః=సమిధలు లేని అగ్ని వలె; స్వయం = తనకు తానే; శామ్యతి=శాంతించుచున్నది, ఆకార్య కారణరూపమైన దేహేంద్రియ సంఘాతము, అవిద్యల వ్యవధానము (అడ్డు) లేమిచే సాక్షాత్తుగా పరమానందస్వరూప మగుచున్నది.

తా. గురూపదిష్టమై అతినిపుణుడైన శిష్యునిచే గ్రహింపబడి నిపుణత్వమును పొందినదై మిగుల సాత్త్వికమై, నిర్మలమైన బుద్ధి, దేహేంద్రియాది కార్య కారణ సంఘాతమును సృజించు మాయను తొలగించుచున్నది. మఱి వేని స్వరూపమున ఈ విశ్వము వెలయుచున్నదో ఆ సంసారకారణములైన త్రిగుణములను దహించి నిరింధనమైన (కట్టెలు లేని) అగ్నివలె కార్యకారణమైన దేహాదికము లేనందున అవిద్యయను ఉపాధి పోయినందున సాక్షా త్పరమానందరూప మగుచున్నది.

అవ. ఈ ప్రకారము స్వప్రకాశజ్ఞానస్వరూపుడు, నిత్యుడు అగు ఆత్మ ఒక్కడే అగును. అతనికి కర్తృత్వాది ధర్మములు దేహోపాధికము లగును. ఆ యాత్మ కంటె వ్యతిరిక్తమైనది సర్వ మనిత్యము, మాయామయమునై యున్నది. అందువలన అన్నింటినుండి విరక్తుడై ఆత్మజ్ఞానముచే సంసారబంధవిముక్తు డగు నని "విలక్షణః స్థూలసూక్ష్మాత్"

ఇత్యాది శ్లోకముల ద్వారా చెప్పబడినది. ఇట్లు శ్రుతిసమన్వయముచే అర్థము నిర్ణీతమైనను మతాంతరవిరోధముచే సందేహము కలుగకూడదని ఆ మతమును నివారించుటకు ఆ మతము నద్భావించుచున్నారు—

శ్లో. అథైషాం కర్మకర్తౄణాం భోక్తౄణాం సుఖదుఃఖయోః,
నానాత్వ మథ నిత్యత్వం లోకకాలాగమాత్మనామ్. **14**

అ. అథ=మఱి; కర్మకర్తౄణాం=పుణ్యాపాపకర్మలను చేయువారును; సుఖదుఃఖయోః భోక్తౄణాం=వాని ఫలములగు సుఖదుఃఖముల ననుభవించువారను అగు; ఏషాం=ఈ జీవుల యొక్క; లోక కాల+ఆగమ+ఆత్మనాం— లోక=భోగస్థానములగు స్వర్గాదిలోకములు; కాల=భోగకాలము; ఆగమ=ఆ భోగాదులను చెప్పు శాస్త్రములు; ఆత్మనాం=భోక్తలగు జీవులకును; నానాత్వం=వైవిధ్యము (అనేకత్వము); నిత్యత్వం=నిత్యత్వమును; మన్యసే= తలంచుచున్నావు.

తా. పుణ్యపాపకర్మలు చేయు కర్తలు, వాని ఫలములగు సుఖదుఃఖముల ననుభవించు భోక్తలగు జీవులును, భోగస్థానములగు స్వర్గాదిలోకములును, వాని భోగకాలమును, శాస్త్రములును, ఆ భోక్తలస్వరూపమునకు నానాత్వమును (జీవుల అనేకత్వమును), నిత్యత్వమును మఱి తలంతువేని దానికి చెప్పుచున్నారు.

వి. మీమాంసకులగు జైమిని మతానుయాయు లిట్లు తలంతురు—"అహం ప్రత్యయ జ్ఞేయుఁడు అనగా నేను నను శబ్దమునకు లక్ష్యమై తోచుచు తెలియవచ్చువాడే ఆత్మ. అతడు ప్రతిశరీరభిన్నుడు. ఒక్కొక్క శరీరమం దొక్కొక్క జీవు డుండును. అతడు కర్తయు భోక్తయు నై యున్నాడు. ఆ జీవునకు స్వస్వరూపుడై నిర్వికారుడై ఏకమైన పరమాత్మ లేడు" అని. వారిట్లనెదరు— "అహంప్రత్యయవిజ్ఞేయో జ్ఞాతవ్యః సర్వదైవ హి" అని. నేనని తోచుచు తెలియదగినవాడు, సర్వదా ఎఱుంగదగినవాడు అగును. అట్లయినచో వైరాగ్యమును కలుగదు. అదెట్లన, భోగస్థానము లసత్యములైననే వైరాగ్యము కలుగును. భోగకాలమునకుగాని, దానికుపాయమగు కర్మను బోధించు ఆగమనమునకుగాని, భోక్తయగు ఆత్మకు గాని ఈ అనిత్యత్వము లేదు. అని ఇట్లు లోక, కాల, ఆగమ, ఆత్మలు నిత్యములని తలంతువేని అందుకు పైనఁ జెప్పెదము.

అవ. భోగ్యములు విచ్ఛిన్నము లగుటవలన, మాయామయము లగుటవలనను వైరాగ్యము కలుగనేర దన్నచో నిట్లనుచున్నారు—

శ్లో. మన్యసే సర్వభావానాం సంస్థా హ్యౌత్పత్తికీ యథా,
తత్తదాకృతి భేదేన జాయతే భిద్యతే చ ధీః. **15**

అ. సర్వభావానాం=స్రక్చందన వనితాది సకల భావముల యొక్క; సంస్థా=స్థితి; ఔత్పత్తికీ=ప్రవాహరూపముచే నిత్యమగును. అట్లే వచింతురు. "న కదాచి దనీదృశం జగత్" ఒకప్పుడును జగత్తు ఇట్టిది కావట్టిదికాదు. అనగా జగత్తు ఇట్లే నిత్యమై యుండును. అందువలన

ఈ జగమునకు కర్త ఒకానొకడు ఈశ్వరుడు లేడని భావము. యథా = యథావత్ (వాస్తవము). జగత్తు సర్వము మాయామయము కాదు. ఆత్మస్వరూపభూతము, నిత్యము, ఏకమగు జ్ఞానమే లేదనుచున్నారు - తత్తదాకృతిభేదేన=ఆ యా ఘటపటాద్యాకారములచే; ధీః=బుద్ధి; జాయతే=కలుగుచున్నది; కావున అనిత్యము; భిద్యతే చ = భేదము నందునదియు. ఇందలి గూఢమగు అభిప్రాయ మిది—ఆత్మ నిత్యజ్ఞానస్వరూపము కాదు. మఱి యేమనగా జ్ఞాన పరిణామము కలవాడు, వికారి యగుటచే అనిత్యు డనుటకును వలనుపడదు. అట్లే వచింతురు— 'విక్రియాజ్ఞానరూపస్య న నిత్యత్వే విరోత్స్యతే' అని. కావున ముక్తియందింద్రియాది రహితునకు పరిణామ మసంభవము కాన జడముగా పరిణామమునందుట పురుషార్థఫలకము కాదు గనుకను ప్రవృత్తిమార్గమే శ్రేయస్కరము గాని నివృత్తిమార్గము కాదు.

తా. భోగ్యములగు స్రక్చందన వనితాదులగు సర్వపదార్థముల స్థితి ప్రవాహమువలె నిత్యమైనది. జగత్తు సత్యము. మాయామయము కాదు. ఘటపటాద్యాకారములుగా తోచు పదార్థముల భేదము నిత్యము. అని బుద్ధియందు తలంచుచున్నవాడవైనచో దానికి చెప్పెదము.

అవ. అందు. పైనచెప్పబడినదాని నంగీకరించి, వైరాగ్యము జనించుటకు ప్రవృత్తి మార్గ మనర్థహేతు వని ప్రపంచించుచున్నారు—

శ్లో. ఏవ మప్యంగ సర్వేషాం దేహినాం దేహయోగతః,
కాలావయవత స్సన్తి భావా జన్మాదయోఽసకృత్. **16**

అ. అంగ=ఓ ఉద్ధవా! ఏవం అపి=పైనపేర్కొన్న రీతి యైనను; సర్వేషాం దేహినాం= ఎల్లప్రాణులకు; దేహయోగతః=దేహముల సంయోగము వలన; జన్మాదయః=జన్మము లోనగు; భావాః=భావములు; కాల+అవయవతః=కాలము యొక్క అవయవమైన సంవత్సరము వలన; అసకృత్ =పలుమార్లు; సంతి=కలుగుచున్నవి.

తా. ఓ ఉద్ధవా ! ఇట్లు లోకముల స్థితికిని, లోకపాలురకును, ఎల్లప్రాణులకును, దేహసంబంధమువలన జన్మస్థితిలయములను భావములు పలుమాఱు కాలావయవమగు సంవత్సరము వలన కలుగుచున్నది.

శ్లో. అత్రాపి కర్మణాం కర్తు రస్వాతంత్ర్యం చ లక్ష్యతే,
భోక్తుశ్చ దుఃఖసుఖయోః కో న్వర్థో వివశం భజేత్. **17**

అ. అత్ర+అపి = జైమిని కథితమగు కర్తృభోక్తృ పక్షమున గూడ; కర్మణాం కర్తుః = ప్రవృత్తి కర్మలు చేయువాడును; దుఃఖసుఖయోః = దుఃఖమును, సుఖమును; భోక్తుశ్చ = అనుభవించువానికి; అస్వాతంత్ర్యం లక్ష్యతే = పరతంత్రత (కర్మ పరాధీనత) అగపడుచున్నది. ఏలనన స్వాతంత్ర్యమున్నచో దుష్కర్మయు, దుఃఖభోగమును సంభవింపవు. కావున, కః ను అర్థః = ఏ పురుషార్థము; వివశం = అస్వతంత్రుడగు కర్త, భోక్త యగు వానిని; భజేత్ = పొందును ? ఏ పురుషార్థ మాతని యందు స్థిరముగ నుండును ? (ఏదియు ఉండదు.)

తా. జైమినికి అభిమతమైన కర్తృభోక్తృ పక్షమును బట్టి చూచినను ప్రవృత్తి కర్మం నాచరించుచు, సుఖదుఃఖముల ననుభవించువాడు కర్మాధీనుడే గాని స్వతంత్రుడు గాడు. స్వతంత్రు డగుచో దుష్కర్మ లేల చేయును? దుఃఖ మేల అనుభవించును ? కావున ఇట్లు పరాధీనుడగు వానిలో నే పురుషార్థము స్థిరముగ నెలకొనును ?

అవ. ఓయీ ! ఎవరు పుణ్యకర్మను చేయ నెఱుంగుదురో వారు సుఖవంతులే యగుదురు. ఎవ రట్లు చేయ నెఱుంగరో వారు మాత్రము దుఃఖభాగు లగుదురు. అన్నచో అందుకు చెప్పుచున్నారు—

శ్లో. న దేహినాం సుఖం కించి ద్విద్యతే విదుషా మపి,
తథా చ దుఃఖం మూఢానాం వృథాఽహంకరణం పరమ్. **18**

అ. దేహినాం = ప్రాణులలో; విదుషాం అపి = చక్కగా కర్మ చేయ నెఱిగిన వారికిని; కించిత్ సుఖం = కొంచెము సుఖమును; న విద్యతే = లేదు; తథా = అట్లే; మూఢానాం = కర్మను చక్కగా చేయుట ఎఱుగని వానికిని; దుఃఖం = ఇంచుక దుఃఖమును లేదు. అందువలన, పరం అహంకరణం = అధికమైన అహంకారము, మేము కర్మ కుశలుల మగుటచే సుఖవంతులము అనుట; వృథా = వ్యర్థమే అగును.

తా. సమ్యక్కర్మ అనగా సుఖమును కలిగించు యాగాది పుణ్యకర్మ యొక్క స్వరూప మెఱింగిన విద్వాంసులకు సైతము కొంచెమైన సుఖము కలుగుట లేదు. అట్లు కర్మ స్వరూప మెఱుంగని మూఢులకు కొంత దుఃఖమును కలుగుట లేదు. కనుక మేము కర్మకుశలుర మగుట వలన సుఖులమై యున్నా మనుట వ్యర్థమగు అహంకారమే యగును.

అవ. సుఖదుఃఖప్రాప్తి విఘాతముల నెఱుగుదురని అంగీకరించియు ఇట్లనుచున్నారు—

శ్లో. యది ప్రాప్తిం విఘాతం చ జానన్తి సుఖదుఃఖయోః,
తేఽ ప్యద్ధా న విదు ర్యోగం మృత్యు ర్న ప్రభవే ద్యథా. **19**

అ. సుఖదుఃఖయోః = సుఖదుఃఖముల యొక్క; ప్రాప్తిం విఘాతం చ = ప్రాప్త మగుటను, ప్రాప్తించకపోవుటను; యది జానంతి = గుర్తించుదురేని; తే అపి = అట్టివారును; అద్ధా = సత్యము; మృత్యుః యథా న ప్రభవేత్ = మృత్యు వేప్రకారము సంభవించదో; యోగం = దాని కుపాయమును; న విదుః = ఎఱుగరు.

తా. సుఖదుఃఖముల ప్రాప్త్యప్రాప్తుల నెఱిగినవారైనను, తమకు మృత్యువెట్లు సంభవింపకుండునో ఆ యుపాయము నెఱుగరు.

అవ. అట్లయినను యావజ్జీవము సుఖము కలుగు నన్నచో నట్లు కాదనుచున్నారు—

శ్లో. కో న్వర్థః సుఖయ త్యేనం కామో వా మృత్యు రన్తికే,
ఆఘాతం నీయమానస్య వధ్య స్యేవ న తుష్టిదః. **20**

అ. ఆఘాతం = వధ్యస్థానమునకు; నీయమానస్య = తీసికొనిపోబడుచున్న; వధ్యస్య = చంపదగినవానికి, పూలమాలలు, చందనము మున్నగునవి; ఇవ = వలె; అంతికే =

చెంతనే; మృత్యుః = చావునిశ్చితమై యుండగా; కః ను అర్థః = ఏ అర్థముగాని; కామః వా=కామము గాని; ఏనం = ఈ విద్వాంసుని; సుఖయతి = సుఖపెట్టును? న తుష్టిదః = సంతోషము కలిగించునది కానే కాదు.

తా. వధ్యస్థానమునకు గొనిపోబడుచున్న వధ్యునికి (అపరాధికి) ఏ పదార్థమును సంతుష్టి నొసగనట్లు మృత్యువు సమీపమునం దుండునప్పుడు ఈ విద్వాంసునికి ఏ అర్థమును, ఏ కామమును గాని సుఖము కలిగింపదు.

అవ. ఈ ప్రకార మీలోకమున సుఖము లేదని చెప్పబడినది. లోకాంతర మందును అట్లే సుఖము లే దనుచున్నారు—

శ్లో. శ్రుతం చ దృష్టవ ద్దుష్టం స్పర్ధాసూయాత్యయవ్యయైః,
బహ్వ న్తరాయకామత్వాత్ కృషివచ్చాపి నిష్ఫలమ్. **21**

అ. శ్రుతం చ = అదృష్టఫలమగు స్వర్గాదికమును; దృష్టవత్ =ఇహలోక సంబద్ధములగు పశ్వాదిఫలములవలె; స్పర్ధాః ... వ్యయైః — స్పర్ధా = పరుల సుఖమును సహింపమి; అసూయా = పరుల గుణమును దోషముగా నెంచుట; అత్యయ = నాశము; వ్యయైః = అపక్షయము అనువానిచే లేదా; వ్యయః = నాశము; అత్యయ = అన్యుని అతిశయము ఆ అతిశయమును జూచి యది ప్రాప్తించక పోవుటచే దుఃఖము; బహ్వంతరాయకామత్వాత్= పెక్కువై గుణ్యరూపములైన విఘ్నములు గల సుఖము కలదగుటవలన, కృషివత్ చ అపి = బహువిఘ్నములు గల కృషివలెనే; నిష్ఫలం = (తెలియవచ్చు స్వర్గము సైతము బహువిఘ్నములు గలది) నిష్ప్రయోజనము.

తా. ఇహమందు చూపట్టు కృషి యెట్లు బహు విఘ్నములకు లోనై ఏదియో కొంత ఫలితము చేకూర్చి సుఖమును బొరయించుచున్నదో అట్లే వేదమువలనఁ దెలియవచ్చు స్వర్గము సైతము పరసుఖాసహనమైన స్పర్ధ చేతను, పరగుణములందు దోషావిష్కరణ చేయు నసూయచేతను, నాశముచేతను, అపక్షయముచేతను చెడ్డదై, పెక్కు విఘ్నములకు లోగిన కామసుఖముల కాస్పదమై నిష్ఫల మగుచున్నది

అవ. విఘ్నవైగుణ్యాదులు లేవని అంగీకరించినను నాశమువలని దుఃఖము ద్రోసి పుచ్చరాని దనుచున్నారు ఐదు శ్లోకములచే—

శ్లో. అంతరాయై రవిహతో యది ధర్మః స్వనుష్ఠితః,
తేనాపి నిర్జితం స్థానం యథా గచ్ఛతి తచ్ఛృణు. **22**

అ. అంతరాయైః అవిహతః = విఘ్నములచేఁ గొట్టువడనిదియగు; ధర్మః = ధర్మము; సు + అనుష్ఠితః యది = చక్కగా అనుష్ఠించఁబడిన దైనను; తేన అపి = ఆ ధర్మముచే గూడ; నిర్జితం స్థానం = సంపాదించబడిన స్వర్గాది స్థానము; యథా గచ్ఛతి = ఎట్లు పోవునో; తత్ = దానిని; శృణు = వినుము.

తా. విఘ్నములకు లోనుగాక ధర్మమును చక్కగా అనుష్ఠించినను, దానిచే సాధించ బడిన స్వర్గాది స్థాన మేమగునో వినుము

శ్లో. ఇష్ట్వేహ దేవతా యజ్ఞైః స్వర్లోకం యాతి యాజ్ఞికః,
భుంజీత దేవవ త్తత్ర భోగాన్ దివ్యా న్నిజార్జితాన్. 23

అ. ఇహ = ఈ లోకమందు; యాజ్ఞికాః = యజ్ఞానుష్ఠానవిశిష్టులు; యజ్ఞైః = యజ్ఞములచే; దేవతాః = ఇంద్రాది దేవతలను; ఇష్ట్వా = పూజించి; స్వర్లోకం యాంతి = స్వర్గలోకమునకు పోవుదురు; తత్ర = ఆ స్వర్గమునందు; దేవవత్ = దేవతల వలె; నిజ + అర్జితాన్ = తమచే సంపాదించబడిన; దివ్యాన్ భోగాన్ = దేవభోగములను; భుంజతే = అనుభవింతురు.

తా. క్రతుదీక్షాపరులు క్రతువు లొనర్చి ఇంద్రాది దేవతలను చరుపురోడాశాది హవిస్సులచే తృప్తిపఱచి, తత్ఫలానురూపమైన స్వర్గలోకమునకుఁ బోవుదురు అచట తాము సంపాదించిన పుణ్యఫలములచే దేవతలవలె దేవభోగముల ననుభవింతురు.

శ్లో. స్వపుణ్యోపచితే శుభ్రే విమాన ఉపగీయతే,
గంధర్వై ర్విహరన్ మధ్యే దేవీనాం హృద్యవేషధృక్. 24

అ. స్వపుణ్య + ఉపచితే = తన పుణ్యములచే సర్వభోగ సంపన్నమై; శుభ్రే = స్వచ్ఛమైన; విమానే = విమానమందు; హృద్యవేషధృక్ = మనోహరమైన రూపాలంకారములను ధరించినవాడై; దేవీనాం మధ్యే = అప్సరల నడుమ నుండి; విహరన్ = విహరించుచు; గంధర్వైః ఉపగీయతే = గంధర్వుల గానముచే కీర్తింపఁబడును.

తా. తన సుకృతముచే సర్వభోగ సంపన్నమై శుభ్రమైన విమానమందు చక్కగా వస్త్రాభరణ మాల్య చందనాలంకృతుఁడై మనోహర రూపముతో నొప్పుచు, వేల్పువెలఁదుల నడుమ నుండి విహరించుచు గంధర్వులచే గీతములచే గీర్తింపబడుచుఁ గొనియాడబడును.

శ్లో. స్త్రీభిః కామగయానేన కింకిణీజాలమాలినా,
క్రీడన్ న వేదాత్మపాతం సురాక్రీడేషు నిర్వృతః. 25

అ. కింకిణీ జాల మాలినా = చిరుగజ్జెల దండలు గలదైన; కామగయానేన = ఇచ్ఛ వచ్చిన చోటికి పోవు విమానముచే; స్త్రీభిః = అచ్చర లేమలతో; సుర + ఆక్రీడేషు = నందన వనము లోనగు దేవోద్యానములందు; క్రీడన్ = క్రీడించుచు; నిర్వృతః = కామ సుఖములచే సుఖితుడై; ఆత్మపాతం న వేద = తన క్రింది పాటు ఎఱుంగడు.

తా. చిరుగజ్జెల దండలతో శోభిల్లు కామగమనముగల విమానమునం దప్సరసలతో గూడి నందనోద్యానాదులందు క్రీడించుచు, కామసుఖములఁ దృప్తుఁడగుచు నుండునే కాని తాను క్రిందపడుట నెఱుంగడు.

శ్లో. తావ త్ప్రమోదతే స్వర్గే యావ త్పుణ్యం సమాప్యతే,
క్షీణపుణ్యః పత త్యర్వా గనిచ్ఛన్ కాలచాలితః. 26

అ. యావత్ పుణ్యం సమాప్యతే = ఎంత పర్యంతము పుణ్యము సమాప్తి యగునో, తావత్ స్వర్గే ప్రమోదతే = అంత పర్యంతము స్వర్గము నందు సంతోషించును; క్షీణపుణ్యః = క్షీణించిన పుణ్యము కలవాడై; కాలచాలితః = కాలముచే చలింప జేయబడినవాడై; అనిచ్ఛన్ = ఇచ్ఛ లేని వాడైనను, అర్వాక్ = క్రిందిదైన భూలోకమునందు; పతతి = పడుచున్నాడు.

తా. తన పుణ్య మెంతకాలముదనుకు నిల్చియుండునో అంతకాలము స్వర్గము నందు సుఖ సంతోషములను చూఱగొనుచుండి కాలగతిని తన పుణ్యమంతయు క్షీణించినంతనే తన కిచ్ఛ లేకున్నను క్రింద భూమిపైఁ బడుచున్నాడు.

అవ. ప్రవృత్తిధర్మము రెండు విధములుగా నుండును. విధి ననుసరించి కామ్యకర్మ లందు ప్రవర్తించుట యొకటి, ఆ విధి నుల్లంఘించి అధర్మములైన నిషిద్ధ కర్మలందు ప్రవర్తించుట రెండు. ఇందు కామ్యకర్మ ప్రవృత్తికి ఫలము చెప్పఁబడినది. ఇంక అధర్మప్రవృత్తికి గతి లేక ఫలమును చెప్పుచున్నారు—

శ్లో. యద్యధర్మరత స్సంగా దసతాం వాఽజితేంద్రియః,
కామాత్మా కృపణో లుబ్ధః స్త్రైణో భూతవిహింసకః. **27**

అ. అసతాం సంగాత్ = దుష్టుల సాంగత్యము వలన; అధర్మరతః యది = అధర్మ కృత్యములం దాసక్తుడైనను; అజితేంద్రియః వా = ఇంద్రియములను జయింపని వాఁడైనను; కామాత్మా = ఇంద్రియ సుఖములందు మనస్సు నిల్పి; కృపణః = వానిపై నాస గలవాడు; లుబ్ధః = భోగ తృష్ణాకులుడై; స్త్రైణః = స్త్రీ లంపటుడై; భూతవిహింసకః = ఆ స్త్రీల నిమిత్తము ప్రాణులను హింసించువాడై.

తా. తులువల చెలిమిం జేసి, యధర్మ లకృత్యముం దాసగొన్నవాడై, ఇంద్రియములను గెలువలేక, వానికి లోఁగి, ఆ యింద్రియ సుఖములందు మనస్సు నిల్పి, దానిం బడయగోరుచు భోగతృష్ణచే నాకులపాటు పడుచు, స్త్రీ లాంపట్య మెక్కువ కాఁగా తత్సుఖార్థము ప్రాణిహింస చేయుచున్నాడు.

శ్లో. పశూ నవిధినాఽఽలభ్య ప్రేతభూతగణాన్ యజన్,
నరకా నవశో జంతు ర్గత్వా యా త్యుల్బణం తమః. **28**

అ. అవిధినా = నిషిద్ధ విధానమున; పశూన్ = జంతువులను; ప్రేతభూతగణాన్ = ప్రేతలగు శాకినీ డాకిన్యాదులను, భేతాళాదులగు భూతగణములను; ఆలభ్య = వధించి; యజన్ = యాగము చేయుచు; అవశః = కర్మ పరతంత్రుడై; నరకాన్ గత్వా = నరకములను పొంది; ఉల్బణం = మిక్కిలి అధమమైన; తమః = స్థావరాదిజన్మమును; యాతి = పొందుచున్నాడు.

తా. దుష్టజనులు తన్ను ప్రలోభపెట్టి ధనాదికము కొఱకు ప్రేతలకు, పిశాచములకు, శాకినీ డాకినీ భేతాళాది భూతగణములకు ప్రీతిగా వేదవిరుద్ధమైన విధానముతో పశువులను చంపి వారిని తృప్తిపఱచి యజించిన వాడు జంతుతుల్యుడగు నరుఁడు తన దుష్కర్మాధీనుడై నరకములను బొంది తర్వాత మిక్కిలి అధమమగు వృక్షాదిస్థావరజన్మమును పొందుచున్నాడు.

అవ ఈ ప్రకారము కర్మలందు ప్రవర్తించు వానికి సుఖము లేదు, దుఃఖనివృత్తి లేదని యుపసంహరించుచున్నారు—

శ్లో. కర్మాణి దుఃఖోదర్కాణి కుర్వన్ దేహేన తైః పునః,
దేహ మాభజతే తత్ర కిం సుఖం మర్త్యధర్మిణః. **29**

అ. దేహేన = ఈ దేహముచే; దుఃఖ + ఉదర్కాణి = ఉత్తర కాలమున దుఃఖము కలిగించు; కర్మాణి = పనులను; కుర్వన్ = చేయుచున్నవాడై; తైః = ఆ కర్మలచే; పునః = మఱల; దేహం ఆభజతే వై = దేహమును పొందుచున్నాడు గదా; మర్త్యధర్మిణః = మరణ ధర్మము గల నరునకు; తత్ర = ఈ లోకమున, ఈ దేహమున; కిం సుఖం = ఏ సుఖము కలదు ?

తా. ఈ దేహముచే నుత్తర కాలమున దుఃఖములు గలిగించు పాపకర్మలు చేయుచు, ఆ కర్మల ఫలముచే మఱల నన్యమగు దేహమును పొందుచు నుండు మరణ ధర్మము గల ఈ నరులకు ఇందేమి సుఖము కలదు ?

అవ. అట్లయినను లోకములు నిత్యము లగుట వలనను, అమర్త్యధర్మము కలవగుట వలనను లోకపాలురకు సుఖము కలుగు నన్నచో నిట్లనుచున్నారు—

శ్లో. లోకానాం లోకపాలానాం మద్భయం కల్పజీవినామ్,
బ్రహ్మణోఽపి భయం మత్తో ద్విపరార్ధపరాయుషః. 30

అ. కల్పజీవినాం = బ్రహ్మదేవుని ఒక అహఃప్రమాణము జీవించు; లోకానాం = లోకములకు; లోకపాలానాం = ఇంద్రాది లోకపాలురకును; మద్ భయం = నా వలని భయము కలదు; ద్విపరార్ధపరాయుషః = రెండు పరార్ధములు పూర్ణాయువు గల; బ్రహ్మణః అపి = బ్రహ్మకు సైతము; మత్తః భయం = నా వలన భయము కలదు.

తా. బ్రహ్మదేవుని ఒక అహఃప్రమాణము 14 మనువులు పాలించు ఒక కల్పకాలము జీవించి నిలిచియుండు స్వర్గాది లోకములకు, ఇంద్రాది దిక్పాలురకు నా వలని భయము గలదు అట్లే రెండు పరార్ధములు పూర్ణాయువు గల బ్రహ్మకు సైతము నా వలన భయము గలదు.

వి. కృత, త్రేతా, ద్వాపర కలియుగములు సంవత్సర ప్రమాణము.

| యుగము | కాల పరిమితి |
|---|---|
| కృత యుగము | 17, 28, 000 |
| త్రేతా యుగము | 12, 96, 000 |
| ద్వాపర యుగము | 8, 64, 000 |
| కలి యుగము | 4, 32, 000 |
| నాల్గు యుగములు చేరి, ఒక మహా యుగము. | 43, 20, 000 |

వెయ్యి మహా యుగములు బ్రహ్మదేవునికి ఒక్క పగలు. అనగా 43, 20, 000 × 1000 = 432, 00, 00, 000 నన్నూట ముప్పది రెండు కోట్ల సంవత్సరములు బ్రహ్మదేవునికి ఒక్క పగలు. రాత్రి అంతే కాలము. అనగా 864 కోట్ల సంవత్సరములు బ్రహ్మదేవునికి ఒక దినము. ఇందు 432 కోట్ల సంవత్సరములు ఒక పగలు. ఇది ఒక కల్పము. ఈ కల్పకాలము ఇంద్రాదులు జీవించియుందురు. ఈ కల్పకాలమునందే స్వాయంభువుడు లోనగు 14 గురు మనువులు పాలింతురు. 864 × 360 = 31, 104 కోట్ల సంవ

త్సరము లోక సంవత్సరము. ఈ మానము ప్రకారము బ్రహ్మదేవునికి 50 సంవత్సరములు ఒక పరార్ధము. రెండు పరార్ధములు 100 సంవత్సరములు. అనగా 31,10,400 కోట్ల సంవత్సరములు బ్రహ్మదేవుని పూర్ణాయువు.

అట్లే భీషాఽస్మా ద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాఽస్మా దగ్నిశ్చేంద్రశ్చ మృత్యు ర్ధావతి పంచమః.

పరబ్రహ్మము వలని భీతిచే వాయువు వీచును. ఆ బ్రహ్మము వలని భయముచే సూర్యుఁ డుదయించును. బ్రహ్మమువలని భయముచే అగ్ని జ్వలించును. ఇంద్రుడు వర్షించును. మృత్యువు ప్రాణులను హరించును. అందువలన ప్రవృత్తిమార్గ మిట్లనర్థ హేతువైనందున దాని నుండి విరక్తిచే నివృత్తి పొందుట యుక్తము అని తాత్పర్యము.

అవ. ఇంత మాత్రము చేతనే తాను ఈశ్వరుఁ డని ప్రకటించుట ద్వారా ఈశ్వరాభావము నంగీకరించుట పరిత్యజింపబడినది. ప్రౌఢిచే పూర్వ మంగీకరించిన యితరమైన దానిని గూడ నాలుగు శ్లోకములచే నిరాకరించుచున్నారు. అందు కర్తృభోక్తృ రూపము గలవాడే ఆత్మ యని చెప్పిన దానిని నిరాకరించుచున్నారు—

శ్లో. గుణాః సృజంతి కర్మాణి గుణోఽనుసృజతే గుణాన్,
జీవస్తు గుణసంయుక్తో భుంక్తే కర్మఫలా న్యసౌ. 31

అ. గుణాః = ఇంద్రియములు: కర్మాణి = కర్మలను శబ్దాది విషయములను సృజించును ఆత్మ సృజించదు. ఆత్మయే ఇంద్రియములను ప్రవర్తింపజేయుచు కర్మలను చేయు నందు వేని యందులకుఁ జెప్పుచున్నారు. గుణః = సత్త్వాది గుణము; గుణాన్ అనుసృజతే = ఇంద్రియములను ప్రవర్తింపజేయును. ఆత్మ కాదు. అందువలన ఆత్మకు కర్తృత్వమే లేదు. భోక్తృత్వము సైతము ఔపాధికము అని చెప్పుచున్నారు. జీవస్తు = జీవు డన్ననో; గుణ సంయుక్తః = ఇంద్రియాది యుక్తుడై, ఎందువలన ననగా యీ జీవుడు ఇంద్రియములయం దహంకారము గలవాడై, కర్మఫలాని భుంక్తే = కర్మఫలముల ననుభవించుచున్నాడు.

తా. చెవి, కన్ను లోనగు నింద్రియము వినుట, చూచుట లోనగు కర్మలను సృజించును. ఆత్మ కాదు. ఆ శ్రోత్రాదీంద్రియములను సత్త్వాదిగుణములు సృజించును కాబట్టి జీవునికి కర్తృత్వము లేదు. జీవుఁడు ఇంద్రియములతోఁ గూడుకొన్నవాడై అనగా ఈ ఇంద్రియములు నావి యని వానియం దభిమానము కలవాడై కర్మఫలములగు సుఖదుఃఖములను పొందుచున్నాడు.

అవ. ఆత్మకు చెప్పబడిన నానాత్వము కూడ నౌపాధిక మని చెప్పుచున్నారు—

శ్లో. యావత్ స్యాత్ గుణవైషమ్యం తావ న్నానాత్వ మాత్మనః,
నానాత్వ మాత్మనో యావ త్పారతంత్ర్యం తథైవ హి. 32

అ. యావత్ = ఎంత వఱకు; గుణవైషమ్యం = త్రిగుణముల యొక్క వ్యత్యాసము అహంకారాదిక మగు కార్యరూపము; స్యాత్ = అగునో (ఉండునో); తావత్ = అంత

వఱకు; ఆత్మనః = జీవునికి; నానాత్వం = పెక్కు రూపులు కలుగును. ఓయీ! ఆత్మ యొక్కటి యైనచో పారతంత్ర్య మెట్లు చెప్పబడినది? ఎట్లు లోకపాలాదులకును నావలన భయ మని చెప్ప బడినది? అనగా అందులకు చెప్పుచున్నారు— ఆత్మనః = ఆత్మకు; నానాత్వం = పెక్కు రూపులు; యావత్ = ఎంతపర్యంతమో; పారతంత్ర్యం = పరాధీనత; తథా ఏవ హి = ఆ ప్రకారము, అంతపర్యంత ముండును.

తా. త్రిగుణముల వ్యత్యాసమువలన నేర్పడిన అహంకారాది కార్య మెంతవఱకుండునో అంతవఱకును ఆత్మకు నానాత్వము (వివిధ భేదములగు రూపులు) ఉండును. ఎంతవఱకు ఆత్మకు నానాత్వ ముండునో అంతవఱకు పారతంత్ర్యము తప్పక యుండును.

అవ. ఏది గూఢమై, ఇష్టమై, అంగీకృత మైనదో ఆ ప్రవృత్తి మార్గమే శ్రేయస్కర మన్నచో అందుకు చెప్పుచున్నారు—

శ్లో. యావ దస్యాః స్వతంత్రత్వం తావ దీశ్వరతో భయమ్,
య ఏత త్సముపాసీరం స్తే ముహ్యంతి శుచార్పితాః. 33

అ. యావత్ = ఎంతపర్యంతము; అస్య అస్వతంత్రత్వం = ఆత్మకు స్వాతంత్ర్యము లేదో; తావత్ ఈశ్వరతః భయం = అంతవఱకు ఈశ్వరునివలన భయము; యే = ఎవరు; ఏతత్ సముపాసీరన్ = గుణవైషమ్య మైన అహంకారముచే చేయబడు భోగమును, కర్మను సేవించుచున్నారో; తే = వారు, లోకము లనిత్యము లగుటవలన; శుచా అర్పితాః = శోక ముచే గ్రువ్వబడినవారై; ముహ్యంతి = మోహమగు సంసారమును పొందుదురు.

తా. ఎంతవఱ కాత్మకు స్వతంత్రత లేదో అంతవఱకు ఆత్మ కీశ్వరుని వలన భయము కలదు. ఎవరు గుణవైషమ్యముచే నగు అహంకారాది కృతమగు భోగమును, కర్మను సేవించు చున్నారో భోగలోకము లనిత్యము లైనందున వాని నుండి భ్రష్టులై శోకాకులులై మోహ సంసారమును పొందుచున్నారు.

అవ. ఈ కర్మప్రవృత్తి కేవల మనిత్యమే గాక మాయామాత్రమై యున్నదని చెప్పు చున్నారు—

శ్లో. కాల ఆత్మాఽఽగమో లోక స్స్వభావో ధర్మ ఏవ చ,
ఇతి మాం బహుధా ప్రాహు ర్గుణవ్యతికరే సతి. 34

అ. కాలః = అహోరాత్రాదిరూపమైన కాలము; ఆత్మా = ఆత్మ; ఆగమః = వేదము; లోకః = స్వర్గాదికము; స్వభావః = దేవతిర్యగాదికారణ మగు ప్రకృతి; ధర్మః ఏవచ = అందు భోగకారణమైన ధర్మము; ఇతి = అని; మాం = నన్ను; గుణవ్యతికరే సతి = గుణ క్షోభము కలిగినంతనే; బహుధా ప్రాహుః = పెక్కువిధములుగా చెప్పుదురు.

తా. మాయయొక్క త్రిగుణముల వ్యత్యాసమున ప్రపంచసృష్టి కలిగినప్పుడు కాలము, ఆత్మ, ఆగమము, లోకము, స్వభావము (ప్రకృతి) ధర్మము అని నన్ను పెక్కు విధముల గీర్తింతురు. నా కంటె వ్యతిరిక్తములు లేవు. అందువలన నివృత్తి మార్గమే ముక్తి హేతు వగుట వలన అదియే శ్రేయమగును.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుఁడు వచించెను.

అవ. ఈ ప్రకార మింతదనుక ఆత్మ యొక్కఁడే యనియు, గుణకార్య మగు దేహ సంబంధమే సంసార మనియు, ఆత్మజ్ఞానము వలన ముక్తి కలుగునదియు, ఆత్మ స్థూల సూక్ష్మ దేహముల కంటె విలక్షణు డనియు, పూర్వము 'విలక్షణః స్థూలసూక్ష్మాత్' (11-10-8) ఇత్యాది శ్లోకముల ద్వారా చెప్పబడినది. అదియే 'అథైషాం కర్మకర్తౄణాం' (11-10-14) ఇత్యాది శ్లోకములచే మతాంతర నిరాకరణము ద్వారా దృఢీకరింపబడినది. ఆ విష యమున ప్రశ్నించుచున్నారు—

శ్లో. గుణేషు వర్తమానోఽపి దేహజే ష్వనపావృతః,
గుణై ర్న బధ్యతే దేహీ బధ్యతే వా కథం విభో. **35**

అ. విభో = ఓ ప్రభూ! గుణేషు వర్తమానః అపి = ఇంద్రియములందు వర్తించు చున్న వాడైనను; దేహీ = జీవుఁడు; దేహజేషు = ఆ యింద్రియకార్యములగు కర్మసుఖాదు లందు; కథం = ఎట్లు; గుణైః న బధ్యతే = ఇంద్రియములచే బంధింపబడఁడు? అట్లయినచో; అనపావృతః = ఇంద్రియములచే ఆకాశమువలె ఆవరింపబడినవాడైన, కథం బధ్యతే=ఎట్లు బంధింపబడును? బద్ధుడు కానిచో సంసారబంధ మెట్లు కలుగును?

తా. ఇంద్రియము లేకున్న ముక్తి కలుగునా? ఇంద్రియము లున్న ముక్తి కలుగునా? ఇంద్రియములు లేకున్న ముక్తి కలుగు నందువేని జ్ఞానసాధనము లేనందున ముక్తి లేదు. ఇంద్రియము లున్నప్పుడు ముక్తి కలుగు నన్నచో ఇంద్రియములందు వర్తించువాడయ్యు దేహి ఆ ఇంద్రియ కార్యమగు దేహమందు జనించిన కర్మసుఖాదులందు ఎట్లు బంధితుడు కాకుం డును? పోనిండు. ఆకాశాదుల వలె నింద్రియములచే నావరింపబడడు. గనుక వానిచే బంధింప బడడు అన్నచో అట్టివానికి సంసార బంధము మాత్రము ఎట్లు సంభవించును?

అవ. ఆ ఎల్ల విషయేంద్రియము లున్నను తదభిమానముచే (అహంకారముచే) బంధింప బడుచు, వానియం దభిమాననివృత్తిచే ముక్తుఁ డగును. అనునదే యభిమత మగుచో నది యెట్లు తెలియవలయు నని ప్రశ్నించుచున్నారు.

శ్లో. కథం వర్తేత విహరేత్ కై ర్వా జ్ఞాయేత లక్షణైః,
కిం భుంజీ తోత విసృజే చ్ఛయీ తాసీత యాతి వా. **36**

అ. ముక్తుఁడు, కథం వర్తేత = ఇంద్రియముల కర్మలందు ఎట్లు వర్తించును: విహరేత్ = ఎట్లు విహరించును? కైః లక్షణైః జ్ఞాయేత వా = ఏ లక్షణములచే తెలియబడును?; కిం భుంజీత = ఏమి భుజించును?; ఉత విసృజేత్ = మఱి ఏమి విసర్జించును?; శయీత = ఎట్లు పరుండును?; ఆసీత = ఎట్లు ఉండును; యాతి వా = ఎట్లు పోవును?

తా. ఇంద్రియక్రియలచే బద్ధు డయ్యు వాని నంటక ముక్తుడై యున్నవాడు స్వకృత్య ములం దెట్లు ప్రవర్తించును? ఎట్లు విహరించును? ఏ లక్షణములచే నెఱుఁగబడును? ఎట్టి

ఆహారము భుజించును ? మలమూత్రాదు లెట్లు విసర్జించును ? ఎట్లు పరుండును ? ఎట్లు ఉండును ? ఎట్లు నడచును ? వచింపుము.

శ్లో. ఏత దచ్యుత ! మే బ్రూహి ప్రశ్నం ప్రశ్నవిదాం వర,
నిత్యముక్తో నిత్యబద్ధ ఏక ఏవేతి మే భ్రమః. **37**

అ. అచ్యుత = అచ్యుతుడా; ప్రశ్నవిదాం వర = ప్రశ్నల కుత్తరములు తెలిసిన వారలలో శ్రేష్ఠుడా !; ఏతత్ ప్రశ్నం = ఈ ప్రశ్నను గూర్చి; మే బ్రూహి = నా కుత్తరమిమ్ము; నిత్యబద్ధః = అనాది గుణసంబంధమువం జేసి సంసారమున సదా బద్ధుడై యున్నవాడు నిత్యముక్తః = (ముక్తి కర్మజన్య మగుచో అనిత్యత్వ ప్రసంగము వలన) నిత్యముక్తుడు; ఏక ఏవ ఇతి = ఒక్కడే యని; మే భ్రమః = నా యొక్క భ్రమ.

తా. శ్రీ కృష్ణా ! ప్రశ్నల కుత్తరము తెలిసిన వారిలో నుత్తముడా ! ఈ ప్రశ్న కుత్తరము నాకుఁ జెప్పుము. ఒక్కడే యగు ఆత్మ అనాదిగుణ సంబంధమునం జేసి, సంసారమున సదా బద్ధుడై యున్నాడు. ముక్తి కర్మజన్య మగుచో అనిత్యత్వ ప్రసంగము వలన ఆ ఆత్మ నిత్యముక్తు డని ఇరువురును ఒక్కడే యని ఈ అంగీకార్య విషయము నందు నాకు భ్రమ కలుగుచున్నది. దీనిం గూర్చి వచింపుము.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే దశమోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమందు ఏకాదశస్కంధమున దశమాధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. ఏకాదశే తు బద్ధానాం ముక్తానా మపి లక్షణమ్,
సాధూనాం చ తథా భక్తే ర్లక్షణం హరి ణేరితమ్

ఈ ఏకాదశాధ్యాయమందు బద్ధులు, ముక్తు లనువారి లక్షణమును, సాధువుల లక్షణము, భక్తిలక్షణము అనువానిని శ్రీ కృష్ణుఁడు చెప్పెను.

శ్రీ భగవాన్ ఉవాచ = శ్రీకృష్ణుఁడు వచించెను.

అవ. నిత్యబద్ధుఁడు, నిత్యముక్తుఁడు ఒక్కఁడే అని నా భ్రమ. ఏది నీవు వచించితివో అది వస్తువును బట్టి విరోధమా ? ప్రతీతి వలన విరోధమా అనినచో అందు మొదటిది కాదు. బంధ మోక్షములు వాస్తవములు కానివగుటవలన అని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. బద్ధో ముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః,
గుణస్య మాయామూలత్వా న్న మే మోక్షో న బంధనమ్. 1

అ. బద్ధః ముక్తః ఇతి వ్యాఖ్యా = బద్ధుడు, ముక్తుఁడు అను వివరణము; మే గుణతః = నా యధీనమైన సత్త్వాది గుణోపాధి వలననే కాని; వస్తుతః న = వాస్తవముగ లేదు. 'ఓయీ! బౌపాదికత్వ మందును తండుల పాకాదికము వలె ఏల వాస్తవము గాదు ? అనగా అందులకు చెప్పుచున్నారు — గుణస్య మాయామూలత్వాత్ = సత్త్వాదిగుణము మాయామూలమగుటవలన; మే = నాకు; న బంధనం = బంధనము లేదు: న మోక్షః = విముక్తియు లేదు, అయ్యా ! ఏమిది ? సర్వశాస్త్ర విరోధము చెప్పుచుంటి రనగా అందులకు చెప్పుచున్నారు - ఇతి మే వ్యాఖ్యా = ఈ ప్రకారము నా నిర్ణయము. కుతర్కము లిక చాలు నని యర్థము. లేదా ఈ క్రింది ప్రకారముగా అన్వయము. —

ఆత్మ, బద్ధుఁడు ముక్తుఁడు అని ఏ వ్యాఖ్య చెప్పఁబడినదో అది నా గుణమువలన అనగా మద్గుణ పారతంత్ర్యమువలన. ఇందు హేతువుగా గుణ నియంతయగు తనయందు తద్వ్యతిరేకమును చెప్పుచున్నారు — 'కావుననే నాకు బంధము గాని, మోక్షము గాని లేవు'అని తక్కినది అంతయు సమానము. (పై వలెనే).

తా. ఆత్మ బద్ధుఁడు, ముక్తుఁడు అని నేను వ్యాఖ్యానించుట నా యధీనమైన సత్త్వాది గుణమునుబట్టి కాని వాస్తవమునఁ గాదు. ఆ సత్త్వాది గుణము మాయామూలక మగుట వలన, ఆత్మయగు నాకు బంధము లేదు, మోక్షము లేదు.

అవ. ఈ ప్రకారము కారణభూతము లైనను గుణములు మాయామయను లగుట వలన తత్కార్యమగు సంసారము సైతము మాయ యగునని ప్రవచించుచున్నారు.

శ్లో. శోకమోహౌ సుఖం దుఃఖం దేహాపత్తిశ్చ మాయయా,
స్వప్నో యథాఽఽత్మనః ఖ్యాతిః సంసృతి ర్న తు వాస్తవీ. 2

అ. శోకమోహౌ = శోకమోహములు; దేహ + ఆపత్తిః చ = దేహప్రాప్తియు; మాయయా = మాయచే నగును; యథా స్వప్నః = ఏ ప్రకారము స్వప్నము; ఆత్మనః = ఖ్యాతిః = బుద్ధియొక్క వివర్తమగునో ఆ ప్రకారము; సంసృతిః = సంసారము; న వాస్తవః = వాస్తవము గాదు.

తా. శోకమోహములు, సుఖదుఃఖములు, దేహప్రాప్తి యనునవి యన్నియు మాయ వలనఁ గలుగుచున్నవి. స్వప్న మెట్లు బుద్ధియొక్క వివర్తమో (వాసనాబలము వలన తోచు చున్నది) రజ్జువు సర్పముగా తోఁచినట్లు భ్రాంతిరూపమై తోఁచునో అట్లే సంసారమును వాస్తవము గాదు. మాయయని భావము.

అవ. అందువలన వాస్తవముగ విరోధము లేదు. ప్రతీతిమాత్రము ఉపాధిసంబంధముతో ఘటించుచున్నదని చెప్పుచున్నారు —

శ్లో. విద్యావిద్యే మమ తనూ విద్ధ్యుద్ధవ శరీరిణామ్,
మోక్షబంధకరీ ఆద్యే మాయయా మే వినిర్మితే. 3

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవుడా ! విద్యా + అవిద్యే = విద్య అవిద్య అనునవి; శరీరిణాం = దేహధారులగు జీవులకు; బంధమోక్షకరీ = బంధమును మోక్షమును కలిగించునవి; మమ తనూ విద్ధి = నా శక్తులని యెఱుంగుము. పిదయన; మే మాయయా వినిర్మితే = నా యొక్క లేక నాచే మాయచే నిర్మించబడినవి; బంధమోక్షకరీ = (ఈ పదము ఏకవచనాంత మైనను ద్వివచనార్థముతో చెప్పబడినది) బంధమును, మోక్షమును కలిగించుచున్నవి. అయ్యా ! వాని కార్యములగు బంధమోక్షములు అనాదులు, నిత్యములు కావా అనిన కావు; ఆద్యే = విద్యావిద్య లాద్యములు. అందువలన ఎంతపర్యంతము అవిద్యను ప్రవర్తింపజేయునో అంతవఱకు బంధము. ఎప్పుడు విద్యనొసగునో అప్పుడు స్ఫురించును అట్లే స్కాందమునందు —

శ్లో. బంధకో భవపాశేన భవపాశాచ్చ మోచకః,
కైవల్యదః పరం బ్రహ్మ విష్ణురేవ సనాతనః.

సంసారపాశముచే బంధము, సంసారపాశమునుండి విముక్తి కలిగించువాఁడు, కైవల్యము నిచ్చువాడు, పరబ్రహ్మము, సనాతనుడు విష్ణువే యని దెలియవలెను.

తా. ఓ ఉద్ధవా ! శరీరధారులగు జీవులకు మోక్షమును కలిగించు విద్యయు, (జ్ఞానము) బంధము కలిగించు అవిద్యయు (అజ్ఞానము) నా శక్తులని యెఱుంగుము. నా మాయచే అనాదులైన అవిద్యావిద్యలు రెండును క్రమముగా మోక్షమును, బంధమును కలిగించునవి నాచే

మాయచే సృజింపబడినవి. అవి అనాదులైనను వాని కార్యములగు బంధ మోక్షములు నిత్యములు గావు.

అవ. పై శ్లోకమునందు శరీరులని బహువచనముతో నిర్దేశించుట వలన విషయభేదముచే అవిరోధము చెప్పబడిన దను భ్రాంతిని దూరీకరించుచు బంధమోక్షముల వ్యవస్థ నుపపాదించుచున్నారు—

శ్లో. ఏకస్యైవ మమాంశస్య జీవస్యైవ మహామతే,
బంధోఽస్యావిద్యయాఽనాది ర్విద్యయా చ తథేతరః. **4**

అ. మహామతే = ఓ మహాబుద్ధిశాలీ! ; ఏకస్య ఏవ = ఒక్కడే అయిన; మమ+అంశస్య = నా అంశమైన; జీవస్య+ఏవ = జీవునికే; అస్య = ఇతనికి; అవిద్యయా = అవిద్యచే; అనాదిః బంధః = మొదలు తెలియని బంధము; తథా = ఆ ప్రకారము; విద్యయా = విద్యచే; ఇతరః = బంధమున కితరమైన మోక్షము కలుగుచున్నది.

తా. ఓ దొడ్డబుద్ధి గల ఉద్ధవా! ఒక్కడేయై నా యంశమైన ఈ జీవునికే అవిద్యచే అనాదియైన సంసార బంధమును విద్యచే తదితరమైన మోక్షమును కలుగుచున్నది.

వి. అప్పుడు, అట్లయిన అనగా జీవు డొక్కడే అయిన యెడల ఆత్మాభేదము. జీవాత్మ పరమాత్మలకు అభేదము కలుగుట వలన ఓ భగవానుడా! అప్పుడు నీకు గూడ సంసార బంధము కలదు గదా అనిన లే దనుచున్నారు. ఎట్లనగా ఏ ప్రకారము ఒక్క డే అయిన చంద్రుడు, సూర్యుడు లోనగువారికి జలాదిక మగు నుపాధిచే బింబ ప్రతిబింబ రూపమైన భేదము కలుగుచున్నదో మఱి యెట్లు జలకృతము లైన కంపాదులు ప్రతిబింబమునకే కలుగుచున్నవో (ఆకాశమందుండు బింబమై యున్న చంద్రునకుఁ గలుగవో) ఏ ప్రకారము ఆజలమునందలి ప్రతిబింబము ఉపాధి భేదముచే ఒక్క ఉదక కుంభము భగ్నమైనంతనే దానినిబొంది యున్న ప్రతిబింబమునకే బింబముతో నైక్యము గలుగుచున్నదో ఇతరోపాధిని పొందిన ప్రతిబింబమునకు కలుగదో ఆ ప్రకరము అవిద్య యందు ప్రతిబింబితుడై నా యంశమైన జీవునికే ఆ యవిద్యాకృతమైన బంధము కలగును. దానికి ఉపాధి వలననైన భేదము వలన అవ్యవస్థ (తారుమారు) లేదు. అట్లే గౌడపాదులు మాండూక్యకారిక లందు నిట్లు చెప్పియున్నారు—

శ్లో. యథై కస్మిన్ ఘటాకాశే రజోధూమాదిభి ర్యుతే,
న సర్వే సంప్రయుజ్యంతే తథా జీవా స్సుఖాదిభిః.

దుమ్ము, పొగ అనువానితోఁ గూడిన ఒక్కటే ఘటాకాశమం దెట్లో అట్లే జీవులు వారి వారి దేహాద్యుపాధులను బట్టి సుఖాదులను గూడుదురు. ఎల్ల జీవులు అట్లు కూడరు.

అవ. ఈ ప్రకారము బంధ మోక్ష వ్యవస్థ నుపపాదించి, ఎట్లు వర్తింతురు అనుదానికి వైలక్షణ్యమను ప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నారు—

అవ. జీవేశ్వరుల కొక్కటి, జీవులకెల్ల నొక్కటి యని వైలక్షణ్యము (భేదము) ద్వివిధ మగును. అందు తొలుత జీవేశ్వరులకు గల వైలక్షణ్యమును రెండున్నర శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. అథ బద్ధస్య ముక్తస్య వైలక్షణ్యం వదామి తే,
విరుద్ధధర్మిణో స్తాత స్థితయో రేకధర్మిణి. **5**

అ. తాత = నాయనా! అథ = మఱి; ఏకధర్మిణి = ఒక్క శరీరమునందు; స్థితయోః = నియమ్యనియంతలుగా నున్నట్టి; విరుద్ధధర్మిణోః = శోకానందము లను విరుద్ధ ధర్మములు గల; బద్ధస్య = బద్ధునికి (జీవునికి); ముక్తస్య = ముక్తునికి; (ఈశ్వరునికి) వైలక్షణ్యం = భేదమును; తే వదామి = నీకు చెప్పెదను.

తా. ఓ గొప్పబుద్ధి కలవాడా! ఒక్క శరీరమునందే నియమ్య నియంతలై (జీవేశ్వరులై) యుండుచు శోకానందము లను విరుద్ధధర్మములు గలవారైన (శోకము జీవధర్మము, ఆనంద మీశ్వరధర్మము) బద్ధునికి (జీవుఁడు), ముక్తునికి (ఈశ్వరునకు)గల వైలక్షణ్యమును (భేదమును) చెప్పెదను వినుము.

శ్లో. సుపర్ణా వేతౌ సదృశౌ సఖాయౌ
యదృచ్ఛ యైతౌ కృతనీడౌ చ వృక్షే,
ఏక స్తయోః ఖాదతి పిప్పలాన్న
మన్యో నిరన్నోఽపి బలేన భూయాన్. **6**

అ. సుపర్ణౌ = వృక్షముకంటె వన్యములైన పక్షులవలె దేహముకంటె భిన్నులై యున్నవారును; సదృశౌ = చిద్రూపులైన ఒండొరులు సమానులు; సఖాయౌ = వియోగము లేనందువలన, ఐకమత్యమువలన సఖులును; యదృచ్ఛయా = అనిరుక్తయై వచింపరానిదైన మాయచే; వృక్షే = ఛేదింపబడు వృక్షమువంటిదైన దేహమునందు—

శ్రుతి : 'ఊర్ధ్వమూల మవాక్శాఖం వృక్షం యో వేద సంప్రతి' పైన వేరును క్రింద కొమ్మలును గల వృక్షము నెవఁ డెఱుంగునో - అను శ్రుతివలనను,

శ్లో. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. అను స్మృతివలనను, వేరు పైకిని, కొమ్మలు క్రిందికిని గలదైన అశ్వత్థవృక్షమును అవ్యయమునుగాఁ జెప్పుదురు. కృతనీడౌ = చేయబడిన హృదయరూపమగు గూడుగలవారునై; ఏతౌ = ఈ ఇరువురు గలరు; తయోః = ఆ ఇరువురిలో; ఏకః = ఒకడు, జీవుడు; పిప్పల + అన్నం = పిప్పల మనగా అశ్వత్థము అట్టి దేహము. దానియందు భుజింపదగిన కర్మఫలమును; ఖాదతి = భక్షించుచున్నాడు (అనుభవించుచున్నాడు; అన్యః = ఇతరుఁడు (ఈశ్వరుడు) నిరన్నః = అభోక్తయు (అన్నము లేనివాడై) నిజానందతృప్తుడై; బలేన = జ్ఞానాదికమగు శక్తిచే; భూయాన్ = అధికుడై యున్నాడు. అట్లే శ్రుతి :

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వా ద్వ త్త్యనశ్న న్నన్య అభిచాకశీతి. అని. రెండు పక్షులు

కూడి మిత్రములై సమానమైన వృక్షమును కూడి యున్నవి. వానిలో నొకటి రుచ్యమైన పిప్పలమును భుజించుచున్నది. మఱియొకటి భుజింపకయే వర్తించుచున్నది.

తా. వృక్షముకంటె భిన్నములైన పక్షులవలె,దేహముకంటె భిన్నులై ఇరువురు దేహమునందుండుచున్నారు. ఇరువురు జ్ఞానస్వరూపులయినందున సమానులు. ఎడబాటు లేక ఐకమత్యముతో నున్నందున నిరువురు సఖులు కూడి ఛేదించదగు వృక్షము వంటిదైన (అనగా మరణ ధర్మముకలదైన) దేహమునందు మాయచే హృదయరూపమగు గూడు నిర్మించుకొన్నవారై యున్నారు. వారిలో నొక్కఁడు (జీవుఁడు) పిప్పలాన్నమును అనగా దేహమునందుండి కర్మఫల మనుభవించుచున్నాడు. అన్యుడు (ఈశ్వరుడు) నిరన్నుడై కర్మఫల మనుభవించనివాడై నిజానందతృప్తుడై, జ్ఞానశక్తిచే, జ్ఞాన వీర్య తేజః ప్రముఖ శక్తులచే వాని కంటె మిగుల నధికుడై యున్నాడు.

అవ. బలాధిక్యమును చెప్పుచున్నారు.

శ్లో. ఆత్మాన మన్యం చ స వేద విద్వాన్
అపిప్పలాదో న తు పిప్పలాదః,
యోఽవిద్యయా యుక్ స తు నిత్యబద్ధో
విద్యామయో యస్స తు నిత్యముక్తః. 7

అ. అపిప్పలాదః = కర్మ ఫల భోక్త గాని; సః = ఆ యీశ్వరుఁడు; విద్వాన్ = జ్ఞాన స్వరూపుడు; ఆత్మానం = తన్ను; అన్యం = ఇతరుడగు జీవుని; దేహేంద్రియాదికమును; వేద = ఎఱుంగును. న తు పిప్పలాదః = కర్మఫల భోక్త యగు జీవుడు తన్ను గాని, ఇతరుడగు ఈశ్వరుని గాని యెఱుఁగడు; యః అవిద్యయా యుక్ = ఎవడవిద్యతో కూడినవాడో; సః = ఆ జీవుఁడు; నిత్యబద్ధుఁడు; యః విద్యామయః = ఎవఁడు జ్ఞాన స్వరూపుడో; స తు నిత్యముక్తః = అతడు నిత్యముక్తుఁడు.

తా. జ్ఞానస్వరూపుఁడై కర్మఫలభోక్త గాని ఆ ఈశ్వరుఁడు తన్ను, నితరుడగు జీవుని దేహేంద్రియాదిక స్వరూపమును గుర్తెఱుంగుచున్నాడు. కర్మ ఫల భోక్త యగు జీవుఁడు తన్ను గాని, తన కంటె నితరుఁడైన యీశ్వరునిఁ గాని యెఱుంగఁడు. దేహేంద్రియాదుల స్వరూప స్వభావాదుల గాని నిక్క మెఱుంగడు. ఎవడు విద్యామయుడో లేక జ్ఞానస్వరూపుడో ఆ ఈశ్వరుఁడు నిత్యముక్తుఁడు. మాయచే ఆవరింపబడనివాఁడు. మాయకు ఆశ్రయమై దానిని ప్రకాశింపఁ జేయువాఁడు.

అవ. ఇప్పుడు బద్ధులు, ముక్తులు నగు జీవులకు పరస్పరము వైలక్షణ్యమును చెప్పుచున్నారు—

శ్లో. దేహస్థోఽపి న దేహస్థో విద్వాన్ స్వప్నా ద్యథోత్థితః,
అదేహస్థోఽపి దేహస్థః కుమతిః స్వప్నదృగ్యథా. 8

అ. విద్వాన్ = ముక్తుఁడు; దేహస్థః = సంస్కారవశమున దేహమునం దున్నవాఁడయ్యును; యథా స్వప్నాత్ ఉత్థితః = స్వప్నము నుండి మేల్కొనినవాడు వలె; న దేహస్థః=

దేహమునం దుండువాడు కాడు. ఆ దేహగత సుఖదుఃఖాదికములు లేనందున వానివలె. ఆప్రకారము, అదేహస్థః అపి = వాస్తవముగ దేహమునం దుండువాడు కాకపోయినను; కుమతిః = అవిద్వాంసుఁడు; స్వప్నదృక్ యథా = స్వప్నగత దేహుఁడు వలె; దేహస్థః = దేహ నిమిత్తములైన సుఖదుఃఖములను పొందువాడు కావున దేహమునం దున్నవాడే అగును.

తా. విద్వాంసుఁడు అనగా ముక్తుఁడు. సంస్కార వశమున దేహమునం దున్నవాఁడైనను స్వప్నమునుండి మేల్కొన్నవాఁడు వలె దేహమునం దుండువాఁడు కాఁడు. స్వప్నమునందు తోచిన వానిని స్మరించుచు, అవి మిథ్యలని తలంచును; అట్లే ముక్తుఁడు దేహగత సుఖదుఃఖాదికములు తనవని భావించడు. అట్లే నిజముగ దేహమునందు లేనివాడు అనగా దేహసంబంధము లేనివాఁడైనను, అవిద్వాంసుఁడు స్వప్నగతదేహుఁడు వలె దేహనిమిత్తములైన సుఖదుఃఖాదుల ననుభవించు పాత్రమైనందున దేహమునం దున్నవాడై బద్ధుఁ డగును.

అవ. ఇందు హేతు వగుటచే మఱియొక వైలక్షణ్యమును చెప్పుచున్నారు—

శ్లో. ఇంద్రియై రింద్రియార్థేషు గుణై రపి గుణేషు చ,
గృహ్యమాణే ష్వహంకుర్వ న్న విద్వా న్య స్త్వవిక్రియః. 9

అ. ఇంద్రియైః = చక్షురా దీంద్రియములచే; ఇంద్రియార్థేషు = ఇంద్రియార్థములగు రూపాదులు; గృహ్యమాణేషు = గ్రహింపబడిన వగుచుండ; యః తు విద్వాన్ = ఏ విద్వాంసుఁడు; అహం న కుర్యాత్ = నేను గ్రహించుచున్నా నను భావమును గావింపడో; గుణైః = సత్త్వాది గుణములచేత; గుణేషు = సుఖ దుఃఖ మోహాది గుణములు, గృహ్యమాణేషు సత్సు = గ్రహింపబడిన వగుచుండగా; అవిక్రియః = రాగాది శూన్యుడై యుండువాడు, ముక్తుఁడు.

తా. చక్షురా దీంద్రియములచే రూపాదులగు ఇంద్రియార్థములు గ్రహింపబడుచున్నను, సత్త్వాది గుణముల ద్వారా సుఖదుఃఖ మోహాది గుణములు మనస్సు ద్వారా గ్రహింపబడుచున్నను, విద్వాంసుఁడు లేక ముక్తుఁడు రాగాది శూన్యుఁడై యుండును.

వి. అట్లే భగవద్గీత యందు చెప్పబడినది.

శ్లో. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే.

ఓ దొడ్డ బాహువులు గలవాడా! అర్జునా! గుణ కర్మ విభాగముల తత్త్వ మెఱింగిన వాడు శ్రోత్రాదీంద్రియములు శబ్దాది గుణములందు వర్తించుచున్నవని తలంచి వానియందాసక్తుడు కాడు.

శ్లో. కర్మాధీనే శరీరేఽస్మిన్ గుణభావ్యేన కర్మణా,
వర్తమానోఽబుధ స్తత్ర కర్తాఽస్మీతి నిబధ్యతే. 10

అ. అబుధః = అవిద్వాంసుఁడు; కర్మ+అధీనే = పూర్వకర్మకు అధీనమైన; అస్మిన్ = ఈ శరీరమందు; గుణభావ్యేన = ఇంద్రియములచే భావింపఁదగు; కర్మణా = కర్మచేత;

తత్ర = ఆ దేహాదికమునందు; వర్తమానః=వర్తించుచు; కర్తా అస్మి ఇతి=నేనే కర్తను అని, నిబధ్యతే = బద్ధు డగుచున్నాడు.

తా. అవిద్వాంసుఁడు కర్మాధీనమై ఈ శరీరమందు వర్తించుచు ఇంద్రియములచే భావింపదఁగు కర్మచే నేను కర్తనని అహంకారముచే ఆ దేహమునందు బద్ధుఁ డగుచున్నాఁడు.

వి. అట్లే గీతయందు —

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే.

ప్రకృతి గుణములచే చేయఁబడు కర్మల కన్నింటికి అహంకారముచే మూఢమైన చిత్తము గలవాఁడు నేను కర్త నని తలంచును.

ఈ మూడు శ్లోకములచే ఎట్లు వర్తించును అను ప్రశ్నకు సుఖదుఃఖశూన్యుఁడు నిరభిమానుఁడై దేహమునందు వర్తించునని ఉత్తరము చెప్పినట్లగుచున్నది

అవ. మఱియొక వైలక్షణ్యమును చెప్పుచు ఏమి ఎట్లు భుజించును అను మొదలైన ప్రశ్నలకు మూడు శ్లోకములతో నుత్తరము చెప్పుచున్నారు.

శ్లో. ఏవం విరక్తః శయన ఆసనాటన మజ్జనే,
దర్శన స్పర్శన ఘ్రాణ భోజన శ్రవణాదిషు,
న తథా బధ్యతే విద్వాం స్తత్ర తత్రాదయన్ గుణాన్ **11**

అ. ఈ ప్రకారము, అన్యగతమైన కర్మ నన్ను బంధించదని; శయనే = పరుండుట యందు; ఆసన + అటవ మజ్జనే = కూర్చుండుట, సంచరించుట, స్నానము చేయుట యందు; దర్శన, స్పర్శన, ఘ్రాణ, భోజన, శ్రవణ + ఆదిషు = చూచుట, తాకుట, మూర్కొనుట; భుజించుట, వినుట లోనగు ఇంద్రియవృత్తు లందు; విరక్తః = విరక్తి పొందినవాడై; విద్వాన్ = ముక్తుఁడు, జ్ఞాని; తత్ర తత్ర = ఆయా శబ్దాది విషయములందు; గుణాన్ ఆదయన్ = గుణముల ననుభవింపనివాఁడై వానికి సాక్షియై యుండుచు; తథా న బధ్యతే = అవిద్వాంసుఁడు వలె బంధింపఁబడఁడు.

తా. అన్యగతమైన కర్మ నన్ను బంధింపదని ముక్తుఁడు, జ్ఞాని, సెజ్జయందు శయనించుట, పీఠమునందు కూర్చుండుట, ఉద్యానవనములందు సంచరించుట, జలక్రీడలందు, వనితాదుల సౌందర్యములగు వస్తువులను దర్శించుట, వారి ఆలింగనాదులు వాంఛించుట, పుష్పాది సుగంధమును మూర్కొనుట, సరసాన్నములను భక్షించుట, శృంగారగీతములు వినుట లోనగు ఇంద్రియానుకూలవృత్తులందు అనురక్తుడు గాక ఆయా శబ్దాది విషయములందు ఇంద్రియములఁ బ్రవర్తింపఁజేయుచుఁ దాను సాక్షిమాత్రుఁడై తాను వాని ననుభవించక యుండుచు, అవిద్వాంసుని వలె బద్ధుఁడు కాఁడు.

అవ. ఇది ఎందువల్ల ననగా అందులకుఁ జెప్పుచున్నారు—

శ్లో. ప్రకృతిస్థోఽప్యసంసక్తో యథా ఖం సవితానిలః,
వైశారద్యేక్షయాసంగ శితయా ఛిన్నసంశయః,
ప్రతిబుద్ధ ఇవ స్వప్నాన్ నానాత్వా ద్వినివర్తతే. 12

అ. ప్రకృతిస్థః అపి = ప్రకృతికార్యమగు దేహమం దున్నవాఁ డయ్యు; యథా = ఏ ప్రకారము; ఖం, సవితా, అనిలః = ఆకాశము, సూర్యుఁడు, వాయువు వర్తించునో; అసంసక్తః = అట్లు సక్తుఁడు కానివా డగుచు; వైశారద్యా = నిపుణత గలదైన; అసంగశితయా = వైరాగ్యముచే తీక్ష్ణమైన; ఈక్షయా = జ్ఞానదృష్టిచే; ఛిన్నసంశయః = తుత్తునియలైన సందేహములు గలవాఁడై; స్వప్నాత్ ప్రతిబుద్ధ ఇవ = కల నుండి మేల్కాంచిన వాఁడు వలె; నానాత్వాత్ = వివిధమైన దేహ ప్రపంచము నుండి; వినివర్తతే = నివృత్తి పొంది యుండు చున్నాఁడు.

తా. ఆకాశము సర్వవస్తుగతమైన వాని నంటని విధమునను, సూర్యుఁడు జలమునందు ప్రతిబింబితుఁ డయ్యు ఆ జల కంపనాది ధర్మములను పొందనట్లు వాయువు సర్వత్ర సంచరించువాఁ డయ్యు, ఆయా ద్రవధర్మముల నంటని విధమునను, ముక్తుఁడు ప్రకృతికార్యమగు దేహమునం దున్నవాఁ డయ్యు, వేదాంతార్థ నిశ్చయము గలదై, వైరాగ్యముచే నిశితమైన జ్ఞానదృష్టిచే అనగా అట్టి విజ్ఞానముచే అసంభావనాది సంశయములు తుత్తునియలు కాగా దేహాదిప్రపంచము నుండి నివృత్తుఁడై, వానియం దాసక్తుఁడు గాకున్నాడు.

అవ. ఎట్లు విచారించినను దానికి ఉత్తరముగా మఱియొక వైలక్షణ్యమును చెప్పుచున్నారు.

శ్లో. యస్య స్యు ర్వీతసంకల్పాః ప్రాణేంద్రియ మనోధియామ్,
వృత్తయ స్సతు నిర్ముక్తో దేహస్థోఽపి హి తద్గుణైః. 13

అ. యస్య = ఎవని యొక్క; ప్రాణ-ఇంద్రియ-మనో-ధియాం = ప్రాణము, ఇంద్రియములు; మనస్సు, బుద్ధి లోనగు వాని యొక్క; వృత్తయః = వ్యాపారములు; వీతసంకల్పాః = సంకల్ప వర్జితము లగునో; సః తు దేహస్థః అపి = అతఁడు దేహమునం దున్నవాఁడయ్యు; తద్గుణైః = ఆ దేహగుణములచే, సంకల్ప శూన్యము లగు ప్రాణాది వృత్తులచే, విహరించుచు ముక్తుఁ డగుచున్నాడు.

తా. ఎవని ప్రాణము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి లోనగువాని వృత్తులు సంకల్ప వర్జితములో (ప్రయోజనమును గూర్చి వర్తించవో యనుట) అతడు దేహస్థుఁ డయ్యును దేహగుణములు, సంకల్ప శూన్యము లగు ప్రాణాది వృత్తులచే విహరించుచు ముక్తుఁ డగుచున్నాఁడు.

అవ. ఈ ప్రకారము ఇంతవఱకు సంవేద్య మగు బద్ధ ముక్తుల వైలక్షణ్యము చెప్పబడినది. ఇప్పుడు ఏ యే లక్షణములచే ఆ బద్ధముక్తులు తెలియబడుదురు? అను ప్రశ్నకు ఉత్తరముగా పరులకు సులభముగాఁ దెలియఁదగిన వారల వైలక్షణ్యమును మూడు శ్లోకములచే జెప్పుచున్నారు.

శ్లో. యస్యాత్మా హింస్యతే హింస్రై ర్యేన కించి ద్యదృచ్ఛయా,
అర్చ్యతే వా క్వచి త్తత్ర న వ్యతిక్రియతే బుధః. **14**

అ. యస్య ఆత్మా = ఎవని శరీరము, హింస్రైః = దుర్జనుల చేతను; అన్యములగు ప్రాణుల చేతను; హింస్యతే = హింసింపబడుచున్నదో; యదృచ్ఛయా = తనకుఁ దానై; యేన = ఎవ్వనిచే నైనను; కించిత్ క్వచిత్ అర్చ్యతే = ఇంచుక; ఒకప్పుడు పూజింపఁబడునో; బుధః = విద్వాంసుఁ డైనచో; తత్ర = ఆ హింసా పూజలందు; న వ్యతిక్రియతే = మిగుల వికారమును బొందడు. అట్లే యాజ్ఞవల్క్యునిచే చెప్పఁబడినది–

శ్లో. యః కంటకై ర్వితుదతి చందనై ర్యశ్చ లింపతి,
అక్రుద్ధోఽపరితుష్టశ్చ సమ స్తస్య చ తస్య చ.

ఎవడు, ఎవనిని కంటకములచే (ముండ్లచే) గ్రుచ్చుచున్నాడో; ఎవడు గంధముతో పూయుచున్నాడో ఆ కంటకములను మేనఁ గ్రుచ్చువానిపై క్రోధము పొందనివాడును ఆ గంధపుఁబూత పూసెడువానిపై పరితుష్టుఁడు గానివాడు నై, ఇరువురి యందు సముఁ డగునో అతఁడు ముక్తుఁడు.

తా. తన శరీరమును క్రూరులైన దుర్జనులు ఇతరములగు ప్రాణులు హింసించు చున్నను, తనకుఁదానై ఎవఁడైనను ఇంచుక ఒకప్పుడు పూజించినను విద్వాంసుఁ డైనవాఁడు ఆ హింసా పూజలచే ఏ విధమగు వికారమును బొందకుండుచున్నాడు.

శ్లో. న స్తువీత న నిందేత కుర్వతః సాధ్వసాధు వా,
వదతో గుణదోషాభ్యాం వర్జిత స్సమదృ జ్మునిః. **15**

అ. సాధు = మంచిపనిని; అసాధు వా = చెడ్డపనిని గాని; కుర్వతః = చేయువార లను; వదతః = వచించు వారలను; న స్తువీత = స్తుతించరాదు; న నిందేత = నిందించరాదు; గుణదోషాభ్యాం వర్జితః = మంచి చెడ్డలచే విడువబడినవాడై; సమదృక్ = సమదృష్టి గల వాఁడై; మునిః = మునియై యుండును.

తా. మంచిపని చేయుచు మంచిమాట లాడుచుండు వారలను, ఎవడు క్రమముగా స్తుతిం చక నిందింపకయు ఆ మంచిచెడ్డలకుఁ దాను లోనుగాక విడివడి రెండియందు సమదృష్టి గల వాఁడును, మౌనియు నై యుండునో వాఁడు ముక్తుఁడు.

శ్లో. న కుర్యా న్న వదే త్కించి న్న ధ్యాయే త్సాధ్వసాధు వా,
ఆత్మారామోఽనయా వృత్త్యా విచరే జ్జడవ న్మునిః. **16**

అ. సాధు - అసాధు వా = మంచిపనిగాని, చెడ్డపనిగాని మంచిమాటగాని, చెడ్డమాట గాని; కించిత్ న కుర్యాత్ = ఇంచుకయు చేయరాదు; న వదేత్ = వచింపరాదు; న ధ్యాయేత్ = ధ్యానించగూడదు; అనయా వృత్త్యా = ఈ మనోవర్తనముచే; ఆత్మారామః = ఆత్మయందు రమించువాఁడై; జడవత్ = మందునివలె; మునిః విచరేత్ = ముని చరించ వలెను.

తా. ముక్తుఁడగు పురుషుఁడు మంచి పని గాని, చెడ్డ పని గాని చేయకూడదు. మంచి మాట గాని, చెడ్డమాటగాని చెప్పగూడదు. ధ్యానించగూడదు. ఆత్మారాముఁడై ఈ మనోవర్త

నముచే జడునివలె మునియై చరించును. దేశసంచారము చేయును. దైహికములగు కర్మలను గూర్చి ఉదాసీనుఁడగువాడు ముక్తుఁడగును.

అవ. ఈ చెప్పబడిన వన్నియు ముముక్షువునకు సాధనములని తెలియదదినవి ఎవడు కేవలము శబ్దబ్రహ్మము నందు అనగా వేదమునందు అభిజ్ఞుఁడును, పాండిత్య మాత్రశ్లాఘియై పైనఁ బేర్కొనఁబడిన సాధనములచే ఆ బ్రహ్మపదార్థము నందు నిష్ఠ గలవాడు కాడో వానిని నిందించుచున్నారు—

శ్లో. శబ్దబ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్ పరే యది,
శ్రమ స్తస్య శ్రమఫలో హ్యధేను మివ రక్షతః. **17**

అ. శబ్దబ్రహ్మణి = శబ్దబ్రహ్మ మగు శ్రుతియందు; నిష్ణాతః = పండితుఁడై; పారంగతుఁడై; పరే = పరబ్రహ్మమందు; న నిష్ణాయాత్ యది = ధ్యానాదికమగు యోగము చేయనివాఁడగు నేని; తస్య శ్రమః = అతని శాస్త్రపరిశ్రమము; అధేనుం=ఎంతకాలమునకో ఈను ఆవును, గొడ్డుటావును; రక్షతః ఇవ = రక్షించువానికి వలె; శ్రమఫలః = శ్రమ యొక్కటియే ఫలము గలదగును పురుషార్థ పర్యవసాయి కాదు.

తా. ఎవడు కేవలము శబ్దబ్రహ్మ మగు వేదము నధ్యయనము చేసి, పాండిత్యము గడించి, పండితుఁడను పేరును మాత్రము పొంది, పొగడ్త కెక్కినవాడై, పరబ్రహ్మమునందు ధ్యాననిష్ఠ కలవాఁడు కాఁడో అట్టివాని శాస్త్రపరిశ్రమము గొడ్డుటావును పోషించు వానికి వలె శ్రమమే ఫలముగా గలదై, పరమ పురుషార్థము నిచ్చునది కాకపోవుచున్నది.

అవ. ఈ విషయమునే అన్యార్థ నిదర్శనములచే ప్రపంచించుచున్నారు.

శ్లో. గాం దుగ్ధదోహా మసతీం చ భార్యాం దేహం పరాధీన మసత్ప్రజాం చ
విత్తం త్వతీర్థీకృత మంగ వాచం హీనాం మయా రక్షతి దుఃఖదుఃఖీ **18**

అ. అంగ = ఉద్ధవా; దుగ్ధదోహాం గాం = పిదుకబడిన పాలు గలది; ఉత్తర కాలమందు పాలు పితుకుట లేనిది; పాలు వట్టిపోయి ప్రయోజనము లేని ఆవును; అసతీం భార్యాం చ = తనను కామించని పెండ్లమును, పరాధీనం దేహం = ప్రతిక్షణము దుఃఖ హేతువై ముదిమిచే నితరులపై నాధారపడిన శరీరమును; అసత్ప్రజాం చ = దృష్టాదృష్టసాధన శూన్యుఁడై, ఇహపరములకు కొఱగాని, ఇహమున తల్లిదండ్రుల నుద్ధరించని వాడును, పరమునకు శ్రాద్ధాది క్రియలు చేయనివాఁడగు పుత్రుని; అతీర్థీకృతం విత్తం = యోగ్యుడు కాని వానికిచ్చిన ధనమును, మయా హీనాం వాచం = నాచే హీనమైన వాక్కును అనగా భగవన్నుతి లేని వాక్కును; రక్షతి =ఎవడు రక్షించుచున్నాడో, దుఃఖదుఃఖీ = వాఁడు దుఃఖము తర్వాత దుఃఖమే గలవాఁడగును.

తా. ఓ ఉద్ధవా! ఎవడు గొడ్డుటావును పోషించునో, అంకుటాలును గూడియుండునో, వృద్ధుఁడై పరాధీనుఁడగునో, కుపుత్రుఁడు గలవాఁడో, అపాత్రునికి ధన మిచ్చునో, భగవన్నుతి లేని వాక్కు గలవాడో అట్టివాడు దుఃఖము తరువాత దుఃఖమునే పొందును

అవ. నా స్తుతి లేని వాక్కు గలవాడు దుఃఖమును పొందును. అనుదానిని వివరించు చున్నారు—

శ్లో. యస్యాం చ మే పావన మంగ కర్మ స్థిత్యుద్భవ ప్రాణనిరోధ మస్య.
లీలావతా రేప్సిత జన్మనా స్యా ద్వంధ్యా గిరం తాం బిభృయా న్న ధీరః. **19**

అ. అంగ = ఓ ఉద్ధవా ! యస్యాం = ఏ వాక్కు నందు; మే = నా యొక్క; పావనం = జగత్తును పావనము చేయునదై; అస్య = ఈ విశ్వము యొక్క; స్థితి+ఉద్భవ ప్రాణ నిరోధం = స్థితి, ఉత్పత్తి, లయము అనునవి కలదైన; కర్మ = కృత్యము గాని; లీలావతార +ఈప్సిత జన్మనా = లీలావతారములందు జగత్తునకు ప్రేమాస్పదమైన శ్రీరామకృష్ణాది జన్మమైన; న స్యాత్ = ఉండదో; వంధ్యాం తాం గిరం = నిష్ఫలమైన ఆ వాక్కును; ధీరః = బుద్ధిమంతుఁడు; న ధారయేత్ = ధరించకూడదు.

తా. ఏ కథలందు విశ్వమునకు సృష్టి స్థితి లయములకు హేతువై జగత్పావనమైన నా కృత్యము ప్రవర్తించదో, ఏ వృత్తమునందు జగత్తునకు ప్రేమాస్పదమైన లీలావతారము లైన శ్రీరామకృష్ణాదుల జన్మాదికము కనఁబడదో అట్టి నిష్ఫలమైన వృత్తమును లేక వాక్కును పండితుడైనవాడు ధరించఁ గూడదు, అట్టి విషయమును గూర్చి వచింపగూడదు.

అవ. చెప్పబడిన జ్ఞానమార్గమును ఉపసంహరించుచున్నారు—

శ్లో. ఏవం జిజ్ఞాసయాఽపోహ్య నానాత్వభ్రమ మాత్మని,
ఉపారమేత విరజం మనో మయ్యర్ప్య సర్వగే. **20**

అ. ఏవం = ఈ ప్రకారము: జిజ్ఞాసయా = ఆత్మవిచారముచే; ఆత్మని = ఆత్మ యగు తన యందు; నానాత్వభ్రమం = దేహేంద్రియాధ్యాస రూపమైన భ్రాంతిని; అపోహ్య = నిరసించి; విరజం మనః = నిర్మలమైన మనస్సును; సర్వగే మయి = పరిపూర్ణుడైన నాయందు అర్ప్య = సమర్పించి, ధరించి; ఉపారమేత = విరమించవలెను. ఏ ఇంచుకయు చేయగూడదు. కేవలము శాస్త్ర పాండిత్యముచే వర్తింపవలదు.

తా. ధీరుఁడు ఇట్లు నిశ్చయించుకొని ఆత్మవిచారముచే ఆత్మయగు తాను దేహాదులందు నేనని భావించిన అధ్యాసను నిరసించి నిర్మలమైన మనస్సును పరిపూర్ణుడనైన నా యందు సమర్పించి ఇతర కృత్యముల నుండి విరామమును పొందవలెను. కేవల శాస్త్ర పాండిత్యముచే తర్కింప జనదు.

శ్లో. య ద్యనీశో ధారయితుం మనో బ్రహ్మణి నిశ్చలమ్,
మయి సర్వాణి కర్మాణి నిరపేక్ష స్సమాచరేత్. **21**

అ. బ్రహ్మణి = బ్రహ్మమునందు; నిశ్చలం మనః = చలించని మనస్సును; ధారయితుం = ధరింపజేయుటకు; అనీశః యది = అశక్తుఁడైనచో: మయి = నా యందు; సర్వాణి కర్మాణి = తాను చేయు సర్వకర్మలను సమర్పించి; నిరపేక్షః = ఫలాపేక్ష లేనివాడై ; సమాచరేత్ = చక్కగా నాచరింపవలెను.

తా. ఒకవేళ మనస్సును నిశ్చలము చేసికొని బ్రహ్మమునందు నిల్పుటకశక్తుడైన యెడల, తాను చేయు నిత్య నైమిత్తికాది సర్వకర్మలను నా యందు సమర్పించి ఫలాపేక్ష లేనివాఁడై ఆచరించవలెను. నా భక్తి చేతనే కృతార్థుఁడు కాగలఁడు.

అవ. నా యందు ఫల సమర్పణముచే చేయుకర్మలచే శుద్ధ సత్త్వుడైన వానికి అంతరంగ భక్తిని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. శ్రద్ధాలు ర్మే కథాః శృణ్వన్ సుభద్రా లోకపావనీః,
గాయ న్ననుస్మరన్ కర్మ జన్మ చాభినయన్ ముహుః. 22

అ. శ్రద్ధాలుః = శ్రద్ధ గలవాఁడై; సుభద్రాః = మంగళకరములు; లోకపావనీః = లోకపావనములును అగు; మే కథాః = నా కథలను; శృణ్వన్ = వినుచు; గాయన్ = పాడుచు; జన్మ కర్మ చ = నా జన్మ కృత్యములను; అనుస్మరన్ = స్మరించుచు; ముహుః = మాటిమాటికి; అభినయన్ = స్వయముగా అనుకరించుచు...

తా. శ్రద్ధ గలవాడై మంగళకరములై లోకపావనములైన నా కథలను వినుచు, పాడుచు, స్మరించుచు నా జన్మకర్మములను స్వయముగా అనుకరించుచు శ్రీకృష్ణ వేషధారి వలె నటించుచు ప్రవర్తింపవలెను.

శ్లో. మదర్థే ధర్మకామార్థాన్ ఆచరన్ మదుపాశ్రయః,
లభతే నిశ్చలాం భక్తిం మయ్యుద్ధవ సనాతనే. 23

అ. మత్+ఉపాశ్రయః = నన్ను ఆశ్రయించినవాడై, నా భక్తుడై; మదర్థే = నా కొఱకు; ధర్మార్థ కామాన్ = ధర్మము, అర్థము, కామము ను ప్రసాదించు కర్మలను; ఆచరన్ = ఆచరించుచు, సేవించుచు; సనాతనే మయి = పురాణ పురుషుడనైన నాయందు; నిశ్చలాం భక్తిం లభతే = చలించని భక్తిని పొందును.

తా. ఓ ఉద్ధవా! నన్నాశ్రయించి నా భక్తుడై, నా కొఱకు ధర్మార్థ కామప్రదములగు కర్మల నాచరించుచున్నవాడై, సేవించుచున్నవాడై, పురాణ పురుషుడైన నాయందచంచల భక్తిని పొందుచున్నాడు.

శ్లో. సత్సంగలబ్ధయా భక్త్యా మయి మాం య ఉపాసితా,
స వై మే దర్శితం సద్భి రంజసా విందతే పదమ్. 24

అ. మయి = నా యందు, ఈ ప్రకారము; సత్సంగలబ్ధయా = సాధుసంగముచే లభించిన; భక్త్యా = భక్తితో; మాం = నన్ను; యః ఉపాసితా = ఎవడు ధ్యానించువాడగునో; సః = ఆ ధ్యానశీలుఁడు; సద్భిః-దర్శితం వై = సత్పురుషులచే నిశ్చితమైన; మే పదం = నా స్వరూపమును; అంజసా ప్రాప్నోతి = సుఖముగనే పొందుచున్నాడు.

తా. నాయందు ఈ ప్రకారము ఎవడు సాధుసంగముచే లభించిన భక్తిచే నన్ను ధ్యానించువాడగునో, ఆ ధ్యానశీలుఁడు సత్పురుషులు నిశ్చయించిన నా స్వరూపమును సుఖముగనే పొందుచున్నాడు.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుఁడు పలికెను.

అవ. సత్సంగలబ్ధమైన భక్తిచే అని చెప్పబడినది. అందు ఆ సత్పురుష విశేషములు, భక్తి విశేషములను గూర్చి ప్రశ్నించుచున్నారు—

శ్లో. సాధు స్తవో త్తమశ్లోక మతః కీదృగ్విధః ప్రభో,
భక్తి స్త్వ య్యుపయుజ్యేత కీదృశీ సద్భి రాదృతా. **25**

అ. ప్రభో = ఓ ప్రభూ ! సాధువులు తమ తమ చిత్తములకు అనుకూలమైన మార్గమును కల్పించుకొన్నవారు పెక్కండ్రు కలరు. వారలలో తవ = నీకు; మతః = సమ్మతుఁడు; ఉత్తమః సాధుః = ఉత్తమ సాధువు; కీదృగ్విధః=ఎటువంటివాఁడు ? భక్తి సైతము లోకమునందు పెక్కు విధములుగా నుండును. సద్భిః ఆదృతా = నారదాదులగు సత్పురుషులచే ఆదరించబడిన; కీదృశీ భక్తిః = ఎట్టి భక్తి; త్వయి ఉపయుజ్యేత = నీయం దుపయుక్త మగుచున్నది.

తా. ఓ ప్రభూ ! తమ తమ చిత్తమునకు అనుకూలమగు మార్గమును కల్పించుకొన్న సాధుపురుషులు పెక్కండ్రు గలరు. అట్టివారలలో ఎటువంటి సాధువు ఉత్తముడు నీకు సమ్మత మగుచున్నాడు ? అట్లే సత్పురుషులైన నారదాదులచే ఆదరించబడిన భక్తి వివిధముగా నుండును. అట్టి భక్తి మార్గములలో నీయం దుపయుక్తమగు భక్తి యెటువంటి దగునో వచింపుము.

అవ. ఇది చెప్పుము. ఈ రహస్యము నీ చేతనే వచింపదగినదని ఐశ్వర్యము నావిష్కరించుచున్నారు—

శ్లో. ఏత న్మే పురుషాధ్యక్ష ప్రపన్నాయ చ కథ్యతామ్, **26**
త్వం బ్రహ్మ పరమం వ్యోమ పురుషః ప్రకృతేః పరః,
అవతీర్ణోఽసి భగవన్ స్వేచ్ఛోపాత్తపృథగ్వపుః. **27**

అ. పురుషాధ్యక్ష = ఓ బ్రహ్మాది పురుషుల నియమించువాఁడా !; ఏతత్ = ఈ భక్తి రహస్యమును; ప్రపన్నాయ మే కథ్యతాం = నిన్ను శరణు పొందిన నాకుఁ జెప్పుము; భగవన్ = ఓ భగవంతుఁడా !; స్వేచ్ఛా+ఉపాత్త పృథక్+వపుః=తన (నీ) వారల ఇచ్ఛచే గ్రహించబడిన వేఱై పరిమితమైన శరీరము కలవాఁడవై ; అవతీర్ణః అసి = భూమియం దవతరించినవాడ వై తివి

తా. ఓ బ్రహ్మాది పురుషులను నియమించువాడా ! ఈ భక్తి రహస్యమును నిన్ను శరణు పొందిన నాకుఁ జెప్పుము. నీవు పరబ్రహ్మము పరమ వ్యోమము. హృదయాకాశము, దహరాకాశరూపుఁడవు లేక హృదయపుండరీకమున వెలుఁగుదువు లేక ఆకాశము వలె దేనినంటని అసంగుడవు. ప్రకృతికి పరుడైన పురుషుఁడవు అగుదువు. నీవారగు భక్తుల కోరికచే నిచ్చ వచ్చిన ప్రత్యేకమైన పరిమితమైన శరీరము గలవాడవై శరీరధారివై భూమియం దవతరించియున్నావు.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుఁడు వచించెను.

అవ. అందు మప్పుడి లక్షణములచే సాధుపురుషుని నిరూపించుచున్నారు—

శ్లో. కృపాళు రకృతద్రోహ స్తితిక్షు స్సర్వదేహినామ్,
సత్త్వసారో౽నవద్యాత్మా సమ స్సర్వోపకారకః. **28**

అ. కృపాళుః = పరుల దుఃఖమును సహించనివాడు; సర్వదేహినాం అకృతద్రోహః= ఎల్ల దేహులకును కొన్నింటికైన ద్రోహము చేయనివాఁడు; సత్త్వసారః = మనోబలము లేక స్థైర్యము కలవాఁడు; తితిక్షుః = క్షమాగుణము కలవాడు; అనవద్య+ ఆత్మా = అసూయా రహితుఁడు; సమః = సుఖ దుఃఖములందు సముఁడు; సర్వ+ఉపకారకః = ఎల్లరకు ఉపకారము చేయువాఁడు.

తా. పరుల దుఃఖమును గాంచి సహింపలేని కృప కలవాఁడు, అన్ని ప్రాణులలో ఏ కొన్నిటిని గాని కీడు చేయనివాఁడు, ఓర్పు గలవాఁడు, మనఃస్థైర్యము గలవాఁడు, అసూయాదులు లేని చిత్తము గలవాఁడు, సుఖదుఃఖనులందు సమవర్తనుఁడు. ఎల్ల ప్రాణులకు ఉపకారము చేయువాడు.

శ్లో. కామై రహతధీ ర్దాంతో మృదు శ్శుచి రకించనః,
అనీహో మితభు క్ఛాంతః స్థిరో మచ్ఛరణో మునిః. **29**

అ. కామైః=ఇంద్రియకామములచే; అహతధీః= క్షోభపొందని చిత్తము కలవాఁడు; దాంతః=చక్షురాది బాహ్యేంద్రియముల నియమించినవాఁడు; మృదుః=అకఠినచిత్తుడు; శుచిః=సదాచారుడు; అకించనః=అపరిగ్రహుడు; అనీహః=దృష్టాదృష్టక్రియాశూన్యుడు; మితభుక్=లఘువగు ఆహారము భుజించువాఁడు; శాంతః=అంతఃకరణము నియమించినవాఁడు; స్థిరః=స్వధర్మమందు చలించనివాఁడు; మత్+శరణః=నన్నొక్కఁడినే ఆశ్రయించినవాఁడు; మునిః=మననశీలుఁడు.

తా, ఇంద్రియ సుఖములకు కలతపడని చిత్తము గలవాఁడు, చక్షురాదులను బాహ్యేంద్రియములను అరికట్టినవాఁడు, మెత్తని మనస్సు గలవాఁడు, సదాచార సంపన్నుఁడు, ఇతరుల వలన నే పరిగ్రహము చేయనివాడు, ఐహికము, ఆముష్మికము నగు సుఖప్రాప్తికై కర్మ లాచరించనివాఁడు, లఘువుగ భుజించువాఁడు, మనఃశాంతి కలవాఁడు, స్వధర్మము నుండి చలించనివాఁడు, నన్ను మాత్రమే శరణ్యునిగా నాశ్రయించినవాఁడు మననశీలుఁడును.

శ్లో. అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జితషడ్గుణః,
అమానీ మానదః కల్యో మైత్రః కారుణికః కవిః. **30**

అ. అప్రమత్తః=జాగరూకుఁడు; గభీరాత్మా=నిర్వికారుడు; ధృతిమాన్ =విపత్తువందును దిగులొందనివాడు; జితషడ్గుణః=జయింపఁబడిన షడ్గుణములు గలవాఁడు

శ్లో. క్షుత్పిపాసే శోకమోహౌ జరామృత్యూ షడూర్మయః.

ఆకలిదప్పులు, శోక మోహములు, జరామృత్యువులు అను ఆరింటిని జయించినవాఁడు, అమానీ=ప్రతిష్ఠను కాంక్షించనివాఁడు; మానదః=ఇతరులను గౌరవించువాఁడు; కల్యః=దక్షుఁడు; మైత్రః=వంచకుఁడు కానివాఁడు; కారుణికః = కనఁబడినివాని నాసింపక కరుణతోడనే ప్రవర్తించువాఁడు; కవిః=చక్కని జ్ఞానము గలవాఁడు.

తా. ఏమఱుపాటు లేనివాఁడు, వికారము పొందని చిత్తము గలవాఁడు, ఆపదలందును దీనుఁడు కానివాఁడు, ఆకలిదప్పులు, శోక మోహములు, జరామరణములు అను షడ్గుణము లనఁబడు వానిని జయించినవాఁడు, ఇతరుల వలన గౌరవ ప్రతిష్ఠల నాసించనివాఁడు, సమర్థుఁడు, వంచన లేని మైత్రి గలవాఁడు, లోభి గాక కరుణతో ప్రవర్తించువాఁడు, చక్కని జ్ఞానియైనవాడు సాధు వనబడును.

శ్లో. ఆజ్ఞా యైవం గుణాన్ దోషాన్ మయాఽఽది ష్టా నపి స్వకాన్,
ధర్మాన్ సంత్యజ్య య స్సర్వాన్ మాం భజేత్ సోఽపి సత్తమః. 31

అ. ఏవం=ఈ ప్రకారము; గుణాన్ = ధర్మాచరణమున సత్త్వశుద్ధి మున్నగు గుణములను; దోషాన్=అధర్మాచరణమున నరకమున బడుట మున్నగు దోషములను; ఆజ్ఞాయ = ఎఱింగి; మయా = వేదరూపుఁడగు నాచే; ఆదిష్టాన్ అపి = చెప్పబడినవైనను; స్వకాన్ ధర్మాన్ =స్వీయములగు ధర్మములను; సర్వాన్ సంత్యజ్య=ఎల్ల వానిని పరిత్యజించి, యః= ఎవడు; మాం భజేత్ =నన్ను సేవించునో; సః అపి సత్తమః=వాడు నైతము మున్ను చెప్పబడిన వాఁడువలె సాధుశ్రేష్ఠుడు.

వి ధర్మములను అజ్ఞానము వలన, నాస్తిక్యము వలన త్యజించుటయా అనగా కాదు ధర్మాచరణమందు సత్త్వశుద్ధి లోనగు గుణములను, అధర్మమునందు దోషములను ఎఱింగియు నా యొక్క ధ్యాన నిక్షేప భక్తిచే ఎల్ల గుణములు లభించగలవని దృఢ నిశ్చయముచే సర్వ ధర్మములను పరిత్యజించి లేక భక్తి దార్ఢ్యముచే నివృత్తి మార్గము నందు (జ్ఞానమార్గము) అధికారము గలవాఁ డగుటచే త్యజించి, అట్లు గాకున్న శుద్ధ ఏకాదశి, కృష్ణ ఏకాదశి అనువాని యందలి యుపవాసములను, అనుపవాసములను నివేదించి, భక్తి విరుద్ధ ధర్మములగు ఏ శ్రాద్ధాదులు గలవో వానిని త్యజించి అని యర్థము.

తా. ఇట్లు గుణములను, దోషములను ఎఱింగి వేదరూపుఁడనై నేను వచించిన వైనను స్వధర్మముల నన్నింటిని పరిత్యజించి ఎవడు నన్ను భజించుచున్నాడో వాడును అన్ని గుణములు గలవాడు వలె సాధుపురుషుఁ డగుచున్నాఁడు.

శ్లో. జ్ఞాత్వా జ్ఞాత్వా ఽపి యే వై మాం యావాన్ యశ్చాస్మి యాదృశః,
భజం త్యనన్యభావేన తే వై భక్తతమా మతాః. 32

అ. యావాన్=భగవంతుఁ డెంతడివాడు ? దేశకాలాపరిచ్ఛిన్నుడు; యశ్చ=ఎవడు సర్వాత్ముడు; యాదృశః=ఎట్టివాడు; సచ్చిదానందరూపుడు నై ; అస్మి=ఉన్నాను. అని యే వై =ఎవరైనచో; మాం=నన్ను; జ్ఞాత్వా=ఎఱింగియు; అజ్ఞాత్వాఽపి=ఎఱుంగకయు; అనన్యభావేన=ఏకాంతభావముచే; భజన్తి=భజించుచున్నారో; తేవై = వారే; భక్తతమాః మతాః=పరమభక్తు లని సమ్మతులు.

తా. భగవంతుఁ డెవడు ? ఎంత మాత్రమువాఁడు ? ఎటువంటివాఁడు ? అని నన్ను ఎఱుంగకయు క్రమముగా దేశకాల పరిచ్ఛిన్నుఁడు, సర్వాత్ముఁడు, సచ్చిదానందరూపుఁడు అని యెఱింగియు ఎవ్వరు నన్ను ఏకాంత భావనచే అనన్యభక్తిచే సేవించుచున్నారో వారు పరమ భక్తులు, నాకు సమ్మతులు.

అవ. ఈ ప్రకారము సాధుభక్తుల లక్షణము చెప్పఁబడినది. ఇంకను భక్తి లక్షణమును ఎనిమిది శ్లోకములచేఁ జెప్పుచున్నారు—

శ్లో. మల్లింగ మద్భక్తజన దర్శన స్పర్శనార్చనమ్,
పరిచర్యాస్తుతి ప్రహ్వగుణ కర్మాను కీర్తనమ్. 33

అ. మత్-లింగ = నా ప్రతిమల యొక్క; మద్భక్తజన = నా భక్తజనుల యొక్కయు; దర్శన స్పర్శన + అర్చనం = దర్శనము, స్పర్శనము, అర్చనము అనువానిని, పరిచర్యా...కీర్తనమ్—పరిచర్యా = సేవ; స్తుతి = స్తోత్రము; ప్రహ్వా = నమస్కారము; గుణకర్మ + అను కీర్తనం = గుణకర్మలను కీర్తించుట.

తా. నా విగ్రహములను, నా భక్తజనులను దర్శించుట, స్పృశించుట, పూజించుట సేవ చేయుట, స్తుతించుట గుణకర్మలను కీర్తించుటయును.

శ్లో. మత్కథాశ్రవణే శ్రద్ధా మదనుధ్యాన ముద్ధవ,
సర్వలాభోపహరణం దాస్యే నాత్మనివేదనమ్. 34

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవుఁడా, మత్కథాశ్రవణే = నా కథలను వినుటయందు; శ్రద్ధా = శ్రద్ధయు; మత్ + అనుధ్యానం = నన్ను గూర్చి ధ్యానించుట; సర్వలాభ + ఉపహరణం = తమకు లభించిన ఎల్ల వస్తువులను సమర్పించుట; దాస్యేన + ఆత్మనివేదనం చ = దాస్యముచే తన్ను సమర్పించుకొనుటయు.

తా. ఓ ఉద్ధవా ! నా కథలను వినుటయందు శ్రద్ధయు, నన్ను గూర్చి ధ్యానము చేయుట, తనకు లభించిన పత్ర, పుష్ప, ఫలాన్నాదికము సర్వమును, ధనమును నాకు సమర్పించుట దాసభావమున తన్ను నివేదించుకొనుట.

శ్లో. మజ్జన్మ కర్మకథనం మమ సర్వానుమోదనమ్,
గీతతాండవ వాదిత్ర గోష్ఠీభి ర్మద్గృహోత్సవః. 35

అ. మజ్జన్మకర్మకథనం = నా అవతారములను నా చేసిన కృత్యములను వచించుట; మమ సర్వ + అనుమోదనం = నా యొక్క జన్మాష్టమిలోనగు పర్వదినములందు సంతోషము; గీతతాండవవాదిత్రగోష్ఠీభిః = గానము, నాట్యము, వాద్యము లోనగువాని అనుష్ఠానములచే; మత్ గృహ + ఉత్సవః = నా దేవాలయ మహోత్సవములు జరుపుటయు.

తా. నా అవతారములను అందు నేను చేసిన కృత్యములను వాక్రుచ్చుటయు నేను జనించిన జన్మాష్టమి లోనగు పర్వదినములందు నన్ను గూర్చి విని సంతోషించుటయు, గానము, నాట్యము, వీణా, వేణు, మృదంగాది వాద్యములు లోనగువాని గోష్ఠులచే నా దేవాలయములందు మహోత్సవములు జరుపుటయు.

శ్లో. యాత్రాబలివిధానం చ సర్వవార్షిక పర్వసు,
వైదికీ తాంత్రికీ దీక్షా మదీయవ్రతధారణమ్. **36**

అ. సర్వవార్షిక పర్వసు=సంవత్సరము పొడుగునను వచ్చు చాతుర్మాస్యములగు ఆషాఢ శ్రావణ, భాద్ర పదాశ్వయుజ కార్తీకమాసములందు, ఏకాదశులందు; యాత్రాబలివిధానం చ= విశేషించి ఉత్సవము, పూలుపండ్లు లోనగు ఉపహారములు సమర్పించుటయు; వైదికీ=వేదోక్త మార్గమునను; తాంత్రికీ=ఆగమవిధానమునను; దీక్షా=నన్ను పూజించి దీక్ష వహించుటయు; మదీయవ్రతధారణం=నాసంబంధములైన వ్రతములను గావించుటయు.

తా. ఏడాది పొడుగునను వచ్చు (ఆషాఢాది నాలుగు మాసములకదు వచ్చు) ఏకాదశు లందు మహోత్సవములను గావించుట, పుష్పఫలసరసాన్నములను నివేదించుట, వేదోక్త మార్గమునను, పాంచరాత్రాగమ విధానమునను నన్నుఁ బూజింపఁ దీక్షఁ గొనుటయు నా సంబంధములైన వ్రతములను చేపట్టుటయు.

శ్లో. మదర్చాస్థాపనే శ్రద్ధా స్వతః సంభూయ చోద్యమః,
ఉద్యానోపవనాక్రీడా పురమందిర కర్మణి. **37**

అ. మత్+అర్చాస్థాపనే=నావిగ్రహాదికములను ప్రతిష్ఠించుటయందు; శ్రద్ధా= శ్రద్ధ; ఉద్యానోపవనక్రీడా పురమందిర కర్మణి— ఉద్యాన=పూవులు ప్రధానముగా గల: పూవుఁదోట; ఉపవన=పండ్లు ప్రధానముగాఁగల మామిడి, టెంకాయ చెట్లుగల తోపు; ఆక్రీడా=నీడ ప్రధానముగాగల చెట్లు కలిగి విహరించు క్రీడాస్థానము, పురమందిర కర్మణి= గోపురప్రాకారాదులతో దేవాలయము, సామాన్యమందిరము లోనగువానిని నిర్మించుటయందు; స్వతః=స్వయముగా సామర్థ్యమున్నను; సంభూయ=ఇతరులతో కలసి; ఉద్యమః చ=ప్రయత్నమును.

తా. నా విగ్రహములను ప్రతిష్ఠించుట యందును, పుష్పములు ప్రధానముగాఁ గల పూవుఁ దోటలను, ఫలములు ప్రధానముగాఁ గల మామిడి, అరటి, టెంకాయ, జామ లోనగు ఫల వృక్షములు గల తోపులను, ఛాయా ప్రధానమైన వృక్షములుగల క్రీడాస్థానములు, గోపుర ప్రాకార, విమాన సహితములగు దేవాలయములు, భజనమందిరములు లోనగువాని నిర్మాణము నందు స్వయముగా సామర్థ్య మున్నను ఇతరులతోఁ గూడి శ్రద్ధతో ప్రయత్నించుటయు.

శ్లో. సమ్మార్జనోపలేపాభ్యాం సేకమండలవర్తనైః,
గృహశుశ్రూషణం మహ్యం దాసవ ద్యదమాయయా. **38**

అ. సమ్మార్జన+ఉపలేపాభ్యాం=పెంటపోవఁ జిమ్ముటచే, ఆవుపేడ నీటితో అలుకుట చేతను; సేకమండల వర్తనైః=నీరు చల్లుట భద్రములోనగు మండలములు లేక ముగ్గులు పెట్టుట చేతను; మహ్యం=నా కొఱకు; యత్=ఏ, గృహశుశ్రూషణం=నా ఆలయముల సేవకలదో దానిని; దాసవత్=సేవకుఁడువలె; అమాయయా=కపటములేక చేయుటయు.

తా. పెంట పోవఁ జిమ్ముట, గోమయముతో నలుకుట, నీరు చల్లుట సర్వతోభద్రాది మండలములగ ముగ్గులు పెట్టుట లోనగువానిచే నా ఆలయములకు దాసుఁడు వలె నిష్కపటముగా సేవ చేయుటయు,

శ్లో. అమానిత్వ మదంభిత్వం కృత స్యాపరికీర్తనమ్,
అపి దీపావలోక మ్మే నోపయుంజ్యా న్నివేదితమ్. 39

అ. అమానిత్వం=అభిమానము కలవాడు కాకుండుట; అదంభిత్వం=డాంబికము లేకుండు వాఁడగుట; కృతస్య అపరికీర్తనం=చేసిన పూజాది కార్యమును నలుగురిలో చెప్పికొనకుండుట, నివేదితం=నివేదింపఁబడిన, ఒకదానికి వినియోగింప బడిన; దీప+అవలోకం అపి=దీపప్రకాశము నైనను; న ఉపయుంజ్యాత్=ఉపయోగింపగూడదు.

తా. అహంకారము లేకుండుట, డాంబికము వీడియుండుట, తాను చేసిన సత్కృత్యములు నలువురిలోఁ బొగడుకొనకుండుట భక్తి లక్షణము. ఇతరునిచే నివేదించబడిన దీపము నేనియు నా కొఱ కుపయోగింపకుండుటయు.

వి. ఈ నియమము సాధారణముగా మందుని విషయము, అనురక్తిచే నిష్టము పొందగోరిన వాని విషయ మగును. కాని భక్తితో మాత్రము దీపాదికము గ్రాహ్యమే యగను.

శ్లో. షడ్భి ర్మాసోపవాసై స్తు యత్ఫలం పరికీర్తితమ్,
విష్ణో ర్నివేద్య సిద్ధేన పుణ్యం త ద్భుంజతాం కలౌ. 1
హృది రూపం ముఖే నామ నైవేద్య ముదరే హరేః,
పాదోదకం చ నిర్మాల్యం మస్తకే యస్య సోఽచ్యుతః. 2

కలియుగము నందు విష్ణువునకు నివేదించిన పవిత్రమైన అన్నాదికమును దొఱకినంత దానిని భుజించువాడు అరుమాసము ఉపవాస వ్రతములచే నే ఫలము కీర్తింపఁబడినదో ఆ ఫలమును పొందుచున్నాడు.

హృదయమందు హరి రూపమును, ముఖమునందు (వాక్కునందు) శ్రీహరినామమును, ఉదరమందు శ్రీహరి నివేదనము, శిరస్సునందు శ్రీహరి పాదోదకమును, నిర్మాల్యమును ఎవనికిఁ గలదో వాఁడే అచ్యుతుఁడు.

శ్లో. విష్ణో ర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరమ్,
పితృభి శ్చాపి తద్దేయం తదానంత్యాయ కల్పతే. 1
పితృశేషం తు యో దద్యా ద్ధరయే పరమాత్మనే,
రేతోధాః పితర స్తస్య భవన్తి క్లేశభాగినః. 2

ఆశాసతే సదా దేవాః పితర స్సర్వ ఏవ హి,
య ఇష్ట్వాదౌ మహావిష్ణుం పశ్చా త్తేన పితౄన్ సురాన్. 3
యజతే చ స వై పుత్రో వంశో జాయేత జీవతు,
ఆస్ఫోటయన్తి పితరః ప్రనృత్యన్తి పితామహాః,
వైష్ణవోఽస్మిన్ కులే జాత స్స న స్సంతారయిష్యతి. 4

విష్ణువునకు నివేదించిన అన్నము నితర దేవతకు నివేదించి పూజింపవచ్చును పితృ దేవతలకు ఆ అన్నమును పెట్టినచో అది మోక్షము నీయ సమర్థ మగును

పితృశేషము నెవఁడు పరమాత్మయగు హరికి నివేదించుచున్నాఁడో వాఁడు రేతస్స్నానము చేయువా డగును. వాని పితరులు క్లేశ భాగు లగుచున్నారు.

విష్ణువునకు నివేదించిన అన్నమును దేవతలు, పితరులు ఎల్లరు సర్వదా భుజింపగోరుదురు. ఎవడు మొదట మహావిష్ణువును పూజించి తర్వాత సురలను, పితరులను పూజించునో ఆ పుత్రుఁడు వంశోద్ధారకుఁడు, చిరంజీవియు నగును. ఈ వంశమునందు విష్ణుభక్తుఁడు జనించెను, మనలను తరింపఁజేయ గలడని వాని పితరులు, పితామహులు చప్పట్లు చఱచుచు నృత్యము చేయుదురు.

శ్లో. యద్య దిష్టతమం లోకే యచ్చాపి ప్రియ మాత్మనః,
తత్త న్నివేదయే న్మహ్యం తదానంత్యాయ కల్పతే. **40**

అ. యత్ యత్ లోకే ఇష్టతమం=ఏది యేది లోకమందు మిక్కిలి ఇష్టమైనదో;యత్=ఏది; ఆత్మనః అపి=తనకును; ప్రియం చ=ఇష్టమో; తత్ తత్=అయా వస్తువును; మహ్యం నివేదయేత్=నాకు నివేదించ వలెను. తత్=అనివేదనము; అనంత్యాయ=మోక్షముకొఱకు; కల్పతే=సమర్థ మగును.

తా. ఏదేది లోకమందు ప్రియమైన వస్తువో, గోఘృతము, మధువు, ఆమ్ర, కదళీ, ద్రాక్షా ఫలాదికము లోనగునది ఏది తనకు ప్రియమైన సరసాన్నాదికము కలదో ఆ యా పదార్థములను నాకు నివేదింపవలెను. అట్లు గావించుట మోక్షసాధన మగును.

అవ. ఇప్పుడు పదునొకండు పూజాధిష్ఠానములను చెప్పుచున్నారు—

శ్లో. సూర్యోఽగ్ని ర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖం మరు జ్జలమ్,
భూ రాత్మా సర్వభూతాని భద్ర పూజాపదాని మే. **41**

అ. భద్ర—ఓ మంగళశీలుడా! సూర్యః=సూర్యుడు; అగ్నిః=అగ్ని; బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు; గావః=ఆవులు; వైష్ణవః=విష్ణుభక్తుడు; ఖం=ఆకాశము; మరుత్=వాయువు; జలం=నీరు; భూః=భూమి; ఆత్మా=తాను (జీవుడు) సర్వభూతాని=సకల ప్రాణులు; మే=నా యొక్క; పూజాపదాని=పూజాస్థానములు.

తా. సూర్యుఁడు, అగ్ని, బ్రాహ్మణుఁడు, గోవులు, విష్ణుభక్తుఁడు, ఆకాశము, వాయువు, జలము, భూమి, ఆత్మ (తాను, జీవుడు) సర్వభూతములు నా పూజాస్థానము లగును.

శ్లో. సూర్యే తు విద్యయా త్రయ్యా హవిషాఽగ్నౌ యజేత మామ్,
ఆతిథ్యేన తు విప్రాగ్ర్యే గోష్వంగ యవసాదినా. **42**

అ. ఓ ఉద్ధవా ! సూర్యే తు=సూర్యునియందు; మాం=నన్ను; త్రయ్యా విద్యయా= సూర్యసూక్తములచే ఉపస్థానాది మంత్రములచేతను, అగ్నౌ=అగ్నియందు; హవిషా=అన్నాదికమగు హవిస్సుచేతను; గోషు=గోవులందు; యవసాదినా=గోగ్రాసమగు పచ్చగడ్డిలోనగువానొసగుట చేతను; యజేత=పూజించవలెను.

తా. ఓ ఉద్ధవా ! సూర్యునందు నన్ను వేదచోదితము లగు సూర్యసూక్తముల చేతను, అగ్నియందు నన్ను అన్నాదిహవిస్సు చేతను, బ్రాహ్మణోత్తమునియందు నన్ను భోజనాదికమగు అతిథి సత్కారము చేతను, గోవులందు నన్ను పచ్చగడ్డి లోనగువాని నొసగుట చేతను పూజించవలెను.

శ్లో. వైష్ణవే బంధుసత్కృత్యా హృది ఖే ధ్యాననిష్ఠయా,
వాయౌ ముఖ్యధియా తోయే ద్రవ్యై స్తోయ పురస్కృతైః. 43

అ. వైష్ణవే = విష్ణుభక్తునందు; బంధుసత్కృత్యా = బంధువు వలె సన్మానించుట చేతను; హృది ఖే=హృదయాకాశమందు; ధ్యాననిష్ఠయా = ధ్యాన నిష్ఠ చేతను; వాయౌ= వాయువునందు; ముఖ్యధియా=ప్రాణదృష్టిచేతను; తోయే=జలమునందు; తోయపురస్కృతైః=జలము ముందుగాగల; ద్రవ్యైః=కుశతిలతండులాది ద్రవ్యములతోఁగూడిన తర్పణము చేతను పూజించవలెను.

తా. విష్ణుభక్తుని బంధువును వలె సమ్మానించియు, హృదయాకాశమున ధ్యాననిష్ఠతోడను, వాయువును ప్రాణభావన తోను, జలమందు జలసహిత కుశతిలతండులాది ద్రవ్యముల నర్పించుట చేతను పూజించవలెను.

శ్లో. స్థండిలే మంత్రహృదయై ర్భోగై రాత్మాన మాత్మని,
క్షేత్రజ్ఞం సర్వభూతేషు సమత్వేన యజేత మామ్. 44

అ. స్థండిలే=భూమియందు; మంత్రహృదయైః=మేదినీ సూక్తాది రహస్య మంత్ర న్యాసముల చేతను; ఆత్మని=తన హృదయమందు; ఆత్మానం=పరమాత్మను, భోగైః=సిరి సంపదల భోగముల చేతను; సర్వభూతేషు =ఎల్ల జీవులందు; క్షేత్రజ్ఞం= క్షేత్రజ్ఞునిగను; సమత్వేన= సమదృష్టిచే; మాం యజేత=నన్ను పూజించవలెను.

తా. భూమియందు నన్ను మేదినీ సూక్తాది రహస్య మంత్రన్యాసముల చేతను, తన హృదయమందు, ఆత్మయైన నన్ను సంకల్పితమగు ఇంద్రియసుఖానుభవముల చేతను ఎల్ల భూతములందు నన్ను క్షేత్రజ్ఞరూపునిగను సమదృష్టితో పూజింపవలెను.

శ్లో. ధిష్ణ్యే ష్వేతేషు మద్రూపం శంఖ చక్ర గదాంబుజైః,
యుక్తం చతుర్భుజం శాంతం ధ్యాయ న్నర్చే త్సమాహితః, 45

అ. ఏతేషు ధిష్ణ్యేషు=ఈ చెప్పబడిన సూర్యాదిస్థానములందు; శంఖచక్రగదా+ అంబుజైః=శంఖము, చక్రము, గద, పద్మములనువానితో; యుక్తం=కూడిన; చతుర్భుజం= నాలుగు బాహువులు గలిగి; శాంతం=శాంతమై; నిర్వికారమైన; మద్రూపం=నారూపమును; సమాహితః=ఏకాగ్రచిత్తుడై; ధ్యాయన్ అర్చయేత్=ధ్యానించుచు పూజించవలెను.

తా. ఈ చెప్పబడిన సూర్యాదిస్థానములందు (సర్వాధిష్ఠానములందు) ధ్యేయ ప్రకారమును చెప్పుచున్నారు. శంఖ చక్ర గదా పద్మములతో గూడిన చతుర్భుజములు గలదై ప్రశాంతమై నిర్వికారమగు నా రూపమును ఏకాగ్రచిత్తుడై ధ్యానించుచు పూజించవలెను.

అవ. యుక్తమైన భక్తికి ఫలమును చెప్పుచున్నారు—

శ్లో. ఇష్టాపూర్తేన మామేవ యో యజేత సమాహితః,
లభతే మయి సద్భక్తిం మత్స్మృతిః సాధుసేవయా. **46**

అ. యః=ఎవడు; సమాహితః=నిశ్చలబుద్ధి గలవాడై; ఇష్ట+అపూర్తేన=ఇష్టములగు యాగములు, బావి, అగ్రహారము లోనగు పూర్తకర్మలచే; మాం యజేత=నన్ను పూజించునో, అతడు; సాధుసేవయా=సాధువుల సేవచే; మత్స్మృతిః=నా స్మరణము; జ్ఞానము గలవాడై; మయి=నాయందు సద్భక్తిం లభతే=అచంచల భక్తిని పొందును.

తా. నిశ్చలచిత్తుడై ఎవడు నన్నిష్టములగు యాగముల చేతను, దేవాలయము, బావి, ఆరామము, అగ్రహారములను నిర్మించుట లోనగు పూర్తకర్మలచేతను పూజించుచున్నాడో వాడు సాధుసేవచే నా స్మరణజ్ఞానము కలిగి నాయందచంచలమగు భక్తిని పొందుచున్నాడు.

అవ. జ్ఞానమార్గమును, భక్తిమార్గమును రెండును చెప్పబడినవి. జ్ఞానమార్గము కంటె భక్తిమార్గము శ్రేష్ఠమని చెప్పుచున్నారు—

శ్లో. ప్రాయేణ భక్తియోగేన సత్సంగేన వినోద్ధవ,
నోపాయో విద్యతే సమ్యక్ ప్రాయణం హి సతా మహమ్. **47**

అ. ఉద్ధవ=ఓ ఉద్ధవుడా! ప్రాయేణ=సాధారణముగా; సత్సంగేన=సాధుసంగమము చేతను; భక్తియోగేన వినా=భక్తియోగముచేతను తప్ప; ఉపాయః=సంసారతరణోపాయము న విద్యతే=అన్యము లేదు; హి=ఏకారణమువలన; అహం=నేను; సతాం=సాధుజనులకు; సమ్యక్ ప్రాయణం=చక్కని ఆశ్రయుడనై యున్నానో అందువలన సత్సంగము భక్తి అంతరంగమని అర్థము.

తా. ఓ ఉద్ధవా! తఱచుగా లోకమందు సాధుసంగముచే గలుగు భక్తియోగము చేత, మఱియొక్కడు సంసారము తరించుటకు ఉపాయము లేదు. ఏలయన భక్తజనులకు పరమాశ్రయుడనై యున్నాను. కావున సత్సంగతియే భక్తియోగమునకు అంతరము, లోపలిది.

అవ. మఱి ఇప్పుడు సాంఖ్యయోగాదులు సాధనాంతర సాపేక్షములు, సవ్యభిచారులు. సత్సంగము మాత్రము స్వతంత్రముగ సమర్థము, ఫల మొసంగుట యందవ్యభిచారి (తప్పక ఫల మొసగునది) అని వర్ణింప దొరకొని చెప్పుచున్నారు—

శ్లో. అథైత త్పరమం గుహ్యం శృణ్వతో యదునందన,
సంగోప్య మపి వక్ష్యామి త్వం మే భృత్యః సుహృ త్సఖా. **48**

అ. అథ = మఱి; ఏతత్ = ఈ చెప్పబోవునది; పరమం గుహ్యం = మిగుల రహస్యమైనది; అతః = ఇందువలన; యదునందన = యదుపుత్రా! శృణు = వినుము; సంగోప్యం అపి = రహస్యమైనదైనను; వక్ష్యామి = వచించెదను. త్వం = నీవు; మే = నాకు; భృత్యః, సుహృత్ = సేవకుడవు; మేలుకోరు బంధుడవు; సఖా = చెలికాఁడవు.

తా. ఓ యదుకుమారా! నేను చెప్పబోవునది మిగుల రహస్యమైనది. కావున వినుము. అత్యంత రహస్యమైనను నీకు చెప్పగలను. నీవు నాకు సేవకుండవు, దగ్గర చుట్టమవు, స్నేహితుఁడవునై యున్నావు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే ఏకాదశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమునం దేకాదశస్కంధమున ఏకాదశాధ్యాయము.

# ద్వాదశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. ద్వాదశే సాధుసంగస్య మహిమా వర్ణితః పురా,
కర్మానుష్ఠానత స్త్యాగవ్యవస్థా చ తతః పరమ్.

ఈ ద్వాదశాధ్యాయమందు ముందు సాధుసంగముయొక్క మహిమ వర్ణింపఁబడినది. తర్వాత కర్మానుష్ఠానమువలన త్యాగవ్యవస్థ చెప్పఁబడినది.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుఁడు వచించెను.

శ్లో. న రోధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ,
న స్వాధ్యాయ స్తప స్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా. 1

అ. ఉద్ధవ=ఉద్ధవుఁడా; మాం=నన్ను; యోగః=ఆసనప్రాణాయామాదికమైన యోగము; న రోధయతి=వశీకరింపలేదు; న సాంఖ్యం=తత్త్వముల వివేకమగు సాంఖ్యము లోఁగొనలేదు. న ధర్మః=సామాన్యమగు అహింసాదిధర్మము వశముచేయలేదు; న స్వాధ్యాయః=వేదజపము కాదు; తపః=కృచ్ఛ్రచాంద్రాయణాదికము, కాదు; త్యాగః=సన్న్యాసము కాదు; న ఇష్ట+అపూర్తం=అగ్నిహోత్రాదికము కూపారామాది నిర్మాణము కాదు; న దక్షిణా=సామాన్యమగు ధనాదిదానము కాదు.

తా. ఓ ఉద్ధవా! న్యాసన ప్రాణాయామాది యోగశాస్త్రము వశీకరింపలేదు. ఇట్లే చతుర్వింశతితత్త్వముల వివేకమగు సాంఖ్యము నన్ను తెలుపలేదు. అహింసాదికమగు ధర్మము నన్ను లోఁగొనలేదు. వేదజపము నన్ను ప్రకటించలేదు. సన్న్యాసము వలన నేను తెలియరాను. ఇష్టమగు అగ్నిహోత్రాది కర్మ గాని, కూపారామ నిర్మాణాదికమగు పూర్తకర్మ గాని నన్ను తెలుప సాధనములు కావు. సామాన్య ధన కనక వస్తు వాహనాది దానము నన్ను వశపఱచుకొనలేదు.

శ్లో. వ్రతాని యజ్ఞ శ్ఛందాంసి తీర్థాని నియమా యమాః,
యథాఽవరుంధే త్సత్సంగ స్సర్వసంగాపహో హి మామ్. 2

అ. వ్రతాని=ఏకాదశ్యుపవాసాదులు; యజ్ఞః=దేవపూజ; ఛందాంసి=రహస్యమంత్రములు; నియమాః=తపస్స్వాధ్యాయాదులు; యమాః=అహింసాదులు; యథా=ఏప్రకారము; సర్వసంగాపహః=ఎల్లసంగములను పోఁగొట్టు; సత్సంగః=సాధుపుంగవుల సంగము; మాం=నన్ను; అవరుంధేత్=వశీకరించునో.

తా. ఏకాదశ్యుపవాసము లోనగు వ్రతములు గాని, గంగాది పుణ్యతీర్థములు గాని, శౌచాది నియమములు, బ్రహ్మచర్యాది నియమములు గాని ఏవన్నియును, సర్వ సంగములను పోనడంచు సాధుపుంగవుల సంగము నన్నెట్లు వశీకరించునో అట్లు వశీకరించలేవు.

శ్లో. సత్సంగేన హి దైతేయా యాతుధానా ఖగా మృగాః,
గంధర్వాప్సరసో నాగా స్సిద్ధచారణగుహ్యకాః. 3

శ్లో. విద్యాధరా మనుష్యేషు వైశ్యాః శూద్రాః స్త్రియోఽంత్యజాః,
రజస్తమఃప్రకృతయ స్తస్మిం స్తస్మిన్ యుగే యుగే. 4

అ. సత్సంగేన హి = సాధువుల సంగము చేతనే; యాతుధానాః = రాక్షసులు; ఖగాః = పక్షులు; మృగాః = పశువులు; గంధర్వాప్సరసః = గంధర్వులు, అచ్చరలు; నాగాః= ఉరగులు; సిద్ధచారణగుహ్యకాః = సిద్ధులు, చారణులు, గుహ్యకులు; విద్యాధరాః = విద్యాధరులు; మనుష్యేషు = మనుష్యులందు; వైశ్యాః = వైశ్యులు; శూద్రాః = శూద్రులు; స్త్రియః=స్త్రీలు; అంత్యజాః = చండాలురు. తస్మిన్ తస్మిన్ యుగే యుగే = ఆయా యుగము నందు; రజస్తమః ప్రకృతయః= రజస్తమో గుణముల స్వభావము గలవారు.

తా. ఆ యా కృతాది యుగములందు సత్సంగము చేతనే ప్రహ్లాదాది దైత్యులు, విభీషణాది రాక్షసులు, జటాయువు లోనగు పక్షులు, గజేంద్రుడు లోనగు జంతువులు, చిత్రరథాది గంధర్వులు, మేనకాద్యప్సరసలు, శేషాది నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, విద్యాధరులు లోనగు దేవజాతులును, మనుష్యులందు రజస్తమస్సుల స్వభావము గల వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, చండాలురు లోనగు వారలును ధన్యులైరి

శ్లో. బహవో మత్పదం ప్రాప్తా స్త్వాష్ట్రకాయాధవాదయః,
వృషపర్వా బలి ర్బాణో మయ శ్చాథ విభీషణః. 5

అ. త్వాష్ట్ర కాయాధవ+ఆదయః = త్వష్ట పుత్రుడగు వృత్రుడు; కయాధుపుత్రుడు ప్రహ్లాదుడు; ఆదయః = మొదలగువారు; వృషపర్వా, బలిః, బాణః = వృషపర్వుడు, బలి, బాణుడు; మయః = మయుడు; విభీషణః = విభీషణుడు; బహవః=పలువురు; మత్పదం = నా స్థానమును; ప్రాప్తాః = పొందిరి

తా. సత్సంగము చేతనే వృత్రుడు, ప్రహ్లాదుడు లోనగువారు, వృషపర్వుడు, బలి, బాణుడు, మయుడు మఱి విభీషణుడు లోనగు పెక్కుఱు నా స్థానమును పొందిరి.

శ్లో. సుగ్రీవో హనుమా నృక్షో గజో గృధ్రో వణిక్పథః,
వ్యాధః కుబ్జా వ్రజే గోప్యో యజ్ఞపత్న్య స్తథాఽపరే. 6

అ. సుగ్రీవః = సుగ్రీవుడు; హనుమాన్ = ఆంజనేయుడు; ఋక్షః = భల్లూకము (జాంబవంతుడు); గజః = గజేంద్రుడు; గృధ్రః = గృధ్రము అనగా జటాయువు; వణిక్పథః = తులాధారుడు; వ్యాధః = ధర్మవ్యాధుడు; కుబ్జా = కుబ్జ (గూనిది); వ్రజే = గోకుల మందలి; గోప్యః = గోపికలు; తథా = అట్లే; అపరే=తక్కిన; యజ్ఞపత్న్యః = దీక్షితుల భార్యలు (ఋషి పత్నులు).

తా. సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, ఋక్షుఁడు అనగా భల్లూకమగు జాంబవంతుఁడు, గజేంద్రుఁడు, గృధ్రము అనగా జటాయువు, వణిక్పథుఁడు-వైశ్యుఁడు (తులాధారుఁడు), ధర్మవ్యాధుఁడు, కుబ్జ, గోకుల మందలి గోపికలు, దీక్షితులభార్యలు (ఋషిపత్నులు) వీ రెల్లరు సత్సంగముచే నా స్థానమును పొందిరి.

అవ. వారలకు సత్సంగము కంటె వ్యతిరిక్తమైన సాధనాంతరము లేమిని జెప్పుచున్నారు—

శ్లో. తే నాధీతశ్రుతిగణా నోపాసితమహత్తమాః,
అవ్రతాతప్తతపస స్సత్సంగాన్మా ముపాగతాః. 7

అ. తే = పైన పేర్కొనబడినవారు; న అధీతశ్రుతిగణాః = వేదముల నధ్యయనము చేసినవారు కారు; న ఉపాసిత మహత్తమాః = ఆ వేదముల కొఱకు దొడ్డవారి నుపాసించిన వారు కారు; అవ్రత+అతప్తతపసః = ఏకాదశ్యాది ఉపవాసములు చేయనివారు; కృచ్ఛ్రాది తపములచే తపించినవారు కారు సత్సంగాత్ = సత్పురుషుల తోడి కూడిక వలన, సత్సంగ మనగా నా తోడి సంబంధమను భావముతో చెప్పబడినది; మాం = నన్ను; ఉపాగతాః = పొందిరి.

తా. పైన పేర్కొనబడినవారు వేదముల నధ్యయనము చేసినవారు కారు. ఆ వేదాధ్యయనము కొఱకు పెద్దలను సేవించినవారు కారు. ఏకాదశ్యుపవాసములు చేసినవారు కారు. కృచ్ఛ్రచాంద్రాయణాది తపములు చేసినవారు కారు. అట్టివారైనను వారు కేవలము సత్సంగము వలననే నన్ను పొందిరి.

అవ. పైన చెప్పబడినవారిలో వృత్రుఁడు లోనగువారికి మాత్రము కష్టమైన దేదేని సాధనాంతర ముండిన నుండుగాక. గోపికలు లోనగువారికి మాత్రము అన్యమైన సాధన మేమియు లేదనుచున్నారు—

శ్లో. కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః,
యేఽన్యే మూఢధియో నాగా స్సిద్ధా మా మీయు రంజసా. 8

అ. కేవలేన హి భావేన = ముఖ్యముగా సత్సంగము వలన లభించిన ప్రీతిచే; గోప్యః = గోపికలు; గావః = గోవులు; నగాః = యమళార్జునాది వృక్షములు (మద్దిచెట్లు) (అప్పుడు బృందావనమున వర్తించు పర్వత తరు గుల్మాదులకు సైతము భగవంతు నందు భావ ముండెనని తోచుచున్నది.) మృగాః = జాంబవదాదులు; నాగాః = నాగులు (కాళియాదులు); యే = ఏ; అన్యే మూఢధియః = అన్యులగు మందమతులును, సిద్ధాః = కృతార్థు లగుచు; అంజసా = శీఘ్రముగా; మాం ఈయుః = నన్ను పొందిరి. అట్లే భగవంతునిచే చెప్పబడినది—

శ్లో. అహో అమీ దేవవ రామ రార్చితం
పాదాంబుజం తే సుమనః ఫలార్హణమ్,
నమం త్యుపాదాయ శిఖాభి రాత్మన
స్తమోపహత్యై తరుజన్మ యత్కృతమ్.

ఔరా ! ఈ బృందావనము నందలి తరులతాదులు తరుజన్మమును పొందినవయ్యు వంచిన తమ చిట్ట చివరి కొమ్మలచే తమ అజ్ఞానము పోవుటకై దేవతలకు ఫల మీయఁదగినవై పుష్ప ఫల సమర్పనమునకు యోగ్యమై దేవేంద్రుడు లోనగు సురలచే పూజింపబడినవైన నీ పాదపద్మము లను నమస్కరించుచున్నవి.

తా. గోపికలు, గోవులు, జంతువులు, తరులతాదులు, నాగులు (జంతువులు జాంబవంతుఁడు లోనగువారు. నాగులు కాళియుఁడు లోనగువారు. తరువులు యమళార్జునాదులు (మద్దిచెట్లు) అని తెలియవలెను.) అన్యులగు మందమతులును. కేవలము సాధుసంగము చేతనే కృతార్థులై నన్ను పొందిరి.

అవ. నన్ను పొందుట దుర్లభ మని చెప్పుచున్నారు—

శ్లో. యం న యోగేన సాంఖ్యేన దానవ్రతతపోఽధ్వరైః,
వ్యాఖ్యాస్వాధ్యాయసంన్యాసైః ప్రాప్నుయా ద్యత్నవా నపి. **9**

అ. యం = ఏ నన్ను; యత్నవాన్ అపి = ప్రయత్నపడినవాడైనను; యోగేన = ధ్యానయోగముచే గాని; దానవ్రతతపస్ + అధ్వరైః = దాన వ్రత తపస్సులు యాగములు లోనగు వానిచే గాని; వ్యాఖ్యా స్వాధ్యాయ సన్న్యాసైః = శాస్త్ర వ్యాఖ్యాన వేదాధ్యయనసన్న్యాసములచే గాని; న ప్రాప్నుయాత్ = పొందలేడో.

తా. అట్టి నన్ను పొందవలెనని ప్రయత్నపడినవాఁడైనను, ధ్యానయోగము చేతగాని, జ్ఞానయోగము చేతఁ గాని, దానములచే, వ్రతములచే, తపస్సులచే, యాగములచే, శాస్త్ర వ్యాఖ్యానములచే, వేదాధ్యయనముచే సన్న్యాసము చేతను పొందనేరడు. అనగా కేవలము సాధు సంగము చేతనే నన్ను పొందగలడని భావము.

అవ. గోపికల భావమును ప్రపంచించుచున్నారు—

శ్లో. రామేణ సార్ధం మధురాం ప్రణీతే
శ్వాఫల్కినా మయ్యనురక్తచిత్తాః,
విగాఢభావేన న మే వియోగ
తీవ్రాధయోఽన్యం దదృశుః సుఖాయ. **10**

అ. రామేణ సార్ధం = బలరామునితో గూడ; శ్వాఫల్కినా = శ్వఫల్కుని పుత్రుడగు అక్రూరునిచే; మధురాం ప్రణీతే సతి = మధురను పొందించిన వాడను కాగా; మయి అనురక్తచిత్తాః = నాయందనురాగము గలవారు; విగాఢభావేన = దృఢమగు ప్రీతిచే; మే = నా యొక్క; వియోగ తీవ్ర + ఆధయః = ఎడబాటుచే గాఢమైన మనోవ్యథ గలవారై, గోపికలు; అన్యం = ఇతరమును; సుఖాయ న దదృశుః = తమ సుఖమునకు చూడరైరి.

తా. అక్రూరుడు బలరామునితోఁ గూడ నన్ను మధురకుఁ బిలుచుకొని పోయినంతనే నాయందనురక్తచిత్తలగు గోపికలు నా మీది గాఢమగు ప్రేమకలవారగుటచే నా యెడబాటుచేఁ తీవ్రమగు మనోవ్యథ గలవారై తమ సుఖమునకై యే ఇతర వస్తువును గానరైరి.

అవ. తీవ్రమైన మనోవ్యథ కలుగుటను ప్రపంచించుచున్నారు.

శ్లో. తా స్తాః క్షపాః ప్రేష్ఠతమేన నీతా
మయైవ బృందావనగోచరేణ,
క్షణార్ధవ త్తాః పున రంగ తాసాం
హీనా మయా కల్పసమా బభూవుః. 11

అ. అంగ = ఓ ఉద్ధవా !; యాః = ఏవి ఏవి; బృందావనగోచరేణ = బృందావన సంచారి యగు; మయా ఏవ = నా తోడనే; క్షణార్ధవత్ = అర క్షణము వలె; నీతాః = గడపబడినవో; తాః తాః క్షపాః = ఆ యా రాత్రులు; మయా హీనాః = నాచే హీనములై; కల్పసమాః = కల్పకాలముతో సమానములు; బభూవుః = అయినవి.

తా. ఓ ఉద్ధవా ! గోపికలు బృందావనమందు నాతో గూడి ఏ యే రాత్రులను అర క్షణముగా గడిపిరో ఆ రాత్రులే నేను లేకపోగా వారి కవి కల్పకాలసమము లైనవి.

అవ. ఈ ప్రకారము తీవ్రమైన మనోవ్యథ గలవారు మోహవ్యాజమున సమాధిని పొందిరని చెప్పుచున్నారు—

శ్లో. తా నావిదన్ మ య్యనుషంగబద్ధ
ధియ స్స్వ మాత్మాన మద స్తథేదమ్,
యథా సమాధౌ మునయోఽబ్ధితోయే
నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే. 12

అ. మయి = నా యందు; అనుషంగబద్ధధియః = ఆసక్తిచే కట్టుబడిన చిత్తము గల గోపికలు; సమాధౌ = యోగ సమాధి యందు; యథా మునయః = మునుల వలె; అబ్ధితోయే = సముద్రజలమందు; ప్రవిష్టాః = ప్రవేశించిన; నద్యః ఇవ = నదుల వలె; స్వం = తమ్ము లేక తమ పతిపుత్రాదికమును మమతాస్పదమును, ఆత్మానం = అహంకారాస్పదమగు దేహమును; అదః = దూరస్థమైన పరలోకమును; తథా = ఆ ప్రకారము; ఇదం = సన్నిహితమైన ఈ లోకమును; నామరూపే = తమ నామ రూపములను; న అవిదన్ = ఎఱుగరైరి.

తా. నా యందలి ప్రేమచే కట్టువడిన చిత్తము గల ఆ గోపికలు, సమాధియందు మునుల వలెను, సముద్రజలమందు ప్రవేశించిన నదులవలెను, తమ్ముగాని, నావారను మమకారమున కాస్పదమైన పతిపుత్రాదులను గాని, తమ అహంకారమున కాస్పదమైన దేహమును గాని, దూరపు వస్తువులను గాని, పరలోకమును గాని, దగ్గఱ వస్తువును గాని, ఈ లోకమును గాని తమ తమ రూపములను గాని యెఱుంగరైరి.

శ్లో. మత్కామా రమణం జారం మత్స్వరూపావిదోఽబలాః,
బ్రహ్మ మాం పరమం ప్రాపుః సంగా చ్ఛతసహస్రశః. 13

అ. మత్కామాః = నన్ను కామించినవారైన; అబలాః = బలహీనలైన స్త్రీలు, గోపికలు; మత్ స్వరూప + అవిదః = నా స్వరూపము నెఱుంగనివారైనను; సంగాత్ = సత్సంగమ్ము వలన; జారం రమణం = జారుఁడను బుద్ధిచే నెఱుంగదగిన ప్రియుని; పరమం బ్రహ్మ =

పరబ్రహ్మమైన; మాం = నన్ను; శతసహస్రశః = వందలు వేల కొలది, ప్రాపుః = పొందిరి.

తా. జారుఁడై ప్రియుఁడైన నన్ను కామించినవారై, నా స్వరూపము నెఱుంగని వారైనను అబలలైన గోపికలు, జారుఁడను బుద్ధితో నూర్ల వేలకొలది పరబ్రహ్మమగు నన్ను సత్సంగము వలన పొందిరి.

శ్లో. తస్మాత్త్వ ముద్ధ వోత్సృజ్య చోదనాం ప్రతిచోదనామ్,
ప్రవృత్తిం చ నివృత్తిం చ శ్రోతవ్యం శ్రుత మేవ చ. **14**

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవుఁడా; తస్మాత్ = నా భజన ప్రభావ మిట్టి దగుటవలన; త్వం = నీవు; చోదనం = ధర్మమును బోధించు శ్రుతిని; ప్రతిచోదనాం = అధర్మమునే విస్తరించి చెప్పు స్మృతిని; ప్రవృత్తిం చ = కర్మమార్గమును; నివృత్తిం చ = జ్ఞానమార్గమును; శ్రోతవ్యం = వినదగిన ఆత్మతత్త్వమును; శ్రుతం ఏవ చ = వినిన తత్సాధనమగు యోగ విధిని; ఉత్సృజ్య = విసర్జించి.

తా. ఓ ఉద్ధవా! నా భజన ప్రభావ మిట్టిది గావున, నీవు ధర్మబోధకమగు శ్రుతిని, అధర్మమును విస్తరించి చెప్పు స్మృతిని లేక విధి నిషేధ కర్మలను, కర్మమార్గమును, జ్ఞాన మార్గమును, శ్రోతవ్యమగు ఆత్మతత్త్వమును, శ్రుతమైన తత్సాధనమైన యోగ విధానమును వీడినవాడవై.

శ్లో. మా మేక మేవ శరణ మాత్మానం సర్వదేహినామ్,
యాహి సర్వాత్మభావేన మయా ఽస్యా హ్యకుతోభయః. **15**

అ. సర్వదేహినాం = ఎల్ల ప్రాణులకు; ఆత్మానం మాం = ఆత్మయైన నన్ను; ఏకం ఏవ = ఒక్కనినే, ఆత్మభావేన = స్వస్వరూప భావముతో; శరణం యాహి = రక్షకునిగా పొందుము. మయా హి = నా తోడనే; అకుతోభయః స్యాః = దేని వలనను భయము లేనివాడ వగుము;

తా. ఎల్ల ప్రాణులకు ఆత్మయైన నన్నొక్కనిచే స్వస్వరూప భావముతో శరణు పొందుము. నా తోడ గూడి, దేని వలనను భయము లేనివాడ వగుము

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుఁడు వచించెను.

అవ. ఇంతకుముందైనచో నాచే జెప్పబడిన వానియందు జాగరూకుడవై స్వధర్మమందు వర్తింపుము. అని యిట్లు కర్మ చేయదగినదిగా వచింపబడినది. ఇప్పుడన్ననో సర్వమును త్యజించి, నన్ను శరణు పొందుమని చెప్పబడినది. ఈ విషయమై ఆత్మకు కర్తృత్వాదిక మున్నదా లేదా అని ఆత్మవిషయమై హృదయమందున్న సంశయము నివర్తించ కున్నది. లేక కర్మత్యాజ్యమా అని హృదయమందున్న సంశయము నివర్తించలేదు. అని ప్రశ్నించుచున్నారు.

శ్లో. సంశయః శృణ్వతో వాచం తవ యోగేశ్వరేశ్వర,
న నివర్తత ఆత్మస్థో యేన భ్రామ్యతి మే మనః. 16

అ. తవ = నీ యొక్క; వాచం = వచనమును; శృణ్వతః = వినుచున్న; మే=నాకు; ఆత్మస్థః = హృదయమందున్న; సంశయః = సందేహము; న నివర్తతే = మఱలకున్నది; యేన = ఏ సందేహముచే; మే = నా యొక్క; మనః = మనస్సు; భ్రామ్యతి = భ్రమించుచున్నదో.

తా. ఓ యోగేశ్వరేశ్వరా ! ఓ యోగులకు ప్రభువా ! యోగమహిమ గలవాడా ! నీవు వచించిన విషయమును వినుచున్న నాకు హృదయమునందు గల సందియము పీడకున్నది. ఆ సందియమున నా మనస్సు భ్రమించుచున్నది.

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు వచించెను.

అవ. ఆ సంశయమున కుత్తరము 'స ఏష' అని మొదలుకొని ఎనిమిది శ్లోకములచే చెప్పబడుచున్నది దీని భావ మిది. మఱి ఈశ్వరు డన్ననో తన మాయావశమున ప్రపంచ స్వరూపుడుగా భాసిల్లుచున్నాడు. ఆ ప్రపంచాధ్యాస వలననే జీవులకు అనాదియగు అవిద్యచే కర్తృత్వాదికము కలిగినది. అందువలన విధిప్రతిషేధాధికార మేర్పడినది. అప్పుడు సత్త్వశుద్ధికొఱకు కర్మలను చేయుమని చెప్పబడినది. ఈ సత్త్వము (బుద్ధి) శుద్ధమైనచో మఱల కర్మజాడ్య పరిహారమునకై శక్తి విక్షేపకమైన (చలింపజేయునదైన) కర్మాదరమును పరిత్యజించి దృఢవిశ్వాసముతో నన్ను భజింపుమని చెప్పబడినది. విద్య యనగా బ్రహ్మజ్ఞానము. అది కలుగగనే కర్తవ్య మే యించుకయు లేదు. ఆ విషయమై ఇప్పుడు, ఈశ్వరుని వలన వాగాదులగు ఇంద్రియముల ద్వారా జీవులకు సంసార కారణమైయున్న ప్రపంచోద్గమమును నాలుగున్నర శ్లోకములచే చెప్పుచున్నారు —

శ్లో. స ఏష జీవో వివరప్రసూతిః ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః,
మనోమయం సూక్ష్మ ముపేత్య రూపం మాత్రా స్వరో వర్ణ ఇతి స్థవిష్ఠః. 17

అ. సః ఏషః జీవః = ఆ ఈ అపరోక్షుడైన జీవుడు; సర్వమును జీవింపజేయు పరమేశ్వరుడు, అపరోక్షత్వమందు హేతువును చెప్పుచున్నారు- వివరప్రసూతిః = వివరములైన మూలాధారాది చక్రములందు ప్రసవమువంటి ప్రసవము అనగా అభివ్యక్తి కలవాడై; షట్చక్రములు—

శ్లో. ఆధారో మణిబంధశ్చ మణిపూరక ఏవ చ,
అనాహతో విశుద్ధాజ్ఞాచక్రా ణ్యేతాని షట్క్రమాత్.

మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధి లేక విశుద్ధ, ఆజ్ఞ అని క్రమముగా నాఱు చక్రములు వర్తించును.

ఆ యభివ్యక్తిని చెప్పుచున్నాడు. ఘోషేణ = పరాఖ్యమను నాదము కలదైన; ప్రాణేన = ప్రాణముతో గూడ; గుహాం ప్రవిష్టః = ఆధార చక్రమును ప్రవేశించినవాడై; మనోమయం సూక్ష్మరూపం = మనోమయమై సూక్ష్మరూపమైన పశ్యంతి యను పేరుగల వాక్కును, మధ్యమ అను వాక్కును; ఉపేత్య = మణిపూరక చక్రము నందు, విశుద్ధచక్రము

నందు పొంది; వక్త్రే = ముఖము నందు; మాత్రా = హ్రస్వాదికము; స్వరః = ఉదాత్తాదికము; వర్ణః = అకారాది వర్ణము; ఇతి = ఈ ప్రకారమనై; స్థవిష్ఠః = వైఖరి యను పేరు గలవాడై స్థిరముగా నున్నాడు. అతి స్థూలుడై నానా వేద శాఖా స్వరూపు డగుచున్నాడు. అట్లే-

చత్వారి వాక్పరిమితా పదాని తాని విదు ర్బ్రాహ్మణా యే మనీషిణః,
గుహా త్రీణి నిహితా నేఙ్గయన్తి తురీయం వాచం మనుష్యా వదన్తి,

నాలుగు విధములగు వాక్కులచే ప్రకటమగు పదమును మనీషులగు బ్రాహ్మణు లెఱుంగుదురు. వీరిలో మూఁడు వాక్కులు హృదయగుహాయందు గూఢమైయున్నవి. అవి చలించవు. నాలుగవదైన వైఖరీవాక్కును మనుష్యులు వచింతురు. అట్లే,

శ్లో. యా సా మిత్రావరుణసదనా దుచ్చరన్తీ త్రిషష్టిం
వర్ణానన్తః ప్రకటకరణైః ప్రాణసంగాత్ ప్రసూతే
తాం పశ్యన్తీం ప్రథమముదితాం మధ్యమాం బుద్ధిసంస్థాం
వాచం వక్త్రే కరణవిశదాం వైఖరీం చ ప్రపద్యే.

ఏది మిత్రావరుణుల ముఖమునుండి ఉచ్చరింపబడుచున్నదో ఆ వాక్కు ప్రాణసంగమువలన లోపల ప్రకటమగు కంఠతాల్వాది కరణముల ద్వారా త్రిషష్టి (అఱువది మూడు) వర్ణములను కనుచున్నదో, ప్రథమమున జనించు అపరావాక్కు ను, పశ్యంతీ వాక్కును, బుద్ధిని నెలకొన్న మధ్యమా వాక్కును, ముఖము నందు (నోటి యందు) కరణముచే విశదమగు వైఖరీ వాక్కును శరణు పొందుచున్నాను.

తా. అపరోక్షస్వరూపుడై, సర్వమును జీవింపజేయు నీ పరమేశ్వరుఁడు మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రము లను షట్చక్రములం దభివ్యక్తి గలదై, పరావాగ్రూపమై, నాదవంతమైన ప్రాణముతో అధారచక్రమును ప్రవేశించి, అందుండి నాభియందలి మణిపూరకచక్రమందు మనోమయమై, సూక్ష్మరూపమైన పశ్యంతీవాక్కును జొచ్చి, అందుండి అనాహతచక్రముద్వారా విశుద్ధచక్రమందు మధ్యమా వాక్కును పొంది, తర్వాత ముఖము లేక నోటి యందు కంఠతాల్వాది స్థానముల ద్వారా హ్రస్వ దీర్ఘప్లుతములను ఉదాత్తాది స్వరములను, అకారాద్యచ్చులను, కకారాది హల్లులను, 63 సంఖ్య గల వానిని పొంది, స్థూలరూపుఁడై, వైఖరీ వాక్కును పొంది, వివిధములైన వేదశాఖల స్వరూపము పొందినవా డగుచున్నాడు.

హ్రస్వము, దీర్ఘము, ప్లుతములు 3. ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము, ప్రచయము అని స్వరములు 4. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః అని స్వరములు లేక అచ్చులు ప్రాణములు 16. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ, శ ష స హ, ళ క్ష 3 + 4 + 16 + 35 = 58

అవ. అవ్యక్తుడై యుండుచున్న ఈశ్వరునికి సూక్ష్మ మధ్యమ క్రమమున అభివ్యక్తి యగుటయందు దృష్టాంతమును చెప్పుచున్నారు.—

శ్లో. యథాఽనలః ఖేఽనిలబంధు రూష్మా బలేన దారు ణ్యధి మథ్యమానః,
అణుః ప్రజాతో హవిషా సమిధ్యతే తథైవ మే వ్యక్తి రియం హి వాణీ. 18

అ. యథా=ఏ ప్రకారము; అనలః=అగ్ని; ఖే=దారువు రంధ్రమందు; ఊష్మా= అవ్యక్తుడై ఉష్ణస్వరూపుడై యుండుచు; దారుణి=కొయ్యయందు; బలేన=బలముతో; అధికం మథ్యమానః = మిక్కిలి మథింపబడు చున్నవాడై; అనిలబంధుః = వాయుసహాయుడై; అణుః=సూక్ష్మ విస్ఫులింగాది రూపు డగుచున్నాడు. మఱల; ప్రజాతః=తృణ సమిధలచే వర్ధితుండై; హవిషా సమిధ్యతే = హవిస్సుచే ప్రజ్వలించుచున్నాడో; తథా ఏవ=ఆ ప్రకారమే; ఇయం వాణీ=వేదస్వరూపమైన ఈ వాక్కు; మే వ్యక్తిః=నా అభివ్యక్తి. నావలన జనించిన దగుచున్నది.

తా. దారువుయొక్క సూక్ష్మరంధ్రమందు దాగియున్న అగ్ని, బలముచే దారువునం దధికముగా మథించినంతనే తన సన్నని నిప్పు రవ్వలతోఁ గూడి సూక్ష్మరూపుడై యుదయించి, తృణాదులచే వర్ధిల్లి, హవిస్సుచే నెట్లు ప్రజ్వలించుచున్నదో అట్లే వేదవాణి నావలన జనించుచున్నది. నా అభివ్యక్తి యగుచున్నది.

అవ ఇపుడు చెప్పబడిన వాగ్వృత్తి నుపసంహరించుచు ఇతరేంద్రియవృత్తులందు అతిదేశించుచున్నారు—

శ్లో. ఏవం గదిః కర్మ గతి ర్విసర్గో ఘ్రాణో రసో దృక్ స్పర్శః శ్రుతిశ్చ,
సంకల్పవిజ్ఞాన మథాభిమానః సూత్రం రజః సత్త్వతమోవికారః. 19

అ. ఏవం=ఈ ప్రకారము; గదిః = సంభాషణ రూపమైన వాక్కు నా అభివ్యక్తి యని ఉపసంహారము; కర్మ = గ్రహించుట, ఇచ్చుట లోనగు హస్తముల వృత్తి; గతిః=పాదముల వృత్తి యగు గమనము; విసర్గః = విసర్జించుట, మలమూత్రములను విసర్జించుట పాయూపస్థల (గుదము, శిశ్నము లేక ఉపస్థ) వృత్తి, ఇవి కర్మేంద్రియ వృత్తులు; రసః = మధురాది రసములు రుచి చూచుట; ఘ్రాణః = గంధాదులను మూర్కొనుట; దృక్ = దర్శనము; స్పర్శః = స్పర్శనము; శ్రుతిః = వినుట; జ్ఞానేంద్రియవృత్తులు; సంకల్పవిజ్ఞానం = సంకల్పరూపమగు విశేషజ్ఞానము, మనోవృత్తి; అథ అభిమానః = అహంకారము; సూత్రం = ప్రధానము యొక్క వృత్తి; రజః సత్త్వతమోవికారః = సత్వరజస్తమస్సుల యొక్క వికారము; ఈ ప్రకారము అధిదేవతాది త్రివిధమగు ప్రపంచము నా అభివ్యక్తి యని పూర్వశ్లోకముతో అన్వయము.

తా. ఇట్లు వైఖరీ వాక్కు నా అభివ్యక్తియై యున్నది. అట్లే ఆదానగ్రహణాదికము హస్తముల కర్మము లేక వృత్తి. గమనము పాదముల వృత్తి. మల మూత్రముల విసర్జనము పాయూపస్థల వృత్తి. ఇవి కర్మేంద్రియముల వృత్తులు. గంధములను మూర్కొనుట నాసికా వృత్తి. మధురాది రసముల నాస్వాదించుట జిహ్వా వృత్తి, స్వరూపములను దర్శించుట చక్షుర్వృత్తి, స్పృశించుట త్వక్కువృత్తి, వినుట శ్రవణము వృత్తి, ఘ్రాణము, జిహ్వా, త్వక్కు చక్షువు, శ్రవణము, అనునవి జ్ఞానేంద్రియము లగును. వీని నడుమ సూత్రము అనగా ప్రధానము యొక్క సత్త్వరజస్తమస్సుల వికారము ఇంద్రియాధిదేవతలు, కర్మేంద్రియములు,

జ్ఞానేంద్రియములు ఈ మూడు విధములగు ప్రపంచము ప్రధానము యొక్క వృత్తి, నా అభివ్యక్తి యగుచున్నది.

శ్లో. అయం హి జీవ స్త్రివృ దబ్జయోని రవ్యక్త ఏకో వయసా న ఆద్యః,
విశ్లిష్టశక్తి ర్బహుధేవ భాతి బీజాని యోనిం ప్రతిపద్య యద్వత్. **20**

అ. అయం హి జీవః = ఈ జీవుఁడు; సర్వజీవనాధారుడైన ఈ పరమేశ్వరుఁడు; అవ్యక్తః = మొదట అవ్యక్తుఁడు; ఏకః = ఒక్కడు; ఆద్యః = ఆద్యుడైన; నః = ఆ ఈశ్వరుడు; వయసా = కాలముచే; విశిష్టశక్తిః = విభక్తములైన వాగాదింద్రియ రూపము లను శక్తులు గలవాఁడై లేక విశేషముగా ఆలింగనము చేయబడిన మాయాశక్తి గలవాడై; త్రివృత్ = త్రిగుణాశ్రయుఁడు; అబ్జయోనిః = లోకపద్మమునకు కారణమై; బీజాని = బీజములు; యోనిం = క్షేత్రమును; ప్రతిపద్య = పొంది. యద్వత్ = ఎట్లో, అట్లే; బహుధా ఏవ భాతి = అనేక విధములుగా ప్రకాశించుచున్నాడు; బీజాని = బీజము అని బహువచనము చెప్పుట సరిగాదు; బీజ మనుట లెస్స.

తా. ఒక్క బీజము క్షేత్రమును పొంది వివిధములగు శాఖా పత్ర పుష్ప ఫల శోభితమై పెక్కు విధములఁ గన్పట్టునట్లు తొల్త అవ్యక్తుఁడై ఒక్కడై సర్వజీవుల కాధారుడైన ఆద్యుఁడైన ఈ పరమేశ్వరుఁడు మాయాశక్తితోఁ గూడినవాడై మాయగుణముల కాశ్రయుఁడై జగమను పద్మమునకు కారణమై వాగాదింద్రియముల ద్వారా పెక్కు విధములుగా ప్రకాశించు చున్నాడు.

అవ. అందువలన ఆ పరమేశ్వరుని మాయావిలసిత మగుటవలన తదాశ్రయమైన ఈ జగము ఆ పరమేశ్వరుని కంటె వేరుగాదని దృష్టాంత సహితముగాఁ జెప్పుచున్నారు—

శ్లో. యస్మి న్నిదం ప్రోత మశేష మోతం పటో యథా తంతువితానసంస్థః,
య ఏష సంసారతరుః పురాణః కర్మాత్మకః పుష్పఫలే ప్రసూతే. **21**

అ. తంతువితానసంస్థః = తంతువుల సమూహమందున్న; పటః యథా = వస్త్రము వలె; యస్మిన్ = ఏ పరమేశ్వరుని యందు; ఇదం = ఈ విశ్వము; అశేషం = సమస్తము; ఓతం = పడుగురూపమైన తంతువులందు (నిడుపుగా కూర్చఁబడినది); ప్రోతం = పేక రూపమగు అడ్డముగాఁ గూడిన తంతువుల వలె; ఇట్టి సమష్టి వ్యష్ట్యాత్మకమైన విశ్వము అవిద్యచే ఆత్మయందు వృక్షరూపమున అధ్యస్తమైనది. జీవునకు కర్తృత్వాదికము సంసార హేతువు. అందువలన ఆ కర్తృత్వాది వివేక జ్ఞానముచే కర్మాదికము సర్వము పరిత్యాజ్యమని చెప్పబడిన దను ఆశయముచే చెప్పుచున్నారు. యః = ఏ; ఏషః సంసారతరుః = ఈ సంసార వృక్షము; పురాణః = అనాది; కర్మాత్మకః = ప్రవృత్తి స్వభావము; పుష్పఫలే = భోగాప వర్గములు; కర్మఫలములు; ప్రసూతే = జనింపజేయుచున్నది.

తా. నిడుపగు పడుగురూపముననను, అడ్డమగు పేకరూపముననను సమకూడిన తంతువులం దున్న వస్త్రము వలె ఏ పరమేశ్వరుడు — విశ్వము పడుగని చెప్పఁబడు దీర్ఘతంతువులయందు, పేక అని చెప్పబడు తిర్యక్తంతువులయందును ఉన్న పటము వలె కూర్చబడిన

దైన ఈ సంసారవృక్షము అనాది కర్మస్వరూపము, ప్రవృత్తి స్వభావము కలదై పుష్పఫల రూపములు, కర్మ ఫలములైన భోగాపవర్గములను కనుచున్న దగును.

అవ. వృక్షరూపమును ప్రపంచించుచున్నారు—

శ్లో. ద్వే అస్య బీజే శతమూల స్త్రినాళః పంచస్కంధః పంచరసప్రసూతిః,
దశైకశాఖో ద్విసుపర్ణనీడ స్త్రివల్కలో ద్విఫలో ఒర్కం ప్రవిష్టః. 22

అ. అస్య = ఈ సంసార వృక్షమునకు; ద్వే బీజే = రెండైన పుణ్య పాపములు బీజములు; శతమూలః = శతము అనగా నూఱు (అపరిమితములైన) వాసనలను వేళ్లు గలది; త్రినాళః = మూడు గుణములు ప్రకాండములు (చెట్టు మొదటి యందలి పెద్ద కొమ్మలు) గలది; పంచస్కంధః = పంచ భూతముల కొమ్మలు గలది; పంచరస ప్రసూతిః = శబ్దాది పంచ తన్మాత్ర లను రసమును కనుట గలది; దశ + ఏకశాఖః = పదునొకండు ఇంద్రియములు; (జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మన స్సొకటి=11) అను పదునొకండు శాఖలు=చిన్న కొమ్మలు గలది; ద్విసుపర్ణ నీడః = పక్షితుల్యు లగు జీవ పరమాత్మల గూడు గలది; త్రివల్కలః = వాత పిత్త శ్లేష్మము లను మూడు వల్కలములు పట్టలు గలది; ద్విఫలః = సుఖదుఃఖము లను రెండు ఫలములు గలది; అర్క ప్రవిష్టః = సూర్యమండలము పర్యంతము వ్యాపించినది; సూర్యమండలమును ఛేదించుకొని పోయినవానికి సంసారము లేదందు వలన అట్లు చెప్పుట.

తా. ఈ సంసార వృక్షము పుణ్య పాపము లను రెండు బీజములు కలదై, వందల కొలది అపరిమిత వాసనలు కలదియు, సత్త్వరజస్తమస్సు లను గుణము లను మూడు మొదళ్లు గలదియు, పృథివ్యాది పంచభూతము లను పెద్ద కొమ్మలు కలదియు, శబ్దాది విషయము లను (శబ్ద స్పర్శ రస రూప గంధములు) అయిదు రసములను కనుట గలదియు, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనస్సు 1 చేరి పదునొకండు చిన్నకొమ్మలు గలదియు, వాత, పిత్త, శ్లేష్మము లను మూడు వల్కలములు (పట్టలు) గలదియు, సుఖ దుఃఖములను రెండు ఫలములు గలదై సూర్యమండలము వరకు వ్యాపించి యున్నది.

అవ. ఆ వృక్ష ఫల భోక్తలను చెప్పుచున్నారు—

శ్లో. అదన్తి చైకం ఫల మస్య గృధ్రా గ్రామేచరా ఏక మరణ్యవాసాః,
హంసా య ఏవం బహురూప మిజ్యై ర్మాయామయం వేద స వేద వేదమ్. 23

అ. గృధ్రాః = కాముకులు; గ్రామేచరాః = గృహస్థులు; అస్య = ఈ సంసార వృక్షము యొక్క; ఏకం ఫలం = దుఃఖరూపమైన ఒక ఫలమును, విపరిణామము వలన స్వర్గము సైతము దుఃఖస్వరూపమే యగును; అదంతి = భక్షించుచున్నారు; హంసాః = వివేకవంతులు; అరణ్యవాసాః = సన్న్యాసులు; ఏకం ఫలం = సుఖరూపమైన ఒక్క ఫలమును; అదన్తి = భక్షించుచున్నారు. (ఒక్క పరమాత్మను); మాయామయం = మాయాస్వరూపుడై; బహురూపం = పెక్కురూపములు గలవానిని; యః = ఎవడు; ఏవం = ఈ ప్రకారము ఇజ్యైః = పూజ్యులైన గురువులతో; (కృత్వా = భజించి;) వేద = ఎఱుగుచున్నాడో; సః = వాఁడు; వేదం = తత్త్వార్థమును; వేద = ఎఱుంగుచున్నాడు.

తా. కర్మఫలాసక్తులై, కాముకులైన గృహస్థులు ఆ ఫలములలో దుఃఖరూపమైన ఒక్క ఫలమును (పరిణామమందు స్వర్గము సైతము లేనందున అదియును దుఃఖమే యగును) భుజించుచున్నారు. వివేకవంతులు ఆరణ్యవాసులగు సన్యాసులు వానిలో సుఖరూపమైన రెండవ ఫలమును భుజించుచున్నారు ఎవడు పరమాత్మను మాయామయునిగను, బహురూపునిగను ఎఱింగి పూజ్యులైన గురువుచే నెఱింగి పూజించుచున్నాడో వాడు తత్త్వార్థము నెఱుంగుచున్నాడు.

అవ. నీవుగూడ ఈ ప్రకార మెఱింగి కృతకృత్యుడ వగుచు సాధనము లన్నింటిని త్యజింపుమని చెప్పుచున్నారు.

శ్లో. ఏవం గురూపాసన యైకభక్త్యా విద్యాకుఠారేణ శితేన ధీరః,
వివృశ్చ్య జీవాశయ మప్రమత్త స్సంపద్య చాత్మాన మథ త్యజాస్త్రమ్. **24**

అ. ఏవం = ఈ ప్రకారము; గురు + ఉపాసనయా = గురువులను సేవించుటచే లభించినదైన; ఏకభక్త్యా = ఏకాంతభక్తి యను; శితేన కుఠారేణ = వాడియైన గొడ్డలిచేత, (జ్ఞాన కుఠారముచేత) ధీరః = ధీరుఁడు, పండితుఁడు; అప్రమత్తః = జాగరూకుఁడై; జీవితాశయం = జీవనమున కుపాధియైన లింగశరీరమును; వివృశ్చ్య = ఛేదించి; ఆత్మానం సంపద్య = పరమాత్మను పొంది; అథ = తర్వాత; అస్త్రం = సాధనమైన జ్ఞానమును; త్యజ = త్యజించుము.

ఇట్లు గురువులను సేవించుటచే లభించిన ఏకాంతభక్తిచే లభించినదైన పదునైన జ్ఞాన కుఠారముచే లేక భక్తిజ్ఞానములను కుఠారముచే త్రిగుణాత్మకమైన జీవుని లింగశరీరమును (సూక్ష్మశరీరమును) ఛేదించి, పరమాత్మను పొంది, సాధనమైన జ్ఞానమును వీడవలెను.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే ద్వాదశో ఽ ధ్యాయః.

ఇది శ్రీ మద్భాగవతము ఏకాదశస్కంధము నందు పండ్రెండవ అధ్యాయము.

ఓం తత్సత్

# త్రయోదశాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. త్రయోదశేఽథ సత్త్వస్య వృద్ధ్యా విద్యోదయక్రమః,
హంసేతిహాసత శ్చిత్త గుణ విశ్లేష వర్ణనమ్.

ఈ త్రయోదశాధ్యాయమందు సత్త్వగుణవృద్ధిచే జ్ఞాన ముదయించు క్రమము, హంసేతిహాసము వలన చిత్తగుణము నెడబాయుటయును వర్ణింపబడినది.

శ్రీ కృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుఁడు వచించెను—

అవ. జ్ఞానకుఠారముచే జీవోపాధిని, లింగశరీరమును ఛేదించి సాధనమును త్యజింపు మని చెప్పఁబడినది. ఓయీ! జీవోపాధిని ఛేదించి అని చెప్పబడినది గదా! అందు తపస్సు లోనగు గుణత్రయవృత్తి ప్రతిబంధముగా నున్నప్పుడు విద్యోత్పత్తి యెట్లు కలుగును? అని ఆశంకించి, ఆ ప్రతిబంధ నివృత్తిద్వారా విద్యోత్పత్తి కలుగు విధమును ఏడు శ్లోకములచేఁ జెప్పుచున్నారు. అందు ఆనందాది గుణముల వలె సత్త్వాది గుణములు మూఁడు ఆత్మ ధర్మము లగునేని అప్పు డవి పరమాత్మ స్వరూపము లగుట వలన వాని నివృత్తి కలుగదు. అనిన ఇది ఈ ప్రకారము కాదు అని చెప్పుచున్నారు.

శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి గుణా బుద్ధే ర్న చాత్మనః,
సత్త్వే నాన్యతమౌ హన్యా త్సత్త్వం సత్త్వేన చైవ హి. 1

అ. సత్త్వం రజః తమః ఇతి గుణాః = సత్త్వము, రజస్సు, తమస్సులను ఈ మూడు గుణములు; బుద్ధేః = ప్రకృతివే అగును; న చ ఆత్మనః = ఆత్మగుణములు కావు; సత్త్వేన = సత్త్వగుణముచే; అన్యతమౌ = అన్యములైన రజస్తమస్సులను అనగా వాని వృత్తులగు; హన్యాత్ = జయించవలెను; సత్త్వం = సత్త్వదమాది రూపమును; సత్త్వేన చ ఏవ హి = ఉపశమాత్మకమైన సత్త్వముచే; హన్యాత్ = జయించవలెను.

తా. సత్త్వ రజస్తమస్సులను మూఁడు గుణములు ప్రకృతి వగును గాని ఆత్మసంబంధులు కావు. కాఁబట్టి సత్త్వగుణముచే నితరములగు రజస్తమోవృత్తులను జయించవలెను. సత్త్వదమాదిరూపమగు ఆ సత్త్వమును ఉపశాంతిరూపమగు సత్త్వముచే జయించవలెను.

అవ. గుణత్రయవృత్తులు పరస్పరము సమర్థనరూపము లగుటవలన సత్త్వగుణముచే నితరగుణముల వృత్తు లెట్లు తప్పక జయింపదగిన వగు ననగా చెప్పుచున్నారు—

శ్లో. సత్త్వా ద్ధర్మో భవే ద్వృద్ధా త్పుంసో మద్భక్తిలక్షణః,
సాత్త్వికోపాసనయా సత్త్వం తతో ధర్మః ప్రవర్తతే. 2

అ. శుద్ధాత్ సత్త్వాత్ = రజస్తమస్సులు కలియని శుద్ధసత్త్వమువలన; పుంసః = పురుషునికి; మద్భక్తిలక్షణః = నాయందలి భక్తిరూపమగు; ధర్మః = ధర్మము; భవేత్ = కలుగును; సాత్త్విక + ఉపాసనయా = సాత్త్వికములగు పదార్థముల సేవనము వలన; సత్త్వం = సత్త్వము వృద్ధియగును; తతః = ఆ సత్త్వము వలన; ధర్మః ప్రవర్తతే = ధర్మము ప్రవర్తించుచున్నది.

తా. శుద్ధ సత్త్వమువలన పురుషునికి నా భక్తిరూపమగు ధర్మము కలుగుచున్నది సాత్త్వికములగు పదార్థములను భుజించుట ద్వారా సత్త్వగుణము వర్ధిల్లును. దానివలన భక్తి రూపమగు ధర్మము ప్రవర్తించును.

శ్లో. ధర్మో రజస్తమో హన్యాత్ సత్త్వవృద్ధి రనుత్తమః,
అమనశ్యతి తన్మూలో హ్యధర్మ ఉభయే హతే. 3

అ. సత్త్వవృద్ధిః = సత్త్వగుణము యొక్క వృద్ధిగలదియు; అనుత్తమః = సర్వోత్తమము అగు; ధర్మః = నా భక్తిరూపమగు ధర్మము; రజస్, తమస్, హన్యాత్ = రజస్తమస్సుల నడగించును; ఉభయే హతే = ఆ రజస్తమస్సులు రెండును హతమైనంతనే; తన్మూలః = ఆ రజస్తమస్సులు కారణముగా కల, రాగద్వేషాదులు, ప్రమాదాలస్యములు మూలముగా కల; అధర్మః = అధర్మము; అనునశ్యతి = వెనువెంటనే నశించుచున్నది.

తా. సత్త్వగుణ వృత్తియొక్క వృద్ధి కలదై, సర్వోత్తమమైన మద్భక్తి రూపమైన ధర్మము రజస్తమస్సులను హతము గావించును. ఆ రజస్తమస్సులు రెండును హతములైనంతనే అవి మూలముగా గల, అనగా వాని వృత్తులగు రాగాద్వేషాదులు ప్రమాదాలస్యాదులు లోనగునవి మూలముగాఁ గల అధర్మము సైతము వెన్వెంటనే నశించుచున్నది.

అవ. సాత్త్వికోపాసనచే సత్త్వము వర్ధిల్లునని చెప్పబడెను. ఆ సత్త్వవృద్ధికి హేతువులైన తెలపుటకు సామాన్యముగా గుణత్రయవృద్ధి హేతువులను చెప్పుచున్నారు—

శ్లో. ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ,
ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః. 4

అ. సుగమము. ఈ శ్లోకమున 'అపః' కు 'అర్థః' అని పాఠాంతరము.

తా. ఆగమము అనగా శాస్త్రము, జలము (పాఠభేదమునననుసరించి అర్థము) ప్రజ, దేశము, కాలము, కర్మ, జన్మము, ధ్యానము, మంత్రము, సంస్కారము అను నీ పదియు గుణములు మూఁడింటికి హేతువు లగును.

అవ. వీనియందు సాత్త్వికాదుల నిర్ణయమును వచించుచున్నారు—

శ్లో. తత్తత్సాత్త్విక మేవైషాం యద్య ద్వృద్ధాః ప్రచక్షతే,
నిందంతి తామసం తత్త ద్రాజసం యదుపేక్షతే. 5

అ. ఏషాం = వీనిలోపల; యత్ యత్ = దేనిని దేనిని; వృద్ధాః ప్రచక్షతే = పెద్దలు ప్రశంసింతురో; తత్ తత్ = అది అది; సాత్త్వికం ఏవ = సాత్త్విక హేతువే యగును;

నిందంతి = దేనిని దేనిని నిందింతురో; తత్ తత్ తామసం = అది అది తామసమగును; యత్ ఉపేక్షితం = ఏది ప్రశంసింపబడదో; తత్ = అది; రాజసం = రాజసమగును.

తా. వృద్ధులు దేనిని దేనిని ప్రశంసించుచున్నారో అది అది అంతయు సాత్త్వికమగును. దేనిని దేనిని నిందింతురో అది యది తామసమగును. దేనిని దేనిని ప్రశంసించరో అది అది రాజసమగును.

శ్లో. సాత్త్వికాన్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయే,
తతో ధర్మ స్తతో జ్ఞానం యావత్ స్మృతి రపోహనమ్. 6

అ. పుమాన్ = పురుషుఁడు; సత్త్వవివృద్ధయే = సత్త్వగుణవృత్తివృద్ధికై; సాత్త్వికాది ఏవ సేవేత = సాత్త్వికము లగు శాస్త్రాదులనే సేవించవలెను; తతః=అట్టివానివలన, ధర్మః = ధర్మము; తతః = ఆ ధర్మము వలన, యావత్ = ఎంత పర్యంతము; స్మృతిః = ఆత్మ యొక్క అపరోక్ష మైనది; అపోహనం = స్థూల సూక్ష్మ దేహములకు కారణభూతమైన గుణ వృత్తులను తొలగించునట్టి; జ్ఞానం = జ్ఞానము కలుగును.

తా. పురుషుడు సత్త్వగుణవృత్తియొక్క వృద్ధి కొఱకు సాత్త్వికములైన శాస్త్రములనే సేవించవలయును. అనగా నివృత్తి శాస్త్రములనే (జ్ఞానప్రదములు) సేవించవలెను. ప్రవృత్తి పరములను, పాషాండశాస్త్రములను సేవింపగూడదు. పుణ్యతీర్థ జలములనే సేవింపవలెను. గాంధోదకము, సుర మొదలగు వానిని సేవింపగూడదు. అట్లే నివృత్తిపరులగు జ్ఞానులను సేవించవలెను. ప్రవృత్తిపరులగు దురాచారులను సేవింపవలదు. నిర్జనప్రదేశమును సేవించునది. రాజవీథులను, జూదమాడు ప్రదేశములను ప్రవేశింపరాదు. బ్రాహ్మీముహూర్తము లోనగు కాలమును ధ్యానాదికము విషయమై సేవింపవలయును. ప్రదోషమును అర్ధరాత్రిని సేవింపగూడదు. నిత్యమగు కర్మ నాచరించునది. కామ్యములను అభిచారాదులను అనుష్ఠింప గూడదు. వైష్ణవ శైవ దీక్షా లక్షణమైన జన్మమును పొందవలెను. శాక్త క్షుద్ర దీక్షారూపమగు దానిని పొందవలదు శ్రీవిష్ణుధ్యానమును గ్రహించునది. కామినిని, శత్రువులను ధ్యానింప వలదు. ప్రణవాదికమగు మంత్రమును జపింపవలెను. కామ్యక్షుద్రాది మంత్రములను జపింప గూడదు. తన చిత్తసంశోధనము గావింపవలెను. కేవలము దేహ గృహములను శోధింప గూడదు.

అయ్యా! తత్త్వమస్యాది మహా వాక్య శ్రవణము వలననే ఆత్మజ్ఞాన ముద్భవించును గదా! మఱి దానికి సత్త్వవృద్ధితో గాని, ధర్మముతో గాని, ఏమి ప్రయోజనము? అన్నచో ఎప్పటికి ఆత్మాపరోక్షము కలుగునో ఎప్పటికి స్థూల సూక్ష్మ దేహములకు కారణభూతమైన రజస్తమస్సుల గుణవృత్తుల పోకడ కలుగునో అప్పటికి జ్ఞానము కలుగుచున్నది అందువలన పైన పేర్కొన్న లెన్నియగువానిని తప్పక సేవింపవలెనని భావము.

అవ ఓయీ ! గుణముల వ్యతికరము వలన (హెచ్చుతగ్గులు) జనించిన దేహము, స్వాశ్రయభూతములైన గుణములను స్వయముగనే ఉత్పన్నమైన విద్య లేక జ్ఞానముచే నెట్లు పోనడంచి, తాను సైత ముపశమిల్లు ననగా అందుకు చెప్పుచున్నారు—

శ్లో. వేణుసంఘర్షజో వహ్నిః దగ్ధ్వా శామ్యతి తద్వనం,
ఏవం గుణవ్యత్యయజో దేహః శామ్యతి తత్క్రియః. 7

అ. వేణు స ఘర్ష జః వహ్నిః = వెదురుచెట్ల రాపిడివలన జనించిన అగ్ని ఏ ప్రకారము స్వయముగా ఉత్పన్నములైన జ్వాలల చేత; తద్వనం = ఆ వెదురుచెట్ల అడవిని; దగ్ధ్వా = దహించి, శామ్యతి = శమించునో; ఏవం = ఈ విధముగా; గుణవ్యత్యయజః = గుణముల హెచ్చు తగ్గులవలన జనించిన; దేహః = దేహము; తత్క్రియః = ఆ అగ్నికి వలె క్రియా వ్యాపారము అనగా జ్ఞాన వ్యాపారము గలదై; జ్ఞానమును కలిగించి; శామ్యతి = అజ్ఞానము చేత నిర్మూలమై శాంతించుచున్నది.

తా. వెదురుచెట్ల ఒరిపిడి వలన కారుచిచ్చు స్వయముగనే ఉత్పన్నమైన అగ్నిజ్వాలలచే ఆ వెదురుటడవిని పూర్తిగా దహించి, స్వయముగా నెట్లు చల్లారుచున్నదో, అట్లే త్రిగుణముల మాఱుపాటువలన జనించిన దేహము అగ్నివలె తనలో జనించిన జ్ఞానము త్రిగుణములను నిర్మూలించి తానును శమించుచున్నది.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను.

అవ. ఓయీ ! నియతేంద్రియులై సాత్త్విక సేవ చేయుటలో ఇంతమాత్రము పురుషార్థము కలదే, మఱి అటులైనను, రాజసాదులగు విషయ సుఖములను దుఃఖమని ఎఱుంగుచున్న వారయ్యు మర్త్యులు వాని నెట్లు సేవించుచున్నారు ? అని ప్రశ్నించుచున్నారు—

శ్లో. వదంతి మర్త్యాః ప్రాయేణ విషయాన్ పద మాపదాం,
తథాపి భుంజతే కృష్ణ తత్కథం శ్వఖరాజవత్. 8

అ. కృష్ణ ! = ఓ కృష్ణుడా !; మర్త్యాః = మరణ ధర్మము గల నరులు; ప్రాయేణ= తఱచుగా; విషయాన్ = విషయ సుఖములను; ఆపదాం పదం = ఆపదలను గూర్చు స్థానమని విదంతి = ఎఱుంగుదురు; తథాపి = అట్లెఱింగి యుండియు; శ్వ, ఖర + అజవత్ = కుక్క, గాడిద మేక అను జంతువుల వలె; తత్ = ఆ విషయ సుఖమును; కథం భుజంతే = ఎట్లు అనుభవింతురు.

తా. ఓ కృష్ణా ! మానవులు సహజముగా ఇంద్రియసుఖము లెల్ల ఆపదలకు స్థానమని ఎఱింగిన వారలే అగుదురు. అట్లెఱింగినవా రయ్యు కుక్క లెట్లు ఆడుకుక్కచే బెదిరింప బడినవయ్యు ఆ ఆడుకుక్కను వెంబడించుచున్నవో గాడిద లెట్లు, ఆడు గాడిద కాలితన్నులు తగినవగుచును ఆ ఆడుగాడిదను పైకొనుచున్నవో, మేకపోతు లెట్లు వధింప గొనిపోబడు చున్నను, సిగ్గులేనివై ఆడుమేకను పైకొన గమనించుచున్నవో అట్లే విషయసుఖము వలన పలుపాట్లు, శ్రమ కలుగుచున్నను వానిపై దమిచే వానినే ఎట్లు అనుభవించుచున్నారు ?

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

అవ. మిథ్యాభినివేశముచే అనుభవించుచున్నారు అని సహేతుకముగా మూడు శ్లోకములచే చెప్పుచున్నారు —

శ్లో. అహ మి త్యన్యథా బుద్ధిః ప్రమత్తస్య యథా హృది,
ఉత్సర్పతి రజో ఘోరం తతో వైకారికం మనః. 9

అ. ప్రమత్తస్య = వివేకశూన్యుడైన వానికి; అహం ఇతి = దేహాదికము నందు నేనను; అన్యథా బుద్ధిః = మిథ్యాబుద్ధి (అసత్యమగు నిశ్చయము); హృది = హృదయమందు; యథా ఉత్సర్పతి = ఏ ప్రకారము వ్యాపించుచున్నదో; తతః = ఆ అహంబుద్ధి వలన; వైకారికం = సత్త్వప్రధానమైనను; మనః = మనస్సును; ఘోరం = దుఃఖాత్మకమైన; రజః ఉత్సర్పతి = రజోగుణవృత్తి వ్యాపించుచున్నది.

తా. వివేకశూన్యునికి దేహాదికము నేను అను బుద్ధి హృదయమునందు దృఢముగా వ్యాపించుచున్నది. అట్టి అహంబుద్ధి వలన సత్వప్రధానమైనదైనను మనస్సును దుఃఖాత్మకమగు రజోగుణవృత్తి వ్యాపించుచున్నది.

శ్లో. రజోయుక్తస్య మనసః సంకల్పః సవికల్పకః,
తతః కామో గుణధ్యానాద్ దుర్ధరః స్యాద్ధి దుర్మతేః. 10

అ. రజస్ + యుక్తస్య = రజోగుణవృత్తితో గూడిన; మనసః = మనస్సునకు; సవికల్పకః = ఇదియే భోగ్యమను వికల్పముగల; సంకల్పః=సంకల్పము కల్గును; తతః = ఆ సంకల్పమువలన; గుణధ్యానాత్ = ఔరా! ఎట్టి రూపము, ఔరా ఎట్టి భావము అనుదాని గుణములను ధ్యానించుటవలన; దుర్మతేః = దుష్టబుద్ధికి; దుర్ధరః కామః స్యాత్ = దుర్భరమైన కామము కలుగును.

తా. రజోగుణవృత్తితో గూడిన మనస్సునందు స్త్రీవిత్తాదికము నాకు భోగ్యవస్తు వను వికల్పరూపమగు సంకల్పము కలుగును. దానివలన ఔరా! స్త్రీ ఎంత చక్కనిది? ఔరా దీని ప్రేమ ఎంతటిది? అని దాని గుణములను ధ్యానించుట వలన దుష్టబుద్ధి కలవానికి భరింపరాని కామను కలుగును.

శ్లో. కరోతి కామవశగః కర్మాణ్యవిజితేంద్రియః,
దుఃఖోదరాణి సంపశ్యన్ రజోవేగవిమోహితః. 11

అ. కామవశగః = కామమునకు లోనైనవాడు; అవిజిత + ఇంద్రియః = గెలువని ఇంద్రియములు కలవాడై; దుఃఖ + ఉదరాణి సంపశ్యన్ = ఉత్తరకాలమున దుఃఖము నిచ్చునవని చూచుచు, తెలిసినవాడగుచు; రజోవేగవిమోహితః = రజోగుణ వృత్తి యొక్క వేగమున మోహమును పొంది; కర్మాణి కరోతి = కాముకుని కర్మలు చేయుచున్నాడు.

తా. కామమునకు లోనైనవాడును, ఇంద్రియములను గెలువనివాడునై రజోగుణవృత్తి వేగముచే మోహమును పొంది, ఉత్తరకాలమున ఇవి దుఃఖమును కల్గించునవని తెలిసియు, అట్టి కాముకకర్మలు చేయుచున్నాడు.

శ్లో. రజస్తమోభ్యాం యదపి విద్వాన్ విక్షిప్తధీః పునః,
అతంద్రితో మనో రుంధన్ దోషదృష్ట్యా న సజ్జతే. 12

అ రజస్తమోభ్యాం = రజస్తమస్సులచే; విక్షిప్తధీః యదపి = ఆవరింపబడి మూఢమైన చిత్తము కలవాడైనప్పటికిని; పునః = మరల; విద్వాన్ = వివేకవంతుడు; అతంద్రితః = తొట్రుపాటులేనివాడై; దోషదృష్ట్యా = స్త్రీలోనగు వాని దోషపు చూపుచే; మనః + రుంధన్ = మనస్సును అరికట్టుచు; న సజ్జతే = ఆ భోగ్య వస్తువులందు ఆసక్తుడు కాడు.

తా. రజస్తమోగుణవృత్తు లావరించి చిత్తము మూఢమై ఆకర్షించుచున్నను వివేకవంతుడు మాత్రము తొట్రుపడనివాడై స్త్రీలోనగు భోగ్యవస్తువులందు దోషదృష్టి నిడి వానియందు ఆసక్తుడు కాడు.

అవ. విషయసుఖములందు దోషదృష్టిచే మనోనిగ్రహము నందు సమర్థుడు కాని వాడగుచో సుఖముగా మనోనిగ్రహమునకు ఉపాయము చెప్పుచున్నారు—

శ్లో. అప్రమత్తో ఒనుయుంజీత మనో మయ్యర్పయన్ శనైః,
అనిర్విణ్ణో యథాకాలం జితశ్వాసో జితా సనః. **13**

అ. అప్రమత్తః = జాగరూకుడై; హెచ్చరిక గలవాడై; అనిర్విణ్ణః = అనలసుడై సోమరితనము లేనివాడై. సకాలమునకు త్రిషవణస్నానము, ప్రాతర్మధ్యాహ్న సాయంకాలము లందు స్నానము చేయుచు; శనైః = మెల్లగా; మయి = పరమానంద రూపుడైన నాయందు; మనః అర్పయన్ = మనస్సును సమర్పించుచు; జితశ్వాసః = ప్రాణాయామపరుడై; జితాసనః = స్థిరాసనుడై ... ...

తా. ఏమఱుపాటు లేక సోమరితనము వీడినవాడై ఉచ్ఛ్వాస నిశ్శ్వాసముల నిరోధించుచు ప్రాణాయామపరుడై పద్మాసన పీఠాసనాది ఆసనములందు తడవుకాలము కూర్చుండుచు మెల్లగా పరమానంద రూపుడైన నాయందు మనస్సును సమర్పింపవలెను. సమాధానము చేయవలెను.

అవ. విషయసుఖములతో దిటవుగా కూడుకొన్న మనస్సునకు వాని పీడ్పాటుచే ఈశ్వరునందు నిష్ఠతో మనస్సమాధానము కావించుట సాధ్యము కాదని తలంచుచున్న వానిని గూర్చి ఆ ఈశ్వరనిష్ఠను నిరూపించుట కొఱకు ఇతిహాసమును గోచరింప జేయుచున్నాడు—

శ్లో. ఏతావాన్ యోగ ఆదిష్టః మచ్ఛిష్యైః సనకాదిభిః,
సర్వతో మన ఆకృష్య మ య్యద్ధా ఒఽ వేశ్యతే యథా. **14**

అ. సర్వతః = అన్ని విషయముల నుండి; ఆకృష్య = ఆకర్షించి; మనః = మనస్సు; యథా = ఏ ప్రకారము; అద్ధా = స్థిరముగా; ఆవేశ్యతే = ఉంచబడునో; ఏతావాన్ = ఇంత మాత్రమగు; యోగః = ధ్యానయోగము; మత్ + శిష్యైః; సనక + ఆదిభిః = నా శిష్యులగు సనకాదుల చేత; ఆదిష్టః = ఆదేశింపబడినది. నాచే చెప్పబడినది.

తా. జ్ఞానమార్గ ప్రవర్తకులగు నా శిష్యులు సనకసనందనాదులు ఎల్లవిషయ సుఖముల నుండి మనస్సును ఏ ప్రకారము ఆకర్షించి నా యందు సమాధానము చేయవలెనో అట్టి ధ్యానయోగము గూర్చి వారు నన్ను అడుగగా పూర్వము నేను ఆ యోగమును చక్కగా చెప్పియున్నాను.

అవ. నా శిష్యులచే నని చెప్పుటచే కడుంగడు వయస్సున పెద్దలైన వారికి ఈ రూపున యోగ నిరూపణ మసంభవమగుట వలన ప్రశ్నించుచున్నారు—

శ్లో. యదా త్వం సనకాదిభ్యో యేన రూపేణ కేశవ,
యోగ మాదిష్టవా నేత ద్రూప మిచ్ఛామి వేదితుమ్. **15**

అ కేశవ = ఓ కృష్ణా ! ; యదా = ఎప్పుడు; త్వం = నీవు; సనకాదిభ్యః = సనకాదులకు; యేన రూపేణ = ఏ రూపముచే; యోగం ఆదిష్టవాన్ = యోగమును ఆదేశించితివో; ఏతత్ రూపం = ఈ రూపమును; వేదితుం = తెలిసికొనుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. ఓ కృష్ణా ! నీవు ఎప్పుడే రూపమున సనకాదులకు నీ ధ్యానయోగమును ఉపదేశించితివో ఆ రూపము నెఱుంగగోరుచున్నాను.

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీ కృష్ణుడు వచించెను.

శ్లో. పుత్రా హిరణ్యగర్భస్య మానసా స్సనకాదయః,
పప్రచ్ఛుః పితరం సూక్ష్మం యోగ స్యైకాంతికీం గతిమ్. **16**

అ. హిరణ్యగర్భస్య = బ్రహ్మయొక్క; మానసాః పుత్రాః = మానస పుత్రులు; మనస్సంకల్పమున జనించినవారగు; సనకాదయః = సనక సనందనాదులు; పితరం = తండ్రిని; యోగస్య = ధ్యానయోగము యొక్క; సూక్ష్మం = మిక్కిలి తెలియ శక్యము గానిదైన; ఐకాంతికీం, గతిం = అనన్యమైన గతిని పరాకాష్ఠను గూర్చి; పప్రచ్ఛుః = అడిగిరి.

తా. బ్రహ్మదేవుని మానసపుత్రులు సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను నలువురు తండ్రిని చేరి ఒకనాడు నా ధ్యానయోగము యొక్క సూక్ష్మమైన ఏకాంతమైన గతియైన పరాకాష్ఠను, పరమావధిని గూర్చి ప్రశ్నించిరి.

సనకాదయః ఊచుః = సనకాదులు వచించిరి.

శ్లో. గుణే ష్వావిశతే చేతో గుణా శ్చేతసి చ ప్రభో,
కథ మన్యోన్యసంత్యాగో ముముక్షో రతితితీర్షోః. **17**

అ ప్రభో = ఓ ప్రభూ !; గుణేషు = స్వభావముగనే రాగాదివశమున ఏ విషయములందు; చేతః ఆవిశతే = చిత్తము ప్రవేశించుచున్నదో; గుణాః చేతసి చ = ఆ అనుభూతమైన విషయములు వాసనారూపమైన చిత్తమందు ప్రవేశించుచున్నవో; అతితితీర్షోః = వానిని మిక్కిలి తరింపగోరు; ముముక్షోః = మోక్షేచ్ఛ గలవానికి; అన్యోన్య సంత్యాగః = వాని పరస్పర దూరీకరణము; కథం = ఎట్లు ? చెప్పుము.

తా. ఓ లోకేశ్వరా ! చిత్తము విషయరూపములైన గుణములందు అనురాగ వశమున చొరబడుచున్నవి. ఆ విషయములు సైతము వాసనారూపమగు చిత్తము నంగు చొచ్చుచున్నవి. వాని యొండొండు వీడ్పాటు ఎట్లు కలుగునో చెప్పుము.

శ్లో. ఏవం పృష్టో మహాదేవః స్వయంభూః భూతభావనః,
ధ్యాయమానః ప్రశ్నబీజం నాభ్యపద్యత కర్మధీః. **18**

అ. ఏవం పృష్టః = ఈ ప్రకారము సనకాదులచే ప్రశ్నింపబడినవాడై; మహాదేవః = దొడ్డవేల్పు; స్వయంభూః = స్వయముగ అవతరించిన బ్రహ్మ; భూతభావనః = ప్రాణులను సృజించువాడు నైతము, ధ్యాయమానః = చాల తడవు విచారించినవాడయ్యు: ప్రశ్నబీజం = ఎఱుఁగమివలన ప్రశ్న కారణమును; కర్మధీః = సృష్టిక్రియయందు చలించు బుద్ధికలవాడు; న + అభ్యపద్యత = పొందలేదు, ఎఱుంగనివాడయ్యెను.

తా. ఇట్లు సనకాదులు ప్రశ్నించిన విని ఆ దొడ్డవేల్పు స్వయముగా జనించిన వాడు, ప్రాణుల సృష్టికర్తయయ్యును, బ్రహ్మ చాలా సేపు చింతించియు, ఆ ప్రశ్నకు తగిన ప్రత్యుత్తరమును సృష్టిక్రియ యందు విక్షిప్తమైన చిత్తము కలవాడైనందున ఎఱుంగ నేరదయ్యెను.

శ్లో. స మా మచింతయ ద్దేవం ప్రశ్నపారతితీర్షయా,
తస్యాహం హంసరూపేణ సకాశ మగమం తదా. **19**

అ. సః = ఆ బ్రహ్మ; ప్రశ్నపార తితీర్షయా = ప్రశ్నకు నుత్తరమును దాటగోరి; అభిప్రాయము నెఱుంగు కోరికచే; మాం దేవం అచింతయత్ = దేవుడనగునన్ను చింతించెను; అహం = నేను; హంసరూపేణ = హంసరూపముతో క్షీరనీరములను వేఱుచేయ సమర్థమైనది హంసయే కనుక అట్లే విషయచిత్తములను తెల్పుటకు; తదా = అప్పుడు; తస్య సకాశం అగమం = అతని సామీప్యమును పొందితిని.

తా. ఆ ప్రశ్న పారమును దాటగోరి ఉత్తరమును తెలియగోరి ఆ బ్రహ్మ నన్ను చింతించెను. పాలు నీరు వేరు పరుచుటకు హంస ఎట్లు సమర్థమో ఆ హంస రూపమున విషయ చిత్తములను తెల్పుటకు నేను బ్రహ్మ చెంతకు వచ్చితిని

శ్లో. దృష్ట్వా మాం త ఉపవ్రజ్య కృత్వా పాదాభివందనం,
బ్రహ్మాణ మగ్రతః కృత్వా పప్రచ్ఛుః కో భవానితి. **20**

అ. తే = ఆ సనకాదులు; మాం దృష్ట్వా = నన్ను చూచి; ఉపవ్రజ్య = సమీపించి: పాదాభివందనం = పాదనమస్కారమును; కృత్వా = చేసి; బ్రహ్మాణం అగ్రతః కృత్వా = బ్రహ్మను ముందిడుకొని; భవాన్ కః ఇతి పప్రచ్ఛుః = నీవు ఎవడవని ప్రశ్నించిరి.

తా. సనకాదులు నన్నుగాంచి పజ్జచేరి పాదాభివందనము ఆచరించి బ్రహ్మను ముందిడుకొని నన్ను చూచి నీ వెవడవని ప్రశ్నించిరి.

శ్లో. ఇత్యహం మునిభిః పృష్టః తత్త్వజిజ్ఞాసుభి స్తదా,
య దవోచ మహం తేభ్య స్త దుద్ధవ నిబోధ మే. **21**

అ. ఇతి = ఈ విధముగా; తత్త్వజిజ్ఞాసుభిః = తత్త్వమును తెలియగోరిన; మునిభిః = సనకాదులచే; తదా పృష్టః = అప్పుడు ప్రశ్నింపబడినవాడనై; అహం = నేను; తేభ్యః = వారలకు; యద్ అవోచం = ఏమి చెప్పితినో; ఉద్ధవ = ఓ ఉద్ధవా; తత్ మే నిబోధ = దానిని నావలన తెలిసికొనుము.

తా. ఇట్లు బ్రహ్మ తత్వ మెఱుంగ గోరు ఆ సనకాదిమునులు నన్ను ప్రశ్నింప వారలకు నేను అప్పుడు ఏమి బదులు చెప్పితినో దానిని నీవు ఇప్పుడు నా వలన తెలిసికొనుము.

ఆవ. దేహాదికమునకు భిన్నమైన ఆత్మజ్ఞానము కలిగినచో రాగాదిక మసంభవ మగుచున్నందున స్వయముగనే విషయ చిత్తములకు విశ్లేషము భేదము కలుగుచున్నదని చెప్పుటకు వారి ప్రశ్నను ఖండించు నెపముననే అప్పుడు అత్మానాత్మ వివేకమును చెప్పు చున్నారు—

శ్లో. వస్తునో య ద్యనానాత్వ మాత్మనః ప్రశ్న ఈదృశః,
కథం ఘటేత వో విప్రాః వక్తు ర్వా మేక ఆశ్రయః. **22**

అ. విప్రాః = ఓ బ్రాహ్మణులారా! ఈదృశః ప్రశ్నః = మీరడిగిన ఇటువంటి ప్రశ్న; ఆత్మనః యది = ఆత్మను గూర్చియు, దాని ఉపాధి యగు భూతసంగమును గూర్చియు అయినదగుచో, వస్తునః = పరమార్థవస్తువగు దానికి, అనానాత్వం = వైవిధ్యము సంభ వించుచున్నది, కాబట్టి సర్వాత్మకమై ఏకమైన ఆత్మను నీవెవడవని ప్రశ్నించుట సరికాదు; వః = మీచే అడుగబడిన ప్రశ్న; ఈదృశః = పెక్కింటియందు నిర్ధారణరూపమైనది; కథం ఘటేత = ఎట్లు పొసగును; వాం = మీకు; వక్తుః = ఉత్తరము వచించు; మే = నాకు; కః ఆశ్రయః = అవిశేషమైన ఆత్మ యందు ఏది ఆశ్రయము కలదు. ఏ జాతి గుణ విశేషము నాశ్రయించి ఉత్తర మీయగలను.

తా. ఓ విప్రులారా! మీరు నీ వెవడవని నన్ను అడిగిన ప్రశ్న ఆత్మను గూర్చినదా? లేక ఆత్మ కుపాధి భూతమైన ఈ దేహధారులగు భూతసంఘమును గూర్చినదా? ఆత్మను గూర్చిన దైనచో ఆత్మ పరమార్థ వస్తువు. అద్దానికి నానాత్వము లేదు. అట్లగుచో మీ ప్రశ్నము పెక్కు విషయములందు నిర్ధారణరూపమును బొరయుచున్నది. అట్టి ప్రశ్న యొక్కదాని కెట్లు ఘటిల్లును? మీకు త్తరమును నేను దేని నాశ్రయించి నిర్విశేషమైన ఆత్మ యందు ఏ జాతి గుణ విశేషముల నాశ్రయించి ప్రత్యుత్తర మీయగలను?

శ్లో. పంచాత్మకేషు భూతేషు సమానేషు చ వస్తుతః,
కో భవా నితి వః ప్రశ్నో వాచారంభో హ్యనర్థకః. **23**

అ. పంచాత్మకేషు = పంచభూతముల స్వరూపములైన; భూతేషు = దేవ మనుష్యాది దేహములు; సమానేషు = విభిన్నములై యుండగా; వస్తుతః = పరమ కారణస్వరూపమును బట్టి; సమానేషు = అభిన్నములై యుండగా; కః భవాన్ + ఇతి = నీవెవడవను; వః ప్రశ్నః = మీ ప్రశ్న; వాచా + ఆరంభః = కేవలము వాక్కుచే మాత్రము పేర్కొనదగినదై; అనర్థకః హి = అర్థము లేని దగుచున్నది.

శ్రుతి. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం.

మృద్వికారమగు ఘట శరావాదికము యొక్క నామధేయము కేవలము వాగ్వ్యవహార గోచరమగును. గాని మృత్తికయే సద్వస్తు వగును.

తా. పంచభూతముల మిశ్రమములై వర్ధిల్లు ఈ దేవ మనుష్యాదుల దేహము లన్నియు భూతాదుల్లను బట్టి సమానములు. అభిన్నములు. అట్లే పరమార్థమును బట్టి చూచినను అన్నింటి యందు పరమాత్మ ఒక్కడై యున్నందున అన్నియు పరమాత్మ కారణముగా గలవి, కనుక

అట్లు చూచినను అభిన్నములు. ఏవిధమున చూచినను నీ వెవడవను మీప్రశ్నము కేవలము వాక్కుచే గోచరించు నామము గలదై అనర్థక మగుచున్నది. కావున భూత సంఘ విషయమునకు మీప్రశ్న సరి గాదని భావము.

అవ. అందు భూతములు పంచ భూతాత్మకము లనుట ప్రత్యక్షాది సిద్ధమే యై యున్నది. అని పరమకారణాభేదము నుపపాదించుచున్నారు—

శ్లో. మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యై రపీంద్రియైః,
అహమేవ న మత్తోన్య దితి బుధ్యధ్వ మంజసా. **24**

అ. మనసా, వాచా, దృష్ట్యా = మనస్సుచే వాక్కుచే చక్షురాదింద్రియములచే; అన్యైః ఇంద్రియైః అపి = ఇతరములగు ఇంద్రియముల చేతను; గృహ్యతే = మనచే ఏదేది గ్రహింప బడుచున్నదో; అయా అది; అహం ఏవ = నేనే; మత్తః న అన్యః = నా కంటె ఇతరము కాదు లేదు అని; అంజసా = తత్త్వ విచారములో; బుధ్యధ్వం = ఎఱుంగుడు.

తా. మన మెల్లరము మనస్సు, వాక్కు, చక్షువు లోనగు వాని చేతను ఇతరములగు శ్రోత్రాదులగు ఇంద్రియముల చేతను ఏ ఏ శబ్దాది విషయముల నెఱుంగుచున్నామో అది యంతయు నేనే. నా కంటె నితర మేదియు లేదని తత్వవిచారము చేసి గుర్తెఱుంగుడు. ఇట్లనుటచే నేను సర్వాత్మకుడనని తత్త్వరూపమగు నుత్తరము చెప్పిన ట్లగుచున్నది.

అవ ఈ ప్రకారము ప్రశ్నను ఖండించు నెపమున ఆత్మస్వరూపమును సామాన్యముగా నిరూపించి మిక్కిలి పరిహరింప శక్యముగాని బ్రహ్మము గూర్చి ప్రశ్నించిన దానికి నుత్తర మును జెప్పుచున్నారు. (అధ్యాయ సమాప్తి పర్యంతము)

శ్లో. గుణే ష్వావిశతే చేతో గుణా శ్చేతసి చ ప్రజాః,
జీవస్య దేహ ఉభయం గుణా శ్చేతో మదాత్మనః. **25**

అ. ప్రజాః = ఓ పుత్రకులారా!; చేతః = చిత్తము; గుణేషు ఆవిశతే = గుణము లందు ప్రవేశించుచున్నది; గుణాః చేతసి = గుణములు చిత్తము నందు ప్రవేశించుచున్నవి; గుణాః చేతః ఉభయం = గుణములు, చిత్తము ఈ రెండును; మత్ + ఆత్మనః = నా స్వరూప మైన బ్రహ్మ స్వరూపమైన; జీవస్య = జీవునికి; దేహః = దేహము; అధ్యస్తమైన ఉపాధి యగును. స్వరూపము గాదు.

తా. ఓ పుత్రులారా! చిత్తము సత్త్వాది గుణములందు, సత్త్వాది గుణములు చిత్తము నందును పరస్పరము చొచ్చియున్నవి ఈ చిత్తము, గుణములు రెండును నా స్వరూపమై బ్రహ్మస్వరూపమైన జీవునికి దేహము లేక అధ్యస్తమగు నుపాధి అగును. కాని స్వరూపము కాదు.

ఈ శ్లోకమందు అభిప్రాయమిది.

కర్తృత్వ భోక్తృత్వాది రూపమున విషయములతో సమకూడిన చిత్తము బుద్ధ్యాది వాచ్యమై జీవుని స్వరూపమగునేని పదంపడి దాని వియోగము ఘటిల్లదు. జీవుని స్వరూప

మన్నను బ్రహ్మకు చిత్తాధ్యాసము చేతను, దాని స్వభావము కల్గుటచేతను విషయములతో జీవుడు సమకూడుట సంభవించును. అందువలన స్వస్వరూపమగు బ్రహ్మమును భావన చేయుటచేతను, విషయములు మిథ్యలని అనుసంధానము కావించుటచేతను, ఎల్లవానియందు నిర్వేదము పొంది భగవంతుని భజించువానికి పరిపూర్ణ స్వరూపావస్థానము కలుగుచున్నది.

శ్లో. గుణే ష్వావిశతే చిత్త మభీక్ష్ణం గుణసేవయా,
గుణాశ్చ చిత్తప్రభవా మద్రూప ఉభయం త్యజేత్. **26**

అ. అభీక్ష్ణం = మఱి మఱి; గుణసేవయా = సత్త్వాది గుణముల సేవనము చేత; చిత్తం = చిత్తము; గుణేషు ఆవిశతే = వాని సంస్కారముచే గుణములందు ప్రవేశించుచున్నది; గుణాః చిత్తప్రభవాః = ఆసత్త్వాది గుణములు వాసనారూపములని చిత్తమునందు అధికముగా ఉనికి కాంచుచున్నవి; ఉభయం = చిత్తమును, గుణములను రెంటిని; మద్రూపః సన్ = నా స్వరూపము గలవాడగుచు; త్యజేత్ = త్యజింపవలెను.

తా. మఱి మఱి సేవించుటవలన చిత్తము సత్త్వాది గుణములందు చొచ్చుచున్నది. ఆ సత్త్వాది గుణములును, వాసనారూపమున చిత్తమునం దధికముగా పొడమి యుండుచున్నవి. కావున సాధకుడు బ్రహ్మస్వరూపమగు నా రూపమును పొంది ఆ రెండింటిని త్యజింపవలెను.

అవ. ఓయీ! జాగ్రత్స్వప్నాద్యవస్థలు గల జీవునికి కూటస్థ స్వరూపము కలుగుట ఎట్లనగా దానికి చెప్పుచున్నారు—

శ్లో. జాగ్రత్స్వప్నస్సుషుప్తిశ్చ గుణతో బుద్ధివృత్తయః,
తాసాం విలక్షణో జీవః సాక్షిత్వేన వినిశ్చితః. **27**

అ. జాగ్రత్, స్వప్నః, సుషుప్తిః = మేల్కాంచిన స్థితి, కల, నిద్ర అనువవి మూడును, బుద్ధివృత్తయః = బుద్ధి యొక్క వృత్తులై యున్నవి. అవి జీవునకు స్వాభావికములు గావు. అట్లే చెప్పబడినది.

సత్త్వా జ్జాగరణం విద్యా ద్రజసా స్వప్న మాదిశేత్,
ప్రస్వాపం తమసా జంతో స్తురీయం త్రిషు సంతతమ్.

ఈ ప్రాణికి సత్త్వగుణము వలన జాగ్రదవస్థ కలుగునని చెప్పవలెను. రజోగుణము చేత స్వప్నము కల్గునని చెప్పవలెను. తమోగుణము చేత సుషుప్తి కల్గును. ఈ మూడవస్థలందును తురీయమును సంతత మున్నట్లు తెలియవలెను.

ఈ చెప్పబోవు క్రమమును బట్టి సత్త్వాది గుణము వలననే ఆ అవస్థా రహితుడనియే విని శ్చితము. ఎందువలన ? జీవః తు = జీవుడన్ననో; తాసాం విలక్షణః = ఆ మూడవస్థలకు వేఱై; సాక్షిత్వేన వినిశ్చితః = సాక్షిగ నుండునని నిశ్చయింపబడినది.

తా. సత్త్వ రజస్తమోగుణముల వలన క్రమముగా కలుగు జాగ్రత్స్వప్న సుషుప్తు లను మూడవస్థలు బుద్ధియొక్క వృత్తులై ఉన్నవి. జీవుడైనచో ఆ అవస్థాత్రయ రహితుడై ఆ అవస్థలకు సాక్షియై యుండువాడని వేదాంతములందు నిశ్చయింపబడినది.

శ్లో. యర్హి సంసృతిబంధోఽ య మాత్మనో గుణవృత్తిదః,
మయి తుర్యే స్థితో జహ్యాత్ త్యాగ స్తద్గుణచేతసామ్. **28**

అ. యద్ధి = ఎందువలన, అయం సంసృతిబంధః = ఈ సంసారబంధము (చక్కగా దీనిచే జరగవది కనుక సంసృతి అనగా బుద్ధి. దీనిచే నగు బంధము.) ఆత్మనః = జీవునికి; గుణవృత్తిదః = గుణములను వృత్తులను ఇచ్చుచున్నది అందువలన; తుర్యే మయి = అవస్థా త్రయమునకు అతీతుడు, తురీయుడగు నాయందు; స్థితః జహ్యాత్ = ఉండుచు, ఆ బంధమును విడను; తత్ గుణచేతసాం = అప్పుడు గుణములకు చిత్తమునకును; త్యాగః = పరస్పర త్యాగము కలుగుచున్నది.

తా. ఏది ఈ సంసారమును జరుపుచున్నదో అది సంసృతి అనగా బుద్ధి. ఈ బుద్ధి తోడి బంధము జీవునికి గుణవృత్తుల నిచ్చుచున్నది. ఆ బుద్ధి వలన జీవుడు తాను అవస్థా త్రయమునకు అతీతుడు, తురీయుడనైన నాయందు ఉనికి గాంచి, ఆ బంధమును విడు చన్నాడు. అప్పుడు గుణములకు చిత్తమునకు పరస్పరము విడ్పాటు కలుగుచున్నది.

అవ. దీని నెట్లు విడనగు ననగా చెప్పుచున్నారు —

శ్లో. అహంకారకృతం బంధ మాత్మనోఽ ర్థవిపర్యయం,
విద్వాన్ నిర్విద్య సంసారచింతాం తుర్యే స్థితః త్యజేత్. 29

అ. అహంకార కృతం = అహంకారముచే నైన; బంధం = సంసారబంధమును; ఆత్మనః = తనకు జీవునికి; అర్థ విపర్యయం = ఆనందాదికము నావరించుటచేత అనర్థ కారణ మైన దానిని; విద్వాన్ నిర్విద్య = విద్వాంసుడు దుఃఖ మిది యని తెలిసి; తుర్యే స్థితః = తురీయావస్థయం దుండుచు; సంసారచింతాం = సంసారమగు బుద్ధి యందలి అభిమానమును ధ్యానిచే నగు భోగచింతను కూడ; త్యజేత్ = విడవలెను,

తా. అహంకారముచే నేర్పడిన సంసారబంధము తనకు (జీవునికి) ఆనందాదికము నావరించి అనర్థము తెచ్చిపెట్టుననియు ఈ బంధము దుఃఖరూపమనియు తెలిసినవాడై విద్వాం సుడు తురీయస్వరూపు డగుచు సంసారబుద్ధి యందలి అభిమానమును దానిచే నగు భోగా సక్తిని విడవలెను.

అవ. ఎంతవరకు ఈ భోగాదిచింతను విడడో అంతవరకు ఈతని కర్మజ్ఞానములు సర్వము వ్యర్థ మనుచున్నారు—

శ్లో. యావ న్నానార్థధీః పుంసో న నివర్తేత యుక్తిభిః,
జాగ్రత్యపి స్వప న్నజ్ఞః స్వప్నే జాగరణం యథా. 30

అ. యావత్ = ఎంత పర్యంతము; పుంసః = పురుషునికి; నానార్థధీః = వివిధ విషయ ములందు ఆసక్తి; యుక్తిభిః = శాస్త్ర ప్రమాణములచే; న నివర్తేత = నివర్తించవో; స్వప్నే = స్వప్నావస్థ యందు; జాగరణం యథా = జాగరణ స్థితి వలె; జాగ్రత్యపి = జాగ్ర ద్దశ యందును; అనగా కర్మాదులందు; అజ్ఞః = సమ్యగ్దర్శి కానివాడు; స్వపన్ = కలలు గాంచుచుండును.

తా. ఎంత పర్యంతము పురుషునికి వివిధ విషయములం దాసక్తి గల బుద్ధి శాస్త్రోక్త ప్రమాణములచే నివృత్తము కాదో అంత పర్యంతము జాగ్రద్దశ యందలి కర్మలందును,

స్వప్నమున జాగ్రద్వ్యవహారము కన్నట్లు సమ్యగ్దర్శి కానివాడై అజ్ఞుడై కలలు గాంచినట్లు ప్రవర్తించుచుండును.

అవ. ఓయీ! వేదప్రమాణబద్ధమైన వర్ణాశ్రమకర్మాదులందు వివిధ బుద్ధులను ఎట్లు నివర్తింపనగును అనగా చెప్పుచున్నారు—

శ్లో. అసత్త్వా దాత్మనోఽ న్యేషాం భావానాం తత్కృతా భిదా,
గతయో హేతవ శ్చాస్య మృషా స్వప్నదృశో యథా. **31**

అ. ఆత్మనః = జీవునికి; అన్యేషాం = తనకంటె ఇతరములైన; భావానాం = దేహాదుల యొక్కయు; తత్కృతా = ఆ దేహాదులచే నేర్పడిన; భిదా = వర్ణాశ్రమాది భేద రూపము; గతయః = స్వర్గాది ఫలములును; హేతవః = వానికి హేతువులైన యాగాది కర్మలును; అసత్త్వాత్ = సత్త్వములు కాని వగుట వలన; అస్య = ఈ ఆత్మకు; స్వప్నదృశః యథా = కలను గాంచువానికి వలె; మృషా = మిథ్య యగును; వేదము అవిద్యావంతునకు విషయమైనదని భావము.

తా. జీవునికి ఇతరములైన దేహాదులును వానిచే నేర్పడిన వర్ణాశ్రమ కర్మాది భేదములును అసత్తులగుట వలన స్వర్గాది ఫలములును, వానికి కారణములగు యాగాదికర్మలును స్వప్నదర్శికి వలె మిథ్యలగును. వేదము అవిద్యావంతులకు లేక అజ్ఞులకు విషయమైనదని భావము.

శ్లో. యో జాగరే బహి రనుక్షణధర్మిణోఽర్థాన్
భుంక్తే సమస్తకరణై ర్హృది తత్సదృక్షాన్,
స్వప్నేఽ థ సుప్త ఉపసంహరతే స ఏకః
స్మృత్యన్వయా త్త్రిగుణవృత్తిదృ గింద్రియేశః. **32**

అ. యః = ఎవడు; జాగరే = జాగ్రదవస్థ యందు; బహిః = బాహ్యములై కనుపట్టు; అనుక్షణధర్మిణః = ప్రతిక్షణము మారుచుండు క్షణికములైన బాల్య యౌవనాది ధర్మములు గల; అర్థాన్ = స్థూల దేహాదులను; సమస్తకరణైః = చతురాదులగు సర్వేంద్రియముల చేత; భుంక్తే = అనుభవించుచున్నాడో; యః = ఎవడు; స్వప్నే = స్వప్నదశ యందు; హృది = హృదయమందు; తత్ సదృక్షాన్ = జాగ్రద్దశ యందు గాంచిన వానితో సాటియైన వానిని; వాసనా మయములను; భుంక్తే = అనుభవించుచున్నాడో; అథ = తరువాత; యః = ఎవడు; సుప్తే = సుషుప్తి యందు; ఉపసంహరతే = వానిన్నింటిని ఉపసంహరించుచున్నాడో; సః ఏకః = అతడొక్కడే, ఏలయన త్రిగుణవృత్తి దృక్ = అవస్థాత్రయ ద్రష్టయు; ఓయీ! జాగ్రదవస్థను సర్వేంద్రియములు చూచును. స్వప్నమును మనస్సు చూచును. సుషుప్తిని తత్సంస్కార విశేషమగు బుద్ధి గాంచును. కాబట్టి ఆత్మ ఎట్లు ద్రష్ట యగును అనగా ఇంద్రియ + ఈశః = ఇంద్రియనియామకుడై యున్నాడు. ఓయీ! ఇంద్రియేశులైనను విశ్వతైజస ప్రాజ్ఞులు భిన్నులగుదురు కదా; అట్లైన కారు, ఏలన; స్మృతి అన్వయాత్ = స్మరణశక్తిచే నెల్ల యవస్థలందును అన్వయించుటవలన; యః = ఏ నేను స్వప్నములను చూచితిని. ఏ నేను తరువాత సుషుప్తి యందు ఏ ఇంచుకయు నెఱుంగకుంటిని. ఆ ఈ

నేనే ఇప్పుడు మేల్కనుచున్నాను. అని ఉపాధిభేదముచే విశ్వాదివ్యవహారము అని భావము. దానిచే బాల్యయువాద్యవస్థలందును ప్రతిసంధానము ద్రష్టవ్య మగును.

ఎవడు జాగ్రదవస్థయందు బాహ్యములై తోచుచు, అనుక్షణము మారుచుండు బాల్య యౌవనాది ధర్మములు, స్థూలదేహాదులను అనుభవించుచున్నాడో, ఎవడు స్వప్నమునందు హృదయమునందు జాగ్రదవస్థయందు గాంచిన స్థూలదేహాదులకు సాటియైన వానిని వాసనా మయములైన వానిని గాంచుచు అనుభవించుచున్నాడో ఎవడు సుషుప్తి యందు ఈ అన్నింటిని ఉపసంహరించుచున్నాడో, అతడు ఒక్కడే అగును. అనగా ఆ ముగ్గురు ఒక్కరే యగుదురు అనుట.

తా. జాగ్రదవస్థను ఇంద్రియములు, స్వప్నమును మనస్సు, సుషుప్తిని తత్సంస్కార విశేషబుద్ధి చూచినట్లు కన్పట్టినను, ఈ అవస్థాత్రయ సాక్షియైన ఆత్మ ఒక్కడే అగును. ఏల యన అతడు ఇంద్రియములను నియమించువాడు. మఱి ఇంద్రియేశు డగుచు, ఈ మూడవస్థ లందు విశ్వతైజస ప్రాజ్ఞులని భిన్నులుగా కన్పట్టినను ఆ ముగ్గురు ఒక్కరే అగుదురు. స్మరణ మనుసంధానము చేయుట వలన నేను స్వప్నమునందు అనేక వస్తువులను గాంచితిని. తర్వాత నిద్రావస్థయందు నే నేమియు నెఱుంగకుంటిని. మఱి ఇప్పుడు జాగ్రదవస్థ యందు మేల్కాంచి అన్నింటిని చూచుచున్నారు. అని యిట్లు స్మరించుచు నుండుటం బట్టి ఆత్మ ఒక్కడే ఉపాధి భేదముచే విశ్వతైజస ప్రాజ్ఞాది వ్యవహార గోచరు డగుచున్నాడు. అన్యుడు కాడు. దానిచే బాల్య తారుణ్యాద్యవస్థలందును, స్మరణ ప్రతి సంధానముచే ఆత్మ యొక్కడే యని తెలియనగును.

అవ. అందువలన నేమి ఏర్పడినదనగా చెప్పుచున్నారు.—

శ్లో. ఏవం విమృశ్య గుణతో మనస స్త్ర్యవస్థా
మన్మాయయా మయి కృతా ఇతి నిశ్చితార్థాః,
సంఛిద్య హార్ద మనుమాన సదుక్తి తీక్ష్ణ
జ్ఞానాసినా భజత మాఽఖిలసంశయాధిమ్. 33

అ. ఏవం = ఈ ప్రకారము; గుణతః = త్రిగుణమువలన గలిగిన; మనసః = మనస్సు యొక్క; త్ర్యవస్థాః = మూడవస్థలను; విమృశ్య = విమర్శించి; మత్ + మాయయా = నా అవిద్యచే; మయి కృతాః = ఇవి నా యందు కల్పించబడినవి వాస్తవముగా లేవని; నిశ్చితార్థాః = నిశ్చయింపబడిన ఆత్మరూప వస్తువుగలవారై (మీరు); అనుమాన, సదుక్తి తీక్ష్ణ + అసినా = ఊహలచే సాధువుల ఉపదేశవాక్యములగు శ్రుతివాక్యములచే వాడియైన జ్ఞానమను ఖడ్గముచే; హార్దం = హృదయమందున; అఖిల సంశయ + అధిం = ఎల్ల సంశయములకు అధిష్ఠానమైన అహంకారమును; సంఛిద్య = భేదించి; మా భజత = నన్ను సేవింపుడు.

తా. సత్త్వాది గుణవృత్తులను బట్టి మనస్సున కేర్పడు జాగ్రదాది మూడవస్థలును నా అవిద్యచేత నా యందు కల్పింపబడినవి. ఇవి వాస్తవముగా లేవని, తద్ద్వారా ఆత్మ స్వరూప మును నిశ్చయించుకొన్నవారై మీరు ఎల్ల సంశయములకు అధిష్ఠానమైన హృదయమందు నెలకొని యున్న అహంకారమును, ఊహాపోహలకు ఆస్పదమగు అనుమానాది ప్రమాణముల

చేతను, సాధుపురుష లుపదేశించిన శ్రుతివాక్యముల చేతను, వాడియైన జ్ఞానమను ఖడ్గముచే ఖండించి నన్ను భజింపుడు.

శ్లో. ఈక్షేత విభ్రమ మిదం మనసో విలాసః
దృష్టం వినష్ట మతిలోల మలాతచక్రం,
విజ్ఞాన మేక మురుధైవ విభాతి మాయా
స్వప్న స్త్రిధా గుణవిసర్గకృతో వికల్పః. 34

అ. ఇదం = ఈ జగమును; విభ్రమం ఈక్షేత = భ్రాంతిరూపముగా చూడవలెను. ఏల యనగా అందుకు హేతువులు; మనసః విలాసః = మనస్సంకల్పాదికము వలన విజృంభించిన విలాసమైనది; దృష్టం = ఇంద్రియ గోచరమగుచున్నది; వినష్టం = నశించిపోవుచున్నది; అతిలోలం = మిగుల చలించుచున్నది; అలాత చక్రం = గిరగిర త్రిప్పిన కొఱవి చక్రమువలె, ఓయీ, భ్రమసైతము నిర్విషయ మెట్లగును ? ఏ ఆధారము లేక భ్రాంతి జనించదు కదా ! అనిన చెప్పుచున్నారు. నిగమనము వచించుచున్నారు. అందువలన; త్రిధా = మూడు విధములుగా; గుణ విసర్గకృతః = గుణముల పరిణామముచే చేయబడిన; వికల్పః = భేదమై; విజ్ఞానం + ఏకం = అనుభవైకవేద్యమగు బ్రహ్మమొక్కటే; ఉరుధా + ఏవ = పెక్కు విధములుగనే; విభాతి = భాసిల్లుచున్నది; స్వప్నః = ఈ భేదము స్వప్నమువలె; మాయా = మృష లేక మిథ్య అగును.

తా. మనస్సుయొక్క సంకల్ప వికల్పములకు పెక్కు లీలలుగా కల్పించుటవలనను చక్షురాదులగు నింద్రియములకు స్పష్టముగా గోచరించుచున్నందునను స్వప్నమువలె మఱి నశించిపోవుచుండుటచేతను, మిగుల చాంచల్యము కలదగుటవలనను, గిరగిర త్రిప్పిన కొఱవిచే నేర్పడు చక్రమువలె, ఈ జగము భ్రాంతిరూపమగును. అనుభవైక వేద్యమగు బ్రహ్మ మొక్కటే మూడు విధములుగా త్రిగుణముల సృష్టిచే కల్పింపబడిన భేదముగలదై పెక్కు విధములుగా ప్రకాశించుచున్నది. ఈ భేదమంతయు స్వప్నమువలె మాయలేక మిథ్య యగును

శ్లో. దృష్టిం తతః ప్రతినివర్త్య నివృత్తతృష్ణః
తూష్ణీం భవే న్నిజసుఖానుభవో నిరీహః,
సందృశ్యతే క్వచి దిదం యదవస్తు మిథ్యా
త్యక్తం భ్రమాయ న భవే త్స్మృతి రానిపాతాత్. 35

అ. దృష్టిం = తన దృష్టిని; తతః = ఈ దృశ్య ప్రపంచము నుండి; ప్రతినివర్త్య = మరలించి, నివృత్తతృష్ణః = మనో నిశ్చలత కొఱకు నివర్తించిన విషయాభిలాష గలవాడై; నిజసుఖ + అనుభవః = ఆత్మ సుఖానుభవము గలవాడై; నిరీహః = నిష్క్రియుడు; భవేత్ = మనో వాక్కాయ కర్మ రహితుడు కావలెను అని అర్థము. ఓయీ దేహము కలవానికి ఎల్లపుడు ద్వైతదృష్టి నుండి మరలుట పొసగనందున మరల సంసారము కలుగుచునే యుండును కదా ! అనిన అందుకు చెప్పుచున్నారు, క్వచిత్ = ఒకప్పుడు; అవశ్యకమగు అహారాదులందు; ఇదం = ఈ దృశ్యము; సందృశ్యతే = కన్పట్టుచుండినను; యత్ = ఏది; అవస్తుబుద్ధ్యా = పూర్ణముగా సత్యము గాదను బుద్ధితో; త్యక్తం=విడువబడినో అది; పునః = మరల; మోహాయ

= మోహము కొఱకు; న భవేత్ = కానేరదు; స్మృతిః = స్మరణము; ఆనిపాతాత్ = దేహపాత పర్యంతము; భవేత్ = సంసార మాత్రమున అవభాసించియుండును.

తా. కావున తన దృష్టిని ఈ దృశ్య ప్రపంచమునుండి మరలించి విషయాభిలాషను వీడినవాడై కర్మలను త్యజించి ఆత్మ సుఖానుభవము గలవాడు గావలెను. మనోవాక్కాయ కర్మలను వీడినవాడు కావలెను. ఆవశ్యకమగు ఆహార సేవనమునందు ద్వైతదృష్టి సంభవించు చున్నదిగదా అనిన ఇది వాస్తవము గాదు. అది పూర్ణముగా త్యజించిన తరువాత ఈ దృశ్యమునందు మోహము కల్గింపదు. ఈ ద్వైతస్మరణము దేహపాతపర్యంతము సంసార మాత్రమున అవభాసించుచుండు ననవగును.

శ్లో. దేహం చ నశ్వర మవస్థిత ముత్థితం వా
సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమత్ స్వరూపం,
దైవా దపేత మథ దైవవశా దుపేతం
వాసో యథా పరికృతం మదిరామదాంధః. 36

అ. అవస్థితం = పీఠము నందున్నదియు; ఉత్థితం = ఆసనము నుండి లేచినదియు; దైవాత్ = దైవము వలన; అపేతం = తొలగినదియు; అథ = మఱి; దైవవశాత్ = విధి లేక కర్మవశమువలన; ఉపేతం = కూడినదియు; నశ్వరం = నశించునదియునగు; దేహం చ = దేహమును గూడ; సిద్ధః = ఆత్మ నెఱింగిన పురుషుడు; న పశ్యతి = చూడడు; యతః = ఏల యన; యతః = ఏ దేహము ద్వారా; స్వరూపం = స్వస్వరూపమును; అధ్యగమత్ = పొందినవాడు. అందువలన, యథా = ఏ ప్రకారముగా; మదిరామదాంధః = మద్య పానముచే మత్తు గొని కన్ను గాననివాడు; వాసః = తన కట్టు వస్త్రము; పరికృతం = తొల గినదైనను, ఉండినదైనను; న పశ్యతి = ఎఱుంగడో.

తా. సిద్ధపురుష డే దేహము ద్వారా స్వస్వరూపమగు బ్రహ్మము నధిగమించునో, నశించు స్వభావము గల ఆ దేహము ఆసన మందున్నను, పీఠము నుండి లేచినను, కర్మ వశమున వీడినను, కర్మవశమున కూడినను, కల్లు ద్రావి క్రైపెక్కిన వాడు తన కట్టిన వస్త్రము తొలగినను ఉన్నను పరికింపనట్లు సిద్ధుడు దేహమును గమనింపడు.

శ్లో. దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతి సమీక్షత ఏవ సాసుః,
తం సప్రపంచ మధిరూఢసమాధియోగః
స్వాప్నం పున ర్న భజతే ప్రతిబుద్ధవస్తుః. 37

అ. దేహః+అపి = దేహము సైతము; దైవవశగః = విధికి లోనై సంచరించుచు; స్వ +ఆరంభకం = తన పుట్టుకకు కారణమైన; కర్మ=పూర్వ కర్మ; యావత్ = ఎంత పర్యంత ముండునో, అంత పర్యంతము; స+అసుః = ప్రాణేంద్రియములతో కూడినదై; ప్రతి సమీక్షతే ఏవ ఖలు = కాలము నెదురుచూచుచు సహజస్థితి తోనే ఉండుచున్నది; నశించదనుట. అట్లయిన నొకప్పుడు సిద్ధుడు దేహాసక్తుడు కాడా! అనిన కాదనుచున్నాడు; సప్రపంచం = ప్రాణేంద్రియ మనోబుద్ధులతో గూడిన; తం = ఆ దేహమును; స్వాప్నం = స్వప్నము వందు భాసిల్లు దానివిగా నెంచి; అధిరూఢ సమాధి యోగః = ప్రాప్తమగు సమాధి పర్యంతము

ధ్యానాది యోగము కలవాడగుచు; ప్రతిబుద్ధ వస్తుః = ఎఱింగిన పరమాత్మ వస్తువు గల సిద్ధుడు; న పునః భజతే = మరల ఆ దేహాసక్తిని పొందడు.

తా. విధికి లోనై వర్తించు నీదేహము తన జన్మకు కారణమైన కర్మ ఎంత వర కుండునో అంతవఱకు ప్రాణేంద్రియములతో చేరి కాలము నెదురుచూచుచు నశింపకయే నిల్చి యుండును. కావున సమాధినిష్ఠలో నెలకొన్నవాడై పరమాత్మ వస్తువు నెఱింగిన సిద్ధ పురు షుడు ప్రాణేంద్రియ మనోబుద్ధులతో ఈ దేహమునందు మరల నాసక్తుడై సేవింపడు. అనగా దేహాభిమాని కాడు.

అవ. చెప్పబడిన విషయమందు వారికి విశ్వాసము కలుగుట కొఱకు స్వస్వరూపమును చెప్పుచున్నారు—

శ్లో. మయైత దుక్తం వో విప్రాః గుహ్యం యత్సాంఖ్యయోగయోః,
జానీత మాగతం యజ్ఞం యుష్మ ద్ధర్మ వివక్షయా. 38

అ. విప్రాః = సనకాదులగు ఓ విప్రులారా! మయా = నాచే; వః = మీకు యత్ = ఏ; సాంఖ్యయోగయోః=ఆత్మానాత్మ వివేకరూపమగు సాంఖ్యయోగము; అష్టాంగ యోగ రూపమగు యోగము అనువానియొక్క; ఏతత్ గుహ్యం = ఈరహస్యము; ఉక్తం= చెప్పబడినది; యుష్మత్ + ధర్మవివక్షయా = మీకు ధర్మము వచించు కోరికతో; ఆగతం = వచ్చిన; యజ్ఞం = మహావిష్ణువునుగా; జానీత = ఎఱుంగుడు.

తా. ఓ సనకాది విప్రులారా! ఆత్మానాత్మ వివేకరూపమగు సాంఖ్యశాస్త్రమును, యమ నియమాదులగు అష్టాంగయోగముల రూపమగు పాతంజల యోగశాస్త్రము అనువానియందు ఏ రహస్యము గలదో ఆ ఆత్మతత్వమును మీకు నేను చెప్పినాడను. మీకు ధర్మమును తెలియజెప్ప కోరికతో నిచ్చటి కేతెంచిన నన్ను విష్ణువునుగా మీరెఱుంగుడు.

'యత్తేన హంసరూపేణ బ్రహ్మణే ప్యాత్థ మాధవః'

మాధవుడు హంసరూపమున బ్రహ్మదేవునికి ఆత్మతత్వము చెప్పెనని యనువాదమగును.

శ్లో. అహం సాంఖ్యస్య యోగస్య సత్య స్యర్తస్య తేజసః,
పరాయణం ద్విజశ్రేష్ఠాః శ్రియః కీర్తే ర్దమస్య చ. 39

అ. ద్విజశ్రేష్ఠాః = ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! అహం = నేను; సాంఖ్యయోగస్య = సాంఖ్యమునకు యోగమునకు, ఋతస్య = వేదమువలన తెలియు ధర్మమునకు; సత్యస్య = అనుష్ఠింపబడు ధర్మమునకు; తేజసః = ప్రభావమునకు; శ్రియః = లక్ష్మికి; కీర్తేః = కీర్తికి; దమస్య చ = ఇంద్రియనిగ్రహమునకు; పరాయణం = పరమప్రాప్యముగా నున్నాను.

తా. ఓద్విజోత్తములారా! నేను సాంఖ్య యోగములకు, వేద చోదిత ధర్మమగు ఋతమునకు, అనుష్ఠింపబడు ధర్మమగు సత్యమునకు, ప్రభావమునకు, లక్ష్మికి, కీర్తికి ఇంద్రియ నిగ్రహమునకును పరమ ప్రాప్యమైన వాడనని ఎఱుంగుడు.

శ్లో. మాం భజంతి గుణా స్సర్వే నిర్గుణం నిరపేక్షకం,
సుహృదం ప్రియ మాత్మానం సామ్యాసంగాదయో గుణాః. 40

అ. నిర్గుణం = గుణరహితుడు; నిరపేక్షకం = దేనియందు నపేక్షలేనివాడును; సుహృదం = జీవుల మేలు గోరువాడును; ప్రియం = ఇష్టుడును; ఆత్మానం = ఆత్మస్వరూపుడునగు; మాం = నన్ను; సామ్య + అసంగ ఆదయః గుణాః = సమత్వము అన్నింటియందు సమదృష్టియు; అసంగము = దేనియందును సంగము లేకుండుట లోనగు గుణములు; భజంతి = పొందును; అ, గుణాః = సత్త్వాది గుణపరిణామ రూపములు గావు. అనగా నిత్యములగుచున్నవి.

తా. సమత్వము, అసంగము లోనగు గుణములు గుణరహితుడై దేనియందు నపేక్ష లేనివాడై, ఎల్ల జీవులకు మేలు గోరువాడై ఎల్లరి కిష్టుడై ఆత్మ స్వరూపుడైన నన్ను భజించు చున్నవి. సత్త్వాది గుణ పరిణామ రూపములు గాక ఆ గుణములు నిత్యమై నాయందుండు చున్నవి.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. ఇతి మే ఛిన్నసందేహా మునయ స్సనకాదయః,
సభాజయిత్వా పరయా భక్త్యాఽగృణత సంస్తవైః. **41**

అ. ఇతి = ఈ విధముగా; మే = నాచేత; సనక + ఆదయః మునయః = సనకాది మునులు; ఛిన్న సందేహాః = తొలగిన సందేహముగలవారై; సభాజయిత్వా = నన్ను సంతోష పరచి; పరయా భక్త్యా = ఉత్కృష్ట భక్తితో; సంస్తవైః = సన్నుతులచే; అగృణత = స్తుతించిరి.

తా. ఇట్లు నాచే బోధితులై సనకాదులగు మునులు సంశయములు వీడినవారై ఏకాంత భక్తిచే నన్ను పూజించి సన్నుతులచే నన్ను స్తుతించిరి.

శ్లో. తైరహం పూజిత స్సమ్యక్ సంస్తుతః పరమర్షిభిః,
ప్రత్యేయాయ స్వకం ధామ పశ్యతః పరమేష్ఠినః. **42**

అ. తైః పరమర్షిభిః = మహర్షులగు ఆ సనకాదులచే; సమ్యక్ పూజితః = చక్కగా పూజింపబడి; సంస్తుతః = చక్కగా స్తుతింపబడినవాడనై; అహం = నేను; పరమేష్ఠినః పశ్యతః = బ్రహ్మ చూచుచుండగనే; స్వకం ధామ = నా స్వీయ ధామమగు వైకుంఠమును; ప్రత్యేయాయ = మరలి వచ్చితిని.

తా. ఇట్లు ఋషిశ్రేష్ఠులగు సనకాదులచే చక్కగా పూజను, సన్నుతులను గొన్నవాడనై బ్రహ్మదేవుడు చూచుచుండగనే నా వైకుంఠధామమునకు మరలి వచ్చితిని.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే త్రయోదశోఽధ్యాయః.

ఇది శ్రీ మద్భాగవతము ఏకాదశ స్కంధమున పదమూడవ అధ్యాయము

ఓం తత్సత్.

# చతుర్దశాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. చతుర్దశే పరం శ్రేయో భక్తిరేవ న చేతరత్
ఇత్యేత ద్వర్ణ్యతే ధ్యానయోగశ్చ సహ సాధనైః.

ఈ పదునాల్గవ అధ్యాయమందు ఉత్తమమైన శ్రేయస్సునకు సాధనము భక్తి యొక్కటియే గాని ఇతరము గాదు అని వర్ణింపబడును. ధ్యానయోగము సాధనములతో తెల్పబడును.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను.

శ్లో. వదంతి కృష్ణ శ్రేయాంసి బహూని బ్రహ్మవాదినః,
తేషాం వికల్పప్రాధాన్య ముతాహో ఏకముఖ్యతా. **1**

అ. కృష్ణ! = ఓ కృష్ణా! బ్రహ్మవాదినః = వేదవాదులు; శ్రేయాంసి = శ్రేయస్సాధనములను; బహూని వదంతి = పెక్కులు వచించుచున్నారు; తేషాం = వానిలో; వికల్పప్రాధాన్యం ఉత = అదిగాని ఇదిగాని ఒక్కటియే అనునట్టి వికల్పము చేత అన్నింటికి ప్రాధాన్యమగునా; అహో = లేక; ఏకముఖ్యతా = వీనియం దొకదానికే ప్రాధాన్యముండునా, భగవంతునిచే భక్తిచే మోక్షము కలుగునని చెప్పబడినది. అన్యులన్ననో మోక్షమున కన్యములు సాధనములని వచించుచున్నారు. కాని వానియందు విశేషనిర్ధారణ కొఱకు ప్రశ్నించుచున్నారు.

తా. ఓ కృష్ణా! బ్రహ్మవాదులు (వేదార్థ మెఱింగినవారు) మోక్షమునకు సాధనములను పెక్కింటిని వచించుచున్నారు. వానిలో ఇదియు నదియు ఒక్కటియే అను వికల్పరీతిని అన్నింటికిని ప్రాధాన్య మగునా లేక వానిలో నొక్కదానికి మాత్రమే ప్రాధాన్య మగునా చెప్పుము.

అవ. ఒకదానికే ముఖ్యత్వము అను పక్ష ముప్పతిల్లుటకు కారణమును చెప్పుచున్నారు.

శ్లో. భవతోదాహృతః స్వామిన్ భక్తియోగోఽ నపేక్షితః,
నిరస్య సర్వతః సంగం యేన త్వయ్యావిశే న్మనః. **2**

అ. స్వామిన్ = ఓ స్వామీ! భవతా ఉదాహృతః = నీచే చెప్పబడిన; భక్తియోగః అనపేక్షితః = ఇతర ఫలాపేక్ష లేనిది, అహైతుకము, భక్తియోగము; యేన = ఏ భక్తి యోగముచే; సర్వతః = అన్నింటినుండి; సంగం, నిరస్య = సంగమును నిరసించి; త్వయి= నీయందు; మనః ఆవిశేత్ = మనస్సు ప్రవేశించునో,

తా. ఓ స్వామీ! నీవు చెప్పిన భక్తియోగము ఇతర ఫలాపేక్ష లేనిది అహైతుక మైనది. దానిచే సర్వసంగములు నిరసించి పురుషుడు నీయందు మనస్సును ప్రవేశపెట్టు చున్నాడు. దీని యర్థమిది. నీవు భక్తియోగమును చెప్పితివి. అన్యులు మఱికొన్నింటిని శ్రేయస్సాధనములుగా చెప్పుచున్నారు. దానిలో నేది సాక్షాత్తుగ ఫలసాధనముగా ప్రధాన మగును? అన్నియు అంగాంగిభావమున ప్రధానములై యున్నవి. వీనియందు వికల్పమేల? అన్నియు తుల్యఫలము కలవి యగునా? లేక వానిలో నేదైన విశేషము గలదా? చెప్పు మనుచున్నారు.

శ్రీ భగవానువాచ = భగవంతుడు వచించెను.

అవ. వీనియందు భక్తియే మహాఫల మగుటచే ముఖ్యమైనది అన్యములైనచో వాని వాని ప్రకృత్యనుసారముగ పువ్వుస్థానీయములగు స్వర్గాదిఫలబుద్ధులుగల ప్రాణులచే ప్రాధాన్యముగా కల్పింపబడినవి. అవి అల్పఫలములు కలవగును అని విడమర్చుటకు ప్రకృత్యనుసారముగ వేదార్థజ్ఞానము పెక్కు విధములుగా చేయబడినదని ఏడు శ్లోకములచే చెప్పుచున్నారు.—

శ్లో. కాలేన నష్టా ప్రళయే వాణీయం వేదసంజ్ఞితా,
మయాదౌ బ్రహ్మణే ప్రోక్తా ధర్మో యస్యాం మదాత్మకః. 3

అ. ప్రళయే = ప్రళయకాలమందు; ఇయం వేదసంజ్ఞితా వాణీ = ఈ వేదమనుపేరు పొందిన వాక్కు; కాలేన నష్టా = కాలగతిని నశించినది; మయా = నాచే; ఆదౌ = సృష్టికి మొదలు; బ్రహ్మణే ప్రోక్తా = బ్రహ్మకు చెప్పబడినది; యస్యాం = ఏ వేదవాణి యందు; మత్ + ఆత్మకః = నాయందు చిత్తము నిల్పుట గలదైన; ధర్మః = భక్తిరూప ధర్మము కలదో.

తా. వేదమను పేరుపొందిన వాణి కాలగతిచే ప్రళయకాలమందు నష్టమై పోయినది. ఆ వేదవాణిని నేను సృష్టిప్రారంభమున బ్రహ్మదేవునికి చెప్పినాడను. ఆ వేదవాణినగు నా యందు చిత్తము నిల్పునదైన భక్తిధర్మము తెల్పబడినది.

శ్లో. తేన ప్రోక్తా స్వపుత్రాయ మనవే పూర్వజాయ సా,
తతో భృగ్వాదయోఽ గృహ్ణన్ సప్తబ్రహ్మమహర్షయః. 4

అ. తేన = ఆ బ్రహ్మచే; సా = ఆ వేదవాణి; పూర్వజాయ, స్వపుత్రాయ మనవే = మొదట జనించి తన పుత్రుడైన స్వాయంభువ మనువునకు; ప్రోక్తా = చెప్పబడినది; తతః = ఆ మనువువలన; భృగు + ఆదయః = భృగువులోనగువారు; సప్తబ్రహ్మమహర్షయః = ఏడు గురు ప్రజాపతులైన మహర్షులు; అగృహ్ణన్ = ఆ వేదవాణిని గ్రహించిరి.

తా. ఆ బ్రహ్మ తన జ్యేష్ఠపుత్రుండగు స్వాయంభువ మనువునకు ఆ వేదవాణి నుపదేశించెను. ఆ మనువు వలన భృగువు, మరీచి, అత్రి, అంగిరుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అను ఏడుగురు ప్రజాపతులు మహర్షులు ఆ వేదవాణిని గ్రహించిరి.

శ్లో. తేభ్యః పితృభ్య స్తత్పుత్రాః దేవదానవ గుహ్యకాః,
మనుష్యాః సిద్ధ గంధర్వాః సవిద్యాధరచారణాః. 5

అ. తేభ్యః మునిభ్యః = ఆ మునులవలన; తత్పుత్రాః = వారి పుత్రులు. (తక్కినది సుగమము).

తా. ఆ ఏడుగురు మునుల వలన దేవతలు, దానవులు, గుహ్యకులు, మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, చారణులు గ్రహించిరి.

శ్లో. కిందేవాః కిన్నరా నాగాః యక్షకింపురుషాదయః
బహ్వ్యస్తేషాం ప్రకృతయో రజస్సత్త్వతమో భువః. 6

అ. కిందేవాః = బడలిక, చెమట, కంపులేనివారై భూస్పర్శగలిగి సంచరించువారు కిందేవతలు మనుష్యులా అని సందేహాస్పదులు కాగా, ద్వీపాంతరవాసులగు మనుష్యులు; కింనరాః = ఇంచుక ముఖమునుబట్టిగాని శరీరమునుబట్టి మనుష్యలక్షణము కలిగి కన్పట్టువారు; యక్ష కింపురుష + ఆదయః = యక్షులు; కింపురుషులు ఇంచుక మానవులవలె ఉండువారు వానరులు; నాగాః = నాగులు లోనగువారును గ్రహించిరి; తేషాం ప్రకృతయః= వారివాసనలు; రజస్సత్త్వతమో =రజస్సత్త్వ తమోగుణములు కలవగుటచే; భువః = జన్మస్థానములు; బహ్వ్యః = పెక్కు విధములుగా నున్నవి.

తా. అలసట, చెమట, దుర్గంధములేని శరీరముగలవారై భూస్పర్శ గలిగి సంచరించు ద్వీపాంతరవాసులగు మనుష్యులును, ముఖమును బట్టి శరీరమునుబట్టి మనుష్యుని సరిపోలిన కిన్నరులు, నాగులు, యక్షులు, ఇంచుక మానవాకృతి గల వానరులు, లోనగువారును ఆ వేదవాణిని గ్రహించిరి. వారి జన్మ ప్రవర్తనలు రజస్సత్త్వ తమోగుణములు గలవగుటచే వారి మనో వాసనలు పెక్కు విధములై యుండును.

శ్లో. యాభి ర్భూతాని భిద్యంతే భూతానాం మతయ స్తథా,
యథాప్రకృతి సర్వేషాం చిత్రా వాచః స్రవంతి హి. 7

అ. యాభిః = ఏ కర్మవాసనలచే; భూతాని = దేవాసుర మనుష్యాదులగు ప్రాణులు; భూతానాం మతయః = ప్రాణుల చిత్తములును; భిద్యంతే = భేదిల్లుచున్నవో; తేషాం = ఆ ప్రాణులందరియొక్క; యథాప్రకృతి = వారి వారి స్వభావము నతిక్రమింపక, చిత్రాః వాచః = వేదార్థ వ్యాఖ్యాన విషయములైన వాక్కులు; స్రవంతి హి = జాలువారుచుండును కదా.

తా. ఏ కర్మవాసనలచే దేవాసుర మనుష్యాది ప్రాణులును, ఆ ప్రాణుల చిత్తములును, భేదస్థితిని పొందుచున్నవో, దానం జేసి ఎల్ల ప్రాణులకు వారి వారి స్వభావము నతిక్రమింపక వేదార్థ వ్యాఖ్యాన విషయములైన వాక్కులు ప్రకటన మగుచుండును

శ్లో. ఏవం ప్రకృతివైచిత్ర్యాత్ భిద్యంతే మతయో నృణాం,
పారంపర్యేణ కేషాంచిత్ పాషండమతయోఽపరే. 8

అ. ఏవం = ఈ ప్రకారము; ప్రకృతివైచిత్ర్యాత్ = కర్మవాసనల భేదము వలన; నృణాం మతయః = నరుల చిత్తవృత్తులు; భిద్యంతే = మారుచుండును; కేషాంచిత్ = కొందరు వేదాధ్యయన శూన్యులైనవారియొక్క; పారంపర్యేణ = ఉపదేశక్రమము చేతను అపరే = ఇతరులు; పాషండమతయః = వేదవిరుద్ధ ధర్మచిత్తులైరి.

తా. ఈ విధముగా కర్మవాసనల భేదము ననుసరించి చిత్తవృత్తి భేదిల్లుచుండును. వేదాధ్యయనశూన్యులైన కొందఱి ఉపదేశక్రమము ననుసరించి, ఇతరులు వేదవిరుద్ధ ధర్మ మవలంబించు చిత్తము కలవారైరి.

శ్లో. మన్మాయామోహితధియః పురుషాః పురుషర్షభ,
శ్రేయో వదం త్యనేకాంతం యథాకర్మ యథారుచి. 9

అ. పురుష + ఋషభ = పురుషశ్రేష్ఠుడా ! మత్ మాయా మోహితధియః = (అట్టి పాషండ ప్రకృతి గలవారు మాయాగుణ మూలు రగుటవలన) నా యొక్క మాయచే మోహమును పొందిన బుద్ధిగలవారై ; పురుషాః = పురుషులు; యథాకర్మ = వారి కర్మవాసనానుగుణముగను; యథారుచి = వారి యభిరుచి కనుగుణముగను, అనేకాంతం = నానావిధమైన; శ్రేయః వదంతి = శ్రేయోమార్గమును వచించుచుందురు.

తా. ఓ పురుషశ్రేష్ఠుడా! అట్టి పాషండ ప్రకృతి గలవారు మాయగుణములచే నట్టివా రగుచున్నారు. కాబట్టి నా మాయచే వివేకము గోలుపోయిన చిత్తము గలవారై వారి వారి కర్మ వాసనానుగుణముగను, వారి వారి యభిరుచి కనుగుణముగను శ్రేయస్సాధనమును పెక్కువిధములుగా వచింతురు.

అవ. దానినే చెప్పు చున్నారు.

శ్లో. ధర్మ మేకే యశ శ్చాన్యే కామం సత్యం, దమం, శమం,
అన్యే వదంతి స్వార్థం వై ఐశ్వర్యం త్యాగ భోజనమ్,
కేచిద్యజ్ఞం తపో దానం, వ్రతాని నియమాన్ యమాన్. 10

అ. ధర్మం = నిత్యనైమిత్తికమైన కర్మను; ఏకే = కొందరు కర్మ మీమాంసకులు; వదంతి = చెప్పుదురు. అట్లే చెప్పబడినది —

మోక్షార్థీ న ప్రవర్తేత తత్ర కామ్యనిషిద్ధయోః,
నిత్యనైమిత్తికే కుర్యాత్ ప్రత్యవాయజిహాసయా.

మోక్షమును గోరువాడు కామ్యములు నిషిద్ధములు నగు కర్మలు ఆచరింపగూడదు. తన కనుదినము సంప్రాప్తించు దురితక్షయమునకు, నిత్యనైమిత్తికములగు స్నాన సంధ్యా జప పంచమహా యజ్ఞాదులగు కర్మల నాచరింపవలెను.

1. కామ్యము = జయః పుత్ర విత్త స్వర్గాదికము.

2. నిషిద్ధము = సురాపానము, పరాంగనారతి.

3. నిత్యము = సంధ్యా జప హోమాదికము.

4. నైమిత్తికము=దర్శపూర్ణ మాసాదికము, సంక్రమణాదులందు తర్పణ దానాదికము, యశః=కీర్తిని, కావ్యాలంకార మగు కృతిని; ఏకే = కొందఱు, అందరు. అట్లే.

యావత్కీర్తి ర్మనుష్యస్య పుణ్యలోకేషు గీయతే,
తావ ద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే.

మనుజుని సత్కీర్తి ఎంతకాలము వరకు పుణ్యలోకములందు కీర్తింపబడునో, అన్నివేల కొలది వత్సరములు మనుష్యుడు స్వర్గమునందు కీర్తింపబడును.

కామం = ఇంద్రియ సుఖానుభవమును వాత్స్యాయనాదులు చెప్పుదురు; సత్యం, శమం, దమం = సత్యము, శమము, దమము లనగువానిని యోగశాస్త్ర ప్రవర్తకులు చెప్పుదురు; అన్యే = దృష్టార్థవాదులు ప్రత్యక్షప్రమాణవాదులు, ప్రత్యక్ష సుఖమును గాంచువారు, దండనీతిని రచించినవారు; ఐశ్వర్యం = సంపద, ప్రభుత్వము అనువానిని; స్వార్థం = పురుషార్థముగా; వదంతి = చెప్పుదురు; ఇందువలన సామాదులగు నుపాయములే శ్రేయస్సాధనము లని వారి మతము.

అన్యే త్యాగభోజనం = ఒకరి కిచ్చుట; తానునుభవించుట అని లోకాయతులు వచింతురు. కేచిత్ = కొందరు; యజ్ఞం, తపః, దానం = దేవతల పూజ, తపస్సు, దానము; వ్రతాని = ఏకాదశ్యాది వ్రతములు; నియమాన్ = స్వాధ్యాయాది నియమములను; యమాన్ = అహింసాది యమములను శ్రేయస్సాధనములుగా చెప్పుదురు.

తా. కర్మమీమాంసకులు నిత్యనైమిత్తకములగు కర్మ లాచరించు ధర్మమును శ్రేయస్సాధనముగా చెప్పుదురు. కవీశ్వరులు రసాలంకార సహిత కావ్య ప్రబంధములను రచించి, దానివలన శాశ్వతకీర్తి గడించుట లెస్స యందురు. వాత్స్యాయనాది మహర్షులు కామసుఖము లనుభవించుట మే లందురు. యోగశాస్త్ర ప్రవర్తకులు సత్యము, శమము, దమము అనువాని ననుష్ఠించుట మేలందురు. దృష్టార్థవాదులగు దండనీతి రచయితలు సామ భేద దానాద్యుపాయములచే విజయము సాధించి తద్ద్వారా ఐశ్వర్యమును, ప్రభుత్వమును సంపాదించి యనుభవించుట పురుషార్థ మందురు. లోకాయతులు, నాస్తికులు ఇతరుల కొసంగి తాను సంపూర్ణముగా సుఖ మనుభవించుట శ్రేయ మందురు. ఇంకను కొందఱు కర్మఠులు మునులు దేవపూజ తపస్సు, దానము శ్రేయస్సాధన మందురు.

అవ. ఆ లోకాదులు తుచ్ఛఫలము లనుచున్నారు.

శ్లో. ఆద్యంతవంత ఏ వైషాం లోకాః కర్మవినిర్మితాః
దుఃఖోదరాః తమోనిష్ఠాః క్షుద్రానందాః శుచార్పితాః. **12**

అ. ఏషాం = పైన శ్రేయస్సాధనములని పేర్కొనిన వీరియొక్క; కర్మవినిర్మితాః = కర్మఫలములచే చేకూరినవగు; లోకాః = స్వర్గాది పుణ్యలోకములు; ఆద్యంతవంతః ఏవ = మొదలు చివరగలవియే అగును. అనగా అస్థిరములనుట; దుఃఖోదరాః = ఉత్తర కాలమందు దుఃఖఫలము గూర్చునవి; తమోనిష్ఠాః = మోహ పర్యవసానము గలవి; క్షుద్ర+ఆనందాః = అల్పమైన ఆనందము గలవి; శుచా+అర్పితాః = భోగకాలమందు అసూయాదులగు శోకముతో కూడినవి అగును

తా. పైన శ్రేయస్సాధనములను, శ్రేయస్సులను వచించిన వీరికి లభించు పుణ్యలోకములు కర్మ ఫలములచే చేకూరినవి. మొదట లభించి ఆవల లేకుండ పోవునవి కనుక అస్థిరములై యున్నవి మఱియు చివర ఉత్తరకాలమందు దుఃఖము నొడగూర్చుచున్నవి. అజ్ఞాన

ము‌ను అవసానమున కలిగి యున్నవి. అల్పమైన ఆనందము కలవి. భోగకాలమందు సైతము అసూయాదులగు శోకముతో గూడినవి అగుచున్నవి.

శ్లో. మయ్యర్పితాత్మన స్సభ్యః నిరపేక్షస్య సర్వతః,
మయాత్మనా సుఖం య త్తత్ కుత స్స్యాత్ విషయాత్మనామ్. 13

అ. సభ్య! = ఓ సభాయోగ్యుడా! మయి = నా యందు; అర్పిత + ఆత్మనః = సమర్పించిన చిత్తము కలిగి; సర్వతః=అన్నింటినుండి; నిరపేక్షస్య = అపేక్షలేనివానికి; మయా = పరమానంద స్వరూపుడైన నాతో; ఆత్మనా = స్వస్వరూపుడై స్ఫురించువానితోడి; సుఖం = సుఖము; యత్ = ఏది గలదో; తత్ =ఆ సుఖము; విషయ+ఆత్మనాం= విషయ సుఖ చిత్తులకు; కుతః స్యాత్ = ఎట్లు కలుగును? ఏ విధముననూ కలుగదు.

తా. నా యందు తన చిత్తము సమర్పించి ఎల్లవిషయములనుండి మఱలి నిరపేక్షుడైన వానికి లభించు, పరమానందస్వరూపుడై స్వస్వరూపుడనైన నాతోడి సుఖము ఏదిగలదో అది విషయ సుఖాభిలాషుల కెట్లు కలుగును?

అవ. పరిపూర్ణత్వమునే చెప్పుచున్నారు.

శ్లో. న పారమేష్ఠ్యం న మహేంద్రధిష్ణ్యం న సార్వభౌమం న రసాధిపత్యం,
న యోగసిద్ధీ న పునర్భవం వా మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాఽన్యత్. 14

అ. మయి+అర్పిత+ఆత్మా = నా యందు సమర్పించిన చిత్తము గల నా భక్తుడు; మత్ + వినా అన్యత్ = నేను లేక ఇతరమైన; పారమేష్ఠ్యం = పరమేష్ఠి అనగా బ్రహ్మ ఆయన ఉండు సత్యలోకమును; న+ఇచ్ఛతి = కోరడు; న మహేంద్రధిష్ణ్యం = ఇంద్రుని స్థానమగు స్వర్గమును వాంఛింపడు; న సార్వభౌమం = చక్రవర్తి పదమును అభిలషింపడు; న రసాధిపత్యం = పాతాళ లోకాధిపత్యము నిచ్ఛగింపడు; న యోగసిద్ధీః=అణిమాది యోగ సిద్ధులను కోరడు; న పునర్భవం వా = మోక్షమును సైతము వాంఛింపడు.

తా. నా యందు చిత్త మిడిన నా భక్తుడు నేను లేని బ్రహ్మయుండు సత్యలోకము కావలెనని కోరడు. ఇంద్రుని వాసమగు స్వర్గలోకమును వాంఛింపడు. భూజగమునకు చక్రవర్తిపదము నొల్లడు. పాతాళలోకాధిపత్యము నిచ్ఛగింపడు. అణిమాది యోగసిద్ధులకు ఇష్టపడడు. మోక్షమును సైతమభిలషింపడు. నేను ఆతనికి మిగుల నిష్టుడనని అర్థము.

శ్లో. న తథా మే ప్రియతమః ఆత్మయోని ర్న శంకరః,
న చ సంకర్షణో న శ్రీః నైవాత్మా చ యథా భవాన్. 15

అ. తథా = ఆ ప్రకారము; ఆత్మయోనిః = బ్రహ్మ - పుత్రుడైనను; న ప్రియతమః = ప్రియతముడు గాడు; న శంకరః = మత్స్వరూపుడైన శివుడును గాడు; న సంకర్షణః = సోదరుడైన బలుడును గాదు; న శ్రీః=భార్యయైన లక్ష్మియు గాదు; న ఆత్మా ఏవ = నా మూర్తిసైతము గాదు; యథా భవాన్ = ఏ ప్రకారము నీవు ప్రియతముడవో భక్తుడు ప్రియతముడని చెప్పదగి యున్నను అతి హర్షమున అట్లు చెప్పెను.

తా. ఓయి ఉద్ధవా! భక్తుడవైన నీవు నాకెంతటి ప్రియతముడవో, అంతటి ప్రియతముడు నాకు పుత్రుడైనను బ్రహ్మ కాడు. అట్లే నా స్వరూపమగు శంకరుడు కాడు. సోదరుడైన బలరాముడు కాడు. భార్యయైన లక్ష్మియు గాదు. నా మంగళ విగ్రహమును ప్రియతమము గాదు.

శ్లో. నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనం,
అనువ్రజా మ్యహం నిత్యం పూయేయే త్యంఘ్రిరేణుభిః. **16**

అ. నిరపేక్షం = ఐహికాముష్మిక సుఖేచ్ఛ లేనివాడును; మునిం = మనన శీలుడును; శాంతం = కామక్రోధములు శాంతించిన వాడును; నిర్వైరం = ఎవని యందును ఈర్ష్యలేనివాడును; సమదర్శనం = అన్నింటను వాసుదేవుడు కలడు, సర్వమును వాసుదేవుడని సమదృష్టి గల భక్తుని, అహం = నేను; నిత్యం అనువ్రజామి = ఎల్లప్పుడు అనుసరించి పోవుదును; అంఘ్రి రేణుభిః = పాదధూళులచే. పూయేయ = నాలోనుండు బ్రహ్మాండములను పవిత్రము చేయుచున్నాను. అను భావమున పవిత్రుని చేయుదును.

ఆవ. మఱియు నా భక్తులకు కలుగు సుఖ మింతమాత్రమని వాకొనుట కెవ్వడు సమర్థుడగును? ఆ సుఖము స్వసంవేద్యము నిరుపమమును అని వచించుచున్నాడు.

శ్లో. నిష్కించనా మయ్యనురక్తచేతసః శాంతా మహాంతోఽఖిలదీనవత్సలాః,
కామై రనాలబ్ధధియో జుషంతి య త్తే నైరపేక్ష్యం న విదు స్సుఖం మమ. **17**

అ. నిష్కించనాః = తమది ఇది అని ఏ ఇంచుక వస్తువును లేనివారును; మయి + అనురక్తచేతసః = నాయందు ప్రేమతోడి చిత్తము గలవారును; శాంతాః = మనశ్శాంతి గలవారును; మహాంతః = అహంకార రహితులును; అఖిల దీనవత్సలాః = ఎల్ల దీనులందు ప్రేమ గల వారును; కామైః = విషయవాంఛలచే; అలబ్ధధియః = అస్పృష్ట చిత్తులును, నిష్కించనత్వాది ఈ విశేషణములు స్వేచ్ఛమై హేతు హేతుమద్భావము గలవి, ఇట్టివారు; మమ = నా భక్తులు; యత్ సుఖం = ఏ సుఖమును; జుషంతి = సేవింతురో; తే విదుః = ఆ సుఖమును వారలే ఎఱుంగుదురు; న విదుః = అన్యు లెఱుంగరు; నైరపేక్ష్యం = అపేక్షలేని వారిచేతనే లభ్యమగునది. మోక్షాపేక్ష గలవారిచేత లభ్యము గానిదగును. లేక ఇట్టివారై ఎవరు నన్ను సంతోషపెట్టుదురో వారే నైరపేక్షమగు సుఖమును ఎఱుంగుదురు. అన్యు లెఱుంగరని యర్థము.

తా. ఎవరు తమదని యేయించుక వస్తువును లేనివారును, నాయం దనురక్తమైన చిత్తముగలవారును, ఎల్ల దిక్కులేని వారియందు ప్రేమగలవారును, ఇంద్రియ సుఖవాంఛలకు లోనుగాని చిత్తముగలవారును అగు నా భక్తులు ఏ సుఖము ననుభవింతురో ఆ సుఖము వారలే ఎఱుంగుదురు మోక్షాపేక్ష గలవారు సైతము ఆ సుఖమును బడయలేరు. లేక ఇట్టివారై నన్ను పూజాదికమున సంతోషపెట్టువారు మాత్రము నైరపేక్ష్యమగు సుఖము నెఱుంగుదురు. అన్యులెఱుంగరని యర్థము.

ఆవ. మఱియు అట్టి ఉత్తమ భక్తుల కథ అటుండనిమ్ము, మఱి పామరుడైన నా భక్తుడు సైతము కృతార్థుడే అయి యున్నా డనుచున్నారు. —

శ్లో. బాధ్యమానోఽ పి మద్భక్తో విషయై రజితేంద్రియః
ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయై ర్నాభిభూయతే. 18

అ. అజితేంద్రియః = ఇంద్రియములను జయింపని నా భక్తుడు; విషయైః = ఇంద్రియ విషయములచేత బాధ్యమానః అపి = ఆకర్షింపబడినవాడయ్యు; ప్రాయః = తఱచుగా; ప్రగల్భయా భక్త్యా = సమర్థమైన నా భక్తిచే; విషయైః = విషయసుఖములచే; న + అభిభూయతే = పీడింపబడడు.

తా. ఇంద్రియములను గెలువలేని నా భక్తుడును విషయసుఖములచే ఆకర్షింపబడిన వాడయ్యు సమర్థమైన భక్తిచే ఆ విషయసుఖములకు సామాన్యముగా బాధింపబడకుండును.

అవ. ఇందుకు దృష్టాంతము చెప్పుచున్నారు.

శ్లో. యథాగ్నిః సుసమిద్ధార్చిః కరో త్యేధాంసి భస్మసాత్,
తథా మద్విషయా భక్తిః ఉద్ధ వైనాంసి కృత్స్నశః. 19

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవుడా! సుసమిద్ధార్చిః = పాకము లోనగువాని కొఱకు మిక్కిలి మండుచున్న జ్వాలలు గల అగ్ని; యథా = ఏ ప్రకారము; ఏధాంసి = కట్టెలను; భస్మసాత్ కరోతి = బూడిద చేయునో; తథా = ఆ ప్రకారము; మద్విషయా భక్తిః = నేను లక్ష్యముగా గల భక్తి; ఏనాంసి = సమస్త పాపములను; కృత్స్నశః = అన్నింటిని; భస్మసాత్ కరోతి = భస్మము చేయుచున్నది.

తా. ఓ ఉద్ధవా! పాకాదికము కొఱకు బాగుగా మంటలు గల అగ్ని ఎట్లు కట్టెలను కాల్చి భస్మము చేయుచున్నదో అట్లే నా యందలి రాగాదికముతో గూడిన నా విషయమైన భక్తి ఎల్ల పాపములను భస్మము చేయుచున్నది. భగవంతుడు గూడ భక్తి మహిమను గూర్చిన ఆశ్చర్యముతో ఆహో ఉద్ధవా! వినుమని విస్మయముతో సంబోధించుచున్నారు.

అవ. రెండు శ్లోకములచే ఇందువలన ఇటువంటి శ్రేయస్సు అన్యము లేదనుచున్నారు.

శ్లో. న సాధయతి మాం ధర్మో న సాంఖ్యం యోగ ఉద్ధవ
న స్వాధ్యాయః తప స్త్యాగో యథా భక్తి ర్మ మోర్జితా. 20

అ. ఉద్ధవ! మాం = నన్ను; ధర్మః = యాగాది ధర్మనిష్ఠ; న సాధయతి = వశము చేసికొనలేదు; న సాంఖ్యం = సాంఖ్యము కాదు; న యోగః = యోగము సమర్థము కాదు; న స్వాధ్యాయః = వేదపాఠమును గాదు; న త్యాగః = దానమును గాదు; యథా = ఏ ప్రకారము; మమ ఊర్జితా భక్తిః = నా యొక్క బలిష్ఠమైన భక్తి వశము చేసికొనునో.

తా. ఓ ఉద్ధవా! ఏ విధముగా నాయందలి అచంచల భక్తి నన్ను వశము చేసికొనునో అట్లు యాగాది ధర్మము నన్ను వశము చేసికొనలేదు. అందు సాంఖ్యమును నేరదు. యోగము శక్తము గాదు. వేదాధ్యయనము ప్రయోజనకారి కాదు. దాన ముపయోగపడదు.

శ్లో. భక్త్యాహ మేకయా గ్రాహ్యః శ్రద్ధయాత్మా ప్రియః సతాం
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్. 21

అ. ఆత్మా అహం = ఆత్మస్వరూపుడనగు నేను; సతాం ప్రియః = సాధువులకు ప్రియుడను; శ్రద్ధయా = శ్రద్ధతో గూడిన; ఏకయా భక్త్యా = ఒక్క భక్తితోడనే; గ్రాహ్యః = గ్రహింపదగినవాడను; మత్‌నిష్ఠా భక్తిః = నాయందు దృఢముగా నెలకొన్న భక్తి: సంభవాత్ = ఆస్తికబుద్ధి మాత్రమున సంభవించుటవలన; శ్వపాకాన్ + అపి = కుక్కమాంసమును తిను చండాలురను సైతము పునాతి = పావనులను చేయుచున్నది.

తా. సాధువులకు ప్రియుడనై ఆత్మస్వరూపుడనైన నేను శ్రద్ధతో గూడిన ఒక్క భక్తితో మాత్రమే సులభముగా గ్రాహ్యుడనగుచున్నాను. కేవల మాస్తిక్యబుద్ధితో మాత్రము సంభవించినదై నాయందు నెలకొన్న భక్తి కుక్క మాంసము భుజించు వారలను సైతము పావనులను చేయుచున్నది.

అవ. భక్తి లేకున్నచో అన్యములగు సాధన ములన్నియు వ్యర్థమనుచున్నారు. —

శ్లో. ధర్మ స్సత్య దయోపేతో విద్యా వా తపసాన్వితా
మద్భక్త్యపేత మాత్మానం న సమ్యక్ ప్రపునాతి హి. 22

అ. సత్యదయా + ఉపేతః = సత్యము, భూతదయ అనువానితో గూడిన; ధర్మః = ధర్మవర్తనము గాని; తపసా + అన్వితా = నియమోపవాసాది వ్రతములతో గూడిన; విద్యా వా = జ్ఞానము గాని; మత్ + భక్తి + అపేతం = నా భక్తిచే వైదొలగిన; ఆత్మానం = చిత్తముగల వరుని; సమ్యక్ = చక్కగా న పునాతి = పవిత్రుని చేయదు.

తా. సత్యము భూతదయలతో గూడిన ధర్మప్రవర్తనముగాని, తపస్సుతో గూడిన వివేకమగు విద్యగాని (జ్ఞానము) నా భక్తిలేని చిత్తముగల నరుని చక్కగా పావనుని చేయలేదు.

అవ. అట్లయిన భక్తిలేదని ఎట్లు తెలియబడునని శంక రాగా భక్తికి చిహ్నములు చెప్పుచున్నారు.

శ్లో. కథం వినా రోమహర్షం ద్రవతా చేతసా వినా
వినాఽఽనందాశ్రుకలయా శుద్ధ్యే ద్భక్త్యా వినాఽఽశయః. 23

అ. రోమహర్షం = శరీరము గగుర్పాటు లేక; కథం = భక్తి ఎట్లు తెలియబడును; ద్రవతా చేతసా వినా = కరగిన చిత్తము కలుగక భక్తి ఎట్లు తెలియును; భక్త్యా వినా = భక్తి లేక; ఆశయః = చిత్తము, కథం శుద్ధ్యేత్ = ఎట్లు పరిశుద్ధ మగును.

తా. మేన గగుర్పాటు లేకున్న భక్తి ఎట్లు తెలియగలదు? అట్లే చిత్తము ద్రవీభూతము గాకున్న భక్తిలేదు. ఆనందబాష్పములు కానరాకున్న భక్తిలేదు. అట్లే భక్తి లేకున్న చిత్తమెట్లు పరిశుద్ధ మగును.

అవ. మఱియు నాభక్తి చిత్తమును శోభిల్లజేయునని ఏమి చెప్పనగును? ఏ భక్తి వలన తొట్రుపాటు వాక్కు, లోనగువాని లక్షణములు గల నాభక్తి గలవాడు సర్వలోకమును పావనము చేయుచున్నా డనుచున్నారు. —

శ్లో. వా గ్గద్గదా ద్రవతే యస్య చిత్తం హస త్యభీక్ష్ణం రుదతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ మద్భక్తియుక్తో భువనం పునాతి. 24

అ. యస్య వాక్ = ఎవని యొక్క వాక్కు; గద్గదా = డగ్గుత్తిక గలదో; చిత్తం = ద్రవతే = చిత్తము కరఁగునో; అభీక్ష్ణం = మఱి మఱి; హసతి = నా భక్తి పారవశ్యమున నవ్వునో; క్వచిత్ = ఒకప్పుడు; రుదతి = ఏడ్చునో; విలజ్జః = సిగ్గు విడివవాడై; ఉద్గాయతి = బిగ్గరగా పాడునో, నృత్యతే చ = ఆడును కూడ; మద్భక్తియుక్తః = నా భక్తితో గూడినవాడు; భువనం = లోకమును; పునాతి = పవిత్రము చేయును.

తా. ఎవని వాక్కు తొటుప్రడునో, చిత్తము ద్రవీభూతమగునో అట్టి నా భక్తితో గూడినవాడు ఆ పురుషుడు నా భక్తి పారవశ్యమున మఱి మఱి నవ్వును. ఒక్కొక్కప్పుడు ఏడ్చును. ఒకప్పుడు సిగ్గు వీడి బిగ్గరగా పాడును. మఱి నృత్యము చేయును. ఇట్టి నా భక్తుడే లోకమును పావనము చేయుచున్నాడు.

అవ. భక్తిచేతనే ఆత్మశుద్ధి కలుగును గాని అన్యము వలన గాదని దృష్టాంతముతో చెప్పుచున్నారు—

శ్లో. యథాగ్నినా హేమ మలంజహాతి ధ్మాతం పున స్స్వం భజతే చ రూపం
ఆత్మా చ కర్మానుశయం విధూయ మద్భక్తియోగేన భజ త్యథో మామ్. 25

అ. యథా = ఏ ప్రకారము; హేమ = బంగారము; అగ్నినా ధ్మాతం = అగ్నితో పుటము వేయబడినదై; మలం జహాతి = తనలో నున్న మాలిన్యమును విడుచున్నదో; పైన కడుగుటచే వీడదు; పునః = మరల; స్వం రూపం భజతే = తన స్వచ్ఛమగు రూపమును పొందుచున్నదో; అట్లే ఆత్మా చ = జీవుడును; మత్ భక్తి యోగేన = నా భక్తి యోగముచే కర్మ + అనుశయం విధూయ = కర్మ వాసనను పోద్రోలి; అథో మాం భజతే = తర్వాత నా స్వరూపమును పొందుచున్నాడు.

తా. బంగారము అగ్నియందు పుటము వేయబడి తనలో మాలిన్యము తొలగించుకొను చున్నది. కాని క్షాళనాదులచే (కడుగుట) మాలిన్యము తొలఁగించుకొనలేదు. మఱియు తన తొల్లింటి స్వచ్ఛమగు రూపును పొందుచున్నది. అట్లే జీవుడును నా భక్తియోగముచే తన కర్మ వాసనను వైదొలగించుకొని నా రూపమును పొందుచున్నాడు.

అవ. ఓయీ ! బ్రహ్మవి దాప్నోతి పరం - శ్రుత మేవ విదిత్వాఽతిమృత్యు మేతి.... బ్రహ్మ మెఱింగినవాడు బ్రహ్మమును (మోక్షమును) పొఁగను. విన్న బ్రహ్మము నెఱింగి మోక్షమును పొందుచున్నాడు. –అను లోనగు శ్రుతులచే జ్ఞానము వలననే అవిద్య నివర్తించుట నిన్ను (బ్రహ్మమును) పొందుట అని తెలియ నయ్యెడు మఱి భక్తియోగముచే నేల యనగా చెప్పుచున్నారు—

శ్లో. యథా యథాఽఽత్మా పరిమృజ్యతేఽసౌ, మత్పుణ్య గాథా శ్రవణాభిధానైః
తథా తథా పశ్యతి తత్త్వ మోకం చక్షు ర్యథైవాంజన సంప్రయుక్తమ్. 26

అ. మత్ పుణ్యగాథా శ్రవణ+ఆదిభిః = నా పావనములైన కథలను శ్రవణము చేయుట చేతను; యథా యథా = ఏ యే ప్రకారము; అసౌ ఆత్మా = ఈ చిత్తము; పరిమృజ్యతే = మాలిన్యము తుడువబడునో; తథా తథా = ఆయా ప్రకారము; అంజన సంప్రయుక్తం = కాటుకతో కూడినదైన; చక్షుః = కన్ను; యథా = ఏ ప్రకారమో, ఆ ప్రకారము; తత్త్వసూక్ష్మం = బ్రహ్మము యొక్క యాథాత్మ్యమైన సూక్ష్మరూపమును; పశ్యతి = చూచుచున్నది. భక్తి అవాంతరవ్యాపారమే జ్ఞానము గాని వేఱు గాదు అని అర్థము.

తా. పావనములైన నా కథలను వినుట చేతను, నన్ను కీర్తించుట చేతను, ఎంత కెంతకు ఎట్లెట్లు భక్తుని చిత్తము మాలిన్యము తొలగినదగునో అంత కంతకు అట్లట్లు కాటుక బెట్టిన కన్ను వలె బ్రహ్మము యొక్క యాథాత్మ్యమగు సూక్ష్మరూపమును చూడగలుగు చున్నది. భక్తి యొక్క అవాంతర వ్యాపారమే జ్ఞానమగును గాని వేఱు గాదు.

అవ. మఱి జ్ఞానమనగా చిత్తమునకు కలుగు నా ఆకార పరిణామ మగును. అదియును నన్ను భజించుట వలన స్వభావముననే కలుగుచున్నది. మఱి ప్రయత్నాంతర మేదియు నపేక్షింపదు. అని దృష్టాంత సహితముగా చెప్పుచున్నారు—

శ్లో. విషయాన్ ధ్యాయత శ్చిత్తం విషయేషు విషజ్జతే
మా మనుస్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే. 27

అ. విషయాన్ = ఇంద్రియ విషయసుఖములను; ధ్యాయతః చిత్తం = ధ్యానించువాని చిత్తము; విషయేషు - విషజ్జతే = విషయసుఖములందే ఆసక్తమగుచున్నది; మాం అనుస్మరతః చిత్తం = నన్ను అనుస్మరించువాని చిత్తము; మయి + ఏవ = నాయందే; ప్రవిలీయతే = లీనమగుచున్నది.

తా. ఇంద్రియ సుఖములను ధ్యానించువాని చిత్తము ఆ విషయసుఖములందే ఆసక్తమగుచున్నది. నన్ననుక్షణము స్మరించువాని చిత్తము నా యందే లీనమగుచున్నది.

అవ. ఎందువలన అన్యమగు సాధనము, దాని ఫలము స్వప్న మనోరథముల వలె అసత్యమును, ధ్యానము చేయనట్టిదియు నగును అందువలన అట్టి దానిని వీడి నా యందే మనస్సును ఏకాగ్రము చేయుమని ప్రకరణ విషయము నుపసంహరించుచున్నారు—

శ్లో. తస్మా దసదభిధ్యానం యథా స్వప్నమనోరథం
హిత్వా మయి సమాధత్స్వ మనో మద్భావభావితమ్. 28

అ. తస్మాత్ = అందువలన; స్వప్నమనోరథం యథా = స్వప్నమునందు గాంచినదియు, మనస్సులో కోరినదియు నెట్లో, అట్లు; అసత్ + అభిధ్యానం = అసత్తులగు విషయములను ధ్యానించుటను; హిత్వా = త్యజించి; మత్ + భావభావితం = నా భజనమున శుద్ధమైన; మనః = నీ మనస్సును; మయి = నా యందు; సమాధత్స్వ = చక్కగా నుంచుము.

తా. కల యందు గాన వచ్చిన ధనాదికము, మనస్సంకల్పముచే గోచరించు ఔన్నత్యమును ఎట్లు అసత్యములో, అట్లే అసత్యములు, అనిత్యములునైన విషయములను ధ్యానించు

టను త్యజించి, నా భజనము వలన పరిశుద్ధమైన నీ మనస్సును నాయందు నిశ్చలముగా నుంచుము

అవ. విశేషించి వాత్స్యాయనాది మహర్షులు వచించినట్టి కామశాస్త్ర పథములు తప్పక పరిత్యజింపదగిన వనుచున్నారు. —

శ్లో. స్త్రీణాం తత్సంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్
క్షేమే వివిక్త ఆసీనః చింతయే న్మా మతంద్రితః 29

అ. స్త్రీణాం = స్త్రీల యొక్కయు; తత్సంగినాం = ఆ స్త్రీల యందు సక్తులగు వారి యొక్కయు; సంగం = నెయ్యమును; త్యక్త్వా = విడచి; క్షేమే = నిరుపద్రవమై; వివిక్తే = నిర్జన ప్రదేశమందు; ఆసీనః = కూర్చుండిన వాడవై; అతంద్రితః = తొట్రుపాటు లేని వాడవై; మాం = నన్ను; చింతయేత్ = ధ్యానింపవలెను.

తా. స్త్రీల స్నేహమును, ఆ స్త్రీలను ప్రేమించు పురుషుల నెయ్యమును పూర్తిగా త్యజించి, నిరుపద్రవమైన నిర్జన ప్రదేశమందు కూర్చుండినవాడై తొట్రుపడక నన్ను ధ్యానింపవలెను.

అవ. దీనినే ఉపపాదించుచున్నారు. —

శ్లో. న తథాస్య భవేత్ క్లేశో బంధ శ్చాన్య ప్రసంగతః
యోషిత్సంగా ద్యథా పుంసో యథా తత్సంగి సంగతః. 30

అ. తథా = ఆ ప్రకారము; అస్య = నన్ను చింతించుచున్నవానికి; అన్య ప్రసంగతః = ఇతరులతో స్నేహము వలవ; క్లేశః బంధః = దుఃఖము, బంధము; న భవేత్ = కలుగదు; పుంసః = పురుషునికి; యోషిత్ సంగాత్ = స్త్రీల స్నేహము వలన, తత్ సంగిసంగతః = ఆ స్త్రీల సంగడితనము గలవారి నెయ్యము వలనను కల్గునో.

తా. సాధకుడగు నీ పురుషునికి ఎట్లు స్త్రీల సంగమమునను, ఎట్లు స్త్రీల సంగడి కాండ్రి సంగము వలనను, దుఃఖము, పీడ్పాటు లేక కలుగునో అట్లు మఱి ఇతరుల సంగము వలన క్లేశబంధములు కలుగవు.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను.

అవ. నన్ను చింతింపవలెనని చెప్పబడినది. ఆ చింతన ప్రకారమును ప్రశ్నించు చున్నారు. —

శ్లో. యథా త్వా మరవిందాక్ష! యాదృశం వా యదాత్మకం
ధ్యాయే న్ముముక్షు రేతన్మే ధ్యానం త్వం వక్తు మర్హసి. 31

అ. అరవిందాక్ష! = తామరల వంటి కన్నులు గలవాడా!; ముముక్షుః = మోక్షము గోరువాడు; త్వాం = నిన్ను; యథా = ఏ ప్రకారము; యాదృశం = ఎట్టి వస్త్ర భూష ణాదులు గలవానిని; యత్ + ఆత్మకం = ఏ స్వరూపము గలవానిని; ధ్యాయేత్ = ధ్యానింప

వలెను; ఏతత్ ధ్యానం = ఈ నీ ధ్యానమును; మే = నాకు; త్వం వక్తుం అర్హసి = వచింప దగుదువు.

తా. ఓ తామరకలవంటి కన్నులు గలవాడా! సంసారబంధ ముక్తిని గోరువాడు లేక మోక్షమును గోరువాడు, నిన్నెట్టి వస్త్రభూషణాలంకృతునిగను ఎట్టి స్వరూపము గలవానిని గను ధ్యానము చేయవలెనో, ఈ నీ ధ్యానమార్గము నాకు చెప్పుము.

విశే. యథా = ఏ ప్రకారము అని ధ్యానాంగప్రశ్నము, యాదృశము = ధ్యేయ విశేషణ ప్రశ్నము యదాత్మకమని విశేషణములను గూర్చి ప్రశ్నము — అని తెలియనగును. ఇందు దీని యర్థము ముముక్షువు నిన్నెట్లు ధ్యానించును? నాకు చెప్పుమని జిజ్ఞాసువునకు చెప్పుటకు నాకు మాత్రము నీ దాస్యమే పురుషార్థము ధ్యానముచే నగు కృత్యము లేదు. అట్లే చెప్పబడినది.

త్వయోపభుక్త స్రగ్గంధ వాసోఽలంకార చర్చితాః
ఉచ్ఛిష్ట భోజినో దాసా స్తవ మాయాం జయేమహి ! ఇతి.

నీవు ధరించిన పూదండలు, పూసికొన్న గంధము, కట్టిన వస్త్రము, పెట్టుకొన్న నగలు మైపూతలు అనువానిని గైకొని, నీ యెంగిలి అన్నము భుజించు నీ దాసులమై నీ మాయను జయించుచున్నాము.

శ్లో. సమ ఆసన ఆసీనః సమకాయో యథా సుఖం
హస్తా వుత్సంగ ఆధాయ స్వనాసాగ్రకృతేక్షణః. 32

అ. ఉత్సంగే = తొడలందు; హస్తౌ - ఆదాయ = హస్తములనుంచి; సమే = ఎక్కువ ఎత్తువల్లములు లేని; ఆసీనే = కంబళము లోనగు ఆసనమందు; సమకాయః = నడుము వంచక నిల్పిన ఊర్ధ్వకాయము గలవాడై; (స్వస్తికాద్యాసన నియమమని చెప్పబడక) నాసాగ్రకృత + ఈక్షణః = చిత్తస్థైర్యము కొఱకు ముక్కు చివర నిల్పిన కంటి చూపు కలవాడై.

శ్లో. అంతర్లక్ష్యో బహిర్దృష్టిః స్థిరచిత్తః సుసంయతః

లోపలి లక్ష్యము, వెలుపలి దృష్టి, స్థిరచిత్తుడు ఇంద్రియ సంయమనము గలవాడు కావలెను అని యోగశాస్త్రమందు చెప్పబడినది.

తా. మిక్కిలి ఎత్తును మిక్కిలి క్రిందును గాని సమమైన కంబళాది ఆసనమందు నడుము నిక్కించి, చక్కగా తనకు అనుకూలమగు విధమున గూర్చుండి తన రెండు చేతులను రెండు తొడలపై నుంచి చిత్తస్థైర్యము కల్గుట కొఱకు తన కంటిచూపును కొనముక్కుపై నిల్పిన వాడగుచు.

శ్లో. ప్రాణస్య శోధయే న్మార్గం పూర కుంభక రేచకైః
విపర్యయేణాతి శనైః అభ్యసే న్నిర్జితేంద్రియః. 33

అ. పూర కుంభక రేచకైః = పూరకము, కుంభకము, రేచకము — నాసికా రంధ్రముల ద్వారా గాలిని లోపలికి పూరించుట, నిల్పుట, విడుచుట అను విధములచే ప్రాణస్య-

మార్గం = ప్రాణవాయువు నడచు మార్గమును; శోధయేత్ = శోధనము చేయవలెను; విపర్యయేణ = పైన చెప్పినదానికి వ్యతిరేక మార్గమునవైన; (శోధయేత్ = శోధింపవలెను). నిర్జిత + ఇంద్రియః = ఇంద్రియములను జయించినవాడవై; అతిశనైః = అతి మెల్లగా; అభ్యసేత్ = ప్రాణాయామము నభ్యసింపవలెను.

తా. ఇడ– అనగా ముక్కు కుడిప్రక్క రంధ్రము ద్వారా వాయువును లోపలికి పీల్చుట పూరకము. నాభి లోనగు స్థానమందు ఆ వాయువును నిల్పుట కుంభకము. ఆ గాలిని ఎడమ ముక్కు రంధ్రము ద్వారా వదలుట రేచకము. మరల ఆ ముక్కు ఎడమ రంధ్రము ద్వారా పీల్చవలెను. పింగళ అని ఎడమ ముక్కు రంధ్రము. ఇట్లు గాలి పీల్చుట, నిల్పుట, విడచుట అనునదే ప్రాణాయామము. దీనినే క్రమముగా పూరక కుంభక రేచకము లందురు, అట్లు గాక అందు వ్యతిరిక్తముగా రేచకము గాలిని విడచి, పూరించి నిల్పి విడువవచ్చును. ఈ విధముగా ప్రాణమార్గ శోధన కావింపవలెను.

అవ. ప్రాణాయామము సగర్భము, అగర్భమని ద్వివిధము. అందు శ్రేష్ఠమగుట వలన ప్రణవ గర్భమును చెప్పుచున్నారు—

శ్లో. హృద్యవచ్ఛిన్న మోంకారం ఘంటానాదం బిసోర్ణవత్
ప్రాణే నోదీర్య తత్రాథ పున స్సంవేశయే త్స్వరమ్. 34

అ. హృది = హృదయమందు; అవచ్ఛిన్నం = మూలాధార చక్రము నుండి నిరంతరము; ఘంటానాదం = ఘంటాధ్వని వంటిదైన; ఓంకారం = ఓంకారమును, హృదయమందున్న దానిని; ప్రాణేన = ప్రాణవాయువుతో; బిస + ఊర్ణవత్ = తామర నూలిపోగు వలె; ఉదీర్య = ద్వాదశ మాత్రల కాలము పర్యంతము పైకి పొంది; తత్ర = మాత్రాతీతమైన హృదయమందు; స్వరం = పదునైదు బిందువులు గల స్వరమును; సంవేశయేత్ = నిలుపవలెను.

తా. మూలాధారము నుండి శిరస్సు పర్యంతము తామర నూలిపోగు వలె సూక్ష్మమై నిరంతరము హృదయ మందున్న ఘంటాధ్వని వంటి ఓంకారమును ప్రాణవాయువుచే పైకి కొని వచ్చి, మఱల ఆ ఓంకారమును ఉదాత్త నాదమును హృదయమందు స్థిరముగా నిల్పుము. ద్వాదశాంతములైన అచ్చులతో (12) అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ,ఌ,ౡ,ఏ,ఐ,ఓ,ఔ,అం, అః (16) పదునైదు అచ్చులు అంతముగా గల ఓంకారమును నిల్పవలెను.

శ్లో. ఏవం ప్రణవసంయుక్తం, ప్రాణసంయమ మభ్యసేవ్
దశకృత్వః త్రిషవణం మాసాదర్వా గ్జితానిలః. 35

అ. ఏవం = ఈ ప్రకారము; ప్రణవసంయుక్తం = ఓంకారముతో గూడిన; ప్రాణసంయమం = ప్రాణాయామమును. దశకృత్వః = పూటకు పదిసార్లు చేయుచు; త్రిషవణం= మూడు మారులు స్నానము చేయుచు; మాసాత్, అర్వాక్=ఒక నెల తరువాత; జిత + అనిలః = శ్వాసను జయించిన వాడగుము.

తా. ప్రతిదినము మువ్మారు స్నానము చేయుచు, ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంకాలము ఈ మూడు కాలములందు, ఒక్కొక్కమారు పదిమారు ప్రాణాయామము చేయుచు ఒక్క నెలకు తరువాత శ్వాసను జయించినవా డగుచున్నాడు.

శ్లో. హృత్పుండరీక మంతస్థ మూర్ధ్వనాళ మధో ముఖం
ధ్యాత్వోర్ధ్వముఖ మున్నిద్ర మష్టపత్రం సకర్ణికం
కర్ణికాయాం న్యసే త్సూర్య సోమాగ్నీ నుత్తరోత్తరమ్. **36**

అ. అంతఃస్థం = దేహములోపల నున్నదియు; ఊర్ధ్వనాళం = కాడపైకి కలదియు; అధోముఖం = క్రింది ముఖముగలదై అరటిపూవు మొగ్గవలె నున్నదియు; అష్టపత్రం = ఎనిమిది రేకులు గలదియు; సకర్ణికం = దుద్దుతో కూడినదియు నగు; హృత్పుండరీకం = హృదయ కమలమును; ఊర్ధ్వముఖం = పైపైకి ముఖము గల దానిగను; ఉన్నిద్రం = వికసించిన దానినిగను చేసి; ధ్యాత్వా = ధ్యానించి పై స్థితికి విపరీతముగా; కర్ణికాయాం = ఆ దుద్దునందు; ఉత్తర + ఉత్తరం = ఒకరి తరువాత ఒకరినిగా; సూర్యసోమ + అగ్నీన్ = సూర్యచంద్రాగ్నులను; న్యసేత్ = ఉంచునట్లు భావించి చింతింపవలెను.

తా. దేహము లోపల నున్నదైన హృదయ కమలముపైకి కాడయు, క్రింద ముఖమును గలదై, అరటి పూవు మొగ్గ వలె నుండును. అది ఎనిమిది రేకులు గలిగి, దుద్దు కలదై యుండును. దానిని ఊర్ధ్వముఖముగను, వికసించునదిగను చేసి, భావించి దానిని దుద్దునందు క్రమముగా సూర్యచంద్రాగ్నులను ప్రతిష్ఠించినట్లు భావించి ధ్యానింపవలెను.

అవ. సవిశేషణ ధ్యానమును ఆఱు శ్లోకములతో చెప్పుచున్నారు—

శ్లో. వహ్నిమధ్యే స్మరే ద్రూపం మమైత ద్ధ్యాన మంగళమ్
సమం ప్రశాంతం సుముఖం దీర్ఘచారు చతుర్భుజమ్. **37**

అ. వహ్నిమధ్యే = ఆ అగ్నిమధ్యమందు; మమ = నాయొక్క; ఏతత్ = ఈ; ధ్యానమంగళం = ధ్యానమునకు శుభవిషయమై; సమం = అనురూపావయవములు కలిగి; ప్రశాంతం = శాంతము; సుముఖం = సెమ్మొగముగలదై; దీర్ఘచారుచతుర్భుజం = పొడవులై సుందరములైన నాలుగు బాహువులుగలదై; రూపం = నా రూపమును; స్మరేత్ = స్మరింపవలెను.

తా. ఆ యగ్ని నడుమ ధ్యానమునకు శుభవిషయమై అనురూపమైన అవయవములు గలదై, ప్రశాంతమై, అందమైన ముఖము గలదై పొడవులై సుందరములైన నాలుగు బాహువులు గలదైన ఈ నా రూపమును స్మరింపవలెను.

శ్లో. సుచారు సుందరగ్రీవం, సుకపోలం, శుచిస్మితం
సమాన కర్ణ విన్యస్త స్ఫురన్మకర కుండలమ్. **38**

అ. సుచారు సుందరగ్రీవం = అతి రమ్యమైన చక్కని కంఠముగలదియు; సుకపోలం= అందమైన చెక్కిళులు గలదియు; శుచిస్మితం = తెల్లని లేనగవు గలదియు; సమాన...కుండలం; సమానకర్ణ = సరిసమానముగా నుండు చెవులందు; విన్యస్త = ఉంచబడిన; స్ఫురత్ + మకరకుండలం = ప్రకాశించు మొసలి రూపున నున్న చెవిపోగులు గలదానిని స్మరింపవలెను.

తా. అతిరమ్యమై, చూడదగిన కంఠము, నునుపై తళతళ మెఱయు చెక్కిళులు, తెలి లేనగవు హెచ్చుతగ్గులు లేని చెవులందు పెట్టబడిన మొసలి రూపున నున్న బంగారు పోగులు గల నా రూపును స్మరింపవలెను.

శ్లో. హేమాంబరం ఘనశ్యామం, శ్రీవత్సశ్రీనికేతనం
శంఖచక్రగదాపద్మ వనమాలాది భూషితమ్. **39**

అ. హేమాంబరం = సువర్ణ కాంతులను వెదజల్లు పసుపువన్నె పట్టు పుట్టము గలదై; ఘనశ్యామం = మబ్బు జిగి వోలె నీలి వన్నె గలిగి; శ్రీవత్సశ్రీనికేతనం = ఱొమ్మునందు కుడి ప్రక్క శ్రీవత్సమను పుట్టుమచ్చకును, ఎడమ ప్రక్క సిరికిని; ఉనికి పట్టుగా గలిగి; శంఖ చక్ర గదా పద్మ వనమాలాది భూషితం = శంఖము, చక్రము, గద, పద్మము, వనమాల (పెద్ద పూదండ) అను వానిచే నలంకరింపబడిన (నా రూపమును ధ్యానింపవలెను.)

తా. సువర్ణ కాంతులను వెదజల్లు పసుపువన్నె పట్టుపుట్టము గలదై మబ్బు జిగి వోలె నీలి వన్నె గలిగి ఱొమ్మునందు కుడిప్రక్క శ్రీవత్సమను పుట్టుమచ్చకును ఎడమప్రక్క సిరికిని, ఉనికి పట్టుగాఁ గలిగి శంఖము, చక్రము, గద, పద్మము, వనమాల (పెద్దపూదండ) అనువానిచే నలంకరింపబడిన నా రూపమును ధ్యానింపవలెను.

శ్లో. నూపురైర్విలసత్పాదం కౌస్తుభప్రభయాఽన్వితం
ద్యుమత్కిరీట కటక, కటి సూత్రాంగదా యుతమ్. **40**

అ. నూపురైః+విలసత్పాదం = అందియలచే విలసిల్లు పాదములు గలదై; కౌస్తుభ ప్రభయా+అన్వితం = కౌస్తుభ మణికాంతితో గూడినదై; ద్యుమత్+యుతం ద్యుమత్ = ప్రకాశించు; కిరీట కటక = కిరీటము చేతి కడియములు; కటిసూత్ర + అంగద + ఆయుతం = మొలత్రాడు, భుజకీర్తులు లోనగువానిచే అంతట అలంకరింపబడినదియు.

తా. అందియలతో ప్రకాశించు పాదములు గలదియు, కౌస్తుభ మణి కాంతులతో గూడినదియు, మెఱయు కిరీటము, చేతి కడియములు, మొలత్రాడు, భుజకీర్తులు అనువానిచే ప్రకాశించునదియు.

శ్లో. సర్వాంగసుందరం హృద్యం ప్రసాదసుముఖేక్షణం
సుకుమార మభిధ్యాయేత్ సర్వాంగేషు మనో దధత్. **41**

అ. సర్వ+అంగ సుందరం = ఎల్ల అవయవములు సుందరమైనదియు; హృద్యం = మనోహరమును; ప్రసాద సుముఖ+ఈక్షణం = ప్రసన్నమైన నెమ్మొగము, కన్నులు కలదియు; సుకుమారం = కోమలమైనదియు నగు రూపును; సర్వ+అంగేషు = ఎల్ల అవయవములందు; మనః = మనస్సును; దధత్ = ధరించుచు; అభిధ్యాయేత్ = ధ్యానింపవలెను.

తా. ఎల్ల అవయవములు సుందరముగా నుండునదియు, ప్రసన్నమైన నెమ్మొగము కన్నులు గలదియు కోమలము నగు రూపమునందు అన్ని అవయవములందు మనస్సు నుంచుచు ధ్యానింపవలెను.

అవ. విశేషణము తో గూడిన ధ్యానము నుపసంహరించుచున్నారు—

శ్లో. ఇంద్రియాణీంద్రియార్థేభ్యో మనసాఽఽకృష్య తన్మనః
బుద్ధ్యా సారథినా ధీరః ప్రణయే న్మయి సర్వతః. **42**

**అ.** ఇంద్రియాణి = శ్రోత్రాది ఇంద్రియములను; ఇంద్రియ + అర్థేభ్యః = ఇంద్రియ వృత్తులగు శబ్దాదుల నుండి; మనసా, ఆకృష్య = మనస్సుచే ఆకర్షించి; తత్ + మనః = ఆ మనస్సును; ధీరః = ధీరుడై; బుద్ధ్యా సారథినా = బుద్ధి యను సారథిచే; సర్వతః = సర్వాంగయుక్తుడైన; మయి = నా యందు; ప్రణయేత్ = అధికముగా పొందజేయవలెను.

తా. శ్రోత్రాదులగు నింద్రియములను ఇంద్రియార్థములగు శబ్దాదులనుండి మనస్సుచే ఆకర్షించి ఆ మనస్సును బుద్ధి యను సారథి ద్వారా సర్వాంగ శోభితుడైన నా యందు కొని వచ్చి దృఢముగా నిల్పవలెను.

అవ. ఎటువంటివానిని అనుదానికి, ఉత్తరముగా సవిశేషణమును చెప్పి యాదాత్మకం = ఏ స్వరూపమును అనుదానికి మెల్లగా విశేషణమును త్యాగము చేయుట చేత ధ్యానమును సమాధి పర్యంతము మూడు శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. **తత్సర్వవ్యాపకం చిత్త మాకృష్యైకత్ర ధారయేత్**
**నాన్యాని చింతయే ద్భూయ స్సుస్మితం భావయే న్ముఖమ్.** **43**

అ. సర్వవ్యాపకం = నా రూపమందలి ఎల్ల అవయవములందు వ్యాపించియున్న; తత్ + చిత్తం = ఆ చిత్తమును; ఆకృష్య = ఆకర్షించి; ఏకత్ర = ఒక్క చోటనే; ధారయేత్ = నిల్పవలెను; అన్యాని = ఇతరాంగములను; భూయః = మరల; న చింతయేత్ = చింతింపవలదు; సుస్మితం, ముఖం = చిరునగవు గల నా ముఖమును; భావయేత్ = భావింపవలెను.

తా. అట్లు నా సర్వాంగములందు వ్యాపించిన చిత్తమును ఆకర్షించి ఒక్క చోటనే నిల్పవలెను. ఇతరములగు నంగములను నేమి: ధ్యానింపవలదు చక్కని చిఱునగవుగల నా ముఖమును ధ్యానింపవలెను.

శ్లో. తత్ర లబ్ధపదం చిత్త మాకృష్య వ్యోమ్ని ధారయేత్
తచ్చ త్యక్త్వా మదారోహో న కించిదపి చింతయేత్. **44**

**అ.** తత్ర = ఆ సుస్మిత ముఖమునందు; లబ్ధ పదం = స్థిరత్వమును పొందిన; చిత్తం = చిత్తమును; ఆకృష్య = ఆకర్షించి, వ్యోమ్ని = సర్వకారణ రూపమందు; (దహరాకాశమందు) ధారయేత్ = నిల్పవలెను. తత్ = ఆ కారణరూపమును; త్యక్త్వా = త్యజించి; మత్ + ఆరోహః = శుద్ధ బ్రహ్మము నందు ఆరూఢుడై; కించిత్ + అపి = ఏ ఇంచుకయు; న చింతయేత్ = చింతి పవలదు.

తా. ఆ ముఖము నందు స్థైర్యమును పొందిన చిత్తము నాకర్షించి సర్వకారణ మగు నారూపమందు (దహరాకాశమునందు) నిల్పవలెను. తర్వాత ఆ కారణరూపమును త్యజించి, శుద్ధ బ్రహ్మమందు ఆరూఢుడై ఏ యించుకయు చింతింపనివాడు కావలెను.

శ్లో. ఏవం సమాహితమతిః మామేవాత్మాన మాత్మని
విచష్టే మయి సర్వాత్మన్ జ్యోతి ర్జ్యోతిషి సంయుతమ్. 45

అ. ఏవం = ఈ ప్రకారము; సమాహితమతిః = నియమితచిత్తుడై; ఆత్మానం మాం+ఏవ = ఆత్మస్వరూపుడగు నన్నే; ఆత్మని = తనయందును; విచష్టే = కూడిన; సర్వాత్మన్ = సర్వాత్మ స్వరూపుడైన; మయి = నాయందు; ఆత్మానం = తనను; జ్యోతిషి = తేజస్సునందు; సంయుతం = కూడిన, జ్యోతిః ఇవ = జ్యోతివలె యగును.

తా. ఇట్లు సమాహితచిత్తుడై తనయందు ఆత్మయై యున్న నన్ను గాంచుచు, సర్వాత్ముడైన నాయందు తన్ను గాంచుచు జ్యోతియందు గూడిన జ్యోతివలె నగును.

అవ. ఇటువంటి సమాధి పర్యంతమైన ధ్యానమునకు ఫలములు చెప్పుచున్నారు.—

శ్లో. ధ్యానే నేత్థం సుతీవ్రేణ యుంజతో యోగినో మనః
సంయాస్య త్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞానక్రియాభ్రమః 46

అ. ఇత్థం = ఈ ప్రకారము; సుతీవ్రేణ, ధ్యానేన = మిక్కిలి తీక్ష్ణమైన ధ్యానముతో; మనః = మనస్సును; యుంజతః = కూర్చుచున్న; యోగినః = యోగికి; ద్రవ్యజ్ఞానక్రియాభ్రమః = అధిభూతము, అధిదైవము, అధ్యాత్మము అను త్రివిధ భ్రాంతి లేక, దృశ్యము, ద్రష్ట, దర్శనము అనువాని భ్రమ; ఆశు=శీఘ్రముగా; నిర్వాణం=శాంతిని; సంయాస్యతి = పొందగలదు. చక్కగా తెలియగలదగును.

తా. ఇట్లు మిక్కిలి తీవ్రమైన ధ్యానమునందు మనస్సు నిల్పిన యోగికి, అధిభూతము, అధిదైవము, అధ్యాత్మము, క్రమముగా పంచభూతములు, ఇంద్రాది దేవతలు, శరీరము అను వాని భ్రాంతిగాని లేక, దృశ్యమగు ప్రపంచము ద్రష్ట = చూచువారు, దర్శనము = చూచు జ్ఞానము. అను త్రివిధమగు భ్రమగాని శీఘ్రముగా శాంతిని పొందుచున్నది. అంత సర్వమును బ్రహ్మముగా తెలియనగును.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే చతుర్దశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమందు ఏకాదశస్కంధమున పదునాలుగవ (14) అధ్యాయము.

ఓం తత్సత్.

# పంచదశాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

శ్లో. తతః పంచదశే ప్రోక్తాః సిద్ధయో ధారణానుగాః
శ్రీవిష్ణుపదసంప్రాప్తా వంతరాయతయా మతాః.

ఈ పదనేనవ అధ్యాయమందు చిత్తధారణానుసారములై గలుగు అణిమాది సిద్ధులు చెప్పబడినవి. అవి శ్రీమహావిష్ణుపదమును సంప్రాప్తించుటకు అంతరాయములు, విఘ్నములుగా చెప్పబడినవి.

అవ. ఈ ప్రకారము మనస్సును సమాధియందు నిల్పుచున్న యోగికి, లోన ఆవిర్భవించునట్టి అణిమాదులగు సిద్ధులు సైతము విఘ్నప్రాయములే యగును. కాన యోగి వానిని పరిహరించి పరమేశ్వరపరుడే యగునది వచింప దొడ్తి ఆ సిద్ధులను చెప్పుచున్నారు. —

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. జితేంద్రియస్య యుక్తస్య, జితశ్వాసస్య యోగినః
మయి ధారయత శ్చేత ఉపతిష్ఠంతి సిద్ధయః. **1**

అ. జితేంద్రియస్య = ఇంద్రియములను జయించిన వాడును; యుక్తస్య = స్థిర చిత్తుడును; జితశ్వాసస్య = శ్వాస వరికట్టినవాడును. మయి = నా యందు; చేతః = చిత్తమును ధారయతః = నిల్పుచున్న; యోగినః = యోగికి; సిద్ధయః = అణిమాదిసిద్ధులు; ఉపతిష్ఠంతి = వాని యంతన అవే వచ్చి చేరుచున్నవి.

తా. ఇంద్రియములను జయించినవాడై, స్థిరచిత్తుడై, ప్రాణాయామపరుడై, శ్వాసను జయించినవాడై, నా యందు నిశ్చలముగా చిత్తమును నిల్పుచున్న యోగికి అణిమాది సిద్ధులు వాని యంతన అవి కలుగుచున్నవి.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను.

శ్లో. కయా ధారణయా కాస్వి త్కథం వా సిద్ధిరచ్యుత
కతి వా సిద్ధయో బ్రూహి, యోగినాం సిద్ధిదో భవాన్. **2**

అ. అచ్యుత = ఓ అచ్యుతా !; కయా ధారణయా = ఏ ధారణా యోగముచే; కాస్విత్ = ఏది; సిద్ధిః = సిద్ధి; కథం = ఎట్టిది; సిద్ధయః కతి వా = సిద్ధులు ఎన్నియో; బ్రూహి = చెప్పుము; యోగినాం = యోగులకు; భవాన్ = నీవు; సిద్ధిదః = సిద్ధులొసంగువాడవు గదా !

తా. ఓ అచ్యుతా! ఏ ధారణ (యోగము)చే ఏ సిద్ధి కలుగును? ఆ సిద్ధి స్వరూప మెట్టిది? సిద్ధు లెన్ని? నీవు యోగులకు సిద్ధి నొసంగువాడవు. కావున నాకు తెలుపుము.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. సిద్ధయోఽష్టాదశ ప్రోక్తా ధారణాయోగపారగైః
తాసా మష్టౌ మత్ప్రధానాః, దశైవ గుణహేతవః. 3

అ. ధారణా యోగ పారగైః = ధ్యాన యోగ సిద్ధిని గాంచిన యోగులచే; త్రికాల జ్ఞానము లోనగు, క్షుద్ర సిద్ధులను, అన్యములనుగూడ వారెఱుంగుదురని భావము; సిద్ధయః = సిద్ధులు ధారణలును; అష్టాదశ-ప్రోక్తాః = పదునెనిమిది చెప్పబడినవి తాసాం = పదునెనిమిదింటిలో; మత్ప్రధానాః = నేను ముఖ్యముగా గలవైన సిద్ధులు, స్వభావమును బట్టి నేను ఆశ్రయుడనుగా గలవి; అష్టౌ = ఎనిమిది మాత్రము; దశ = తక్కిన పది సిద్ధులు; గుణ హేతవః = సత్వ గుణోత్కర్ష హేతువుగా గలవి యగును.

తా. ధ్యాన యోగసిద్ధిని పొందిన యోగులు, సిద్ధులు పదునెనిమిది అని చెప్పుదురు. నేను ముఖ్యముగా స్వభావమును బట్టి, ఆశ్రయుడనై యున్న సిద్ధులు ఎనిమిది మాత్రమే. అవి నా సారూప్యమును బొందినవి ఇంచుక న్యూనగుణము గలవి యగును. తక్కిన పది సిద్ధులును సత్వ గుణోత్కర్ష హేతువుగా నేర్పడునవి.

అవ. వానిని ఐదున్నర శ్లోకములచే స్వరూపములతో నిర్దేశించుచున్నారు—

శ్లో. అణిమా మహిమా మూర్తే ర్లఘిమా ప్రాప్తి రింద్రియైః
ప్రాకామ్యం శ్రుతదృష్టేషు, శక్తిప్రేరణ మీశితా. 4

అ. అణిమా = మిక్కిలి సూక్ష్మరూపము పొందుట; మహిమా = మిక్కిలి స్థూల రూపము పొందుట; లఘిమా = తేలిక రూపమును పొందుట; మూర్తేః = దేహమునకు సంబంధించినవి మూడు సిద్ధులు; ప్రాప్తిః = ప్రాప్తి యను సిద్ధి, ఇంద్రియైః = ఇంద్రియములతో గూడి ఆయా ఇంద్రియాధిదేవతల రూపము తోడి సంబంధము గలది; శ్రుతదృష్టేషు = చూడబడిన వినబడిన వగు పారలౌకికములు దర్శన యోగ్యమును వగు ఎల్ల వాని యందు, భూబిలాదులు కప్పబడిన వాని యందును; ప్రకామ్యం = ప్రాకామ్యమను సిద్ధి, భోగవస్తు దర్శనమందు సామర్థ్యరూపమైన శక్తి, ప్రాకామ్యసిద్ధి యగును; శక్తి ప్రేరణం=శక్తియనగా మాయ ఆ మాయ అంశమున జనించిన ఐశ్వర్య జ్ఞానాదిశక్తుల యొక్క పైకి తెలియవచ్చునది, అందు ఈశ్వరునందు మాయా ప్రేరణము; ఇతరప్రాణులందు మాయాంశములైన జ్ఞానాదిశక్తి ప్రేరణము; ఈశితా = ఈశిత్వసిద్ధి యగును.

తా. అణిమ = మిక్కిలి సూక్ష్మరూపమును పొందుట, మహిమ మిక్కిలి స్థూల రూపము పొందుట, లఘిమ = మిక్కిలి తేలిక రూపమును పొందుట. అనునిట్టివి మూడు సిద్ధులు దేహమునకు సంబంధించినవి. ప్రాణుల యొక్క చక్షురాదులగు నింద్రియములతో, ఆయా ఇంద్రియాధిదేవతలగు ఆదిత్యాదుల రూపముతో సంబంధము గలిగి యుండుట ప్రాప్తి యను సిద్ధి యగును. అనగా చక్షు రింద్రియము ద్వారా సూర్యుని పొందగల్గుట. శ్రుతి

వలన విన్న పరలోక సంబంధులు, ప్రత్యక్షముగా దర్శనయోగ్యములైన ఇహలోక సంబంధులు నగు అధోలోకములగు పాతాళాది లోకములకు సంబంధించినవియు నగు, భోగ వస్తువుల దర్శించు సామర్థ్య రూపమైనది ప్రాకామ్యసిద్ధి యగును. శక్తి యనగా మాయ. దాని యంశములు జ్ఞానైశ్వర్య వీర్యాదులు. ఈశ్వరునందు మాయ ఇతర ప్రాణులందు తదంశములగు జ్ఞాన వీర్యాదులు ప్రకోపించుట ఈశిత యను సిద్ధి యగును.

శ్లో. గుణే ష్వసంగో వశితా, యత్కామః స్తదవస్యతి
ఏతా మే సిద్ధయః సౌమ్య అష్టా వౌత్పత్తికా మతాః. 5

అ. గుణేషు = విషయభోగములందు; అసంగః = ఆసక్తిలేకుండుట; వశితా = వశిత యను సిద్ధియగును; యత్ + కామః = ఏ యే సుఖమును గోరుచున్నాడో; తత్ + అవస్యతి = దాని యవధిని హద్దును పొందునది; సౌమ్య = ఓ సౌమ్యుడా! ఏతా, మే, సిద్ధయః = ఇవి నాకు సంబంధించిన సిద్ధులు; అష్టా = ఎనిమిది; ఔత్పత్తికాః, మతాః = స్వాభావికములు, నిరతిశయములని ప్రసిద్ధి కెక్కినవి.

తా. విషయ భోగములందు ఆసక్తి లేకుండుట, వశిత యను సిద్ధి యగును. ఇదియే సుఖమును గోరిన, ఆ సుఖమును చేకూర్చునది. ఇవి యెనిమిదియు స్వాభావికములు, నిరతిశయములునై నాకు సంబంధించిన సిద్ధులై యున్నవి.

అవ. గుణహేతుకములైన సిద్ధులను చెప్పుచున్నారు.

శ్లో. అనూర్మిమత్త్వం దేహేఽస్మిన్ దూరశ్రవణదర్శనం
మనోజవః కామరూపం, పరకాయప్రవేశనమ్. 6

అ. అస్మిన్ దేహే = ఈ దేహమునందు; అనూర్మిమత్వం = క్షుత్పిపాసలు లేకుండుట; దూరశ్రవణదర్శనం = దూరదేశమునందలి శబ్దమును వినుట, రూపమును చూచుట అనునవి రెండు సిద్ధులు; మనోజవః = మనోవేగమువ దేహగమనమును; కామరూపం = కామితరూపప్రాప్తి; పరకాయప్రవేశనం = ఇతరుల శరీరమందు ప్రవేశించుట.

తా. ఈ శరీరమందు ఆకలిదప్పులు లేకుండుట, దూరప్రదేశమునందలి శబ్దమును వినుట, రూపమును చూచుట. మనోవేగమున నొండు ప్రదేశమునకు దేహముతో బోవుట, ఇష్టమగు రూపును పొందుట, పరకాయమందు ప్రవేశించుట ఈ యాఱును సత్వగుణోత్కర్షచే నగు సిద్ధులు.

శ్లో. స్వచ్ఛందమృత్యుః దేవానాం సహక్రీడానుదర్శనం
యథాసంకల్పసంసిద్ధి రాజ్ఞాఽప్రతిహతా గతిః. 7

అ. స్వచ్ఛందమృత్యుః = తన యిచ్ఛ వచ్చినపుడు మరణించుట; దేవానాం సహ = అప్సరసలతో గూడిన దేవతల యొక్క; క్రీడానుదర్శనం = జల క్రీడా విహారాదులను చూచుట; యథాసంకల్ప సంసిద్ధిః = తన సంకల్పానురూపమైన ప్రయోజన సిద్ధి; అప్రతిహతా; గతిః ఆజ్ఞా = అడ్డు లేనిదై తనంతట చలామణి యగు ఆజ్ఞ.

తా. తన యిచ్ఛ వచ్చినపుడు తాను మరణించు శక్తి, ఆచ్చర లేమలతో గూడిన వేల్పులయొక్క క్రీడావిహారాదులను దర్శించుట, తన సంకల్పమునకు తగినట్లు తన కార్యము సిద్ధించుట, అడ్డు లేక చలామణి యగు ఆజ్ఞ యనునవి చేరి పది సిద్ధు లగును.

శ్లో. త్రికాలజ్ఞత్వ మద్వంద్వం పరచిత్తాద్యభిజ్ఞతా
అగ్న్యర్కాంబువిషాదీనాం ప్రతిష్టంభోఽ పరాజయః. **8**

అ. త్రికాలజ్ఞత్వం = భూత భవిష్యాది మూడు కాలముల స్థితి నెఱుంగుట; అద్వంద్వం = శీతోష్ణాదుల బాధ లేమి; పరచిత్త + ఆది + అభిజ్ఞతా = ఇతరుల తలంపు లోనగువానిని తెలియుట; అగ్ని + అర్క + అంబు విష + ఆదీనాం = అగ్ని, సూర్యుడు, జలము, విషము అను వాని యొక్క; ప్రతిష్టంభః = స్తంభింపఁజేయుట; అపరాజయః = ఓటమి లేకుండుట.

తా. భూతభవిష్యద్వర్తమానములను మూడు కాలముల స్థితిగతు లెఱుంగుట, చలి వేడిముల పీడకు లోను గాకుండుట, అన్యుల ఉద్దేశ్యము తెలియుట, అగ్ని, సూర్యుడు, జలము, విషము లోనగు వానిని స్తంభింపఁజేయుట, ఎవరివలన అపజయము లేకుండుట అను ఈ ఐదును క్షుద్రసిద్ధు లగును.

అవ. ఆయా వాని ధారణాదులతోఁగూడ ఆ సిద్ధులను విశేషముగా నిరూపించు చున్నారు.

శ్లో. ఏతా శ్చోద్దేశతః ప్రోక్తా యోగధారణసిద్ధయః
యయా ధారణయా యత్స్యా ద్యథా స్యాత్తన్నిబోధ మే. **9**

అ. ఏతాః యోగధారణసిద్ధయః = ఇవి ధారణాయోగముచే గలుగు సిద్ధులు; ఉద్దేశతః ప్రోక్తాః = ఉద్దేశించిన క్రమమున చెప్పబడినవి; యయా ధారణయా = ఏ ధారణచే; యత్ స్యాత్ = ఏ సిద్ధి కల్గును; యథా స్యాత్ = ఏ విధముగా కల్గును; తత్ మే నిబోధ = దానిని నా వలన తెలిసికొనుము.

తా. మొదట నుద్దేశించిన క్రమము ననుసరించి ధారణాయోగము వలన కలుగు సిద్ధులు అన్నియు చెప్పబడినవి. ఇక యే ధారణచే ఏ సిద్ధి కలుగును ? ఏ విధముగా కల్గును? అను దానిని నేను చెప్పెదను తెలిసికొనుము.

శ్లో. భూతసూక్ష్మాత్మని మయి తన్మాత్రం ధారయన్ మనః
అణిమాన మవాప్నోతి తన్మాత్రోపాసకో మమ. **10**

అ. భూత సూక్ష్మ + ఆత్మని, మయి = పృథివ్యాది పంచ భూతముల సూక్ష్మ స్వరూపుడనైన, నా యందు; తన్మాత్రం = భూత సూక్ష్మాకారమైన; మనః ధారయన్ = మనస్సును నిల్పుచున్నవాడు; మమ అణిమానం = నా సంబంధియైన అణిమ సిద్ధిని; అవాప్నోతి = పొందు చున్నాడు.

తా. పృథివ్యాది పంచభూతముల స్వరూపుడనైన నా యందు మనస్సును నిల్పుచు, శబ్దాది తన్మాత్రల నుపాసించువాడు, నా సంబంధియైన యణిమా సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో. మహత్యాత్మ న్మయి పరే యథా సంస్థం మనో దధత్
మహిమాన మవాప్నోతి భూతానాం చ పృథక్ పృథక్. **11**

అ. మహతి+ఆత్మన్ = మహత్తత్త్వోపాధిగల; పరే మయి = పరుడనైన నాయందు; యథాసంస్థం = ఆ మహత్తత్త్వాకారమైన, మనః దధత్ = మనస్సును నిల్పుచున్నవాడై; మహిమానం, అవాప్నోతి = మహిమ యను సిద్ధిని పొందుచున్నాడు; భూతానాం చ = ఆకాశాది భూతముల ఉపాధి గల నా యందు మనస్సును నిల్పుచున్నవాడై అయా భూతముల యొక్క మహత్త్వమును; పృథక్ పృథక్ = వేఱువేఱుగా పొందుచున్నాడు.

తా. మహత్తత్త్వము (సమిష్టి బుద్ధి) ఉపాధిగాగలిగి పరుడైన నా యందు మనస్సును స్థిరముగా నిల్పి, యుపాసించినవాడు మహిమ సిద్ధిని పొందుచున్నాడు. అట్లే ఆకాశాది పంచ భూతోపాధికుడనైన నా యందు మనస్సు నిల్పి ధ్యానించినవాడు ఆభూతముల యొక్క ప్రత్యేకమగు మహత్త్వమును (గొప్పతనమును) పొందుచున్నాడు.

శ్లో. పరమాణుమయే చిత్తం భూతానాం మయి రంజయన్
కాలసూక్ష్మార్థతాం యోగీ లఘిమాన మవాప్నుయాత్. **12**

అ. భూతానాం = వాయువు లోనగు పరమాణువు లుపాధిగా గల; మయి = నా యందు; చిత్తం రంజయన్ = చిత్తమును స్థిరముగా నిల్పి ధ్యానించుచున్న; యోగీ = యోగి; కాలసూక్ష్మ+అర్థతాం = కాలము యొక్క పరమాణువు లుపాధిగా గల రూపత్వమును; లఘిమానం, అవాప్నుయాత్ = లఘిమాసిద్ధిని పొందును.

తా. వాయ్వాది భూతముల పరమాణువు లుపాధిగా గల నా యందు చిత్తమిడి, ధ్యానించు యోగి కాల పరమాణువు లుపాధిగాగల రూపధర్మమును, లఘిమాసిద్ధిని పొందును.

అవ. లఘుత్వ వివరణ మిట్లు చెప్పబడినది.

శ్లో స కాలః పరమాణు ర్వై యో భుంక్తే పరమాణుతామ్.
ధారయన్ మయ్యహం తత్త్వే మనో వైకారికేఽఖిలం
సర్వేంద్రియాణా మాత్మత్వ ప్రాప్తిం ప్రాప్నోతి మన్మనాః. **13**

అ. సః కాలః పరమాణుః = ఆ కాలము పరమాణు వగును; యః పరమాణుతాం భుంక్తే = పరమాణుత్వమును పొందుచున్నా డనగా పరమాణూపాసకుడు పరమాణు ధర్మమును పొందుచున్నాడు. వైకారికే = సాత్త్వికమైన; అహంతత్త్వేమయి = అహంకార ముపాధిగా గల నా యందు; అఖిలం మనః ధారయన్ = ఏకాగ్రమైన మనస్సును నిల్పుచు; సర్వ+ఇంద్రియాణాం = ఎల్ల ఇంద్రియముల యొక్క; ఆత్మత్వం = అధిష్ఠాతల ధర్మమును; ప్రాప్తిం = ప్రాప్తి యను సిద్ధిని పొందుచున్నాడు. ఇందుకు హేతువుమన్మనాః = నా యందు మనోధారణ ప్రభావము వలననే (ప్రభావము) ప్రాప్తిసిద్ధి కలుగుచున్నది. ఇందు అతీత హేతు వనుసంధించదగినది లేదు. ఈ ప్రకారమే

శ్లో. మద్ధారణీయథావేవ మద్యోగ బల మాశ్రితః.

నా యందు ధారణా ప్రభావము చేతనే నా యోగబలము నాశ్రితు డగును.

తా. సాత్త్వికమైన అహంకార తత్త్వ ముపాధిగా గల నాయందు ఏకాగ్రమైన మనస్సును స్థిరముగా నిల్పుచున్న యోగి, ఇంద్రియాధిష్ఠాతల ధర్మమగు ప్రాప్తిసిద్ధిని పొందుచున్నాడు. ఇందుకు హేతువు నా యందు గల ధారణాయోగప్రభావమే.

శ్లో. మహ త్యాత్మని యః సూత్రే ధారయన్ మయి మానసం
ప్రాకామ్యం పారమేష్ఠ్యం మే విందతేఽ వ్యక్త జన్మనః. 14

అ. మహతి+ఆత్మని = క్రియా శక్తి ప్రధానమైన మహత్తత్త్వము; సూత్రే = సూత్రాత్మ ఉపాధిగా గల; మయి = నా యందు; యః = ఎవడు; మానస , ధారయన్ = మనస్సు నిల్పి ధ్యానించుచున్నవాడై; అవ్యక్త జన్మనః = తెలియని జన్మము కలవాడైన, జన్మరహితుడైన; మే = నా యొక్క; పారమేష్ఠ్యం = సర్వోత్కృష్టమైన; ప్రాకామ్యం, విందతే = ప్రాకామ్యమను సిద్ధిని పొందుచున్నాడు.

తా. క్రియాశక్తి ప్రధానమైన మహత్తత్త్వము సూత్రాత్మ ఉపాధిగా గల నా యందు మానసము నిల్పి ధ్యానించుచున్న వాడు, జన్మము తెలియని జన్మము లేని జన్మరహితుడనైన నా యొక్క సర్వోత్కృష్టమైన ప్రాకామ్యమను సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో. విష్ణౌ త్ర్యధీశ్వరే చిత్తం ధారయన్ కాలవిగ్రహే
స ఈశిత్వ మవాప్నోతి క్షేత్రజ్ఞ క్షేత్ర చోదనామ్. 15

అ. త్రి+అధీశ్వరే = త్రిగుణాత్మిక యగు మాయకు నియంతయై; కాలవిగ్రహే = అహోరాత్రాది కాల రూపమున గణన కెక్కిన, అంతర్యామి యందు; చిత్తం ధారయన్ = చిత్తమును నిల్పి ధ్యానించుచున్న; సః = అతడు (యోగి); క్షేత్రజ్ఞ క్షేత్ర చోదనాం = జీవులను వారికి క్షేత్రములై ఉపాధులైన శరీరమందు మఱి వారి కుపాధులగు వారిని ప్రేరేపించునది, వాని వాని వ్యవహారములను వ్యవహరింప పురికొల్పునదైన (విశ్వమునకు కర్త యగు బ్రహ్మ మొదలగు వారిని ప్రేరేపించునది కాదు); ఈశిత్వం - అవాప్నోతి = ఈశిత్వ మను సిద్ధిని పొందుచున్నాడు.

తా. త్రిగుణాత్మిక యగు మాయను నియమించు నియంతయై, అహోరాత్రాది కాల విభాగమును గణించు కాలస్వరూపుడై, అంతర్యామియైన నా యందు చిత్తమిడి ధ్యానించు ఆ యోగి, జీవులను వారి క్షేత్రములగు శరీరములను, వారి కుపాధులగు అంతఃకరణాదులను వాని వాని వ్యవహారమును నిర్వహింపఁ బురిగొల్పునదైన (విశ్వమును సృజించు బ్రహ్మ లోనగువారిని ప్రేరేపించునది కాదు) ఈశిత్వ మను సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో. నారాయణే తురీయాఖ్యే భగవచ్ఛబ్దశబ్దితే
మనో మ య్యాదధ ద్యోగీ మద్ధర్మా వశితా మియాత్. 16

అ. "తురీయ+ఆఖ్యే = తురీయుడు (నాలుగవ వాడు) అను పేరు గల

శ్లో. విరాడ్ఢిరణ్యగర్భశ్చ, కారణం చేత్యుపాధయః.
ఈశస్య యత్త్రిభి ర్హీనం, తురీయం తత్పదం విదుః"

ఈశ్వరునికి, విరాట్టు, హిరణ్యగర్భుడు, మాయ అని మూడు ఉపాధులు గలవు ఈ మూడు ఉపాధులు లేనివాడు, అ విధము తురీయపదము తురీయుడగు అందఱికి అధికుడగు: భగవత్ శబ్ద శబ్దితే = భగవంతుడను శబ్దముచే పలుకబడువాడు.

శ్లో. ఐశ్వర్యస్య, సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరితః.

సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆరును భగమని చెప్పబడును. ఇవి గలవాడు భగవంతుడు.

నారాయణే మయి = నారాయణుడైన నా యందు; మనః ఆదధత్ = మనస్సు నుంచుచున్న యోగి; మద్ధర్మః = నా ధర్మము గలవాడై; వశితాం ఇయాత్ = వశిత్వ మను సిద్ధిని పొందుచున్నాడు.

తా. విరాట్టు, హిరణ్యగర్భుడు, మాయ అను ఉపాధులు లేనిది తురీయమను పద మేది కలదో, అదియే తురీయుడను పేరు గల నారాయణుడు సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అను ఆరును భగమనబడును. ఆ యారు గుణములు గలిగిన వా డగుట వలన భగవంతుడని పేర్కొనబడుచున్నాడు. ఆ నారాయణుడైన నా యందు మనస్సుంచి, ధ్యానించు యోగి నా ధర్మము గలవాడై వశిత్వమను సిద్ధిని పొందుచున్నాడు.

శ్లో. నిర్గుణే బ్రహ్మణి మయి ధారయన్ విశదం మనః
పరమానంద మాప్నోతి యత్ర కామోఽవసీయతే. **17**

అ. నిర్గుణే బ్రహ్మణి మయి = ఏ గుణములు స్ఫురింపని నాయందు; విశదం మనః ధారయన్ = నిర్మలమైన మనస్సు నిల్పి ధ్యానించు యోగి, పరమానందం = పరమానంద స్వరూపుని నన్ను; ఆప్నోతి = పొందుచున్నాడు; యత్ర = ఏ పరమానంద స్వరూపమునందు; కామః = సమస్తమైన కామము; తదంశము; అవసీయతే = సమాప్తి గాంచుచున్నదో.

తా. ఏ గుణములు ప్రస్ఫురించని నిర్గుణ బ్రహ్మమైన నాయందు నిర్మలమైన మనస్సు నుంచి, ధ్యానించు యోగి, ఎవ్వని సమస్త కామములను, తదంశములను పరిసమాప్తి నొందుచున్నవో (ఇంకను కామించవలసినవి లేవనుట) అట్టి పరమానంద రూపుని నన్ను పొందుచున్నాడు.

శ్లో శ్వేత ద్వీపపతౌ చిత్తం శుద్ధే ధర్మమయే మయి
ధారయన్ శ్వేతతాం యాతి షడూర్మిరహితో నరః. **18**

అ. శ్వేతద్వీపపతౌ = శ్వేతద్వీపమునకు పతినైయ; ధర్మమయే, శుద్ధే, మయి = ధర్మస్వరూపుడై, శుద్ధ సత్త్వమూర్తియైన, నాయందు; చిత్తం ధారయన్ = చిత్తముంచి ధ్యానించువాడు; షట్ + ఊర్మిరహితః = ఆకలి దప్పులు, శోక మోహములు, జనన మరణములు, అను ఆరు ఊర్ములు లేనివాడు; నరః శ్వేతతాం యాతి = నరుడు శుద్ధస్వరూపమును పొందుచున్నాడు.

తా. శ్వేతద్వీపమునకు ప్రభువై శుద్ధ సత్త్వమూర్తియై ధర్మస్వరూపుడైన నా యందు చిత్తము నిల్పి ధ్యానించువాడు క్షుత్పిపాసలు, శోక మోహములు, జన్మమరణములు లేనివాడై నరుడు శుద్ధ స్వరూపుడై నా ధర్మమును పొందుచున్నాడు.

శ్లో. మయ్యాకాశాత్మని ప్రాణే మనసా ఘోష ముద్వహన్
తత్రోపలబ్ధా భూతానాం హంసో వాచః శృణోత్యసౌ. **19**

అ. ఆకాశాత్మని = ఆకాశస్వరూపుడై: ప్రాణే = సమిష్టి ప్రాణస్వరూపుడ నైన నా యందు; మనసా ఘోషం + ఉద్వహన్ = మనస్సుచే నాదమును చింతించుచున్న వాడు; అసౌ హంసః = ఈ జీవుడు; తత్ర = ఆ ఆకాశమందు; ఉపలబ్ధా = జ్ఞాతమై; భూతానాం వాచః = అందున్న వివిధములైన ప్రాణుల యొక్క వాక్కులను; శృణోతి = వినుచున్నాడు లేక ఆకాశమునందు అభివ్యక్తములైన భూతముల వాక్కులను దూరమందుం డియే వినుచున్నాడు.

తా. ఆకాశస్వరూపుడై సమష్టి ప్రాణరూపుడైన నా యందు మనస్సుచే నాదమును చింతించుచు హృదయాకాశము నుండి ప్రాణాపానముల రాకపోకలను ధ్యానించువాడగు ఈ జీవుడు ఆ యాకాశమునందు అభివ్యక్తములైన వివిధములైన భూతముల వాక్కులను దూరము నుండియే వినుచున్నాడు.

శ్లో. చక్షు స్త్వష్టరి సంయోజ్య త్వష్టార మపి చక్షుషి
మాం తత్ర మనసా ధ్యాయన్ విశ్వం పశ్యతి సూక్ష్మదృక్. 20

అ. చక్షుః = చక్షురింద్రియమును; త్వష్టరి, సంయోజ్య = ఆదిత్యునందు కూర్చి; చక్షుషి = చక్షురింద్రియమునందు; త్వష్టారం + అపి = ఆదిత్యునైనను కూర్చి: తత్ర = ఆ యుభయుల సంయోగమందు; మాం = నన్ను; మనసా, ధ్యాయన్ = మనస్సుచే ధ్యానించువాడు; సూక్ష్మదృక్ = సూక్ష్మదృష్టి గలవాడై; విశ్వం పశ్యతి = జగత్తును దూరము నుండియే వినుచున్నాడు.

తా. చక్షురింద్రియము నాదిత్యుని యందు లేదా చక్షురింద్రియమం దాదిత్యుని కూర్చి ఆయుభయుల సంయోగమందు నన్ను మనసా ధ్యానించువాడు సూక్ష్మదృష్టికలవాడై దూరము నుండియే జగత్తును చూచును.

శ్లో. మనో మయి సుసంయోజ్య దేహం తదను వాయునా
మద్ధారణానుభావేన తత్రాత్మా యత్ర వై మనః. 21

అ. మనః, దేహం = మనస్సును, దేహమును; తదను వాయునా = ఆ దేహమునందు వర్తించు వాయువుచే; మయి సుసంయోజ్య = నాయందు చక్కగా కూర్చి; మత్ + ధారణా + అనుభావేన = నన్ను నిశ్చలముగా ధ్యానించు ప్రభావముచే; యత్ర వై = ఎచ్చటికి; మనః = మనస్సు పోవునో; తత్ర + ఆత్మా = అచ్చటికి దేహము పోవును. లేక; మనః = కర్తయగు మనస్సు తన్ను దేహమును వాయువుతో; మయి = నాయందు నమకూర్చి ఎచ్చటికి పోయినను దానివెంట దేహమును పోవును.

తా. మనస్సును దేహము నందు, దేహమునందు అనువర్తించు వాయువుతో చక్కగా జోడించి, ధారణాయోగముచే నన్ను ధ్యానించువాడు, ఆ యోగ ప్రభావముచే తన మనస్సు ఎచ్చటికి పోవుచున్నదో అచ్చటికి తన దేహమును తీసికొని పోగలుగుచున్నాడు.

శ్లో. యదా మన ఉపాదాయ యద్యద్రూపం బుభూషతి
తత్త ద్భవే న్మనో రూపం మద్యోగ బల మాశ్రయః. 22

అ. యదా మనః ఉపాదాయ = ఎప్పుడు మనస్సును ఉపాదానకారణముగా )కుండకు మన్ను ఉపాదాన కారణము అట్లు) గై కొని; యత్, యత్ రూపం = ఏ ఏ దేవతారూపమును; బుభూషతి = కా, గోరుచున్నాడో; తత్, తత్ మనః రూపం = ఆ యా మనస్సునకు ఇష్ట మైన రూపమును; మత్ + యోగబలం = ఏ నేను అచింత్యశ క్తినై నానాకారుడనై. యున్నానో అట్టి నాయందు మనస్సుయొక్క ధారణా యోగ ప్రభావము; ఆశ్రయః = కారణము గలవాడై యోగి అగుచున్నాడు.

తా. యోగి ఎప్పుడు తన మనస్సు నుపాదాన కారణముగా చేసి యే యే దేవతా రూపమును తాను కాగోరుచున్నాడో, అచింత్యశ క్తినై నానాకారుడనై యున్న నా యందు మనస్సు నిడి ధారణా యోగమున చింతించుచున్నాడో అప్పుడు ఆ నా ధారణా యోగ ప్రభా వము కారణముకాగా ఆయా దేవతారూపమును పొందుచున్నాడు.

శ్లో. పరకాయం విశన్ సిద్ధః ఆత్మానం తత్ర భావయేత్
పిండం హిత్వా విశేత్ ప్రాణో వాయుభూత షడంఘ్రివత్. **23**

అ సిద్ధః = సిద్ధుడు; పరకాయం విశన్ = ఏ ఇతర శరీరమును ప్రవేశింప గోరు చున్నాడో; తత్ర ఆత్మానం భావయేత్ = యితర శరీరమందు తన చిత్తమును అందు చేరు దానినిగా భావింపవలెను; పిండం, హిత్వా = అంత తన స్థూలరూపమును వీడి; ప్రాణః = ప్రాణప్రధానమైన లింగ శరీరోపాధికుడై; వాయుభూతః = బాహ్యవాయువును ప్రవేశించిన వాడై; ఆ మార్గమున నని యర్థము; షడంఘ్రివత్ = ఆఱు కాళ్ళు గల తుమ్మెదవలె; విశేత్ = పరకాయమును ప్రవేశింపవలెను.

తా. సిద్ధుడు ఏ పరకాయమును ప్రవేశింపగోరుచున్నాడో, ఆ పరకాయ మందు తన చిత్తమును ధారణా యోగమున ధ్యానించి, తరువాత తన స్థూల శరీరమును వీడి, ప్రాణము ప్రధానముగా గల సూక్ష్మ శరీరముతో గూడి బాహ్య వాయువునందు ప్రవేశించి, ఆ వాయువు ద్వారా ఆఱు కాళ్ళు గల తుమ్మెద ఎట్లు ఒక పుష్పము నుండి మఱియొక పుష్పమును ప్రవే శించునో అట్లే సునాయాసముగా పరకాయమును ప్రవేశింపవలెను.

అవ. పిండమును వీడి అని చెప్పబడినది. ఆ విధము చెప్పుచు, స్వచ్ఛందమరణమును చెప్పుచున్నాడు.

శ్లో. పార్ష్ణ్యా పీడ్య గుదం ప్రాణం హృ దురః కంఠ మూర్ధసు
ఆరోప్య బ్రహ్మరంధ్రేణ బ్రహ్మ నీత్వా త్యజే త్తనుమ్. **24**

అ. ప్రాణం = ప్రాణోపాధికుడైన జీవుని; హృత్, ఉరః, కంఠమూర్ధసు = లోపలి హృదయాకాశము, వెలుపలి వక్షము, కంఠము, శిరస్సు అను కానియందు; ఆరోప్య = ఆరో పించి; పార్ష్ణ్యా = కుడికాలి మడమచే; గుదం ఆపీడ్య = గుదస్థానమును నిరోధించి; బ్రహ్మ రంధ్రేణ =శిరస్సుపై గల బ్రహ్మరంధ్రము ద్వారా బ్రహ్మము లేక అపేక్షిత స్థానమును; నీత్వా = మనస్సుచే ప్రాపింపఁజేసి; తనుం త్యజేత్ = శరీరము త్యజింపవలెను.

తా. కాలి మడమచే గుదస్థానమును బిగించి ప్రాణోపాధికుడగు జీవుని హృదయా కాశమును, వక్షమును, వక్షము నుండి కంఠమును, కంఠము నుండి శిరస్సును చేర్చి, బ్రహ్మ రంధ్రము ద్వారా బ్రహ్మమును లేక తన యపేక్షిత స్థానమును చేర్చి ఈ శరీరమును వీడ వలెను.

శ్లో. విహరిష్యన్ సురాక్రీడే మత్స్థం సత్త్వం విభావయేత్
విమానే నోపతిష్ఠంతి సత్త్వవృత్తి సురస్త్రియః. 25

అ. సుర + ఆక్రీడే = దేవతల యుద్యానవనమందు; విహరిష్యన్ = విహరింప గోరు చున్నవాడై; మత్స్థం సత్త్వం = నాయందు గల శుద్ధసత్త్వమును; విభావయేత్ = చింతింప వలెను; సత్త్వ వృత్తి సురస్త్రియః = సత్త్వాంశమున జనించిన అప్సరసలు స్త్రీలు; విమా నేన, ఉపతిష్ఠంతి = విమానముతో చేరవత్తురు.

తా. దేవతల ఉద్యానవనమందు విహరింప గోరినవాడు నా యందున్న శుద్ధసత్త్వమును రజస్తమస్సులనంటని సత్త్వమును ధ్యానింపవలెను. అప్పుడు సత్త్వాంశ సంభూతలగు అప్సర స్త్రీలు విమానము నెక్కి వచ్చి, చెంత చేరుదురు.

శ్లో. యదా సంకల్పయేత్ బుద్ధ్యా యథా వా మత్పరః పుమాన్
మయి సత్త్వే మనో యుంజన్ తథా తత్సముపాశ్నుతే. 26

అ. మత్పరః పుమాన్ = నేనే శరణ్యముగా గల పురుషుడు; యథా వా = ఏ అకాల మందున, ఏ ప్రకారము గాని; సంకల్పయేత్ = దేనిని పొందవలెను, అని సంకల్పించుచున్నాడో; సత్త్వే, మయి = సత్త్వరూపుడైన నాయందు; మనః యుంజన్ = మనస్సును చేర్చుచున్న వాడై; తథా, తత్ సముపాశ్నుతే = ఆ ప్రకారము దాని ననురూపముగా సర్వమును పొందుచున్నాడు.

తా. నా యందత్యంత విశ్వాసము గలిగి, నన్నే శరణ్యునిగా గోరుచున్న పురుషుడు సత్త్వస్వరూపుడనైన నా యందు మనస్సును ఏ అకాలమందు గాని, ఏ ప్రకారము గాని, ఏమి కావలయునని సంకల్పించుచున్నాడో, ఆ ప్రకారము వాని ఇచ్ఛకనురూపమైన దాని నంతయును బొందుచున్నాడు.

శ్లో. యో మద్భావ మనుప్రాప్త ఈశితుః ర్వశితుః పుమాన్
న కుతశ్చి ద్విపద్యేత తస్య చాజ్ఞా యథా మమ. 27

అ. యః పుమాన్ = ఏ పురుషుడు; ఈశితుః = సర్వనియంతయు; వశితుః = స్వతంత్రు డైన; మత్ + భావం = నా యొక్క స్వభావమును; అనుప్రాప్తః = పొందినవాడు; యథా మమ ఆజ్ఞా = నాయాజ్ఞ ఎట్లో అట్లే; తస్యచ = వాని యాజ్ఞకూడ; న కుతశ్చిత్ విపద్యేత = దేనివలనను కొట్టువడదు.

తా. ఏ పురుషుడు సర్వ నియంతయు, స్వతంత్రుడైన నా స్వభావమును పొందిన వాడగునో, నాయాజ్ఞవలె, యతని యాజ్ఞయు చెల్లును. దేనివలనను అతడు కొట్టు వడడు. చెల్లుబడి కలిగియుండును.

శ్లో. మద్భక్త్యా శుద్ధచిత్తస్య యోగినో ధారణావిదః
తస్య త్రైకాలికీ సిద్ధిః జన్మ మృత్యూపబృంహితా. 28

అ. మత్ + భక్త్యా— శుద్ధ చిత్తస్య = నా యందలి భక్తిచే శుద్ధచిత్తుడైన; ధారణావిదః = క్షుద్రమగు ధారణా యోగము నెఱింగిన వాడగు; తస్య యోగినః = ఆ యోగికి; త్రైకాలికీ సిద్ధిః = త్రికాల వస్తు విషయముల నెఱుంగు సిద్ధి; జన్మ మృత్యు+ఉపబృంహితా =జన్మ మృత్యువులతో కూడినది అగుచున్నది. దీనిచే పరచిత్తాద్యభిజ్ఞత చెప్పబడినది.

తా. ఎవడు నా యందలి భక్తిచే నిర్మలచిత్తుడు, త్రికాల వేదియై ఈశ్వర ధారణా యోగ విదుడగుచున్నాడో (క్షుద్రధారణావిదుడు) ఆ యోగికి త్రికాల వస్తు విషయముల నెఱుంగు సిద్ధి, జన్మ మృత్యువులను గూడినదైన అనగా వానిని గూడ నెఱింగిన సిద్ధి కలుగు చున్నది దీనివలన పరుల చిత్తము నెఱుంగునది చెప్పబడెను.

శ్లో. అగ్న్యాదిభిః న హన్యేత మునే ర్యోగమయం వపుః
మద్యోగ శ్రాంతచిత్తస్య యాదసా ముదకం యథా 29

అ. మత్+ యోగశ్రాంతచిత్తస్యః = నా యందు చిత్తముంచి నల్పిన ధారణా యోగము చేత సఫలమైన చిత్తము గల; మునేః = ముని యొక్క; యోగమయం వపుః = అగ్ని లోనగు వాని వల్ల బాధలు లేనివాడవు నీవు. అని ఇట్టి యోగసిద్ధిని పొందిన శరీరము; యాదసాం ఉదకం యథా = జల జంతువులున్న యుదకము వలె; అగ్ని + ఆదిభిః న హన్యేత =అగ్ని లోనగు వానిచే బాధింపబడదు.

తా. నా యందు మనస్సుంచి ధారణాయోగమున విశ్రాంతి గాంచి సఫలమైన చిత్తము గల ముని యొక్క యోగప్రభావము జల జంతువులన్న ఉదకము వలె అగ్ని లోనగు వాని పీడను పొందదు. దీనిచే శీతోష్ణాది ద్వంద్వములు పీడింపవని చెప్పబడినది.

శ్లో మద్విభూతీ రభిధ్యాయన్ శ్రీవత్సాది విభూషితాః
ధ్వజాత పత్ర వ్యజనైః స భవే దపరాజితః. 30

అ. శ్రీవత్స+ ఆది విభూషితాః = శ్రీవత్సమను పుట్టుమచ్చ లోనగువానిచే అలంకరింపబడినవియు; ధ్వజ+ఆతపత్ర వ్యజనైః = టెక్కెము, తెల్ల గొడుగు, వీవనలు అనువానితో గూడినవియు అగు; మత్ + విభూతీః = నా అవతారములను; అభిధ్యాయన్ = ధ్యానించు చున్నవాడై ; సః = ఆ యోగి; అపరాజితః భవేత్ = ఓటమిని పొందని వాడగును.

తా. శ్రీవత్సమను పుట్టుమచ్చ లోనగు వానిచే నలంకరింపబడినవియు, ధ్వజము. శ్వేత ఛత్రము. వింజామరములు లోనగు వానితో గూడినవియునగు నా యవతారములు ధ్యానించు చున్న ఆ యోగి ఎప్పుడును ఎవని చేతను ఓటమిని పొందని వాడగును.

శ్లో. ఉపాసకస్య మామేవం యోగధారణయా మునేః
సిద్ధయః పూర్వకథితాః ఉపతిష్ఠం త్యశేషతః. 31

అ. మాం + ఏవం = ఈ ప్రకారము నన్ను; యోగ ధారణయా = వేలు వేలు యోగ ధారణలచే; ఉపాసకస్య మునేః = ఉపాసించు మునికి; పూర్వకథితాః సిద్ధయః = పూర్వము చెప్పబడిన అణిమాది సిద్ధులు, అశేషతః = సంపూర్ణముగా; ఉపతిష్ఠంతి = సిద్ధించుచున్నవి.

తా. ఈ ప్రకారము నన్ను వేలు వేలు ధారణా యోగములచే ధ్యానించుచు ఉపాసించు మునికి పూర్వము నేను చెప్పిన అణిమాది సిద్ధులు పూర్తిగా సిద్ధించుచున్నవి.

అవ. లేక వివిధములైన ధారణా యోగములు అభ్యసించు ప్రయాస పడుట లేక ఒక్క ధారణ చేతనే సర్వసిద్ధులు గలుగుచున్నవని చెప్పుచున్నారు.

శ్లో॥ జితేంద్రియస్య దాంతస్య జితశ్వాసాత్మనో మునేః
మద్ధారణాం ధారయతః కా ను సిద్ధి స్సుదుర్లభా. 32

అ. జితేంద్రియస్య = ఇంద్రియముల నెల్ల జయించినవాడు; దాంతస్య = ఇంద్రియములు నిశ్చలములు చేసి, జితశ్వాస + ఆత్మనః = ప్రాణాపానముల నిరోధించి మనస్సును నిగ్రహించినవాడై; మత్ + ధారణాం ధారయతః = తురీయుడై నారాయణుడైన నా యందు ధారణ యోగమును అభ్యసించువానికి; కా ను సిద్ధిః సుదుర్లభా = ఏ సిద్ధి దుర్లభమగును ? అన్ని సిద్ధులు సిద్ధించునని భావము.

తా. ఇంద్రియములు వెలుపల పోనీక నిరోధించుట ద్వారా జితేంద్రియుడై, ఉచ్ఛ్వాస నిశ్వాసములు అరికట్టుట ద్వారా ప్రాణవాయువును స్తంభింపఁజేసినవాడై మనో నిగ్రహము గలవాడై నారాయణుడైన నా యందు చిత్తమిడి ధారణాయోగ మభ్యసించు మునికి ఏ సిద్ధి దుర్లభమగుచున్నది? ప్రతిసిద్ధియు సిద్ధించుచున్నది.

అవ ఈ ప్రకారము ఆ సిద్ధులు సిద్ధించినను అవి ప్రార్థింపదగినవి కావు అనుచున్నారు—

శ్లో॥. అంతరాయా న్వదం త్యేతాన్ యుంజతో యోగ ముత్తమమ్
మయా సంపద్యమానస్య కాలక్షపణ హేతవః. 33

అ ఉత్తమం యోగం యుంజతః = శ్రేష్ఠమైన ధారణా యోగము నభ్యసించు మునికి, మయా సంపద్యమానస్య = నాతో ప్రాపింపగోరువానికి యోగికి; కాలక్షేపణ హేతవః = కేవలము కాలముగడుపుటకు హేతువులనియు; ఏతాన్ = ఈ అణిమాది సిద్ధులను అంతరాయాన్ వదంతి = యోగవిఘ్నములైన వానినిగా పెద్దలు వచింతురు.

తా. ఉత్తమమైన ధారణాయోగ మభ్యసించు, నన్ను ప్రాపింపఁగోరు యోగికి, ఈ అణిమాది సిద్ధులన్నియు యోగ విఘ్నకారులనియు, ఇవి కేవలము కాలము గడుపుటకు మాత్ర ముపయోగించునని పెద్దలు వచింతురు.

అవ జన్మ చేతనే కొన్ని సిద్ధులు వచ్చుచున్నవి మత్స్యాదులు ఉదకమందు నిల్చియుండుట, పక్షులు ఆకసము నందు ఎగురుచుండుట ఇట్టివి. అందువలన ఇతర ఫలాపేక్ష

లేని ధారణాయోగ మొక్కటి అభ్యసింపదగినది. కామ్యములైన ఇతర ధారణలు కావని చెప్పుచున్నారు.

శ్లో. జన్మౌషధితపోమంత్రైః యావతీ రిహ సిద్ధయః
యోగే నాప్నోతి తాః సర్వాః నాన్యై ర్యోగగతిం వ్రజేత్. 34

అ. జన్మ + ఓషధి తపస్ + మంత్రైః = పుట్టుకచేత, ఓషధులచేత, తపస్సుచేతను, మంత్రపురశ్చరణచేతను; యావతీః సిద్ధయః = ఎన్నెన్ని సిద్ధులు కలుగుచున్నవో; తాః సర్వాః =వానినన్నిటిని; యోగేన+ ఆప్నోతి = నా ధారణారూపముచే పొందుచున్నాడు; అన్యైః ఇతరములైన ధారణాయోగములచే; యోగగతిం = యోగఫలము నా సాలోక్యమును; న వ్రజేత్ = వీడరాదు.

తా. జన్మము చేతను, ఓషధుల చేతను, తపస్సు చేతను మంత్రముల చేతను ఎన్నెన్ని సిద్ధులు సిద్ధించుచున్నవో ఆ సిద్ధులన్నింటిని నా ధారణాయోగముచే పొందుచున్నాడు. ఇతర ధారణా యోగముల నభ్యసించినను, యోగఫలమగు నా సాలోక్యము త్యజింపకూడదు.

అట్లే పతంజలి చెప్పినాడు—

జన్మౌషధి తపోమంత్ర యోగజాః సిద్ధయః స్మృతాః

ఇట్లు ఏయే సిద్ధులు గలవో ఆ సిద్ధులన్నియు ఉత్తమమగు నా ధారణా యోగము చేతనే లభించుచున్నవి. కావున ఇతర ధారణాయోగము నభ్యసించుట చేత నాసాలోక్యము పొందు నా ధారణాయోగమును వీడకూడదు. అనగా ఇవి కూడదు. నా సాలోక్యము పొంద జేయు ఉత్తమ యోగధారణయే ముఖ్యము.

శ్లో. సర్వాసా మపి సిద్ధీనాం హేతుః పతి రహం ప్రభుః
అహం యోగస్య సాంఖ్యస్య ధర్మస్య బ్రహ్మవాదినామ్ 35

అ. సర్వాసాం సిద్ధీనాం =ఈ చెప్పిన ఎల్ల పద్ధతులకు; అహం = నేను; హేతుః = కారణము పతిః = పాలకుడు; ప్రభుః = ఈయ సమర్థుడు కేవలము సిద్ధులనే కాక మోక్షమునకు కూడ ప్రభువనుచున్నారు; అహం = నేను; యోగస్య = మోక్షమునకు; సాంఖ్యస్య = దానికి సాధనమగు జ్ఞానమునకు; ధర్మస్య = ధర్మమునకు, బ్రహ్మవాదినాం = ఆ ధర్మమునకు; బ్రహ్మవాదినాం = ఆ ధర్మ ముపదేశించు వేదవాదులకును, ప్రభువునై యున్నాను.

తా. ఇచ్చువాడును ప్రభువు నేనయి యున్నాను. మఱి నేనే మోక్షమునకును తత్సాధన మగు జ్ఞానమునకును దానికి మూలమగు ధర్మములకు ఆ ధర్మము నుపదేశించు వేదవాదులకును ప్రభువై యున్నాను

అవ. ఎందువలన ననగా చెప్పుచున్నారు—

శ్లో. అహమాత్మాఽంతరో బాహ్యోఽనావృతః సర్వదేహినాం
యథా భూతాని భూతేషు బహిరంతః స్వయం తథా. 36

అ. సర్వదేహినాం = ఎల్ల జీవులకు; అహం ఆత్మా = నేను ఆత్మనై యున్నాను; అంతరః = అంతర్యామి స్వరూపుడును; బాహ్యః = పైని వ్యాపించి యుండువాడును; అనావృతః = దేని చేతను ఆవరింపబడనివాడును; యథా = ఏ విధముగా; భూతాని = పంచ మహా భూతములు; భూతేషు = జరాయుజాది చతుర్విధములైన ప్రాణులందు; బహిః అంతః = వెలుపల, బయట, స్వయం = స్వయముగ నున్నవో; తథా = ఆ ప్రకారము.

తా. జరాయుజములు = మావితో పుట్టు నరులు లోనగువారు అండజములు = గ్రుడ్డుల ద్వారా జనించు పక్షులు లోనగునవి, స్వేదజములు = చెమట వలన జనించు దోమలు మొదలగునవి, ఉద్భిజ్జములు = భూమినుండి మొలకెత్తి పెరుగు వృక్షలతాదులు. లోనుగాగా ఈ నాలుగు విధములగు ఎల్ల ప్రాణులందు పృథివ్యాది పంచమహాభూతము లెట్లు వెలుపల స్థూలముగను, లోపల సూక్ష్మముగను, స్వయముగా వర్తించుచున్నవో అట్లే నేను ఎల్ల జీవులకు, ఆత్మనై, అంతర్యామినై, విరాట్టునై లోపల వెలుపల వ్యాపించి యుండుచు దేనిచేతను కప్పబడక యున్నాను.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే పంచదశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధమున పదునైదవ అధ్యాయము.

# పదునాఱవ అధ్యాయము

## సంగ్రహ శ్లోకములు

శ్లో. షోడశే తు హరే రావిర్భావయుక్తా విభూతయః,
జ్ఞానవీర్యప్రభావాదివిశేషే ణోపవర్ణితాః.
అంతశ్చిత్తేన యద్ధ్యాన మశక్య మకృతాత్మనామ్
అత స్తద్యోగతాప్రాప్త్యై విభూత్యాదినిరూపణమ్.
ఏవం తావ న్నవాధ్యాయ్యా మష్టప్రశ్నా నిరూపితాః,
బ్రహ్మత్వసంభవే తావత్ సప్తమాదిచతుష్టయే.
బంధముక్త్యోశ్చ నిర్ధారే సద్భక్త్యోశ్చ తతః పరే,
ద్వాదశేఽనంతరం కర్మ కృతత్యాగవ్యవస్థితౌ.
హంసేతిహాసతో యోగనిష్ఠాయాం చ త్రయోదశే,
శ్రేయస్సాధననిర్ధారే ధ్యానే నైవ చతుర్దశే.
ధారణాసిద్ధిభేదే చ ప్రసంగేన నిరంతరే,
ఉద్ధవప్రశ్నతో దత్త ముత్తరం హరిణోచితమ్.
షోడశే భూతివిస్తారో ద్వయో ర్వర్ణాశ్రమవ్రతే,
జ్ఞానాదినిర్ణయే చాతో యమాదీనాం చ నిర్ణయే.
యోగత్రయాధికారే తు వింశే చ తదనంతరమ్,
తత్త్వసంఖ్యావివాదే చ పుంప్రకృత్యో ర్వివేచనే.
జన్మమృత్యుప్రకారే చ ద్వావింశే దత్త ముత్తరమ్,
పరాపరాధసహనే చతుర్భి స్తదనంతరమ్.
సప్తవింశే క్రియాయోగప్రశ్నే తదుపవర్ణనమ్,
అష్టావింశే తతః ప్రోక్తా జ్ఞానయోగోపసంహృతిః.
సంసారసంభవప్రశ్నే తన్మధ్యే దత్త ముత్తరం,
తదశక్త్యా పునః ప్రశ్నే భక్తియోగోపసంహృతిః.
ఏవం ప్రశ్నోత్తరా ణ్యత్ర క్రమే ణైతాని వింశతిః.

ఈ షోడశాధ్యాయమందు శ్రీహరియొక్క ఆవిర్భావముతో గూడిన విభూతులు జ్ఞాన వీర్య ప్రభావాది విశేషములతో వివరింపబడినవి. ఇంద్రియజయము, మనోనిగ్రహము లేని వారలకు చిత్తము లోపల ధ్యానించుట అశక్యమగును. అందువలన అట్టి ధ్యానయోగప్రాప్తికి విభూతులు లోనగువానిని నిరూపించుట జరిగినది.

---

అశ్లేకచిత్తంబువం దత్తఅపడక భగవదాయత్తం బైవ యేకచిత్తంబువం బ్రసన్న చిత్తులై నరులు ముక్తు లగుదురు. అట్లుగాన నవిద్యావిద్యలు నా మాయగా విచారించి, కేవల పశుమార్గులు గాక, షడ్గుణైశ్వర్య సంపన్నులైన యోగీంద్రుల వగిది, మఖంబు గోరక

ఈ ప్రకారము తొమ్మిది (9) అధ్యాయములందు ఎనిమిది ప్రశ్నలు నిరూపింపబడినవి. బ్రహ్మత్వము సంభవించు విషయము మాత్రము 7వ అధ్యాయము మొదలు 4 నాలుగు అధ్యాయములందు, బంధము క్తులు సద్భక్తిద్వయము తర్వాతి పదునొకండవ(11)అధ్యాయమున పండ్రెండవ(22) అధ్యాయమునకర్మచేయుట - దాని త్యాగము అనువాని స్థితులు, త్రయోదశా (13)ధ్యాయమందు హంసోపాఖ్యానము వలన యోగనిష్ఠ, చతుర్దశాధ్యాయ(14) మందు శ్రేయస్సాధన నిర్ధారణము, పంచదశాధ్యాయ(15)మందు ధారణాసిద్ధుల భేదమును, ఉద్ధవప్రశ్నమును బట్టి శ్రీహరిచే నుత్తరమీయబడినది.

షోడశాధ్యాయ (16) మందు భూతివిస్తారము, పదునేడవ అధ్యాయమందు, వర్ణాశ్రమవ్రతములు, (18) అష్టాదశాధ్యాయమందు జ్ఞానాదినిర్ణయము, పందొమ్మిదవ (19) అధ్యాయమందు యమ నియమాదుల నిర్ణయము ఇరువదవ(20)అధ్యాయమందు యోగత్రయాధికారము, యిరువదియొక (21) అధ్యాయమందు తత్వ సంఖ్యా వివాదము, ప్రకృతిపురుష వివేకము, ఇరువది రెండవ (22)అధ్యాయమందు, జన్మమృత్యు ప్రకారము అనువానికి ప్రత్యుత్తరములు చెప్పబడినవి.

తరువాత ఇరువదిమూడు, నాలుగు, అయిదు, ఆరు, (23, 24, 25, 26), అధ్యాయములందు పరాపరాధసహనము, ఇరువది యేడవ అధ్యాయమందు క్రియాయోగప్రశ్నము వర్ణింపబడినవి. ఇరువదిఎనిమిదవ అధ్యాయమందు జ్ఞానయోగోపసంహారము, ఇరువది తొమ్మిదవ అధ్యాయమందు సంసారసంభవ ప్రశ్నము, వివరింపబడినవి. ముప్పది. ముప్పది యొకటి అధ్యాయము లందు భక్తియోగము ఉపసంహరింపబడినది. ఈ ప్రకారము ప్రశ్నోత్తరక్రమములు ఇరువది (20) చెప్పబడినవి.

అవ. అహమాత్మాంతరో బాహ్యోఽనావృత స్సర్వదేహినామ్
యథా భూతాని భూతేషు బహి రంతః స్వయం తథా.

అందు పంచభూతము లెట్లు ఒక్కొక్కచో నొక్కొక గుణవిశేషముచే ఉద్రేకమును పొందియు వేఱొకచో సామాన్య రూపమునను వర్తించుచున్నవో, అట్లే నీవు గూడ నెచట ఎట్లు వర్తింతువు అని విభూతులను ప్రశ్నించుటకు ప్రథమమున చెప్పబడిన సర్వాత్మకత్వమునే యనువదించుచున్నారు.

---

యుండు వారలు ముక్తులగుదురు. సర్వంబును విష్ణుమాయగాఁ దెలియుము. అని, యుద్ధవునకి జెప్పిన, నతండు, 'దేవా! నీ రూపం బెలాగునం గానవచ్చు. అనిన, నతం డిట్లనియె. భక్తి భావనా పరాయణుండై, కృపాపరతంత్రుడై. మితభాషణుండై, బొంకక, కర్మంబుల మదర్పణంబుగాఁ జేసిన యతండు భాగవతుండు. మత్కథలను మజ్జన్మ కర్మంబులను వినుచు, మత్సేవకు లయిన భాగవతులం జూచి, తన గృహంబునకుం గొనిపోయి, మజ్జన పూజన భోజన శయన వినయ ధ్యానంబులం బరితుష్టులం జేసిన యతండును భాగవతుం డనంబడు. ఇట్లెంత కాలంబు జీవించు నంతకాలము నడపు నతండు మద్రూపమున వైకుంఠ నిలయంబు నొందు. అదియునుం గాక, గంధ పుష్ప ధూప దీప నైవేద్యంబుల లక్ష్మీసమేతుండనై శంఖ, చక్ర

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను—

శ్లో. త్వం బ్రహ్మ పరమం సాక్షా దనాద్యంత మపావృతమ్,
సర్వేషా మపి భావనాం త్రాణస్థిత్యుద్భవాప్యయః. 1

అ. త్వం = నీవు, అనాది + అంతం = ఆద్యంతములు లేనిదియు; అనావృతం = నిరావరణము స్వతంత్రమును అగు; సాక్షాత్ పరమం బ్రహ్మ = సాక్షాత్తుగ పరబ్రహ్మ మగుదువు; సర్వేషాం భావానాం + అపి = ఎల్ల ప్రాణులకును; త్రాణస్థితి + ఉద్భవ + అప్యయః = రక్షణము, జీవనము అనువానితో గూడిన లయము ఉత్పత్తి గలవాడవై (ఉపాదానకారణముగా) ఉన్నావు.

తా. ఏది ఆద్యంతము లేనిదై, దేనిచేతను గూడ నావృతము గానిదై స్వతంత్రమై ఎల్ల ప్రాణులకు రక్షణము, జీవనము, ఉత్పత్తి, లయము కల్గించు నుపాదానకారణమై యున్నదో ఆ పరబ్రహ్మము సాక్షాత్తుగా నీవే అయియున్నావు.

అవ. ఇందు సదాచారము ప్రమాణ మనుచున్నారు—

శ్లో. ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయ మకృతాత్మభిః,
ఉపాసతే త్వాం భగవన్ ! యాథాతథ్యేన బ్రాహ్మణాః. 2

అ. ఉచ్చావచేషు భూతేషు = ఉత్తమ మధ్యమాధమములగు ఎల్ల భూతములందు; అకృత + ఆత్మభిః = స్థిరచిత్తులు కానివారిచే; దుర్జ్ఞేయం = ఎఱుంగశక్యముగాని; త్వాం = సర్వ భూతకారణుడగు నిన్ను; బ్రాహ్మణాః = వేదతాత్పర్యవిదులగు బ్రాహ్మణులు; యాథాతథ్యేన = యథార్థస్వరూపమున; ఉపాసతే = ఉపాసించుచున్నారు.

తా. ఎల్ల ప్రాణులందుండుచు నిశ్చలచిత్తులు కాని వారికి ఎఱుంగ శక్యము గాక సర్వభూతకారణుడై యున్న నిన్ను వేద తాత్పర్య విదులగు బ్రాహ్మణులు ఉపాసించుచున్నారు.

---

గదా శార్ఙ్గాది యుక్తుండ నైన నన్ను శుకసనకాది యోగీంద్రులు. అంబరీష విభీషణ రుక్మాంగదులు మొదలుగా గల భాగవతులు, శాస్త్రాచార బోధితులు గాక, భక్తిభావనా విశేషంబున నన్నెఱిఁగి, నిత్యంబును జింతనాయుక్తులై నన్నెఱింగిరి. మధురానగరంబునకు హలాయుధ సమేతుండ నైన యే నరుగుచో గోపిక లోపికలు లేక భక్తియోగంబునఁ జింతించి, ముక్తలైరి. ఇది భక్తియోగ ప్రకారంబు అని యుద్ధవునికిం జెప్పెను.

కం. ధ్యానం బే క్రియ నిలుచును, ధ్యానం బే రీతి దగు నుదారచరిత్రా !
ధ్యాన ప్రకార మంత య, నూనంబుగఁ జెప్పుమయ్య ! యుర్వీరమణా !

వ. అని యడిగిన నయ్యాదవేంద్రుం డిట్లని పలుకం దొడంగె. దారు మధ్యభాగంబున ననలంబు సూక్ష్మరూపమున వర్తించు చందంబున, నందంబై, సకల శరీరులయందు వచ్చేద్యుండును, నదాహ్యుండును, నశోష్యుండును నైన జీవుండు వసియించి యుండు. వనిన నుద్ధవుం డిట్లనియె, సనక సనందనాది యోగీంద్రులకు యోగమార్గం బే రీతి నానతిచ్చితివి. అది యే విధం బానతీవే అని యభ్యర్థించిన, నతం డిట్లనియె, వారలు చతుర్ముఖు నడిగిన నతండు

అవ. ఈ ప్రకారము కారణస్వరూపు డగుటచే సర్వాత్మకునిగా అనువదించి, విభూతులను గూర్చి ప్రశ్నించుచున్నారు—

శ్లో. యేషు యేషు చ భూతేషు యేన త్వాం పరమర్షయః,
ఉపాసీనాః ప్రపద్యంతే సంసిద్ధం త ద్వదస్వ మే. 3

అ. యేషు యేషు చ భూతేషు = ఏ ఏ భూతములందు; యేన = ఏ విధమున; త్వాం = నిన్ను; పరమర్షయః ఉపాసీనాః = ఋషిశ్రేష్ఠులు ఉపాసించువారై; ప్రపద్యంతే = 'నిన్ను' శరణు పొందుచున్నారో; తత్ సంసిద్ధం = ఆ సంసిద్ధమైన స్వరూపమును; మే వదస్వ = నాకు చెప్పుము.

తా. ఋషిశ్రేష్ఠులు నిన్ను ఏయే భూతములందు ఏరూపమున నుపాసించువారై, శరణు పొందుచున్నారో ఆ స్వతస్సిద్ధమైన నీ రూపమును నాకు తెలియజెప్పుము.

అవ ఆ దుర్జ్ఞేయత్వమును చెప్పుచున్నారు—

శ్లో. గూఢ శ్చరసి భూతానాం భూతాత్మా భూతభావనః,
న త్వాం భూతాని పశ్యంతి పశ్యంతం మోహితాని తే. 4

అ. భూతానాం = ప్రాణులలోపల; గూఢః చరసి = అవ్యక్తుడవై వర్తింతువు; భూత + ఆత్మా = భూతములకు అంతర్యామివై యున్నావు; భూతభావనః = భూతములను సృజించువాడవు; తే మోహితాని = నీచే మోహమును పొందిన; భూతాని = ప్రాణులు; పశ్యంతం న పశ్యంతి = వానిని చూచుచున్న నిన్ను చూడజాలవు

తా ఓ భగవంతుడా! నీవు ప్రాణుల లోపల తెలియరాక వర్తించుచున్నావు. నీవే సర్వభూతములందు అంతర్యామివై యున్నావు. ఓ ప్రాణులను సృజించువాడా! నీ మాయా మోహితములైన ప్రాణులు, తమ్ము చూచుచున్న నిన్ను చూడలేవు కదా!

---

నేను దెలియ నేర ననిన, వారలు విస్మయం బందుచుండ నే నాసమయంబున హంసస్వరూపుండనై, వారల కెఱింగించిన తెఱంగు వినుము. పంచేంద్రియంబులకు దృష్టంబైన పదార్థం బనిత్యంబు నిత్యదృష్టి బ్రహ్మంబని తెలియ వలయు. దేహి కర్మార్జిత దేహుండై, సంసార మమతల నిరసించి, నిశ్చల జ్ఞాన యుక్తుండై, మత్పద ప్రాప్తుండగు, స్వప్న లబ్ధ పదార్థంబు నిజము గాని క్రియ, గర్భామభవ పర్యంతంబు కళేబరంబు వర్తించునని, సాంఖ్యయోగమున సనకాదులకు నెఱిఁగించిన విని, బ్రహ్మ మొదలైన దేవత లెఱింగిరి. వారల వలన భూలోకంబునందుఁ బ్రసిద్ధంబయ్యె. అదిగావున నీవును నెఱింగికొని పుణ్యాశ్రమంబులకుం జనుము. అస్మదీయభక్తి యుక్తులను, హరిపరాయణులను నిరసింపక, యట్టి భాగవతుల చరణ రజఃపుంజంబు తన శరీరంబు సోఁకఁజేయు నతండును, ముద్రాధారణపరులకును హరి దివ్యనామంబు ధరియించు వారలకును నన్నోదకంబులు నిడునతఁడును, వాసుదేవభక్తులం గని హర్షించువాఁడును, భాగవతులు అని చెప్పి, మఱియు, సర్వసంగపరిత్యాగంబు చేసి, యొం డెఱుంగక, నన్నే తలంచు మానవునకు భుక్తి ముక్తి ప్రదాయకుండనై యుండుదు. అని యానతిచ్చిన నుద్ధవుండు, జ్ఞాన మార్గం బెరీతి యానతీయవలయు ననిన హరి యిట్లనియె. ఏకాంత మానసుండై, హస్తాబ్జం

అవ. ఆ విభూతులను సాకల్యముగా ప్రశ్నించుచున్నారు—

శ్లో. యాః కాశ్చ భూమౌ దివి వా రసాయాం
విభూతయో దిక్షు మహావిభూతే,
తా మహ్య మాఖ్యా హ్యనుభావితాస్తే
నమామి తే తీర్థపదాఙ్ఘ్రిపద్మమ్. 5

అ. మహావిభూతే = ఓ దొడ్డ విభూతులు గలవాడా! భూమౌ = భూతలమందు; దివి వా = స్వర్గముననైన; రసాయాం = పాతాళమున; దిక్షు = దిక్కులందు; తే అనుభావితాః = నీయందలి చిచ్ఛక్తి విశేషమున గూర్పబడినవో; తాః, మహ్యం, ఆఖ్యాహి = ఆ విభూతులను నాకు చెప్పుము; తే తీర్థపద + అరవిందం = నీయొక్క గంగాది పుణ్యతీర్థములకు స్థానమైన నీపాద కమలమును గూర్చి; నమామి = నమస్కరింతును.

తా. ఓ దొడ్డ విభూతులు గలవాడా! భూమి యందును, స్వర్గమునందు, పాతాళమందు, దిక్కులందు ఏ యే విభూతులను నీవు చిచ్ఛక్తిచే గూర్చియున్నావో ఆ విభూతులను నాకు చెప్పుము. గంగాది పుణ్య తీర్థములకు స్థానమైన నీ పాదపద్మములకు నమస్కారము చేసెదను

---

బూరుద్వయంబున సంధించి, నాసాగ్రంబున నీక్షణంబు నిలిపి, ప్రాణాయామంబున నన్ను హృదయగతుంగాఁ దలంచి, యష్టాదశ ధారణాయోగ సిద్ధు లెఱింగి, యందు నణిమాదులు ప్రధాన సిద్ధులుగాఁ దెలిసి, యింద్రియముల బంధించి, మనం బాత్మయందుఁ జేర్చి, యాత్మ నాత్మతోఁ గీలించిన బ్రహ్మపదంబుఁ బొందు భాగవతశ్రేష్ఠు లితర ధర్మంబులు మాని, నన్నుం గాంతురు. తొల్లి పాండునందనుం డగు నర్జునుండు యుద్ధరంగంబున విషాదంబు నొంది, యిట్లు యడిగిన, నతనికి నేఁ జెప్పిన తెఱంగు నెఱింగించెద.

భూతంబులందు నాధారభూతంబును, సూక్ష్మంబులయందు జీవుండును, దుర్జయంబుల యందు మనంబును, దేవతలయందుఁ బద్మగర్భుండును, వసువులయందు హవ్యవాహనుండును, నాదిత్యులయందు విష్ణువును, రుద్రులందు నీలలోహితుండును, బ్రహ్మలయందు భృగువును, ఋషులలోన నారదుండును, ధేనువులయందుఁ గామధేనువును, సిద్ధులలోనం గపిలుండును, దైత్యులలోఁ బ్రహ్లాదుండును, గ్రహంబులలోఁ గళానిధియును, గజంబులలో నైరావతంబును, హయంబులలో నుచ్చైశ్శ్రవంబును, నాగంబులలోన వాసుకియును, మృగంబులలోన గేసరియును, నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబును, వర్ణంబులలోన నోంకారంబును, నదుల యందు గంగయును, సాగరంబులలో దుగ్ధసాగరంబును, నాయుధంబులలోఁ గార్ముకంబును, గిరులయందు మేరువును, వృక్షంబులలో నశ్వత్థంబును, నోషధులలోన యవలును, యజ్ఞముల యందు బ్రహ్మయజ్ఞంబును, వ్రతంబులం దహింసయు, యోగంబులయందు నాత్మయోగంబును, స్త్రీలలోన శతరూపయు, భాషణంబులలోన సత్యభాషణంబును, ఋతువులందు వసంతాగమంబును, మాసంబులలో మార్గశీర్షంబును, నక్షత్రంబులలో నభిజిత్తును, యుగంబులయందు గృతయుగంబును, భగవదాకారంబులందు వాసుదేవుండును, యక్షులలో గుబేరుండును, వానరులయం దాంజనేయుండును, రత్నంబులయందుఁ బద్మరాగంబును, దానంబులలో నన్నదానంబును, దిథులయం దేకాదశియు, నరులయందు వైష్ణవుండై భాగవత ప్రవర్తనం బ్రవర్తించువాఁడును, నివియన్నియు మద్విభూతులుగా నెఱుంగుము. అని కృష్ణుఁ డుద్ధవున కుపన్యసించిన వెండియు నతం డిట్లనియె.

శ్రీకృష్ణ ఉవాచ = శ్రీ కృష్ణుడు వచించెను.

అవ. నరఋషి అవతారమైన అర్జునుని ప్రశ్న వంటిదేయగుట వలన నీ యీప్రశ్నము సాధుసమ్మత మగును అని అనుమోదించుచున్నారని మూడు శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. ఏవ మేత మహం పృష్టః ప్రశ్నం ప్రశ్నవిదాం వర,
యుయుత్సునా వినశనే సపత్నై రర్జునేన వై. 6

అ. ప్రశ్నవిదాం-వర = ప్రశ్న నెఱింగినవారిలో శ్రేష్ఠుడా! ఏవం = ఈ ప్రకారము; అహం = నేను; ఏతం = ఈ విభూతి విస్తరమును గూర్చి; సపత్నైః = శత్రువులతో; యుయుత్సునా = యుద్ధము చేయగోరిన; అర్జునేన = అర్జునునిచే; వినశనే = కురుక్షేత్రమందు పృష్టః = ప్రశ్నింపబడితిని.

తా. ఓ ప్రశ్నవిదులలో శ్రేష్ఠుడా ! నీ వడిగిన ప్రకారమే పూర్వము కురుక్షేత్రము నందు శత్రువులతోయుద్ధముచేయగోరిన అర్జును డీ విభూతుల విస్తరమునుగూర్చి నన్నడిగెను.

అవ. యుద్ధము చేయగోరినవానికి విభూతులను గూర్చిన ప్రసంగమెట్లు కల్గె ననగా అందులకు చెప్పుచున్నారు—

శ్లో. జ్ఞాత్వా జ్ఞాతివధం గర్హ్య మధర్మ్యం రాజ్యహేతుకమ్,
తతో నివృత్తో హంతాఽహం హతోఽ హమితి లౌకికః. 7

అ. రాజ్యహేతుకం = రాజ్యకాంక్ష కారణముగా కలదియు; అధర్మ్యం = అధర్మ సంగతమును; గర్హ్యం = నింద్యమైనదిగా; జ్ఞాతివధం = బంధువులవధను; జ్ఞాత్వా = ఎఱింగి; అహం, హంతా = నేను వీరిని బంధువులను చంపువాడను, అని; అహం హతః = నేను వీరిచే చంపబడువాడను, అని; లౌకికః = ప్రాకృతమతి గలవాడై; తతః = ఆ యుద్ధము నుండి; నివృత్తః = మఱలెను.

తా. రాజ్యప్రాప్తి కారణమై, అధర్మయుతమై, అతినింద్యమైనది ఈ బంధువధ అని ఎఱింగినవాడై అర్జునుడు నేను ఈ బంధువులకు హంతకుడను, వీరు నాకు హంతకులు అని ప్రాకృతబుద్ధి గలవాడై నేను యుద్ధము చేయ నొల్లనని మఱలెను.

శ్లో. స తదా పురుషవ్యాఘ్రో యుక్త్యా మే ప్రతిబోధితః,
అభ్యభాషత మామేవం యథా త్వం రణమూర్ధని. 8

అ. తదా = అప్పుడు, జ్ఞాతివధనుండి మఱలినవాడై; సః పురుషవ్యాఘ్రః = ఆ పురుష శ్రేష్ఠుడు; మే = నాచే; యుక్త్యా = శాస్త్రయుక్తిచే; ప్రతిబోధితః = ఆత్మజ్ఞానము బోధింపబడినవాడై; యథా త్వం = ఏ ప్రకారము నీవు; అభ్యభాషథాః = అభిభాషించితివో; ఏవం = ఈ ప్రకారము; రణమూర్ధని = సంగ్రామ ముఖమునందు; మాం = నన్ను; అభ్యభాషత = సంభాషించెను, అప్పటివలె నీకును ఉత్తరము చెప్పగలనని భావము.

తా. యుద్ధము నుండి వెనుదిరిగినవాడై ఆ పురుషశ్రేష్ఠుడు నాచే శాస్త్రయుక్తిచే ఆత్మబోధము వడసి ఇప్పుడు నీవు నన్నడిగినట్లు సంగరాగ్రభాగమున నన్ను అడిగెను. వానికి చెప్పిన భంగి నుత్తరము నీకును చెప్పెదను.

అవ :ఆ విభూతులనే చెప్పుచున్నారు—

శ్లో. అహ మాత్మోద్ధ వామీషాం భూతానాం సుహృ దీశ్వరః,
అహం సర్వాణి భూతాని తేషాం స్థిత్యుద్భవాప్యయః. 9

అ. అస్మచ్ఛబ్దమునకు సమానాధికరణము (విశేషణములు, ప్రథమాంతములు ద్వితీయాంతములగు విభూతులు అవియన్నియు ఉపాసన కొఱకు చెప్పబడుచున్నవి. యథా యోగ్యముగా తెలియదగును.

ఉద్ధవ! అహం = నేను; అమీషాం భూతానాం ఆత్మా = ఈ భూతములకు ఆత్మను: సుహృత్ ఈశ్వరః = మేలుగోరువాడను, నియామకుడను· అని సామాన్యముగా నుపాస్యుడ వగుదునని అర్థము; అహం = నేను; సర్వాణి భూతాని = ఎల్ల భూతములు అనగా ఎల్ల జీవులకు ఆధారభూతుడను; తేషాం స్థితి + ఉద్భవ + అప్యయః = ఆ భూతములకు ఉనికి పుట్టుక, లయము అనువానిని కలిగించువాడను.

తా. ఓ ఉద్ధవా! నేను ఈ భూతము లన్నింటికీ ఆత్మను, సుహృత్తును, ఈశ్వరుడను, నేను సర్వభూతములకు అధారభూతుడను. ఆ భూతములకు సృష్టి స్థితి లయములను కలిగించువాడను.

అవ. విశేషించి విభూతులను చెప్పుచున్నారు.

శ్లో. అహం గతి ర్గతిమతాం కాలః కలయతా మహం,
గుణానా మప్యహం సామ్యం గుణి న్యౌత్పత్తికో గుణః. 10

అ. అహం = నేను; గతిమతాం గతిః = కర్మజ్ఞాన మార్గములందు వర్తించువారికి ప్రాప్యమైనవాడను; అహం = నేను; కలయతాం కాలః = అహోరాత్రాది రూపముల గణించి ప్రాణమును వశీకరించువానిలో కాలమును; అహం గుణానాం చ సామ్యం = శాంత్యాది గుణములలో సర్వత్ర సమత్వమగు దాని గుణమును; అహం = నేను (లేక) గుణములలో సామ్యావస్థ యగు అవ్యాకృతమగు మూలప్రకృతిని; గుణిని = సత్త్వాది గుణము గలవానియందు; ఔత్పత్తికః గుణః = స్వాభావికమైన గుణమును.

తా కర్మమార్గమునను, జ్ఞానమార్గమునను ప్రవర్తించువారలకు పరమప్రాప్యము ప్రాణులను కాలశక్తిచే వశీకరించువానిలో కాలమును నేను. సత్త్వాది గుణములలో త్రిగుణముల సామ్యావస్థ గలదైన మూలప్రకృతిని నేను· జ్ఞానాది గుణములు గలవానియందు స్వాభావికమైన జ్ఞానగుణము నేనయి యున్నాను. ఇట్లు నన్నుపాసింపవలెను.

శ్లో. గుణానా మప్యహం సూత్రం మహతాం చ మహా నహం,
సూక్ష్మాణా మప్యహం జీవో దుర్జయానా మహం మనః. 11

అ. గుణానాం = ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులను గుణములలో; అహం = నేను; సూత్రం = ప్రథమమైన ఇచ్ఛాశక్తి అను గుణమును అనగా అహంకార తత్త్వము; మహతాం = మిగుల దొడ్డవానిలో; అహం = నేను; మహాన్ = మహత్తత్త్వమును (సమిష్టి బుద్ధి) నేను; సూక్ష్మాణాం = సూక్ష్మములైన వానిలో సైతము; అహం = నేను; జీవః = అవిద్య ఉపాధిగా గలవాడగు జీవుడను. దుర్జ్ఞేయుడగుటవలన జీవుడు సూక్ష్మరూపు డగును – అని. శ్రుతి-

బుద్ధే ర్గుణే నాత్మగుణేన చైవ, దూ ర్వ్యాగ్రమాత్రోఽప్యపరోఽపి దృష్టః. బుద్ధి గుణమగు జ్ఞానముతోను చిత్తగుణము, మనోగుణము అను వానితోఁగూడ, గటికపోచ కొనయంత సూక్ష్మమైన ఇతరుడగు జీవుడును చూడబడినాడు. దుర్జయానాం మనః = జయింపశక్యముగాని వానిలో నేను మనస్సును.

తా. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులను మూడు గుణములలో ఇచ్ఛాశక్తి లేక అహంకార తత్వము నేను. పెద్దదైన వానిలో మహత్తత్వము (సమిష్టి బుద్ధి) నేను. సూక్ష్మవస్తువై తెలియశక్యము గాని వానిలో జీవుడు నేను. జయింపరాని వానిలో నేను మనస్సును. మూల ప్రకృతి యొక్క త్రిగుణముల ప్రథమ కార్యము అహంకారతత్వము

శ్లో. హిరణ్యగర్భో వేదానాం మంత్రాణాం ప్రణవ స్త్రివృత్,
అక్షరాణా మకారోఽస్మి పదాని ఛందసా మహమ్. **12**

అ వేదానాం హిరణ్యగర్భః = వేదములలో వాని అధ్యాపకుడైన బ్రహ్మదేవుడు; మంత్రాణాం = మంత్రములలో: త్రివృత్ ప్రణవః = అకార, ఉకార, మకారాత్మకమగు ఓంకారము; అక్షరాణాం అకారః = వర్ణ సమామ్నాయములో అకారము; ఛందసాం = ఛందస్సులలో; త్రివృత్ పదాని = మూడు పాదములు గల గాయత్రి; అహం + అస్మి = నేను అగుచున్నాను.

తా. వేదములలో వేదాధ్యాపకుడగు బ్రహ్మ నేను. వేదమంత్రములలో అకార, ఉకార మకారాత్మకమగు ఓంకారము నేను. వర్ణసమామ్నాయమందు అకారము నేను. ఛందస్సులలో మూడు పాదములు గల గాయత్రిని నేను

శ్లో. ఇంద్రోఽహం సర్వదేవానాం వసూనాం హవ్యవా డహం,
ఆదిత్యానా మహం విష్ణుః రుద్రాణాం నీలలోహితః. **13**

అ. సర్వదేవానాం ఇంద్రః, అహం = ఎల్ల దేవతలలో ఇంద్రుడు నేను. వసూనాం హవ్యవాట్, అహం = అష్ట వసువులలో హవ్యమును వహించు అగ్ని నేను; ఆదిత్యానాం విష్ణురహం = ద్వాదశాదిత్యులలో విష్ణువు అను ఆదిత్యుడు నేను; రుద్రాణాం నీలలోహితః = ఏకాదశ రుద్రులలో నీలలోహితుడు అను (అర్ధనారీశ్వరుడు) నేనగుచున్నాను.

తా. నేను దేవతలలో ఇంద్రుడను. వసువులలో అగ్నిని. ఆదిత్యులలో విష్ణువును· రుద్రులలో నీలలోహితుడను.

శ్లో. బ్రహ్మర్షీణాం భృగు రహం రాజర్షీణా మహం మనుః,
దేవర్షీణాం నారదోఽహం హవిర్ధా న్యస్మి ధేనుషు. **14**

అ. బ్రహ్మర్షీణాం భృగు రహం = బ్రహ్మర్షులలో భృగుమహర్షిని నేను; రాజర్షీణాం మనుః అహం = రాజర్షులలో మనువును నేను; దేవర్షీణాం నారదః అహం = దేవర్షులలో నారదుడను నేను; ధేనుషు హవిర్ధానీ అస్మి = ధేనువులందు కామధేనువు నగుదును.

తా. బ్రహ్మర్షులలో భృగుమహర్షి, రాజర్షులలో స్వాయంభువ మనువు, దేవర్షులలో నారదుడు, గోవులందు కామధేనువు నేనగుచున్నాను.

శ్లో. సిద్ధేశ్వరాణాం కపిలః సుపర్ణోఽహం పతత్రిణాం,
ప్రజాపతీనాం దక్షోఽహం పితౄణా మహ మర్యమాః. 15

అ. సిద్ధేశ్వరాణాం కపిలః = ఉత్తమ జ్ఞానసిద్ధులలో కపిలుడు; పతత్రిణాం సువర్ణః అహం = పక్షులలో గరుత్మంతుడు నేను; ప్రజాపతీనాం దక్షః అహం = ప్రజాపతులలో దక్షుడు నేను; పితౄణాం అర్యమా అహం = పితృదేవతలలో అర్యముడు నేను.

తా. జ్ఞానసిద్ధులలో కపిలుడు, పక్షులలో గరుత్మంతుడు, ప్రజాపతులలో దక్షుడు, పితృదేవతలలో అర్యముడు నేనే అయియున్నాను.

శ్లో. మాం విద్ధ్యుద్ధవ దైత్యానాం ప్రహ్లాద మసురేశ్వరం,
సోమం నక్షత్రౌషధీనాం ధనేశం యక్షరక్షసామ్. 16

అ. ఉద్ధవ; దైత్యానాం = దైత్యులలో అసురేశ్వరం ప్రహ్లాదం = అసురప్రభువైన ప్రహ్లాదుని; మాం విద్ధి = నన్నుగా ఎఱుంగుము; నక్షత్ర + ఓషధీనాం సోమం = నక్షత్రములలో ఓషధులలో చంద్రునిగను; యక్ష రక్షసాం = యక్ష రాక్షసులలో; ధనేశం = కుబేరుని నను ఎఱుంగుము.

తా. ఓ ఉద్ధవా దైత్యులలో అసుర ప్రభువగు ప్రహ్లాదుని నన్నుగా ఎఱుంగుము. అట్లే నక్షత్రములలో ఓషధులలో చంద్రుని, యక్షరాక్షసులలో కుబేరుని నన్నుగా ఎఱుంగుము.

శ్లో. ఐరావతం గజేంద్రాణాం యాదసాం వరుణం ప్రభుం,
తపతాం ద్యుమతాం సూర్యం మనుష్యాణాం చ భూపతిమ్. 17

అ. గజేంద్రాణాం ఐరావతం = గజరాజములలో ఐరావతమును; యాదసాం ప్రభుం వరుణం = జల జంతువులలో వానికి ప్రభువగు వరుణుని; తపతాం ద్యుమతాం సూర్యం = ప్రతాపవంతులలో దీప్తిమంతులలో సూర్యుని; మనుష్యాణాం భూపతిం చ = మనుష్యులలో భూభర్తను నన్నుగా ఎఱుంగుము.

తా. గజరాజములలో ఐరావతమును, జలజంతువులలో వానికి ప్రభువగు వరుణుని, ప్రతాపవంతులలో దీప్తిమంతులలో సూర్యుని, మనుష్యులలో భూపాలుని నన్నుగా ఎఱుంగుము

శ్లో. ఉచ్చైఃశ్రవా స్తురంగాణాం ధాతూనా మస్మి కాంచనం,
యమ స్సంయమతాం చాహం సర్పాణా మస్మి వాసుకిః. 18

అ. తురంగాణాం ఉచ్చైఃశ్రవాః = అశ్వములలో ఉచ్చైఃశ్రవమును; ధాతూనాం = కాంచనం అస్మి = లోహములలో స్వర్ణమగుచున్నాను; సంయమతాం యమః అహం = దండించువారిలో యముడు నేనే; సర్పాణాం వాసుకిః అస్మి = సర్పములలో వాసుకి నేనగుచున్నాను.

తా. అశ్వములలో ఉచ్చైఃశ్రవము నేను. లోహములలో సువర్ణము నేను. దండించు వారిలో యముడు నేను. సర్పములలో వాసుకి నేను.

శ్లో. నాగేంద్రాణా మనంతోఽస్మి మృగేంద్రః శృంగిదంష్ట్రిణాం,
ఆశ్రమాణా మహం తుర్యః వర్ణానాం ప్రథమోఽనఘ. 19

అ. అనఘ = పాపరహితుడా !: నాగేంద్రాణాం అనంతః అస్మి = నాగరాజులలో శేషుడ నగుచున్నాను: శృంగిదంష్ట్రిణాం మృగేంద్రః = కొమ్ములు కలవానిలో, కోఅలు గల వానిలో సింహము; ఆశ్రమాణాం తుర్యః అహం = బ్రహ్మచర్యాద్యాశ్రమములలో నాల్గవది సన్న్యాసము నేను; వర్ణానాం ప్రథమః = జాతులలో ప్రథముడు బ్రాహ్మణుడు నేను.

తా. ఓ పాపరహితుడా! నాగరాజులలో శేషుడను నేను. కొమ్ములు గల జంతువులలో, కోఅలు గల జంతువులలో సింహము నేను. బ్రహ్మచర్యములోనగు ఆశ్రమములలోనాల్గవదగు సన్న్యాసాశ్రమము నేను. వర్ణములలో ప్రథమమగు బ్రాహ్మణవర్ణము నేను.

శ్లో. తీర్థానాం స్రోతసాం గంగా సముద్ర స్సరసా మహం
ఆయుధానాం ధను రహం త్రిపురఘ్నో ధనుష్మతామ్ 20

అ. తీర్థానాం స్రోతసాం గంగా = పుణ్య తీర్థములై ప్రవహించు నదులలో గంగయు; సరసాం సముద్రః అహం = సరస్సులలో సముద్రము నేను; ఆయుధానాం ధనుః అహం = ఆయుధములలో ధనుస్సు నేను; ధనుష్మతాం త్రిపురఘ్నః = ధనుస్సు గలవారిలో త్రిపురములు గూల్చిన శివుడు నేను.

తా. పుణ్యతీర్థములై ప్రవహించునదులలో గంగ నేను. నిలుకడగానుండు సరస్సు సముద్రుడు నేను. ఆయుధములలో ధనుస్సు నేను. విలుకాండ్రలో త్రిపురాసుర సంహారియగు రుద్రుడు నేను.

శ్లో. ధిష్ణ్యానా మస్మ్యహం మేరుః గహనానాం హిమాలయః,
వనస్పతీనా మశ్వత్థ ఓషధీనా మహం యవః. 21

అ. ధిష్ణ్యానాం మేరుః = నివాస స్థానములలో మేరుపర్వతము; అహం అస్మి = నేనగుచున్నాను: గహనానాం హిమాలయః = దుర్గమములలో హిమగిరి; వనస్పతీనాం అశ్వత్థః = గొప్ప వృక్షములలో రావిచెట్టు; ఓషధీనాం యవః అహం = ధాన్యములలో యవధాన్యము నేను.

తా. నివాస స్థానములలో మేరు పర్వతము నేను. దుర్గములలో హిమగిరి నేను. వృక్షములలో అశ్వత్థ వృక్షము నేను. ధాన్య విశేషములలో యవధాన్యము నేనగుచున్నాను.

శ్లో. పురోధసాం వసిష్ఠోఽహం బ్రహ్మిష్ఠానాం బృహస్పతిః,
స్కందోఽహం సర్వసేనాన్యా మగ్రణ్యాం భగవా నజః. 22

అ. పురోధసాం వసిష్ఠః అహం = పురోహితులలో వసిష్ఠుడు నేను; బ్రహ్మిష్ఠానాం బృహస్పతిః = వేదశాస్త్రనిష్ఠులలో బృహస్పతి; సర్వసేనాన్యాం = ఎల్ల సేనాపతులలో; స్కందః అహం = కుమారస్వామి నేను; అగ్రణ్యాం భగవాన్ అజః = సన్మార్గ ప్రవర్తకులలో భగవంతుడగు బ్రహ్మ నేను.

తా. పురోహితులలో వసిష్ఠుడను నేను. వేదాంతార్థ విదులలో బృహస్పతిని. సేనాధి పతులలో కుమారస్వామిని నేను. సర్వాధ్యక్ష ప్రవర్తకులలో ధాతయగు బ్రహ్మను నేను.

**శ్లో. యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోఽహం వ్రతానా మవిహింసనం**
**వాయ్వగ్న్యర్కాంబు వాగాత్మా శుచీనా మప్యహం శుచిః. 23**

**అ.** యజ్ఞానాం బ్రహ్మయజ్ఞః అహం = యజ్ఞములలో బ్రహ్మయజ్ఞము నేను; వ్రతానాం అవిహింసనం = వ్రతములలో నియమరూపముకు వానిలో అహింసావ్రతము; శుచీనాం అపి = శోధకములైన మార్జన, తక్షణ, ఘర్షణములలోను (చిమ్ముట, చెక్కుట, రాయుట); వాయు + అగ్ని + అర్క + అంబు వాక్ + ఆత్మా = వాయువు అగ్ని సూర్యుడు జలము వాక్స్వరూపము గలవాడను; శుచీనాం శుచిః = పరిశుద్ధులలో పరిశుద్ధుడను; అహం = నేను.

యజ్ఞములలో బ్రహ్మయజ్ఞము నేను. వ్రతములలో అహింసావ్రతము నేను. శోధకములలో (చిమ్ముట, చెక్కుట, రాయుటలు) వాయువు, అగ్ని, సూర్యుడు, ఉదకము, వాక్కు లోనగు రూపముగల శుచిని శోధకుడను నేను. ఒక వస్తువును పరిశుద్ధము చేయుట శోధనము వాయ్వాదు లన్నియు శోధకములగును. అవి కానగుట.

**శ్లో. యోగానా మాత్మసంరోధో మంత్రోఽస్మి విజిగీషతాం,**
**ఆన్వీక్షకీ కౌశలానాం వికల్పః ఖ్యాతివాదినామ్. 24**

అ. యోగానాం = యమాది అష్టాంగములలో; ఆత్మ సంరోధః = చిత్త సంయమమగు సమాధి నేను, విజిగీషతాం మంత్రః అస్మి = జయింపగోరు వారిలో దండనీతి నేను అగుదును; కౌశలానాం = వివేకాది నైపుణ్యములలో, అన్వీక్షకీ = ఆత్మానాత్మ వివేకరూపమగు విద్యను నేను; ఖ్యాతివాదినాం వికల్పః = ఖ్యాత్యాదివాదులలో ఇది ఈ ప్రకారమా, లేక ఈ ప్రకారమా యని దురంత వికల్పము నేను.

తా. యమ నియమాదులగు అష్టాంగ యోగములలో పరిపక్వమగు చిత్తసంయమము సమాధి నేను. జయింపగోరు వారలలో మంత్రము అనగా దండనీతి నేను. వివేకములోనగు నిపుణత్వములలో ఆన్వీక్షకి యనగా ఆత్మానాత్మ వివేక రూపమగు విద్య నేను. ఖ్యాతివాదులలో ఇది ఈ ప్రకారమైనయుండవచ్చును లేదా ఇది సిద్ధాంతమగును అని స్థిరముగా తెల్పని వికల్పము (స్థాణువా పురుషుడా యనుట.) నేను.

విశేషము

ఆత్మఖ్యాతి రసత్ఖ్యాతి రఖ్యాతిః ఖ్యాతి రన్యథా
తథా ఽ నిర్వచనఖ్యాతి రిత్యాసీత్ ఖ్యాతిపంచకమ్.

(1) ఆత్మఖ్యాతివాదులు, (2) అసత్ఖ్యాతివాదులు, (3) అఖ్యాతివాదులు (4) అన్యథాఖ్యాతి వాదులు, (5) అనిర్వచనీయఖ్యాతివాదులు —

1) ఆత్మఖ్యాతి వాదులు — బౌద్ధులు. శుక్తియందు కాన్పించు రజతము భ్రమ. తానింతకు ముందు గాంచి బుద్ధిలో నిల్చియున్న రజతమే శుక్తియందు కాన్పించు నందురు.

అ. అనిమిషాం = అప్రమత్తులలో; సంవత్సరః అస్మి = సంవత్సరము అగుదును. ఋతూనాం = ఋతువులలో; మధుమాధవౌ = చైత్ర వైశాఖములు గల వసంతఋతువు, మాసానాం మార్గశీర్షః అస్మి = మాసములలో మార్గశీర్షము అగుదును; తథా = ఆ ప్రకారము; నక్షత్రాణాం అభిజిత్ = నక్షత్రములలో అభిజిత్తును.

తా. జాగ్రత్త గలవానిలో కాలమును మార్పుచేయు సంవత్సరము నేను. ఋతువులలో చైత్ర వైశాఖ మాసములు వచ్చు వసంత ఋతువు నేను. అభిజిత్తు నక్షత్రము ఉత్తరాషాఢకు పైనను, శ్రవణమునకు క్రిందుగను ఉండు నక్షత్రము.

శ్లో. అహం యుగానాం చ కృతం ధీరాణాం దేవలోఽసితః,
ద్వైపాయనోఽస్మి వ్యాసానాం కవీనాం కావ్య ఆత్మవాన్. 28

అ. యుగానాం కృతం అహం = యుగములలో కృతయుగము నేను; ధీరాణాం=పండితులలో; దేవలః అసితః = దేవలుడను, అసితుడను; వ్యాసానాం ద్వైపాయనః అస్మి = వేద విభాగ కర్తలు 28 గురిలో ద్వైపాయనుడను వ్యాసుడు నేను; కవీనాం ఆత్మవాన్ కావ్యః = విద్వాంసులలో నిశ్చల చిత్తుడగు శుక్రుడు నేను.

తా. యుగములలో కృతయుగము నేను. పండితులలో దేవలుడు అసితుడు నేను, వేద విభాగకర్తలు 28 గురిలో కృష్ణద్వైపాయనుడను నేను. విద్వాంసులలో నిశ్చలచిత్తుడగు శుక్రుడు నేను.

శ్లో. వాసుదేవో భగవతాం త్వం తు భాగవతే ష్వహమ్,
కింపురుషాణాం తు హనుమాన్ విద్యాధ్రాణాం సుదర్శనః. 29

అ. భగవతాం = భగవంతులలో; అనగా ఉత్పత్త్యాదు లెఱింగినవారిలో—

శ్లో. ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానా మాగతిం గతిమ్,
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి.

వాసుదేవః = కృష్ణుడు నేను; భాగవతేషు = భగవద్భక్తులందు; త్వం తు అహం = నీవు నేను; కింపురుషాణాం తు హనుమాన్ = కుత్సితాకారము గల పురుషులలో హనుమంతుడు, విద్యాధ్రాణాం సుదర్శనః = విద్యాధరులలో సుదర్శనుడు నేను.

తా. ఉత్పత్తి ప్రళయములు, భూతముల రాకపోకలు, విద్య అవిద్య అను ఆఱు గుణములు గల భగవంతులలో వసుదేవపుత్రు డగు కృష్ణుడు నేను. భక్తులలో నీవు నేను. కుత్సితాకారము గల పురుషులలో హనుమంతుడు నేను. విద్యాధరులలో సుదర్శనుడు నేను అగుదును.

శ్లో. రత్నానాం పద్మరాగోఽస్మి పద్మకోశస్తు పేశసామ్,
కుశోఽస్మి దర్భజాతీనాం గవ్య మాజ్యం హవిష్ష్వహమ్. 30

అ. రత్నానాం పద్మరాగః అస్మి = రత్నములలో పద్మరాగము అగుదును; పేశసాం పద్మకోశః = సుందరమైనవానిలో తామరమొగ్గ; దర్భజాతీనాం కుశః అస్మి = దర్భజాతు

లలో తెల్లు, గఱిక మొదలగువానిలో కుశదర్భ వగుదును; హవిష్షు గవ్యః ఆజ్యం అహం = హావిస్సులయందు గోఘృతము నేను.

తా. రత్నములలో పద్మరాగము (కెంపు) నేను. సుందర వస్తువులలో తామర మొగ్గ నేను. తెల్లు, గఱిక మొదలగు దర్భజాతులలో కుశదర్భ నేను. హవిస్సులందు గోఘృతము నేను.

శ్లో. వ్యవసాయినా మహం లక్ష్మీః కితవానాం చలగ్రహః,
తితిక్షాఽస్మి తితిక్షూణాం సత్త్వం సత్త్వవతా మహమ్. **31**

అ. వ్యవసాయినాం = ప్రయత్నముగలవారిలో; లక్ష్మీః అహం = ధనాది సంపద నేను; కితవానాం చలగ్రహః = జూదరులలో కపటము, వితండము; తితిక్షూణాం తితిక్షా అస్మి = శీతోష్ణాది ద్వంద్వము సహించువారిలో సైరణ అగుదును; సత్త్వవతాం సత్త్వం అహం = సాత్త్వికులలో సత్త్వగుణము నేను.

తా. వ్యవసాయము చేయువారిలో ధనాది సంపద నేను. జూదరులలో కపటము, వితండమగు చేష్ట నేను. శీతోష్ణాది ద్వంద్వము సహించువారిలో ఆ సహనము నేను. సాత్త్వికులలో సత్త్వగుణము నేను.

శ్లో. ఓజః సహో బలవతాం కర్మాఽహం విద్ధి సాత్త్వతామ్,
సాత్త్వతాం నవమూర్తీనా మాదిమూర్తిరహం పరా. **32**

అ. బలవతాం ఓజః సహః = బలవంతులలో శరీరబలము, మనోబలము; సాత్త్వతాం = భక్తులలో; కర్మ అహం విద్ధి = భక్తితో చేయు పూజాదికమగు కర్మ నేనుగా నెఱుంగుము; నవమూర్తీనాం = నవవ్యూహార్చన మందలి వాసుదేవాది సాత్త్వతాం = భక్తుల యొక్క; తొమ్మండుగురు మూర్తులలో; పరా = ఉత్కృష్టమైన; ఆదిమూర్తిః అహం = ప్రథమమగు వాసుదేవమూర్తిని నేను.

తా. బలవంతులలో శరీరబలము మనోబలము నేను. భక్తులు భక్తితో చేయు పూజాది కర్మ నేను. భక్తులయొక్క నవవ్యూహార్చనమందలి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ, హయగ్రీవ, వరాహ, నారసింహ, వామనులగు నవమూర్తులలో ప్రథమమగు వాసుదేవమూర్తిని నేను.

శ్లో. విశ్వావసు ర్విప్రచిత్తి ర్గంధర్వాప్సరసా మహమ్,
భూధరాణా మహం స్థైర్యం గంధమాత్ర మహం భువః. **33**

అ. గంధర్వ + అప్సరసాం = గంధర్వులలో అప్సరలలో; విశ్వావసుః విప్రచిత్తిః = క్రమముగా విశ్వావసువును, విప్రచిత్తిని; భూధరాణాం స్థైర్యం అహం = పర్వతములలో దృఢశక్తి నేను; భువః = భూమిలో; గంధమాత్రం అహం = అవికారమైన గంధగుణము నేను.

తా. గంధర్వులలో విశ్వావసుడు, అప్సరసలలో విప్రచిత్తి నేను. శైలములలో స్థిరశక్తిని నేను. భూమిలో నవికారమైన గంధగుణము నేను.

శ్లో. అపాం రసశ్చ మధుర స్తేజిష్ఠానాం విభావసుః,
ప్రభా సూర్యేందుతారాణాం శబ్దోఽహం నభసః పరః. 34

అ. అపాం మధురః రసశ్చ = ఉదకములలో మధురమగు రసమును; తేజిష్ఠానాం విభావసుః = మిక్కిలి తేజస్సుగలవారిలో సూర్యుడు; సూర్య ఇందుతారాణాం = సూర్యుడు, చంద్రుడు, నక్షత్రము అనువానిలో; ప్రభా = ప్రకాశము; నభసః పరః శబ్దః అహం = ఆకాశములో పరాఖ్యమగు శబ్దము నేను.

తా. ఉదకములలో మధురరసము నేను. అధిక తేజోవంతులలో సూర్యుడు నేను. సూర్య చంద్ర తారకలలో ప్రకాశము నేను. ఆకాశములో పరాఖ్య మగు శబ్దము నేను.

శ్లో. బ్రహ్మణ్యానాం బలి రహం వీరాణా మహ మర్జునః,
భూతానాం స్థితి రుత్పత్తి రహం వై ప్రతిసంక్రమః. 35

అ. బ్రహ్మణ్యానాం అహం బలిః = బ్రాహ్మణ భక్తులలో బలిచక్రవర్తిని నేను; వీరాణాం అర్జునః అహం = వీరులలో అర్జునుడు నేను; భూతానాం = భూతములలో; స్థితిః ఉత్పత్తిః ప్రతిసంక్రమః వై అహం = ఉండుట, జన్మము, లయము నేను.

తా. బ్రాహ్మణ భక్తులలో బలిని నేను. వీరులలో అర్జునుడు నేను. ప్రాణులతో ఉత్పత్తి స్థితి లయములు నేను అగుదును.

శ్లో. గత్యుత్సర్గో క్త్యుపాదాన మానందస్పర్శలక్షణమ్,
ఆస్వాద శ్రుత్యవఘ్రాణ మహం సర్వేంద్రియేంద్రియమ్. 36

అ. గతి + ఉత్సర్గ + ఉక్తి + ఉపాదానం = గమనము, విసర్జించుట, వచనము, గ్రహించుట, ఆనంద స్పర్శలక్షణం = ఆనందము, స్పృశించుట; ఆస్వాద శ్రుతి + అవఘ్రాణం = చూచుట, వినుట, మూర్కొనుట; సర్వ + ఇంద్రియ + ఇంద్రియమ్ = ఎల్ల ఇంద్రియముల అర్థగ్రహణము; అహం = నేను

తా. గమనము, విసర్జనము, వచనము, గ్రహణము (పట్టుకొనుట), ఆనందము అను కర్మేంద్రియ వ్యాపారములు నేను. స్పర్శము, దర్శనము, ఆస్వాదము, శ్రవణము, ఆఘ్రాణము అను జ్ఞానేంద్రియ వ్యాపారములు ఐదును నేను. ఎల్ల యింద్రియముల అర్థగ్రహణము నేను అగుదును.

అవ. ఈ ప్రకార మా యా వస్తువులందు వాని వాని సంబంధము ద్వారా విశేషించి ఎల్ల విభూతులను నిరూపించి ఇపుడు సామాన్యముగ ఎల్లవానిని నిరూపించుచున్నారు—

శ్లో. పృథివీ వాయు రాకాశ ఆపో జ్యోతిరహం మహాన్,
వికారః పురుషోఽవ్యక్తో రజస్సత్త్వం తమః పరమ్. 37

అ. పృథివీ....జ్యోతిః = భూమి, వాయువు, ఆకాశము, ఉదకము, అగ్ని అనువాని పంచ తన్మాత్రలు, అహం = నేను; మహాన్ = మహత్తత్త్వము; వికారః = పంచమహాభూతములు,

పురుషః = జీవుడు; అవ్యక్తం = ప్రకృతి; రజః సత్త్వం తమః పరం = సత్త్వ రజస్తమములు, పరబ్రహ్మము.

తా. ఇట్లే పంచవింశతి తత్త్వములు చెప్పబడినవి—

శ్లో. మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త,
షోడశకస్తు వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను భూత సూక్ష్మములు, అహంకారము, మహత్తత్త్వము ఇవి యేడును ప్రకృతి వికృతులు. వికారములనగా పంచ మహాభూతములు, జ్ఞానేంద్రియములు ఐదు, మనస్సు చేరి పదునారును వికృతులు. జీవుడు, ప్రకృతి రెండు. మొత్తము ఇవి (25) పంచ వింశతి తత్త్వములు. సత్త్వ రజ స్తమస్సులను త్రిగుణము పరబ్రహ్మము నే నగుదును.

శ్లో. **అహ మేతత్ ప్రసంఖ్యానం జ్ఞానం తత్త్వవినిశ్చయమ్.** **38**
**మయేశ్వరేణ జీవేన గుణేన గుణినా వినా,**
**సర్వాత్మనాపి సర్వేణ న భావో విద్యతే క్వచిత్.** **39**

అ. ఏతత్ ప్రసంఖ్యానం = ఈ పంచవింశతి తత్త్వములు లోనగువాని పరిగణనము; విభాగమును పొందియుండు సంఖ్యము; జ్ఞానం = వీనినిర్ధారూపము లోనగునది ఎఱుంగు జ్ఞానము; తత్త్వవినిశ్చయః = వీని ఫలమగు తత్త్వముల నిర్ణయము; అహం = నేను; దీనిని సంక్షేపించి చెప్పుచున్నారు— ఈశ్వరేణ = ఈశ్వరుడు; జీవేన = జీవుడు; గుణేన = గుణమగు క్షేత్రము; గుణినా = గుణములు కల క్షేత్రజ్ఞుడు; సర్వాత్మనా = సర్వమునకు ఆత్మయైన; సర్వేణ = సమస్తమైన మయా వినా = నేను లేక, నన్ను వీడి; భావః = ఏ పదార్థము; క్వచిత్ న విద్యతే = ఒకప్పుడును గలుగలేదు. సర్వము నేనే అగుదును.

తా. ఈ పంచవింశతి తత్త్వములు లోనగువాని పరిగణనము, వీని లక్షణము, విభాగమును పొందు సంఖ్యము, వీని ఫలము నే నగుదును. జీవుడు, ఈశ్వరుడు అను ద్వివిధ స్వరూపము సర్వమును నైన నన్ను వీడి ఏ యొక వస్తువు గూడ నొకప్పుడును ప్రవర్తింప జాలదు.

అవ. సామాన్యముగ నేమి ? ఈ ప్రకారము సంక్షేపించి చెప్పుచున్నావు. పూర్వము వలె నిర్ధార సంబంధములతో విశేషించి యెల్లవానిం జెప్పుము. అనినచో అందులకు చెప్పుచున్నారు—

శ్లో. **సంఖ్యానాం పరమాణూనాం కాలేన క్రియతే మయా,**
**న తథా మే విభూతీనాం సృజతోఽండాని కోటిశః.** **40**

అ. పరమాణూనాం = పృథివి లోనగువాని పరమాణువుల యొక్క, సంఖ్యానం = గణనము; కాలేన = దొడ్డదగు కాలమునను; మయా క్రియతే = నాచే చేయబడును. కాని, తథా = ఆ ప్రకారము; కోటిశః = కోట్లకొలది; అండాని సృజతః = బ్రహ్మాండములను సృజించుచున్న; మే విభూతీః = నా విభూతులను; న తథా = అట్లు లెక్కింప వీలుకాదు.

తా. పృథివి లోనగు పంచమహా భూతముల పరమాణువులను చాలకాలమున కిన్నియని నాకు లెక్కపెట్ట సాధ్యమగునుగాని,నేను కోట్లకొలది సృజించు బ్రహ్మాండములకు సంఖ్యలేదు. ఇక వాటి సంబంధమగు నా విభూతుల నెట్లు లెక్కింపగలను ? లెక్కింప శక్యము కాదని భావము.

శ్లో. తేజః శ్రీః కీర్తి రైశ్వర్యం హ్రీ స్త్యాగ స్సౌభగం భగః,
బలం తితిక్షా విజ్ఞానం యత్ర యత్ర స మేంఽశకః. 41

అ. తేజః = ప్రభావము; శ్రీః=సంపద; కీర్తిః = కీర్తి; ఐశ్వర్యం = ప్రభుత్వము: హ్రీః = లజ్జ; త్యాగః = త్యాగము; సౌభగం = సౌభాగ్యము; బలం = బలము; తితిక్షా = ఓర్పు· విజ్ఞానం = అనుభవజ్ఞానము; యత్ర యత్ర = ఎట నెట కలవో; సః = అది యెల్ల; మే అంశకః = నా అంశము.

తా. ప్రభావము, సంపద, కీర్తి, ప్రభుత్వము, లజ్జ, త్యాగము, మనోనయనముల కాహ్లాదము, సౌందర్యము, భాగ్యము, బలము, సహనము. అనుభవ జ్ఞానము, ఎచ్చటెచ్చట కలవో అవి నా అంశము లని తెలియుము.

శ్లో. ఏతా స్తే కీర్తితా స్సర్వా స్సంక్షేపేణ విభూతయః,
మనోవికారా ఏ వైతే యథా వాచాభిధీయతే. 42

అ. ఏతాః విభూతయః సర్వాః=ఈ నా విభూతులన్నియు; తే సంక్షేపేణ కీర్తితాః= నీకు సంగ్రహముగా చెప్పబడినవి. ఇవి నాయందు చిత్తము నిలుపుటకై చెప్పబడినవి. అందు వలన వీనియందు మిక్కిలి అభినివేశము చేయతగదు అనుచున్నారు— ఏతే = ఇవి; మనోవికారాః ఏవ = మనస్సునకు కలత కలిగించునవే యగును. పరమార్థములు కావు; యథా = ఏ ప్రకారము; గగన కుసుమాదులు, వాచా అభిధీయతే = వాఙ్మాత్రమున చెప్పబడునో వాని వంటివి.

తా. ఈ ప్రకారము నీకు ఎల్ల విభూతులు నీ చిత్తము నా యందు నిల్పుటకు మాత్రము సంగ్రహముగ నాచే చెప్పబడినవి. కావున వానియందు ముఖ్యముగాచిత్తము నిల్పవలదు. మఱి ఆ విభూతులు మనస్సును మిక్కిలి కలత పెట్టునవగును. గగనకుసుమాదు లెట్లు వాఙ్మాత్రమున చెప్పబడునో అవి నిత్యమైన వెట్లు కావో అట్లే వానివంటివి ఇవి యగును.

శ్లో. వాచం యచ్ఛ మనో యచ్ఛ ప్రాణం యచ్ఛేంద్రియాణి చ,
ఆత్మాన మాత్మనా యచ్ఛ న భూయః కల్పసేఽధ్వనే. 43

అ. వాచం యచ్ఛ = వాక్కును నియమింపుము; మనః యచ్ఛ =మనస్సును నిగ్రహింపుము; ప్రాణం యచ్ఛ = ప్రాణము నరికట్టుము; ఇంద్రియాణి చ = ఇంద్రియములను నియమింపుము; బుద్ధిం = బుద్ధిని; ఆత్మనా యచ్ఛ = సత్త్వసంపన్నబుద్ధితో నిల్పుము; భూయః = మఱల; అధ్వనే న కల్పసే = సంసారమార్గమునందు సమర్థుడవు కావు.

తా. నీవు వాక్కునునిరోధింపుము. మనస్సును నిగ్రహింపుము. ప్రాణమును నిరోధింపుము. ఇంద్రియముల నరికట్టుము. బుద్ధిని సత్త్వసంపన్నబుద్ధితో నియమింపుము. ఇట్లు చేసితివేని నీవు మరల సంసారము దారికి రావు.

శ్లో. యో వై వాఙ్మనసీ సమ్య గసంయచ్ఛన్ ధియా యతిః,
తస్య వ్రతం తపో జ్ఞానం స్రవ త్యామఘటాంబువత్. 44

అ. యః యతిః వై = ఏ సన్న్యాసి అయినచో; వాక్ + మనసీ = వాక్కును, మనస్సును, ధియా = బుద్ధితో; సమ్యక్ అసంయచ్ఛన్ = సంయమనము చేయనివా డగునో; తస్య = ఆ యతి యొక్క; వ్రతం = వ్రతము; తపః = తపస్సు; జ్ఞానం = జ్ఞానము, ఆమఘట + అంబువత్ = పచ్చికుండలో నీరువలె, స్రవతి = కారిపోవును.

తా. ఏ యతి వాక్కును మనస్సును, శుద్ధబుద్ధితో చక్కగా నిరోధింపడో, వాని వ్రతము, తపము, జ్ఞానము పచ్చికుండ(కాల్చనికుండ) లోని నీరు వలె కారిపోవును.

శ్లో. తస్మా ద్వచోమనఃప్రాణా న్నియచ్ఛే న్మత్పరాయణః,
మద్భక్తియుక్తయా బుద్ధ్యా తతః పరిసమాప్యతే. 45

అ. తస్మాత్ = అట్లు వ్రతాదికము చేయుటవలన; మత్పరాయణః = నన్ను శరణ్యునిగా గొల్చు భక్తుడు; మద్భక్తి యుక్తయా బుద్ధ్యా = నాయందు భక్తితో కూడిన బుద్ధితో; వచః, మనః, ప్రాణాన్ = వాక్కు, మనస్సు, ప్రాణము ఇంద్రియములు అనువానిని, నియచ్ఛేత్ = నియమించవలెను. తతః = అందువలన, పరిసమాప్యతే = కృతకృత్యుడు కాగలడు.

తా. కాబట్టి నాభక్తుడు నా భక్తితో గూడిన బుద్ధితో వాక్కును, మనస్సును, ప్రాణమును, ఇంద్రియములను నియమింపవలెను. అట్లు చేసెనేని అతడు కృతకృత్యుడు కాగలడు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే షోడశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున (16) పదునారవ అధ్యాయము.

# సప్తదశాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

**తతః సప్తదశే పృష్టే స్వధర్మే భక్తిలక్షణే**
**హంసోక్తం ధర్మ మన్వాహ బ్రహ్మచారిగృహస్థయోః.**

మఱి ఈ పదునేడవ అధ్యాయమందు స్వధర్మమగు భక్తి లక్షణమగు ప్రశ్న ప్రశ్నింప బడగా, అందుకు హంసస్వరూపుడైన భగవంతుడు మున్ను చెప్పిన బ్రహ్మచారి గృహస్థుల ధర్మములు వర్ణింపబడును.

అవ. 'కర్మాహం విద్ధి సాత్త్వతం' అను శ్లోకమునందు భక్తితో చేయబడిన పూజాదికము మోక్షసాధనము నా విభూతి యని చెప్పబడినది. నాచే చెప్పబడిన స్వధర్మములందే మఱని వాడై ఆచరించు కర్మలు భక్తి సాధనము లగుచున్నవని యట నట చెప్పబడినవి కాని కర్మా నుష్ఠాతలకు నియమముగా భక్తి కన్పించుట లేదు. అందువలన దానినిగూర్చి (7) ఏడుశ్లోకము లచే ప్రశ్నించుచున్నారు—

ఉద్ధవ ఉవాచ=ఉద్ధవుడు వచించెను.

శ్లో. **యస్త్వయాభిహితః పూర్వం ధర్మస్త్వద్భక్తిలక్షణః**
**వర్ణాశ్రమాచారవతాం సర్వేషాం ద్విపదా మపి.** 1

**అ. వర్ణ+ఆశ్రమ+ఆచారవతాం = వర్ణాశ్రమాచారములుగల; సర్వేషాం = ఎల్ల వారికి; ద్విపదాం + అపి = వర్ణాశ్రమ హీనులకు, త్వద్భక్తి లక్షణః = నీ భక్తిని సాధించు నదైన; యః ధర్మః = ఏ ధర్మము; త్వయా = నీచేత చెప్పబడినది.**

తా. బ్రాహ్మణాది వర్ణములు గృహస్థాదులగు ఆశ్రమములు, వానికి తగునట్లు ఆచరించుచున్న ఎల్లవారికి, అట్లు వర్ణాశ్రమాచారములు లేనివారికి నీవు పూర్వము భక్తి సాధనమైన ధర్మ ముపదేశించియున్నావు.

శ్లో. **యథానుష్ఠీయమానేన త్వయి భక్తి ర్నృణాం భవేత్**
**స్వధర్మే ణారవిందాక్ష! తన్మమాఖ్యాతు మర్హసి.** 2

**అ. యథా = ఏ ప్రకారముగా; అనుష్ఠీయమానేన=అనుష్ఠింపబడుచున్న; స్వధర్మేణ= స్వధర్మాచరణముచేత; అరవిందాక్ష=తెల్ల తామరలవంటి కన్నులుకలవాడా! త్వయి భక్తిః= నీయందు భక్తి; నృణాం భవేత్ = నరులకు కలుగునో; తత్ = ఆ విధము; మే = నాకు, ఆఖ్యాతుం అర్హసి = చెప్పదగుదువు.**

తా. ఓ పుండరీకాక్షా! స్వధర్మ మేప్రకార మనుష్ఠింపబడుచుండుటచే నరులకు నీయందు భక్తికలుగునో, ఆ ధర్మానుష్ఠాన ప్రకారము నాకు చెప్పుము.

శ్లో॥ పురా కిల మహాబాహో! ధర్మం పరమకం ప్రభో!
యత్తేన హంసరూపేణ బ్రహ్మణేఽభ్యాత్థ మాధవ. 3

అ. మహాబాహో = ప్రభో మాధవ; పురా = పూర్వము; తేన హంసరూపేణ = ప్రసిద్ధమైన హంసరూపుడవగు నీచే, యత్ పరమకం ధర్మం = ఏ నిత్యసుఖ స్వరూపమును; బ్రహ్మణే = బ్రహ్మకొఱకు; అభ్యాత్థ = చక్కగా చెప్పితివో.

తా. ఓ దొడ్డబాహువులు కలవాడా! ఓ ప్రభూ! ఓ మాధవా! పూర్వము నీవు హంస స్వరూపుడవై బ్రహ్మకు ఏ నిత్య సుఖరూపమైన ధర్మమును వచించితివో, కేవలము యోగమాత్రము కాదు. మీకు ధర్మమును వచింపగోరి, వచ్చిన నన్ను యజ్ఞపురుషునిగా నెఱుంగుడు. అని చెప్పుట వలన. (జానీత మాగతం యజ్ఞం యుష్మద్ధర్మవివక్షయా )

శ్లో. స ఇదానీం సుమహతా కాలే నామిత్రకర్శన,
న ప్రాయో భవితా మర్త్యలోకే ప్రాగనుశాసితః. 4

అ. అమిత్రకర్శన= ఓ శత్రునాశకుడా! ప్రాక్ అనుశాసితః = నీచే పూర్వము అనుశాసింపబడినది; సః = ఆ ధర్మము; ఇదానీం = ఇప్పుడు; సుమహతా కాలేన = చాలా తడవగు కాలముచే; మర్త్యలోకే = మనుష్యలోకమునందు; ప్రాయః న భవితా = తఱచుగా అట్లే యుండలేదు.

తా. ఓ శత్రునాశకుడా! పూర్వము నీవు అనుశాసించిన ఆ ధర్మము చాలకాలమైనందున మనుష్యలోకమునందు స్థిరముగా అట్లే యుండదుకదా!

అవ. ఈ విషయమును గూర్చి రెండు శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. వక్తా కర్తా నావితాన్యో ధర్మస్యాచ్యుత తే విభో
సభాయామపి వైరించ్యాం యత్ర మూర్తిధరాః కలాః. 5

అ విభో అచ్యుత! ధర్మస్య = ధర్మము యొక్క; వక్తా, కర్తా, అవితా = వచించువాడు, ఆచరించువాడు, రక్షించువాడు; తే అన్యః=నీకంటె అన్యుడు; వైరించ్యాం సభాయాం =బ్రహ్మసంబంధి సభలోనైనను న=ఉండడు, యత్ర =ఏ సభయందు; కలాః మూర్తిధరాః = వేదాదివిద్యలు మూర్తిమంతములై యుండును

తా. ఓ ప్రభూ! కృష్ణా! నీవు వచించిన ధర్మమును వచించు బ్రాహ్మణులు ఆ ధర్మమును ఆచరించు మహాత్ములు, ఆ ధర్మమును రక్షించు క్షత్రియులు ఎవ్వరెవ్వరు కలరో వారిలోను, వేదశాస్త్రాది విద్యలు అన్నియు మూర్తిమంతములైయుండు బ్రహ్మదేవుని సభయందున్నవారలలోను నీకంటె నితరుడు వక్తగాని, కర్త, రక్షకుడుగాని యుండడు. అందువలన ఈ ధర్మమును చెప్పవలయు ననుట.

శ్లో. కర్త్రాఽవిత్రా ప్రవక్త్రా చ భవతా మధుసూదన
త్యక్తే మహీతలే దేవ వినష్టం కః ప్రవక్ష్యతి. 6

అ. మధుసూదన ! దేవ ! కర్త్రా = కర్త; అవిత్రా = రక్షకుడు; ప్రవక్త్రా = ధర్మ ప్రవర్తకుడగు నీచేత; మహీతలే త్యక్తే సతి = భూతలము త్యజింపబడినది కాగా; వినష్టం = నష్టప్రాయమైన ధర్మమును; కః ప్రవక్ష్యతి = ఎవడు వచింపగలడు.

తా. ధర్మవక్తయు, ధర్మకర్తయు, ధర్మరక్షకుడు నగు నీవు భూతలమును వీడినంతనే ఇక నష్టప్రాయమైన ఈ భక్తిధర్మమును చెప్పువా డెవడుండును?

శ్లో. తత్త్వం నస్సర్వధర్మజ్ఞ ధర్మ స్త్వద్భక్తిలక్షణః
యథా యస్య విధీయేత తథా వర్ణయ మే ప్రభో ! 7

తత్ = అందువలన; నః = మనలో మనుష్యులలో; సర్వధర్మజ్ఞ = ఎల్ల ధర్మములు తెలిసినవాడా ! ప్రభో; త్వం = నీవు, యథా = ఏ ప్రకారము. యస్య విధీయేత = ఎవని విధింపబడునో; తథా = ఆ ప్రకారము; మే వర్ణయ = నాకు చెప్పుము.

తా. మనుష్యులమగు మాలోనెల్ల నీవు సర్వధర్మములు తెలిసినవాడవు. ప్రభుడవు కాన నీవు పోయిన ధర్మము నశించును. కనుక నీ భక్తిలక్షణమగు ధర్మము ఎట్లు ఎవడు ఏ ప్రకారము అనుష్ఠింప వీలగునో, ఆ విధము, ఆ ప్రకారము, ఆ ధర్మము నాకు చెప్పుము.

అవ. శ్రీకృష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు వచించెను—

శ్లో. ధర్మ్య ఏష తవ ప్రశ్నో నిశ్శ్రేయసకరో నృణాం,
వర్ణాశ్రమాచారవతాం తముద్ధవ నిబోధ మే. 8

అ. ఉద్ధవ! తవ ఏష ప్రశ్నః = నీయొక్క ఈ ప్రశ్నము; ధర్మ్యః = ధర్మ సంగతము: వర్ణాశ్రమాచారవతాం, నృణాం = వర్ణాశ్రమాచారవంతులగు నరులకు; నిశ్శ్రేయసకరః మోక్షప్రదము; తం = ఆ ధర్మమును; మే నిబోధ = నావలన నెఱుంగుము.

తా. ఓ ఉద్ధవా! నీవు నన్నడిగిన ప్రశ్న ధర్మబద్ధమైనది. నరులకు శ్రేయస్కరమైనది. వర్ణాశ్రమా చార వంతులగు నరులకు మోక్షప్రదమైనది. కావున ఆ ధర్మమును వచింతును. వినుము.

శ్లో. ఆదౌ కృతయుగే వర్ణో నృణాం హంస ఇతి స్మృతః
కృతకృత్యాః ప్రజా జాత్యా తస్మా త్కృతయుగం విదుః. 9

అ. ఆదౌ కృతయుగే = తొల్త కృతయుగమందు; నృణాం వర్ణః = నరులజాతి, హంస ఇతి స్మృతః = హంసయని చెప్పబడినది; జాత్యా = జన్మచేతనే; ప్రజాః కృతకృత్యాః = ప్రజలు కృతార్థు లగుదురు. తస్మాత్ కృతయుగం విదుః = అందువలన కృతయుగమును ఎఱుగుదురు.

తా. అందు మొదట సృష్టి ప్రారంభమున నాయొక్క ఉపాసనా లక్షణమే ముఖ్య ధర్మమై యుండెను. అచారలక్షణమైన ధర్మము మాత్రము తరువాత ప్రవర్తించినది. ఈ ప్రకారము ఆ ధర్మము అనుష్ఠింపబడినదై భక్తియోగమును జనింపజేయుచున్నదని వర్ణించు

బని చెప్పుచున్నారు. కల్పాది లేక సృష్టి ప్రారంభమునందు కృతయుగమునందు కేవలము నన్నే ఉపాసించుచుండిరి. అన్యమేమి చేయకుండిరి అని చెప్పుటకు కృతయుగ నామమును నిర్వచించుచున్నారు.

కల్పాదియందు కృతయుగమున నరులజాతి హంసయని చెప్పబడును. ఆజాతిచేతనే జన్మచేతనే ప్రజలు కృతార్థులు కృతకృత్యులు అగుచుండిరి. కావున ఆ యుగమునకు కృతయుగమను నామము సార్థకమగునని ఎఱుంగుదురు.

ఇట్టి ధ్యానము కంటె అప్పుడన్యమగు విధాయకమగు కర్మమేదియు లేదనుచున్నారు

**శ్లో. వేదః ప్రణవ ఏవాగ్రే ధర్మోఽహం వృషరూపధృత్**
**ఉపాసతే తపోనిష్ఠాః హంసం మాం ముక్తకిల్బిషాః. 10**

**అగ్రే = ఆదియుగమందు; ప్రణవ ఏవ = ప్రణవము ఓంకారమే; వేదః = వేదమై యుండెను ధర్మః = మనోవిషయమైన ధర్మస్వరూపుడనైన, అహం = నేను; వృషరూపధృత్ = నాలుగు పాదములుగల వృషభరూపధరుడనై యున్నాను, అది క్రియావిశేషమై యజ్ఞాదికమై యుండెను ముక్తకిల్బిషాః = వీడిన పాపములు గలవారై ప్రజలు; తపోనిష్ఠాః = తపస్సునందు నిష్ఠగలవారై మనస్సు ఇంద్రియము లేకాగ్రమగుట తపస్సు అగును. హంసం మాం = శుద్ధుడగు నన్ను; ఉపాసతే = ఉపాసించుచుండిరి.**

**మనసశ్చేంద్రియాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తపః**
**మనస్సును, ఇంద్రియములను ఏకాగ్రము చేయుటయే ఉత్తమమగు తపస్సు అగును.**

తా. ఆదియుగమందు ఓంకారమొక్కటే వేదముగా నుండెను, మనోవిషయమైన ధర్మమైన నేను యజ్ఞాదిక్రియలే నాలుగు పాదములుగాగల ధర్మవృషభమై యుంటిని. పాపరహితులై, తపోనిష్ఠులైన ప్రజలు ఆ ఓంకారముచే శుద్ధహంస స్వరూపుడైన నన్నుమాత్ర ముపాసించుచుండిరి.

**శ్లో. త్రేతాముఖే మహాభాగ ప్రాణాన్మే హృదయాత్త్రయీ**
**విద్యా ప్రాదురభూ త్తస్యాః అహ మాస త్రివృన్మఖః. 11**

**ఓ మహాభాగ, త్రేతాముఖే = త్రేతాయుగ ప్రవేశమందు; మే ప్రాణాత్ = ప్రాణనిమిత్తమైన; హృదయాత్ = హృదయము వలన; త్రయీ విద్యా ప్రాదురభూత్ = వేదవిద్య ఆవిర్భవించెను. తస్యాః = ఆవిద్యవలన; అహం = నేను; త్రివృత్ + ముఖః = హౌత్రము, ఆధ్వర్యవము, ఔద్గాత్రము అను మూడింటితో గూడిన యజ్ఞస్వరూపుడనైతిని; యజ్ఞో వై విష్ణుః అని శ్రుతి.**

తా. ఓ మహాభాగా! త్రేతాయుగము ప్రవేశించినంతనే వైరాజ పురుషుడనైన నా ప్రాణమునకు నిలయమగు నా హృదయమునుండి త్రయీవిద్య ఆవిర్భవించెను. ఆవిద్యను బట్టి నేను హోత, అధ్వర్యుడు ఉద్గాత అను ఋగ్యజుస్సామ వేదాధ్యయన సంపన్నులు

గావించు హౌత్రము ఆధ్వర్యము ఔద్గాత్రము అను మూడు క్రియలతో గూడిన యజ్ఞరూపుడ నైతిని.

అవ. వర్ణాశ్రమముల ధర్మములు చెప్పుటకై వాని యుత్పత్తిని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో॥ విప్రక్షత్రియ విట్శూద్రా ముఖ బాహూరు పాదజాః
వైరాజా త్పురుషా జ్జాతాః య ఆత్మాచారలక్షణాః. **12**

అ. వైరాజాత్పురుషాత్ = విరాట్పురుషుని నుండి; ముఖబాహు + ఊరుపాదజాః = ముఖము, బాహువులు, ఊరువులు, పాదములు అనువాటినుండి జనించిన వారు; విప్రక్షత్రియ విట్ శూద్రాః = విప్రులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు, యే = ఎవరు, ఆత్మ + ఆచార లక్షణాః = స్వధర్మమగు జాతుల ఆచార లక్షణములు గలవారయిరి.

తా. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను నాలుగు జాతులు గల వారై వారి వారి జాత్యాచారములు స్వధర్మ లక్షణములతో కూడినవా రయిరి.

శ్లో. గృహాశ్రమో జఘనతః బ్రహ్మచర్యం హృదో మమ
వక్షస్స్థలా ద్వనే వాసః న్యాసః శీర్షణి సంస్థితః. **13**

మమ = విరాట్పురుషుడగు నా యొక్క; జఘనతః = జఘన ప్రదేశము, పొత్తికడుపు నుండి, గృహాశ్రమః = గృహస్థాశ్రమము; హృదః = వక్షము క్రిందిభాగమునుండి. బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యము. వక్షస్స్థలాత్ = వక్షస్స్థలమునుండి: వనేవాసః = వానప్రస్థము; న్యాసః = సన్న్యాసము, శీర్షణి సంస్థితః = శిరస్సునందు జనించినది.

తా. విరాట్పురుషుడగు నాయొక్క జఘనప్రదేశమునుండి గృహస్థాశ్రమము, వక్షస్థలము యొక్క క్రిందిభాగమునుండి బ్రహ్మచర్యము, వక్షఃస్థలమునుండి వానప్రస్థము, శీర్షము నుండి సన్న్యాసము అను ఆశ్రమములు జనించినవి.

శ్లో. వర్ణానా మాశ్రమాణాం చ జన్మభూమ్యనుసారిణీః
ఆసన్ ప్రకృతయో నౄణాం నీచైః నీచోత్తమోత్తమాః. **14**

అ. వర్ణానాం = వర్ణములకు. ఆశ్రమాణాం చ = ఆశ్రమములకును; జన్మభూమి + అనుసారిణః = వారి వారి జన్మస్థానము ననుసరించి; నౄణాం ప్రకృతయః = నరుల స్వభావములు: నీచైః = మెల్లగా; నీచ + ఉత్తమ + ఉత్తమాః = మంద జన్మభూమి గలవారికి. మధ్యమ స్వభావము, ఉత్తమ జన్మభూమి గలవారికి, ఉత్తమ స్వభావము; ఆసన్ = అయినవి.

తా. బ్రాహ్మణాది నాలుగు వర్ణములకు బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములకు మానవుల స్వభావములు, విరాట్పురుషుని దేహావయవములనుండి పుట్టుక కల్గెను. జన్మ ప్రదేశముల ననుసరించి వారి స్వభావములు మధ్యమోత్తమములుగా మూడు విధములయ్యెను. బ్రాహ్మణులు విరాట్పురుషుని ఉత్తమ ప్రదేశమగు ముఖమునుండి జనించినవారు గావున ఉత్తమ స్వభావులు. గృహస్థాశ్రమము ఉత్తమాశ్రమము. వాని స్వభావము ఉత్తమ మయ్యెను. ఇట్లెల్లరకు తెలియదగును.

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం సంతోషః క్షాంతి రార్జవమ్,
మద్భక్తిశ్చ దయా సత్త్వం బ్రహ్మప్రకృతయ స్త్విమాః. 15

తా. శమము, దమము, తపము (ఆలోచనము), శౌచము, సంతోషము, క్షాంతి (ఓర్పు) ఆర్జవము (ఋజువర్తనము), నా యందలి భక్తియు, దయ, సత్త్వము అను నివి బ్రాహ్మణ జాతికి స్వభావ గుణములు.

శ్లో॥ తేజో బలం ధృతిః శౌర్యం తితిక్షౌదార్య ముత్తమం
స్థైర్యం బ్రహ్మణ్య మైశ్వర్యం క్షత్రప్రకృతయ స్త్విమాః. 16

అర్థము సుగమము.

తా. తేజము (ప్రతాపము), ధృతి, (ధైర్యము), శౌర్యము, తితిక్ష (సహనము) ఔదార్యము (ఈవి) ఉద్యమము (ప్రయత్నము), స్థైర్యము, బ్రహ్మణ్యత (బ్రాహ్మణభక్తి) ఐశ్వర్యము (ప్రభుధర్మము) అనునివి క్షత్రియజాతికి స్వభావ గుణములు.

శ్లో॥ ఆస్తిక్యం దాననిష్ఠా చ హ్యదంభో విప్రసేవనం,
అతుష్టి రర్థోపచయైః వైశ్యప్రకృతయ స్త్విమాః. 17

అ. అర్థ + ఉపచయైః = ధనాది సంపదల వృద్ధుల చేత; అతుష్టిః = తుష్టి లేకుండుట; ఆస్తిక్యం = (దేవు డున్నాడను విశ్వాసము), దాననిష్ఠా = దాననిష్ఠ, అదంభః = డాంబికము లేకుండుట, విప్రసేవనం = విప్రసేవనము, అర్థోపచయైః అతుష్టిః = ధనసంపద పెంపొందుచుండగా చాలువను తృప్తి లేకుండుట; ఇమాః = అనునివి; వైశ్యప్రకృతయః = వైశ్యస్వభావగుణములు.

శ్లో॥ శుశ్రూషణం ద్విజగవాం దేవానా మప్యమాయయా
తత్ర లబ్ధేన సంతోషః శూద్రప్రకృతయ స్త్విమాః 18

అ. ద్విజగవాం = విప్రులకు, గోవులకు; దేవానాం + అపి = దేవతలకు; అమాయయా = కపటము లేక; శుశ్రూషణం = సేవ; తత్ర లబ్ధేన = ఆ సేవయందు లభించిన అన్నాదికముచే; సంతోషః = సంతోషము; ఇమాః = ఇవి, శూద్రప్రకృతయః = శూద్ర జాతి స్వభావములు

తా. విప్రులకు, గోవులకు, దేవతలకు వంచనలేక సేవచేయుట, దానిచే లభించిన అన్నాదికముచే సంతోషించుట ఇవి శూద్రజాతి స్వభావగుణములు.

ఈ పేర్కొన్నవే ఆశ్రమ స్వభావ గుణములని యెఱుంగదగును. ఆశ్రమాదులకు బాహ్యులైన వారి స్వభావ గుణములను చెప్పుచున్నారు.

శ్లో॥ అశౌచ మనృతం స్తేయం నాస్తిక్యం శుష్కవిగ్రహః,
కామః క్రోధశ్చ తర్షశ్చ స్వభావోఽంతేవసాయినామ్. 19

అ. అశౌచం = శౌచము లేమి, అనృతం = అసత్యము, స్తేయం = దొంగతనము; నాస్తిక్యం = దేవుడు లేడనుట; శుష్క విగ్రహః = అకారణ కలహము, కామః, క్రోధః, తర్షః = కామము క్రోధము, పేరాస; అంతేవసాయినాం = చండాలుర యొక్క. స్వభావః = స్వభావము.

తా. శుచిలేమి, అసత్యము, చౌర్యము, నాస్తికత, కారణము లేని కలహము, కామము, క్రోధము, తృష్ణ అనునివి చండాలురయొక్క స్వభావ గుణములు.

అవ. మఱి ఎల్లవారికి సాధారణమగు ధర్మములు చెప్పుచున్నారు—

**శ్లో. అహింసా సత్య మస్తేయ మకామ క్రోధ లోభతా,**
**భూతప్రియహితేహా చ ధర్మోఽయం సార్వవర్ణికః. 20**

అ. అహింసా సత్యం, అస్తేయం = చౌర్యము లేమి; అకామక్రోధలోభతా = కామ క్రోధలోభములు లేకుండుట; భూతప్రియహిత+ఈహా చ=ప్రాణులకు మేలు చేయు కోరిక, అయం సార్వవర్ణికః = ఇది సర్వవర్ణములకు సంబంధించిన ధర్మము.

తా. అహింస, సత్యము, చౌర్యములేమి, కామక్రోధ లోభములు లేకుండుట, ప్రాణులకు ఇష్టము, మేలు చేయు కోరిక అనునివి సర్వవర్ణములకు సంబంధించిన ధర్మము అగును.

అవ. వర్ణధర్మములను గృహస్థ ప్రకరణమందు చెప్పగలరు. ప్రథమమున ఇప్పుడు ఆశ్రమముల యందు బ్రహ్మచారి ధర్మములు వర్ణింపబడును. బ్రహ్మచారి ఉపకుర్వాణుడు, నైష్ఠికుడు అని ద్వివిధము. అందు మొదటివాడగు ఉపకుర్వాణ బ్రహ్మచారి ధర్మములను తొమ్మిది శ్లోకములచే చెప్పుచున్నారు—

**శ్లో. ద్వితీయం ప్రాప్యానుపూర్వ్యాత్ జన్మోపనయనం ద్విజః,**
**వసన్ గురుకులే దాంతో బ్రహ్మాధీయీత వాగ్వతః. 21**

అ. ద్విజః = త్రైవర్ణికుడు; అనుపూర్వ్యాత్ = గర్భాధానాది సంస్కారక్రమమున ద్వితీయం జన్మ = రెండవ జన్మమైన; ఉపనయనం ప్రాప్య = ఉపనయనమును పొంది; గురుకులే వసన్ = గురుకులము నందు వసించుచు; దాంతః = జితేంద్రియుఁడై; ఆచార్యుని చేత ఆహూతుడై; వాగ్యతః = వాఙ్నియమము కలవాడై; బ్రహ్మ, అధీయీత = వేదము నధ్యయనము చేయవలెను. అర్థమును విచారింపవలెను.

తా. బ్రహ్మ క్షత్రియ వైశ్యులను త్రైవర్ణికులలో నెవ్వడైనను, గర్భాధానాది సంస్కారములను క్రమముగా పొంది ద్వితీయజన్మమగు ఉపనయనమును ప్రాపించి, గురుకులమందు వసించుచు, గురువుచే పిలువబడి, వాఙ్నియమము కలవాడై, వేదము నధ్యయనము చేయవలెను.

**శ్లో. మేఖలాజిన దండాక్ష బ్రహ్మసూత్ర కమండలూన్,**
**జటిలోఽధౌత దద్వాసో రక్తపీఠః కుశాన్ దధత్. 22**

అ. మేఖలా ... ... లూన్ = మేఖలా = దర్భల మొలత్రాడు; అజిన = జింక చర్మము; దండ= కఱ్ఱ, అక్ష =అక్షమాల; బ్రహ్మసూత్ర = యజ్ఞోపవీతము; కమండలూన్ = కమండలము అనువానిని; కుశాన్ = దర్భలను; దధత్ = ధరించుచు; జటిలః =అభ్యంగన స్నానము లేక జడలు దాల్చినవాడై; అధౌత దత్ +వాసః = నిర్మలములు కాని- ధంత

ములు, వస్త్రము కలవాడై ; అరక్తపీఠః=రంజవమైన రత్న కంబళాదికము ఆసనము లేనివాడు కావలెను.

తా. దర్భమొలత్రాడు, జింకచర్మము, కట్టి, జపమాల. జందెము, జలకుండిక, దర్భలు అనువానిని ధరించి తలంటు స్నానము లేక జడలు దాల్చిన వాడై, నిర్మలము కాని దంతము, వస్త్రము కలవాడై, పరితనము కాంచిన రత్న కంబళాదికము ఆసనము లేనివాడై యుండవలెను.

**శ్లో. స్నానభోజన హోమేషు, జపోచ్చారే చ వాగ్యతః**
**న చ్ఛింద్యా న్నఖరోమాణి. కక్షోపస్థ గతాన్యపి. 23**

అ. స్నాన భోజన హోమేషు = స్నాన భోజన క్రియలందు; జప+ఉచ్చారే చ = జపమందు; మల మూత్ర విసర్జనమందు; వాగ్యతః = మౌనియై, నఖ రోమాణి = నఖములు, రోమములు; కక్ష+ఉపస్థ గతాని+అపి = చంకలు, మర్మస్థానమును పొందినవై నప్పటికి; న ఛింద్యాత్ = ఛేదింపరాదు.

తా. స్నానము, భోజనము, హోమము చేయునపుడును, జపము చేయునపుడును, మల మూత్రములు విసర్జించునపుడును మౌనము వహింపవలెను. గోళ్ళను కొఱికి తీయకూడదు. చంకలు, మర్మస్థానము నందున్న వెంట్రుకలకు పెఱుకకూడదు.

**శ్లో. రేతో నావకిరే జ్జాతు, బ్రహ్మవ్రతధరః స్వయం**
**అవకీర్ణేఽవగాహ్యాప్సు యతాసుః త్రిపదాం జపేత్. 24**

అ. బ్రహ్మవ్రతధరః = వేదాధ్యయన దీక్ష గలవాడు; జాతు = ఒకప్పుడైనను; రేతః = వీర్యమును; న+అవకిరేత్ = స్ఖలనము చేయకూడదు: అవకీర్ణే = దైవికముగా వీర్యము స్ఖలనమైనపుడు; అప్సు అవగాహ్య = జలములందు మునిగి; యత+అసుః = ప్రాణాయామము చేసి; త్రిపదాం జపేత్ = గాయత్రిని జపింపవలెను.

తా. వేద మధ్యయనము చేయు దీక్షగల బ్రహ్మచారి ఒకానొకప్పుడును స్వయముగా వీర్యము స్ఖలనము కావింపగూడదు. ఒకవేళ దైవికముగా వీర్యము స్ఖలనమైనచో నీళుల గ్రుంకి ప్రాణయామము చేసి, గాయత్రిని జపించవలెను.

**శ్లో. అగ్న్యర్కాచార్య గోవిప్ర గురువృద్ధ సురాన్ శుచిః**
**సమాహిత ఉపాసీత సంధ్యే చ యతవాగ్ జపన్. 25**

అ. శుచిః = స్నానాదికమున శుద్ధుడై; సమాహితః = ఏకాగ్రచిత్తుడై; అగ్న్యర్క ... అగ్ని, సూర్య, ఆచార్య, గో, విప్ర, గురు, వృద్ధ, సురాన్ = సురలను; ఉపాసీత = సేవింపవలెను; యతవాక్=వాక్కు నియమము గలవాడై, సంధ్యే = ప్రాతః సాయంకాల సంధ్యలను; జపన్ = జపించుచు, ఉపాసీత=సేవింపవలెను.

తా. మధ్యాహ్నమందు సంధ్యానిమిత్తమైన మౌనము లేదు. కాన ద్వివచనము. శుచియై నిశ్చలచిత్తుడై అగ్ని, సూర్యుడు, ఆచార్యుడు, గోవు, విప్రుడు, గురువు, వృద్ధుడు, దేవతలు లోనగు వారిని సేవింపవలెను. వాఙ్నియతుడై గాయత్రిని జపించుచు ఉభయ సంధ్యలను సేవింపవలెను.

శ్లో. ఆచార్యం మాం విజానీయా న్నావమన్యేత కర్హిచిత్
న మర్త్యబుద్ధ్యాఽసూయేత సర్వదేవమయో గురుః. 26

అ. ఆచార్యం మాం విజానీయాత్ = తనకు వేద మధ్యయనము చెప్పు ఆచార్యుని నన్నుగా ఎఱుంగవలెను; కర్హిచిత్ న+అవమన్యేత = ఒకప్పుడును అవమానింప వలదు; మర్త్యబుద్ధ్యా న అసూయేత = మానవుడను బుద్ధితో అసూయ పడరాదు. గురుః సర్వదేవమయః = గురువు సకలదేవతా స్వరూపుడు.

తా. తనకు వేద మధ్యయనము చెప్పు ఆచార్యుని నన్నుగా ఎఱుంగవలెను. ఒకప్పుడును అవమానింపరాదు. మానవుడను బుద్ధితో అసూయపడకూడదు. గురువు ఎల్ల దేవతల స్వరూపమని భావించవలెను.

శ్లో. సాయంప్రాత రుపానీయ భైక్షం తస్మై నివేదయేత్
యచ్చాన్యద ప్యనుజ్ఞాత ఉపయుంజీత సంయతః 27

అ. సాయంప్రాతః, సాయంకాలము ఉదయకాలము లందు, భైక్షం ఉపానీయ = భిక్షాన్నము కొని; తస్మై నివేదయేత్ = ఆ గురువునకు నివేదింపవలెను; యత్, చ అన్యత్ + అపి = ఏది అన్యము దొరికినను నివేదింపవలెను; అనుజ్ఞాతః = అనుమతింపబడి; సంయతః = నియతచిత్తుడై, ఉపయుంజీత = భిక్షాన్నము భుజింపవలెను.

తా. సాయంత్రము ప్రాతఃకాలమును తెచ్చిన భిక్షాన్నమును గురువునకు నివేదింపవలెను ఇక నేది లభించినను కూడ ఆ గురుని యనుమతిని పొంది చిత్త మేకాగ్రముగా నుంచి భిక్షాన్నము భుజింపవలెను.

శ్లో. శుశ్రూషమాణ ఆచార్యం సదోపాసీత నీచవత్
యానశయ్యాసన స్థానైః నాతిదూరే కృతాంజలిః. 28

అ, ఆచార్యం శుశ్రూషమాణః = గురువును సేవించుచు; సదా = ఎల్లప్పుడు; నీచవత్ = తాను అల్పుని వలె; యాన, శయ్యా, ఆసన, స్థానైః = గమనము, శయనము, ఆసనము స్థానము లోనగువానిచే, నీచవత్ = తాను అల్పుడుగా; న+అతిదూరే = ఇంచుక దూరము నందు; కృతాంజలిః, ఉపాసీత = చేతులు మోడ్చి సేవింపవలెను.

తా. ఆచార్యునకు సేవచేయుచు తాను అల్పజనుడువలె నమస్కరించుచు, గురువు పోవునపుడు వెనుకపోవుచు, పరుండినపుడు సమీపమున అప్రమత్తుడై, క్రింద శయనించుచు, విశ్రాంతుడైన గురువు పాదములు పట్టుట లోనగువానిచే కూర్చుండియు, ఎచ్చటికైన పోవుట తెలియుటకు సమీపముననుండి సేవింపవలెను.

శ్లో. ఏవంవ్రతో గురుకులే వసే ద్భోగవివర్జితః,
విద్యా సమాప్యతే యావత్ బిభ్ర ద్వ్రత మఖండితమ్. 29

అ. ఏవంవ్రతః = ఇట్టి నియమము కలవాడై ; యావత్, విద్యా సమాప్యతే = ఎంత వఱకు విద్య పరిపూర్తి యగునో అంతవఱకు; భోగవివర్జితః = ఇంద్రియ భోగములను వర్జించినవాడై ; అఖండితం వ్రతం = స్ఖలితమ్ము పొందని వ్రతమును; బిభ్రత్ = ధరించుచు; గురుకులే వసేత్ = గురుకులము నందు వసింపవలెను.

తా. ఇట్టి వ్రతము గలవాడు వేదవిద్య పరిసమాప్తి యగువఱకు స్థాలిత్యము పొందని బ్రహ్మచర్య వ్రతమును ధరించి, ఇంద్రియ భోగములను విడచి, బ్రహ్మచారియై గురుకులము నందు నివసింపవలెను.

అవ. ఈ ప్రకారము ఉపకుర్వాణ బ్రహ్మచారి ధర్మములు చెప్పి, నైష్ఠిక బ్రహ్మచారి విశేష ధర్మములను చెప్పుచున్నారు—

**శ్లో. యద్యసౌ ఛందసాం లోక మారోక్ష్యన్ బ్రహ్మవిష్టపం,**
**గురవే విన్యసే ద్దేహం స్వాధ్యాయార్థం బృహద్వ్రతః. 30**

అ. అసౌ. = ఈ బ్రహ్మచారి; ఛందసాం లోకః — వేదముల లోకమగు మహర్లోకము కు; బ్రహ్మ విష్టపం = అచ్చటి నుండి బ్రహ్మలోకమును; ఆరోక్ష్యన్ = ఎక్కగోరిన వాడగుచు అని యర్థము లేక ఛందస్సుల లోకమనగా వేదములు మూర్తిమంతములై యుండు బ్రహ్మలోకమును అని విశేషణముగా చెప్పవచ్చును. బృహద్వ్రతః = నైష్ఠికవ్రతము కలవాడై, స్వాధ్యాయార్థం = అధికముగా వేద మధ్యయనము చేయుటకు గాని, అధ్యయనము చెప్పిన గురుని ఋణము తీర్చుటకు గాని; గురవే దేహం విన్యసేత్ = గురువునకు తన దేహమును సమర్పింపవలెను.

తా. ఈ బ్రహ్మచారి ఛందస్సుల లోకమగు మహర్లోకమును పొంది, అచ్చటనుండి బ్రహ్మలోకమును పొందగోరినచో, లేక వేదములు మూర్తిమంతములై యుండు బ్రహ్మలోకమును పొంచుటకు గాని, నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతము కలవాడై, అధిక వేదవిద్యా ప్రాప్తికి గాని, తనకు వేదమును చెప్పిన గురుని ఋణము తీర్చుటకు గాని, తన దేహమును గురువునకు సమర్పింపవలెను.

**శ్లో. అగ్నౌ గురావాత్మని చ సర్వభూతేషు మాం పరం**
**అపృథగ్ధీ రుపాసీత బ్రహ్మవర్చ స్వ్యకల్మషః. 31**

అ. అగ్నౌ, గురౌ, ఆత్మని చ=అగ్నియందు, గురునందు, తనయందున; సర్వ భూతేషు = ఎల్ల భూతములందు; పరం మాం = పరుడైన నన్ను; అపృథక్ధీః = భేదబుద్ధి లేనివాడై; బ్రహ్మవర్చస్వీ = వేదాధ్యయనము వలన తేజస్సు గలవాడై; అకల్మషః = పాప రహితుడై; ఉపాసీత = నన్ను సేవింపవలెను.

తా. ఈ నైష్ఠిక బ్రహ్మచారి అగ్నియందు, గురువునందు, తన యందు, ఎల్లభూతము లందును, పరమేశ్వరుడగు నన్ను భేదబుద్ధి లేక దర్శించుచు, వేదాధ్యయనము వలన కలిగిన బ్రహ్మతేజముతో, నిష్పాపుడై, నన్ను లేక గురువు నుపాసింపవలెను.

అవ. వానప్రస్థయతి ధర్మములను చెప్పుచున్నారు—

**శ్లో. స్త్రీణాం నిరీక్షణ స్పర్శ సల్లాప క్ష్వేళనాదికం**
**ప్రాణినో మిథునీభూతా నగృహస్థోఽగ్రత స్త్యజేత్. 32**

అ. స్త్రీణాం = స్త్రీల యొక్క; నిరీక్షణ ...... ఆదికం. నిరీక్షణ = చూచుట; స్పర్శ = తాకుట; సల్లాప = సంభాషించుట; క్ష్వేళ నాదికం = పరిహాసము లోనగు వానిని; మిథునీ భూతాన్ ప్రాణినః = దంపతులై కలసియున్న ప్రాణులను; అగృహస్థ = గృహస్థుడు కాని వాడు; అగ్రతః త్యజేత్ = ముందుగనే విడువవలెను, చూడరాదు.

తా. స్త్రీలను చూచుట, తాకుట, వారితో మాటలాడుట, వారిని పరిహసించుట, దంపతులను చూచుట గృహస్థుడు కానివాడు చేయరాదు

అవ. అతనికే సర్వాశ్రమ సాధారణ ధర్మములను రెండు శ్లోకములలో చెప్పుచున్నారు—

శ్లో. శౌచ మాచమనం స్నానం సంధ్యోపాస్తి ర్మ మార్చనం
తీర్థసేవా జపోఽ స్పృశ్యాభక్ష్య సంభాష్య వర్జనమ్. 33

అ. సంధ్యా + ఉపాస్తి = సంధ్యోపాసనము; మమ + అర్చనం = నా పూజ; అస్పృశ్య – అభక్ష్య – అసంభాష్య వర్జనం = స్పృశింపరాని, తినరాని, సంభాషింపరాని వానిని విడచుట.

తా. శరీరమునకు పారిశుద్ధ్యము, ఆచమనము, స్నానము, సంధ్యోపాసనము, నన్ను పూజించుట, తీర్థసేవ, జపము, స్పృశింపరాని, తినరాని, సంభాషింపరాని వానిని విడచుట. ఇవి గలవాడు కావలెను.

శ్లో. సర్వాశ్రమ ప్రయుక్తోఽయం నియమః కులనందన
మద్భావః సర్వభూతేషు మనోవాక్కాయసంయమః. 34

అ. కులనందన, అయం = ఈ; నియమః = నియమము; సర్వ + ఆశ్రమ ప్రయుక్తః = బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమములకు యుక్తమైనది; సర్వభూతేషు మద్భావః = ఎల్ల భూతము లందు నాస్వరూపమును చూచుట; మనో వాక్ కాయ సంయమః = మనస్సు, మాట, శరీరముల నదుపులోనుంచుట.

తా. ఓ కులమును సంతోషపెట్టువాడా ! ఈ నియమము ఎల్ల వారలకు ఉపయుక్తమైనది. ఎల్ల భూతములందు, నన్ను దర్శింపగలిగి, మనస్సు, వాక్కు, శరీరము అదువానిని నియమమునం దుంచుకొనువాడు కావలెను.

అవ. నిష్కామ నైష్ఠికునకు మోక్షము ఫల మనుచున్నారు—

శ్లో. ఏవం బృహద్వ్రతధరో బ్రాహ్మణోఽగ్ని రివ జ్వలన్
మద్భక్త: తీవ్రతపసా దగ్ధ కర్మాశయోఽమలః. 35

అ. ఏవం = ఈ ప్రకారము; = బృహద్వ్రతధరః బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించిన; బ్రాహ్మణ, = బ్రాహ్మణుడు; = అగ్నిరివ జ్వలన్ అగ్నివలె తేజరిల్లుచు; మత్ + భక్తః = నా భక్తుడు; తీవ్రతపసా = ఉగ్రమైన తపస్సుచే, దగ్ధకర్మ + ఆశయః = దహింపబడిన కర్మ వాసనము కలిగి; అమలః = నిర్మలు డగుచున్నాడు.

తా. ఈ ప్రకారము బ్రహ్మచర్య మనుష్ఠించిన బ్రాహ్మణుడు అగ్నివలె ప్రజ్వలించుచు, నా భక్తుడై, కఠోర తపస్సుచే కర్మ వాసనలన్నియు నశించి చిత్తశుద్ధి కలవాడగుచున్నాడు.

అవ. ఉపకుర్వాణ బ్రహ్మచారికి సమావర్తనము చేయు విధానము చెప్పుచున్నారు—

శ్లో. అథానంతర మావేక్ష్యన్ యథా జిజ్ఞాసితాగమః
గురవే దక్షిణాం దత్త్వా స్నాయాద్గుర్వనుమోదితః. 36

అ అథ, అనంతరం = తరువాత రెండవదగు గృహస్థాశ్రమమును; ఆవేక్ష్యన్ = ప్రవేశింపఁగోరుచు; యథా జిజ్ఞాసిత + ఆగమః = యథావిధిగా వేదార్థ విచారము చేసినవాడై; గురవే దక్షిణాం దత్త్వా = గురువునకు దక్షిణ నిచ్చి; గురు + అనుమోదితః = గురువు ఆమోదమును పొంది; స్నాయాత్ = అభ్యంగన స్నానము చేయవలెను. (మఱలవలెను)

తా. అంత బ్రహ్మచారి గృహస్థాశ్రమము పొందగోరినవాడై, యథావిధిగా వేదార్థ విచారము చేసి, గురుదక్షిణ నిచ్చి, గురు ననుమతిని పొంది అభ్యంగన స్నానము చేయవలెను గురుకులమునుండి తన గృహమునకు మరలి రావలెను.

అవ. వానికి అధికారానురూపమైన ఆశ్రమ వికల్పమును సముచ్చయమును చెప్పుచున్నారు—

శ్లో గృహం వనం వా ప్రవిశేత్, ప్రవ్రజేద్వా ద్విజోత్తమః
ఆశ్రమా దాశ్రమం గచ్ఛేత్ నాన్యథాఽమత్పర శ్చరేత్. 37

అ. గృహం ప్రవిశేత్ = సకాముడైనచో గృహమును ప్రవేశింపవలెను; వనం = అంతఃకరణ శుద్ధ్యాది కాముడైనచో వనమును ప్రవేశింపవలెను.; ప్రవ్రజేత్ + వా = శుద్ధాంతఃకరణుడైనచో సన్న్యసింపవలెను; ద్విజోత్తమః = బ్రాహ్మణ శ్రేష్ఠుడు. ఇట్లనుటచే క్షత్రియ వైశ్యులకు ప్రవ్రజ్యాధికారము లేదని సూచించుచున్నారు. బ్రాహ్మణుడైనచో సన్న్యసింపవలెను. లేదా, ఆశ్రమాత్ + ఆశ్రమం గచ్ఛేత్ = ఒక ఆశ్రమము నుండి, తరువాతి ఆశ్రమమును క్రమముగా పొందవలెను; న + అన్యథా = ఏ ఆశ్రమము లేనివాడై, వ్యతిక్రమముగా పై ఆశ్రమము నుండి క్రింది ఆశ్రమమును పొందరాదు. లేక మత్పరః చరేత్ = నా భక్తుడై చరింపవలెను. అమత్పరః = నా భక్తుడు కానివాడు అనియు పదవిభాగము, స్వభక్తునికి ఆశ్రమ నియమాభావము ముందు చెప్పగలరు.

తా. బ్రహ్మచారి సకాముడైనచో గృహస్థాశ్రమమును ప్రవేశింపవలెను. అంతఃకరణ శుద్ధికాముడైనచో వానప్రస్థాశ్రమమును పొందవలెను, అంతఃకరణశుద్ధి గల బ్రాహ్మణుడైనచో సన్న్యాసము స్వీకరింపవలెను. ఇట్లనుటచే క్షత్రియ వైశ్యులకు సన్న్యాసము లేదని చెప్పబడినది. ఏ ఆశ్రమము లేనివాడు కాగూడదు. పై ఆశ్రమము వాడు క్రింది ఆశ్రమమునకు విపరీతముగా రాకూడదు. నా భక్తుడై చరింపవలెను.

శ్లో. గృహార్థీ సదృశీం భార్యాం ఉద్వహే దజుగుప్సితాం,
యవీయసీం తు వయసా సమవర్ణా మనుక్రమాత్. 38

గృహార్థీ = గృహస్థుడు కాఁగోరినవాడు, సదృశీం = తనకు సాటియై, అజుగుప్సితాం = కులమును బట్టి, లక్షణమును బట్టి, నిందితకానిదైన, వయసా యవీయసీం = తనకన్న చిన్నదైన, సమవర్ణాం = తనకులము కలదైన, కన్యను, అనుక్రమాత్ = కులక్రమము ననుసరించి భార్యాం ఉద్వహేత్ = భార్యగా స్వీకరింపవలెను.

తా. గృహస్థుడు కాంగోరినవాడు, తన సాటిదై, కులలక్షణముల బట్టి నిందిత కానిదై, వయస్సుచే తన కంటె చిన్నదై తమ వర్ణము కలదైన కులకన్యను భార్యగా గ్రహించి వివాహ మాడవలెను.

శ్లో. ఇజ్యాధ్యయన దానాని సర్వేషాం చ ద్విజన్మనాం,
ప్రతిగ్రహోఽధ్యాపనం చ, బ్రాహ్మణ స్యైవ యాజనమ్. 39

అ. ద్విజన్మనాం సర్వేషాం = ద్విజులగు త్రైవర్ణికుల కెల్లరకు; ఇజ్యా అధ్యయన దానాని = యజ్ఞము వేదాధ్యయనము, దానము తగును; ప్రతిగ్రహః = దానము గొనుట; అధ్యాపనం = వేదము చెప్పుట ; యజనం = యజ్ఞము చేయించుట; బ్రాహ్మణస్య+ఏవ = బ్రాహ్మణునకే తగును.

తా. ద్విజులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు, యజ్ఞము చేయుట, వేదాధ్యయనము చేయుట, దానము చేయుట- ఇవి తగును. ప్రతిగ్రహము, (దానము పుచ్చుకొనుట), అధ్యాపనము (వేదము శిష్యులకు చెప్పుట) యజ్ఞము చేయించుట బ్రాహ్మణున కొక్కనికే తగును. కామమును బట్టి ఇతర కన్యలను వివాహ మాడదగును. వర్ణక్రమము బట్టి వివాహ మాడవలెను.

తిస్రో వర్ణానుపూర్వ్యేణ, ద్వే, తథైకాం యథాక్రమం
బ్రాహ్మణ క్షత్రియ విశాం భార్యాస్తా శ్శూద్రజన్మనః, —అని స్మృతి.

వర్ణక్రమము ననుసరించి బ్రాహ్మణుడు మూడు కులముల కన్యలను క్షత్రియ వైశ్య శూద్ర కన్యలను వివాహ మాడదగును. క్షత్రియుడు ఇద్దఱను వైశ్య శూద్ర కన్యలను వైశ్యుడు శూద్రకన్యను వివాహ మాడనగును.శూద్రునకు శూద్రకన్యకనే వివాహ మాడదగును.

శ్లో. ప్రతిగ్రహం మన్యమానః తపస్తేజో యశో మదం
అన్యాభ్యామేవ జీవేత శిలైర్వా దోషదృక్తయోః. 40

అవ. అందు ముఖ్యమును, ముఖ్యతమమునగు నితరవృత్తిని చెప్పుచున్నారు—

అ. ప్రతిగ్రహం = దానమును గ్రహించుట, తపస్, తేజస్, యశస్, మదం = తపస్సు తేజస్సు, కీర్తి యను వానిని హరించునదిగా, మన్యమానః = తలచుచు, తయోః వా = యాజనాధ్యాపనములయందు. దోషదృక్ = కార్పణ్యాది దోషము చూచువాడై (అశగలుగుట.) అన్యాభ్యాం ఏవ, జీవేత = యాజనాధ్యాపములచే జీవింపవలెను, శిలైః = యజమాని త్యజించిన క్షేత్ర పతితములగు ధాన్యపు గింజలచే జీవింపవలెను.

తా. విప్రుడు ఇతరులనుండి దానము గ్రహించుట తన తపస్సు, బ్రహ్మతేజస్సు కీర్తి లోనగువానిని హరించునని తలంచుచున్నవాడై యాజనాధ్యాపనములు రెంటిచే జీవింపవలెను. ఆ రెంటియందు కార్పణ్యాది దోషమును చూచుచున్నవాడై పొలములో, యజమానులు త్యజించిన రాలిన ధాన్యపుగింజలను ఏఱి తెచ్చుకొని వానితో జీవింపవలెను. ఈ ప్రకారము జీవనవర్తన కష్టమైనను, బ్రాహ్మణుడు దానిని సహింపవలెనని చెప్పుచున్నారు.

శ్లో॥ బ్రాహ్మణస్య హి దేహోఽయం, క్షుద్రకామాయ నేష్యతే
కృచ్ఛ్రాయ తపసే దేహప్రీత్యాఽనంతసుఖాయ చ. 41

అ. బ్రాహ్మణస్య, అయం దేహః హి=బ్రాహ్మణుని ఈ దేహము, క్షుద్రకామాయ తుచ్ఛమగు కామమునకు, న ఇష్యతే=ఇచ్ఛగింపఁదగదు; దేహప్రీత్యా=దేహము వందలి సంతృప్తితో, అనంతసుఖాయ=మోక్షసుఖము కొఱకు -ఇచ్ఛగింపదగినది.

తా. బ్రాహ్మణుని దేహము తుచ్ఛమగు కామసుఖమునకు ప్రార్థింప దగదు. మఱేమనగా కృచ్ఛ్రాదికమగు తపస్సు చేయుటకు, దేహపాతమైనంతట మోక్షసుఖము పొందుటకు మాత్రము కోరబడుచున్నది.

శ్లో॥ శిలోంఛవృత్త్యా పరితుష్టచిత్తో ధర్మం మహాంతం, విరజం జుషాణః,
మయ్యర్పితాత్మా గృహ ఏవ తిష్ఠన్, నాతిప్రసక్త స్సముపైతి, శాంతిమ్. 42

అ. శిల+ఉంఛవృత్త్యా =శిలమనగా పొలము నందు రాలిన ధాన్యపుగింజ లేరికొనుట. ఉంఛమనగా అంగడి వీధిముందు పడియున్న ధాన్యపు గింజలేరి తెచ్చుకొనుట. అను రెండు వృత్తులచే, పరితుష్టచిత్తః=సంతృప్తిచెందిన చిత్తము గలవాడు, మహాంతం=అతిథి సత్కార రూపమై దొడ్డదైన ధర్మమును, విరజం=నిష్కామముగా, జుషాణః=సేవించుచున్నవాడై, మయి+అర్పిత+ఆత్మా = నాయందు అర్పించిన చిత్తముగలవాడై, గృహే ఏవ తిష్ఠన్ గృహమునందే ఉండుచు, న+అతిప్రసక్తః=ఎక్కువ ఇంద్రియ సుఖాసక్తి లేనివాడై, శాంతిం సముపైతి=మనశ్శాంతిని పొందుచున్నాడు.

తా. పంటపొలములందు రాలిన పరిగ లేరికొనియు, అంగడివీధిలో రాలిన ధాన్యపుగింజ లేరికొనియు, జీవించుచు తృప్తిచెందిన చిత్తము గలవాడై, అతిథి సత్కారమగు గొప్ప ధర్మమును నిష్కామమున కావించుచు, నాయందు చిత్తముంచి, ఇంద్రియ సుఖమునందు సక్తుడుగాక వర్తించువాడు పరమశాంతిని పొందుచున్నాడు.

అవ. ఈ ప్రకారము, అధనునకు మహత్ఫలము చెప్పి, సధనులకును మహాఫలమును చెప్పుచున్నారు—

శ్లో॥ సముద్ధరంతి యే విప్రం సీదంతం మత్పరాయణం
తానుద్ధరిష్యే నచిరాత్ ఆపద్భ్యో నౌ రి వార్ణవాత్. 43

అ. యే=ఎవ్వరైతే, మత్పరాయణం, విప్రం=నా భక్తుడైన విప్రుని, సీదంతం=క్రుంగుచున్నవానిని, అన్నాదికమిడి పోషించుచున్నారో, తాన్=వారిని, ఆపద్భ్యః=ఆపదలనుండి, అర్ణవాత్ నౌరివ=సముద్రమునుండి ఓడవలె, నచిరాత్ ఉద్ధరిష్యే=శీఘ్రముగనే ఉద్ధరింపగలను.

తా. ఏ సంపన్న గృహస్థులు నా భక్తుని, విప్రుని లేమిచే శ్రమించువానిని, అన్నమిడి పోషింతురో వారలను కడు శీఘ్రముగనే, సముద్రమున ఓడవలె, ఆపదల నుండి ఉద్ధరింతును.

అవ. రాజునకు ఆవశ్యకమైన దానిని చెప్పుచున్నారు—

శ్లో. సర్వా స్సముద్ధరే ద్రాజా పితేవ వ్యసనా త్ప్రజాః,
ఆత్మాన మాత్మనా ధీరః యథా గజపతి ర్గజాన్. **44**

అ. రాజా = రాజు, పితా ఇవ = తండ్రివలె, సర్వాః ప్రజాః = ప్రజలందఱను, వ్యసనాత్ సముద్ధరేత్ = దుఃఖమునుండి ఉద్ధరింపవలెను, గజపతిః = గజరాజము, గజాన్ యథా = ఇతర గజములనువలె, ధీరః = ధీరుడై, ఆత్మానం = తనను, ఆత్మనా = తన నిర్మలబుద్ధితో, సముద్ధరేత్ = ఉద్ధరింపవలెను.

తా. తండ్రి బిడ్డలను వలె, గజరాజు సామాన్య గజములను వలె, రాజు ధీరుడై తన ఏలుబడిలోని ప్రజ నందరను కష్టములనుండి ఉద్ధరించుచు అట్లే దృఢచిత్తముతో తనను తాను ఉద్ధరించుకొనుచు వర్తింపవలెను.

శ్లో. ఏవంవిధో నరపతిః విమానే నార్కవర్చసా,
విధూ యే హాశుభం కృత్స్న మింద్రేణ సహ మోదతే. **45**

అ. ఏవంవిధః నరపతిః = ఇట్లు వర్తించు నరపాలుడు, ఇహ = ఈలోకమందు కృత్స్నం, అశుభం విధూయ = ఎల్లపాపమును తొలగించుకొని, అర్కవర్చసా, విమానేన = సూర్యతేజముగల విమానముతో, ఇంద్రేణ సహ = ఇంద్రునితో గూడి, మోదతే = సంతోషమందుచున్నాడు.

తా. ఇట్లు ప్రజారక్షణము కావించు నరపాలుడు ఈ లోకమునందు తన పాపముల నెల్ల పోగొట్టుకొని, సూర్యప్రకాశము గల విమానము నెక్కి దేవలోకము నందు, ఇంద్రునితో బాటు, దేవభోగములచే సంతసించును.

శ్లో. సీదన్ విప్రో వణిగ్వృత్త్యా పణ్యై రేవాపదం తరేత్,
ఖడ్గేన వాఽఽపదాక్రాంతః న శ్వవృత్త్యా కథంచన. **46**

అ. సీదన్ విప్రః = దారిద్ర్యముచే నలుగుచున్న విప్రుడు, వణిగ్ + వృత్త్యా = వైశ్యుని వృత్తిచే, పణ్యైః = అమ్మదగిన వస్తువులచే, ఆపదం తరేత్ = ఆపదను దాటవలెను. వా = లేక, ఆపదాక్రాంతః = ఆ వృత్తిలో ఆపదనొందినచో, ఖడ్గేన = క్షత్రియ వృత్తిచే కత్తిపట్టి ఆపదను తరింపవలెను. కథంచన శ్వవృత్త్యా న = ఒకప్పుడును నీచవృత్తిచే జీవింపదగదు.

తా. దారిద్ర్యముచే కష్టపడుచున్న విప్రుడు వైశ్యవృత్తి నవలంబించి, విక్రయార్హము లగు వస్తువుల నమ్మి (సురా. లవణాదులను పరిహరించి) తన ఇక్కట్టు నుండి దాటవలెను. ఆ వృత్తిచే తనకు ఆపద గడవనిచో క్షత్రియవృత్తివలన నైన ఖడ్గధారియై జీవింపవలెను; నీచసేవ నెట్టి కష్టమునందును గ్రహింపరాదు.

శ్లో. వైశ్యవృత్త్యా తు రాజన్యో జీవే న్మృగయయాఽఽపది,
చరేద్వా విప్రరూపేణ న శ్వవృత్త్యా కథంచన. **47**

అ. రాజన్యః=రాజు, ఆపత్కాలమునందు, వైశ్యవృత్త్యా జీవేత్ = వ్యాపారముచే జీవింపవలెను. ఆపది, మృగయా=ఆపత్సమయమందు వేటను వృత్తిగా గొని జీవింపవలెను. విప్రరూపేణ చరేత్- వా= విప్రునివలె వేదాధ్యాపనముచే జీవింపవలెను కథంచన, శ్వవృత్త్యా న=ఎట్టి కష్టమునందను నీచసేవ పనికిరాదు.

తా. రాజు కష్టకాలమందు వైశ్యవృత్తిచే జీవింపవలెను. మఱి ఆపదలందు వేటాడి జీవింపనగును. విప్రునట్లు వేదము శిష్యులకు చెప్పి జీవింపవలెను. కాని ఎట్టి ఇక్కట్టునను నీచసేవచే జీవింపరాదు.

శ్లో. శూద్రవృత్తిం భజే ద్వైశ్యః శూద్రః కారుకటక్రియాం,
కృచ్ఛ్రాన్ముక్తో న గర్హ్యేణ వృత్తిం లిప్సేత కర్మణా. 48

అ. వైశ్యః శూద్రవృత్తిం భజేత్=ఆపదయందు శూద్రవృత్తిని, నీచసేవను చేయనగును. శూద్ర=శూద్రుడు, కారుకటక్రియాం భజేత్=ప్రతిలోమ జాతులగు శిల్పులు చేయు వడ్రంగి పని.చాపలల్లుట మొదలగు వానిని చేయ నగును. కృచ్ఛ్రాత్-ముక్తః=ఆపద తొలగిన వాడై, గర్హ్యేణ కర్మణా= నింద్యమైన కర్మచే, వృత్తిం న లిప్సేత= జీవనము కోరకూడదు.

తా. వైశ్యుడు ఆపదయందు శూద్రవృత్తియగు సేవకాదివృత్తిని అవలంబించదగును. శూద్రుడును శిల్పులు మేదరవాండ్రు చేయు శిల్పము, వడ్రంగి పని, చాపలల్లుట లోనగువానిని చేపట్టదగును. ఆపద తొలగినంతనే నింద్యమైన వృత్తిచే జీవింపఁదగదు.

అవ. వృత్తి వ్యవస్థను చెప్పి, మఱల గృహస్థునకు ఆవశ్యకములైన పంచ మహా యజ్ఞములను చెప్పుచున్నారు—

శ్లో. వేదాధ్యాయః స్వధా స్వాహా బల్యన్నాద్యై ర్యథోదయమ్,
దేవర్షి పితృభూతాని మద్రూపా ణ్యన్వహం యజేత్. 49

అ. వేదాధ్యాయః=వేదాధ్యయనముచే ఋషులను, స్వధా = స్వధాకారముచే పితరులను, స్వాహా=స్వాహాకారముచే దేవతలను, బలి+అన్నాద్యైః=బలిహారములోనగు అన్నాదికములచే భూతములను (అన్నోదకములచే మనుష్యులను), దేవర్షి పితృభూతాని= దేవతలు, ఋషులు, పితరులు, భూతములను, యథా+ఉదయం=విభవాను సారముగా, మద్రూపాణి= నా రూపములను, అన్వహం=ఎప్పుడును, యజేత్=పూజించవలెను.

తా. బ్రహ్మయజ్ఞమగు వేదాధ్యయనముచే ఋషులను, స్వధాకారముచే తర్పణాదులు సమర్పించి పితృ యజ్ఞముచే పితృ దేవతలను, స్వాహాకారముచే హవిస్సును సమర్పించి దేవ యజ్ఞముచే దేవతలను, బలిహరణము వలన భూతయజ్ఞముచే భూతములను, అన్నోదకములచే మనుష్యయజ్ఞమున మనుష్యులను తృప్తి పరచవలెను.

శ్లో. యదృచ్ఛ యోపపన్నేన, శుక్లేనోపార్జితేన వా,
ధనేనాఽపీడయన్ భృత్యాన్, మాం యజేతాహరన్ క్రమాత్. 50

అ. యదృచ్ఛయా-ఉపపన్నేన=ప్రయత్నములేక ప్రాప్తించినదియు, శుక్లేన ఉపార్జితేన-వా=పరిశుద్ధమైన స్వవృత్తిచే ఆర్జించినదైన, ధనేన= ధనముతో, భృత్యాన్-అపీడయన్ = సేవకులను పీడించని వాడై, ఆహరన్=ధనమార్జించుచు, మాం=నన్నుగూర్చి, క్రతూన్ - యజేత=క్రతువులను చేయవలెను.

తా. స్వప్రయత్నము లేక ప్రాప్తించినదియు, శుద్ధమైన వృత్తిచే నార్జింపబడినదియు నగు ధనముచే భృత్యులను పీడింపక పోషించుచు, నన్నుగూర్చి క్రతువులను చేయవలెను.

అవ. గృహస్థునికి సైతము నివృత్తినిష్ఠను మూడు శ్లోకములచే చెప్పుచున్నారు—

**శ్లో. కుటుంబేషు న సజ్జేత న ప్రమాద్యేత్ కుటుంబ్యపి,**
**విపశ్చి న్నశ్వరం పశ్యేత్ అదృష్టమపి దృష్టవత్ 51**

అ. కుటుంబేషు - న- సజ్జేత=కుటుంబీకులగు సతీసుతాదులందు ఆసక్తుడు కారాదు. కుటుంబీ + అపి న ప్రమాద్యేత్=కుటుంబమున్నను ఈశ్వరనిష్ఠయందు ప్రమత్తుడు కారాదు. విపశ్చిత్=విద్వాంసుడు, అదృష్టం-అపి స్వర్గాది సుఖమును కూడ, దృష్టవత్ =ఐహిక సుఖము, వలె, నశ్వరం పశ్యేత్=నశించునదిగా చూడవలెను.

తా. గృహస్థుడు సతీసుతాదులయందు ఆసక్తుడు కారాదు. సంసారి యైనను నిష్ఠను మరువరాదు. అదృష్టమగు పరలోకసుఖమునుకూడ ఐహికసుఖమువలె నశించున దని తెలియవలెను. దృష్టాదృష్టాసక్తున కెట్లు ప్రమాద మనగా, వాని యందు ఆసక్తియే ప్రమాద మని భావము.

అవ. దృష్టములైన వాని యందు ఆసక్తి అధికమగుట వలన వాని నాశస్వభావమును చెప్పుచున్నారు—

**శ్లో. పుత్రదారాప్త బంధూనాం సంగమః పాంథసంగమః,**
**అనుదేహం వియంత్యేతే స్వప్నో నిద్రానుగో యథా. 52**

అ. పుత్ర దార- ఆప్తబంధూనాం; సంగమః=పుత్రుడు, భార్య, ఆప్తులు బంధువులు అను వీరి కలయిక, పాంథ సంగమః=బాటసారులతోడి కూడిక వంటిదగును. నిద్రా-అగమే స్వప్నః యథా =నిద్రవచ్చినప్పుడు స్వప్న మెట్లో, ఆ రీతిగనే, అనుదేహం=ప్రతిదేహము నందు, ఏతే వియంతి=ఈ దార పుత్రాదులు నశించుదురు;

తా. నిద్ర వచ్చినపుడు కన్పించి, మేల్కాంచినపుడు స్వప్నమెట్లు మాయమగునో, అట్లే కొడుకులు, చెలులు, బంధువులు కూడ, చలి పందిరి వద్ద కలిసికొను బాటసారుల వలె కొంత వడికి, ఎవరి దారిన వారు పోదురు. అట్లే ప్రతి జన్మమునందును కూడినవారు దేహాంతమున నశింతురు.

**శ్లో. ఇత్థం పరిమృశన్ ముక్తో గృహేష్వతిథివ ద్వసన్**
**న గృహై రను బధ్యేత నిర్మమో నిరహంకృతిః. 53**

అ. ఇత్థం, ఈప్రకారము, యుక్త్యా పరిమృశన్ = యుక్తితో విమర్శించుచు, గృహేషు = స్వజనమునందు, అతిథివత్-వసేత్ = అతిథి వలె ఉండవలెను; నిర్మమః నిరహం కృతిః = మమకారము, అహంకారము లేనివాడై, గృహైః న, అనుబధ్యేత్ = గృహదారాదులతో బంధితుడు కారాదు.

తా. ఇట్లు శాస్త్రయుక్తులచే విమర్శించుచు, గృహము నందు అతిథి వలె నివసించుచు ఇది నాది అను మమకారము, ఈ దేహము నేను అను అహంకారము లేనివాడై గృహదారాదులతో బంధితుడు కారాదు.

అవ. వానికిని ఆశ్రమ వికల్పమును చెప్పుచున్నారు—

శ్లో. కర్మభిః గృహమేధీయైః ఇష్ట్వా మామేవ భక్తిమాన్
తిష్ఠేద్వనం వా ప్రవిశేత్ ప్రజావాన్వా పరివ్రజేత్. 54

అః గృహమేధీయైః కర్మభిః = గృహస్థునకు సంబంధించిన కర్మలచే, భక్తిమాన్ = భక్తి గలవాడై; మాం ఏవ ఇష్ట్వా = నన్నే పూజించి; తిష్ఠేత్ = గృహమందే ఉండవలెను; ప్రజావాన్-వా = బిడ్డలు గలవాడైన గాని; వనం వా ప్రవిశేత్ = వనమును ప్రవేశింపవలెను, పరివ్రజేత్ = సన్యసింపవలెను.

తా. గృహస్థుడు గృహస్థాశ్రమోచితములైన కర్మలచే భక్తిమంతుడై పూజించి,గృహస్థాశ్రమము నందే ఉండవలెను. సంతానము కలవాడగుచో వనమును ప్రవేశించునది. లేదా సన్న్యాసమునైన గ్రహింపవలెను.

శ్లోః యస్త్వాసక్త మతి ర్గేహే పుత్రవిత్తైషణాతురః,
స్త్రైణః కృపణధీ ర్మూఢో మమాహ మితి బధ్యతే. 55

అ. యః = ఎవడు; గేహే = గృహమునందు; పుత్ర-విత్త-ఈషణా- ఆతురః = పుత్రులందు, ధనమునందు కోరికచే సంభ్రమించువాడు; స్త్రైణః = స్త్రీ చపలుడు; కృపణధీః = దీనభావము గలవాడు; మూఢః = మూర్ఖుడు, మమ- అహం-ఇతి = నాది, నేను అని; బధ్యతే = బద్ధుడగును.

తా. గృహమునందు- భార్యా పుత్రాదుల యందు ఇచ్ఛతో సంభ్రమము పొందువాడు; స్త్రీచపలుడు, దీన భావము గలవాడు, మూఢుడు, నేను, నాది అని తలంచుచు సంసార బద్ధుంగుడురు.

శ్లో. అహో మే పితరౌ వృద్ధౌ భార్యా బాలాఽఽత్మజాః ప్రజాః
అనాథా మామృతే దీనాః కథం జీవంతి దుః ఖితాః 56

అ. అహో, మే పితరౌ వృద్ధౌ = నా తలిదండ్రులు వృద్ధులు, భార్యా, బాలాత్మజాః; ప్రజాః = చిన్న బిడ్డలును, అనాథాః = అనాథులై; మాం ఋతే కథం జీవంతి = నేను లేక ఎట్లు జీవింతురు; దుఃఖితాః = దుఃఖము పొందినవారు.

తా. నా తల్లిదండ్రులు ముదుసలులు. నా భార్య చిన్నబిడ్డల తల్లి. ఏ దిక్కు లేని వారు దుఃఖితులు. నేను లేకున్న నెట్లు జీవింతురు?

**శ్లో. ఏవం గృహాశయాఽఽక్షిప్త హృదయో మూఢధీ రయం**
**అతృప్త స్తా ననుధ్యాయన్ మృతోఽంధం విశతే తమః. 57**

**అ. ఏవం = ఈ ప్రకారము; గృహ-ఆశయ-ఆక్షిప్త-హృదయః = గృహమందలి వాసనచే ఎల్లెడల నుంచబడిన హృదయము గలవాడై; మూఢధీః-అయం = మూఢబుద్ధియగు ఈ గృహస్థు; అతృప్తః = తృప్తి లేనివాడై; తాన్ అనుధ్యాయన్ = ఆ గృహదారాదులను చింతించుచు; మృతః = చనిపోయి; అంధం-తమః విశతే = తామసికమగు అధమజన్మను పొందుచున్నాడు.**

తా. ఇట్లు గృహాసక్తమైన చిత్తము గలవాడు, మూఢబుద్ధియైన గృహస్థు అసంతృప్తి గలవాడై, ఆ గృహ దారాదులను చింతించుచు, మృతుడై తామసికమైన అధమజన్మను పొందుచున్నాడు.

ఇది శ్రీమద్భాగవతమందు ఏకాదశ స్కంధమందు

పదునేడవ (17) అధ్యాయము

ఓం తత్సత్.

# అష్టాదశాధ్యాయము

## సంగ్రహ శ్లోకము

**శ్లో. అష్టాదశేఒవద ద్ధర్మం వనస్థయతిగోచరం**
**అధికారవిశేషేణ విశేషం చాపి తద్గతమ్.**

ఈ పదునెనిమిదవ అధ్యాయమున వానప్రస్థ సన్న్యాసుల ధర్మము, అధికార తారతమ్యమును బట్టి అందు విశేషమును చెప్పబడెను.

శ్రీ కృష్ణ ఉవాచ = శ్రీ కృష్ణుడు వచించెను.

**శ్లో. వనం వివిక్షుః పుత్రేషు, భార్యాం న్యస్య సహైవ వా**
**వన ఏవ వసే చ్ఛాంతః తృతీయం భాగ మాయుషః.** 1

**అ. వనం వివిక్షుః = వనము ప్రవేశింపగోరినవాడై; భార్యాం, పుత్రేషు, న్యస్య = భార్యను పుత్రులయందు నుంచి; వా = లేక; సహ + ఏవ = ఆమె తోనే కాని; ఆయుషః తృతీయం భాగం = ఆయువున మూడవ భాగము; శాంతః వన ఏవ వసేత్ = శాంతుడై అడవి యందు నివసింపవలెను.**

తా. అడవికి పోఁగోరి తన భార్యను పుత్రుల కొప్పగించి గాని, తనతో బాటు నుంచుకొని గాని వనమున శాంతుడై, తన ఆయువులో మూడవ పాలు 75 సంములవరకు నివసింపవలెను.

ఆయువు నూరు వత్సరములను నాల్గు పాళ్ళుగా చేసి, ఒక్కొక్క ఆశ్రమము నందు (25) ఇరువదియైదు వత్సరముల వంతున లెక్కచేసి కొనవలెను. అందుమీద క్షీణేంద్రియునకు ఇంచుక విరాగము కల్గిన సన్న్యాసమున కధికారము కల్గును.

**శ్లో. కందమూల ఫలై ర్వన్యైః మేధ్యై ర్వృత్తిం ప్రకల్పయేత్**
**వసీత వల్కలం వాసః తృణపర్ణాజినాదినా.** 2

**అ. వన్యైః = వనము నందు లభించు, మేధ్యైః = పవిత్రములైన; కంద మూల ఫలైః = గడ్డలు, వేళ్లు, పండ్లు లోనగువానిచే; వృత్తిం ప్రకల్పయేత్ = జీవనము కల్పించుకొనవలెను, వల్కలం వాసః వసీత = నారచీరను వస్త్రముగా కట్టుకొనవలెను; తృణ-పర్ణ-అజిన-ఆదినా = గడ్డి, ఆకులు, చర్మము మొదలగువానితో వస్త్రము ధరింపవగును.**

తా. వనమున లభించు పావనములగు కందమూల ఫలములతో జీవింపవలెను. నారచీరను గాని, గడ్డి, ఆకులు, చర్మముగాని వస్త్రముగా గ్రహింపవలెను.

శ్లో. కేశరోమ నఖ శ్మశ్రు మలాని బిభృయాద్దతః
న ధావే దప్సు మజ్జేత త్రికాలం స్థండిలేశయః. 3

అ. కేశ-రోమ-నఖ-శ్మశ్రు-మలాని = తలవెండ్రుకలు, శరీర రోమములు, గోళ్ళు, మీస ములు, గడ్డము లోనగు మాలిన్యము; బిభృయాత్ = ధరింపవలెను; దతః న ధావేత్ = పండ్లు తోమవరాదు; త్రికాలం అప్సు మజ్జేత = మూడు వేళలందు నీట మునుగవలెను; స్థండిలేశయః = నేల మీద పరుండవలెను.

తా. తలకురులు, మేని వెండ్రుకలు, గోళ్ళు, మీసములు, గడ్డములోనగు వాని మాలిన్యము దాల్చునది. పండ్లు తోమరాదు. ప్రొద్దున, మధ్యాహ్నము, సాయంత్రము మూడు కాలములందు స్నానము చేయునది. నేలమీద పరుండవలెను.

శ్లో. గ్రీష్మే తప్యేత పంచాగ్నీన్ వర్షా స్వాసార షాడ్జలే
ఆకంఠమగ్న శ్శిశిరే ఏవంవృత్త స్తపశ్చరేత్. 4

అ. గ్రీష్మే = గ్రీష్మర్తువు నందు; పంచాగ్నీన్ తపేత = నాలుగు వంకల నాలు గగ్నులను పైన సూర్యుడు చేరిన అయిదగ్నులు నిమిత్తముగా శరీరమును తపింపజేయునది. వాని నడుమ నుండి తపస్సు చేయవలెనని భావము. వర్షాసు = వర్షర్తువు నందు; ఆసారషాట్ = వర్ష ధారల సంపాతమును సహించువాడై అభ్రవాసమను వ్రతమాచరింపవలెను; శిశిరే = శిశిర ఋతువు నందు; జలే, ఆకంఠమగ్నః = నీట కంఠము దనుక మునిగినవాడై ; ఏవంవృత్తః = ఇట్లు వర్తించుచు; తపః చరేత్ = తపస్సు చేయవలెను.

తా. వేసవియందు నాల్గుప్రక్కల నాలుగు అగ్నులను ప్రజ్వలింపజేసి, నింగిని సూర్యుడు వెలుగుచుండగా ఆపంచాగ్నుల మధ్యన తపస్సు చేయవలెను. వర్షర్తువునందు జల ధారల సంపాతమును సహించుచు, అభ్రవాసమను వ్రత మాచరింపవలెను. శిశిర ఋతువున జలముల కంఠముదాక మునిగి, ఉదక వాసమగు వ్రతము నాచరించుచు తపస్సు చేయవలెను.

శ్లో. అగ్నిపక్వం సమశ్నీయాత్ కాలపక్వ మథాఽ పి వా
ఉలూఖలాశ్మకుట్టో వా దంతోలూఖల ఏవ వా 5

అ. అగ్నిపక్వం సమశ్నీయాత్ = అగ్నిచే పక్వమైన అన్నమును గడ్డలను భుజింపవలెను అథ కాలపక్వంవా = కానిచో కాలముచే పక్వమైన ఫలాదికమును భుజించునది. ఉలూఖల-అశ్మ కుట్టః వా = రోలు, ఱాయి మొ॥ వానిచే నీవా రాదికము దంచుట గలవాడుగా గాని; దంత + ఉలూఖలః = దంతములే రోలుగా గలవాడుగా గాని కావలెను.

అగ్నిచే పచనమైన అన్నము గడ్డలు లోనగు వానిని గాని, కాలముచే పండిన ఫలాదికముగాని భుజింపవలెను. రోలుతో దంచి, ఱాయిచేరాసి గాని పొట్టు లోనగువానిని తొలగించు సాధనము కలిగి, వడ్లను బియ్యము చేసి భుజింపవలెను. లేక దంతములతో కొఱికి పొట్టును పోగొట్టి బియ్యము చేసి భుజింపవలెను.

శ్లో. స్వయం సంచినుయా త్సర్వం ఆత్మనో వృత్తికారణాత్
దేశ కాల బలాభిజ్ఞో నాదదీతా ఽన్య దాహృతమ్. 6

అ. ఆత్మనః వృత్తికారణాత్ = తనకు జీవనాధారము కావున; స్వయం సర్వం చిను యాత్ = కంద మూలాదికమంతయును స్వయముగనే సంపాదించి తీసుక రావలయును; దేశ కాల బల-అభిజ్ఞః = దేశము కాలము, దేహబలము తెలిసినవాడై; ఆహృతం అన్యత్ = ఎవరో తెచ్చిన వేఱొక వస్తువును; న ఆదదీత = గ్రహింపరాదు.

కాలాంతరే హ్యాహృతం తు నాదదీత వనాశ్రమః
లబ్ధే నవే నవే నాద్యేత్ పురాణం తు పరిత్యజేత్ — అని నారదోక్తి.

వానప్రస్థుడు కాలాంతరమున గొని తెచ్చిన వానిని గ్రహింపరాదు. క్రొత్తవగు అన్నాది కము దొరికినంతనే ప్రాతవానిని విడువవలెను.

తా. వానప్రస్థుడు తన జీవనమునకు హేతువగుటంబట్టి కంద మూల ఫలాదికము నంతయును తానే స్వయముగా కొని రావలయును. దేశ కాల దేహ బలములను తెలిసిన వాడ గుటచే కాలాంతరమున తెచ్చినవానిని గైకొనవలదు.

శ్లో. వన్యైశ్చరుపురోడాశాన్ నిర్వపేత్కాలచోదితాన్
నతు శ్రౌతేన పశునా మాం యజేత వనాశ్రమః. 7

అ. వనాశ్రమః = వానప్రస్థుడు; వన్యైః = వనమున లభించు నీవారాదికముచే; చరుపురోడాశాన్ = చరుపురోడాశములను; కాలచోదితాన్ = సంవత్సర కాలమున వచ్చు ఆగ్రహాయణాది ఇష్టులను; నిర్వపేత్ = యజ్ఞము చేయవలెను; శ్రౌతేన పశునా = వేదము విధించు పశువుతో; మాం న యజేత = నన్ను యజింపవలదు.

తా. వానప్రస్థుడు వనమున లభించు నీవారాదికముతో నేర్పరచిన, చరువు హవ్యము పురోడాశము మొదలగు వానిని, సంవత్సర కాలమున వచ్చు ఆగ్రహాయణి లోనగు ఇష్టులను నాకు ప్రీతిగా చేయవలెను. శ్రుతి చోదితమగు పశువుతో ఇష్టులను చేయరాదు.

శ్లో. అగ్నిహోత్రం చ దర్శశ్చ పూర్ణమాసశ్చ పూర్వవత్
చాతుర్మాస్యాని చ మునే రామ్నాతాని చ నైగమైః. 8

అ. అగ్నిహోత్రం, చ దర్శః పూర్ణమాసశ్చ = అగ్నిహోత్రము, దర్శము, పూర్ణ మాసము పూర్వవత్ = పూర్వము వలె; మునేః = వానప్రస్థునకు; నైగమైః = వేదవిదులచే చాతుర్మాస్యాని = ఆగ్రహాయణ్యాదులు; ఆమ్నాతాని = చెప్పబడినవి.

తా. అగ్నిహోత్రము, దర్శపూర్ణ మాసలు (అమావాస్యా పూర్ణిమలందు చేయు ఇష్టి) చాతుర్మాస్య క్రతువు, ఆగ్రహాయణ్యాదులు వానప్రస్థునకు తగినవని వేదవిదులచే చెప్ప బడినవి.

అవ. ఈ నిష్కామునకు ఫలము చెప్పుచున్నారు—

శ్లో. ఏవం చీర్ణేన తపసా మునిర్ధమనిసంతతః
మాం తపోమయ మారాధ్య ఋషి లోకాదు పైతి మామ్. 9

అ. ఏవం=ఈ ప్రకారము; తపసా చీర్ణేన=తపస్సుచే కృశించిన శరీరముతో; మునిః = మునియు, ధమని సంతతః=నరములు వ్యాపించినవాడు; తపోమయం మాం, ఆరాధ్య=తపః

స్వరూపుడనగు నన్ను ఆరాధించి; ఋషిలోకాత్ = ఋషులుండు మహార్లోకాది క్రమమున; మాం ఉపైతి = నన్ను పొందుచున్నాడు.

తా. ఇట్లు తపస్సున కృశించి, మాంస మంతయు శుష్కించి, నరములు మాత్రము బయటపడిన శరీరము గలవాడై, తపస్స్వరూపుడగు నన్నారాధించి, ఋషులు వసించు మహర్లోకాది క్రమమున నన్ను పొందుచున్నాడు. అంతఃకరణశుద్ధియు, భక్తియు కలిగి, ఇందుండియే సంసారబంధము త్రెంచి కాంచును. ప్రతిబంధక బాహుళ్య మున్నచో క్రమముగా ముక్తుడగును.

శ్లో॥ యస్త్వేత త్కృచ్ఛ్రతశ్చీర్ణం తపో నిశ్శ్రేయసం మహత్.
కామా యాల్పీయసే యుంజ్యాత్ బాలిశః కోఽపర స్తతః. 10

అ. యః = ఎవడు, కృచ్ఛ్రతః = అతికష్టముగా; చీర్ణం = కృశించి పొందిన; నిశ్శ్రేయసం = మోక్షప్రదమైన; మహత్-తపః = గొప్ప తపస్సును, అల్పీయసే కామాయ = మిక్కిలి అల్పమగు నింద్రియ సుఖముకొఱకు; యుంజ్యాత్ = కూర్చునేని, తతః = వానికన్న; బాలిశః = మూర్ఖుడు; కోఽపరః = వేఱొకడు ఎవడు ?

తా. ఎవ డిట్లు కష్టపడి కృశించి ఆర్జించినది, బ్రహ్మలోకమును సైతము తక్కువ చేయునది, మోక్షప్రదమైనదియగు గొప్ప తపమును ఇంద్రియవాంఛకు తత్సుఖమునను వినియోగించునో, వానికంటె మూర్ఖు డెవడుండును ?

అవ. ఎవ డిట్లు కామప్రతిబంధము లేక యావజ్జీవము తపము చేయునో వానికి మోక్షము. జీవితపు తృతీయ భాగము చివర వైరాగ్యము దృఢముగ లేకున్నను సన్న్యాసమం దధికారము కలదు. ఆ తృతీయభాగమునకు ముందే తన వానప్రస్థధర్మము నిర్వహింపలేనివా డగుచో అతడు అవిరక్తుడా ? అట్టి విరక్తుని కృత్యము తెలుపుచున్నారు—

శ్లో. యదాసౌ నియమేఽకల్పో జరయా జాతవేపథుః,
ఆత్మ న్యగ్నీన్ సమారోప్య మచ్చిత్తోఽగ్నిం సమావిశేత్. 11

అ. యదా = ఎప్పుడైతే; అసౌ = ఈ వానప్రస్థుడు; నియమే, అకల్పః = ఆశ్రమ నిష్ఠయందు అశక్తుడై ; జాత వేపథుః = ముదిమిచే శరీరకంపము గలవాడగునో అపుడు; ఆత్మని, అగ్నీన్-సమారోప్య = తనయందు అగ్నులను ఆరోపించుకొని; మచ్చిత్తః, అగ్నిం సమావిశేత్ = నాయందు మనస్సు కలిగి, అగ్నిని ప్రవేశింపవలెను.

తా. ఈ వానప్రస్థుడు తన యాశ్రమ నియమము నిర్వహింప నసమర్థుడైనచో ముసలితనముచే మేని వడకు గలవాడగుచో ఆత్మయం దగ్నిని ఆరోపించుకొని, నాయందు చిత్తముంచి, అగ్నిప్రవేశము చేయవలెను.

శ్లో. యదా కర్మవిపాకేషు, లోకేషు నిరయాత్మసు,
విరాగో జాయతే సమ్యగ్, న్యస్తాగ్నిః ప్రవ్రజే త్తతః. 12

అ. యదా = ఎపుడు. కర్మవిపాకేషు = కర్మఫలములైన. నిరయ-ఆత్మసు = దుఃఖరూపములైన నరకప్రాయమైన, లోకేషు = లోకములందు, విరాగః సమ్యగ్ జాయతే = విరక్తి చక్కగా కల్గునో, అప్పుడు. న్యస్తాగ్నిః = అగ్నులను విడచి, తతః = ఆ అగ్నిహోత్రాది కర్మ మండి, ఆ వర్ణాశ్రమము నుండి, ప్రవ్రజేత్ = సన్న్యసింపవలెను.

తా. ఎప్పుడు కర్మఫల ప్రాప్తములై నరక ప్రాయములైన ఇహ పరలోకములందు విరక్తి జనించునో, అపుడు అగ్నుల నుద్వాసన చేసి, ఆ యాశ్రమము నుండి సన్న్యసింప వలెను.

అవ. అందు మొదటి కృత్యమును చెప్పుచున్నారు——

శ్లో. ఇష్ట్వా యథోపదేశం మాం దత్త్వా సర్వస్వ మృత్విజే,
అగ్నీన్ స్వప్రాణ ఆవేశ్య, నిరపేక్షః పరివ్రజేత్. **13**

అ యథా - ఉపదేశం = శాస్త్రమున చెప్పిన రీతిగా శ్రాద్ధాష్టక పూర్వకముగా ప్రాజాపత్యమను ఇష్టిచే, మాం ఇష్ట్వా = నన్ను గూర్చి యజించి, సర్వస్వం = తనకున్న ధనమంతయు, ఋత్విజే దత్త్వా = ఋత్విజున కిచ్చి, అగ్నీన్ = అగ్నులను, స్వప్రాణే = ప్రాణోపాధి గల ఆత్మయందు, ఆవేశ్య = ఆవేశింపజేసి, నిరపేక్షః పరివ్రజేత్ = ఏ అపేక్ష లేనివాడై సన్న్యసింపవలెను.

తా. శాస్త్రము నందు చెప్పబడిన రీతిలో అష్టకా శ్రాద్ధ పూర్వకముగా ప్రాజాపత్య మను ఇష్టిని నాకు ప్రీతిగా కావించి, అగ్నులను ప్రాణోపాధి గల ఆత్మయందు ఆరోపించి, ఏ అపేక్ష లేక సన్న్యసింపవలెను.

అవ. సన్న్యాసము నందు విఘ్నములు కల్గును. వానిని లెక్కింపక సన్న్యాసమే గ్రహింపవలెనను ఆశయమున చెప్పుచున్నారు——

శ్లో. విప్రస్య వై సన్న్యసతో దేవా దారాదిరూపిణః,
విఘ్నం కుర్వం త్యయం హ్యస్మా నాక్రమ్య సమియా త్పరమ్ **14**

అ. సన్న్యసతః విప్రస్య వై = సన్న్యసించిన బ్రాహ్మణునకే, దారాదిరూపిణః = భార్యాది రూపులైన, దేవాః = దేవతలు, అయం = ఈ విప్రుడు, అస్మాన్, ఆక్రమ్య = మనలను దాటి, పరం సమియాత్ = పరబ్రహ్మము పొందునని, విఘ్నం కుర్వంతి = విఘ్నము చేయుచున్నారు.

తా. సన్న్యసింప బోవు విప్రునకు భార్యాపుత్రుల రూపముల నున్న ఇంద్రాది దేవతలు "ఈ విప్రుడు మనస్థానములను దాటి పరబ్రహ్మమును పొందు" నని సన్న్యాసము నకు విఘ్నము కల్గింతురు.

అవ. ఇట్లు ప్రవ్రజితుడైన వాని ధర్మములను చెప్పుచున్నారు——

శ్లో. బిభృయాచ్చేన్ముని ర్వాసః కౌపీనాచ్ఛాదనం పరం,
త్యక్తం న దండపాత్రాభ్యాం అన్యత్కించి దనాపది. **15**

అ. మునిః = సన్న్యాసి, పరం = గోచీకంటె ఇతరమగు, వాసః బిభృయాత్ చేత్ వస్త్రమును ధరింపగోరునేని, అప్పుడు; కౌపీనాచ్ఛాదనం = కౌపీనమునుగప్పునంత వస్త్రమును, బిభృయాత్ = ధరింపవలెను, అనాపది = కష్టకాలము కానిచో, త్యక్తం = ప్రేషోచ్చారణకు పూర్వము విడిచిపెట్టి దండ పాత్రాభ్యాం = దండ కమండలువుల కంటె, అన్యత్ - కించత్ = అన్యమేదియు,న బిభృయాత్ = ధరింపగూడదు.

తా. యతి కౌపీనముకంటె వేఱు వస్త్రము ధరింపగోరుచో, ఆ కౌపీనమును కప్పునంత వస్త్రమును మాత్రము ధరింపవలెను. తనకే యుపద్రవము లేనపుడు దండకమండలువులు తప్ప, ప్రేషోచ్చారణమునకు ('భవాన్ యజతాం' అను వాక్యోచ్చారణకు) పూర్వము విడచిపెట్టిన దేనిని కూడ ధరింపరాదు.

అవ. పరమహంసకు విధి నిషేధములు గోచరింప నందున బహూదకాది ధర్మములను భగవంతుడు చెప్పుచున్నాడు.

శ్లో. దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్,
సత్యపూతాం వదే ద్వాచం మనఃపూతం సమాచరేత్. **16**

అ. దృష్టిపూతం = కంటి చూపుచే నిష్కంటకమైన చోటును చూచి, పాదం న్యసేత్ = అడుగు పెట్టవలెను. వస్త్రపూతం జలం పిబేత్ = వస్త్రమున వడ గట్టిన నీరు త్రాగవలెను. సత్యపూతాం వాచం వదేత్ = సత్యముచే పావనమైన మాటను మాట్లాడవలెను. మనఃపూతం సమాచరేత్ = మనస్సుచే చక్కగా విచారించిన పనిని ఆచరింపవలెను.

తా. ముందు రాలు, ముండ్లు లేవని తెలిసిన మార్గమందు అడుగు మోపవలెను. వస్త్రము వడగట్టి నీటిని త్రాగవలెను. సత్యముచే పావనమగు వాక్కును పలుకవలెను చక్కగా మనస్సుచే విచారించిన పనిని చేయవలెను.

శ్లో. మౌనానీహానిలాయామాః దండా వాగ్దేహచేతసాం,
నహ్యేతే యస్య సంత్యంగ, వేణుభి ర్న భవేద్యతిః. **17**

అ. అంగ = ఓ ఉద్ధవా! వాగ్ దేహ చేతసాం = వాక్కు, శరీరము, చిత్తము, అను వానికి, మౌన-అనీహా అనిలాయామాః = మౌనము, కామ్య కర్మ త్యాగము, ప్రాణాయామము అను, దండాః = నియమములు, నసంతి = లేవో, వేణుభిః = వేణుదండములచే, యతిఃన భవేత్ = యతి కాజాలడు.

తా. వాక్కునకు మౌనము, దేహమునకు కామ్యకర్మత్యాగము, చిత్తమునకు ప్రాణాయామము— అను దండములు మూడును ఎవనికి ఉండవో అతడు సన్న్యాసి కాడు. కేవలము దండకమండలువులచే సన్న్యాసి కాడు.

శ్లో. భిక్షాం చతుర్షు వర్ణేషు విగర్హ్యాన్ వర్జయన్ చరేత్,
సప్తాగారా నసంక్లుప్తాన్ తుష్యే ల్లబ్ధేన యావతా. **18**

అ. చతుర్షు = వృత్తి భేదముచే నాల్గు విధములైన, వర్ణేషు = బ్రాహ్మణుల వర్ణము లందే, ముందు ముందుండు వారు దొరకక పోయినచో, విగర్హ్యాన్ = నిందితులను, పతితులను

సంక్లుప్తాన్ = ఈ లాభము కలుగదని పూర్వ ముద్దేశించిన వారిని, వర్జయన్ = విడిచి పెట్టుచు, సప్తాగారాన్ = ఏడు గృహములను, భిక్షాం చరేత్ = భిక్ష నాచరింపవలెను.

తా. కుసూలధాన్యులు (గరిసెలు నిండుగా ధాన్యము నుంచి జీవించువారు) కుంభీధాన్యులు (బానలకు నిండుగా ధాన్యము పోసికొని జీవించువారు) త్ర్యహికులు (మూడు దినములకు సరిపడు ధాన్య ముంచు కొన్నవారు) అశ్వస్తనులు (రేపటి కించుకయు లేనివారు) అని గృహస్థులు నాలుగు విధములుగా నుందురు. వారిలో నిందితులను పతితులను వర్జించి, వీనియింట లాభముండదని యుద్దేశించిన వారిని విడచి, తక్కిన వారున్న ఏడు గృహములకు భిక్షకు పోవలెను. యతి ఆగృహములందు వచ్చిన దానితో తృప్తిపడవలెను.

శ్లో. బహిర్జలాశయం గత్వా. తత్రోపస్పృశ్య వాగ్యతః,
విభజ్య పావితం శేషం, భుంజీతాశేష మాహృతమ్. 19

అ. బహిః జలాశయం గత్వా=గ్రామమునకు వెలుపలనుండు జలాశయమునకు పోయి, తత్ర ఉపస్పృశ్య = అందు కాలు సేతులు కడిగికొని, వాగ్యతః = మౌనియై, పావితం = ప్రోక్షణాదులచే పవిత్రమైన అన్నమును, విభజ్య = విష్ణు, బ్రహ్మ, సూర్య భూతములకు సమర్పించి, శేషం = మిగిలిన, అశేషం ఆహృతం=తెచ్చిన ఆహారమంతయు, భుంజీత = తినవలెను. దీనివలన అధికముగా కొనివచ్చుట నిరసింప బడినది.

విశే. యాచితం అను పాఠమున మాధుకరమున యాచించి తెచ్చిన అన్నమును భుజించునదని అర్థము కాని అయాచితభైక్షచతుష్టయము కాదు

మాధుకరమున తెచ్చిన యన్నము నివేదించుట భిక్షాన్నము నితరుల కొసగుట, నివేదించిన యన్నమును జలములందు వేయుట, ఈ మూడును భూతతృప్తి కల్గించును. అప్పు డెవ్వడేని యాచించినచో వాని కిచ్చి మిగిలిన దానిని జలములందు వేయవలెను.

శ్లో. మాధూకరే తు నైవేద్యం భైక్షే నాన్యేషు విద్యతే,
నైవేద్యకం క్షిపే దప్సు త్రితయం భౌతికం విదుః.

తా. ఊరి వెలుపల నుండు జలాశయము వద్దకు ఛేరి, కాలుసేతులు కడిగి ఆచమించి, మౌనియై జలప్రోక్షణముచే పావనమైన అన్నమును బ్రహ్మ విష్ణు, సూర్య, భూతములకు సమర్పించి, శేషించిన అన్నమును పూర్తిగా భుజింపవలెను.

శ్లో. ఏకశ్చరే న్మహీ మేతాం నిస్సంగ స్సంయతేంద్రియః,
ఆత్మక్రీడ శ్చాత్మరతః ఆత్మవాన్ సమదర్శనః. 20

అ ఆత్మక్రీడః=ఆత్మయందు వినోదించుచు, ఆత్మరతః= పరమేశ్వరునందు సక్తుడై ఆత్మవాన్ = ధీరుడై, సమదర్శనః = అంతట బ్రహ్మము నొకదానిని సమముగా చూచి, నిస్సంగః=ఇతరుల తోడి సంబంధములేనివాడుగా, సంయత+ఇంద్రియః=ఇంద్రియములను

**వశమందుంచుకొనినవాడై, ఏకః = ఒక్కడే, ఏతాం మహీం చరేత్ = ఈ భూమియందు సంచరింపవలెను.**

తా. యతి ఏ సంగము లేక, ఇంద్రియ సంయమము గావించి, ఆత్మయందు వినోదించుచు ఆత్మరూపుడగు పరమేశ్వరునందు ఆసక్తుడై, ధీరుడై, అంతట బ్రహ్మము నొక్కనినే (ఎల్ల ప్రాణులయందును) సమముగా దర్శించుచు తానొక్కడే భూమి నంతయు సంచరింపవలెను.

**శ్లో. వివిక్తక్షేమశరణః మద్భావవిమలాశయః,**
**ఆత్మానం చింతయే దేకం అభేదేన మయా మునిః. 21**

**అ. వివిక్తక్షేమ శరణః = విజనమై, నిరుపద్రవమైన స్థానము గలవాడును, మద్భావ విమల + ఆశయః = నా యందలి భక్తిచే నిర్మలమైన చిత్తముగలవాడై, మునిః = యతి, అభేదేన మయా = తనకంటె వేఱుగాని నాతో గూడి, ఏకం ఆత్మానం = ఒక్కడే అయిన పరమాత్మను, చింతయేత్ = ధ్యానింపవలెను.**

తా. జనుల సందడి లేక, ఏ పీడయు లేని ప్రదేశమున నుండుచు, నా మీద భక్తిచే నిర్మలమైన చిత్తములో, భేదము లేని, నాతోగూడి, ఒక్కడే అయిన పరమాత్మను ధ్యానింపవలెను.

**శ్లో. అన్వీక్షే తాత్మనో బంధం మోక్షం చ జ్ఞాననిష్ఠయా,**
**బంధ ఇంద్రియవిక్షేపో మోక్ష ఏషాం చ సంయమః. 22**

**అ. జ్ఞాన నిష్ఠయా = జ్ఞాన నిష్ఠతో, ఆత్మనః బంధం = తనకు గల బంధమును, మోక్షం చ = మోక్షమును, అన్వీక్షేత = విమర్శించి చూడవలెను. ఇంద్రియ విక్షేపః = ఇంద్రియముల సంచారము, బంధః = బంధము తేషాం సంయమః = ఆ ఇంద్రియముల నరికట్టుట. మోక్షః = మోక్షము అని తెలియ వలెను.**

తా. జ్ఞాననిష్ఠ ద్వారా తనకు గల్గిన బంధమును, కలుగు మోక్షమును విచారింపవలెను. ఇంద్రియముల స్వేచ్ఛావ్యాపారము బంధమనియు, వాని సంయమనమే మోక్షమనియు నెఱుంగవలెను.

**శ్లో. తస్మా న్నియమ్య షడ్వర్గం మద్భావేన చరే న్మునిః,**
**విరక్త స్సర్వకామేభ్యః లబ్ధ్వాఽఽత్మని సుఖం మహత్. 23**

**అ. తస్మాత్ = అందువలన, షడ్వర్గం = జ్ఞానేంద్రియముల నైదింటిని, మనస్సును, నియమ్య = నిగ్రహించుకొని. సర్వకామేభ్యః విరక్తః = ఎల్ల కామముల నుండి విరక్తుడై, ఆత్మని = తన చిత్తమందు, మహత్సుఖం = గొప్ప సుఖమును. లబ్ధ్వా చరేత్ = పొంది చరింప వలెను.**

తా. అందువలన జ్ఞానేంద్రియము లైదింటిని, మనస్సును నిగ్రహించి, జయించి సర్వ కామములనుండి విరక్తుడై తన చిత్తమందు గొప్ప సుఖమును పొంది చరింపవలెను.

శ్లో. పురగ్రామవ్రజాన్ సార్థాన్ భిక్షార్థం ప్రవిశం శ్చరేత్,
పుణ్యదేశసరిచ్ఛైల వనాశ్రమవతీం మహీమ్. 24

అ. పురగ్రామ వ్రజాన్ = కోటబురుజులు గల పట్టణములు, గ్రామములు, గొల్లపల్లెలు, సార్థాన్ = యాత్రిక జన సమూహము, భిక్షార్థం ప్రవిశన్ చరేత్ = భిక్ష కొఱకు ప్రవేశించుచు చరింపవలెను పుణ్య – దేశ – సరిత్ – శైల– వన – ఆశ్రమవతీం = పుణ్య ప్రదేశములు నదులు, పర్వతములు, అడవులు ఆశ్రమములు గల భూమిని చరింప వలెను.

తా. కోట బురుజులు గల పట్టణములను, గ్రామములను, గొల్లపల్లెలను భిక్ష కొఱకు ప్రవేశించుచు చరింపవలెను. పుణ్య ప్రదేశములు, నదులు, పర్వతములు అరణ్యములు, ఆశ్రమములు గల భూమిని సంచరించుచుండవలెను.

శ్లో. వానప్రస్థాశ్రమపదే ష్వభీక్ష్ణం భైక్ష మాచరేత్,
సంసిధ్య త్యాశ్వ సమ్మోహః, శుద్ధసత్త్వ శ్శిలాంధసా. 25

అ. వానప్రస్థ – ఆశ్రమ పదేషు = వానప్రస్థుల ఆశ్రమనివాసములందు, అభీక్ష్ణం = పలుమార్లు, భైక్షం = భిక్షా చర్యను, ఆచరేత్ = ఆచరింపవలెను. శిల + అంధసా = పరిగ ఏఱికొని తిను అన్నముచే, శుద్ధ సత్త్వః = పరి శుద్ధ చిత్తుడై, అస్తసమ్మోహః = మోహము నశించిన వాడై, సంసిధ్యతి = బంధ విముక్తిని పొందుచున్నాడు.

తా. యతి వానప్రస్థుల ఆశ్రమములందు పలుమార్లు భిక్షాచర్య నవలంబించి శిల వృత్తిచే లభించు అన్నము తిని, పరిశుద్ధచిత్తుడై, మోహము నశించినంతనే బంధవిముక్తిని పొందుచున్నాడు.

అవ. మృష్టాన్నము వీడి, శిలాన్నమున ఎట్లు ప్రవృత్తి కల్గుననగా చెప్పుచున్నారు—

శ్లో. నైత ద్వస్తుతయా పశ్యేత్ దృశ్యమానం వినశ్యతి,
అసక్తచిత్తో విరమే దిహాముత్ర చికీర్షతామ్. 26

అ. ఏతత్ దృశ్యమానం = ఈ కన్పించు మృష్టాన్నము, వస్తుతయా న పశ్యేత్ = సత్య వస్తువుగా చూడవలదు. వినశ్యతి = కన్పట్టునది నశించును. అసక్తచిత్తః = ఆసక్తి లేని చిత్తము గలవాడై, ఇహ, అముత్ర చికీర్షతాం = కొ ఇహ పర సుఖములకై చేయు కర్మను, విరమేత్ = విరమింపవలెను.

తా. ఈ కన్పట్టు మృష్టాన్నమంతయు నశించి పోవునది కాన దీనిని సత్య వస్తువుగా దర్శింపరాదు. దేనియందును ఆసక్తచిత్తుడు గాక, విరక్తుడై ఇహ పరముల సుఖము కలిగించు కర్మను మానవలెను.

అవ. దృశ్యమగు మృష్టాన్నము వినాశ మగు పర్యంతము సుఖహేతు వగుట వలన అన్నచింత గల వానికి విరాగ మెట్లు కల్గుననగా చెప్పుచున్నారు.

శ్లో. యదేత దాత్మని జగత్ మనోవాక్ప్రాణ సంహతం,
సర్వం మాయేతి తర్కేణ స్వస్థః త్యక్త్వా న తత్స్మరేత్. 27

అ. యత్-ఏతత్- జగత్- మమకారమున కాస్పదమైన ఈ జగత్తు, మనస్-వాక్-ప్రాణ సంహితం = మనస్సు, వాక్కు, ప్రాణము, ఇంద్రియములతో గూడిన ఈ శరీరము, సర్వం = తజ్జన్యమగు సుఖము కూడా, మాయా-ఇతి = మాయ మాత్రమని, తర్కేణ = స్వప్నాది దృష్టాంతముచే, ఆత్మని = ఆత్మయందు నిశ్చయించి, త్యక్త్వా = వానియందాసక్తి వీడి, స్వస్థః = ఆత్మనిష్ఠ గలవాడై, న స్మరేత్ = తిరిగి వానిని స్మరింపరాదు.

తా. మమకారమున కాస్పదమైన ఈ జగత్తు సంసారము, మనస్సు, వాక్కు, ఇంద్రియములతో గూడిన ఈ శరీరము దాని వలన కలుగు సుఖము — అన్నియు కూడ, ఆత్మయందు మాయచే భాసిల్లుచున్నదని యూహించి వానియందు ఆసక్తుడు గాక, ఆత్మనిష్ఠ గలవాడై మరల వానిని స్మరింపరాదు.

అవ. ఈ ప్రకారము బహూదకాది యతిధర్మములను చెప్పి, పరమహంసాదుల ధర్మమును చెప్పుచున్నారు.

**శ్లో. జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తో వాఽనపేక్షకః,**
**సలింగా నాశ్రమాం స్త్యక్త్వా చరే దవిధిగోచరః. 28**

అ. విరక్తః = బాహ్యేంద్రియముల సౌఖ్యములనుండి విరక్తుడై ముముక్షువగుచు, జ్ఞాననిష్ఠః = జ్ఞాన నిష్ఠ గలవాడై, అనపేక్షకః = మోక్షమందు అపేక్ష లేనివాడై, మద్భక్తః వా = నా భక్తుడైన వాడు, సలింగాన్, ఆశ్రమాన్, త్యక్త్వా త్రిదండాదులతో గూడిన సన్న్యాసాశ్రమములను విడచి, అవిధి గోచరః = విధికి కింకరుడు గాక, చరేత్ = చరింపవలెను. వానియందాసక్తిని వీడి యథోచితమైన ధర్మమున వర్తించువదని యర్థము. మఱి అత్యంత త్యాగమే చెప్పబడక, మరల ధర్మము విధించుట వలన అత్రియుని ధర్మమును ఉత్తరాధ్యాయమందు చెప్పబోవుచున్నారు. పూర్వము చెప్పినదానికి దీనికిని విశేష మేమనగా విధికింకరుడు కారాదు. దీనినే స్పష్ట పఱుప గలరు.

తా. బహిర్వ్యాపారములనుండి విరక్తుడై, ముముక్షువై, జ్ఞాననిష్ఠ గలవాడై, మోక్షమందపేక్ష లేనివాడై, త్రిదండాది సన్న్యాస ధర్మను లందు ఆసక్తి లేక విధి కింకరుడు గాక నా నా భక్తుడు ప్రవర్తింప వలెను.

అవ. ఎట్లు చరింప వలె ననగా చెప్పుచున్నారు—

**శ్లో. బుధో బాలకవ త్క్రీడేత్ కుశలో జడవ చ్చరేత్,**
**వదేదున్మత్తవ ద్విద్వాన్ గోచర్యాం నైగమః చరేత్. 29**

అ. బుధః = వివేకము గలవాడైనను, బాలకవత్ క్రీడేత్ = మానావమానముల వివేకము లేని బాలుడు వలె క్రీడించునది. కుశలః జడవత్ — చరేత్ = నిపుణుడైనను మందుని వలె ఫలానుసంధానము లేనివాడై చరించునది. విద్వాన్ ఉన్మత్తవత్ వదేత్ = పండితుడైనను పిచ్చివాని వలె లోక రంజన భావముచే వదింపవలెను: నైగమః గోచర్యాం చరేత్ = వేదార్థనిష్ఠ గల వాడైనను అనియతాచారుడై చరింపవలెను.

తా. వివేక వంతుడైనను మానావమానముల వివేకము లేని బాలుని వలె క్రీడింప వలెను. నిపుణుడైనను ఫలానుసంధానము లేని జడుని వలె చరింప వలెను. పండితుడైనను పిచ్చివానివలె, లోకరంజనా భావమున వచింప వలెను. వేదార్థ నిష్ఠుడైనను అనియతాచారుడై వర్తింప వలెను.

శ్లో. వేదవాదరతో నస్యాత్ న పాషండీ న హైతుకః
శుష్కవాదవివాదేన న కించి త్పక్ష మాశ్రయేత్. **30**

అ. వేద వాదరతః న స్యాత్ = కర్మకాండాది వ్యాఖ్యాన నిష్ఠుడు కారాదు. న పాషండీ = శ్రుతి స్మృతి విరుద్ధానుష్ఠాత కారాదు: న హైతుకః = తర్క నిష్ఠుడు కారాదు. శుష్క వాద వివాదే చ = నిష్ప్రయోజనమగు గోష్ఠిలో, కించిత్ పక్షం న ఆశ్రయేత్ = ఏ పక్షమును ఆశ్రయింపరాదు.

తా. కర్మకాండను వ్యాఖ్యానించుటలో ఆసక్తుడు కారాదు. శృతి స్మృతి విరుద్ధ మగు మార్గ మవలంబించువాడు కారాదు. కేవలము తర్కనిష్ఠుడు కారాదు. నిష్ప్రయోజనమగు వాద ప్రతివాదములందు ఏ పక్షమును ఆశ్రయింపరాదు.

శ్లో. నోద్విజేత జనాద్ధీరః జనం చోద్వేజయే న్నతు,
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన. **31**

అ. ధీరః = ధీరుడు, జనాత్ = జన సంఘము నుండి, న ఉద్విజేత్ = ఉద్వేగముపొందరాదు. జనంచ, నతు, ఉద్వేజయేత్ = అట్లే జన సముదాయమును కలత పెట్టదగదు. అతివాదాన్ = దురుక్తులను. తితిక్షేత = సహింపవలెను. కంచన, న, అవమన్యేత = ఎవరిని అవమానింపరాదు.

తా. ధీరుడై ఏ జనమువలనను కలత చెందరాదు. మఱియు కానే జనమును క్షోభ పఱుచరాదు అన్యుల దూషణ వాక్యములను సహింపవలెను. ఎవరిని అవమానింపరాదు.

అవ. ఆత్మదృష్టిచే వైర కారణము లేదని చెప్పబడినది దేహదృష్టిచేతను వైరము లేదని చెప్పుచున్నారు.

శ్లో దేహ ముద్దిశ్య పశువ ద్వైరం కుర్యా న్న కేనచిత్
ఏక ఏవ పరోహ్యాత్మా భూతేష్వా త్మ న్యవస్థితః
యథేందు రుదపాత్రస్థో భూతాన్యేకాత్మకాని చ. **32**

అ. దేహం ఉద్దిశ్య = దేహమును ప్రధానముగా ఎంచి, పశువత్ = పశువువలె కేనచిత్, వైరం, న కుర్యాత్ = ఎవనితోను, పగ బూనరాదు. ఏకః ఏవ = పరః, హి ఆత్మా = ఒక్కడే యగు పరమేశ్వరుడు. ఆత్మ. భూతేషు = ఎల్ల భూతములందు, ఆత్మని = తన యందు, అవస్థితః = ఉన్నాడు. యథా = ఇందుః ఉదపాత్రస్థః = ఎట్లు చంద్రుడు ఉదక పాత్రయందు ప్రతి బింబించుచున్నాడో, అట్లే భూతాని, ఏకాత్మ కానిచ = భూతములన్ని ఒకే ఆత్మ గలవి.

తా. ఒక్కడే పరమేశ్వరుడు, పరమాత్మరూపమున, సర్వభూతముల హృదయమందును ఉన్నాడు. ఏ విధముగా చంద్రుడు ఉదకపాత్రయందు ప్రతిబింబించుచున్నాడో ఆ విధముగనే సర్వభూతములు ఒక్క ఆత్మ గలవి. కనుక దేహమును కారణముగా గొని పరులపై ఎవరితోనూ వైరము పెట్టుకొనరాదు.

శ్లో॥ అలబ్ధ్వా న విషీదేత, కాలే కాలేఽశనం క్వచిత్,
లబ్ధ్వా న హృష్యేద్ధృతిమాన్ ఉభయం దైవతంత్రితమ్. **33**

అ. కాలే కాలే = భోజన సమయమున, అశనం అలబ్ధ్వా = ఆహారమును పొందనిచో, న విషీదేత = దుఃఖింపరాదు. ధృతిమాన్ = జితేంద్రియుడగుచు, లబ్ధ్వా న హృష్యేత్ = ఆహారమును పొంది హర్షింపవలదు. ఉభయం = రెండును. దైవతంత్రితం = లభించుట, లభింపమి. అనునవి దైవాధీనము లగును,

తా. ఒకప్పుడు భోజన సమయమున అన్నము లభింపలేదని దుఃఖింపరాదు. లభించినచో లభించిన దని సంతోష పడరాదు. రెండును లభించుట లభింపమి అనునవి దైవాధీనములని తలంపదగును.

అవ. మఱి ఇప్పుడు భిక్షాప్రయత్నము చాలునని. విరమింప వలెనని చెప్పుచున్నారు.

శ్లో॥ ఆహారార్థం సమీహేత యుక్తం తత్ప్రాణధారణం,
తత్త్వం విమృశ్యతే తేన తద్విజ్ఞాయ విముచ్యతే. **34**

అ. ఆహారార్థం = ఆహార మాత్రమునకు, సమీహేత = కోరవలయును. ఏలయన ; తత్ ప్రాణధారణం -- యుక్తం = అది తన ప్రాణధారణకు తగియున్నది, తేన తత్త్వం విమృశ్యతే = ఆ ప్రాణధారణచే తత్త్వము విమర్శింపబడును, తత్-విజ్ఞాయ విముచ్యతే = తత్త్వ మెఱింగి బంధ విముక్తు డగును.

తా. ప్రాణధారణకు మాత్రము వలయునంత ఆహారము కోరదగును. ప్రాణధారణచేత గదా ఆత్మతత్త్వము విమర్శింపబడుచున్నది. ఆ విమర్శచేత ఆత్మనెఱింగి బంధ విముక్తుడగును.

అవ. అట్లయిన మృష్టాన్నము – అగ్రాహ్యమా! ఎవనిచే ఇట్లు చెప్పబడినది. అను దానికి చెప్పుచున్నారు.

శ్లో॥ యదృచ్ఛయోపపన్నాన్నం అద్యాచ్ఛ్రేష్ఠ ముతాపరం,
తథా వాస స్తథా శయ్యాం ప్రాప్తం ప్రాప్తం భజే న్మునిః. **35**

అ. యదృచ్ఛయా = స్వప్రయత్నము లేక; ఉపపన్నం = లభించిన ; అన్నం = అన్నము; శ్రేష్ఠం = మేలైనది; ఉత అపరం = లేక తక్కువైనది - అయినను; అద్యాత్ = తినవలెను, తథా = ఆ ప్రకారము; వాసః = నివాసము, వస్త్రము; తథా = అట్లే; శయ్యా = పడక కూడ; ప్రాప్తం, ప్రాప్తం = లభించిన దానిని అంతను; భజేత్ = అనుభవింపవలెను.

తా. తన ప్రయత్నము లేకయే తనకు లభించినది మృష్టాన్నమైనను, సామాన్యమైనను దానిని భుజింపవలెను. అట్లే నివాసము, వస్త్రము, పడక లభించినవి కీడుగాని, మేలు గాని దానిని గ్రహింపవలెను.

**శ్లో. శౌచ మాచమనం స్నానం న తు చోదన మాచరేత్**
**అన్యాంశ్చ నియమాన్ జ్ఞానీ, యథాహం లీల యేశ్వరః 36**

**అ. జ్ఞానీ**=జ్ఞాని, శౌచం. ఆచమనం, స్నానం, చోదనం, న ఆచరేత్=శౌచ, ఆచమన, స్నానములను శ్రుతిచోదితముగ ఆచరింపరాదు. అన్యాన్ నియమాన్ = ఇతర నియమములను; యథా-అహం, ఈశ్వరః లీలయా = ఏ ప్రకారము నేను, ఈశ్వరుడుగా లీలామాత్రమున చరింతునో అట్లు.

తా. పాణి పాద ప్రక్షాళనాదికము శౌచము, ఆచమనము, స్నానము, ఇతరములగు నియమములను, యతి వేదచోదితముగా ఆచరింపరాదు. జ్ఞానియైనవాడు ఈశ్వరుడగు నావలెనే కేవలము లీలగా ఆచరింపవలెను.

అవ. ఎందువలన అతనికి విధి కింకరత్వము లేదనగా చెప్పుచున్నారు.

**శ్లో. న హి తస్య వికల్పాఖ్యా యా చ మద్వీక్షయా హతా.**
**ఆదేహాంతా త్క్వచి త్ఖ్యాతిః, తతస్సంపద్యతే మయా. 37**

అ. తస్య = ఆ యతికి; వికల్ప-ఆఖ్యా-న = వికల్పరూపమగు భేదప్రతీతి లేదు; యాచ మద్వీక్షయా హతా =ఏఆఖ్య నా వీక్ష (జ్ఞానము)చే కొట్టువడెనో. అట్లు కొట్టువడలేదు, మరల కన్పట్టుచున్నది. అందువలన చెప్పుచున్నారు; ఆదేహ-అంతాత్ = దేహనాశ పర్యంతము; క్వచిత్ ఖ్యాతిః = ఒకప్పుడు అభేద ప్రతీతి భాసితముగనే యుండును; తతః = దేహపాతానంతరము మయా సంపద్యతే=మత్తుల్యసంపత్తిని పొ దును.

తా. ఆ యతికి భేదప్రతీతి కలుగదు ఏలయన, అది నాచే వీక్షణారూప జ్ఞానముచే కొట్టువడిన దగును. దేహనాశ పర్యంతము యతికి, నాచే అభేద ప్రతీతి ఒక్కొక్కపుడు కల్గుచునే యుండును. అనంతర మతడు మత్తుల్య సంపత్తిని పొందును.

అవ. ఈ ప్రకారము విరక్తుడై, అపరోక్షజ్ఞానము గలవానికి, సన్న్యాసము, దాని ధర్మములు చెప్పి కేవలము వైరాగ్యమునకు, ఆత్మజ్ఞానము నెఱుంగగోరువానినిగూర్చి చెప్పుచున్నారు.

**శ్లో. దుఃఖోదర్కేషు కామేషు జాత నిర్వేద ఆత్మవాన్,**
**అజిజ్ఞాసితమద్ధర్మో ముని ర్గురు ముపవ్రజేత్. 38**

అ. దుఃఖ-ఉదర్కేషు-కామేషు=ఉత్తరకాలమున దుఃఖము కల్గించు, ఇంద్రియ సుఖములందు; జాత నిర్వేదః = విరక్తి కలవాడు; ఆత్మవాన్ = చిత్తస్థైర్యము గలవాడు; అజిజ్ఞాసిత మద్-ధర్మః = నా ప్రాప్తి సాధనమైన భక్తియోగము నెఱుగనివాడు ; మునిః=యతిః గురుం వ్రజేత్ = గురువును సమీపింపవలెను.

తా. అనుభవమునకు తరువాత మోక్షము కల్గించు సంసార కామ భోగములందు విరక్తుడై, చిత్తస్థైర్యము గలవాడై నన్ను ప్రాపింపజేయు భక్తియోగము నెఱుంగని యతి, గురుని సేవింపవలెను.

శ్లో. తావత్పరిచరే త్ప్రాజ్ఞం శ్రద్ధావా ననసూయకః,
యావద్బ్రహ్మ విజానీయాత్ మామేవ గురు మాదృతః, 39

అ. ప్రాజ్ఞః = బుద్ధిమంతుడు, శ్రద్ధావాన్. = శ్రద్ధగలవాడు, అనసూయకః = అసూయ లేనివాడై, తావత్ = అంత పర్యంతము, గురుం మాం, ఏవ ఆదృతః = గురువును నన్నుగా ఆదరించుచు, పరిచరేత్ = శుశ్రూష చేయవలెను. యావత్ బ్రహ్మ విజానీయాత్ = ఎంతలో బ్రహ్మ నెఱుంగునో.

తా. బుద్ధిమంతుడైనవాడు తాను బ్రహ్మము నెఱుంగు పర్యంతము, గురువును నన్నుగా భావించి, ఆదరించి, శ్రద్ధగలవాడు, అసూయలేనివాడై శుశ్రూష చేయవలెను. అందు మీదట ఒక్కడే చరింపనది-అను ధర్మము నందు వర్తింపనది.

శ్లో. యస్త్వసంయత షడ్వర్గః ప్రచండేంద్రియసారథిః
జ్ఞానవైరాగ్యరహితః త్రిదండ ముపజీవతి 40

అ. యః తు, అసంయత షడ్ వర్గః = ఎవడైతే నియమించుకొనని, అయిదు యింద్రియములు మనస్సు కలవాడో, ప్రచండ – ఇంద్రియ సారథిః = మిక్కిలి ఆసక్తములైన ఇంద్రియములకు సారథియైన బుద్ధి కలవాడో, జ్ఞాన వైరాగ్యరహితః జ్ఞాన వైరాగ్యములు లేనివాడో త్రిదండం ఉపజీవతి = అతడు త్రిదండ సన్న్యాసము గ్రహించి జీవించును.

తా. ఎవ్వడు ఇంద్రియమనస్సులను, షడ్వర్గమును లోగొనడో, అత్యంతాసక్తములైన ఇంద్రియములకు సారథియైన బుద్ధిగలవాడో, జ్ఞాన వైరాగ్యములు లేనివాడో, అతఁడు త్రిదండ సన్న్యాసమును దంభార్థము గ్రహించి జీవించును.

శ్లో. సురా నాత్మాన మాత్మస్థం నిహ్నుతే మాం చ ధర్మహా,
అవిపక్వకషాయో ఽస్మా దముష్మాచ్చ విహీయతే. 41

అ. సురాన్ = యజింపదగు దేవతలను, ఆత్మానం = తనను, ఆత్మస్థం, మాం = తనలో నున్న నన్ను, ధర్మహా = ధర్మహంతయై, నిహ్నుతే = మోసగించునో, అవిపక్వ కషాయః = ఇంద్రియ మనోవాసనలు పక్వము కానివాడు, అస్మాత్ = ఇహలోకమునుండి, అముష్మాత్–చ = స్వర్గలోకమునుండియు, విహీయతే = భ్రష్టుడగుచున్నాడు.

తా. ఎవడు యజింప దగు ఇంద్రాది దేవతలను, తనను, ఆత్మయందున్న నన్ను ధర్మనాశకుడై మోసగించునో, అట్టి పరిపక్వము కాని ఇంద్రియ మనోవాసనలు గలవాడు ఇహలోకము నుండి, పరలోకమునుండియు భ్రష్టుడగుచున్నాడు.

అవ. నాలుగాశ్రమములవారికి ప్రధాన ధర్మములు చెప్పుచున్నారు.

శ్లో. భిక్షో ర్ధర్మః శమోఽహింసా, తప ఈక్షా వనౌకసః,
గృహిణో భూతరక్షేజ్యా ద్విజ స్యాచార్యసేవనమ్. 42

అ. భిక్షోః ధర్మః = భిక్షువునకు ధర్మము, శమః అహింసా = శాంతి, అహింసయు, వనౌకసః = వానప్రస్థునకు; తపః ఈక్షా, = తపము పరమాత్మ దర్శనము, గృహిణః = గృహస్థునకు, భూతరక్షా, ఇజ్యా = యాగము), ద్విజస్య = బ్రహ్మచారికి, ఆచార సేవనం = గురుసేవ.

తా. శాంతి అహింస, సన్న్యాసిధర్మములు. వానప్రస్థునకు తపస్సు, పరమాత్మ దర్శనము ధర్మము లగును. గృహస్థునకు భూతరక్షణము యజ్ఞము ధర్మము లగును. బ్రహ్మచారికి గురుసేవ ధర్మమగును.

శ్లో. బ్రహ్మచర్యం తపశ్శౌచం సంతోషో భూతసౌహృదం,
గృహస్థ స్యాప్యృతౌ గంతుః సర్వేషాం మదుపాసనమ్ 43

అ. ఋతౌ గంతుః = ఋతువునందు భార్యాసంగమము చేయు, గృహస్థస్య = గృహస్థునకు, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యము సంభవించును తతః = తరువాత, శౌచం = రాగాది రాహిత్యము, సంతోషః = సంతోషము; భూత సౌహృదం = ప్రాణుల యందు మైత్రి, నన్ను సేవించుట, మత్ ఉపాసనం = సర్వేషాం = ఎల్లరకు సమానములు.

తా. ఋతుకాలమున భార్యాసంగమము చేయు గృహస్థునకు బ్రహ్మచర్య వ్రతఫలము లభించును. శౌచము, సంతోషము, ప్రాణులందు మైత్రీభావము, నన్ను భజించుట యనునవి ఎల్లరకు సమానములు.

అవ. ఇట్టి వర్ణాశ్రమ ధర్మముల ఫలమును చెప్పుచున్నారు.

శ్లో. ఇతి మాం యః స్వధర్మేణ భజన్నిత్య మనన్యభాక్,
సర్వభూతేషు మద్భావో మద్భక్తిం విందతేఽచిరాత్. 44

అ. ఇతి = ఈ విధముగా, మాం = నన్ను, యః = ఎవడు, స్వధర్మేణ = తన ఆశ్రమోచితధర్మముచే, భజన్ = భజించుచు, నిత్యం = ఎల్లప్పుడు, అనన్యభాక్ = ఇతరము పై మనస్సు లేనివాడై, సర్వభూతేషు, మద్భావః = ఎల్ల భూతములందు నా స్వరూపమును చూచుచు, అచిరాత్ మద్భక్తిం విందతే = త్వరలో నాభక్తిని పొందుచున్నాడు;

తా. ఇట్లు నన్ను స్వవర్ణాశ్రమోచిత ధర్మము కలిగి, అనన్యచింతకుడై భజించుచున్న వాడు సర్వభూతములందు నా స్వరూపము గాంచువాడై నా భక్తిని త్వరలోనే పొందుచున్నాడు.

అవ. దాని వలన నేమగునో చెప్పుచున్నారు.

శ్లో. భక్త్యోద్ధవానపాయిన్యా సర్వలోకమహేశ్వరమ్,
సర్వోత్పత్త్యప్యయం బ్రహ్మ కారణం మోపయాతి సః. 45

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవా, అనపాయిన్యా - భక్త్యా = ఎడ తెగని భక్తితో, సర్వలోకమహేశ్వరం సర్వ + ఉత్పత్తి- అప్యయం = ఎల్లప్రాణుల ఉత్పత్తి లయములు చేయువాడును, కారణం = జగత్కారణమయిన, బ్రహ్మ మాం = బ్రహ్మమగు నన్ను; ఉపయాతి = పొందుచున్నాడు.

రా. ఓ ఉద్ధవా! ఎడతెగనిభక్తితో, ఎల్లలోకములు పాలించువారి ప్రభువును, ఎల్ల ప్రాణుల ఉత్పత్తిలయములు చేయువాడును, సర్వ జగత్కారణమును బ్రహ్మస్వరూపుడును అగు నన్ను పొందుచున్నాడు.

అవ. అందువలన అతడు ముక్తుడే అనుచున్నారు.

శ్లో. ఇతి స్వధర్మనిర్ణిక్తసత్త్వో నిర్జ్ఞాత మద్గతిః,
జ్ఞానవిజ్ఞానసంపన్నః విరక్తః సముపైతి మామ్ **46**

అ. ఇతి = ఈ ప్రకారము, స్వధర్మ నిర్ణిక్త సత్త్వః = స్వధర్మముచే పరిశుద్ధమగు బుద్ధి గలవాడు, విజ్ఞాత మద్గతిః = నా ఈశ్వర స్వరూపము, తెలిసిన వాడును, జ్ఞాన విజ్ఞాన సంపన్నః = పరోక్ష అపరోక్షజ్ఞానములతో గూడిన వాడును, విరక్తః మాం సముపైతి = విముక్తుడై నన్ను పొందుచున్నాడు.

రా. ఈ ప్రకారము స్వధర్మముచే పరిశుద్ధమైన బుద్ధిగలవాడును, నా ఈశ్వరస్వరూప మెఱింగినవాడును, పరోక్షాపరోక్ష జ్ఞానములతో గూడినవాడును, విరక్తుడునై నన్ను పొందు చున్నాడు.

అవ. ఉక్త ధర్మమును సంక్షేపించి చెప్పుచున్నారు.

శ్లో. వర్ణాశ్రమవతాం ధర్మ ఏష ఆచారలక్షణః,
స ఏవ మద్భక్తియుతః, నిశ్శ్రేయసకరః పరః. **47**

అ. వర్ణ – ఆశ్రమవతాం = వర్ణము, ఆశ్రమము గలవారికి, ఆచార లక్షణః = అనుష్ఠానరూపమైన, ఏష ధర్మః = ఈ ధర్మము, పితృలోక ప్రాప్తి ఫలము కలది, స. ఏవ, మద్భక్తియుతః = ఆ ధర్మమే నా యందలి భక్తితో సమర్పించిన దగునేని, పరః నిశ్శ్రేయసకరః = శ్రేష్ఠమగు మోక్షము కల్గించున దగును.

రా. వర్ణాశ్రమములు గలవారికి చెందినదై పితృలోక ప్రాప్తిగలదైన ఈ ధర్మము నా యందు సమర్పించబడిన దగునేని ఉత్తమ మైన మోక్షము నిచ్చును.

శ్లో. ఏతత్తేఽభిహితం సాధో భవాన్ పృచ్ఛతి యం చ మాం,
యథా స్వధర్మసంయుక్తో భక్తో మాం సమియా త్పరమ్ **48**

అ. సాధో! భవాన్ —ఓ సజ్జనుడా, నీవు, మాం — నన్ను, యం పృచ్ఛతి = ఏ ధర్మము ప్రశ్నించితివో, ఏతత్ – తే అభిహితం ఇది నీకు చెప్పబడినది, యథా = ఏ విధముగా, స్వధర్మ సంయుక్తః భక్తః = తనధర్మముతో కూడిన భక్తుడు పరం మాం సమియాత్ = పర బ్రహ్మమగు నన్ను పొందును.

రా. ఓ సాధూ! నీవు ఏ ధర్మము గూర్చి నన్ను ప్రశ్నించితివో, ఆ యీ ధర్మము నీకు చెప్పిన వాడను. ఆప్రకారము స్వధర్మములో గూడిన భక్తుడు పరబ్రహ్మమగు నన్ను పొందు చున్నాడు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే అష్టాదశోఽధ్యాయః

ఇది శ్రీ మద్భాగవతమున ఏకాదశ స్కంధమున
(18) పదునెనిమిదవ అధ్యాయము.

# ఏకోనవింశోఽధ్యాయః

## సంగ్రహశ్లోకము

**జ్ఞానాదే ర్నిర్ణయః పూర్వం కృతో హ్యాశ్రమధర్మతః,**
**ఏకోనవింశతితమే జ్ఞానాదే స్త్యాగ ఉచ్యతే.**
**జ్ఞానినో వర్ణ్యతే కర్మాభావ ఏకోనవింశకే,**
**యుక్తితర్కస్వరూపాభ్యాం నష్టజ్ఞానస్య సర్వదా.**

కడచిన అధ్యాయమందు పూర్వము ఆశ్రమధర్మమును బట్టి జ్ఞానాదుల నిర్ణయము చేయబడినది. ఈ పందొమ్మిదవ అధ్యాయమందు ఆ జ్ఞానాదుల త్యాగము చెప్పబడుచున్నది.

ఈ పందొమ్మిదవ అధ్యాయమందు యుక్తి తర్కముల స్వరూపములచే నష్టమైన జ్ఞానము గల జ్ఞానికి కర్మాభావము వర్ణింపబడును. చెప్పబడును.

అవ. ఈ ప్రకారము తర్కము వలన బాధితమైనను, దేహాది ప్రపంచము ఎంత వఱకు అపరోక్ష జ్ఞానానుభవముచే దిగ్భ్రాంతి మున్నగునది వలె లీనము కాదో, అంతవఱకు జ్ఞానాభ్యాసము చేయవలెను. దానివలన మోక్షము కల్గునని 'ఆదేహాంతా త్క్వచి త్ఖ్యాతిః తతః సంపద్యతే మయా' అనుదానిచే చెప్పబడినది.

ఎవనికి అపరోక్షానుభవము వలన ప్రపంచము లీనప్రాయ మగునో, వానికి చేయ వలసిన కృత్యము లేదనుచున్నారు.

**శ్లో. యో విద్యాశ్రుతి సంపన్నః ఆత్మవా న్నానుమానికః,**
**మాయామాత్ర మిదం జ్ఞాత్వా, జ్ఞానం చ మయి సన్న్యసేత్.** 1

**అ. యః = ఎవడు, విద్యాశ్రుత సంపన్నః = అనుభవ పర్యంతము విద్యాశ్రవణ ముతో గూడినవాడో, ఆత్మవాన్ = ఆత్మతత్త్వప్రాప్తిగలవాడో, న - అనుమానికః = కేవ లము పరోక్షజ్ఞానము లేనివాడో; ఇదం = ఈ ద్వైతము; మాయామాత్రం = మాయగా తోచుచున్నదని; జ్ఞాత్వా = తెలిసికొని; జ్ఞానం = తన్నివృత్తి సాధనమగు జ్ఞానమును; మయి సన్న్యసేత్ = నా యందు ఉంచవలెను.**

తా. ఎవడు అనుభవ పర్యంతము బ్రహ్మవిద్యాశ్రవణముతో గూడినవాడో, ఆత్మతత్త్వ ప్రాప్తి గలవాడో, కేవలము పరోక్షజ్ఞానము లేనివాడో, లేక శ్రుత్యనుకూలమగు తర్కముచే నిర్ణయము గలవాడో. అతడు "ఈ ద్వైతప్రపంచమును నివృత్తి కావించు సాధనము జ్ఞానను నాయందు మాయచే తోచుచున్నదని, ఎఱింగి తత్సాధనమును(జ్ఞానమును) నాయం దుంచ వలెను. ఇదియే విద్వత్సన్న్యాస మగును.

అవ. అంతు హేతువును చెప్పుచున్నారు.

శ్లో. జ్ఞానిన స్త్వహ మేవేష్టః స్వార్థో హేతుశ్చ సమ్మతః,
స్వర్గ శ్చైవాపవర్గశ్చ నాన్యోఽర్థో మదృతే ప్రియః. 2

అ. జ్ఞానినః=జ్ఞానికి; అహం ఏవ—ఇష్టః = నేనే ఇష్టమయినవాడను; స్వార్థః = ఫలము; హేతుః = ఆ ఫలసాధనముగను; సమ్మతః— చ = తలంపబడినవాడను; స్వర్గః చ ఏవ అపవర్గః చ = స్వర్గమోక్షములును నేను, అన్యః అర్థః = ఇతరమైన వస్తువు; మత్-ఋతే న=నేను తప్ప నింక లేదు.

తా. జ్ఞానికి నే నిష్టుడను. ప్రాప్యఫలము, దానికి సాధనమగు జ్ఞానము అభ్యుదయ మగు స్వర్గమును, సంసార నివృత్తియగు మోక్షమును నేనే. నేను తప్ప అన్యమగు వస్తువు గాని, ప్రయోజనము గాని లేదు.

అవ. ఇందు విద్వదనుభవమును ప్రమాణీకరించుచున్నారు.

శ్లో. జ్ఞాన విజ్ఞాన సంపన్నాః పదం శ్రేష్ఠం విదు ర్మమ,
జ్ఞానీహ మే ప్రియతమో జ్ఞానేనాసౌ బిభర్తి మామ్. 3

అ. జ్ఞానవిజ్ఞాన సంపన్నాః = జ్ఞానము, విజ్ఞానముతో కూడినవారు; మమ పదం శ్రేష్ఠం విదుః = నా స్థానమును శ్రేష్ఠముగా నెఱుంగుదురు; జ్ఞానీ ఇహ మే ప్రియతమః = వీరిలో జ్ఞాని నాకత్యంత ప్రీతిపాత్రుడు; అసౌ = ఇతడు; జ్ఞానేన = జ్ఞానముతో; మాం బిభర్తి = నన్ను ధరించుచున్నాడు.

తా. పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము (అనుభవము) గలవారు, నా పదము నుత్తమముగా నెఱుంగుదురు. జ్ఞాని. నాకు అత్యంతప్రియుడు. ఇతడు నన్ను జ్ఞానముచే ధరించుచున్నాడు.

అవ. అతని జ్ఞానమును స్తుతించుచున్నారు.

శ్లో. తప స్తీర్థం జపో దానం, పవిత్రా ణీతరాణి చ,
నాలంకుర్వంతి తాం శుద్ధిం, యా జ్ఞానకలయా కృతా. 4

అ. తపః=తపస్సు; తీర్థం = పుణ్య తీర్థముల కేగుట, జపః = జపము; దానం = దానము; ఇతరాణి పవిత్రాణి = ఇతరములైన పవిత్ర కర్మలును; తాం శుద్ధిం=ఆ నైర్మల్యమును, న అలంకుర్వంతి = కలిగింప సమర్థములు కావు; యా = ఏ శుద్ధి; జ్ఞానకలయా = జ్ఞానాంశముచే; కృతా = చేయబడినదో.

తా. ఏది జ్ఞానాంశముచే పొందబడుచున్నదో, ఆ చిత్తనైర్మల్యమును, తపము, తీర్థము జపము, దానము, ఇతరములైన పవిత్ర కర్మలు పడయ నేరవు.

శ్లో. తస్మాత్ జ్ఞానేన సహితం జ్ఞాత్వా స్వాత్మాన ముద్ధవ,
జ్ఞాన విజ్ఞాన సంపన్నో భజ మాం భక్తిభావితః, 5

అ. ఉద్ధవ ! = ఓ ఉద్ధవుడా !; తస్మాత్ = అందువలన; జ్ఞానేన సహితం = జ్ఞానముతో కూడిన (జ్ఞానము కల్గువరకు); స్వ-ఆత్మానం = స్వస్వరూపమగు ఆత్మను; భక్తి భావితః = భక్తి భావమును పొందినవాడవై ; మాం భజ = నన్ను సేవింపుము.

తా. ఓ ఉద్ధవా! అందువలన స్వాత్మను జ్ఞానముతో కూడిన వానినిగా ఎఱింగి, భక్తి భావమును పొంది, నన్ను సేవింపుము.

శ్లో. జ్ఞాన విజ్ఞాన యజ్ఞేన మామిష్ట్వాఽఽత్మాన మాత్మని,
సర్వయజ్ఞపతిం మాం వై సంసిద్ధిం మున యోఽన్వగుః, 6

అ. జ్ఞాన-విజ్ఞాన యజ్ఞేన = పరోక్ష-అపరోక్ష రూపమగు యజ్ఞముచే; ఆత్మానం మాం = ఆత్మయైన నన్ను; సర్వయజ్ఞపతిం = ఎల్ల యజ్ఞముల ఫలదాయకుని; ఆత్మని ఇష్ట్వా = తమ హృదయమందు అర్చించి; మునయః = మునులు, మాం = నన్ను గూర్చి, సంసిద్ధిం-అన్వగుః = సిద్ధిని పొందిరి.

తా. బ్రహ్మతత్త్వము శ్రవణము చేసి, పరోక్ష జ్ఞానము పొంది, తరువాత భక్తి ధ్యానాదులచే అపరోక్షమగు అనుభవజ్ఞానము నొంది, జ్ఞానయజ్ఞముచే ఎల్ల యజ్ఞములకు ఫలప్రదుడు పరమాత్మయైన తనను తమహృదయమందు పూజించి మునులు ముక్తి (సిద్ధి) ని పొందిరి.

అవ. ఆ ప్రకారము జ్ఞానమును సంక్షేపముగా ఉపదేశించుచున్నారు.

శ్లో. త్వ య్యుద్ధ వాశ్రయతి య స్త్రివిధో వికారో
మాయాంతరాపతతి నాద్యపవర్గయో ర్యత్,
జన్మాదయోఽస్య యదమీ తవ తస్య కిం స్యు
రాద్యంతయో ర్యదసతోఽస్తి తదేవ మధ్యే. 7

అ. ఉద్ధవ ! త్వయి = నీ యందు; యః త్రివిధః = ఏ ఆధ్యాత్మికాదికమగు త్రివిధమైన; వికారః = దేహాదికము; ఆశ్రయతి = కలదో అది; మాయా = మాయ యగును. పరమార్థము కాదు. యత్ = ఎందువల్లనైతే; అంతరా = మధ్యకాలము నందే, అపతతి = రజ్జువు నందు సర్పము, మాల మున్నగువది వలె ఏర్పడుచున్నది. న-ఆది- అపవర్గయోః తత్ = అది మొదటను తుదకను లేదు. అందువలన యత్ = ఎప్పుడు; అస్య = ఈ దేహాది వికారమునకు; అమీ = ఈ జన్మాదులు; స్యుః = కలుగుచున్నవో; తదా = అప్పుడు; తస్య = అట్టి; తవ = అధిష్ఠాన భూతుడవైన నీకు; కిం = ఏమి కలదు ? ఇంచుకయును లేదు. ఆత్మకు వాస్తవముగా జన్మాది వికారము లేదు. అది అసత్తు అగుట వలన నన్నచో, అసతః = అట్లు నిజము కానిదై ; అసత్తైన సర్పాదికము; ఆద్యంతయోః = ఆద్యంతములందు; యత్ = ఏ రజ్జ్వాదికము గలదో; తత్ = అది; మధ్యే = మధ్యమందును గలదు. సర్పాదికము లేదు. దానికి జన్మాదులు లేవు. అందువలన నీవు నిర్వికారమగు బ్రహ్మవని భావము.

తా. ఉద్ధవా! నీయందు ఆధ్యాత్మికమగు దేహేంద్రియాదికము, ఆధిదైవికమగు ఇంద్రియాదిదైవత వర్గము, ఆది భౌతికమగు పంచభూతములు శబ్దాదివృత్తులు—అను మూడు విధములగు ఏ వికారములు కలుగుచున్నవో ఇదంతయు మాయామాత్రము. సత్యము గాదు.

లయును, స్వప్నమందును మెలకువ లేక, స్వప్నకాలమునందు తోచి విముక్తించిన పిదప కదపట పదార్థము లన్నియు, కలలోని లోకములవలెనె యివియును అసత్యము లగును. మఱియు ఈ దేహమునకు కలుగు జన్మాదులు పరిణామములగు వికారములు వానికి అధిష్ఠాన భూతుడవైన నీకు ఇందుకేమియు లేవు. ఆ జన్మాదులు కూడ వాస్తవములు గావు. అసత్తుగా నుండి తోచు స్వప్నాదులయందు మొదటను, పిదపను పరజ్ఞానాదికము సత్యమై యున్నదో, అదియే మధ్యకాలమునందు నున్నదిగాని స్వప్నాదికము లేదు. అట్లే ఈ దేహాది వికారము వాస్తవముగా లేదు. ఏది ఆద్యంతములందు కలదో అదియే మధ్యకాలమునందును కలదు. దానికి జన్మాదులు లేవు. అందువలన నీవు నిర్వికారమై యున్న బ్రహ్మమై యున్నావు.

అవ. ఉద్ధవ ఉవాచ— ఉద్ధవుడు వచించెను.

**శ్లో. జ్ఞానం విశుద్ధం విపులం యదేత ద్వైరాగ్య విజ్ఞానయుతం పురాణం,**
**ఆఖ్యాహి విశ్వేశ్వర విశ్వమూర్తే, త్వద్భక్తియోగం చ మహ ద్విమృగ్యమ్. 8**

**అ. యత్ -ఏది, విశుద్ధం=శుద్ధ సాత్త్వికమై, విపులం=విస్తరించినదై, వైరాగ్య విజ్ఞాన యుతం = వైరాగ్య విజ్ఞానములతో కూడినదైన, జ్ఞానం = అట్టి జ్ఞానమును, మహత్— విమృగ్యం – పెద్దలగు బ్రహ్మాదులచే గూడ వెదక దగినట్టి, త్వద్భక్తి యోగం చ = నీ భక్తి యోగమును గూడ, ఆఖ్యాహి =చెప్పుము**

తా. ఓ విశ్వపతీ! ఓ విశ్వస్వరూపా! ఏది విశుద్ధమై, శుద్ధ సాత్త్వికమై, విస్తరించినదై సనాతనమై, వైరాగ్యము, అనుభవజ్ఞానము అను వానితో గూడినచో అట్టి విజ్ఞానమును, బ్రహ్మాదుల చేతను వెదక దగినట్టి ఆ నీ భక్తియోగమును వచింపుము.

అవ. మహాత్ము లన్వేషింపదగు ఆ భక్తియోగమును పొందఁ గోరికతో చెప్పుచున్నారు.

**శ్లో. తాపత్రయే ణాభిహతస్య ఘోరే, సంతప్యమానస్య భవాధ్వ నీశ,**
**పశ్యామి నాన్య చ్ఛరణం తవాంఘ్రి, ద్వంద్వాతపత్రా దమృతాభివర్షాత్. 9**

అ. **ఈశ=ఓ ప్రభూ !** ఘోరే భవ-అధ్వని=భయంకరమైన సంసారమార్గమందు, **తాపత్రయేణ-అభిహతస్య=ఆధ్యాత్మికాది త్రివిధతాపముచేకొట్టువడి, సంతప్యమానస్య=తాపముపొందిన నాకు, అమృత-అభివర్షాత్=అమృతపు జల్లులు కురియు, తవ అంఘ్రి-ద్వంద్వ-ఆతపత్రాత్ = శీతోష్ణాది ద్వంద్వములనుండి రక్షించు నీపాదయుగమగు ఛత్రముకంటె, అన్యత్ శరణం న పశ్యామి=ఇతరమగు శరణమును చూడకున్నాను.**

తా. ఓ పరమేశ్వరా! ఘోరమైన ఈ సంసార పథమునందు, ఆధ్యాత్మిక, ఆధిదైవిక ఆధిభౌతికము లను త్రివిధమగు తాపత్రయదుఃఖముచే కొట్టువడి, సంతాపము నందుచున్న నేను, అమృతపు జల్లులు కురియుచున్న శీతోష్ణాది ద్వంద్వముల నుండి రక్షించునదైన నీ పాదయుగమను ఛత్రము కంటె అన్యమును శరణు గానకున్నాను.

అవ. మిక్కిలి దయ గలిగించుచు నిట్లనుచున్నారు.

శ్లో. దష్టం జనం సంపతితం బిలేఽస్మిన్, కాలాహినా క్షుద్రసుఖోరుతర్షం,
సముద్ధరైనం కృపయాఽపవర్గ్యైః, వచోభి రాసించ మహానుభావ. **10**

అ. మహానుభావ! అస్మిన్ బిలే = ఈ సంసారకూపమునందు, సంపతితం = పడినదియు, అచట, కాలాహినా = కాలసర్పముచే, దష్టం = కఱువబడినదియు, క్షుద్రసుఖ - ఉరుతర్షం = అల్పసుఖములందే మిక్కిలి తృష్ణగలదియునగు, ఏనం జనం = ఈ జనుని నన్ను, సముద్ధర = ఉద్ధరింపుము, కృపయా = దయతో, అపవర్గ్యైః = అపవర్గబోధకములగు, వచోభిః = వాక్కులతో, ఆసించ = తడుపుము.

తా. ఓ మహానుభావా! ఈ సంసారకూపమున పడి, అందు కాలసర్పముచే కఱువబడి క్షుద్రమగు సంసార సుఖములందు మిక్కిలి తృష్ణ కల్గియున్న ఈ జనుని నన్ను కృపతో నుద్ధరింపుము. మోక్ష బోధకములగు వాగమృతబిందువులతో నన్ను తడుపుము.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

అవ. విశ్వాసము కల్గుటకు విద్వత్సభయందు నిర్ణీతమైన అర్థము చెప్పెదననుచున్నారు.

శ్లో. ఇత్థమేత త్పురా రాజా భీష్మం ధర్మవిదాం వరం,
అజాతశత్రుః పప్రచ్ఛ సర్వేషాం నోఽనుశృణ్వతామ్. **11**

అ. పురా, రాజా అజాతశత్రుః = పూర్వము రాజు, అజాతశత్రువు, ఇత్థం = నీవడిగిన ప్రకారము; ఏతత్ = ఈ జ్ఞానమును గూర్చి; ధర్మవిదాం వరం భీష్మం = ధర్మ మెఱింగిన వారిలో శ్రేష్ఠుడగు భీష్ముని; సర్వేషాం నః శృణ్వతాం = మే మందఱము వినుచుండగా; ప్రపచ్ఛ = అడిగెను.

తా. నీవడిగిన ప్రకారము ఈ జ్ఞానమునుగూర్చి పూర్వము ధర్మరాజు, ధర్మవేత్తలలో నుత్తముడైన భీష్ముని మేమందఱము వినుచుండగా ప్రశ్నించెను.

శ్లో. నివృత్తే భారతే యుద్ధే సుహృన్నిధనవిహ్వలః,
శ్రుత్వా ధర్మాన్ బహూన్ పశ్చాత్ మోక్షధర్మా నపృచ్ఛత. **12**

అ. భారతే యుద్ధే నివృత్తే = కౌరవ పాండవుల యుద్ధము పూర్తికాగా; సుహృత్-నిధన విహ్వలః = బంధుమిత్రుల మృతిచే దిగులు పొందినవాడై; బహూన్-ధర్మాన్-శ్రుత్వా = పెక్కు ధర్మములను విని; పశ్చాత్ = తరువాత; మోక్షధర్మాన్ అపృచ్ఛత = మోక్ష ధర్మములను ప్రశ్నించెను.

తా. భారతసంగ్రామ మంతయు సమాప్తిచెందిన తరువాత, అందు పెక్కు బంధుమిత్రులు వధింపబడినందులకు బాధనొందినవాడై ధర్మరాజు భీష్మునివలన రాజధర్మములు, ఆపద్ధర్మములు విని, పదంపడి మోక్షధర్మములగూర్చి అడిగెను.

శ్లో. తా నహం తేఽభిధాస్యామి దేవవ్రతముఖాత్ శ్రుతాన్,
జ్ఞాన విజ్ఞాన వైరాగ్య శ్రద్ధా భక్త్యుపబృంహితాన్. **13**

అ. దేవవ్రత ముఖాత్ = భీష్ముని నోటినుండి; శ్రుతాన్ = విన్న; తాన్; జ్ఞాన ... బృంహితాన్ = జ్ఞానము, విజ్ఞానము, వైరాగ్యము, శ్రద్ధ, భక్తులతో గూడిన మోక్షధర్మములను; తే, అభిధాస్యామి = నీకు వచింతును.

రా. నేను భీష్మునిముఖమున వినినట్టి, జ్ఞానము, విజ్ఞానము, వైరాగ్యము, శ్రద్ధ, భక్తి లోనగువానిచే పెంపొందింపబడిన మోక్షధర్మములను నీకు చెప్పెదను.

శ్లో. నవైకాదశ పంచ త్రీన్ భావాన్ భూతేషు యేన వై,
ఈక్షేతాథైక మప్యేషు తత్ జ్ఞానం మమ నిశ్చితమ్ **14**

అ. నవ = ప్రకృతి-పురుష, మహదహంకార పంచ తన్మాత్రలు అను తొమ్మిదియు, ఏకాదశ = జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు మనస్సుతో కలిసి పదునొకండును; త్రీన్ = సత్త్వరజస్తమములను మూడు గుణములును; పంచ = పంచ తన్మాత్రలును; భావాన్ = ఈ ఇరువది యెనిమిది తత్త్వములను; భూతేషు = బ్రహ్మ మొదలు స్థావరముల పర్యంత ముండు ప్రాణులందు, అనుగతములైన వానిని; యేన వై = ఏ జ్ఞానముచే; ఈక్షేత = చూచునో; అథ, ఏషు-అపి = మఱి ఈ భావములందును; ఏకం = ఒక్క పరమాత్మ తత్వ మనుగతమైన దానిని; యేన, ఈక్షేత = ఏ జ్ఞానముచే చూచునో, అట్టి, తత్-జ్ఞానం = కార్య కారణాత్మకమైన జగత్తు, పరమ కారణాత్మకముగనే చూచు ఆ జ్ఞానము; మమ నిశ్చితం = నాచే నిశ్చయింపబడినది.

రా. ప్రకృతిపురుషులు (2) మహదహంకారపంచతన్మాత్రలు(7) చేరి, ఈతొమ్మిదియు, జ్ఞానేంద్రియములు (5),కర్మేంద్రియములు (5), మనస్సు కలిసి-ఈపదునొకండును, పంచ భూతములును, సత్త్వరజస్తమస్సులను మూడుగుణములును చేరి, మొత్తము-ఈ (28) ఇరువది ఎనిమిది తత్వములను బ్రహ్మమొదలు స్థావరపర్యంతముగల ప్రాణులందును, ఏజ్ఞానముచే చూచుచు సంభవించుచున్నదో, పైని ఇరువదియెనిమిదియు నను గతమైన బ్రహ్మమొదలు వృక్షము పర్యంతముగల సర్వప్రాణులందు ఏజ్ఞానముచే పరమాత్మతత్వము చూడబడుచున్నదో అది జ్ఞానమని నానిశ్చయము.

అవ. విజ్ఞానము అర్ధశ్లోకముచే చెప్పబడుచున్నది.

శ్లో. ఏతదేవ హి విజ్ఞానం న తథైకేన యేన యత్. **15**

అ. యత్ = ఏది; యదా = ఎపుడు; యేన-ఏకేన = ఏ ఒక్కదానిచే అనుగతములైన వానిని అనేకాత్మకములను పేర్కొనబడినవానిని పూర్వము చూచెనో, వానిని; తథా = పూర్వము వలె; న (ఈక్షేత) = చూడరాదు, మఱి ఏమనగా అది ఒక్క పరమకారణమైన బ్రహ్మమే. అపుడు, ఏతత్-ఏవ-హి-విజ్ఞానం = ఇదియే విజ్ఞానమని చెప్పబడును దీని భావమిది. పరోక్షజ్ఞానముచే అపరోక్షభ్రమము దిఙ్మోహాదులందువలె తొలగనందువలన, అప్పుడు బ్రహ్మాత్మకమగు జగత్తును చూచువాడైనను; అక్కకంటె వేఱుగా సత్తు ఉండెనని తలంచును అపరోక్ష జ్ఞానముచే నది బాధిత మగును. వేఱుగాదు. జీవన్ముక్తుడు సంస్కారశేషమును కాలిన వస్త్రమును వలె చూచును. అటుమీదట చూడడు. అందువలన పరోక్షాపరోక్ష జ్ఞానములు జ్ఞాన విజ్ఞాన శబ్దములచే చెప్పబడును.

తా. ముందు ఒక్కదానితో కూడినదానిని పెక్కుస్వరూపములుగా చూచెను. అట్లు గాక, అవి యన్నియు పరమకారణమైన ఒక్క బ్రహ్మమే యని చూచుట విజ్ఞాన మగును.

అవ. ఒక్కదానితో సర్వకార్యముల అనుగతియును, కార్యములు కారణముకన్న వేఱుగా నుండవనియు ఒకటిన్నర శ్లోకముచే ఉపపాదించుచున్నారు. 'అవిజ్ఞానమున ఒకప్పుడు జగత్తు ఇట్టిదిగా నుండదనిచో' ఇత్యాది మతమున ఈ భావములకు ఉత్పత్త్యాదు లుండును. అప్పుడు కారణ మొక్కటి కాకపోవుచున్నందువలన ఏకాత్మకత మిథ్యాత్వము సంభవించక పోవును. అందువలన వాని ఉత్పత్త్యాదులను సాధించుచున్నారు.

శ్లో. స్థిత్యుత్పత్త్యప్యయాన్ పశ్యేత్ భావానాం త్రిగుణాత్మనామ్,
ఆదా వంతే చ మధ్యే చ సృజ్యా త్సృజ్యం యదన్వియాత్,
పున స్తత్ప్రతిసంక్రామే యచ్ఛిష్యేత తదేవ సత్. 16

అ. త్రిగుణాత్మనాం = త్రిగుణ స్వరూపములై సావయవములైన; భావానాం = దేహాదుల యొక్క; స్థితి-ఉత్పత్తి-అప్యయాన్ = ఉనికి; పుట్టుక; లయము అనువానిని, పశ్యేత్ = చూడవలెను అందువలన; ఆదౌ; అంతే, మధ్యే చ = ఆదియందు ఉత్పత్తికి; అంతమందు (పరిణామాంతరాపత్తి యందు) కారణమగుటచే; మధ్యకాలమందు ఆశ్రయ మగుటచే; సృజ్యాత్ సృజ్యం = కార్యము వలన కార్యాంతరముగూర్చి; యత్-అన్వియాత్ = ఏది అనుగతమగునో; తత్-ప్రతి సంక్రామే = వాని ప్రళయమందును, యత్-శిష్యేత = ఏది పరిశేషించుచున్నదో; తత్-ఏవ = అదియే, సత్ = సత్యము, సత్పదార్థము అని చూడవలెను.

తా. త్రైగుణాత్మకములై, సావయవములై పరస్పరభిన్నములైన ఈదేహాదులన్నియు జన్మస్థితిలయములు కలవి గావున ఘటాదులవలె చూడవలెను. ఉత్పత్తియందును, లయమందును స్థితియందును కార్యము నుండి కార్యాంతరమునకు ఏది అనుగతమై యున్నదో, మఱియు సర్వ ప్రళయసమయమందును ఏది శేషించి యుండునో అదియే సత్యము సత్పదార్థమని చూడవలెను.

అవ. వైరాగ్యమును రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. శ్రుతిః ప్రత్యక్ష మైతిహ్య మనుమానచతుష్టయమ్,
ప్రమాణే ష్వనవస్థానాత్ వికల్పా త్స విరజ్యతే. 17

అ. శ్రుతి-నేహ నానా స్తి కించన-ఇందు అనేకత్వము పెక్కుగా నుండునది; ఇంచుకయును లేదు. అను పటాదికార్యము తయు; తంత్వాదులకు వ్యతిరేకముగా చూపట్టదు. ఇట్లే చైతన్య వ్యతిరేకముగా ఏకించిత్తును కన్పట్టదు అని శ్రుతియు, ఐతిహ్యం = మహాజనులందు ప్రసిద్ధము, అనుమానం = విమతము, భేదము, మిథ్య; దృశ్యమగుటవలన, శుక్తియందు రజతము వలె ఈ ప్రకారము, చతుష్టయం = పైనాల్గును; ప్రమాణేషు = ఈ ప్రమాణములందు; అనవస్థానాత్ = నిరూపణము బాధితమగుటవలన, సః = అతడు (ఈ రీతిగా సత్యమగు ఆత్మతత్వము నిరూపణము అగుటవలన) వికల్పాత్ = వికల్పము మిథ్య యగుటవలన, విరజ్యతే = విరక్తుడగుచున్నాడు.

తా. 'ఈ ప్రపంచమునందు పెక్కుగా నుండున దేకించిత్తును లేదు' అను శ్రుతియు, కార్యమగు పటము, తంతువులకంటె వేఱుగాదను ప్రత్యక్ష ప్రమాణము, మహాజనులందును ఈ

జగము మిథ్యయని వచించువాక్యమును. శుక్తియందు రజతమువిధముగా కన్పట్టుచున్నది మిథ్యయని అనుమాన ప్రమాణము—ఈనాల్గుప్రమాణములు, ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము-అనువానియందు ఈజగత్తు బాధితమగుట వలన, ఈజగత్తు మిథ్యయని చెప్పబడుచున్నది. అని ఎరిగినవాడై ఈజగత్తునందు విరక్తుడగుచున్నాడు. ఇది వైరాగ్యమగును.

అవ. వేదోక్తములు స్వర్గాది సుఖాలతో విరక్తుడు కాఁగూడదు గదా అనిన దానికి చెప్పుచున్నారు.

శ్లో. కర్మణాం పరిణామిత్వా దావిరించా దమంగళం,
విపశ్చి న్నశ్వరం పశ్యేత్-అదృష్టమపి దృష్టవత్. 18

అ. కర్మణాం పరిణామిత్వాత్ = యాగాది కర్మలు పరిణామము ఫలము అగుటవలన; విరించాత్, ఆమంగళం = బ్రహ్మలోక పర్యంతము దుఃఖరూపము; అదృష్టం- అపి-కనపడని స్వర్గాది సుఖముకూడా, దృష్టవత్ = కన్పించిన దానివలె, నశ్వరం = నశించునది అని విపశ్చిత్ = విద్వాంసుడు; పశ్యేత్ = చూచును.

తా. యాగాదికర్మల ఫలపరిణామముగా లభించుబ్రహ్మాదిలోకములు సహితము దుఃఖరూపము లగుటచే, కంటికి కన్పట్టు ఇహలోక సుఖాదికము వలె, కంటికి కానరాని స్వర్గాది సుఖము సహితము నశ్వరమగునని విద్వాంసుడు తలంచును.

అవ. భక్తియోగమును సకారణముగ తెల్పుచున్నారు.

శ్లో. భక్తియోగః పురైవోక్తః ప్రీయమాణాయ తేఽనఘ,
పునశ్చ కథయిష్యామి మద్భక్తేః కారణం పరమ్. 19

అ. అనఘ-ప్రీయమాణాయ- తే = మిగుల ప్రీతికి పాత్రుడవైన నీకు; భక్తియోగః = పురా ఏవ- ఉక్తః = పూర్వమే భక్తియోగము చెప్పబడినది పునః = మరల, మద్భక్తేః = నా భక్తియొక్క; పరం కారణం = పరమ కారణమును, కథయిష్యామి = చెప్పగలను.

తా. మిగుల ప్రీతిపాత్రుడవైన నీకు నా భక్తియోగము పూర్వమే చెప్పబడెను. అయినను నీకు నా భక్తికి గల పరమ కారణమును చెప్పగలను.

శ్లో. శ్రద్ధాఽమృతకథాయాం మే శశ్వ న్మదనుకీర్తనం,
పరినిష్ఠా చ పూజాయాం స్తుతిభిః స్తవనం మమ. 20

అ. మే- అమృతకథాయాం శ్రద్ధా = నా అమృతతుల్యములైన కథలను శ్రవణము చేయుశ్రద్ధ; శశ్వత్ = ఎల్లప్పుడు; మత్- అనుకీర్తనం = నన్ను కీర్తించుట, పూజాయాం పరినిష్ఠా చ = పూజయందు పూర్ణనిష్ఠ; స్తుతిభిః మత్ స్తవనం = స్తుతులచే నన్ను స్తుతించుట.

తా. నా కథామృతమందు శ్రవణాదరము; ఎల్లపుడు నన్ను కీర్తించుట, నాపూజయందు దృఢనిష్ఠయు, స్తుతులచే నన్ను స్తుతించుటయు భక్తియోగమగును.

శ్లో. ఆదరః పరిచర్యాయాం సర్వాంగై రభివందనం,
మద్భక్త పూజాభ్యధికా, సర్వభూతేషు మన్మతిః. 21

అ. పరిచర్యాయాం-ఆదరః = నా సేవయందు ఆదరము; సర్వాంగైః అభివందనం = సాష్టాంగదండప్రణామము; అభ్యర్థికా' మత్ - భక్త పూజా = అధికముగా నా భక్తులను పూజించుట; సర్వభూతేషు మన్మతిః = అన్ని భూతములందు నా స్వరూపమును చూచుట.

తా. నా సేవయం దాదరము, నాకు సాష్టాంగ దండ ప్రణామ మాచరించుట, నాభక్తుల నధికముగా పూజించుట, సర్వభూతములందును నాయునికిని గాంచుట.

శ్లో. మదర్థే ష్వంగచేష్టా చ, వచసా మద్గుణేరణం,
మయ్యర్పణం చ మనసః, సర్వకామ వివర్జనమ్, **22**

అ. మత్- అర్థేషు = నా కార్యములందు; అంగచేష్టా చ = లౌకిక క్రియను దేహమును ప్రవర్తింవ జేయుట; వచసా మద్గుణ- ఈరణం = వాక్కుచే నా గుణములను వచించుట; మనసః మయి అర్పణం = మనస్సును నాయందు సమర్పించుట; సర్వకామవివర్జనం = ఎల్లకామములను విడచుట.

తా. నా సేవాకార్యములను కాయికముగా చేయుట, వాక్కుతో నాగుణములను కీర్తించుట, మనస్సును నాయందు సమర్పించుట, ఎల్లకామములను విడచుట భక్తికి కారణమగును.

శ్లో. మదర్థేఽర్థపరిత్యాగో భోగస్య చ సుఖస్య చ,
ఇష్టం దత్తం హుతం భుక్తం మదర్థం యద్వ్రతం తపః. **23**

అ. మదర్థే- అర్థ పరిత్యాగః = నా భజనము కొఱకు ధనాధికము త్యాగము చేయుట; భోగస్య సుఖస్య = భోగసాధనమగు చందనాదికమును; పుత్రోపలాలనాదికమైన సుఖమును త్యాగముచేయుట; ఇష్టం = వైదిక కర్మ; దత్తం = దానము; హుతం = హోమము. భుక్తం = అనుభవింపబడినది; యత్ = ఏ; వ్రతం; తపః = వ్రతము తపము మదర్థం = నా కొఱకు త్యాగముచేయుట

తా. నా భజనము కొఱకు ధనమును త్యాగముచేయుట, భోగసాధనమగు చందనాదికము, సుఖసాధనమగు పుత్రోపలాలనాదికమును త్యాగముచేయుట, వేదోక్తమైన క్రియ, క్రతువు దానము, హోమము, భోజనము, తపము, వ్రతము పీని నన్నింటిని నీకొఱకు సమర్పించుట భక్తికి కారణమగును.

శ్లో. ఏవం ధర్మై ర్మనుష్యాణాం ఉద్ధవాత్మనివేదనాత్
మయి సంజాయతే భక్తిః కోన్యోఽర్థో ఽస్యావశిష్యతే. **24**

ఉద్ధవ! ఏవం ధర్మైః = ఈ చెప్పిన పూజాది ధర్మములచే; ఆత్మనివేదనాత్ = తన్ను సమర్పించుట వలన; మనుష్యాణాం = మనుష్యులకు; మయి భక్తిః = నా యందు భక్తిః సంజాయతే = కల్గుచున్నది; అస్య = ఈ భక్తికి అన్యః అర్థః = వేఱొక ప్రయోజనము; కః అవశిష్యతే = ఏది మిగులును.

తా. ఓ ఉద్ధవా! పైన చెప్పిన భక్తిధర్మములచే ఆత్మసమర్పణ కావించుట ద్వారా, మానవులకు నాయందు ప్రేమలక్షణమైన భక్తి జనించుచున్నది. ఇట్లు భక్తునకు భక్తిజనించిన తరువాత ఇక నే పురుషార్థము శేషించుచున్నది? అన్ని పురుషార్థములును తమకు తాముగా వచ్చి భక్తుని చేరుచున్నవి.

అవ. దానినే చెప్పుచున్నారు. బంధమోక్షములకు, అర్థానర్థములకు చిత్తమే కారణమని రెండు శ్లోకములలో చెప్పుచున్నారు.

శ్లో. యదాత్మన్యర్పితం చిత్తం, శాంతం సత్త్వోపబృంహితం,
ధర్మం జ్ఞానం స వైరాగ్యం ఐశ్వర్యం చాభిపద్యతే. **25**

అ. యదా = ఎప్పుడు, ఆత్మని = పరమాత్మయగు నాయందు; సత్త్వ - ఉపబృంహితం = సత్త్వగుణముచే పెంపొందిన; శాంతం చిత్తం = శాంతమగు చిత్తము, అర్పితం = అర్పింపబడినదో, అప్పుడు. ధర్మం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం చ అభిపద్యతే = ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యములను పొందుచున్నాడు,

తా. ఎప్పుడు భక్తుడు సత్త్వగుణముచే వర్ధిల్లిన శాంతచిత్తమును సమర్పించుచున్నాడో, అప్పుడతడు ధర్మజ్ఞానములను, వైరాగ్యైశ్వర్యములను పొందుచున్నాడు.

శ్లో. యదర్పితం తద్వికల్పే ఇంద్రియైః పరిధావతి,
రజస్వల మసన్నిష్ఠం చిత్తం విద్ధి విపర్యయమ్. **26**

అ. యత్ చిత్తం = చిత్త మెప్పుడు. వికల్పే = వికల్పమగు దేహము గృహాదికమందు అర్పితం సత్ = అర్పింపబడినదై; ఇంద్రియైః పరిధావతి = ఇంద్రియములతో పరుగిడుచున్నదో; రజస్వలం = కలుషితమో; అసన్నిష్ఠం = అసత్యమగు సంసారమున నెలకొన్నదో; అందువలన, విపర్యయం విద్ధి = అధర్మాదికము కలుగునని ఎఱుంగునది.

తా. ఎప్పుడు చిత్తము వికల్పమైన,దేహము గృహాదికమునందు సమర్పింపబడినదై ఇంద్రియముల వెంట పడుచున్నదో, అప్పుడు కలుషితమై అసత్యమగు సంసారమున నెలకొన్నదై, అందువలన అధర్మాదికము జరుగునని ఎఱుంగుము.

శ్లో. ధర్మో మద్భక్తికృత్ ప్రోక్తో జ్ఞానం చైకాత్మ్యదర్శనమ్,
గుణేష్వసంగో వైరాగ్య మైశ్వర్యం చాణిమాది చ. **27**

అ. మత్ భక్తి-కృత్ = నా భక్తిని కావించునది; ధర్మః ప్రోక్తః = ధర్మముగా చెప్పబడినది, ఏకాత్మ్యదర్శనం జ్ఞానం చ = సర్వము నొక్క పరమాత్మగా చూచు జ్ఞానమును; గుణేషు = అసంగః = ఇంద్రియముల యందు ఆసక్తిలేమి; వైరాగ్యం, ఐశ్వర్యం, అణిమాది చ = వైరాగ్యము, ఐశ్వర్యము, అణిమాదులును.

తా. నాభక్తి గావింపజేయునది ధర్మము అని చెప్పబడినది. అట్లే సర్వము నొక్క పరమాత్మగా చూచు జ్ఞానము, ఇంద్రియ సుఖములందాసక్తిలేమి, వైరాగ్యము, ఐశ్వర్యము, అణిమాది సిద్ధులుకూడ అగును.

అవ. ధర్మాదులు మహాజన ప్రసిద్ధములైనను, అన్యథా వ్యాఖ్యానించుటవలన యమాదులందును సంఖ్యనుబట్టియు, స్వరూపమునుబట్టియు నించుక వైలక్షణ్యము కల్గుచున్నదను ఊహతో వాని విశేష మెఱుంగగోరి అయిదు శ్లోకములతో ప్రశ్నించుచున్నారు.

శ్లో. యమః కతివిధః ప్రోక్తః నియమో వాఽరికర్శన
కశ్శమః కో దమః కృష్ణ కా తితిక్షా ధృతిః ప్రభో. **28**

అ. అరిసూదన=శత్రుసూదనుడా! ; యమః, కతివిధః ప్రోక్తః = యమ మెన్ని విధములుగా చెప్పబడినది; ప్రభో=ఓ సర్వశక్తుడా ! ; కృష్ణ = ఓ కృష్ణుడా ! ; నియమః వా = నియమ మెన్ని విధములు ? ; కః శమః, కః దమః = శమమన నేమి ? దమమన నేమి ? ; కా తితిక్షా = ఓర్పు అననేమి ? ధృతిః = ధైర్యమన నేమి ?

తా. ఓశత్రుసూదనా! యమము ఎన్ని విధములుగా చెప్పబడినది. నియమ మెన్ని విధములు? శమ మననేమి? దమ మన నేమి, తితిక్ష యననేమి? ధృతి యన నేమి?.

**శ్లో. కిం దానం కిం తప శ్శౌర్యం. కిం సత్య మృత ముచ్యతే,**
**కస్త్యాగః కిం ధనం చేష్టం కో యజ్ఞః కా చ దక్షిణా. 26**

అ. కిం దానం = దాన మన నేమి ? కిం తపః, శౌర్యం = తపము శౌర్యము అననేమి? కిం సత్యం ఋత ఉచ్యతే = సత్యము, ఋతము, అననేమి ? కః త్యాగః = త్యాగమేది ? ఇష్టం ధనం చ కిం = ఇష్టమగు ధన మేమి ? కః యజ్ఞః = యజ్ఞమన నెయ్యది ? దక్షిణా చ కా = దక్షిణ ఏది ?

తా, దాన మన నేమి ? తప మేది ? శౌర్యమన నేమి ? సత్యము శౌచము అన నేమి ? త్యాగ మననేమి? ధనమన నేది, ఇష్టమన నేది, యజ్ఞ మన నేమి? దక్షిణ యన నేమి?

**శ్లో. పుంసః కిం స్విద్బలం శ్రీమద్ భగో లాభశ్చ కేశవ,**
**కా విద్యా హ్రీః పరా కా శ్రీః కిం సుఖం దుఃఖమేవ వా. 30**

అ. పుంసః బలం కింస్విత్ = పురుషునకు బలమేది; శ్రీమద్ భగః లాభః చ కః = శ్రీమంతమగు సౌభాగ్యము, లాభము ఏది; కా విద్యా, హ్రీః=విద్య.హ్రీయనునవి ఏవి? పరా =క్షేమమైన ; శ్రీః=అలంకారము. కా=ఏది?; సుఖం దుఃఖం ఏవ వా కిం=సుఖదుఃఖములేవి?

తా. కేశవా ?పురుషునికి బలమేది? శ్రీమంతమగు సౌభాగ్యమేది ? లాభమేది? విద్య ఏది ? హ్రీ యన నేమి ? ?ఉత్తమమగు నలంకారమేది? సుఖ దుఃఖము లేవి ?

**శ్లో. కః పండిత: కశ్చ మూర్ఖః కః పంథా ఉత్పథశ్చ కః,**
**కః స్వర్గో నరకః కశ్చ కో బంధు రుత కిం గృహమ్. 31**

అ సుగమము.

తా. పండితుడెవ్వడు ?మూర్ఖుడు ఎవడు ? ధర్మమార్గ మేది ? అధర్మమార్గమేది? స్వర్గ మన నేమి? నరకమేది ? బంధువెవరు? గృహ మన నేది?

**శ్లో. క ఆఢ్యః కో దరిద్రో వా కృపణశ్చ క ఈశ్వరః**
**ఏతాన్ ప్రశ్నాన్ మమ బ్రూహి, విపరీతాంశ్చ సత్పతే. 32**

అ. సుగమము.

అ. సత్పతే = సాధుజనవల్లభా ! ఆఢ్యు డెవ్వడు ? దరిద్రు డెవ్వడు? కృపణుడెవ్వడు? ఈశ్వరు డెవడు? ఈ ప్రశ్నలను గూర్చియు, ఇంకను వానికి విపరీతములైన అశమాదుల గూర్చియు నాకు సదుత్తరము లిమ్ము.

శ్రీభగవా నువాచ=శ్రీ భగవానుడు వచించెను.

[illegible] దే చెప్పబడినవి.

శ్లో॥ అహింసా సత్య మస్తేయ, మసంగో హ్రీ రసంచయః,
ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనం స్థైర్యం క్షమాఽభయమ్. 33

అ. సుగమము.

[illegible], [illegible] హ్రీ (పాపకర్మమందు సిగ్గు), [illegible] ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము [illegible].

శ్లో॥ శౌచం జప స్తపో హోమః శ్రద్ధాఽఽతిథ్యం మదర్చనం,
తీర్థాటనం పరార్థేహా తుష్టి రాచార్యసేవనమ్. 34

అ. సుగమము.

తా. శౌచము [illegible]. బహిశ్శౌచము, అంతశ్శౌచము [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], పరులకు మేలు చేయు [illegible], సంతృప్తి, [illegible] — [illegible] నియమము [illegible].

శ్లో॥ ఏతే యమాః సనియమా ఉభయో ర్ద్వాదశ స్మృతాః,
పుంసా ముపాసితా స్తాత యథాకామం దుహంతి హి. 35

అ. ఉభయోః = రెండింటికి; ఏతే: సనియమాః: యమాః = నియమములతో కూడిన యమములు; ద్వాదశ స్మృతాః = పండ్రెండు చెప్పబడినవి. ఉపాసితాః = ఉపాసింపబడినవై; పుంసాం = పురుషులకు; ఉభయోః = ప్రవృత్తి నివృత్తి మార్గగతులకు: యథాకామం = వారి కామానుసారము, దుహంతి = కోరికలను తీర్చుచున్నవి.

తా. పై రెండు శ్లోకములందు పండ్రెండు యమములు, పండ్రెండు నియమములు చెప్పబడినవి. [illegible] యమములు, [illegible] నియమములు ముఖ్యమని తెలియవలెను. వాని నుపాసించు [illegible] వారి వారి వాంఛను బట్టి మోక్షమును, ఇహలోక సుఖమును [illegible].

శ్లో॥ శమో మన్నిష్ఠతాబుద్ధేః దమ ఇంద్రియసంయమః,
తితిక్షా దుఃఖసమ్మర్షో జిహ్వోపస్థజయో ధృతిః. 36

అ. మన్నిష్ఠతాబుద్ధేః శమః = నాయందు అచంచలమగు బుద్ధి శమమగును. కేవలము శాంతి మాత్రము కాదు. ఇంద్రియసంయమః దమః = ఇంద్రియములు వరికట్టుట దమ మగును. దుఃఖ సమ్మర్షః తితిక్షా = సత్కార్యముష్ఠానశ్రమను సహించుట తితిక్ష; జిహ్వోపస్థజయః ధృతిః = జిహ్వను ఉపస్థము జయించుట ధృతి యగును.

తా. నాయందు స్థిరముగా బుద్ధిని నిల్పుట శమమగును. కాని కేవలము శాంతికాదు. ఇంద్రియములను నిరోధించుట దమ మగును. కాని చోరాదిదండనము కాదు. విహితకర్మాను

స్థాపత్రాదుల సహనము తితిక్ష యగును. కేవలము భారాదుల సహించుట కాదు. జిహ్వను, ఉపస్థను జయించుట, వాని వేగమును నిరోధించుట ధృతియగును. కాని మనఃక్షోభము లేకుం డుట కాదు.

శ్లో॥ దండన్యాసః పరం దానం కామత్యాగ స్తప స్స్మృతః,
స్వభావవిజయ శ్శౌర్యం సత్యం చ సమదర్శనమ్. 37

అ. దండన్యాసః = భూతద్రోహము త్యజించుట; పరం దానం = ఉత్కృష్టమగు దానము, కామత్యాగః = భోగములందు ఉపేక్ష; తపః స్మృతః = తపస్సుగా చెప్పబడినది. స్వభావవిజయః శౌర్యం = ప్రకృతి వాసనలను, తన స్వభావవాసనను జయించుట, శౌర్యము. సమదర్శనం- సత్యం=బ్రహ్మమును గూర్చి సమానముగా అంతటను ఆలోచించుట సత్యమగును యథార్థాభిభాషణము కాదు.

తా. భూతములను హింసింపకుండుట ఉత్తమమగు దానము. కేవలము ధనార్పణము కాదు. భోగములం దుపేక్ష వహించుట తపమగును. కృచ్ఛ్రచాంద్రాయణాదికము కాదు. బ్రహ్మమును సమముగా ఆలోచనసల్పుట సత్యమగును. యథార్థాభిభాషణము కాదు.

శ్లో॥ ఋతం చ సూనృతా వాణీ కవిభిః పరికీర్తితా,
కర్మ స్వసంగమ శ్శౌచం త్యాగ స్సన్న్యాస ఉచ్యతే. 38

అ. సూనృతా వాణీ ఋతం = సత్యము ప్రియమువగు వాక్కు ఋతము అని, కవిభిః, పరికీర్తితా=కవులచే చెప్పబడినది. ఈ ప్రకారము ఋత సత్యములు స్ఫుటముగా వివేచింపబడినవి. శౌచము మలత్యాగరూప మగుటచే త్యాగభేద ప్రతీతియే కలుగును కనుక క్రమప్రాప్తమైన త్యాగమును వ్యాఖ్యానించుటకు మొదట దానికంటె అర్థభేదముచే శౌచమును వ్యాఖ్యానించు చున్నారు. కర్మసు-అసంగమః శౌచం=కర్మలందు తత్ఫలితములందు అనాసక్తి శౌచమగును. త్యాగః సన్న్యాసః ఉచ్యతే = త్యాగ మనగా సన్న్యాసమని చెప్పబడుచున్నది.

తా. సత్యమై ప్రియమైన వాక్కు ఋతమని కవులు వాక్రుచ్చిరి. కర్మలందు తత్ఫలములందు ఆసక్తిలేకుండుట శౌచమగును. సన్న్యాసము త్యాగముగా చెప్పబడినది.

శ్లో॥ ధర్మ ఇష్టం ధనం నౄణాం యజ్ఞోఽహం భగవత్తమః,
దక్షిణా జ్ఞానసందేశః ప్రాణాయామః పరం బలమ్. 39

అ. నృణాం ఇష్టం- ధనం- ధర్మః = నరులకు ఇష్టమైన ధనము ధర్మాచరణమగును. భగవత్తమః అహం యజ్ఞః = పరమేశ్వరుడగు నేను యజ్ఞమగుదును. దక్షిణా జ్ఞానసందేశః = యజ్ఞార్థమైన దానము దక్షిణ యగును అది జ్ఞానోపదేశ మగును. ప్రాణాయామః పరం బలం= ప్రాణాయామము ఉత్తమమగు బలమగును.

తా. నరులకు ఇష్టమైన ధనము ధర్మాచరణము, పశ్వాదికముకాదు. పరమేశ్వరు డగు నేను యజ్ఞమగుదును. నేనను బుద్ధితో యజ్ఞ మనుష్ఠింపవలెను. కేవలము క్రియాబుద్ధితో గాదు. యజ్ఞార్థమగు దక్షిణ గురూపదేశమగును. హిరణ్యాదిదానము కాదు. మనస్సును దమింపజేయు ప్రాణాయామమే బలమగును. దుష్టులను దండించుట కాదు,

శ్లో. భగో మ ఐశ్వరో భావో లాభో మద్భక్తి రుత్తమః,
విద్యాత్మని భిదా బాధో జుగుప్సా హ్రీ రకర్మసు. 40

అ. భగః = భాగ్యము, మే ఐశ్వరో భావః = నా యొక్క ఐశ్వర్యాది షాడ్గుణ్యము; ఉత్తమః లాభః మద్భక్తిః = నా భక్తియే ఉత్తమమైన లాభము, విద్యా-ఆత్మనిభిదా-బాధః = ఆత్మయందు తోచు భేదమునకు బాధయగునది విద్య; అకర్మసు జుగుప్సా- హ్రీః = అకర్మలందు జుగుప్సా దర్శనము హ్రీ యగును

తా. ఐశ్వర్యము, జ్ఞానము, సంపద, వైరాగ్యము, కీర్తి, వీర్యము —ఆరును భగ మన బడును. అట్టి షడ్గుణ సంపత్తి యనెడి భగమును పొందుట భాగ్యమగును. కేవలము సంపద కాదు. ఉత్తమమైన భక్తియే లాభము పుత్రాదిలాభము కాదు: ఆత్మయందు భేదభావము పోనడంచునది విద్య యగును. జ్ఞానమాత్రము కాదు. అకార్యములందు ఏవగింపు హ్రీయగును. కేవలము సిగ్గు కాదు.

శ్లో. శ్రీ ర్గుణా నైరపేక్షాద్యాః సుఖం దుఃఖ సుఖాత్యయః,
దుఃఖం గ్రామ్యసుఖాపేక్షా పండితో బంధ మోక్షవిత్. 41

అ. నైరపేక్షాద్యాః గుణాః = నిరపేక్షతో నుండుట మున్నగు గుణములు; శ్రీః = అలంకారము. దుఃఖ సుఖ అత్యయః = దుఃఖసుఖముల నతిక్రమించి వాని ననుసంధించనిది సుఖము; గ్రామ్యసుఖ- అపేక్షా, దుఃఖం = గ్రామ్యసుఖము నందు అపేక్ష దుఃఖము; బంధమోక్షవిత్- పండితః = బంధము మోక్షము నెఱిగినవాడు పండితుడు.

తా. అపేక్ష లేమి లోనగు సద్గుణములు అలంకారము. కిరీటాదికము కాదు. సుఖ దుఃఖములను అనుసంధానము చేయనిది సుఖము. విషయ భోగాపేక్షయే దుఃఖము. అగ్ని దాహాదికము కాదు. బంధమోక్షము తెలిసినవాడు పండితుడు. కేవలము విద్వాంసుడు కాదు.

శ్లో. మూర్ఖో దేహాద్యహంబుద్ధిః పంథా మన్నిగమః స్మృతః,
ఉత్పథ శ్చిత్తవిక్షేపః స్వర్గః సత్త్వగుణోదయః. 42

అ. దేహాది- అహంబుద్ధిః = దేహాదికము నాది, నేను అను బుద్ధికలవాడు; మూర్ఖః = మూర్ఖుడు;మత్-నిగమః పంథాః=నన్ను పొందించు నివృత్తిమార్గము పంథ అగును. చిత్తవిక్షేపః ఉత్పథః = చిత్తమును చలింపఁజేయునది ఉత్పథ మగును. సత్త్వగుణ – ఉదయః స్వర్గః = సత్త్వగుణపు ఉద్రేకము స్వర్గమగును.

తా. దేహము నేను దేహాదులు నావి అను గుణములు గలవాడు మూర్ఖుడగును. మూతుడు కాడు. నన్ను పూర్తిగా ప్రాపింపఁజేయునది నివృత్తిమార్గము. సన్మార్గమగును. చిత్తమును చలింపఁజేయు ప్రవృత్తిమార్గము ఉత్పథమగును. చౌర్యాదికము కాదు. సత్త్వగుణోదయము స్వర్గమగును. ఇంద్రాదిలోకము కాదు.

శ్లో. నరక స్తమ ఉన్నాహో బంధు ర్గురు రహం సఖే,
గృహం శరీరం మానుష్యం గుణాఢ్యో హ్యాఢ్య ఉచ్యతే. 43

అ. తమ ఉన్నాహః = తమోగుణము యొక్క ఉద్రేకము; నరకః = నరకము, సఖే = ఓ మిత్రుడా ! బంధుః గురుః — అహం = గురువే బంధువు. అతడును నేనే.

ఏక ఏవ పరో బంధుః విషమే సముపస్థితే

గురుః సకలధర్మాత్మా యత్రాకించనగో హరిః.

అని జగద్గురువు విషమస్థితి సంభవించినపుడు గురువు ఒక్కడే ఉత్తమ బంధువు. సకల ధర్మాత్ముడు, భక్తాదులను రక్షించువాడు హరి యగును. గృహం = సాధనము; భోగా యతనమగు ఇల్లు, మనుష్యం శరీరం = మనుష్యరూపమగు శరీరమే గాని మేడలు మున్నగు వానితో కూడిన గృహము కాదు. గుణాఢ్యః ఆఢ్యః ఉచ్యతే హి = మంచి గుణములతో గూడినవాడు ఆఢ్యుడు. ధనాఢ్యుడు కాడు.

తా. తమోగుణము యొక్క ఉద్రేకము నరకమగును. తామిస్రాదికము కాదు. నేనే బంధుడను. గురువును భ్రాత్రాదులు కారు. భోగాయతనము సాధనము మానుషరూపమునగు శరీరము గృహమగును. హర్మ్యాదులు కావు. ధర్మాదిగుణసంపన్నుడు ఆఢ్యుడు. ధనవంతుడు కాడు.

శ్లో. దరిద్రో యస్త్వసంతుష్టః కృపణో యోఽజితేంద్రియః,
గుణేష్వసక్తధీ రీశః గుణసంగో విపర్యయః. **44**

అ. యః అసంతుష్టః, దరిద్రః = ఎవడు సంతుష్టి లేనివాడో, వాడు దరిద్రుడు; యః, అజితేంద్రియః కృపణః = ఎవడు జితేంద్రియుడు కాడో వాడు కృపణుడు. గుణేషు + అసక్తధీః ఈశః = విషయగుణములందు ఆసక్తి లేనివాడు ఈశుడు, గుణసంగః = గుణములందు ఆసక్తికలవాడు, విపర్యయః = అనీశుడు. ఇది సమాధి విపర్యయమునకు ఉపలక్షణముగా చెప్పబడినది.

తా. సంతృప్తి లేనివాడు దరిద్రుడగును. ధనహీనుడు కాడు. ఇంద్రియములను జయింపని వాడు శోచ్యుడు కృపణుడు. దీనుడు కాడు. విషయ గుణముల ఆసక్తి లేనివాడు ఈశ్వరుడు. స్వతంత్రుడు గుణములందు ఆసక్తి గలవారు ఇతరులు, అస్వతంత్రు లగుదురు.

శ్లో. ఏతే ఉద్ధవ తే ప్రశ్నాః సర్వే సాధు నిరూపితాః, **45**

తా. ఉద్ధవ ! నీ ప్రశ్న లన్నియును సమాధానములతో చక్కగా నిరూపింప బడినవి.

ఈ. ఈ సమస్తము గుణ దోషముల వివేకము కొరకు ఉద్ధవునిచే ప్రశ్నింపబడినవి. వానికి సంక్షేపముగా లక్షణము చెప్పుచున్నారు—

శ్లో. కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః,
గుణదోషదృశి ర్దోషః గుణస్తూభయవర్జితః. **46**

అ. గుణదోషయోః లక్షణం = గుణదోషముల లక్షణమును, బహునా వర్ణితేన కిం = ఎక్కువగా వర్ణించుటచే నేమి ప్రయోజనము. గుణ దోషముల లక్షణము ఇంతమాత్రమే

అగును. గుణదోషదృశిః = గుణదోషముల దర్శనము; దోషః = దోషమగును. ఉభయ వర్జితః గుణః = ఆ రెండింటిని విడచుట గుణమగును.

తా. గుణదోషముల స్వరూపమును మిక్కిలి వర్ణించుటచే నేమియు ప్రయోజనము లేదు. గుణదోషముల దర్శించుటయే దోషము; ఆ రెంటిని దర్శింపకుండుటయే గుణమగును.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే ఏకోనవింశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధమున పందొమ్మిదవ అధ్యాయము.

# వింశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

**వింశే యోగత్రయం ప్రోక్తం భక్తి జ్ఞానక్రియాత్మకమ్,**
**గుణదోష వ్యవస్థార్థ మధికారివిభాగతః.**

ఇరువదవ అధ్యాయమందు గుణదోష వ్యవస్థ కొఱకు అధికారి విభాగమును బట్టి భక్తి జ్ఞాన క్రియారూపములగు మూడు యోగములు చెప్పబడును

అవి. 'గుణదోషదృశి ర్దోషో గుణ స్తూభయవర్జితః' – అని చెప్పిన దానిని ఐదు శ్లోకములచే ఆక్షేపించుచున్నారు.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు పలికెను.

**శ్లో. విధిశ్చ ప్రతిషేధశ్చ నిగమో హీశ్వరస్య తే,**
**అపేక్షతేఽరవిందాక్ష గుణం దోషం చ కర్మణామ్. 1**

అ అరవిందాక్ష = ఓ పద్మనయనుడవగు దేవా! విధిః = చేయవలసిన విధిరూపమగు కర్మయు; ప్రతిషేధః చ = చేయదగని కర్మ నిషేధము తెల్పునది ఈశ్వరస్య తే = పరమేశ్వరుడవైన నీయొక్క; నిగమః హి = ఆజ్ఞారూపమైన వేదముకదా. ఆ వేదము; కర్మణాం గుణం దోషం చ అపేక్షతే = కర్మలయొక్క, గుణమును, దోషమును అనగా పుణ్యపాప ఫలరూపములను అపేక్షించును కదా.

తా. ఓ పద్మములవంటి నేత్రములు కలవాడా! విధిప్రతిషేధములను తెల్పునది పరమేశ్వరుడవైన నీయాజ్ఞారూపమైన వేదము. ఆ వేదము కర్మలయొక్క పుణ్యపాప ఫలములను స్వీకరించుచున్నది అనగా తెల్పుచున్నది.

సంధ్యావందనాదులు చేయుట విధి. సురాపానాదులు చేయకుండుట నిషేధము. మొదటి దాని వలన పుణ్యము, రెండవదానివలన పాపము కలుగునని యాజ్ఞారూపమగు వేదము తెల్పుచున్నది.

**శ్లో వర్ణాశ్రమవికల్పం చ ప్రతిలోమానులోమజమ్,**
**ద్రవ్యదేశవయఃకాలాన్ స్వర్గం నరకమేవ చ. 2**

అ వర్ణ-ఆశ్రమ వికల్పం చ = వర్ణములు, ఆశ్రమములు అనువాని భేదమును: ప్రతిలోమ-అనులోమ-జం = వర్ణముల అనుకూల ప్రతికూలముల వలన జనించిన జాత్యాదికమును, ద్రవ్య ...... కాలాన్ = ద్రవ్యము, దేశము, వయస్సు, కాలములను; స్వర్గం నరకం = స్వర్గము, నరకమును.

[illegible] సుగమము.

తా. [illegible] అధికారులైన వారికి వర్ణాశ్రమ భేదములును, వానిగుణ [illegible] ప్రతిలోమ, అనులోమ పద్ధతి ద్వారా జనించిన [illegible] చెప్పబడుచున్నది. ప్రతిలోమజాతి అనగా [illegible] పురుషుని వలన జనించిన సూత వైదేహకాదులు. [illegible] పురుషుని వలన హీనవర్ణుడగు స్త్రీలయందు జనించిన [illegible] వారు. వారికిని "అసత్సంతస్తు విజ్ఞేయాః ప్రతి [illegible]" [illegible] ప్రతిలోమ అనులోమ [illegible] జనించినవారు అసత్సంతతులని [illegible].

అవ. [illegible] ప్రయోజనము కల్గును? అందువలన [illegible].

శ్లో. గుణదోషభిదా దృష్టి మంతరేణ వచ స్తవ,
నిశ్శ్రేయసం కథం నౄణాం నిషేధవిధిలక్షణమ్. **3**

అ. నిషేధ విధి లక్షణం = నిషేధము, విధి అను రెండు రూపములగు కర్మకాండ; తవ వచః = నీ యొక్క మాట యగు వేదము; గుణదోషభిదా దృష్టిం అంతరేణ = గుణము, దోషము అను భేదదృష్టి లేక నౄణాం = మనుష్యులకు; నిశ్శ్రేయసం కథం = మోక్ష మెట్లు లభింపఁజేయును: గుణదోషభిదా దృష్టిం = గుణ దోష దర్శనము దోషమని నిరాకరించుట వలన గుణము దోషము అను భేద దృష్టి నిషేధ విధి లక్షణమైన కర్మకాండమును తవవ చః అంతరేణ = నీ వాక్కగు వేదము లేక, నౄణాం నిశ్శ్రేయసం కథం = నరులకు మోక్షము ఎట్లు కలుగును?

అందును శ్రోతవ్యము, మంతవ్యము ఇత్యాదిసాధన విధికి శ్లో. నానుధ్యాయేత్ బహూన్ ఛబ్దాన్ వాచో విగ్లా పనం హి తత్ = పెక్కు శబ్దములను ధ్యానించ కూడదు పలుక కూడదు. అది వాక్కునకు శ్రమ అగును. ఇయ్యది నిషేధము సాధనవిధికి ఆవశ్యక మగుట వలన లేక గుణదోష భేద దృష్టి లేక నిషేధ లక్షణమైన నీ వాక్కు లేక అని సామానాధి కరణ్యమైన కానిమ్ము. లేక గుణదోషభేద దృష్టి లేక నిషేధలక్షణమైన నీ వాక్కు వేదము. సర్వవేదమును మోక్షపరము అని అంగీకరించుట తత్త్వమస్యాది వాక్యము వలె నిశ్శ్రేయసపరమగును. అట్లే ఇది గుణము ఇది దోషము అను భేదదృష్టిలేనిదైన ఇది నిషేధము, ఇది విధి అనదగు కర్మకాండ రూపమైన నీ వాక్కగు వేదము నరులకెట్లు మోక్షము కల్గించునదగును?

తా. గుణదోష భేదదృష్టిలేక విధి, నిషేధ రూపమగు నీ వాక్కైన వేదమెట్లు నరులకు మోక్షము కలిగించును?

అవ. సర్వజ్ఞులగు పితరులు దేవతలు ఆరాధింప బడినవారై, ప్రత్యక్షముగా వచ్చి చూచి మనుష్యులకు అవిధినిషేధములను చెప్పగల రనగా కాదనుచున్నారు.

శ్లో. పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షు స్తవేశ్వర,
శ్రేయ స్త్వనుపలబ్ధేర్థే సాధ్యసాధనయో రపి.

అ. ఈశ్వర, హే ఈశ్వరా! పితృదేవ మనుష్యాణాం = పితరులకు, దేవతలకు, మనుష్యులకు, తవ వేదః = నీ వాక్కగు వేదము; శ్రేయః చక్షుః = ఉత్తమమైన చతురింద్రియము స్వరూపము, ప్రమాణము; అనుపలబ్ధే అర్థే = పొందబడని స్వర్గము, మోక్షము అను వానియందు, సాధ్యసాధనయోః అపి = సాధ్య సాధనములందు ఇది దీనికి సాధ్యము ఇది దీనికి సాధనము అని యిట్లు గుణదోషదృష్టి లేక నిశ్శ్రేయసము ఘటిల్లును.

తా. పితరులకు దేవతలకు మనుష్యులకు ఎల్లవారికి సన్నిహితములై పొందబడని స్వర్గమునకు మోక్షమునకు, సాధ్యసాధనములకు నీ వాగ్రూపమగు వేదము శ్రేష్ఠమగు చక్షురింద్రియమై యున్నది. పరమప్రమాణమై యున్నది. ఈస్వర్గ మోక్షాదులందును, సాధన వివేకమందును అని గుణదోషదృష్టి లేకున్న మోక్ష మెట్లు కలుగును ?

అవ. మఱియును శాస్త్రము చేతనే చెప్పబడిన భేదదృష్టికి, శాస్త్రమెట్లు నివర్తకమగునో చెప్పుచున్నారు—

శ్లో. గుణదోషభిదాదృష్టి ర్నిగమాత్తే న హి స్వతః,
నిగమేనాపవాదశ్చ భిదా యా ఇతి హ భ్రమః. 5

అ. తే నిగమాత్ = నీ అజ్ఞారూపమైన వేదము వలననే, గుణదోషభిదాదృష్టిః = గుణదోషముల భేద దర్శనము చెప్పబడినది, స్వయముగా; స్వతః = నిగమేన, అపవాదశ్చ = ఆ నీ వాక్కు చేతనే అందుకు అపవాదముగా గుణదోష దర్శనము పని లేదు అన్నచో, యా భిదా భ్రమః ఇతి హ = ఏది భేదమో అది భ్రమ యగును. ఏ అర్థము పొందదగినదో దానిని నివర్తించిన భేదము భ్రమ యగును.

తా. స్వయముగా గాక నీ వాగ్రూపమైన వేదము వలన గుణదోష భేదదర్శనము చెప్పబడి తెలియవచ్చెను. ఆవేదము చేతనే గుణదోషదర్శనము పని లేదను అపవాదము చెప్పుట వలన ఒక్కవేదమే భేదమును తన్నివర్తనమును ఎట్లు చెప్పునని భ్రాంతి కల్గుచున్నది. దేనిచే అర్థమును పొందుట, నివర్తించుట చెప్పబడినదో అది స్పష్టముగా భ్రమయగును. దానిని వచింపుము.

శ్రీ భగవానువాచ — శ్రీభగవానుడు వచించెను.

అవ. విషయభేదము లేకున్నను అధికారి భేదముచే అవిరోధమును చెప్పుటకై ప్రథమమున యోగత్రయమును చెప్పుచున్నారు.

శ్లో. యోగా స్త్రయో మయా ప్రోక్తా నృణాం శ్రేయోవిధిత్సయా,
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయోఽన్యోఽస్తి కుత్రచిత్. 6

అ. నృణాం శ్రేయః విధిత్సయా = నరులకు శ్రేయస్సు లేక మోక్షసాధనేచ్ఛచే; జ్ఞానం కర్మ చ. భక్తిశ్చ = జ్ఞానము, నిష్కామకర్మ, భక్తి యని; యోగాః త్రయః = యోగములు మూడు. (ఉపాయములు మూడు బ్రహ్మకాండ, కర్మకాండ, దేవతాకాండ): మయా ప్రోక్తాః = నాచే చెప్పబడినవి. అన్యః ఉపాయః న కుత్రచిత్ = వీనికంటె మోక్షసాధనోపాయము ఎందును లేదు. అని కామ్యకర్మమును నిషేధించుచున్నారు. అది పై అధ్యాయమందు స్పష్టమగును;

[illegible] కోరికతో నేను జ్ఞానము, నిష్కామకర్మ, భక్తి [illegible] కర్మకాండ, దేవతాకాండ అని మూడు చెప్పియున్నాను. [illegible] ఉపాయము అన్యమెందును లేదు.

[illegible] రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో.** నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు
తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినామ్. **7**

**అ.** [illegible] = ఈ జగత్తునందు, — **మూడు ఉపాయముల లోపల;** కర్మసు నిర్విణ్ణానాం = [illegible] దుఃఖబుద్ధిచే వాని ఫలములందు విరక్తులైన; న్యాసినాం = **వానికి సాధన భూతము** లైన కర్మలను త్యజించిన వారికి; జ్ఞానయోగః = జ్ఞానయోగము సిద్ధిప్రదమగును; **తేషు అనిర్విణ్ణ** చిత్తానాం = ఆ కర్మలందు దుఃఖబుద్ధి శూన్యులై; కామినాం = ఆ కర్మ ఫలములందు [illegible] లేనివారికి, [illegible] వారికి; కర్మయోగః = కర్మయోగము సిద్ధిప్రదమగును.

**తా.** [illegible] దుఃఖబుద్ధితో విరక్తులై ఆ కర్మలను త్యజిం [illegible] సిద్ధిప్రదమగును. ఆ కర్మలందు, దుఃఖబుద్ధి లేనివారికి, తత్ఫ [illegible] ఫలప్రదమగును.

**శ్లో.** యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః. **8**

**అ.** యదృచ్ఛయా = అపూర్వ భాగ్యోదయముచే; మత్కథాదౌ = నా చరిత్రాదు లందు; జాతశ్రద్ధః తు = జనించిన శ్రద్ధ కలవాడు; యః పుమాన్ = **ఏ పురుషుడు కలడో;** న నిర్విణ్ణః తు = కర్మలందు విరక్తుడు కాడో కర్మఫలములందు **అభిలాషి కాడో;** అస్య = వీనికి; భక్తియోగః సిద్ధిదః = భక్తియోగము సిద్ధిప్రదము.

**తా.** [illegible] ప్రవర్తించు వానికి పూర్తిగా విధిప్రతిషేధాధికార ముం [illegible] చెప్పబడును. నిష్కామ కర్మయోగాధికారికి మాత్రము యథా [illegible] విధిప్రతిషేధము [illegible]. అదియు జ్ఞానయోగ భక్తియోగముల యందే. వానియందు [illegible] విధిప్రతిషేధములు స్వల్పము. వానిచే సిద్ధులైన వారికి విధి ప్రతిషేధము కించిత్తును లేదు.

అపూర్వమగు భాగ్యోదయముచే ఏ పురుషుడు నాకథలందు శ్రద్ధ జనించిన వాడగునో వాడు కర్మయందు విరక్తుడు. కర్మఫలములందును రక్తుడును కాడు. అట్టివానికి భక్తి యోగము సిద్ధిప్రదమగును.

అవ. అవధితో గూడిన కర్మయోగమును చెప్పుచున్నారు.

**శ్లో.** తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా
మత్కథాశ్రవణాదౌ చ శ్రద్ధా యావన్న జాయతే. **9**

అ. యావతా-న-నిర్విద్యేత = ఎంతవరకు నిర్వేదమును పొందడో; తావత్ కర్మాణి కుర్వీత = అంతకాలము కర్మలను చేయవలెను; యావత్ మత్కథాదౌ వా = ఎంతవరకు నా కథాదికము నందు గాని, శ్రద్ధా న జాయతే = శ్రద్ధ జనించదో అంతవరకు కర్మలను చేయవలసియుండును.

శ్లో. స్వధర్మస్థో యజన్ యజ్ఞై రనాశీఃకామ ఉద్ధవ!
న యాతి స్వర్గనరకౌ యద్యన్య న్న సమాచరేత్. **10**

అ. ఉద్ధవ! స్వధర్మస్థః = తన వర్ణాశ్రమమునం దుండువాడై; అనాశీః కామః = ఫలకాముడు గాక; యజ్ఞైః యజన్ = యజ్ఞములతో యజించుచు; అన్యత్ న సమాచరేత్-యది = ఇతరము నరక సాధనము నాచరించని వాడైన యెడల రెండు విధములుగ విహితాతిక్రమణము వలననైనను, నిషిద్ధాచరణము వలననైనను నరకము కల్గును. ఇతడు స్వధర్మమునందున్నవాడగుట వలన నిషిద్ధమును వర్జించుటవలన నరకమును పొందడు.

తా. తన వర్ణాశ్రమమందు ప్రవర్తించుచు, ఫలకాముడు గాక, యజ్ఞములను యజించుచు, నిషిద్ధ కర్మను కామ్యకర్మను చేయనివాడు స్వర్గమును పొందడు. నరకమును పొందడు.

శ్లో. అస్మిన్ లోకే వర్తమానః స్వధర్మస్థోఽనఘః శుచిః
జ్ఞానం విశుద్ధ మాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా. **11**

అ. అస్మిన్ లోకే వర్తమానః = ఈ లోకమందు. ఈ దేహమందు వర్తించువాడు; స్వధర్మస్థః = తన వర్ణాశ్రమోచిత ధర్మమున నుండుచు, అనఘః = నిషిద్ధ త్యాగమున పాపరహితుడు; శుచిః = నివృత్తమలుడై; విశుద్ధం జ్ఞానం ఆప్నోతి = శుద్ధ సత్త్వమగు జ్ఞానమును పొందును లేక; యదృచ్ఛయా = అప్రయత్నముగనే; మద్భక్తిం వా ఆప్నోతి = నా భక్తినైన పొందును. కేవలజ్ఞానము కంటె భక్తి దుర్లభమని భక్తి తోపించుచున్నాడు.

తా. ఈ లోకమునందే ఉండుచు, స్వధర్మమున వర్తించుచు, నిషిద్ధ కర్మత్యాగమున, పాపరహితుడై రాగాది మలములు నివర్తించుటచే శుచియైనవాడు విశుద్ధమైన జ్ఞానమును పొందుచున్నాడు. లేక అప్రయత్నముగనే నా భక్తిని తప్పక పొందుచున్నాడు.

అవ. ఈ ప్రకారము జ్ఞాన భక్తి సాధనమైన నరదేహమును స్తుతించుచున్నారు.

శ్లో స్వర్గిణోఽప్యేత మిచ్ఛంతి లోకం నిరయిణ స్తథా
సాధకం జ్ఞానభక్తిభ్యాం ఉభయం తదసాధకమ్. **12**

అ. స్వర్గిణః అపి = స్వర్గలోకవాసులును; తథా నిరయిణః = నరకవాసులు కూడ జ్ఞానభక్తిభ్యాం సాధకం = జ్ఞానభక్తుల కొఱకు సాధకమైన. ఏతం లోకం ఇచ్ఛంతి = ఈలోకమును కోరుదురు; ఉభయం = ఆ స్వర్గ నరకములు రెండును; తద్-అసాధకం = ఆ జ్ఞాన భక్తులకు సాధకములు కావు.

తా. స్వర్గమున వసించు దేవతలును, నరకమున నివసించు నారకులును, జ్ఞానమునకు భక్తికి సాధకమైన ఈ భూలోకమును వాంఛింతురు. దేవతలున్న స్వర్గముగాని నారకులున్న నరకలోకము గాని ఈ రెండు. ఆ జ్ఞానభక్తులకు సాధకములు కానేరవు.

శ్లో. న నరః స్వర్గతిం కాంక్షేత్ నారకీం చ విచక్షణః
నేమం లోకం చ కాంక్షేత, దేహావేశాత్ప్రమాద్యతి. **13**

అ. విచక్షణః నరః = పండితుడైన నరుడు; స్వర్గతిం న కాంక్షేత్ = స్వర్గలోకభోగము కోరరాదు. నారకీం చ = నరకలోక పీడనము గాని కోరవలదు. ఇమం లోకం న కాంక్షేత = ఈ భూలోకమును కోరరాదు. దేహ ఆవేశాత్ ప్రమాద్యతి = దేహాసక్తి వలన ప్రమాదమును; అవధాన శూన్యమును; జాగ్రత్తలేమిని పొందును.

తా. వివేకవంతుడగు నరుడు నరకము వలె స్వర్గమును సైతము కాంక్షింపరాదు. ఈ లోకమును గూడ కాంక్షింపరాదు. ఏలయన దేహాదికమునందు ఆసక్తుడై ప్రమాదమును పొందును. కర్తవ్యమును మఱచును.

శ్లో. ఏతద్విద్వాన్ పురా మృత్యోః రభవాయ యతేత సః
అప్రమత్త ఇదం జ్ఞాత్వా మర్త్యమ ప్యర్థసిద్ధిదమ్. **14**

అ. ఏతద్ విద్వాన్ = మఱి ఏమనగా ఈ దేహము అర్థ సాధకమని ఎఱింగినవాడై, సః = అతడు; మృత్యోః పురా = మృత్యువు రాకపూర్వమే; అభవాయ = మోక్షము కొఱకు; యతేత = ప్రయత్నింపవలెను. మఱియు; ఇదం మర్త్యం అపి = ఈ శరీరము మరణ ధర్మము గలదైనను; అర్థసిద్ధిదం జ్ఞాత్వా = మోక్షపురుషార్థ సిద్ధిప్రదమని ఎఱింగి అప్రమత్తః = ఆసక్తిలేని వాడై యత్నింపవలెను.

తా. ఈ దేహము అర్థ సాధకమనియు, మరణధర్మము గలదైనను, పరమ పురుషార్థమగు మోక్షసిద్ధికి మూలమనియు, నెఱింగి అప్రమత్తుడై, ఈ దేహమందు అత్యంతాభిమాని గాక, మృత్యువు రాకముందే మోక్షమునకు యత్నింపవలెను.

శ్లో. ఛిద్యమానం యమైరేతైః కృతనీడం వనస్పతిం
ఖగ స్స్వకేత ముత్సృజ్య క్షేమం యాతి హ్యలంపటః. **15**

అ. యమైః ఏతైః = యముని వంటి నిర్దయులైన పురుషులచే; ఛిద్యమానం = ఖండింపబడుచున్నదియు కృతనీడం వనస్పతిం = తాను గూడు కట్టుకొని యున్న చెట్టును; స్వకేతం = తనకాశ్రయమైన దానిని; ఉత్సృజ్య = విడచి; అలంపటః ఖగః = ఆసక్తిలేనిదె పక్షి, క్షేమం యాతి హి = క్షేమమును పొందుచున్నది.

తా. యమునివలె కఠినాత్ములైన పురుషులు వచ్చి ఖడ్గాదులతో తాను గూడు కట్టుకొని, నివసించుచున్న వృక్షమును, తన కాశ్రయమైన దానిని నఱుకు చుండగా చూచి, అప్పుడు పక్షి ఆ వృక్షమునందు ఆసక్తి లేనిదై, దానిని వీడి, తనకు క్షేమంకర మైన మఱియొక స్థానమును పొందుచున్నది.

శ్లో. అహోరాత్రై శ్ఛిద్యమానం బుద్ధ్వాయు ర్భయవేపథుః
ముక్తసంగః పరం బుద్ధ్వా నిరీహ ఉపశామ్యతి. **16**

అ. అహోరాత్రైః = పగలు, రాత్రులచే; ఛిద్యమానం = ఖండింపబడుచున్న; ఆయుః బుద్ధ్వా = ఆయువు నెఱింగి, ముక్తసంగః = సంగము విడి, పరం బుద్ధ్వా = పరమేశ్వరు నెఱింగి; నిరీహః ఉపశామ్యతి = వాంఛలు లేనివాడై, పరమ శాంతిని పొందుచున్నాడు.

తా. అహోరాత్రములచే నెడ తెగక, ఛేధింపబడుచున్న క్షీణింపబడుచున్న తన ఆయువు నెఱింగి, తనకు మృత్యువు సన్నిహిత మగుచున్నదని భీతిచే వణంకు గలవాడై, విషయ భోగములం దసంగము గలవాడై, పురుషుడు ఆ పరమేశ్వరు నెఱింగి, కోరికలు లేనివాడై పరమ శాంతిని పొందుచున్నాడు.

అవ. ఇట్లు ప్రయత్నము చేయక ప్రమత్తుడైన వానిని నిందించు చున్నాడు.

శ్లో. నృదేహ మాద్యం సులభం సుదుర్లభం ప్లవం సుకల్పం గురుకర్ణధారం
మయానుకూలేన నభస్వతేరితం పుమాన్ భవాబ్ధిం న తరేత్స ఆత్మహా. **17**

అ. ఆద్యం = సర్వఫలములకు మూలము; సులభం = దీనిచే నార్జించిన కర్మలచే సర్వమును ప్రాప్తింపఁ జేయబడునదియు, సుదుర్లభం = కోటిఉద్యమములచే ప్రాపింప శక్యము గానిదియు; సులభం = యదృచ్ఛచే లభించుట వలన సులభమును, సుకల్పం = పటుతరమైనది; గురుకర్ణధారం = ఆశ్రయించినంత మాత్రమున నావికుడగు గురువు కలదియు; ప్లవం = సంసార సాగరమును దాటించు తెప్ప అయిన, నృదేహం = నరుని శరీరమును, అనుకూలేన = స్మరించినంతమాత్రమున అనుకూలుడైన; మయా నభస్వతా = నేనను వాయువుచే; ఈరితం = నడుపబడిన దానిని గ్రహించి; ఆత్మహా పుమాన్ = ఆ పురుషుడు ఆత్మఘాతుకుడు; న భవాబ్ధిం తరేత్ = సంసారసాగరమును దాటలేకున్నాడు.

తా. సర్వఫలములకు మూలమై కోటిప్రయత్నములు చేసినను లభింపనిదై స్వప్రయత్నము లేక లభించినది గనుక సులభమై, దృఢతరమైనదై, ఆశ్రయించిన మాత్రమున కరుణించు గురువను నావికుడు గలదై, తెప్పయైన మానవ శరీరమును, స్మరణమాత్రమున అనుకూలుడైన నేనను వాయువుచే ప్రేరేపింపబడిన మానవ శరీరమును పొంది, ఏ పురుషుడు సంసారసాగరమును తరింపడో వాడు, ఆత్మఘాతుకు డగుచున్నాడు.

అవ. ఈ ప్రకారము ఇంతవరకు, విరక్తుడు గానివారికి, వైరాగ్యము ద్వారా, జ్ఞాన భక్తి సాధకమగు కర్మయోగము చెప్పి, ఇపుడు చక్కగ విరక్తుడైన వానికి, జ్ఞానయోగము, ఆజ్ఞానప్రాప్తికి పూర్వము కర్తవ్యమును, వర్జనీయమును తొమ్మిదిన్నర శ్లోకములచే చెప్పు చున్నారు.

శ్లో. యదారంభేషు నిర్విణ్ణో; విరక్తస్సయంతేంద్రియః
అభ్యాసే నాత్మనో యోగీ, ధారయే దచలం మనః, **18**

అ. యదా = ఎప్పుడు; ఆరంభేషు నిర్విణ్ణః = ఆ కర్మములందు దుఃఖదర్శనముచే ఉద్విగ్నుడై; విరక్తః = ఆ ఫలములందును; విరక్తుడై; సంయత-ఇంద్రియః = ఇంద్రియములను సంయమనము చేసినవాడు; ఆత్మనః అభ్యాసేన = పరమాత్మ విషయవృత్తిసంతతిచే; పరమాత్మ ధ్యాన సంతానముచే, మనః అచలం ధారయేత్ = మనస్సును నిశ్చలముగా ధరింపవలెను.

తా. వైరాగ్యమును, ఆకర్మ ఫలములందును, ఎప్పుడును దుఃఖదర్శనముచే కలత చెందినవాడును, విరక్తుడును అగును, అప్పుడు ఇంద్రియములను నిరోధించి, పరమాత్మ ధ్యాన యోగమునందు, మనస్సును నిశ్చలముగా ధరింపవలెను.

అవ. అట్లయినచో మనస్సును నిశ్చలముగా నిలుపుట సాధ్యము కాదు కనుక తత్స్వభావ మును బట్టి నిరోధింపవలెనని చెప్పుచున్నారు.

శ్లో. ధార్యమాణం మనో యర్హి, భ్రామ్య దాశ్వనవస్థితం,
అతంద్రితోఽనురోధేన మార్గే ణాత్మవశం నయేత్. **19**

అ. యర్హి = ఎప్పుడు; ధార్యమాణం మనః = అభ్యాసమున ధరింపఁబడుచున్న మనస్సు అనవస్థితం = స్థిరముగా నిలువనిదై; ఆశు-భ్రామ్యత్ = శీఘ్రముగా చలించున దగునేని, అప్పుడు; అతంద్రితః = సంభ్రమము లేనివాడై, అనురోధేన మార్గేణ = అనుకూలమగు ఇంచుక అపేక్షను తీర్చుట ద్వారా; ఆత్మవశం నయేత్ = తనకు వశముగా పొందింపవలెను.

తా. అప్పుడు అభ్యాసవశమున ధరింపబడుచున్న మనస్సు ఎప్పుడు వడి వడి తిరుగుచున్నదో, నిలకడ గాంచదో, అప్పుడు యోగి తొందర పడక, అనుకూలమగు నపేక్షను లభింపజేయునట్టి మార్గముద్వారా, మనస్సును తనవశము చేసికొనవలెను.

అవ. పూర్వోక్తమునందే మనస్సు చంచలమగుచో నెట్లు అనగా నందుకు చెప్పుచున్నారు—

శ్లో. మనోగతిం న విసృజేత్ జితప్రాణో జితేంద్రియః,
సత్త్వసంపన్నయా బుద్ధ్యా మన ఆత్మవశం నయేత్. **20**

అ. మనోగతిం న విసృజేత్ = మనస్సు పోకడను విడచిపెట్టకూడదు; జితప్రాణః జితేంద్రియః = ప్రాణాయామముచే ప్రాణవాయువును వశము చేసికొన్నవాడై, ఇంద్రియములను జయించి. సత్త్వసంపన్నయా బుద్ధ్యా = సత్త్వగుణ సంపన్నమైన బుద్ధిచే; మనః = మనస్సును; ఆత్మవశం నయేత్ = ఆత్మను లక్షించునదిగా చేయవలెను.

తా. ఎప్పుడుగాని, మనోగమనమును గూర్చి ఉపేక్ష వహింపరాదు. అప్రమత్తుడై, దానిని లక్షింపవలెను. ప్రాణాయామముచే ప్రాణములను వశము చేసి, ఇంద్రియములను జయించిన వాడై, సత్త్వగుణ సంపన్నమైన బుద్ధిచే ఆ మనస్సును ఆత్మవశము గావింపవలెను.

అవ. అనురోధమార్గమును దృష్టాంతసహితముగా స్తుతించుచున్నారు—

శ్లో. ఏష వై పరమో యోగో మనస స్సంగ్రహః స్మృతః,
హృదయజ్ఞత్వ మన్విచ్ఛన్ అదాంత స్యార్వతో యథా. **21**

అ. ఏషః వై = ఇదియే; మనసః సంగ్రహః = అనుకూలమార్గమున మనస్సును సంగ్ర హించుట; పరమః యోగః స్మృతః = ఉత్తమమైన యోగ మని చెప్పబడినది. యోగ సాధన మగుట వలన ఉపచారముచే నిదియే యోగమని స్తుతి; యథా = ఏ ప్రకారము, అదాంతస్య

అర్వతః = శిక్షణ పొందని అశ్వము యొక్క; హృదయజ్ఞత్వం = స్వాభిప్రాయమగు దాని పోకను; అన్విచ్ఛన్ = అపేక్షించుచు, అశ్వశిక్షకుడు ప్రథమమున ఇంచుక గుఱ్ఱము ననువర్తించును, అప్పుడు కళ్ళెముచే దానిని నిల్పియే పోవుచున్నాడో అట్లే.

తా. మఱియొక శ్రమశిక్షణము గాంచని గుఱ్ఱము నెక్కిన రౌతు దాని యభిప్రాయము ననుసరించి దాని కళ్ళెమును పట్టికొని కొంతదూరము దానిని పోనిచ్చుచు, మెల్లగ ఎట్లు వశము చేసికొనుచున్నాడో, అట్లే మనస్సును చక్కగా లోగొనవలెను. ఇది పరమము జ్ఞానమార్గము.

అవ. ఈ ప్రకారము ఇంచుక వశీకృతమైన మనస్సున కత్యంత నిశ్చలత్వమున కుపాయములను మూడు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. సాంఖ్యేన సర్వభావానాం ప్రతిలోమానులోమతః,
భవాప్యయా వనుధ్యాయే న్మనో యావ త్ప్రసీదతి. 24

అ. సాంఖ్యేన = తత్త్వముల యొక్క వివేకముచే; సర్వభావానాం = మహాత్తత్వము మొదలు దేహపర్యంతమున్న తత్త్వముల యొక్క; ప్రతిలోమ-అనులోమతః = అనులోమ ప్రకారము ప్రకృతి మొదలు మహదాదిక్రమమున, జగము ప్రాణి సముదాయము జనించు క్రమమును, ప్రతిలోమక్రమము పృథివ్యాదిక్రమమున ప్రపంచ లయము; భవ-అప్యయౌ = ప్రకృతిక్రమమున జన్మము (అనులోమము) పృథివ్యాది క్రమమున లయము (ప్రతిలోమము) లను, మనః యావత్ ప్రసీదతి = మనస్సు ఎంతవఱకు ప్రసన్నమగునో అంతవరకు; అను ధ్యాయేత్ = ధ్యానింపవలెను.

అవ. ఉపాయసహస్రములచేనైనను మనస్సు విషయాకారత్వమును త్యజింపదు. మఱల నుపదేశించుటవలన నేమి ప్రయోజనము? దానికి చెప్పుచున్నారు.

శ్లో. నిర్విణ్ణస్య విరక్తస్య పురుష స్యోక్త వేదినః,
మన స్త్యజతి దౌరాత్మ్యం చింతిత స్యానుచింతయా. 23

అ. నిర్విణ్ణస్య = ఆగమాపాయములు, రాకపోకలు, జన్మమరణములు గల దేహమందు అవధిభూతమైయున్న, ఆత్మదర్శనమున, దాని వివేకము తెలిసి సంసారమునందు ఉద్విగ్నుడై; విరక్తస్య = భోగములందు విరక్తుడై, ఉక్తవేదినః = గురూపదేశమైన అర్థము నెఱింగి చింతించు ఆలోచన కలవాడైన; పురుషస్య మనః = పురుషుని యొక్క మనస్సు; అను చింతయా = మాటిమాటికి చింతించుట చేత; దౌరాత్మ్యం త్యజతి = దేహాద్యభిమానమును త్యజించుచున్నది.

తా. జననమరణములను పొందు దేహములందు అవధిభూతమైన ఆత్మను దర్శించుట ద్వారా వానియందు అసహ్యము పొందినవాడై భోగములందు విరక్తి పొంది గురు వుపదేశించిన పరమార్థ మెఱింగిన పురుషుని మనస్సు గురూపదేశమును పలుమార్లు చింతించుటచే దేహాద్యభిమానమును త్యజించుచున్నది.

శ్లో. యమాదిభి ర్యోగపథై రాన్వీక్షిక్యా చ విద్యయా
మమార్చోపాసనాభి ర్వా నాన్యై ర్యోగ్యః స్మరే న్మునిః. 24

అ. యమాదిభిః = యమములోనగు; యోగపథైః = యోగమార్గములచేతను; ఆన్వీక్షిక్యా విద్యయా = తత్త్వవిచారాత్మకమైన బ్రహ్మవిద్య చేతను, (మమ) అర్చన-ఉపాసనాభిః వా = పూజ ధ్యానములచేతగాని; యోగ్యః = యోగ్యుడనైన పరమాత్మనగు నన్ను; మునిః స్మరేత్ = ముని స్మరింపవలెను; న అన్యైః = ఇతర మార్గములచే ఇతరమును చేయరాదు.

తా. యమాదులగు యోగమార్గములచేతను, తత్త్వపదార్థమును శోధించు బ్రహ్మవిద్య చేతను, నన్ను పూజించి యుపాసించుటచేతను, పరమాత్మనగు నన్ను ముని స్మరింపవలెను. ఇతర మార్గములచే ఇతర మేదియు చేయరాదు.

అవ. పాపము సంభవించినచో ప్రాయశ్చిత్తకర్మ చేయవలసినదే. అందులకు చెప్పు చున్నారు.

శ్లో. యది కుర్యా త్ప్రమాదేన యోగీ కర్మ విగర్హితం
యోగేనైవ దహే దంహో నాన్య త్తత్ర కదాచన. 25

అ. యోగీ = జ్ఞాని; ప్రమాదేన = పొరపాటున; విగర్హితం కర్మ, కుర్యాత్-యది = నింద్యమైన కర్మ చేసిన యెడల; యోగేన-ఏవ = జ్ఞానాభ్యాసము చేతనే, అంహః దహేత్ = పాపమును దహింపవలెను; కదాచన = ఒకప్పుడును; అన్యత్ న కుర్యాత్ = వేఱొకటి చేయరాదు

తా. యోగి ప్రమాదవశమున నేదేని నింద్యకర్మను చేసినవా డగునేని, జ్ఞానాభ్యాసము చేతనే ఆ పాపము దహింపవలెను. ఇట్లు చెప్పుట భక్తుడు భగవన్నామ సంకీర్తనము చేతనే పాపమును దహించును అన్యాయమునకుపలక్షణము. ఎల్లప్పుడును జ్ఞాని కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తము చేయవలయు.

అవ. ఏయేవి నిషిద్ధమైన నైమిత్తికమగు కర్మ సత్త్వ శోధకమగుటవలన గుణమగును. హింసాదులు ఆసక్తిహేతుకములగుట వలన దోష మగును. అందు ఆ దోషమును నివర్తింపజేయు తపమునందే కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తము గుణమని విధిప్రతిషేధములచే చెప్పబడినందున ప్రాయశ్చిత్తములేక యోగముచేతనే పాప మెట్లు దహింపనగు ననగా అందుకు చెప్పుచున్నారు.

శ్లో. స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః
విపర్యయస్తు దోషః స్యాత్ ఉభయో రేష నిశ్చయః. 26

అ. స్వే-స్వే-అధికారే = తమ తమ అధికారమందు, వర్ణాశ్రమాధికారమందు; యా నిష్ఠా = ఏ కర్మనిష్ఠ, జ్ఞాననిష్ఠ చెప్పబడినదో, సః గుణః పరికీర్తితః = అది గుణమని చెప్ప బడినది; విపర్యయః తు దోషః స్యాత్ = అందుకు విపరీతము దోషమగును; ఉభయోః = గుణ దోషముల యొక్క; ఏషః నిశ్చయః = ఇది నిశ్చయము.

తా. తమ తమ వర్ణాశ్రమాధికారమునం దేది ధర్మనిష్ఠయని చెప్పబడినదో అది వారికి గుణమని చెప్పబడినది. అందుకు విపరీతము దోషమగును. ఇది దోషగుణముల నిర్ణయ మగును.

అవ. దాని నుపపాదించుచున్నారు. ఎందువలన. విధినిషేధములచే, గుణ దోష విధానముచే కర్మలయొక్క నియమము సంకోచము చేయబడినదో చెప్పుచున్నారు.

**శ్లో. కర్మణాం జాత్యశుద్ధానా మనేన నియమః కృతః,**
**గుణదోషవిధానేన సంగానాం త్యాజనేచ్ఛయా. 27**

అ **జాతి–అశుద్ధానాం = ఉత్పత్తిచేతనే అశుద్ధములైన, (ప్రాప్తములైనవి కావు) కర్మణాం = కర్మలయొక్క; సంగానాం = సంగములయొక్క; త్యాజన-ఇచ్ఛయా = వీడవలెనను ఇచ్ఛచే; అనేన గుణదోష విధానేన = ఇది గుణము, ఇది దోషము అను విధానము చేత; నియమః కృతః = నియమము చేయబడినది.**

దీని భావ మిది. పురుషునకు అశుద్ధి అనునది ప్రవృత్తిమార్గము కంటె అన్యములేదు. స్వాభావిక ప్రవృత్తి చేతనే, అతడు మలిను డగుట వలన, సర్వకర్మలనివృత్తి శీఘ్రముగా చేయశక్యముకాదు. కావున కర్తవ్యమిది కాదు, ఇదియే కర్తవ్యము అని స్వాభావిక ప్రవృత్తిని సంకోచించుట ద్వారా దీని నివృత్తియే చేయబడుచున్నది. ఆ ప్రకారము వేదము ప్రవృత్తి పరముకాదు. ఆ విధమును ఉత్తరాధ్యాయ మందు చెప్పగలము. "ఉత్పత్త్యై నహి కామేషు" ఇందువలన, యోగికి స్వాభావిక ప్రవృత్తి లేనందున ప్రాయశ్చిత్తాది విధి గోచరము కాదు.

తా. పుట్టుక చేతనే, అనిత్యఫలముల నొసంగు కర్మలును దుఃఖములిచ్చు విషయ సంగాదులను వీడవలెనను ఇచ్ఛచే ఇది గుణము ఇది దోషము అను ఈ మార్గమున నియమ మేర్పడినది.

**శ్లో. జాతశ్రద్ధో మత్కథాసు, నిర్విణ్ణోఽన్యేషు కర్మసు,**
**వేద దుఃఖాత్మకాన్ కామాన్, పరిత్యాగే ఽప్యనీశ్వరః. 28**

**అ. మత్కథాసు, జాతశ్రద్ధః = నా కథలందు జనించిన శ్రద్ధకలవాడును, అన్యకర్మసు నిర్విణ్ణః = ఇతర కర్మలందు ఉద్విగ్నుడు, వాని ఫలములందు విరక్తుడు కాడు, పరిత్యాగే, అనీశ్వరః అపి = కామ పరిత్యాగమందు అశక్తుడైనను, కామాన్ దుఃఖాత్మకాన్** వేద **= విషయ సుఖములను దుఃఖస్వరూపములుగా నెఱుంగుచున్నాడు.**

తా. నా కథలను శ్రవణము చేయుటయందు శ్రద్ధగలవాడును, ఇతర క్రియలందు మనస్సు పోనివాడును, వాని ఫలములందు విరక్తుడు గాక, కామ పరిత్యాగము నందు అశక్తుడయ్యును, ఇంద్రియ సుఖములగు కామములను దుఃఖ స్వరూపములని ఎఱుంగు చున్నాడు.

అవ. ఇట్టివా డెవ్వడు, శ్రద్ధాళువై, భక్తిచే సర్వ మగునని దృఢనిశ్చయము గలవాడై తర్వాత నన్ను ప్రీతితో భజించెనేని, విషయసుఖములను సేవించువాడయ్యు, వాని యందు ప్రీతి నొందరా దనుచున్నారు.

శ్లో. తతో భజేత మాం భక్త్యా శ్రద్ధాళు ర్దృఢనిశ్చయః,
జుషమాణశ్చ తాన్ కామాన్, దుఃఖోదర్కాంశ్చ గర్హయన్. **29**

అ. తతః = అటుపిమ్మట. శ్రద్ధాళుః = శ్రద్ధ గలవాడై; దృఢ నిశ్చయః = గట్టి నిశ్చయము గలవాడై, మాం భక్త్యా భజేత = నన్ను భక్తితో భజింపవలెను; దుఃఖ-ఉదర్కాన్ = ఉత్తరకాలమున దుఃఖము నొసగువానినిగా; గర్హయన్ = నిందించుచు; తాన్ కామాన్ జుషమాణః = ఆ కామసుఖములను సేవించుచున్న వాడై.

తా. అటుపిమ్మట శ్రద్ధగలవాడు, దృఢనిశ్చయము గలవాడు, ఉత్తరకాలమున దుఃఖము కలిగించు విషయసుఖములను అనుభవించుచు, వానిని నిందించుచు, నన్ను భక్తితో భజింపవలెను.

అట్లు ఎట్లు భజింపవలెను? దానివలన ఏమగును? అనగా చెప్పుచున్నారు.

శ్లో. ప్రోక్తేన భక్తియోగేన భజతో మాం సకృన్మునేః,
కామా హృదీయా నశ్యంతి, సర్వే మయి హృది స్థితే. **30**

అ. ప్రోక్తేన భక్తియోగేన = పూర్వము చెప్పిన భక్తియోగముచే; సకృత్ = ఒక్కసారియైనను; మాం భజతః మునేః = నన్ను భజించు మునికి; హృదీయాః కామాః సర్వే = హృదయమందు నెలకొన్న కామములన్నియు; మయి హృది స్థితే = నేను హృదయమున ఉండియుండగా; నశ్యంతి = నశించుచున్నవి.

తా. నేను చెప్పిన భక్తియోగమార్గమున నన్ను ఒక్కమారైనను, భజించుచున్న యోగికి, నేను హృదయమందు ఉండి యుండగా, వాని హృదయమందలి కామము లన్నియు నశించుచున్నవి.

శ్లో. భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే సర్వకర్మాణి మయి దృష్టే ఽఖిలాత్మని. **31**

అ. అఖిలాత్మని మయి దృష్టే సతి = సర్వాత్మస్వరూపుడగు నేను గనుపట్టినవాడను కాగా; హృదయగ్రంథిః = హృదయమను గ్రంథి, అహంకారము; భిద్యతే = భేదింపబడుచున్నది; సర్వసంశయాః = ఎల్ల సంశయములు, తత్పూర్వకములైన అసంభావనాదులు; ఛిద్యంతే = విచ్ఛిన్నము లగును; అస్య కర్మాణి క్షీయంతే = సంసార హేతుకములగు వీని అనారబ్ధకర్మలు క్షీణించును

తా. సర్వాత్మస్వరూపుడనగు నేను కానవచ్చినంతనే, యోగియొక్క హృదయగ్రంధి యగు అహంకారము పటాపంచ లగును. దాని ద్వారా ఏర్పడిన అసంభావనాదులగు సర్వసంశయములు విచ్ఛిన్నములగును. అంత వీని అనారబ్ధకర్మలు సంసారకారణము లైనవియు, క్షీణించును. ఆరబ్ధఫలములును నశించును.

అవ. ఈ ప్రకారముగ వ్యవస్థచే అధికారత్రయము చెప్పబడినది. అందును భక్తి, అన్య నిరపేక్ష గుండగుటవలనను, ఇతరము దాని సాపేక్ష మగుటవలనను భక్తియోగమే శ్రేష్ఠమని మూడు శ్లోకములలో నుపసంహరించుచున్నారు.

శ్లో. తస్మాన్మద్భక్తియుక్తస్య యోగినో వై మదాత్మనః,
న జ్ఞానం న చ వైరాగ్యం ప్రాయః శ్రేయో భవే దిహ 32

అ. తస్మాత్ = అందువలన; మత్-భక్తి యుక్తస్య = నా యందలి భక్తితో గూడి, మద్-ఆత్మనః యోగినః వై = నాయందు చిత్తముగలిగిన యోగికి; న జ్ఞానం, న చ వైరాగ్యం = జ్ఞానము కాదు, వైరాగ్యమును కాదు; ప్రాయః = తరుచుగా; ఇహ = ఇందు; శ్రేయః భవేత్ = శ్రేయస్సు కల్గును.

తా. కాబట్టి నాయందు భక్తితో గూడి, నాయందు చిత్తమిడిన యోగికి జ్ఞానము పని లేదు. వైరాగ్యమును అవసరము లేదు. భక్తివల్లనే అతనికి ఇందు శ్రేయస్సు కల్గును.

అవ. అందుకు హేతువు చెప్పుచున్నారు.

శ్లో. యత్కర్మభి ర్య త్తపసా జ్ఞాన వైరాగ్యతశ్చ యత్,
యోగేన దానధర్మేణ శ్రేయోభి రితరై రపి. 33

అ కర్మభిః యత్ = కర్మలచే నేది సాధ్యమో; తపసా యత్ = తపస్సుచే నేది ప్రాప్యమో; జ్ఞానవైరాగ్యతః యత్ = జ్ఞానవైరాగ్యముల వలన ఏది గమ్యమో; యోగేన = యోగముచే; దానధర్మేణ = దానధర్మములచే; ఇతరైః శ్రేయోభిః అపి = అన్యములగు శ్రేయోమార్గముల చేతను, ఏది సంప్రాప్య మగునో.

తా. కర్మలచే నేది సాధ్యమో, తపస్సుచే నేది ప్రాప్యమో, జ్ఞాన వైరాగ్యముల వలన ఏది గమ్యమో, దానధర్మములచేతను, ఇతరములగు శ్రేయోమార్గముల చేతను ఏది సంప్రాప్త మగునో.

శ్లో. సర్వం మద్భక్తియోగేన, మద్భక్తో లభతేఽఞ్జసా,
స్వర్గాపవర్గం మద్ధామ, కథంచి ద్యది వాంఛతి. 34

అ. సర్వం = పైన పేర్కొన్న దంతయు; మత్ భక్తి యోగేన = నా భక్తియోగముచే; మద్భక్తః = నా భక్తుడు; అంజసా లభతే = శీఘ్రముగా పొందును; స్వర్గ-అపవర్గం = స్వర్గము, మోక్షము; మద్-ధామ = నా స్థానము; కథంచిత్ వాంఛతి యది = కష్టముచే కోరెనేని (కోరెనేని అనుటచే వాంఛలేదని చెప్పబడినది.)

తా. పైన పేర్కొన్న దంతయు నా భక్తుడు భక్తి యోగముచేత, శీఘ్రముగా పొందు చున్నాడు. నా ధామమగు వైకుంఠ మతనికి సిద్ధముగనే యున్నది. అతడు వాంఛించునేని స్వర్గము, మోక్షమును కలుగుచున్నవి.

అవ. అందు హేతువు చెప్పుచున్నారు.

శ్లో. ఏవ మేతా న్మయాదిష్టా ననుతిష్ఠంతి మే పథః,
క్షేమం విందంతి మత్ స్థానం, యద్బ్రహ్మ పరమం విదుః. 38

అ. ఏవం = ఈ ప్రకారము: మయా, ఆదిష్టాన్, ఏతాన్ = నాచే చెప్పఁబడిన ఈయుపాయములను; మే పథః = నన్ను ప్రాప్తించు మార్గములను: అనుతిష్ఠంతి = ఎవరు అనుష్ఠించుచున్నారో వారు, క్షేమం; మత్ స్థానం విందంతి = కాలమాయాది విరహితమైన నాస్థానమును పొందుచున్నారు; యత్-పరమం బ్రహ్మ విదుః = దేనిని పరబ్రహ్మముగా నెఱుంగుదురో.

తా. ఎవరు నేను చెప్పిన ముక్తిమార్గములను, నన్ను ప్రాపించు నుపాయములను అనుసరించి వర్తించుచున్నారో వారు కాలమాయాది రహితమై పరబ్రహ్మమని చెప్పబడు నా స్థానమును పొందుచున్నారు.

ఇతి శ్రీమద్భాగవతే, ఏకాదశస్కంధే వింశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధమున ఇరువదియవ అధ్యాయము.

# ఏకవింశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

**జయతి స్వపరానందపరానందనృకేసరీ,**
**యత్కృపాలవలేశేన శ్రీధరః సంస్కృతః కృతః.**
**ఏకవింశే క్రియాజ్ఞానభక్తిష్వనధికారిణాం,**
**కామినాం ద్రవ్యదేశాదిగుణదోషాః ప్రపంచితాః.**

స్వీయమైన బ్రహ్మానందముచే ఇతరుల ఆనందస్వరూపుడైన, నరసింహమూర్తి సర్వోత్కర్షతో వర్తించుచున్నాడు. ఎవని కృపాలవలేశముచే శ్రీధరుడు సంస్కరింపబడి భక్తుడై వర్ధిల్లుచున్నాడు.

ఈ ఇరువది యొకటవ అధ్యాయమందు కర్మజ్ఞానభక్తులందు, అనధికారులై, ఫలకాములై, కాములైన వారికి ద్రవ్య దేశాది గుణదోషములు ప్రపంచింపబడినవి.

శ్రీ భగవాన్ ఉవాచ — శ్రీ భగవంతుడు వచించెను.

ఈ ప్రకారము గుణదోష వ్యవస్థ కొఱకు యోగత్రయము చెప్పబడినది. అందు జ్ఞాన భక్తి సిద్ధులకు గుణదోషములు లేవు. సాధకులకు మాత్రము స్వల్పముండును. ప్రథమముననే కర్మనిష్ఠను నివర్తించువారికి, యథాశక్తి నిత్యనైమిత్తికకర్మ గుణము. అది సత్త్వశోధకమై యున్నందున అది గుణము. నిత్యనైమిత్తికకర్మను చేయకుండుట నిషిద్ధకరణమగును. అది [illegible] దోషము. ఆ దోషము నివర్తించినదగుటకు కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తము గుణమగును. విశుద్ధసత్త్వులైన జ్ఞాననిష్ఠులకు జ్ఞానాభ్యాసమే సిద్ధహేతువగుటచే గుణము. భక్తినిష్ఠులకు మరల మరల శ్రవణ కీర్తన భక్తియే గుణమగును. ఇప్పుడట్టివారి లోపల ఎవరు సిద్ధులు కారో, ఎవరు సాధకులు గారో, కామ్య కర్మప్రధానులో అట్టి వారికి సకల దోషములను ప్రపంచించుచున్నవాడగుచు మొదట అతిబహిర్ముఖులగు వారలను నిందించుచున్నారు.

**శ్లో. య ఏతాన్ మత్పథో హిత్వా భక్తిజ్ఞానక్రియాత్మకాన్,**
**క్షుద్రాన్ భోగాం శ్చలైః ప్రాణైః కామంత స్సంసరంతి తే. 1**

అ. యే = ఎవరు; **ఏతాన్ మత్పథః = నేను** వచించిన ఈ ముక్తి మార్గములను; భక్తిజ్ఞాన క్రియాత్మకాన్ హిత్వా = భక్తిజ్ఞాన క్రియారూపములను వదలి, చలైః ప్రాణైః = అస్థిరము లైన దేహ ప్రాణముల చేతను ఇంద్రియముల చేతను; క్షుద్రాన్, భోగాన్ కామంతః = తుచ్ఛము లైన ఇంద్రియభోగములను సేవించుచున్నవారో; తే = వారు; సంసరంతి = నిఖిల దోషభాజను లగుటచే నానా యోనులను పొందుచున్నారు.

తా. ఎవ్వరు నేను చెప్పిన భక్తిజ్ఞానకర్మస్వరూపములను ముక్తిమార్గములను త్యజించి తుచ్ఛములైన ఇంద్రియభోగములను, అస్థిరములగు దేహప్రాణేంద్రియములచే సేవించుచున్నారో వారు, అఖండదోషభాజను లగుటచే నానాయోనులను ప్రాపించుచు, సంసారమున ప్రవర్తించుచుందురు.

అవ. ఓయీ! అకర్మలచేతనే కొందరు గుణదోషభాజను లగుదురు. కొందరు కారు. మఱి ఈ వైషమ్యమెట్లు సంభవించును. అగ్నిచే కొందరు తాప మందుదురు. మరి కొందరు తాప మందరు అనుట సంభవించును కదా! అందుకు చెప్పుచున్నారు.

**శ్లో. స్వే స్వేఽధికారే యా నిష్ఠా స గుణః పరికీర్తితః,**
**విపర్యయస్తు దోషః స్యాత్ ఉభయో రేష నిశ్చయః. 2**

అ. స్వే స్వే అధికారే = తమ తమ వర్ణాశ్రమానుసారము తమ తమ అధికారమునందు యా నిష్ఠా=ఏ కర్మనిష్ఠ కలదో; సః = అది: గుణః పరికీర్తితః = గుణమని చెప్పబడినది. విపర్యయః తు = అధర్మమునకు విరుద్ధముగా నాచరించుట; దోషః స్యాత్ = దోషమగును; ఉభయోః = ఈ గుణదోషములు రెంటికిని: ఏషః నిశ్చయః = ఇదియే నిర్ణయము.

తా. వారివారి వర్ణాశ్రమరీతి ననుసరించి, (తమతమ అధికారము ననుసరించి) ఎవరెవరికి ఏది ధర్మనిష్ఠయో అదియే వారికి గుణమని చెప్పబడినది. దానికి విపరీతముగా ప్రవర్తించుట దోషము అని ఈ విధముగా గుణదోషముల నిశ్చయము గావింపబడినది. గుణదోషములు అధికారి భేదమును బట్టి కల్పితము లగునుగాని వస్తునిష్ఠ గలవి గావు.

అవ. దానిని చెప్పుచున్నారు.

**శ్లో. శుద్ధ్యశుద్ధీ విధీయేతే సమానేష్వపి వస్తుషు,**
**ద్రవస్య విచికిత్సార్థం గుణదోషౌ శుభాశుభౌ. 3**

అ. వస్తుషు సమానేషు అపి = వస్తువులు సమానములై ఒక్కరీతిగా ఉన్నను, ద్రవ్యస్య విచికిత్సార్థం = ఆ వస్తువుల యొక్క ఇది యోగ్యమా! అయోగ్యమా! అను సందేహము ద్వారా, స్వాభావిక ప్రవృత్తిని ప్రతిబంధించుట కొఱకు; శుద్ధి-అశుద్ధీ = శుద్ధము, అశుద్ధము. యోగ్యత్వము. అయోగ్యత్వము, గుణదోషౌ = తన్నిమిత్తమైన గుణదోషములు, ఉపాదేయత్వము: అనుపాదేయత్వము; శుభ-అశుభౌ = తన్నిమిత్తమగు అర్థము, అనర్థము; విధీయేతే = విధింపబడుచున్నవి.

తా. వస్తువు లన్నియు సమానములైయున్నను, ఈ వస్తువు యోగ్యమా, అయోగ్యమా అను సందేహము ద్వారా, స్వాభావికమగు ప్రవృత్తిని నిరాకరించుటకై, ఆ వస్తువులకు యోగ్యత, అయోగ్యత అను వానికి కారణము, ఉపాదేయత్వము, అనుపాదేయత్వము (గ్రహింపదగినది. తగనిది), అర్థము, అనర్థము చెప్పబడినది.

**శ్లో. ధర్మార్థం వ్యవహారార్థం యాత్రార్థమితి చానఘ,**
**దర్శితోఽయం మయాచారో ధర్మముద్వహతాం ధురమ్.**

అ. ధర్మార్థం = ధర్మముకొఱకు. శుద్ధ్యశుద్ధులు శుద్ధమగు దానిచే ధర్మమును అశుద్ధమగు దానిచే అధర్మమును; వ్యవహారార్థం = వ్యవహారము కొఱకు. గుణదోషములు. అశుద్ధములైన గుణదోషములు సైతము రాజాదుల వ్యవహారమునందు కన్పట్టుట వలన. అందు ఉపాదేయము, ఇతరము గాదనియు; యాత్రార్థం = జీవయాత్ర కొఱకు; శుభాశుభములు దోషములైనను ఆపదలందు శరీర నిర్వహణ మాత్రము గ్రహించుట పాపముకాదు. అధికము గ్రహించుట పాపము ధర్మధురం = ధర్మరూపమైన భారమును; ఉద్వహతా మయా = వహించు నాచే మన్వాదిరూపము: అయం ఆచారః = ఈ ఆచారము; దర్శితః = కర్మజడులకు తెల్పబడినది.

తా. పైన పేర్కొనబడిన వానియందు శుద్ధి, అశుద్ధి, అనురెండును ధర్మముకొరకు చెప్పబడినవి. శుద్ధమగు వస్తుగ్రహణముచే ధర్మము,అశుద్ధమగుదానిచే అధర్మము కల్గును. అట్లే గుణదోషములు వ్యవహారనిమిత్తము. అశుద్ధములగు గుణదోషములు రాజాదుల వ్యవహారమందున కన్పట్టుచున్నవిగాన, అరాజవ్యవహారమందే అట్లు, గ్రాహ్యమనియు, ఇతరత్ర గ్రాహ్యముకాదనియు, మరి శుభాశుభములు దేహయాత్రకై చెప్పబడినవి. దోషమైనను, ఆపదలందు శరీరనిర్వహణమునకుమాత్రము అగ్రాహ్యమగు పరాన్నమును గ్రహించుట పాపము కాదు.అధికము గ్రహించుట పాపమగును.ఇట్లు పూర్వము ధర్మరూపమైన భారమును వహించి మన్వాదిరూపమున నేను ఈఆచారము కర్మజడులకు తెల్పియున్నాను.

అవ. శుద్ధాశుద్ధుల ప్రపంచింపుడు,వేదోక్తము లగుటచే, వానియందభినివేశము (దృఢ చిత్తత్వము) కూడదని సమానములగు వస్తువులందును ఏది చెప్పబడినదో, వానిని మూడు శ్లోకములచే విస్తరించుచున్నారు.

**శ్లో. భూమ్యంబ్వగ్న్యనిలాకాశాః భూతానాం పంచధాతవః.**
**ఆబ్రహ్మస్థావరాదీనాం శారీరా ఆత్మసంయుతాః. 5**

**అ. భూమి-అంబు-అగ్ని-అనిల-ఆకాశాః** = భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములు; భూతానాం = ప్రాణుల యొక్క; ధాతవః = ధరింపజేయు ధాతువులై కారణములై; ఆ బ్రహ్మ స్థావరాదీనాం = బ్రహ్మ మొదలు వృక్షాది స్థావరముల పర్యంతమున్న; ప్రాణినాం = ప్రాణులకు; ధాతవః = ధరించు ధారణములు కారణము; శారీరాః = శరీరారంభకములు దేహమునుబట్టి సామ్యము చెప్పబడినది. జీవునిబట్టి సామ్యము చెప్పుచున్నారు. ఆత్మసంయుతాః = ఆత్మతో కూడినవై యున్నవి.

తా. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అను పంచమహాభూతములు ఆత్మతోకూడినవి బ్రహ్మమొదలు వృక్షాదిస్థావరములవరకుగల ప్రాణులు ధరించు కారణములై యున్నవి.

**శ్లో. వేదేన నామరూపాణి విషమాణి సమేష్వపి,**
**ధాతు షూద్ధవ కల్ప్యంతే ఏతేషాం స్వార్థసిద్ధయే. 6**

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవా! ఏతేషాం = ఈ ప్రాణులకు, స్వార్థసిద్ధయే = ప్రకృతి నియమము ద్వారా ధర్మాది పురుషార్థసిద్ధి కొరకు; ధాతుషు = దేహములందు; సమేషు = సమ

ములైన వానియందు; విషమాణి నామరూపాణి = భిన్నములగు నామరూపములు, వర్ణాశ్రమాది ధర్మములు వేదేన కల్ప్యంతే = వేదముచే కల్పింపబడుచున్నవి

తా. ప్రాణులకు ధర్మాదికమగు పురుషార్థసిద్ధికి, వారిదేహములు సమములైనను భిన్నములైన నామరూపములు, వర్ణాశ్రమాదులు వేదముచే కల్పింపబడుచున్నవి.

అవ. కేవలము దేహములందే కాదు. మరియును,

శ్లో. **దేశకాలాదిభావానాం వస్తూనాం మమ సత్తమ,**
**గుణదోషౌ విధీయేతే నియమార్థం హి కర్మణామ్.** 7

అ. సత్తమ = ఓ శ్రేష్ఠుడా! దేశ, కాలాది భావానాం = దేశము, కాలము, భావము లోనగువానికి సైతము; వస్తూనాం = ఉపాదేయములైన వ్రీహ్యాది వస్తువులకు సయితము; మమ = నాచే; కర్మణాం నియమార్థం = కర్మల సంకోచము కొరకు; గుణదోషౌ విధీయేతే = గుణదోషములు విధింపబడుచున్నవి.

తా. సత్పురుషుడా! ఫలనిమిత్తాధికారులగు దేశకాలభావములకు, అనుపాదేయములగు ఫలనిమిత్తాధికారులకు, ఉపాదేయములగు వ్రీహ్యాది వస్తువులకు కర్మల నియమముకొరకు నాచే గుణదోషములు విధింప బడుచున్నవి.

అవ. ఈ ప్రకారము గుణదోషములను పరిశోధించి, అవి శుద్ధ్యశుద్ధి మూలకములని, శుద్ధ్యశుద్ధుల నెనిమిది శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. **అకృష్ణసారో దేశానాం అబ్రహ్మణ్యోఽశుచి ర్భవేత్,**
**కృష్ణసారోఽప్యసౌ వీరః కీకటో సంస్కృతేరిణమ్.** 8

అ. దేశానాం = దేశములలో; అకృష్ణ సారః = నల్లజింక స్వేచ్ఛాసంచారము లేనిది; అబ్రహ్మణ్యః = బ్రాహ్మణభక్తి శూన్యమగు దేశము; అశుచిః భవేత్ = మిక్కిలి అశుచి యగును. కృష్ణసారః = కృష్ణమృగ సంచారముచే శ్రేష్ఠమై, సౌవీరః = సువీరులు అయిన సత్పురుషులు గల; కీకటః అపి = కీకట దేశమైనను; శుచిః = శుచి యంతయు. "స వై పుణ్యతమో దేశః సత్పాత్రం యత్ర లభ్యతే" ఎందు సత్పాత్రము లభించునో, అది పుణ్యతమమగు దేశ మగును, అసౌ వీరః = అట్టి సత్పురుషులు లేనిది, కీకటః = అంగ వంగ, కళింగాది దేశము; అశుచి-అసంస్కృత-ఈరిణం = సమ్మార్జనాది శూన్యమైన మ్లేచ్ఛ జనాశ్రయమైన దేశము, అందును ఊషరదేశము అశుచి. దాని కన్యము శుచి

తా. నల్లజింక ఎచ్చట స్వేచ్ఛగా సంచరింపదో, బ్రాహ్మణభక్తి ఎక్కడ లేదో ఆ దేశము అశుచి యగును. నల్లజింక ఎచట స్వేచ్ఛగా సంచరించునో, సువీరులు సత్పురుషులు ఎందు కలరో, అది కీకటదేశమైనను, శుచియగు దేశము. సత్పురుష లెందు లేరో అట్టి అంగ వంగ కళింగ కీకటాదిదేశములు అశుచు లగును. అందును చిమ్మి చల్లి పరిశుద్ధము చేయక మ్లేచ్ఛులు బలసియుండు దేశము అశుచి. అందును ఊషరదేశము మిగుల అశుచి యగును.

అవ. కాలమునకు శుద్ధ్యశుద్ధులు చెప్పుచున్నారు—

శ్లో. కర్మణ్యో గుణవాన్ కాలో ద్రవ్యతః స్వత ఏవ వా,
యతో నివర్తతే కర్మ స దోషోఽకర్మకః స్మృతః. **9**

అ. ద్రవ్యతః = ద్రవ్యసంపత్తిని బట్టి; స్వతః ఏవ వా = స్వయముగా గాని (స్వతస్సిద్ధమైన పూర్వాహ్ణాదికము); కర్మణ్యః = కర్మార్హమైన; సః కాలః = ఆ కాలము; గుణవాన్ = కర్మవిషయమైన గుణము కలది; యతః = దేనినుండి: కర్మ నివర్తతే = ద్రవ్యలోపముచే గాని, రాష్ట్ర విప్లవాదికముచే గాని, కర్మ నివర్తింపబడునో; అకర్మకః = సూతకాదికమందు దశాహాది లక్షణమైనదేని, కర్మానర్హము, అని, స్మృతః = చెప్పబడినది.

తా. ద్రవ్యసంపదతో గూడినట్టిది కాని, స్వతస్సిద్ధమైన పూర్వాహ్ణాదికమైనదిగాని అగు కర్మార్హమైనకాలము గుణవంతము. ఎందు ద్రవ్యాలాభముచే గాని, రాష్ట్ర విప్లవముచేగాని, కర్మ నివర్తింపబడుచున్నదో, ఏది సూతికాదికమందును, దశాహాదికాదిశౌచము గలదో, కర్మానర్హమైన ఆకాలము దోషము అశుద్ధమగును.

అవ. వస్తుశబ్దముతో పేర్కొనబడిన ద్రవ్యముల శుద్ధ్యశుద్ధులు నాల్గుశ్లోకములచే చెప్పుచున్నారు.

శ్లో. ద్రవ్యస్య శుద్ధ్యశుద్ధీ చ ద్రవ్యేణ వచనేన చ,
సంస్కారేణాథ కాలేన మహత్త్వాల్పతయాఽథవా. **10**

అ. ద్రవ్యస్య = ద్రవ్యమునకు; ద్రవ్యేణ = తోయాదికముచే; శుద్ధి-అశుద్ధీ = శుద్ధియు; మూత్రాదికముచే అశుద్ధియు కల్గుట; వచనేన = బ్రాహ్మణ వచనముచే; శుద్ధమా, అశుద్ధమా యను సందేహమునందు శుద్ధమే అను బ్రాహ్మణవచనముచే శుద్ధి, విపరీతమైన దానిచే నశుద్ధి; సంస్కారేణ = జలప్రోక్షణాదికముచే పుష్పాదికమునకు శుద్ధి, మూర్కొనుటచే అశుద్ధి, పర్యుషితాన్నాదికమునకు శుద్ధిలేదు. కాలేన = దశాహాది కాలముచే, నవోదకాదికమునకు శుద్ధి, విపరీతమగువానిచే అశుద్ధి. (ఉచ్ఛిష్టాదికమునకు శుద్ధిలేదు). అంత్యజు లుపయోగించిన తటాకాదులు దొడ్డవైన శుద్ధి, అల్పములైన అశుద్ధి.

తా. వస్త్రము పాత్రము లోనగువస్తువులకు జలము లోనగువానిచే శుద్ధి. మూత్రము లోనగువానిచే అశుద్ధి కలుగును. ఇది శుద్ధమా! అశుద్ధమా! అనుసందేహమునందు బ్రాహ్మణ వచనముచే శుద్ధి, తక్కినవానిచే అశుద్ధి. జలప్రోక్షణాదిక సంస్కారముచే పుష్పాదులకు శుద్ధి. (అట్లు పర్యుషితాన్నమునకు శుద్ధిలేదు.) వాసనచూచుటచే అశుద్ధి. దశాహాదికముచే నవోదకాదికమునకు శుద్ధి. (ఉచ్ఛిష్టాదికమునకు శుద్ధిలేదు). వివరీతమగు వానిచే అశుద్ధి. అంత్యజు లుపయోగించు తటాకాదులు దొడ్డవైన శుద్ధి, అల్పములైన అశుద్ధి.

శ్లో. శక్త్యాఽశక్త్యా చ బుద్ధ్యా వా సమృద్ధ్యా చ యదాత్మనః,
అఘం కుర్వంతి హి యథా దేశావస్థానుసారతః. **11**

అ. శక్త్యా, అశక్త్యా చ = శక్తిచే అశక్తిచేతను సూర్యోపరాగము; సూతకాన్న గ్రహణములచే, శక్తులకు అశుద్ధి, అశక్తులకు శుద్ధి యగును; బుద్ధ్యా = పుత్ర జన్మాదికమందు పది దినముల తరువాత తెలియుట శుద్ధి, పది దినముల లోపల తెలియుట అశుద్ధి ; సమృద్ధ్యా =

సంపదచే, చినిగి మురికియైన వస్త్రమునకు సంపదగల వానిని గూర్చి అశుద్ధి, దరిద్రుని గూర్చి శుద్ధి; అందును విశేషమును చెప్పుచున్నారు ఆత్మనః = ఆత్మకు, ఈ ద్రవ్యవచనాదులు, ద్రవ్యముల అశుద్ధిద్వారా తమకు; యథా = యథాతథముగా; అఘం కుర్వంతి యద్ = ఏ పాపమును చేయుచుండుట; దేశ-అవస్థా-అనుసారతః = దేశ కాలాదుల ననుసరించియే; తత్ = అదియు అంతటను చేయవు. అది యుక్తము. దేశమందు చేయుచున్నవి. చోరవ్యాకుల ప్రదేశ మందు చేయవు. ఆప్రకారము రోగాది వ్యతిరిక్తమగు యౌవనాద్యవస్థయందు చేయునుగాని బాల్యరోగాద్యవస్థయందు పాపము కలిగింపవు. అట్లే—

స్మృతి. శ్లో. దేశం కాలం తథాత్మానం ద్రవ్యం ద్రవ్యప్రయోజనం,
ఉపపత్తి మవస్థాం చ, జ్ఞాత్వా శౌచం ప్రకల్పయేత్.

**దేశము, కాలము, ఆత్మ, (తనను) ద్రవ్యము, ద్రవ్యప్రయోజనము, ఉపపత్తి, అవస్థ వీని నెఱింగి, శౌచమును కల్పింపవలెను.**

తా. శక్తిగలవారికి సూర్యగ్రహణాదులు, సూతకాన్న భోజనాదులచే అశుద్ధి. అశక్తులకు శుద్ధి. పుత్రాది జన్మము పదిదినముల తరువాత తెలియుట శుద్ధి. పదిదినములలోపల నెఱుంగుట అశుద్ధి. సంపత్సమృద్ధిచే జీర్ణ మలిన వస్త్రధారణము ధనసంపన్నునకు అశుద్ధి. పేదకు శుద్ధి. ఈ ద్రవ్యవచనాదులు ద్రవ్యముల అశుద్ధిద్వారా ఆయా దేశకాలానుసారము పాపము కలిగించును. అంతట కలిగింపవు. అందును నిర్భయమగు దేశమునందు కలిగించును. చోరవ్యాకులదేశమునందు కాదు. రోగాదులులేని యౌవనదశయం దున్నపుడే కలిగించును. బాల్యరోగాద్యవస్థలయందు పాపము కలిగింపవు.

అవ. ద్రవ్యాదులచే ద్రవ్యమునకు శుద్ధియని చెప్పబడినది. అందు వచనాదిశుద్ధి ఒకే విధముగలది. ద్రవ్యముచే శుద్ధి బహురూపముల నుండును. అశుద్ధిని ప్రపంచించుచున్నారు.

**శ్లో. ధాన్యదార్వస్థితంతూనాం రసతైజసచర్మణాం,**
**కాలవాయ్వగ్నిమృత్తోయైః పార్థివానాం యుతాయుతైః. 12**

**అ. ధాన్య, దారు-అస్థి తంతూనాం = ధాన్యము కొయ్య ఆజ్యము లోనగువానిని గ్రహించు చమసాదికము; అస్థి = గజదంతాదికము; తంతూనాం = నూలు వస్త్రము లోనగువానికి; రస తైజస చర్మణాం = రస ఘృత తైలాదులు; తైజస = సువర్ణాదులు; చర్మణాం = కృష్ణాజినము లోనగువానికి; పార్థివానాం = రాజవీథి, బురద, ఘటము ఇటుక లోనగువానికి; యుత-అయుతైః = కూడినవి కూడనివియైన; కాల, వాయు, అగ్ని, మృత్-తోయైః = కాలముచే, వాయువుచే, అగ్నిచే, మృత్తుచే, జలముచే శుద్ధి.**

తా. ధాన్యాదులకు వాయువుచే శుద్ధి. నేయి మొదలగు వానిని పోసియుంచు కొయ్య పాత్రలకు, గజదంతాదులకు జలములచే శుద్ధి. రసవస్తువులగు నెయ్యి నూనె లోనగువానికి, అగ్నియందు కాచుటచే శుద్ధి. జింకచర్మము లోనగు చర్మవస్తువులకు జలములచే శుద్ధి. పార్థివములగు వీథిలోని ధూళి, ఘటము, ఇటుక లోనగువానికి జలముచే శుద్ధి.

కాల వాయు పక్వ కాలాదులచేతను, కాకము, అంత్యజులు లోనగువాని స్పర్శయందలి కాలమహిమచే దేశకాలావస్థానుసారము జరుగును.

అవ. అస్పృశ్యములైన వానిని స్పృశించుటకు శుద్ధిని చెప్పి లేపవిషయమందు చెప్పుచున్నారు.

శ్లో. **అమేధ్యలిప్తం యద్యేన గంధలేపౌ వ్యపోహతి,**
**భజతే ప్రకృతిం తస్య తచ్ఛౌచం తావదిష్యతే. 13**

అ. యత్ = ఏ పీఠ వస్త్ర పాత్రాదికము; అమేధ్యలిప్తం = అపరిశుద్ధమగు వస్తువులచే పూయబడిన దగుచు; యేన = ఏ తక్షణ, ఘర్షణ, క్షారాదికముచే; గంధలేపౌ వ్యపోహతి = ఆ దుర్వాసనను, పైపూతను త్యజించుచున్నదో (చెక్కుట, తోముట, తవుడు చింతపండు లోనగు వానిచే) ప్రకృతిం భజతే = స్వగతమలమును త్యజించి, తన తొంటిరూపును, పొందునో, తస్య = దానికి, తత్ శౌచం = ఆ శోధనము, తావత్ ఇష్యతే = అంతవరకు కర్తవ్యమని కోరబడుచున్నది.

తా. అపరిశుద్ధ పదార్థముచే పూయబడిన పీఠము, పాత్రము, వస్త్రము లోనగునవి క్రమముగా చెక్కుట, పులుసు, నీరు లోనగువానిచే శుభ్రపరచుటచే వానికంటిన పూతిగంధము పోవునంతవరకు. మరల వానివాని రూపు పొందినవగును. అంతవరకు దానిచే పలుమార్లు శుద్ధి గావింపనగును.

అవ. ఈ ప్రకారము ద్రవ్యశుద్ధిని చెప్పి, ఇప్పుడు కర్తృశుద్ధిని చెప్పుచున్నారు —

శ్లో. **స్నానదానతపోవస్థా వీర్యసంస్కారకర్మభిః,**
**మత్స్మృత్యా చాత్మనః శౌచం శుద్ధం కర్మాచరేద్ద్విజః. 14**

అ. స్నాన...కర్మభిః = స్నానము, దానము, తపస్సు, అవస్థ (కౌమారాది దశ). శక్తి ఉపనయనాది సంస్కారము, శౌచసంధ్యోపాసనాదీక్షాది లక్షణమగు కర్మ లోనగువానిచే; మత్-స్మృత్యా చ = నా స్మరణము చేతను; ఆత్మనః = సాహంకారుడగు కర్తయొక్క; శౌచం = శుద్ధిని, ఈశుద్ధి వ్యవహారముకొఱకు గాదు. మఱి ఏమనగా విపరీతమైన కర్మకొరకు; శుద్ధః = ఇట్లు శుద్ధుడై; ద్విజః = ద్విజుడు, శూద్రాదులకు నుపలక్షకము; కర్మ ఆచరేత్ = కర్మను ఆచరింపవలెను.

తా. స్నానము, దానము, తపస్సు, కుమారాది భావము, శక్తి, ఉపనయనాదిసంస్కారము; శౌచ సంధ్యోపాసనా దీక్షాది లక్షణమైన కర్మ లోనగు వానిచే నాస్మరణముచే కర్మ శుద్ధిని పొందును. అట్లు శుద్ధుడై ద్విజుడు (శూద్రాదులును) కర్మ నాచరింపవలెను.

అవ. మంత్రశుద్ధిని చెప్పుచున్నారు.

శ్లో. **మంత్రశుద్ధిః పరిజ్ఞానం కర్మశుద్ధి ర్మదర్పణం,**
**ధర్మః సంపద్యతే షడ్భిః, అధర్మస్తు విపర్యయః. 15**

అ. పరిజ్ఞానం = సద్గురు ముఖమున సత్వపరిజ్ఞానము; మంత్రశుద్ధిః = మంత్రమునకు శుద్ధి; పరిజ్ఞానం = సమగ్ర జ్ఞానము; మత్ అర్పణం = ఈశ్వరుడనైన నాయందు సమర్పించుట;

కర్మశుద్ధిః = కర్మశుద్ధి, ధర్మాదులకొఱకు శుద్ధ్యశుద్ధులను సవిస్తరముగా దెలిపి, ఉపసంహరించుచున్నారు. షడ్భిః=దేశము, కాలము, ద్రవ్యము, కర్త, మంత్రము, కర్మ అను ఆరింటిచే శుద్ధమగు; ధర్మః సంపద్యతే = ధర్మము పొందబడును; అధర్మః తు = అధర్మమన్ననో; విపర్యయః = ఇందుకు వ్యతిరిక్తము.

తా. గురుముఖమున యథార్థ పరిజ్ఞానము మంత్రమునకు శుద్ధియగును. ఈశ్వరుడనగు నాయందు సమర్పణము చేయుట కర్మకు శుద్ధి. దేశము, కాలము, ద్రవ్యము,కర్త, మంత్రము, కర్మ అను వానిచే ధర్మము పొందబడుచున్నది. అధర్మ మిందుకు విపరీత మగును.

అవ. ఈగుణదోషవిభాగము వాస్తవము కాదనుచున్నారు—

శ్లో. క్వచి ద్గుణోఽపి దోషః స్యాద్ దోషోఽపి విధినా గుణః,
గుణదోషార్థనియమః తద్భిదా మేవ బాధతే. **16**

అ. క్వచిత్ గుణః అపి దోషః స్యాత్ = ఒకప్పుడు గుణము సైతము దోషమగును. ఆపత్సమయమందు ప్రతిగ్రహము గుణమైనను ఆపద లేనప్పుడు నిషిద్ధమగుటచే దోషమగుచున్నది. పరధర్మముగూడ పరునకు గుణమైనను తనకు దోషమగుచున్నది; దోషః అపి విధినా గుణః = ఒకప్పుడు దోషము సైతము విధి బలమున గుణమే అగును. శ్రుతి. యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ = ఏ దినము విరక్తి కల్గుచున్నదో ఆ దినమే సన్న్యసింపవలెను, అని శ్రుతి. విరక్తునికి కుటుంబత్యాగము గుణమైనను, అవిరక్తునికి దోషమగుచున్నది. ఋతౌ భార్యాం ఉపేయాత్ = ఋతుకాలమందు భార్యను పొందవలెను, అను నియమము. గుణ దోషార్థ నియమః = గుణదోషముల కొరకైన నియమము (నియామకమగు శాస్త్రము) తత్ భిదాం= ఆ గుణదోషముల భేదమునే; బాధతే = బాధించుచున్నది.

తా. ఒకప్పు డేది గుణమో అదియే వేఱొకప్పుడు దోషమగును. అనగా ఆపత్కాలమందు దానమును ప్రతిగ్రహించుట దోషముకాదు. గుణమగును. అదియే ఆపదలేనపుడు ప్రతిగ్రహించుట దోషమగును. అట్లే ఒకప్పుడు దోషమైనది విధిబలమున గుణమగును. అనగా విరక్తునికి కుటుంబమును త్యజించుట దోషముగాదు. వేదము విధించు వాక్య బలమున గుణమే యగును. అట్లు విరక్తునికి కుటుంబత్యాగము గుణమైనది. అవిరక్తునికి దోషమగును. ఇట్లు గుణదోషముల నొక్క అర్థమందే నియమించు శాస్త్రము, వానిభేదమునే బాధించుచున్నది. అట్లే పరధర్మము పరునకు ధర్మమైన తనకు దోషమగును.

అవ. దోషమునకు ఒకప్పుడు దోషత్వము లేకపోవుటకు, గుణత్వము లభించుటకు ఉదాహరణమును తెల్పుచున్నారు—

శ్లో. సమానకర్మాచరణం పతితానాం న పాతకం,
ఔత్పత్తికో గుణ స్సంగో న శయానః పతత్యధః. **17**

అ. సమాన కర్మ-ఆచరణం = సమానమైన కర్మ ఆచరించుట, అనగా సురాపానాదికము యొక్క ఆచరణము, అపతితులకు పతనహేతువైనను; పతితానాం=జాతికర్మలచే పతితులైనవారికి; న పాతకం = పాతకము గాదు; అధికార భ్రంశకము కాదు. పూర్వమే పతితు

లై నందువ అందువలన నిది దోషమయ్యు నిందు దోషత్వము లేదని యర్థము. ఆ ప్రకారము సంగః = సంగము యతికి దోషమైనను; ఔత్పత్తికః గుణః = గృహస్థునికి పూర్వస్వీకృతమైనది గుణమగుచున్నది; అధః శయానః = పూర్వమే నేలపై క్రింద పరుండినవాడు; న పతతి = క్రిందబడడు గదా.

తా. పరుండగనే నేలమీద క్రింద పరుండినవాడు మరల నెట్లు క్రింద బడడో అట్లే సురాపానాదికము లోనగు సమాన కర్మచరణము అపతితులకు దోషమైనను, జాతిచే, కర్మచే, పతితులైన వారికి, పాతకము గాదు. అధికారభ్రంశకరము గాదు. అట్లే స్త్రీసంగమము యతికి దోషమైనను గృహస్థునికి దోషముగాదు. పూర్వమే స్వీకరించినది కావున గుణమే యగును.

అవ. అందువలన గుణదోషనియమవిధులను ప్రవృత్తిసంకోచముద్వారా నివృత్తియందే తాత్పర్యమని అంగీకరించి చెప్పుచున్నారు—

శ్లో. యతో యతో నివర్తేత విముచ్యేత తత స్తతః,
ఏష ధర్మో నృణాం క్షేమః శోకమోహభయాపహః! **18**

అ. యతః యతః నివర్తేత = ఏ యే వానివలన నివృత్తి పొందుచున్నాడో; తతః తతః = ఆయా వానివలన; విముచ్యేత = విముక్తి చెందుచున్నాడు; నృణాం = నరులకు; ఏషః = ఇది; శోక మోహ భయ అపహః = శోకమోహభయములను పోగొట్టునట్టి; క్షేమః ధర్మః = క్షేమంకరమైన ధర్మము.

తా. మనుష్యుడు దేనిదేనినుండి విరక్తిపొందునో, దానినుండి విముక్తి నందుచున్నాడు. నరులకు శోకము, మోహము, భయము, పోగొట్టునట్టి ఈధర్మము క్షేమంకరమైనది.

శ్లో. విషయేషు గుణధ్యానాత్ పుంస స్సంగ స్తతో భవేత్,
సంగా త్తత్ర భవే త్కామః కామాదేవ కలి ర్భవేత్. **19**

అ. పుంసః = పురుషునికి; విషయేషు = ఇంద్రియ భోగములందు; గుణధ్యానాత్ = గుణధ్యానము వలన; రమణీయత్వ బుద్ధివలన; సంగాత్ = ఆ విషయములందు ఆసక్తి వలన వానిచే కట్టువడుట వలన; కామః భవేత్ = కామము కలుగును; కామాత్-ఏవ = కామము వలననే దానితో గూడి; కలిః భవేత్ = కలహము కలుగుచున్నది.

తా. ఇంద్రియభోగములందు రమణీయతాబుద్ధివలన పురుషునికి వానియందు ఆసక్తి కల్గుచున్నది. అవిషయములందు ఆసక్తివలన వానిచే కొట్టువడి కామము కల్గుచున్నది.ఆకామముతోగూడ కలహము కలుగును.

శ్లో. కలే ర్దుర్విషహః క్రోధః తమ స్త మనువర్తతే,
తమసా గ్రస్యతే పుంసః చేతనా వ్యాపినీ ద్రుతమ్. **20**

అ. కలేః దుర్విషహః క్రోధః = కలహము వలన సహింపరాని తీవ్రమైన క్రోధము; తం తమః అనువర్తతే = ఆ క్రోధమును సమ్మోహము అనువర్తించును; తమసా = ఆసమ్మో

హాముచే ద్రుతం వ్యాపినీ చ=శీఘ్రముగా వ్యాపించు; పుంసః=పురుషుని, చేతనా = కార్యాకార్య స్మృతి, బుద్ధి, గ్రస్యతే = మ్రింగివేయబడును.

తా. కలహమువలన తీవ్రమైన క్రోధము జనించును. ఆక్రోధమును సమ్మోహ మావరించును. ఆసమ్మోహనముచే కార్యాకార్యస్మరణము గల పురుషునిబుద్ధి శీఘ్రముగా గ్రసింపబడును.

**శ్లో. తయా చ రహిత స్సాధో జంతు శ్శూన్యాయ కల్పతే,**
**తతోఽస్య స్వార్థవిభ్రంశో మూర్ఛితస్య మృతస్య చ. 21**

అ. సాధో! తయా చ రహితః = ఆ కార్యాకార్యస్మృతిచే హీనుడై; జంతుః శూన్యాయ కల్పతే = ప్రాణి లేనివానికి సమమగును; తతః = అందువలన; మూర్ఛితస్య = మూర్ఛ పొందినవానికి; మృతస్య = చనిపోయినవానికి; అస్య = వీనికి; స్వార్థవిభ్రంశః = పురుషార్థ హాని కల్గును.

తా. ఓసాధూ! అట్టి కార్యాకార్యస్మృతిలేనివాడు అసత్తుల్యు డగును. (ఉండియు లేనివానితో సమానుడు.) అట్లయినవానికి, మూర్ఛపొందినవానికి, చనిపోయినవానికి సమానముగా పురుషార్థహాని సంభవించును.

అవ. మూర్ఛితునితో, మృతునితో సమానత్వమును ప్రపంచించుచున్నారు—

**శ్లో. విషయాభినివేశేన నాత్మానం వేద నాపరం,**
**వృక్షజీవికయా జీవన్ వ్యర్థం భస్త్రేవ యః శ్వసన్. 22**

అ. విషయ- అభినివేశేన = విషయ భోగములందు లగ్నమగుటచే; యః = ఎవడు; ఆత్మానం న వేద-తన్ను తానెఱుంగడు; న-అపరం = ఇతరము నెఱుంగడు; వ్యర్థం = వ్యర్థముగా; వృక్ష జీవికయా = వృక్షమువంటి జీవనముచే; భస్త్రా-ఇవ=కొలిమితిత్తివలె, శ్వసన్ = గాలి తీసికొనుచు, విడచుచున్నాడో వాడు: మృతతుల్యుడు.

తా. ఎవడు భోగములందు లగ్నమనస్కుడై తన్నెఱుగడో, ఇతర మెఱుంగడో. వ్యర్థమగు వృక్షమువలె జీవించుచున్నాడో, వాడు మూర్ఛితతుల్యుడు. కొలిమితిత్తివలె గాలి పీల్చుకొనుచు, విడచుచు వాడు మృతతుల్యు డగును. అందువలన స్వార్థనాశము కల్గును.

అవ. ప్రవృత్తిమార్గమున ప్రవర్తించువానికి, స్వర్గాదిఫలము కలుగునని, వేదశ్రవణమున తెలియుటవలన స్వార్థవిభ్రంశ మెట్లు కలుగుననగా అందుకు చెప్పుచున్నారు—

**శ్లో. ఫలశ్రుతి రియం నృణాం న శ్రేయోరోచనం పరం,**
**శ్రేయోవివక్షయా ప్రోక్తా యథా భైషజ్యరోచనమ్. 23**

అ. ఇయం ఫలశ్రుతిః = శ్రుతులవలన వినబడిన ఈ కర్మఫలశ్రవణము; శ్రేయః న = పరమ పురుషార్థపరము కాదు; కాని నృణాం = బహిర్ముఖురగు నరులకు; పరం = కేవలము; రోచనం = గుడజిహ్వికాన్యాయముచే మోక్షసాధనములందు అభిరుచిని మాత్రము కలిగించును; శ్రేయస్ + వివక్షయా = మోక్షము వచింపగోరుచు, యథా = ఏ ప్రకారము; భైషజ్య రోచనం=ఔషధమందు రుచిని కల్గించు. ఖాద్యలడ్డుకాదిక మెట్లో – అట్లే.

పిబ నింబం ప్రదాస్యామి ఖలు తే ఖండలడ్డుకాన్,
పిత్రైవ ముక్తః పిబతి న ఫలం తావదేవ తు

వేపాకురసము త్రాగుము. నీకు కలకండ లడ్డుల నిచ్చెదను అని తండ్రి చెప్పగా పుత్రుడు త్రాగి ఫలము నెట్లు పొందుచున్నాడో అట్లే రోచనం పరం = కర్మలందు రుచి నుత్పాదించుటకై చెప్పినమాటలు ప్రోక్తాః = చెప్పబడినవి.

తా. వేపాకురసమును త్రాగుము. నీకు కలకండ లడ్డుల నిచ్చెదనని తండ్రి చెప్పగా, విని పుత్రుడు ఆరసము త్రాగి (కలకండలడ్డుకముం గాని) ఆరోగ్యమును పొందుచున్నాడు. ఆరోగ్యము లభ్యమైతే మందు త్రాగే నిమిత్తము కలకండ నిచ్చెదననుటదాని, రోగనివృత్తికి కాదు కదా! అట్లే వేదము చెప్పెడు ఫలములు పరమపురుషార్థముకాదు. మరి ఏమనగా మోక్షము పొందవలెనని, అందు రుచికల్గుటకై కర్మలందు అవాంతర ఫలములచే రుచి కల్పించి చెప్పబడినది.

అవ. కర్మకాండయందు మోక్షముయొక్క నామముసైతము విన్పించుట లేదు. ఏల ఈ ప్రకారము వ్యాఖ్యానించుట? వినినట్లుగా జరుగుట లేదు కదా? అని రెండుశ్లోకములచే చెప్పుచున్నారు —

శ్లో ఉత్పత్త్యైవ హి కామేషు ప్రాణేషు స్వజనేషు చ,
ఆసక్తమనసో మర్త్యా ఆత్మనోఽనర్థహేతుషు. **24**

అ. ఉత్పత్త్యా ఏవ హి = స్వభావము వలననే; మర్త్యాః = మనుజులు; ఆత్మనః = తనకు అనర్థహేతుషు = కీడుకల్గించు కారణములగు కామసుఖములందు; ప్రాణేషు = ఆయురింద్రియ బల శౌర్యాదులందు; స్వజనేషు = పుత్రాదులందు; ఆసక్తమనసః = ఆసక్తమైన మనస్సుగలవారగుదురు.

తా. మానవులు స్వభావముగనే తమకు అనర్థకారణములైన కామభోగములందు ఆయువు, ఇంద్రియబలము, దేహబలము, శౌర్యము లోనగువానియందును పుత్రాదులందు ఆసక్తచిత్తులై యుందురు.

అవ. అందువలన నమ్రులైనవారినిగూర్చి అనుచున్నారు—

శ్లో. నతా నవిదుషః స్వార్థం భ్రామ్యతో వృజినాధ్వని,
కథం యుంజ్యాత్ పునస్తేషు తాం స్తమో విశతో బుధః. **25**

అ. స్వార్థం-అవిదుషః = పరమసుఖము నెఱుంగని వారయిన; నతాన్ = నమ్రులైన; తాన్ = అట్టివారిని, వృజిన-అధ్వని = పాపమగు కామమార్గమందు; దేవయోనులందు; భ్రామ్యతః = భ్రమించుచు; తమః = వృక్షాదియోనిని; విశతః = పొందుచున్న: తాన్ = వారిని; పునః = మరల, పశుకాముడు, ఆయురింద్రియ కాముడు, పుత్రకాముడు- అను, తేషు = ఆ కామములందే; బుధః = స్వయం జ్ఞానముగల వేదము; కథం యుంజ్యాత్ = ఎట్లు ప్రవర్తింపజేయును ?

తా. పరమసుఖ మెఱుంగనివానినిగూర్చి వేద మేది బోధించునో, అదియే పరమశ్రేయ మని నమ్ములై కామమార్గమునందు, దేవాదియోనులందు తిరుగుచు, మరల వృక్షాది యోనులను పొందుచున్నవారినిగూర్చి, స్వతంత్రజ్ఞానముగల వేదము, మరల ఆకామమార్గము లందే ఎట్లు ప్రవర్తింపజేయును?

అవ. అట్లయిన కర్మమీమాంసకులు వేదమును కర్మఫలపరముగా తలంతురు. అనగా అందుకు చెప్పుచున్నారు.

**శ్లో. ఏవం వ్యవసితం కేచి దవిజ్ఞాయ కుబుద్ధయః,**
**ఫలశ్రుతిం కుసుమితాం న వేదజ్ఞా వదంతి హి. 26**

అ. ఏవం వ్యవసితం = ఈ ప్రకారము నిశ్చితమైన వేదముయొక్క అభిప్రాయము; **కుబుద్ధయః కేచిత్ అవిజ్ఞాయ = కుత్సితబుద్ధులు కొందరు తెలియక; కుసుమితాం = అవాం** తర ఫల ప్రయోజనమగుటచే రమణీయమైన; ఫలశ్రుతిం = ఫలశ్రుతినిగా చెప్పుదురు. వారందు వలన కుబుద్ధులు; వేదజ్ఞాః న వదంతి హి = వేదార్థ మెఱింగిన వ్యాసాదులు అట్లు చెప్పరు.

తా. ఇట్లు నిశ్చితమైన వేదముయొక్క అభిప్రాయ మెఱుంగని కుబుద్ధులు, అవాంతర ఫలమై రమణీయముగా కన్పట్టుటచే పరమఫలశ్రుతిని కర్మఫలశ్రుతినిగనే వచింతురు. స్వర్గము మోక్షమే అందురు.వేదార్థ మెఱిగిన వ్యాసాదు లట్లు చెప్పరు.

అవ. కుబుద్ధిత్వమును 8 శ్లోకములతో ప్రపంచించుచున్నారు.

**శ్లో. కామినః కృపణా లుబ్ధాః పుష్పేషు ఫలబుద్ధయః,**
**అగ్నిముగ్ధా ధూమతాంతాః స్వలోకం న వదంతి తే. 27**

అ. కామినః = స్వర్గాదికాములు; కృపణాః = దీనులు, **లుబ్ధాః = తృష్ణాకులులు;** ఇందువలననే, పుష్పేషు ఫలబుద్ధయః = పుష్పములందు ఫలబుద్ధి, అవాంతర ఫలములందు పరమఫలబుద్ధి గలవారు; అగ్నిముగ్ధాః = అగ్ని సాధ్య కర్మాభినివేశము గలవారు; ధూమ తాంతాః = ధూమమార్గమే అంతముగా కలవారు, వివేకము లేనివారు: తే=వారు; స్వలోకం = ఆత్మతత్వము; న వదంతి = చెప్పరు.

కశ్చిద్వా అస్మాల్లోకా త్ప్రేత్య ఆయనం వేద అయ మహ మస్మీతి = ఈ లోకము నుండి మరణించి, ఒకానొకడు, "ఇతడు నేను అని ఆత్మను గుర్తెఱుంగుచున్నాడు, కశ్చిత్ స్వం లోకం ప్రతిజానాతి అగ్నిముగ్ధో హ వై ధూమతాంతాః = ఒకానొకడు తన ఆత్మస్వరూపము నెఱుంగడు. అగ్నిసాధ్య కర్మయందు అభినివేశము కలిగి ధూమమార్గము గలవారు ఎఱుంగరు

తా. స్వర్గాదికాములు, దీనులు, తృష్ణాకులులు, అవాంతరఫలములను పరమ ఫలమన బుద్ధిగలవారు, అగ్నిసాధ్యకర్మయందు అభినివేశముగలవారు వివేకములేనివారు ఆత్మతత్వమ నెఱుంగరు.

అవ. ఆ స్వలోక మన నేదో చెప్పుచున్నారు——

శ్లో. న తే మాం అంగ జానంతి హృదిస్థం య ఇదం యతః,
ఉక్థశస్త్రా హ్యసుతృపో యథా నీహారచక్షుషః. **28**

అ. అంగ = ఓయీ! హృదిస్థం = హృదయమందున్న ఆత్మనగు: మాం = స్వలోకమును; తే=వారు; న జానంతి=ఎఱుగరు; ఓయీ! హృదయగతుడగు అహంకారాస్పదుని ఎరుగుదురు గదా? సత్యమే. కాని పరమాత్ముని మాత్ర మెఱుగరు అనుచున్నారు. యః ఇదం = ఎవ్వనికంటె వేఱుగా ఇది లేదో; ఎందువలన? యతః ఇదం జాతమ్ = ఎవనినుండి యీ జగము పుట్టెనో ఆ పరమాత్ముని వల తెలియరు? హి = ఎందువల్లనైతే; ఉక్థశస్త్రాః = కర్మ్మయే కథనీయము. లేక పశుహింసాసాధనముగా కలవారు; అసుతృపః = ప్రాణములను తృప్తి నొందించుటలో తత్పరులు, నీహారచక్షుషః = తమోప్రాప్తములగు కన్నులు గలవారు; యథా = ఎట్లో అట్లు సన్నిహితవస్తువునుకూడ కానరు.

తా. ఓయీ! హృదయస్థుడను, స్వలోకమైనవాడను అగు నన్ను వారెఱుగరు. వారు కర్మయే పశుహింసా సాధనముగా కలవారు. ప్రాణములు నిలుపుకొనుటే లక్ష్యముగా కలవారు. తమో నిమీలితమైన దృష్టిగలవారు. కావున వారు నన్ను చూడలేరు.

శ్లో. తే మే మత మవిజ్ఞాయ పరోక్షం విషయాత్మకాః,
వృథా పశూన్ విహింసంతి హింస్యంతే ప్రేత్య తైస్తు తే. **29**

అ. విషయాత్మకాః = విషయములయందాసక్తమైన మనస్సుగల; తే = వారు; పరోక్షం = అస్ఫుటమగు; మే మతం = నా మతమును; అవిజ్ఞాయ = తెలియజాలక; వృథా = వ్యర్థముగ; పశూన్ = యజ్ఞాదులందు పశువులను; విహింసంతి = హింసింతురు; తే = వారు, మఱల, ప్రేత్య = మృతినొంది, పరలోకమున; తైః = ఆ పశువుల చేతనే; హింస్యంతే = హింసింపబడుదురు.

తా. విషయప్రవణులగు వారు నామతమును తెలియజాలరు. కావుననే వారు పశుహింస చేతురు. మఱల ఆపశువులచేతనే పరలోకమున హింసింపబడుదురు.

అవ. స్వమతమును తెలుపుచున్నారు—

శ్లో. హింసాయాం యది రాగః స్యా ద్యజ్ఞ ఏవ న చోదనా,
ఇతి వేదధ్వనిం శ్రుత్వా న ప్రబుధ్యన్తి కర్మసు. **30**

అ. హింసాయాం = మాంసభక్షణమందును, హింసవలన కలుగు ఫలమునందును, రాగః స్యాత్ యది = అభిలాషయున్నచో, యజ్ఞః ఏవ = యజ్ఞమే అనుష్ఠింపదగును. న చోదనా=అంతేకాని యది యావశ్యకమను విధానము లేదు. ఇతి=అని, వేదధ్వనిం=వేద పాదమును, శ్రుత్వా=విని, కర్మసు=పనులయందు, న ప్రబుధ్యంతి=మెలకువతో నుంచరు,

తా. "మాంసము తినుటయందు, హింసించుటవలన కలుగు స్వర్గాదిఫలమందు దాసక్తి యున్నచో యజ్ఞమే చేయు"డను వేదవాక్కు యజ్ఞము లవశ్యకర్తవ్యములని విధించుటలేదు! ఎవరి కట్టి ఆసక్తి కలదో దానిచే ప్రేరితులై వారట్లు ఆచరించిన ఆచరింపవచ్చును.. కాని

అది వేదచోదితమని భావింప నక్కరలేదు. కాని వేదధ్వనిని తెలియని వారట్టి కర్మల విష యమున వివేకులై ప్రవర్తింపరు.

**శ్లో. హింసావిహారా హ్యాలబ్ధైః పశుభి స్స్వసుఖేచ్ఛయా,
యజంతే దేవతా యజ్ఞైః పితృభూతపతీన్ ఖలాః. 31**

**అ.** హింసావిహారా హి = అజ్ఞానమువలన హింసయందు స్వేచ్ఛగా విహరించెడి; ఖలాః =దుష్టులు; ఆలబ్ధైః = చంపబడిన; పశుభిః = పశువులచే; స్వసుఖ+ఇచ్ఛయా = తమ సుఖమును బడయు కోరికతో; యజ్ఞైః = యజ్ఞముల చేత; దేవతాః = దేవతలను; పితృభూత పతీన్ = పితరులను, భైరవేశ్వరాది భూతపతులను; యజంతే = యజింతురు.

తా. అజ్ఞానమువలన హింసానురక్తులై పశువులను చంపి స్వసుఖేచ్ఛతో దేవతలకును పితరులకును. భూతపతులకుఁ బ్రీతిగాఁ యజ్ఞములను జేయుదురు.

అవ. వా రతి మందబుద్ధు లనుచున్నారు.

**శ్లో. స్వప్నోపమ మముం లోక మసంతం శ్రవణప్రియమ్,
ఆశిషో హృది సంకల్ప్య త్యజం త్యర్థా న్యథా వణిక్. 32**

**అ.** స్వప్న+ఉపమం = స్వప్నతుల్యమును; అసంతం = అనిత్యమును; శ్రవణప్రియం = చెవులవందువుగా వినవైనదియు నగు; అముం లోకమ్ = ఈ పరలోకమును, స్వర్గమును; ఆశిషః = వాంఛలను; హృది సంకల్ప్య = ఈ లోకమునందు హృదయమున సంకల్పించు కొని (నిశ్చయింపక); అర్థాన్ = ధనములను: యథా వణిక్ = వైశ్యునివలె, త్యజన్తి= విడుదురు.

తా. ఒకానొకవైశ్యుఁడు దుస్తరఘన సముద్రాదులను దాటి ధనమార్జింపవలెనను మిక్కిలి ధనార్జనేచ్ఛతో పూర్వసిద్ధమైయున్న ధనమును వెచ్చించి, ఓడప్రయాణము జేసి, ఆయోడ పగిలిపోవుటచే ద్రవ్యము నష్టమైపోయి ఉభయభ్రష్టు డెట్లగుచున్నాడో అట్లే ఈః ఖలులుకూడ స్వప్నతుల్యమును, అనిత్యమును, పరలోకమగు స్వర్గమును గూర్చి శ్రవణ ప్రియముగా విని యందు సుఖములను పొందఁగోరి యట్లు హృదయమున సంకల్పించి తమ ధనము త్యజించుచున్నారు.

**శ్లో. రజస్సత్త్వతమోనిష్ఠా రజస్సత్త్వ తమోజుషః,
ఉపాసత ఇంద్రముఖ్యాన్ దేవాదీ న్న యథైవ మామ్. 33**

**అ.** రజస్+సత్త్వ–తమః–నిష్ఠాః = రజస్సు, సత్త్వము, తమస్సు లను గుణములందు నిష్ఠగలవారు; రజస్సత్త్వతమోజుషః = ఆ రజస్సత్త్వ తమోగుణములను పొందిన; ఇంద్ర ముఖ్యాన్ = ఇంద్రుడు ప్రధానముగా; దేవ+ఆదీన్ = దేవతలు లోనగువారిని; ఉపాసతే= సేవింతురు. ఇంద్రాదులు నా యంశమై యున్నందున వది నా యుపాసనమే యయ్యును మామ్=నన్ను; యథా-ఏవ = అభేద దర్శనమున; న ఉపాసతే = ఉపాసించరు,

తా. రజస్సత్త్వతమోగుణ క్రియలయందు నిష్ఠగల మానవులు ఆరజస్సత్త్వతమో గుణ వర్తనులై ఇంద్రుఁడు ప్రధానముగా గలదేవతలు లోనగువారి నుపాసించుచున్నారు. ఆఇంద్రాదులు నాయంశమున జనించినవారు గనుక వారి యుపాసనము నాయుపాసనమే యైనను అట భేదదర్శనమున న న్నుపాసింపరు.

అవ. హృదయమునందు సంకల్పమని చెప్పబడినది. ఆసంకల్పమునే తెలుపుచున్నారు.

**శ్లో. ఇష్ట్వేహ దేవతా యజ్ఞై ర్గత్వా రంస్యామహే దివి,**
**తస్యాంత ఇహ భూయాస్మ మహాశాలా మహాకులాః. 34**

**అ. ఇహ = ఈ లోకమునందు; దేవతాః = దేవతలను; యజ్ఞైః = యజ్ఞములచే; ఇష్ట్వా = యజించి; గత్వా = పోయి; దివి = స్వర్గమునందు. రంస్యామహే = అప్సరసలతో క్రీడింతుము; తస్య+అంతే = ఆ స్వర్గభాగమునకు చివర; మహాకులాః = దొడ్డ గృహస్థులమై; భూయాస్మ = జనింతుము అని.**

తా. ఇందు దేవతలను యజ్ఞములచే యజించి ఆఫలమున స్వర్గలోకమునకు పోయి అందు అప్సరసలతో క్రీడించుచు దేవభోగము ననుభవింతుము. ఆభోగాంతమున భూలోకము నందు గొప్పవంశమున ధనవంతులమై గొప్పగృహస్థులమై జనింతుముగాక! యని సంకల్పము.

అవ. అందువలన నేమి యగు ననఁగా జెప్పెదను.

**శ్లో. ఏవం పుష్పితయా వాచా వ్యాక్షిప్తమనసాం నృణామ్,**
**మానినాం చాతిస్తబ్ధానాం మద్వార్తాపి న రోచతే. 35**

**అ. ఏవం = ఈ ప్రకారము; పుష్పితయా = మనోరంజనము గలిగించు; వాచా = దవే వాక్యముచే, వ్యాక్షిప్తమనసాం = పరమార్థమునుండి చలించుచున్న మనసు గలవారై; మానినాం = అహంకారముతో; అతిస్తబ్ధానాం = మిక్కిలి అలసబుద్ధిగల; నృణాం = నరులకు; మత్+వార్తా అపి = నన్ను శ్రవణముచేయు వార్తయు; న రోచతే = రుచింపదు.**

తా. ఇట్లు మనస్సును రంజింపచేయు వేదవాక్యమును విని దాని ప్రభావముచే ఆ కర్మలం దాసక్తులై కర్తృత్వాద్యహంకారయుతులై మలబుద్ధులైన నరులకు నా కథాశ్రవణమున్నైతము రుచించదు. అందువలన వారు నిత్యము సంసారులే యగుదురు.

అవ. ఈ ప్రకారము వేదములు ప్రవృత్తిపరములు అనువానిని నిరాకరించి ప్రకృతమగు నివృత్తి పరత్వము నుపసంహరించుచున్నారు.

**శ్లో. వేదా బ్రహ్మాత్మవిషయా స్త్రికాండవిషయా ఇమే,**
**పరోక్షవాదా ఋషయః పరోక్షం మమ చ ప్రియమ్ 36**

**అ. త్రికాండవిషయాః = కర్మ-బ్రహ్మ-దేవతా కాండము లను మూఁడు విషయములు గల; ఇమే వేదాః = ఈ వేదములు; బ్రహ్మ-ఆత్మ విషయాః = బ్రహ్మమే జీవి సంసారి కాదను విషయము నందు తత్పరములు అను ప్రతీతికి—**

శ్లో. ఫలశ్రుతి రియం నృణాం న శ్రేయోరోచనం పరం,
శ్రేయోవివక్షయా ప్రోక్తా యథా భైషజ్యరోచనమ్"

అని పూర్వోక్త కారణమునే జ్ఞప్తికిఁ దెచ్చుచున్నారు— ఋషయః = మంత్రములు లేక మంత్రద్రష్టలు; పరోక్షవాదాః = అతీంద్రియార్థ ప్రతిపాదన పరములు, పరోక్షం = అట్లు పరోక్షముగ జేయుట; మమ చ ప్రియమ్ = నాకును ఇష్టము. దీని భావమిది_

శుద్ధాంతఃకరణము కలవారే బ్రహ్మతత్త్వము నెఱుంగవలెను గాని అనధికారులగు అన్యులు కాదు. అనధికారులు వ్యర్థముగా కర్మలు వీడి భ్రష్టు లగుదురు కనుక.

తా. వేదములు కర్మకాండము, బ్రహ్మకాండము, దేవతాకాండ మను విషయము కలవి. అవి బ్రహ్మయే ఆత్మ సంసారి గాదనుటలో తత్పరములు, మంత్రములు (లేక మంత్రద్రష్టలు అతీంద్రియ విషయములను ప్రతిపాదించుటలో తత్పరములు. నాకును పరోక్షమే ప్రియమైనది.

అవ. వేదజ్ఞులైనను జైమిన్యాదు లెందువలన ఆ ప్రకారము వర్ణించుచున్నారు? నేను తప్ప వాస్తవముగా వేదమును గాని వేదార్థమును గాని వేదార్థమునుగాన యెవ్వఁ డెఱుంగడు అను ఆశయమునఁ జెప్పుచున్నాఁడు. అధ్యాయ సమాప్తి వరకు.

శ్లో. శబ్దబ్రహ్మ సుదుర్బోధం ప్రాణేంద్రియ మనోమయమ్,
అనంతపారం గంభీరం దుర్విగాహ్యం సముద్రవత్. **37**

అ. శబ్దబ్రహ్మ = శబ్దబ్రహ్మమను వేదము; సుదుర్బోధం = స్వరూపమునుబట్టి గాని, అర్థమునుబట్టి గాని ఎఱుంగుట దుస్సాధ్యము అది సూక్ష్మము-స్థూలము అని ద్వివిధము; అందు సూక్ష్మమన్నచో స్వరూపమును బట్టి దుర్విజ్ఞేయ మనుచున్నారు; ప్రాణ+ఇంద్రియ మనోమయం = ప్రథమము, ప్రాణమయము-పరాఖ్యము. తరువాత మనోమయము; పశ్యంత్యాఖ్యము—పైని నింద్రియమయము—మధ్యమాఖ్యము- అది వాగ్వ్యంజకమై వాగింద్రియము ప్రధానముగాఁ గలది- మఱియు, అనంతపారం = సమిష్టి ప్రాణాదిమయమై నిర్విశేషమైన దానికి దేశము వలనను. కాలము వలనను, అపరిచ్ఛేదము లేనందువలన తుది తెలియరానిది. అర్థమునుబట్టి దుర్విజ్ఞేయత్వమును జెప్పుచున్నారు.

గంభీరం = నిగూఢార్థ ముగలది; – అందువలన – సముద్రవత్ = సముద్రము వలెః దుర్విగాహ్యం = అది ప్రవేశానర్హము. అట్లే 'శ్రుతి'.

శ్రుతి. చత్వారి వాక్పరిమితా పదాని, తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః, గుహా త్రీణి విహితా నేఙ్గయంతి తురీయం వాచో మనుష్యా వదంతి.

వాచః = శబ్దబ్రహ్మము యొక్క; పరిమితాని = గణింపబడిన; పదాని = వానిచే తత్త్వము తెలియబడును గావున ఆ పదములు; చత్వారి = నాలుగు; తాని = ఆ నాలుగింటిని, ఏ మనీషిణః- ఏ అంతర్దృష్టిగల; బ్రాహ్మణాః = బ్రాహ్మణులు; విదుః = ఎఱుంగుదురు;-ఇతరు లెఱుంగరు, ఏలయన, గుహా = దేహమధ్యమందు; త్రీణి నిహితాని = మూడు యున్నవి; న+ఇంగయతి— స్వరూపమును ప్రకాశింపజేయవు.

తురీయం... వదంతి = కేవలము వాక్కుయొక్క తురీయము, చతుర్థభాగమును వైఖరీ రూపమును మనుష్యులు ప్రాణులు పలుకుచుందురు కాని దానిని తెలియలేరు.

తా. శబ్దబ్రహ్మ స్వరూపమగు వేదము స్వరూపమును బట్టియు, అర్థమును బట్టియు తెలియుటకు దుస్సాధ్యమైనది. అది సూక్ష్మము, స్థూలము అని ద్వివిధ మగును. అందు సూక్ష్మము స్వరూపమును బట్టి దుర్విజ్ఞేయము, అందు ప్రథమము ప్రాణమయమైనది, పర యను పేరు గలది. తర్వాత మనోమయము–పశ్యంతి యను పేరు గలది. మూడవది ఇంద్రియమయము-మధ్యమ యను పేరు గలది. ఇది వాక్కును ప్రకటించునది. వాగింద్రియ ప్రధానమైయున్నది. మఱియు నీ ప్రాణేంద్రియమనస్సుల సమిష్టిమయమై నిర్విశేషమైనది దేశకాలములచే బరిచ్ఛిన్నము కానిది. కావున తుది తెలియరానిదియును, అర్థమును బట్టి దుర్విజ్ఞేయత్వము వలన నిగూఢార్థము గలదై సముద్రము వలె ప్రవేశమున కనర్హమై.

శబ్దబ్రహ్మత్వము యొక్కయు–పరాపశ్యంతీ వైఖరులను నాలుగింటియందు నంత ర్దృష్టిగల బ్రాహ్మణులు ఈ నాలుగింటిని ఎఱుంగుదురు. వానిలో మూడు హృదయగుహ యందు దాగి యున్నవి. స్వరూపమును ప్రకాశింప జేసెడి ఈ నాలుగవదైన వైఖరీ వాక్కును మనుష్యులు వచింతురు. కాని దాని తత్త్వము తెలియరు.

అవ. అందు మనీషులచేత మాత్రము తెలియదగిన సూక్ష్మరూపమును దెలుపు చున్నారు.

**శ్లో. మయోపబృంహితం భూమ్నా బ్రహ్మణానంతశక్తినా,**
**భూతేషు ఘోషరూపేణ బిసేషూర్ణేవ లక్ష్యతే. 38**

**అ భూమ్నా = అంతఃస్థితుఁడైన అపరిచ్ఛేద్యుఁడు; బ్రహ్మణా = అధిష్ఠాతయైనను అవికారుడు; అనంతశక్తినా = అవికృతుఁడయ్యు నియంతయైన; మయా = అంతర్యామినైన నాచే; ఉపబృంహితః = ఆ శబ్దబ్రహ్మము యొక్క సూక్ష్మరూపము అధిదైవము! భూతేషు = సర్వప్రాణుల యందు; ఘోషరూపేణ = నాదరూపమున; బిసేషు = తామరకాండలందు; ఊర్ణా ఇవ = తంతువు వలె; లక్ష్యతే = మనీషులచే లోపల సూక్ష్మమై తెలియబడుచున్నాడు.**

తా. ఆ శబ్దబ్రహ్మము యొక్క సూక్ష్మరూపము అపరిచ్ఛేద్యుఁడై, భూమస్వరూపుడును అధికారుఁడైన బ్రహ్మము నియంతయై అనంతశక్తియు, అంతర్యామినగు నాచే అధిష్ఠించబడి అది ప్రాణులందు నాదరూపమున తామరకాండలందు సన్ననిదారము వలె మనీషులచే గుర్తింపబడుచున్నది.

అవ. వైఖరియను పేరుగల బృహతీ వాక్కుయొక్క ఉత్పత్తి ప్రకారమును దృష్టాంత సహితముగా జెప్పుచున్నారు.

**శ్లో. యథోర్ణనాభి ర్హృదయా దూర్ణా ముద్వమతే ముఖాత్,**
**ఆకాశా ద్ఘోషవా న్ప్రాణో మనసా స్పర్శరూపిణా,**
**ఛందోమయోఽమృతమయ స్సహస్రపదవీం ప్రభుః. 39**

వ. యథా = ఏ ప్రకారము; ఊర్ణనాభిః = సాలెపురుగు; హృదయాత్ = హృదయమునందు, ముఖాత్ = ముఖద్వారమున; ఊర్ణం = తంతువును; ఉదవమతే = వెలుపలికి వెడలఁ గ్రక్కుచున్నది; అదే దృష్టాంతికమందు; ప్రాణః = ప్రాణము; ఉపాధిగాగల హిరణ్యగర్భుడు– ప్రభుః– భగవంతుఁడు; ఛందోమయః = వేదస్వరూపుడు; అమృతమయః = స్వయముగ అమృతమూర్తి; ఘోషవాన్ = నాద ముపాదానముగాఁ గలవాడు; మనసా నిమిత్తభూతమైన మనస్సు; ఆ నిమిత్తత్వమును తెలుపుచున్నారు; స్పర్శరూపిణా=స్పర్శాదులగు వర్ణములను సంకల్పించినదైన (స్పర్శగ్రహణము లక్షణము); ఆకాశాత్ = హృదయాకాశము నుండి; బృహంతిని సృజించుచున్నాఁడని మూఁడవ శ్లోకముతో నన్వయము; బృహతీ శబ్దార్థము వ్యాఖ్యానించుటకు విశేషణము; సహస్రపదవీం = బహుమార్గములు గల దానిని ......

తా. సాలెపురుగు తనగర్భమునుండి నోటిద్వారా తంతువుల నెట్లు వెడలఁగ్రక్కుచున్నదో అట్లే ప్రాణోపాధిగల హిరణ్యగర్భుఁడు భగవానుఁడు నాదముపాదానముగాఁగల వాఁడై స్పర్శాదులగు వర్ణములను సంకల్పించునదై నిమిత్తమైన మనస్సుచే బహుమార్గములు గలదైన బృహతిని సృజించు చున్నాడు. అని పైకి అన్వయము.

**శ్లో. ఓంకారా ద్వ్యంజితస్పర్శస్వరోష్మాంతస్థభూషితామ్,**
**విచిత్రభాషావితతాం ఛందోభి శ్చతురుత్తరైః,**
**అనంతపారాం బృహతీం సృజ త్యాక్షిపతే స్వయమ్. 40**

అ. ఓంకారాత్ = ఓంకారము నుండి; వ్యంజిత.... ...తామ్ = వక్షము కంఠము లోనగువానిచే ప్రకటములైన స్పర్శ- క,చ,ట,త,ప– వర్గము– (స్వర-అకారాద్యచ్చులు) ఊష్మ – శ, ష, స, హ లు అంతస్థ = య, ర, ల, వ, లను వానిచే నలంకృతము, ఓంకారము హృద్గతమై సూక్ష్మమైనది అభీష్టముగాని అకారాది వర్గరూపము కాదు; విచిత్రభాషా వితతాం = లౌకిక వైదిక భాషలచే విస్తృతమైనది; చతురుత్తరైః = నాలుగేసి అక్షరము లధికములైన; ఛందోభిః = ఛందస్సులచే; అనంతపారాం = తుదలేనిదియు; బృహతీం = బృహతీ ఛందమగు వైఖరీ వాక్కును; సృజతి = సృజించుచున్నాడు; స్వయం = స్వయముగ; ఆక్షిపతే = ఉపసంహరించుచున్నాడు;

తా. ఓంకారము నుండి వక్షము కంఠము లోనగు స్థానముల సంయోగముతో ప్రకటితములగు క,చ,ట,త,ప- వర్గము లైదును స్పర్శములు. (స్వరము) అకారాది యచ్చులు పదునాలుగును, శ,ష,స,హ అను ఊష్మలు నాలుగును, య,ర,ల,వ యనునాలుగును అంతస్థములు-అను నలుబదితొమ్మిది వర్గములచే నలంకృతమై - వైదిక లౌకికములగు వివిధ భాషలచే విస్తృతమై, నాలుగేసి అక్షరము లెక్కువగాగల ఛందస్సుచేఁ బ్రకటమగునదై -అంతమిది యని ఎఱుంగరానిదైన బృహతియను వైఖరీ వాక్కును స్వయముగనే సృజించు చున్నాను. స్వయముగనే యుపసంహరించు చున్నాను.

అవ. వానియందు ఛందస్సు లెన్నియో తెలుపుచున్నారు.

శ్లో. గాయత్ర్యుష్ణిగనుష్టుప్చ బృహతీ పఙ్క్తి రేవ చ,
త్రిష్టుప్చ జగతీ ఛందో హ్యత్యష్టితి జగద్విరాట్. **41**

తా. గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి-అత్యష్టి, అతిజగతి, విరాట్టు అనునవి ఛందస్సులు.

"ఉక్తాత్యుక్తా థా మధ్యా ప్రతిష్ఠా న్యానుపూర్విశా" యను వచనమును బట్టి ఉక్త ఛందస్సు నాలుగక్షరములు గలది. తర్వాత అత్యుక్త ఎనిమిదక్షరములు గలది ఉదాహరణకు

"అగ్నిర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః" మధ్య పండ్రెండక్షరములు-

"అగ్ని ర్జ్యోతి రింద్రో జ్యోతిః సూర్యో జ్యోతిః ప్రతిష్ఠా షోడశాక్షరీ"

"శ్రుతి. అగ్నౌ పత్నీవాస్సృజూ ర్దేవేన త్వష్ట్రా సోమం పిబ."-సుప్రతిష్ఠా వింశత్యక్షరా. పురూతమం పురూణాం స్తోతౄణాం వివాచి వాజేభి ర్వాజయంతాం చతుర్వింశత్యక్షరా గాయత్రీ.

శ్రు. "అగ్ని మీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం హోతారం రత్నధాతమం" తరువాయిని నాలుగేసి యక్షరముల వృద్ధితో "నుష్ణిక్కు" మొదలు ఉత్కృతి వివరవఱకు నుండెడి ఛందస్సులు: తెలియదగిన ఉత్కృతి అను ఛందస్సు:- 104 అక్షరములు గలది. ఛందస్సులచే నుపలక్షితమైనది.

అవ. అందువలన బృహతి యగు వైఖరి సైతము స్వరూపమును బట్టి సాకల్యముగ దుర్జ్ఞేయమని చెప్పబడినది. అర్థమును బట్టియు దుర్జ్ఞేయత్వమును జెప్పుచున్నారు.

శ్లో. కిం విధత్తే కిమాచష్టే కి మనూద్య వికల్పయేత్
ఇత్యస్యా హృదయం లోకే నాన్యో మద్వేద కశ్చన. **42**

**అ. ఆ వైఖరీ వాగ్రూపమగు వేదము, కిం విధత్తే = కర్మకాండమునందు విధివాక్య మేమి విధించుచున్నదో; కిం ఆచష్టే = దేవతాకాండ యందు మంత్రవాక్యముల నేమి ప్రకాశింప జేయుచున్నదో; కిం అనూద్య = జ్ఞానకాండమునందు దేనిని జెప్పి వికల్పమో నిషేధమో వికల్పము చేయుచున్నారు; హృదయం = దాని హృదయము లోని తాత్పర్యమును; లోకే = లోకమునందు; మత్ = నా కంటె నితరుడు; న వేద = ఎఱుంగడు.**

తా. ఆ వైఖరీ వాగ్రూపమగు వేదము కర్మకాండమునందు విధివాక్యములచే నేమి విధించుచున్నది? దేవతాకాండము నందు మంత్రవాక్యములచే దేనినిఁ నిషేధార్థమును వికల్పించు చున్నది? అని ఇవ్విధముగా నీ వేదము యొక్క తాత్పర్యము లోకమునందు నా కంటె నన్యుఁ డెవ్వఁ డెఱుంగడు.

శ్లో. మాం విధత్తేఽభిధత్తే మాం వికల్ప్యాపోహ్యతే హ్యహమ్.
ఏతావాన్ సర్వ వేదార్థ శ్శబ్ద ఆస్థాయ మాం భిదాం
మాయామాత్రమనూద్యాంతే ప్రతిషిధ్య ప్రసీదతి॥ **43**

అ. మాం విధత్తే = యజ్ఞరూపుఁడ నగు నన్నే విధించుచున్న; అభిధత్తే = అయా దేవతారూపములనుఁ జెప్పుచు; -నా కంటె వేఱు లేదు. ఆకాశాదికము ప్రపంచము-; తస్మాద్వా ఏతస్మాదాకాశ స్సంభూతః ఇట్లు; వికల్ప్య = భేదము వలె; ఎందువలనని ప్రశ్న రాగా సర్వవేదార్థములను సంక్షేపముగాఁ జెప్పుచున్నాను; శబ్దః = వేదము; మాం=పరమార్థరూపుని నన్ను; ఆస్థాయ = ఆశ్రయించి; భిదాం=భేదములను; మాయామాత్రం అనూద్య = మాయామాత్రమని యనువదించి "నేహ నానాస్తి కించన"యని. ప్రతిషిధ్య= నిషేధించి; ప్రసీదతి = నివృత్తమగును.

తా. వేదము పరమార్థస్వరూపుఁడ నగు నన్నాశ్రయించినదై భేదజగమును మాయామాత్రమని చెప్పి-బ్రహ్మము కంటె వేఱులేదని నిషేధించుచు జనవ్యాపారము నుండి నివృత్తి జెందుచున్నది. వేదార్థమంతయు నంతమాత్రమగును.

దీని భావము–ఏప్రకార మంకురమం దేరసముండునో యదే దాని విస్తారమై యుండు వివిధ కాండలశాఖలం దుండును. అట్లే ప్రణవమున కర్థమగు పరమేశ్వరుడు ఆప్రణవమునకు విస్తారములగు సకల వేదశాఖలు, కాండములకును అన్వయించును. వేఱొకడు కాడు.

# ద్వావింశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో॥ ద్వావింశే తత్త్వసంఖ్యానా మవిరోధవిధోచ్యతే,
పుం ప్రకృత్యో ర్వివేకశ్చ జన్మమృత్యువిధాది చ. 1

ఏకవింశాధ్యాయమున వేదములు ప్రవృత్తిపరములగుటను నిరాకరించి యవి మోక్షపరములని నిర్ధారణ చేయబడినది. అట్లవి మోక్షపరము లయ్యును వానియం దవాంతర వివాదములు కల్పుట్టుచున్నవి. ఎట్లన, కొందరు తత్త్వసంఖ్యల విషయమై వివదించుచున్నారు. అందును కొందరు వాహ్యార్థముల సత్త్వము, అసత్త్వముల విషయమున వివదించుచున్నారు. మరికొందరు ఆత్మతత్త్వ విషయమున గూడ ఏకమా అనేకమా అని వివదించుచున్నారు. అందేది సత్యమను జిజ్ఞాసచే ప్రశ్నించుచున్నారు.

ఉద్ధవ ఉవాచ : ఉద్ధవుడు పలికెను.

శ్లో. కతి తత్త్వాని విశ్వేశ సంఖ్యాతా న్యృషిభిః ప్రభో, 1

అ. విశ్వేశ = విశ్వేశ్వరా! ప్రభో = ప్రభూ, ఋషిభిః = ఋషులచే, తత్త్వాని = ప్రకృత్యాది తత్త్వములు, సంఖ్యాతాని = పరిగణింపబడినవి. కతి = అవి ఎన్ని యగుట యుక్తము ?

తా. ఓ విశ్వేశ్వరా ! ప్రభూ ! ఋషు లాగమ శాస్త్రమున మున్ను ప్రకృతిలోనగు తత్త్వముల సంఖ్యా పరిగణనము చేసిరి కదా. అందే సంఖ్య యుక్తము ?

అప మొదట భగవన్మతము ననువదించి పిమ్మట పెక్కుభంగుల తత్త్వ సంఖ్యానము మూడు శ్లోకములచే విస్తరించుచున్నారు —

శ్లో. నవైకాదశ పంచ త్రీ ణ్యాత్థ త్వమిహ శుశ్రుమః,
కేచిత్ షడ్వింశతిం ప్రాహు రపరే పంచవింశతిమ్ . 2

నవైకే నవ షట్కేచి చ్చత్వా ర్యేకాదశాపరే,
కేచి త్సప్తదశ ప్రాహు ష్షోడ శైకే త్రయోదశ . 3

అ. త్వం = నీవు; ఇహ = ఇప్పుడు; నవ + ఏకాదశ పంచ త్రీణి = తొమ్మిది, పదునొకండు అయిదు, మూడును చేరి యిరువది యెనిమిది తత్త్వములను; ఆత్థ = చెప్పుచుంటివి. శుశ్రుమః = ఆలకింతుము. కేచిత్ = కొందఱు; షట్ + వింశతిం = ఇఱువదియాఱును; అపరే = ఇతరులు; పంచవింశతిం = ఇఱువదియైదును; ప్రాహుః = తత్త్వములను చెప్పుదురు.

ఏకే = కొందఱు; సప్త = ఏడని; నవ = తొమ్మిదియని; షట్ = ఆరని; చెప్పుదురు. అపరే = ఇతరులు: చత్వారి - ఏకాదశ = నాలుగు; పదునొకండుమ; కేచిత్ = కొందరు; సప్తదశ = పదునేడని, ప్రాహుః = పలుకుదురు. ఏకే = కొందఱు; షోడశ - త్రయోదశ = పదనాఱు - పదమూడని చెప్పుదురు

తా. నీ విరువది తత్త్వములని చెప్పగా విందుము. కొంద రిరువది యాఱనియు, మఱి కొంద రిరువదియైదనియు నుడువుచుందురు; మఱికొంద ఱేడనియు, నితరులు తొమ్మి దనియు, పరు లారనియు, కొందఱు నాలుగనియు కొందఱు పదునొకండనియు కొందఱు పదునేడనియు మరి కొందఱు పదియాఱనియు నింకొందఱు పదుమూడనియు వక్కాణించుచున్నారు.

**శ్లో. ఏతావత్త్వం హి సంఖ్యానా మృషయో యద్వివక్షయా,**
**గాయంతి పృథగాయుష్మ న్నిదం నో వక్తు మర్హసి 4**

అ ఆయుష్మన్ = నిత్యస్వరూపా; ఋషయః = ఋషులు; సంఖ్యానాం = తత్వముల సంఖ్యల యొక్క; ఏతావత్వం = ఈనానాత్వము. యత్ + వివక్షయా = ఏప్రయోజనమును తెలుపు కోరికతో; గాయంతి = పేర్కొనుచున్నారో; ఇదం = దీనితత్వమును నః = మాకు; వక్తుం అర్హసి = తెలుపదగుదువు.

తా ఓ ఆయుష్మంతుడా! ఋషు లే ప్రయోజనము తెలుపగోరి తత్వముల సంఖ్యల నిట్లు పెక్కు విధములుగాఁ జెప్పుచున్నారు? అందులకు కారణము మాకీ విధముగా దెలియ జెప్పుము

అవ వారు చెప్పదలంచు మార్గ భేదమున పూర్వోక్త సంఖ్యలును యుక్తమే యగును. మాయ నాశ్రయించి. ఎన్ని చెప్పిన యుక్తముకాదు? అనుచున్నారు.

శ్రీ భగవా నువాచ - శ్రీభగవంతుడు వచించెను :—

**శ్లో. యుక్తం యత్సంతి సర్వత్ర భాషంతే బ్రహ్మణా యథా,**
**మాయాం మదీయా ముద్గృహ్య వదతాం కిం ను దుర్ఘటమ్. 5**

అ యత్ = ఎందువలన సర్వత్ర = అన్నిటియందు, సంతి = అంతర్భూతములైన సర్వతత్వములు కలవని; బ్రాహ్మణాః = బ్రాహ్మణులు: యథా = ఏప్రకారము, భాషంతే = వచించుచున్నారో యుక్తం = అది యుక్తమే యగును. మదీయాం మాయాం = నా మాయను: ఉద్గృహ్య = గ్రహించి; (అసత్తును సైతము మాయాశ్రయమున ఘటించుచున్నారు) వదతాం = వచించువారికి. కిం ను దుర్ఘటమ్ = ఏది దుర్ఘటము!

తా. బ్రాహ్మణు లిట్లు పలుకుట యుక్తమే. ఏలనన అంతట నంతర్భూతములై నవిగా చెప్పబడు నీ వివిధ సంఖ్యలు కల తత్వములు వాస్తవమున లేనే లేవు. అట్లు లేకున్నను మాయ నాశ్రయించి వారు చెప్పుటచే లేనిదానిని గూర్చి ఏమి చెప్పినను అది యుక్తమే యగును. ఎడారి ఎండమావుల వంటి ప్రదేశములలో జల మెంత యున్నదను వివాద మేర్పడిన సందర్భమున జలపరిమాణ మెంత యున్నదని చెప్పుకొన్నను తప్పులేదు. వాస్తవమున కచట జలమే యుండదు కదా

అవ. [illegible] యుక్తమగునో [illegible] వివాద మేల కలుగును ? [illegible] హేతువుల గూర్చి వాద మెట్లు గలుగునని చెప్పు [illegible]

శ్లో॥ నైతదేవం యదాత్థ త్వం యదహం వచ్మి తత్తథా.
ఏవం వివదతాం హేతుం శక్తయో మే దురత్యయాః. **6**

అ. త్వం = నీవు; యత్ + ఆత్థ = ఏది చెప్పుచుంటివో; ఏతత్ + న ఏవ = ఇది యీ ప్రకారము కాదు; అహం = నేను; యత్ = ఏదేని; వచ్మి = చెప్పుదునో తత్ + తథా = అది యట్లే. హేతుం ఏవం వివదతాం = ఈ ప్రకారము హేతువు గూర్చి వివాదము చేయువారలకు. మే దురత్యయాః శక్తయః = దాటరానివైన నాయొక్క సత్త్వాదిశక్తులు అంతఃకరణవృత్తి విశేషరూపముగ పరిణతములై కారణ మగుచున్నవి.

తా. నీవు చెప్పినది యిది ఆ ప్రకారము గాదు. నే నేది పల్కితినో యది ఆప్రకారమే యని యిట్లు హేతు విషయక వివాదము చేయు వారలకు దాటనలవి గానిదియు. సత్త్వగుణము లోనగు నాశక్తి అంతఃకరణ వృత్తి విశేషరూపముగ పరిణతమై హేతు వగుచున్నది

శ్లో॥ యాసాం వ్యతికరా దాసీ ద్వికల్పో వదతాం పదమ్,
ప్రాప్తే శమదమేఽప్యేతి వాద స్త మను శామ్యతి **7**

అ. యాసామ్. వ్యతికరాత్ = ఏ సత్త్వాది శక్తులయొక్క క్షోభవలన; వదతాం = వాదించువారికి పదమ్ = విషయము; వికల్పః = భేదమయ్యెను; అంతఃకరణవృత్తి వికల్పమే దానికి మూలభూతము; దీనినే వ్యతిరేకముఖముగ ప్రదర్శించుచున్నారు శమదమే = శమదమములు; ద్వంద్వసమాసమున నేకీభావము ప్రాప్తే = ప్రాప్తించగా; వికల్పః = భేదము; అప్యేతి = తొలగును. తం అను = అ వికల్పము ననుసరించి. వాదః = వాదము; శామ్యతి = శాంతించును

తా. సత్త్వాది శక్తుల విజృంభణము వలన వివాదము చేయు వారికి వికల్పము లేక భేదము సంభవించుచున్నది అంతఃకరణవృత్తి వికల్పము దానికి మూలకారణము. శమదమములు సంప్రాప్తించినంతనే యావికల్పము లయము పొందును. దానితో వాదము శమించును.

అవ. అన్నింటి నంతర్భూతములని చెప్పిన దానిని వివరించుచున్నారు

శ్లో॥ పరస్పరాను ప్రవేశా త్తత్త్వానాం సాత్వతర్షభ,
పౌర్వాపర్య ప్రసంఖ్యానం యథా వక్తు ర్వివక్షితమ్. **8**

అ. సాత్వత + ఋషభ — ఓ భక్తశ్రేష్ఠుడా!; తత్త్వానాం = కార్యకారణ తత్వములు, పరస్పర...అనుప్రవేశాత్ — ఒండొంటి యందు ప్రవేశించుట వలన వక్తుః = వచించువాని యొక్క, యథావివక్షితమ్ = వక్తవ్యేచ్ఛ ననుసరించి; పౌర్వా .... అపర్య సంఖ్యానం = పూర్వము కార్యము, పిమ్మట కారణము అని యిట్లు కార్యకారణ భావముల పరిగణన లేక పూర్వము అల్పసంఖ్యము, అపరము అధిక సంఖ్యము అని వాని భావమునకు పౌర్వాపర్యముచే గణన మగును.

తా. తత్త్వము లనగా పృథివ్యాది కార్యములు, మహదాది కారణము. కారణము లైదు పరస్పర మొకదానిలో నొకటి ప్రవేశించుట చేత కారణము పూర్వము న్యూనసంఖ్య గలది.

కార్యము అపరము అధికసంఖ్య గలది, అని యిట్లు కార్యకారణ భావపరిగణనము చేతను, వ్యక్తియొక్క వివక్షానుగుణముగ భేదము కల్గుచున్నది గాని వేఱుగాదు.

**శ్లో. ఏకస్మిన్నపి దృశ్యంతే ప్రవిష్టానీతరాణి చ,**
**పూర్వస్మి న్నపరస్మిన్వా తత్త్వే తత్త్వాని సర్వశః. 9**

అ. ఏకస్మిన్=ఒక్కటియే కారణముగా నుండు తత్త్వమునందు; ఇతరాణిచ=కార్యతత్త్వములు; పూర్వస్మిన్=కారణభూతమైన పూర్వతత్త్వమందుగాని; పరస్మిన్ తత్త్వే వా=కార్యభూతమైన పర తత్త్వమందుగాని. తత్త్వాని=క్రమముగా పర పూర్వవృత్తములు: ప్రవిష్టాని=సూక్ష్మరూపమున మట్టి యందు ఘటమువలె ప్రవేశించినవి.

తా మొదట ముఖ్యుండున దైన కారణతత్త్వమునందు మట్టియందు ఘటమువలె ఇతర ములై కార్యతత్త్వములు సూక్ష్మరూపమునఁ బ్రవేశించియున్నది. తర్వాతిదైన కార్యతత్త్వము నందును అట్లే కారణతత్త్వము లనుగతమై ఘటము నందున్న మన్నువలె ప్రకాశించుచున్నవి.

అవ. వీని సంఖ్యకు గల పరస్పర విరోధము నుపసంహరించుచున్నాడు.

**శ్లో. పౌర్వాపర్య మతోఽమీషాం ప్రసంఖ్యాన మభీప్సతాం,**
**యథా వివిక్తం యద్వక్త్రం గృహ్ణీమో యుక్తి సంభవాత్. 10**

అ అతః=అందువలన; అమీషాం=ఈ తత్త్వముల యొక్క; పౌర్వ+అపర్య=కారణ కార్య భావము; ప్రసంఖ్యాన=న్యూనాధిక సంఖ్యా గణనమును; అభీప్సతాం=వాదించు వారలకు; యథా= ఏ ప్రకారము; యత్+వక్త్రం=ఏ ముఖమెన్నియని పలుకునో అట్లు వివిక్తం=నిశ్చితమగు, యుక్తి సంభవాత్=అంతటను యుక్తిసంభవము వల్ల. గృహ్ణీమః=గ్రహించుదుము

తా. కాఁబట్టి ఈ తత్త్వముల యొక్క కారణ కార్యభావములు న్యూనాధిక సంఖ్యను గూర్చి వాదించువారికి ఏ ప్రకార మెవని నోరు వచింపఁ గలుగునో అది యంతయు నట్లే నిశ్చయింపఁబడినదగును. పూర్వము చెప్పినన్యాయము ననుసరించి పరస్పర ప్రవేశ ధర్మమును బట్టి సకలవాదములకును యుక్తి కలదు కనుక.

అవ. అయ్యా! కార్యకారణ తత్త్వములతో పృథక్త్వము. అపృథక్త్వ మను వివక్ష సేయుటచే వాని సంఖ్యా భేదము కలిగిన కలుగుఁగాక. కలుగును ? దేనిచే ఇరువదారు. ఇరువ దైదు తత్త్వములు ప్రవర్తించినవో లేదా ఆ జీవేశ్వరులకు భేదాపేక్ష ఎట్లు జెప్పుచున్నారు.

**శ్లో. అనాద్యవిద్యాయుక్తస్య పురుషస్యాత్మవేదనం,**
**స్వతో న సంభవే దన్య స్సర్వజ్ఞో జ్ఞానదో భవేత్. 11**

అ. అనాది+అవిద్యా యుక్తస్య=అనాదియగు నవిద్యతోఁ గూడిన పురుషుఁడు (పురుషునికి)' ఆత్మవేదనం=ఆత్మజ్ఞానము; స్వతః న సంభవేత్=స్వయముగా సంభవించదు; స్వతః సర్వజ్ఞః= స్వయముగా సర్వజ్ఞుడు; జ్ఞానదః=జ్ఞానప్రభువు; పరమేశ్వరుడు; అన్యః=అన్యుఁడు కాఁగలడని ఇరు వదియారు తత్త్వముల వారి యభిప్రాయము.

తా. ప్రకృతి పురుష లిరువురును మహదహంకార తన్మాత్రలు 7 జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనస్సులు - 11: పంచ మహాభూతములు 5 - ఇవ్విధముగా తత్త్వములు

25 అయినను పురుషుడు స్వయముగా నవిద్యాయుక్తుడైనందున స్వయముగ సర్వజ్ఞుడునైన పరమేశ్వరుడు వేరొక్క పురుషుండని 26 తత్త్వము వారి యభిప్రాయము.

శ్లో. పురుషేశ్వరయో రత్ర న వైలక్షణ్య మస్తి వై,
తదన్యకల్పనాపార్థా జ్ఞానం చ ప్రకృతే ర్గుణః 12

అ. పురుష + ఈశ్వరయోః = జీవేశ్వరుల కిరువురకు; అత్ర = ఇట్లు వైలక్షణ్యం = అసమానత్వము. భేదము; న అస్తి వై = లేదు; వారిరువురును చిద్రూపులైనందున తత్ + అన్యకల్పనా = వారతమ్యంతము భిన్నులని కల్పించుట; అపార్థా = వ్యర్థము ఈ ప్రకారము పంచవింశతి పక్షము ప్రవర్తించునని యర్థము. ఈ ప్రకారమైన ఈశ్వరప్రసాది లబ్ధజ్ఞానముగల పురుషుడు వేఱేవలన తత్త్వసంఖ్య యొకటి వృద్ధియై ఇరి తత్త్వములగును జ్ఞానం చ = జ్ఞానము; ప్రకృతేః గుణః = ప్రకృతి యొక్క సత్త్వగుణవృత్తియగుట నందంతర్భూతము.

తా. జీవేశ్వరు లిరువురకు వైలక్షణ్యము = భేదము లేదు అట్లు కల్పించుట మిక్కిలి వ్యర్థమే యగును. ఇరువురును చిద్రూపులు గనుక - ఇరువదియైదు తత్త్వములే సరిపడును. అట్లయిన నీశ్వర ప్రసాద లబ్ధుడైన జీవుడు దెట్లను దేయగా నున్న వాడని చెప్పుటలో తత్త్వమొకడు అభివృద్ధి నొంది ఇరువదియారు తత్త్వము లగును కదపటి చూడఁబోయిన నీ రెండు పక్షములును సరిపడవు జ్ఞానమును ప్రకృతియొక్క సత్త్వగుణవృత్తియై అంతర్భూతమగును.

అవ. అయ్యా! జ్ఞానము జీవధర్మము గదా! ప్రకృతి గుణమెట్లగునని చెప్పుచున్నారు

శ్లో. ప్రకృతి ర్గుణసామ్యం వై ప్రకృతే ర్నాత్మనో గుణాః
సత్త్వం రజ స్తమ ఇతి స్థిత్యుత్పత్త్యంత హేతవః 13

అ. గుణసామ్యం = త్రిగుణాత్మకమైన సామ్యావస్థగల, ప్రకృతిః = ప్రకృతి సత్త్వం, రజః తమః ఇతి = సత్త్వము, రజస్సు, తమస్సు అను; స్థితి + ఉత్పత్తి + అంత హేతవః = జగముల యొక్క ఉనికి, పుట్టుక, నాశము అను వానికి కారణములైన గుణాః = గుణములు; ప్రకృతేః = ప్రకృతివే; న + ఆత్మనః = ఆత్మకు సంబంధించినవి కావు.

తా. త్రిగుణముల సామ్యావస్థ గలది ప్రకృతి. జగముల యొక్క ఉనికి, జన్మము, నాశము అనుదానికి హేతువైనవి సత్త్వము, రజస్సు, తమము అను మూడు గుణములు ప్రకృతివే. జీవుడు కర్త కానందున నతడు స్థిత్యాదులకు హేతుభూతముంగు గుణముల కాశ్రయుడగుట కుదరదు.

శ్లో. సత్త్వం జ్ఞానం రజః కర్మ తమోఽజ్ఞాన మిహోచ్యతే,
గుణవ్యతికరః కాల స్స్వభావ స్సూత్ర మేవ వా. 14

అ. సత్త్వం = అందువలన; సత్త్వమయమగు, జ్ఞానం = జ్ఞానము; ప్రకృతి గుణమని పుణ్యముతో సంబంధము; అయ్యా! దానిచే నివర్త్యమగు కర్మయు; అజ్ఞానమును తత్త్వాంతర మగునా యన్న కాదు రజః కర్మ = రజోగుణముయొక్క వృత్తి కర్మయు; తమః = తమోగుణవృత్తి; అజ్ఞానం = అజ్ఞానము; ఇహ + ఉచ్యతే = ఈతత్త్వములయందు చెప్పబడుచున్నది. అందువలన-కర్మాజ్ఞానములు రజస్తమస్సు

లద్వారా ప్రకృతియం దంతర్భూతములని భావము. అట్లయినను కాలస్వభావములు తత్త్వాంతరములగునా యనఁగా కాదు. గుణవ్యతికరః—గుణములయొక్క వైషమ్యము వలన నగునది అది కాలః = కాలము; ఈశ్వరుడే కాలమగును. స్వభావః=స్వభావమన;సూత్రం = సూత్రము. మహత్త్వము ఆది సర్వశక్తి మంతము; ఈ ప్రకారము జ్ఞానాదులు యథాయథాముగ అంతర్భూతములగుటవలన పక్షద్వయము లందును తత్త్వవృద్ధి లేదు. ఇదియే పక్షాంతరము లందును ఎఱుంగదగును. స్వమతమునందు గుణములు ఆగమాపాయులగుట వలన ప్రకృతికంటె భేదము వివక్షిత మైనది. అందువలన గుణములు మూడు తత్త్వములు;

తా. సత్త్వమయమైనది జ్ఞానమును, రజోమయము కర్మము. తమోవృత్తియగునది అజ్ఞానము. ఈ కర్మాజ్ఞానములు ప్రకృతియం దంతర్భూతము లగును. గుణ వైషమ్యము గావించు కాల మీశ్వరుడే. మహత్తత్వమే సూత్రము.

అవ. పూర్వోక్తములైన పక్షద్వయ సాధారణములగు ఇతరములైన పంచ వింశతి తత్త్వములను రెండున్నర శ్లోకములచేఁ జెప్పుచున్నారు.

శ్లో. పురుషః ప్రకృతి ర్వ్యక్త మహంకారో నభోఽనిలః,
జ్యోతి రాపః క్షితి రితి తత్త్వా న్యుక్తాని మే నవ. **15**

అ. పురుషుడు, ప్రకృతి - వ్యక్తమనగా మహత్తత్త్వము, అహంకారము నభము అనఁగా నాకాశగుణము శబ్దము. అనిల మనఁగా స్పర్శము. జ్యోతిః=అగ్నిగుణము రూపము. ఆపః=జలగుణము రసము. క్షితిః ఇతి – భూమి గుణము గంధము మే=నాచే; నవ = తొమ్మిది; తత్త్వాని ఉక్తాని= తత్త్వములు చెప్పబడినవి

నేను మొదట ప్రకృతి పురుషుఁడు, మహత్తత్త్వము అహంకారము, శబ్దస్పర్శరూప రస గంధములను తన్మాత్రలు చేరి మొత్తము తొమ్మిది తత్త్వములను చెప్పితిని.

అవ. పదునొకండు తత్త్వములను దర్శింపజేయుచున్నారు.

శ్లో. శ్రోత్రం త్వ గ్దర్శనం ఘ్రాణో జిహ్వేతి జ్ఞానశక్తయః,
వాక్పాణ్యుపస్థపాయ్వంఘ్రిః కర్మాణ్యంగోభయం మనః. **16**

అ. జ్ఞానశక్తయః = జ్ఞానేంద్రియములు; కర్మాణి=కర్మేంద్రియములు. శ్రోత్రము;త్వక్కు; చక్షువు,ఘ్రాణము జిహ్వ అను నైదును జ్ఞానేంద్రియములు: వాక్కు, పాణి, ఉపస్థ, పాయువు, (గుద స్థానము) పాదము అను నైదును కర్మేంద్రియములు. ఈరెండింటి సంబంధము గలది మనస్సు— కలసి పదునొకండు తత్త్వములు

తా. సుగమము.

అవ. అయిదింటిని జెప్పుచున్నారు

శ్లో. శబ్దః స్పర్శో రసో గంధో రూపం చేత్యర్థజాతయః.
గత్యు క్త్యుత్సర్గశిల్పాని కర్మాయతనసిద్ధయః. **17**

అ. శబ్దః...రూపం చ + ఇతి = శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. అనునవి అర్థజాతయః = విషయములుగా పరిణమించినవి పంచమహాభూతములు. గతి లోనగువానిచే తత్కార్యాధిక్యముచే ఉభయపక్షము లంటును అంగీకనగా చేసినుచున్నారు; గతి + ఉక్తి + ఉత్సర్గ-శిల్పాని = గమనము, వచనము, విసర్జనము, ఆదానము, ఆనందము అనునైదును. కర్మ + ఆయతన సిద్ధయః = ఆ కర్మేంద్రియములయొక్క ఫలములు - తత్త్వాంతరములు.

తా. శబ్దము, స్పర్శము, రూపము రసము, గంధము అను జ్ఞానేంద్రియ విషయములై పరిణమించు పంచ మహాభూతము లైదగును. వచనాదాన గమన విసర్గాదానము లైదు కర్మేంద్రియ వృత్తులగును. నాన తత్త్వాంతరము లగును.

అవ. ఈ ప్రకారము మతత్రయమునందు - తత్త్వసంఖ్యాభేదమును దేని వివక్షచే నిర్ణయింతు రని ప్రశ్నించిన దానికి ఆ యా మత తాత్పర్యమును దెలుపుచున్నారు

శ్లో. సర్గాదౌ ప్రకృతి ర్హ్యస్య కార్యకారణరూపిణీ,
సత్త్వాదిభి ర్గుణై ర్ధత్తే పురుషోఽవ్యక్త ఈక్షతే. **18**

అ. కార్యకారణరూపిణీ = కార్యములగు షోడశ వికారములు కారణములగు మహదాదులు నేడును; స్వరూపముగాం గలదైన; ప్రకృతిః = ప్రకృతి అస్య = ఈ విశ్వముయొక్క; సర్గ + ఆదౌ = సృష్టిప్రారంభమునందు; సత్త్వ + ఆదిభిః గుణైః = సత్త్వము లోనగు గుణములచే; ధత్తే = ఉపాదాన కారణ రూపమగుట వలన; సృజ్యము లగు వాని యవస్థలను, జీవులను ధరించుచున్నది. అవ్యక్త = అపరిణామియైన నిమిత్తము; పురుషః = పురుషుండు; ఈక్షతే = ఈ ప్రకృతిని జూచుచున్నాడు అందు వలన పరిణామిని యైన ప్రకృతి కంటె పురుషుడు వేఱు

తా. ఈ విశ్వసృష్టి ప్రారంభమునందు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు మనస్సు పంచభూతములను పదునారు కార్యములును మహదహంకార పంచతన్మాత్రలను కారణము లేడును స్వరూపముగాంగల ప్రకృతి సృజింపబడు జీవాది సకలము సూక్ష్మముగా ధరించుచున్నది. దానిని పరిణామరహితు పురుషుండు కేవలము చూచుచున్నాడు. అందువలన పరిణామిని యగు ప్రకృతికంటె అపరిణామి యగు పురుషుడు వేఱు.

అవ. తత్త్వములచే నారంభమైన కార్యమునకు దానియందే అంతర్భావమును జెప్పుచున్నారు.

శ్లో. వ్యక్తాదయో వికుర్వాణా ధాతవః పురుషేక్షయా,
లబ్ధవీర్యా స్సృజం త్యండం సంగతాః ప్రకృతే ర్బలాత్. **17**

అ. వ్యక్త + ఆదయః = మహదాదులు; ధాతవః = ప్రకృతివలన నుద్భవమైన ప్రకృతికార్యము లేడును; వికుర్వాణాః = వేఱురూపముల దొరకినవై; సంగతాః = ఒండొండు గూడినవై; ప్రకృతేః బలాత్ = ప్రకృతి బలముచే; అండమ్ = కార్యమగు బ్రహ్మాండమును. సృజంతి = సృజించుచున్నవి

తా. వ్యక్తములగు మహదాదు లేడు నగు ప్రకృతి వికృతులు, తత్త్వము- తమ తమ రూపులు తేటపడునట్లు వేఱుగం గన్పట్టుచున్నవై పురుషుని వీక్షణముచే బలసంపన్నములై యొండొండు గూడి ప్రకృతి నాశ్రయించి బ్రహ్మాండమను కార్యమును సృజించుచున్నవి.

అవ. ఈ ప్రకారము స్వమతము నుపసంహరించి, మతాంతరములందు సామాన్యముగా నిరూపితమైన తత్త్వ ఘటనను విశేషముగా సతాత్పర్యముగా తెలుపుచున్నారు.

శ్లో. సప్తైవ ధాతవ ఇతి తత్రార్థాః పంచ ఖాదయః,
జ్ఞానమాత్మో భయాధార స్తతో దేహేంద్రియాసవః,
నైక మన్యతరద్వాపి విహా యేహోపలభ్యతే. 18

అ. సప్త + ఏవ ధాతవః ఇతి = ఏడు మాత్రము తత్త్వములని; తత్ర + అర్థాః = అందు విషయములు. ఖ + ఆదయః = ఆకాశాది పంచమహా భూతములు. జ్ఞానమ్ = దృశ్యమెఱుంగు ద్రష్ట జీవుఁడు ఉభయ + ఆధారః = ఆభూతములకు జీవునికి రెంటికి అధారమైన పరమాత్మచే. అందుప్రకృతి లోనగునవి కారణమలై పంచభూతములం దంతర్భావ మొందును. ఇతరముల కంతర్భావమును జెప్పుచున్నాడు తతః = వానివలన; దేహ + ఇంద్రియ + అసవః దేహేంద్రియ ప్రాణములను కార్యములు జనించును; ఏకం + అపి = ఒక్కటైనను; ఇతరత్ + వా + అపి = ఇతరమగు నొక్కటై; విహాయ = తత్త్వమును వదలి న + ఉపలభ్యతే = యుండదు

తా. దృశ్యమగు పంచమహాభూతములు, ద్రష్టయగు జీవుఁడు, ఈద్రష్టకు దృశ్యమునకును ఆధారభూతుఁడైన పరమాత్మ చేరి యేడుతత్త్వములగును ఆప్రకృతిలోనగు కారణములగు పంచభూతములందు అంతర్భావము - ఈ యేడింటివలన దేహేంద్రియ ప్రాణములను కార్యములు పుట్టుచున్నవి. ఇందే యొక్కటియును తత్త్వమును వీడి యుండదు.

అవ. షట్ + ఇతి = ఆఱు తత్త్వములని చెప్పెడు మతమునగూడ భౌతికమునకు భూతాంతర్భావమును, జీవమునకు పరమాత్మాంతర్భావమును చెప్పుచున్నారు.

శ్లో. షడిత్యత్రాపి భూతాని పంచ షష్ఠః పరః పుమాన్,
తై ర్యుక్త ఆత్మసంభూతై స్సృష్ట్వేదం సముపావిశత్. 19

అ. అత్ర + అపి = ఈ సంఖ్యలతో బూతాని; పంచబూతములు; షష్ఠః = ఆఱవవాడు; పరః పుమాన్ = పరమ పురుషుఁడు; ఆత్మసంబూతః = తనవలన జన్మించిన వాఁడు; తైః + యుక్తః = వానితోఁ గూడినవాఁడు; ఇదం సృష్ట్వా = ఈ విశ్వమును సృజించి; సముపావిశత్ = ఇందు జీవరూపమునఁ ప్రవేశించెను.

తా. ఆఱుతత్త్వములని చెప్పెడి వారి యభిప్రాయ మెట్లనగా పంచమహాతత్త్వములు; వానియందు భౌతికపదార్థములన్నియు నంతర్భూతము లగును. పరమపురుషుడు పరమాత్మ. ఈయనయందు జీవు డంతర్భూతుడు, ఆ పరమాత్మ ఈ జగమును సృజించి జీవభాగమున నిందు ప్రవేశించును.

శ్లో. చత్వా ర్యేవేతి తత్రాపి తేజ ఆపో న్న మాత్మనః,
జాతాని తై రిదం జాతం జన్మావయవినః ఖలు. 20

అ. చత్వారి + ఏవ—ఇతి = నాలుగు తత్త్వములును; తత్ర + అపి = అసంఖ్యతో; ఆత్మనః = ఆత్మలోనగు; ఆత్మతోకలసి నాలుగు. అంతర్భావార్థము చెప్పుచున్నారు; తైః = అ నాలుగింటిచే; ఇదం జాతం = ఈ విశ్వము జనించినది; ఆవయవినః = సమస్తకార్యజాతమునకు, జన్మ = జన్మము; తైః ఖలు = ఆనాల్గింటిచేతనే.

శ్లో. ఏకాదశత్వ ఆత్మాసౌ మహాభూతేంద్రియాణి చ,
సంఖ్యానే సప్తదశకే భూతమాత్రేంద్రియాణి చ,
పంచ చైకేన మనసా ఆత్మా సప్తదశః స్మృతః. **21**

అ. ఏకాదశత్వమ్=పదునొకండు తత్త్వముల సంఖ్య; అసౌ, ఆత్మా = ఈ పరమాత్మ; మహాభూత + ఇంద్రియాణి చ = మహాభూతములు - జ్ఞానేంద్రియములు పది చేరి పదునొకం డగును.

సప్తదశకే-సంఖ్యానే = పదునేడు తత్త్వముల సంఖ్యయందు; భూతమాత్రమ్ + ఇంద్రియాణి చ = పంచభూతములు. శబ్దాది తన్మాత్ర లైదు, ఇంద్రియములు పంచ చ =అయిదగును; ఏకేన మనసా = ఒక్క మనస్సుతో గూడిన; ఆత్మా = పరమాత్మ; సప్తదశః = పదునేడు సంఖ్య గలవాఁడని; స్మృతః = చెప్పఁబడుచున్నాడు.

తా. పదునొకండు తత్త్వములని చెప్పుట ఇట్లు:- పంచభూతములు, జ్ఞానేంద్రియములు, పరమాత్మ చేరి పదునొకండు తత్త్వము లగును.

పదునేడు తత్త్వముల సంఖ్య-మహాభూతములైదు, శబ్దాదితన్మాత్రలైదు; జ్ఞానేంద్రియము లైదు. మనస్సు ఒక్కటి. ఈపదునాఱింటితోగూడిన పరమాత్మ పదునేడు-అనుట.

శ్లో. తద్వత్ షోడశసంఖ్యానే ఆత్మైవ మన ఉచ్యతే
భూతేంద్రియాణి పంచైవ-మన ఆత్మా త్రయోదశ. **22**

అ తత్ + వత్ = అ విధముగా; షోడశసంఖ్యానే = పదునాఱు తత్త్వముల సంఖ్య; ఏషః ఆత్మా = ఈ పరమాత్మ; మనః = సంకల్పించువాఁడై, మనస్సు అని; ఉచ్యతే = చెప్పఁబడును; భూత తన్మాత్రేంద్రియములు పదునైదు సంకల్పించు మనోరూపుఁడైన ఆత్మచే పదునా ఱగును.

తా. ఆట్లే పదునాఱను సంఖ్యలో ఆత్మయే మనస్సుగా చెప్పఁబడి పై పదునేడును పదునాఱగుచున్నవి. పదమూడు సంఖ్య:- తన్మాత్రలతో నేకీకృతమైన భూతము లైదు; జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లైదు; మనః = మనస్సు; ఇంద్రియాధిష్ఠాత జీవాత్మ పరమాత్మ ఈ విధముగా జేరి పదమూ డగును.

అవ. ఉపసంహరించుచున్నారు.

శ్లో. ఇతి నానాప్రసంఖ్యానం తత్త్వానా మృషిభిః కృతం,
సర్వం న్యాయ్యం యుక్తిమత్త్వా ద్విదుషాం కిమశోభనమ్. **23**

అ. ఇతి = ఈ ప్రకారము; తత్త్వానాం = తత్త్వములయొక్క; నానాప్రసంఖ్యానం = వివిధ ప్రసంఖ్యలు; ఋషిభిః = ఋషులచే; కృతం = ప్రకృతి పురుష భేదము తెలియజేయ జెప్పబడినవి- యుక్తిమత్త్వాత్ = యుక్తితో గూడిన; విదుషాం = బుద్ధిమంతులకు; సర్వం న్యాయ్యం = అన్ని వాదములు న్యాయములే; అశోభనం కిం = ఇం దనర్థమేమి కలదు ?

తా. ఇన్ని విధములుగా తత్త్వముల వివిధసంఖ్యను ఋషులు ప్రకృతి పురుష భేదమును దెలుపుటకుఁ జెప్పిరి. బుద్ధిమంతులగువారల యుక్తిచే సమన్వయము, అన్ని తత్త్వముల సంఖ్యలును న్యాయమే యగును ఇం దనర మేదియును లేదు.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించుచున్నాడు.

అవ. ఆ ప్రకృతి పురుషుల విషయమై ప్రశ్నించుచున్నాడు.

శ్లో॥ ప్రకృతిః పురుష శ్చోభౌ యద్యప్యాత్మవిలక్షణౌ,
అన్యోన్యోపాశ్రయాత్కృష్ణ దృశ్యతే న భిదా తయోః. 24

అ. కృష్ణ = శ్రీకృష్ణా!; ప్రకృతిః పురుషశ్చ = ప్రకృతియు – పురుషుడును; ఉభౌ = ఇరువురును. ఆత్మవిలక్షణౌ = స్వరూపముచే జడాజడ స్వభావముచే భేదము గల వా రగుదు రను; అన్య—అన్య—ఉపాశ్రయాత్ = ఒండొరుల నుపాశ్రయించుట వలన; తయోః = వారియొక్క; భిదా = భేదము; న దృశ్యతే = కనుపించదు,

తా. ఓ కృష్ణా! ప్రకృతి పురుషులను వారిరువురును స్వభావముచే భిన్నులుగదా! అనగా ప్రకృతి జడస్వభావము గలది. పురుషుడు చైతన్యస్వభావుడు. అనగా ప్రకాశస్వభావుడు. వీ రొండొరుల నాశ్రయింతురేని జడమగు ప్రకృతిదే పైచేయి యగును. పురుష నడంచును. ప్రకాశ స్వభావుడు పురుషుడు పైవాడగుచో ప్రకృతిని మించును. తేజస్తిమిరములవలె నొండొరులకును పైకారణమును బట్టి భేదప్రతీతి కలుగనేరదు.

శ్లో. ప్రకృతౌ లక్ష్యతే హ్యాత్మా ప్రకృతిశ్చ తథాత్మని
ఏ తన్మే పుండరీకాక్ష మహాంతం సంశయం హృది।
ఛేత్తు మర్హసి సర్వజ్ఞ వచోభి ర్నయనైపుణైః. 25

అ. ప్రకృతౌ = ప్రకృతియందు, అనగా తత్కార్యమందు; ఆత్మా = పురుషుడు; లక్ష్యతే = కన్పట్టును; తథా = అ ప్రకారము; ప్రకృతిశ్చ = ప్రకృతి. ఆత్మని = పురుష నందు గన్పట్టును; పురుషుడు లేక ప్రకృతికి ప్రతీతి లేదు. నేనను అభేద ప్రతీతి వలన దేహాత్మలకు భేదము కన్పట్టుట లేదని యర్థము, పుండరీకాక్ష = ఓ కమలాక్ష !; హృది = హృదయమునందు; మహాంతం సంశయం = గొప్ప సంశయము; ఏతత్ = దానిని; సర్వజ్ఞ = ఓ సర్వజ్ఞ; నయనైపుణైః = యుక్తి ప్రావీణ్యముచే; వచోభిః = వచస్సులచే; ఛేత్తుం = పోగొట్టుటకు; అర్హసి = తగుదువు.

తా. ప్రకృతియందు పురుషుడును, పురుషునియందు ప్రకృతియును దోచును. అనగా ప్రకృతికార్యమగు దేహమునందు పురుషుడు తోచుచున్నాడు. పురుషుడు లేకున్న ప్రకృతి గాని ప్రకృతి కార్యపు దేహముగాని కన్పట్టదు. అట్లే పురుషునియందు ప్రకృతియు, తత్కార్య దేహమును అగపడుచున్నది. ఇట్లుండ ప్రకృతికార్యమగు దేహము నేనను అభేద ప్రతీతి వలన దేహాత్మలకు భేదము కన్పట్టుట లేదు; నాహృదయమందున్న ఈ గొప్పసంశయ మును భవదీయ దివ్యవచో నైపుణ్యముచే నివారింపుము.

శ్లో. త్వత్తో జ్ఞానం హి జీవానాం, ప్రమోషస్తేఽత్ర శక్తితః
త్వమేవ హ్యాత్మమాయాయా గతిం వేత్థ న చాపరః. 26

అ. హి = ఏ కారణమున; త్వత్తః = నీ ప్రసాదమున; జీవానాం = జీవులకు; జ్ఞానం = జ్ఞానమును; తే శక్తితః = నీ మూలమున; ప్రమోషః = అజ్ఞానభ్రంశమును; త్వం—ఏవ = నీవే;

ఆత్మమాయాయా = నీ మాయ యొక్క; గతిం = పోకడను; వేత్థ = ఎఱుగుదువు; న చఅపరః = ఇతరు లెఱుంగరు.

తా. దేనివలన నిందు జీవులకు నీ ప్రసాదమున జ్ఞానము కలుగుచున్నదో నీమాయ వలన ఆ జ్ఞానహరణము జరుగుచున్నది. నీవే నీ మాయా తత్త్వము నెఱుంగుదువు. అన్యు లెఱుంగరు.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవానుడు చెప్పెను—

శ్లో. ప్రకృతిః పురుష శ్చేతి వికల్పః పురుషర్షభ,
ఏష వైకారిక స్సర్గో గుణవ్యతికరాత్మకః. **27**

అ. ప్రకృతిః-పురుషశ్చ+ఇతి = ప్రకృతి పురుషుఁ డను; వికల్పః = అత్యంత భేదము కలిగియున్న; ఏషః = ఈ, సర్గః = సృజింపబడు దేహాది సంఘాతము, వైకారికః=స్థూలమార్గమున నానా వికారములు గలుగు; గుణవ్యతికరాత్మకః = సత్త్వాది గుణముల వైషమ్యము వలన నేర్పడినది.

తా. ప్రకృతి పురుషుడు అనువా రిరువురు అత్యంత భేదము గలవా రగుదురు. ఏల యనగా ప్రకృతియను శబ్దముచేఁ జెప్పబడు ఈ దేహేంద్రియ సంఘాతము స్థూలమార్గమున జూచినచో వివిధములగు వికారములు గలదై సత్త్వాది ప్రగుణముల వ్యతికరముచే వ్యత్యస్తము లేక వైషమ్యముచే సృజింపబడిన స్వరూపము గల దగుచున్నది.

శ్లో. మమాంగ మాయా గుణమ య్యనేకధా వికల్పబుద్ధీశ్చ గుణై ర్విధత్తే
వైకారిక స్త్రివిధోఽధ్యాత్మ మేక మథాధిదైవ మధిభూత మన్యత్, **28**

అ. అంగ=ఓయీ! మమ=నాయొక్క; గుణమయీ=త్రిగుణస్వరూపమగు మాయా,=మాయ గుణైః=త్రిగుణములచే; అనేకధా = పెక్కు విధములుగ; వికల్పబుద్ధీః=భేద బుద్ధులనుతో; విధత్తే= చేయును. వైకారిక=వైకారికములనేక వికారములు గలదైనను; (స్థూల మగుమార్గమును జెప్పుచున్నాడు) త్రివిధః=మూడువిధములగు; అధ్యాత్మం+ఏకం=అధ్యాత్మ మను నొకటి, అథ=మఱియు, అధిదైవం =అధిదైవము; అన్యత్ =ఇతరము; అధిభూతం=అధిభూతము.

తా. ఓ ఉద్ధవా! త్రిగుణస్వరూపిణియగు నామాయ భేదమును, భేదబుద్ధులను సత్త్వాది గుణములచే బెక్కు విధములుగా జేయుచున్నది. అట్లయినను వైకారికమగు దేహేంద్రియ సంఘాతము నానావిధములు గలదైనను స్థూలమగు మార్గము అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము అని మూడు విధములుగా చెప్పబడినది.

అవ. వాని రూపమును తెలుపుచున్నాడు.

శ్లో. దృగ్రూపమార్కం వపు రత్ర రంధ్రే పరస్పరం సిధ్యతి యస్స్వ తఃఖే
ఆత్మా యదేషా మపరో య ఆద్య స్స్వయానుభూత్యాఽఖిల సిద్ధ సిద్ధః. **29**

అ. దృక్ =చక్షురింద్రియము, అధ్యాత్మ మగు; రూపం = రూపము; అధిభూతము; అత్ర రంధ్రే= ఈచక్షుర్గోళమందు' ప్రవేశించుచున్నది; అర్కం వపుః =సూర్యసంబంధ మగు అంశము — అధి

దైవము; యః=ఏసూర్యుడు; ఖే=ఆకాశమునందు; స్వతః=స్వయంవిభుడై; పరస్పరం = అధ్యాత్మాధిదైవముల చేరికవలన; సిద్ధ్యతి=రూపసిద్ధి కలుగును; అనగా చక్షువులచే రూపము తెలియబడుచున్నది ఆ చక్షురింద్రియముల ప్రకృతి ఇతరవిధముగా ప్రవర్తింపని దగుటచే దాని యధిష్ఠాతదైవము తెలియబడుచున్నది. అధిదైవమువలన చక్షువులయొక్క ప్రవృత్తి కలుగుచున్నది. ఆప్రవృత్తి వలన రూపము తెలియబడుచున్నది. ఈప్రకార మీ మూఁడును పరస్పరము సిద్ధించుచున్నవి ఇందు రంధ్రమనిన దృష్టాంతమున కుపయోగి యగుటచే విశేషవ్యావర్త్యమును జెప్పుచున్నాడు. యః= ఎవఁడు; ఖే=ఆకాశమందు; మండలస్వరూపుడై వర్తించుచున్నాడు; స్వతః=స్వతఃసిద్ధుడు,

ఇప్పుడు ఆత్మకు వికారిత్వాదులు లేమిచే భేదము చెప్పబడుచున్నది.

౨. యత్=ఏ కారణము వలన; ఆత్మా=పరమాత్మ, ఏషాం=ఈ అధ్యాత్మాదులకు; ఆద్యః= కారణభూతు యున్నాడు; కనుక ఏక రూపుడు; అపరః=అందువలన దానికంటె భిన్నుడు స్వప్రకాశము గలవాడగుటవలన అని చెప్పుచున్నాడు. స్వయా+అనుభూత్యా=తపస్సిద్ధ ప్రకాశముతో; అఖిలసిద్ధసిద్ధః=ఎల్లసిద్ధులకు ప్రకాశములకు సైతము ప్రకాశకుడు;

తా. దృక్కనగా చక్షురింద్రియము. అధ్యాత్మము- రూపము; అధిభూతము అగ్ని గుణము; ఇవి రెండును నేత్రగోళమందు వర్తించుచున్నవి. సూర్యసంబంధియగు నంశము అధిదైవమగును. చక్షువుచే రూపము తెలియఁబడును. ఆ రూప మితరేంద్రియములచేఁ దెలియబడనందువలన చక్షురింద్రియములచే దెలియబడుచున్నది. ఆ చక్షురింద్రియ మన్యథా ప్రవర్తింపనందున తదధిష్ఠాత, దైవము తెలియబడుచున్నది. ఆ దైవమువలననే చక్షువు ప్రవర్తించును. అందువలన రూపజ్ఞాన మేర్పడును. ఈ ప్రకార మీ మూఁడును పరస్పరము సిద్ధించుచున్నవి.

ఆకాశమునందు మండలస్వరూపుడై యుండు సూర్యుడు స్వతస్సిద్ధ చక్షుర్విషయుడు ఇట్లే ఏ పరమాత్మ ఈ అధ్యాత్మాది త్రయంబునకు కారణమైయున్నాడో యతఁడు ఏకరూపుడై దానికంటె భిన్నుడై స్వతస్సిద్ధ ప్రకాశముతో పరస్పర ప్రకాశములగు ఇంద్రియగుణదైవములకు ప్రకాశకుడై యున్నాడు.

**శ్లో. ఏవం త్వగాదిశ్రవణాది చక్షుర్జిహ్వాది నాసాది చ చిత్తయుక్తమ్ 30**

అ. చక్షుః=చక్షువు-ఏప్రకారమో; ఏవం=ఈప్రకారము; త్వక్+ఆది=త్వక్కులోనగునది; శ్రవణ+ఆది=చెవి లోనగునది; జిహ్వా+ఆది=జిహ్వ లోనగునది; నాసా+ఆది=ముక్కు లోనగునది; చిత్తయుక్తమ్=చిత్తముతోఁగూడిన, అంతఃకారణాంతరమును తెలియవలెను.

తా. పూర్వశ్లోకమున అధ్యాత్మము- చక్షురింద్రియము. అధిభూతము:రూపము సూర్యుడని యెట్లు రూపజ్ఞానమునకు మూఁడు విధములు చెప్పబడినవో అట్లే క్రమముగా అధ్యాత్మాదులన్ని ఇంద్రియములకు నట్లే యగు ననుచున్నాడు. ఎట్లనగా త్వక్కు, స్పర్శము, వాయువు, శ్రోత్రము, శబ్దము, దిక్కులు, జిహ్వ,రసము, వరుణుడు, నాసిక, గంధము, అశ్వినులు, చిత్తము, మనసు, చంద్రుఁడు, బుద్ధి-బోద్ధవ్యము, బ్రహ్మ, అహంకారము, అహంకర్తవ్యము రుద్రుఁడని యిట్లు త్రివిధము.

అవ. మఱలఁగూడ వైలక్షణ్యము మాత్రమే చెప్పబడినది. త్రివిధ ప్రపంచ వ్యతిరిక్తు వగు ఆత్మయొక్క ప్రాప్తి యెట్లగు....అహంకార నివృత్తి లేకున్న? అహంకారకృత వివిధ వికల్ప నివృత్తిచేతనే ఆత్మప్రాప్తియను ఆశయమునఁ జెప్పుచున్నారు...

శ్లో. యోఽసౌ గుణక్షోభకృతో వికారః ప్రధానమూలా న్మహతః ప్రసూతః
అహం త్రివృ న్మోహవికల్ప హేతు ర్వైకారిక స్తామస ఐంద్రియశ్చ- 31

అ. యః=ఏ; గుణక్షోభకృతః=సత్త్వాది గుణములను ప్రేరేపించువాడై నిమిత్తభూతుడైన పరమేశ్వరుని వలననేకాక కాలమువలన సృజింపబడిన; వికారః=వికృతియగు; అసౌ=ఈఅహంకారము; ప్రధానమూలాత్=ప్రధాన ముపాదానముగాగల, మహతః=మహత్తత్త్వ మూలముగా; ప్రసూతః=జనించినది; అహం=అహంకారము; వైకారికః=సాత్త్వికము; తామసః=తామసము; ఐంద్రియశ్చ=రాజసము అను మూడువిధముల మోహవికల్ప హేతుః=మోహమయమైన వికల్పమునకు కారణము.

తా. గుణములను వ్యత్యస్తముగాఁ ప్రేరేపించు పరమేశ్వరునివలన లేక కాలమువలన నేది సృజింపబడినదో ఆ ఈ అహంకారము ప్రధాన ముపాదానముగాఁగల మహత్త్వమునుండి జనించి వికారికమై యున్నది. ఈప్రకారము సాత్త్వికము, రాజసము తామస మను త్రివిధమై మోహమయమైన వికల్పము లేక భేదమునకు కారణ మగుచున్నది.

అవ. అయ్యహంకార మేల నివర్తించదు? ఆత్మ నెఱుంగని అజ్ఞాన మను నెపమున నది యాత్మజ్ఞానమున నివర్తించునను ఆశయమునఁ జెప్పుచున్నారు—

శ్లో. ఆత్మాపరిజ్ఞానమయో వివాదోహ్యస్తీతి నాస్తీతి భిదార్థనిష్ఠః,
వ్యర్థోఽపి నైవోపరమేత పుంసాం మత్తః పరావృత్తధియాం స్వలోకాత్. 32

అ ఆస్తి+ఇతి=ఉన్నది–కలదను విధి ప్రత్యయ విషయము న+అస్తి ఇతి=లేదనునది నిషేధప్రత్యయ విషయముగ; భిదా+అర్థనిష్ఠః=ఈ భేదవిషయములందు నెలకొన్న; వివాదః=అనుపపత్తివాదము; ఆత్మ+అపరిజ్ఞానమయః=ఆత్మయొక్క పరిజ్ఞానము లేక అజ్ఞానస్వరూప వివాద విషయమయము; భేదవిషయ వివేచనము వలన-వస్తుమాత్రనిష్ఠముగాదు అందువలన పరస్పర యుక్తభేదము నిరాకరింపఁబడిన దగును.

వ్యర్థః +అపి=అర్థరహితమైనను; స్వలోకాత్ = స్వరూపభూతుఁడైన, మత్తః = నావలన; పరావృత్తధియాం = వెనుదిరిగిన బుద్ధిగల వారలకు, బహిర్ముఖులగు, పుంసాం=పురుషులకు, న+ఉపరమేత=ఈ మమకార ముపశమిల్లదు; మఱి దానిచే నగు కర్మలచే, దేహములందు సంచరించు సంసారము పొందుదురు.

తా. అయ్యా! వికల్పముచే నహంకారమునకు మోహమయత్వమెట్లు? కొందఱు దానిని సత్త్వముగా నంగీకరించు చున్నారు. అనగాఁ జెప్పుచున్నారు అస్తి యనఁగా నున్నది కలదను విధి ప్రత్యయ విశేషము. "నాస్తి" లేదనునది నిషేధప్రత్యయ విశేషము. ఈవిధి నిషేధముల భేద విషయము గల ఈ వివాదము (అహంకార మున్నది - లేదనుట) ఆత్మ పరి

జ్ఞానము లేని యజ్ఞానమయమై యున్నది. వివాదమంతయును భేదార్థ నిష్ఠముగాని వస్తుమాత్ర నిష్ఠముకాదు. అందువలన పరస్పర యుక్తులచేతనే ఈ వాదము నిరాకృతమగుటవలన ఈ అహంకారము మోహమయమని చెప్పబడుచున్నది. అహంకారము వికల్పము లేనియెడల తన్నివృత్తి ప్రయాస అట్లహంకారనివృత్తి ప్రయత్నము వ్యర్థము. అర్థరహితమైన - 'స్వ స్వరూపుఁడనైన నావలన' పరావృత్త బుద్ధిగల పురుషులకు నాయందు యావయే లేని బహిర్ముఖులకు ఆభేదము నివర్తింపదు. మఱి అహంకార కృతములైన కర్మలచే ఉత్తమాధమ దేహము లందు సంచరించు వారల కహంకార మెట్లు నివర్తింపబడును?

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు పలికెను.

**శ్లో॥ త్వత్తః పరావృత్తధియ స్స్వకృతైః కర్మభిః ప్రభో,**
**ఉచ్చావచాన్ యథా దేహాన్ గృహ్ణంతి విసృజంతి చ. 33**

అ. ప్రభో = ఓప్రభూ!; త్వత్తః = నీవలన; పరావృత్తధియః = పెడమొగము పెట్టిన బుద్ధిగలవారు; స్వకృతైః = తమచేఁజేయఁబడిన; కర్మభిః = కర్మలచే, యథా = ఏ ప్రకారము; ఉచ్చావచాన్ = వివిధములగు; దేహాన్ = దేహములను; గృహ్ణంతి = గ్రహించు చున్నారు, విసృజంతి చ = విసర్జించుచు నున్నారు.

తా. ఓ ప్రభూ ! నీ యందు భక్తి నిష్ఠలేక మరలని బుద్ధిగలవారు స్వకృతములగు కర్మలచే వివిధములగు దేహముల నెట్లు గ్రహించుచున్నారు ? ఎట్లు విసర్జించుచున్నారు? వ్యాపకుడైన ఆత్మకు దేహము నుండి దేహాంతరగమనమును - అకర్తకు కర్మలును నిత్యునికి జన్మ మరణాదులును ఎట్లు లభించును ?

**శ్లో. తన్మమాఖ్యాహి గోవింద దుర్విగాహ్య మనాత్మభిః,**
**న హ్యేత త్ప్రాయశో లోకే విద్వాంస స్సంతి నో హితాః. 34**

అ. గోవింద = ఓ శ్రీకృష్ణా! అనాత్మభిః = ఆత్మజ్ఞానము లేనివారలకు: దుర్విగాహ్యం = అవగాహన జేసికొనఁదగనిదైన; తత్ = ఆవిషయము; మమ + ఆఖ్యాహి = నాకు తెలుపుము; లోకే = లోకమున; ఏతత్ = కర్మకృత జన్మాదికము; విద్వాంసః = ఎఱిఁగినవారు, నః హితాః = మాకు హితులగు వారు; ప్రాయశః = తరచుగా; నసంతి = ఉండరు, ఏలయనగా మాయావంచితులుకనుక;

తా గోవిందా! అనాత్మజ్ఞులకు దుర్విగాహ్యమైన ఈ విషయమును నా కొఱకు జెప్పుము. లోకమందు ఈ కర్మ జన్మాదికముల నెఱింగి మా బోంట్లకు మేలుగోరు పురుషులు సాధారణముగా నుండరు. ఎల్లరు మాయావంచితులు.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవానుఁడు వచించుచున్నాడు.

అవ లింగశరీరాభ్యాసమువలన సర్వము ఘటిల్లునను ఉత్తరమును జెప్పుచున్నాడు—

**శ్లో. మనః కర్మమయం నృణా మింద్రియైః పంచభి ర్యుతమ్,**
**లోకా ల్లోకం ప్రయాత్యన్య ఆత్మా తదనువర్తతే. 35**

అ. నృణాం=నరులయొక్క. పంచభిః ఇంద్రియైః=అయిదైన జ్ఞానేంద్రియములతో; ప్రధానము గా నైదింటిని సుట, అన్యముల కుపలక్షణార్థము; యుతమ్=కూడిన; కర్మమయం=ఇంద్రియకర్మలను చింతించుస్వరూపముగల. మనః=మనస్సు; లోకాల్లోకం=ఒకదేహము నుండి వేఱొక దేహమును; ప్రయాతి=పొందును; అన్యః=తదన్యుఁడు; ఆత్మ; తత్+అనువ ర్తతే=అహంకారముతో నా మనస్సు ననుసరించును

తా. జ్ఞానేంద్రియము లైదింటితో (ఇతరములను గూడి) కర్మస్వరూపమైన నరుల మనస్సు ఒక దేహమునుండి మఱియొక దేహమునకు బోవును. దానికంటె నితరుడైన యాత్మ అహంకారముతో నా మనస్సు ననుసరించును.

అవ. అయ్యా! మనస్సుకు సైతము పూర్వదేహాదియోగము దేహాంతరయోగము నెట్లు కలుగు నందువేని స్మృతివియోగయోగములచే నని చెప్పుటకు వాని కారణములను జెప్పుచున్నాడు-

శ్లో. ధ్యాయన్మనోను విషయాన్ దృష్టాన్వాఽనుశ్రుతా నథ
ఉద్యత్సీద త్కర్మతంత్రం స్మృతి స్తదనుశామ్యతి. **36**

అ. కర్మతంత్రం మనః = మనస్సు కర్మవిషయ మగుట వలన; దృష్టాన్ = కర్మోపస్థాపితము లైన ఐహికసుఖములను; అనుశ్రుతాన్ = వేదోక్తములైన విషయములను; ధ్యాయత్ = ధ్యానించు చున్నదై; అథ=తర్వాత; ఆ విషయములు ధ్యానింపబడు చుండగా కర్మధ్యాన మనస్సు; ఉద్యత్ = ఆ విర్భావము గలది; సీదత్=లయము పొందునది అగును. తదను=అటు పిమ్మట; స్మృతిః=పూర్వాంతరసంధాయకమగు స్మృతి; అనుశామ్యతి=నశించుచున్నది.

తా. మనస్సు కర్మస్వరూప మగుట వలన కర్మలచేనగు నైహికములగు దేహేంద్రియ విషయభోగములను, వేదోక్తములైన పరలోకవిషయభోగములను ధ్యానించుచున్నదై ఆ విషయములం దావిర్భవించి - పూర్వవిషయము లందు లీనమగుచున్నది. తర్వాత నరునకు పూర్వాపరముల యనుసంధానము గావించు (స్మృతి) నశించుచున్నది.

అవ. అందువలన నేమగుచున్నదనఁగా జెప్పుచున్నాడు—

శ్లో విషయాభినివేశేన నా త్మానం యత్స్మరే న్మనః,
జంతో ర్వై కస్యచి ద్ధేతో ర్మృత్యు రత్యంతవిస్మృతిః. **37**

అ. విషయ+అభినివేశేన= కర్మలచే ప్రాప్తించిన దేవాది దేహములందు మిక్కిలి అభిమానముచే; ఆత్మానం= పూర్వదేహమును; మఱల, మనః=మదిలో; న స్మరేత్=ఇది స్మరింపదనున దేది కలదో యదియే, కస్యచిత్=దేహాభిమానముచే భయశోకాదులవలన దేవాది దేహాభిమానమున హర్షాభిలాషల పూర్వదేహమును గూర్చి, అత్యంత విస్మృతిః=అహంకారనివృత్తి; జంతోః=తదభిమానుఁడైన జీవునకు, మృత్యుః=మృత్యువని చెప్పబడును

తా. కర్మచే సంప్రాప్తమైన దేవాదిదేహములం దభిమానముచే మనస్సు పూర్వదేహమును మఱచుట యనున దేది గలదో- ఆ దేహాభిమానముచే భయశోకాదుల వలన హర్షాభిలాషల

హేతువువలన పూర్వదేహమున కత్యంతవిస్మృతియగును ఆవిస్మృతియనగా నహంకారనివృత్తి ఇదియే దేహాభిమానియగు జీవునకు మృత్యు వని చెప్పబడును. పూర్వదేహ స్మృతినివృత్తియే మృత్యువని భావము.

**శ్లో. జన్మత్వాత్మతయా పుంస స్సర్వభావేన భూరిద,**
**విషయస్వీకృతిం ప్రాహు ర్యథా స్వప్నమనోరథా. 38**

అ. జన్మ తు=జన్మము; విషయస్వీకృతిం=దేహమును తన్నుగా స్వీకరించుట; అను అభిమానముగా; ప్రాహుః=చెప్పుదురు; దేహమువలె నుత్పత్తి. పుత్రాదిదేహములందువలెప్రీత్యతిశయ మాత్రముచే; తనుకాదు సర్వభావేన=అభేదముచే; పుంసః=పురుషుని; ఆత్మతయా=ఆత్మనుగా; విషయస్వీకృతిం = దేహాభిమానమును; జన్మ తు ప్రాహుః = జన్మమని చెప్పుదురు; ఉత్పత్తి మరణములకు దృష్టాంతద్వయము. యథా = ఏ ప్రకారము; స్వప్న మనోరథౌ=కలయందు మనస్సంకల్పములని.

తా. స్థూలదేహాభిమానమును వీడి స్వప్నమున సూక్ష్మశరీరమొందుట. అందే దేహాభిమానము-మనస్సునం దెన్ని సంకల్పవికల్పములో అట్లే సుఖదుఃఖములు కలుగును. పురుషునికి దేహాభిమానముచే దేహము దన్నుగా గ్రహించుటచే జన్మమందును.

అవ. ఆ దృష్టాంతములను వివరించుచున్నారు.

**శ్లో. స్వప్నే మనోరథే నైవం ప్రాక్తనం న స్మర త్యసౌ,**
**తత్ర పూర్వమివాత్మాన మపూర్వం చానుపశ్యతి. 39**

అ. స్వప్నే మనోరథే చ= స్వప్నమునందును. మనోరథమునందు (మనస్సంకల్పము) ప్రాక్తనం= పూర్వదేహమును; అసౌ= ఈ నరుఁడు; న స్మరతి=స్మరింపడు; తత్ర= ఆ వర్తమానకాల మనోరథములలో,ఆత్మానం= తన్ను; పూర్వం= పూర్వమట్లున్న వానివలె; అపూర్వం+ఇవ= పూర్వమట్లుగాని వలెను; పూర్వసిద్ధుఁడైన తన్ను అపూర్వము వలె నపుడుజనించిన వాని వలె, అను పశ్యతి= చూచుచున్నాడు.

తా. స్వప్నమునందు మనోరథమునందు మనస్సు తనతోఁటి దేహమును స్మరింపదు. ఆ స్వప్నమనోరథములందు తాను పూర్వసిద్ధుడైన యున్నవాడైనను అప్పుడు తానట్లు జనించె నని తలంచు నని భావము.

అవ. ఉపసంహరించు చున్నాడు.

**శ్లో. ఇంద్రియాయ నసృష్ట్యేదం త్రైవిధ్యం భాతి వస్తుని,**
**బహిరంతర్భిదా హేతు ర్జనోఽ సజ్జనకృద్యథా. 40**

అ. ఇంద్రియ+అయన సృష్ట్యా=ఇంద్రియములకు మార్గమైన మనస్సుయొక్క దేహాంతరాభిమానమను ఏస్సృష్టి కలదో యా సృష్టిచే; వస్తుని=ఆత్మయందు, అదేహాభిమానముచే, ఇదం త్రైవిధ్యం=ఈ ఉత్తమ మధ్యమ నీచత్వమను త్రివిధత్త్వము; భాతి=అసత్తుగ భాసిల్లుచున్నది; ఇట్టి యాత్మ, బహిః+అంతః భిదా హేతుః=బాహ్యాభ్యంతర భేద హేతు వగుచున్నది; బాహ్యవిషయములను ఆభ్యంతర విషయములును సుఖాదులను చూచుచున్నది; యథా జనః=ఎ ప్రకారము జీవుండు; అసత్+జనకృత్=స్వర్గము; అసత్యములైన దేహములను చేయుచు చూచు - బహు

రూపుఁడై భాసించుచున్నాడో, అట్లు లేదా యీ త్రైవిధ్య మధ్యాత్మాదిరూపమున భాసించుచున్నది. అసజ్జనస్సైల్ జనః=తండ్రి స్వయముగా సముడయ్యును పుత్రాభిమానముచే వాని శత్రు మిత్రాదుల యందు భేదహేతువు గలవాఁ డగునని భావము.

తా. ఇంద్రియముల మార్గదర్శియగు మనస్సునకు దేహాంతరాభినివేశము వలన కలుగు స్మృష్టి యేది గలదో ఆ యుత్పత్తిచే ఆత్మయందా దేహాభిమానముచే ను త్తమమధ్యమనీచత్వమను త్రైవిధ్యము వాస్తవమున లేకున్నను ఉన్నటులు భాసించుచున్నది. ఇట్టివాఁడగు నాత్మ బాహ్య విషయములును, అభ్యంతరవిషయములును అగు సుఖములను చింతించుచున్నాడు. జీవుఁడు స్వప్నమున పెక్కు జనములను సృజించి చూచుచు బహురూపు డెట్లగుచున్నాడో అట్లును లేక ఆత్మయందు దేహాభిమానము నందు మనస్సునందు అధ్యాత్మాధిదైవాధిభూతములను మూఁడు-ఎట్లు భాసించుచున్నవో, దుష్టపుత్రుని గన్నతండ్రి తన పుత్రునిపై ప్రీతిచే వాని శత్రువు లందు భేదకారణుడై యుండునట్లు దేహాభిమానమున నిట్లగును.

అవ. ఈ ప్రకారము లోకప్రసిద్ధములైన జన్మమృత్యువులను నిరూపించి, ప్రశ్నించినవి కానివైనను సూక్ష్మములైన వానిని వైరాగ్యమునకై నిరూపించుచున్నారు.

శ్లో॥ నిత్యదా హ్యంగ భూతాని భవంతి న భవంతి చ.
కాలే నాలక్ష్యవేగేన సూక్ష్మత్వా త్తన్న దృశ్యతే **41**

అ. అంగ = ఓ ఉద్ధవా !; అలక్ష్యవేగేన = కానరాని వేగమున; నిత్యదా = ప్రతిక్షణము; భూతాని=శరీరములు; భవంతి=పుట్టుచున్నవి. న భవంతి చ=నశించుచును యున్నవి. సూక్ష్మత్వాత్ =కాలము మిగుల సూక్ష్మమగుటచేః తత్+న దృశ్యతే=దానిచేనగు భవనము-అభవనము అనగాజన్మ మృత్యువు లవివేకులచే నెఱుంగబడవు;

తా. ఓ ఉద్ధవా! గుర్తింపరాని వడిగల కాలముచే ప్రతిక్షణమును శరీరము జనించుచు నశించుచుండును కాల మతిసూక్ష్మమగుటవలన తత్కృతమగు భవనము నభవనము (జన్మ మృత్యువు) అవివేకులకుఁ దెలియ రాదు.

అవ. జనన మరణము లున్నచో వాని నెఱుంగకపోవుటకు కారణ మిది యగుగాక. ఈ జన్మమరణములకు సత్త యెట్లు అని ఆశంకించి అనుమానముచే దానిని సాధించుచున్నారు.

శ్లో. యథార్చిషాం స్రోతసాం చ ఫలానాం వా వనస్పతేః
తథైవ సర్వభూతానాం వయోవస్థాదయః కృతాః. **42**

అ. అర్చిషాం=దీపజ్వాలలకు; పరిణామాదులచే-స్రోతసాం=ప్రవాహములకు; గతులచేత; వనస్పతేః=ఆమ్రాది వృక్షములయొక్క; ఫలానాం=పండ్లకు రూపాదులచే; యథా=ఏ ప్రకారముః అవస్థా+ఆదయః=అవస్థాదివిశేషములు; కృతాః=(కాలముచే)చేయబడినవో; (ఆది శబ్దముచే తేజోబల కామ కౌశలాదులు గ్రాహ్యములు. తథా+ఏవ=ఆ ప్రకారమే; ప్రతిక్షణోత్పత్తి వినాశములు గలుగుట వలన అవస్థాభేదాదుల వలన) సర్వభూతానాం=ఎల్లభూతములకు; వయః+అవస్థా+ఆదయః= బాల్యాది వయస్సుల యొక్కదశలు; కృతాః=చేయబడినవి.

తా. దీపజ్వాలలకు పరిణామాదులచేతను (తైలపువత్తికి అగ్ని చేరి దీపమై మండుచు అనుక్షణము జ్వాల పుట్టుచు మారుచున్నది) ప్రవాహములకు గతులు లోనగు వానిచేతను (నదీ ప్రవాహమనుక్షణము సముద్రగామియై వచ్చి పోవుచుండును). అట్లే ఆ మావి లోనగుఫలములకు రూపాదులచేతను, మామిడిపిందె కాయయై పండుగామారి వన్నె, రుచి గంధముస్పర్శము మారునో అట్లే కాలముచే మారునట్టి దశలు గావింపబడుచున్నది. అట్లే ఎల్లభూతముల శరీరములకు కాలముచే బాల్యాద్యవస్థావిశేషములు గావింపబడుచున్నవి.

అవ. అనుక్షణము మారుచున్నచో అదియే యిది అతండే యితడని ప్రత్యభిజ్ఞ కలుగుట ఎట్లనగా—

**శ్లో. సోఽయం దీపోఽర్చిషాం యద్వత్ స్రోతసాం తదిదం జలమ్,
సోఽయం పుమానితి నృణాం మృషా గీర్ధీర్మృషాయుషామ్, 43**

అ. అర్చిషాం=జ్వాలలయొక్క సాదృశ్యము వలన సః+అయం దీపః = ఇది ఆదీపమే అని ప్రత్యభిజ్ఞ; యద్వత్ = ఏప్రకారమో; స్రోతసాం=నదీ ప్రవాహముయొక్క తత్+ఇదం—జలమ్ = ఇది ఆ జలమే అని ప్రత్యభిజ్ఞ యెట్లో, సః అయం పుమాన్ =అతండీ పురుషుండే యని, గీః = వాక్కు; ధీః=బుద్ధి; నృణాం=పెక్కు శరీరములను గొనువారును. మృష+ఆయుషాం=వ్యర్థమైన ఆయుస్సు గలవారలకు (అవివేకులకు) కలుగును.

తా. జ్వాలల సాదృశ్యమును బట్టి యా దీపమే ఈ దీపమనియు, ప్రవాహముల సాదృశ్యమునుం బట్టి యా జలమే ఈ జలమనియు నెట్లు ప్రత్యభిజ్ఞ కలుగునో అట్లే ఆ పురుషుడే ఈ పురుషుండని పెక్కు శరీరధారులగు మనుష్యుల యొక్క ప్రత్యభిజ్ఞ వ్యర్థముగా నాయువు గడుపు నవివేకులకు గలుగుచున్నది.

అవ. దేహమే నేనను అధ్యాసముగల పురుషునికి కర్మ, జనన, మరణములు గలుగును. అట్లు ఆధ్యాస లేనివానికి కలుగఁ వను వ్యవస్థ యెట్లు ఘటించును ? లేదని భావము. పురుష భేదముచే ఘటమునకు సత్త్వాసత్త్వములు కలుగవు గదా! అజ్ఞునికి సైతము వాస్తవమున కవి లేవను దానిని జెప్పుచున్నారు.

**శ్లో. నాజ్ఞ స్స్వకర్మబీజేన జాయతే సోఽప్యజః పుమాన్
మ్రియతే వామరో భ్రాంత్యా యథాగ్ని ర్దారుసంయుతః 44**

అ. స్వకర్మబీజేన=బీజభూతమైన తనకర్మచే సః=ఆ అజ్ఞః పుమాన్ అపి=అజ్ఞుండగు పురుషుండు, న జాయతే =జనింపడు: న మ్రియతే=మరణించడు భ్రాంత్యా=ఇచియంతయు భ్రాంతిచేతనే అజః = జన్మములేని వాడయ్యును — జనించువాడు: అమరః = మరణించనివాడై నను మరణించువాడు; యథా = ఏ రీతిగ; అగ్నిః=మహాభూతమై తేజోరూపమై ఆకల్పాంత ముండునదైనను; దారుసంయుతః=దారువుతో యోగవియోగములచే జన్మనాశములను పొందుచున్నట్లు

తా. బీజతుల్యమైన స్వకర్మచే అజ్ఞుండైన పురుషుండు సైతము నిజముగా జనించుట లేదు. మరణించుటయును లేదు. అయినను తాను పుట్టుక లేనివాడయ్యుం బుట్టినవానివలె, అమరుండు— మరణము లేనివాండయ్యు మరణించువాండువలె- నే విధముగా మహాభూతమె

తేజోరూపమై ఆకల్పాంతము నుండు అగ్ని దారుసంయోగమున జ్వలించి వియోగమున నశించు చుండునో యట్లే జన్మనాశములను భ్రాంతిచే బొందుచున్నాడు.

అవ. సిద్ధముగా సూక్ష్మట్లు గాపించి చెప్పిన వయోవస్థలను బ్రపవించుచున్నాడు.

శ్లో. నిషేక గర్భ జన్మాని బాల్యకౌమార యౌవనమ్,
వయోమధ్యం జరామృత్యు రిత్యవస్థా స్తనో ర్నవ. **45**

అ. నిషేకగర్భజన్మాని = నిషేకమనగా గర్భప్రవేశము — గర్భ=గర్భమార్గమున వృద్ధి; జన్మాని=పుట్టుకలు; బాల్యకౌమార యౌవనం=బాల్యమైదు వత్సరముల వఱకు, కౌమారము పదు నాఱు వత్సరముల వఱకును. యౌవనము నలుబది వత్సరముల వఱకును; వయః మధ్యం=నడిమి వయస్సు-అరువది వత్సరముల వఱకు; జరామృత్యుః=మృత్యువు మరణము ఇవి;తనోః=శరీరము నందు, నవ అవస్థాః=తొమ్మిది యవస్థలు;

తా. గర్భప్రవేశము. గర్భమార్గమున వృద్ధి, జన్మము, బాల్యము (అయిదేండ్ల వయస్సు) కౌమారము (పదునారేండ్ల వయస్సు) యౌవనము (నలువదేండ్ల వయస్సు) నడి వయస్సు (అరువదేండ్ల వయస్సు) జర- మృత్యువులను నవి శరీరమునకు తొమ్మిది యవస్థలు.

అవ. దేహసంబంధమువలన జన్మమరణాదులు కలుగునని ఉపపాదితమైన అర్థము నుపసంహరించుచున్నారు.

శ్లో ఏతా మనోరథమయీ ర్హ్యన్యస్యోచ్చావచా స్తనూః
గుణసంగా దుపాదత్తే క్వచి త్కశ్చి జ్జహాతి హ. **46**

అ అన్యస్య = ఇతరమగు దేహసంబంధులగు; ఏతాః మనోరథమయీః = మనస్సంకల్ప క్రియల వల్లనైన ఉచ్చావచాః=వివిధములగు; తనూః=నిషేకాద్యవస్థలను, గుణసంగాత్=త్రిగుణ ప్రకృతిని తెలియనందున; కశ్చిత్=ఒకానొకడు ఉపాదత్తే=గ్రహించును;=పరమేశ్వరానుగ్రహము పొందినవాడు; జహాతి=అవస్థలుగల దేహమునకు ద్రష్టను నేనే ఆయవస్థలుగలవాడను గానని వివేక జ్ఞానముచే నాయావస్థలను వీడుచున్నాడు

తా. ఇతరమగు దేహసంబంధులగు నిషేకాదులగు తొమ్మిది అవస్థలు గుణసంగముచే ప్రకృతి నెఱుంగమిచే నొక్కడు గ్రహించుచున్నాడు. ఒకప్పు డొకానొకడు పరమేశ్వరు నను గ్రహము పొందినవాడై ఈ యవస్థలు గల దేహమునకు ద్రష్టను నేను - ఈ యవస్థలు గల వాడను గానని ఆయవస్థలను పొందకున్నాడు.

అవ. అట్లగుచో మూర్తిమంత మగుటచే జన్మమరణ వర్తితమగు దేహము అగపడదు కదా అనగా అందులకు జెప్పుచున్నాడు.

శ్లో. ఆత్మనః పితృపుత్రాభ్యా మనుమేయౌ భవాప్యయౌ,
నభవాప్యయవస్తూనా మభిజ్ఞో ద్వయలక్షణః. **47**

అ పితృపుత్రాభ్యాం=పితాపుత్రులచే-పితృదేహమున కూర్ధ్వదైహికము చేయువానికి మరణము పుత్రదేహము యొక్క జాతకర్మ చేయువానికి జన్మము కన్పట్టును; ఆత్మనః=తన దేహమునకు;

భవ+అప్యయౌ=జన్మమరణములును ఇట్లు అనుమాన ప్రమాణముచే కన్పట్టుచుండగా; భవ + అప్యయ-వస్తూనాం = జన్మ మరణములు గల వస్తువులైన దేహములకు; అభిజ్ఞః = ఎఱుంగదగిన ద్రష్ట; ద్వయలక్షణః=ఉత్పత్తి వినాశ లక్షణములు కలవాడు కాడు.

తా. తండ్రికి పితృకర్మ చేయుచున్నప్పుడు మరణమును, పుత్రుని జాతకర్మయందు జన్మము నెఱింగినవాఁడై తన జన్మమరణముల నట్లే అనుమానముచే నూహించి, జన్మమరణ ములుకల దేహములకు ద్రష్టయైనవాడు జన్మమరణధర్మము గలవాఁడు కాడు.

అవ. ఈ విషయమునే దృష్టాంతముచే ప్రపంచించుచున్నాడు—

**శ్లో. తరో ర్బీజవిపాకాభ్యాం యో విద్వాన్ జన్మసంయమౌ,**
**తరో ర్విలక్షణో దృష్ట ఏవం ద్రష్టా తనోః పృథక్. 48**

అ. తరోః = భూమినుండి మొలచు వృక్షమునకు మాత్రము, ఫలపాకాంతమగు వ్రీహ్యాదికమునకు బీజవిపాకాభ్యాం=బీజమునుండి; పరిణామమునుండి; తరువుయొక్క అంత్యమగుపరిణామము విపాకము జన్మసంయమౌ = జన్మనాశములను; యః విద్వాన్ = ఎవఁ డెఱుంగునోవాడు, తరోః = వృక్షమున కంటె, విలక్షణః=వేఱుగా, దృష్టః=చూడబడునో, ఏవం=ఈ ప్రకారము ఆ జన్మ ఈ ప్రకారము. తనోః=శరీరము కంటె; పృథక్ = వేఱుగనున్న వాటికి; ద్రష్టా=ద్రష్టయు; ద్రయగును; అనగా దేహము నందుండు ఆత్మ యా జన్మ నాశములను పొందదు.

తా. ఫలపాకాంతములు అనగా ఫలించుటతోడనే నశించు స్వభావముగల వరిపైరు లోనగు వ్రీహ్యాదికము విత్తనము వలన జనించుటయు, పరిణామమున ఫలించి నశించునదియును. ఆ వ్రీహ్యాదికమునకు వేత్త ద్రష్ట యెటులుండునో అట్లే దేహతరువు నందుండు ఆత్మ దేహమునకు వేత్త సాక్షియై దేహముయొక్క జన్మనాశములను పొందదు.

అవ. అవివేకికి సంసారమును ఐదు శ్లోకములచే ప్రపచించుచున్నాఁడు.

**శ్లో. ప్రకృతేరేవ మాత్మాన మవివిచ్యాఽబుధః పుమాన్,**
**తత్త్వేన స్పర్శసంమూఢ స్సంసారం ప్రతిపద్యతే 49**

అ. ఏవం=ఈ ప్రకారము; ప్రకృతేః=ప్రకృతికార్యమగు దేహము; ఆత్మానం=తన్ను; అవి విచ్య=వేఱుగ నెంచక; అబుధః=అజ్ఞుఁడగు; పుమాన్ =నరుడు స్పర్శసంమూఢః=సత్యదృష్టిచే విషయములందు మూఁఢుడై; సంసారం ప్రతిపద్యతే=సంసారమును పొందుచున్నాడు. ఇట్లు ప్రకృతి కార్యమగు దేహమునుండి తాను వేరని తత్త్వమార్గమును దెలియని పురుషుఁడు విషయభోగములు సత్య ములని నమ్మి వానియందు తగిలి మూఢుడై సంసారమును పొందుచున్నాడు.

అవ. గుణభేదముచే త్రివిధమును, అందు దాని దాని తారతమ్యముచే ఒక్కొక్క దాని యందు ద్వివిధము నగు సంసారమును పేర్కొనుచున్నారు.

**శ్లో. సత్త్వసంగా దృషీన్ దేవాన్ రజసా సురమానుషాన్**
**తమసా భూతతిర్యక్త్వం భ్రామితో యాతి కర్మభిః. 50**

అ సత్త్వసంగాత్ = సత్త్వగుణసక్తి వలన; ఋషీన్ దేవాన్ = ఋషులు, దేవతలును; రజసా = రజస్సంగము వలన; అసురమానుషాన్ = అసురులను, మనుష్యులను; తమసా=తమస్సం

గము వలన; భూతతిర్యక్త్వం = భూతములు, పశుపక్ష్యాదులగుటను, కర్మభిః = కర్మలచే; భ్రామితః = తిరుగువాఁడు; యాతి = పొందును.

తా. సత్త్వగుణసంగముచే దేవతలు ఋషులయు జన్మములను, రజోగుణ సంసర్గముచే అసురమానుష జన్మములను, తమోగుణసంబంధము వలన భూతములు తిర్యగ్జంతువులు లోనగువాని జన్మమును కర్మలచే తిరుగువాఁడు పొందుచున్నాడు.

అవ. అయ్యా! అకర్తయగు ఆత్మకు కర్మలచే భ్రమణ మెట్లనగా జెప్పుచున్నారు.

**శ్లో. నృత్యతో గాయతః పశ్యన్ యథైవానుకరోతి తాన్,**
**ఏవం బుద్ధిగుణాన్ పశ్య న్ననీహోఽ ప్యనుకార్యతే. 51**

అ. నృత్యతః = నృత్యము చేయువానిని; గాయతః = గానము చేయువానిని; పశ్యన్ = చూచుజనము; యథా + ఏవ = ఏ ప్రకారము; తాన్ = వారి పదస్వర తాళాదిగతిని; శృంగారాది రసమును; అనుకరోతి = మనస్సు నం దనుకరించు చున్నారో; ఏవం = ఈ ప్రకారము; బుద్ధిగుణాన్ = బుద్ధియందు గన్పట్టు సత్త్వాది గుణములను; పశ్యన్ = చూచుచు; అనీహః = కోరికలేనివాడును; అనుకార్యతే = గుణములచే బలాత్కారమున ననుకరించబడును; ఈ దృష్టాంతముచే దృశ్యధర్మము ద్రష్టయందు స్ఫురించు చున్నదని తెలుపఁబడినది.

తా. నృత్యముచేయు నటకులను, గానము జేయు గాయకులను గాంచిన జనుఁడు నటకుల నృత్యములోని శృంగారకరుణాది రసమును, గాయకుల గానములోని స్వరతాళాదికముల నెట్లు మనస్సునం దనుకరించునో, ఇట్లే బుద్ధియందు గన్పట్టు సత్త్వాదిగుణములను చూచు జీవుఁడు అనీహుఁడు. అనగా నే ఇచ్ఛయు లేనివాడైనను ఆగుణముల బలాత్కారమున వాని ననుకరించుచున్నాడు. దీనినిబట్టి దృశ్యధర్మము ద్రష్టయందు స్ఫురించుచున్నదని తెలియు చున్నది.

అవ. ఉపాధిధర్మములు ఉపహితమునందు భాసించునను దానికి దృష్టాంతమును జెప్పుచున్నారు.

**శ్లో. యథాంభసా ప్రచలతా తరవోఽ పి చలా ఇవ,**
**చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే భ్రామ్యతీవ భూః. 52**

అ. యథా = ఏ ప్రకారము; ప్రచలతా = కదలుతున్న; అంభసా = (సరో)జలముచే; తరవః + అపి = గట్టుననుండు వృక్షములు సైతము; చలాః ఇవ = జలమునందు ప్రతిబింబితములై చలించు చున్నట్లు కన్పట్టుచున్నవో; భ్రామ్యమాణేన = తిరుగుచున్న; చక్షుషా = కంటిచే; భూః = భూతలము భ్రామ్యతి + ఇవ = తిరుగునదియు వలె; దృశ్యతే = కన్పట్టుచున్నదో.

తా. ఏ ప్రకారము కదలుచున్న జలముచే తీరమునందున్న తరువులు జలమునందు ప్రతిబింబించి చలించుచున్నట్లు కన్పట్టునో- ఎట్లు తన్ను తాను గిఱ్ఱుమని తిరిగినవాని తిరుగు చున్న కంటికి భూతలము సైతము తిరుగుచున్నట్లు కన్పట్టుచున్నదో— అట్లే శబ్దాది విషయముల నింద్రియముల ద్వారా గ్రహించిన మనస్సుచే లావణ్యాదు లగు గుణములు కల్పించినవే యగును గాని వాస్తవమునకు లేవు. అందువలన నీ సంసార మహానిబంధనకు అంగీ

కరించి గ్రాహకగుణములు గ్రాహ్యమునం దవభాసించు నన్నదానికి చక్షుర్దృష్టాంతమును జెప్పెను.

అవ. భోగమునకు మిథ్యాత్వము నందు దృష్టాంతము (భోగము మిథ్య అనుదానికి దృష్టాంతము) చెప్పుచున్నారు.

**శ్లో. యథామనోరథధియో విషయానుభవో మృషా.**
**స్వప్నదృష్టాశ్చ దాశార్హ తథా సంసార ఆత్మనః. 53**

అ. దాశార్హ !=ఓ దశార్హవంశమున బుట్టిన మహానుభావా! యథా=ఏ ప్రకారము; మనోరథధియః=మనస్సుచే కల్పించిన లావణ్యాది గుణములు; స్వప్నదృష్టాః+చ=స్వప్నము నందు జూడబడినవియు; మృషా=అసత్యములో; తథా=ఆ ప్రకారము; ఆత్మనః=జీవునికి; విషయ+అనుభవః=విషయ భోగరూపమగు; సంసారః మృషా=సంసారము మిథ్య;

తా. మనస్సంకల్పముచేం దోంచు లావణ్యాది గుణ విషయములు స్వప్నమునం జూడంబడిన వస్తువులును ఎట్లు మిథ్య యగునో అట్లే విషయభోగరూపమైన సంసారము గూడ మిథ్య యగుచున్నది.

అవ. అట్లు సంసారము మిథ్యయైన యెడల దాని నివృత్తికై శ్రమ యేల? అనంగా నందులకుం జెప్పుచున్నాండు.

**శ్లో. అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతి ర్న నివర్తతే**
**ధ్యాయతో విషయా నస్య స్వప్నేఽ నర్థాగమో యథా. 54**

అ. విషయాన్=శబ్దాదివిషయములను లేక విషయభోగములను; ధ్యాయతః = ధ్యానించుచుండుట; అస్య అర్థే=దృశ్యమగు దేహాది సంఘాతము; అవిద్యమానే+అపి=వాస్తవముగా లేకున్నను, సంసృతిః=సంసారము; స్వప్నే=స్వప్నమునందు; యథా+అనర్థ+ఆగమః=కీడువచ్చుటవలె; న నివర్తతే=నివర్తించదు.

తా. వాస్తవముగా నింద్రియాదిభోగములకు విషయమగు దేహాదిసంఘాతము లేకున్నను- ఆ విషయ భోగములను జింతించుచున్న తన్నివృత్తి జీవునకు కలగనంతసేపును సంసారము నివృత్తిగాదు.

అవ. అందువలన భోగోద్యమము కర్తవ్యము గాదనుచున్నారు.

**శ్లో. తస్మా దుద్ధవ మా భుంక్ష్వ విషయా నసదింద్రియైః**
**ఆత్మాగ్రహణ నిర్భాతం పశ్యన్ వైకల్పికం భ్రమమ్. 55**

అ. ఉద్ధవ=ఓ ఉద్ధవా!; ఆత్మ+అగ్రహణ నిర్భాతం=పరమాత్మ నెఱుంగమిచేం జూపట్టునదై వైకల్పికం=భేదకల్పితమగు; భ్రమమ్=భ్రాంతిని జగమును; పశ్యన్=చూచుచున్నను; అసత్+ఇంద్రియైః=మిథ్య యగు నింద్రియములచే; విషయాన్=విషయభోగములను; మా భుంక్ష్వ=అనుభవింపకుము.

తా. అందువలన ఓ ఉద్ధవా! పరమాత్మ నెఱుంగక పోవుటచే వెలుంగుచున్నదై భేద కల్పితమైన భ్రాంతిజగమును గాంచుచు మిథ్యాభూతములైన ఇంద్రియములద్వారా విషయ భోగముల ననుభవింపకుము.

అవ. దుఃఖప్రతీకారోద్యమమును సైతము పరిత్యజించి పరమేశ్వరనిష్ఠచేతనే ప్రవర్తించవలె ననుచున్నారు.

**శ్లో క్షిప్తోఽవమానితోఽసద్భిః ప్రలబ్ధోఽసూయితోఽథవా**
**తాడిత స్సన్నిరుద్ధో వా వృత్త్యా వా పరిహారితః. 56**

అ. క్షిప్తః = త్రోయబడినవాడు; అసద్భిః = దుష్టులచే; అవమానితః = అవమానింపబడియు ప్రలబ్ధః = అపహసింపఁబడియు; అసూయితః = అసూయఁ జేసినను; అథవా = లేక; తాడితః = కొట్టబడియు; సన్నిరుద్ధః వా = కొట్టబడియు; వృత్త్యా = జీవనముచే; పరిహారితః = విడదీయఁబడినవాఁడు.

తా. దుష్టులు తన్ను త్రోసినను అవమానించినను పరిహసించినను అసూయపడినను లేక కొట్టినను కట్టివేసినను జీవనమునుండి తొలగింపబడినవాడైనను...

**శ్లో. నిష్ఠితో మూత్రితో వాజ్ఞై ర్బహుధైవం ప్రకంపితః**
**శ్రేయస్కామః కృచ్ఛ్రగత ఆత్మనాత్మాన ముద్ధరేత్. 57**

అ. అజ్ఞైః = అజ్ఞానులచే; నిష్ఠితః = ఉమియఁబడినవాఁడై; మూత్రితః = మూత్రము పోయఁబడి బహుధా = పెక్కువిధములు; ఏవం = ఈ ప్రకారము; ప్రకంపితః = పరమేశ్వరుని నుండి జార్పబడియు; శ్రేయస్కామః = శ్రేయస్సును మోక్షమును గోరువాడు; కృచ్ఛ్రగతః = కష్టములు పొందినవాడును; ఆత్మనా = వివేకబుద్ధితో; ఆత్మానం = తన్ను జీవుని; ఉద్ధరేత్ = సంసారమునుండి ఉద్ధరించుకొనవలెను.

తా. అజ్ఞులచే నుమియబడియు, మూత్రవిసర్జనము గావింపబడియు నీ ప్రకారము పెక్కు విధములుగాఁ బరమేశ్వరనిష్ఠనుండి లాగబడినవాఁడయ్యు శ్రేయస్కామియై మోక్షమును గోరువాడు వివేకబుద్ధితో ఆత్మను ఉద్ధరించుకొనవలయును.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు పలికెను.

**శ్లో యథైవ మను బుధ్యేయం వద నో వదతాం వర**
**సుదుస్సహమిమం మన్య ఆత్మ న్యసదతిక్రమం**
**విదుషామపి విశ్వాత్మన్ ప్రకృతి ర్హి బలీయసీ-**
**ఋతే త్వద్ధర్మనిరతాన్ శాంతాం స్తేచ్చరణాశ్రయాన్. 58**

అ. వదతాం వర = వచోనిపుణులలో శ్రేష్ఠుడా!; ఏవం = నీవు చెప్పిన దానిని; యథా = ఏ ప్రకారము; అనుబుధ్యేయం = తెలిసికొనగలనో; ఆ ప్రకారము, నః = మమ్ములనందఱను; వద = చెప్పుము.
త్వత్ + ధర్మనిరతాన్ = నీ భక్తిధర్మమునందు నిష్ఠగలవారు; శాంతాన్ = శాంతులు; త్వత్ + చరణ + ఆశ్రయాః = నీ పాదముల నాశ్రయించినవారిని; ఋతే = విడచి; విదుషామ్ + అపి = విద్వాంసు

లకును; ఆత్మని = ఆత్మదేహమునందు; ఇదం — ఈ; అసత్ + అతిక్రమం = దుష్టులుచేయుఅప; చారమును;విశ్వాత్మన్ =ఓ విశ్వేశ్వరుడా ! సుదుస్సహం= సహింప నసాధ్యము ప్రకృతిః =స్వభావము; బలీయసీ × బలిష్ఠమును...

తా. ఓ సువాదశాలీ! నీవు చెప్పిన ఈ సంసారస్వరూపము తన్నివృత్తి- ఎట్లుండ గలవో మాకెల్లరకు బోధింపుము. దుష్టులు తన్నుగావించు నపరాధములు నీ భక్తి ధర్మనిష్ఠ గలిగి శాంతులై నీ పాదము లాశ్రయించిన భక్తులకు తప్ప. విద్వాంసులకు సైతము సహింప సాధ్యము గావని తలంతును. ఏల యనగా స్వభావము బలిష్ఠమైనది.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే, ద్వావింశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమునందు ఏకాదశస్కంధమున నిరువదిరెండవ యధ్యాయము.

# త్రయోవింశోఽధ్యాయః

## సంగ్రహశ్లోకము

**త్రయోవింశే తిరస్కార సహనోపాయ ఈర్యతే,**
**భిక్షుగీతప్రకారేణ మనసః సంయమో ధియా,**
**దుర్జనోపద్రవో నూనం దుస్సహో హి మహీయసామ్,**
**అత శ్చతుర్భి రధ్యాయైః సహనోపాయవర్ణనమ్.**

ఈ ఇరువదిమూఁడవ అధ్యాయమందు విషయభోగతిరస్కారము - దుష్టాపరాధ సహనము- భిక్షుగీతా దృష్టాంతముచే చెప్పబడును.

దుర్జనులచే నగు నుపద్రవము నిజముగా దొడ్డవారికి సైతము సహింప కష్టసాధ్యము. అందువలనఁ జెప్పబోవు నాలుగధ్యాయములందును ఆ యుపద్రవము సహించు నుపాయము వివరింపఁబడుచున్నది

అందు మొదట నీ యధ్యాయమందు భిక్షుగీతచే మనోవిజయము చెప్పి తరువాతి అధ్యాయమందు ప్రకృతిపురుషవివేకము — అటుపిమ్మటి అధ్యాయమునందు నైలగీతద్వారా విషయసంగత్యాగముచే సత్సంగము అను నుపాయములు క్రమముగా భగవంతునిచే వర్ణి కరింపఁబడినవి.

శ్రీశుక ఉవాచ = శ్రీశుకులు వచించిరి —

**శ్లో. స ఏవ మాశంసిత ఉద్ధవేన భాగవతముఖ్యేన దాశార్హ ముఖ్యః**
**సభాజయన్ భృత్యవచో ముకుంద స్తమాబభాషే శ్రవణీయవీర్యః. 1**

అ. సః దాశార్హముఖ్యః = ఆ దశార్హ మను రాజవంశపు వారిలో శ్రేష్ఠుడగు శ్రీకృష్ణుఁడు; ఏవం = ఈ ప్రకారము భాగవత ముఖ్యేన = భగవద్భక్త శ్రేష్ఠుఁడగు; ఉద్ధవేన = ఉద్ధవునిచే; ఆశంసితః = ప్రార్థింపఁబడినవాఁడై : భృత్యవచః = భృత్యుని వచనమును; సభాజయన్ = గౌరవించుచు; శ్రవణీయ వీర్యః = వినఁదగినప్రభావము గల; ముకుందః = కృష్ణుఁడు; తం = ఆ ఉద్ధవుని గూర్చి; ఆబభాషే = సంభాషించెను.

తా. భాగవతోత్తముఁ డుద్ధవుఁ డిట్లు ప్రార్థించినంత దాశార్హవంశీయులలో శ్రేష్ఠుఁడు శ్రోతవ్యప్రభావముగల కృష్ణుఁ డా భక్తుని వచనములను గౌరవించుచు అతనిని గూర్చి యిట్లు మాటలాడెను.

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుఁడు వచించెను.

అవ. అపుడు సమ్మతిచూపుటవలన నుద్ధవుని వచనమును రెండు శ్లోకములచే గౌర వించుచున్నారు—

శ్లో. బార్హస్పత్య స నహ్యత్ర సాధు ర్వై దుర్జనేరితైః,
దురుక్తై ర్భిన్న మాత్మానం య స్సమాధాతు మీశ్వరః 2

అ. బార్హస్పత్య=ఓ బృహస్పతి శిష్యుడా! అత్ర=ఈ లోకమున; దుర్జన+ఈరితైః=దుష్టులచే పలుకఁబడిన; దురుక్తైః=దూషణ వచనములచే; భిన్నం=క్షోభిల్లిన; ఆత్మానం=మనస్సును; యః=ఎవడు; సమాధాతుం=శమింపజేయుటకు; ఈశ్వరః=సమర్థుడో; సః=వాడు; న హి=లేడు.

తా. ఓ బృహస్పతిశిష్యా! ఈలోకమునందు దుష్టులు వచించు దూషణవాక్యములచే క్షోభనొందిన మనస్సును శాంతపరచుకొనుటకు సమర్థుడైన సాధుపురుషుఁడు లేడు.

అవ. ఎందువలన ననగాఁ జెప్పుచున్నాడు :

శ్లో. న తథా తప్యతే విద్ధః పుమాన్ బాణై రజిహ్మగైః,
యథా తుదంతి మర్మస్థా హ్యసతాం పరుషేషవః 3

అ. పుమాన్=పురుషుఁడు; అజిహ్మగైః=వాడియైన; బాణైః=బాణములచే విద్ధః=గ్రుచ్చబడినవాడై; తథా న తప్యతే=ఆ ప్రకారము సంతాపమొందడు; యథా=యేప్రకారము; అసతాం=పరుష=దుష్టుల, ఇషవః=కఠినోక్తులను బాణములు, మర్మస్థాః=ఆయువుపట్లనున్నవై తుదంతి=పీడించునో.

తా. దుష్టుల కఠినోక్తు లను బాణము లాయువు పట్లు గ్రుచ్చుకొని బాధింప నరుడెట్లు బాధచెందునో అట్లు పదునైన బాణములచే గ్రుచ్చబడియు పురుషుఁడు తాపము నొందడు.

అవ అట్లయ్యు నాచేఁ జెప్పఁబడబోవు నుపాయములచే సమస్తమును సహింప శక్యమగు నను అభిప్రాయములచే నితిహాసమును ప్రస్తావించుచున్నాడు.

శ్లో. కథయంతి మహ త్పుణ్య మితిహాస మిహోద్ధవ,
తమహం వర్ణయిష్యామి నిబోధ సుసమాహితః. 4

అ. ఉద్ధవ=ఓ ఉద్ధవా; ఇహ=ఈ సందర్భమున; మహత్=దొడ్డ; పుణ్యం=పవిత్రమగు; ఇతిహాసం=పూర్వవృత్తమును-కథయంతి=పూర్వము పెద్దలు చెప్పిరి; తం=దానిని: అహం వర్ణయిష్యామి=నేను వర్ణింపఁగలను; సుసమాహితః=ఏకాగ్రచిత్తుడవై; నిబోధ=ఎఱిఁగొనుము;

తా. ఓ ఉద్ధవా! ఈ విషయమై పెద్దలు ఒకగొప్ప పూర్వకథను చెప్పెదరు. దానిని నీకు జెప్పెదను. నిశ్చల మనస్కుఁడవై వినుము.

శ్లో. కేనచి ద్భిక్షుణా గీతం పరిభూతేన దుర్జనైః,
స్మరతా ధృతియుక్తేన విపాకం నిజకర్మణామ్. 5

అ. దుర్జనైః పరిభూతేన=దుర్జనులచే పరాభవింపఁబడి; నిజకర్మణాం=తన తొంటికర్మంల యొక్క; విపాకం=పరిపాకమును; స్మరతా=స్మరించుచున్న; ధృతియుక్తేన=మనోధైర్యముకల కేనచిత్+భిక్షుణా=ఒకానొక సన్న్యాసిచేత; గీతం=ఇట్లు చెప్పబడినది.

తా. పూర్వ మొక సన్న్యాసి దుష్టులు తన్ను బాధింపనవమానితుఁడై తన తొంటి కర్మంల పరిణామమును ధైర్యముతో స్మరించుచు చెప్పిన కథ ఇది యగును.

అవ. ఆసన్న్యాసి పూర్వము ధనాఢ్యుఁడై కష్టార్జితమైన ధనము నాశమగుటచే మిగుల వెత గుడిచి నిర్విణ్ణుఁడై సన్న్యాసియై భిక్షమునకు దిరుగుచు దుర్జనులచే తఱుమబడి ప్రస్తుతోపయోగియైన గాథను వాకొనెనని ఆతని చరితమును జెప్ప మొదలిడినాడు.

శ్లో. అవంతీషు ద్విజః కశ్చి దాసీ దాఢ్యతమ శ్శ్రియా,
వార్తావృత్తిః కదర్యశ్చ కామీ లుబ్ధోఽ తికోపనః. **6**

అ. అవంతీషు=మాళవజనపదమునందు; కశ్చిత్ ద్విజః=ఒక విప్రుఁడు; శ్రియా=సంపదతో; ఆఢ్యతమః=కూడిన దొడ్డభాగ్యము గలవాడు; వార్తావృత్తిః=కృషి వాణిజ్యాది రూపమైన జీవనము గలవాడు; కదర్యః+చ=తనకు: ధర్మకార్యములకును, ఆలుబిడ్డలకును, దేవతాతిథి భృత్యులకును బాధకుఁడు.

శ్లో ఆత్మానం ధర్మకృత్యం చ పుత్రదారాంశ్చ పీడయన్,
దేవతాతిథి భృత్యాంశ్చ స కదర్య ఇతి స్మృతః

కామీ=కామాభిలాష గలవాడు; లుబ్ధః=పేరాస గలవాఁడు; అతికోపనః=జనుల యందతి కోపము గలవాఁడు.

తా. పూర్వ మవంతీజనపదములందు ద్విజుఁ డొకఁడు శ్రీమంతుఁడు గలఁడు. అతఁడు కృషివాణిజ్యములు వృత్తిగా గలవాఁడు. ధర్మకార్యములు చేయక ప్రతివారిని బాధించువాఁడు. భోగాభిలాష గలిగి లుబ్ధుఁడై ముక్కోపియై యుండెను

శ్లో జ్ఞాతయోఽ తిథయ స్తస్య వాఙ్మాత్రేణా ప్యనర్చితాః,
శూన్యావసథ ఆత్మాఽపి కాలే కామై రనర్చితః. **7**

అ. తస్య=అతనియొక్క; జ్ఞాతయః=బంధువులు; అతిథయః=అతిథులు; వాఙ్మాత్రేణ+అపి=అతనిచే మంచిమాటచే నైనను; అనర్చితాః=పూజింపఁబడరైరి; శూన్య+అవసథే=ధర్మ కామ విహీనమగు ఆ గృహమునందు (దేహము); ఆత్మా+అపి=స్వశరీరమును; కాలే=ఆయా సమయములందు; కామైః=కోరికలతో; అనర్చితః=పూజింపబడలేదు.

తా. అతఁడు తన బంధువులను గాని, యింటికి వచ్చు నతిథులను గాని మంచిమాటలచే గూడ సత్కరింపలేదు. ధర్మ కామ హీన ఆతని గృహమున, అతడు తన శరీరమునైన వివిధములగు కోరికలతో తృప్తి నొందింపలేదు.

శ్లో. దుశ్శీలస్య కదర్యస్య ద్రుహ్యంతే పుత్రబాంధవాః,
దారా దుహితరో భృత్యా విషణ్ణా నాచరన్ ప్రియమ్. **8**

అ. కదర్యః=లోభియై పరులను బాధించుచు; దుశ్శీలస్య=చెడ్డ స్వభావము గలవాఁడగు అతని యొక్క; పుత్రబాంధవాః+పుత్రులు, బంధువులు; దారాః=భార్య; దుహితరః=కూతుళ్ళు; భృత్యాః=భృత్యులు (నేను); విషణ్ణాః=దుఃఖితులై; ద్రుహ్యంతే=అతనిపై ద్వేషముతో; ప్రియమ్=ఇష్టమును; న=ఆచరన్=ఆచరింపరైరి.

తా. చెడ్డస్వభావము గలిగి పరులను బాధించుచు లోభియైన వానిని వానిపుత్రులు, చుట్టములు భార్యాపుత్రికలు, సేవకులును ద్వేషించి అతనికి ప్రియ మాచరింపరైరి.

శ్లో. తస్యైవం యక్షవిత్తస్య చ్యుత స్యోభయలోకతః,
ధర్మకామవిహీనస్య చుక్రుధుః పంచభాగినః. 9

అ. ఉభయలోకతః = ఇహపరలోకములు రెంటినుండి; చ్యుతస్య=జారిపడినవాడును; ధర్మ కామ విహీనస్య = ధర్మ కామములు లేనివాఁడు అగు; తస్య = వానియొక్క; పంచభాగినః = దేవ, ఋషి, పితృ, భూత, మనుష్య, బ్రహ్మర్షులు; చుక్రుధుః = క్రోధించిరి.

తా. ఈ ప్రకారము యక్షుల విత్తమువలె కేవలము రక్షింపదగు విత్తముగలవాఁడయి ఇహపరలోకముల నుండి పతితుడై ధర్మకామరహితుడగు వానిపై పంచయజ్ఞాధిదేవతలగు దేవ ఋషి పితృ నర భూతములు కోపించినవి.

శ్లో. తదవధ్యాన విస్రస్తపుణ్యస్కంధస్య భూరిద,
అర్థో ఽప్యగచ్ఛ న్నిధనం బహ్వాయాసపరిశ్రమః. 10

అ. భూరిద!= ఓ మహాదానశీలుఁడా!; తత్ + అవధ్యాన విస్రస్తపుణ్య స్కంధస్య=ఆ పంచ యజ్ఞాధిదేవతలయొక్క అనాదరముచే భ్రంశము నొందిన అర్థలాభమునకు హేతుభూతమగు పుణ్య స్కంధము గలవాని యొక్క; అర్థః + అపి =ధనాది వస్తువులును; బహ్వాయాస పరిశ్రమః = మిక్కిలి ప్రయాసచే కృష్యాదులచే పడిన శ్రమ అంతయు; నిధనంఅగచ్ఛత్ =నాశము పొందెను.

తా. ఓ దానశీలా! ఆ పంచయజ్ఞాధిదేవతల ననాదరించుటచే దనపుణ్యమెల్ల నశింపగా ఆతనియొక్క మిక్కిలి కృష్యాది పరిశ్రమకు ఫలమగు ధనాధికము చివరకు నాశనమయ్యెను.

అవ. ఎట్లు నాశనమయ్యె ననగాఁ జెప్పుచున్నారు—

శ్లో. జ్ఞాతయో జగృహుః కించి త్కించి ద్దస్యవ ఉద్ధవ,
దైవతః కాలతః కించి ద్బ్రహ్మబంధో ర్నృపార్థివాత్. 11

అ. ఉద్ధవ =ఓ ఉద్ధవా!; బ్రహ్మబంధోః =ఆ దుర్బ్రాహ్మణునియొక్క ధనమును; జ్ఞాతయః = దాయాదులు; కించిత్ జగృహుః =కొంత గ్రహించిరి; దస్యవః = దొంగలు, కించిత్ =కొంత గ్రహించిరి; దైవతః=గృహదాహాదికము వలన; కాలతః =కాలము పాతర వేసినధాన్యము చెడుట వలన; కొంత; నృపార్థివాత్ =నరులవలన రాజులవలన కొంత హరింపఁబడెను.

ఆ దుష్టబ్రాహ్మణుని ద్రవ్యము ద్దాయాదులు కొంత గ్రహించిరి. చోరులు కొంత హరించిరి. దైవవశమున గృహదాహాదులచేఁ గొంత హరింపబడెను. కాలగతిని పాతరవేసిన ధాన్యాదులు చెడుటమూలమునఁ గొంత నశించెను. నరులు రాజులును మిగిలినకొంతను హరించిరి.

శ్లో. స ఏవం ద్రవిణే నష్టే ధర్మకామవివర్జితః
ఉపేక్షిత స్స్వజనై శ్చింతా మాప దురత్యయామ్. 12

అ. యేవం = ఈ ప్రకారము; ద్రవిణే నష్టే =ధనాధికము నశించినది కాఁగా; సః = ఆ ద్విజ బంధువు; ధర్మకామ వివర్జితః = దాన భోగములు లేనివాడై; స్వజనైః = జను లెల్లరిచే; ఉపేక్షితః = బహిష్కృతుడై; దురత్యయాం = దాటశక్యముగాని; చింతాం + ఆప =చింతను పొందెను.

తా. ఈ ప్రకారము తన యాస్తి యంతయు నష్టమై పోఁగా ఆ చెడుపాఱుఁడు ధనము నొకరి కీయక తాను గుడువనివాఁడై ఎల్లజనులచే నొల్లనివాఁడై కడకు దురంతమైన చింతను పొందెను.

శ్లో. తస్యైవం ధ్యాయతో దీర్ఘం నష్టరాయ స్తపస్వినః,
ఖిద్యతో బాష్పకంఠస్య నిర్వేద స్సుమహా నభూత్. **13**

అ. యేవం=ఈ ప్రకారము; దీర్ఘ=చాలాకాలము; ధ్యాయతః=చింతనొందువానికు; నష్టరాయః=నశించిన ధనములు గలిగినవానికు; తపస్వినః = సంతప్తుడై; ఖిద్యతః=ఖేద మొందుచు; బాష్పకంఠస్య=కన్నీళ్ళు కంఠమునఁ గ్రుక్కుకొను; తస్య=ఆ విప్రునికి; సుమహాన్=మిగుల తీవ్రమైన; నిర్వేదః అభూత్=వైరాగ్యము కలిగెను

తా. ఇట్లు పెద్దకాలము వగచుచు నున్న యతనియాస్తి సమస్తము నిరస్తముకాగా సంతప్తస్వాంతుడై దుఃఖించి కంఠగతబాష్పప్రాయుడై యున్న నవ్విప్రుని కప్రతీత వైరాగ్య భాగ్యము పొడసూపినది.

శ్లో. న చాహేద మహో కష్టం వృథాత్మా మేఽనుతాపితః
న ధర్మాయ న కామాయ యస్యార్థాయాస ఈదృశః. **14**

అ సః=ఆ విప్రుడు; ఇదం చ ఆహ=ఈ మాట చెప్పెను; అహో కష్టం=ఔరా! ఎంత కష్టము వచ్చినది. యస్య = ఎవనికి; ఈదృశః=ఇట్టి; అర్థ+ఆయాసః=ధనార్జనాయాస కలదో అట్టి; మే+ఆత్మా=నాయొక్క శరీరము=న ధర్మాయ=ధర్మమునకు గాకయు; న కామాయ=భోగముచే గాకయు; అనుతాపితః=వ్యథపెట్ట బడినదియే,

తా. ఆతఁడు తనలోఁ దా నిట్లనుకొనెను. కటకటా! నా కెంతటి కష్టము ప్రాప్తించినది. ధనార్జనమునకై ఎట్లు శ్రమపడితినో ఆ నేను ధర్మమునకు గాని భోగమునకుగాని కొఱగాక నా శరీరమును వ్యర్థముగా బాధవెట్టితిని గాదా!

శ్లో. ప్రాయే ణార్థః కదర్యాణాం న సుఖాయ కదాచన,
ఇహ చాత్మోపతాపాయ మృతస్య నరకాయ చ. **15**

అ. ప్రాయేణ = తఱచుగా; కదర్యాణాం = పిసినిగొట్టులయొక్క; అర్థః=ధనము; కదాచన =ఒకప్పుడు; న సుఖాయ = సుఖమునకు గాక; ఇహ= ఈ లోకమునందు; ఆత్మ+ఉపతాపాయ =శరీర మనస్తాపములకు; మృతస్య=మరణించిన పిమ్మట; నరకాయ చ =ధర్మము నాచరింపనందున నరకమునకు పోవుటకును.

తా. తఱచుగా లోభుల ధనము సుఖమున కెప్పుడును పనికిరాదు. ఆ పిసినిగొట్టు ఈ లోకమునందు శరీరమును కష్టపెట్టి మనస్సునకు వ్యథవెట్టి భోగ మాసింపక తాపమును పొందును. దానధర్మాదులు గావింపనందునఁ జచ్చినపిదప నవ్వానికి నరకమును గలుగును.

శ్లో యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యా యే గుణినాం గుణాః,
లోభ స్స్వల్పో ఽపి తాన్ హంతి శ్విత్రం రూప మివేప్సితమ్. **16**

అ. గుణినాం=సద్గుణములు గలవారియొక్క; యే గుణాః= యే గుణములు; శ్లాఘ్యాః = పొగడ్త కెక్కినవో; యశస్వినాం = ఆ కీర్తిమంతుల యొక్క; యశః=యశస్సు; శుద్ధం= నిర్మలమైన; స్వల్పః = లోభః- అపి పిసినిగొట్టుతనము కొంచెమైనను; తాన్ =గుణవంతులను. ఊర్జితం=శ్రేష్ఠమగు; రూపం=రూపము; శ్విత్రం ఇవ=కుష్ఠువువలె; హంతి=హతమార్చును.

తా. గుణవంతుల గుణము లెవ్వి పొగడ్త కెక్కినచో ఆయశోవంతుల స్వల్పమగు లోభమైనను సురూపమును కుష్ఠువువలె కీడునం బొరయించును.

శ్లో. అర్థస్య సాధనే సిద్ధ ఉత్కర్షే రక్షణే వ్యయే,
నాశోపభోగ-ఆయాస స్త్రాసశ్చింతా భ్రమో నృణామ్ 17

అ. నృణాం=నరులకు; అర్థస్య=ధనము యొక్క; సిద్ధే=సిద్ధించినదైనప్పుడును; ఉత్కర్షే= ఆధనవృద్ధియందు, రక్షణే = రక్షణమందు; వ్యయే = వ్యయమందు, నాశ + ఉపభోగే=నాశము భోగమునందు; సాధనే=ఆర్జనమున, ఆయాసః=అలసట; త్రాసః=రక్షణమందు భయము; చింతా =చింత; భ్రమః=నాశము కలుగును.

తా. ధనము సిద్ధించినను దానిని సాధించునప్పుడు పెంపొందించునప్పుడును మిగుల శ్రమ కలుగును. రక్షణమందు భయము కలుగును. భోగమునందు చింత సంభవించును. నాశమున పిచ్చిపట్టును.

శ్లో. స్తేయం హింసాఽనృతం దంభః కామః క్రోధ స్స్మయో మదః,
భేదో వైర మవిశ్వాస స్సంస్పర్ధా వ్యసనాని చ. 18

అ. స్పష్టము

తా. చౌర్యము, హింస, అసత్యము, డాంబికము, కామము, క్రోధము, గర్వము, మత్తు, భేదము, వైరము, అపనమ్మిక, పోటీ, వ్యసనము అనునవి యర్థమువలన గలుగును.

శ్లో. ఏతే పంచదశానర్థా హ్యర్థమూలా మతా నృణామ్,
తస్మా దనర్థ మర్థాఖ్యం శ్రేయోఽర్థీ దూరత స్త్యజేత్. 19

అ. యేతే పంచదశ=ఈ పదునైదు; అనర్థాః=కీళ్లు; అర్థమూలాః = ధనకారణములుగా; నృణాం=నరులకు; మతాః=తలంచబడుచున్నవి; తస్మాత్=అందువలన; అర్థ+ఆఖ్యం=అర్థమను నది అనర్థం=అనర్థము తెచ్చిపెట్టును; శ్రేయః+అర్థీ=శ్రేయస్సును కాంక్షించు వాడు; దూరతః = త్యజేత్=ఆ ధనమును దూరముగా త్యజించ వలయును.

తా. పైనఁ బేర్కొనిన స్తేయాదులు పదునైదును అనర్థములు (కీళ్లు). ధనమూలములై నరులకుఁ గలుగుచున్నవి. వానియందు స్తేయము, హింస, అనృతము, దంభము, కామము, క్రోధము, అర్థప్రాప్తికొఱకు నేర్పడు ననర్థములు. అర్థము ప్రాప్తించిన తరువాత స్మయము మదము మున్నగు తొమ్మిదివ్యసనములతో గూడిన అనర్థములు- స్త్రీ, జూదము, మద్యపానము అను మూడు మహావ్యసనములును ప్రాప్తించు చుండును.

అవ. భేదవైరస్పర్ధలను రెండు శ్లోకములచే ప్రవచించుచున్నాడు.

**శ్లో. భిద్యంతే భ్రాతరో దారాః పితర స్సుహృద స్తథా,**
**ఏకా స్నిగ్ధాః కాకణినా సద్య స్సర్వేఽరయః కృతాః. 20**

అ. భ్రాతరః=తోఁబుట్టువులు; దారాః=భార్యలు; పితరః=తండ్రులు; సుహృదః=బంధువులు భిద్యంతే= స్నేహమును త్యజింతురు. యేకా=ఒక్కటి ప్రాణములుగల వారుడు; అస్నిగ్ధాః= అప్రియముగలవారై, కాకణినా=ఇరువది వరాటిక నాణెములచే; సర్వే=ఎల్లరును; సద్యః=అప్పుడే; అరయః—కృతాః=శత్రువులుగా జేయబడుదురు.

తా. తోఁబుట్టువులు, భార్యలు, తండ్రులు, బంధుమిత్రులు ధనకారణముగా స్నేహము వీడుదురు. దేహములు భిన్నములైనను ప్రాణమొక్కటియై మసలు ప్రాణసఖులు అతిప్రియతములు గూడ ఒక్క కాకణిచే (ఒక్క నాణెముచే) అప్పుడే యెల్లరును పగవా రగుదురు.

**శ్లో. అర్థే నాల్పీయసా హ్యేతే సంరబ్ధా దీప్తమన్యవః.**
**త్యజం త్యసూఽ స్స్పృధో ఘ్నంతి సహసోత్సృజ్య సౌహృదమ్. 21**

అ. అల్పీయసా = మిగుల స్వల్పమైన; అర్థేన = ధనముచే; యేతే=ఈ సోదరులు;సంరబ్ధాః =క్షోభజెందినవారయి; దీప్తమన్యవః = ప్రజ్వలించు క్రోధముగలవారలై; అసూన్ త్యజంతి = ప్రాణములను వీడుదురు; స్పృధః=పగబూనిన వారలై; సౌహృదం = స్నేహమును; ఉత్సృజ్య= విసర్జించి; సహసా=వెంటనే; ఘ్నంతి=చంపుదురు.

తా. మిక్కిలి కొంచెమైన ధనముచేతఁగూడ ఈ సోదరులందఱు క్షకలఁతఁజెందినవారై మందుచున్న కినుకఁగలవారై వారిప్రాణములను వీడుదురు. మఱి వీలున్నచో నెయ్యమును వీడి వెంటనే తమ వానిని చంపివేయుదురు.

అవ. ఈలోకమందు మాత్రము ధనాశాపరుల కీ యనర్థములు గలుగునా లేక పరలోకమందును అనర్థములు గలుగునా అనగా చెప్పుచున్నారు.

**శ్లో. లబ్ధ్వా జన్మామరప్రార్థ్యం మానుష్యం తద్ద్విజాగ్ర్యతామ్,**
**తదనాదృత్య యే స్వార్థం ఘ్నంతి యాంత్యశుభాం గతిమ్. 22**

అ. అమరప్రార్థ్యం=దేవతలచే నర్థింపదగు; మానుష్యం=మనుష్య సంబంధమైన; జన్మ= జన్మమును; లబ్ధ్వా = పొంది; తత్=అందున; ద్విజ+అగ్ర్యతామ్=బ్రాహ్మణ్యమును; తత్=ఆ పావన జన్మమును. అనాదృత్య=ఆదరింపక; యే=ఎవరు; స్వార్థం=ఆత్మహితమును; ఘ్నంతి= నాశము చేయుదురో వారు; అశుభాం గతిం=దుర్గతిని; యాంతి=పొందుదురు.

తా. వేల్పులు సైతము నిత్యము కోరుచుండు మానవ జన్మమును అందున బ్రాహ్మణత్వమును బొందియు దానినాదరింపక యెవరు ఆత్మహితమును ఆత్మ జ్ఞానమును పొంద ప్రయత్నింపరో వారు దుర్గతి పాలగుదురు:

అవ. అమరప్రార్థనీయత్వమును దెలుపుచున్నారు;

**శ్లో. స్వర్గాపవర్గయో ర్ద్వారం ప్రాప్య లోక మిమం పుమాన్,**
**ద్రవిణే కోఽనుషజ్జేత మర్త్యోఽనర్థస్య ధామని. 23**

అ. స్వర్గ అపవర్గయోః = స్వర్గమోక్షములకు; ద్వారం = సాధనమైన; ఇమం లోకం = ఈ దేహమును; ప్రాప్య = పొంది; పుమాన్ = పురుషుఁడు; మర్త్య = మరణశీలుఁడు—నరుడు: అనర్థస్య = కీడునకు; ధామని స్థానమైన; ద్రవిణే = ధనమునందు; కః అనుషజ్జతే = ఎవఁడు ఆసక్తుడగును.

తా. స్వర్గమునకు మోక్షమునకును సాధనమైన ఈదేహమును పొంది పురుషుఁడు నరుఁడు అనర్థజ్ఞానమగు ధనమునం దెవ్వ డాసక్తుఁడగును ?

శ్లో. దేవర్షి పితృభూతాని జ్ఞాతిబంధూంశ్చ భాగినః,
అసంవిభజ్య చాత్మానం యక్షవిత్తః పతత్యధః. 24

అ. దేవర్షి = భూతాని = దేవతలు, ఋషులు, పితరులు, భూతములు, జ్ఞాతిబంధూన్ = సగోత్రులు వివాహాది సంబంధము కలవారిని; భాగినః = భార్యాదులను, ఇతరులను; ఆత్మానం = తనను; అసంవిభజ్య = అన్నాదులచే సంతృప్తులను చేయక; యక్షవిత్తః = యక్షుల ద్రవ్యమునకువలె కేవల రక్షకుడైనవాఁడు; అధః పతతి = క్రిందఁ బడును. దుర్గతి బొందును.

తా. దేవయజ్ఞ పితృయజ్ఞ బ్రహ్మయజ్ఞాదులగు పంచయజ్ఞాధిదేవతలగు దేవతల పితరుల ఋషుల భూత మనుష్య సగోత్రక వివాహాది సంబంధ భార్యాదులగు ధనమునకు భాగస్వాములగువారల నన్నాదులచేఁ దృప్తి పరచక కేవలము సొమ్మునకు యక్షధనమువలె రక్షకుడైన వాఁ డధఃపతితు డగును.

అవ. ఇట్లు విమర్శించి యనుతాపము నొంది యిట్లనుచున్నారు——

శ్లో. వ్యర్థయాఽర్థేహయా విత్తం ప్రమత్తస్య వయోబలమ్,
కుశలా యేన సిద్ధ్యంతి జరఠః కిన్ను సాధయే. 25

అ. వ్యర్థయా = నిష్ప్రయోజనమగు; అర్థేహయా = ధనసంపాదనేచ్ఛచేః ప్రమత్తస్య = మిక్కిలి మత్తుడైన; మమ = నాయొక్క; విత్తం = ధనము; వయః = వయస్సు; బలం = శక్తియు; గతం = తొలగినది; యేన = యేవిత్తాదులచే; కుశలాః = వివేకులు; సిద్ధ్యన్తి = ముక్తినొందుదురో; జరఠః = ముదుసలినై ; కిం ను సాధయే = దేనిని సాధింతును ?

తా. వ్యర్థమైన ధనాశచే ప్రమత్తుఁడనైన నాధనము, వయస్సు బలము విత్తగతమై విత్తాదికమునందు-కుశలురు, అందాశలేనివారు సంసారముక్తు లగుదురు. ముదుసలిని నేనేమి సాధింపగలను ?

అవ. తనవంటి అన్యునిగూర్చియు శోకించుచున్నారు——

శ్లో. కస్మాత్సంక్లిశ్యతే విద్వాన్ వ్యర్థయాఽర్థేహయాఽసకృత్,
కస్యచిన్మాయయా నూనం లోకోఽయం సువిమోహితః. 26

అ. కస్మాత్ = ఎందువలన; విద్వాన్ = అనర్థము నెఱింగినవాఁడు; వ్యర్థయా = అర్థ + ఈహయా = వ్యర్థమైన ధనాశచే; అసకృత్ = పలుమార్లు; సంక్లిశ్యతే = మిక్కిలి క్లేశపడుచున్నాడు; కార్యము మాహించుచున్నారు; కస్యచిత్ = ఒకానొకనియొక్క; మాయయా = మాయచే; అయం లోకః = ఈ జనము; నూనం నిక్కముగా; సువిమోహితః = మిక్కిలి విమోహమును పొందినది.

తా. అర్థ మనర్థములను దెచ్చునని యెఱింగిన పండితుఁడును ఎందువలననో వ్యర్థముగా నర్థాశచేఁ బలుమార్లు మిక్కిలిక్లేశమునుఁ బొందుచున్నాడు. ఏ ఒకానొకని మాయచేతనో ఈ లోకము మిక్కిలి మోహమును పొందుచున్నది.

అవ. అయ్యో! ఇతఁడు మోహితుఁడై క్లేశమును బొందుటలేదు, కాని ధనాదులచే భోగాదులను పొందవలెనను నిచ్ఛచే నందురా ?

శ్లో. కిం ధనై ర్ధనదై ర్వా కిం కామై ర్వా కామదై రుత,
మృత్యునా గ్రస్యమానస్య కర్మభి ర్వోత జన్మదైః. **27**

అ. మృత్యునా=మరణముచే; గ్రస్యమానస్య=మ్రింగబడనున్నవానికి; ధనైః ధనదై ర్వా కిం=ధనములతో లేక ఆ ధనమునిచ్చు వారితో నేమి పని; కామైర్వా కిం=కోరికలతో నేమిపని; ఉత కామదైః=మరియు ఆ కోర్కెలు తీర్చు ధనముచే నేమి ప్రయోజనము? అట్లే, జన్మదైః=అనేక జన్మలనిచ్చు; కర్మభిః వా=కర్మలచేతను; కిం=యేమి ప్రయోజనము ?

తా. మృత్యువుచే మ్రింగబడుచున్నవానికి ధనములచే, ధనమునిచ్చువారిచే నేమి ప్రయోజనము ? కామముచే కామములిచ్చువారిచే నేమి ప్రయోజనము ? జన్మలను గలిగించు కర్మలచే నేమి ప్రయోజనము కలుగును ?

అవ. ఇప్పుడు వివేకము నొంది హర్షించుచుఁ జెప్పుచున్నాడు—

శ్లో. నూనం మే భగవాన్ ప్రీత స్సర్వదేవమయో హరిః,
యేన నీతో దశా మేతాం నిర్వేద శ్చాత్మనః ప్లవః. **28**

అ. యేన ప్రీతేన=సంతసించిన యెవ్వనిచే; అహం=నేను; యేతాం దశాం=ఈ వైరాగ్య దశను; నీతః=పొందబడితినో? ఆత్మనః ప్లవః=నాకు తెప్పయగు; నిర్వేదశ్చ=వైరాగ్యమును కలిగెనో; సః=అట్టి; భగవాన్=భగవంతుడు; సర్వదేవమయః=సర్వదేవతా స్వరూపుడు నైన; హరిః=విష్ణువు; నూనం=నిశ్చయముగా; తుష్టః=సంతోషించినాడు.

తా. నిజముగా నావలన సర్వదేవతాస్వరూపుఁడాహరి సంప్రీతుడయినాడు. ఆయన చేతనే ఈదశను బొంది సంసారసాగరమును తరింప దెప్పయైన వైరాగ్యము నొందితిని.

శ్లో. సోఽహం కాలావశేషేణ శోషయిష్యేఽంగ మాత్మనః,
అప్రమత్తోఽఖిలస్వార్థే యది స్యా త్సిద్ధ ఆత్మని. **29**

అ. సః అహం=అట్లు నిర్వేదమునొందిన నేను; యది స్యాత్=జీవితకాల మింకను మిగిలి యున్నచో, కాల+అవశేషేణ=జీవితకాలశేషముచే; ఆత్మనః అంగం=నా దేహమును, శోషయిష్యే =తపస్సుచే శోషింపజేసెదను, ఆత్మని సిద్ధః=ఆత్మయందే తుష్టుడనై, అఖిలస్వార్థే=సమస్తమైన ధర్మాధి సాధనమునందు; అప్రమత్తః=యేమరుపువీడిన వాతనయ్యెదను.

తా. నాకు జీవిత మింకను శేషించియున్నచో నేను సమస్త ధర్మసాధనమం దప్రమత్తుడనై ఆత్మసంతుష్టుఁడనై జీవితకాలశేషము నా శరీరమను తపమున శ్రమ పెట్టెదను.

శ్లో. తత్ర మా మనుమోదేరన్ దేవా స్త్రిభువనేశ్వరాః,
ముహూర్తేన బ్రహ్మలోకం ఖట్వాంగ స్సమసాధయత్. 30

అ. తత్ర=ఆ తపోనిష్ఠనున్న మాం=నన్ను; త్రిభువన+ఈశ్వరాః=ముల్లోకములకు ప్రభువులగు త్రిమూర్తులు;దేవాః = ఇంద్రాది దేవతలు అనుమోదేరన్ = ఆమోదింతురు; ఖట్వాంగః = ఖట్వాంగుడు. ముహూర్తేన=ముహూర్తకాలములో; బ్రహ్మలోకం=వైకుంఠమును సమసాధయత్= సాధించెను.

తా. నేను తపోనిష్ఠలో నున్నచో త్రిలోకప్రభువులైన త్రిమూర్తులు ఇంద్రాది దేవతలు నన్ను గూర్చి ఆమోదింతురు. ఖట్వాంగు డొక్క ముహూర్తమున బ్రహ్మలోకమును సాధించెను.

శ్రీ భగవా నువాచ=శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. ఇత్యభిప్రేత్య మనసా హ్యావంత్యో ద్విజసత్తమః,
ఉన్ముచ్య హృదయగ్రంథీన్ శాంతో భిక్షు రభూ న్మునిః, 31

అ. ఇతి అభిప్రేత్య మనసా=ఇట్లు మనస్సులో నిశ్చయించుకొని; ఆవంత్యః=అవంతీ దేశ సంజాతుడు; ద్విజసత్తమః=ద్విజశ్రేష్ఠుడు; శాంతః భిక్షుః మునిః అభూత్=శాంతుడై మౌనియై భిక్షుకుడయ్యెను.

తా. ఇట్లు మనస్సున నిశ్చయించి అయ్యవంతీదేశ విప్రవరుడు అహంకారాదుల నెల్ల త్యజించి శాంతుండై మౌనియై భిక్షుకుం డయ్యెను.

శ్లో. స చచార మహీ మేతాం సంయతాత్మేంద్రియానిలః,
భిక్షార్థం నగరగ్రామా నసంగోఽలక్షితోఽవిశత్. 32

అ. సః= ఆ భిక్షువు; సంయత+ఆత్మ+ఇంద్రియః=ఇంద్రియ మనస్సులను నిరోధించిన వాడై; యేతాం మహీం=ఈ భూమిని; చచార=సంచరించెను; అసంగః=ఆసక్తిలేనివాడు; అలక్షితః=ఇతడిట్టివాడని గుర్తింపరానివాడై; భిక్షార్థం=భిక్షకొఱకు; నగరగ్రామాన్=నగర గ్రామములను; అవిశత్=చొచ్చెను.

తా. ఇంద్రియముల నరికట్టి మనస్సు నిల్పినవాఁడై ఆ భిక్షుకు డీ భూమిని సంచరించుచు, అసంగుడై శ్రేష్ఠుడుగాఁ దెలియనివాఁడై భిక్షకొఱకు నగరగ్రామములను జొచ్చెను.

శ్లో. తం వై ప్రవయసం భిక్షు మవధూత మసజ్జనాః,
దృష్ట్వాః పర్యభవన్ భద్ర బహ్వీభిః పరిభూతిభిః. 33

అ. భద్ర= ఓ మంగళుడైనవాడా, ప్రవయసం=మిక్కిలి ముదుసలి, అవధూతం=మలినుడైన; తం భిక్షుం= ఆ భిక్షువును; అసత్ జనాః=దుష్టజనులు; దుష్టాః=పొగరుబోతులు; బహ్వీభిః=పెక్కువిధముల; పరిభూతిభిః=తిరస్కారములచే; పర్యభవన్=అవమానించిరి

తా. మిక్కిలి ముదిసి మలినదేహుఁడైన ఆభిక్షుకుని కొందఱు దుష్టజనులు పొగరుబోతులును అనేక భంగుల తిరస్కారములచే నవమానించిరి.

అవ. ఆ పరిభవమును ఏడు శ్లోకములలో చెప్పుచున్నాడు.

శ్లో. కేచి త్త్రివేణుం జగృహు రేకే పాత్రకమండలూ,
పీఠం చైకేఒక్షసూత్రం చ కంథాం చీరాణి కేచన. 34

అ. కేచిత్=కొందరు దుష్టులు; త్రివేణుం=మూడు వెదురుల కట్టను; జగృహుః=గ్రహించిరి; యేకే=కొందఱు; పాత్రకమండలూ=అన్నపాత్రను కమండలమునుగొని; యేకే=కొందఱు; పీఠం=కృష్ణాజినమును; అక్షసూత్రం = అక్షమాలను, కంథాం = బొంతను; చీరాణి = కావి వస్త్రములను గొనిరి.

తా. కొందఱు పురుషులు ఆ వృద్ధసన్యాసి దండమును గ్రహించిరి. కొందఱు అన్న పాత్రను కమండలమును గొనిరి. కొందఱు కృష్ణాజినమును అక్షమాలను గ్రహించిరి. కొందఱు బొంతను కావిబట్టలను గొనిరి.

శ్లో. ప్రదాయ చ పునస్తాని దర్శితా న్యాదదు ర్మునేః. 35
అన్నం చ భైక్షసంపన్నం భుంజానస్య సరిత్తటే,
మూత్రయంతి చ పాపిష్ఠా నిష్ఠీవంత్యస్య మూర్ధని. 36

అ తాని=వానిని, మునేః ప్రదాయ=ఓ భగవంతుడా, తీసికొనుమని; దర్శితాని=చూపిన వానినే; ఆదదుః=మరల గ్రహించిరి; భైక్షసంపన్నం=భిక్షగొనివచ్చిన; అన్నం = అన్నమును సరిత్-తటే=నదీతీరమున, భుంజానస్య=భుజించువానిని, మూర్ధని=శిరమున; పాపిష్ఠాః=ఆపాపాత్ములు; మూత్రయంతి చ = ఉచ్చపోసిరి; నిష్ఠీవంతి=ఉమ్మివేసిరి

తా. తాము గొన్నవానిని ఓ భగవంతుడా! కొనుమని, మునికి చూపి వానిని మరల గ్రహించి ఆ పాపాత్ములు భిక్షమెత్తిసంపాదించుకొన్న అన్నమును నదీతీరమున భుజించుచున్న ఆభిక్షువు శిరమున మూత్రమును పోసిరి. ఉమ్మివేసిరి.

శ్లో. యతవాచం వాచయంతి తాడయంతి న వక్తి చేత్,
తర్జయం త్యపరే వాగ్భిః స్తేనోఒయమితి వాదినః. 37

అ. యతవాచం=వాఙ్నియమము గలవానిని; వాచయంతి = మాటాడించెదరు; న వక్తి చేత్= మాటాడనిచో; అయం స్తేనః=వీడు దొంగ యని; వాదినః=వాదించుచు;వాగ్భిః తర్జయంతి=వాక్కులచే బెదరించిరి;

తా. మౌనియై మాటాడకయున్న మాటాడించెదరు. మాటాడకుండిన కొట్టిరి. ఇతరులు వీడు దొంగయని మాటలచే బెదరించిరి.

శ్లో. బధ్నంతి రజ్వా తం కేచి ద్బధ్యతాం వధ్యతా మితి,
క్షిపంత్యేకేఒవజానంతి హ్యేష ధర్మధ్వజ శ్శఠః,
క్షీణవిత్త ఇమాం వృత్తి మగ్రహీ త్స్వజనోజ్ఝితః, 38

అ. కేచిత్ = కొందఱు; రజ్వా = త్రాడుచే; తం=ఆ భిక్షువును; బధ్యతాం వధ్యతా మితి= కట్టుడు కొట్టుడని; బధ్నంతి=కట్టసాగిరి; యేకే=కొందరు; క్షిపంతి=నిందింప దొడగిరి; యేషః= వీడు; ధర్మధ్వజః=కపట ధర్మ వేషపువాడు; శఠః=దుష్టుడు; క్షీణవిత్తః=ధనము పోగొట్టుకొనినవాడు; స్వజనోజ్ఝితః =తన బంధులచే విడువబడినవాడు ఇమాం వృత్తిం=ఈ భిక్షువృత్తిని; అగ్రహీత్ =స్వీకరించెను; అని, అవజానంతి =అవమానించిరి.

తా. కొందఱు కట్టుడు కొట్టుడని ఆ భిక్షువును త్రాడుచే గట్టిరి. కొందఱు నిందించిరి. కొంద ఱీతడు కుటిలమగు ధర్మవేషము వేసినవాఁడనియు, త్రిదండి సన్యాసి వేషమును వేసినాడనియు, లోకవంచకుడనియు ధనమెల్లరు గోల్పోవుటచే నీ సన్యాసవృత్తిని గ్రహించిన జడు డనియు నవమానించిరి.

శ్లో॥ అహో ఏష మహాసారో ధృతిమాన్ గిరిరా డివ,
మౌనేన సాధయ త్యర్థం బకవ ద్దృఢనిశ్చయః. 39

అ. అహో=ఔర; యేష=ఇతడు; గిరిరాడ్ + ఇవ=పర్వతము వలె; మహాసారః=అమిత బల్లిదుడు; ధృతిమాన్=ధైర్యశాలి; మౌనేన=మౌనముచే; బకవత్=కొంగవలె, కృతనిశ్చయః=చలించని మనస్సు గలవాడై; అర్థం=స్వప్రయోజనమును; సాధయతి=సాధించువాడు.

తా. ఔరా! ఇతడు పర్వతరాజువలె బలిష్ఠుడు, ధైర్యశాలి కొంగవలె ధృఢనిశ్చయుడై మౌనమున స్వప్రయోజనమును సాధించుచున్నాడు.

శ్లో॥ ఇత్యేకే విహసం త్యేన మన్యే దుర్వాతయంతి చ,
తం బబంధు ర్నిరురుధు ర్యథా క్రీడనకం ద్విజమ్. 40

అ ఇతి=ఇట్లు; యేకే=కొందరు; విహసంతి=పరిహసించ సాగిరి; యేకే=కొందరు, దుర్వాతయంతి = అపానమును విడతురు; తం=ఆ భిక్షువును? క్రీడనకం= క్రీడాసాధనమైన; యథా ద్విజం=శుకశారికాదులనువలె; బంధుః=కారాగారమున బంధించిరి.

తా. ఇట్లని కొందఱు పరిహసించిరి. కొందఱు వానిపై అపానవాయువు విడచిరి. కొంద ఱతనిని సంకెళ్లతో కట్టిరి. కొందఱు చిలుక, గోరువంకలనువలె ఆటపట్టి చెరసాలలో బంధించిరి.

శ్లో॥ ఏవం స భౌతికం దుఃఖం దైహికం దైవికం చ యత్,
భోక్తవ్య మాత్మనో దిష్టం ప్రాప్తం ప్రాప్త మబుధ్యత. 41

అ. యేవం=ఈ ప్రకారము; సః=ఆ భిక్షువు, భౌతికం=దుర్జనాదులు చేసిన; దైహికం=దేహముయొక్క; దుఃఖం=జ్వరాది నిమిత్తమగు యత్=యేది; దైవికం = శీతోష్ణభావము; ఆత్మనః=తనకు; భోక్తవ్యం=అనుభవించవలసిన; దిష్టం=దైవికమై, ప్రాప్తం ప్రాప్తం=అట్లు ప్రాప్తించుదానినిగ; అబుధ్యత=ఎఱిఁగెను.

తా. ఈ ప్రకార మీభిక్షకుఁడు దుర్జను లాచరించిన భౌతికమైనవియగు దైహికజ్వరాది దుఃఖమును దైవికమైన శీతోష్ణాది దుఃఖమును తనకు తప్పక ననుభవింపదగినదని దైవప్రాప్తమైనదని యెఱింగెను.

శ్లో॥ పరిభూత ఇమాం గాథా మగాయత నరాధమైః,
పాతయద్భి స్స్వధర్మస్థో ధృతి మాస్థాయ సాత్త్వికీమ్. 42

అ. పాతయద్భిః=అధర్మమున తన్ను గొట్టుచున్న; నరాధమైః=ఆనీచులచే; పరిభూతః=అవమానితుఁడై స్వధర్మస్థః=తనధర్మమున నుండి. సాత్త్వికీం=సత్త్వగుణమును బొందియును; ధృతిం=ధైర్యమును; ఆస్థాయ=కూడగట్టుకొని; ఇమాం గాథాం=ఈ గాథను, అగాయత=గానమొనర్చెను.

తా. తన్ను గొట్టుచున్న సరాధములచే నిట్లు అవమానితుడై అభిక్షువు తనధర్మమున నిల్చి సాత్త్వికమగు ధృతిని జెప్పు ఈ గాథను కీర్తించెను.

అవ. ఆ గాథను పదునాలు శ్లోకములచే నిట్లు జెప్పుచున్నాడు.

**శ్లో. నాయం జనో మే సుఖదుఃఖహేతు ర్న దేవతాత్మగ్రహకర్మకాలాః,**
**మనః పరం కారణ మామనంతి సంసారచక్రం పరివర్తయే ద్యత్. 43**

టీ. అయం జనః=ఈ దుష్టజనము; న మే సుఖదుఃఖహేతుః=నా సుఖదుఃఖములకు కారణము గాదు; న దేవతా అత్మగ్రహకర్మకాలాః=దేవతలు, ఆత్మ కర్మ కాలము కాదు; యత్=యేది; సంసారచక్రం పరివర్తయేత్=సంసార చక్రమును ద్రిప్పుచున్నదో; మనః=ఆ మనస్సే, పరం కారణం=ముఖ్యకారణమని; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

ఆట్లే శ్రుతి "మనసా హ్యేవ శృణోతి; మనసా పశ్యతి"
మనస్సుచే వినుచున్నాఁడు. మనస్సుచే జూచుచున్నాఁడు.

తా. ఈ దుష్టజనులు నాసుఖదుఃఖములకు కారకులు గారు. దేవతలు (పరమాత్మ) గ్రహములు కర్మ కాలము అనునవి గూడ కాదు. ఏది సంసార చక్రమును ద్రిప్పుచున్నదో ఆ మనస్సే ముఖ్యకారణమని జెప్పుచున్నాడు.

**శ్లో మనో గుణాన్వై సృజతే బలీయ స్తతశ్చ కర్మాణి విలక్షణాని,**
**శుక్లాని కృష్ణా న్యథలోహితాని తేభ్య స్సవర్ణా స్సృతయో భవంతి 44**

టీ. మనః=మనస్సు; గుణాన్=సత్త్వాది గుణవృత్తులను; సృజతే=సృజించుచున్నది;తతః=ఆ వృత్తులవలన; విలక్షణాని=విభిన్నములైన, కర్మాణి=క్రియలు; జనించుచున్నవి; తేభ్యః=ఆక్రియలవలన, సవర్ణాః=ఆయా కర్మానురూపము; సృతయః=దేవతిర్యఙ్నరాదిగతులు కలుగుచున్నవి

తా. బలిష్ఠమైన మనస్సు సత్త్వాదిగుణములను సృజించును. అవృత్తులవలన నిర్మలములగు సాత్త్వికములు పాపాస్వాదులగు తామసములును, పుణ్యాపుణ్యాత్మకములగు రాజసము లోనగు కర్మలు గలుగును. వానివలన వానివాని కర్మానుసారము క్రమముగా సాత్త్వికులు-దేవతలు-తామసులు రాక్షసులు-క్రమముగా రాజసులు నరులునుగా నగుదురు.

అవ. అట్లయిన మనస్సుకే సంసారముగాని ఆత్మకు గాదొకో యను శంకకు జెప్పుచున్నాడు. అవిద్యచే మనస్సుయొక్క అభ్యాసముచే ఆత్మకి సంసారము గలుగుచున్నది స్వయముగఁ గాదు. ఏలయన ఆ యధ్యాసలేని ఈశ్వరునకు ఈ సంసారము లేదు. మఱి యేమనగాఆ యధ్యాసగల జీవునకే గలుగుచున్నదనుట జెప్పుచున్నాడు.

**శ్లో. అనీహ ఆత్మా మనసా సమీహతా హిరణ్మయో మత్సఖ ఉద్విచష్టే,**
**మనస్స్వలింగం పరిగృహ్య కామాన్ జుషన్నిబద్ధో గుణసంగతోఽసౌ. 45**

టీ. సమీహతా=సంకల్ప వికల్పములుచేయు కార్యములను గోరుచున్న; మనసా=మనస్సుచే; అనీహః=యే కోర్కెలు — క్రియలును లేనివాడై; ఆత్మా=పరమాత్మ; హిరణ్మయో=విద్యాశక్తి

ప్రధానుడు మత్సఖః=నాజీవన సఖుడగుటచేత; ఉత్=అధికముగా; విచష్టే=తిరోహితముగాని జ్ఞానముచే; కేవలము చూచుచున్నాడు; అందువలన; అసౌ=మఱి ఈ జీవుడగు నేను; స్వలింగం= నాయందు ఈ సంసారమును దోఁపింపఁజేయు; మనః=మనస్సును నేనుగా; పరిగృహ్య=పరిగ్రహించి; సత్త్వాదిగుణములవలన; జుషత్=సేవించుచు; గుణసంగత=కర్మలతోడి సంబంధము గలవాడనై; నిబద్ధః=బంధింపబడితిని.

తా. సంకల్పవికల్పములు గావింపగోరుచున్న మనస్సుతో తత్క్రియాసంగరహితుడైన పరమాత్మ విద్యాశక్తిప్రధానుడు. నా జీవనమునకు సఖుడు. నియంత-స్వతంత్రుడు-అతిరోహితజ్ఞానముచే కేవలము నన్ను జూచుచున్నాడు. అందువలన ఈ జీవుడనైన నేను సంసారమును ప్రకటించు ఈమనస్సుతో ఆత్మగా పరిగ్రహించి అధ్యాసచే సత్త్వాది గుణసంగము వలన కామసుఖములను సేవించుచు ఈ సంసారమునందు కట్టివేయబడుచున్నాడు.

అవ. అందువలన మనోనిగ్రహము జేసినయెడల సర్వమును జేసినట్లే. అనిగ్రహము లేకున్న సర్వమును వ్యర్థమనుట రెండుశ్లోకములలోఁ జెప్పుచున్నాడు:

**శ్లో. దానం స్వధర్మో నియమో యమశ్చ శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని,**
**సర్వే మనోనిగ్రహలక్షణాంతాః పరో హి యోగో మనసః సమాధిః 46**

అ. దానం=దానము; స్వధర్మః=నిత్యనైమిత్తికమైనది, నియమః = తపస్స్వాధ్యాయాదులు; యమః= అహింసా సత్యములు, శ్రుతం = వేదాధ్యయనము; కర్మాణి=ఇతర క్రియలు; సత్+వ్రతాని = ఉత్తమ వ్రతమును, సర్వే = ఇవి యన్నియు; మనోలక్షణ+అంతాః = మనో నిగ్రహరూప ఫలము గలవి; అవి, జ్ఞానాంగములుగా ప్రసిద్ధములైనవి – అందుచే; మనసః=సమాధిః=మనోనిగ్రహము; పరః యోగః=ఉత్కృష్టమైన జ్ఞానము.

తా. దానము నిత్యనైమిత్తికమగు ధర్మము, తపస్స్వాధ్యాయాది నియమములు - అహింసా సత్యాదియమము, వేదాంత శాస్త్రాదిశ్రవణము - ఏకాదశ్యుపవాసాది వ్రతములు - ఇతరములగు కర్మలు నిట్లే. మనోనిగ్రహ మొక్కటే ఫలముగాఁ గలవి. మనోనిగ్రహమే యుత్కృష్టజ్ఞాన మగును.

**శ్లో. సమాహితం యస్య మనః ప్రశాంతం దానాదిభిః కిం వద తస్య కృత్యం,**
**అసంయతం యస్య మనో వినశ్య ద్దానాదిభి శ్చే దపరం కిమేభిః 47**

అ. యస్య మనః=ఎవని మనస్సు; సమాహితం=నిశ్చలమై; ప్రశాంతం=పరమ శాంతమగునో; తస్య=వానికి; దాన+ఆదిభిః=దానములు మున్నగు వానిచే; కిం కృత్యం=యేమి పని ? కిం=యేమి_ చెప్పుమని ప్రత్యుపదేశమును జేయుచు స్వయముగనే జెప్పుచున్నాడు; యస్య మనః= ఎవని మనస్సు, అసంయతం=కట్టువడనిదిగ చంచలమునై; వినశ్యత్=అలస్యాదులతో నశించుచున్నదగునో, అతనికి, యేభిః=ఈ; దానాదిభిః=దానమున్నగు వానిచే; అపరం కిం=వేరు ప్రయోజనమేమి ?

తా. ఎవని మనస్సు నిశ్చలమై ప్రశాంతమగునో వానికి దానాదులచే జేయఁదగు క్రియ ఏదిగలదో చెప్పుము. ఎవరి మనస్సు కట్టువడక చంచలమగునో వానికి ఈ దానాదులచే నేమి ప్రయోజనము గలుగును?

అవ. అయ్యా! ఇతరములగు నింద్రియములవలన ప్రయోజనము కలదా? అనగా లేదనుచున్నారు.

శ్లో. మనో వశేఽన్యే హ్యభవం స్మ దేవా మనశ్చ నాన్యస్య వశం సమేతి,
భీష్మో హి దేవ స్సహస స్సహీయాన్ యుంజ్యా ద్వశే తం సహి దేవదేవః. 48

అ. మనః + వశే = మనస్సు వశమగుచుండగా; అన్యే దేహః = ఇతరములగు నింద్రియములు- వాని యధిష్ఠాతలగు దేవతలు; మనోవశే = మనస్సుకు వశము; అభవన్ = అయిరి; మనః = మనస్సు; అన్యస్య = ఇతరములకు; న వశం సమేతి = వశము గాదు భీష్మః + హి = యోగ్యులకు కూడ భయం కరుఁడగు. దేవః = మనోరూపుడు; సహసః = బలవంతుని కంటె; సహీయాన్ = బలవంతుఁడు; యః = ఎవడు; తం = అతనిని. వశే యుంజ్యాత్ = వశ మొనరించుకొనునో; సహి = వాఁడే, దేవదేవః సర్వేంద్రియ జేత యగుచున్నాడు: ఇతరులు కారు, ఆట్లే శ్రుతియు :

శ్లో. మనసో వశే సర్వమిదం బభూవ నాన్యస్య మనో వశ మన్వియాయ,
భీష్మో హి దేవః సహసః సహీయాన్... ఇతి.

మనస్సు వశమైనచో నన్యములగు నింద్రియము వాని నధిష్ఠించిన దేవతలును వశ్య లగుదురు ఇది ఇతరములగు నింద్రియాదికమునకు వశమగునదికాదు. ఈ మనోదేవుఁడు యోగులకు సైతము మిగుల భయంకరుడు.

అవ. అందువలన ఆమనస్సు నిగ్రహమునకు వ్యతిరేకముగా ఇతర నిగ్రహముకై ప్రవర్తించువారు మూఢు లనుచున్నారు.

శ్లో. తం దుర్జయం శత్రు మసహ్యవేగ మరుంతుదం తన్న విజిత్య కేచిత్,
కుర్వం త్యసద్విగ్రహ మత్ర మర్త్యై ర్మిత్రా ణ్యుదాసీనరిపూంశ్చ మూఢాః 49

అ. దుర్జయం = గెలువ శక్యము గానిది; అసహ్యవేగం = సహింపరాని రాగాదుల, వేగము గలది; అరుంతుదం = మర్మముల వ్యథపుట్టునదియు; తత్ = ఆ మనస్సును; అవిజిత్య = జయింపక; కేచిత్ = కొందఱు మర్త్యులు; మర్త్యైః = మర్త్యులలో, అసత్ + విగ్రహం = వా స్తవముగా కలహము కుర్వంతి = కావింతురు; అత్ర = ఇచట అనుకూలమును బట్టి; మిత్రాణి = మిత్రులను; ఉదాసీన + రిపూన్ చ = ఉపేక్షావంతులను శత్రువులనుగా, మూఢాః = మూఢులు; కుర్వంతి = చేయుచున్నారు

తా. గెలువశక్యముగానిదియు, సైరింపరాని రాగాదులవేగముగలదై, మర్మములు వుచ్చు మనస్సును జయింపలేక కొందఱు మర్త్యులు మర్త్యులతో గలహింతురు. ఆమూఢులు కొంద ఱిని మిత్రులుగను, ఉదాసీనులుగను శత్రువులుగను చేయుచుందురు.

అవ పిమ్మట నాప్రకారమున సంసారమున దిరుగుచుందు రనుచున్నారు—

శ్లో. దేహం మనోమాత్ర మిమం గృహీత్వా
మమాహమి త్యంధధియో మనుష్యాః
ఏషోఽహ మన్యోఽయ మితి భ్రమేణ
దురంతపారే తమసి భ్రమంతి. 50

అ మనోమాత్రం = మనస్సుచే మాత్రము కల్పించిన; ఇమం దేహం = ఈ దేహమును; మమ + అహం ఇతి = పుత్రాది దేహమును నాది యని స్వదేహమును; నిగ్రహముతో గ్రహించి; అంధ

ధియః = అజ్ఞానబుద్ధిగల; మనుష్యాః = మనుష్యులు; ఏషః అహం = ఇది నేను; అయం + అన్యః + ఇతి = ఇతఁడు వేఱు అను; భ్రమేణ = భ్రాంతిచే; దురంతపారే = తరింపరాని దరి గల; తమసి = సంసారమందు; భ్రమంతి = తిరుగుచుందురు.

తా. మనస్సుచేతనే కల్పించబడిన ఈ దేహము నేను. పుత్రాదిదేహములు మత్సంబంధములని అజ్ఞానమయుఁడై మనుష్యుఁడు ఇది నేను-ఇతఁడు వేఱను భ్రాంతిచే తరింప శక్యము గాని దరిగల సంసారతమస్సున బడి తిరుగుచున్నాడు.

అవ. ఈ ప్రకారము మనస్సునే సుఖదుఃఖకారణమని యుపపాదించి జనాదులగు నాటింటిని కారణములు గావని యీ శ్లోకములచే జెప్పుచున్నాఁడు.

శ్లో॥ జనోఽన్యహేతు స్సుఖదుఃఖయోశ్చే
త్కిమాత్మన శ్చాత్ర హి భౌమయో స్తత్,
జిహ్వాం క్వచి త్సాన్వం దశతి స్వదద్భి
స్తద్వేదనాయాం కతమాయ కుప్యేత్ 51

అ. అస్య = ఈ సంసారము యొక్క; సుఖదుఃఖయోః = సుఖదుఃఖములకు; జనః = జనము; హేతుశ్చేల్ = కారణమైనచో; ఈ పక్షమందు ఆత్మకు సుఖదుఃఖాదిక మున్నదా, ఏమియు లేదు. ఆత్మకు- సుఖదుఃఖ కర్మత్వము, తత్కర్తృత్వము లేదని అర్థము; ఏలయన చెప్పుచున్నాడు— ఆత్మా = ఈ ఆత్మ హి నిశ్చయిఃపఁబడి; భౌమయోః = భూమి వికారములైన స్థూలసూక్ష్మ శరీరములకు; క్వచిత్—జిహ్వాం = తన నాలుకను; స్వదద్భిః = తన దంతములచే; దశతి = కొఱుకుచున్నాడు; తత్ + వేదనాయాం = అ బాధయందు కతమాయ = దేనికొఱకు; కుప్యేత్ = కోపించును.

తా. ఈ సంసారసుఖదుఃఖములకు కారణము జనులేయన్నచో ఆ సుఖదుఃఖాదికము ఆత్మ కేమాత్రము లేదు. భూమి వికారములగు స్థూలసూక్ష్మదేహములకే యగును. ఆత్మకు గాదు. ఆ మూర్తియు, అక్రియుఁడైన వానికి హవ్యాదులందు కర్తృత్వ కర్మత్వముల చొప్పడము—అట్లయినను దుఃఖమాత్మపర్యవసాయియే యనినచో ఈప్రకారమైన ఆత్మ రెండు విధములుగానున్న ఒక్కఁడే యగుటవలన ఏ యొకడును విషయము గాదు. తన నాలుక తనదంతములతో గొఱికికొని నరుఁ డెవనిపై గోపించును?

అవ. దేవతలకు సర్వదేహములందు అభేదము వలన కోప విషయము లేదని స్వదేహ దృష్టాంతమును చెప్పుచున్నారు.

శ్లో. దుఃఖస్య హేతు ర్యది దేవతాస్తు కిమాత్మన స్తత్ర వికారయో స్తత్,
యదంగ మంగేన నిహన్యతే క్వచి త్క్రుధ్యేత కస్మై పురుష స్తతోఽన్యః 52

అ. దుఃఖస్య హేతుః = దుఃఖమునకు గారణము, యది దేవతా = ఇంద్రియాధి దేవతలైన; అస్తు = అట్లే అగుఁగాక; ఆపక్షము నందును; ఆత్మనః కిం = ఆత్మ కేమి గలదు; ఎందువలన; తత్ర = ఆ ఇంద్రియాధిపత్యము వికారయోః = నామరూప వికారములు పొందిన; ఇరువురు దేవతలకే తత్ = ఆ దుఃఖము కలుగును; — హస్తముచే ముఖము కొట్టఁబడి హస్తము నష్టమైనచో—ఆ ముఖముల నభిమానించు అగ్నీంద్రులకు ఆ దుఃఖము కలుగును గాని అతిక్రియుఁడై—అనహంకారుఁడైన ఆత్మకు గలుగదు.

యత్ = ఎప్పుడు; అంగం = దేవతాధిష్ఠాంతమైన అంగేన = హస్తాదికముచే; నిహన్యతే = కొట్టబడుచున్న; తతః = ఆ అంగాదులకంటె; అన్యపురుషః = ఇతరుఁడగు పురుషుఁడు; కస్మై = ఎవనికొఱకు; క్రుధ్యేత = కోపించును ?

తా. ఆ దుఃఖము ఇంద్రియాధిష్ఠాతలగు దేవతలకు అగునన్నచో నట్లేయగుగాక కాని ! ఆ పక్షమునందును ఆత్మకేమి గలదు? వికారయోః = వికారము పొందిన దేవతల ముఖమును, హస్తముకొట్టగా అముఖముచే అహస్తము కొఱుకబడగా ఆబాధ ఆ అధిష్ఠాన దేవతలకు అగ్నికి ఇంద్రునకు అగును. కాని ఆ యింద్రియ దేవతలకంటె నన్యుఁడుడు, అనహంకారు ఆత్మకు గాదు. హస్తముబొందు బాధకై-ఎవరికై-కోపించును.

శ్లో. ఆత్మా యది స్యాత్సుఖదుఃఖహేతుః
కిమన్యత స్తత్ర నిజస్వభావః
నహ్యాత్మనోఽన్య ద్యది తన్మృషాస్యాత్
క్రుధ్యేత కస్మా న్న సుఖం న దుఃఖమ్. 53

అ. సుఖదుఃఖహేతుః = ఆత్మ వలననే కలుగు సుఖదుఃఖాకార పరిణామముల వలన వానికి ఆత్మా యది స్యాత్ = ఆత్మయగు నెడల; ఆ పక్షము నందును; అన్యతః కిం = ఇతరమైన దాని వలన గాదు, నిజస్వభావః = తన స్వభావమేయైన ఎవనికై ఆత్మకు పరిణామము అన్యము వలని కలుగును గదా ! అందువలన కోప విషయము గలుగునన్నచో అందులకు చెప్పుచున్నాడు, ఆత్మనః అన్యత్ = ఆత్మకంటె వ్యతిరిక్తము; నహి = లేనే లేదు; యది స్యాత్ = అట్లు ఉన్నట్లుగా దోచుచున్నది. తత్ మృషా = అది మిథ్యయే; కస్మాత్ = ఏ హేతువు వలన; క్రుధ్యేత = కోపించును న సుఖం న దుఃఖం = దేని నిమిత్తము సుఖదుఃఖములు లేవో.

తా. పోనిండు. అట్లుగాని యాత్మయే సుఖదుఃఖములకు హేతువగునెడల ఆత్మయైన సుఖదుఃఖాకార పరిణామము నిజస్వభావము గలదగును. ఇతరము వలనకాదు. ఎవనికికోపించు ఆత్మకంటె నితరము లేదు. అట్లుండినట్లు తోచినచో అది మిథ్యయగును. దేనివలన సుఖదుఃఖములేదో దానిపై నెట్లు కోపించును ?

శ్లో. గ్రహా నిమిత్తం సుఖదుఃఖయో శ్చే
త్కిమాత్మనోఽజన్య జనస్య తేవై,
గ్రహై ర్గ్రహస్యైవ వదంతి పీడాం
క్రుధ్యేత కస్మై పురుష స్తతోఽన్యః. 54

అ. సుఖదుఃఖయోః = సుఖదుఃఖములకు; గ్రహాః = సూర్యాది గ్రహములు; నిమిత్తం చేత్ = కారణము; — ఆ పక్షమునందు; అజస్య — ఆత్మనః = అజుఁడగు ఆత్మకు ఏమి గలదు ? యతః = దేని వలన; జనస్య = జనించుచుండు దేహమునకై ; తే వై = జన్మలగ్నాపేక్షచే; ద్వారశాష్టమాధి రాశుల యందు—ఆ గ్రహము సుఖదుఃఖ నిమిత్తమగును; గ్రహైః = అంతరిక్షమ దున్న గ్రహములచే; గ్రహస్య + ఏవ అందున్న గ్రహమునకు, పీడాం పాదార్ధాది దృష్టిచే పీడను. దైవజ్ఞులు; ఆ లగ్నము నందుత్పన్నమైన దేహము నందు ఆ దేహాభిమానము కలుగు చున్నది. అని వదంతి = చెప్పుచున్నారు. తతః అన్యః = ఆ దేహముకంటె నితరమైన; పురుషః = కర్త, కస్మై క్రుధ్యేత = ఎవనిపై కోపించును?

తా. సుఖదుఃఖాదులకు కారణము సూర్యాదిగ్రహణము లన్నచో ఆపక్షమునందు అజుడగు ఆత్మకు దుఃఖమలేదు. ఏగారణముచే జనించుచున్నదో ఆదేహమునకే జన్మలగ్నమును బట్టి ద్వాదశరాశులయందుండు అగ్రహములు సుఖదుఃఖకారణము లగుచున్నవి. మఱి అంతరిక్షమందున్న గ్రహమునకు పాదార్థదృష్ట్యాదిభేదములచే పీడగలుగునని దైవజ్ఞులు చెప్పుదురు. గ్రహ......లందుండి వానిదృష్టి కగోచరుఁడైన పురుషుఁని గ్రహగతిచే నగు పీడ ఆ లగ్నమునందున్న దేహమునందు ఆదేహాభిమానమున సుఖదుఃఖాదికము కలుగుచున్నది. అందువలన పురుషుఁడు ఆగ్రహములకంటె నితరుఁడుగనుండు వాఁడెవనిపై కోపించును?

అవ. కర్మ సుఖదుఃఖములకు హేతు వగుచో కానిమ్మని అసూయతో చెప్పినమాట. కర్మయే లేనపు డది హేతువగుటెట్లు? అందులకు చెప్పుచున్నారు—

శ్లో. కర్మాస్తు హేతు స్సుఖదుఃఖయో శ్చేత్
కిమాత్మన స్తద్ధి జడాజడత్వే.
దేహ స్త్వచిత్పురుషోఽయం సుపర్ణః
క్రుధ్యేత కస్మై న హి కర్మమూలమ్. 55

అ. కర్మ=కర్మ; సుఖదుఃఖయోః=సుఖదుఃఖములకు; హేతుః చేత్=కారణము అయినచో; అస్తు=కానిమ్ము; ఆత్మనః=ఆత్మకు; కిం=ఏమి? (సుఖదుఃఖ కర్మత్వము గాని, తత్కర్తృత్వము గాని లేదనుట); హి=ఎందువల్లనైతే; తత్=ఆ కర్మ: జడాజడత్వే=దేనికైనను జడాజడత్వము లున్ననే ఏర్పడును. జడ మగుటచే వికారిత్వము, అజడ మగుటచే హితముగోరి ప్రవర్తించుట యుండును గనుక. దేహస్తు=దేహమో; అచిత్=జడము కావున దానికి ప్రవృత్తిలేదు; అయం=ఈ; పురుషః=పురుషుడు (ఆత్మ); సుపర్ణః=శుద్ధజ్ఞాన స్వరూపుడు (కనుక ఆయనకు వికారిత్వము లేదు) కావున, కస్మై క్రుధ్యేత=ఎవ్వనిపై కోపించును?; యతః=ఎందువల్లనైతే; కర్మమూలం న హి=సుఖదుఃఖములకు మూలమగు కర్మయే లేదు కదా.

అవ. సుఖదుఃఖములకు కర్మయే మూల మన్నచో, ఆత్మ కేమియు క్షతిలేదు. ఏదైనను జడము అజడము కూడ అయిననే ఆకర్మ ఏర్పడును దేహమచిత్తు అనగా జడము, వికారస్వభావము కలది. దీనికి ప్రవృత్తిలేదు. ఇక ఆత్మ శుద్ధజ్ఞానస్వరూపము. అవికారి. కావున ఎవనిపై కోపించును? సుఖదుఃఖములకు మూలమగు కర్మయే లేదు.

శ్లో. కాలస్తు హేతు సుఖదుఃఖయో శ్చేత్
కిమాత్మన స్తత్ర తదాత్మకోఽసౌ.
నాగ్నే ర్హి తాపో న హిమస్య తత్ స్యాత్
క్రుధ్యేత కస్మై న్న పరస్య ద్వంద్వమ్. 56

అ. సుఖదుఃఖయోః కాలః హేతుః చేత్=సుఖదుఃఖములకు కాలము హేతువగుచో; ఆత్మనః కిం=ఆత్మ కేమి; తత్ర=ఆ కాలపక్షమునను; అసౌ=ఈ ఆత్మ; తదాత్మకః=కాలస్వరూపమే. బ్రహ్మాంశ మగుటచే, తన యంశకు తన వలననే పీడ కలుగదు. ఇందులకు దృష్టాంతము— అగ్నేః=అగ్ని కారణముగా; తాపః న=తదంశమగు జ్వాలాదులకు తాపము, దాహముచే నశింపదు. దాని కుపాధియగు కాష్ఠాంశమును కాల్చుటచే నాశము కలుగును. అట్లే మరియొక దృష్టాంతము చెప్పు

చున్నారు— హిమస్య=మంచునకు గల; తత్=ఆ చల్లదనము, దాని యంశమగు తుషారకణము నకు నాశకము కాదని యర్థము. మఱియు, అంశత్వ మటు లుంచుదము. వస్తుతః, పరస్య=పర బ్రహ్మకు; ద్వంద్వం=సుఖదుఃఖాదికము; న=లేదు,

తా. సుఖదుఃఖములకు కాలము హేతువగుచో, అపక్షమునను ఆత్మకు దానితోనేమి ? ఎలనన కాలము పరమాత్మాంశమే యగుచున్నది. కనుక తనయంశకు తనవలననే పీడ కలు గదు. అగ్ని, తనయంశమగు జ్వాలాదులు నశించుటకు హేతువుకాదు. ఆ అగ్నికి ఉపాధియగు కట్టెముక్కను కాల్చివేయుటచే దానికి నాశము కలుగును. అట్లే మంచునకు గల చల్లదనము ఆమంచుయొక్క యంశమగు తుషార కణమునకు నాశకము కాదు. ఆ యంశత్వము మాట యటు లుంచుదము. వాస్తవమున పరబ్రహ్మకు సుఖదుఃఖాదులు లేవు.

అవ. అని యిట్లు ప్రసిద్ధములగు హేతువు లాఱును త్రోసిపుచ్చబడినవి. ఇంకను ఎవ్వ రైన వేఱొక హేతువు నూహించినను, అది వస్తుమహిమనుబట్టి సంభవము కానేరదు, అను చున్నారు—

శ్లో. న కేనచిత్ క్వాపి కథంచ నాస్య
ద్వంద్వోపరాగః పరతః పరస్య,
యథాఽహమ స్సంసృతిరూపిణః స్యా
దేవం ప్రబుద్ధో న బిభేతి భూతైః. **57**

అ. సంసృతిరూపిణః=అవిద్యమానమగు సంసారమును ప్రకాశింపజేయునట్టి; అహమః= అహంకారమునకు; యథా=ఎట్లు; స్యాత్=ద్వంద్వ సంబంధముండునో; అట్లు, పరతః=ప్రకృతి కంటే; పరస్య అన్య=పరుడగు ఈ ఆత్మకు; కేనచిత్=ఎవ్వని చేతను; క్వాపి=ఎందును; కథం— చన=ఎట్లును ద్వంద్వోపరాగః= ద్వంద్వ సంబంధము; న=కలుగదు; ఏవం=ఈ విధముగా ప్రబుద్ధః=తెలిసినవాడు; భూతైః=భూతములచే; న బిభేతి=భయము నొందడు,

తా. పరమగు ప్రకృతికంటె పరుడైన ఆత్మకు వేఱెవ్వనిచేతను, ఎచ్చటను, ఎట్లును, ద్వంద్వసంబంధము కలుగదు. ఆ ద్వంద్వసంబంధము అహంకారమువల్ల కలిగినదే గాని వాస్తవము కాదు. అని యెవ్వడెఱుంగునో అతడు భూతములవలని భయము నొందడు.

అవ. కావున నేనును ఆట్లే పరమాత్మనిష్ఠతో తరింతు ననుచున్నాడు—

శ్లో. ఏతాం స ఆస్థాయ పరాత్మనిష్ఠా
మధ్యాసితాం పూర్వతమైర్మహర్షిభిః.
అహం తరిష్యామి దురంతపారం
తమో ముకుందాంఘ్రి నిషేవయైవ. **58**

అ. సః అహం=అట్టి నేను; పూర్వతమైః=మిక్కిలి పూర్వులగు; మహర్షిభిః=మహర్షులచే అధ్యాసితాం=అధిష్ఠితమగు, పరాత్మనిష్ఠాం=పరమాత్మ నిష్ఠను; ఆస్థాయ=పొంది; ముకుందాంఘ్రి నిషేవయా ఏవ=ముకుందుని పాదములను సేవించుట చేతనే; దురంతపారం=అంతులేని పారము గల; తమః=తమస్సును; తరిష్యామి=దాటెదను,

తా. కావున, నేను, ప్రాచీనులగు మహర్షుల సాధనపథమును పొంది, పరమాత్మనిష్ఠుడనై. అపారమగు తమస్సును తరించెదను.

శ్రీ భగవా నువాచ—భగవంతుడు నచించెను.

అవ. ప్రస్తావసహితముగా గాథార్థమును సంక్షేపముగ చెప్పుచున్నారు—

శ్లో. నిర్విద్య నష్టద్రవిణో గతక్లమః
ప్రవ్రజ్య గాం పర్యటమాన ఇత్థమ్,
నిరాకృతో ఽసద్భిరపి స్వధర్మా
దకంపితో ఽమూం మునిరాహ గాథామ్. 59

అ. ఇత్థం=ఈ ప్రకారముగ; నష్టద్రవిణః=ధనము నశించినవా డగుటచే; నిర్విద్య=నిర్వేదము నొంది; ప్రవ్రజ్య=సన్న్యసించి గాం=భూమిని; పర్యటమానః=తిరుగుచు; గతక్లమః=శ్రమ తొలగినవాడై, పరమాత్మ నిష్ఠ నొందినవాడై; అసద్భిః=దుష్టులచే; నిరాకృతః అపి=నిరాకరింప బడియు; స్వధర్మాత్=తన ధర్మము నుండి; అకంపితః=చలింపక; మునిః=ముని; అమూం గాథాం=ఈ గాథను; ఆహ=పలికెను.

తా. ఆముని ధనము నశింపగా, నిర్వేదము నొంది, సన్న్యసించి, భూమియం దెల్లడల పర్యటించుచు, దుష్టులచే నిరాకరింపబడినవాడయ్యును, తన ధర్మమునుండి చలింపక యీ గాధను పలికెను.

శ్లో. సుఖదుఃఖప్రదో నాన్యః పురుష స్యాత్మవిభ్రమః,
మిత్రోదాసీనరిపవః సంసార స్తమసః కృతః. 60

అ సంసారః=మిత్రులు, ఉదాసీనులు, శత్రువులు అను నీ త్రివిధరూపమగు సంసారము అంతయు; తమసః కృతః=అజ్ఞానకృతమైనది సుఖదుఃఖప్రదః=సుఖదుఃఖములను కలిగించునది; పురుషస్య=మనుజునకు; ఆత్మవిభ్రమః = మనస్సును భ్రమింపజేయునది కంటె; అన్యః=వేఱొకటి; న=కాదు.

తా. మిత్ర, ఉదాసీన, శత్రురూపమగు నీ సంసార మజ్ఞానకృతమైనది. సుఖదుఃఖముల నిచ్చునది. పురుషుని మనస్సును భ్రమింపజేయునది ఇంతకంటె వేఱొక్కటి లేదు.

శ్లో. తస్మా త్సర్వాత్మనా తాత నిగృహాణ మనో ధియా,
మయ్యావేశితయా యుక్త ఏతావాన్ యోగసంగ్రహః, 61

అ. తాత!=తండ్రీ!; తస్మాత్=అందువలన; సర్వాత్మనా=సర్వ విధములుగా; మయి=నా యందు; ఆవేశితయా=ప్రవేశపెట్టబడిన; ధియా=మనస్సుచే; యుక్తః=కూడినవాడవై; మనః=నీ మనస్సును; నిగృహాణ=నిగ్రహింపుము; యోగసంగ్రహః=యోగము యొక్క సంక్షేపము; ఏతావాన్=ఇంతమాత్రము.

తా. నాయనా! కావున నీ వన్నివిధములుగా నీ మనస్సును నాయందే నిలిపి, యన్య మార్గములు పట్టకుండ నిగ్రహింపుము. ఇదియే సంగ్రహముగ నీకు తెలుపు యోగము.

శ్లో. య ఏతాం భిక్షుణా గీతాం బ్రహ్మనిష్ఠాం సమాహితః,
ధారయన్ శ్రావయన్ శృణ్వన్ ద్వంద్వైర్నైవాభిభూయతే. 62

అ. యః = ఎవ్వడు; భిక్షుణా = మునిచే; గీతాం = గానము చేయబడిన; ఏతాం = ఈ బ్రహ్మనిష్ఠాం = బ్రహ్మనిష్ఠను; ధారయన్ = నిలుపుకొనునో; సమాహితః = అవహితుడై; శ్రావయన్ = వినిపించునో; శృణ్వన్ = వినునో; సః = అతడు; ద్వంద్వైః = సుఖదుఃఖాదులచే న అభిభూయతే = తిరస్కరింపబడడు.

తా. భిక్షుగీతమగు నీ బ్రహ్మనిష్ఠనెవడు సావధానముగ నాలకించునో, ధరించుచు పరులకు వినిపించునో అతడు సుఖదుఃఖాది ద్వంద్వములచే కలత నొందడు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశ స్కంధే త్రయోవింశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధమున నిరువదిమూడవ అధ్యాయము.

# చతుర్వింశోఽధ్యాయము

## సంగ్రహశ్లోకము

శ్లో. **చతుర్వింశే తు సాంఖ్యేన మనోమోహో నివార్యతే,**
**ఆత్మన స్సర్వభావానా మాగమాపాయ చింతయా.**

**స్వపదద్వంద్వ భక్తానా మద్వంద్వత్వాయ సంయమమ్,**
**చిత్తస్యోక్త్వా పునః కృష్ణ స్సాంఖ్య మత్రాహ తత్కృతే.**

ఈ ఇరువదినాల్గవ అధ్యాయమున సాంఖ్యము వివరింపబడుచున్నది. దీనిచే సకల వస్తుజాతము పరమాత్మనుండియే యుద్భవించి, యతనియందే లయమునందునని తలంచుట ద్వారా మనస్సుయొక్క అజ్ఞానము నివారింపబడుచున్నది. శ్రీకృష్ణపరమాత్మ తన పాదముల జంటపై భక్తిని నిలిపినవారికి ద్వంద్వభ్రమ కలుగకుండుటకు మనోనియమము నుపదేశించి, మఱల వారికై ఈ యధ్యాయమున సాంఖ్యశాస్త్రము నెఱింగించుచున్నారు.

అవ. "అద్వితీయుడగు పరమాత్ముని మాయచే ప్రకృతి పురుషులద్వారా ద్వైతమంతయు జనించును. అది మఱల నా పరమాత్మలోనే లయించును." అని మననము చేయువానికి ద్వంద్వభ్రమ తొలగునని తెలుపుటకు సాంఖ్యమునుగూర్చి ఇట్లు ప్రస్తావించుచున్నారు—

శ్రీభగవా నువాచ = శ్రీభగవంతుడు వచించెను —

శ్లో. **అథ తే సంప్రవక్ష్యామి సాంఖ్యపూర్వం వినిశ్చితమ్,**
**యద్విజ్ఞాయ పుమాన్ సద్యో జహ్యా ద్వైకల్పికం భ్రమమ్** **1**

అ. అథ = ఇటుపైన; తే = నీకు; పూర్వ వినిశ్చితం = పూర్వులగు కపిలాదులచే నిశ్చయింపబడిన; సాంఖ్యం = సాంఖ్యమును; సంప్రవక్ష్యామి = తెలిపెదను; యత్ = ఏ సాంఖ్యమును; విజ్ఞాయ = తెలిసికొని; పుమాన్ = నరుడు; సద్యః = శీఘ్రమే; వైకల్పికం = భేదనిమిత్తకమగు, భ్రమం = భ్రమమును; జహ్యాత్ = విడచిపెట్టునో.

తా. నేనిటుపై కపిలాది పూర్వాచార్యులు నిశ్చయించి ప్రవర్తింపజేసిన సాంఖ్యశాస్త్రము నీకు చెప్పెదను. దీని నెఱిగిన నరుడు శీఘ్రమే వివిధ ప్రకారమగు భేదభ్రమమును వీడగలడు.

శ్లో. **ఆసీ జ్జ్ఞాన మథో అర్థ ఏకమే వావికల్పితమ్,**
**యదా వివేకనిపుణా ఆదౌ కృతయుగేఽయుగే.** **2**

అ. జ్ఞానం = ద్రష్టయు, ఆ ద్రష్టకు దృశ్యమగు; అథో = సమస్తమైన; అర్థః = పదార్థమును; అవికల్పితం = వికల్పము లేని; ఏకం ఏవ = బ్రహ్మయందే లీనమై ఏకమై యుండెను. ఎప్పుడటులుండె

నసగా చెప్పుచున్నారు— అయుగే = యుగములకు పూర్వము ప్రళయకాలమున అని యర్థము. అగ్రే-ఆదౌ = మొదటి; కృతయుగే = కృతయుగము నందును; అగ్రే, యదా = ఏ కాలమున; వివేక నిపుణాః = జ్ఞాను లుండురో, అప్పుడును, జ్ఞానులకు భేదము స్ఫురించదు కావున.

తా. ప్రళయమందును, మొదటి కృతయుగమందును, జ్ఞానులగువా రేయే కాలములం దుండిరో ఆయా కాలములందును ద్రష్టయగు జీవుడు, దృశ్యమగు నీ సకల ప్రపంచము భేదములేకయే బ్రహ్మయందు లీనమైయుండెను.

శ్లో॥ తన్మాయాఫలరూపేణ కేవలం నిర్వికల్పితమ్,
వాఙ్మనోఽగోచరం సత్యం ద్విధా సమభవ ద్బృహత్. 3

అ. కేవలం = ఒక్కటియే యైనను; తత్ బృహద్బ్రహ్మ = ఆ బృహద్బ్రహ్మము; మాయా ఫల రూపేణ, మాయా = దృశ్యమను ప్రపంచము; ఫల = బ్రహ్మ యొక్క ప్రకాశము అను; రూపేణ = రూపముతో; ద్విధా సమభవత్ = రెండుగా నయ్యెను నిర్వికల్పితం = బ్రహ్మకంటె భిన్నము కానివి (రెండును తద్రూపమే కనుక); వాఙ్మనోఽగోచరం = మాటలకు; మనస్సునకు అందనిది మాయ అవ్యక్త స్వరూపము గనుకను, జీవు డతి సూక్ష్ముడు కనుకను; సత్యం = సత్యమును (రెండును నిత్యములే కనుక).

తా. కేవలము, నిత్యమగు ఆ బృహద్బ్రహ్మమే మాటలకు, మనస్సునకు అంతుబట్టని విధముగా దృశ్యమగు మాయగా, బ్రహ్మప్రకాశమగు ఫలముగా నిట్లు రెండు విధములుగా నయ్యెను.

శ్లో. తయో రేకతరో హ్యర్థః ప్రకృతిః సోభయాత్మికా.
జ్ఞానం త్వన్యతమో భావః పురుషః సోఽభిధీయతే. 4

అ. తయోః = ఆ రెంటిలో; ఏకతరః అర్థః = నొక్క వస్తువు, ప్రకృతిః = ప్రకృతి యన బడును. సా = ఆ ప్రకృతి; ఉభయాత్మికా = కార్యకారణ స్వరూపము; అన్యతమః భావః = వేఱొక్కటి, జ్ఞానం = జ్ఞానము; సః పురుషః అభిధీయతే = అదే పురుష డని చెప్పబడును;

తా. బ్రహ్మయొక్క రెండు రూపములలో నొక్కటి కార్యకారణరూపమగు ప్రకృతి వేఱొకటి పురుష డనఁ బరగునట్టి జ్ఞానము.

శ్లో. తమో రజః సత్త్వమితి ప్రకృతే రభవన్ గుణాః,
మయా ప్రక్షోభ్యమాణాయాః పురుషానుమతేన చ. 5

అ పురుషానుమతేన = సృష్టి జీవుని అదృష్టముచే ప్రయుక్తమైనది కనుక అట్టి జీవుని కంగీ కార్యమగు, లేదా తనదే యగు ప్రకృతిని చూచుటయను ఏ పురుషావస్థ కలదో దానిద్వారా, మయా = పరమేశ్వరుడనగు నాచే; ప్రక్షోభ్యమాణాయాః = కలచబడుచున్న; ప్రకృతేః = ప్రకృతి వలన; తమః రజః సత్త్వమితి = తమస్సు రజస్సు, సత్త్వ మనెడి; గుణాః = గుణములు; అభవన్ = అభివ్యక్తము లైనవి.

తా. పరమేశ్వరుడనగు నేను ప్రకృతిని ఈక్షించుట యను పురుషావస్థ ద్వారా ఈప్రకృతిని క్షోభిల్లజేయుటచే, దానినుండి తమస్సు, రజస్సు, సత్త్వమను మూడు గుణము లభివ్యక్తములైనవి.

శ్లో. తేభ్యః సమభవత్ సూత్రం మహాన్ సూత్రేణ సంయుతః.
తతో వికుర్వతో జాతో యోఽహఙ్కారో విమోహనః 6

అ. తేభ్యః=ఆ గుణముల వలన; సూత్రం=క్రియాశక్తిగల ప్రథమ వికారము; సమభవత్=ఏర్పడెను, (తతః=దానినుండి): మహాన్=జ్ఞానశక్తి పుట్టెను. ఓయీ! మహాతత్త్వము లేక జ్ఞానశక్తియే ప్రథమ వికారమని గదా ప్రసిద్ధము? అట్లగా నిట్లు చెప్పుచున్నారు, అ జ్ఞానశక్తి, జ్ఞానక్రియలు రెండును కలది యగుటచే, సూత్రేణ=సూత్రముచే; సంయుతః=వేత్వేరుగా కాక కలసియున్నది ఒకే తత్త్వము క్రియాజ్ఞానశక్తులచే రెండుగా చెప్పబడుచున్నదని యర్థము. వికుర్వతః=వికారము నొందిన; తతః=ఆ మహత్తత్త్వము నుండి; అహఙ్కారః=అహంకారమొ; జాతః=పుట్టెను; యః=ఎది; విమోహనః=జీవుని భ్రమకు కారణమో.

తా. త్రిగుణముల వలన క్రియాశక్తిగల సూత్రము, దానినుండి జ్ఞానశక్తియగుమహత్తు ఏర్పడెను. ఆ మహత్తత్త్వము సూత్రముతో సంబద్ధమైయుండెనే గాని వేఱుగ లేకుండెను. ఆ మహత్తత్త్వము వికారమునొంది అహంకారము పుట్టెను. అదియే జీవులకు మోహహేతువు.

శ్లో. వైకారిక స్తైజసశ్చ తామస శ్చేత్యహం త్రివృత్,
తన్మాత్రేంద్రియమనసాం కారణం చిదచిన్మయః. 7

అ. అహం=అహంకారము వైకారికః, తైజసః, తామసః చేతి=వైకారికము, తైజసము, తామసము అని; త్రివృత్=మూడు విధములుగా. తన్మాత్ర-ఇంద్రియ-మనసాం=పంచతన్మాత్రలు - ఇంద్రియములు-మనస్సు- (మనశ్శబ్దము దేవతలకును ఉపలక్షణ మగుటచే) దేవతలకును కారణము, చిదచిన్మయః=చిదాభాసవ్యాప్య నగుటచే ఉభయగ్రంధిరూపము.

తా. ఆ అహంకారము వైకారికము, తైజసము, తామసమని త్రివిధము. ఇది పంచతన్మాత్రలకు, ఇంద్రియములకు, మనస్సునకు (దేవతలకును) కారణము. చిదచిద్రూపము.

వి. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" అను శ్రుతి వలసను, ''అన్నమయం హి సౌమ్య మనః'' ఇత్యాదిశ్రుతివల్లను తొలుత భూతసృష్టి పంచధా విభక్తములు కాని భూతముల వలన ప్రాణాదిక్రమము ననుసరించి సమష్ట్యాత్మికమగు లింగశరీరము, పిమ్మట పంచీకృతములైన ఆ భూతములవలన బ్రహ్మాండము దానియందు విరాట్టు, తదంతర్యామి లీలాస్వరూపుడు, క్షీరాబ్ధిశయనుడగు శ్రీమన్నారాయణుడు' విరాట్టగు ఆయన నాభిపద్మమున భోగమూర్తియగు చతురాననుడు (బ్రహ్మ), ఆయనవలన అవసరమునుబట్టి తక్కిన జీవుల యుత్పత్తియు అది ప్రక్రియ అయ్యెను, చిత్తాభివ్యక్తి పూర్వమగు అహంకారము దానివలన భూతేంద్రియాది వ్యవహారము అని ఇట్లు మహదాదిక్రమముననుసరించి సృష్టి చెప్పబడుచున్నది.

అవ. ఆ త్రివిధాహంకారమునుండి త్రివిధమగు ప్రపంచపు టుత్పత్తిని ప్రదర్శించుచున్నారు—

శ్లో. అర్థ స్తన్మాత్రతో జజ్ఞే తమసా దింద్రియాణి చ,
తైజసా ద్దేవతా ఆస న్నేకాదశ చ వైకృతాత్. 8

అ. తన్మాత్రతః=శబ్దాధి తన్మాతలకు కారణమైన; తామసాత్=తామసాహంకారము ద్వారా భూతము లావరించు స్వభావము కలవగుటచే, అర్థః=మహాభూతములు; జజ్ఞే=జనించెను, తైమిర

రాజ సాహంకారముద్వారా, ఇంద్రియాణి=జ్ఞానేంద్రియ కార్మేంద్రియములు పదియు, జన్మించెను. అని ప్రవర్తించు స్వభావము కలవి కనుక, వైకృతాత్ = సాత్త్వికాహంకారము వలన, దేవతాః= దిక్కులు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీదేవతలు, అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మిత్రుడు, చంద్రుడు, అను పదునొకండును, చకారముచే మనస్సును జన్మించినవి ప్రకాశించుట వీని స్వభావము.

తా. శబ్దాది తన్మాత్రలకు కారణాలైన తామసాహంకారమునుండి మహాభూతములు, రాజసాహంకారమువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, సాత్త్వికాహంకారమువలన పదునొక్క దేవతలు, మనస్సు అను నీ పండ్రెండు జన్మించెను.

శ్లో. మాయా సంచోదితా భావాః సర్వే సంహత్య కారిణః,
అండ ముత్పాదయామాసు ర్మమాయతన ముత్తమమ్ 9

అ. సర్వే= సమస్తమైన, భావాః = మహదాదులు= మయా=నాచే, సంచోదితాః=ప్రేరిత ములై, సంహత్య= కలిసి, కారిణః = కార్యోత్పాదన సమర్థములై, మమ= వైరాజాంతర్యామియగు నాకు, ఉత్తమం= శ్రేష్ఠమగు, ఆయతనం= స్థానమను, అండం= బ్రహ్మాండము, ఉత్పాదయామసుః =సృజించినవి

తా. మహదాది భావములన్నియు నాప్రేరణ నొంది, కలిసి కట్టుగ కార్యోత్పాదన సమర్థములై, వైరాజాంతర్యామియగు నాకు బ్రహ్మాండమమును శ్రేష్ఠస్థానమును సృజించినవి.

శ్లో. తస్మి న్నహం సమభవ మండే సలిలసంస్థితౌ,
మమ నాభ్యా మభూత్ పద్మం విశ్వాఖ్యం తత్ర చాత్మభూః 10

అ. సలిలసంస్థితౌ= జలంమదున్న, తస్మిన్ అండే= ఆ అండమందు, అహం= నేను, సమభవమ్= శ్రీమన్నారాయణరూపుడైన లీలావిగ్రహముతో నుంటిని మమ= నాయొక్కనాభ్యాం= నాభియందు, విశ్వాఖ్యం= విశ్వమను పేరుగల లోకకారణభూతమగు, పద్మం అభూత్= పద్మ మావిర్భవించెను= తత్ర చ= ఆ పద్మమందు, ఆత్మభూః= చతురాననరూప భోగవిగ్రహముతో ఆ వైరాజుడే ఆవిర్భవించెను.

తా. జలమందున్న ఆయండమందు నేను శ్రీమన్నారాయణరూపుడనై లీలావిగ్రహము దాల్చి యుంటిని. నా నాభియందు విశ్వమను లోకకారణభూతమగు పద్మ మావిర్భవించెను. ఆ పద్మమందు చతుర్ముఖరూపమగు భోగవిగ్రహముతో వైరాజుడే ఆవిర్భవించెను.

శ్లో. సోఽసృజ త్తపసా యుక్తో రజసా మదనుగ్రహాత్,
లోకాన్ సపాలాన్ విశ్వాత్మా భూర్భువం స్వరితి త్రిధా. 11

అ. సః= ఆ చతుర్ముఖుడు, రజసా యుక్తః= రజోగుణ సంయుతుడై, మదనుగ్రహాత్= నాయనుగ్రహముచే, తపసా= తపముచే, సపాలాన్= లోకపాలురతో కూడిన, లోకాన్= లోకములను, భూః= అతలాది సహితమగు భూలోకము, భువః= అంతరిక్షలోకము, స్వః= స్వర్గలోకము (ఇది మహర్లోకాదులకును ఉపలక్షణము) అని, త్రిధా=మూడు విధములుగా, అసృజత్=సృష్టించెను.

తా. విశ్వాత్ముడగు ఆ చతుర్ముఖుడు రజోగుణసమేతుడై నా యనుగ్రహమువలన తపోనిష్ఠుడై భూర్భువస్సువ ర్లోకములను, తక్కిన మహదాది లోకములను, లోకపాలురను సృజించెను.

అవ. లోకసృష్టికి ప్రయోజనమును చెప్పుచున్నారు—

శ్లో దేవానా మోక ఆసీత్ స్వర్భూతానాం చ భువః పదమ్,
మర్త్యాదీనాం చ భూర్లోకః సిద్ధానాం త్రితయాత్ పరమ్. 12

అ. స్వర్ = స్వర్గము = దేవానాం = దేవతలకు = ఓకః ఆసీత్ = నివాసమయ్యెను. భువః = భువర్లోకము, భూతానాం = భూతములకు. పదం = స్థానమయ్యెను భూఃలోకః = భూలోకము, మర్త్యాదీనం = మనుజులు మున్నగువారికి, పదం = నివాసము అయ్యెను. త్రితియాత్ పరం = ఈ మూడు లోకములకంటు పరమను మహర్లోకము మున్నగునది, సిద్ధానాం = సిద్ధులయొక్క నివసమయ్యెను.

తా. అందు స్వర్గము దేవతలకు, భువర్లోకము భూతములకు, భూలోకము మనుజాదులకు, ముల్లోకములకంటె పైనున్నదగు మహదాదిలోకము సిద్ధులకును నివాసమయ్యెను.

శ్లో. అధోఽసురాణాం నాగానాం భూమేరోకోఽ సృజ త్ప్రభుః,
త్రిలోక్యాం గతయః సర్వాః కర్మణాం త్రిగుణాత్మనామ్. 13

అ. ప్రభుః = ప్రభువగు ఆచతుర్ముఖుడు, భూమేః అధః = భూలోకమునకు క్రిందుగా, అసురాణాం = అసురులయొక్కయు, నాగానాం = ఉరగులయొక్కయు; ఓకః = నివాసమును, అసృజత్ = సృష్టించెను. త్రిలోక్యాం = పాతాళాది సహితమైన భూర్భువస్సు వర్లోకములందు, కర్మణాం = గార్హస్థ్యధర్మములయొక్క, గతయః = ఫలాత్మకములను స్థానములు భోగాదితారతమ్యముచే కలుగును.

తా. చతుర్ముఖుడు భూలోకమునకు క్రింద అసురుల నివాసమును, ఉరగుల నివాసమును సృజించెను. పాతాళాదిసహితమైన త్రిలోకములందు గార్హాస్థ్యధర్మములయొక్క ఫలాత్మక స్థానములు భోగాదితారతమ్యముచే నేర్పడును. అంద ష్టాంగయోగము యొక్కయు, తపముయొక్కయు, సన్న్యాసము యొక్కయు, స్థానములు నిర్మలములు.

శ్లో యోగస్య తపసశ్చైవ న్యాసస్య గతయోఽ మలాః,
మహర్జన స్తపః సత్యం భక్తియోగస్య మద్గతిః 14

అ యోగస్య = అష్టాంగముయొక్కయు; తపసః చైవ = తపస్సుయొక్కయు; న్యాసస్య = సన్న్యాసముయొక్కయు అమలాః = నిర్మలములగు; గతయః = స్థానములు; మహః = మహర్లోకము; జనః – జనలోకము; తపః = తపోలోకము; సత్యం = సత్యలోకమును అగుచున్నవి భక్తియోగస్య = భక్తియోగమునకు. మద్గతిః = వైకుంఠము చేరుటయే లక్ష్యము.

తా. అష్టాంగయోగము, తపము. సన్న్యాసములచే మహర్లోక, జనలోక, తపోలోక సత్యలోకములు పొందబడుచున్నవి భక్తియోగము గలవాడు వైకుంఠలోకమును చేరుచున్నాడు

అవ. అందు మద్గతి దక్క తక్కిన గతులు చంచలము లని వైరాగ్యము కొఱకై పేర్కొనుచున్నారు—

శ్లో. మయా కాలాత్మనా ధాత్రా కర్మయుక్త మిదం జగత్,
గుణప్రవాహ ఏతాస్మి న్నున్మజ్జతి నిమజ్జతి. 15

అ. కాలాత్మనా = కాలాత్మకుడను; ధాత్రా = పరమేశ్వరుడనగు; మయా = నాచే; కర్మయుక్తం = కర్మఫలముతో సంబంధింపజేయబడిన; ఇదం జగత్ = ఈ జగత్తు; ఏతస్మిత్ = ఈ; గుణప్రవాహే = సంసారము నందు ఉన్మజ్జతి = సత్యలోకము వఱకు నుత్తమగతులను పొందును మఱల; నిమజ్జతి = స్థావరముల వఱకు నిమ్నగతిని పొందును.

తా. కాలాత్మకుడనై, పరమేశ్వరుడనై, హేతుభూతుడనగు నాచే కర్మ ఫలముతో సంబంధింపజేయబడిన ఈ జగత్తు సంసారమున సత్యలోకమువఱకు గల ఉత్తమగతులను పొందును. మఱల స్థావరములవఱకు గల నిమ్న గతులను పొందును,

అవ. సృష్టి రూపణము అభిన్నాత్మజ్ఞానమే ప్రయోజనముగా కలదగుటచే దానిని ప్రతిపాదించుటకు కారణముచే కార్యవ్యాప్తిని చెప్పుచున్నారు—

శ్లో. అణు ర్బృహ త్కృశః స్థూలో యో యో భావః ప్రసిధ్యతి,
సర్వోఽ ప్యుభయ సంయుక్తః ప్రకృత్యా పురుషేణ వా. 16

అ. యః యః భావః = ఏ యే భావము; అణుః = అణువు; బృహత్ = మహత్తు; కృశః = కృశించినది; స్థూలః = లావైనది యని; ప్రసిధ్యతి = ప్రసిద్ధినందుచున్నదో; సర్వః అపి = ఆ యా భావమంతయు; ప్రకృత్యా = ప్రకృతిచే; వా = లేదా; పురుషేణ = పురుషునిచే; ఉభయ సంయుక్తః = ఈ రెంటిచేతనే వ్యాప్తమైనది.

తా. ఏయే భావము అణువనియు, బృహత్తు అనియు, కృశమనియు, స్థూలమనియు, ప్రసిద్ధినొందుచున్నదో అట్టి భావమంతయు, ప్రకృతి పురుషుడు అను నీ యుభయము చేతనే వ్యాప్తమైయున్నది.

అవ. ఇపుడు కార్యము కారణరూపమగుటను చూపుచున్నారు—

శ్లో. యస్తు యస్యాది రంతశ్చ స వై మధ్యం చ తస్య సన్,
వికారో వ్యవహారార్థో యథా తైజస పార్థివాః 17

అ. యః + తు = ఎవరైతే; యస్య = ఏ కార్యమునకు: ఆదిః = కారణమును; అంతః = లయస్థానమును అగుచున్నాడో; తస్య = దానికి: మధ్యం = మధ్యావస్థయు; సః ఏవ; = అతడే ఇది మృత్సువర్ణాదులలో చూడబడినది; సన్ = అవ్యభిచారియగుటచే అతడే కాని వేఱొండు కాదు. అట్లగుచో మిథ్యాభూతమగు కార్యసృష్టియేల అనగా చెప్పుచున్నారు; వికారః = కార్యరూపమగు వికారము; వ్యవహరించుటకొఱకు; యథా = ఎట్లో అట్లు తైజసపార్థివాః = తైజసములగు; కటకకుండలాదులును పార్థివములగు ఘటశరావాదులును.

తా. కార్యమున కెవ్వ డాదియు, అంతము నైయున్నాడో ఆతడే దానికి మధ్యమును అగుచున్నాడు. మధ్యమందు వికారము లేర్పడుచున్నవో అవి అన్నియు వ్యవహారము కొఱకే, కంకణములు కుండలములు మున్నగు సువర్ణ నిర్మిత తైజసపదార్థములు, కుండలు, మూకుళ్లు మున్నగు మట్టితో చేయబడిన పార్థివ పదార్థములవలె.

అవ. అట్లగుచో మహదాదులును ఆద్యంతరూపకములే కనుక అవియును సత్యములే కావలెననగా చెప్పుచున్నారు—

శ్లో. యదుపాదాయ పూర్వస్తు భావో వికురుతేఽ పరమ్,
ఆది రంతో యదా యస్య తత్సత్య మభిధీయతే. **18**

అ. యత్ = ఏ రూపమును; ఉపాదాయ=ఉపాదాన కారణముగా స్వీకరించి; పూర్వః తు భావః = పూర్వకారణమగు మహదాది, భావము; అపరం = అహంకారాదికమగు భావమును; వికురుతే=సృజించుచున్నదో; ఎట్లు పిండము మృత్తును తీసికొని, తానే నిమి త్తమై ఘటమును సృజించు చున్నదో అట్లు; అట్లగుచో "మృ త్తికేత్యేవ సత్యకు" ఇత్యాది శ్రుతి ఎట్లు పొసగుననగా చెప్పుచున్నారు యత్=యేది; యదా=ఎపిడు; యస్య=దేనికి; ఆదిః అంతశ్చ వివక్ష్యతే=ఆదియు అంతముగను వివక్షితమగుచున్నదో; తదా=అపుడు; తత్ = అది; సత్యం = సత్యమని; అభిధీయతే=పేర్కొనబడు చున్నది. పరమ కారణమైనదే సత్యమని శ్రుతి-వివక్షచేసినది కనుక.

తా. ఏరూపమును చేకొని పూర్వకారణమగు మహదాది అపరమగు అహంకారాది భావ మును సృజించుచున్నదో, ఎట్లు పిండము మట్టిని గ్రహించి స్వయముగా నిమిత్తమై ఘటమును సృజించునో, అది సత్యము. ఏది యెపుడు దేనికి ఆదియు అంతము అగునో అది సత్యమని చెప్పబడుచున్నది,

అవ. ఓయీ ! అట్లయ్యును, ప్రకృతి పురుష కాలములు కార్యములు కావు కనుక భిన్నము లగుటచే అద్వితీయత యెట్లనగా చెప్పుచున్నారు—

శ్లో. ప్రకృతి ర్హ్యస్యోపాదాన మధారః పురుషః పరః,
సతోఽ భివ్యంజకః కాలో బ్రహ్మ తత్త్రితయం త్వహమ్ **19**

అ. అస్య సతః=ఈ సత్తుగు కార్యమునకు; ఉపాదానం ప్రకృతి.=ఉపాదానముగా ఏ ప్రకృతి ప్రసిద్ధమై కలదో; ఆధారః=ఆ ప్రకృతి కాధారముగా అధిష్ఠాతయగు పరః పురుషః=పరమపురుష డెవ్వడుకలడో; అభివ్యంజకః కాలః=గుణక్షోభముచే అభివ్యంజకమగు కాలమేది కలదో; తత్ త్రితయం=ఆ మూడును బ్రహ్మ అహమేవ=బ్రహ్మరూపుడనగు నేనే కాని వేఱుకాదు. ప్రకృతి శక్తి కనుక; పురుషకాలము లవస్థారూపములు కనుక.

తా. సత్తగు ఈకార్యమున కుపాదానమగు ప్రకృతి, ఆప్రకృతి కాధారము అధిష్ఠాత యగు పరమపురుషుడు, గుణక్షోభముచే అభివ్యంజికమగు కాలము ఈ మూడును, బ్రహ్మస్వ రూపుడునగు నేనే- ప్రకృతి శక్తియగుటచేతను, పురుషకాలము లవస్థారూపము లగుటచేతను ఇవి వేఱుకావు.

అవ. ఈ ప్రకారము త్రికాలములందును వ్యభిచరించని దగుటచే బ్రహ్మయే సత్యమని చెప్పుటకై, దానికి సృష్టికారణముగ మొదట సత్యమును పేర్కొని, నడుమగూడ దానికి సత్త్వమునే ఉపపాదించి, చివరకు అవధిగా సత్యత్వమును చూపబోవుచు సృష్టిప్రవాహ రూప మగు స్థితియొక్క అవధిని పేర్కొనుచున్నారు--

శ్లో. సర్గః ప్రవర్తతే తావత్ పౌర్వాపర్యేణ నిత్యశః,
మహాన్ గుణవిసర్గార్థః స్థిత్యంతో యావదీక్షణమ్. **20**

అ. మహాన్=గొప్పదియు; పౌర్వాపర్యేణ=పితృపుత్రాది రూపముగ; నిత్యశః=ఎడతెగక; సర్గః తావత్ ప్రవర్తతే = సృష్టి ప్రవర్తించును; అదిః గుణ విసర్గార్థః = గుణ దేహములయందు;

విసర్గార్థః = వివిధముగా సృజింపబడు జీవుని భోగమే ప్రయోజనము గాఁగలది స్థిత్యంతః = ప్రళయము వఱకు యావదీక్షణమ్ = భగవంతుని సంకల్పమున్నంత వఱకు ఉండును.

తా. విస్తృతమగు సృష్టి పితృపుత్రాదిరూపముగ నిత్యము ప్రవర్తించుచునే యుండును. అది దేహములందు వివిధములుగా సృజింపబడు జీవుని భోగమే ప్రయోజనముగా కలది. ప్రళయము వఱకు ఉండునది. ఆ స్థితియు భగవత్సంకల్ప మున్నంతదనుక యుండునది.

అవ. ప్రళయమును నిరూపించుచున్నారు—

**శ్లో. విరా ణ్మయాఽఽ సాద్యమానో లోక కల్ప వికల్పకః,**
**పంచత్వాయ విశేషాయ కల్పతే భువనైః సహ** 21

అ. విరాట్ = బ్రహ్మాండము; మయా = కాలాత్ముడగు నాచే; ఆసాధ్యమానః = వ్యాపించబడు చున్నదై; లోకకల్పవికల్పకః = లోకములకు ప్రతిదినము వివిధములు సృష్టిప్రళయములు కల్పించుచున్న దైనను; పంచత్వాయ విశేషాయ = పంచత్వ రూపమగు విశేషమునకై అనగా విభాగమునకై; కల్పతే = యోగ్యమగుచున్నది. ఈ బ్రహ్మాండము పంచభూతముల కైక్యరూపమగుటచే; ఆ పంచభూతముల పృథగ్భావముచే నశించుచున్నది.

తా. ఈ బ్రహ్మాండమున కాలాత్ముడనగు నేను వ్యాపించియున్నాను. ఇది సదా లోకములను సృష్టిప్రళయములను కల్పించుచునే యుండును. అట్లయ్యును ఇది పంచభూతముల సంఘాత రూపమగుటచే, ఆ పంచభూతము లెపుడు వేఱగునో అపుడిది నశించుచున్నది.

అవ. అందు "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో ఽన్నమ్, అన్నాత్పురుషః" ఇతి. వేదోక్తమగు సృష్టికి ప్రతిలోమముగ లయమును చెప్పుచున్నారు :—

**శ్లో. అన్నే ప్రలీయతే మర్త్య మన్నం ధానాసు లీయతే,**
**ధానా భూవకా ప్రలీయన్తే భూమి ర్గంధే ప్రలీయతే.** 22

అ. మర్త్యం = శరీరము; దేనిచే వృద్ధిపొందెనో ఆ; అన్నే = అన్నమందు; ప్రలీయతే = శతవర్ష అనావృష్టి యందు క్షీణింపగా; అచటనే లయించుచున్నదని భావము; అన్నం = అన్నము, ధానాసు లీయతే = బీజమాత్రావశిష్ట మగుచున్నదని; ధానాః = బీజములు; భూమౌ ప్రరేయన్తే = నాటబడియు మొలకెత్తవు; భూమిః = భూమి; ప్రళయకాలపు సూర్యునిచే శోషింపజేయబడినదై సంకర్షణుని ముఖాగ్నిచే తగులబడినదై; గంధే ప్రలీయతే = భూతసూక్ష్మరూపమగు గంధము మాత్రమే మిగిలిన దగుచున్నది.

తా. శరీరము తన వృద్ధికి కారణమగు అన్నమునందును, ఆ అన్నము బీజమందును, బీజములు మొలకెత్తక భూమియందును. భూమి సూర్యాగ్నిచే భస్మమై భూతసూక్ష్మమగు గంధమందును లయము నొందుచున్నది.

**శ్లో. అప్సు ప్రలీయతే గంధ ఆపశ్చ స్వగుణే రసే.**
**లీయతే జ్యోతిషి రసో జ్యోతీ రూపే ప్రలీయతే.** 23

అ గంధః = గంధము; నూరు సంవత్సరముల వానచే తడుపబడి; అప్సు ప్రలీయతే = జలమందు లీనమగుచున్నది; ఆపః చ = జలములును; జ్యోతిస్సుచే యింకించబడినవై; స్వగుణే = తమ

గుణమగు; రసే=రసమందు; ప్రలీయన్తే = లీనమగుచున్నవి (రసమాత్రావశిష్టములగుచున్నవి) అంతట రసః అపిః = రసమును; జ్యోతిషి=జ్యోతిస్సునందు; లీయతే=నశించుచున్నది. జ్యోతిః= తేజము, వాయువుచే తిరస్కరింపబడినదై; రూపే(ప్రతీయతే = రూపమాత్రావశిష్ట మగుచున్నది.

నూరు సంవత్సరముల వానచో కొట్టుకొనిపోయి గంధీము జలమందు లయించుచున్నది. ఆ జలమును తేజస్సుచే యింకించబడి రసమాత్రావశిష్ట మగుచున్నది. ఆ రసమును తేజము నందు లయించుచున్నది. తేజము తన గుణమగు రూపమాత్రావశిష్ట మగుచున్నది.

**శ్లో. రూపం వాయౌ స చ స్పర్శే లీయతే సోఽపి చాంబరే,**
**అంబరం శబ్దతన్మాత్ర ఇంద్రియాణి స్వయోనిషు. 24**

అ. రూపం=రూపము; వాయౌ=వాయువునందును; సః అపి=ఆవాయువును స్పర్శే=స్పర్శ యందును; సః అపి=ఆస్పర్శము అంబరే = ఆకాశమందును;అంబరం=ఆకాశము; శబ్దతన్మాత్రే= శబ్దతన్మాత్రయందును; ఇంద్రియాణి=ఇంద్రియములు; స్వయోనిషు=తమకు ప్రవర్తకములైన దేవతలయందును లయించుచున్నవని యభిప్రాయము.

తా. రూపము వాయువునందును, వాయువు స్పర్శమందును, స్పర్శను ఆకాశమందును, ఆకాశము శబ్దతన్మాత్ర మందును, ఇంద్రియములు తమ్ము ప్రవర్తింపజేయు దేవతల యందును లీనము లగుచున్నవి.

**శ్లో. యోని ర్వైకారికే సౌమ్య లీయతే మన సీశ్వరే,**
**శబ్దో భూతాది మ ప్యేతి భూతాది ర్మహతి ప్రభుః. 25**

అ. యోనిః=ఇంద్రియప్రవర్తక దేవతలు; ఈశ్వరే=నియంతయగు; మనస్సు నందు;మనసి= లీయతే=లయించును. శబ్దః=శబ్దము; భూతాదిం = తామసాహంకారమును; అప్యేతి = పొందును. అందు లయించునని భావము. ప్రభుః=సర్వజగన్మోహక మగుటచే సమర్థమగు భూతాది = త్రివిధాహంకారము· మహతి=జడాంశమును వీడి; జ్ఞానక్రియా శక్తిమాత్రరూప మగుచున్నది.

తా. ఓ సౌమ్యుడా! ఇంద్రియ ప్రవర్తక దేవతలు నియంత యగు మనస్సు నందును, శబ్దము తామసాహంకార మందును లయించును. జగన్మోహకమగు త్రివిధాహంకారము జడాంశమును విడచి జ్ఞానక్రియాశక్తిమాత్రరూపముగ నుండును.

**శ్లో. స లీయతే మహాన్ స్వేషు గుణేషు గుణవత్తమః,**
**తేఽ వ్యక్తే సంప్రలీ యన్తే తత్కాలే లీయతేఽ వ్యయే 26**

అ. గుణవత్తమః=జ్ఞానక్రియాశక్తిమంతమమగుటచే గుణవత్తమగును; మహాన్=ఆ మహత్తత్త్వము; స్వేషు గుణేషు =స్వకారణగుణములందు; లీయతే=లీనమగుచున్నది. తే=ఆ గుణములు అవ్యక్తే=అవ్యక్తమందు; సంప్రలీయన్తే=లీనము లగుచున్నవి. తత్=ఆ అవ్యక్తము; అవ్యయే = ఉపరతవృత్తిగల కాలే=కాకాలాధీనమగుటచే దానియందే; ప్రలీయతే = లయము నందుచున్నది.

తా. జ్ఞానక్రియాశక్తిమంతమగుటచే గుణవత్తమమగు ఆ మహత్తత్త్వము, స్వకారణ గుణములందు లయము నందుచున్నది. ఆ గుణములు అవ్యక్తమందును, అవ్యక్తము కాల మందును లీనమగుచున్నవి.

శ్లో. కాలో మాయామయే జీవే జీవ ఆత్మని మయ్యజే,
ఆత్మా కేవల ఆత్మస్థో వికల్పాపాయలక్షణః. 27

అ కాలః = కాలము; మాయామయే = మాయాప్రవర్తకుడు లేదా జ్ఞానమయుడగు జీవే = జీవుని యందు. జీవుడనగా జీవింపజేయువాడు మహాపురుషుడు కాలము విశ్వస్రష్టయగు ఉపకరణరూపము అది వృత్తులచే సృజించును. కావున అది జీవరూపమున నిలచును; కావుననే సప్తమస్కంధమున "కాలం - చరన్తం సృజతీశ ఆశ్రయం ప్రధానపుంభ్యాం నరదేవ సత్యకృత్'' అనియు దశమస్కంధమునను—

''యోఽయం కాల స్తస్య తేఽవ్యక్తబంధో చేష్టా మహాశ్చేష్టతే యేన విశ్వమ్.
నిమేషాది ర్వత్సరాంతో మహీ యాం స్తేత్వేశానం క్షేమధామ ప్రపద్యే.''

అనియు చెప్పబడినది. జీవః = జీవుడు; అజే - అజుడగు; మయిఆత్మని = ఆత్ముడునగు నాయందు ప్రతి యోగిలేకుండుటచే పరిపూర్ణ డగుటచే స్వరూపముతో నుండును. ఆత్మాన = ఆత్మయు; ఆత్మని ఏవ = ఆత్మయందే యుండును గాని వేనియందును లయించడు. ఏలయనగా ఆత్మ కేవలః = కేవలుడు అనగా నిరుపాధికుడు; వికల్పాపాయి లక్షణః = విశ్వోత్పత్తి; ప్రళయముల కు అధిష్ఠానము; అవధి లక్షితుడగుచున్నాడు.

తా. కాలము జ్ఞానమయుడగు జీవునియందు, ఆ జీవుడు ఆత్ముడనగు నా యందును లీనమగును. ఆత్మ నిరుపాధికుడు ఆత్మస్థుడే గాని ఏ యితరమందును ఉండడు. ఆత్ముడు విశ్వోత్పత్తి ప్రళయముల కధిష్ఠాత, అవధి యైనవాడు.

శ్లో ఏవ మన్వీక్షమాణస్య కథం వైకల్పికో భ్రమః,
మనసో హృది తిష్ఠేత వ్యోమ్నీవార్కోదయే తమః, 28

అ ఏవం = ఈ విధముగ; అన్వీక్షమాణస్య = చూచువానికి; మనసః = మనస్సునకు; కథం = ఎట్లు; వైకల్పికః భ్రమః = భేదనిమిత్తకమగు భ్రమముకల్గును? అట్లుకల్గిన; వ్యోమ్ని = ఆకసమున అర్కోదయే = సూర్యోదయ మైనపుడు; తమః ఇవ = అంధకారమువలె; హృది = మనస్సునందు; కథం = ఎట్లు, తిష్టేత = నిలచును;

తా. ఈ ప్రకారము పై విషయములన్నింటిని విచారదృష్టితో చూచువారికి మనస్సునందు వైకల్పిక భ్రమ కలుగు టెట్లు? ఒకవేళ కలిగినను అది ఆకాశమున సూర్యోదయింపగా చీకటి తొలగినట్లు తొలగునే గాని మదిలో నిలచియుండదు.

అవ ఉపసంహరించుచున్నారు—

శ్లో. ఏష సాంఖ్యవిధిః ప్రోక్తః సంశయగ్రంథి భేదనః
ప్రతిలోమానులోమాభ్యాం పరావరదృశా మయా, 29

పరావరదృశా = కార్యకారణములు; స్థూలసూక్ష్మములను వానినెల్ల దర్శింపగల; మయా = నాచేత; ఏషః = ఈ సశయగ్రంధి భేదనః = సందేహములను ముడులను విప్పగల; సాంఖ్యవిధిః = సాంఖ్యవిధి; ప్రతిలోమ అనులోమాభ్యాం = ఉత్పత్తి; ప్రళయరూపములతో; ప్రోక్తః = చెప్పబడినది.

తా. కార్యకారణములు, స్థూలసూక్ష్మములు అగువానికెల్ల దర్శింపగలవాడనగు నాచేత, సందేహములను నివారించునట్టి ఈ సాంఖ్యవిధి యిపుడు ఉత్పత్తి ప్రళయరూపముగా వివరించబడినది.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే చతుర్వింశోఽధ్యాయః.
ఇది శ్రీమద్భాగవతమందు ఏకాదశస్కంధమున నిరువది నాలుగవ అధ్యాయము.

# పంచవింశోఽధ్యాయము

## సంగ్రహశ్లోకము

**పంచవింశే త్వనైర్గుణ్య ప్రతిపత్త్యై నిరూప్యతే,**
**చిత్తప్రభవ సత్త్వాది గుణవృత్తి రనేకధా.**

ఈ ఇరువదియైదవ అధ్యాయమునందు ఆత్మయొక్క నిర్గుణత్వము తెలియుటకై మనస్సునందు పుట్టెడి సత్త్వము మున్నగాగల గుణముల యొక్క వ్యాపారమనేక విధములుగా నిరూపించబడుచున్నది.

అవ. ప్రకృతి పురుష వివేకరూపమగు జ్ఞానము కలవాడయ్యును, ఎంతవఱకు ప్రయత్న విశేషముచే సత్త్వాది గుణత్రయ వృత్తిని జయింపడో అంత వఱకు ద్వంద్వములు తొలగవు. కావున ఆ గుణత్రయ వ్యాపారమును జయించుట కుపాయమగు గుణ నివృత్తిని నిరూపించుటకు చెప్పుచున్నారు—

శ్రీ భగవా నువాచ = శ్రీ భగవంతుడు వచించెను.

శ్లో. **గుణానా మసమిశ్రాణాం పుమాన్ యేన యథా భవేత్,**
**తన్మే పురుషవర్యేద ముపధారయ శంసతః.** 1

అ. పురుషవర్య = ఓ నరశ్రేష్ఠుడా! పుమాన్ = మనుజుడు అసమిశ్రాణాం = వేఱ్వేఱగు, గుణానాం = గుణములలో, యేన = ఏ గుణముచే; యథా భవేత్ = ఎట్టివాడగునో; తత్ = దానిని; శంసతః = చెప్పుచున్న; మే = నావలన; ఉపధారయ = వినుము

తా. వేఱ్వేఱుగ నున్న సత్త్వాది గుణములలో నే గుణముచే నరు డెట్టివా డగునో చెప్పెదను, ఓ పురుష శ్రేష్ఠుడా! నీవు దీని నాలకింపుము

అవ. అందు సత్త్వవృత్తులను పేర్కొనుచున్నారు—

శ్లో. **శమో దమ స్తితిక్షేక్షా తపః సత్యం దయా స్మృతిః,**
**తుష్టి స్త్యాగోఽస్పృహా శ్రద్ధా హ్రీర్దయాదిః స్వనిర్వృతిః.** 2

అ. శమః = మనోనిగ్రహము; దమః = బాహ్యేంద్రియనిగ్రహము; తితిక్షా = సహనము; ఈక్షా = వివేకము; తపః = తన ధర్మమున వర్తించుట; సత్యం = సత్యము పలుకుట; దయా = దానము (దయ దానగతి రక్షణేషు అని స్మృతి.) స్మృతిః = పూర్వాపరముల నాలోచించుట; తుష్టి = లభించిన దానిచే సంతోషించుట; త్యాగః = వ్యయించు స్వభావము; అస్పృహా = విషయములందు వైరాగ్యము; శ్రద్ధా = ఆస్తికత, హ్రీః = అనుచిత కార్యములందు లజ్జ (అట్టికార్యములను చూడకుండుట) దయా = దయ; ఆదిః = ఆర్జవము; వినయము మున్నగునవి; స్వనిర్వృతిః = ఆత్మరతి; అనునవి (సత్త్వ వృత్తులు)

తా. స్పష్టము.

అవ. రజోవృత్తులను వచించుచున్నారు—

శ్లో. కామ ఈహా మద స్తృష్ణా స్తమ్భ ఆశీ ర్భిదా సుఖమ్,
మదోత్సాహో యశః ప్రీతి ర్హాస్యం వీర్యం బలోద్యమః. 3

అ. కామః = అభిలాష; ఈహా = వ్యాపారము; మదః = దర్పము; తృష్ణా = లభించినదానిచే సంతోషింపకుండుట; స్తంభః = గర్వము; ఆశీః = ధనాదుల నభిలషించి దేవతాదులను ప్రార్థించుట; భిదా = నేను వేఱని భేదబుద్ధి; సుఖం = విషయభోగము; మదోత్సాహః = మదముచే యుద్ధాదుల నాచరింపవలెనని పట్టుదల; యశః = కీర్తి, ప్రీతిః = స్తుతిప్రియత్వము; హాస్యం = పరిహాసము; వీర్యం = గొప్పదనమును వెల్లడించుట; బలోద్యమః = బలముతో నుద్యమించుట (న్యాయముగ నుద్యమించుటయో సాత్త్వికమే యగును) యనునవి (రాజస వ్యాపారములు).

తా. స్పష్టము.

అవ. తమోవృత్తులను పేర్కొనుచున్నారు—

శ్లో. క్రోధో లోభోఽ నృతం హింసా యాచ్ఞా దంభః క్లమః కలిః,
శోకమోహౌ విషాదార్తీ నిద్రాశా భీ రనుద్యమః. 4

అ క్రోధః = సహింపలేకుండుట; లోభః = వెచ్చించుట కిష్టపడకుండుట; అనృతం = శాస్త్రీయము కానిదానిని ప్రమాణమని పలుకుట; హింసా = ద్రోహము; యాచ్ఞా = కోరిక; దంభః = ధర్మమును ప్రదర్శించుట; క్లమః = శ్రమము; కలిః = కలహము; శోకమోహౌ = దుఃఖించుట; భ్రమ; విషాద + ఆర్తి = దుఃఖము దైన్యము; నిద్రా = తంద్ర; ఆశా = నాకిది లభించునని యెదురుచూచుట; భీః = భయము; అనుద్యమః = జాడ్యము అనునవి (తమోవృత్తులు.)

తా. స్పష్టము.

శ్లో. సత్త్వస్య రజస శ్చైతా స్తమస శ్చానుపూర్వశః,
వృత్తయో వర్ణితప్రాయాః సన్నిపాత మథో శృణు. 5

అ. అనుపూర్వశః = క్రమముగా; ఏతాః = ఈ; వృత్తయః = వృత్తులు; సత్త్వస్య = సత్త్వమునకు; రజసః = రజస్సునకు; తమసశ్చ = తమస్సునకును సంబంధించినవి; వర్ణితప్రాయాః = వర్ణింపబడినవైనవి. (ఇట్లే అన్యవృత్తులును ఊహింపదగినవని భావము). అథో = ఇటుపైన; సన్నిపాతం = ఈ త్రిగుణముల మిశ్రణమును గూర్చి; శృణు = వినుము.

తా. ఈ విధముగా వరుసగా సత్త్వగుణవృత్తులు, రజోగుణ వృత్తులును, తమోగుణ వృత్తులును వర్ణింపబడినవి. ఇవిగాక మఱికొన్నింటిని గూడ యీ వృత్తులతో బాటుగా నూహించుకొనవచ్చును. ఇటుపైన వీని మిశ్రణమును గూర్చి తెలిపెదను, వినుము.

అవ. విభక్తములైన గుణముల వృత్తులు వర్ణింపబడినవి. మిశ్రముల గుణముల నిటుపై చెప్పుచున్నారు—

శ్లో. సన్నిపాత స్త్వహ మితి మమే త్యుద్ధవ యా మతిః,
వ్యవహారః సన్నిపాతో మనోమాత్రేంద్రియాసుభిః. 6

అ. ఉద్ధవ=ఓ ఉద్ధవుడా! అహం మమ ఇతి=నేను, నాది యని; యా మతిః=ఎబుద్ధి కలదో అది; సన్నిపాతః=గుణత్రయ సంఘాతమువలన కలిగినది; మనోమాత్రేంద్రియాసుభిః=మనస్సు, మాత్రలు, ఇంద్రియములు, ప్రాణములచే; వ్యవహారః=వ్యవహరించుట; సన్నిపాతః=త్రిగుణ సన్నిపాతమువలన కలిగినట్టిదియే.

తా. ఉద్ధవుడా! నేను, నాది యని మమత్వముతో కూడి సకలవృత్తి సాధారణమైన బుద్ధి గుణత్రయ సన్నిపాతము వలన కలిగినట్టిదియే. "నేను శాంతుడను, నేను కాముకుడను, నేను క్రోధనుడను" మున్నగునదియు, "నాకు శాంతి కలదు, కామమున్నది, క్రోధ మున్నది" యిత్యాదికమగు బుద్ధియు గుణత్రయసన్నిపాతజన్యమే. ఇట్లు మనస్సుచే, శబ్దాదులచే, తన్మాత్రలచే, ప్రాణములచే చేయబడు వ్యవహారమంతయు గుణత్రయ సముదాయము వల్లనే కలుగుచున్నది.

శ్లో. ధర్మే చార్థే చ కామే చ యదాఽసౌ పరినిష్ఠితః,
గుణానాం సన్నికర్షోఽ యం శ్రద్ధారతిధనావహః. 7

అ. అసౌ=ఈ పురుషుడు; యదా=ఎప్పుడు; ధర్మే చ=ధర్మమందును; అర్థే చ=అర్థమందును; కామే చ=కామపురుషార్థమందును; పరినిష్ఠితః=నిష్ఠకలవాడగునో; తదా=అపుడు; అయః=ఈ; గుణానాం సన్నికర్షః=ఈ త్రివర్గమందు నిష్ఠారూపమైన సన్నికర్షః శ్రద్ధారతిధనావహః=శ్రద్ధను; ప్రీతిని; ధనమును కలిగించును.

తా. ధర్మార్థకామములు సత్త్వరజస్తమస్సుల కార్యము లగుటచే పురుషు డెప్పు డీ ధర్మార్థ కామములందు నిరతుడగునో అపుడీ త్రివర్గనిష్ఠారూపమగు త్రిగుణ సన్నికర్షము క్రమముగా శ్రద్ధను, ప్రీతిని, ధనమును కలుగజేయును.

అవ. ధర్మనిష్ఠయందును త్రిగుణసన్నిపాతమును ప్రదర్శించుచున్నారు—

శ్లో. ప్రవృత్తిలక్షణే నిష్ఠా పుమాన్ యర్హి గృహాశ్రమే,
స్వధర్మే చానుతిష్ఠేత గుణానాం సమితిర్హి సా. 8

అ. ప్రవృత్తిలక్షణే=కామ్యధర్మమందు; యర్హి = ఎప్పుడు; నిష్ఠా=నిలుకడ యుండునో; తదా=అప్పుడు; పుమాన్=పురుషుడు; గృహాశ్రమే=గృహస్థాశ్రమమందే ఆసక్తుడై యుండవలెను. అను=పిమ్మట; స్వధర్మే=నిత్యనైమిత్తికమగు తన ధర్మమునందు; తిష్ఠేత్=నిష్ఠకలిగి యుండవలెను. సా=నిష్ఠయు; గుణానాం=త్రిగుణములయొక్క; సమితిః హి=సన్నిపాతమే కదా.

తా. మనుజుడు కామ్యధర్మమందు నిష్ఠగలిగినవా డగుచో, గృహస్థాశ్రమమందేయుండి నిత్య నైమిత్తిక రూపమగు తన ధర్మము ననుష్ఠించుచుండవలెను. ఆ నిష్ఠయు త్రిగుణముల సన్నిపాతముచే నేర్పడినట్టిదియే.

అవ. అని యిట్లు మిశ్రములు, విభక్తములగు గుణముల వృత్తులను ప్రదర్శించియిపుడు

"పుమాన్ యేన యథా భవేత్" అని పూర్వము చెప్పిన దానిని మూడు శ్లోకములచే వివరించు చున్నారు.

శ్లో. పురుషం సత్త్వసంయుక్త మనుమీయా చ్ఛమాదిభిః,
కామాదిభీ రజోయుక్తం క్రోధాద్యై స్తమసా యుతమ్. **9**

అ. పురుషం = పురుషుని; శమాదిభిః = శమము మున్నగు గుణములచే; సత్త్వసంయుక్తం = సత్త్వగుణయుక్తునిగను; కామాదిభిః = కామము మున్నగు గుణములచే; రజోయుక్తం = రజోగుణ యుక్తునిగను; క్రోధాద్యైః = కోపము మున్నగు గుణములచే; తమసా యుతం = తమోగుణయుక్తునిగను అనుమీయాత్ = ఊహింపవలెను.

తా. పురుషునిలోని శమాదిగుణములను బట్టి యతడు సత్త్వగుణము కలవా డనియు, కామాది గుణములను బట్టి రజోగుణము కలవాడనియు, క్రోధాది గుణములచే తమోగుణము కలవా డనియు ఊహించుకొనవలెను.

శ్లో. యదా భజతి మాం భక్త్యా నిరపేక్షః స్వకర్మభిః,
తం సత్త్వప్రకృతిం విద్యా త్పురుషం స్త్రియ మేవ వా, **10**

అ. యదా = ఎపుడు; నిరపేక్షః = ఏకోరికయులేక; స్వకర్మభిః = తన కర్మలచేతనే; మాం = నన్ను; భక్త్యా = భక్తితో; భజతి = సేవించునో; తం = ఆ వ్యక్తిని; పురుషం = పురుషునే గాని; స్త్రియం ఏవ వా = స్త్రీనేకాని; సత్త్వప్రకృతిం = సాత్త్వికప్రవృత్తికల వ్యక్తినిగా, విద్యాత్ = తెలిసి కొనవలెను.

తా. స్పష్టము.

శ్లో. యదా ఆశిష ఆశాస్య మాం భజేత స్వకర్మభిః,
తం రజఃప్రకృతిం విద్యా ద్ధింసా మాశాస్య తామసమ్. **11**

అ, యదా = ఎప్పుడైతే; ఆశిషః = కోరికలను; ఆశాస్య = కోరి; స్వకర్మభిః = తన పనులచే; మాం = నన్ను; భజేత = సేవించునో; తం = అతనిని; రజఃప్రకృతిం = రజోగుణవంతునిగాను; హింసాం = శత్రుమరణాదికమును; ఆశాస్య = కోరి; యః మాం భజేత్ = ఎవడు నన్ను సేవించునో; తం = అతనిని; తామసం = తమః స్వభావునిగను; విద్యాత్ = ఎఱుగవలెను.

తా. ఏవేని ప్రయోజనముల నుద్దేశించి, స్వకర్మలచే నన్ను సేవించువాడు రజఃప్రకృతి కలవాడు. శత్రునాశాది ప్రయోజనము కోరి నన్ను ఆరాధించువాడు తామస స్వభావము కల వాడు. (ఇట్లు ఆయా గుణములచే నాయా ఆచరణము కలవా డగును.)

అవ. అయ్యా! మీకును గుణవశముచే కర్తృత్వము సమానమే కనుక ఏ విశేషమును బట్టి మాటిమాటికి నన్ను సేవించుమని పలుకుచున్నారు? ఏ విశేషముచే మీరు సేవ్యులు, జీవుడు సేవకుడు అను నియమము ప్రవర్తించును? అనగా చెప్పుచున్నారు,

శ్లో. సత్త్వం రజ స్తమ ఇతి గుణా జీవస్య నైవ మే,
చిత్తజా యైస్తు భూతానాం సజ్జమానో నిబధ్యతే. **12**

అ. సత్త్వం రజః తమః ఇతి గుణాః = సత్త్వము, రజస్సు తమస్సు అనుగుణములు; జీవస్య = జీవునకే; మే = నాకు; న ఏవ = లేవు; ఎందువలన ? చిత్తజాః = అవి జీవనోపాధియగు చిత్తమందలి

వ్యక్త మగునట్టివి. భూతానాం = దేహరూపములు; తద్భిన్నములగువాని నడుమ; సజ్జమానః = సంయుక్తుడగుటచే; కావున వానిచే నతడే బద్ధుడగును. నేనుమాత్రము అట్లు సక్తుడను కాను. 'అన్నమయం హి సౌమ్య ! మనః' అనుశ్రుతినిబట్టి లేదా భూతానాం=అపంచీకృతులగు భూతములకు కార్యభూతమగు ఏ చిత్తము కలదో ఆ చిత్తమువలన పుట్టినవగుటచే భూతోపహితుడగు జీవునకే ఆగుణములతో సంగము గాని నాకు కాదని భావము.

తా. సత్త్వము, రజస్సు, తమస్సను మూడు గుణములును జీవునకే గాని నాకు కలుగవు. ఏల ననగా నా త్రిగుణములు జీవోపాధి యగు చిత్తమునందభివ్యక్త మగునట్టివి. కావున వానిచే జీవుడు బద్ధుడగునే గాని నేను కాను. జీవుడు దేహరూపములు, తద్భిన్నములగు భూతములనడుమ సక్తుడై యుండును. నేనట్లు సక్తుడనై యుండను. గుణములకు నియామకుడ నగుటచే సృష్ట్యాదులను చేయుచు గూడ నేను నిత్యముక్తుడ నగుటచే జీవునికంటె నిది పెద్ద భేదము. లేదా పంచీకృతములు కానట్టి భూతములకు కార్యభూతమగు చిత్తము వలన పుట్టినవగుటచే నాత్రిగుణములు భూతోపహితుడగు జీవునకే సంబంధించునట్టివి గాని నాకు కాదని భావము.

అవ. ఈ ప్రకారము మిశ్రగుణములయు. అమిశ్రగుణములయు కార్యములను ప్రదర్శించి యిపు డొక్కొక్క గుణోద్రేకముచే కలుగు కార్యములను పదునేడు శ్లోకములచే ప్రదర్శించుచున్నారు-

**శ్లో. యదేతరౌ జయేత్సత్త్వం భాస్వరం విశదం శివమ్,**
**తదా సుఖేన యుజ్యేత ధర్మజ్ఞానాదిభిః పుమాన్. 13**

అ. యదా = ఎప్పుడు, భాస్వరం = ప్రకాశకమును, విశదం = స్వచ్ఛమును, శివం = శాంతమును అగు, సత్త్వం = సత్త్వగుణము, ఇతరౌ = తక్కిన రెండు గుణములను, జయేత్ = జయించునో, తదా = అపుడు, పుమాన్ = నరుడు, సుఖేన = సుఖముతోడను, ధర్మ–జ్ఞాన– ఆదిభిః = ధర్మము, జ్ఞానములచేతను, ఆది శబ్దముచే శమదమాదులచేతను, యుజ్యేత = కూడినవాడగును.

తా. ప్రకాశకము, స్వచ్ఛము, శాంతమును అగు సత్త్వగుణ మెపుడు తక్కిన రెండు గుణములను జయించునో అపుడు నరుడు సుఖము, ధర్మము, జ్ఞానము, శమము, దమము మున్నగువానితో కూడినవాడగును.

**శ్లో. యదా జయేత్తమః సత్త్వం రజః సంగం భిదా చలమ్,**
**తదా దుఃఖేన యుజ్యేత కర్మణా యశసా శ్రియా. 14**

అ. యదా = ఎప్పుడు, తమః = తమస్సును, సత్త్వం = సత్త్వమునుగూడ, సంగం = సంగహేతువును, భిదా = భేదహేతువును; చలం = ప్రవృత్తి స్వభావము కలదియునగు, రజః = రజోగుణము; జయేత్ = జయించునో, తదా = అప్పుడు, దుఃఖేన = దుఃఖముతోడను, కర్మణా = కర్మముతోడను; యశసా = కీర్తితోడను, యుజ్యేత = కూడినవాడగును.

తా. ఎపుడు సంగహేతువు, భేదహేతువు, ప్రవృత్తిస్వభావము కలదగు రజోగుణము, సత్త్వతమోగుణములు రెంటిని జయించునో అపుడు దుఃఖము, కర్మ, యశము, కీర్తి యనువానిని పొందును.

**శ్లో. యదా జయే ద్రజః సత్త్వం తమో మూఢం లయం జడమ్,**
**యుజ్యేత శోకమోహాభ్యాం నిద్రయా హింసయాఽఽశయా.** 15

అ. యదా = ఎపుడు, రజః = రజస్సును, సత్త్వం = సత్త్వమును, తమః = తమోగుణము, జయేత్ = జయించునో, ఆ తమస్సు ఎట్టిదనగా, మూఢం = వివేకమును పోగొట్టునది, లయం = ఆవరణ రూపమైనది, జడం = ఉద్యమములేనట్టిది. మూఢమగుటచే, శోకమోహాభ్యాం = శోక మోహ హింసల తోడను, లయమగుటచే, నిద్రయా = నిద్రతోడను, జడమగుటచే ఉద్యమ ముండదు కనుక, హింసయా = హింసచేతను, ఆశయా = కేవల మాశతోడను కూడినవా డగును, అని గమనింపదగును.

తా. ఎపుడు తమస్సు సత్త్వరజస్సులను జయించునో అపుడు తమస్సువివేకమును పోగొట్టును. జ్ఞానమునావరించును. ఉద్యమింప నీయదు. కావున తమః స్వభావుడు శోక మోహ హింసలతో, నిద్రతో కూడినవాడై ఆశతో నిండియుండును.

**శ్లో. యదా చిత్తం ప్రసీదేత ఇంద్రియాణాం చ నిర్వృతిః,**
**దేహేఽభయం మనోఽసంగం తత్సత్త్వం విద్ధి మత్పదమ్** 16

అ. యదా = ఎప్పుడు; చిత్తం = మనస్సు; ప్రసీదేత = ప్రసన్నమగునో, ఇంద్రియాణాం = ఇంద్రియములకు, నిర్వృతిః చ = ఉపరతియు అగునో; దేహే = దేహమందు; అభయం = నిర్భయమును; మనః = మనస్సునందు; అసంగం = సంగరాహిత్య మేర్పడునో; తత్ = అపుడు; మత్పదం = నాయుపలబ్ధిస్థానమగు; సత్త్వం = సత్త్వగుణమును ఉద్రిక్తమైనటులు; విద్ధి = ఎఱుంగుము.

తా. మనస్సు ప్రసన్నమైనపుడు, ఇంద్రియములు శాంతి నొందును. అట్లు దేహమున నిర్భయము, మనస్సున సంగరాహిత్యము కలవానియందు నా యుపలబ్ధిస్థానమగు సత్త్వగుణ ముద్రిక్తమైనదని తెలియుము.

**శ్లో. వికుర్వన్ క్రియయా చాధీ రనివృత్తిశ్చ చేతసామ్,**
**గాత్రాస్వాస్థ్యం మనో భ్రాంతం రజ ఏత న్నిశామయ.** 17

అ (యదా పునః = మఱల ఎప్పుడైతే.) క్రియయా వికుర్వన్ = క్రియచే వికారమును పొందుచు; ఆధీః భవతి = అంతటను విక్షేపము నొందిన బుద్ధి కలవాడగునో; చేతసాం = బుద్ధీంద్రియములయొక్క అనివృత్తిః = ఉపరతి కలుగదో; గాత్ర + అస్వాస్థ్యం = కర్మేంద్రియములకు; వికారమధికమగునో. మనః = మనస్సు భ్రాంతం = చంచలమగునో; అపుడు, ఏతత్ = దీనినే; రజః = రజోగుణము ఉద్రిక్తమైనదిగా; నిశామయ = తెలియుము.

తా. ఎప్పుడు క్రియచే వికారము పొందుచు, బుద్ధి విక్షిప్తమగునో. బుద్ధీంద్రియము లుపరతి నొందనో, కర్మేంద్రియము లధికముగ వికారము నొందునో, మనస్సు చంచలమగునో అపుడు రజోగుణ ముద్రిక్తమైనదని తెలియుము.

**శ్లో. సీదచ్చిత్తం విలీయేత చేతసో గ్రహణేఽక్షమమ్,**
**మనో నష్టం తమో గ్లాని స్తమ స్తదుపధారయ.** 18

అ (యదా = ఎపుడు); సీదత్ = తిరోభావము నొందుచున్నదియు; చేతసః గ్రహణే = చిదాకార పరిణామమునందు; అక్షమం సత్ = అసమర్థ మగుచున్నదై; చిత్తం = వివేకము; విలీయేత = నశిం

చునో; మనః అపి...సంకల్పాత్మకమగు మనస్సుకూడ; నష్టం = లయమునందునో; తమః = అజ్ఞానము; గ్లానిః = విషాదము కలుగునో, తత్ = దానిని; తమః ఉపధారయ = ఉదిక్తమైనతమస్సుగా తెలిసికొమ్ము.

తా. వివేక మెపుడు తిరోభవించుచు చిదాకారముగ పరిణమించుట కసమర్థమగునో సంకల్పాత్మకమగు మనస్సుకూడ లయించునో, అజ్ఞానము విషాదము కలుగునో దానినే తమస్సుయొక్క ఉద్రేకమునుగా తెలిసికొమ్ము.

**శ్లో. ఏధమానే గుణే సత్త్వే దేవానాం బల మేధతే,**
**అసురాణాం చ రజసి తమస్యుద్ధవ రక్షసామ్. 19**

అ. ఉద్ధవ, సత్త్వే గుణే = సత్త్వగుణము; ఏధమానే = వృద్ధినొందుచుండగా; దేవానాం బలం = దేవతల బలము; ఎధతే = పెరుగును; రజసి = రజోగుణము వృద్ధినందుచుండగా; అసురాణాం బలం ఏధతే = ఆసురబలము వృద్ధినందును, తమసి = తమోగుణము వృద్ధినందుచుండగా; రక్షసాం = రక్షస్సుల బలము పెరుగును.

తా. ఉద్ధవుడా! సత్త్వగుణము వృద్ధినందగా దేవబలము, రజోగుణము వృద్ధినందుచుండగా అసురబలము, తమోగుణము వృద్ధి నందుచుండగా రాక్షసబలము పెరుగును.

అవ. గుణోత్కర్షద్వారా అవస్థాభేదమును చూపుచున్నారు—

**శ్లో. సత్త్వా జ్జాగరణం విద్యా ద్రజసా స్వప్న మాదిశేత్,**
**ప్రస్వాపం తమసా జంతో స్తురీయం త్రిషు సంతతమ్. 20**

అ. సత్త్వాత్ = సత్త్వగుణోద్రేకము వలన; జాగరణం = మేల్కొనుటను; విద్యాత్ = తెలియవలెను; రజసా = రజోగుణముచే; స్వప్నం = నిద్రను; ఆదిశేత్ = తెలియవలెను. తమసా = తమోగుణముచే; జంతోః = ప్రాణియొక్క; ప్రస్వాపం = గాఢనిద్రను; విద్యాత్ = తెలియవలెను. ప్రసంగవశముచే నిర్గుణావస్థను తెలుపుచున్నారు; తురీయం = నాల్గవది :అనగా వేఱొక అవస్థ; త్రిషు = జాగ్రత్; స్వప్న, సుషుప్తులు మూటియందును; సంతతమ్ = ఉండునది ఏకరూపమగు ఆత్మ తత్త్వమే యని అర్థము.

తా. సత్త్వగుణముచే జాగరణము, రజస్సుచే స్వప్నము. తమస్సుచే సుషుప్తి కలుగును. ఈ మూటికంటెను వేఱై ఏకరూపమగు ఆత్మ తత్త్వము జాగ్రత్స్వప్న సుషుప్తులు మూటియందును నుండును.

అవ. గుణోత్కర్షద్వారా ఆ యా కర్మఫలనిష్ఠను ప్రదర్శించుచున్నారు—

**శ్లో. ఉపర్యుపరి గచ్ఛన్తి సత్త్వేన బ్రాహ్మణా జనాః,**
**తమసాఽధోఽధ ఆముఖ్యా ద్రజసాఽన్తరచారిణః. 21**

అ. సత్త్వేన = సత్త్వగుణముచే; బ్రాహ్మణాః జనాః = వేదానుష్ఠానయుక్తులగు వారు; ఉపరి + ఉపరి గచ్ఛన్తి = ఊర్ధ్వలోకముల కేగుదురు. "ఆబ్రాహ్మణః" అను పాఠమున బ్రహ్మలోకము వఱకును అని యర్థము; తమసా = తమోగుణముచే: ఆముఖ్యాత్ = స్థావరముల వఱకు; అధః అధః = అధోలోకములను చేరెదరు. రజసా = రజోగుణముచే; అంతరచారిణః = ఊర్ధ్వలోకములకు; అధోలోకములకు నడుమ చరించువారు, మనుజులు అగుదురు.

తా. సత్త్వగుణముచే వేదానుష్ఠాత లగువా రూర్ధ్వలోకముల కేగుదురు. తమోగుణముచే నధోలోకముల కేగెదరు. రజోగుణముచే నడుమ మానవులై యుందురు.

అవ. దేహమును జీవి నిష్క్రమించు సమయమందలి గుణోత్కర్షకు ఫలము చెప్పుచున్నారు.

శ్లో. సత్త్వే ప్రలీనాః స్వర్యాన్తి నరలోకం రజోలయాః,
తమోలయాస్తు నిరయం యాన్తి మామేవ నిర్గుణాః. **22**

అ. సత్త్వే=సత్త్వగుణము వృద్ధినొందగా; ప్రలీనాః=మరణించినవారు; స్వర్ యాన్తి= స్వర్గమున కేగెదరు, రజోలయాః=రజోగుణము ప్రవృద్ధముకాగా మరణించినవారు; నరలోకం= మనుష్యలోకమును పొందెదరు. తమోలయాః తు=తమోగుణము వృద్ధినందగా మరణించినవారు; నిరయం= నరకమును పొందెదరు, నిర్గుణాః=జీవించియుండియు గుణసంగము లేనివారగుచో; మామేవ యాన్తి=నన్నే చేరుదురు.

తా. మరణకాలమున సత్త్వగుణోద్రేకము కలవారు స్వర్గమును, రజోగుణోద్రేకము కలవారు మనుష్యలోకమును, తమోగుణోద్రేకము కలవారు నరకమును పొందెదరు. అట్లుగాక జీవించియుండియు గుణసంబంధము లేనివారగుచో మాత్రము నన్నే పొందెదరు.

అవ. ఇప్పుడు గుణోత్కర్షవల్లనే కలిగెడి ఆయా ఫలములను సాధించు త్రివిధ కర్మలను తెలుపుచున్నారు —

శ్లో. మదర్పణం నిష్ఫలం వా సాత్త్వికం నిజకర్మ తత్,
రాజసం ఫలసంకల్పం హింసాప్రాయాది తామసమ్. **23**

అ. మదర్పణం=నాకు ప్రీతికలుగవలెనని యుద్దేశించి చేయబడినదియు; నిష్ఫలంవా=కేవలము దాసభావము చేతనే (ఫలము కోరక) చేయబడినదియు; యత్=ఏ పని కలదో; తత్= ఆ నిత్యకర్మమున్నగునది, సాత్త్వికం=సాత్త్వికము. ఫలసంకల్పం=ఫలముఁగోరి చేయు కర్మ, రాజసం=రాజసము; హింసాప్రాయాది=హింస నుద్దేశించిన (లేదా హింసాబహుళమైన) కర్మ; తామసమ్=తామసము.

తా. నా ప్రీతికై చేయబడినది లేదా కేవలము దాసభావముచేతనే ఫలము కోరక చేయబడినది యగు కర్మ సాత్త్వికము. ఏదేని ఫలము గోరి చేయునట్టి కర్మ రాజసము. హింసాప్రచురమైన కర్మ తామసము.

అవ. ఇపుడు సగుణ నిర్గుణ భేదముతో జ్ఞానముల చాతుర్విధ్యమును వచించుచున్నారు-

శ్లో. కైవల్యం సాత్త్వికం జ్ఞానం రజో వైకల్పికం చ యత్,
ప్రాకృతం తామసం జ్ఞానం మన్నిష్ఠం నిర్గుణం స్మృతమ్, **24**

అ కైవల్యం=దేహాదివ్యతిరిక్తముగ ఆత్మకలదను; జ్ఞానం=జ్ఞానము; సాత్త్వికం= సాత్త్వికజ్ఞానము యత్=ఎయ్యది; వైకల్పికం=దేహాదులకంటె ఆత్మ వేఱుకాదను జ్ఞానము; రజః= రజోగుణ కృతమగు జ్ఞానము; ప్రాకృతం=బాలురు; మూగవారి జ్ఞానముతో సమానమైనది; తామసం

జ్ఞానం = తమోగుణకృతమగు జ్ఞానము; మన్నిష్ఠం = పరమేశ్వర విషయకమైనది; నిర్గుణం స్మృతం = నిర్గుణముగా చెప్పబడినది.

తా. దేహాదులకంటె వేఱుగా ఆత్మ కలదను జ్ఞానము సాత్త్వికము. అట్లు వేఱు కాదను జ్ఞానము రాజసము. బాలురు మూగవారి జ్ఞానముతో సమానమైనది తామసజ్ఞానము. పరమేశ్వరవిషయకజ్ఞానము నిర్గుణము.

**శ్లో. వనం తు సాత్త్వికో వాసో గ్రామో రాజస ఉచ్యతే,**
**తామసం ద్యూతసదనం మన్నికేతం తు నిర్గుణమ్. 25**

అ. వనం = ఏకాంతమగుటచే అరణ్యము; సాత్త్వికః వాసః = సాత్త్విక నివాసము; గ్రామః = ఊరు; రాజసః ఉచ్యతే = రాజస నివాసమని చెప్పబడును; ద్యూతసదనం = జూదమాడుతావు; తామసం = తమోనివాసము; మన్నికేతం తు = నా యావాసమనగా దేవాలయాదికము; నిర్గుణం = నిర్గుణ నివాసము.

తా. ఏకాంత ప్రదేశ మగుటచే వనము సాత్త్విక నివాసము. గ్రామము రాజస నివాసము. జూదమాడు ప్రదేశము తామస నివాసము. ఈమూడును కాక దేవాలయము నిర్గుణ మగు శ్రేష్ఠనివాసము.

**శ్లో. సాత్త్వికః కారకోఽసఙ్గీ రాగాంధో రాజసః స్మృతః,**
**తామసః స్మృతివిభ్రష్టో నిర్గుణో మదపాశ్రయః. 26**

అ. కారకః = కర్త; అసంగీ = అనాసక్తుడగుచో; సాత్త్వికః = సాత్త్వికు డగును, రాగాంధః = అమితమగు అభినివేశము (పట్టుదల)కలవాడు; రాజసః స్మృతః = రజోగుణము కలవాడుగా తలంపబడును. స్మృతివిభ్రష్టః = స్మృత్యుక్త ధర్మము ననుష్ఠించనివాడు; తామసః = తామసు డగును. మదపాశ్రయః = నన్నే శరణు జొచ్చినవాడు: నిర్గుణః = నిర్గుణుడగును.

తా. కర్త అనాసక్తు డగుచో సాత్త్వికుడగును. అమితాసక్తికలవాడు రాజసుడగును స్మృతి విరుద్ధముగ నాచరించువాడు తామసుడగును. నన్నే శరణుజొచ్చినవాడు నిర్గుణుడగును.

**శ్లో. సాత్త్వి క్యాధ్యాత్మికీ శ్రద్ధా కర్మశ్రద్ధా తు రాజసీ,**
**తామ స్యధర్మే యా శ్రద్ధా మత్సేవాయాం తు నిర్గుణా. 27**

అ. ఆధ్యాత్మికీ = అధ్యాత్మశాస్త్ర విషయక మగు; శ్రద్ధా = శ్రద్ధ; సాత్త్వికీ = సాత్త్వికి; కర్మ శ్రద్ధా తు = యజ్ఞయాగాది కర్మలయందు (ఫలాపేక్షతో కూడిన) శ్రద్ధ; రాజసీ = రాజసి యగును అధర్మే = అధర్మమందు; యా శ్రద్ధా = ధర్మమను భావము; తామసీ = తామసి అగును; మత్సేవాయాం తు = నా సేవయందలి శ్రద్ధ; నిర్గుణా = నిర్గుణశ్రద్ధ యగును.

తా. ఆధ్యాత్మికశాస్త్రములందలి శ్రద్ధ సాత్త్వికము. యజ్ఞయాగాది కర్మయందలి శ్రద్ధ రాజసము. అధర్మమందు ధర్మబుద్ధితో కూడిన శ్రద్ధ తామసము. నా సేవయందు శ్రద్ధ లగ్నమైన శ్రద్ధ నిర్గుణము.

**శ్లో. పథ్యం పూత మనాయస్త మాహార్యం సాత్త్వికం స్మృతమ్,**
**రాజసం చేంద్రియప్రేష్ఠం తామసం చార్తిదాఽశుచి. 28**

అ. పథ్యం=హితము; పూతం=శుద్ధము; అనాయస్తం=అనాయాసముగ లభించినది అగు; ఆహార్యం=ఆహారము; సాత్త్వికం స్మృతం=సాత్త్వికమని చెప్పబడినది. ఇంద్రియ ప్రేష్ఠం=భోజనకాలమందు మాత్రము సుఖము కలిగించు కారము, పులుపు, ఉప్పునైన ఆహారము; రాజసం=రాజసాహారము; ఆర్తిద+అశుచి=దేహేంద్రియములకు బాధ కలిగించునది; అపరిశుద్ధమైనదియగు ఆహారము; తామసం=తామసము.

తా. హితము పరిశుద్ధము అనాయాసలబ్ధమగు ఆహారము సాత్త్వికము. భోజనకాలమందు మాత్రము తృప్తిని కలిగించు కారము పులుపు ఉప్పునైన ఆహారము రాజసము. శరీరేంద్రియములకు పీడ కలిగించునది అపరిశుద్ధమైనదియగు ఆహారము తామసము.

**శ్లో. సాత్త్వికం సుఖ మాత్మోత్థం విషయోత్థం తు రాజసమ్,**
**తామసం మోహదైన్యోత్థం నిర్గుణం మదపాశ్రయమ్.** **29**

అ. ఆత్మోత్థం సుఖం=తనచేతనే కలిగించబడినది. (బాహ్యార్థ విషయముకాదు) అనగా ఆత్మానుభవ సంతోషరూపమైనది; సాత్త్వికం సుఖం=సాత్త్విక సుఖము; విషయోత్థం=విషయ సంగముచే కలిగినది; రాజసం=రాజససుఖము మోహదైన్యోత్థం=మాదకవస్తువులను భుజించుటచే కలిగిన పారవశ్యము; పుత్రకళత్రాదులను తన వశమందుంచుకొనుటవలన కలిగెడి సుఖము, తామసం=తామససుఖము; మదపాశ్రయం=మద్విషయకమగు జ్ఞానము; నిర్గుణం=నిర్గుణమగును,

తా. ఆత్మానుభవ సంతోష రూపమగు సుఖము సాత్త్వికము. విషయసంగముచే కలిగినది రాజససుఖము. మాదకద్రవ్య భక్షణము, పుత్రకళత్రాదులు వశమందుండుటయున్నగు వానివలన కలుగు సుఖము తామససుఖము. మద్విషయకమగు సుఖము మాత్రము నిర్గుణము.

అవ. ఇంతవఱకు చెప్పబడిన సంసారహేతుభూతమగు త్రైగుణ్యమును రెండు శ్లోకములతో నుపసంహరించుచున్నారు.

**శ్లో. ద్రవ్యం దేశః ఫలం కాలో జ్ఞానం కర్మ చ కారకః,**
**శ్రద్ధాఽవస్థాఽఽకృతి ర్నిష్ఠా త్రైగుణ్యః సర్వ ఏవ హి.** **30**

అ. ద్రవ్యం=పథ్యము; పవిత్రము అయిన ద్రవ్యము; దేశః=వనగ్రామాది రూపమగు ప్రదేశము, ఫలం='సాత్త్వికం సుఖం' ఇత్యాదిగామున్ను చెప్పబడినది కాలః=ఎపుడు నన్ను భక్తితో సేవించునో; ఎపుడు ఇతరములు రెంటిని జయించునో అని ఏ కాలము చెప్పబడినదో ఆ కాలము; జ్ఞానం='కైవల్యం సాత్త్వికం జ్ఞానం' ఇత్యాదిగా చెప్పబడినది. కర్మ=భగవదర్పణ రూపమగు కర్మ; కారకః=''సాత్త్వికః కారకోఽసఙ్గీ'' ఇత్యాదిరూపమైనది; శ్రద్ధా=సాత్త్వికాదిరూపమగు శ్రద్ధ; అవస్థా='సత్త్వా జ్జాగరణం' ఇత్యాది అవస్థ; ఆకృతిః="ఉపర్యుపరి" త్యాదిగా చెప్పబడిన దేవత్వాది రూపము; నిష్ఠా= ''సర్వే ప్రలీనాః స్వర్యాన్తి'' ఇత్యాదిగా చెప్పబడిన స్వర్గాదికము; త్రైగుణ్యః సర్వ ఏవ హి=ఇట్లు ఈ భావ మంతయు త్రిగుణాత్మకము.

తా. పూర్వోక్తమగు ద్రవ్యము, దేశము, ఫలము, కాలము, జ్ఞానము, కర్మ, కారకము, శ్రద్ధ, అవస్థ, ఆకృతి, నిష్ఠ అను భావ మంతయు త్రిగుణాత్మకము,

శ్లో. సర్వే గుణమయా భావాః పురుషావ్యక్త ధిష్ఠితాః,
దృష్టం శ్రుత మనుధ్యాతం బుద్ధ్యా వా పురుషర్షభ, 31

అ. దృష్టం = చూడబడినట్టిది; శ్రుతం = వినబడినట్టిది, బుద్ధ్యా అనుధ్యాతం = బుద్ధిచే తలంపబడినది; ఇట్లు పురుష + అవ్యక్త ధిష్ఠితాః = పురుషునిచే; అవ్యక్తముచే అధిష్ఠితములైన; భావాః = భావములు; సర్వే = అన్నియు; గుణమయాః = గుణరూపములు.

తా. మనము చూచునవి, వినునవి, బుద్ధితో తలంచునవి ఇట్లు పురుషావ్యక్తములతో కూడిన భావములన్నియును త్రిగుణాత్మకములే.

అవ. ఇటుపై ముందు చెప్పబడిన త్రైగుణ్యము సంసారహేతు వగుట ననువదించుచు దానిని జయించుటవలన మోక్షము కలుగు ననుచున్నారు—

శ్లో. ఏతాః సంసృతయః పుంసో గుణకర్మనిబంధనాః,
యేనేమే నిర్జితాః సౌమ్య గుణా జీవేన చిత్తజాః,
భక్తియోగేన మన్నిష్ఠో మద్భావాయ ప్రపద్యతే. 32

అ. సౌమ్య = ఓ సజ్జనుడా! ఏతాః = ఇవి; పుంసః = మనుజునకు; గుణకర్మనిబంధనాః = గుణము కర్మలనుబట్టి కలిగెడి; సంసృతయః = సంసారరూపములు; చిత్తజాః = మనస్సునుండి పుట్టెడి; ఇమే గుణాః = ఈ గుణములు; యేన = ఏ పురుషునిచేత; నిర్జితాః = జయింపబడిన వగునో; సః = అతడు; భక్తియోగేన = భక్తియోగముచే; మన్నిష్ఠః సన్ = నాయందే మనసు నిలిపి; మద్భావాయ = మోక్షమునకు; ప్రపద్యతే = యోగ్యుడగును.

తా. ఓ సజ్జనుడా! ఇవి యన్నియు గుణకర్మలనుబట్టి మనుజునకు కలుగు సంసారస్థితిగతులు. చిత్తజములగు ఈగుణముల నెవడు జయించునో వాడు భక్తియోగ సాధనచే నా యందే నిష్ఠగలవాడై మోక్షము పొందుటకు యోగ్యుడగును.

అవ. కావున వివేకము గలవారి కిదియే యుక్త మనుచున్నారు—

శ్లో. తస్మా ద్దేహ మిమం లబ్ధ్వా జ్ఞానవిజ్ఞానసంభవమ్,
గుణసంగం వినిర్ధూయ మాం భజన్తు విచక్షణాః. 33

అ. తస్మాత్ = అందువలన; జ్ఞానవిజ్ఞానసంభవం = జ్ఞాన విజ్ఞానములు కలుగుటకు మూలమైన, ఇమం దేహం = ఈ నరదేహమును; లబ్ధ్వా = పొంది; గుణసంగం = గుణములతోడి సంబంధమును; వినిర్ధూయ = తొలగించుకొని; విచక్షణాః = పండితులగువారు, మాం = నన్ను; భజన్తు = సేవింతురుగాక!

తా. కావున జ్ఞాన విజ్ఞానములు కలుగుట కాధారభూతమగు ఈనరదేహమును పొంది బుద్ధిమంతులు గుణముల సాంగత్యము వీడి నన్ను సేవింతురుగాక!

అవ. అట్లు భజించు పద్ధతిని తెలుపుచున్నారు—

శ్లో. నిస్సంగో మాం భజే ద్విద్వా నప్రమత్తో జితేంద్రియః,
రజస్తమ శ్చాభిజయేత్ సత్త్వసంసేవయా మునిః,
సత్త్వం చాభిజయే ద్యుక్తో నైరపేక్ష్యేణ శాంతధీః. 34

అ. విద్వాన్ = జ్ఞానియగువాడు; నిస్సంగః = సంగము వీడి; అప్రమత్తః = ఏమఱనివాడై; జితేంద్రియః = ఇంద్రియములను తన వశమందుంచుకొని; మాం = నన్ను; భజేత్ = సేవించవలెను; మునిః = మునియై; సత్త్వసంసేవయా = సత్త్వగుణము నవలంబించుటచే; రజః తమశ్చ అభిజయేత్ = రజస్తమోగుణములను జయించవలెను; యుక్తః = అట్లు సత్త్వయుక్తుడైన పిమ్మట; శాంతధీః = ప్రశాంతమైన బుద్ధికలవాడై; నైరపేక్ష్యేణ = కోరికలు వీడి, సత్త్వం చ = సత్త్వగుణమునుకూడ; అభిజయేత్ = జయింపవలెను.

తా. జ్ఞానియైనవాడు సంగము వీడి, అప్రమత్తుడై జితేంద్రియుడై సత్త్వగుణము నవలంబించి, దానిచే రజస్తమస్సులను జయింపవలెను. అట్లు సత్త్వగుణయుతుడైన పిమ్మట శాంతుడై, రాగము వీడి సత్త్వమునుగూడ జయింపవలెను.

అవ. ఇట్లు చేయుచో నన్ను పొందు ననుచున్నారు—

**శ్లో. సంపద్యతే గుణై ర్ముక్తో జీవో జీవం విహాయ మామ్,**
**జీవో జీవవినిర్ముక్తో గుణై శ్చాశయసంభవైః,**
**మయైవ బ్రహ్మణా పూర్ణో న బహి ర్నాంతర శ్చరేత్. 35**

అ. జీవః = జీవుడిట్లు; గుణైః = త్రిగుణములచేతను; ముక్తః = విడువబడినవాడై; జీవం = జీవత్వమునకు కారణమైన లింగశరీరమును; విహాయ = వీడి; మాం = నన్ను; సంపద్యతే = పొందును; జీవః = జీవుడు; జీవవినిర్ముక్తః = లింగ శరీరమును వీడి; ఆశయసంభవైః = అంతఃకరణమునందు పుట్టెడి; గుణైశ్చ = గుణములచేతను; విడువబడి; బ్రహ్మణా = పరమాత్మనగు; మయా = ఏవ = నాచేతనే; పూర్ణః = నిండినవాడై; బహిః = బయట విషయభోగములను గాని; అంతరః = అంతరంగముచే వానిని స్మరించుటగాని; న చరేత్ = ఆచరింపడు.

తా. జీవు డిట్లు త్రిగుణములను లింగశరీరమును వీడి పరమాత్మనగు నాయందే మనస్సునిలిపి పూర్ణుడై విషయభోగముల ననుభవింపడు. మనస్సులో వానినితలంపడు.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే పంచవింశోఽధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమం దేకాదశస్కంధమున నిరువదియైదవ అధ్యాయము.

# షడ్వింశోఽధ్యాయః

## సంగ్రహశ్లోకము

**షడ్వింశే యోగనిష్ఠాయా విఘాతో దుష్టసంగతః,**
**సాధుసంగేన తన్నిష్ఠా పరా కాష్ఠేతి వర్ణ్యతే.**
**యోగినో యోగవిభ్రంశః సంగతః సంభవే దితి,**
**సర్వథా తన్నివృత్త్యర్థ మైలగీతం వితన్యతే.**

ఈ యిరువది యాఱవ అధ్యాయమున, దుష్టసాంగత్యముచే యోగనిష్ఠ చెడు ననియు, సజ్జన సాంగత్యముచే ఆనిష్ఠ పరాకాష్ఠను పొందుననియు వర్ణింపబడుచున్నది. యోగి సంగముచే యోగభ్రష్టు డగునని, అట్లు యోగి సంగమును వర్జించుటకు ఐలగీతము వివరింప బడుచున్నది.

శ్రీభగవా నువాచ = భగవంతుడు వచించెను.

అవ. వెనుక "నిస్సంగో మాం భజే ద్విద్వా నప్రమత్తో జితేంద్రియః" అని చెప్ప బడినది. అట్లు నిస్సంగుడు, అప్రమత్తుడు, జితేంద్రియుడు కానిచో అనర్థము కలుగునని చెప్ప బోవుచు, అట్లగుచో జీవన్ముక్తునకు గూడ సంగము వారింప శక్యముగానిది కనుక అనర్థము కలుగునని యాశంకించి పూర్వోక్తము ననువదించి యొకటిన్నర శ్లోకముచే దానిని పరిహరించు చున్నారు—

శ్లో. **మల్లక్షణ మిమం కాయం లబ్ధ్వా మద్ధర్మ ఆస్థితః,**
**ఆనందం పరమాత్మాన మాత్మస్థం సముపైతి మామ్.** 1

అ. మల్లక్షణం=నా స్వరూపమును దర్శింపజేయు; ఇమం కాయం = ఈ నరదేహమును; లబ్ధ్వా=పొంది; మద్ధర్మే=భక్తిరూపమగు నా ధర్మమందు; ఆస్థితః=నిష్ఠగలవాడై, ఆత్మస్థం=తన యందే నియంతనై యున్న; పరం ఆనందం=పరమానంద స్వరూపుడనగు, ఆత్మానం=పరమాత్మ నైన, మాం=నన్ను; సముపైతి=చక్కగా పొందును.

తా. నాస్వరూపమును దర్శింపజేసెడి ఈశరీరమునుపొందినవాడై నాయందలి భక్తి కలిగిన నరుడు తనయందే నియంతనై పరమానందస్వరూపుడను, పరమాత్మనగు నన్ను పొందును.

అవ. అట్టివానికి విషయసంగము కలుగదు కదా అన్నచో అట్లు కాదనుచున్నారు—

శ్లో. **గుణమయ్యా జీవయోన్యా విముక్తో జ్ఞాననిష్ఠయా**
**గుణేషు మాయామాత్రేషు దృశ్యమానే ష్వవస్తుతః,**
**వర్తమానోఽపి న పుమాన్ యుజ్యతేఽ వస్తుభి ర్గుణైః.** 2

అ. జ్ఞాననిష్ఠయా=జ్ఞాననిష్ఠచే; గుణమయ్యా=గుణరూపమైన; జీవయోన్యా=జీవోపాధిచే, విముక్తః=విడువబడినవాడై; అవస్తుతః=వాస్తవము కాకయే; దృశ్యమానేషు=కేవలము మాయామాత్రమే ఐన గుణేషు=గుణములయందు; వర్తమానః అపి=వర్తించువాడైనను; పుమాన్=నరుడు అవస్తుభిః=వాస్తవములుగానట్టి; గుణైః=గుణములతో; న యుజ్యతే=కూడినవాడు కాడు.

తా. జ్ఞానమం దచంచలమగు నిష్ఠకలవా డగుటచే జీవోపాధినుండి విముక్తుడైన జీవుడు అవాస్తవములగు గుణములనడుమ నివసించుచు గూడ, అవాస్తవములయ్యు వాస్తవములవలె కన్పట్టుచున్న మాయారూపములే యగు గుణములచే సక్తుడుగాడు.

అవ. అట్లయ్యును సంగమును వర్జింపవలె ననుచున్నారు—

శ్లో. సంగం న కుర్యా దసతాం శిశ్నోదరతృపాం క్వచిత్,
తస్యానుగ స్తమస్యన్ధే పత త్యంధానుగోఽంధవత్. **3**

క్వచిత్=ఒకప్పుడును; శిశ్నోదరతృపాం=శిశ్నమును; ఉదరమును మాత్రము తృప్తి నొందించుకొనునట్టి; అసతాం=దుష్టులయొక్క; సంగం=సంబంధమును; న కుర్యాత్=చేయరాదు, తస్యానుగః=అట్టి దుష్టు నొక్కని ననుసరించు వాడైనను, అంధానుగః=గ్రుడ్డివాని ననుసరించిన; అంధవత్=గ్రుడ్డివానివలె; అంధే తమసి=గాఢాంధకారమునందు (అంధతామిస్ర నరకమందు) పతతి=పడును.

తా. సంభోగము. కడుపు నింపుకొనుటలతో తృప్తినొందునట్టి చెడ్డవారితో చెలిమి చేయరాదు. అట్టివారిలో నొక్కరితో సాంగత్య మేర్పడినను గ్రుడ్డివాని ననుసరించిన గ్రుడ్డివానివలె అధతామిస్రమున బడును.

అవ. ఇందులకు దృష్టాంతము జూపుచున్నారు—

శ్లో. ఐలః సమ్రా డిమాం గాథా మగాయత బృహచ్ఛ్రవాః,
ఉర్వశీవిరహా న్ముహ్య న్నిర్విణ్ణః శోకసంయమే. **4**

అ. బృహచ్ఛ్రవాః=గొప్పకీర్తి కలవాడును; సమ్రాట్=చక్రవర్తియు అగు; ఐలః=పురూరవుడు; ఉర్వశీవిరహాత్=ఊర్వశితో నెడబాటువలన మొదట; ముహ్యన్=ఆమెయందు మోహమున బడుచు; కురుక్షేత్రమున నామెను కలసికొని; గంధర్వు లిచ్చిన యగ్నితో దేవతలకు యాగము చేసి; తిరిగి యూర్వశీ లోకమున కేగి; యచట; శోకాపగమే సతి=శోకము తొలగగా; నిర్విణ్ణః=నిర్వేదము నొంది; ఇమాం గాథాం అగాయత= ఈ గాథను గానము చేసెనని నవమస్కంధానుసారముగ చూచుకొనవలెను.

తా. మహాకీర్తిశాలి, చక్రవర్తియగు ఐలుడు(పురూరవుడు) మొదట ఊర్వశీ విరహముచే పీడితుడై తరువాత కురుక్షేత్రమున నామెను కలసికొని గంధర్వులొసంగిన అగ్నితో యాగమొనర్చి దేవతలను సంతుష్టులను చేసి తత్ఫలముగా ఊర్వశీలోకమును పొంది శోకము తొలగిన సందర్భమున నిర్వేదము చెంది ఈచెప్పబోవు గాధను గానముచేసెను.

అవ. మొదటి మోహావస్థను చెప్పుచున్నాడు.

శ్లో. త్యక్త్వాఽఽత్మానం వ్రజంతీం తాం నగ్న ఉన్మత్తవ న్నృపః,
విలప న్నన్వగా జ్జాయే ఘోరే తిష్ఠేతి విక్లవః. **5**

అ. ఆత్మానం=తన్ను; త్యక్త్వా=విడచి; వ్రజన్తీం=పోవుచున్న (లేదా శయ్యపై తన్ను విడచి పోవుచున్న) తాం = ఆమెను, నృపః = ఆ రాజు; నగ్నః = దిసమొలయై, ఉన్మత్తవత్ = పిచ్చివానివలె, జాయే = ఓ కాంతా ! ఘోరే=కఠినాత్మురాలా ! తిష్ఠ =నిలువుము; ఇతి=అని; విక్లవః =వివశుడై ; విలపన్ = ఏడ్చుచు; అన్వగాత్ =వెంటబడెను.

తా. ఆమె తన్ను శయనముపై వీడి పోవుచుండగా, నా రాజు దిసమొలయై. పిచ్చివానివలె "ఓప్రియా నీవెంత కఠినాత్మురాలివే నిలువుము నిలువు"మని వివశుడై యేడ్చుచు వెంబడించెను.

అవ. వివశత్వమునకు కారణమును పేర్కొనుచున్నారు—

**శ్లో. కామా నతృప్తోఽనుజుషన్ క్షుల్లకాన్ వర్షయామినీః,**
**న వేద యాన్తీ ర్నాయాన్తీ రుర్వశ్యాకృష్టచేతనః. 6**

అ. ఉర్వశ్యాకృష్టచేతనః = ఊర్వశిచే ఆకర్షింపబడిన మనస్సుకల ఆపురూరవుడు; క్షుల్లకాన్ = తుచ్ఛములగు, కామాన్ = భోగములను; అతృప్తః=తృప్తిలేకయే; అనుజుషన్ = అనుభవించుచు, యాన్తీః =గడుచుచున్నవి గాని; ఆయాన్తీః = వచ్చుచున్నవిగాని యగు; వర్షయామినీః = రాత్రులను, సంవత్సరములను; న వేద = ఎఱుగడయ్యెను.

తా. ఆ పురూరవు డట్లు ఉర్వశియం డనురక్తుడై స్వేచ్ఛగా కామభోగము లనుభవించుచు రాత్రులు గడచుట వచ్చుటను గూడ గమనింపక సంవత్సరములకొలది కాలము క్షుద్రసుఖములతో గడపెను.

ఐల ఉవాచ = పురూరవుడు పలికెను.

అవ. అట్లు గంధర్వలోకము చేరి బహుకాల మూర్వశీ సంభోగానంతరము నిర్వేదమునొందిన పురూరవుని గానము పదునెనిమిది శ్లోకములతో చెప్పుచున్నారు. అందు ఎనిమిదింటిచే ఆయన పరితాపము తెలుపబడుచున్నది—

**శ్లో. అహో మే మోహవిస్తారః కామకశ్మలచేతసః,**
**దేవ్యా గృహీతకంఠస్య నాయుఃఖండా ఇమే స్మృతాః. 7**

అ. అహో =అయ్యో ! కామకశ్మలచేతసః = కామముచే మలినమైన మనస్సుకల, మే = నా యొక్క; మోహవిస్తారః = మహామోహ మెంతటిది ? దేవ్యా = ఊర్వశిచే, గృహీతకంఠస్య = కంఠాలింగన మొనర్పబడిన నాచే; ఇమే = ఈ; ఆయుఃఖండాః = అహోరాత్రరూపములగు ఆయుష్షుయొక్క విభాగములు; న స్మృతాః = స్మరింపబడలేదు.

తా. అయ్యో! కామమున మనసు చెడి నే నెంతటి అజ్ఞానమున పడితిని! ఊర్వశీ కంఠాలింగనమును పొంది, నా అయువునం దంశములగు అహోరాత్రములు గడచిపోవుట గుర్తింపనైతిని.

అవ. దానినే నుడువుచున్నారు—

**శ్లో. నాహం వేదాభినిర్ముక్తః సూర్యో వాభ్యుదితోఽ ముయా,**
**ముషితో వర్షపూగానాం బతాహాని గతాన్యుత. 8**

అ. అముయా = ఈమెచే; ముషిత = దొంగిలింపబడిన వివేకము కలవాడనై ; అభినిర్ముక్తః = ఇపుడు విడువబడితిని; అహం = నేను; ఈమెతో విహరించుచుండగా; సూర్యః = సూర్యుడు; అభ్యుదితో వా = అస్తమించెనని కాని ఉదయించెనని కాని; న వేద = ఎఱుగనైతిని; బత = అయ్యో! వర్షపూగానాం = అనేక సంవత్సరములందలి; అహాని = దినములు; గతాని = గడచినవో, న వేద = ఎఱుగనైతిని.

తా. ఈయూర్వశి నా వివేకమును పోగొట్టినది. కావుననే నే నామెతో విహరించుచుండగా సూర్యోదయాస్తమయములు కూడ తెలియకుంతున నెన్ని యేండ్లు గడచినవో. అయ్యో! తెలియనైతిని.

శ్లో. అహో మే ఆత్మసమ్మోహో. యేనాత్మా యోషితాం కృతః,
క్రీడామృగ శ్చక్రవర్తీ నరదేవశిఖామణిః. 9

అ. యేన = ఏమోహముచే; అహం = నేను; యోషితాం = స్త్రీలకు. క్రీడామృగః = ఆటలాడుకొను జంతురూపముగల వస్తువుగా, కృతః = చేయబడితినో; చక్రవర్తీ = చక్రవర్తిని; నరదేవ శిఖామణిః = రాజుల కలంకారభూతుడను; మే = నాయొక్క; ఆత్మసంమోహః = అనాత్మజ్ఞత; అహో = అయ్యో!

తా. నేను చక్రవర్తినయ్యు రాజుల కెల్ల తలమానిక మయ్యు, మోహితుడనై నన్ను నేను స్త్రీలకొక క్రీడామృగమును చేసికొంటిని. నే నెంత అనాత్మజ్ఞుడను.

అవ. ఓయీ! ప్రణయకుపితయైన నాయిక నోదార్చుట కామె కధీనుడగుట యుక్తము కదా! అందువా, నిజమే కాని యిచట ప్రణయకోపము లేదనుచున్నాడు—

శ్లో. సపరిచ్ఛద మాత్మానం హిత్వా తృణ మివేశ్వరమ్
యాంతీం స్త్రియం చాన్వగమం నగ్న ఉన్మత్తవ ద్రుదన్. 10

అ. సపరిచ్ఛదం = రాజ్యాదులతో కూడినవాడను; ఈశ్వరం = చక్రవర్తినగు; ఆత్మానం = నన్ను: తృణమివ = గడ్డిపోచనువలె; హిత్వా = విడచిపెట్టి; యాంతీం = పోవుచున్న స్త్రియం = స్త్రీని; నగ్నః = దిసమొలనై ; ఉన్మత్తవత్ = పిచ్చివానివలె; రుదన్ = ఏడ్చుచు, అన్వగమం = వెంట పోయితిని.

తా. నేను రాజ్యము కలవాడను; చక్రవర్తిని. నన్నీమె తృణీకరించి విడచి పోవుచుండగా నేను దిసమొలనై పిచ్చివానివలె నేడ్చుచు వెంటపోయితిని.

అవ. మఱియు నా ప్రభావాదులపై తనకు గల అభిమానము వ్యర్థ మనుచున్నారు.

శ్లో. కుత స్తస్యానుభావః స్యా త్తేజ ఈశత్వ మేవ వా,
యోఽన్వగచ్ఛం స్త్రియం యాన్తీం ఖరవ త్పాదతాడితః॥ 11

అ. యః = ఏ నేను; యాంతీం = పోవుచున్న; స్త్రియం = స్త్రీని; అన్వగచ్ఛం = అనుసరించి పోయితిని, ఖరవత్ = గాడిదచేవలె, పాదతాడితః = కాళ్లచేతన్నబడితిని తస్య = అట్టివాడనగు నాకు, అనుభావః = గొప్పదనము గాని; తేజః = తేజస్సుగాని, ఈశత్వం ఏవ వా = చక్రవర్తిత్వముగాని, కుతః = ఎట్లు ?

తా. ఆమె పోవుచుండగా నే నామె వెన్నంటి పోవుచుంటిని. ఆమె గాడిదవలె నన్ను కాలితో తన్నినది. అట్టిచో నింక నామహిమ మెక్కడిది ? పరాక్రమ మెక్కడిది ? చక్రవర్తిత్వ మెక్కడిది ?

అవ. ఇట్టి నాకు సకల సాధనములు వ్యర్థమనుచున్నారు—

శ్లో. **కిం విద్యయా కిం తపసా కిం త్యాగేన శ్రుతేన వా,**
**కిం వివిక్తేన మౌనేన స్త్రీభి ర్యస్య మనో హృతమ్.** **11**

అ. యస్య=ఏ మనుష్యునియొక్క, మనః=మనస్సు, స్త్రీభిః=స్త్రీలచేత, హృతం=వశీకరించుకొనబడినదో; తస్య = వానికి, విద్యయా = విద్యచే, కిం=ఏమి ప్రయోజనము, తపసా =తపముచే,తను త్యాగేన = త్యాగముచేతను. శ్రుతేన వా = అధ్యయనముచేతను, వివిక్తేన = ఏకాంత ప్రదేశమం దుండుటచేతను, మౌనేన = మాటలాడకుండుటచేతను, కిం = ఏమి ప్రయోజనము ?

తా. ఎవని మనస్సు స్త్రీవశమైనదో వాని విద్య, తపము, త్యాగము, అధ్యయనము, ఏకాంతప్రదేశమం దునికి, మౌనము అన్నియు వ్యర్థములు.

అవ. ఇట్లనుతాపము చెంది తన్ను రెండు శ్లోకములతో నిందించుకొనుచున్నాడు—

శ్లో. **స్వార్థ స్యాకోవిదం ధిఙ్మాం మూర్ఖం పండితమానినమ్,**
**యోఽహ మీశ్వరతాం ప్రాప్య స్త్రీభి ర్గోఖరవ జ్జితః.** **13**

అ. మూర్ఖం=మూఢుడగు, పండితమానినం=ప్రాజ్ఞునిగా నన్ను తలంచుకొనువాడను; స్వార్థస్య =ఆత్మశ్రేయస్సు యొక్క. అకోవిదం=అజ్ఞాని అగు, మాం ధిక్=నాకు నింద యగుగాక; యః అహం=ఏ నేను; ఈశ్వరతాం=చక్రవర్తిత్వమును; ప్రాప్య అపి=పొందియు; గోఖరవత్=ఎద్దువలె; గాడిదవలె; స్త్రీభిః=పరస్త్రీలచే; జితః=జయింపబడితిని.

తా. నేను మూఢుడను, నన్ను పండితునిగా భావించుకొనినవాడను, నాశ్రేయము నే నెఱుగనివాడను. చక్రవర్తినయ్యు ఎద్దు, గాడిదవలె పరస్త్రీచే భంగపడితిని.

శ్లో. **సేవతో వర్షపూగా న్మే ఉర్వశ్యా అధరాసవమ్,**
**న తృప్యత్యాత్మభూః కామో వహ్ని రాహుతిభి ర్యథా.** **14**

అ. వర్షపూగాన్=అనేక సంవత్సరములు; ఊర్వశ్యాః=ఊర్వశియొక్క; అధరాసవం=అధరాసవమును (పెదవిని చుంబించుటను) సేవతః=సేవించుచున్న; మే=నాకు; ఆత్మభూః=మనస్సునం దుద్భవించిన; కామః న తృప్యతి=కామము తృప్తి నొందుట లేదు.

తా. నే ననేక సంవత్సరము లూర్వశి యధరామృతము నాస్వాదించితిని. కాని నాకు ఆమెయందు కలిగిన కామము ఆహుతులచే అగ్ని తృప్తి నొందని విధముగా తృప్తి నందలేదు.

అవ. ఇట్లెనిమిది శ్లోకములచే రాజునకు కలిగిన నిర్వేదము నిరూపించబడినది. ఇవు డాతనికి కలిగిన వివేకమును తెలుపుచున్నారు —

శ్లో. **పుంశ్చల్యాపహృతం చిత్తం కోఽన్యో మోచయితుం ప్రభుః**
**ఆత్మారా మేశ్వర మృతే భగవంత మధోక్షజమ్.** **15**

అ. పుంశ్చల్యా=వ్యభిచారిణియగు ఊర్వశిచే, చిత్తం=నా మనస్సు; అపహృతం=వశము చేసికొనబడినది; అధోక్షజః=ఇంద్రియాధీనము కాని జ్ఞానము కలవాడును; ఆత్మారామ+ఈశ్వరం=విషయ విముఖులై ఆత్మయందే రమించు వారలకు ఈశ్వరుడును; భగవంతమ్ ఋతే=భగవంతుడు దక్క; అన్యః కః=ఇతరు డెవ్వడు, మోచయితుం=విడిపించుటకు; ప్రభుః=సమర్థు డగును.

తా. నామనస్సొక వ్యభిచారిణికి వశమైనది. ఇంద్రియముల నధఃకరించినవాడు, విషయములందు తగులు పడక ఆత్మయందే రమించువారికి ఈశ్వరుడైన భగవంతు డొక్కడు తక్క ఇతరు డెవ్వడు నన్ను విడిపించగలడు ?

అవ. పరమేశ్వరు ననుగ్రహములేక దేవతలచే నుపదేశింపబడిన వేదవాక్యముచే కూడ మోహము తొలగ దనుచున్నారు—

శ్లో. బోధితస్యాపి దేవ్యా మే సూక్తవాక్యేన దుర్మతేః,
మనోగతో మహామోహో నాపయా త్యజితాత్మనః. 16

అ. దేవ్యా=ఊర్వశిచేత; సూక్తవాక్యేన=యథార్థవచనము చేత 'పురూరవో మా మృథా మా ప్రతప్తో మా త్వా వృకాసో అశివాస ఉక్షన్, న వై స్త్రైణాని సఖ్యాని సన్తి సాలావృకాణాం హృదయాన్యేతా' అను వచనముచేత; బోధితస్యాపి=ఉపదేశింపబడిన వాడనైనను; దుర్మతేః=కామాసక్తమానసుడనై; అజితాత్మనః=ఇంద్రియ వశుడనైన; మమ=నాయొక్క; మనోగతః=మనస్సునందలి; మహామోహః=కాంతయందు ఈమె భోగింపదగినది యను నిట్టి మోహము; న అపయాతి=తొలగుట లేదు.

తా. ఊర్వశి యథార్థ వచనములచే నన్నెంతగా ప్రబోధించినను కామాసక్తుడనైన నేను ఇంద్రియ పారవశ్యము నొంది, ఆమెయందు మోహమును విడువజాలనైతిని.

అవ. పూర్వము 'పుంశ్చల్యాఽపహృతం చిత్తం' ఇత్యాదిగా ఆమె చేసిన అపచారము స్మరించి యిపు డా యపరాధము నాదే యనుచున్నాడు —

శ్లో. కి మేతయా నోపకృతం రజ్జ్వా వా సర్పచేతసః,
రజ్జుస్వరూపావిదుషో యోఽహం యదజితేంద్రియః. 17

అ. నః=మాకు అనగా కాముకులకు; ఏతయా=ఈమెచే; కిమపకృతం=ఏమి అపకారము చేయబడినది? కొంచెమును లేదు. రజ్జు స్వరూపా విదుషః=త్రాడుయొక్క స్వరూపమును తెలియకయే, త్రాటినిచూచి; సర్పచేతసః=సర్పమను బుద్ధిచే ఖేదపడువానికి, రజ్జ్వా=ఆత్రాటిచే, కిమపి=ఏమియు; న అపకృతం=ఎట్లు అపకారము చేయబడలేదో అట్లు; యః అహః=ఏ నేను; యత్=ఎందువల్లనైతే; అజితేంద్రియః=జితేంద్రియుడను కాకుంటినో అట్టి నాకు; ఏతయా=ఈ యుర్వశిచే, కిం అపకృతం=ఏ అపకారము చేయబడినది ? ఏమియు చేయబడలేని భావము.

తా. రజ్జుస్వరూపము నెఱుగనివా డొకడు రజ్జువును (తాటిని) చూచి పామని భయపడినచో అది త్రాడువల్ల కలిగిన అపకారము కానట్లు నే నింద్రియవశుడ నగుటచే నా కామె యపకారిణి కాదు సరికదా హితబోధ చేయుటచే ఉపకారిణియు అగుచున్నది.

అవ. ఓయీ! అట్లయ్యును సుగంధము కలిగియుండుట ప్రేమ మున్నగు గుణములచే ఆమెయే యీసమ్మోహమునకు మూలముకదా అని ఆశంకించి, ఆసౌగంధ్యాదులును తన బుద్ధితో కల్పించినవే యని నాల్గు శ్లోకములచే చెప్పుచున్నాడు -

**శ్లో క్వాయం మలీమసః కాయో దౌర్గంధ్యాద్యాత్మకోఽశుచిః.**
**క్వ గుణాః సౌమనస్యాద్యా హ్యధ్యాసోఽవిద్యయా కృతః. 18**

అ. మలీమసః = మిక్కిలి మలినము; దౌర్గంధ్యాద్యాత్మకః = దుర్గంధమున కాలవాలము; అశుచి = అపరిశుద్ధమగు; అయం కాయః = ఈ కాంతాశరీరము లేదా నా శరీరము; క్వ = ఎక్కడ? సౌమనస్యాద్యాః = మంచి మనస్సు కలిగియుండుట మున్నగు, గుణాః = శ్రేష్ఠగుణములు; క్వ = ఎక్కడ? అవిద్యయా = స్వరూపమును తెలియజాలమిచే; అధ్యాసః = భ్రమ; కృతః = చేయబడినది.

తా. ఈ శరీరము మిక్కిలి మలినమైనది. దుర్గంధ భూయిష్ఠము, అపరిశుద్ధమును. అట్టి ఈ శరీరమేడ? సౌమనస్యము మున్నగు శోభనగుణము లెక్కడ? స్వరూపాజ్ఞాన వశముచే నా కీభ్రమ కలిగినది.

అవ. మమకారముగూడ నందు కల దనుచున్నారు -

**శ్లో. పిత్రోః కిం స్వం ను భార్యాయాః స్వామినోఽగ్నేః శ్వగృధ్రయోః,**
**కిమాత్మనః కిం సుహృదా మితి యో నావసీయతే॥. 19**

అ. పిత్రోః కిం స్వం (కాయః) = ఈ శరీరము తల్లిదండ్రులదా (వారు జనకులు కనుక) భార్యాయాః వా = భార్యదా (భోగము నిచ్చునది కనుక), స్వామినః = యజమానిదా (అధీనుడు కనుక) అగ్నేః = అగ్నిదా ! (అంత్యేష్టిలో అగ్ని కాహుతి యగునది కనుక), శ్వగృధ్రయోః వా = కుక్కలు, గ్రద్దలదా? (వానికి భక్ష్యము కనుక) కిం ఆత్మనః = ఆత్మదా? (శరీరకృతములగు శుభాశుభములను అనుభవించునది కనుక) కిం సుహృదాం = మిత్రులదా! (ఉపకారులు కనుక), ఇతి = అని; యః న అవసీయతే = ఏ నేను నిశ్చయింపలేకున్నానో.

తా. ఈశరీరమునకు జనకులు కనుక ఇది వారిదా, భోగము నిచ్చునది కనుక అగ్నిదా చెప్పుచేతలలో నుంచుకొను యజమానిదా? తుదకు అగ్నిలో బడునది కనుక అగ్నిదా ? భక్ష్యము కనుక కుక్కలు గ్రద్దలదా ? తత్కృత శుభాశుభములను పొందునది కనుక ఆత్మదా? ఉపకారులు కనుక మిత్రులదా యని నేను నిశ్చయింపజాలకున్నాను.

**శ్లో. తస్మిన్ కలేవరేఽమేధ్యే తుచ్ఛనిష్ఠే విషజ్జతే,**
**అహో సుభద్రం సునసం సుస్మితం చ ముఖం స్త్రియః. 30**

అ. తుచ్ఛనిష్ఠే = క్రిములు, మలము, భస్మముగా తుదకు పరిణమించునది; అమేధ్యే = అపవిత్రమైనదగు, తస్మిన్ = ఈ; కలేవరే = శరీరమునందు; అహో = ఆహా, సుభద్రం = సుఖము కలిగించునది; సునసం = చక్కని నాసిక కలది; సుస్మితం చ = చక్కని చిరునగవు కలది, స్త్రియః = స్త్రీయొక్క ముఖం = ముఖము అని; విషజ్జతే = మిక్కిలి సంసక్తు డగును.

తా. ఇట్లు పరిణామమున కృమి,విడ్భస్మరూపము అపవిత్రము అగు శరీరమునందు, ఆహా! ఈమె శరీర మెంత సుఖావహము, ఈమె ముఖ మెట్లు చక్కని నాసిక కలది, చక్కని చిరునగవు కలది అని సంసక్తు డగును.

అవ. కావున గుణముల నారోపించి రమించు మాదృశులు కృమితుల్యు లనుచున్నాడు—

శ్లో. త్వఙ్మాంస రుధిరస్నాయు మేదోమజ్జాస్థి సంహతౌ,
విణ్మూత్ర పూయే రమతాం కృమీణాం కియదన్తరమ్. 21

అ. త్వక్. మాంస, రుధిర, స్నాయు, మేదః, మజ్జ, అస్థి, సంహతౌ = చర్మము; మాంసము, రక్తము, నరము, మెదడు, ఎముకల యందలి ద్రవము, ఎముకల సమూహమును, విట్, మూత్ర, పూయే చ = మలమూత్రము, చీములందు; రమతాం = విహరించు; కృమీణాం = క్రిములకంటె; కియత్ = ఎంత అంతరమ్ = భేదము!

తా. చర్మ, మాంస, రక్తములు, నరము, మెదడు, ఎముకలందలి నూనె, ఎముకలు వీని సమూహము మలమూత్రములు చీమునందు పొరలు పురుగులకును నాకును భేద మేమున్నది ?

శ్లో. అథాపి నోపసజ్జేత స్త్రీషు స్త్రైణేషు చార్థవిత్,
విషయేంద్రియ సంయోగా న్మనః క్షుభ్యతి నాన్యథా. 22

అ. అథ అపి = అట్లయ్యును; అర్థవిత్ = ఆత్మహితము నెఱిగినవాడు; స్త్రీషు = స్త్రీలయందును; స్త్రైణేషు చ = స్త్రీలకు వశులగు వారితోడను; న ఉపసజ్జేత = సంగము కలిగియుండరాదు. విషయేంద్రియసంయోగాత్ = విషయేంద్రియముల యొక్క సంయోగమువలన; మనః = మనస్సు, క్షుభ్యతి = క్షోభిల్లునేకాని; అన్యథా న = వేఱొండు విధముగ కాదు.

తా. అట్లయ్యు నాత్మహితము గోరువాడు స్త్రీలతో, స్త్రీవశ్యులగు పురుషులతో సంబంధము వీడవలయును. విషయేంద్రియ సంయోగముచే మనస్సు క్షోభిల్లును కాని వేఱువిధముగ కాదు.

అవ. ఓయీ ! ఒక్కొకచో కన్నులు మూసికొనుట మున్నగు వానివలన గూడ చిత్త క్షోభ కలుగుట చూచుచున్నాము కాదా అన్నచో నిజమే. అదియు పూర్వదర్శనాదులు లేక సంభవించదనుచున్నారు –

శ్లో. అదృష్టా దశ్రుతా ద్భావా న్న భావ ఉపజాయతే,
అసంప్రయుంజతః ప్రాణాన్ శామ్యతి స్తిమితం మనః. 23

అ. అదృష్టాత్ = చూడబడనిది, అశ్రుతాత్ = వినబడనిది అగు; భావాత్ = పదార్థమువలన, భావః = చిత్తక్షోభము; న జాయతే = కలుగదు ప్రాణాన్ = ఇంద్రియములను; అసంప్రయుంజతః = నియమించుకొనినవాని; మనః = మనస్సు; స్తిమితం = నిశ్చలమై: శామ్యతి = రాగాది కలుషితము కాకుండును.

తా. పదార్థములను చూడక, వానినిగూర్చి వినక యున్నచో మనస్సు నిశ్చలమై యుండును. రాగాదులచే కలుషితము గానేరదు.

శ్లో. తస్మా త్సంగో న కర్తవ్యః స్త్రీషు స్త్రైణేషు చేంద్రియైః,
విదుషాం చాప్యవిశ్రబ్ధః షడ్వర్గః కిము మాదృశామ్ 24

అ. తస్మాత్ = అందువలన; స్త్రీషు = స్త్రీల విషయమునను; స్త్రైణేషు = స్త్రీలకు వశపడువారి విషయమునను; ఇంద్రియైః = ఇంద్రియములతో; సంగః = పొత్తు; న కర్తవ్యం = చేయదగనిది, షడ్వర్గః = ఆరు విధములగు ఇంద్రియ సమూహము; విదుషామపి = పండితులకును; అవిశ్రబ్ధః = విశ్వసింపదగనిది అట్టిచో, మాదృశాం = నా వంటి వారి విషయమున, కిము = ఏమని చెప్పవలెను !

తా. కావున స్త్రీలతో, స్త్రీవశులగు వారితో ఇంద్రియ సంబంధము కూడదు. అరింద్రియములును పండితులకే నమ్మరానివగుచో పామరులమాట యేమి చెప్పవలయును ?

అవ. ఫలితమును రెండు శ్లోకములచే తెలుపుచున్నారు —

శ్రీభగవా నువాచ — శ్రీ భగవంతుడు పచించెను.

శ్లో. ఏవం ప్రగాయన్ నృప దేవదేవః
స ఉర్వశీలోక మథో విహాయ
ఆత్మాన మాత్మ న్యవగమ్య మాం వై
ఉపారమ జ్ఞానవిధూత మోహః. 25

అ. నృపదేవదేవః = రాజులకు దేవతలకును దేవుడగు సః = ఆ ఐలుడు: ఏవం = ఈ ప్రకారముగ; ప్రగాయన్ = మిక్కిలి గానము చేయుచు; ఆత్మానం మాం = పరమాత్ముడవగు నన్ను; ఆత్మని అవగమ్య = తనయందు తెలిసికొని; జ్ఞాన విధూతమోహః = జ్ఞానముచే మోహము తొలగినవాడై, ఉపారమత్ = సంసారమునుండి నివృత్తుడయ్యెను

తా. అని యిట్లు ఐలుడు ఊర్వశీలోకము వీడి తనయందు పరమాత్మను సాక్షాత్కరించుకొని సంసారవిముక్తు డయ్యెను.

శ్లో. తతో దుస్సంగ ముత్సృజ్య సత్సు సజ్జేత బుద్ధిమాన్,
సన్త ఏతస్య ఛిన్దన్తి మనోవ్యాసంగ ముక్తిభిః. 26

అ. తతః = అందువలన; బుద్ధిమాన్ = బుద్ధిమంతుడగువాడు; దుస్సంగం = చెడ్డవారితో చెలిమిని; ఉత్సృజ్య = విడచి, సత్సు = సజ్జనులయందు; సజ్జేత = కలసియుండువాడు కావలెను. సంతః = సజ్జనులు; ఏతస్య = ఇతనియొక్క, మనోవ్యాసంగం = మనస్సుయొక్క విషయ వ్యాసంగమును; ఉక్తిభిః = సదుపదేశములచే; ఛిన్దంతి = ఛేదింతురు

తా. కావున బుద్ధిమంతు డగువాడు దుష్టులతో చెలిమి వీడి సజ్జనులతో కూడియుండవలెను. సత్పురుషులు అట్టివాని మనస్సునందలి విషయవ్యాసంగమును సదుపదేశములచే ఛేదింతురు.

అవ. సత్పురుషలక్షణమును తెలుపుచున్నారు—

శ్లో. సన్తోఽనపేక్షా మచ్చిత్తాః ప్రశాన్తాః సమదర్శినః,
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః. 27

అ. సంతః = సత్పురుషులు; అనపేక్షాః = నా కంటె వేఱువిషయములయం దభిలాష లేనివారు; మచ్చిత్తాః = నాయందే లగ్నమైన మనస్సుకలవారు; ప్రశాంతాః = రాగాదులచే కలుషితముకాని మనస్సు కలవారు, సమదర్శినః = సకలప్రపంచమును బ్రహ్మాత్మకముగనే చూచువారు, నిర్మమాః = దేహమందును తత్సంబంధములగు వానియందును, నేను నాది యను మమకారము లేనివారు; నిర్ద్వంద్వాః = శీతోష్ణాది ద్వంద్వముల వలన వికారము నొందనివారు; నిష్పరిగ్రహాః = అనుకూల విషయములకు దూరముగనున్నవారు.

తా. సత్పురుషులు నాకంటె వేఱు విషయములం దపేక్ష లేనివారు, నాపైననే మనసు నిలిపినవారు, నిర్మలమగు మనస్సు కలవారు సర్వమును బ్రహ్మస్వరూపముగనే చూచువారు, అహంకార మమకారములు వీడినవారు, శీతోష్ణాది ద్వంద్వములచే వికారము నొందనివారు, విషయములకు వశముకానివారు.

అవ. వారుపదేశింపవలెనని అపేక్షింప పనిలేదు వాని సాన్నిధ్యమే తరింపజేయుననుచున్నారు—

శ్లో. **తేషు నిత్యం మహాభాగ! మహాభాగేషు మత్కథాః,**
**సంభవంతి హితా నృణాం జుషతాం ప్రపునం త్యఘమ్.** 28

అ మహాభాగ = మహాభాగ్యశాలీ ! నిత్యం = అనుదినము; మహాభాగేషు = మహాభాగ్యశాలులగు, తేషు = వారెనడుమ; నృణాం = మానవులకు; హితాః = మేలు కలిగించెడి; మత్కథాః = నాయొక్క కథలు: సంభవంతి = కలుగు చుండును, అవి, జుషతాం = వినువారియొక్క; అఘం = పాపమును; ప్రపునంతి = శోధన చేయును

తా. ఓ భాగ్యశాలీ! మహాభాగ్యశాలురగు ఆ సత్పురుషులు సదా నాకు సంబంధించిన కథలతోనే పొద్దుపుచ్చువారు. నా కథలు నరులకు హితము గూర్చును. వారి పాపములను శోధించును

శ్లో. **తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః,**
**మత్పరాః శ్రద్ధధానాశ్చ భక్తిం విందంతి తే మయి** 29

అ తాః = ఆకథలను, యే = ఎవరు; మత్పరాః = నాయందే ఆసక్తులై ; శ్రద్ధధానాశ్చ = శ్రద్ధ కలవారై చేయుచున్నారో, ఆదృతాః = ఆదరయుక్తులై ; అనుమోదంతి చ = అనుమోదింతురో; తే = వారు; మయి = నాయందు; భక్తిం = భక్తిని; విందంతి = పొందెదరు.

తా నాయందు చిత్తము నిలిపి శ్రద్ధతో ఎవరు నా కథల నాకర్ణింతురో, గానము చేతురో వారు నాయందు భక్తిని పొందుదురు.

శ్లో. **భక్తిం లబ్ధవతః సాధో కి మన్య దవశిష్యతే.**
**మయ్యనంతగుణే బ్రహ్మ ణ్యానందానుభవాత్మని.** 30

అ. అనంతగుణే = అంతులేని గుణము కలిగినట్టియు; ఆనందానుభవాత్మని = ఆనందము ననుభవింపుటచే ప్రకాశించు; బ్రహ్మణి మయి = బ్రహ్మమగు నాయందు; భక్తిం లబ్ధవతః = భక్తిని పొందినవానికి, అన్యత్ కిం అవశిష్యతే = వేఱేమి దుర్లభము మిగిలియున్నది!

తా. అనంతగుణుడు, నిరతిశయానందరూపుడు, పరబ్రహ్మయగు నాయందు భక్తి నిలిపినవాడు సాధింపక మిగిలిన దేమున్నది?

శ్లో. **యథోపశ్రయమాణస్య భగవన్తం విభావసుమ్,**
**శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవత స్తథా.** 31

అ యథా = ఏ ప్రకారముగా, భగవంతుడగు; విభావసుం = అగ్నిని; ఉపశ్రయమాణస్య = సేవించుచున్నవానికి; శీతం = చలి; భయం = భయము; తమః = చీకటి, అత్యేతి = నశించునో;

సాధూన్ = సత్పురుషులను; సం సేవతః = సేవించువానికిని; తథా = అట్లే, కర్మజాడ్యము, సంసార భయము, తన్మూలమగు అజ్ఞానమును నశించును.

తా. భగవంతుడగు అగ్నిని సేవించు వానికిని కర్మజాడ్యము, సంసారభయము, అజ్ఞానము నశించును.

**శ్లో. నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయనమ్,**
**సంతో బ్రహ్మవిదః శాంతా నౌర్దృఢే వాప్సు మజ్జతామ్. 32**

అ. ఘోరే = భయంకరమగు; భవాబ్ధౌ = సంసారసముద్రమునందు; నిమజ్జ్య ఉన్మజ్జతాం = మునిగితేలు (ఉత్తమాధమయోనులను పొందు) వారికి; అప్సు = జలములందు, మజ్జతాం = మునిగిపోవు చుండు వారికి, దృఢా నౌః ఇవ = గట్టి నావవలె; బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలును; శాంతాః = శాంతులును; సంతః = సత్పురుషులు; పరమాయనమ్ = మిక్కిలి శరణు పొంద దగినవారు.

తా. భీకరమగు భవాబ్ధిలో మునిగి తేలు (నానావిధ యోనులలో జన్మించు) వారలకు, జలములో మునుగు వారి కెట్లు దృఢమగు నావ శరణ్యమో, అట్లు బ్రహ్మవిదులు శాంతులగు సజ్జనులు పరమప్రాప్యులు.

**శ్లో. అన్నం హి ప్రాణినాం ప్రాణా ఆర్తానాం శరణం త్వహమ్,**
**ధర్మో విత్తం నృణాం ప్రేత్య సన్తోఽర్వాగ్బిభ్యతోఽరణమ్. 33**

అ. (యథా = ఎట్లు); అన్నం హి = అన్నమే; ప్రాణినాం = ప్రాణులకు; ప్రాణాః = జీవనమో; అహమేవ = నేనే (ఎట్లు), ఆర్తానాం = పీడితులైన వారికి, శరణం = రక్షకుడనో, (ఎట్లు) ప్రేత్య = పరలోకమున; నృణాం = నరులకు; ధర్మః = ధర్మము; విత్తం = ధనమో; (అట్లు) సంతః = సత్పురుషులే, అర్వాక్ = సంసారపాతము నుండి; బిభ్యతః = భయపడుచున్నవానికి; అరణం = శరణము.

తా. అన్న మెట్లు ప్రాణులకు జీవనాధారమో, నే నె ట్లార్తులకు రక్షకుడనో, పరలోకమున నరులకు ధర్మ మెట్లు ధనమో, అట్లు సత్పురుషులే సంసారమున అధఃపాతమునకు భయపడు వానికి రక్షకులు.

**శ్లో. సంతో దిశన్తి చక్షూంషి బహి రర్కః సముత్థితః,**
**దేవతా బాంధవాః సన్తః సన్త ఆత్మాఽహమేవ చ. 34**

అ. సంతః = సత్పురుషులు; చక్షూంషి = సగుణ నిర్గుణ జ్ఞానరూపములగు నేత్రములను; దిశన్తి = కలిగింతురు; అర్కః (తు) = సూర్యుడు మాత్రము; సముత్థితః అపి = చక్కగా నుదయించియు బహిః ఏవ = బయట మాత్రమే, దర్శన సాధనమును కలిగించుచున్నారు. దేవతాః = దేవతలును; బాంధవాః = బంధువులును, సంతః = సత్పురుషులే; సంతః = సజ్జనులు; ఆత్మా = నా కాత్మీయులు; కావున, అహమేవ = వారు నేనే యని భావించి సేవింపదగిన వారు.

తా. సత్పురుషులు సగుణ నిర్గుణ జ్ఞానరూపమగు నేత్రముల నిత్తురు. సూర్యుడో ఎంతగా ప్రకాశించినను బాహ్యముగనే దర్శన సాధనము నిచ్చును. సత్పురుషులు మాత్రమే దేవతలును, బాంధవులును. సత్పురుషులు నా కాత్మీయులు. వారిని నేనే యను భావముతో సేవింపదగును.

అవ. అధ్యాయార్థము నుపసంహరించుచున్నారు-

శ్లో. వైతసేన స్తతో౽ప్యేవ ముర్వశ్యా లోకనిఃస్పృహః,
ముక్తసంగో మహీ మేతా మాత్మారామ శ్చచార హ. 35

అ వైతసేనః = సుద్యుమ్నుడుగా ఉమావనమున ప్రవేశించి యచట స్త్రీత్వమును పొందిన వీత సేనుని (వీతము అనగా తన పూర్వరూపము కోల్పోయి స్త్రీత్వము నొందిన- సేన కలవాడు- వీత సేనుడు) కుమారుడు పురూరవుడు; ఏవం = ఈ ప్రకారముగా; ఉర్వశ్యా = ఊర్వశిచే; లోకనిస్పృహః = స్థానము నుండి; లేదా అవలోకనము (చూచుట) నుండి; నిస్పృహః = కాంక్ష తొలగినవాడై; ఆత్మారామః = పరమాత్మనిష్ఠుడై, చచార = యథేష్టముగా తిరిగెను.

తా. పురూరవు డట్లు ఊర్వశిలోకమునందు కాంక్ష తొలగినవాడై, సజ్జన సాంగత్యముచే నిస్సంగుడై . పరమాత్మనిష్ఠుడై యథేచ్ఛగా తిరిగెను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ఏకాదశస్కంధే షడ్వింశో౽ధ్యాయః.
ఇది శ్రీమద్భాగవతమహాపురాణమునం దేకాదశస్కంధమున నిరువదియాఱవ
అధ్యాయము ముగిసినది.

# సప్తవింశాధ్యాయము

## సంగ్రహశ్లోకములు

**సప్తవింశే క్రియాయోగః సద్య శ్చిత్త ప్రసాదకః,**
**సర్వ కామాప్తి హేతుశ్చ సాంగః ప్రోక్తః సమాసతః.**
**రాగాద్యాకులచిత్తానాం కుతోఽసంగాది సంభవః,**
**ఇతి కృష్ణార్చనం భద్ర మనుస్మృత్యాఽను పృచ్ఛతి.**

ఈ ఇరువది యేడవ అధ్యాయమందు, శీఘ్రమే మనస్సును ప్రశాంతపఱచునది సకలాభీష్టములు లభించుటకు మూలమైనది యగు యోగము సాంగముగ సంగ్రహ రూపముగ చెప్పబడినది.

రాగాదులచే మనో వ్యాకులతను పొందినవారు నిస్సంగు లెట్లగుదురు? అని అట్టి వారికై శుభమగు కృష్ణార్చనమును అనుస్మృతిగా ప్రశ్నోత్తరములలో తెలుపుచున్నారు

ఉద్ధవ ఉవాచ–ఉద్ధవుడు వచించెను.

శ్లో. **క్రియయోగం సమాచక్ష్వ భవదారాధనం ప్రభో,**
**యస్మాత్త్వాం యే యథాఽర్చంతి సాత్వతాః సాత్త్వతర్షభ!** 1

అ. ప్రభో! = ఓ ప్రభూ!, సాత్వతర్షభ = సాత్వతశ్రేష్ఠుడా! యస్మాత్ = ఎ కారణ, అధిష్ఠానముల వలన; త్వాం = నిన్ను. సాత్వతాః = భక్తులు; అర్చంతి = పూజింతురో; అట్టి; భవదారాధనం = నీ పూజారూపమగు; క్రియాయోగం = క్రియాయోగమును; సమాచక్ష్వ = చెప్పుము.

తా ఓ సాత్వత శ్రేష్ఠుడా! ఏ కారణాధిష్ఠానములతో భక్తులు నిన్ను సేవింతురో అట్టి భగవదారాధనరూపమగు క్రియయోగమును నాకు తెలుపుము.

శ్లో. **ఏత ద్వదంతి మునయో ముహు ర్నిఃశ్రేయసం నృణామ్,**
**నారదో భగవాన్ వ్యాస ఆచార్యోఽఙ్గిరసః సుతః.** 2

అ. నారదః; భగవాన్ వ్యాసః; ఆచార్యః అంగిరసః సుతః = అంగిరసుని తనయుడగు బృహస్పతి; అను నీ మునయః = మునులు; ఎతత్ = దీనిని; నృణాం = నరులకు; నిశ్శ్రేయసం = మోక్షప్రదమని; ముహుః = మాటిమాటికి; వదంతి = చెప్పుదురు.

తా నారద, వ్యాస, బృహస్పత్యాది మహానుభావులగు మునులందరును యీ క్రియాయోగమును నరులందఱకును మోక్షప్రదమని పలుమారు పలుకుదురు.

శ్లో. **నిస్సృతం తే ముఖాంభోజా ద్యదాహ భగవా నజః,**
**పుత్రేభ్యో భృగుముఖ్యేభ్యో దేవ్యై చ భగవాన్ భవః.** 3

అ. తే = నీ యొక్క; ముఖాంభోజాత్ = ముఖపద్మమునుండి; నిస్సృతం = వెలువడినట్టి; యత్ = ఏ క్రియాయోగమును; భగవాన్ అజః = భగవంతుడగు బ్రహ్మ; భృగుముఖ్యేభ్యః పుత్రేభ్యః = భృగువు మున్నగు కుమారుల కుపదేశించెను. భగవాన్ భవః = భగవంతుడగు శంకరుడును; దేవ్యై = పార్వతీ దేవి కుపదేశించెను.

తా. నీముఖకమలమునుండి వెలువడిన ఈ కర్మయోగము ను బ్రహ్మ తన పుత్రులు భృగువు మున్నగువారికిని, శివుడు పార్వతికిని ఉపదేశించిరి.

శ్లో. ఏతద్వై సర్వవర్ణానా మాశ్రమాణాం చ సంమతమ్,
శ్రేయసా ముత్తమం మన్యే స్త్రీశూద్రాణాం చ మానద **4**

అ. మానద — ఓ మానదుడా! ఏతత్ = ఈ భగవదారాధనము; సర్వవర్ణానాం = అన్నివర్ణముల వారికిని (త్రైవర్ణికులకు), ఆశ్రమాణాం చ = నాలుగాశ్రమముల వారికిని; సంమతమ్ = సంమతమైనది, స్త్రీశూద్రాణాం చ = స్త్రీలకును శూద్రులకు గూడ; శ్రేయసా ముత్తమం = పరమ శ్రేయస్కరముగా; మన్యే = తలంతును,

తా. ఈ నీ యారాధనము మూడు వర్ణముల వారికిని, అన్ని ఆశ్రమముల వారికిని, సమ్మతము. అంతేకాదు. స్త్రీలకు శూద్రులకును గూడ నిది పరమశ్రేయస్కరమని తలంతును.

శ్లో. ఏతత్ కమలపత్రాక్ష కర్మబంధ విమోచనమ్,
భక్తాయ చానురక్తాయ బ్రూహి విశ్వేశ్వరేశ్వర! **5**

అ. కమల పత్రాక్ష = తామర రేకులవంటి కన్నులు గలవాడా! విశ్వేశ్వర = విశ్వాధీశులకు కూడ ఈశ్వరుడా! కర్మబంధ విమోచనం = కర్మబంధములు తొలగించునట్టి ఏతత్ = దీనిని; భక్తాయ = భక్తుడను; అనురక్తాయ = అనురక్తుడను అగు నాకు; బ్రూహి = చెప్పుము.

తా. ఓ కమలనేత్రా! దేవా! కర్మబంధములు తొలగించునదగు దీనిని భక్తుడు అనురక్తుడనగు నా కుపదేశింపుము.

శ్రీభగవా నువాచ — భగవంతుడు వచించెను—

శ్లో న హ్యన్తోఽనన్తపారస్య కర్మకాండస్య చోద్ధవ,
సంక్షిప్తం వర్ణయిష్యామి యథావ దనుపూర్వశః. **6**

అ ఉద్ధవ = ఓ ఉద్ధవుడా! అనంతపారస్య = అంతులేని; కర్మకాండస్య = కర్మకాండకు; అంతః నహి = తుది యన్నది లేదు. కావున; యథావత్ = యథాతథముగను; అనుపూర్వశః = క్రమముగను; సంక్షిప్తం = సంగ్రహముగా, వర్ణయిష్యామి = వర్ణింతును.

తా. ఉద్ధవుడా! కర్మకాండ అనంతము. దానికి తుదియన్నది లేదు. దానిని సంక్షిప్తముగా, క్రమానుగతముగా యథాతథముగ నీ కుపదేశింతును.

శ్లో వైదిక స్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః,
త్రయాణా మీప్సితే నైవ విధినా మాం సమర్చయేత్. **7**

అ వైదికః, తాంత్రికః, మిశ్రః ఇతి = వైదికము, తాంత్రికము మిశ్రము అని; మే = నా

యొక్క, మఖః = పూజ; త్రివిధః = మూడు విధములైనది. త్రయాణాం = ఈ మూడు పద్ధతులలో; ఈప్సితేన ఏవ విధినా = తమ కభీష్టమగు విధానముతో; మాం = నన్ను; సమర్చయేత్ = పూజింపవలెను

తా. నాపూజ వైదికము (వైదిక మంత్రము, వైదికాంగములు గల పురుషసూక్తాదిక ముతో పూజ) తాంత్రికము (పాంచరాత్రాది ఆగమమార్గమున పూజ) మిశ్రము (వైదక తాంత్రి కముల సమన్వయముతో నేర్పరచిన పూజ) అని మూడు విధములు. ఇందు తమ కిష్టమగు పద్ధతి ద్వారా నన్ను పూజించవచ్చును

**శ్లో. యదా స్వనిగమే నోక్తం ద్విజత్వం ప్రాప్య పూరుషః,**
**యథా యజేత మాం భక్త్యా శ్రద్ధయా తన్నిబోధ మే** 8

అ యదా = ఎపుడు; పురుషః = మనుజుడు; స్వనిగమేన = గర్భాష్టమ — ఏకాదశ ద్వాదశా బ్దాది కాలమందు) తన యధికారానుగుణముగ ప్రవర్తించు వేదముచే, ఉక్తం = చెప్పబడిన ద్విజత్వం ఉపనయన సంస్కారమును; ప్రాప్య = పొందినవాడై, యథా = ఎట్లు; మాం = నన్ను; భక్త్యా = భక్తి తోడను; శ్రద్ధయా = ఆసక్తితోడను; యజేత = పూజించునో; తత్ = ఆవిధానమును మే = నావలన; నిబోధ = వినుము.

తా. మనుజుడు తన వేదశాఖ ననుసరించి ఏకాలమున ఉపనయన సంస్కారము పొందవలెనో ఆకాలమున నుపనీతుడై భక్తిశ్రద్ధలతో నన్నెట్లు పూజింపవలెనో ఆవిధానము నెఱింగించెదను వినుము.

**శ్లో. అర్చాయాం స్థండిలేఽగ్నౌ వా సూర్యే వాప్సు హృది ద్విజే,**
**ద్రవ్యేణ భక్తియుక్తోఽర్చేత్ స్వగురుం మా మమాయయా.** 9

అ అర్చాయాం = ప్రతిమయందుగాని స్థండిలే = చక్రాబ్జ మండలాదులందుగాని; అగ్నౌ వా = అగ్నియందుగాని; సూర్యే వా = సూర్యునియందుగాని; ద్విజే = బ్రాహ్మణునియందు గాని ద్రవ్యేణ = పూజాసాధనముతో స్వగురుం మాం = తన గురువగు నన్ను (ఇట్లుపలుకుచే గురుదేవతల కైక్యభావన) భక్తియుక్తః = భక్తితో కూడినవాడై; అమాయయా = నిష్కపట భావముతో (ఫలమందా సక్తి లేనివాడై) అర్చేత్ = పూజించవలెను.

తా. ప్రతిమ, చక్రాబ్జమండలము మున్నగునది, అగ్ని, సూర్యుడు, జలము, తన హృద యము, బ్రాహ్మణుడు వీనిలో నేదే నొకదానియందు పూజా సాధనములతో తన గురువగు నన్ను నిష్కపటభావముతో భక్తియుక్తుడై పూజించవలెను.

**శ్లో. పూర్వం స్నానం ప్రకుర్వీత ధౌతదంతోఽంగశుద్ధయే,**
**ఉభయై రపి చ స్నానం మంత్రై ర్మృద్గ్రహణాదినా.** 10

అ ధౌతదంతః = పండ్లుతోముకొనినవాడై; అంగశుద్ధయే = అవయవముల పరిశుద్ధత కొఱకు, పూర్వం = మొదట; స్నానం ప్రకుర్వీత = స్నానము చేయవలయును. మృద్గ్రహణాదినా = బంక మట్టి గోమయము మున్నగు వాని నొడలికి పూసికొని; ఉభయైః మంత్రైః = వైదిక తాంత్రిక మంత్రము లతో; స్నానం ప్రకుర్వీత = స్నానము చేయవలయును.

తా. తొలుత పలు దోమి, అవయవ శుద్ధికై స్నానమాచరింపవలయును. ఆ స్నానమును,

ము[illegible] పూజింపవలెను[illegible] అప్పైన వైదిక, తాంత్రిక [illegible] పూజింపవలెను.

శ్లో॥ సంధ్యోపాస్త్యాది కర్మాణి వేదేనాఽఽచోదితాని మే,
పూజాం తైః కల్పయేత్ సమ్యక్సంకల్పః కర్మ పావనీమ్. **11**

అ. వేదేన=వేదముచే; ఆచోదితాని=[illegible] విహితములైన; సంధ్యోపాస్త్యాది కర్మాణి=సంధ్యోపాసన మున్నగు [illegible] కార్యములు [illegible]; తైః=వానిచే; సమ్యక్సంకల్పః= వరమేశ్వ[illegible] విషయమగు [illegible] కర్మపావనీం=[illegible] పుట్టినట్టి; మే పూజాం=నా పూజను; కల్పయేత్=[illegible]

తా. వేదవిహితములగు సంధ్యోపాసనాది నిత్యకర్మల ([illegible]) నాచరించి, [illegible] పూజ నాచరింపవలెను.

శ్లో॥ శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ,
మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధా స్మృతా. **12**

అ. ప్రతిమా–[illegible] ప్రతిమ; శైలీ=శిలానిర్మితము, దారుమయీ=కొయ్యతో చేసినది; లౌహీ =[illegible] లేప్యా=మట్టి; చందనము [illegible] వానితో చేసినది; లేఖ్యా=పత్రాదికముపై [illegible]; సైకతీ=ఇసుక తో నిర్మితమైనది; మనోమయీ=మణినిర్మితము; అని యిట్లు, అష్టవిధా= [illegible] స్మృతా=[illegible] చెప్పబడినది.

తా. ప్రతిమ శిలామయము, లోహమయము, మృణ్మయము లేదా చందనాదిమయము, లేఖ్యము, సైకతమయము, మానసపూజ చేయుచో మనోరూపము, మణిమయము అని ఎనిమిది విధములు.

శ్లో॥ చలాచలేతి ద్వివిధా ప్రతిష్ఠా జీవమందిరమ్,
ఉద్వాసావాహనే న స్తః స్థిరాయా ముద్ధవార్చనే. **13**

అ. ఉద్ధవ=ఓ ఉద్ధవుడా ! అ ప్రతిమ, చలా అచలా ఇతి ద్వివిధా=చల అచల అని రెండు విధములు. ప్రతిష్ఠా=కళాన్యాసాదికముచే, జీవమందిరం=భగవంతుని ఆలయము సంపన్నమగును. స్థిరాయాం=అచల రూపమగు ప్రతిమయందు; అర్చనే=ఆరాధన చేయుచో; ఉద్వాసావాహనే=విసర్జనము–ఆవాహనము [illegible] న స్తః=ఉండవు

తా. ఉద్ధవా! ఆప్రతిమ చలము. స్థిర మని ద్వివిధము. అట్టి ప్రతిమను కళాన్యాసాదులచే ప్రతిష్ఠింపగా నది దేవాలయ మగును. స్థిరమగు ప్రతిమ కర్చన చేయుచో ఆవాహన విసర్జనము లతో పని లేదు.

శ్లో॥ అస్థిరాయాం వికల్పః స్యాత్ స్థండిలే తు భవే ద్ద్వయమ్,
స్నపనం త్వవిలేప్యాయా మన్యత్ర పరిమార్జనమ్. **14**

అ. అస్థిరాయాం=చర ప్రతిమ యగుచో; వికల్పః స్యాత్=ఆవాహన విసర్జనము లొక్కచో చేయ బడవచ్చును. ఒక్కచో చేయబడకున్నను దోషము లేదు. స్థండిలే తు=వేదికపైన; ద్వయం భవేత్= ఆవాహన విసర్జనములు రెండును ఉండును అవిలేప్యాయాం=మృణ్మయ లేఖ్యములు విడచి తక్కిన

చోట్ల: స్నపనం = స్నపనము చేయదగును; అన్యత్ర = లేప్యాలేఖ్యాసైకత ప్రతిమలకు; పరిమార్జనమ్ = పరిమార్జన మాత్రమే.

తా. చరప్రతిమ కావాహన విసర్జనములు చేయవచ్చును. వేదికపై ఆవాహన విసర్జనములు రెండును కర్తవ్యములే యగును. మృణ్మయ లేఖ్యములు విడచి తక్కినచోట్ల స్నపనము చేయవలయును లేప్యాలేఖ్యా సైకత ప్రతిమలకు పరిమార్జన వఱకు మాత్రమే కర్తవ్యము.

**శ్లో. ద్రవ్యైః ప్రసిద్ధై ర్మద్యాగః ప్రతిమాదిష్వమాయినః,**
**భక్తస్య చ యథాలబ్ధై ర్హృది భావేన చైవ హి. 15**

అ. అమాయినః = నిష్కామునకు; ప్రతిమాదిషు = ప్రతిమ మున్నగు వానియందు; ప్రసిద్ధైః ద్రవ్యైః = ప్రశస్తములగు ద్రవ్యములతో; మద్యాగః = నా పూజ విహితము; భక్తస్య = భక్తునకు; యథాలబ్ధైః = లభించిన ద్రవ్యములతోడను; అట్లు చందనాది ద్రవ్యము సర్వథా లభించనిచో; హృది భావేన = హృదయముననే నా యాగము చేయుచున్నట్లు భావనచేసియు; (మనోమయ ద్రవ్యములతో నని యర్థము) పూజ చేయవలెను.

తా. నిష్కాముడు ప్రతిమాదులందు ప్రశస్త ద్రవ్యములతో నాపూజ చేయవలెను. భక్తుడు తనకు లభించిన ద్రవ్యములతోడనే ఆ పూజ చేయవలయును. అట్లు చందనాది ద్రవ్యములు లభించనిచో తన మనస్సులోనే ఆయాగము చేయుచున్నట్లు భావనచేసి మనోమయ ద్రవ్యములతో పూజ చేయవలెను.

అవ. అధిష్ఠాన భేదముచే ప్రధానోపచారమును వచించుచున్నారు—

**శ్లో. స్నానాలంకరణం ప్రేష్ఠ మర్చాయామేవ తూద్ధవ,**
**స్థండిలే తత్త్వవిన్యాసో వహ్నా వాజ్యప్లుతం హవిః 16**

అ. ఉద్ధవ! స్నానాలంకరణం = స్నానము, అలంకరణము; అర్చాయామేవ = ప్రతిమయందే; ప్రేష్ఠం = నాకు ప్రియతమమైనది; స్థండిలే = మండలాదులయందు; తత్త్వవిన్యాసః = యథాస్థానముగ అంగ ప్రధానదేవతలను ఆయా మంత్రములలో స్థాపించుటయు; వహ్నౌ = అగ్నియందు; ఆజ్యప్లుతః = నేతితో తడుపబడిన; హవిః = హవిర్ద్రవ్యమును (నాకు ప్రియతమము).

తా. ఉద్ధవుడా! ప్రతిమయందు స్నానము అలంకరణము తప్పక చేయుట నాకభిమతము. వేదికయందు ఆయా మంత్రములతో ఆయా స్థానములందు అంగప్రధాన దేవతలను స్థాపించుట అగ్నిహోత్రమందు ఆజ్యమిశ్రితమగు హవిస్సును విడచుటయు నాకు ప్రియము.

**శ్లో. సూర్యే చాభ్యర్హణం ప్రేష్ఠం సలిలే సలిలాదిభిః,**
**శ్రద్ధయోపాహృతం ప్రేష్ఠం భక్తేన మమ వార్యపి. 17**

అ. సూర్యే = సూర్యరూపియగు ప్రతిమయందు; అభ్యర్హణం = ఉపస్థానముతో పూజించుట (స్తోత్రములతో నారాధించుట) ప్రేష్ఠం = అభిమతము; సలిలే = జలమందు; సలిలాదిభిః = నీరు, చందనము, పుష్పములు, అక్షతలు మున్నగువానిచే పూజ అభీష్టము; మమ భక్తేన = నా భక్తునిచే; శ్రద్ధయా = శ్రద్ధతో; ఉపాహృతం = తేబడిన; వార్యపి = జలముకూడ; మమ = నాకు; ప్రేష్ఠం = ఇష్టమైనది.

తా. సూర్యుని ఉపస్థానముచే పూజించుట, జలమందు సలిలాదులచే నర్చించుట నా కభిమతము. నాభక్తుడు శ్రద్ధతో తెచ్చిన జలము కూడ నాకు పరమప్రియము.

శ్లో. భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే,
గంధో ధూపః సుమనసో దీపోఽన్నాద్యం చ కిం పునః. 18

అ. అభక్తేన ఉపహృతం = భక్తుడు కానివాడు తెచ్చిన; భూరి అపి = అత్యధికమగు; దయ్యును గంధః ధూపః; సుమనసః = పుష్పములు; అన్నాద్యం = అన్నము మున్నగు నైవేద్యమును మే = నాకు; తోషాయ = సంతుష్టికి; న కల్పతే = కలిగింపదు, కిం పునః = తక్కినది వేఱుగా చెప్పవలెనా !

తా. నాకు భక్తుడు కానివాడు అత్యధికముగ గంధము ధూపము పుష్పములు అన్నాది నైవేద్యములు విశేషముగ సమర్పించినను అవి నాకెంతమాత్రమును తృప్తిని కలిగింపదు. ఇంక తక్కిన ద్రవ్యముల విషయము వేఱుగా చెప్పవలెనా !

శ్లో. శుచిః సంభృతసంభారః ప్రాగ్దర్భైః కల్పితాసనః,
ఆసీనః ప్రాగుదగ్వాఽర్చే దర్చాయా మథ సంముఖః. 19

అ. శుచిః = పరిశుద్ధుడును; సంభృత సంభారః = పూజాద్రవ్యములు సమకూర్చుకొనినవాడైన ప్రాగ్దర్భైః = తూర్పునకు కొనలున్న దర్భ తో, కల్పితాసనః = చేయబడిన పీఠము కలవాడై; ప్రాక్ = తూర్పుగా; ఉదగ్వా = లేక ఉత్తరముగా, ఆసీనః = ఎదురుగా కూర్చుండి; అర్చేత్ = పూజింపవలెను

తా. పరిశుద్ధుడై పూజాద్రవ్యములు పూర్వమే సేకరించుకొని ప్రాగగ్రములగు దర్భలతో కూడిన ఆసనముపై ప్రాఙ్ముఖుడు లేక ఉత్తరాభిముఖుడై కూర్చుండినవాడై ప్రతిమను పూజించుచో తదభిముఖుడై నన్ను పూజించవలెను.

శ్లో. కృతన్యాసః కృతన్యాసాం మదర్చాం పాణినా మృజేత్,
కలశం ప్రోక్షణీయం చ యథావ దుపసాధయేత్. 20

అ. కృతన్యాసః = పిమ్మట గుర్వాదులకు నమస్కారము చేసి; యథోపదేశముగ తన యందు మూలమంత్రన్యాస మొనర్చి; కృతన్యాసాం = ఆ మూలమంత్రన్యాసమే చేయబడిన; మదర్చాం = నా అర్చాప్రతిమను; పాణినా = చేతిలో, మృజేత్ = నిర్మాల్యాదులను తొలగించి శోధింపవలెను కలశం = పూర్ణకుంభమును; ప్రోక్షణీయం చ – ప్రోక్షణార్థమగు ఉదకపాత్రను; యథావత్ = యథాప్రకారముగ; ఉపసాధయేత్ = యథాప్రకారముగ. ఉపసాధయేత్ = సంస్కరించవలెను

తా. పిమ్మట గుర్వాదులకు ప్రణమిల్లి పనకు గురువు లుపదేశించిన విధముగ తనయందు మూలమంత్రన్యాసము చేసికొని, ఆమూలమంత్రముచేతనే న్యాసము చేయబడిన చేతితో నిర్మాల్యాదులను తొలగించి అర్చాప్రతిమను మార్జనము చేయవలెను పూర్ణకుంభమును ప్రోక్షణ పాత్రను చందన పుష్పాదులతో సంస్కరించవలెను.

శ్లో తదద్భి ర్దేవయజనం ద్రవ్యాణ్యాత్మాన మేవ చ,
ప్రోక్ష్య పాత్రాణి త్రీణ్యద్భి స్తై స్తై ర్ద్రవ్యైశ్చ సాధయేత్ 21

అ. ఉదకైః = కలశోదకములతో, దేవయజనం = యాగభూమిని; ద్రవ్యాణి = సాధనములను; ఆత్మానం = తన దేహమును; త్రీణి పాత్రాణి = పాద్యాదిపాత్రలు మూడింటిని; ప్రోక్ష్య = ప్రోక్షణము చేసి, అద్భిః = కలశోదకములతో; తైః తైః ద్రవ్యైశ్చ - ఆ యా ద్రవ్యములతోడను; సాధయేత్ = నింపవలెను. అందు పాద్యాదుల ద్రవ్యము లెట్టివనగా—

పాద్యే శ్యామాక దూర్వాబ్జ విష్ణుక్రాంతాది రిష్యతే,
గంధ పుష్పాక్షత యవ కుశాగ్ర తిల సర్షపాః.
దూర్వా చేతి క్రమా దర్ఘ ద్రవ్యాష్టక ముదీరితమ్.
జాతీలవంగకంకోలై ర్మత మాచనీయకమ్.

శ్యామాకము, దూర్వ (గరిక) అబ్జము (పద్మము) విష్ణుక్రాంతము మున్నగునవి పాద్యద్రవ్యములు. గంధము; పుష్పము, అవాలు. దూర్వ అను నీ యెనిమిదియు అర్ఘ్యద్రవ్యములు. జాజికాయ, లవంగము కంకోలములు ఆచమనీయ ద్రవ్యములు.

తా. ఆ కలశోదకములతో యాగభూమిని, యాగ ద్రవ్యములను తన శరీరమును, అర్ఘ్య పాద్యాచమనీయ పాత్రలను ప్రోక్షించి, ఆ యా కలశోదకములతోడను, ఆ యా ద్రవ్యముల తోడను వానిని పూరింపవలెను.

**శ్లో. పాద్యార్ఘ్యాచమనీయార్థం త్రీణి పాత్రాణి దేశికః,**
**హృదా శీర్ష్ణాథ శిఖయా గాయత్ర్యా చాభిమంత్రయేత్. 22**

అ. దేశికః = ఆచార్యుడు; పాద్య - అర్ఘ్య - ఆచమనీయార్థం = పాద్యము అర్ఘ్యము ఆచమనీయముల కొఱకై; త్రీణి పాత్రాణి = మూడు పాత్రలను, క్రమముగా; హృదా = హృదయ మంత్రము చేతను, శీర్ష్ణా = శిరోమంత్రము చేతను; శిఖయా = శిఖా మంత్రము చేతను; గాయత్ర్యా చ = అన్ని పాత్రలను గాయత్రీ మంత్రము చేతను; అభిమంత్రయేత్ = అభిమంత్రింపవలెను.

తా. ఆచార్యుడు పాద్యపాత్రను హృదయమంత్రముతోను, అర్ఘ్యపాత్రను శిరోమంత్రముతోను, ఆచమనీయపాత్రను శిఖామంత్రముతోను తిరిగి మూడు పాత్రలను గాయత్రీమంత్రముచేతను అభిమంత్రింపవలెను.

**శ్లో. పిండే వాయ్వగ్నిసంశుద్ధే హృత్పద్మస్థాం పరాం మమ,**
**అణ్వీం జీవకలాం ధ్యాయే న్నాదాంతే సిద్ధభావితామ్. 23**

అ. అనంతరము, పిండే = దేహము; వాయ్వగ్ని సంశుద్ధే = కోష్ఠగతమైన వాయువుచే శోషితమును ఆధారగతమగు అగ్నిచే తగులబెట్టబడినదియు, తిరిగి లలాటమందలి చంద్రమండలామృత ప్లావనముచే అమృతమయ మయినదికాగా, దానియందు, హృత్పద్మస్థాం = హృదయ కమలమందున్న, పరాం = శ్రేష్ఠమైన అణ్వీం = సూక్ష్మమైనది; నాదాంతే = ప్రణవము యొక్క అకార, ఉకార, మకార బిందు నాదములు ఐదంశములు ఆ నాదాంతమందు, సిద్ధ భావితాం = సిద్ధులచే ధ్యానించబడినది, శ్రుతియు ఇట్లు చెప్పుచున్నది—

"యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః."

జీవకలాం = శ్రీనారాయణమూర్తిని; ధ్యాయేత్ = ధ్యానించవలెను.

అవ. ఇటుపై ఆయుధాదిపూజను తెలుపుచున్నారు—

శ్లో. సుదర్శనం పాంచజన్యం గదా సీషు ధనుర్హలాన్,
ముసలం కౌస్తుభం మాలాం శ్రీవత్సం చానుపూజయేత్. 27

అ. సుగమము.

తా. ఆటుపైన సుదర్శన పాంచజన్య కౌమోదకీ నందక, బాణ శార్ఙ్గ హల ముసలము లను ఎనిమిది ఆయుధములను అష్టదిక్కులయందును కౌస్తుభ వనమాలా శ్రీవత్సములను

శ్లో. నందం సునందం గరుడం ప్రచండం చండమేవ చ,
మహాబలం బలం చైవ కుముదం కుముదేక్షణమ్. 28

శ్లో. దుర్గాం వినాయకం వ్యాసం విష్వక్సేనం గురూన్ సురాన్,
స్వే స్వే స్థానే త్వభిముఖాన్ పూజయేత్ ప్రోక్షణాదిభిః. 29

అ. నందాదులను, గురూన్=గురువులను; సురాన్=దేవతలను, స్వే స్వే స్థానే=వారి వారి స్థానములందు; అభిముఖాన్=నా కభిముఖముగా; ప్రోక్షణాదిభిః=ప్రోక్షణము మున్నగువానిచే; పూజ యేత్=పూజింపవలెను.

తా. నందుడు సునందుడు ప్రచండుడు చండుడు మహాబలుడు బలుడు కుముదుడు కుముదేక్షణుడు అను భగవత్పార్షదులను అష్టదిక్కులందును, గరుడుని నాయెదుటను, దుర్గను, వినాయకుని వ్యాసుని, విష్వక్సేనుని కోణములందును, గురువులను వామ ప్రదేశమందును, ఇంద్రాది లోకపాలురను వారివారి దిక్కులందును ఇట్లు వీరిని నాకు (భగవంతున)కభిముఖముగా అర్ఘ్యాదులచే పూజింపవలెను.

శ్లో. చందనోశీర కర్పూర కుంకుమాగురు వాసితైః,
సలిలైః స్నాపయే న్మంత్రై ర్నిత్యదా విభవే సతి. 30

అ. విభవే సతి=ధనము తగినంతగా ఉన్నచో; నిత్యదా=ప్రతిదినము; చందన...వాసితైః =చందనము; వట్టి వేరు; కర్పూరము; కుంకుమపూవు; అగురువులతో పరిమళించు జలములతో; మంత్రైః=మంత్ర సహితముగ; స్నాపయేత్=స్నపనము చేయవలయును.

తా. చాలినంత ధనమున్నచో చందనము, వట్టివేరు, కర్పూరము, కుంకుమపూవు, అగురువు మున్నగు పరిమళద్రవ్యములు కలిపిన జలములతో నిత్యము స్నపన మొనరించ వలెను.

శ్లో. స్వర్ణ ఘర్మానువాకేన మహాపురుషవిద్యయా,
పౌరుషేణాపి సూక్తేన సామభీరాజనాదిభిః 31

శ్లో. వస్త్రోపవీతాభరణ పత్ర స్రగ్గంధలేపనైః,
అలంకుర్వీత సప్రేమ మద్భక్తో మాం యథోచితమ్. 32

అ. స్వర్ణఘర్మానువాకేన = "సువర్ణం ఘర్మం పరివేద వేన" మిత్యాది స్వర్ణ ఘర్మానువాకము చేతను; మహాపురుషవిద్యయా "= జితం తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన: సుబ్రహ్మణ్య నమస్తేఽస్తు మహాపురుష పూర్వజ" అను మహాపురుష విద్యచేతను; పౌరుషేణ సూక్తేన = "సహస్రశీర్షా" ఇత్యాది పురుష సూక్తము చేతను; సామ = ఇంద్ర నరో మేమధితా హవన్తే" అను నీ ఋక్కునందు గానము చేయబడిన సామలతో; నీరాజన = నీరాజనముతో; ఆదిభిః = రౌహిణాదులతోను; వస్త్ర ..లేపనైః = వస్త్రములు, యజ్ఞోపవీతము, ఆభరణములు; కపోలములు, వక్షఃస్థలము మున్నగు ప్రదేశములందు రచింపబడు పత్రభంగులు. మాలలు, చందనములు; అగరువు మున్నగు వానితో; మద్భక్తః = నా భక్తుడగువాడు; సప్రేమ = ప్రేమతో కూడినవాడై; యథోచితం = తగురీతిగా; మాం = నన్ను; అలంకుర్వీత = అలంకరించవలెను.

తా. స్వర్ణఘర్మానువాకము, మహాపురుషవిద్య, పురుషసూక్తముల తోడను, సామల తోడను, నీరాజనాదులతోడను, వస్త్ర, యజ్ఞోపవీత, ఆభరణ, పత్రభంగ, చందనాదులతోడను, నా భక్తుడు ప్రేమతో నన్ను తగువిధముగ నలంకరించవలెను.

**శ్లో. పాద్య మాచమనీయం చ గంధం సుమనసోఽక్షతాన్,**
**ధూప దీపోపహార్యాణి దద్యా న్మే శ్రద్ధయాఽర్చకః.**

అ. అర్చకః = పూజకుడు మే = నాకు; పాద్యం; ఆచమనీయం, గంధం; సుమనసః = పుష్పములను; అక్షతాన్; ధూపదీప ఉపహార్యాణి = ధూపము; దీపము, నైవేద్యములను; శ్రద్ధయా = శ్రద్ధతో, దద్యాత్ = సమర్పించవలెను.

తా. అర్చకుడు నాకు పాద్య, ఆచమనీయ, గంధ, పుష్ప, అక్షత, ధూప, దీప, నైవేద్యములను శ్రద్ధతో సమర్పించవలెను.

**శ్లో. గుడ పాయస సర్పీంషి శష్కుల్యాపూప మోదకాన్.**
**సంయావ దధి సూపాంశ్చ నైవేద్యం సతి కల్పయేత్. 34**

అ. సతి = విభవ మున్నచో: గుడ పాయస సర్పీంషి = బెల్లము, పాయసము, నేయి; శష్కుల్యా ...మోదకాన్ = చక్కిలములు, పిండివంటలు, లడ్డులు; సంయావ.. సూపాంశ్చ = పిండి, పెరుగు, పప్పులను; నైవేద్యం కల్పయేత్ = నైవేద్య మీయవలెను.

తా. సంపన్ను డగుచో బెల్లము, పాయసము, నేయి, జంతికెలు, పిండివంటలు, లడ్డు, పిండి, పెరుగు, పప్పులను నైవేద్య మిడవలెను.

**శ్లో. అభ్యంగోన్మర్దనాదర్శ దంతధావాభిషేచనమ్,**
**అన్నాద్య గీతనృత్యాది పర్వణి స్యు రుతాన్వహమ్. 35**

అ. అభ్యంగ.. షేచనం – అభ్యంగ తైలస్నానము; ఉన్మర్దన = ఒడలు నలుచుట; ఆదర్శ = అద్దముచూపుట; దంతధావ = పండ్లు తోముట; అభిషేచనం = తలస్నానము; అన్నాద్య = అన్నాది భోగము: గీత = గానము; నృత్యాది = నృత్యము మున్నగునవి, పర్వణి = పండుగ సమయములందు, ఉత = లేదా; అన్వహం = నిత్యముగాని; స్యుః = ఉండవలయును.

తా. స్వామికి అభ్యంగము, ఒడలు నలుచుట, పండ్లు తోముట, స్నానము చేయించుట, అన్నాది భోగము, గానము, నృత్యము యివి పర్వసమయములందుగాని, నిత్యము గాని చేయనగును.

శ్లో॥ విధినా విహితే కుండే మేఖలాగర్తవేదిభిః,
అగ్నిమాధాయ పరితః సమూహేత్ పాణినోదితమ్. **36**

అ. విధినా = స్వగృహ్యోక్త ప్రకారముగా; మేఖలా గర్త వేదభిః = మేఖల, గర్తము, వేదికలతో; విహితే = నిర్మింపబడిన; కుండే = హోమకుండమందు; అగ్నిమాధాయ = అగ్ని నుంచి; ఉదితం = ప్రజ్వలించిన అగ్నిని: పరితః = చుట్టును; పాణినా = చేతితో, సమూహేత్ = ఒక్కచోటికి చేర్చవలెను.

తా. తన గృహ్యోక్త ప్రకారముగా మేఖలా, గర్త, వేదికలతో కుండము నిర్మించి అందగ్నిని ప్రతిష్ఠించి. దానిని ప్రజ్వలింపజేసి, అట్లు ప్రజ్వలించిన అగ్నిని తనచేతితో నొక్క చోటికి చేర్చవలెను.

శ్లో. పరిస్తీర్యాథ పర్యుక్షే దన్వాధాయ యథావిధి,
ప్రోక్షణ్యాసాద్య ద్రవ్యాణి ప్రోక్ష్యాగ్నౌ భావయేత మామ్. **37**

అ పరిస్తీర్య = దర్భలతో పరిస్తరణము చేసి; యథావిధి = శాస్త్రోక్తముగా; అన్వాధాయ = వ్యాహృతులతో అన్వాధానమను పేరుగల సమిధలను వేయు కార్యమును సంకల్పించి; ప్రోక్షణ్యాం = ప్రోక్షణ పాత్రోదకముతో, ద్రవ్యాణి = ఆజ్యపాత్ర మున్నగు వానిని; ఆసాద్య = ఆసాదనము చేసి; ప్రోక్ష్య = చల్లి; అగ్నౌ = అగ్నియందు; మాం = నన్ను; భావయేత = భావించవలెను.

తా. దర్భలతో పరిస్తరణము చేసి, యథావిధిగా వ్యాహృతులతో అన్వాధానము చేసి ప్రోక్షణపాత్రోదకముతో ఆజ్యపాత్ర మున్నగువానిని ప్రోక్షించి, అగ్నియందు నన్ను భావించవలెను

శ్లో॥ తప్తజాంబూనదప్రఖ్యం శంఖచక్రగదాంబుజైః,
లసచ్చతుర్భుజం శాంతం పద్మకింజల్కవాససమ్. **38**

శ్లో. స్ఫురత్కిరీట కటక కటిసూత్ర వరాంగదమ్,
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభం వనమాలినమ్. **39**

అ తప్తజాంబూనదప్రఖ్యం = మేలిమి బంగారమువలె ప్రకాశించువాడును; శంఖ చక్రగదాంబుజైః = శంఖ చక్ర, గదా, పద్మములతో; లసచ్చతుర్భుజం = ప్రకాశించు నాలుగు చేతులు కలవాడును; శాంతం = శాంతుడును, పద్మ కింజల్క వాససం = తామరస కింజల్కముల వర్ణము కల వస్త్రము ధరించినవాడును: స్ఫురత్...వరాంగదమ్ — స్ఫురత్ = ప్రకాశించు; కిరీట = కిరీటము; కటక = కంకణములు; కటిసూత్ర = మొలత్రాడు; వరాంగదం = శ్రేష్ఠములగు బాహుపురులు కలవాడును; శ్రీవత్సవక్షసం = శ్రీవత్సమను పుట్టుమచ్చ రొమ్ముపై కలవాడును: భ్రాజత్ కౌస్తుభం = ప్రకాశించు కౌస్తుభ మణి కలవాడును: వనమాలినం = వనమాల దాల్చినవాడును అగు నన్ను భావించవలెను.

తా. మేలిమి బంగారు వలె ప్రకాశించుచు, నాల్గు చేతులందును శంఖచక్రగదా పద్మములను ధరించి, శాంతుడై, పీతాంబరము దాల్చి, ప్రకాశించు కిరీటము కంకణములు మొలత్రా

డు బాహుపురులు ధరించినవాడును, శ్రీవత్సమను పుట్టుమచ్చతో నొప్పువాడును. కౌస్తుభ మణితో ప్రకాశించువాడును. వనమాల దాల్చినవాడును అగు నన్ను భావించవలెను.

శ్లో. ధ్యాయ న్నభ్యర్చ్య దారూణి హవిషాభిఘృతాని చ,
ప్రాస్యాజ్యభాగా వాఘారౌ దత్త్వా చాజ్యప్లుతం హవిః. **40**

అ. ధ్యాయన్ = పైన చెప్పబడినట్లు ధ్యానముచేయుచు; అభ్యర్చ్య = పూజించి; హవిషా = నేతితో, అభిఘృతాని = తడుపబడిన; దారూణి = ఎండు కట్టెలను; ప్రాస్య = అగ్నియందుంచి. ఆఘారౌ ఆజ్యభాగౌ = ఆఘారములు ఆజ్యభాగము లనబడు ఆజ్యాహుతులను; దత్త్వా = ఆహుతులొసంగి; అజ్యప్లుతం = నేతిలో నుంచబడిన; హవిః = దేవతోద్దేశ్యకమగు హవిస్సును; దత్త్వా = అగ్నియందుంచి,

తా. పూర్వోక్త రూపముతో భగవంతుడనగు నన్ను ధ్యానించి, పూజించి, ఎండు కట్టెలను నేతితో తడిపి అగ్నియందు ఆహుతులుగా సమర్పించి, ఆఘారములు, ఆజ్యభాగము లనబడు ఆజ్యాహుతులను సమర్పించి...

శ్లో. జుహుయా న్మూలమంత్రేణ షోడశర్చావదానతః,
ధర్మాదిభ్యో యథాన్యాయం మంత్రైః స్విష్టకృతం బుధః **41**

అ. మూలమంత్రేణ = అష్టాక్షరమంత్రముతోడను; షోడశర్చా = పురుషసూక్తముతోడను; అవదానతః = ప్రతి ఋక్కునకు ఆహుతిని గ్రహించుచు, పురుష సూక్తముతో నారాధించుచో (అదియే మూలమంత్రము, దానితోనే ప్రతి ఋక్కునకు అవదానముతో హోమము; ఇట్లు,) మంత్రైః = 'స్వాహా' కారముతో ముగియు నామమంత్రములలో. యథాన్యాయం = పూజాక్రమముననే; అగ్నికి. స్విష్టకృతం = స్విష్టకృతమను పేరుగల హోమమును: బుధః = అర్చకుడు; జుహుయాత్ = చేయవలెను.

తా. అష్టాక్షర మంత్రముతోను. పురుషసూక్తముతోను ప్రతిఋక్కునకు ఆహుతిని గ్రహించుచు పూజాక్రమము ననుసరించియే, మంత్రములతో నర్చకుడు స్విష్టకృత మను పేరుగల హోమము చేయవలయును

శ్లో. అభ్యర్చ్యాథ నమస్కృత్య పార్షదేభ్యో బలిం హరేత్,
మూలమంత్రం జపే ద్బ్రహ్మ స్మర న్నారాయణాత్మకమ్. **42**

అ. అథ = పిమ్మట; అభ్యర్చ్య = అగ్నియందున్నట్టి అంతర్యామియగు భగవంతు నర్చించి, నమస్కృత్య = ప్రణమిల్లి; పార్షదేభ్యః = నందాది పార్షదులకు; ఎనిమిది దిక్కులందును; బలిం హరేత్ = పూజ చేయవలెను పిమ్మట; పూజాస్థానమునకు వచ్చి; నారాయణాత్మకం = నారాయణ స్వరూపియగు; బ్రహ్మ = పరబ్రహ్మను; స్మరన్ = స్మరించుచు; మూలమంత్రం = మూలమంత్రమును; జపేత్ = జపించవలెను.

తా. అటుపైన అగ్నియందు అంతర్యామియైయున్న భగవంతు నర్చించి, ప్రణామ మొనర్చి, నందాది పార్షదులను పూజించి నారాయణరూపియగు పరమాత్ముని స్మరించుచు, మూలమంత్రజపము చేయవలెను.

శ్లో. దత్త్వాఽఽచమన ముచ్ఛేషం విష్వక్సేనాయ కల్పయేత్,
ముఖవాసం సురభిమ త్తాంబూలాద్య మథార్హయేత్. **43**

అ. విష్వక్సేనాయ=విష్వక్సేనునకు; ఆచమనం దత్త్వా=ఆచమన మొసంగి, ఉచ్ఛేషం=భగవన్నివేదితమును; కల్పయేత్=సమర్పించవలెను. పిమ్మట తదనుమతితో తాను భుజించవలెను. పిమ్మట; సురభిమత్=పరిమళించు కర్పూరాదులతో కూడిన; తాంబూలాద్యం=తాంబూలము మున్నగు, ముఖవాసం=ముఖవాసమును సమర్పించవలెను. అథ అర్హయేత్=తిరిగి పుష్పాంజలితో పూజించవలెను.

తా. పిమ్మట భగవంతుడు భుజించుట పూర్తియైనట్లుగా భావించుకొని, ఆసన మొసంగి, ఉచ్ఛేషమును విష్వక్సేనుల కొసంగి, ఆయన యనుజ్ఞతో పిమ్మట దానిని తాను భుజించవలెను. ఆ పైన, పరిమళించు తాంబూలాదికము నొసంగి, మరల పుష్పాంజలితో పూజించవలెను.

**శ్లో. ఉపగాయన్ గృణ న్నృత్యన్ కర్మా ణ్యభినయన్ మమ,**
**మత్కథాః శ్రావయన్ శృణ్వన్ ముహూర్తం క్షణికో భవేత్. 44**

అ. ఉపగాయన్=పాడుచు; గృణన్=కీర్తించుచు, నృత్యన్=నృత్యము చేయుచు మమ=నాయొక్క; కర్మాణి=చరితములను; అభినయన్=వినుచు, ముహూర్తం క్షణికో భవేత్=ముహూర్తకాలము గూడ తదేకనిష్ఠగలవాడై క్షణమువలె గడుపవలెను.

తా. నన్నే కీర్తించుచు, నాగాథలనే గాన మొనర్చుచు, నా కర్మల నభినయించుచు, నా కథలు వినిపించుచు, వినుచు తన్మయత్వముతో ముహూర్తకాలమును క్షణమునువలె గడుపవలెను.

**శ్లో. స్తవై రుచ్చావచైః స్తోత్రైః పౌరాణైః ప్రాకృతై రపి,**
**స్తుత్వా ప్రసీద భగవ న్నితి వందేత దండవత్.**

అ. స్తవైః=స్తుతులతోడను; ఉచ్చావచైః=పెద్దవి చిన్నవియగు; స్తోత్రైః=స్తోత్రములతోడను, పౌరాణైః=పురాణ కథలతోడను, ప్రాకృతైరపి=ప్రాకృత గాథలతోడను: స్తుత్వా=స్తుతించి; భగవన్=ఓ భగవంతుడా! ప్రసీద=ప్రసన్నుడవు కమ్ము; ఇతి=అని; దండవత్=కట్టెవలె; వందేత=నేలపై బడి ప్రణమిల్లవలెను.

తా. వేదోక్త పురాణోక్తములగు నానావిధస్తోత్రములతో స్తోత్రముచేసి "ఓ భగవంతుడా! ప్రసన్నుడవు కమ్ము" అని దండవత్ప్రణామము చేయవలెను.

అవ. ఎట్లు ప్రణామము చేయవలె ననగా చెప్పుచున్నారు—

**శ్లో. శిరో మత్పాదయోః కృత్వా బాహుభ్యాం చ పరస్పరమ్,**
**ప్రపన్నం పాహి మా మీశ భీతం మృత్యుగ్రహార్ణవాత్. 46**

అ. శిరః=తలను; మత్పాదయోః=నా పాదములకడ; కృత్వా=మోకరించి; పరస్పరం=ఒండొక; బాహుభ్యాం=హస్తములతో (కుడి చేతితో కుడి పాదమును; ఎడమ చేతితో ఎడమ పాదమును స్పృశించి; ఈశ=ఓ భగవంతుడా! ప్రపన్నం=నీకు ప్రపన్నుడను; మృత్యుగ్రహార్ణవాత్=మృత్యువు, పిశాచము, మున్నగు వానివలన; భీతం=భయపడిన వాడనగు; మాం=నన్ను, పాహి=కాపాడుము.

తా. నా పాదముల చెంత శిరము వంచి ప్రణామము చేసి "ప్రభూ! నేను ప్రపన్నుడను. మృత్యువను పిశాచము నన్ను భయపెట్టుచున్నది. ఈ సంసార సాగరమునుండి నన్ను కాపాడుము"

**శ్లో. ఇతి శేషాం మయాదత్తాం శిరస్యాధాయ సాదరమ్,**
**ఉద్వాసయే చ్చే దుద్వాస్యం జ్యోతి ర్జ్యోతిషి తత్పునః.**

అ ఇతి = ఈ ప్రకారముగ ప్రార్థించి; శేషాం = నిర్మాల్యమును; మయా దత్తాం = నాచేత నీయ బడినట్లు భావించి( సాదరం = ఆదరముతో, శిరసి ఆధాయ = శిరముపై దాల్చి, ఉద్వాస్యం చేత్ = ఉద్వాసన చేయదగిన దగుచో; తత్ జ్యోతిః = ప్రతిమయందు ఉద్వాసము చేయబడిన జ్యోతిస్సును; పునః = తిరిగి; జ్యోతిషి = హృదయగతమగు జ్యోతిస్సునందు; ఉద్వాసయేత్ = ఉద్వాసన చేయవలెను

తా. అని యిట్లు విన్నవించి, నిర్మాల్యమును భగవంతుడే నా కొసంగినాడని భావన చేసికొనుచు, ఆదరములో తులసి మున్నగు నిర్మాల్యమును తలపై ధరించి, ఆ పైన ఉద్వాసన చేయవలసియున్నచో ప్రతిమాగతమగు జ్యోతిస్సును తిరిగి హృదయగతమైన జ్యోతిస్సునందు ఉద్వాసన చేయవలెను.

**శ్లో. అర్చాదిషు యదా యత్ర శ్రద్ధా మాం తత్ర చార్చయేత్,**
**సర్వభూతే ష్వాత్మని చ సర్వాత్మాఒ హ మవస్థితః 48**

అ. యథా = ఎపుడు; అర్చాదిషు = అర్చమున్నగు ప్రతిమలందు; యత్ర = దేనియందు; శ్రద్ధా = ఆసక్తియో; తత్ర = ఆ ప్రతిమయం దపుడు; మాం = నన్ను. అర్చయేత్ = పూజింపవలెను. సర్వాత్మా = సర్వశరీరములు కలవాడనగు: అహం = నేను; సర్వభూతేషు = సకల ప్రాణులందును; ఆత్మని చ = నా యందును కూడ; అవస్థితః = అంతర్యామినై యున్నాను.

తా. అర్చాది ప్రతిమ లెనిమిదింటిలో దేనియం దధికమగు శ్రద్ధయున్న దానియందు నన్ను పూజింపవచ్చును. సర్వ శరీరములు నావే. నేను సకలప్రాణులందును, నాయందును గూడ అంతర్యామినై యున్నాను.

**శ్లో. ఏవం క్రియాయోగపథైః పుమాన్ వైదికతాంత్రికైః,**
**అర్చ న్నుభయతః సిద్ధిం మత్తో వింద త్యభీప్సితామ్. 49**

అ. ఏవం = ఈ ప్రకారముగా: వైదిక తాంత్రికైః = వైదికములు; తంత్రోక్తములు నగు, క్రియాయోగపథైః = నన్నర్చించుటకు తగిన ఉపాయము లనేకములచే; పుమాన్ = మనుజుడు, అర్చన్ = పూజించుచు), మత్తః = నావలన; అభీప్సితాం = అభీష్టమగు, ఉభయతః సిద్ధిం = ఇహపరములురెంటి యందును సిద్ధిని; విందతి = పొందు చున్నాడు.

తా. ఇట్లు వైదిక తాంత్రికములగు వివిధ అర్చనా సరణులచే నన్నర్చించు మను జు డిహపరములు రెంటిని సాధించగలుగును.

**శ్లో. మదర్చాం సంప్రతిష్ఠాప్య మందిరం కారయే ద్దృఢమ్,**
**పుష్పోద్యానాని రమ్యాణి పూజాయాత్రోత్సవాశ్రితాన్. 50**

అ. దృఢం మందిరం కారయేత్ = దృఢమగు దేవాలయము నిర్మించవలెను. అందు, మదర్చాం = నా అర్చామూర్తిని; సంప్రతిష్ఠాప్య = ప్రతిష్ఠించి; పూజాయాత్రా ఉత్సవ ఆశ్రితాన్ = నిత్యార్చన;

యాత్రా = రథయాత్ర మున్నగునది, ఉత్సవ = నిత్యోత్సవ పక్షోత్సవాదులకు, ఆశ్రితాన్ = కావలసిన: పుష్పోద్యానాని = పూదోటలను, రమ్యాణి = సుందరమైనవానినిగా: కారయేత్ = చేయించవలెను.

తా దృఢమగు దేవాలయము నిర్మించి, అందు నా యర్చామూర్తిని ప్రతిష్ఠించి ఆ మూర్తికి నిత్యము పూజ, యాత్ర ఉత్సవములు నిర్వహించుటకు కావలయు పూలకై పూదోటను పెంచవలెను

**శ్లో. పూజాదీనాం ప్రవాహార్థం మహాపర్వ స్వథాన్వహమ్,**
**క్షేత్రాపణ పురగ్రామాన్ దత్త్వా మత్సార్ష్టితా మియాత్॥ 51**

అ పూజాదీనాం = పూజ యాత్ర మున్నగువానియొక్క, అన్వహం = సదా, ప్రవాహార్థం = ఎల్లప్పుడు అనువర్తించుకొఱకు, మహాపర్వసు = గొప్ప పర్వదినములందు, క్షేత్ర-ఆపణ-పుర- గ్రామాన్ = పొలములు, దుకాణములు: పురములు: గ్రామము లను, దత్త్వా = ఇచ్చి; మత్సార్ష్టితాం = నాతో సమానమగు ఐశ్వర్యమును: ఇయాత్ = పొందవలెను.

తా. దేవాలయమందు నిత్యనైమిత్తికములగు పూజాయాత్రాదులు, ఎడతెగక జరుగుచుండు కొఱకు పర్వసమయములందు పొలము, దుకాణము, పురము, గ్రామములను దానము చేసి నాతో సమానమగు ఐశ్వర్యము నందును.

**శ్లో. ప్రతిష్ఠయా సార్వభౌమం సద్మనా భువనత్రయమ్,**
**పూజాదినా బ్రహ్మలోకం త్రిభి ర్మత్సామ్యతా మియాత్. 52**

అ ప్రతిష్ఠయా = భగవన్మందిరమును ప్రతిష్ఠించుటచే; సార్వభౌమం = సార్వభౌమపదమును, సద్మనా = దేవాలయ నిర్మాణముచే, భువనత్రయం = త్రైలోక్య సుఖమును; పూజాదినా = పూజ మున్నగువానిచే, బ్రహ్మలోకం = బ్రహ్మలోకమును; త్రిభిః = ప్రతిష్ఠ, దేవాలయనిర్మాణము, పూజలచే; మత్సామ్యతాం = నాసాధర్మ్యమును: ఇయాత్ = పొందును.

తా దేవాలయ ప్రతిష్ఠచే సమస్త భూమండలాధిపత్యమును, దేవాలయనిర్మాణముచే త్రైలోక్య సుఖమును, పూజాదులు చేయుటచే బ్రహ్మలోకమును, ఈమూటిని చేయుటచే నా సాధర్మ్యమును పొందును.

**శ్లో. మామేవ నైరపేక్ష్యేణ భక్తియోగేన విందతి,**
**భక్తియోగం స లభతే ఏవం యః పూజయేత మామ్. 53**

అ. ఏవం = ఈ ప్రకారముగా; యః = ఎవడు, నైరపేక్ష్యేణ = ఫలాభిసంధి లేనివాడై, భక్తియోగేన = భక్తియోగముతో, మాం = నన్ను; పూజయేత = పూజించునో, సః = అతడు, మామేవ = నన్నే; విందతి = పొందును; సః = అతడు; భక్తియోగం = భక్తియోగమును; లభతే = పొందును.

తా. ఈ విధముగా నెవడు ఫలాభిసంధిలేని భక్తియోగముతో, నన్నారాధించునో వాడు నన్నే చేరును అతడు భక్తియోగము నందును.

**శ్లో. యః స్వదత్తాం పరై ర్దత్తాం హరేత సురవిప్రయోః,**
**వృత్తిం స జాయతే విడ్భుగ్వర్షాణామయుతాయుతమ్. 54**

అ. యః = ఎవడు; సురవిప్రయోః = దేవబ్రాహ్మణులకు, స్వదత్తాం = తా నొసంగినదిగాని; పరైః దత్తాం = ఇతరు లొసంగినది గాని, వృత్తిం = జీవనమును, హరేత = పోగొట్టునో; సః = అతడు వర్షాణాం అయుతాయుతం = పదికోట్ల సంవత్సరములు; విడ్భుక్ జాయతే = మలభక్షకు డగును.

తా ఎవడు దేవ బ్రాహ్మణులకు తాను గాని, ఇతరులు గాని దాన మొసంగిన భూమి మున్నగు వానిని హరించునో అతడు కోట్లాది సంవత్సరములు మలభక్షకు డగును.

శ్లో. కర్తుశ్చ సారథే ర్హేతో రనుమోదితు రేవ చ,
కర్మణాం భాగినః ప్రేత్య భూయో భూయసి తత్ఫలమ్. 55

అ. కర్తుః చ = కర్తకు; సారథేః = సహకర్తకు; హేతోః = ప్రయోజక కర్తకు, అనుమోదితుః = సమ్మతించువానికి, కర్మణాం = కర్మలయొక్క; భాగినః = భాగస్వాములైన వీరికి; తత్ఫలం = ఆకర్తకు లభించు ఫలమే. భూయః భూయసి = పెద్ద పనికి పెద్దఫలము.

తా. కర్త కే ఫలము లభించునో ఆ కర్తయగు వానితో కలసి పనిచేయు వారును సహకర్త, ప్రయోజకుడు, సమ్మతి నిచ్చినవారు వీరెల్లరు కర్మల ఉత్కర్షను బట్టి ఉత్కృష్ట ఫలములను పొందుదురు.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ఏకాదశస్కంధే సప్తవింశోఽధ్యాయః.
ఇట్లు శ్రీమద్భాగవత మహాపురాణమం దేకాదశస్కంధమున నిరువదియేడవ అధ్యాయము.

# అష్టావింశాధ్యాయము

## సంగ్రహశ్లోకము

**అష్టావింశే తు యః పూర్వం విస్తరేణోపవర్ణితః,**
**జ్ఞానయోగః పునశ్చాసౌ సమాహృత్య నిరూప్యతే.**

ఈ యిరువదెనిమిదవ అధ్యాయమున, పూర్వమే జ్ఞానయోగము విస్తారముగ వర్ణింపబడినదో అదియే సంగ్రహముగ మఱల నిరూపించ బడుచున్నది—

**శ్లో.** **పరస్వభావకర్మాణి న ప్రశంసేన్న గర్హయేత్**
**విశ్వమేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ.** **1**

అ విశ్వం=ప్రపంచమును; ప్రకృత్యా=గుణ సామ్యరూపమగు ప్రకృతి **తోడను; పురుషేణ** చ=ప్రకృతిని రక్షించు పురుషుని **తోడను;** ఏకాత్మకం=సర్వావయవి యగు పరమాత్మయే మూల స్వరూపముగా కలది యని; పశ్యన్=చూచుచున్నవాడై, పరస్వభావ కర్మాణి=ఇతరుల స్వభావములను; పనులను, న ప్రశంసేత్=మెచ్చుకొనరాదు; న గర్హయేత్=నిందింపరాదు.

తా. ఈ ప్రపంచము ప్రకృతి **పురుషు**లతో నేకరూపముగా నీక్షించుచున్నవాడైయితరుల స్వభావమును, వారి కృత్యములను పొగడుట లేక తెగడుట చేయరాదు.

అవ. అట్లు ప్రశంసించుటో, నిందించుటో చేయుచో దోషము చెప్పుచున్నారు—

**శ్లో** **పర స్వభావ కర్మాణి యః ప్రశంసతి నిందతి,**
**స ఆశు భ్రశ్యతే స్వార్థా దస త్యభినివేశతః.** **2**

అ. యః=ఎవడు; పరస్వభావ కర్మాణి=ఇతరుల స్వభావమును; కృత్యములను; ప్రశంసతి =మెచ్చుకొనునో; నిందతి=నిందించునో; సః=అతడు; అసతి=మిథ్యాభూతమగు ద్వైతమందు; అభినివేశతః=పట్టుదల కలిగియుండుట వలన; స్వార్థాత్=జ్ఞాననిష్ఠారూపమగు స్వార్థమునుండి; ఆశు =శీఘ్రమే; భ్రశ్యతే=భ్రంశము నొందును.

తా. ఎవడు పరస్వభావమును గాని, పరకృత్యములను గాని పొగడునో లేక తెగడునో అట్టివాడవాస్తవమగు ద్వైతమందభినివేశము కలవాడగుటచే జ్ఞాననిష్ఠ నుండి భ్రంశము నొందును.

అవ. ఆ భ్రంశమునే దృష్టాంతముతో జూపుచున్నారు—

**శ్లో.** **తైజసే నిద్రయాపన్నే పిండస్థో నష్టచేతనః,**
**మాయాం ప్రాప్నోతి మృత్యుం వా తద్వ న్నానార్థదృక్ పుమాన్.**

అ. తైజసే=రాజసాహంకారము వలన కలుగు యింద్రియ సముదాయము; నిద్రయా=నిద్రచే; ఆపన్నే=అభిభూతము కాగా; పిండస్థః=జీవుడు; మనోమాత్రము చేతనే, మాయాం ప్రాప్నోతి=స్వప్నరూపమగు మాయను పొందును. పిమ్మట మనస్సు లీనము కాగా; నష్టచేతనః సన్=చైతన్యము తొలగినవాడై; మృత్యుం=మృత్యువును; వా=లేదా మృత్యుతుల్యమగు సుషుప్తిని గాని; ప్రాప్నోతి=పొందునో; తద్వత్=ఆ ప్రకారముగనే; నానార్థధుక్=ద్వైతాభినివేశముగల, పుమాన్=మనుజుడును; విక్షేపమును వినాశమును పొందును

తా. రాజసాహంకార కార్యమగు ఇంద్రియ సముదాయము నిద్రకు లోనుకాగా జీవుడు మనోమాత్రముచే స్వప్నరూపమగు మాయను పొందును. అనంతరము చైతన్యము తొలగినవాడై ఎట్లు మృత్యువును లేదా తత్తుల్యమగు సుషుప్తిని పొందునో అట్లు ద్వైతాభినివేశముగల మనుజుడును వినాశము నందును.

అవ. ద్వైత మసత్యమగుటచే స్తుతి నిందలు నిర్విషయములని యొకున్నర శ్లోకములచే వివరించుచున్నారు—

శ్లో. కిం భద్రం కి మభద్రం వా ద్వైత స్యావస్తునః కియత్,
వాచోదితం తదనృతం మనసా ధ్యాత మేవ చ. **4**

అ. అవస్తునః=అవాస్తవమగు; ద్వైతస్య=ద్వైతములో, కిం భద్రం=ఏది శుభము, కి మభద్రం=ఏది యశుభము; కియత్=ఏపాటి శుభము? ఎంత అశుభము? వాచా ఉదితం=వాక్కుచే ఏది పలుకబడినదో; ఇది చక్షురాదులకు నుపలక్షణము. చక్షురాదులచే ఏది దృశ్యమో; మనసా=మనసుచే; ధ్యాతమేవ చ=ధ్యానించ బడినదియును; తత్=అదియెల్ల; అనృతం=అసత్యము.

తా. ద్వైత మన్నదే లేనపుడు అం దేది శుభ మేది యశుభ మని గాని, ఎంత శుభ మెంత యశుభ మనిగాని ప్రశ్న కవకాశము లేదు. దానిని గూర్చి యేమి చెప్పినను, వినినను, చూచినను, మనస్సుచే తలంచినను అదియంతయు నసత్యమే.

అవ. అట్లగుచో దేహాద భావములును లేవు కదా. అట్టిచో నవి భయహేతువు లెట్లనగా దానిని సదృష్టాంతముగ పలుకుచున్నారు—

శ్లో ఛాయాప్రత్యాహ్వయాభాసా హ్యసంతోఽప్యర్థకారిణః,
ఏవం దేహాదయో భావా యచ్ఛం త్యామృత్యుతో భయమ్. **5**

అ ఛాయా . భాసాః—ఛాయా=ప్రతిబింబము, ప్రత్యాహ్వయ=ప్రతిధ్వని; ఆభాసాః=శుక్తి రజతాది భ్రాంతి యనునవి; అసంతః అపి=అవాస్తవములయ్యును; అర్థకారిణః=వాస్తవికములవలె కార్యకారు లగుచున్నవి ఏవం=ఇట్లే; దేహాదయః భావాః=దేహము మున్నగు భావములును; ఆమృత్యుతః=మరణపర్యంతము, భయం యచ్ఛన్తి=భయము పొందును.

తా. ప్రతిబింబము, ప్రతిధ్వని, శుక్తి రజతాదికము లెట్లు వాస్తవికములు కాకున్నను వాస్తవికములవలె కార్యకారు లగునట్లు దేహాది భావములకును మరణపర్యంతము భయమున్నది.

అవ. ఓయీ! సృష్ట్యాదిశ్రుతులే ద్వైతమును నిరూపించినవి కదా మఱి యిదెట్లు సత్యమగు ననగా రెండున్నర శ్లోకములచే చెప్పుచున్నారు—

శ్లో. ఆత్మైవ తదిదం విశ్వం సృజ్యతే సృజతి ప్రభుః,
త్రాయతే త్రాతి విశ్వాత్మా హ్రియతే హర తీశ్వరః 6

అ. తత్ = అందువలన; ఇదం విశ్వం = ఈ ప్రపంచ మంతయు; ఆత్మైవ = పరమాత్మయే. ప్రభుః = సర్వశక్తి సమన్వితుడగు; ఈశ్వరః = ఐశ్వర్య శాలియు; విశ్వాత్మా = విశ్వరూపుడునగు అ ఆత్మ; సృజ్యతే = తన్ను దాను సృజించు కొనుచున్నాడు. సృజతి = విశ్వమును సృజించుచున్నాడు; త్రాయతే = తన్ను దాను రక్షించుకొనుచున్నాడు; త్రాతి = విశ్వమును రక్షించుచున్నాడు. హ్రియతే = తన్ను దా నుపహరించుకొనున్నాడు, హరతి = విశ్వమును ఉపసంహరించుచున్నాడు.

తా. కావున నీ ప్రపంచమంతయు పరమాత్మ రూపమే. ఆయన సమర్థుడు, విశ్వవ్యాపి ఐశ్వర్యశాలి. తన్ను దాను సృజించుకొనును, విశ్వమును సృజించును. తన్ను దాను రక్షించుకొనును. విశ్వముఁ గాపాడును. తన్ను దా నుపసంహరించుకొనును. విశ్వము నుపసంహరించును.

శ్లో. తస్మా న్న హ్యాత్మనోఽన్యస్మా దన్యో భావో నిరూపితః,
నిరూపితేయం త్రివిధా నిర్మూలా భాతి రాత్మని. 7
ఇదం గుణమయం విద్ధి త్రివిధం మాయయా కృతమ్,

అ. తస్మాత్ = అందువలన; అన్యస్మాత్ = సృజ్యాతి వ్యతిరిక్తమైన, ఆత్మనః = ఆత్మకంటె, అన్యః భావః = వేఱొక భావము; న నిరూపితః = నిరూపించబడలేదు. ఇయం = ఈ; త్రివిధా = ఆధ్యాత్మికాది రూపమగు; ఆత్మని = ఆత్మయందు; భాతిః = అవభాసము; నిర్మూలా నిరూపితా = ఆధార రహితమని అరూపించబడినది. గుణమయం = త్రిగుణ సముద్భవమగు; త్రివిధం = ద్రష్ట, దృక్, దృశ్యరూప మగునది; మాయయా కృతం = మాయచే చేయబడినదిగా; విద్ధి = ఎఱుంగుము.

తా. కావున ఆత్మకంటె వేఱైన భావ మేదియు నిరూపింపబడలేదు. ఈ ప్రకారము ఆధ్యాత్మికాది త్రివిధమగు భావమును నిరాధారమని నిరూపితమైనది. ద్రష్ట, దృక్, దృశ్య రూపమంతయు గుణ త్రయ జాత మగుటచే మాయాజన్యమని యెఱుంగుము.

శ్లో. ఏతద్విద్వాన్ మదుదితం జ్ఞానవిజ్ఞాన నైపుణమ్,
న నిన్దతి న చ స్తౌతి లోకే చరతి సూర్యవత్. 8

అ. మదుతితం = నాచేత చెప్పబడిన; ఏతత్ = ఈ, జ్ఞాన విజ్ఞాన నైపుణం = జ్ఞాన విజ్ఞాన నిష్ఠను; విద్వాన్ = ఎఱింగినవాడు; న నిందతి = ఎవ్వరిని నిందింపడు; న చ స్తౌతి = ఎవ్వరిని స్తోత్రము చేయడు; లోకే = లోకమందు; సూర్యవత్ = సూర్యునివలె సర్వభూతసముడై చరతి = సంచరించును.

తా. నే నిపుడు తెలిపిన జ్ఞాన, విజ్ఞానముల కౌశలమును అవగతము చేసికొనిన విద్వాంసుడు ఎవ్వరినేని తెగడుట గాని, పొగడుట గాని చేయక లోకమున సూర్యునివలె సర్వభూతసముడై సంచరించును.

అవ. ఈ జ్ఞాన విజ్ఞాన నిష్ఠ కలుగుట కుపాయమును చెప్పుచున్నారు—

శ్లో. ప్రత్యక్షే ణానుమానేన నిగమే నాత్మసంవిదా.
ఆద్యన్తవ దసజ్జాత్వా నిస్సంగో విచరే దిహ. 9

అ. ఆద్యంతవత్ = ఆద్యంతములు కలది; ద్వైత మేది కలదో; అది; అసత్ = మిథ్యయని; జ్ఞాత్వా = తెలుసుకొని; నిస్సంగః = సంగము వీడి; విచరేత్ = సంచరించవలెను. ఆద్యంతములు కలిగి యుండుటకు ప్రమాణములు — ప్రత్యక్షేణ = ప్రత్యక్షప్రమాణముచే ఘటాదులను; అనుమానేన = సావయవమగుటచే దృశ్యమగు పృథివ్యాదికమును; నిగమేన = వేదవాక్యముచే (శబ్ద ప్రమాణముచే) అప్రత్యక్షమగు ఆకాశాదికమును; ఆత్మ సంవిదా = స్వానుభవముచే దృశ్యమగు సర్వ మాద్యంతములుగలది మిథ్య అనియు తెలిసికొని; నిస్సంగః = దానియం దాసక్తి లేనివాడై చరించవలెను.

తా. ఈ జ్ఞాన విజ్ఞాన నిష్ఠ కలుగుట కొఱకై - ప్రత్యక్ష-శబ్ద-స్వానుభవరూప ప్రమాణములచే ఆద్యంతములు (ద్వైతము) కలది మిథ్యయని యెఱిగి, దానియం దాసక్తి వీడి చరించవలెను.

ఉద్ధవ ఉవాచ = ఉద్ధవుడు వచించెను.

అవ. ఓయీ ! ఆత్మజ్ఞానముచే దృశ్యమంతయు అసత్తని చెప్పబడుచో, ఆత్మ స్వప్రకాశమని, దేహాదికము ద్వైతము జడమని చెప్పినట్లగును. అట్లగుచో సంసార ప్రతిభాసము కుదురదు అని ప్రేరణ చేయుచున్నాడు—

**శ్లో. నైవాత్మనో న దేహస్య సంసృతి ర్ద్రష్టృదృశ్యయోః,**
**అనాత్మస్వదృశో రీశ ! కస్య స్యా దుపలభ్యతే. 10**

అ. ఈశ = ఓ ఈశ్వరుడా ! ద్రష్టృదృశ్యయోః = చూచువాడు; చూడబడునది యగునట్టి; అనాత్మ స్వదృశోః = జడాజడములగు; ఆత్మనః = ద్రష్టయగు ఆత్మకు; దేహస్య = దృశ్యమగు దేహమునకు సంసృతిః న = సంసారము లేనిచో; కస్య స్యాత్ = మఱి ఎవరికి సంసారము కలుగును ? అది యసలే లేదని యందుమా ! ఉపలభ్యతే = ఆ జన్మమరణాది రూపమగు సంసార మనుభవములో నున్నది కదా. అనుభవ సిద్ధము నెట్లు కప్పిపుచ్చుట కుదురును?

అవ. దీనినే వివరించుచున్నారు —

**శ్లో. ఆత్మాఽవ్యయోఽగుణః శుద్ధః స్వయంజ్యోతి రనావృతః,**
**అగ్నివ ద్దారువ దచిద్దేహః కస్యేహ సంసృతిః. 11**

అ. ఆత్మా = ఆత్మ; అవ్యయః = నాశము లేనిది; అగుణః = నిర్గుణము; రాగాదులు లేనిది; శుద్ధః = పుణ్య పాపరహితము; స్వయంజ్యోతిః = అజ్ఞాన రహితము; అనావృతః = పరిచ్ఛేద రహితము; దేహః = శరీరమో; అచిత్ = జడము, అగ్నివత్ = అగ్నివలెను; దారువత్ = కొయ్యవలెను; దీని భావ మిది—అగ్ని దారువులు భిన్నములుగాలభించుచున్నను, దారువు ప్రకాశింపజేయబడునది; అగ్ని ప్రకాశింపజేయునదియు ఎట్లో, అట్లే దేహాత్మలును. కావున, కస్య ఇహ సంసృతిః = ఇచట సంసార మెవ్వరికి? దేహాత్మలు రెంటికిని సంసారము పొసగదని యుద్ధవుడు తలంచుచున్నారు.

తా. ఆత్మ నాశములేనిది, నిర్గుణము, శుద్ధము, స్వయంజ్యోతి, పరిచ్ఛేద రహితము. దేహము జడము, ఆత్మదేహము లగ్నిదారువుల వలె ప్రకాశ్య ప్రకాశకములు కనుక నింక దేనికి సంసార మెట్లు సంభవించును ?

శ్రీ భగవా నువాచ — శ్రీ భగవంతుడు వచించెను.

అవ. నీవు చెప్పినది సత్యమే. అట్లయ్యును, ఆయుభయుల వివేకము లేకుండుటచే సంసారహేతు వని యైదు శ్లోకములతో చెప్పుచున్నారు—

**శ్లో. యావ ద్దేహేంద్రియప్రాణై రాత్మనః సన్నికర్షణమ్,**
**సంసారః ఫలవాం స్తావ దపార్థోఽప్యవివేకినః 12**

అ. యావత్ = ఎంతవఱకు; దేహేంద్రియప్రాణైః = దేహము, ఇంద్రియములు, ప్రాణములతో, **ఆత్మనః** = ఆత్మకు; సన్నికర్షణం = సంబంధముండునో, ఓయీ ! ఆత్మ నిస్సంగము కదా. దానికి సంబంధము కలుగు టెట్లు అనగా చెప్పుచున్నారు— అవివేకినః = అజ్ఞాన కృతమైనది, ఓయీ ! ఆత్మ స్వప్రకాశముకదా అతని కెట్లు అజ్ఞానకృతమగు సంసారము కలుగును ? అనగా చెప్పుచున్నారు — సంసారః = సంసారము; అపార్థోఽపి = మిథ్య అయ్యును; ఫలవాన్ = ఫలప్రదము. ఇచట ఫలమనగా **స్ఫూర్తి**యేగాని ఫలమన్నది వాస్తవమున లేదు.

తా. ఆత్మ ఎంత దనుక దేహేంద్రియ ప్రాణములతో సంబంధము కలిగియుండునో అంతవరకును దాని నజ్ఞాన మావరించి యుండును. సంసారము మిథ్యయయ్యు ఆ సంబంధ ముండునంతవఱకు సంసారస్ఫూర్తియే కలుగును

**అవ.** ఓయీ ! దేహాదులు మిథ్యాభూతములు కదా. అని సంసారస్ఫూర్తికి **హేతువు** లెట్లనగా చెప్పుచున్నారు—

**శ్లో. అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతి ర్న నివర్తతే,**
**ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా 13**

అ. అర్థే = దేహాదికమగు అర్థము, అవిద్యమానే అపి = లేకున్నను; విషయాన్ = విషయములను, ధ్యాయతః = తలంచుచున్న; అస్య = ఈ యాత్మకు; స్వప్నే = కలయందు; అనర్థాగమః యథా = కీడుకలుగుటవలె, సంసృతిః = సంసారము; న నివర్తతే = మఱలదు

తా. దేహాదికమగు అర్థము మిథ్యాభూతమయ్యును, విషయములనే ధ్యానించు ఆత్మకు కలలో కీడు కలుగుట వలె సంసార మేర్పడునే గాని మఱలదు.

అవ. ఓయీ ! దేహారంభకమగు కర్మనుబట్టి యెఱుకగల జీవన్ముక్తునకు కూడ విషయస్ఫూర్తి (భోజనాద్యకాలమున అన్నాది జ్ఞానము) వారింప రాని దగుటచే మోక్షము కలుగక పోవలెను కదా అన్నచో చెప్పుచున్నారు—

**శ్లో, యథా హ్యప్రతిబుద్ధస్య ప్రస్వాపో బహ్వనర్థభృత్,**
**న ఏవ ప్రతిబుద్ధస్య న వై మోహాయ కల్పతే. 14**

అ. యథా = ఏ ప్రకారముగ; ప్రస్వాపః = నిద్ర, అప్రతిబుద్ధస్య = మేల్కొనని వానికి; బహ్వనర్థభృత్ = అనేకములగు అనర్థములు కలిగించునో, అట్లు; సః ఏవ = ఆ నిదురయే; ప్రతిబుద్ధస్య = మేల్కొనిన వానికి; మోహాయ నైవ కల్పతే = అజ్ఞానము కలిగింపదు.

తా. నిద్ర, మేల్కొనని వానికి దేహాత్మాభిమానముచే పెక్కు అనర్థములు కలిగిం

చును. కాని ఆ నిద్రనుండి మేల్కొనినచో నది (ఆ నిద్ర) ఆత్మాభిమానము వలన కలుగు అనర్థమునకు దారి తీయకుండును.

అవ. అహంకారరూపమగు దేహాదిసన్నికర్షయే సంసారాలంబన మని యన్వయ వ్యతిరేకములచే(అహంకారమున్నచో సంసారము కలుగుట, అహంకారము తొలగిన సంసారము తొలగుట యనునవి అన్వయవ్యతిరేకములు) చూపుచున్నారు—

**శ్లో॥ శోక హర్ష భయ క్రోధ లోభ మోహ స్పృహాదయః,**
**అహంకారస్య దృశ్యన్తే జన్మ మృత్యుశ్చ నాత్మనః. 15**

అ. శోక స్పృహాదయః—శోకము, హర్షము, భయము, కోపము, లోభము, మోహము, కోరిక మున్నగునవి జన్మ=పుట్టుక; మృత్యుః చ=మరణము, అనునవి; అహంకారస్య=అహంకారమున్నదే దృశ్యంతే=అగపడుచున్నవి గాని; ఆత్మనః న=ఆత్మకు సంబంధించినవి గావు. సుషుప్తియందీ శోకాదు లగపడకుండుటచే 'నేను సుఖిని' అన్నట్లు చైతన్యముకాని, సుఖిని అను ప్రతీతిగాని లేకుండుట చేతను, సుఖాదులు దర్శనీయము లగుటచే, కృశత్వము మున్నగునవి వలె ద్రష్ట ధర్మములగుట కుదు రదు. చెప్పబడినది కూడ

సుప్తేఽహమి న దృశ్యన్తే సుఖదోషప్రవృత్తయః,
అత స్తస్యైవ సంసారో న మే సంసృతి సాక్షిణః

(అహంకారము నిదురించగా, సుఖదోష ప్రవృత్తు లగపడవు. కావున నా యహంకారమునకే సంసారము గాని, యా సంసారమునకు సాక్షినగు నాకు కాదు).

తా. శోకము, హర్షము, భయము, క్రోధము, లోభము, మోహము, స్పృహ, జన్మ మృత్యు వనునవి యహంకారమునకుగాని ఆత్మకు గావు.

అవ. ఓయీ!సంసార మహంకారమునకే యగుచో ముక్తియు దానికే గావలయును. అట్లగుచో ముక్తియందహంకారము మిగిలియుండుట సంభవించును కదా యన్నచో చెప్పుచున్నారు—

**శ్లో॥. దేహేంద్రియ ప్రాణ మనోభిమానో జీవోఽన్తరాత్మా గుణకర్మమూర్తిః,**
**సూత్రం మహా నిత్యురుధేవ గీతః సంసార ఆధావతి కాలతన్త్రః. 16**

అ. దేహేంద్రియ ..భిమానః — దేహము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు వీనియందభి మానముగల. అంతరాత్మా=వానియందంతర్గతుడగు. జీవః=జీవుడు, గుణకర్మమూర్తిః=గుణ కర్మమయమగు రూపముగలవాడు; సూత్రం మహాన్ ఇతి=సూత్రభూతుడు సూక్ష్మరూపుడని; ఉరుధా=బహు ప్రకారములుగా; గీతః=పేర్కొనబడినవాడు; కాలతంత్రః=కాలవశుడై; సంసారే= సంసారమందు; ఆధావతి=అంతటను తిరుగుచున్నాడు

తా. జీవుడు దేహము, ఇంద్రియములు, ప్రాణము మనస్సులందభిమానము కలవాడై, తదంతర్గతుడై యున్నాడు. అతడు గుణకర్మమయుడు. సూత్రోపాధి, మహదు పాధిగా పలువిధముల గానము చేయబడినవాడు. అట్టి జీవుడు సంసారమందు పరమేశ్వరాధీనుడై యెల్లెడల దిరుగుచున్నాడు.

అవ. ఈప్రకారము ఆత్మకు సంసారము కలుగుట కహంకారము ప్రధానకారణ మని చెప్పబడినది ఇపుడు ప్రధానముగ సర్వరూపుడని ప్రతిపాదించబడినది.

**శ్లో. అమూల మేత ద్బహురూపరూపితం మనోవచః ప్రాణ శరీర కర్మ,**
**జ్ఞానాసి నోపాసనయా శితేన ఛిత్వా ముని ర్గాం విచర త్యతృష్ణః.**

అ. అమూలం = మూలశూన్యము; బహురూపరూపితం = అజ్ఞానముచే మాత్రము అనేక రూప ములతో (దేవాది శరీరములతో) రూపణము చేయబడినదియు, మనోవచః ప్రాణశరీర కర్మ = మనస్సు వాక్కు, ప్రాణము, శరీరమను దాని కార్యమగు: ఏతత్ = అహంకారమును; ఉపాసనయా = గురుసేవ యను; శితేన = తీక్ష్ణమగు, జ్ఞానాసినా = జ్ఞానమను ఖడ్గముచే, ఛిత్వా = నఱకి; మునిః = మునియై; అతృష్ణః = ఏ కోరికలు లేక, గాం = భూమిని; విచరతి = విహరించును.

తా. అహంకారము నిర్మూలమైనను అజ్ఞానము కారణముగా బహురూపములతో కానవచ్చుచున్నది. మనస్సు, వాక్కు, ప్రాణము, శరీరము అనువానియం దాచరింపబడునట్టిది. అట్టి యహంకారమును జ్ఞానమను పదునైన కత్తితో భేదించి, మునియగువాడు. కోరికలు లేనివాడై భూమిపై విహరించును.

అవ. ఆ జ్ఞానమునే స్వరూప సాధన ఫలములతో నిరూపించుచున్నారు.

**శ్లో. జ్ఞానం వివేకో నిగమ స్తపశ్చ ప్రత్యక్ష మైతిహ్య మథానుమానమ్,**
**ఆద్యంతయో రస్య యదేవ కేవలం కాలశ్చ హేతుశ్చ తదేవ మధ్యే. 18**

అ. వివేకః = వివేకము; జ్ఞానం = జ్ఞానము; సాధనములను చెప్పుచున్నారు—నిగమః = వేదము, తపః = స్వధర్మము; ప్రత్యక్షం = స్వానుభవము; ఐతిహ్యః = ఉపదేశము అనుమానం = తర్కము; అస్య జగతః = ఈ ప్రపంచముయొక్క: అద్యంతయోః = మొదలు తుదలందు; యదేవ = ఏది (బ్రహ్మము) కలదో; కాలః = జగత్తును ప్రకాశింపజేయునది (కలయతి ప్రకాశయతి); హేతుశ్చ = జగత్తునకు కారణభూతమైనది అగును. కేవలం = ఆ బ్రహ్మయే; మధ్యే అపి—నడుమకూడ ఉన్నది (అంతేకాని నడుమ అగపడునట్టి జగత్తు కాదు)

తా. ఈ విశ్వమునకు కారణము, ప్రకాశమును బ్రహ్మమే. ఈ విశ్వమంతయు తద్రూపమేగాని వేఱు కాదని యిట్లు నిశ్చయఫలకమగు ఏ వివేకము నిగమాదిసాధనములచే కలుగునో అది జ్ఞానము.

**శ్లో. యథా హిరణ్యం స్వకృతం పురస్తా త్పశ్చాచ్చ సర్వస్య హిరణ్మయస్య,**
**తదేవ మధ్యే వ్యవహార్యమాణం నానాపదేశై రహ మస్య తద్వత్ 16**

అ. యథా = ఏ ప్రకారముగా; స్వకృతం = చక్కగా కుండలాది రూపముగా మలచబడిన హిరణ్యం = బంగారము, సర్వస్య; హిరణ్మయస్య = ఆ సమస్తమైన బంగారముతో చేయబడిన కుండ లాదుల ఉత్పత్తికి, పురస్తాత్ = పూర్వము; పశ్చాత్ = వాని నాశానంతరమును కలదో; మధ్యే చ = నడుమ; నానాపదేశైః = అనేక నామములతో; వ్యవహార్యమాణం = పిలువబడుచున్నను; తదేవ యథా = ఎట్లు ఆ బంగారమే అగుచున్నదో, తద్వత్ = అట్లే అస్య = ఈ విశ్వమునకును; అహం = నేను (కారణ భూతుడనకు నేనే. నానా వ్యవహారములకు ఆలంబనమైనవాడు కాని నా కంటె వేఱుగా విశ్వము లేదు).

తా. ఏ ప్రకారముగా సువర్ణము కుండలాదికమగు ఆభరణరూపముగ చేయబడుటకు పూర్వమును ఆ యాభరణములు ఉత్తరకాలమున నాశము పొందినపుడుగూడా సువర్ణమే యగునో అట్లు నడుమ ఆభరణరూపముగనుండి కుండలములు, కంకణములుమున్నగు వివిధ నామములతో పిలువబడినపుడును సువర్ణమే అగును అట్లే విశ్వమునకు కారణభూతుడనగు నేనే నానా నామములతో పిలువబడుచున్నాను. కాని నాకంటె వేరుగా విశ్వము లేదు.

అవ. ఈ ప్రకారముగా కార్యమగు ప్రపంచము కారణమగు బ్రహ్మస్వరూపమే యని వివరించి ప్రకాశ్యమగు యీ ప్రపంచము ప్రకాశక మగుటను తెలుపుచున్నారు—

**శ్లో. విజ్ఞాన మేత త్త్రియవస్థ మఙ్గ గుణత్రయం కారణకార్యకర్తృ,**
**సమన్వయేన వ్యతిరేకతశ్చ యేనైవ తుర్యేణ తదేవ సత్యమ్. 20**

అ. అఙ్గ=ఓయీ ! త్రియవస్థం=జాగ్రత్తు మున్నగు మూడవస్థలు కలిగిన; **విజ్ఞానం**=విజ్ఞాన మేదికలదో, గుణత్రయం=మనస్సు, దాని అవస్థలకుగాని కారణ రూపమగు త్రిగుణములు సత్వరజస్తమస్సులు ఏవి కలవో; కారణ కార్య కర్తృ – కారణం=అధ్యాత్మము; కార్యం=అధిభూతము; కర్తృ=అధిదైవము అను గుణత్రయ కార్యభూతమగు త్రివిధ జగత్తు; యేన తుర్యేణ=నాల్గవదగు ఏ సామాన్య జ్ఞాన మాత్రముతో; సమన్వయేన భవతి=అనుగతమై ప్రకాశించునో 'త మేవ భాన్త మనుభాతి స్వరం' 'తస్య భాసా సర్వ మిదం విభాతి' 'చక్షుష శ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత్రక మనసోయే మనో విదుః' ఇత్యాది శ్రుతి ప్రమాణము. ఓయీ ! విశేష **విజ్ఞాన** వ్యతిరేకముగ నాల్గవ నామ మేదియు మాకు లభ్యమగుట లేదే అనగా చెప్పుచున్నారు వ్యతిరేకతశ్చ=భగవత్సంబంధము లేకయే సమాధ్యాదులందు ఏ జ్ఞానము కలదో; తదేవ సత్యం అదియే సత్యము

తా. ఓ ఉద్ధవా! జాగ్రత్, స్వప్న,సుసుప్తి రూపమగు అవస్థాత్రయముతో కూడిన విజ్ఞానము, మనస్సునకు, దాని అవస్థలకు కారణరూపమగు సత్త్వరజస్తమో గుణములు, ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవికమగు జగత్తు. నాల్గవదగు ఏ సామాన్యజ్ఞానమాత్రముతో ననుగతమై ప్రకాశించునో, సమాధ్యాదులందు జగత్సంబంధము లేకయే ఏ విశేషరూపమగు జ్ఞానము కలదో అదియే సత్యము.

అవ. ఈ విధముగ కాలత్రయమం దవ్యభిచరిత మైనట్టిది సత్యమని చెప్పబడినది. వ్యభిచరితమగునట్టి దసత్యమని చెప్పుచున్నారు.-

**శ్లో. న యత్పురస్తా దుత యన్న పశ్చా న్మధ్యే చ తన్న వ్యపదేశమాత్రమ్**
**భూతం ప్రసిద్ధం చ పరేణ యద్య త్తదేవ తత్ స్యాదితి మే మనీషా. 21**

అ. యత్=ఏ జగత్తు; పురస్తాత్=దాని సృష్టికి పూర్వము; న=లేదో; ఉత=లేక; యత్=ఏ జగత్తు: పశ్చాత్=దాని నాశమునకు పిమ్మట; న=లేదో; తత్=ఆ వస్తువు; మధ్యే చ న=ఉత్పత్తి వినాశములకు నడుమ కూడ లేదు. వ్యపదేశమాత్రం=అది కేవలము వ్యవహారమే కాని సత్యము కాదు. యత్=ఎందువల్లనైతే; యత్ యత్=ఏ యే వస్తువు, పరేణ=అన్యముచే; **భూతం**=పుట్టినదో; ప్రసిద్ధం చ=ప్రకాశింపజేయబడినదో తత్=ఆ వస్తువు; తత్ స్యాత్ ఇతి=స్వకారణము అయినట్టి వస్తువే యగును గాని **వేఱు** కాదని; మే మనీషా=నా తలంపు.

తా. ఏ జగత్తు సృష్టికి ముందుగాని, లయమునకు పిమ్మట కాని ఉండదో అది నడుమ కూడ లేనట్టిదియే. అట్లు ఉన్నట్లు భాసించుట వ్యవహారము మాత్రమే. ఏ యే వస్తు వన్య పదార్థముచే పుట్టింపబడునో, ప్రకాశింపజేయబడెనో ఆయా వస్తువు స్వకారణము, ప్రకాశకమగు బ్రహ్మరూపమే గాని వేఱుకాదని నేను తలంతును.

అవ. ఈ ప్రకారముగ కార్య, ప్రకాశ్యములకు కారణప్రకాశములతో నభేదము నుపపాదించి ప్రస్తుత మారెంటి వివేకముచే ప్రపంచము బ్రహ్మభిన్న మనుచున్నారు.-

**శ్లో. అవిద్యమానోఽప్యవభాసతే యో వైకారికో రాజససర్గ ఏషః,**
**బ్రహ్మ స్వయంజ్యోతి రతో విభాతి బ్రహ్మేంద్రియార్థాత్మ వికార చిత్రమ్: 22**

అ యః వైకారికః = వికారసమూహ మెయ్యది కలదో; ఏషః అవిద్యమానః = అది పూర్వము లేనట్టిదై; రాజస సర్గః = రజోద్వారమున బ్రహ్మకార్యమై; అవభాసతే అపి = బ్రహ్మ ప్రకాశ్యమై కన్పట్టుచున్నది. బ్రహ్మ=బ్రహ్మమో; స్వయం = స్వతస్సిద్ధము; జ్యోతిః = ప్రకాశకము; అతః = ఇందువలన; ఇంద్రియ ..చిత్రమ్-ఇంద్రియ = పంచేంద్రియములు; అర్థ = పంచతన్మాత్రలు ఆత్మ = మనస్సు (ఇది దేవతలకు సుపలక్షణము) వికార = పంచభూతములు యిట్లు; చిత్రం = ఆశ్చర్య జనకమై; బ్రహ్మ = బ్రహ్మమే భాసించుచున్నది.

తా. వికారసమూహ మంతయు పూర్వము లేనిది రజోద్వారమున బ్రహ్మ కార్యము, బ్రహ్మప్రకాశ్యమై కన్పట్టునట్టిది. కాని బ్రహ్మము మాత్రము స్వతస్సిద్ధము, స్వయంజ్యోతి యగుటచే ఇంద్రియ, తన్మాత్ర మనః, పంచభూతాత్మకముగా విచిత్రమై భాసించుచున్నది.

అవ. ఉపసంహరించుచున్నారు-

**శ్లో. ఏవం స్ఫుటం బ్రహ్మ వివేకహేతుభిః పరాపవాదేన విశారదేన,**
**ఛిత్త్వాఽఽత్మసందేహ ముపారమేత స్వానందతుష్టోఽఖిలకాముకేభ్యః. 23**

అ. ఏవం = ఇట్లు నిగమ, తపః, ప్రత్యక్ష, ఐతిహ్య, అనుమానములచేత, స్ఫుటం = స్పష్ట మగునట్లుగా; బ్రహ్మవివేక హేతుభిః - బ్రహ్మజ్ఞానము కలుగుటకు వలయు కారణములచేతను; పరాప వాదేన = దేహాదుల కాత్మత్వమును నిరసించునట్టి; విశారదేన = నిపుణునిచేతను దగు (నిమిత్తభూతు డగు గురువు చేతను); ఆత్మ సందేహం = పరమాత్మ విషయకమగు సందేహమును; ఛిత్త్వా = నివారించి, స్వానందతుష్టః = ఆత్మానందముతో పరితుష్టినొందినవాడై ; అఖిల కాముకేభ్యః = సమస్తములగు ఇంద్రియాదుల నుండియు; ఉపారమేత = నిస్సంగుడు కావలెను.

తా. ఈ ప్రకారము ముందుచెప్పబడిన నిగమ తపః, ప్రత్యక్ష, ఐతిహ్యాను మానములతో స్పష్టముగ తెలియునట్లు, బ్రహ్మజ్ఞానము కలుగుటకు వలయు కారణములచే దేహాదులకాత్మత్వమును నిరసించునట్టి నిపుణుడగు గురువువలన పరమాత్మ విషయక సందేహమును తొలగించుకొని, ఆత్మానందపూర్ణుడై సకలేంద్రియాదుల సంగము విడువవలెను.

అవ. పరాపవాదమును వివరించుచున్నారు—

శ్లో. నాత్మా వపుః పార్థివ మింద్రియాణి దేవా హ్యసు ర్వాయుర్జలం హుతాశః
మనోఽన్నమాత్రం ధిషణా చ సత్త్వ మహంకృతిః ఖం క్షితి రర్థసామ్యమ్ 24

అ పార్థివం=పృథివీ రూపమైన; వపుః=శరీరము, ఆత్మా=ఆత్మ; న=కాదు: ఇచట "వపుః ఆత్మా న భవతి పార్థివ త్వాత్" అనునదిఅనుమాన ప్రకారము ఇంద్రియాణి=ఇంద్రియములు; దేవాః = దేవతలు; అసుః=ప్రాణము; వాయుజలం = వాయువు జలము; హుతాశః = అగ్ని; అన్నమాత్రం = అన్నమయమైన; మనః=మనసు; ధిషణాచ=బుద్ధియును; సత్త్వం=చిత్తము; అహంకృతిః=అహంకారము; ఖం=ఆకాశము; క్షితిః=పృథివి; అర్థసామ్యమ్=శబ్దాదులు; ప్రకృతిః ఆత్మా=ఆత్మ; న=కాదు.

శరీరము ఆత్మకాదు. ఇంద్రియములు ఆత్మకాదు, దేవతలు, ప్రాణము, వాయువు, జలము, అగ్ని, మనసు బుద్ధి చిత్తము, అహంకారము, ఆకాశము, పృథివి, శబ్దాదులు. ప్రకృతి ఇవేవియు ఆత్మకాదు.

ఇచట ఇవేవీ ఆత్మకాదు అనుటకు అనుమాన స్వరూపము లున్నవి. శరీరము ఆత్మ కాదు. పృథివి కావున, ఇంద్రియములు ఆత్మ కాదు కరణములుగాన. దేవతలు వైకారికులు కావున ఆత్మ కాదు. వాయువు కావున ప్రాణము ఆత్మ కాదు. అన్నమయము కావున మనసు ఆత్మకాదు. తైజసము కావున బుద్ధి ఆత్మ కాదు. అహంకారము పరిణామి కావున ఆత్మ కాదు. పృథివి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము ఇవి పంచ భూతములు కాన ఆత్మ కాదు. జడము కాన ప్రకృతి ఆత్మ కాదు. ఇటుల శరీరాదులు ఆత్మ యనువారి మతమును నిరసించిరి.

అవ:- వివేకజ్ఞానములు కలిగిన ముక్తునికి ఇంద్రియాదుల వలన కలిగెడి గుణదోష సంబంధము లేదని చెప్పుచున్నారు.

శ్లో. సమాహితైః కః కరణై ర్గుణాత్మభిః గుణో భవే న్మత్సువివిక్త ధామ్నః
విక్షిప్య మాణై రుత కిం ను దూషణం ఘనై రుపేతై ర్విగతై రవేః కిమ్. 25

అ. గుణాత్మభిః=సత్వాది గుణరూపములైన; సమాహితైః=కలిసి ఉన్న (సమాధానముతో నున్న) కరణైః=ఇంద్రియములతో; మత్సువివిక్తధామ్నః = దేనితో సంగతి లేని నా స్వరూపమైన ఆత్మకు; కః=ఏ; గుణః=గుణము; భవేత్=అగును; ఉత=లేక; విక్షిప్యమాణైః=విషయము లందు వ్యాపృతములైన (సంగతములైన) ఇంద్రియములతో దూషణం=దోషము; కిం ను=ఏమి యుండును. ఉపేతైః=కూడి ఉన్న; విగతైః=తొలగిన; ఘనైః=మేఘములతో; రవేః=సూర్యునికి; కిం=ఏమి చేకూరును.

తా॥ మేఘములు గుంపులుగా కలిసి వచ్చినను. విడిపోయినను. సూర్యునికి గుణదోషములు లేనటుల, సత్వాది గుణ రూపములైన ఇంద్రియములు సమాధానముతో ఉన్నను, విషయము లందు ఆసక్తములై యున్నను నిస్సంగమై నా స్వరూపమైన, ఆత్మకు గుణదోషములు కలుగవు.

అవ. అసంగబ్రహ్మముగా నున్న వానికి గుణదోషము లెవ్వియు నుండవని ఆకాశ దృష్టాంతముచే చెప్పుచున్నారు.-

శ్లో. యథా నభో వాయ్వనలాంబు భూగుణై ర్గతాగతై ర్వర్తుగుణైర్న సజ్జతే
తథాఽక్షరం సత్త్వరజస్తమోమలై రహమ్మతేః సంసృతిహేతుభిః పరమ్. 26

అ యథా = ఏవిధముగా; నభః = ఆకాశము గతాగతైః = వచ్చుచు పోవుచునుండు; వాయ్వన లాంబుభూగుణైః = వాయువు, అగ్ని, జలము, భూమి యను తక్కిన నాల్గు భూతముల యొక్కయు శోషణ; దహన; క్లేదన; రజోధూసరత్వాదు లగు గుణములతో; ఋతుగుణైర్వా = వచ్చిపోవుచుండు ఋతువుల గుణములతోగాని, న సజ్జతే = సంబంధించదో; తథా = అట్లే, పరం అక్షరం = అక్షరపర బ్రహ్మము; సంసృతి హేతుభిః = సంసార హేతువులగు; అహమ్మతేః = అహంకారము యొక్క, సత్త్వ రజస్తమోమలైః = సత్త్వరజస్తమస్సులను మాలిన్యములతో, న సజ్జతే = సంబంధము పొందదు.

తా. ఆకాశమెట్లు గతాగతములు చేయు వాయువు, అగ్ని, జలము, భూమి వీని గుణములతో గాని, ఋతుగుణములతో గాని సక్తము కాదో, అట్లే అక్షర పరబ్రహ్మము సంసారహేతువులగు అహంకారపు సత్త్వరజస్తమస్సుల మాలిన్యములతో సక్తుడు కాదు.

అవ. సమ్యగ్ జ్ఞానము లేనివాడు ముక్తునివలె యథేచ్ఛగా ఆచరింపరాదని రెండు శ్లోకములతో చెప్పుచున్నారు. -

శ్లో. **తథాఽపి సంగః పరివర్జనీయో గుణేషు మాయారచితేషు తావత్,**
**మద్భక్తియోగేన దృఢేన యావ ద్రజో నిరస్యేత మనః కషాయః** 27

అ. తథాపి = అట్లయ్యును; యావత్ = ఎంతవరకు; దృఢేన = సడలని; మద్భక్తియోగేన = నా యందు భక్తియుక్తుడగుటచే; మనః కషాయః = మనస్సును చెడగొట్టునట్టి; రజః = రజోగుణము: నిరస్యేత = పోగొట్టబడునో; తావత్ = అంతవరకు; మాయారచితేషు = మాయచే కల్పితములైన; గుణేషు = విషయములయందు; సంగః = సంబంధము; పరివర్జనీయః = పరిత్యజింపపగినది.

తా. అట్లయ్యును దృఢమగు అధ్యవసాయముచే మద్భక్తితత్పరుడై, మనస్సును రజోగుణసంపర్కము లేనిదానినిగా చేసికొనువరకు మాయాకల్పితములగు విషయములతో సాంగత్యము వర్జించవలెను.

అవ. దానినే దృష్టాంతముతో నుపపాదించుచున్నారు.-

శ్లో. **యథాఽఽమయోఽసాధు చికిత్సితో నృణాం పునః పునః సంతుదతి ప్రరోహన్,**
**ఏవం మనోఽపక్వకషాయకర్మ కుయోగినం విధ్యతి సర్వసంగమ్.** 28

అ. యథా = ఏ విధముగా; నృణాం = నరులకు; అసాధు చికిత్సితః = చక్కగా చికిత్స చేయబడని; ఆమయః = వ్యాధి; పునః పునః = మాటి మాటికి, ప్రరోహన్ సంతుదతి = రోగము పొడసూపునట్లు చేయునో; ఏవం = ఈ విధముగనే; అపక్వకషాయకర్మ = దహింపబడని రాగాదులు; తన్మూలములగు కర్మలు కలిగినది; సర్వసంగం = పుత్రాదు లెల్లరియం దాసక్తమైనదియగు; మనః = మనస్సు. కుయోగినం = సమ్యగ్ జ్ఞానము లేనివానిని; విధ్యతి = భ్రంశము నొందించును.

తా. వ్యాధికి తగిన చికిత్స చేయకుండుటచే నది యెట్లు మఱల మఱల నావిర్భవించుచునే యుండునో యట్లే దహించబడని రాగాదులు, తన్మూలముగా కర్మలు కలదై, దారాపుత్రాదులం దాసక్తమైన మనస్సు సమ్యగ్ జ్ఞానము లేనట్టి వానిని భ్రష్టుని చేయును

అవ. ఓయీ! ఎట్లైని విషయసంగ మేర్పడినచో యోగభ్రంశము కలుగునందురా అట్టిచో ఉపాయసహితమగు యోగమార్గము ప్రయోజకము గదా అనగా ఇట్లు చెప్పుచున్నారు,

శ్లో. కుయోగినో యే విహితాన్తరాయై ర్మనుష్యభూతై స్త్రిదశోపసృష్టైః
తే ప్రాక్తనాభ్యాసబలేన భూయో యుంజంతి యోగం నతు కర్మతంత్రమ్. **29**

అ. యే = ఎవరు: విహిత + అంతరాయైః = ఆ భక్తియోగమున కంతరాయము కలిగించు; మనుష్యభూతైః = బంధు శిష్యాదిరూపులగు, త్రిదశోప సృష్టైః = దేవతలచే ప్రేరితులైన వారిచే; కుయోగినః = అసమ్యగ్ జ్ఞానులుగ నున్నారో, తే = వారు; ప్రాక్తన + అభ్యాసబలేన = తొల్లింటి యభ్యాస పాటవముచే: భూయః యోగం యుంజతి = తిరిగి జన్మాంతరమున యోగయుక్తులగుచున్నారు. కర్మతంత్రం న తు = కర్మవిస్తారమును మాత్రమా పొందరు

తా. మొదట యోగయుక్తులయ్యు, దేవ ప్రేరితులై యోగాభ్యాసమున కంతరాయము కలిగించునట్టి బంధువులు, శిష్యులు మున్నగు వారు కారణముగా అసమ్యగ్జ్ఞానులైరో, వారును అట్టి తొల్లింటి యభ్యాసబలముచే మఱల యోగయుక్తులగుదురే కాని కర్మపరతంత్రులు కారు.

అవ. ఓ యీ విద్వాంసులకు గూడా సర్వథా కర్మ పరిహరింపరానిదగుటచే తిరిగి సంసారము కలుగునుగదా. కావున చెప్పుచున్నారు.

శ్లో. కరోతి కర్మ క్రియతే చ జన్తుః కేనాప్యసౌ చోదిత ఆని పాతాత్,
న తత్ర విద్వాన్ ప్రకృతౌ స్థితోఽపి నివృత్తతృష్ణః స్వసుఖానుభూత్యా. **30**

అ. అసౌ జన్తుః = విద్వాంసుడు కానట్టి యీ దేహమే; కరోతి కర్మ = భోజనాదికమగు కర్మను చేయుచున్నది; క్రియతే చ = వికారము పొందింపబడుచున్నది (ఆ భోజనాది రూపమగు కర్మచే పుష్ట్యాదులను కూడ పొందుచున్నది) కేనాపి = ఏదో ఒక; సంస్కారము మున్నగువానిచే; చోదితః = ప్రేరేపించబడినదై ; ఆనిపాతాత్ = మరణ పర్యంతము; కర్మ చేయుచున్నది. విద్వాంస్తు = పండితుడగు ఆత్మ మాత్రము; ప్రకృతౌ = దేహమందు; స్థితః అపి = ఉన్నను; స్వసుఖానుభూత్యా = ఆత్మసుఖానుభవముచే; నివృత్తతృష్ణః = కోరికలు లేనివాడై ; తత్ర = ఆకర్మయందు; న = వికారమొందడు అహంకారము లేనివాడగుటచే హర్షవిషాదాదులచే సంసారము నొందడు.

తా. విద్వాంసుడు కానట్టి యీ దేహమే భోజనాది రూపమగు కర్మ చేయుచున్నది. దానివలన పుష్టి మున్నగు వికారములు పొందుచున్నది. పండితుడగు ఆత్మయో దేహమందున్నను ఆత్మసుఖానుభవముచే కోరికలు తొలగిన వాడై అట్లు కర్మవలన వికారము నొందడు.

అవ. దైహిక కర్మలచే వికారము కలుగునను శంక యటులిండనిమ్ము. ఏలనన ఈ జీవుడు దేహమును గూడా చూడడనుచున్నాడు.

శ్లో. తిష్ఠంత మాసీన ముత వ్రజంతం శయాన ముక్షంత మదంత మన్నమ్,
స్వభావ మన్యత్ కిమ పీహమానమాత్మాన మాత్మస్థమతి ర్న వేద. **31**

అ. ఆత్మస్థమతిః = స్వాత్మయందే లగ్నమైన మనస్సుగల జీవుడు; తిష్ఠంతం = నిలచినట్టి; ఆసీనం = కూర్చుండినట్టి; ఉత = లేదా; వ్రజంతం = పోవుచున్నట్టి: శయానం = నిదురించుచున్నట్టి; ఉక్షంతం = మూత్రించుచున్నట్టి; అన్నం అదంతం = అన్నము; తినుచున్నట్టి; స్వభావం = స్వభావప్రాప్తమైన; అన్యత్ కిమపి = తదితరమైన దర్శన స్పర్శనాదికమును; ఈహమానం = చేయుచున్న; ఆత్మానం = దేహమును; న వేద = ఎఱుగడు.

తా. ఆత్మస్థమతి యగు జీవుడు నిలచిన, కూర్చున్న, పోవుచున్న, నిదురించుచున్న మూత్రించుచున్న, అన్నమతినుచున్న, స్వాభావికమగు దర్శన స్పర్శనరూపమగు కార్యాంతర మాచరించుచున్న దేహమును తెలిసికొనడు,

అవ. ఓయీ! ఇంద్రియములు కలవాని కెట్లు చూడకుండుట సంభవించుననగా చెప్పుచున్నారు.

**శ్లో. యది స్మ పశ్య త్యసదింద్రియార్థం నానానుమానేన విరుద్ధమన్యత్,**
**న మన్యతే వస్తుతయా మనీషి స్వాప్నం యథోత్థాయ తిరోదధానమ్. 32**

అ. మనీషీ=విద్వాంసుడగు జీవుడు; అసదింద్రియార్థం=బహిర్ముఖములగు యింద్రియముల యొక్క; విషయములను యది పశ్యతి స్మ=చూచుచున్నను; నానానుమానేన=అనేక విధమగుటచే మిథ్య స్వప్నమువలె అను అనుమానముచే; విరుద్ధం=బాధితమై; అన్యత్=ఆత్మవ్యతిరిక్తమును; వస్తుతయా న మన్యతే=వాస్తవమని తలంపడు. యథా=ఎట్లు. ఉత్థాయ=నిద్రలేచి; సంస్కార మాత్రముచేతనే: స్వాప్నం=స్ఫురించుచున్న స్వప్నగతమైన విషయమును తిరోదధానం=స్వయముగనే తిరోహితమగుచున్న దానిని వలె.

తా. విద్వాంసుడగు జీవుడు బహిర్ముఖులగు యింద్రియములయొక్క విషయములను చూచుచున్నను అవి నానావిధములగుటచే మిథ్య అను అనుమానముచే బాధితములగుచున్నవి. అందుచే ఆత్మవ్యతిరిక్తము వస్తువుగా జీవుడు తలంచుటలేదు, నిదుర లేచిన పిమ్మట స్వప్నమున సాక్షాత్కరించిన వస్తువు స్వయముగా తిరోహితమగుచున్నది కదా అట్లే ఇంద్రియవిషయములును తిరోహితములగు చున్నవి.

అవ. ఇట్లు ఆత్మ వికారము నొందదని చెప్పబడినది. ఓయీ! ఇది కుదరదు. ఏలనన ఇది బద్ధావస్థయందు విడువబడుచున్నది. ముక్తావస్థ యందు గ్రహించబడుచున్నది కనుక. ధాన్యమును దంపినపుడు అవి వ్రీహిభావమును వీడి తండులములుగా గ్రహించబడుచున్నవి. వికారమును పొందుచునే యున్నవి కదా. అనగా చెప్పుచున్నారు—

**శ్లో. పూర్వం గృహీతం గుణకర్మచిత్ర మజ్ఞాన మాత్మ న్యవివిక్త మఙ్గ,**
**నివర్తతే తత్పున రీక్షయైవ న గృహ్యతే నాపి విసృజ్య ఆత్మా. 33**

అ. అంగ=ఓయీ ! పూర్వం=బద్ధావస్థయందు; గుణకర్మచిత్రం=సత్త్వాది గుణముల చేతను; తజ్జన్యములగు పుణ్యపాపములచేతను నానావిధమగు; అజ్ఞానం=దేహేంద్రియాది లక్షణమగు అజ్ఞాన కార్యము; ఆత్మని=జీవస్వరూపమందు (ఇతరమం దితరావభాసరూపమగు) అధ్యాసచేత అవివిక్తం= నేను గ్రుడ్డిని, నేను చెవిటిని ఇత్యాద్యభిన్నముగా; గృహీతం=తెలిసికొనబడినది. తదేవ=అధ్యాసచే అభిన్నముగా తెలిసికొనబడిన ఆదేహాదికమే, పునః=తిరిగి; ఈక్షయా ఏవ=స్వరూప జ్ఞానముచేతనే: నివర్తతే=తొలగిపోవుచున్నది. ఆత్మా=ఆత్మయో; న గృహ్యతే=ఏరూపముతోడను గ్రహింపబడుటలేదు. నాపివిసృజ్యః=విడువబడుటయును లేదు. ఇది భావము—ముక్తి క్రియాఫలమగుచో ఆత్మకు వికారము కలిగెడిది. కాని ముక్తి ఆరోపితమగు అజ్ఞానమాత్రము తొలగిపోవుట యను రూపము కలది యగుటచే బంధ మోక్షము లాత్మను స్పృశించవు. కావున దానికి వికారము కలుగదు.

తా. ఉద్ధవా ! బద్ధావస్థలో సత్త్వాదిగుణములు తజ్జన్యములగు పుణ్యాపాపములవలన ఆత్మయందు నేను శుద్ధిని నేను చెవిటిని యిత్యాదిగా దేహేంద్రియాది లక్షణమగు అజ్ఞానము పలుతీరుల అధ్యాస చేయబడినది. తిరిగి ఆ దేహాదికము తత్స్వరూప జ్ఞానముచే తొలగి పోవు చున్నది. ఆత్మ ఏ రూపముతోడను గ్రహింపబడదు. విడువబడదు.

అవ. దీనినే దృష్టాంతముచే స్పష్టము చేయుచున్నారు—

శ్లో. యథా హి భానో రుదయో నృచక్షుషాం తమో నిహన్యా న్నతు సద్విధత్తే,
ఏవం సమీక్షా నిపుణా సతీ మే హన్యా త్తమిస్రం పురుషస్య బుద్ధేః. **34**

అ. యథా = ఏ ప్రకారముగా; భానోః ఉదయః = సూర్యోదయము: నృచక్షుషాం = మనుష్య నేత్రముల యొక్క; తమః = అంధకారమును; నిహన్యాత్ = పోగొట్టును గాని; నతు సత్ విధత్తే = పూర్వమే ఘటాదికమును సృజింపదు; ఏవం = ఈ ప్రకారముగా, నిపుణా సతీ = కౌశలముతో కూడిన; మే సమీక్షా = నా సంబంధి ఆత్మవిద్య; పురుషస్య = పురుషుని యొక్క; బుద్ధేః = బుద్ధియొక్క; తమిస్రం = చీకటిని; హన్యాత్ = పోగొట్టును.

తా. సూర్యోదయము మానవుల నేత్రముల కేర్పడిన యంధకారమును తొలగించునే కాని అయా దృశ్యమానములగు ఘటాదులను సృజింపదు. అట్లే నా యీ ఆత్మవిద్యయు పురుషుని బుద్ధికి కలిగిన అంధకారమును మాత్రమే తొలగించును గాని జ్ఞానమును కలుగజేయదు. ఆ స్వరూపభూత జ్ఞానమునకు ఆవరకమగు అజ్ఞానమును ఆత్మవిద్య తొలగించును గాని. జ్ఞానము కలిగింపదు.

అవ. ఆత్మ నిర్వికార మగుటను వివరించుచున్నారు—

శ్లో. ఏష స్వయంజ్యోతి రజోఽప్రమేయో మహానుభూతిః సకలానుభూతిః,
ఏకోఽద్వితీయో వచసాం విరామే యేనేషితా వాగసవ శ్చరన్తి. **35**

అ. 'ఏషః' అనుదానిచే; అపరోక్షమగుటచే నిత్యప్రాప్తమగు ఆత్మయొక్క ప్రాప్తిని వారించు చున్నారు. ఏషః = ఈ ఆత్మ; స్వయంజ్యోతిః = స్వయం ప్రకాశము; అజః ఉత్పత్తిరహితము; అప్రమేయః = జ్ఞానమను శక్తి విశేషమును కలిగించు నట్టిది; మహానుభూతిః = దేశకాల పరిచ్ఛేద శూన్యమగు స్వరూప జ్ఞానము కలది. సకలానుభూతిః = సకల జ్ఞానములకు కారణమైనది; ఏకః = సజాతీయ భేదశూన్యము; అద్వితీయః = విజాతీయ భేదశూన్యము; వచసాం = వాక్కులకు; విరామే = అగోచర మగుటచే వాక్కులు నివర్తించగా, "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని శ్రుతి. యేన = ఏ ఆత్మచే; ఇషితాః = ప్రేషితములై; వాగసవః = వాక్కు; ప్రాణములును; చరన్తి = సంచరించుచున్నవి.

తా॥ ఈ యాత్మ స్వయంప్రకాశము, ఉత్పత్తిలేనిది. అప్రమేయము, దేశకాల పరిచ్ఛేద శూన్యమగు స్వరూపజ్ఞానము కలది. సకల జ్ఞానములకు కారణమైనది. సజాతీయ విజాతీయ భేదశూన్యము, వాక్కుల కగోచరమగుటచే అవి మరలినవి. ఆత్మ ప్రేరితములై మాత్రమే వాక్కు ప్రాణములు సంచరించుచున్నవి.

అవ. ఆత్మ కద్వితీయత్వము నుపపాదించు కొఱకు భేద మవాస్తవమనుచున్నారు—

**శ్లో. ఏతావా నాత్మన్యమహో యద్వికల్పస్తు కేవలే,**
**ఆత్మన్నృతే స్వమాత్మాన మవలంబో న యస్య హి. 36**

అ. కేవలే=అభిన్నమగు; ఆత్మన్=ఆత్మయందు; వికల్పః ఇతి యత్=వికల్ప మని ఏది కలదో; ఏతావాన్=ఇది యంతయు; ఆత్మనస్మోహః=మనస్సుయొక్క భ్రమమాత్రమే. ఏలయనగా స్వమాత్మాన మృతే=ఆత్మ తప్ప, యస్య=ఏ వికల్పమునకు; అవలంబః న=ఆశ్రయము లేదు. ముత్యపు చిప్ప లేక రజతభ్రమ లేనట్లు. 'నేహ నానాస్తి కించన ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే యుక్తా హ్యస్య హరయః శతా దశ" ఇత్యాది శ్రుతి.

తా॥ అభిన్నమగు ఆత్మయందు వికల్పము మనోభ్రమ మాత్రమే కాని వేఱుకాదు. ఏల యన ఆత్మ తప్ప అట్టి వికల్పమున కాధారము లేదు. ముత్యపు చిప్ప లేక రజతభ్రమ కలుగదు కదా.

అవ. కొందరు ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడుచున్న ప్రపంచము బాధితమగుట కుదురదు కావున వేదాంతార్థములు క్రతువునకు వలెయు కర్తను ప్రతిపాదించుటయందే తాత్పర్యము కలవగుటచే అర్థవాదములగుటవలన ద్వైతము సత్యమని తలంచుచున్నవి. వారి మతముననువదించి దూషించుచున్నారు—

**శ్లో. యన్నామాకృతిభి ర్గ్రాహ్యం పంచవర్ణ మబాధితమ్.**
**వ్యర్థేనా ప్యర్థవాదోఽయం ద్వయం పండిత మానినామ్. 37**

అ. నామాకృతిభిః=నామరూపములచే; గ్రాహ్యం = ఉపలక్షితమైనదియు; పంచవర్ణం= పంచభూతాత్మకమైనదియు అగు; ద్వయం=ఏ ద్వైతము కలదో అది,అబాధితం=బాధితము కానిది అని; పండిత మానినాం = మేమే పండితులమని అభిమానముకల వారికి; అయం అర్థవాదః=వేదాంతములందిది అర్థ వాదమను ప్రతీతి కలుగును కాని తత్త్వవాదులకు కాదు. ఏలనన, వ్యర్థేన+అపి = ఆ ప్రతీతినిష్ప్రయోజనము కనుక.

తా॥ నామరూపములచే నుపలక్షితమైనదియు పంచభూతాత్మకమైనది యగు ఏద్వైతము కలదో అది యబాధితమని పండితులమని తమ్ము తాము తలంచు వా రనుకొందురు. వారే దీని నర్థవాదమని తలంతురు కాని తత్త్వవాదులట్లు తలంపరు. ఏలనన ఆ ప్రతీతి నిష్ప్రయోజనము.

అవ ఇట్లు జ్ఞానయోగమును సవిస్తరముగా నిరూపించి యిపుడు తన్నిష్ఠునకు విఘ్న ప్రతీకారము మూడు శ్లోకములచే తెలుపు చున్నారు—

**శ్లో. యోగినోఽపక్వయోగస్య యుంజతః కాయ ఉత్థితైః,**
**ఉపసర్గై ర్విహన్యేత తత్రాయం విహితో విధిః. 38**

అ. అపక్వయోగస్య=పక్వముకాని యోగముగల (సిద్ధినొందని) వాడును; యుంజతః=యోగ యుక్తుడైనట్టి యోగినః=యోగియొక్క; కాయః=శరీరము; ఉత్థితైః=ఉద్రిక్తములైన; ఉపసర్గైః= విఘ్నములచే; విహన్యేత=చెడగొట్టబడుచో; తత్ర=అచ్చట; అయం=ఈ; విధిః=విధానము; విహితః=విధించబడినది.

తా. యోగమందు సిద్ధి నొందక యోగము నవలంబించి యున్నవాని శరీరము విఘ్నములచే నెదుర్కొనబడుచో అపుడీ విధానము విహితమై యున్నది.

శ్లో. యోగధారణయా కాంశ్చి దాసనై ర్ధారణాన్వితైః,
తపోమంత్రౌషధైః కాంశ్చి దుపసర్గా న్వినిర్దహేత్. **39**

అ. యోగధారణయా=సోమసూర్యాది ధారణచేత; కాంశ్చి దుపసర్గాన్=కొన్ని విఘ్నములను సంతాప శైత్యాదులను), ఆసనైః=వాయువును ధరించుటతో కూడిన ఆసనములచే; కాంశ్చిత్=కొన్నింటిని (వాతాది రోగములను) తపోమంత్రౌషధైః=తపస్సు, మంత్రము, ఔషధములతో, కాంశ్చిత్=కొన్నింటిని (పాపగ్రహ సర్పాది కృత క్లేశములను) వినిర్దహేత్=దహించవలెను.

తా. సోమ సూర్యాది ధారణముచే సంతాప శైత్యాదులను, ఆసనములచే వాతాదిరోగములను, తపో మంత్రౌషధములచే పాపగ్రహ సర్పాది కృతక్లేశములను దహించ వలెను.

శ్లో. కాంశ్చి న్మమానుధ్యానేన నామసంకీర్తనాదిభిః,
యోగేశ్వరానువృత్త్యా వా హన్యా దశుభదాన్ శనైః. **40**

అ కాంశ్చిత్=మఱికొన్ని; అశుభదాన్=అశుభమును కలిగించునట్టి కామాదులను మమ=నా యొక్క; అనుధ్యానేన=సతత చింతన చేతను; నామసంకీర్తనాదిభిః=నామ సంకీర్తనము మున్నగువాని చేతను; దంభమానాదులను; యోగేశ్వరానువృత్త్యావా=యోగేశ్వరుల ననువర్తించుటచేతనుగాని; శనైః=మెల్లగా; హన్యాత్=పోగొట్టవలెను

తా॥ శ్రేయస్కరములు కాని కామాదులను నన్ను సదా ధ్యానించుట చేతను నా నామ జపము చేతను దంభమానాదులను యోగీశ్వరుల ననుసరించుట చేతను మెల్లమెల్లగా పోగొట్టవలెను.

అవ. కొందఱు దేహసిద్ధికై దీని నంతను చేయుచున్నారు. దానిని దూషించుచున్నారు.

శ్లో. కేచి ద్దేహమిమం ధీరాః సుకల్పం వయసి స్థితమ్,
విధాయ వివిధోపాయై రథ యుంజంతి సిద్ధయే. **41**

అ. కేచిత్=కొందరు; వివిధోపాయైః=చెప్పబడినవి మఱియు తదితరములైన ఉపాయములతో; ఇమం దేహం=ఈ శరీరమును; సుకల్పం=జరారోగాదులు లేనిదిగను; వయసి=యుక్త వయస్సునందు; స్థితం=ఉన్నట్టిది గాను; కృత్వా=చేసి; పరకాయ ప్రవేశాది సిద్ధికొఱకు ఆయాధారణారూపమగు; యోగం యుంజంతి,=యోగ నిష్ఠులగు చున్నారు కాని జ్ఞాన నిష్ఠులగుట లేదు.

తా॥ కొంద ఱీ చెప్పబడినవే కాక తక్కిన వివిధోపాయములతో నీ శరీరమును జరా రోగాదిరహితము, యుక్తవయస్సు కలదిగా చేసికొని పరకాయప్రవేశాదిసిద్ధికై యోగాభ్యాసము చేయుచున్నారే కాని జ్ఞానము కొఱకు కాదు.

శ్లో. న హి తత్కుశలాదృత్యం తదాయాసో హ్యపార్థకః,
అ న్తవత్త్వా చ్ఛరీరస్య ఫలస్యేవ వనస్పతేః. **42**

అ. తత్ = అట్టిపని; కుశలాదృత్యం నహి = బుద్ధిమంతున కాదరణీయము కాదు; తదాయాసః = అట్టి యోగాభ్యాసము వలని కష్టము; అపార్థకః = నిష్ప్రయోజనము. ఏలననగా; శరీరస్య అంతవత్త్వాత్ = శరీరము వినాశి కనుక; వనస్పతేః = వృక్షరాజము యొక్క; ఫలస్య ఇవ = ఫలమువలె.

తా॥ కావున బుద్ధిమంతు లావిధమగు యోగాదుల నాదరింపరు. దానికై చేయుశ్రమ నిరర్థకము. శరీర మెంత పోషించినను వృక్షమునుండి ఫలము పడినట్లు నశించును. ఆత్మయో వనస్పతివలె స్థిరముగా నుండును.

అవ. ఓయీ! కొండొకచో సమాధి కంగముగా ప్రాణాయామాది యోగము నాచరించుచో ముసలి తనము రోగములు లేకుండుట కనపడుచున్నది కదా అనగా సత్యమే. అట్లయ్యును సమాధిని వీడి దానియందు సక్తుడు కారా దనుచున్నారు—

**శ్లో. యోగం నిషేవతో నిత్యం కాయ శ్చేత్కల్పతా మియాత్,**
**తచ్ఛ్రద్దధ్యా న్న మతిమాన్ యోగ ముత్సృజ్య మత్పరః. 43**

అ. నిత్యం = నిత్యము; యోగం నిషేవతః = యోగము నాచరించువాని; కాయః = శరీరము; ఉత్కల్పతాం = పాటవమును; ఇయాత్ = పొందును; మతిమాన్ = బుద్ధిమంతుడు; యోగ ముత్సృజ్య = యోగమునువీడి; మత్పరః = నాయం దాసక్తుడు కావలెనే కాని; తత్ = ఆ దేహసిద్ధిని; నశ్రద్దధ్యాత్ = నమ్మరాదు.

తా॥ నిత్యము యోగము నాచరించువాని శరీరము పాటవము నొందును. కుశలుడగువాడా శరీర సిద్ధిని నమ్మక యోగమార్గమును విడచి నా యందాసక్తుడు కావలెను.

అవ. ఇట్లు విఘ్నములకు ప్రతీకారము చేయుటద్వారా యోగము నాచరింపవలెనని చెప్పబడినది. కాని నన్ను శరణు జొచ్చినవానికి మాత్రము విఘ్నశంకయే లేదనుచున్నారు—

**శ్లో. యోగచర్యా మిమాం యోగీ విచరన్ మద్వ్యపాశ్రయః,**
**నాంతరాయై ర్విహన్యేత నిఃస్పృహః స్వసుఖానుభూః. 44**

అ. యోగీ = యోగియగువాడు; ఇమాం = ఈ; యోగచర్యాం = యోగచర్యను; విచరన్ = ఆచరించుచు; మద్వ్యపాశ్రయః = మచ్చరణుడగుటచే; నిస్పృహః = ఏ కోరికలును లేక; స్వసుఖానుభూః = ఆత్మసుఖానుభూతి కలవాడై, అంతరాయైః = విఘ్నములచే, న విహన్యేత = నిహతుడు కాడు.

తా॥ యోగి యీ యోగచర్య నాచరించుచు నన్నాశ్రయించిన వాడు కనుక కోరికలు లేనివాడై విఘ్నములచే కొట్టువడక ఆత్మసుఖానుభూతిని పొందును.

ఇతి శ్రీమద్భాగవత మహాపురాణే ఏకాదశస్కంధే అష్టావింశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందు ఏకాదశస్కంధమున

ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము

# ఏకోన త్రింశాధ్యాయము

## సంగ్రహ శ్లోకములు

శ్లో. **ఊనత్రింశే తు యః పూర్వం విస్తరేణ నిరూపితః**
**భక్తియోగ స్తమేవాహ స్వభక్తాయ సమాసతః.**
**అతి క్లేశ మివాలక్ష్య యోగేఽసంగైక సంపది,**
**సుఖోపాయం పునః కృష్ణ ముద్ధవః పరిపృచ్ఛతి.**

ఈ యిరువది తొమ్మిదవ అధ్యాయమున ముం దేభక్తియోగము విస్తారముగ నిరూపించబడెనో దానినే సంగ్రహముగా భగవంతుడు తన భక్తున కుపదేశించుచున్నాడు. నిస్సంగముచేతనే సాధింపదగిన యోగవిద్య మిగుల కష్టమని భావించి యుద్ధవుడు సుఖోపాయము తెలుపుమని మఱల కృష్ణు నడుగుచున్నాడు—

ఉద్ధవ ఉవాచ= ఉద్ధవుడు పలికెను.

శ్లో. **సుదుస్తరా మిమాం మన్యే యోగచర్యా మనాత్మనః,**
**యథాఽంజసా పుమాన్ సిధ్యే త్తన్మే బ్రూహ్యంజసాఽచ్యుత.** 1

అ. అచ్యుత=ఓ అచ్యుతుడా! ఇమాం=ఈ; యోగచర్యాం=యోగవిద్యను; అనాత్మనః=మనస్సును తనవశమం దుంచుకొనని వానికి; సుదుస్తరాం=మిక్కిలి దురధిగమముగా; మన్యే=తలంతును; పుమాన్=మనుజుడు; యథా=ఎట్లు; అంజసా=సుఖముగా; సిధ్యేత్=ఆ యోగమందు సిద్ధినందునో; తత్= ఆ ప్రకారమును; అంజసా=స్పష్టముగా; మే=నాకు; బ్రూహి=చెప్పుము.

తా॥ అచ్యుతుడా! ఈ యోగవిద్య మనస్సు నదుపుచేయని వానికి దురధిగమమని నా భావన. మనుజు డే విధముగ సుఖముగా నా యోగమున సిద్ధి నందునో అట్టి మార్గమును నాకు తేటతెల్ల మొనర్పుము.

అవ. యోగము సుదుష్కరమగుటను వివరించుచున్నారు.

శ్లో. **ప్రాయశః పుండరీకాక్ష యుంజన్తో యోగినో మనః,**
**విషీదం త్యసమాధానా న్మనో నిగ్రహ కర్శితాః.** 2

అ. పుండరీకాక్ష!=ఓ భగవంతుడా! యోగినః=యోగనిష్ఠులు; మనః = మనస్సును; యుంజన్తః=నిగ్రహించుకొనుచు; అసమాధానాత్=అట్లు నిగ్రహించుకొనజాలక; మనోనిగ్రహకర్శితాః=ఎట్లో మిగుల ప్రయాసచే నట్లు నిగ్రహించుటచే నలయుచు; ప్రాయశః= సాధారణముగ విషీదంతి=దుఃఖపడుదురు.

తా॥ ఓ భగవంతుడా! యోగులు తమ మనస్సును నిగ్రహించుకొను ప్రయత్నములో వొడుదొడుకులు పొందుచు ప్రయత్నముచే నిగ్రహించుటవలన నలయుచు సామాన్యముగ దుఃఖితులగుదురు.

శ్లో, **అథాత ఆనందదుఘం పదాంబుజం హంసాః శ్రయేర న్నరవిన్దలోచన,**
**సుఖం ను విశ్వేశ్వర యోగకర్మభి స్త్వన్మాయయాఽమీ విహతా న మానినః, 3**

అ. అరవిందలోచన=ఓ కమలేక్షణా! అథ అతః = ఎందువలన ఈ ప్రకారము కొందఱు విషాదమును పొందుచున్నారో అందువలన; యే హంసాః=సారాసార వివేకమందు కుశలురైనవారు; ఆనందదుఘం=సమస్తమగు ఆనందమును పూరించునట్టి; పదాంబుజం=నీ పాదపద్మమునే; సుఖం =సుఖము కలుగునట్లుగా; శ్రయేరన్=నిశ్చయముగ నాశ్రయింతురు. విశ్వేశ్వర=లోకప్రభో; అమీ=వీరు; త్వన్మాయయా=నీ మాయచే; విహతాః=కొట్టబడినవారు; యోగకర్మభిః=యోగముచే కర్మలచే; మానినః=గర్వము కలిగి, న శ్రయేరన్=మీ పదాబ్జముల నాశ్రయించరు. లేక, అమీ= నీ భక్తులు; త్వన్మాయయా=నీ మాయచే; న విహతాః=కొట్టువడనివారై; యోగకర్మభిః=యోగాచరణములచే; న మానినః=గర్వితులు కారు. ఇతరులు నీ మాయామోహితులై మేము యోగ విదులము మేము కర్మఠులము అని కేవలము గర్వితులగుదురు వారుముక్తులు కారు.

తా॥ ఓ అరవిందలోచనా! ఓ విశ్వేశ్వరా! కొందరిట్లు క్లేశమును పొందుచున్నారు. కావున సారాసార వివేకము కల చతురులగు హంసలు యోగులు. సమస్తానంద పరిపూరకమగు నీ పాదాంబుజమును సుఖముగ ఆశ్రయించిన నీ భక్తులు వీరు నీ మాయచే కొట్టువడక యోగముచే. కర్మలచే గర్వితులు కానివారగుదురు. మున్ను పేర్కొనిన యోగకర్మములచే గర్వితులై నీ పాదకమలముల నాశ్రయింపరు. ఇతరులు నీ మాయచే మోహమును పొంది మేము యోగ విదులము కర్మ కుశలురము అని గర్వితులగుచున్నారు. వారు ముక్తులు కారు.

అవ:- నీభక్తులైనచో నీ ప్రసాదమున కృతార్థు లగుచున్నారు. అది వింత కాదనుచున్నారు—

శ్లో. **కిం చిత్ర మచ్యుత! తవైత దశేషబంధో**
**దాసే ష్వనన్య శరణేషు యదాత్మ సాత్త్వమ్,**
**యోఽరోచయత్ సహ మృగైః స్వయ మీశ్వరాణాం**
**శ్రీమత్కిరీట తట పీడిత పాదపీఠః. 4**

అ. అచ్యుత=ఓ కృష్ణా! అశేషబంధో= ఎల్లవారికి బంధువా! అనన్యశరణేషు=ఇతర శరణము లేని; దాసేషు=నీ దాసులందు నంద గోపీ; బలిప్రభృతులందు తవ=నీ యొక్క; ఆత్మ సాత్త్వం యత్=నీ యధీనత్వ మేదో, నీవు వారి కధీనుడవై యుండుట అనునది యేదో; ఏతత్ కిం చిత్రం=ఇదియొక ఆశ్చర్యము కాదు. ఏలయిన; యః=ఏ నీవు; శ్రీరామరూపమున; మృగైః సహ =వానరులతో; సఖ్యము; అరోచయత్=ప్రేమతో చేసితివో; కార్యార్థ మన్నచో కాదు; ఈశ్వరాణాం= బ్రహ్మాది లోక ప్రభువులకును; శ్రీమత్కిరీట తట పీడిత పాదపీఠః=కాంతిమంతము కిరీటాగ్రములచే రాపిడినొందింపబడిన పాదపీఠము కలవాడవై; స్వయం=స్వయముగా; అట్టివాడవయ్యును.

తా॥ ఓ అచ్యుతా! ఓ అశేషబంధూ! నిన్ను తప్ప నితరమైన శరణులేని నీ దాసులగు నందుడు, గోపికలు బలిచక్రవర్తి లోనగువారియందు నీ వధీనుడవై యుండుట అనునదొక

చిత్రము కాదు. బ్రహ్మాదులగు లోకప్రభుల యొక్క సువర్ణ రత్న కాంతులు వెదజల్లు కిరీటాగ్రములు నీ పాదపీఠమును తాకుచున్నవి. దేవదేవుడవగు నీవు స్వయముగా శ్రీరామరూపమున వానరులతో సఖ్యమును ప్రీతితో గావించియున్నావు.

అవ. అందువలన నిన్ను పరిత్యజించి అన్యు నెవడాశ్రయించు ననుచున్నారు —

**తం త్వాఖిలాత్మ దయితేశ్వర మాశ్రితానాం**
**సర్వార్థదం స్వకృతవి ద్విసృజేత కో ను,**
**కో వా భజేత్ కిమపి విస్మృతయేఽనుభూత్యై**
**కిం వా భవే న్న తవ పాదరజోజుషాం నః** 5

అ. అఖిల + ఆత్మదయిత + ఈశ్వరం = సర్వజగమునకు ఆత్మయు చైతన్యము కలిగించువాడు ప్రియుడును సేవ్యుడును, ఆశ్రితానాం = తన్నాశ్రయించిన వారికి; సర్వ + అర్థదం = ఎల్ల పురుషార్థముల నిచ్చువాడు; స్వకృతవిత్ = స్వీయులైన బలి ప్రహ్లాదాదులందు చేసిన అనుగ్రహము నెఱిగియున్నవాడు: కః = ఎవడు; తం = అట్టి; త్వాం = నిన్ను; విసృజేత = భజింపక వీడును? కిమపి = నీకంటె వ్యతిరేకమైన దేవతను సైతము; ధర్మజ్ఞానాది సాధనముగాని; భూత్యై = ఐశ్వర్యమునకు; విస్మృతయే = సంసారమునుండి మోక్షమునకు, కః భజేత = ఎవడు సేవించును? కిం అపి = అతి తుచ్ఛం; నీ కంటె వేఱైన స్వర్గాదికమును ఎవడు భజించును? తవ = నీ యొక్క; పాదరజోజుషాం = పాదధూళి సేవనము చేయువారికి; కిం వా న భవేత్ = ఏది లభింప కుండును?

స్వీయులైన బలిప్రహ్లాదులను అనుగ్రహించిన నిన్ను నెఱింగినవాడు, లేక తనయందే అంతర్యామి రూపమున నుండి చేసిన ఉపకారము నెఱింగినవాడు ఎల్లజనమునకు ఆత్మ అనగా చైతన్య మిచ్చువాడును అత్యంతప్రియుడు, కనుక సుసేవ్యుడు నియంత ఈశ్వరుడును అవశ్యము సేవింపదగిన వాడును, ఆశ్రితుల కెల్ల పురుషార్థముల నిచ్చువాడగు నిన్నెవడు భజింపక విడుచును? అతి తుచ్ఛమై నీకు వ్యతిరిక్తమైన స్వర్గాదికను నీ విచ్చిననైన కాని నెవ్వడు సేవించును? లేక నీ కంటె వ్యతిరిక్తమైన దేవతను ధర్మజ్ఞానాది సాధనముగాను ఐశ్వర్యమునకు సంసార విస్మృతికిని అనగా మోక్షమునకు ఎవడు భజించును? నీ పాద పరాగ సేవనమున మాకు మంచిఏమి కలగదు?

ఆ స్వర్గాది సేవనము ఇంద్రియభోగ ఫలకము. అనంతరము నిన్ను విస్మృతి చెందించు వఱకు ఆయా సాధనము లేక భోగమోక్షాది ఫలము కలుగదు. అట్లే శ్లోకము—

యా వై సాధన సంపత్తిః పురుషార్థచతుష్టయే
తయా వినా తదాప్నోతి నరో నారాయణాశ్రయః

పురుషార్థములు నాలుగింటికి సాధన సంపత్తి ఏది కలదో అది లేకున్నను నారాయణుని ఆశ్రయించి నరుడు పురుషార్థ చతుష్టయమును పొందును.

అవ. ఇతర దేవతా భజన వార్త నట్లుండనిమ్ము. నీవు గావించిన ఉపకారమునకు నీయందు ఆత్మనివేదనము చేయుటయే నిష్కృతి (ఋణము తీరుట) ఇతరముగా కాదు అనుచున్నారు—

శ్లో. నైవోపయం త్యపచితిం కవయ స్తవేశ
బ్రహ్మాయుషాపి కృత మృద్ధముదః స్మర న్తః,
యో౽ న్తర్బహి స్తనుభృతా మశుభం విధున్వ
న్నాచార్య చైత్త్య వపుషా స్వగతిం వ్యన క్తి. 6

ఈశ = ఓ పరమేశ్వరా! తవ కృతం = నీచే గావింపఁబడిన ఉపకారమును; స్మరంతః = తలంచుచు; ఋద్ధముదః = అభివృద్ధినందిన పరమానందము కలిగినవారగు; కవయః = బ్రహ్మవేత్తలు సైతము; బ్రహ్మ + ఆయుషా + అపి = బ్రహ్మయొక్క ఆయువు కలవారై నను; అపచితిం = ప్రత్యుపకారమును; అకృత్యమును; న ఏవ ఉపయ న్తి = ఏమాత్రము పొందలేదు. యః = నీవు; బహిః = వెలుపలను; అంతః = లోపలను; ఆచార్యచైత్త్యవపుషా = శ్రీగురురూపదేశమును అంతర్యామిరూపమున; తనుభృతాం అశుభం విధున్వన్ = జీవులయొక్క విషయవాసనను తొలగించు; స్వగతిం = నిజరూపమును వ్యన క్తి = ప్రకటించుచుదువు.

తా. ఓ పరమేశ్వరా! నీవొనర్చిన యుపకారమును స్తుతించుచు, అందు అభివృద్ధి నందిన పరమానందము గల బ్రహ్మవేత్తలు సైతము బ్రహ్మయుష్కాలము శ్రమపడి నీకు ప్రత్యుపకారము చేసి, నీ ఋణము తీర్చుకొనలేరు. ఏల? నీ యుపకార మెట్టిదనగా బాహిర ప్రపంచమున శ్రీసద్గురు రూపమున దర్శనమిచ్చియు, లోపల జ్ఞానమయుడగు అంతర్యామి రూపమున నుండి శరీరధారులయొక్క విషయవాసనను బోగొట్టి నీ స్వరూపమును ప్రకటించుచున్నావు. ఇంత పెద్ద యుపకారమునకు ఏమి బదులు ఎవ్వడు చేయగలడు?

శ్రీశుక ఉవాచ—శ్రీశుకుడు పలికెను-

శ్లో. ఇత్యుద్ధవే నాత్య నుర క్త చేతసా
పృష్టో జగత్క్రీడనకః స్వశ క్తిభిః,
గృహీత మూ ర్తి త్రయ ఈశ్వరేశ్వరో
జగాద సప్రేమ మనోహర స్మితః. 7

అ. ఇతి = ఈ ప్రకారము; అనుర క్త చేతసా = తనయందు ప్రేమగల చి త్తముగల; ఉద్ధవేన = ఉద్ధవునిచే పృష్టః = అడుగబడినవాడు; స్వశ క్తిభిః = తన జ్ఞానైశ్వర్యాది శ క్తులచే; జగత్క్రీడనకః = జగత్తులను ఆటబంతి కలవాడై; గృహీత మూ ర్తిత్రయః = గైకొనబడిన బ్రహ్మవిష్ణుశివులను మూడు మూర్తులుకల· ఈశ్వర + ఈశ్వరః = బ్రహ్మదులగు లోకపాలురకు ప్రభువైన కృష్ణుడు; మనోహర స్మితః = చెలువమైన లేత నవ్వుకలవాడై ; స ప్రేమ = ప్రేమతో; జగాద = ఇట్లు చెప్పెను.

తా. ఇట్లు ఉద్ధవుడు అనుర క్తచిత్తుడై తన్నాశ్రయించినంత తన జ్ఞాన వీర్య సంపదాది శక్తులతో జగము నాటబంతిగా క్రీడించు కృష్ణుడు, త్రిగుణాత్మకులైన బ్రహ్మవిష్ణు రుద్రుల రూపము గైకొని బ్రహ్మదిలోక పాలురకును ప్రభువు మొగమున లేత నగవు మొలకెత్తుచుండ:ప్రేమతో నుద్ధవునితో నిట్లు పలికెను.

శ్లో॥ హంత తే కథయిష్యామి మమ ధర్మాన్ సుమంగళాన్.
యాన్ శ్రద్ధయా చరన్ మర్త్యో మృత్యుం జయతి దుర్జయమ్. 8

అ. హన్త! = ఓయా'; తే = నీకు; సుమంగళాన్ = సుఖరూపములైన; మమ = నాయొక్క; ధర్మాన్ = ధర్మములను. కథయిష్యామి = వివరించెదను: మర్త్యః = మానవుడు; యాన్ = యేధర్మములను, శ్రద్ధయా = శ్రద్ధతో; ఆచరించుచు; దుర్జయం = ఇతర ఉపాయములతో జయింపలేని; మృత్యుం = సంసారమును; జయతి = జయించును

తా. ఓ ఉద్ధవా! సుఖస్వరూపములైన నాధర్మములను నీకు తెలియజేయుచున్నాను. వీటిని తెలుసుకొని శ్రద్ధగా ఆచరించినవారు ఇతర మార్గములలో జయింప శక్యముకాని సంసారమును జయించగలరు.

అవ:- 13 శ్లోకములతో ధర్మములను తెలుపుచున్నాడు

శ్లో॥ కుర్యాత్సర్వాణి కర్మాణి మదర్థం శనకైః స్మరన్
మయ్యర్పితమనశ్చిత్తో మద్ధర్మాత్మ మనోరతిః 9

అ. స్మరన్ = నన్ను తలచుచు; శనకైః = సంరంభము లేకుండగా; మయి = నాయందు; అర్పిత = అర్పించబడిన; మనశ్చిత్తః = సంకల్పాత్మకమైన మనస్సు; అనుసంధానాత్మకమైన చిత్తము కలవాడై; మత్ = నాయొక్క; ధర్మ = ధర్మములందు; ఆత్మ = ఆత్మకు; మనో = మనసున రతిః = ప్రీతి కలవాడై; సర్వాణి = అన్ని; కర్మాణి = పనులను; మదర్థం = నా కొరకు; కుర్యాత్ = చేయవలయును.

తా. సంరంభములేకుండగా నన్నే తలచుచు, సంకల్పాత్మకమైన మనసును అనుసంధానాత్మకమైన చిత్తమును నాయందుఉంచి ఆత్మకు మనసునకు నా ధర్మములందే ప్రీతికలిగించి అన్ని కర్మలను నా కొఱకు చేయవలయును.

శ్లో॥ దేశాన్పుణ్యా నాశ్రయే న్నిత్యం మద్భక్తై స్సాధుభి శ్శ్రితాన్
దేవాసుర మనుష్యేషు మద్భక్తా చరితానిచ 10

---

క. వర్ణాశ్రమధర్మంబులు నిర్ణయముగ నానతిమ్ము నీరజనాభా
కర్ణరసాయనముగ నవి, వర్ణింపుము వినెద నేడు వనరుహనేత్రా. 106

వ. అనినం గృష్ణుండు నాలుగు వర్ణంబుల యుత్పత్తియు నాలుగాశ్రమంబుల కిట్టిట్టి వర్ణంబులనియును, నాలుగు వేదంబులం జెప్పిన ధర్మంబులును బ్రవృత్తి నివృత్తి హేతువులగు పురాణేతిహాస శాస్త్రంబులును వైరాగ్య విజ్ఞానంబులును నివి మొదలుగాగల వన్నియు నెఱింగించి, శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ'' యను నుపనిషత్తుల్యం బగు గీతావచన ప్రకారంబున నెవ్వడేని నాయందు మతి గలిగి వర్తించువాడు నే నని పలుకంబడుఁ బెక్కువిధంబుల వాదంబు లేల యని యెందును దగులువడక నామీదఁ దలంపు గలిగి వర్తింపు మనిన నుద్ధవుండిట్లనియె.

క. తెలియనివి కొన్ని సెప్పితి, తెలియంగల వెల్ల నింక దెలుపుము కృష్ణా
వల నెఱిఁగి మెలఁగ వలయును, నలినాసనజనక భక్తనతపదయుగళా.

అ. మద్భక్తైః = నా భక్తులైన; సాధుభిః = సజ్జనులచేత; శ్రితాన్ = ఆశ్రయించబడిన; పుణ్యాన్ = పవిత్రములైన; దేశాన్ = ప్రదేశములను; నిత్యం = ఎల్లప్పుడూ; శ్రయేత్ = ఆశ్రయించవలయును. (సేవించవలయును) దేవాసురమనుష్యేషు = దేవతలలో రాక్షసులలో మనుష్యులలోని; మద్భక్తాచరితాని చ = నాభక్తులచే ఆచరింపబడిన కర్మలన్నుకూడా; శ్రయేత్ = ఆశ్రయించవలయును (ఆచరించవలయును)

తా. నాభక్తులగు సాధువులు నివసించెడి పవిత్ర ప్రదేశములలో నివసించుచు, దేవదానవ రాక్షసులలోని నా భక్తులు ఆచరించెడి కర్మలనే ఆచరించవలయును

శ్లో. పృథక్సత్రేణ వా మహ్యం వర్షయాత్రా మహోత్సవాన్
కారయేన్నృత్యగీతాద్యైః మహారాజ విభూతిభిః **11**

అ. పృథక్ = వేరుగా; (ఒంటిగా) సత్రేణవా = కలిసికాని; మహ్యం = నాకు; నృత్య గీతాద్యైః = నృత్యముగానము మొదలగు; మహారాజ విభూతిభిః = మహారాజోపచారములతో; వర్ష యాత్రా మహోత్సవాన్ = వర్షోత్సవములను; యాత్రోత్సవములను; కారయేత్ = చేయించవలయును.

తా. ఒంటరిగాకాని, కొందరితో కలిసికాని నా కొఱకు నృత్యము గానము వాద్యము మొదలగు మహారాజభోగములతో ప్రతి సంవత్సరము మహాజన సముదాయము చేరు ఉత్సవములను జరిపించవలయును.

అవ:- అంతరంగ భక్తిని మూడుశ్లోకములతో తెలుపుచున్నారు.

శ్లో మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతమ్
ఈక్షేతాత్మని చాత్మానం యథా ఖమమలాశయః **12**

అ. అమలాశయః = నిర్మలాంతః కరణుడు; సర్వభూతేషు = అన్ని ప్రాణులలో; ఆత్మని = ఆత్మయందు; ఆత్మానం = ఈశ్వరునిగా ఉన్న; బహిః = వెలుపల; అంతః = లోపల; అపావృతం = ఆవరణ రహితముగా నిండియున్న; యథా ఖం = ఆకాశము వలె; మామేవ = నన్నే; ఈక్షేత = చూడవలయును. (తెలియవలయును)

తా. నిర్మలాంతః కరణుడు ఆకాశము లోపల వెలుపల ఆవరణ రహితముగా అంతటా వ్యాపించి యున్నటుల, అన్ని ప్రాణులలో ఆత్మలో ఈశ్వరునిగా లోపల వెలుపల ఆవరణ రహితునిగా వ్యాపించి ఉన్న నన్నే చూడవలయును (తెలియవలయును)

అవ:- పండిత లక్షణమును తెలుపు చున్నారు.

శ్లో. ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహామతే
సభాజయన్మన్యమానో జ్ఞానం కేవల మాశ్రితః **13**

శ్లో. బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః **14**

అ. మహామతే ! = అతిప్రాజ్ఞుడా !; ఇతి = ఈ విధముగా; కేవలం జ్ఞానం = జ్ఞానరూపమైన దృష్టిని; ఆశ్రితస్సన్ = ఆశ్రయించినవాడై ; సర్వాణి = అన్ని; భూతాని = ప్రాణులు; మద్భావేన = నాస్వరూపముగా; మన్యమానః = తలచినవాడై ;సభాజయన్ = గౌరవించుచు;బ్రాహ్మణే = బ్రాహ్మణుని

విషయమున; పుల్కసే = అంత్యజాతివాని విషయమున; స్తేనే = బ్రాహ్మణ ధనమును అపహరించు వాని విషయమున; బ్రహ్మణ్యే = బ్రాహ్మణులకుదానము చేయువానియందు; అర్కే = సూర్యుని విషయమై; స్ఫులింగకే = అగ్నికణమునందు; అక్రూరే = శాంతుని విషయమున; క్రూరే = క్రూరుని విషయమున, సమదృక్ = సముడైన నన్నుగాచూచువాడు; పండితః = పండితుడుగా; మతః = పరిగణించ బడును.

తా. ఓ ప్రాజ్ఞుడా! పైన చెప్పిన విధముగా జ్ఞానదృష్టిని ఆశ్రయించినవాడై అన్ని ప్రాణులను నా స్వరూపముగా తలచి గౌరవించవలయును. ఉత్తముని అధముని ఒకేతీరుగా గౌరవించుట తగునా అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు. అన్ని విధముల వైషమ్యములలో సముడనైన నన్ను చూచినవాడు సమాన గౌరవమీయవచ్చును. ఆ వైషమ్యమును నాలుగు విధములుగా చూపుచున్నారు. జాతి క్రియా గుణ స్వభావములలో వైషమ్యమును ఇచట చెప్పుచున్నారు. బ్రాహ్మణుని విషయమునో అంత్యజాతివాని విషయమున (జాతి) బ్రాహ్మణ ధనమును అపహరించు వాని విషయమున బ్రాహ్మణునికి దానము చేయువాని విషయమున (క్రియ) సూర్యుని విషయమున అగ్నికణము విషయమున (గుణము) శాంతుని విషయమున క్రూరుని విషయమున (స్వభావము) నన్నే చూచువాడు పండితుడనబడును.

అవ:- నరులయందు ఈశ్వరదృష్టి కలవానికి వెంటనే విశేష ఫలము కలుగునని చెప్పుచున్నారు.

శ్లో. నరేష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతోఽచిరాత్
స్పర్ధాఽసూయా తిరస్కారాః సాహంకారా వియంతి హి 15

అ. నరేషు = మానవులయందు; అభీక్ష్ణం = మాటిమాటికి (సర్వకాలములందు) మద్భావం = నా స్వరూపమును; భావయతః = చింతించు; పుంసః = పురుషునికి; అచిరాత్ = వెంటనే; సాహంకారాః = దేహాత్మాభిమానముతోకూడిన; స్పర్ధాఽసూయా తిరస్కారాః = కలహము; గుణములయందు దోషముల నారోపించుకోరికయైన ఆసూయ, అవమానములు వియంతిహి = నశించును కదా.

తా. మానవులలో నన్ను సర్వకాలములలో చూచువానికి దేహాత్మాభిమానముతోపాటు కలహము. గుణములలో దోషములను ఆరోపించు కోరికయైన అసూయ అవమానములు వెంటనే నశించును.

అవ:- అంతర్యామియైన పరమాత్మను చూచుచు అందరికి నమస్కారము చేయవలయునని చెప్పుచున్నారు.

శ్లో. విసృజ్య స్మయమానాన్ స్వాన్ దంభం వ్రీడాం చ దైహికీమ్
ప్రణమేదీశ్వరకలా మాశ్వచండాల గోఖరమ్ 16

అ. స్మయమానాన్ = పరిహసించు; స్వాన్ = తనవారిని; దంభం = నేను గొప్పవాడిని, వాడు నీచుడు అను గర్వమును; దైహికీం = దేహసంబంధమైన; వ్రీడాం = సంకోచమును; విసృజ్య = వదిలి; ఆశ్వచండాల గోఖరం = శునకము నుండి చండాలుడు, ఆవు, గాడిదలవరకు వ్యాపించియున్న; ఈశ్వరకలాం = ఈశ్వరకలను; ప్రణమేత్ = నమస్కరించవలయును.

తా. అందరియందు సమ దృష్టితో మెలగుచున్న తమను చూచి పరిహసించు తన వారిని వదిలి, నేను గొప్పవాడిని ఇతరులు నీచులు అను గర్వమును, ఈ గర్వమువలన కలిగెడి సంకోచమును విడిచి శునకమునుండి ఖరమువరకు ఉండెడి అన్ని ప్రాణులలో అంతర్యామిగా ఉన్న ఈశ్వరకలను నమస్కరించవలయును.

అవ:- అయిదుశ్లోకములలో చెప్పిన సమదృష్టికి అవధిని రెండు శ్లోకములలో చెప్పుచున్నారు.

**శ్లో. యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే**
**తావదేవ ముపాసీత వాఙ్మనః కాయ వృత్తిభిః** **17**

అ. యావత్ = ఎంతవరకు; సర్వేషు = అన్ని; భూతేషు = ప్రాణులందు; మద్భావః = నా భావన; నోపజాయతే = కలుగదో; తావత్ = అంతవరకు; వాఙ్మనః కాయవృత్తిభిః = వాగ్వ్యాపారముచే, కాయిక వ్యాపారముచే, ఏవం = ఈ ప్రకారముగా; ఉపాసీత = ఉపాసించవలయును.

తా. ఎంతవరకు అన్ని ప్రాణులందు నాభావన కలుగదో అంతవరకు, నోటితో అన్ని ప్రాణులనుద్దేశించి "భగవతేనమః" అని పలుకుచు, ఈశ్వరుని అంశయే జీవుడు అను మానసిక భావన చేయుచు అన్ని ప్రాణులనుద్దేశించి దండవత్ప్రణామరూపమగు కాయికవ్యాపారము చేయుచు ఉపాసన చేయవలయును,

**శ్లో. సర్వం బ్రహ్మాత్మకం తస్య విద్యయాఽఽత్మ మనీషయా**
**పరిపశ్యన్ను పరమేత్ సర్వతో ముక్తబంధనః** **18**

అ. తస్య = ఇటుల ఉపాసించువానికి; ఆత్మ మనీషయా = అంతట ఈశ్వరునిచూచు; విద్యయా = విద్యచేత; సర్వం – అంతయు; బ్రహ్మాత్మకం = బ్రహ్మస్వరూపముగా; పరిపశ్యన్ = చూచుచు; ముక్తబంధనః = సంసారబంధములు తొలగినవాడై; సర్వతః = అన్ని వ్యాపారములనుండి; ఉపరమేత్ = విరమించవలయును.

తా. ఈ విధముగా ఆచరించువానికి బ్రహ్మవిద్యచే అంతయు బ్రహ్మస్వరూపముగా కనపడును. దానితో సంసార బంధములు తొలగి అన్ని వ్యాపారములను వదలి వేయును.

అవ:- ఇది యొక్కటే ఉపాయమా! ఇతరోపాయములు కలవా? అనినచో చాలా కలవు అన్నిటిలో ఇదియే శ్రేష్ఠమని తెలుపు చున్నారు,

**శ్లో. అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతోమమ**
**మద్భావ సర్వభూతేషు మనోవాక్కాయ వృత్తిభిః** **19**

అ. సర్వకల్పానాం = అన్ని విధులలో; అయం = ఈ; మనోవాక్కాయ వృత్తిభిః = మానసిక కాయిక వాచిక వ్యాపారములతో; సర్వభూతేషు = అన్ని ప్రాణులలో; మద్భావః = నా భావన; సధ్రీచీనః = ఉత్తమమని; మమ మతః = నా అభిమతము.

తా. అన్ని ప్రాణులలో మనో వాక్కాయ వ్యాపారములతో నా భావనయె అన్ని ఉపాయములలో ఉత్తమమైన ఉపాయమని నా అభిమతము.

అవ. భగవద్ధర్మలక్షణోపాయమే మంచిదని రెండు శ్లోకములతో ఉపపాదించు చున్నారు.

శ్లో. న హ్యంగోపక్రమధ్వంసో, మద్ధర్మస్యోద్ధవాణ్వపి,
మయా వ్యవసిత స్సమ్య జ్నిర్గుణత్వాదనాశిషః. 20

అ. అంగ = ఓయీ; ఉద్ధవ = ఉద్ధవుడా; అనాశిషః = నిష్కామమైన; మద్ధర్మస్య = నా ధర్మమునకు; అణ్వపి = కొంచెము కూడా; ఉపక్రమధ్వంసః = వైగుణ్యము మొదలగు వాటిచే నాశము; న = లేదు. నిర్గుణత్వాత్ = గుణరహితమైనందున; సమ్యక్ = ఈ ఉపాయము మంచిదని; మయా = నాచేతనే; వ్యవసితః = నిశ్చయింపబడినది.

తా. ఓయీ ఉద్ధవా! ఈ భగవద్ధర్మము నిష్కామము కావున దీనికి ఉపక్రమ ధ్వంసము లేదు. ఈ ఉపాయము నిర్గుణము కావున అన్నిటిలో శ్రేష్ఠమని నేనే నిర్ణయించితిని.

శ్లో. యో యో మయి పరే ధర్మః కల్ప్యతే నిష్ఫలాయచేత్,
తదాయాసో నిరర్థస్స్యాత్ భయాదేరివ సత్తమ.

సత్తమ = ఉత్తముడా; యః యః = ఏ యే; నిరర్థః = వ్యర్థమగు (ప్రయోజనములేని) ఆయాసః = ఆయాస రూపమగు వ్యాపారము; పరే = పరమైన; మయి = నాయందు; నిష్ఫలాయ = నిష్కామముగా; కల్ప్యతే చేత్ = ఆచరించినచో; భయాదేరివ = భయాదులవలనవలె; ధర్మః స్యాత్ = ధర్మమగును.

తా. మానవులు వ్యర్థముగా చేయు చేష్టిత నిమిషితాది వ్యాపారములు భయము వలన చేయు పలాయనము, క్లేశము వలన చేయు ఆక్రందనము మొదలగు వ్యాపారములు కూడా ఫలాభిలాష లేక పరమాత్మయైన నాయందు అర్పణము చేసినచో ఆది అంతయు ధర్మమే యగుచు.

అవ. నా భజనమే వివేకమునకు, చాతుర్యమునకు ఫలమని తెలుపుచున్నారు.

శ్లో. ఏషా బుద్ధిమతాం బుద్ధిః సా మనీషా మనీషిణామ్,
యత్సత్య మనృతే నేహ మర్త్యేనాప్నోతి మామృతమ్. 22

అ. సత్యం = సత్యమైన; అమృతం = నిత్యమైన; మాం = నన్ను; అనృతేన = అసత్యమైన; మర్త్యేన = వినాశియైన మనుష్య దేహము చేత; ఇహ = ఈ జన్మలో; ఆప్నోతి యత్ = పొందునో; సా = అదియే; బుద్ధిమతాం = వివేకము గలవారి; బుద్ధిః = వివేకము; ఏషా = ఇది; మనీషిణాం = చాతుర్యము గలవారి; మనీషా = చాతుర్యము,

తా. సత్యము నిత్యమూ అయిన నన్ను అసత్యము వినాశియైన మానవ దేహముతో ఈ జన్మలో పొందునదే వివేకము చాతుర్యము.

అవ. మహాప్రకరణార్థమును రెండు శ్లోకములతో ఉపసంహరించు చున్నారు,

శ్లో. ఏష తేఽభిహితస్సాధో బ్రహ్మవాదస్య సంగ్రహః
సమాస వ్యాస విధినా దేవానా మపి దుర్గమః 23

అ. సాధో! = ఓసజ్జనుడా!; తే = నీకు; ఏషః = ఈ, దేవానామపి = దేవతలకు కూడా దుర్గమః = తెలియ శక్యము వాది బ్రహ్మవాదస్య = వేదాంతార్థము యొక్క; సంగ్రహః = సంగ్రహము; సమాస వ్యాస విధినా = సంక్షేపముగా విస్తరముగా; అభిహితః = చెప్పబడినది

తా. ఓ సజ్జనుడా! దేవతలకు కూడా తెలియరాని వేదాన్తార్థము సంగ్రహముగా విస్తరముగా నీకు తెలిపితిని.

**శ్లో. అభీక్ష్ణశస్తే కథితం జ్ఞానం విస్పష్ట యుక్తిమత్**
**ఏత ద్విజ్ఞాయ ముచ్యేత పురుషో నష్ట సంశయః** **42**

అ తే = నీకు; విస్పష్టయుక్తిమత్ = స్పష్టమైన యుక్తులు గల; జ్ఞానం = జ్ఞానమును; అభీక్ష్ణశః = మాటి మాటికి; కథితః = చెప్పబడినది. పురుషః = మనుజుడు; ఏతత్ = ఈ జ్ఞానమును; విజ్ఞాయ = తెలుసుకొని; నష్టసంశయః సంశయములు తొలగినవాడై; ముచ్యేత = ముక్తుడగును.

తా. స్పష్టమైన యుక్తులు గల ఈ జ్ఞానమును నీకు మాటి మాటికి చెప్పితిని. దీనిని తెలుసుకొనిన మనుజుడు సంశయములు తొలగి ముక్తుడగును.

అవ. ఈ వేదాంతార్థమును అనుసంధానము చేసినవారికి, చెప్పినవారికి వినిన వారికి కూడా ఈ ఫలితమే కలుగునని నాలుగు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. సువివిక్తం తవ ప్రశ్నం మయైత ద్యోఽవధారయేత్**
**సనాతనం బ్రహ్మగుహ్యం పరం బ్రహ్మాధి గచ్ఛతి** **25**

అ. తవ = నీయొక్క; ప్రశ్నం = ప్రశ్న, మయా = నాచేత; సువివిక్తం = చక్కగా వివరించబడినది. ఏతత్ = నేను చెప్పిన ఈ వేదాన్తరహస్యార్థమును; యః = ఎవడు; అవధారయేత్ = అనుసంధానము చేయునో; సమాతనం = సనాతనమైన; బ్రహ్మగుహ్యం = వేదాంతరహస్యమైన; పరం బ్రహ్మ = పరబ్రహ్మను, అధిగచ్ఛతి = తెలియును.

తా. నీ ప్రశ్నను నేను చక్కగా వివరించితిని. నేను వివరించిన ఈ వేదాంత రహస్యమును అనుసంధానము చేసినవారు వేదాన్తార్థరహస్యమైన పరబ్రహ్మను తెలియగలరు.

**శ్లో. య ఏతన్మమ భక్తేషు సంప్రదద్యా త్సు పుష్కలమ్**
**తస్యాఽహం బ్రహ్మదాయస్య దదామ్యాత్మాన మాత్మనః** **26**

అ. యః = ఎవర్తే. ఏతత్ = దీనిని; సుపుష్కలమ్ = సుస్పష్టముగా (సమృద్ధిగా) మమ భక్తేషు = నాభక్తులలో; సంప్రదద్యాత్ = ఉపదేశించునో, తస్య = ఆ: బ్రహ్మదాయస్య = బ్రహ్మోపదేశమును చేసిన వానికి ఆత్మనః ఆత్మానం = ఆత్మలకు ఆత్మయైన పరమాత్మను; దదామి = ఇచ్చెదను (వశము చేతును).

తా. వేదాంతార్థ రహస్యమైన ఈ జ్ఞానమును నా భక్తులకు ఉపదేశము చేసినవానికి పరమాత్మనైన నేను వశములో ఉందును.

**శ్లో. య ఏత త్సమధీయీత పవిత్రం పరమం శుచి**
**స పూయే తాహరహ ర్మాం జ్ఞానదీపేన దర్శయన్.** **27**

అ. యః = ఎవరైతే; పవిత్రం = ఆత్మశుద్ధి కరమైన; పరమం శుచి = ఇతరులను శుద్ధిచేయగల; ఏతత్ = ఈ జ్ఞానమును; సమధీయేత = పెద్దగా చదువునో, సః = అతను; అహరహః = ప్రతిక్షణము; జ్ఞానదీపేన = జ్ఞానజ్యోతిచే; మాం = నన్ను; దర్శయన్ = చూచుచు; పూయేత = శుద్ధిని పొందును.

ఆత్మను శుద్ధి చేయునది, ఇతరులను శుద్ధి చేయగల ఈ వేదాంతార్థ రహస్యమును పెద్దగా చదువువారు ప్రతిక్షణము జ్ఞాన దీపముతో నన్ను చూచుచు పవిత్రులగుదురు.

**శ్లో. య ఏత చ్ఛ్రద్ధయా నిత్య మవ్యగ్ర శ్శృణుయాన్నరః**
**మయి భక్తిం పరాం కుర్వన్ కర్మభి ర్న స బధ్యతే** 28

అ. యః = ఏ; నరః = మనుజుడు; నిత్యం = ఎల్లపుడు; అవ్యగ్రః = సావధాన మనస్కుడై; ఏతత్ = ఈ వేదాంతార్థ రహస్యమును; శ్రద్ధయా = శ్రద్ధతో శృణుయాత్ = వినునో; సః = ఆ మనుజుడు; మయి = నాయందు; పరాం భక్తిం = ఉత్తమమైన భక్తిని; కుర్వన్ = చేయుచు; కర్మభిః = కర్మలచే = న బధ్యతే = బద్ధుడు కాడు.

తా. ఎల్లప్పుడు సావధానముతో శ్రద్ధతో వేదాంతార్థ రహస్యమైన ఈ జ్ఞానమును వినువాడు, నాయందు ఉత్తమమైన భక్తిని చేయుచు కర్మబద్ధుడు కాడు.

అవ. దీనితో సమ్యగ్ జ్ఞానము కలుగనిచో మరల ఉపదేశించెదను అనుచున్నారు.

**శ్లో. అప్యుద్ధవ త్వయా బ్రహ్మ సఖె సముపధారితమ్**
**అపి తే విగతో మోహ శ్శోకా శ్చాసౌ మనోభవః** 29

అ. సఖే ఉద్ధవ! = ఓ ఉద్ధవుడా!; త్వయా = నీచే; బ్రహ్మ = బ్రహ్మము; అపి సముపధారితం = చక్కగా నిశ్చయింపబడినదా? మరియు; తే = నీ యొక్క; మనోభవః = మనస్సునుండి జన్మించిన; అసౌ = ఈ; మోహః = అవివేకము; శోకశ్చ = దుఃఖము కూడా; విగతః = పోయినవా ?

తా. ఓ మిత్రమా! ఉద్ధవుడా! నేను చెప్పిన బ్రహ్మమును నీవు చక్కగా నిర్ణయించి తెలుసుకొన గలిగితివా? నీ మనస్సున జన్మించిన అజ్ఞానము శోకము నీకు దూరమైనవా?

అవ ఉద్ధవునకు బ్రహ్మస్వరూపము తెలిసినదని గ్రహించి చెప్పుచున్నారు.

**శ్లో. నైతత్త్వయా దాంభికాయ నాస్తికాయ శఠాయ చ**
**అశుశ్రూషో రభక్తాయ దుర్వినీతాయదీ యతామ్** 30

అ. త్వయా = నీ చేత; ఏతత్ = తెలుసుకొనిన ఈ బ్రహ్మ జ్ఞానమును; దాంభికాయ = వేషధారికి; నాస్తికాయ = నాస్తికునకు; శఠాయ చ = వంచకునికిని; అశుశ్రూషోః = శుశ్రూష చేయని వానికి (సేవచేయని వానికి) అభక్తాయ = భక్తి విహీనునకు; దుర్వినీతాయ = చెడు తలంపులు గలవానికి; న దీయతాం = ఉపదేశింపరాదు.

తా. ఓ ఉద్ధవుడా! నీవు యెఱింగిన ఈ బ్రహ్మజ్ఞానము వేషధారికి, నాస్తికునకు, వంచకునకు, శుశ్రూష చేయని వానికి, భక్తిలేని వానికి, చెడ్డతలంపులు కలవానికి నీవు ఉపదేశింపకుము.

శ్లో. ఏతై ర్దోషైర్వి విహీనాయ బ్రహ్మణ్యాయ ప్రియాయ చ
సాధవే శుచయే బ్రూయా ద్భ క్తి స్స్యా చ్ఛూద్రయోషితామ్ 31

అ ఏతైః = ఈ పైన నుడివిన దోషములచే; విహీనాయ = రహితమైన వానికి బ్రహ్మణ్యాయ = బ్రాహ్మణసేవ గలవానికి; ప్రియాయ చ = ప్రియుడైనట్టి; సాధవే = సాధువులకును; శుచయే = పరిశుద్ధునకు; భ క్తిః స్యాత్ = భ క్తియున్నచో; శూద్రయోషితాం = శూద్రులకు; స్త్రీలకును; బ్రూయాత్ = చెప్పతగినది.

తా. ఓ ఉద్ధవా! పైన పేర్కొన్న దోషములు లేనివానికిని, బ్రాహ్మణసేవ చేయువాని కిని, సాధువునకు, నిర్మల చిత్తునకు, భ క్తిసంపద కల్గినట్టి పై గుణములు కలిగినట్టి శూద్రు లకు స్త్రీలకును ఉపదేశింప వచ్చును.

అవ. ఈ బ్రహ్మజ్ఞానముతో మానవుడు కృతార్థుడగునని తెలుపు చున్నారు

శ్లో. నైతద్విజ్ఞాయ జిజ్ఞాసో ర్జ్ఞాతవ్య మవశిష్యతే
పీత్వా పీయూష మమృతంపాతవ్యం నావశిష్యతే 32

అ. ఏతత్ = ఈ బ్రహ్మ జ్ఞానమును; విజ్ఞాయ = తెలుసుకొని; జిజ్ఞాసోః = జిజ్ఞాసువులయిన వానికి; జ్ఞాతవ్యం = తెలియ తగినది; నావశిష్యతే = ఏదియు లేదు. పీయూషం = రుచ్యమైన, అమృతం = అమృతమును; పీత్వా = త్రాగి పాతవ్యం = త్రాగదగినది; నావశిష్యతే = మరేమియును ఉండదు.

తా. మిక్కిలి రుచిగల అమృతమును ఆస్వాదించిన పిమ్మట ఇంకను గ్రోలదగినది ఏదియు లేనట్లే ఈ బ్రహ్మతత్వము నెరింగిన జిజ్ఞాసువుకు తెలుసుకొనదగిన విషయము ఏదియు లేదు.

అవ. ఆయా ఫలములను సాధించు సాధనములు చాలా కలవు కదా అనినచో నిజమే. భక్తులు కాని వారికి చాలా ఉన్నవి కాని భక్తులకు మాత్రము అన్నియు నేనే కావున నన్నే ఉపాసించుము అనుచున్నారు.

శ్లో. జ్ఞానే కర్మణి యోగే చ వార్తాయాం దండధారణే
యావా నర్థో నృణాం తాత తావాంస్తేఽహం చతుర్విధః 33

అ జ్ఞానే = జ్ఞానమునందు; కర్మణి = విహిత కర్మయందు (ధర్మము) యోగే చ = యోగమున; కును; (అణిమాద్యష్ట సిద్ధులు) వార్తాయాం = కృష్యాదిక మందు (ఫలము) దండధారణే = ఆధిపత్యము నందు; యావానర్థః = ఏ పురుషార్థములు గలవో; నృణాం = మనుష్యులకు; తావాన్ = అవియన్నియును చతుర్విధః = ధర్మార్థ కామమోక్షములైన నాలుగును; తే = అవి; అహం = నేనే

తా. నరులకు జ్ఞానముచే మోక్షము, వేదవిహిత కర్మలచే ధర్మము, కామ్యకర్మలచే కామము, యోగముచే అణిమాదికము, కృష్యాదికముచే ధాన్యము, దండనచే అనైశ్వర్యము అనునవి ఎట్లు కలుగుచున్నవో ఆ పురుషార్థములును సంపదలును నేనే

శ్లో. మర్త్యో యదా త్యక్త సమస్త కర్మా నివేదితాత్మా విచికీర్షితో మే
తదాఽమృతత్వం ప్రతిపద్యమానో మయాత్మభూయాయ చ కల్పతే వై. 34

అ. మర్త్యః = మనుజుడు; యదా = ఎప్పుడు; త్యక్తసమస్తకర్మా = త్యజింపబడిన ఎల్ల కర్మ గలవాడై, మే = నాకు, నివేదితాత్మా = సమర్పింపబడిన, ఆత్మతత్త్వము కలవాడగునో; తదా = అప్పుడు; మే = నాకు; విచికీర్షితః = విశేషించి ధ్యానాదికమును చేయగోరువాడగును; అందువలన; అమృతత్వం = మోక్షమును; ప్రతిపద్యమానః = పొందుచున్నవాడై; మయా = నాతో, ఆత్మభూయాయ = ఐక్యము కొఱకు; కల్పతే = యోగ్యుడగుచున్నాడు.

తా. మానవుడెప్పుడు తన సమస్తకర్మలను నిత్యనైమిత్తిక కామ్య నిషిద్ధములను వీడి తనను నాకు సమర్పించునో, అపుడాతడు చేయగోరినది చక్కగా చేసినవాడగు చున్నాడు. అందువలన మోక్షమును పొంది నాతో ఐక్యమునకు, నాతో సమానమైన ఐశ్వర్యమునకు యోగ్యుడగును.

శ్రీశుక ఉవాచ = శ్రీ శుకులు పలికిరి.

శ్లో. స ఏవ మాదర్శిత యోగమార్గ స్తదోత్తమ శ్లోక వచో నిశమ్య
బద్ధాంజలిః ప్రీత్యుపరుద్ధ కంఠో న కించి దూచేఽశ్రు పరిప్లుతాక్షః **35**

అ. ఏవం = ఈ ప్రకారముగా; ఆదర్శిత యోగమార్గః = తెలుపబడిన జ్ఞాన యోగమార్గము కలవాడైన; సః = ఆ ఉద్ధవుడు; తదా = అపుడు; ఉత్తమ శ్లోకవచః = పుణ్య శ్లోకుడైన శ్రీ కృష్ణుని వచనమును, నిశమ్య = విని; బద్ధాంజలిః = కై మోడ్పుగలవాడై; ప్రీత్యుపరుద్ధకంఠః = ప్రేమచే డగ్గుత్తిపడిన కంఠస్వరము కలవాడై; అశ్రుపరిప్లుతాక్షః = కన్నీట మునింగిన కన్నులు గలవాడై; నకించిత్ ఊచే = ఏమీ మాటాడకుండెను.

తా. భగవంతుడు తనకు జ్ఞాన యోగమార్గమును తెలుపగా వినిన ఉద్ధవుడు శ్రీకృష్ణునికి కై మోడ్పులిడి ప్రేమచే డగ్గుత్తికబడిన కంఠస్వరము గలవాడై కన్నులు రెండు కన్నీట మునింగినవాడై ఏమియు మాటాడక కొంతవడి యట్లే యుండెను.

శ్లో. విష్టభ్య చిత్తం ప్రణయావఘూర్ణం ధైర్యేణ రాజన్ బహు మన్యమానః
కృతాంజలిః ప్రాహ యదుప్రవీరం శీర్ష్ణా స్పృశం స్తచ్చరణారవిందమ్ **36**

అ. ప్రణయావ ఘూర్ణం = ప్రేమచే క్షోభనొందిన; చిత్తం = చిత్తమును; ధైర్యేణ = ధైర్యముతో; విష్టభ్య = చక్కదిద్ది; బహు మన్యమానః = తన్ను కృతార్థునిగా తలంచి; కృతాంజలిః = కైమోడ్పు గలిగి; తచ్చరణారవిందం = ఆ శ్రీకృష్ణుని పాద పద్మమును; శీర్ష్ణా = శిరముతో; స్పృశన్ = స్పృశించుచు; యదుప్ర వీరం = యదు శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని గూర్చి; ప్రాహ = ఇట్లు చెప్పెను.

తా. ప్రేమచే కలత నొందిన చిత్తమును ధైర్యముచే చక్కదిద్ది, తన్ను కృతార్థునిగా తలంచి, భగవంతునికి నమస్కరించి, ఆయన పాదపద్మములకు శిరము తాకించి మ్రొక్కి శ్రీకృష్ణునితో ఇట్లనియెను.

శ్లో. విద్రావితో మోహమయోంధకారో య ఆశ్రితో మే తవ సన్నిధానాత్
విభావసోః కిన్ను సమీపగస్య శీతం తమో భీః ప్రభవంత్యజాద్య. **37**

అ. అజాద్య = ఓ బ్రహ్మజనకుడా !; ఆశ్రితః = నిన్ను ఆశ్రయించిన; మే = నా యొక్క; మోహామయః = అజ్ఞానమయమైన; అంధకారః = చీకటి; తవ సన్నిధానాత్ = నీ సన్నిధానము వలన; విద్రావితః = తరుమబడినది; విభావసోః = సూర్యునికి; సమీపగస్య = చెంత చేరిన వానికి; శీతం = చలి తమః భీః = చీకటి భయమును; నప్రభవంతి = కలుగవు.

తా. ఓ బ్రహ్మజనకుడవైన నారాయణా! నీ ఆశ్రితుడనైన నా యజ్ఞానమను చీకటి నీ సమ్ముఖ మాత్రముననే పటాపంచలాయెను. సూర్యుని చెంత చేరిన వానికి చలి చీకటి భయము కలుగవు గదా!

**శ్లో. ప్రత్యర్పితో మే భవతాను కంపినా భృత్యాయ విజ్ఞానమయః ప్రదీపః**
**హిత్వా కృతజ్ఞ స్తవ పాదమూలం కోఽన్యత్సమీయాచ్ఛరణం త్వదీయమ్ 38**

అ. అనుకంపినా = కనికరముగల; భవతా = నీచేత; భృత్యాయ = భృత్యుడనైన; మే = నాకు విజ్ఞానమయః = ఆత్మానుభవ స్వరూపమైన; ప్రదీపః = దీపము; ప్రత్యర్పితః = నీమాయచే అపహరింప బడి మరల సమర్పించబడినది; తవ = నీకు; కృతజ్ఞః = కృతజ్ఞుడను; కః = నీఅనుగ్రహమును తెలిసిన ఎవడు; త్వదీయం = నీ: పాదమూలం = పాదసామీప్యమును; హిత్వా = వీడి; అన్యత్ = ఇతరమైన; శరణం = రక్షణను; సమీయాత్ = పొందును.

తా. మొదట నీ మాయతో అపహరించబడిన విజ్ఞానమను దీపమును మరల దయగల నీవు అర్పించితివి. ఇట్టి నీ దయను తెలిసిన వాడెవ్వడును నీ పాదములను విడిచి అన్యమును శరణు పొందును. అనగా నీ పాదారవిందములను వీడడని తాత్పర్యము.

**శ్లో. వృక్ణశ్చ మే సందృఢ స్నేహ పాశో దాశార్హ వృష్ణ్యంధక సాత్వతేషు**
**ప్రసారితస్సృష్టి వివృద్ధయే త్వయా స్వమాయయా హ్యాత్మసుబోధహేతినా. 39**

అ. దాశార్హ వృష్ణ్యంధకసాత్వతేషు = దాశార్హులయిన; వృష్ణి; అంధక; సాత్వ తాదులైన రాజుల వంశీయులందు; సృష్టివివృద్ధయే = జగమున సృష్టి పెంపునకై, స్వమాయయా = తన మాయచే; స్నేహపాశః = నెయ్యంపు పగ్గము; సందృఢః = మిక్కిలి దృఢముగ; ప్రసారితః = వ్యాపించినదియు; త్వయా = నీ చేత; ఆత్మసుబోధహేతినా = ఆత్మ జ్ఞానమను ఖడ్గముచే; సంవృక్ణః = ఛేదింపబడినది.

తా. దాశార్హులు, వృష్ణివంశీయులు, అంధక వంశులు, సాత్వతులు అను నీ నాలుగు తెగలయందు నీ మాయచే యే స్నేహపాశము దృఢముగా నెలకొన్నదో ఆ పాశమును నీయొక్క ఆత్మ జ్ఞానమను ఖడ్గముచే ఛేదించివైచితివి.

**శ్లో. నమోఽస్తు తే మహాయోగిన్ ప్రపన్న మనుశాధిమామ్**
**యథా త్వచ్చరణాంభోజే రతిస్స్యాదనపాయినీ 40**

అ. మహాయోగిన్ = ఓ గొప్పయోగీ!; తే = నీకు; నమోఽస్తు = నమస్కారము; ప్రపన్నం మాం = నీ శరణు పొందిన నన్ను; యథా = యే ప్రకారముగా; త్వచ్చరణాంభోజే = నీ పాదపద్మము లందు; అనపాయినీ = విడిపోని; రతిః = ఆసక్తి; స్యాత్ = కలుగునో అట్లు; అనుశాధి = శాసింపుము.

తా. అణి మాది సిద్ధులు గల ఓ మహాయోగీ! నీకు నమస్కారము. నిన్ను శరణు పొందిన నన్ను ముక్తికై నీ పాదపద్మములందు విడిపోని ఆసక్తి కలుగునట్లు అనుగ్రహింపుము.

శ్రీభగవానువాచ = శ్రీభగవంతుడు పలికెను.

**శ్లో. గచ్ఛోద్ధవ మయాదిష్టో బదర్యాఖ్యం మమాఽఽశ్రమమ్**
**తత్ర మత్పాద తీర్థోదే స్నానోపస్పర్శనైశ్శుచిః 41**

అ. ఉద్ధవ = ఓ ఉద్ధవుడా!; మయా = నా చేత; ఆదిష్టః = నియోగింపబడినవాడవై; బదర్యాఖ్యం = బదరి యను పేరుగల; మమ = నా, ఆశ్రమం = ఆశ్రమమును గూర్చి; గచ్ఛ = వెళ్ళుము; తత్ర = ఆ ఆశ్రమములో; మత్పాది తీర్థోదే = నా పాదతీర్థ జలమున; స్నానోపస్పర్శనైః = స్నాన ఆచమనములచే, శుచిః = పరిశుద్ధుడవు కమ్ము

తా. ఓ ఉద్ధవా! నేను చెప్పినట్లుగా నీ విపుడు నా ఆశ్రమమైన బదరికి వెళ్ళుము. అచట నా పాద తీర్థ జలమునందు స్నానాచమనాదులు నిర్వర్తించి పరిశుద్ధుడవు కమ్ము.

శ్లో॥ ఈక్షయాలక నందాయా విధూతాశేషకల్మషః
వసానో వల్కలాన్యంగ వన్యభుక్సుఖనిస్పృహః **42**

అ. అలక నందాయాః = నా పాదతీర్థమైన అలకనంద యొక్క; ఈక్షయా = దర్శనముచేతనే, విధూతాశేషకల్మషః = చిమ్మబడిన యెల్లపాపములు గలవాడవై; వల్కలాని = నారవస్త్రములను; వసానః = ధరించుచు; వన్యభుక్ = కందమూలములను భుజించుచు; సుఖనిస్పృహః = ఇంద్రియ సుఖము లందు కోరికలేని వాడవు కమ్ము.

తా. స్నానాదికమునకు పూర్వమే నా పాద తీర్థమగు అలకనందా నదియొక్క దర్శనముతో సమస్త పాపములను తొలగించుకొన్నవాడవై నారగుడ్డలను ధరించి, అడవిలోపల కందమూలములను (పండ్లు, గడ్డలు, దుంపలు) తినుచు ఇంద్రియ సుఖములందు కోరిక లేని వాడవు కమ్ము.

శ్లో. తితిక్షు ర్ద్వంద్వమాత్రాణాం సుశీల స్సంయతేంద్రియః
శాంత స్సమాహిత ధియా జ్ఞాన విజ్ఞాన సంయుతః **43**

అ. ద్వంద్వమాత్రాణాం = శీతోష్ణ సుఖదుఃఖాది విషయముల; తితిక్షుః = సహించుచు; సుశీలః = ఋజు స్వభావము గలవాడవై; సంయతేంద్రియః = నియమింపబడిన ఇంద్రియములు కలవాడవై; శాంతః = కామాది వికారరహితుడవై, సమాహితధియా = ఏకాగ్ర చిత్తముతో; జ్ఞాన విజ్ఞాన సంయుతః = ప్రత్యక్ష పరోక్ష జ్ఞానము కలవాడవు కమ్ము.

తా. శీతోష్ణాది ద్వంద్వములను, శబ్దాది విషయములను సహించు వాడును మంచి స్వభావము కలవాడు, జితేంద్రియుడు, కామాది వికార రహితుడు ఏకాగ్ర చిత్తుడవై ప్రత్యక్ష పరోక్ష జ్ఞానములతో బ్రహ్మను కనుగొనవలయును.

శ్లో. మయాను శిక్షితం యత్తే వివిక్త మను భావయన్
మయ్యావేశిత వాక్చిత్తో మద్ధర్మ నిరతో భవాన్
అతిక్రమ్య గతీస్తిస్రో మామేష్యసి తతః పరమ్ **44**

అ. మయా = నాచేత; తే = నీకు; యత్ = ఏది; అనుశిక్షితం = ఉపదేశించ బడినదో దానిని; వివిక్తం = ఏకాంతమున; అనుభావయన్ = ధ్యానించుచు; మయి = నాయందు; ఆవేశితవాక్చిత్తః = ఉంచబడిన వాగాది ఇంద్రియములు చిత్తమును కలిగి; మద్ధర్మనిరతః = నాభక్తి యోగము నందు ధర్మము నందు నిరతుడవై; భవాన్ = నీవు; తిస్రఃగతీః = త్రిగుణములచే లభ్యములైన స్వర్గమర్త్య; నరకములు కలిగిన దానిని; అతీత్య = దాటి; (అతిక్రమించి) తతః పరమ్ = దాని కంటె ఇతరమైన్య మాం = నన్ను; ఏష్యసి = పొందగలవు.

తా. నేను నీకు ఉపదేశించిన జ్ఞానయోగ లక్ష్యమును ఏకాంతమున జేరి ధ్యానము చేయుచు, నా యందు నీ వాక్కును చిత్తమును సమర్పించి నా భక్తి యోగము నందాసక్తుడవై సత్వ రజస్తమోగుణములచే లభ్యములగు స్వర్గ మర్త్యనరకములను మూడింటి కంటె అతీతమైన నన్ను పొందగలవు.

శ్రీశుక ఉవాచ=శ్రీ శుకులు పలికిరి.

శ్లో. న ఏవ ముక్తో హరిమేధసోద్ధవః ప్రదక్షిణంత్రిః పరిసృత్య పాదయోః
శిరో నిధాయాశ్రుకలాభిరార్ద్రధీః న్యషించ దద్వంద్వపరోఽప్యపక్రమే. 45

అ. హరిమేధసా=సంసారమను మేధస్సును హరించు బుద్ధిగల శ్రీ కృష్ణునిచే; ఏవం=ఈ ప్రకారము; ఉక్తః=చెప్పబడినవాడై; అపక్రమే=వెళ్ళు సమయమున; సః=ఆ ఉద్ధవుడు; త్రిః=ముమ్మారు; ప్రదక్షిణం పరిసృత్య=ప్రదక్షిణముగా చుట్టి; పాదయోః=శ్రీ కృష్ణుని పాదములకు; శిరః నిధాయ=శిరమును యుంచి; ఆర్ద్రధీః=కరిగిన చిత్తము కలవాడై; అద్వంద్వ పరః అపి=సుఖ దుఃఖాదుల కతీతుడై నను; అశ్రుకలాభిః=కన్నీటి బొట్లచే; న్యషించత్=తడిపెను.

తా. సంసార బంధమును హరించు మేధస్సు గల శ్రీకృష్ణుడు ఇటుల చెప్పగా ఆ ఉద్ధవుడు శ్రీకృష్ణునకు ముమ్మారు ప్రదక్షిణ మాచరించి, మెత్తబడిన మనస్సు గలవాడై, సుఖ దుఃఖాది ద్వంద్వములను వీడిన వాడై నను, తాను భగవానుని వీడిపోవునపుడు ఆయన పాదము లందు శిరమునుంచి, వానిని కన్నీటి చుక్కలచే తడిపెను.

శ్లో. సుదుస్త్యజ స్నేహ వియోగ కాతరో నశక్నువం స్తం పరిహాతు మాతురః
కృచ్ఛ్రం యయౌ మూర్ధని భర్తృపాదుకే బిభ్రన్నమస్కృత్య యయౌ పునఃపునః

అ. సుదుస్త్యజ స్నేహ వియోగకాతరః=మిక్కిలి వీడరానిదైన నెయ్యమును వీడుటచే; అతి బాధితుడై: తం=ఆ శ్రీ కృష్ణుని; పరిహాతుం=విడుచుటకు; న శక్నువన్=అశక్తుడగుచు; ఆతురః ఏమియును తోచనవాడై; మూర్ధని=శిరమున; భర్తృపాదుకే=స్వామి పాదుకలను; బిభ్రత్=భరింప జేయుచు; (ఆనించి) పునః పునః=మాటి మాటికి; నమస్కృత్య=నమస్కరించి; కృచ్ఛ్రం=అతి నిర్బంధమగు భగవదాజ్ఞచే. యయౌ=వెళ్ళెను.

తా మిక్కిలి వీడరాని స్నేహమును వీడుటకు వెఱచి, ఆ శ్రీకృష్ణుని విడువ నేర్తని వాడై, ఏమియు తోచక, శిరమున స్వామి పాదములను ధరించి మరిమరి భగవంతునికి నమస్కరించి భగవదాజ్ఞచే నిర్బంధితుడై బలవంతముగా వెళ్ళెను.

శ్లో. తతస్త మంతర్హృది సన్నివేశ్య గతో మహాభాగవతో విశాలామ్
యథో పదిష్టాం జగదేకబంధునా తపస్సమాస్థాయ హరేరగాద్గతిమ్. 47

అ. తతః=అటు పిమ్మట; తం=ఆ శ్రీకృష్ణుని; అంతః హృది=హృదంతరాళమున; సన్నివేశ్య=నిలుపుకొని; మహాభాగవతః=భగవద్భక్తులలో ఉత్తముడైన ఆ ఉద్ధవుడు; విశాలాం=విశాలమైన బదరికాశ్రమమునుగూర్చి; గతః=వెళ్ళినవాడై; (అచట) జగదేక బంధునా=ప్రపంచమునకు ఒకే ఒక బంధువైన పరమాత్మచే; యథోపదిష్టాం—పూర్వముపదేశించిన ప్రకారము; తపః సమాస్థాయ—తపోనిష్ఠ కలిగి; హరేః—శ్రీకృష్ణునిచే చెప్పబడినట్టి; గతిం=గతిని; అగాత్=పొందెను.

తా. భగవద్భక్తులలో ఉత్తముడైన ఉద్ధవుడు శ్రీకృష్ణు నాజ్ఞచే, బదరికాశ్రమము చేరి, స్థిర చిత్తుడై అచట తన హృదయమునందు శ్రీకృష్ణుని నిలుపుకొని పూర్వము ఆయన ఉపదేశించిన ప్రకారము తపో నిమగ్నుడై శ్రీహరిని చేరి పరమ పదమును పొందెను

శ్లో. య ఏత దానంద సముద్ర సంభృతం జ్ఞానామృతం భాగవతాయ భాషితమ్
కృష్ణేన యోగేశ్వర సేవితాంఘ్రిణా సచ్ఛ్రద్ధయా సేవ్య జగద్విముచ్యతే **48**

అ. యః = ఎవడు; ఏతత్ = ఈ; ఆనంద సముద్ర సంభృతం = ఆనందముతో కూడిన సముద్రముతో సమమయినట్టి భక్తిమార్గముచే ఈదగల; జ్ఞానామృతం = జ్ఞానమనెడి అమృతమును; యోగేశ్వర సేవితాంఘ్రిణా = యోగి పుంగవులచే సేవింపబడు పాదములు గలిగిన; కృష్ణేన = శ్రీకృష్ణునిచేత, భాగవతాయ = భాగవతుని కొఱకు; భాషితం = చెప్పబడిన ఈ మార్గమును; సత్ శ్రద్ధయా = మంచి శ్రద్ధతో; ఆసేవ్య = కొంచెమైనను సేవించి; జగత్ = సంసారమును; విముచ్యతే = విడుచుచున్నాడు.

తా. యోగనిష్ఠకల మహర్షులచే సేవింపబడు పాదపద్మములు గల శ్రీకృష్ణుడు తన భక్తునికై ఉపదేశించిన ఈ భక్తియోగ విధానమును, జ్ఞానామృతమును ఇంచుకైనను ఎవడాచరించునో వాడు ముక్తుడు. శ్రద్ధతో చక్కగా సేవించిన వాడు సంసార జగమును విడుచును.

అవ జ్ఞానామృతమును ఉపదేశించిన జగద్గురువును నమస్కరించు చున్నారు

శ్లో. భవభయ మపహర్తుం జ్ఞాన విజ్ఞానసారం
నిగమ కృదుపజహ్రే భృంగవద్వేద సారమ్
అమృత ముదధితశ్చాపాయ యద్భృత్య వర్గాన్
పురుష ఋషభ మాద్యం విష్ణుసంజ్ఞం నతోఽస్మి **49**

అ. భవభయం = సంసారమను, జరామరణాది భయమును; అపహర్తుం = పోగొట్టుటకు; నిగమకృత్ = వేదకర్త అయిన భగవంతుడు; భృంగవత్ = తుమ్మెదవలె; వేదసారం = వేదసారమును; జ్ఞాన విజ్ఞానసారం = అంతర్బాహ్య జ్ఞాన; ఆత్మ జ్ఞాన సారమయిన; అమృతం = అమృతమును; ఉదధితః = సముద్రము నుండి; ఉపజహ్రే = తీసుకొని వచ్చెను; భృత్య వర్గాన్ = జ్ఞానులయిన; సంసారులయిన సేవకులను అపాయయత్ = త్రాగించెనో; ఆద్యం = ఆద్యుడైన; పురుష ఋషభం = పురుషోత్తముడయిన, విష్ణుసంజ్ఞం = విష్ణువను సంజ్ఞకల శ్రీకృష్ణుని; నతోఽస్మి = నమస్కరించుచున్నాను

తా. నివృత్తి పరులకు సంసార భయమును పోగొట్టుటకు, సంసారులైన భక్తులకు జరామరణాది భయమును పోగొట్టుటకు పుష్పముల నుండి తుమ్మెద వలె, వేదముల నుండి జ్ఞాన విజ్ఞాన సారమును, సముద్రము నుండి అమృతమును గ్రహించి జ్ఞానులకు భక్తులకు త్రాగించిన ఆదిపురుషోత్తముని శ్రీకృష్ణుని నమస్కరించు చున్నాను.

ఇతి శ్రీమద్భాగవత మహా పురాణే ఏకాదశస్కంధే ఏకోనత్రింశోఽధ్యాయః
ఇది శ్రీమద్భాగవత మహాపురాణమందు ఏకాదశస్కంధమున
ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము

ఓం తత్ సత్

# త్రింశోఽధ్యాయః

## ముప్పదియవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకములు

**త్రింశే తు ప్రాగుపక్షిప్త మౌసల ఛలతో హరిః**
**స్వధామ గంతు మన్విచ్ఛన్ న జహార నిజం కులమ్**
**వినాశాయ పురా ఘోర ముపక్షిప్తం హి మౌసలమ్**
**కథావసానే తత్రైవ విశేషం పరిపృచ్ఛతి**

ఈ ముప్పదియవ అధ్యాయమున ముందు పేర్కొను ముసలమను నెపముతో మును స్వధామమును వెళ్ళగోరి, మొదట తన వంశమును హరించలేదు. ఆ వంశమును నశింప చేయుటకు ముందే ఘోరమైన ముసలము నుంచెను. తరువాత జరిగిన కథను పరీక్షిత్తు అడుగుచున్నాడు.

శ్రీ పరీక్షిదు వాచ = శ్రీపరీక్షిత్తు పలికెను.

శ్లో. **తతో మహాభాగవతే ఉద్ధవే నిర్గతే వనమ్**
**ద్వారవత్యాం కిమకరోద్భగవాన్ భూతభావనః** 1

అ మహాభాగవతే=గొప్ప భక్తుడైన; ఉద్ధవే=ఉద్ధవుడు; వనం=వనమును గూర్చి నిర్గతే=వెళ్ళగా; తతః=తరువాత; భూతభావనః=భూతములను సృజించువాడైన; భగవాన్ = శ్రీకృష్ణుడు; ద్వారవత్యాం=ద్వారకయందు; కిం అకరోత్=ఏమిచేసెను

తా. భాగవతోత్తముడైన ఉద్ధవుడు బదరికాశ్రమమునకు వెడలిన పిమ్మట భూతములను సృజించి భగవంతుడగు శ్రీకృష్ణుడు ద్వారకలో ఏమి చేసెను.

అవ భగవంతుడైన శ్రీకృష్ణుని విషయమున బ్రాహ్మణ శాపము పనిచేయదు గాన శ్రీకృష్ణుడు తన శరీరమెటుల విడిచె నని అడుగు చున్నారు.

శ్లో. **బ్రహ్మశాపోప సంసృష్టే స్వకులే యాదవర్షభః**
**ప్రేయసీం సర్వనేత్రాణాం కథం స్వతను మత్యజత్** 2

అ. స్వకులే=తన యాదవ కులము; బ్రహ్మశాపోప సంసృష్టే= బ్రాహ్మణశాపముచే నాక్రమింప బడినదికాగా; ఈ శాపము భగవంతునెడ సమర్థము కాదు. అయినను తాను యాదవుడు గాన నెట్టైనను దాన్ని మన్నించ వలెనని; యాదవర్షభః=యదుపుంగవుడైన శ్రీకృష్ణుడు; సర్వనేత్రాణాం =ఎల్లప్రాణుల ఎల్ల ఇంద్రియములకు; ప్రేయసీం=మిగుల నిష్టమైన, స్వతనుం= తన శరీరమును; కథం=ఎట్లు; అత్యజత్ =త్యజించెను.

తా. తన యాదవ కులము బ్రాహ్మణ శాపము పొందగా యదుపుంగవుడైన శ్రీకృష్ణ భగవానుడు తన నా శాపమంటకున్నను, తాను యాదవుడై నందున ఆ శాపమును మన్నించు వాడై లోకుల నేత్రాది సర్వేంద్రియములకు ప్రీతిపాత్రమైన తన శరీరమును ఎట్లు వీడెను.

శ్లో. ప్రత్యాకృష్టుం నయన మబలా యత్ర లగ్నం నశేకుః
కర్ణావిష్టం న సరతి తతో యత్సతా మాత్మలగ్నమ్
య చ్ఛ్రీర్వాచాం జనయతి రతిం కీర్త్యమానా కవీనామ్
దృష్ట్వా జిష్ణో ర్యుధి రథ గతం యచ్చ తత్సామ్య మీయుః. 3

అ. అబలాః=గోపికాస్త్రీలు· యత్ర=ఏ శ్రీకృష్ణ స్వరూపమునందు; లగ్నం=తగులుకొన్న; నయనం =తమ నేత్రమును; ప్రత్యాకృష్టుం = మరల్చుటకు; న శేకుః = సమర్థులు కాక పోయిరో, కర్ణావిష్టం = కర్ణరంధ్రముల ద్వారా ప్రవేశించిన; యత్—ఏ స్వరూపము; సతాం—సాధువులకు; ఆత్మ లగ్నం-హృదయము నందు లగ్నమై; తతః—ఆ హృదయము నుండి; న సరతి-తొలగిపోదో; యచ్ఛ్రీః -ఏ స్వరూపము శోభ; కీర్త్యమానా—కొనియాడ బడినదై ; కవీనాం-కవుల యొక్క; వాచాం - వాక్కు లకు; రతిం-ఉల్లాసమును; జనయతి- కలిగించునో, రథగతం—అర్జునుని రథమునందున్న; జిష్ణోః- శ్రీకృష్ణుని యొక్క; యత్—ఏ స్వరూపమును, యుధి -యుద్ధమునందు; దృష్ట్వా—చూచి; తత్సామ్యం ఆ రూప సామ్యమును; ఈయుః — పొందిరి

తా. ఒకసారి చూచినంత మాత్రమున గోపికలు తమ చూపును మరల్చుకోలేక పోయిరి సాధువులు కర్ణరంధ్రముల ద్వారా ప్రవేశించిన స్వరూపమును, మనసు నుండి తొలగించుకోలేక పోయిరి. కవులు అతని సౌందర్య శోభను వర్ణించినంత మాత్రమున వాక్కులకు ఉల్లాసము కలుగును. యుద్ధమున అర్జునుని రథమునందు శ్రీకృష్ణుని స్వరూపమును ఒకసారి చూచినంత మాత్రమున, తత్సామ్యమును పొందిరి. అటువంటి సర్వేంద్రియ ప్రీతికరమైన శరీరమును భగ వానుడు ఎటుల వీడెను. అని పరీక్షిత్తు అడుగుచున్నాడు·

శ్రీ శుక ఉవాచ = శ్రీశుకులు పలికిరి.

శ్లో. దివి భువ్యంతరిక్షే చ మహోత్పాతాన్ సముత్థితాన్
దృష్ట్వాఽఽసీనాన్ సుధర్మాయాం కృష్ణః ప్రాహ యదూనిదమ్. 4

అ. దివి = ఆకసమందు సూర్య పరివేషాదులు, భువి = భూమి యందు భూకంపాదులు; అంత రిక్షే చ— ఆంతరిక్షము నందు, దిగ్దాహాదులు, మహోత్పాతాన్=గొప్ప ఉపద్రవములు, సముత్థితాన్ - పుట్టినవానిని, (స్వయముగ సృష్టించ బడినవి గాన అన్యులచే శాంతింప చేయరానివి)దృష్ట్వా= చూచి, కృష్ణః = శ్రీకృష్ణుడు, సుధర్మాయాం = సుధర్మయను సభయందు, ఆసీనాన్ = కూర్చొని యున్న, యదూన్— యాదవులను గూర్చి, ఇదం = ఈ విధముగా, ప్రాహ = పలికెను.

---

అంతటను గృష్ణుడేమయ్యె నరసి చూడ
యదువు లెటులు వర్తించి రేర్పడంగ
ద్వారకా పట్టణం బెవ్విధమున నుండె
ముని జనశ్రేష్ఠ యానతీ ముదముతోడ. 117.

తా. ఆకాశము నందు సూర్య పరివేషము అనగా సూర్యుని చుట్టు గుండ్రని కాంతి రేఖ, భూమిమీద భూకంపాదులు, దిక్కుల మధ్యలో దిగ్దాహాదులు మొదలగు మహోత్పాత ములను శ్రీకృష్ణుడు చూచెను. ఇవి స్వకులక్షయము కొఱకు తానే కల్పించినవి కావున ఇత రులు శాంతింప చేయలేరు. సుధర్మయను తన సభలో కూర్చొని యున్న యాదవులను గూర్చి ఇటుల పలికెను.

శ్రీకృష్ణ ఉవాచ= శ్రీకృష్ణుడు పలికెను.

శ్లో. **ఏతే ఘోరా మహోత్పాతా ద్వారవత్యాం యమకేతవః**
**శాపశ్చ నః కుల స్యాసీత్ బ్రాహ్మణేభ్యో దురత్యయః**
**ముహూర్త మపి నస్థేయ మత్ర నో యదుపుంగవాః** 5

అ. ఏతే - ఈ, ఘోరాః - భయంకరములైన, మహోత్పాతాః - గొప్ప యుపద్రవములు, ద్వారవత్యాం - ద్వారకయందు, యమ కేతవః - యమునిధ్వజములై అనగా మృత్యు సూచకములై కాన్పించు చున్నవి, నః కులస్య - మన కులమునకు, బ్రాహ్మణేభ్యః - బ్రాహ్మణుల వలన, దుర త్యయః - దాటరాని, శాపశ్చ - శాపము కూడా, ఆసీత్ - కలిగి యుండెను. యదు పుంగవాః - ఓ యాదవ శ్రేష్ఠులారా! అత్ర - ఈ ద్వారకయందు, నః - మనకు, ముహూర్త మపి - ఒక ముహూ ర్తము కూడా, నస్థేయం - ఉండదగదు.

తా. యదుశ్రేష్ఠులారా! ద్వారకలో కలుగుచున్న గొప్ప యుత్పాతములు చూడుడు. ఇవి మృత్యుసూచకముగా నున్నవి. మన వంశమునకు దాటరాని శాపము బ్రాహ్మణుల వలన మొదటనే యున్నది. కావున మనమీ ద్వారకలో ఒక ముహూర్తము కూడా యుండరాదు

శ్లో. **స్త్రియో బాలాశ్చ వృద్ధాశ్చ శంఖద్వారం వ్రజంత్వితః**
**వయం ప్రభాసం యాస్యామః యత్ర ప్రత్యక్సరస్వతీ.** 6

అ స్త్రియః - స్త్రీలు, బాలాశ్చ = బాలురు, వృద్ధాశ్చ - వృద్ధులు, ఇతః - ఇటనుండి, శంఖ ద్వారం - శంఖద్వారమను ప్రదేశమునకు, వ్రజంతు - వెళ్ళుదురు గాక, వయం - మేము, ప్రభాసం = ప్రభాస తీర్థమును గూర్చి; యాస్యామః = వెళ్ళెదము; యత్ర = ఏ ప్రభాస తీర్థము నందు; సర స్వతీ =సరస్వతీ నది, ప్రత్యక్స్రోతా = పశ్చిమముగా ప్రవహించునో.

తా. ఈ ద్వారకనుండి స్త్రీలు బాలురు వృద్ధులు శంఖద్వారమను ప్రదేశమునకు పొందు మేము సరస్వతీ నది పశ్చిమముగా ప్రవహించు ప్రభాస తీర్థమునకు వెళ్ళెదము.

శ్లో. **తత్రాభిషిచ్య శుచయ ఉపోష్య సుసమాహితాః**
**దేవతాః పూజయిష్యామః స్నపనాలేపనార్హణైః.** 7

అ. తత్ర = ఆప్రభాస తీర్థము నందు; అభిషిచ్య = స్నానము చేసి, శుచయః = పరిశుద్ధులమై; ఉపోష్య = ఉపవసించి; సుసమాహితాః = నిశ్చల చిత్తులమై; దేవతాః = దేవతలను; స్నపనాలేపనా ర్హణైః = అభిషేకము; చందన లేపనము మొదలగు పూజలచే; పూజయిష్యామః = పూజించెదము.

తా. ఆ ప్రభాస తీర్థమునందు స్నానము చేసి పరిశుద్ధులమై, ఉపవసించి, నిశ్చల చిత్తు లమై స్నాన చందనాది ఉపచారములతో దేవతలను పూజించెదము.

శ్లో॥ బ్రాహ్మణాంశ్చ మహాభాగాన్ కృతస్వస్త్యయనా వయమ్
గోభూహిరణ్యవాసోభిః గజాశ్వరథవేశ్మభిః. 8

అ. కృతస్వస్త్యయనాః = చేయబడిన పుణ్యాహవచనమను మంగళకర్మగల వారమై; వయం = మనము, మహాభాగాన్ = పూజ్యులైన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను గో భూ హిరణ్య వా సోభిః = గోవులు, భూమి, బంగారము, వస్త్రములు మొదలగు వానిచే; గజాశ్వ రథ వేశ్మభిః = ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, గృహములు మొదలగు వానిచే, పూజయిష్యామః = పూజించెదము

తా. పుణ్యాహవచనము మొదలగు శుభకర్మల నాచరించి, పూజ్యులైన బ్రాహ్మణులను గోవులు, భూమి, బంగారము, వస్త్రములు రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, గృహములు మొదలగు వాటితో పూజించెదము.

శ్లో॥ విధి రేష హ్యరిష్టఘ్నో మంగళాయన ముత్తమమ్
దేవద్విజ గవాం పూజా భూతేషు పరమో భవః 9

అ. ఏషః = ఈ విధిః = పూజాది విధి; అరిష్టఘ్నః = అశుభములను హరించును, ఉత్తమం = శ్రేష్ఠమైన; మంగళాయనం = శుభములకు మార్గము; భూతేషు = ప్రాణులందు; దేవద్విజగవాం = దేవతల, బ్రాహ్మణుల, గోవుల, పూజా = పూజ; పరమః = ఉత్తమమైన; భవః = పుట్టుక గలది యగును.

తా. ఇటుల పూజించిన అన్ని అశుభములు తొలగును. అన్నిటిలో ఉత్తమమైన శుభములు కలిగించు సాధనము ఇదియే. అన్ని ప్రాణుల యందు దేవతల పూజ బ్రాహ్మణ పూజ గోపూజ దేవలోకమున ఉత్తమగతుల నిచ్చును.

శ్లో॥ ఇతి సర్వే సమాకర్ణ్య యదువృద్ధా మధుద్విషః
తథేతి నౌభి రుత్తీర్య ప్రభాసం ప్రయయూ రథైః 10

అ. ఇతి = ఈ విధముగా; సర్వే = అందరు; యదువృద్ధాః = యాదవ వృద్ధులు; మధుద్విషః = మధువను అసురుని చంపిన శ్రీకృష్ణుని యొక్క వాక్యమును; సమాకర్ణ్య = విని; తథేతి = అట్లే యని యభినందించి; నౌభిః = నావలచే; ఉత్తీర్య = దాటి; రథైః = రథములతో; ప్రభాసం = ప్రభాస తీర్థమును; ప్రయయుః = వెళ్ళిరి.

తా. యాదవుల పెద్దలందరు శ్రీకృష్ణుని మాటలు విని, అట్లే యని యభినందించి నావలతో సముద్రమును దాటి, రథములతో ప్రభాస తీర్థమునకు వెళ్ళిరి.

శ్లో॥ తస్మిన్ భగవతాఽఽదిష్టా యదుదేవేన యాదవాః
చక్రుః పరమయా భక్త్యా సర్వశ్రేయోప బృంహితమ్. 11

అ. యదుదేవేన = యాదవప్రభువగు; భగవతా = భగవంతుని చేత; ఆదిష్టాః = ఆజ్ఞాపించబడినవారై, యాదవాః = యాదవులు; తస్మిన్ = ఆ ప్రభాస తీర్థమందు; పరమయా = నిశ్చలమైన; భక్త్యా = భక్తితో, సర్వశ్రేయోప బృంహితం = అన్ని శుభములను పెంపొందించు పూజాదికమును; చక్రుః = చేసిరి

తా. యాదవ ప్రభువు భగవానుడగు శ్రీకృష్ణుని ఆజ్ఞ ప్రకారము యాదవులందఱు ఆ ప్రభాస తీర్థములో నిశ్చలమైన భక్తితో అన్ని శుభములను పెంపు చేయు పూజాదికమును చేసిరి.

శ్లో. తత స్తస్మిన్మహాపానం పపుర్మైరేయకం మధు
దిష్ట విభ్రంశితధియో యద్ద్రవై ర్భ్రశ్యతే మనః 12

ఆ తతః=ఆ పూజాదికములు ముగిసిన తరువాత; తస్మిన్=ఆ ప్రభాస తీర్థమునందు; మైరేయకం=మైరేయకమను పేరుగల; మధు=మద్యమును; దిష్టవిభ్రంశిత ధియః=దైవముచేత స్తిమితము పోగొట్టబడిన చిత్తము గలవారై; మహాపానం=గొప్పపానమును; పపుః=త్రావిరి; యద్ద్రవైః=ఏ మద్యరసముచే; మనః=మనస్సు; భ్రమతే=భ్రమించునో.

తా. ఆ ప్రభాస తీర్థము నందు పూజాదికములు ముగిసిన తరువాత, దైవోపహత చిత్తులై, మనసును భ్రమింప చేయు మద్యరసమును పానము చేసిరి.

శ్లో. మహాపానాభిమత్తానాం వీరాణాం దృప్త చేతసామ్
కృష్ణమాయా విమూఢానాం సంఘర్షస్సుమహానభూత్. 13

ఆ మహాపానాభి మత్తానాం=గొప్ప మద్యపానము చేత మత్తుగొనిన; వీరాణాం=వీరులైన దృప్తచేతసాం=పొగరు గొన్న చిత్తముగల; కృష్ణమాయా విమూఢానాం=శ్రీకృష్ణుని మాయచేత మూఢులైన ఆ యాదవులకు; సుమహాన్=మిక్కిలి గొప్పదైన; సంఘర్షః=కలహము ఆభూత్=జరిగెను, (కలిగెను).

తా. శ్రీకృష్ణ భగవానుని మాయచే మూఢులై, మహాపానముచే మత్తులై, పొగరు గొన్న చిత్తముతో వీరులైన ఆ యాదవులకు గొప్ప కలహము కలిగెను.

శ్లో. యుయుధుః క్రోధసంరబ్ధా వేలాయామాతతాయినః
ధనుర్భి రసిభిర్భల్లైర్గదాభి స్తోమరేష్టిభిః 14

ఆ. క్రోధ సంరబ్ధాః=మిక్కిలి రోషముచే ముందుకురుకువారై; ఆతతాయినః=ఒకరినొకరు; చంపువారై; వేలాయాం=ఆ గట్టునందు; ధనుర్భిః=చాపములతో; అసిభిః=ఖడ్గములతో; భల్లైః=బల్లెములతో; గదాభిః=గదలతో; తోమరేష్టిభిః=చిల్లకోలలు ఈటెలు మున్నగు వానిచే; యుయుధుః=యుద్ధము చేసిరి.

తా. ఇట్లు క్రోధవశులైన ఆ యాదవులు ఆ గట్టునందు ఒకరినొకరు చంపు కోరిక కల వారై, చాపములు ఖడ్గములు, బల్లెములు, గదలు, చిల్లకోలలు, ఈటెలు మున్నగువానిచే యుద్ధము చేసిరి.

శ్లో. పతత్పతాకై రథకుంజరాదిభిః ఖరోష్ట్ర గోభిర్మహిషైర్నరైరపి
మిథస్సమేత్యాశ్వతరైస్సుదుర్మదా న్యహన్ శరైర్దద్భి రివ ద్విపావనే 15

ఆ. పతత్పతాకైః=ఎగురుచున్న టెక్కెములు గల; రథకుంజరాద్యభిః=రథములు; ఏనుగులు, గుఱ్ఱములచేత; ఖరోష్ట్రగోభిః=గాడిదలు; ఒంటెలు. ఎద్దుల చేత; మహిషైః=దున్నలచే; నరైరపి=

నరవాహనములతో; అశ్వతరైః కంచర గాడిదలచేత; మిథః=పరస్పరము; సమేత్య=మార్కొని; దుర్మదాః=మదాంధులై; వనే=వనమున; ద్విపాః=ఏనుగులు; దద్భిరివ=దంతములతోవలె; శరైః=బాణములతో; న్యహన్=చంపిరి

తా. ఎగురు చున్న ధ్వజములతో, రథములతో, ఏనుగులతో, గుఱ్ఱములతో, గాడిదలతో, ఒంటెలతో, ఎద్దులతో, దున్నలతో, నరవాహనములతో, కంచర గాడిదలతో కూడా పరస్పరము ఎదుర్కొని, దుర్మదముతో, అడవిలో ఏనుగులు దంతములతో చంపుకొనునట్లు బాణములతో ఒకరినొకరు చంపుకొనిరి.

అవ. ఒకరినొకరు చంపుకొనుటను నాలుగు శ్లోకములతో వివరించు చున్నారు.

**శ్లో. ప్రద్యుమ్న సాంబౌ యుధి రూఢ మత్సరా వక్రూర భోజా వనిరుద్ధ సాత్యకీ**
**సుభద్ర సంగ్రామ జితౌ సు చారు గదౌ సుమిత్రా సురథౌ సమీయతుః. 16**

అ. యుధి=యుద్ధమునందు; రూఢమత్సరౌ=బాగుగా నాటుకొన్న మత్సరముగల; ప్రద్యుమ్న సాంబౌ=ప్రద్యుమ్నుడు - సాంబుడు; అక్రూర భోజౌ=అక్రూరుడు - భోజుడు; అనిరుద్ధ సాత్యకీ=అనిరుద్ధుడు - సాత్యకి; సుభద్ర సంగ్రామజితౌ=సుభద్రుడు, సంగ్రామ జిత్తు. సుచారుగదౌ=సుచారుడు, గదుడు; సుమిత్రా సురథౌ=సుమిత్రు - సురథుడు; సమీయతుః=ఎదుర్కొనిరి.

య. ఆ యాదవులు మత్సరము బాగా పెరుగగా, యుద్ధములో ప్రద్యుమ్న సాంబులు అక్రూర భోజులు, అనిరుద్ధ సాత్యకులు, సుభద్ర సంగ్రామ జిత్తులు, సుచారు గదులు, సుమిత్రా సురథులు ఎదుర్కొనిరి.

**శ్లో. అన్యే చ యే వై భిషదోల్ముకాదయ స్సహస్రజి చ్ఛతజిద్భాను ముఖ్యాః**
**అన్యోన్య మాసాద్య మదాంధకారితా జఘ్నుర్ముకుందేన విమోహితా భృశమ్. 17**

అ. యేవై=ఎవరు; అన్యే చ=ఇతరులు కూడా; భిషదోల్ముకాదయః=భిషదుడు ఉల్ముకుడు మొదలగువారు; సహస్రజిత్ శతజిత్ భానుముఖ్యాః=సహస్రజిత్తు; శతజిత్ భానువు మొదలగువారు; అన్యోన్యం=పరస్పరము; ఆసాద్య=ఎదుర్కొని; ముకుందేన=శ్రీకృష్ణుని చేత; భృశం=మిక్కిలి; విమోహితాః=మోహమును పొందింప బడినవారై; మదాంధకారముచే బలాత్కరింప బడినవారై; జఘ్నుః=చంపుకొనిరి.

తా. ఇంకను భిషదుడు, ఉల్ముకుడు, సహస్రజిత్, శతజిత్, భానువు మొదలగువారు శ్రీకృష్ణునిచే బాగుగా మోహితులై, మదాంధకారముచే బలాత్కరింపబడి ఒకరినొకరు ఎదుర్కొని చంపుకొనిరి.

**శ్లో. దాశార్హ భోజాంధక వృష్ణి సాత్వతా దుర్వారకా, మాథుర శూరసేనకాః**
**విసర్జనాపై కుకురా కుంతయశ్చ మద్రాశ్చ జఘ్నుః పరిహృత్య సౌహృదమ్. 18**

అ. దుర్వారకాః=వారింప శక్యముకానివారై; దాశార్హ భోజాంధక వృష్ణి సాత్వతాః=దాశార్హులు భోజులు, అంధకులు, వృష్ణులు, సాత్వతులు; మాథుర శూరసేనకాః=మాథురులు, శూరసేనులు, విసర్జనాః=విసర్జనులు; కుకురాః=కుకురులు, కుంతయః=కుంతి వంశమువారు; మద్రాశ్చ=మద్ర వంశము వారు కూడా; సౌహృదం=స్నేహమును; పరిహృత్య=వదిలి; జఘ్నుః=చంపుకొనిరి.

తా. మదాంధకారముతో వారింప శక్యము కానివారై, దాశార్హ, భోజ, అంధక వృష్ణి సాత్వత, మాధుర, శూరసేన, విశర్జన, కుకుర, కుంతి, మద్ర వంశీయులు స్నేహమును వదిలి ఒకరినొకరు చంపుకొనిరి.

శ్లో. పుత్రా స్త్వయుధ్యన్ పితృభి ర్భ్రాతృభిశ్చ స్వస్రీయ దౌహిత్ర పితృవ్యమాతులైః
మిత్రాణి మిత్రైః సుహృదస్సుహృద్భి ర్జ్ఞాతీం స్త్వహన్ జ్ఞాతయ ఏవ మూఢాః 19

అ. పుత్రాః = కొడుకులు; పితృభిః = తండ్రులతో; భ్రాతృభిశ్చ = సోదరులతోను, స్వస్రీయ దౌహిత్ర పితృవ్యమాతులైః = చెల్లెలుకొడుకులతో, కూతురుకొడుకులతో, పినతండ్రులతో, మేనమామలతో; అయుధ్యన్ = యుద్ధము చేసిరి; మిత్రాణి = మిత్రులు; మిత్రైః = మిత్రులతో; సుహృదః = ఆప్త బంధువులు; సుహృద్భిః = ఆప్తబంధువులతో; అయుధ్యన్ = యుద్ధము చేసిరి; మూఢాః = మోహితులైన; జ్ఞాతయః = దాయాదులు, జ్ఞాతీనేవ = దాయాదులనే; అహన్ = చంపిరి.

తా. కొడుకులు తండ్రులతో, సోదరులతో, చెల్లెలు కొడుకులతో, కూతురు కొడుకులతో, పినతండ్రులతో, మేనమామలతో యుద్ధము చేసిరి. మిత్రులు మిత్రులతో, ఆప్తులు ఆప్తులతో యుద్ధము చేసిరి. మూఢులైన దాయాదులు దాయాదులనే చంపిరి.

శ్లో. శరేషు హీయ మానేషు భజ్య మానేషు ధన్వసు
శస్త్రేషు క్షీయ మాణేషు ముష్టిభి ర్జగృహు రేరకాః, 20

అ. శరేషు = బాణములు; హీయమానేషు = విఱిగిపోగా; శస్త్రేషు = ఆయుధములు; క్షీయ మాణేషు = క్షీణింపగా; ముష్టిభిః = పిడికిళ్ళతో, ఏరకాః = తుంగపోచలను; జగృహుః = గ్రహించిరి.

తా. బాణములన్నియు నఱుపోగా, ధనస్సులు విరిగిపోగా, ఆయుధములు క్షీణింపగా ఆ యాదవులు పిడికిళ్ళతో తుంగపోచలను గ్రహించిరి.

శ్లో. తా వజ్ర కల్పా హ్యభవన్ పరిఘా ముష్టిభిర్ధృతాః
జఘ్ను ర్ద్విషంతః కృష్ణేన వార్యమాణాస్తు తం చ తే 21

అ. ముష్టిభిః = పిడికిళ్ళతో; ధృతాః = ధరించబడిన; తాః = ఆ తుంగపోచలు, వజ్రకల్పాః = వజ్రముతో సమానములైన; పరిఘాః = గుదియలుగా, అభవన్ = ఆయెను; ద్విషంతః = ద్వేషించుచున్న తే = ఆ యాదవులు; కృష్ణేన = శ్రీ కృష్ణునిచే; వార్యమాణాస్తు = వారించబడినను; తం చ = ఆ శ్రీ కృష్ణుని కూడా; జఘ్నుః = కొట్టిరి.

తా. పిడికిళ్ళతో తీసుకొనిన తుంగపోచలే వజ్రసారములైన గుదియలైనవి. శ్రీకృష్ణుడు వారించుచున్ననూ ద్వేషించుచు, శ్రీకృష్ణుని కూడా కొట్టిరి.

శ్లో. ప్రత్యనీకం మన్యమానా బలభద్రం చ మోహితాః
హంతుం కృతధియో రాజన్ ఆపతన్నాతతాయినః. 22

అ. మోహితాః = శ్రీకృష్ణుని మాయతో మోహించినవారై; బలభద్రం చ = బలరాముని కూడా; ప్రత్యనీకం = ప్రతిపక్షముగా; మన్యమానాః = తలచినవారై; ఆతతాయినః = ఆఘాతకులు; హంతుం = చంపుటకు, కృతధియః = సంకల్పించి; ఆపతన్ = మీదికి ఉరికిరి.

తా. శ్రీకృష్ణుని మాయచే మోహితులైన ఆ యాదవులు బలరాముని కూడా శత్రువుగా భావించి అతన్ని చంపుటకు సంకల్పించి మీది కురికిరి.

శ్లో. అథ తా వపి సంక్రుద్ధా వుద్యమ్య కురునందన
ఏరకా ముష్టి పరిఘౌ చరంతౌ జఘ్నతుర్యుధి. **23**

అ. కురునందన=ఓ కురువంశీయుడా!; అథ=అటు పిమ్మట; తావపి=ఆ శ్రీకృష్ణ బలరాములు కూడా; సంక్రుద్ధౌ=కోపించినవారై; ఉద్యమ్య=ఉద్యమించి; ఏరకాముష్టి పరిఘౌ=పిడికిళ్ళలో తుంగపోచలను గుదియలుగ కలవారై; యుధి=యుద్ధమునందు; చరంతౌ=తిరుగుచు; జఘ్నతుః=చంపిరి.

తా. ఓ కురు వంశీయా! అట్లు యాదవులు తమ మీదికి రాగా వారు కూడా కోపించి తుంగపోచలను తీసుకొని యుద్ధరంగమున తిరుగుచు యాదవులను చంపసాగిరి.

శ్లో. బ్రహ్మ శాపోప సృష్టానాం కృష్ణమాయావృతాత్మనామ్
స్పర్థాక్రోధః క్షయం నిన్యే వైణవోగ్నిర్యథా వనమ్ **24**

బ్రహ్మశాపోపసృష్టానాం=బ్రాహ్మణ శాపము తాకిన; కృష్ణమాయా వృతాత్మనాం=శ్రీకృష్ణుని మాయచే ఆవరించబడిన మనస్సు గల యాదవుల; స్పర్థాక్రోధః=విరోధము నిమిత్తముగా గల క్రోధము; వైణవః=వెదురు పొదలోపుట్టిన; అగ్నిః=అగ్ని: వనం; యథా=వనమునువలె; క్షయం=నాశమును; నిన్యే=పొందించెను.

తా. బ్రాహ్మణ శాపముదాకిన, శ్రీకృష్ణుని మాయతో మోహితులైన యాదవుల విరోధము వలన కలిగిన కోపము, వెదురు పోదలో పుట్టిన అగ్ని వనమును నాశము చేసినట్లు వారి కులమును నాశము చేసెను.

శ్లో. ఏవం నష్టేషు సర్వేషు కులేషు స్వేషు కేశవః
అవతారితో భువో భార ఇతి మేనేఽవ శేషితః. **25**

అ. ఏవం=ఈ ప్రకారముగా; స్వేషు=స్వీయములైన; సర్వేషు=అన్ని; కులేషు, కులములు నష్టేషు=నాశనము పొందగా; కేశవః=శ్రీకృష్ణుడు; భువః=భూమియొక్క; భారః=భారము. అవశేషితః=నిశ్శేషముగా; అవతారితః=దించబడినది; ఇతి=అని, మేనే=తలచెను.

తా. ఈ ప్రకారముగా తన వారందరు నశించిన తరువాత శ్రీకృష్ణుడు నిశ్శేషముగా భూ భారము తొలగించ బడినది. అని తలచెను.

శ్లో. రామ స్సముద్ర వేలాయాం యోగ మాస్థాయ పౌరుషమ్
తత్యాజ మానుషం లోకం సంయోజ్యాత్మాన మాత్మని. **26**

అ. రామః=బలరాముడు; సముద్ర వేలాయాం=చెలియలి కట్టమీద; పౌరుషం=పరమపురుష రూపధ్యానమగు; యోగం=యోగమును; ఆస్థాయ=ఆశ్రయించి; ఆత్మానం=తన చిత్తమును; ఆత్మని=పరమాత్మయందు; సంయోజ్య=చేర్చి; మానుషం లోకం=భూలోకమును; మనుష్యరూపమును; తత్యాజ=వదిలెను.

తా. కడలి చెలియలి కట్ట యందు బలరాముడు పరమపురుష ధ్యాన రూపమగు యోగమును స్వీకరించి, చిత్తమును పరమాత్మయందు చేర్చి భూలోకమును మానవరూపమును విడిచెను.

శ్లో. రామ నిర్యాణ మాలోక్య భగవాన్దేవకీ సుతః
నిషసాద ధరోపస్థే తూష్ణీ మాసాద్య పిప్పలమ్. 27

అ. దేవకీసుతః = దేవకీ పుత్రుడైన; భగవాన్ = శ్రీ కృష్ణభగవానుడు; రామనిర్యాణం = రాముని కాల ధర్మమును; ఆలోక్య = చూచి; పిప్పలం = రాగి చెట్టును; అసాద్య = పొంది; ధరోపస్థే = భూమి మీద; తూష్ణీం = మిన్నక; నిషసాద = కూర్చుండెను

తా. దేవకీ పుత్రుడైన శ్రీకృష్ణ భగవానుడు రామ నిర్యాణమును చూచి, రాగి చెట్టును ఆశ్రయించి భూమి మీద మిన్నక కూర్చుండెను.

శ్లో. బిభ్రచ్చతుర్భుజం రూపం భ్రాజిష్ణు ప్రభయా స్వయా
దిశో వితిమిరాః కుర్వన్ నిర్ధూమ ఇవపావకః. 28

అ. స్వయా = తనదైన; ప్రభయా = తేజముచే; భ్రాజిష్ణు = ప్రకాశించు; చతుర్భుజం = నాలుగు భుజములు గల; రూపమును; బిభ్రత్ = ధరించినవాడై ; నిర్ధూమః = పొగలేని; పావకః ఇవ = అగ్నివలె; దిశః = దిక్కులను; వితిమిరాః = చీకటిలేవి దానినిగా; కుర్వన్ = చేయుచున్నవాడును.

తా. తన దివ్య తేజముచే ప్రకాశించు నాలుగు భుజములు గల రూపమును దాల్చి పొగ లేని నిప్పువలె దిక్కులను ప్రకాశింప చేయుచున్న వాడై యుండెను.

శ్లో. శ్రీవత్సాంకం ఘనశ్యామం తప్త హాటక వర్చసమ్
కౌశేయాంబరయుగ్మేన పరివీతం సుమంగళమ్. 29

అ. శ్రీవత్సాంకం = శ్రీవత్సమను పుట్టుమచ్చ కలిగిన; ఘనశ్యామం = మేఘమువలె నీలవర్ణము గల; తప్తహాటకవర్చసం = కరిగిన పసిడి వంటి తేజము గల; కౌశేయాంబర యుగ్మేన = పట్టువలువల జంటచే; పరివీతం = కట్టబడిన; సుమంగళం = మంచి శుభలక్షణములు గలవానిని.

తా. శ్రీవత్సమను పుట్టుమచ్చ కలవానిని, మేఘము వలె నీలవర్ణుని, కరిగిన పసిడి తేజము గల పట్టువలువల జంటచే కట్టబడిన వానిని శుభలక్షణములు గలవానిని.

శ్లో. సుందరస్మిత వక్త్రాబ్జం నీలకుంతల మండితం
పుండరీకాభిరామాక్షం స్ఫురన్మకరకుండలమ్. 30

అ. సుందరస్మిత వక్త్రాబ్జం = సుందరమైన చిరునవ్వు కలిగిన ముఖ పద్మము గల వానిని; నీల కుంతల మండితం = నల్లని ముంగురులతో శోభించెడి; పుండరీకాభి రామాక్షం = ఎఱ్ఱని కమలములవలె అందమైన కనులు గల వానిని. స్ఫురన్మకరకుండలం = ప్రకాశించెడి మకర కుండలములు గలవానిని.

అందమైన చిరునవ్వు గల ముఖ పద్మము గల వానిని, నల్లని ముంగురులతో అలంకరించు కొనిన వానిని, ఎఱ్ఱని కమలముల వలె అందమైన కనులు కలవానిని, ప్రకాశించు మకర కుండలములు కలవానిని.

శ్లో. కటిసూత్ర బ్రహ్మసూత్ర కిరీట కటకాంగదైః
హారనూపుర ముద్రాభిః కౌస్తుభేన విరాజితమ్ 31

అ. కటిసూత్ర = మొలత్రాడు; బ్రహ్మసూత్ర=యజ్ఞోపవీతము; కిరీట = కిరీటము; కటక = కడియములు; అంగదైః=బాహుభూషణములు; చేత; హార=ముత్యాల హారములచేత; నూపుర=అందెల చేత; ముద్రాభిః=ఉంగరముల చేత; కౌస్తుభేన=కౌస్తుభ మణిచేత; విరాజితం=శోభించెడివాని.

తా. మొలత్రాడు, జందెము, కిరీటము, కడియములు, బాహుభూషణములు, ముత్యాల హారములు, అందెలు, ఉంగరములు, కౌస్తుభ మణి మొదలగు ఆభరణముల చేత శోభించు వాడును

శ్లో. వనమాలా పరీతాంగం మూర్తి మద్భిర్నిజాయుధైః
కృత్వోరౌ దక్షిణే పాదం ఆసీనం పంకజారుణమ్ 32

అ. వనమాలా పరీతాంగం=తోమాలచే వ్యాప్తమైన సర్వాంగములు కలవాని; మూర్తిమద్భిః= మూర్తిమంతమైన; నిజాయుధైః=సుదర్శనాది ఆయుధముల చేత కూడుకొనిన వానిని; పంకజా రుణం=పద్మమువలె ఎఱ్ఱని; పాదం=పాదమును; దక్షిణే=కుడి; ఊరౌ=తొడమీద; కృత్వా= ఉంచుకొని; ఆసీనం=కూర్చొని యున్న వానిని.

తా. తోమాలచే వ్యాపించబడిన సర్వాంగములు గలవానిని, మూర్తిమంతమైన సుదర్శనాద్యాయుధముల చేత కూడుకొనిన వానిని, పద్మమువలె ఎఱ్ఱని పాదమును కుడి తొడ మీద ఉంచుకొని కూర్చొనిన వానిని.

శ్లో. ముసలావశేషాయః ఖండ కృతేషుః లుబ్ధకో జరాః
మృగస్యాకార చరణం వివ్యాధ మృగ శంకయా 33

అ. ముసల = రోకలియొక్క; అవశేష = మిగిలినదైన; అయఃఖండ = ఇనుప ముక్కచేత, కృతేషుః = చేయబడిన బాణముగల; జరాః = జరాయను; లుబ్ధకః = వేటగాడు; మృగస్య = మృగము యొక్క: ఆకార = ఆకారముతోనున్న; చరణః = పాదమును; మృగ శంకయా = మృగమను అనుమానముచేత; వివ్యాధ = కొట్టెను.

తా. జరుడను వేటగాడు, రోకలి కొనయైన ఇనుప ముక్కతో చేసుకొనిన బాణముతో, మృగాకారముతోనున్న శ్రీకృష్ణ పాదమును మృగమనుకొని కొట్టెను.

శ్లో. చతుర్భుజం తం పురుషం దృష్ట్వా స కృత కిల్బిషః
భీతః పపాత శిరసా పాదయోరసురద్విషః 34

అ. చతుర్భుజం=నాలుగు భుజములుగల; తం=ఆ; పురుషం=శ్రీ కృష్ణుని; దృష్ట్వా=చూచి కృత కిల్బిషః=పాపము చేసిన; సః=ఆ వేటగాడు; భీతః=భయపడినవాడై; అసురద్విషః= రాక్షస వైరియైన శ్రీ కృష్ణుని; పాదయోః=పాదముల మీద; పపాత = పడెను.

తా. నాలుగు భుజములు గల శ్రీకృష్ణుని చూచిన ఆ వేటగాడు తాను చేసిన పొర పాటును తెలుసుకొని భయపడి ఆ శ్రీకృష్ణుని పాదములపై పడెను.

శ్లో. అజానతా కృతమిదం పాపేన మధుసూదన
క్షంతు మర్హసి పాపస్య ఉత్తమ శ్లోకమే ప్రభో 35

అ. మధుసూదన=మధువను రాక్షసుడిని సంహరించిన వాడా!, ఉత్తమ శ్లోక=ఉత్తమ చరిత్రకలవాడా!; ప్రభో!=ఓ ప్రభూ!; పాపేన=పాపియైన, అజానతా=తెలియని నా చేత; ఇదం ఈపని; కృతం=చేయబడినది పాపస్య=పాపియైన; మే=నా యొక్క పాపమును; క్షంతుం= క్షమించుటకు; అర్హసి=తగుదువు

తా. ఓ మధుసూదనా! ఉత్తమ శ్లోకుడా! ఓ ప్రభూ! పాపినైన నేను తెలియక ఈ పాపమును చేసితిని. నా ఈ పాపమును క్షమించుము.

శ్లో. యస్యాద్య స్మరణం నృణా మజ్ఞాన ధ్వాంత నాశనం
వదంతి తస్యతే విష్ణో మయాఽసాధు కృతం ప్రభో! 36

అ విష్ణో=ఓ విష్ణూ!; యస్య=ఎవరి; అనుస్మరణం=స్మరణము; నృణాం=మానవులకు; అజ్ఞానధ్వాంత నాశనం=అజ్ఞానమను చీకటిని నశింపచేయును; అని; వదంతి=చెప్పుచున్నారో; తస్య =అటువంటి; తే=నీకు; ప్రభో!=ఓ ప్రభూ!; మయా=నా చేత; అసాధు=చెడ్డపని; కృతం= చేయబడినది.

తా. ఓ ప్రభూ! విష్ణూ! ఒకసారి స్మరిస్తేనే అజ్ఞానాంధకారమును నశింప చేయు నీకు నేను గొప్ప అపచారము చేసితిని.

శ్లో. తన్మాముజహి వైకుంఠ పాప్మానం మృగలుబ్ధకమ్
యథా పునరహం త్వేవం నకుర్యాం సదతిక్రమమ్ 37

అ వైకుంఠ!=ఓ వైకుంఠా!, తత్=అందువలన; పాప్మానం=పాపియైన; మృగలుబ్ధకం =మృగములను వేటాడు; మాం=నన్ను; ఉజ్జహి=చంపుము; యథా=ఏ ప్రకారముగా, అహం= నేను; పునః=మరల; ఏవం=ఈవిధముగా; సదతి క్రమం=సత్పురుషుల కు అపచారమును; నకుర్యాం =చేయనో.

తా. ఓ వైకుంఠా! నేను మరల ఇటువంటి పాపమును చేయకుండగా, పాపిని మృగములను వేటాడు నన్ను చంపుము.

అవ. ఇది బ్రాహ్మణ శాపము వలన జరిగినది. నీ పొరపాటేమియును లేదు. అనగా చెప్పుచున్నారు.

శ్లో. యస్యాత్మయోగరచితం న విదుర్విరించి రుద్రాదయోస్యతనయాః పతయోగిరాంయే
త్వన్మాయయా పిహితదృష్టయ ఏతదంజః కింతస్యతే వయ మసద్గతయోగృణీమః.

అ. త్వన్మాయయా=నీమాయచేత; పిహిత దృష్టయః=కప్పబడిన జ్ఞానముగల; విరించి రుద్రాదయః=బ్రహ్మ రుద్రుడు మొదలగు వారు; అస్య=ఈ బ్రహ్మ యొక్క; తనయాః=పుత్రులు; యే =ఎవరైతే; గిరాంపతయః=వేదద్రష్టలు; యస్య=ఎవని యొక్క; ఆత్మ యోగరచితం=తనదైన

యోగమాయచేత నిర్మించిన జగమును; నవిదుః తెలియరో; తస్య తే=అటువంటినీకు; ఏతత్ = ఈ బ్రాహ్మణ శాపము; కిం = ఏమి ? అంజః=సులభముగా; అ సద్గతయః = అజ్ఞానులమైన; వయం= మేము; కిం = ఏమని; గృణీమః=వర్ణించెదము.

తా మాయా మోహితులైన బ్రహ్మ రుద్రాదులు, ఆ బ్రహ్మపుత్రులైన వేదద్రష్టలు కూడా నీ యోగ మాయచే నిర్మించిన ఈ జగమును తెలియలేరు. అంతటి నీకు ఈ బ్రాహ్మణ శాపమెంతటిది? అటువంటి నిన్ను అజ్ఞానుల మైన మేము ఏమని వర్ణించగలము.

శ్రీకష్ణ ఉవాచ = శ్రీకృష్ణుడు పలికెను.

శ్లో. మాభైషీ ర్జర ఉత్తిష్ఠ! కామ ఏష కృతో హి మే
యాహి త్వం మదనుజ్ఞాత స్స్వర్గం సుకృతినాం పదమ్. **39**

అ, జర != ఓ జరుడా !; మా భైషీః=భయపడకుము; ఉత్తిష్ఠ=లెమ్ము; ఏషః=ఇది; మే కామః =నాఇష్టమే, కృతః = చేయబడినది; హి = అందువలన, సుకృతినాం= పుణ్యాత్ములకు; పదం =స్థానమునగు; స్వర్గం=స్వర్గమును, మదను జ్ఞాతః = నా అనుమతి పొందినవాడవై; యాహి = పొమ్ము

తా. ఓ జరుడా! భయపడకుము. లెమ్ము. ఇది నా ఇష్టమే. అందువలన పుణ్యాత్ములు వెళ్ళదగు స్వర్గమునకు వెళ్ళుము.

శ్రీశుక ఉవాచ = శ్రీ శుకులు పలికిరి.

శ్లో. ఇత్యాదిష్టో భగవతా కృష్ణే నేచ్ఛా శరీరిణా
త్రిః పరిక్రమ్య తం నత్వా విమానేన దివం యయౌ **40**

అ. ఇచ్ఛా శరీరిణా =తన సంకల్పముచే స్వీకరించిన శరీరముగల; భగవతా = భగవంతుడగు; కృష్ణేన=శ్రీ కృష్ణుని చేత; ఇతి = ఈ విధముగా; ఆదిష్టః=ఆదేశించబడినవాడై ; తం=ఆ కృష్ణుని త్రిః = ముమ్మారు పరిక్రమ్య=ప్రదక్షిణము చేసి; నత్వా=నమస్కరించి; విమానేన = విమానముతో దివం = స్వర్గమును గూర్చి; యయౌ = వెళ్ళెను

తా. తన ఇచ్ఛ ననుసరించి శరీరమును ధరించు భగవానుడగు శ్రీకృష్ణునిచే ఆజ్ఞాపించ బడినవాడై, ఆ శ్రీకృష్ణునికి ముమ్మారు ప్రదక్షిణము చేసి నమస్కరించి విమానముతో స్వర్గమునకు వెళ్ళెను.

శ్లో. దారుకః కృష్ణ పదవీ మన్విచ్ఛన్నధి గమ్య తం
వాయుం తులసికామోదమాఘ్రాయా భిముఖం యయౌ **41**

అ దారుకః = శ్రీకృష్ణసారథి, కృష్ణపదవీం = కృష్ణుని మార్గమును; అన్విచ్ఛన్ = చూచి గోరుచు; తులసికామోదం = తులసి పరిమళముగల; వాయుం=వాయువును; ఆఘ్రాయ = మూర్కొని; తం = ఆ కృష్ణుని; అధిగమ్య=పొంది, అభిముఖం = ఎదురుగా, యయౌ =వెళ్ళెను.

తా. శ్రీకృష్ణుని రధసారధి యగు దారుకుడు శ్రీకృష్ణునన్వేషించుచు వచ్చువాడై తులసి పరిమళములతో నున్న వాయువును మూర్కొని శ్రీకృష్ణుని చూచి అతనికి ఎదురుగా వెళ్ళెను.

శ్లో. తం తత్ర తిగ్మద్యుభి రాయుధై ర్వృతం హ్యాశ్వత్థమూలే కృతకేతనం పతిం
స్నేహస్నుతాత్మా నిపపాత పాదయో రథా దవప్లుత్య సబాష్పలోచనః 42

అ తత్ర=అచ్చట; అశ్వత్థమూలే; రావిచెట్టు మొదట; కృత కేతనం=చేయబడిన స్థానము గల, తిగ్మద్యుభిః=తీవ్రమైన కాంతులు గల; ఆయుధైః=చక్రాద్యాయుధముల చేత; వృతం=కూడిన పతిం=ప్రభువైన; తం=ఆ శ్రీ కృష్ణుని; (చూచి) స్నేహస్నుతాత్మా=ప్రేమచే ద్రవించిన మనస్సు గలవాడై; రథాత్=రథమునుండి; అవప్లుత్య=దుమికి; సబాష్పలోచనః=కన్నీరుతోకూడిన కన్నులు గలవాడై; పాదయోః=పాదములపై; నిపపాత=పడెను.

తా. అచ్చట రాగిచెట్టు మొదట గూర్చుండి, మిగుల తేజరిల్లు చక్రాద్యాయుధముతో కూడుకున్న శ్రీకృష్ణ భగవానుని చూచి, నెయ్యమున మెత్తబడిన మనస్సు గలవాడై, రథము నుండి దుమికి, నీరునిండిన కన్నులతో, శ్రీకృష్ణుని పాదములపై బడెను.

దారుక ఉవాచ = దారుకుడు పలికెను.

శ్లో. అపశ్యత స్తే చరణాంబుజం ప్రభో! దృష్టిః ప్రణష్టా తమసి ప్రవిష్టా
దిశో న జానే నలభే చ శాంతిం యథా నిశాయా ముడుపే ప్రణష్టే 43

అ. ప్రభో!=ఓ ప్రభూ! తే=నీ యొక్క; చరణాంబుజం=పాదకమలములను; అపశ్యతః చూడనట్టి నాకు; దృష్టిః=చూపు; ప్రణష్టా=నశించెను; తమసి=చీకటి యందు; ప్రవిష్టా = ప్రవేశించినది; దిశః = దిక్కులను; న జానే = తెలియను; శాంతిం = శాంతిని; నలభే చ = పొందను; యథా = యే ప్రకారముగా, నిశాయాం = రాత్రి యందు; ఉడుపే = నక్షత్రరాజైన చంద్రుడు; ప్రణష్టే = అస్తమించు వాడుకాగా.

తా. ఓ ప్రభూ! నీ పాద పద్మ దర్శనము లేని నాకు చూపు పోయినది చీకటే మిగిలినది. శాంతిని పొందలేక పోవుచున్నాను. రాత్రి యందు చంద్రుడు అస్తమించగా దిక్కులు తెలియనట్లు నాకు దిక్కులు తెలియుట లేదు.

శ్లో. ఇతి బ్రువతి సూతే వై రథో గరుడ లాంఛనః
ఖ ముత్పపాత రాజేన్ద్ర సాశ్వధ్వజ ఉదీక్షతః 44

అ. ఇతి = ఈ విధముగా, సూతే = సారథి; బ్రువతి = పలుకు చుండగా; గరుడలాంఛనః = గరుడధ్వజముగల; సాశ్వధ్వజః = అశ్వములతో ధ్వజముతో కూడిన; రథః = రథము; ఉదీక్షతః = ఆకాశము వైపు చూచుచుండగా; ఖం = ఆకాశము పైకి, ఉత్పపాత = ఎగిరెను.

తా. ఇట్లు రథసారథి పలుకుచుండగా గరుడధ్వజముతో అశ్వములతో శ్రీకృష్ణుని రథము ఆకాశమున కెగిరెను.

శ్లో. తమన్వగచ్ఛన్దివ్యాని విష్ణుప్రహరణాని చ
తేనాతి విస్మితాత్మానం సూత మాహ జనార్దనః. 45

అ దివ్యాని = దివ్యములైన; విష్ణుప్రహరణాని చ = ఆ శ్రీ కృష్ణుని సుదర్శనాద్యాయుధములు; తం = ఆ రథమును; అన్వగచ్ఛన్ = అనుసరించి వెళ్ళెను; తేన = అటులవెళ్ళుటచే; అతివిస్మిత+ఆత్మానం = అచ్చెరు వొందిన మనసు గల; సూతం = సారథిని; జనార్దనః = శ్రీకృష్ణుడు; ఆహ = ఇటుల చెప్పెను.

తా॥ ఆ శ్రీకృష్ణుని సుదర్శనాద్యాయుధములు రథము వెంట వెళ్ళుటను చూచి అచ్చెరు వొందిన సారథితో శ్రీకృష్ణుడిటుల పలికెను

శ్రీభగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను.

శ్లో. గచ్ఛ ద్వారవతీం సూత! జ్ఞాతీనాం నిధనం మిథః
సంకర్షణస్య నిర్యాణం బంధుభ్యో బ్రూహి మద్దశామ్ **46**

అ. సూత! = ఓ సూతుడా! ద్వారవతీ = ద్వారకాపురికి; గచ్ఛ = పొమ్ము; జ్ఞాతీనాం = బంధువులయొక్క; మిథః = పరస్పరము; నిధనం = పోరు సలిపి మరణించుటయు; సంకర్షణస్య = బలభద్రుని యొక్క; నిర్యాణం = తనుత్యాగమును; మత్ + దశాం = నా స్థితిని; బంధుభ్యః = బంధువులకు; బ్రూహి = చెప్పుము.

తా, ఓ సూతుడా! నీవు ద్వారకకు బోయి మనవారగు యాదవులందరు పరస్పరము కలహించి మృతులగుటయు. బలభద్రుడు తనువు చాలించుటయు, నేనున్న స్థితియు వీని నన్నింటిని అచ్చట బంధువులకు చెప్పుము.

శ్లో. ద్వారకాయాం చ నస్థేయం భవద్భిశ్చ స్వబంధుభిః
మయా త్యక్తాం యదు పురీం సముద్రః ప్లావయిష్యతి **47**

అ. స్వబంధుభిః = మనబంధువులచేతను, భవద్భిః = మీచేత; ద్వారకాయాం = ద్వారకయందును నస్థేయం = ఉండదగదు; మయా = నాచేత; త్యక్తాం = వీడబడిన, యదుపురీం = యాదవుల పురిని; సముద్రః = సముద్రుడు; ప్లావయిష్యతి = ముంచగలడు.

తా. మన బంధువులును మీరును ఇక ద్వారకయందు వసింప దగదు. నేను వీడిన ఆ యాదవుల పురిని సముద్రుడు ముంచివేయును.

శ్లో. స్వం స్వం పరిగ్రహం సర్వే మాదాయ పితరౌ చ నః
అర్జునేనావితాః స్సర్వ ఇంద్ర ప్రస్థం గమిష్యథ **48**

అ. సర్వే = ఎల్ల బంధువులు; నః = మాయొక్క; పితరౌచ = తల్లిదండ్రులును స్వంస్వం = తమతమ; సర్వం = సమస్తమగు; పరిగ్రహం = వస్తుసామగ్రిని; ఆదాయ = గ్రహించి; అర్జునేన = అర్జునునిచే; అవితాః = రక్షింపబడినవారై; ఇంద్రప్రస్థం = ఇంద్రప్రస్థ నగరమునకు; గమిష్యథ = పొండు.

తా. మీరెల్లరును మా తలిదండ్రులును తమతమ వస్తు సామాగ్రిని గైకొని అర్జునునిచే రక్షింపబడువారై ఇంద్రప్రస్థ నగరమునకు పొండు.

శ్లో. త్వం తు మద్ధర్మ మాస్థాయ జ్ఞాన నిష్ఠ ఉపేక్షకః
మన్మాయా రచితా మేతాం విజ్ఞాయోపశమం వ్రజ **49**

త్వంతు = నీవు మాత్రము; మత్ ధర్మం = నాయందలి భక్తిని, ఆస్థాయ = నెలకొని; జ్ఞాననిష్ఠః = జ్ఞాననిష్ఠకలవాడవై; ఉపేక్షకః = ఉదాసీనుడవై; మత్ మాయా రచితాం = నామాయచే నేర్పడిన; ఏతాం = ఈ విద్య విషయమును; విజ్ఞాయ = ఎరింగి; ఉపశమం = మనశ్శాంతిని; వ్రజ = పొందుము.

తా. నీవు మాత్రము నా యెడ భక్తినొంది జ్ఞాననిష్ఠగలవాడవై అన్నిటియందు ఉదాసీనుడవై ఇది యంతయు నా మాయావితానమని యెఱింగి మనశ్శాంతిని పొందుము.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకుడు పలికెను.

**శ్లో. ఇత్యుక్త స్తం పరిక్రమ్య నత్వా కృష్ణం పునః పునః**
**తత్పాదౌ శీర్ష్ణ్యుపాధాయ దుర్మనాః ప్రయయౌ పురీమ్. 50**

అ ఇతి ఉక్తః = ఇట్లు శ్రీ కృష్ణునిచే చెప్పబడిన దారుకుడు; తం కృష్ణం = ఆ శ్రీ కృష్ణుని; పరిక్రమ్య = ప్రదక్షిణము చేసి, పునః పునః = మరల మరల; నత్వా = నమస్కరించి; తత్పాదౌ = ఆ శ్రీకృష్ణుని పాదములను; శీర్ష్ణి = శిరమునందు; ఉపాధాయ = ఉంచుకొని; దుర్మనాః = కలతమనసు గలవాడై; పురీం + ద్వారకాపురిని; ప్రయయౌ...పోయెను.

తా. భగవానుడిట్లు చెప్పగా వినిన దారుకుడు, శ్రీ కృష్ణునికి ప్రదక్షిణము చేసి మరల మరల మ్రొక్కి, ఆయన పాదములను శిరమున నుంచుకొని యాదవ కులము నశించినదని మనఃక్షోభము గలవాడై ద్వారకాపురికి పోయెను.

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే త్రింశోధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమున ఏకాదశ స్కంధమునందు
ముప్పదియవ అధ్యాయము సమాప్తము

ఓం తత్సత్

# ఏకత్రింశోఽధ్యాయః

## ముప్పదియొకటవ అధ్యాయము

అవ:- ఈ అధ్యాయమున శ్రీకృష్ణుడు తన ధామమునకు వెళ్ళవలెనని తలంచుట, వసుదేవుడు లోనగువారలు ప్రీతితో ఆ భగవంతుని అనుసరించి వెళ్ళుట, దేవతలను యాదవులుగా జేసి పిదప నా యాదవులను దేవతలనుగా జేసి శ్రీ కృష్ణుడు స్వేచ్ఛతో తన తనువు తోడనే తన ధామమును జేరుట చెప్పబడును.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుక మహర్షి పలికెను.

**శ్లో. అథ తత్రాగమద్బ్రహ్మ భవాన్యా చ సమం భవః**
**మహేన్ద్రప్రముఖా దేవా మునయ స్స ప్రజేశ్వరాః** 1

అ. అథ = అంతట; తత్ర = ఆ కృష్ణపరమాత్మయున్న ప్రదేశమునకు; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; భవాన్యా సమం = పార్వతితో కూడుకొనిన; భవః చ = పరమ శివుడును; మహేన్ద్రప్రముఖాః = మహేన్ద్రుడు మొదలుగా గల; దేవాః = దేవతలు; మునయః = మునులు; సప్రజా + ఈశ్వరాః = ప్రజాపతులును మరీచ్యాదులతో గూడినవారై; ఆగమత్ = వెడలెను,

తా. అంతట బ్రహ్మ పార్వతితో కూడుకొనిన పరమేశ్వరుడు, మహేన్ద్రాది దేవతలు సనకాది ఋషులు, సమస్త ప్రజాపతులును శ్రీ కృష్ణుడున్న ప్రదేశమునకు వెడలిరి.

**శ్లో. పితరస్సిద్ధ గంధర్వా విద్యాధర మహోరగాః**
**చారణా యక్షరక్షాంసి కిన్నరాప్సరసోద్విజాః** 2
**ద్రష్టుకామా భగవతో నిర్యాణం పరమోత్సుకాః** 3

అ భగవతః = భగవానుడైన శ్రీకృష్ణుని యొక్క; నిర్యాణం = పరమలోకగమనమును; ద్రష్టుకామాః = చూడగోరినవారై, పరమ + ఉత్సుకాః = మిక్కిలి యుత్సుకతతో గూడినవారై; పితరః = పితృదేవతలు; సిద్ధ = సిద్ధులు గంధర్వాః = గంధర్వులు; విద్యాధర = విద్యాధరులు; మహా + ఉరగాః = పన్నగులు, చారణాః = చారణులు, యక్ష = యక్షులు; రక్షాంసి = రాక్షస గణములును కిన్నరాః = కిన్నరులు, అప్సరసః = అప్సరసలు; ద్విజాః = గరుడలోక వాసులైన పక్షులును; (అచటికి చేరిరి అని పూర్వ శ్లోకముతో అన్వయము;)

తా. భగవానుడగు శ్రీ కృష్ణుడు స్వధామమునకు వెళ్ళుటను చూచు కోరికతో పితరులు సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, పన్నగులు, చారణులు, యక్షులు, రాక్షసులు, కిన్నరులు అప్సరసలు, గరుడలోక వాసులగు పక్షులు, మైత్రేయాది విప్రులును అచటికి చనుదెంచిరి.

అవ: ఉత్సాహముతో వారి చేతను ఒకటిన్నర శ్లోకముతో చెప్పుచున్నారు.

శ్లో. గాయంతశ్చ గృణంతశ్చ శౌరేః కర్మాణి జన్మచ
వవర్షుః పుష్పవర్షాణి విమానావళిభిర్నభః
కుర్వంతస్సంకులం రాజన్ భక్త్యా పరమయా యుతాః 4

అ. రాజన్=ఓ రాజా! = శౌరేః = శ్రీకృష్ణుని యొక్క; కర్మాణి = అవతార కృత్యములను జన్మ చ = పుట్టుకను గూర్చియు; గాయంతశ్చ = గానము చేయుచున్నవారై; గృణంతశ్చ = నుతించు వారునునై; విమాన + ఆవళిభిః = విమాన పంక్తులచే, నభః = ఆకాశమును; సంకులం = క్రిక్కిరియు నట్లుగా; కుర్వన్ = చేయుచు; పరమయా భక్త్యా = మిక్కిలి భక్తితో; యుతాః = కూడినవారై; పుష్ప వర్షాణి = పూలవానను; వవర్షుః = కురిపించిరి.

తా. ఓ రాజా! ఆ బ్రహ్మదిదేవతలు శ్రీకృష్ణుని యొక్క అవతారాది విశేషములను పాడుచు, కొనియాడుచు విమానారూఢులై నింగిని సంకుల పరచుచు పరమ భక్తి యుక్తులై శ్రీహరిపై పూలవాన గురిపించిరి

శ్లో. భగవానపి తాన్వీక్ష్య విభూతీరాత్మనో విభుః
సంయోజ్యాత్మని చాత్మానం పద్మనేత్రే న్యమీలయత్. 5

అ భగవానపి = శ్రీ కృష్ణ భగవానుడు సైతము; ఆత్మనః = తనయొక్క; విభూతీః = ఐశ్వర్య స్వరూపులైన; తాన్ = ఆ ఇంద్రాది దేవతలను వీక్ష్య = చూచి; విభుః = సర్వజ్ఞుడైన శ్రీ కృష్ణ భగవానుడు; ఆత్మానం = తనయొక్క ఆత్మను; (అనగా తనదైన విష్ణ్వంశను) ఆత్మని = తనలో; సంయోజ్య = సంఘటిత పరిచి; పద్మనేత్రే = కమలముల వంటి తన నేత్రములను; న్యమీలయత్ = ముకుళింప చేసెను; (మోడ్చిన వాడాయెను)

తా. శ్రీకృష్ణ పరమాత్మ తన సంపదయొక్క స్వరూపులైన ఇంద్రాది దేవతలను గాంచి తనదైన అంశమునందు తన ఆత్మను ప్రవేశింప చేసి స్వస్వరూప స్థితిని స్మరించుచు తన నేత్రములను ముకుళింపచేసెను. ఇచట నేత్రములు ముకుళింప చేయుట పూర్వము బ్రహ్మాది దేవతలు "సలోకాన్ లోకపాలా న్నః పాహి వైకుంఠ కింకరాన్" నీ కింకరులమైన మమ్ము లను కాపాడుము అని ప్రార్థించుట వలన, వారందరు భగవంతుని తమ తమ లోకములకు తోడ్కొని వెళ్ళుటకు, అయా లోకములు వైకుంఠనగరమునకు పోవుదారిలో యున్నందున ఆ దేవతలయందు దయగలవాడగుటచే వారిని చూచిన వారి ప్రార్థనను ఆమోదించవలయును గాన వారిని వంచించుటకు కనులు ముకుళింప చేసెను. అని తెలియవలయును.)

అవ: యోగులవలె స్వచ్ఛంద మృత్యువును భగవానుడు కూడా పొందునను భ్రమను వారించు చున్నారు.

శ్లో. లోకాభిరామం స్వతనుం ధారణాధ్యాన మంగళమ్
యోగధారణయాగ్నేయ్యా దగ్ధ్వా ధామా విశత్స్వకమ్. 6

అ. లోక + అభిరామాం = సకలలోక జీవులకు మనోహరమైనట్టియు, ధారణా ధ్యాన మంగళం = మనోధారణ, ధ్యానములచే శుభకరమైనట్టి; స్వతనుం = తన యొక్క శరీరమును; ఆగ్నేయ్యా = అగ్నిప్రభమై చూపట్టు; యోగధారణయా = యోగ శక్తిచే; అదగ్ధ్వా = దహింపబడకయే; స్వకం = తనకు సంబంధించిన; ధామ = వైకుంఠమును; అవిశత్ = ప్రవేశించెను.

తా. భగవానుడగు శ్రీకృష్ణుడు సకల జీవులకు మనోహరమైన, ధారణ ధ్యానములచే శుభకరమైన తన శరీరమును అగ్ని ప్రభయై కనపడు యోగ శక్తిచే దహింపకయే తనదైన వైకుంఠమునకు చేరెను. (తన శరీరమును దహింప చేసినచో జగత్తున కాధారమైనందున జగత్తే దహించిపోవును. అందువలన దహింప చేయకనే వెళ్ళెను అని చెప్పుట.)

అవ. వెళ్ళిన భగవంతుడు తమ లోకమునకే వచ్చునని దేవతలందరు దుందుభి నాదములను పుష్పవృష్టి మొదలగు మహోత్సవములను జరుపుచున్నారని చెప్పుచున్నారు.

శ్లో. దివి దుందుభయో నేదుః పేతుస్సుమనసశ్చ ఖాత్
సత్యం ధర్మో ధృతి ర్భూమేః కీర్తి శ్శ్రీశ్చానుపితం యయుః 7

అ. దివి = స్వర్గమునందలి; దుందుభయః = దుందుభులు; నేదుః = మ్రోగినవి ఖాత్ = ఆకసము నుండి; సుమనసః = పుష్పములు; పేతుః = రాలినవి; సత్యం = సత్యము; ధర్మః = ధర్మము ధృతిః = ధృతి భూమేః = భూమి నుండి; శ్రీః = శ్రేయస్సు; కీర్తిశ్చ = కీర్తియును; తం = ఆ శ్రీ కృష్ణపరమాత్మ ననుసరించి; యయుః = వెడలిపోయినవి.

తా. అంతట స్వర్గమునందు దేవ దుందుభులు మ్రోగినవి. ఆకాశము నుండి పుష్పవృష్టి గురిసెను. ఈ భూమి నుండి సత్యము, ధర్మము ధృతి కీర్తి, శ్రేయస్సును మొదలగునవి ఆ కృష్ణుని అనుసరించి వైకుంఠమునకు వెళ్ళిపోయినవి.

శ్లో. దేవాదయో బ్రహ్మముఖ్యా న విశంతం స్వధామని
అవిజ్ఞాత గతిం కృష్ణం దదృశుశ్చాతి విస్మితాః 8

అ. బ్రహ్మముఖ్యాః = బ్రహ్మ మొదలగు; దేవాదయః = ఇంద్రాది దేవతలు; స్వధామని = తనదైన వైకుంఠము నందు; అవిజ్ఞాతగతిం = ఎవరికి తెలియనటువంటి; అనగా ఎవరు ఎరుగనట్టి తెలిసికొనలేనట్టి గమనముతో; విశంతం = ప్రవేశించుచున్నట్టి; కృష్ణం = శ్రీ కృష్ణ పరమాత్మను; న దదృశుః = చూడనివారై అతి విస్మితాః = మిక్కిలి ఆశ్చర్యమును పొందిరి.

తా. ప్రముఖులైన బ్రహ్మయు ఇంద్రాది దేవతలును ఎవరికి తెలియని, ఎవరు తెలియలేని గమనముతో తన వైకుంఠమును చేరునట్టి శ్రీ కృష్ణుని గానక ఆశ్చర్య చకితులైరి.

అవ. అవిజ్ఞాత గతిని దృష్టాంతముతో స్పష్టము చేయుచున్నారు.

శ్లో. సౌదామిన్యా యధాకాశే యాంత్యా హిత్వాఽభ్రమండలమ్
గతిర్న లక్ష్యతే మర్త్యై స్తథాకృష్ణస్య దైవతైః 9

అ. యధా = ఏ ప్రకారముగా; ఆకాశే = ఆకాశమునందు; అభ్రమండలం = మేఘమండలమును; హిత్వా = వీడి; యాంత్యాః = వెళ్ళుచున్న; సౌదామిన్యాః = మెఱుపు యొక్క; గతిః = గమనము; అనగా వెళ్ళిపోవునట్టి విధము మర్త్యైః = మానవులచే; న లక్ష్యతే = చూడబడుట లేదో; తథా = అటులనే; దైవతైః = దేవతలచేత; కృష్ణస్య = కృష్ణునియొక్క; గతిః = గమనము; నలక్ష్యతే = కనుగొనబడలేదు.

తా. గగన తలమందలి మేఘమండలమును వీడి అంతర్ధానము చెందునట్టి మెరుపులను మానవులెట్లు చూడలేక పోవుచున్నారో, అట్లే స్వలీలతో, స్వస్వరూపమున స్వస్థానము చెందునట్టి శ్రీ కృష్ణుని దేవతలు సహితము చూడలేక పోయిరట.

శ్లో. బ్రహ్మరుద్రాదయస్తేతు దృష్ట్వా యోగగతిం హరేః
విస్మితాస్తం ప్రశంసంత స్వం స్వం ధామాగమన్నృప. 10

అ. హేనృప=ఓ రాజా!; తే=ఆ; బ్రహ్మరుద్రాదయః=బ్రహ్మ రుద్రుడు మొదలుగా గల దేవత లందరును; హరేః=శ్రీ కృష్ణుని యొక్క; యోగగతిం=యోగ మార్గమున స్వస్థానమునకు వెళ్ళుచున్నతీరును; దృష్ట్వా=చూచి; విస్మితాః = ఆశ్చర్యము చెందినవారై, తం=ఆ శ్రీకృష్ణుని; ప్రశంసంతః=ప్రశంసించుచున్నవారై; స్వం స్వం=తమ తమ; ధామ=నివాసమును గూర్చి; ఆగమన్= వెళ్ళిరి,

తా. ఓ రాజా! బ్రహ్మయు, రుద్రుడు, ఇంద్రుడు మొదలుగా గల దేవతలందరును తన యోగశక్తిచే, స్వస్థలమైన వైకుంఠమునకు వెళ్ళుచున్న శ్రీహరిని గానక ఆశ్చర్యమును చెందినవారై ఆ పరమాత్మను ప్రశంసించుచు వారి వారి స్థానంబులకు వెళ్ళిరి.

అవ. మొదట చెప్పిన అభిప్రాయము అర్థము కాని పరీక్షిత్తును చూచి స్పష్టమైన దృష్టాంతమును తెలుపగా సంతోషించిన పరీక్షిత్తును గాంచి మరల ఆ విషయమునే వివరముగా మూడు శ్లోకములతో తెలువుచున్నారు.

శ్లో. రాజన్పరస్య తనుభృజ్జననాప్యయేహా
మాయావిడంబన మవేహి యథానటస్య
సృష్ట్వాత్మనేద మనువిశ్య విహృత్య చాంతే
సంహృత్య చాత్మ మహిమోపరత స్స ఆస్తే 11

అ. రాజన్!=ఓ పరీక్షిన్మహా రాజా!; పరస్య=సర్వ జగత్కారణుడైన శ్రీహరి యొక్క; తనుభృత్+జనన+అప్యయ+ఈహాః= యాదవులందు జనించుట; లయమగుట ఆనెడి చేష్టలు; నటస్య=నటుని యొక్క; యథా=ఎట్లు; మాయా విడంబనం=మాయా విలాసమై తన నటనానంతరము మామూలుగా ఉండునో; అట్లే ఈ పరమాత్ముని విషయము నందును; అవేహి = తలంచుము; ఆత్మనా = స్వయముగనే; ఇదం = ఈజగత్తును; సృష్ట్వా = సృష్టించి; అనువిశ్య=తానిందు ప్రవేశించి విహృత్య=ఇందు విహరించియు; సంహృత్య=ప్రళయకాలమున సంహారమొనర్చియు; ఆత్మమహిమా =తన యొక్క మహిమ, ఉపరతః=ఉపరత మొనద్చుకొను చున్నవాడై; సః=ఆ శ్రీహరి; ఆస్తే ఉన్నవాడగు చున్నాడు (ప్రవర్తించు చున్నాడమట),

తా. ఓ రాజా! నటుడు ఏ విధముగా తనదిగాని మాయావేషమును ధరించి నటించి నటనానంతరము రంగస్థలము నుండి నిష్క్రమించి తన స్థితిని పొందుచున్నాడో అట్లే భగవంతుడును తనదైన ఆత్మమహిమచే మనుజులందు (యాదవులందు) తానొకడుగా జన్మించి, కలసి విహరించి, అంత్యకాలమున సంహారము గావించి, తన మాయా స్థితినుపసంహరించుకొని యథాస్థితిని అనగా పూర్వస్థితిని పొందుచున్న వాడుగా తెలియుము.

అవ. ఇది ఇటుల కాదని తలంచరాదు. ఈ అవతారముననే భగవానుని నిరతిశయ ప్రభావమును చూచియున్నామని చెప్పుచున్నారు.

శ్లో. మర్త్యేన యో గురుసుతం యమలోకనీతం
త్వాం చాన యచ్ఛరణదః పరమాస్త్ర దగ్ధమ్ 12

శ్లో. జిగ్యేఽంత కాంతక మపీశ మసావనీశః
కిం స్వావనే స్వరనయన్మృగయుం సదేహమ్ 12

అ. యః = ఎవడు; యమలోక నీతం = యమలోకమునకు గొనిపోబడిన; గురుసుతం = గురు పుత్రుని; మర్త్యేన = ఆ మనుజ శరీరముతోడనే; ఆనయత్ = తీసుకొని వచ్చెనో; శరణదః = ఆ శరణాగత రక్షకుడు; బ్రహ్మాస్త్ర దగ్ధం = బ్రహ్మాస్త్రముచే దహింపబడిన; త్వాం చ = నిన్ను కూడా; ఆనయత్ = రక్షణచేసి తీసుకొని వచ్చెను. అంతక + అంతకం = యమునికి లేక ఘాతుకులకు నాశకుడైనట్టి; ఈశం = రుద్రుని సైతము; జిగ్యే = బాణ సంగ్రామము నందు జయించెనో; (అట్టి శ్రీ కృష్ణుడు) మృగయుం = తనను బాణముతో కొట్టిన లుబ్ధుడగు వేటగాని, సదేహం = ఆ దేహముతోనే, స్వః = స్వర్గమునకు; అనయత్ = చేర్చెనో; (అట్టి శ్రీ కృష్ణుడు) స్వ + అవనే = తనను రక్షించుకొనుటయందు లేక తన రక్షణ మందు; అనీశః కిం? = అసమర్థుడా యేమి?

తా. యమలోకమునకు గొని పోబడిన తన గురు పుత్రుని ఆదే శరీరముతో గురు సన్నిధికి చేర్చిన శ్రీ కృష్ణుడు, బ్రహ్మాస్త్రముతో దహించబడిన నిన్ను కాపాడిన కృష్ణుడు శరణా గత రక్షకుడు బాణాసురునితో పోరుసల్పు తఱి అంతకాంతకుడగు రుద్రుని సైతము గెల్చిన కృష్ణుడు, తనపై బాణము వేసిన వేటగాని సశరీరముగా స్వర్గమునకు పంపిన శ్రీ కృష్ణుడు తనను రక్షించుకొనుట యందసమర్థుడా? ఏమియును కాదు. (జగత్తు సర్వము యధీనమే యని భావము)

అవ శ్రీహరి సమర్థుడైనచో అదేశరీరముతో ఇక్కడే మరికొంత కాలమేల యుండలేదు అను శంకకు సమాధానము తెలుపు చున్నారు.

శ్లో. తథాఽప్యశేషస్థితి సంభవాప్యయే
ష్వనన్య హేతుర్యదశేష శక్తిధృక్
నైచ్ఛత్ప్రణేతుం వపురత్ర శేషితమ్
మర్త్యేన కిం స్వాత్మగతిం ప్రదర్శయన్ 13

అ. అశేషస్థితిసంభవాప్యయేషు = ఎల్లవిశ్వముల పుట్టుక ఉనికి గిట్టుటలయందు; అనన్యహేతుః = ఇతరాపేక్షలేని కారణ భూతుడు, అశేష శక్తిధృత్ = ఎల్ల శక్తులు గలవాడు; తథాపి = అయినను శేషితం = యాదవుల నాశము తరువాత మిగిలిన; వపుః = తన శరీరమును; అత్ర = ఈ లోకమున (ఉంచుటకు;) నైచ్ఛత్ = సంకల్పించ లేదు; మర్త్యేన = నశ్వర మైన మానవ దేహముతో; కిం = ఏమి ప్రయోజనము (ఏమియును లేదనుట) స్వాత్మగతిం = తన వారికి ఆత్మ నిష్ఠను; ప్రదర్శయన్ = తెలుపుచు; ప్రణేతుం = తన శరీరమును తీసుకొని వెళ్ళుటకే; ఐచ్ఛత్ = సంకల్పించెను.

తా. అన్ని లోకములను సృష్టించుటలో రక్షించుటలో సంహరించుటలో ఇతరాపేక్ష లేని కారణమైనవాడు, అన్నిశక్తులు గలవాడైనను ఆ శ్రీ కృష్ణుడు నశ్వరమైన ఈ మానవ దేహముతో ఏ ప్రయోజనము లేదని స్వాత్మగతియే ఉత్తమమని తెలియజేయదలచి తన శరీరమును తీసుకొని పోవుటకే సంకల్పించెను. అటులగాక ఆ భగవానుడు తన శరీరమును ఇచటనే ఉంచినచో ఆత్మనిష్ఠులు కూడ దివ్యగతిని ఆదరించక యోగబలముతో దేహసిద్ధిని ఏర్పరచుకొని ఇక్కడే ఉందురని. తాను సమర్థుడైనను శరీరముతో ఇక్కడే ఉండలేదు.

అవ. భగవద్గతిని కీర్తించుటవలన కలుగు ఫలమును చెప్పుచున్నారు.

శ్లో. య ఏతాం ప్రాత రుత్థాయ కృష్ణస్య పదవీం పరామ్
ప్రయతః కీర్తయన్ భక్త్యా తామేవాప్నోత్యనుత్తమామ్ **14**

అ. యః = ఎవడు; ఏతాం = ఈ చెప్పబడినటువంటి కృష్ణస్య = శ్రీ కృష్ణుని యొక్క; పరాం = పరమోత్కృష్టమైనట్టి, పదవీం = పరమపదవిని, ఆ చరిత్రను గూర్చి, ప్రాతః = తెల్లవారు జాముననే, ఉత్థాయ = నిద్ర మేల్కొని, ప్రయతః = ప్రయత్నపూర్వకముగా, భక్త్యా = మిక్కిలి భక్తితో; కీర్తయన్ = కీర్తించునో, అనుత్తమామ్ = అత్యంత ఉత్తమైన, తాం = ఆ, పదవీం = పరమపదవిని ఆప్నోత్యేవ = పొంది తీరును,

తా. ఓ రాజా! తెల్లవారుజాముననే నిద్ర మేల్కొని ప్రయత్నపూర్వకముగా మిక్కిలి భక్తితో శ్రీ కృష్ణుని పరమోత్కృష్టమైన ఈ పరమ పదవిని కీర్తించినవాడు ఆ పరమ పదవిని తప్పక పొందును.

అవ. స్వలోకమునకు వెళ్ళుచు శ్రీ కృష్ణుడు వసుదేవాదులను తన లోకమును చేరుటకు ఆలోచించిన ఉపాయమును తెలుపు చున్నారు.

శ్లో. దారుకో ద్వారకామేత్య వసుదేవోగ్రసేనయోః
పతిత్వా చరణా వస్రై ర్న్యషించ త్కృష్ణవిచ్యుతః **15**

అ. దారుకః = దారుకుడు, ద్వారకాం = ద్వారకానగరమును, ఏత్య = చేరి, వసుదేవ + ఉగ్రసేనయోః = వసుదేవ ఉగ్రసేనులయొక్క, చరణౌ = పాదములపై, పతిత్వా = పడినవాడై, కృష్ణ విచ్యుతః = కృష్ణుని బాసినవాడై, అస్రైః = కన్నీటిచే, న్యషించత్ = తడిపెను.

తా. దారుకుడు కృష్ణుని వీడి ద్వారకను చేరి. వసుదేవ ఉగ్రసేనుల పాదములకు ప్రణమిల్లి వారి పాదములను తన కన్నీటిచే తడిపెను.

శ్లో కథయామాస నిధనం వృష్ణీనాం కృత్స్నశో నృప
తచ్ఛ్రుత్వోద్విగ్నహృదయా జనాశ్శోక విమూర్ఛితాః. **16**

అ. హే నృప! = ఓరాజా! వృష్ణీనాం = యాదవులయొక్క; నిధనం = మరణమును; కృత్స్నశః = సర్వనాశనమును గూర్చియు; కథయామాస = వారికి చెప్పెను; తత్ = ఆ విషయమును; శ్రుత్వా = విని; జనాః = జనులందరు ఉద్విగ్నహృదయాః = కలత చెందిన హృదయము గలవారై; శోక మూర్ఛితాః = దుఃఖాతిశయముచే మూర్ఛబొందిరి.

తా. ఓ రాజా! దారుకుడు హృదయమున మిగుల కుందుచు ఎట్లెట్లో యాదవుల మరణమును గూర్చి యదు వంశము సర్వనాశనమైన తీరును వారికి వినిపించెను. ఆ మాటలను విని జనులు శోకము నొంది ఉద్విగ్నహృదయులై దుఃఖాతిరేకముచే మూర్ఛిల్లిరి

శ్లో. తత్ర స్మ త్వరితా జగ్ముః కృష్ణవిశ్లేష విహ్వలాః
వ్యసవ శ్శేరతే యత్ర జ్ఞాతయో ఘ్నన్త ఆననమ్ **17**

అ. కృష్ణ విశ్లేష విహ్వలాః = శ్రీ కృష్ణుని వియోగముచే కలత పడిన మనసు గలవారై; ఆననం ఘ్నంతః = ముఖమును ఇటునటు కొట్టుకొనుచు; యత్ర = ఎచట జ్ఞాతయః = తమ బంధువులగు యాద

వృ... వ్యసవః = పరస్పరము కలహించుటచే ప్రాణములు బాసి; శేరతేస్మ = పడియుండిరో; తత్ర = ఆ సముద్రతీరమును గూర్చి; త్వరితాః = తొందరపాటు గలవారై; జగ్ముః = వెళ్ళిరి.

తా. అంతట మూర్ఛనుండి మేల్కొనిన వసుదేవాదులు కృష్ణవియోగ దుఃఖముచే దిగులు చెంది, తక్కిన బంధు జనముతో గూడి తొందరపాటుతో తమ బంధువులగు యాదవులు పరస్పరము కలహించుకొని ప్రాణములు వీడి పడియున్న సముద్రతీరమునకు వెళ్ళిరి.

శ్లో. దేవకీరోహిణీచైవ వసుదేవ స్తథా సుతౌ
కృష్ణరామావపశ్యంత శ్శోకార్తా విజహుస్స్మృతిమ్
ప్రాణాంశ్చ విజహుస్త త్ర భగవద్విరహాతురాః 18

అ. దేవకీ = దేవకీదేవి; రోహిణీచైవ = రోహిణియును, తథా = అట్లే వసుదేవః = వసుదేవుడు; సుతౌ = పుత్రులగు, కృష్ణరామౌ = కృష్ణ బలరాములను; అపశ్యంతః = చూడనివారై; (కనిపించుట లేదు గనుక) శోకార్తాః = శోకముచే కుందుచు; స్మృతిః = స్మృతిని; విజహుః = వీడిరి; భగవద్విరహాతురాః = భగవంతుని విడుచుటచే కలత చెందినవారై; ప్రాణాంశ్చ = ప్రాణములను కూడా; విజహుః = విడిచినవారైరి

తా. దేవకి, రోహిణి వసుదేవుడు వారి పుత్రులగు బలరామకృష్ణులను గాననివారై స్మృతిని కోల్పోయి మూర్ఛిల్లిరి శ్రీ కృష్ణభగవానుని విడుచుట వలన మిగుల వెత బొందిన వారై ప్రాణములను సైతము వీడిరి.

శ్లో. ఉపగుహ్యపతీం స్తాం స్తాం శ్చితామారురుహు స్స్త్రియః
రామపత్న్యశ్చ తద్దేహ ముపగుహ్యాగ్ని మావిశన్. 19

అ. స్త్రియః = యాదవ స్త్రీలందరు, తాన్ తాన్ = వారివారి; (ఆ యా) పతీన్ = భర్తలను; ఉపగూహ్య = సమీపించినవారై, చితాం = చితిని; ఆరురుహుః = ఎక్కిన వారైరి రామపత్న్యశ్చ = బలరాముని భార్యలును; తత్ + దేహం = అతని శరీరమును; ఉపగూహ్య = కౌగిలించుకొని; అగ్నిం = అగ్నిలోనికి; ఆవిశన్ = ప్రవేశించిరి.

తా. యాదవస్త్రీలందరూ వారి వారి భర్తలను చేరి కౌగిలించుకొని చితులందు చేరిరి బలరాముని భార్యలును ఆతని కౌగిలించుకొని అగ్నిప్రవేశము చేసిరి.

శ్లో. వసుదేవ పత్న్య స్తద్గాత్రం ప్రద్యుమ్నాదీన్ హరిస్నుషాః
కృష్ణ పత్న్యోవిశన్నగ్నిం రుక్మిణ్యాద్యా స్తదాత్మికాః 20

అ. వసుదేవ పత్న్యః = వసుదేవుని భార్యలు; తద్గాత్రం = ఆయన శరీరమును హరిస్నుషాః = శ్రీ కృష్ణుని కోడండ్రు; ప్రద్యుమ్నాదీన్ = ప్రద్యుమ్నాదులను పట్టుకొని; కృష్ణ పత్న్యః = శ్రీకృష్ణుని భార్యలైన; రుక్మిణ్యాద్యాః = రుక్మిణిమొదలగువారు; తదాత్మికాః = ఆ శ్రీకృష్ణుని యందు మనస్సిడిన వారై; అగ్నిం = అగ్నిలోనికి; ఆవిశన్ = ప్రవేశించిరి.

వసుదేవుని భార్యలు వసుదేవుని, శ్రీ కృష్ణుని భార్యలగు రుక్మిణి మొదలగు వారు శ్రీ కృష్ణుని శ్రీ కృష్ణుని కోడళ్ళు ప్రద్యుమ్నుని పట్టుకొని అగ్ని ప్రవేశము చేసిరి.

శ్లో. అర్జునః ప్రేయసస్సఖ్యుః కృష్ణస్యవిరహాతురః
ఆత్మానం సాంత్వయామాస కృష్ణగీ తైస్సదుక్తిభిః 21

అ. ప్రేయసః = అత్యంత ప్రియుడును; సఖ్యుః = చెలకాడునునైన: కృష్ణస్య = శ్రీ కృష్ణుని యొక్క; విరహాతురః = వియోగముచేత ఆర్తుడైన; అర్జునః = అర్జునుడు; సదుక్తిభిః = చక్కనిమాటలైన (ప్రబోధవాక్యములైన) కృష్ణగీతైః = శ్రీకృష్ణ భగవానుడు పూర్వము తన కుపదేశించిన భగవద్గీతా వాక్యములచేత; ఆత్మానం = తనకుతానే; సాంత్వయామాస = ఊరడింపచేసికొనెను.

తా. అర్జునుడు తన కత్యంత ప్రియుడును స్నేహితుడునునైన శ్రీ కృష్ణపరమాత్మ ఎడబాటువలన కలిగిన భరింపరాని దుఃఖమును తనకు ఇంతకుముందు భగవానుడుపదేశించిన గీతా వాక్యములచేత అనగా

"నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్"

"నేను నా యోగమాయచే నావరింపబడిన వాడనై యెల్లరకు గన్పడను. నేను అజుడను (జన్మరహితుడను) అవ్యయుడను. నన్ను మూఢ చిత్తులగు లోకులు ఎరుంగనేరరు." మొదలగు వానిచే తన్ను తాను ఊరడింపజేసికొనెను.

శ్లో. బంధూనాం నష్టగోత్రాణాం అర్జున స్సాంపరాయికమ్
హతానాం కారయామాస యథావదనుపూర్వశః 22

అ హతానాం = చంపబడిన; నష్టగోత్రాణాం = సంతతితో సహా కులనాశము పొందిన; బంధూనాం = బంధువులకు, అర్జునః = అర్జునుడు; యథావత్ = శాస్త్ర ప్రకారముగా: అను పూర్వశః = క్రమముగా; సాంపరాయికం = పరలోక ప్రాప్తికై చేసెడి క్రియలను; కారయామాస = చేసినవాడయ్యెను,

తా. అర్జునుడు పరస్పరము కలహించుటచే సంతతితోపాటు మరణించిన తమబంధుజనులకు తనవారికి అనగా కృష్ణుడు మొదలుగా గలవారికి క్రమముగా శాస్త్రవిధి ననుసరించి పుణ్యలోక ప్రాప్తికై పిండోదకాది క్రియలు గావించెను.

శ్లో. ద్వారకాం హరిణా త్యక్తాం సముద్రోఽప్లావయత్క్షణాత్
వర్జయిత్వా మహారాజ శ్రీమద్భగవదాలయం 23

అ. హే మహారాజ! = ఓ పరీక్షిన్మహారాజా!; హరిణా = శ్రీ కృష్ణునిచే. త్యక్తాం = విడిచిపెట్టబడిన; ద్వారకాం = ద్వారకానగరమును; శ్రీమత్ = సంపదలకు నెలవగు; భగవత్ + ఆలయం = శ్రీకృష్ణుని సౌధమును మాత్రము; వర్జయిత్వా = వదిలివేసి; సముద్రః = సముద్రుడు; క్షణాత్ = క్షణకాలములో; అప్లావయత్ ముంచివేసెను.

తా. ఓ పరీక్షన్మహా రాజా! అట్లు శ్రీకృష్ణునిచే విడువబడిన ద్వారకలో సంపదలకు నెలవగు ఒక్క శ్రీ కృష్ణుని సౌధమును మాత్రము వదిలి తక్కిన పురమంతటిని సముద్రుడు తన నీటిచే ఒక్కక్షణములో ముంచివేసెను.

శ్లో. నిత్యం సన్నిహిత స్తత్ర భగవాన్మధుసూదనః
స్మృత్యాఽశేషాఽశుభహరం సర్వమంగళ మంగళమ్. 24

అ. స్మృతా = స్మరణ చేత నే, అశేష + అశుభహరం = ఎల్ల అశుభములను హరించునట్టి, సర్వ మంగళ మంగళం = ఎల్ల శుభములకు శుభకరుడగు; భగవాన్ = భగవంతుడైన; మధుసూదనః = శ్రీ కృష్ణ పరమాత్మ; తత్ర = ఆ భవనమునందు; నిత్యం = ఎల్లపుడు; సన్నిహితః = మిక్కిల సన్ని హితుడై యున్నాడు.

తా. స్మరించుట చేతనే సమస్తము లైన అశుభములను తొలగించునట్టి సర్వమంగళ ములకు మంగళంబైన ఆ కృష్ణభగవానుడు ఎల్లప్పుడు ఆ భవనమునందు సన్నిహితుడై యుండెను.

శ్లో. స్త్రీ బాలవృద్ధానాదాయ హతశేషాన్ ధనంజయః
ఇంద్రప్రస్థం సమావేశ్య వజ్రం తత్రాభ్యషేచయత్. 25

అ. ధనంజయః = అర్జునుడు; హతశేషాన్ = చావగా మిగిలిన; స్త్రీబాలవృద్ధాన్ = స్త్రీలను బాలు లను, వృద్ధులను; ఆదాయ = గైకొని; ఇంద్రప్రస్థం = ఇంద్రప్రస్థనగరమును; సమావేశ్య = చేరు కొని; తత్ర = అచట; వజ్రం = వజ్రుడనువానిని; అభ్యషేచయత్ = యాదవరాజ్యమునకు పట్టాభి షిక్తుని చేసెను.

తా. అర్జునుడు చావగా మిగిలిన స్త్రీ బాల వృద్ధులను తీసుకొని ఇంద్రప్రస్థ నగరమును జేరి అచట యాదవ రాజ్యమునకు 'వజ్రు' డను వానిని పట్టాభిషిక్తుని గావించెను.

శ్లో. శ్రుత్వా సుహృద్వధం రాజ న్నర్జునాత్తే పితామహాః
త్వాంతు వంశధరం కృత్వా జగ్మస్సర్వే మహాపథమ్ 26

అ. హే రాజన్ = ఓ పరీక్షన్మహారాజా!; అర్జునాత్ = అర్జునుని వలన; సుహృద్వధం = బంధు మిత్రుల మరణమును గూర్చి; శ్రుత్వా = విని; తే = నీ యొక్క; పితామహాః = తాతాలగు ధర్మరాజా దులు త్వాంతు = నిన్ను మాత్రము; వంశధరం = వంశోద్ధారకునిగా; కృత్వా = ఒనర్చి (చేసి) సర్వే = వారెల్లరు మహాపథమ్ = మహాప్రస్థాన మార్గమును గూర్చి; జగ్మః = వెడలిరి,

తా. ఓ పరీక్షన్మహారాజా! అట్లు అర్జుననిద్వారా శ్రీ కృష్ణుడు మొదలగు బంధుమిత్రుల మరణమును గూర్చి వినిన వారై, మీ తాతలైన ధర్మరాజాదులు నిన్ను వంశోద్ధారని గావించి మహాప్రస్థాన మార్గమును గూర్చి పయనమై వెళ్ళిరి.

అవల శ్రీకృష్ణచరితమును కీర్తించిన ఫలమును రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

శ్లో. య ఏతద్దేవదేవస్య విష్ణోః కర్మాణి జన్మచ
కీర్తయే చ్ఛ్రద్ధయా యుక్తః సర్వః పాపైః ప్రముచ్యతే 27

అ. యః = ఎవడు. ఏతత్ = ఈ; దేవదేవస్య = దేవదేవుడగు; విష్ణోః = శ్రీమన్నారాయణుని యొక్క. కర్మాణి = అవతార కృత్యములను; జన్మ చ = అవతారమును, శ్రద్ధయా = శ్రద్ధతో; యుక్తః = కూడినవాడై; కీర్తయేత్ = పఠించునో, సద్యః = అప్పటికప్పుడే; పాపైః = అన్నిపాపములతో; ప్రముచ్యతే విడువబడుచున్నాడు అనగా అన్నిపాపములు నశించును అని భావము.

తా. దేవదేవుడైన శ్రీకృష్ణుని అవతార కృత్యములను జన్మ వృత్తాంతమును మిక్కిలి

భక్తి శ్రద్ధలతో కీర్తించు వానికి అన్ని పాపములు తత్క్షణమే నశించును. వెంటనే ముక్తిని బొందగలడు.

**శ్లో. ఇత్థం హరేర్భగవతో రుచిరావతార**
**వీర్యాణి బాల చరితాని చ శంతమాని**
**అన్యత్ర చేహ చ శ్రుతాని గృణన్మనుష్యో**
**భక్తిం పరాం పరమహంస గతౌ లభేత. 28**

అ. ఇత్థం=ఈ ప్రకారముగా; భగవతః=భగవానుడైన; హరేః=శ్రీకృష్ణ పరమాత్మ యొక్క; రుచిర=మనోహరములైన, అవతార=అవతారముల యొక్క; వీర్యాణి=వైభవములను లేదా మహిమలను; శంతమాని=శుభకరములగు; బాల చరితాని=బాల్య చరిత్రలను; గృణన్=స్తుతించుచు; మనుష్యః=మనుష్యుడు; అన్యత్ర=పరలోకమందు; ఇహ చ=ఈ లోకమందును; శుభాని=శుభములను; పరమహంస గతౌ=పరమ భాగవతులకు ప్రాప్యుడైన శ్రీ కృష్ణునందు; పరాం శ్రేష్ఠమగు; భక్తిం=ఏకాంత భక్తిని; లభేత=పొందును.

తా. ఈ ప్రకారముగా శ్రీ కృష్ణభగవానుని అవతార విశేషములను మిక్కిలి ప్రభావ సంపన్నములైన అవతార కృత్యములను, మిక్కిలి మనోహరములగు బాల్య చరిత్రలను భక్తి యుక్తుడై స్తుతించువానికి ఇహ పరములందు చక్కని శుభములు కలుగుటయే గాక పరమ హంసులైన భాగవతోత్తములకు ప్రాప్యుడైన శ్రీ కృష్ణునియందు యేకాంత భక్తి ప్రపత్తులు కలుగును.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే ఏకాదశస్కంధే
ఏకత్రింశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమను మహాపురాణమున ఏకాదశస్కంధమున్ను
ముప్పదియొకటవ అధ్యాయము ముగినది.

ఏకాదశస్కంధ స్సమాప్తః
పదునొకండవ స్కంధము ముగిసినది
ఓం తత్ సత్

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# ద్వాదశస్కంధః

## ప్రథమోఽధ్యాయః

శ్లో. జయంతి శ్రీ పరానంద కృపాపాంగ లసద్దృశః
యా నిత్యమనువర్తంతే సంపదో విగతాదృశః

శ్రీమంతుడైన పరమానందుని కృపాకటాక్ష దృష్టులు అజ్ఞానమును పోదోలిన వానికి సంపదలై నిత్యము అనువర్తించుచున్నవి.

శ్లో. ఓం గురుం పరమానందం సచ్చిదానంద విగ్రహమ్
యస్య సంస్మృతి మాత్రేణ చిదానందాయ తే వపుః.

సచ్చిదానంద స్వరూపుడై పరమానందుడైన జగద్గురువు యొక్క ఓంకార పూర్వక మగు స్మరణము భక్తుని శరీరమును చిదానంద స్వరూపముగా చేయును.

శ్లో. ఉక్తస్త్రయోదశాధ్యాయై ర్ద్వాదశే త్వాశ్రయ స్సతః
అధిష్ఠానావధిత్వాభ్యా మాశ్రయ శ్చేశ్వరస్సతః
ఉక్తో లయావధిత్వేన ప్రాకృతాత్యంతికే లయే
అధిష్ఠాన తయా చోక్తో మహాపురుష వర్ణనే
తత్రాద్యై ష్షడ్భిరధ్యాయై శ్శుకః ప్రాహ పరీక్షితే
శేషై స్తత్ర ఖిలాన్యాహ సూతః పృష్టోఽథ సత్త్రిభిః
స్వాశ్రయ శ్రవణే కార్యో న విలంబో మనీషిణా
ఇత్యేత్కాల వైషమ్యం చతుర్భి స్తావదుచ్యతే
తత్రతు ప్రథమే భావి మాగధాన్వయ భూమిపాన్
కలి ప్రభావతః ప్రాహ సంకరాది మలీమసాన్.

ఈ ద్వాదశస్కంధమున 13 అధ్యాయములతో ఆశ్రయమను దశమ పురాణ లక్షణము చెప్పబడినది. అధిష్ఠానము అవధియను రెండు అధ్యాయములచే సత్తముడు, ఈశ్వరుడు, ఆశ్రయుడు, ప్రాకృతము, ఆత్యంతికము అను ప్రళయములు లయావధిగా చెప్పబడినవి. వానికి అధిష్ఠానముగా మహాపురుష వర్ణనము చేయబడినది.

అందు ఆఱు అధ్యాయములు శుకమహర్షి పరీక్షిత్తునకు జెప్పెను. మిగిలిన ఏడు అధ్యాయములు ఖిలములను పేరు గలవి. శౌనకాదులు ప్రశ్నించగా సూతుడు చెప్పెను.

వివేకము గలవాడు స్వాశ్రయ శ్రవణమునందు కాలవిలంబము చేయగూడదని నాలుగు అధ్యాయములచే కాలవైషమ్యము చెప్పబడెను.

అందు ప్రథమాధ్యాయమునందు రాబోవు మాగధ వంశభూపతులను జెప్పిరి. కలి ప్రభావము వలన సంకరాదికము కలిగిన దుశ్చరిత్రులను గూర్చి చెప్పిరి

అవ. ఇట్లు వర్తించిన సోమవంశమునందు శ్రీకృష్ణుని స్వేచ్ఛా క్రీడలు వర్ణింపబడినవి. కృష్ణ భక్తి తప్ప ముక్తికి మరో మార్గము లేదని తెలుపుటకు వైవస్వతమను వంశము సోమ వంశము చెప్పుచు శ్రీకృష్ణావతార చరిత్రలను విస్తరముగా వర్ణించిరి ఇపుడు రాబోవు కలి యుగమందు విజాతీయ సాంకర్యముతో మలినమైన సోమవంశము చెప్పబడుచున్నది. అన్ని వంశములలో మాగధ వంశము చాలా కాలము అనువర్తించినది కావున మాగధ వంశము ఉప క్రమించబడుచున్నది. అందులో మొదట నవమ స్కంధమున పూరు వంశమున ఉపరిచర వసువునకు బృహద్రధుడు, ఆతనికి జరాసంధుడు, జరాసంధునకు సహదేవుడు పుత్రుడని చెప్పబడినది. సహదేవునకు మార్జారి, ఆతనికి శ్రుతశ్రవుడు అని మొదలిడి రిపుంజయుని వరకు రాబోవు ఇరవైమంది రాజులను వర్ణించిరి, వారి తరువాతి వంశము సంకరాది దోషము లతో ఎటుల మలినమైనదో ఇపుడు చెప్పబడుచున్నది.

రాజోవాచ = రాజు పలికెను.

శ్లో. స్వధామానుగతే కృష్ణే యదువంశ విభూషణే
కస్య వంశోఽభవ త్పృథ్వ్యా మేత దాచక్ష్వ మే మునే 1

అ మునే ! = ఓ మునీ ! యదువంశ విభూషణే = యదువంశమునకు అలంకారమైన; కృష్ణే = కృష్ణుడు; స్వధామ + అనుగతే = తన స్థానమైన వైకుంఠమునకు వెళ్ళగా, పృథ్వ్యాం = భూతల మందు; కస్య వంశః = ఎవ్వని వంశము; అభవత్ = ఉండెను; ఏతత్ = దీనిని. మే = నాకు ; ఆచక్ష్వ = చెప్పుము.

తా. ఓ శుకమునీ! యదు వంశమునకు అలంకారమైన శ్రీకృష్ణుడు వైకుంఠమునకు వెళ్ళిన తరువాత భూతలమందు ఏ రాజవంశము వర్ధిల్లెనో నాకు చెప్పుము.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకుడు పలికెను.

శ్లో. యోఽంత్యః పురంజయో నామ భవిష్యోఽథ బార్హద్రథః
తస్యామాత్యస్తు శునకః హత్వా స్వామిన మాత్మజమ్
ప్రద్యోత సంజ్ఞం రాజానం కర్తా యత్పాలక స్సుతః 2

అ. యః = ఎవడు, అంత్యః = కడపటి వాడగు; పురంజయః నామ = పురంజయుడను పేరుగల వాడు; (ఇతనే రిపుంజయుడు) బార్హద్రథః = బృహద్రధుని వంశమువాడు భవిష్యః = కాగలడు; అథ = తరువాత; తస్య = ఆ పురంజయుని యొక్క; అమాత్యః = మంత్రి; శునకః = శునకుడనువాడు; స్వామినం = తన ప్రభువైన పురంజయుని; హత్వా = చంపి; ఆత్మజం = తన కుమారుని; ప్రద్యోత సంజ్ఞం = ప్రద్యోతుడను పేరుగల వానిని; రాజానం = రాజును, కర్తా = చేయగలడు; యత్ = ఏ ప్రద్యోతుని యొక్క; సుతః = పుత్రుడు; పాలకః = పాలకుడను పేరు గలవాడు.

తా. బృహద్రధుని వంశము వాడగు పురంజయుడు రిపుంజయుడను నామాంతరము గలవాడు కడపటి రాజగును, వాని మంత్రి శునకుడు పురంజయుని చంపి తన పుత్రుడగు ప్రద్యోతుని రాజును చేయును. ఆ ప్రద్యోతుని పుత్రుడు పాలకుడు.

శ్లో. విశాఖ యూప స్తత్పుత్రో భవితా జనక స్తతః
నంది వర్ధస్తు తత్పుత్రో పంచప్రద్యోతనా ఇమే
అష్టత్రింశో త్తరశతం భోక్ష్యంతి పృధివీం నృపాః. 3

తా. పాలకుని పుత్రుడు విశాఖ యూపుడు అతని పుత్రుడు జనకుడు. జనకుని పుత్రుడు నందివర్ధుడు. ఈ అయిదుగురు ప్రద్యోతనులు అనువారు వీరు (138) నూట ముప్పది యెనిమిది సంవత్సరములు పృధివిని పాలింపగలరు.

శ్లో. శిశునాభ స్తతో భావ్యః కాకపక్షస్తు తత్సుతః
క్షేమధన్వా సుత స్తస్య క్షేత్రజః క్షత్రధర్మజః 4

తా. నంధి వర్ధుని పుత్రుడు శిశునాభుడు. అతని పుత్రుడు కాక పక్షుడు. కాక పక్షుని కొడుకు క్షేమధన్వుడు. అతని పుత్రుడు క్షేత్రజుడు. క్షేత్రజుని పుత్రుడు క్షత్ర ధర్మజుడు.

శ్లో. విధిసార స్తత స్తస్య జాత శత్రుర్భవిష్యతి
దర్భక స్తత్సుతో భావ్యో దర్భకస్యాజయస్సుతః 5

తా. క్షత్ర ధర్మజుని పుత్రుడు విధిసారుడు అతని పుత్రుడు జాత శత్రువు. అతనికి దర్భకుడు కొడుకగును. దర్భకునికి అజయుడు కొడుకగును.

శ్లో. నందివర్ధన ఆజేయో మహానందిస్తు తత్సుతః
శైశునాభా దశైవైతే షష్ట్యు త్తర శతత్రయం
సమా భోక్ష్యంతి పృధివీం కురుశ్రేష్ఠ కలౌ నృపాః. 6

తా. అజయుని పుత్రుడు నందివర్ధనుడు. అతని కొడుకు మహానంది యనువాడు. ఈ పదుగురు శిశునాభుని వంశమువారు. వీరు (360) మూడు వందల అరువది సంవత్సరములు భూమిని పాలించగలరు.

శ్లో మహానంది సుతోరాజన్ శూద్రా గర్భోద్భవో బలీ
మహా పద్మపతిః కశ్చిన్నందః క్షత్ర వినాశకృత్. 7

తా. మహానంది పుత్రుడు నందియనువాడు ఇతను శూద్రస్త్రీ గర్భమున పుట్టినవాడు. ఇతనే మహాపద్మపతి ఈ నందియే క్షత్రియ వంశములను నాశము చేయువాడు

శ్లో తతో నృపాభవిష్యంతి శూద్రప్రాయా అధార్మికాః 8

తా ఈ నంది నుండి తరువాతి రాజు లందరు శూద్రుల వంటివారే అగుదురు. అధర్మ వర్తనులగుదురు

శ్లో. ఏకచ్ఛత్రాం స పృథివీ మనుల్లంఘిత శాసనః
శాసిష్యతి మహాపద్మః ద్వితీయ ఇవ భార్గవః. 9

తా ఈ మహాపద్ముడు ఏకచ్ఛత్రాధి పతియై తన ఆజ్ఞను ఎవరు అతిక్రమించనట్లు రెండవ పరశురామునివలె భూమిని పరిపాలించగలడు.

శ్లో. తస్య చాష్టౌ భవిష్యంతి సుమాలి ప్రముఖాస్సుతాః
య ఇమాం భోక్ష్యంతి మహీం రాజానశ్చ శతం సమాః. 10

తా. ఆ మహా పద్మునికి సుమాలి మొదలగు వారు ఎనిమిది మంది (8) పుత్రులు కలుగుదురు. ఈ పుత్రులు నూరు సంవత్సరములు భూమిని పరిపాలించగలరు.

శ్లో. నవ నందాన్ ద్విజః కశ్చిత్ ప్రపన్నా నుద్ధరిష్యతి
తేషామభావే జగతీం మౌర్యా భోక్ష్యంతి వై కలౌ. 11

తా ఒక విప్రుడు 8మంది పుత్రులను తండ్రియగు నందుని నిర్మూలించగలడు వారు మడిసిన తరువాత మురయనుస్త్రీ పుత్రులు (మౌర్య్యులు) కలియుగము నందు ఈ భూమిని పాలించగలరు

శ్లో స ఏవ చంద్రగుప్తం వై ద్విజో రాజ్యేఽభిషేక్ష్యతి
తత్సుతో వారిసారస్తు తత శ్చాశోక వర్ధనః. 12

తా. ఆ విప్రుడే చంద్రగుప్తుని రాజ్యమున పట్టాభిషిక్తుని చేయగలడు. చంద్రగుప్తుని పుత్రుడు వారి సారుడు. వారి సారుని పుత్రుడు అశోక వర్ధనుడు.

శ్లో. సుయశా భవితా తస్య సంయుతః స్సుయశస్సుతః
శాలి శూక స్తత స్తస్య సోమశర్మా భవిష్యతి. 13

తా అశోక వర్ధనుని పుత్రుడు సుయశుడు ఆతనికి సంయతుడు, సంయతునికి శాలి శూకుడు, శాలిశూకునికి సోమశర్మ కుమారుడగును

శ్లో. శతధన్వా తత స్తస్య భవితాథో బృహద్రథః 14

తా. సోమ శర్మకు శతధన్వుడు. శతధన్వునికి బృహద్రధుడు కొడుకగును

శ్లో. మౌర్యా హ్యేతే దశ నృపాః స ప్తత్రింశచ్ఛతో త్తరమ్
సమా భోక్ష్యంతి పృథివీం కలౌ కురుకులోద్వహ. 15

తా. ఈ పది మంది మౌర్య్యులు (187) నూట ముప్పది యేడు సంవత్సరములు రాజ్య పాలన చేయగలరు

శ్లో. హత్వా బృహద్రథం మౌర్యం తస్య సేనాపతిః కలౌ
పుష్య మిత్రస్తు శుంగాహ్వ స్స్వయం రాజ్యం కరిష్యతి. 16

తా, మౌర్య్య వంశమువాడైన బృహద్రదుని అతని సేనాపతి యగు పుష్య మిత్రుడు శుంగ వంశమువాడు చంపి తానే స్వయముగా రాజు కాగలడు.

శ్లో॥ అగ్నిమిత్ర స్తత స్తస్మాత్ సుజ్యేష్ఠో భవితా తతః
వసుమిత్రో భద్రకశ్చ కళిందో భవితా తతః. **17**

తా॥ పుష్యమిత్రుని కొడుకు అగ్నిమిత్రుడు. అతని పుత్రుడు సుజ్యేష్ఠుడు. అతని పుత్రుడు వసుమిత్రుడు, వసుమిత్రుని కొడుకు భద్రకుడు, ఆతని పుత్రుడు కళిందుడు రాజు కాగలడు.

శ్లో॥ తతో యోగనస్సుత స్తస్మాద్ధ్వజ మిత్రో భవిష్యతి
తతో భాగవత స్తస్మా ద్దేవహూతిః కురూద్వహ. **18**

తా॥ ఓ కురుశ్రేష్ఠా! కళిందునికి యోగుడు, అతనికి ధ్వజమిత్రుడు అతనికి భాగవతుడు భాగవతునికి దేవహూతి కొడుకు కాగలడు.

శ్లో॥ శుంగా దశైతే భోక్ష్యంతి మహీం వర్షశతాధికం
తతః కణ్వా నియం భూమి ర్యాస్యత్యల్ప గుణాన్నృప' **19**

తా॥ ఈ పది మంది శుంగ వంశము వారు నూరు సంవత్సరముల కంటె అధికముగా ఈ భూమిని పాలించగలరు వారి తరువాత స్వల్ప గుణములు కల కణ్వులు పాలించగలరు.

శ్లో॥ శుంగం హత్వా దేవహూతిం కణ్వోఽమాత్యస్తు కామినమ్
స్వయం కరిష్యతే రాజ్యం వసుదేవో మహామతిః **20**

శుంగవంశీయుడు కాముకుడు అయిన దేవహూతిని చంపి ఆతని మంత్రి కణ్వవంశము వాడు గొప్ప బుద్ధివంతుడు అగు వసుదేవుడు స్వయముగా రాజ్యపాలన చేయగలడు.

శ్లో॥ తస్య పుత్రస్తు భూమిత్ర స్తతో నారాయణ స్సుతః
కణ్వాయనా ఇమే భూమిం చత్వారింశచ్చ పంచచ.
శతాని త్రీణి భోక్ష్యంతి వర్షాణాం చ కలౌ యుగే. **21**

తా॥ వసుదేవుని పుత్రుడు భూమిత్రుడు, అతని సుతుడు నారాయణుడు వీరు కలియుగమున (345) మూడువందల నలుబదియైదు సంవత్సరములు రాజ్యపాలన చేయగలరు.

శ్లో॥ హత్వా కాణ్వం సు శర్మాణం తద్భృత్యో వృషలో బలీ
గాం భోక్ష్యత్యాంధ్రజాతీయః కంచిత్కాల మస త్తమః. **22**

తా॥ కణ్వవంశము వాని సుశర్మయను వానిని ఆతని భృత్యుడు బలము కలవాడు ఆంధ్రజాతివాడైన దుష్టుడు చంపి కొంత కాలము ఈ భూమిని పరిపాలించగలడు

శ్లో॥ కృష్ణనామాథ తద్భ్రాతా భవితా పృథివీపతిః
శ్రీశాతకర్ణ స్తత్పుత్రః పౌర్ణమాసస్తు తత్సుతః. **23**

తా॥ ఆతని తరువాత అతని సోదరుడగు కృష్ణుడనువాడు రాజు కాగలడు. కృష్ణుని కొడుకు శ్రీశాతకర్ణుడు. అతనిపుత్రుడు పౌర్ణమాసుడు రాజుకాగలడు.

శ్లో. లంబోదరస్తు తత్పుత్రః తస్మాచ్చిబిలకో నృపః
మేఘస్వాది శ్చిబిలకాద్దండ మానస్తు తత్సుతః 24

తా. పౌర్ణమాసునికి లంబోదరుడు, అతనికి శిబిలకుడు, శిబిలకునికి మేఘస్వాదుడు, అతనికి దండమానుడు కొడుకు రాజు కాగలడు.

శ్లో. అరిష్ట కర్మా హాలేయ స్తిలక స్తస్య చాత్మజః
పురీష సేతు స్తత్పుత్ర స్తతో రాజా సుదర్శనః 25

తా. దండమానుని పుత్రుడు అరిష్టకర్మ, అతనికి హాలేయుడు, అతనికి తిలకుడు పుత్రుడు. తిలకునికి పురీష సేతువు, అతనికొడుకు సుదర్శనుడు రాజు కొగలడు.

శ్లో. చకోర శ్చరమో యత్ర శివస్వాతి రరిందమః
తస్యాఽపి గోమతిః పుత్రః పురీమాన్భవితా తతః. 26

తా. సుదర్శనుని తరువాత వరుసగా చకోరుడు, చరముడు, శివస్వాతి, అరిందముడు, అతని పుత్రుడు గోమతి, అతని పుత్రుడు పురీమంతుడు రాజ్యపాలన చేయగలరు.

శ్లో. పీరో వేదశ్శివ స్స్కందో యజ్ఞ శీలస్తు తత్సుతః
సితోఽసిత శ్శ్రుతస్కంధో యజ్ఞశ్రీ స్తదాత్మజః
విజయ స్తత్సుతో భావ్య శ్చంద్ర బీజస్సులోమధీః. 27

తా. పురీమంతుని తరువాత పీరుడు, వేదుడు, శివుడు స్కందుడు. యజ్ఞశీలుడు సితుడు, అసితుడు, శ్రుతస్కందుడు, యజ్ఞశ్రీడు, అతని కొడుకు విజయుడు, అతని పుత్రుడు చంద్రబీజుడు, అతని సుతుడు సులోమధీయను వాడు రాజ్యము నేలగలరు.

శ్లో. ఏతే త్రింశన్నృపతయః చత్వార్యబ్దశతాని చ
షట్పంచాశచ్చ పృథివీం భోక్ష్యంతి కురునందన. 28

తా. ఓ కురునందనా! ఈ ముప్పది మంది రాజులు (456) నాలుగు వందల యాబదియారు సంవత్సరములు భూమిని పాలించగలరు.

శ్లో. సప్తాభీరా ఆవభృత్యా దశ గర్దభినో నృపాః
కంకా షోడశ భూపాలా భవిష్యంత్యతి లోలుపాః. 29

తా. ఆవభృతి యను నగరమును రాజధానిగ చేసుకొని (7) యేడుగురు ఆభీర వంశీయులు, పదిమంది గర్దవంశీయులు, (16) పదునారు మంది కంకవంశీయులు అత్యంతము ఇంద్రియాసక్తులు రాజులు కాగలరు.

శ్లో తతోఽష్టౌ యవనా భావ్యాశ్చతుర్దశ చ బర్బరాః
త్రయోదశ మురుండాశ్చ మౌనా ఏకాదశైవతు. 30

తా. కలకవంశీయుల తరువాత (8) యెనిమిది మంది యవనులు రాజులు కాగలరు. వారి తరువాత (14) పదునాలగు మంది బర్బరులు, (13) పదమూడు మంది మురుండులు,

శ్లో. ఏతే భోక్ష్యంతి పృథివీం దశవర్షశతానిచ
నవాధికాం చ నవతిః మౌనా ఏకాదశక్షితిమ్
భోక్ష్యంత్యబ్దశతాన్యంగ త్రీణి తైస్సంస్థితేషు చ. 31

తా. కలకవంశీయుల తరువాత (8) యెనిమిది మంది యవనులు రాజులు కాగలరు. వారి తరువాత (14) పదునాలుగు మంది బర్బరులు, (13) పదమూడు మంది మురుండులు పదునొకండు మంది మౌనులు ఒక వేయి తొంబది తొమ్మిది సంవత్సరములు రాజ్యపాలన చేయగలరు. వారి తరువాత పదునొకండు మంది మౌనులు మూడు వందల సంవత్సరములు రాజ్యపాలన చేయగలరు.

శ్లో. కిలిం కిలాయాం నృపతయో భూతనందో యవం హరః
శిశునందిశ్చ తద్భ్రాతా యశోనందిః ప్రవీరకః
ఇత్యేతే వర్షశతం భవిష్యంత్యధికాని షట్. 32

మౌనులు రాజ్యపాలన చేయుచుండగా,కిలంకిలయను నగరమును రాజధానిగా చేసుకొని, భూతనందుడు, యవంహరుడు, శిశునంది, అతని సోదరుడు యశోనంది, అతని తరువాత ప్రవీరకుడు వీరందరు యోగ్యులు (106) నూట ఆరు సంవత్సరములు రాజ్యపాలన చేయగలరు.

శ్లో. తేషాం త్రయోదశ సుతా భవితారశ్చ బాహ్లికాః
పుష్యమిత్రోఽథ రాజన్యో దుర్మిత్ర స్తస్య చాత్మజః 33

తా. ఆ భూతనందాదులకు (13) పదమూడుమంది బాహ్లీకులు పుత్రులు కలుగుదురు. పుష్యమిత్రుడను మరి యొక రాజునకు దుర్మిత్రుడను కొడుకు కలుగును.

శ్లో. ఏకకాలా ఇమే భూపా స్సప్తాంధ్రా స్సప్తకోసలాః
వైదూర్య పతయో భావ్యా నైషధా స్తత ఏవ హి. 34

తా. ఏడుగురు ఆంధ్రులు, కోసలులు వైదూర్య పతులు, నైషధులు రాజులు కాగలరు. వీరందరు ఆయాదేశముల పేర్లతోనుండిరి. వీరందరు సమకాలికులు.

శ్లో. మాగధానాంతు భవితా విశ్వస్ఫూర్జః పురంజయః
కరిష్యత్య పరోవర్ణాన్ పుళిందయదు మద్రకాన్ 35

తా. మగధ వంశములోని విశ్వస్ఫూర్జుడను నామాంతరము గల పురంజయుడు తన ప్రజలను బ్రాహ్మణాది వర్ణములకు బదులుగా పుళిందులు యదువులు మద్రకులు అనువర్ణముల నేర్పరుచును.

శ్లో. ప్రజాశ్చా బ్రహ్మభూయిష్ఠాః స్థాపయిష్యతి దుర్మతిః
వీర్యవాన్ క్షత్ర ముత్సాద్య పద్మవత్యాం సవైపురి
అనుగంగా మాప్రయాగం తు గుప్తాం భోక్ష్యతి మేదినీమ్ 36

అ. దుర్మతిః=చెడు బుద్ధిగల ఈ పురంజయుడు; ప్రజాః=ప్రజలను; అబ్రహ్మ భూయిష్ఠాః= బ్రాహ్మణాది మూడు వర్ణములు లేని వారినిగా; స్థాపయిష్యతి=నెలుకొల్పును; వీర్యవాన్ =బలవంతు

డగు ఆ పురంజయుడు; క్షత్రం = క్షత్రియ ధర్మమును; ఉత్సాద్య = నశింపచేసి; పద్మావత్యాం పురి = పద్మావతీ పురమునందు; సః = ఆ పురంజయుడు; అనుగంగాం = గంగ మొదలు; ఆ ప్రయాగం = ప్రయాగ వరకు; గుప్తాం = రక్షింపబడిన; మేదినీం = భూమిని; భోక్ష్యతి = పాలింపగలడు.

తా. బలవంతుడు దుష్టుడైన ఆ పురంజయుడు మూడు వర్ణములను చెడగొట్టి వర్ణ భ్రష్టుల జేయగలడు. అటులనే క్షత్రియ ధర్మమును నశింపచేసి పద్మావతీ పురమును రాజధానిగ జేసుకొని గంగ మొదలు ప్రయాగవరకు భూమినేలగలడు.

శ్లో. సౌరాష్ట్రావంత్యాభీరా శ్శూద్రా అర్బుద మాళవాః
వ్రాత్యా ద్విజా భవిష్యంతి శూద్రప్రాయా జనాధిపాః 37

తా. సౌరాష్ట్రము, అవంతి, అభీరము, అర్బుదము, మాళవము అనుదేశాధిపతులు శూద్రప్రాయులగుదురు. ద్విజులు ఉపనయన రహితులై వ్రాత్యులు కర్మభ్రష్టులగుదురు.

శ్లో. సింధో స్తటం చంద్రభాగాం కాంచీం కాశ్మీర మండలమ్
భోక్ష్యంతి శూద్రా వ్రాంత్యాద్యా మ్లేచ్ఛా అబ్రహ్మ వర్చసః 38

తా. సింధునదీతీర ప్రాంతమును, చంద్రభాగానదీ తీరప్రాంతమును, కాంచీపురమును కాశ్మీరమండలమును శూద్రులు, అంత్యజాతివారు బ్రహ్మవర్చస్సులేనివారు మ్లేచ్ఛులు పాలించగలరు.

శ్లో. తుల్యకాలా ఇమే రాజన్ మ్లేచ్ఛప్రాయాశ్చ భూభృతః
ఏతేఽధర్మానృత పరా ఫల్గుదా స్తీవ్ర మన్యవః 39

తా. సమకాలికులైన ఈ రాజులు మ్లేచ్ఛప్రాయులై, అధర్మమునందు సత్యమునందు ఆసక్తులై స్వల్పముగానిచ్చువారును తీవ్రమైన కోపముగలవారుగను ఉందురు.

శ్లో. స్త్రీ బాల గోద్విజఘ్నాశ్చ పరదార ధనాదృతాః
ఉదితా స్తమితప్రాయా అల్పసత్వాల్పకాయుషః 40

తా. ఈ రాజులు స్త్రీలను, బాలురను, గోవులను చంపువారు, పరస్త్రీలను పరులధనమును కాంక్షించువారు ఎక్కువ హర్షము శోకములు గలవారును అల్ప సత్వులు అల్పాయుష్కులు అగుదురు.

శ్లో. అసంస్కృతాః క్రియాహీనా రజసా తమసా వృతాః
ప్రజా స్తే భక్షయిష్యంతి మ్లేచ్ఛా రాజన్యరూపిణః 41

తా. గర్భాదానాది సంస్కారములు లేనివారు, సంధ్యావందనాది కర్మలు చేయనివారు రజోగుణముతో తమోగుణముతో కూడినవారు రాజులరూపమున నుండు మ్లేచ్ఛులు ప్రజలను భక్షింతురు. (నశింపజేతురని భావము)

శ్లో. తన్నాథాస్తే జానపదాః తచ్ఛీలాచారవాదినః
అన్యోన్యతో రాజభిశ్చ క్షయం యాస్యంతి పీడితాః 42

అ. తన్నాథాః = ఆ రాజులే దిక్కుగా గల; తే = ఆ; జానపదాః = జనపదము లందుండు జనులు; తచ్ఛీలా చార వాదినః = ఆ రాజుల శీలమును ఆచారమును గూర్చి వాదించువారై; అన్యోన్యతః = పరస్పరముగా; రాజభిశ్చ = రాజుల చేతను; పీడితాః = పీడించబడినవారై; క్షయం = నాశమును; యాస్యంతి = పొందగలరు.

తా. ఆ రాజులే దిక్కుగా గల ప్రజలు అ రాజుల శీలమును అచారమును గూర్చి వాదించుచుందురు. తమలో తాము పరస్పరము కలహించుకొనుచు. రాజులచే పీడింపబడుచు నాశము పొందుదురు.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
ప్రథమోధ్యాయః

ఇది శ్రీ భాగవతమునందు ద్వాదశ స్కంధమునందు
మొదటి అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్

# ద్వితీయోఽధ్యాయః

## రెండవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకములు

**శ్లో. ద్వితీయే తు కలే ర్దోషవృద్ధౌ కల్క్యవతారతః**
**అధర్మిష్ఠే జనే నష్టే పునః కృత యుగాగమః**

తా. ఈ ద్వితీయాధ్యాయమునందు కలి దోషము వృద్ధియై అధర్మపరులై నాశము పొందగా కల్క్యవతారము వలన మరల కృతయుగము వచ్చును అనియు చెప్పుచు కలిధర్మములను వివరించును.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకులు పలికిరి.

**శ్లో. తతశ్చానుదినం ధర్మస్సత్యం శౌచం క్షమా దయా**
**కాలేన కలినా రాజన్ నంక్ష్యత్యా యుర్బలం స్మృతిః** 1

అ. రాజన్! = ఓ పరీక్షిన్మ మహారాజా!; తతః = ఆ తరువాత; అనుదినం = దిన దినము; కలినా కాలేన = కలికాలముచే, ధర్మః = ధర్మము; సత్యం = సత్యము; శౌచం = శుద్ధి; క్షమా = ఓర్పు; దయా దయ, ఆయుః = ఆయుష్యము బలం = బలము; స్మృతిః = స్మృతి; నంక్ష్యతి = నశించగలదు.

తా ఓ పరీక్షన్మహారాజా! ఇటుల రోజు రోజుకు కలికాల ప్రభావముచే ధర్మము, సత్యము శౌచము, క్షమ దయ, ఆయుష్యము, బలము, స్మృతి నశించి పోగలవు.

**శ్లో. విత్తమేవ కలౌ నౄణాం జన్మాచార గుణోదయః**
**ధర్మన్యాయ వ్యవస్థాయాం కారణం బలమేవ హి** 2

అ కలౌ = కలియుగము నందు. నౄణాం = నరులకు; జన్మాచారగుణోదయః = జన్మయొక్క ఆచారము యొక్క; గుణముయొక్క ఉత్కర్షము; విత్తమేవ = ధనమే; కారణం = కారణము ధర్మ న్యాయ వ్యవస్థాయాం = ధర్మమును న్యాయమును ప్రతిష్ఠించుట యందు. బలం ఏవ = బలమే; కారణం హి = కారణమగును

తా. కలియుగము నందు నరులకు జన్మము, ఆచారము, గుణముల, ఉత్కర్షను నిర్ణయించుటకు ధనమే కారణమగును అటులనే ధర్మమును న్యాయమును ప్రతిష్ఠించుటకు

---

కం. దిన దినమును ధర్మంబులు ననయము ధరనడిగి పోవు నాశ్చర్యముగా
వినువర్ణ చతుష్కములో నెనయగ ధనవంతుడైన నేలుధరిత్రిన్.

కం. బలవంతుడైన వాడే కులహీనుండైన దొడ్డ గుణవంతుడగున్
గలమియు బలిమియు గలిగిన నిలలోపల రాజంతడె యేమనవచ్చున్

బలమే కారణమగును. అనగా ధనమున్నవానిదే ఉత్తమ జన్మము, ఉత్తమాచారము. ఉత్తమ గుణము అందురు. అటులనే బలమున్నవాడు చేసినదే న్యాయము, చెప్పినదే ధర్మమందురు.

శ్లో. దాంపత్యేఽభి రుచిర్హేతుః వాక్చౌర్యం వ్యావహారికే
స్త్రీత్వే పుంస్త్వే చాభిరతి ర్విప్రత్వే సూత్రమేవహి 3

అ. దాంపత్యే = దంపతులగుటకు; అభిరుచిః = ఇష్టమే; హేతుః = కారణము; వ్యావహారికే = క్రయవిక్రయాదికమునందు; వాక్ + శౌర్యం = మాటనేర్పరితమే; హేతుః = కారణము; స్త్రీత్వే = స్త్రీలయందు పుంస్త్వేచ = పురుషులయందు; అభిరతిః = రతి కౌశలమే; హేతువు; విప్రత్వే = బ్రాహ్మణత్వమునందు; సూత్రమేవ = యజ్ఞోపవీతమే హేతువు.

తా. దంపతులగుటకు ఒకరిపై ఒకరికి ప్రీతియే కారణము కాని కుల గోత్రములుకావు. క్రయవిక్రయాదులందు మాట నేర్పరితనమే కారణము కాని ధర్మము కాదు. స్త్రీలలోకాని పురుషులలో కాని ఉత్తమత్వమునకు కారణము రతికౌశలమేకాని కులము ఆచారముకాదు. బ్రాహ్మణత్వమునకు యజ్ఞోపవీతము కారణము కాని సంధ్యావందనము అధ్యయనము కావు.

శ్లో. లింగమేవా శ్రమఖ్యాతా వన్యోన్యాప త్తి కారణమ్
అవృత్యా న్యాయ దౌర్బల్యం పాండిత్యే చాపలం వచః 4

అ. ఆశ్రమ ఖ్యాతౌ = ఆశ్రమమును తెలియుట యందు; లింగమేవ = దండము కృష్ణాజినము మొదలగు; చిహ్నములే, కారణము; అన్యోన్యాప త్తికారణం = ఒక యాశ్రమమునుండి మరియొక ఆశ్రమమునకు చేరుటకు కూడా కాషాయ వస్త్రములు దండాజినములే కారణము కాని బహూదకత్వము హంసాదికములు కావు. అవృత్యా = ధనమీయగలుగుటయే (లేదా దారిద్ర్యమే) న్యాయ దౌర్బల్యం = న్యాయము బలహీనమగుటకు కారణము; పాండిత్యే = పాండిత్యమునందు. చాపలం వచః = బహు భాషణమే కారణము.

తా. ఆశ్రమమును గుర్తించుటయందు కృష్ణాజినము మొదలగునవే కారణము, కాని ఆచారాదికము కాదు. ఆటులనే ఒక ఆశ్రమమునుండి మరియొక ఆశ్రమమును చేరుటకు కూడా కాషాయవస్త్రము కృష్ణాజినములే హేతువులు కాని బహూదకత్వము హంసాదికములు కావు. న్యాయము బలహీనమగుటకు ధనమిచ్చుట లేదా ధనమీయ లేని దారిద్ర్యమే కారణము. కాని న్యాయములోని బలము బలహీనతలు కావు. పాండిత్యమునకు బహుభాషణమే హేతువు కాని జ్ఞానము కాదు.

శ్లో. అనాఢ్యతైవా సాధుత్వే సాధుత్వే చాఢ్యతై వ హి
స్వీకార ఏవ చోద్వాహే స్నానమేవ ప్రసాధనమ్ 5

అ. అసాధుత్వే = దొంగతనము మొదలగు నేరములు ఆరోపించుటలో, అనాఢ్యతైవ = దారిద్ర్యమే కారణము; సాధుత్వే చ = మంచితనము నందును; ఆఢ్యతైవ = ధనము కలిగి యుండుటయే కారణము; ఉద్వాహే = వివాహమునందు; స్వీకార ఏవ = గ్రహించుటయే; స్నానమేవ = స్నానమే ప్రసాధనం = అలంకారము.

తా. దొంగతనము మొదలగు నేరములు ఆరోపించుటకు దారిద్ర్యమే కారణము కాని

న్యాయముగా పరిశీలన కాదు. మంచితనమును చెప్పుటకు ధనసంపత్తియే కారణము కాని గుణ సంపత్తికాదు వివాహమునకు కన్యాస్వీకారమే కారణము కాని శాస్త్రీయ విధికాదు. శరీరమున కున్న మురికిని పోగొట్టుకొనుట అనగా స్నానమే కాని విశుద్ధతీర్థావగాహనము కాదు.

శ్లో. **దూరవార్యయనం తీర్థం లావణ్యే కేశధారణమ్**
**ఉదరం భరతా స్వార్థ స్సత్యత్వే ధార్ష్ట్య మేవ హి** 6

అ. దూరవార్యయనం = దూరమున నుండు జలాశయము; తీర్థం = తీర్థము, శుద్ధ్యాదికము కాదు, లావణ్యే = సౌందర్యము నందు; కేశధారణం = వెంట్రుకలు ధరించుట; ఉదరం భరతా = పొట్ట నింపు కొనుట (కుక్షి పూరణము) స్వార్థః = పురుషార్థము దార్ష్ట్యం = తప్పు చేసియు భయము లేకుండ ప్రవర్తించుటయే సత్యత్వే = సత్యత్వమునకు కారణము

తా, దూరముగా నుండు జలాశయమే తీర్థము కాని శుద్ధ్యాదికము కాదు. కేశాధరణము సౌందర్యమనుకొందురు, కాని శాస్త్ర విహితాంగి క్షౌరము కాదు. కుక్షి పూరణమునే పురుషార్థ ముగా భావింతురు కాని ధర్మాచరణము కాదు. తప్పు చేసియు చేయని వాని వలె గట్టిగా మాట్లాడు వాడే సత్యుడు కాని సత్యవాది కాడు

శ్లో. **దాక్ష్యం కుటుంబ భరణే యశో౽ర్థే ధర్మసేవనమ్** 7

అ. కుటుంబ భరణే = కుటుంబమును పోషించుట యందే; దాక్ష్యం = సామర్థ్యము; యశో౽ర్థే = కీర్తికొఱకు; ధర్మసేవనం = ధర్మమును సేవించుట.

తా. కుటుంబ భరణమునందే సామర్థ్యమును చూపుదురు. కాని ధర్మాది పురుషార్థ సంపాదనయందు కాదు. కీర్తికొరకే ధర్మమును సేవించుట కాని పరలోకము కొఱకు కాదు.

శ్లో. **ఇత్థం ప్రజాభి ర్దుష్టాభి రాకీర్ణం క్షితి మండలమ్**
**బ్రహ్మ విట్ క్షత్ర శూద్రాణాం యో బలీ భవితా నృపః** 8

ఇత్థం = ఈ ప్రకారముగా: దుష్టాభిః = దుష్టులైన; ప్రజాభిః = ప్రజలచేత; క్షితి మండలం = భూమండలము; ఆకీర్ణం = వ్యాపించి యుండును బ్రహ్మవిట్ క్షత్ర శూద్రాణాం = బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో; యః = ఎవడు; బలీ = బలవంతుడో; వాడు; నృపః = రాజు, భవితా = కాగలడు.

తా ఈ ప్రకారముగా ఈ భూమండలమంతయు దుష్టులైన ప్రజలతో వ్యాపించును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో బలవంతుడే రాజగును.

శ్లో. **ప్రజాస్తు లుబ్ధై రాజన్యై ర్నిర్ఘృణై ర్దస్యు ధర్మభిః**
**ఆచ్ఛిన్న దార ద్రవిణాః యాస్యంతి గిరికాననమ్** 9

అ. లుబ్ధైః = లుబ్ధులైన; నిర్ఘృణైః = నిర్దయులైన; దస్యుధర్మభిః = దోపిడి కాండ్ర ధర్మము గల, రాజన్యైః = రాజుల చేత, ఆచ్ఛిన్న దారద్రవిణాః = అపహరించబడిన భార్యలు ధనము గల; ప్రజాః = ప్రజలు: గిరికాననం = కొండలకు; కానలకు; యాస్యంతి = పోవుదురు.

తా. పిసినారులు (లుబ్ధులు) నిర్దయులు, దోపిడి చేయు స్వభావము గ భార్యాపుత్రులు ధనము అపహరించబడగా ప్రజలు అడవులకు పర్వత ప్రాంతములకు

**శ్లో. శాకమూలా మిషక్షౌద్ర ఫల పుష్పాష్టి భోజనాః**
**అనావృష్ట్యా వినంక్ష్యంతి దుర్భిక్ష జ్వరపీడితాః 10**

అ శాకమూలా మిషక్షౌద్ర ఫల పుష్పాష్టి భోజనాః: శాక = కూరలు; మూల = గడ్డలు; ఆమిష = మాంసము; క్షౌద్ర = తేనె; ఫల = పండ్లు; పుష్ప = పూలు; అష్టి = విత్తనములు; భోజనాః = ఆహారముగా గలవారై; అనావృష్ట్యా = వర్షము లేకపోవుటచే; దుర్భిక్ష = కరువు; జ్వర = జ్వరముచే; పీడితాః = పీడించబడినవారై; వినంక్ష్యంతి = నశించగలరు.

తా. కూరలు, గడ్డలు, మాంసము; తేనె, పండ్లు, పూలు, విత్తనములు ఆహారముగా గలవారై, వానలు లేక కరువేర్పడి జ్వరాదులచే పీడించ బడి ప్రజలు నశింతురు.

**శ్లో. శీత వాతాతప ప్రావృడ్భి ర్హిమైరన్యోన్యతః ప్రజాః**
**క్షుత్తృడ్భ్యాం వ్యాధిభిశ్చైవ సంతప్స్యంతే చ చింతయా**
**త్రింశద్వింశతి వర్షాణి పరమాయుః కలౌ నృణామ్ 11**

అ. ప్రజాః = ప్రజలు అన్యోన్యతః = పరస్పరము; శీత = చలి; వాత, గాలి; ఆతప = ఎండ ప్రావృట్ = వానలచే, హిమైః = భయము కలిగించువానిచే; క్షుత్ తృడ్భ్యాం = ఆకలి దప్పులచే; వ్యాధిభిశ్చ = రోగముల చేతను; చింతయా = విచారము చేతను; సంతప్స్యంతే = సంతాపమును పొందగలరు. కలౌ = కలియుగమున, నృణాం = మానవులకు; త్రింశద్వింశతి వర్షాణి = ఇరువది ముప్పది సంవత్సరములు; పరమాయః = పూర్ణాయువగును.

తా. ప్రజలందరు చలి, గాలి, ఎండ, వానలచే, ఆకలి దప్పులచే, రోగములతో చింతలతో సంతాపమును పొందెదరు. కలియుగమున నరులకు ఇరువది లేక ముప్పది సంవత్సరములే పూర్ణాయువగును.

**శ్లో. క్షీయమాణేషు దేహేషు దేహినాం కలిదోషతః**
**వర్ణాశ్రమ వతాం ధర్మే నష్టే వేదపథే నృణామ్ 12**

అ. కలిదోషతః = కలిదోషము వలన; దేహినాం = దేహధారుల యొక్క; నృణాం = నరుల యొక్క దేహేషు = శరీరము; క్షీయమాణేషు = క్షీణించుచుండగా; వర్ణాశ్రమ వతాం = వర్ణాశ్రమ ధర్మములు గలవారియొక్క; ధర్మే = ధర్మమైన; వేదపథే = వేదమార్గము; నష్టే = నశించగా.

తా కలిదోషము వలన దేహధారుల దేహములు క్షీణించగా, వర్ణాశ్రమములు గల మానవుల ధర్మబద్ధమైన వేద మార్గము నశించిపోవును.

**శ్లో. పాషండ ప్రచురే ధర్మే దస్యు ప్రాయేషు రాజసు**
**చౌర్యానృత వృథాహింసా నానా వృత్తిషు వై నృషు 13**

అ. ధర్మే = ధర్మము; పాషండ ప్రచురే = నాస్తిక ప్రాచుర్యము కలదికాగా; రాజసు = రాజులు దస్యుప్రాయేషు = దారిదోపిడి కాండ్ర వంటి వారుకాగా; నృషు = మానవులు; చౌర్య = దొంగ తనము; అనృత కథా = అసత్యము చెప్పుట; వృథాహింసా = వ్యర్థమగు హింస; నానా వృత్తిషు = మొదలగు వివిధ వృత్తులు గలవారు కాగా.

తా. కలియుగమున ధర్మము పాషండ ప్రాచుర్యము కలదగును రాజులు దోపిడికాండ్ర

వలె వ్యవహరింతురు ప్రజలు దొంగతనము అబద్ధము వ్యర్థమగు హింస మొదలగు అధర్మ ప్రవృత్తి కలవారగుదురు.

శ్లో. శూద్రప్రాయేషు వర్ణేషు ఛాగప్రాయేషు ధేనుషు
గృహప్రాయేష్వాశ్రమేషు యౌనప్రాయేషు బంధుషు 14

అ. వర్ణేషు=బ్రాహ్మణాది వర్ణములు; శూద్రప్రాయేషు=శూద్రులవలె ఆచార హీనులుకాగా; ధేనుషు=ఆవులు; ఛాగప్రాయేషు= మేకలవంటివి కాగా; ఆశ్రమేషు=బ్రహ్మచర్యాది ఆశ్రమములు; గృహప్రాయేషు=గృహస్థాశ్రమముల వంటివికాగా; బంధుషు=బంధువులు, యౌనప్రాయేషు=బావ మరదులట్లు కాగా.

తా. బ్రాహ్మణాది వర్ణత్రయము ఆచార హీనములైన శూద్రులవంటి వారుకాగా, ఆవులు ప్రమాణములో పాలిచ్చుటలో మేకలవంటివి కాగా. బ్రహ్మచర్యము మొదలగు ఆశ్రమములు దానము పుచ్చుకొనుట ఎక్కువగా గల గృహస్థాశ్రమముల వంటి వగును. బంధువులు బావ మరదులట్లగుదురు అనగా వారిసోదరిని వీరు,వీరిసోదరిని వారు పరిగ్రహింతురు.

శ్లో. అణుప్రాయా స్వోషధీషు శమీప్రాయేషు స్థాస్నుషు
విద్యుత్ప్రాయేషు మేఘేషు శూన్యప్రాయేషు సద్మసు 15

అ. ఓషధీషు= సస్యములు; అణుప్రాయాసు=అతి సూక్ష్మములు కాగా; స్థాస్నుషు= వృక్షములు శమీప్రాయేషు=శమీ తుల్యములుకాగా; మేఘేషు= మేఘములు; విద్యుత్ప్రాయేషు= మెరుపులాంటివి కాగా; సద్మసు= ఇళ్ళు; శూన్యప్రాయేషు= శూన్యములు కాగా.

తా. సస్యములు లతలు మొదలగు ఔషధులు అతి సూక్ష్మములగును. వృక్షములు చామలను ధాన్యములు ఫలించు సస్యములవలె పరిణామములో నీడలో పంటలో సమములగును మేఘములు ఉండునట్లు లేనట్లు మెఱుపువలె యుండును. గృహములు జనశూన్యములు ధర్మశూన్యములగును.

శ్లో. ఇత్థం కలౌ గత ప్రాయే జనేషు ఖరధర్మిషు
ధర్మత్రాణాయ సత్త్వేన భగవా నవతరిష్యతి 16

ఇత్థం= ఈ విధముగా; కలౌ=కలియుగము; గతప్రాయే=సమాప్తికావచ్చు చుండగా; జనేషు =ప్రజలు; ఖరధర్మిషు=దుస్సహ చేష్టలు గలవారు కాగా; భగవాన్=భగవంతుడు; ధర్మత్రాణాయ =ధర్మమును కాపాడుటకు; సత్త్వేన=సత్త్వ గుణములతో; అవతరిష్యతి= అవతరించగలడు.

తా. ఈ ప్రకారము జనులు సహింపరాని చెడ్డపనులు చేయువారు కాగా కలియుగము సమాప్తి కావచ్చుచుండగా భగవంతుడు ధర్మరక్షణ కొఱకు సత్త్వగుణముతో అవతరించ గలడు.

శ్లో. చరాచర గురుర్విష్ణో రీశ్వరస్యాఖిలాత్మనః
ధర్మత్రాణాయ సాధూనాం జన్మ కర్మాపనుత్తయే 17

అ. చరాచర గురోః= స్థావర జంగమములకు గురువైన, ఈశ్వరస్య=ఈశ్వరుడైన; అఖిలాత్మనః=ఎల్ల జీవులకు ఆత్మయైన; విష్ణోః= విష్ణువు యొక్క; జన్మ= అవతారము; సాధూనాం=

సాధువులయొక్క; ధర్మత్రాణాయ=ధర్మమును కాపాడుటకు; కర్మాపనుత్తయే=కర్మను తొలగించుటకు; (మోక్షమునకు) అగును.

తా. స్థావరములకు జంగమములకు గురుపై ప్రభువైన జీవులందరికీ ఆత్మయైన విష్ణువు అవతారము సాధువుల ధర్మరక్షణకు, మోక్షమునకు అగును.

**శ్లో. శంబలగ్రామ ముఖ్యస్య బ్రాహ్మణస్య మహాత్మనః**
**భవనే విష్ణుయశసః కల్కిః ప్రాదుర్భవిష్యతి** **18**

అ. శంబల గ్రామముఖ్యస్య=శంబలగ్రామమునకు ప్రధానుడగు; మహాత్మనః=మహాత్ముడగు బ్రాహ్మణస్య=బ్రాహ్మణుడగు; విష్ణుయశసః=విష్ణుయశసుడను వాని; భవనే=ఇంటి యందు; కల్కిః=కల్కియను పేరుతో; ప్రాదుర్భవిష్యతి=జనింపగలడు (అవతరించగలడు).

తా. శంబలగ్రామమునకు ముఖ్యుడైన మహాత్ముడైన బ్రాహ్మణుడైన విష్ణుయశస్సుడనువాని ఇంటిలో కల్కి అవతరించగలడు

**శ్లో. అశ్వమాశుగ మారుహ్య దేవదత్తం జగత్పతిః**
**అసినాఽసాధు దమన మష్టైశ్వర్య గుణాన్వితః.** **19**

అః అసాధు దమనం=దుష్టులను మర్దించు; ఆశుగం=వేగముగా వెళ్ళు; దేవదత్తం=దేవదత్తమను పేరుగల; అశ్వం=అశ్వమును; ఆరుహ్య=ఎక్కి; అష్టైశ్వర్య గుణాన్వితః=అణిమాద్యష్టైశ్వర్యములతో; గుణములతో కూడిన; జగత్పతిః=జగన్నాధుడు; అసినా=ఖడ్గముతో (దుష్టులను సంహరించగలడు)

తా దుష్టులను అతి శీఘ్రముగా వెళ్ళెడు దేవదత్తమను గుఱ్ఱమును ఎక్కి అష్టైశ్వర్యములు మంచిగుణములు గల జగన్నాధుడు ఖడ్గముతో (దుష్టులను సంహరించగలడని ముందు శ్లోకముతో అన్వయము).

**శ్లో. విచరన్నాశునాక్షోణ్యాం హయేనా ప్రతిమ ద్యుతిః**
**నృపలింగచ్ఛదో దస్యూన్ కోటిశో నిహనిష్యతి.** **20**

అ. అప్రతిమద్యుతిః=సాటిలేని తేజస్సుగల; ఆశునా=త్వరగా వెళ్ళెడు; హయేన=గుఱ్ఱముతో; క్షోణ్యాం=భూమియందు; విచరన్=తిరుగుచు, నృపలింగచ్ఛదః=రాజవేషధారులైన; దస్యూన్=దోపిడికాండ్రుదొంగలునగు రాజులను; కోటిశః=కోట్లకొలది సంఖ్యగలవారిని; నిహనిష్యతి=వధింపగలడు.

తా. సాటిలేని తేజస్సు గల యా కల్కి త్వరగా వెళ్ళు గుఱ్ఱమునెక్కి భూమిమీద తిరుగుచు రాజవేషధారులైన దొంగరాజులను కొట్లమందిని సంహరించగలడు.

అవ. తరువాత కృతయుగ ప్రవృత్తిని చెప్పుచున్నారు.

**శ్లో. అథ తేషాం భవిష్యంతి మనాంసి విశదానివై**
**వాసుదేవాంగ రాగాతి పుణ్యగంధానిలస్పృశామ్**
**పౌరజాన పదానాంవై హతేష్వఖిలదస్యుషు.** **21**

అ. అథ = అంత; అఖిలదస్యుషు = ఎల్లదుష్టరాజులు; హతేషు = హతులుకాగా; వాసుదేవ = విష్ణువుయొక్క; అంగరాగ = మైపూతయొక్క; అతిపుణ్య = మిక్కిలి పవిత్రమైన; గంధ = పరిమళము గల; అనిల = వాయువును; స్పృశాం = స్పృశించిన; తేషాం = ఆ; పౌరజానపదానాం = నగరములలో పల్లెలలో ఉండువారి; మనాంసి = మనస్సులు; విశదాని = నిర్మలములుగా: భవిష్యంతి = కాగలవు.

తా. కల్కి దుష్టరాజుల నెల్లరిని సంహరించిన తరువాత విష్ణువు మైపూతలోని పవిత్రమైన చక్కని పరిమళముతో కూడిన చల్లని గాలి తాకినంతనే పట్టణములలోను పల్లెలలోను నివసించెడి వారి మనసులు నిర్మలములు కాగలవు.

**శ్లో. తేషాం ప్రజా విసర్గస్తు స్థవిష్ఠ స్సంభవిష్యతి**
**వాసుదేవే భగవతి సత్త్వమూర్తౌ హృది స్థితే. 22**

అ. సత్త్వమూర్తౌ = సాత్త్వికగుణస్వరూపుడగు; భగవతి = భగవానుడగు; వాసుదేవే = విష్ణువు హృది = హృదయమునందు; స్థితే = ఉండగా; తేషాం = ఆ పౌరజానపదులయొక్క; ప్రజావిసర్గస్తు = ప్రజాసృష్టి; స్థవిష్ఠః = గొప్పదిగా స్థూలముగా. సంభవిష్యతి = కాగలదు.

తా. సాత్త్వికగుణస్వరూపుడు భగవానుడగు విష్ణువు హృదయములో నున్న యా పౌర జానపదులకు ప్రజాసృష్టి చాలాగొప్పది స్థూలముగా కాగలదు.

**శ్లో. యదావతీర్ణో భగవాన్ కల్కిర్ధర్మపతిర్హరిః,**
**కృతం భవిష్యతి తదా ప్రజాసూతిశ్చ సాత్త్వికీ. 23**

అ. యదా = ఎపుడైతే; భగవాన్ = భగవంతుడు; ధర్మపతిః = ధర్మపాలకుడు; హరిః = విష్ణువు; కల్కిః = కల్కిగా. అవతీర్ణః = అవతరించునో; తదా = అపుడు; కృతం = కృతయుగము; భవిష్యతి = కాగలదు; సాత్త్వికీ = సత్త్వగుణముకల; ప్రజాసూతిశ్చ = ప్రజాసృష్టి; భవిష్యతి = కాగలదు.

తా. ధర్మప్రభువైన భగవంతుడగు విష్ణువు కల్కిగా అవతరించినపుడు కృతయుగము రాగలదు. సత్వగుణము గల ప్రజాసృష్టి కాగలదు.

అవ కృతయుగమునకు చిహ్నములు చెప్పుచున్నారు

**శ్లో. యదా చంద్రశ్చ సూర్యశ్చ తథా తిష్యే బృహస్పతిః,**
**ఏకరాశౌ సమేష్యంతి తథా భవతి తత్కృతమ్. 24**

అ. యదా = ఎపుడైతే; తిష్యే = పుష్యమీ నక్షత్రమందు; ఏకరాశౌ = ఒకేరాశియందు; చంద్రః = చంద్రుడు; సూర్యశ్చ = సూర్యుడును; బృహస్పతిః = గురువు; సమేష్యంతి = వచ్చెదరో (కలిసెదరో) తథా = అట్లు: తత్ = అకాలము; కృతం = కృతయుగము; భవతి = అగును.

తా. పుష్యమీ నక్షత్రమందు ఒకేరాశిలో సూర్యుడు, చంద్రుడు, బృహస్పతి, కలిసి వచ్చి కలసిఉందురో అది కృతయుగమనబడును. సామాన్యముగా పన్నెండేళ్ళకొకమారు కర్కాటక రాశియందు బృహస్పతి ఉండును. రెండు మూడు అమావాస్యలందు చంద్రుడు సూర్యుడు బృహస్పతి ఒకే రాశిలో ఉండుట సంభవించును. కాని ఇచట ఒకేమారు ఒకేరాశి

ఈ ముగ్గురు ఉందురు కాని ఒకే మారు ఈ ముగ్గురు ప్రవేశించరు. అటుల ప్రవేశించినపుడు అది కృతయుగమగును.

అవ. ఇటుల నవమస్కంధము ప్రారంభము నుండి మొదలుపెట్టిన వైవస్వత మనువు యొక్క రెండువంశముల వృత్తాంతమును ఉపసంహరింప చేయుచున్నారు.

శ్లో. యేఽతీతా వర్తమానా యే యే భవిష్యంతి పార్థివాః
తే త ఉద్దేశతః ప్రోక్తాః వంశజాః సోమసూర్యయోః 25

అ. సోమ సూర్యయోః=చంద్రసూర్యులయొక్క; వంశజాః=వంశములందు పుట్టినవారు; యే=ఏ; అతీతాః=గతించిరో; యే=ఎవరు; వర్తమానాః=ఉంటున్నారో; యే=ఎవరు భవిష్యంతి =రాగలరో; తే, తే=ఆయా; పార్థివాః=రాజులు; ఉద్దేశతః=సంక్షేపముగా; ప్రోక్తాః=చెప్పబడిరి.

తా. సూర్యచంద్రవంశములలోని గతించిన రాజులను గురించి, వర్తమానములోని రాజులను గురించి, రాబోవు రాజులగురించి సంక్షేపముగా వివరించితిని.

అవ. కలియుగములోని అవాంతర విశేషమును చెప్పుచున్నారు.

శ్లో. ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనమ్
ఏతద్వర్ష సహస్రంతు శతం పంచ దశోత్తరమ్ 26

అ. భవతః=నీయొక్క; జన్మ=పుట్టుక; ఆరభ్య=మొదలుకొని; యావత్ నందాభిషేచనం= నందుని పట్టాభిషేకమువరకు; ఏతత్=ఇది; వర్షసహస్రం=ఒకవేయి సంవత్సరములు; శతం= నూరు; పంచదశోత్తరం=తరువాత పదిహేను సంవత్సరములు.

తా. నీ పుట్టుకనుండి నందుని పట్టాభిషేకమువరకు ఉన్న మధ్యకాలము (1115)పదు నొకండు వందల పదిహేను సంవత్సరములగును. ఇచట చెప్పిన (1115) సంవత్సరముల సంఖ్య ఏ యుద్దేశముతో ఏ దృష్టిచే చెప్పబడినదో తెలియదు. ఈ భాగవతమునందు చెప్పిన దానిననుసరించి వాస్తవముగా పరీక్షిత్తునకు నందునకు మధ్య గల కాలము 1498 అగును. చూడుడు. పరీక్షిత్సమకాలికుడు మాగధుడు అయిన మార్జారుడు మొదలు రిపుంజయుని వరకు ఇరువదిమంది రాజులు (1000)వేయి సంవత్సరములు పాలించురు. అని నవమస్కంధ మున చెప్పబడినది. తరువాత ప్రద్యోతనులు 138 సంవత్సరములు, తరువాత శిశునాభ వంశపు రాజులు 360 సంవత్సరములు పృథివిని పాలింతురు. అని ఇచటే చెప్పబడినది. 1000+ 138+360=1498 అగును. కావున 1115 అను సంఖ్యకు ఉద్దేశ్యము ఏమియో తెలి యదు.

---

వ. అట్లుగాన జనంబులు లోభులై జారత్వ చోరత్వాదులచేత ద్రవ్యహీనులై, వన్య శాక మూల ఫలంబులను భుజింపుచు, వనదుర్గంబులం గృహీభూతులై, దుర్భిక్ష శీత వాతాతప క్షుధాతాపంబులచేత భయపడి, ధైర్యహీనులై. యల్పాయుష్కులు, నల్పతర శరీరులునై యుండ, రాజులు చోరులై సంచ రింపుచు, నధర్మప్రవర్తనులై, వర్ణాశ్రమ ధర్మంబులు వదిలి, శూద్రప్రాయులై యుండెదరు. అంత

ఆవ కలియుగ ప్రవృత్తిని వృద్ధిని నిరూపించుటకు కలియుగకాలమునకు చిహ్నములను చెప్పుచున్నారు.

శ్లో॥ సప్తర్షీణాం తు యౌ పూర్వౌ దృశ్యేతే ఉదితౌ దివి
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి 27

అ. దివి = ఆకాశమునందు, సప్తర్షీణాం = సప్తర్షులలోపల; యౌ = ఏ ఇద్దరు; పూర్వౌ = ముందుగా; ఉదితౌ = ఉదయించునో; దృశ్యేతే = కనృట్టుదురో; తయోః = వారిద్దరికి; మధ్యే = నడుమ; సమం = వారికి సమమై, యత్ = యే; నక్షత్రం = నక్షత్రము; కన్పట్టునో,

తా. తూర్పుదిశకు పై భాగమున శకటాకారమైన తారాసప్తకము సప్తర్షి మండలము కన్పట్టును. అందు కొంత యెత్తుగా వారిలో అగ్రస్థానమందు మరీచి కన్పట్టును, అతని తర్వాత వెనుక క్రిందికి వంగిన రెండు శంఖముల అకారమున వసిష్ఠుడు భార్యతో కన్పట్టును, తర్వాత వెనుక ఇంచుక ఉత్తరము ప్రక్క అంగిరసుడు అతని తర్వాత చతురస్రమైన తారా చతుష్కము కన్పించును. ఈ శాన్యమున అత్రి, అతనికి దక్షిణమున పులస్త్యుడు, పులస్త్యునికి పశ్చిమమున పులహుడు, అతనికి ఉత్తరమున క్రతువు. ఇట్లు వారి మధ్యన ఏ పూర్వులు ఇద్దరు ఉదయ సమయమందు ప్రథమమున ఉదయించి కన్పట్టురురో వారు పులహుడు క్రతువు అను పేరులు గలవారు. వారి నడుమ పూర్వులైన వారి నడుమ వారికి సమముగ దక్షిణమున సమదేశస్థిత మైనది, అశ్విన్యాది నక్షత్రములలో ఏ నక్షత్రము కన్పట్టుచున్నదో,

శ్లో॥ తేనైతే ఋషయో యుక్తా స్తిష్ఠంత్యబ్దశతం నృణామ్
తే త్వదీయే ద్విజాః కాలే హ్యధునా చాశ్రితా మఘాః 28

అ. తేన = ఆ నక్షత్రముతో కూడా; ఏతే = ఈ; ఋషయః = ఋషులు; యుక్తాః = కూడి నృణాం = నరుల; అబ్దశతం = నూరు సంవత్సరములు; తిష్ఠంతి = ఉందురు; తే = వారు, త్వదీయే = నీ; కాలే = కాలమునందు; అధునా = ఇపుడు, మఘాః = మఘా నక్షత్రములను; ఆశ్రితాః = ఆశ్రయించి యున్నారు.

తా. ఆ నక్షత్రముతో కూడి ఈ సప్తర్షులు మానవుల నూరు సంవత్సరములుందురు, ఆ సప్తర్షులు ఇపుడు అనగా నీవున్న ఈ కాలమున మఘానక్షత్రమును ఆశ్రయించియున్నారు

---

నోషధులల్ప ఫలదంబులు, మేఘంబులు జలశూన్యంబులు, సస్యంబులు నిస్సారంబులు, నగును ఇట్లు ధర్మమార్గంబులు లేకయున్న యెడ, ముకుందుండు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు కొఱకు, శంబల గ్రామంబున విష్ణుయశుండను విప్రునకు పుత్రత్వంబు నొంది, కల్క్యవతారుండై, దేవతాబృందంబులు నిరీక్షింప, దేవదత్త ఘోటకారూఢుండై, దుష్టమ్లేచ్ఛ జనంబుల దనమండలాగ్రంబున ఖండీభూతులం జేయు. అప్పుడు ధాత్రీమండలంబు విగత క్రూరజన మండలంబై తేజరిల్లును. అంతనరులు విష్ణుధ్యాన వందన పూజాదివిధానాసక్తులై, నారాయణ పరాయణులై వర్తిల్లెదరు. ఇట్టులా కల్క్యవతారంబున నిఖిలజనులు ధన్యులయ్యెదరు. అంతట కృతయుగ ధర్మంబై నడచుచుండు. చంద్ర భాస్కర శుక్ర గురువు లేక రాశిగతులయినం గృతయుగంబై తోచు. రాజా! గత వర్తమాన భావికాలంబులు, భవ జ్జన్మంబు మొదలు పంచదశాధికోత్తర శతసహస్రహాయనంబులై నందాభిషేక పర్యంతంబు నుండు. అంత నారాయణుండు అఖిల దుష్టరాజధ్వంసంబు గావించి, ధర్మంబు నిలిపి, వైకుంఠ నిలయుండగు. ॥

శ్లో. విష్ణోర్భగవతో భానుః కృష్ణాఖ్యోఽసౌ దివం గతః
తదాఽవిశత్కలి ర్లోకం యత్పాపే రమతే మనః 29

అ. భగవతః=భగవానుడైన; విష్ణోః=విష్ణువుయొక్క; కృష్ణాఖ్యః=కృష్ణుడను పేరుగల; అసౌ=ఈ; భానుః=దేహము; దివం=వైకుంఠమును; గతః=వెళ్ళెనో; తదా=అపుడు; కలిః=కలియుగము; లోకం=ఈ లోకమును; అవిశత్=ప్రవేశించెను. యత్=ఏ కలియుగమునందు; మనః=మనస్సు; పాపే=పాపమునందు; రమతే=రమించును.

తా- శ్రీ కృష్ణుడు ఈ లోకమును వదిలి వైకుంఠమును చేరగానే కలియుగము ప్రవేశించినది ఈ కలియుగమునందు పాపమును చేయుటకే మనసు ఉరకలు వేయను.

అవ. శ్రీ కృష్ణుడు ఈ లోకమున ఉన్నపుడే కలి సంధ్యారూపమున ప్రవేశించి యున్నాడు. అయిననూ అపుడు కలి ప్రభావమంతగా లేదని చెప్పుచున్నారు.

శ్లో. యావత్స్వపాద పద్మాభ్యాం స్పృశన్నాస్తే రమాపతిః
తావత్కలిర్వై పృథివీం పరాక్రాంతుం న చా శకత్ 30

అ. రమాపతిః=శ్రీకృష్ణుడు; యావత్=ఎంతవరకు; స్వపాద పద్మాభ్యాం=తన పాదపద్మములతో; పృథివీం=భూమిని; స్పృశన్=తాకుచు; ఆస్తే=ఉండెనో; తావత్=అంతవరకు; కలిః=కలిపురుషుడు; పరాక్రాంతుం=పరాక్రమించుటకు; నాశకత్=సమర్థుడు కాలేదు.

తా, ముందుగా కలి ప్రవేశించిననూ శ్రీ కృష్ణుడు భూమిమీద ఉన్నంత వరకు కలి పరాక్రమించలేక పోయెను.

అవ. మొదట చెప్పినదే కలి ప్రవేశకాలమని చెప్పుచున్నారు.

శ్లో. యదా దేవర్షయ స్సప్త మఘాసు విచరంతి హి
తదా ప్రవృత్తస్తు కలిః ద్వాదశాబ్ద శతాత్మకః 31

అ. యదా=ఎప్పుడు; సప్త=ఏడుగురు; దేవర్షయః=దేవఋషులు; మఘాసు=మఘలలో; విచరంతి=తిరుగుదురో; తదా=అప్పుడు; ద్వాదశాబ్ద శతాత్మకః=దివ్యమైన పండ్రెండు వందల యేండ్లుండెడి; కలిః=కలియుగము; ప్రవృత్తః=ప్రవేశించును.

తా సప్తర్షులు మఘలలో సంచరించునపుడు దివ్యమైన 1200ల సంవత్సరములుండు కలియుగము ప్రవేశించును.

అవ. కలి ప్రవేశకాలమును వివరించి, కలి వృద్ధికాలమును చెప్పుచున్నారు.

శ్లో. యదా మఘాభ్యో యాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః
తదానందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి 32

అ. యదా=ఎపుడు; మహర్షయః=మహర్షులు; మఘాభ్యః=మఘలనుండి; పూర్వాషాఢాం=పూర్వాషాఢా నక్షత్రమును గూర్చి; యాస్యంతి=వెళ్ళెదరో; తదా=అపుడు; నందాత్ ప్రభృతి=నందుడనురాజు కాలమునుండి; ఏషః=ఈ; కలిః=కలియుగము; వృద్ధిం=వృద్ధిని; గమిష్యతి=పొందగలదు.

తా. సప్తర్షులు మఘలనుండి పూర్వాషాఢకు వెళ్ళిన రోజునుండి అనగా నందుడు రాజైన నాటినుండి కలి యుగము వృద్ధి పొందగలదు.

అవ. కలియుగపు చిహ్నములు గోచరించినపుడే కలి ప్రవేశమని చెప్పుట యుక్తము కాని అంతకు మునుపే ప్రవేశము. ఆ తరువాత అభివృద్ధియని చెప్పుట యోగ్యమా అనగా చెప్పుచున్నారు.

శ్లో. యస్మిన్ కృష్ణో దివం యాత స్తస్మిన్నేవ తదాహని
ప్రతిపన్నం కలియుగ మితి ప్రాహుః పురావిదః **33**

అ యస్మిన్ = యేరోజు; శ్రీకృష్ణః = కృష్ణభగవానుడు; దివం = వైకుంఠమును గూర్చి; యాతః = వెళ్ళెనో; తస్మిన్ + ఏవ = అదేరోజు; తదా = అపుడే; అహని = అపూటే; కలియుగం = కలియుగము; ప్రతిపన్నం = ప్రవేశించినది; ఇతి = అని; పురావిదః = పూర్వజ్ఞానము కలవారు; ప్రాహుః = చెప్పెదరు.

తా. శ్రీ కృష్ణభగవానుడు ఈ భూలోకమును వదిలి వైకుంఠమును చేరినరోజే కలియుగము ప్రవేశించినదని పురావిదులు చెప్పిరి

అవ. కలియుగము తరువాత కృతయుగ ప్రవేశమును చెప్పుచున్నారు.

శ్లో. దివ్యాబ్దానాం సహస్రాన్తే చతుర్థేతు పునః కృతమ్
భవిష్యతి తదా నృణాం మన ఆత్మ ప్రకాశకమ్ **34**

అ చతుర్థే = నాలుగవదైన కలియుగము ప్రవేశించిన తరువాత; దివ్యాబ్దానాం = దివ్యమైన సంవత్సరముల; సహస్రాన్తే = వేయి తరువాత; పునః = మరల; తదా = అపుడు; నృణాం = మానవులయొక్క; మన ఆత్మ ప్రకాశకం = మనస్సును ఆత్మను ప్రకాశింపచేయు; కృతం = కృతయుగము; భవిష్యతి = రాగలదు.

తా. నాలుగవదైన కలియుగము ప్రవేశించిన వేయి దివ్యవర్షములు గడచిన తరువాత మానవుల మనస్సును ఆత్మను ప్రకాశింప చేయు కృతయుగము రాగలదు.

అవ. రాజవంశములో ఉన్న స్థితియే బ్రాహ్మణాదులలో కూడా చెప్పుచున్నారు.

---

**వ.** అనిన నట్లకాకయని చెప్పదొడంగె, వినుము. సప్తర్షి మండలాంతర్గతంబులయిన పూర్వ ఋషిద్వయ సమమధ్యంబునందు, నిశాసమయంబున నొక్క నక్షత్రంబు గానుపించిన నాకాలంబు మనుష్యమానంబున శతసంవత్సర పరిమితంబయ్యేనేని నా సమయంబున జనార్దనుండు నిజపదంబునం బొదలు. ఆవేళనే ధాత్రీమండలంబు కలిసమాక్రాంతంబగు. కృష్ణుడెంత కాలంబు భూమియందు బ్రవర్తించు నంతకాలంబు కలిసమాక్రాంతంబు గాదు. మఘా నక్షత్రంబందు సప్తర్షులు నేఘస్రంబున జరియించు రాఘస్రంబున గలి ప్రవేశించి వేయినిన్నూరు వర్షంబులుండు. అంత నా ఋషి సంఘంబు పూర్వాషాఢ కరిగినం గలి ప్రవృద్ధంబు నొందు. ఏ దివసంబున హరి పరమ పదప్రాప్తుడయ్యె నద్దివసంబునందె కలి ప్రవేశించి దివ్యాబ్ద సహస్రంబులు చనిన యనంతరంబ. నాలుగవ పాదంబున గృతయుగ ధర్మంబు ప్రాప్తంబగు.

శ్లో. ఇత్యేష మానవో వంశో యథా సంఖ్యాయతే భువి
తథా విట్శూద్ర విప్రాణాం వంశా జ్ఞేయా యుగే యుగే 35

అ. భువి = భూలోకమందు; ఇతి = ఈ విధముగా; ఏషః = ఈ; మానవః = మనువుకు సంబంధించిన; వంశః = వంశము; యథా = యే విధముగా; సంఖ్యాయతే = చెప్పబడినదో; తథా = అటులనే యుగే యుగే = ప్రతి యుగమునందు; విట్ = వైశ్యుల: శూద్ర = శూద్రుల; విప్రాణాం = బ్రాహ్మణుల యొక్క; వంశాః = వంశములు. జ్ఞేయాః = తెలియవలయును

తా. మను వంశమును వివరించిన విధముగానే ప్రతియుగమున, బ్రాహ్మణవైశ్య శూద్రుల వంశములు కూడా తెలియ వలయును.

అవ. ఇటుల రాజవంశములను కీర్తించుట వైరాగ్యము కలుగుటకు ఉపయోగించునని తెలుపు చున్నారు.

శ్లో. ఏతేషాం నామలింగానాం పురుషాణాం మహాత్మనామ్
కథా మాత్రా వశిష్టానాం కీర్తిరేవ స్థితా భువి 36

అ ఏ తేషాం = పైన చెప్పిన; నామలింగానాం = పేరే జ్ఞాపకముగా ఉన్న; మహాత్మనాః = మహాత్ములైన; కథా మాత్రావశిష్టానాం = కథ మాత్రమే మిగిలియున్న; కీర్తిరేవ = కీర్తియే, భువి = ఈ భూమియందు; స్థితా = మిగిలియున్నది.

తా. ఇంతవరకు చెప్పియున్న మహాత్ములైనరాజుల పేర్లు కీర్తిమాత్రమే మిగిలియున్నవి. కాని, వారుకాని, వారి రాజ్యము కాని పుత్రులు కాని లేరని భావము.

అవ. కలియుగమున పుట్టిన రాజవంశములు ఇతర వంశములు కలియుగాంతమున ఎటుల ప్రవర్తించిరో తెలుపు చున్నారు.

శ్లో. దేవాపి శ్శంతనో ర్భ్రాతా మరశ్చేక్ష్వాకు వంశజః
కలాప గ్రామ ఆసాతే మహాయోగ బలాన్వితౌ 37

అ శంతనోః = శంతనుని; భ్రాతా = సోదరుడు; దేవాపిః = దేవాపి యను వాడు; ఇక్ష్వాకు వంశజః = ఇక్ష్వాకు వంశమువాడగు; మరుశ్చ = మరువను వాడు; మహాయోగ బలాన్వితౌ = గొప్ప యోగబలముతో కూడినవారు; కలాప గ్రామే = కలాపమను గ్రామమున; ఆసాతే = ఉండిరి.

తా. గొప్పయోగబలముతో కూడిన శంతనుని సోదరుడు దేవాపి. ఇక్ష్వాకు వంశము వాడగు మరువు కలాపమను గ్రామమున నివసించు చుండిరి.

శ్లో. తావుపేత్య కలేరంతే వాసుదేవాను శిక్షితౌ
వర్ణాశ్రమ యుతం ధర్మం పూర్వ వత్ప్రథయిష్యతః 38

---

చం నరవర తొంటి భూపతుల నామ గుణంబులు వృత్తచిహ్నముల్
విరియును రూపసంపదలు చెన్నగు రాజ్యము లాత్మవిత్తముల్
వరున నణంగె గాని యట వారల కీర్తులు నిర్మలంబులై
యురవడి భూమిలో నిలిచి యున్నవి నేడును రాజశేఖరా. 14

అ. కలేః = కలియుగముయొక్క; అంతే = అంతమునందు; తౌ = ఆదేవాపి మరువు అనువారలు ఉపేత్య = ఈ లోకమునకు వచ్చి; వాసుదేవానుశిక్షితౌ = వాసుదేవునిచే ఉపదేశించబడినవారై; వర్ణాశ్రమయుతం = వర్ణాశ్రమములలో కూడిన; ధర్మం = ధర్మమును; పూర్వవత్ = మునుపటి వలె; ప్రథయిష్యతః = వ్యాపింప చేయగలరు,

తా. కలియుగము చివరలో దేవాపి మరువు భగవంతునిచే ఉపదేశించబడిన వారై ఈ లోకమునకు వచ్చి మునుపటివలె వర్ణాశ్రమ ధర్మములను వ్యాపింప చేయగలరు.

అవ. ప్రతి నాలుగుయుగములలో ఈ విధానమే జరుగునని చెప్పుచున్నారు.

శ్లో. కృతం త్రేతా ద్వాపరశ్చ కలిశ్చేతి చతుర్యుగమ్
అనేన క్రమయోగేన విభుః ప్రాణిషు వర్తతే **39**

అ. కృతం = కృతయుగము; త్రేతా = త్రేతాయుగము; ద్వాపరః = ద్వాపరయుగము; కలిశ్చ = కలియుగము; ఇతి = అనెడు చతుర్యుగం = నాలుగు యుగములు; అనేన = ఈ; క్రమ యోగేన = క్రమ పద్ధతితో; విభుః = పరమాత్మ; ప్రాణిషు = ప్రాణులలో; వర్తతే = వుండును. (ప్రవర్తించును)

తా. కృత త్రేతా ద్వాపర కలియుగములలో ఇదే పద్ధతిలో పరమాత్మ ప్రాణులలో నివసించును. (ప్రవర్తింప చేయును)

అవ మొదట రాజుల కీర్తియే మిగులును అని చెప్పిన దానినే అయిదు శ్లోకములతో వివరించు చున్నారు,

శ్లో. రాజన్నేతే మయా ప్రోక్తా నరదేవాస్తథా పరే
భూమౌ మమత్వం కృత్వాంతే హిత్వేమాం నిధనం గతాః **40**

అ. రాజన్! = ఓ పరీక్షిన్మహారాజా !; మయా = నాచేత; ప్రోక్తాః = చెప్పబడిన; ఏతే = ఈ; నరదేవాః = రాజులు; తథా = అటులనే; పరే = ఇతరులు; భూమౌ = భూమి యందు; మమత్వం = మమకారమును; కృత్వా = చేసి (కలిగించుకొని) అంతే = చివర; ఇమాం = ఈ భూమిని; హిత్వా = విడిచి; నిధనం గతాః = మరణించిరి.

తా, ఓ రాజా! నేను చెప్పిన రాజులు చెప్పని రాజులు కూడా ఈ భూమి నాది అనుకొని, చివరికి అన్నిటిని విడిచి మరణించిరి.

అవ. మమకారము పెంచుకున్నందు వలన కలిగెడు భూత ద్రోహప్రవృత్తిని నిందించుచున్నారు.

శ్లో. క్రిమి విడ్భస్మ సంజ్ఞాంతే రాజనామ్నోఽపి యస్య చ
భూత ధ్రుక్తత్కృతే స్వార్థం కిం వేద నిరయో యతః **41**

అ. యస్య = ఏ; రాజనామ్నః = రాజనుపేరుగల వానికి; అంతే = దేహాంతమున; క్రిమివిట్ భస్మ సంజ్ఞా = క్రిమియని విట్ అని భస్మ అనియో సంజ్ఞ వచ్చును. తత్కృతే = ఆదేహము కొఱకు; భూతధ్రుక్ = భూతములను ద్రోహము చేయువాడు; స్వార్థం = స్వార్థమును; కిం వేద = ఏమితెలియును ఏమియును తెలియడు; యతః = ఏభూతద్రోహము వలన; నిరయః = నరకము కలుగును.

తా. రాజైన ప్రతివానికి దేహాంతమున ఆదేహమునకు క్రిమి యనియో, విట్ అనియో భస్మ అనియో వ్యవహారము కలుగును. అటువంటి దేహము కొఱకు భూత ద్రోహము చేయు

వాడు పురుషార్థమును తెలియుట లేదు. భూతద్రోహము వలన కలుగు ఫలితము నరకమే.

అవ. మమత ఎటువంటిదో తెలుపుచున్నారు.

శ్లో॥ కథం సేయ మఖండా భూః పూర్వైర్మే పురుషైర్ధృతా
మత్పుత్రస్య చ పౌత్రస్య మత్పూర్వా వంశజస్య వా **42**

అ. సేయం = ఆ ఈ; అఖండా = అఖండమైన; భూః = భూమి; మే = నా; పూర్వైః = పూర్వులైన; పురుషైః = పురుషులచేత; కథం = ఎటుల; ధృతా = ధరించబడినది? మత్పూర్వా = నేనే మొదటివాడనిగా గలిగిన ఈ భూమి; మత్పుత్రస్య = నా పుత్రునికి; పౌత్రస్య = పౌత్రునికి; వంశజస్యవా = నా వంశమున పుట్టిన వానికి కాని; కథం = ఎటులగును.

తా. మా పూర్వులచే ఈ భూమి ఎటుల పాలించబడినది? ఇపుడు నాచే పాలించ బడెడి ఈ భూమిని నా పుత్రుడు. ప్రౌత్రుడు, లేదా నావంశము వారు ఎటుల పరిపాలించగలరు అని రాజ్యముమీద మమతను పెంచుకొనును.

శ్లో. తేజోఽ బన్నమయం కాయం గృహీత్వాత్మతయాఽబుధాః
మహీం మమతయా కృత్వా హిత్వోభౌ నిధనం.గతాః **43**

అ. అబుధాః = విజ్ఞులు కానివారు అనగా దేహాతిరిక్తమైన ఆత్మజ్ఞానము లేనివారు. తేజోఽ బన్నమయం = తేజస్సు, జలము, అన్నముతో ఏర్పడిన; కాయం = శరీరమును; ఆత్మతయా = ఆత్మగా; గృహీత్వా = గ్రహించి; మహీం = భూమిని; మమతయా = తనదిగా; కృత్వా = భావించి; ఉభౌ = శరీరమును, భూమిని; హిత్వా = వదిలి; నిధనం = మరణమును; గతాః = పొందిరి,

తా. శరీరము కంటె వేరుగా ఆత్మ ఉన్నదని తెలియనివారు తేజస్సు, జలము, అన్నముతో ఏర్పడిన శరీరమునే ఆత్మగా భావించి, ఈ భూమి యంతయూ తనదే అను మమకారమును పెంచుకొని, అంతమున భూమిని శరీరమును రెంటిని విడిచి మరణింతురు.

శ్లో. యే యే భూపతయో రాజన్ భుంజతే భువమోజసా
కాలేన తే కృతా స్సర్వే కథామాత్రాః కథాసుచ **44**

అ. రాజన్! = ఓ పరీక్షన్మహారాజా! యే యే = ఏయే; భూపతయః = రాజులు; భువం = భూమిని ఓజసా = పౌరుషముచే; భుంజతే = అనుభవించిరో; తే సర్వే = వారందరు; కాలేన = కాలముచే; కథాసు = ఆయాకథలలో; కథామాత్రాః = కథలుగా మాత్రమే; కృతాః = చేయబడిరి.

తా. ఓ పరీక్షన్మహారాజా! తమ పౌరుషముతో ఈ భూమిని పాలించిన రాజు లందరూ కాలవశమున కథామాత్రముగా చేయబడిరి. అనగా కాలము గడచిన తరువాత వారి కథలే మిగిలినవి కాని వారు మాత్రము లేరు అని భావము.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశ స్కంధే
ద్వితీయోఽధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
రెండవ అధ్యాయము ముగిసినది
ఓమ్ తత్ సత్

వ. శంతను ననుజుండగు దేవాపియు, నిక్ష్వాకు వంశజుండగు, మరుత్తును, యోగయుక్తులై కలాపగ్రామ నిలయులై, కలియుగాంతంబునందు వాసుదేవ ప్రేరితులై, ప్రజల నాశ్రమాచారంబులు దప్పకుండ నడుపుచు, నారాయణ స్మరణంబు నిత్యంబును జేసి కైవల్య పదప్రాప్తులగుదురు. ఇవ్విధంబున నాలుగు యుగంబుల రాజులను, నే నెఱింగించిన పూర్వ రాజన్యులును, వీరందఱును సమస్త వస్తు సందోహంబుల యందును మమతం బొంది, యుత్సాహవంతులై యుండి పిదప, నీ భూతలంబు వదలి, నిధనంబు నొందుదురు. కావున గాలంబు జాడ యెవ్వరికిం గానరాదు. (కీర్తి సుకృత దుష్కృతంబులు వెంట నంటం గలయవి)అదియునుం గాక మత్పూర్వులు హరిధ్యాన వరవశులై, దయా సత్య శౌచ శమ దమాదిక ప్రశస్త గుణంబులం బ్రసిద్ధులై నడిచిరి. అట్లు గావున, 15

క. ధర్మము సత్యము కీర్తియు నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసా వ్రతము, న్నర్మిలి గలవారె పుణ్యులవనీ నాథా! 16

తే. ఈ జగంబేలు దొల్లిటి రాజవరులు
కాలవశమున నాయువుల్ గోలుపోయి
నామ మాత్రావశిష్టులై నారు కాన
సలుప వలువదు మమత నెచ్చటనృపాల! 17

# తృతీయోఽధ్యాయః

## మూడవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**తృతీయే భూమిగీతైస్తు రాజ్యదోషాది వర్ణ్యతే**
**కలౌ చ దోష భూయిష్ఠే దోషహన్త్రీ హరేర్నతిః.**

తా. తృతీయాధ్యాయమున భూమిని గురించి రాజులలో పెరిగెడు మమతాహంకారములను రాజ్యదోషములను తెలిపెదరు. దోషములతోనిండియున్న కలియుగమున శ్రీహరి భక్తి యొక్కటే అన్ని దోషములను పోగొట్టును అని తెలుపుచున్నారు.

అవ. దేహాత్మాభిమానమును రాజ్యమునందు మమకారమును చేయువారు అజ్ఞానులు అని పూర్వము చెప్పియున్నదానిని భూమి గీతములతో వివరించుచున్నారు.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకులు పలికిరి.

శ్లో. **దృష్ట్వాత్మని జయేవ్యగ్రాన్ నృపాన్ హసతి భూరియం**
**అహో మాం విజిగీషంతి మృత్యోః క్రీడనకా నృపాః.** 1

అ. ఆత్మని=తన విషయములో; జయే=జయమునందు; వ్యగ్రాన్=ఆసక్తులైన; నృపాన్ = రాజులను; దృష్ట్వా=చూచి; ఇయం=ఈ; భూః = భూమి; మృత్యోః = మృత్యువునకు; క్రీడనకాః = ఆటబొమ్మలైన; నృపాః =రాజులు; మాం=నన్ను; విజిగీషంతి = గెలువగోరుచున్నారు. అహో! = ఆశ్చర్యము, అని; హసతి = పరిహసించును.

తా. తనను జయించవలెనను కోరికతోనున్న రాజులను చూచి ఈభూమి, మృత్యువునకు ఆటబొమ్మలైన ఈ రాజులునన్ను గెలువ గోరుచున్నారని పరిహాసము చేయును.

శ్లో. **కామ ఏష నరేన్ద్రాణాం మోఘస్స్యాద్విదుషామపి**
**యేన ఫేనోపమే పిండే యేతి విస్రంభితా నృపాః.**

అ. విదుషామపి=పండితులైననూ; నరేంద్రాణాం = రాజులయొక్క; ఏషః = ఈ; కామః = కోరిక; మోఘః స్యాత్ =వ్యర్థమగును; యేన=యే కోరికతో; ఫేనోపమే=నీటి నురుగువంటి; పిండే = శరీరము నందు, యే నృపాః = ఏరాజులు; అతివిస్రంభితాః = మిక్కిలి విశ్వాసముతో నుందురో.

తా. నీటి నురుగువంటి ఈశరీరముపై అతి విశ్వాసముతో పండితులైన రాజులు కూడా భూమిని జయించవలెనని వ్యర్థపు కోరికను పెంచుకొందురు. అటువంటి రాజులను చూచి ఈ భూమి పరిహసించును.

అవ రాజుల కోరికలనే రెండు శ్లోకములతో వివరించుచున్నారు.

**శ్లో. పూర్వం నిర్జిత్య షడ్వర్గం జేష్యామో రాజమంత్రిణః**
**తత స్సచివ పౌరాప్తాన్ కరీన్ద్రానస్య కంటకాన్. 3**

అ. పూర్వం = మొదట; షడ్వర్గం = కామాది షడ్వర్గమును; నిర్జిత్య = గెలిచి; రాజమంత్రిణః = రాజమంత్రులను; జేష్యామః = గెలిచెదము; తతః = అటు పిమ్మట; సచివ పౌరాప్తాన్ = అమాత్యులను పౌరులకు అప్తులను, కరీన్ద్రాన్ = మావటి వారిని; అస్య = ఈ భూమండలమునకు; కంటకాన్ = కంటకతుల్యులైన వారిని గెలిచెదము.

తా. మొదట అరిషడ్వర్గమును జయించి, తరువాత రాజులను మంత్రులను గెలచి అటు పిమ్మట అమాత్యులను పౌరులను, మావటివారిని మరియు ఈ భూమికి కంటక ప్రాయులను గెలిచెదము.

**శ్లో. ఏవం క్రమేణ జేష్యామః పృథ్వీం సాగరమేఖలామ్**
**ఇత్యాశా బద్ధ హృదయా న పశ్యంత్యంతికేంతకమ్. 4**

అ. ఏవం క్రమేణ = ఈ క్రమముగా; సాగరమేఖలాం = సముద్రముతో చుట్టుకొనియున్న; పృథ్వీం = భూమిని; జేష్యామః = గెలిచెదము; ఇతి = అని; ఆశాబద్ధహృదయాః = ఆశతోనిండిన హృదయము కలవారై; అంతికే = సమీపములోనున్న; అంతకం = మృత్యువును; నపశ్యన్తి = చూడరు.

తా. ఈ ప్రకారముగా భూమండలమునంతయు గెలిచెదము అని ఆశను పెంచుకొనుచు **సమీపములోనున్న** మృత్యువును చూడరు.

**శ్లో. సముద్రావరణాం జిత్వా మాం విశంత్యబ్ధి మోజసా**
**కియదాత్మ జయస్యైతన్ముక్తి రాత్మజయే ఫలమ్. 5**

అ. ఓజసా = బలముచేత; సముద్రావరణాం = సముద్రములతో చుట్టుకొని యున్న; మాం = నన్ను; జిత్వా = గెలిచి; అబ్ధిం = సముద్రమును; విశంతి = ప్రవేశించు చున్నారు; ఆత్మజయస్య = ఇంద్రియ జయమునకు; ఏతత్ = ఈ భూమి జయము; కియత్ = ఎంత ఫలము; ఆత్మజయే = ఇంద్రియజయమున; ముక్తిః = మోక్షము; ఫలం = ఫలము.

తా. తమ పరాక్రమముతో సమస్త భూమండలమును జయించిన రాజులు ద్వీపాన్తరములను జయింపగోరి సముద్రములోనికి ప్రవేశించుచున్నారు. కాని ఇంద్రియ జయమును సాధించిన వారికి భూవిజయము ఒక ఫలము కానేరదు. ఇంద్రియ జయమునకు నిజమైన ఫలము ముక్తి మాత్రమే.

**శ్లో. యాం విసృజ్యైవ మనవ స్తత్సుతాశ్చ కురూద్వహ**
**గతా యథాగతం యుద్ధే తాం మాం జేష్యంత్య బుద్ధయః. 6**

అ. కురూద్వహా! = ఓ కురువంశీయుడా!; మనవః = మనువులు: తత్సుతాశ్చ = అతని; పుత్రులు కూడా; యాం = యే భూమిని; విసృజ్యైవ = వదిలియే; యథాగతం = వచ్చినట్లుగా; గతాః = వెళ్ళిరో; తాం మాం = అటువంటి నన్ను; అబుద్ధయః = బుద్ధిహీనులు; యుద్ధే = యుద్ధమునందు; జేష్యంతి = వశము చేసుకొనగలరు.

తా॥ మనువులు వారి పుత్రులు నన్ను వదలి వచ్చినదారిన వెళ్ళిననూ దానిని తెలియక బుద్ధిహీనులు కొందరు యుద్ధములో నన్ను తమ వశము చేసుకొనగలరు.

**శ్లో॥ మత్కృతే పితృ పుత్రాణాం భ్రాతౄణాం చాపి విగ్రహః**
**జాయతే హ్యసతాం రాజ్యే మమతా బద్ధచేతసామ్. 7**

అ. రాజ్యే = రాజ్యమునందు మమతా బద్ధచేతసాం = మమకారముచేత వశముచేయబడిన మనసు గల; అసతాం = దుర్జనులైన; పితృ పుత్రాణాం = తండ్రీకొడుకులకు; భ్రాతౄణాంచాపి = అన్నదమ్ములకు కూడా మత్కృతే = నాకొఱకు, విగ్రహః = విరోధము; జాయతే = కలుగును;

తా. రాజ్యము మీది మమకారముతో దుర్జనులైన తండ్రీకొడుకులకు అన్నదమ్ములకు నాకొరకు విరోధముకలుగును. అనగా అన్నదమ్ములు, తండ్రీ కొడుకులు నాకొరకు కలహింతురని భావము.

**శ్లో॥ మమైవేయం మహీ కృత్స్నా న తే మూఢేతి వాదినః**
**స్పర్ధమానా మిథో ఘ్నంతి మ్రియంతే మత్కృతే నృపాః 8**

అ ఇయం = ఈ; కృత్స్నా = సమస్తము; మహీ = భూమి; మమైవ = నాదే; మూఢ = ఓ మూర్ఖుడా; తే = నీది; న = కాదు; ఇతి = ఇటుల; వాదినః = పలుకుచు; స్పర్ధమానాః = కలహించుచు; మిథః = పరస్పరము; ఘ్నంతి = చంపుకొనెదరు; మత్కృతే = నా కొఱకు; నృపాః = రాజులు; మ్రియంతే = చనిపోయెదరు.

తా. ఈ భూమి యంతయు నాదే నీది కాదు అని వాదించుకొనుచు పరస్పరము కలహించుకొనుచు ఒకరినొకరు చంపుకొనెదరు. ఇటుల నా కొఱకు రాజులు మృతి నొందెదరు.

**శ్లో॥ పృథుః పురూరవా గాధి ర్భరతో నహుషోఽర్జునః**
**మాంధాతా సగరో రామః ఖట్వాంగో దుంధుహా రఘుః. 9**

తా. పృథుచక్రవర్తి, పురూరవుడు, గాధి, భరతుడు, నహుషుడు, కార్తవీర్యార్జునుడు, మాంధాత, సగరుడు, రాముడు, ఖట్వాంగుడు, దుంధుహా, రఘువు వీరందరు రాజ్యపాలన చేసివెళ్ళినవారని ముందు శ్లోకముతో అన్వయము.

**శ్లో॥ తృణబిందుః యయాతిశ్చ శర్యాతి శ్శంతను ర్గయః**
**భగీరథః కువలయాశ్వః కకుత్స్థో నైషధో నృగః, 10**

తా॥ తృణబిందువు, యయాతి, శర్యాతి, శంతనుడు, గయుడు, భగీరథుడు, కువలయాశ్వుడు, కకుత్స్థుడు, నలుడు, నృగుడు.

**శ్లో॥ హిరణ్యకశిపు ర్వృత్రో రావణో లోకరావణః**
**నముచి శ్శంబరో భౌమో హిరణ్యాక్షోఽథ తారకః 11**

తా॥ హిరణ్యకశ్యపుడు, వృత్రాసురుడు, రావణుడు, నముచి, శంబరుడు, నరకుడు, హిరణ్యాక్షుడు, తారకుడు.

శ్లో. అన్యే చ బహవో దైత్యా రాజానో యే జనేశ్వరాః
సర్వే సర్వవిద శ్శూరా స్సర్వే సర్వజితోఽజితాః. 12

అ. అన్యే చ = ఇతరులు కూడా; బహవః = చాలామంది; దైత్యాః = రాక్షసులు; యే = ఎవరైతే; జనేశ్వరాః = ప్రజాపాలకులగు; రాజానః = రాజులు; సర్వే = అందఱు సర్వవిదః = అన్నియును తెలిసినవారు; సర్వే = అందరు; శూరాః = శూరులు; అజితాః = ఇతరులచేత గెలువబడని వారు, సర్వజితః = అందరిని గెలిచినవారు.

తా. పైన చెప్పిన వారు కాక ఇతరులు కూడా చాలామంది రాక్షసులు, ప్రజాపాలకులు, రాజులు, అన్నియు తెలసిన వారు ఇతరులముందు ఓడనివారు, అందరిని గెలచినవారు.

శ్లో. మమతాం మయ్యమర్త్యాయాం కృత్వోచ్చైర్మర్త్య ధర్మిణః
కథావశేషాః కాలేన హ్యకృతార్థాః కృతా విభో.

అ. మర్త్యధర్మిణః = మరణ ధర్మము గల ఈ రాజులు; అమర్త్యాయాం = మరణ ధర్మములేని మయి = నా యందు; ఉచ్చైః = గొప్పగా; మమతాం = మమకారమును; కృత్వా = చేసి కాలేన = కాలవశమున; కథావశేషాః = కథమాత్రమే మిగిలిన వారుగా; అకృతార్థాః = కృతార్థులు కానివారుగా; కృతాః = చేయబడినారు.

తా. మరణధర్మముగల ఈ రాజులు రాక్షసులు మరణములేని నా మీద మమకారమును పెంచుకొని కాలవశముతో అకృతార్థులుగా కథమాత్రమే మిగిలినవారుగా అయిరి.

శ్లో. కథా ఇమాస్తే కథితా మహీయసాం
విధాయ లోకేషు యశః పరేయుషామ్
విజ్ఞాన వైరాగ్య వివక్షయా విభో
వచో విభూతి ర్నతు పారమార్థ్యమ్. 14

అ. విభో! = ఓ పరీక్షన్మహారాజా!, లోకేషు = లోకములందు; యశః = కీర్తిని; విధాయ = ప్రతిష్ఠింపచేసి; పరేయుషాం = మృతినొందిన; మహీయసాం = గొప్పప్రభువులయొక్క; ఇమాః = ఈ; కథాః = కథలు; విజ్ఞాన వైరాగ్య వివక్షయా = విజ్ఞానమును, వైరాగ్యమును బోధించు కోరికచే; కథితాః = చెప్పబడినవి.; వచోవిభూతిః = వాగ్వైభవము; నతు పారమర్థ్యమ్ = పరమార్థము మాత్రము కాదు.

తా. ఓ మహారాజా! ఈ లోకములో కీర్తిని ప్రతిష్ఠింపచేసి మృతినొందిన గొప్పరాజుల చరిత్రను నీకు విజ్ఞానమును వైరాగ్యమును బోధింప గోరి చెప్పితిని. ఈ కథలలో వాగ్వైభవమే కాని పారమార్థ్యములేదు.

అవ. ఇది పరమార్థము కాదని అసలు పరమార్థమును వివరించుచున్నారు.

శ్లో. యస్తూత్తమ శ్లోక గుణానువాద స్సంస్తూయతేఽభీక్ష్ణ మమంగళఘ్నః
తమేవ నిత్యం శృణుయాద భీక్ష్ణం కృష్ణేఽచలాం భక్తి మభీప్సమానః. 15

అ. యః = ఎవడు, కృష్ణే = శ్రీ కృష్ణునియందు; అచలాం = నిశ్చలమైన: భక్తిం = భక్తిని; అభీప్సమానః = కోరువాడు; ఉత్తమ శ్లోకగుణాను వాదః = పుణ్యశ్లోకుడగు శ్రీ కృష్ణుని గుణ కథలు;

అభీక్ష్ణం=మాటి మాటికి; అమంగళఘ్నః=అశుభములను బోనాడు నదిగా; సంస్తూయతే=స్తుతింబడి నదో; తమేవ=ఆ శ్రీహరిని గూర్చియే; నిత్యం=ఎల్లపుడు; అభీక్ష్ణం=మాటి మాటికి; శృణుయాత్=వినవలెను

తా. శ్రీ కృష్ణునియందు నిశ్చలమైన భక్తి కలుగవలయునన్నచో ఎల్లపుడు అన్ని అశుభములను బోనాడి శుభములను చేకూర్చు శ్రీకృష్ణుని గూర్చియే ఎల్లప్పుడూ వినవలయును.

అవ కలిదోషములు వృద్ధిచెందినపుడు భక్తి కలుగుట అసంభవమని తలచి పరీక్షిన్మహా-రాజు అడుగుచున్నాడు.

రాజోవాచ=పరీక్షిన్మహారాజు పలికెను.

శ్లో. కేనోపాయేన భగవన్! కలేర్దోషా న్కలౌ జనాః
విధమిష్యంం త్యుపచితాం స్తన్మే బ్రూహి యథా మునే!. **16**

అ. భగవన్!=పూజ్యుడా; మునే?=ఓ మునీ కలౌ=కలియుగమున; ఉపచితాన్=వృద్ధి పొందిన కలేః=కలియొక్క. దోషాన్ = దోషములను; జనాః = జనులు; కేన+ఉపాయేన = ఏ ఉపాయముతో; విధమిష్యంతి = నాశము చేయగలరో; తత్ = దానిని; యధా = ఉన్నది ఉన్నట్లుగా; మే = నాకు; బ్రూహి = చెప్పుము,

తా. పూజ్యుడైన ఓమునీ! కలియుగమున వృద్ధిపొందెడు కలిదోషములను ప్రజలు ఏ ఉపాయముతో నశింపచేతురో ఆ మార్గమును నాకు యధాప్రకారముగా తెలుపుము.

అవ. కలియుగమున ఏది పరమ ధర్మమని అడుగుచున్నాడు.

శ్లో. యుగాని యుగధర్మాంశ్చ మానం ప్రళయ కల్పయోః
కాలస్యేశ్వర రూపస్య గతిం విష్ణోర్మహాత్మనః. **17**

---

వ గర్వాంధులైన నరపతులం జూచి, బూదేవి హాస్యంబు సేయు. శత్రుక్షయంబు చేసి యెవ్వనికి నీక, తామె యేలు చుండెద మనియెడి మోహంబునం భితృపుత్ర భ్రాతలకు భ్రాంతి గల్పించి, యన్యోన్యవైరానుబంధ బులం గలహంబు చేసి, రణరంగంబులం దృణ ప్రాయఃబులుగా దేహాదులు వర్జించి, నిర్జరలోక ప్రాప్తులయిన పృథు యయాతి గాధి నహుషభరతార్జున మాంధాతృ సగర రామ ఖట్వాంగ దుంధుమార రఘు తృణబిందు పురూరవ శ్శంతను గయ భగీరథ కువలయాశ్వ కకుత్థ్స నిషధాదులగు రాజులును. హిరణ్యకశిపు వృత్రరావణన ముచిశంబర భౌమహిరణ్యాక్ష తారకాదులయిన దైత్యులును ధరణీ మమత్వంబునంజేసికదాకాలవశంబుననాశంబు నొందిరి. ఇదియంతయు మిధ్యగాన సర్వంబునుం బరిత్యజించి జనార్దవ వైకుంఠ వాసుదేవ నృసింహాది హరినామామృత పానంబు నిరంతరంబు చేసి, జరారోగ వికృతులంబాసి హరి పదంబునొందుము అని చెప్పి.

తే. ఉత్తమ శ్లోకుడన నెవ్వడున్నవాడు
సన్నుతుండగు నెవ్వడు సకలదిశల
నట్టి పరమేశ్వరుని జిత్తమందు నిలిపి
తద్గుణంబులు వర్ణింపు ధరణి నాధ

అ, యుగాని = యుగములను గూర్చి; యుగధర్మాంశ్చ = యుగధర్మములను గురించి; ప్రళయ కల్పయోః = ప్రళయము యొక్క: కల్పముయొక్క; మానం = ప్రమాణమును; మహాత్మనః = మహాత్ముడైన; విష్ణోః = విష్ణువు యొక్క, ఈశ్వరరూపస్య = పరమాత్మ స్వరూపమైన; కాలస్య = కాలము యొక్క; గతిం = గమనమును గురించి చెప్పుము.

తా. యుగములను యుగధర్మములను ప్రళయము యొక్క కల్పము యొక్క ప్రమాణమును భగవత్స్వరూపమైన కాలగతిని గురించి తెలుపుము. ప్రళయమనగా జగము జలార్ణవమైయుండుట. కల్పమనగా సృష్టికాలము.

అవ. యుగధర్మములను తెలుపుచున్నారు.

శ్రీశుక ఉవాచ = శ్రీశుకులు పలికిరి.

శ్లో. కృతే ప్రవర్తతే ధర్మ శ్చతుష్పా త్తజ్జనైర్ధృతః
సత్యం దయా తపో దానం ఇతి పాదా విభోర్నృప. 18

అ. నృప = ఓ మహారాజా కృతే = కృతయుగమునందు; ధర్మః = ధర్మము: చతుష్పాత్ = నాలుగుపాదములు గలదై;తజ్జనైః = ఆయుగమునందలి జనులచేః ధృతః = ధరించబడినదై; ప్రవర్తతే = ప్రవర్తించును; విభోః = ప్రభువైన ఆధర్మమునకు; సత్యం = సత్యము; దయా = దయ; తపః = తపస్సు; దానం = దానము; ఇతి = అని; పాదాః = పాదములు;

తా. ఓ రాజా! కృతయుగమునందు ధర్మము నాలుగు పాదములతో ప్రవర్తించును. ఆ యుగమునందలి జనులు ఆ నాలుగు పాదములను ధరింతురు. సత్యము, దయ, తపస్సు, దానము అనునవి నాలుగు పాదములు. ఇచట దాన మనగా రాగద్వేషములు లేకుండా అభయమిచ్చుట. దీనినే ప్రథమ స్కంధమున శౌచశబ్దముతో చెప్పిరి.

అవ. ఆ యుగమునందలి జనుల స్వభావములను తెలుపు చున్నారు.

శ్లో. సంతుష్టాః కరుణా మైత్రా శ్శాంతా దాంతా స్తితిక్షవః
ఆత్మారామా స్సమ దృశః ప్రాయశ శ్శ్రమణా జనాః 19

అ ప్రాయశః = తరచుగా; జనాః = ఆయుగమందలి జనులు, సంతుష్టాః = సంతోషము నొందినవారు. కరుణాః = దయ గలవారు, మైత్రాః = భూతములందు మైత్రిగలవారు. శాంతాః = బాహ్యేంద్రియనిగ్రహము గలవారు. దాంతాః = అంతరింద్రియ నిగ్రహము గలవారు. తితిక్షవః = ఓర్పు గలవారు, ఆత్మారామాః = తమలోనే తాము ఆనందించువారు. సమదృశః = సమదృష్టిగలవారు, శ్రమణాః = ఆత్మజ్ఞానమును అభ్యసించువారు.

తా. కృత యుగము నందలి జనులు నిత్యసంతుష్టులు. దయగలవారు, భూతమైత్రి గలవారు, బాహ్యేంద్రియ నిగ్రహము అంతరింద్రియ నిగ్రహము గలవారు, ఓర్పుగలవారు, ఆత్మారాములు. సమదృష్టి గలవారు, ఆత్మ జ్ఞానమును అభ్యసించువారుగా ఉందురు.

శ్లో. త్రేతాయాం ధర్మపాదానాం తుర్యాంశో హీయతే జనైః
అధర్మపాదై రనృత హింసాఽసంతోష విగ్రహైః, 20

అ. జనైః = జనుల చేత; త్రేతాయాం = త్రేతాయగమునందు; ధర్మపాదానాం = ధర్మపాదముల యొక్క; తుర్యాంశః = నాలుగవ భాగము; అధర్మ పాదైః = అధర్మమునకు పాదములైన; అనృత హింసా అసంతోష విగ్రహైః = అసత్యము; హింస; అసంతోషము, విరోధములతో; హీయతే = విడువ బడును.

తా. త్రేతాయుగమునందలి జనులు ధర్మపాదములైన సత్యము దయ తపస్సు దానముల యొక్క నాలుగవభాగమును అసత్యము,హింస,అసంతోషము,విరోధములతో విడిచిరి. అనగా అసత్యముతో సత్యముయొక్క నాలుగవ భాగమును హింసతో దయ యొక్క నాలుగవ భాగమును. అసంతోషముతో తపస్సుయొక్క నాలుగవభాగమును, విరోధముతో దానముయొక్క నాలుగవ భాగమును విడిచిరని భావము.

శ్లో. తదా క్రియా తపోనిష్ఠా నాతి హింస్రా న లంపటాః
త్రైవర్గికాస్త్రయీ వృద్ధా వర్ణా బ్రహ్మోత్తరా నృప **21**

అ. నృప = ఓ పరీక్షిన్మహారాజా ! తదా = ఆ త్రేతాయుగము నందు; క్రియాః = కర్మలు; న + అతి హింస్రాః = ఎక్కువ హింస చేయునవికావు; న + అతిలంపటాః = ఎక్కువగా ఇంద్రియాసక్తములు కావు; త్రైవర్గికాః = త్రివర్గములు; త్రయీవృద్ధాః = వైదిక వృద్ధులు; లేదా సత్యము తక్క దానము దయ తపస్సు గలవారు; బ్రహ్మోత్తరాః = బ్రాహ్మణాధిక్యము కలవారు.

తా. ఓ రాజా! ఆ త్రేతాయుగమునందలి జనులు ఎక్కువగా హింసలేని కర్మలను, ఇంద్రియాసక్తములైన అభీష్టములను తీర్చు కర్మలను చేయువారుకారు. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు దానము దయ తపస్సు గలవారు. బ్రాహ్మణాధిక్యము గల జాతులుండెడివి.

శ్లో. తపస్సత్యం దయాదానే ష్వర్ధం హ్రసతి ద్వాపరే
హింసాతుష్ట్యనృతద్వేషై ర్ధర్మస్యా ధర్మలక్షణైః **22**

అ. ద్వాపరే = ద్వాపరయుగము నందు; అధర్మ లక్షణైః = అధర్మ లక్షణములైన; హింసా = హింస; అతుష్టి = అసంతోషము; అనృత = అసత్యము; ద్వేషైః = ద్వేషముల చేత; ధర్మస్య = ధర్మము యొక్క; తపః = తపస్సు, సత్యం = సత్యము; దయా = దయ; దానేషు = దానములలో; అర్ధం = సగము; హ్రసతి = తగ్గిపోవును.

తా. ద్వాపరయుగమునందు అధర్మ లక్షణములైన హింస అసంతోషము అసత్యము ద్వేషములచే ధర్మ లక్షణములైన తపస్సు సత్యము దయా దానములలో సగము తగ్గిపోవును.

శ్లో. యశస్వినో మహాశీలాః స్వాధ్యాయాధ్యయనే రతాః
ఆఢ్యాః కుటుంబినో దృప్తా వర్ణాః క్షత్ర ద్విజోత్తరాః **23**

అ. యశస్వినః = కీర్తివంతులు; మహాశీలాః = మహాయజ్ఞానుష్ఠాన శీలురు; స్వాధ్యాయ = వేదము యొక్క; అధ్యయనే = అధ్యయనము నందు; రతాః = అసక్తులు; ఆఢ్యాః = ధనవంతులు; కుటుంబినః = కుటుంబము కలవారు; దృప్తాః = గర్వము కలవారు; వర్ణాః = బ్రాహ్మణాది వర్ణములు; క్షత్ర ద్విజోత్తరాః = క్షత్రియులు బ్రాహ్మణులు ప్రధానముగా గలవారు.

తా. ఆ ద్వాపరయుగమునందు ప్రజలు కీర్తిమంతులు యజ్ఞానుష్ఠాన శీలురు,వేదాధ్యయనమునందు అసక్తికలవారు,ధనవంతులు,కుటుంబము కలవారు,గర్వము కలవారు త్రైవర్ణముల లో బ్రాహ్మణ క్షత్రియులు ముఖ్యులుగా ఉందురు.

**శ్లో. కలౌ తు ధర్మపాదానాం తుర్యాంశోఽధర్మహేతుభిః**
**ఏధమానైః క్షీయమాణో హ్యంతే సోఽపి వినఙ్క్ష్యతి 24**

అ. కలౌతు=కలియుగము నందైతేనో; ధర్మపాదానాం=ధర్మపాదములయొక్క; తుర్యాంశః=నాలుగవ భాగము మిగులును. ఏధమానైః=వృద్ధినొందుచున్న; అధర్మహేతుభిః=అధర్మలక్షణములచే; క్షీయమాణః=తగ్గిపోవుచు; అంతే=చివరకు; సోఽపి=ఆ నాలుగవ భాగము కూడా; వినఙ్క్ష్యతి=నశించిపోవును.

తా. కలియుగమునందు ధర్మపాదములైన తపస్సు సత్యము దయ దానములలో నాలుగవ భాగము మిగులును. చివరకు పెరుగుచున్న అధర్మ లక్షణములతో ఆ నాలుగవ భాగము కూడా నశించి పోగలదు.

**శ్లో. తస్మిన్ లుబ్ధా దురాచారా నిర్దయాః శుష్కవైరిణః**
**దుర్భగా భూరితర్షాశ్చ శూద్రదాశోత్తరాః ప్రజాః 25**

అ. తస్మిన్=ఆకలియుగము నందు; ప్రజాః=ప్రజలు; లుబ్ధాః=పిసినారులు, (ధనము నందు ఆశ గలవారు) దురాచారాః=చెడు ఆచారము గలవారు; నిర్దయాః=దయ లేనివారు; శుష్కవైరిణః=నిష్కారణ వైరము గలవారు; దుర్భగాః=నీచులు; భూరితర్షాశ్చ=ఎక్కువ ఆశగలవారును శూద్రదాశోత్తరాః=శూద్రులు బెస్తవారు ముఖ్యులుగా గలవారు.

తా. ఆ కలియుగము నందు ప్రజలు లోభముగలవారు, చెడు ఆచారముగలవారు, దయలేని వారు, అకారణ వైరము గలవారు, నీచులు, ఎక్కువ ఆశ గలవారు, శూద్రులు బెస్తవారు అధిక ప్రాధాన్యము గలవారుగా ఉందురు.

అవ. నాలుగు యుగములలో ఇంతటి భేదముండుటకు కారణమును అయిదు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. సత్త్వం రజస్తమ ఇతి దృశ్యంతే పురుషే గుణాః**
**కాలసంచోదితాస్తేవై పరివర్తంత ఆత్మని 26**

అ. సత్త్వం=సత్త్వము; రజః=రజస్సు, తమః=తమస్సు; ఇతి=అని; గుణాః=గుణములు; పురుషే=పురుషుని యందు; దృశ్యంతే=కన్పట్టుచున్నవి; కాల సంచోదితాః=కాలముచే ప్రేరితములైన; తే=ఆ గుణములు; ఆత్మని=పురుషుని యందు; పరివర్తంతే=వివిధముగా వర్తించుచున్నవి.

తా. పురుషులలో యుండెడి సత్త్వరజస్తమోగుణములు కాలముచే ప్రేరితములై ఆ పురుషునిలో వివిధ రీతులుగా వర్తించును.

**శ్లో. ప్రభవంతి యదా సత్త్వే మనో బుద్ధీంద్రియాణి చ**
**తదా కృతయుగం విద్యాత్ జ్ఞానే తపసి యద్రుచిః 27**

అ. యదా=ఎపుడు; సత్త్వే=సత్త్వగుణము నందు; మనః=మనస్సు; బుద్ధి=బుద్ధి; ఇంద్రియాణి చ=ఇంద్రియములు కూడా; ప్రభవంతి=అతిశయించి వర్తించునో; యత్=దేనివలన; జ్ఞానే=జ్ఞానమునందు; తపసి=తపస్సు నందు; రుచిః=అభిరుచి కలుగునో; తదా=అపుడు; కృతయుగం=కృతయుగముగా; విద్యాత్=తెలియవలయును

తా. ఎప్పుడైతే మనస్సు, బుద్ధి, ఇంద్రియములు సత్త్వగుణమునందు ప్రవర్తించి జ్ఞానమునందు తపస్సునందు అభిరుచి కలుగునో అపుడు కృతయుగమని తెలియవలయును.

శ్లో. యదా కర్మసు కామ్యేషు భక్తిర్యశసి దేహినాం
తదా త్రేతా రజోవృత్తి రితి జానీహి బుద్ధిమన్ 28

అ. బుద్ధిమన్ = ఓ బుద్ధిమంతుడా!; యదా = ఎపుడు; దేహినాం = మానవులకు; కర్మసు = కర్మలందు; కామ్యేషు = సంక్రమణాది పుణ్యకాలములందు; యశసి = కీర్తియందు; భక్తిః = భక్తి యుండునో; తదా = అపుడు; రజోవృత్తిః = రజోగుణము ప్రధానముగా గల; త్రేతా = త్రేతాయుగము; ఇతి = అని జానీహి తెలియుము.

తా. మానవులకు కర్మలందు, సంక్రమణ గ్రహణాది పుణ్యకాలము లందు, కీర్తియందు అభిరుచి కలుగునపుడు రజోగుణమునందు వర్తించు త్రేతాయుగమని తెలియుము.

శ్లో. యదా లోభ స్త్వసంతోషో మానో దంభో౽థ మత్సరః
కర్మణాం చాఽపి కామ్యానాం ద్వాపరం తద్రజ స్తమః 29

అ. యదా = ఎప్పుడు; లోభః = లోభము; అసంతోషః = సంతోషము లేకుండుట; మానః = గర్వము; దంభః = దంభము; అథ = అటులనే; మత్సరః = మత్సరము; కామ్యానాం = ఫలము కోరి చేయు; కర్మణాం = కర్మలతో అభిరుచి; తత్ = అది; రజస్తమః = రజోగుణము తమోగుణములు లు ప్రధానముగాగల ద్వాపరం = ద్వాపరయుగము.

తా. మానవులకు ధనమునందు ఆశ, అసంతోషము, ఉత్తములను అవమానించ వలయు ననెడి కోరిక గలగెడి గర్వము, దంభాచారము, మత్సరము, కామ్యకర్మలందు ఆసక్తి కలుగు నపుడు రజస్తమో గుణములు ప్రధానముగాగల ద్వాపరయుగమని తెలియవలయును.

శ్లో. యదా మాయా౽నృతం తంద్రీ నిద్రా హింసా విషాదనం
శోక మోహౌ భయం దైన్యం స కలిస్తామస స్స్మృతః 30

అ. యదా = ఎపుడు; మాయా = కపటము; అనృతం = అసత్యము; తంద్రీ = సోమరి తనము; నిద్రా = నిద్ర; హింసా = హింస; విషాదనం = ఆంతర దుఃఖము; శోకమోహౌ = శోకమోహములు; భయం = భయము; దైన్యం = దీనత్వము; సః = అది; తామసః = తమో గుణము ప్రధానముగా కల; కలిః = కలియుగముగా; స్మృతః = చెప్పబడినది. (తలచబడినది).

తా. ఎపుడు మోసము, అసత్యము, సోమరి తనము, నిద్ర, హింస, దుఃఖము, ఆంతర దుఃఖము, శోకము, మోహము, భయము, దైన్యము, కన్పట్టునో అది తమోగుణ ప్రధాన మైన కలియుగమని తెలియము.

అవ. కలిదోషములను తెలుపుచున్నారు.

శ్లో. యస్మాత్ క్షుద్ర దృశో మర్త్యాః క్షుద్ర భాగ్యా మహాశనాః
కామినో విత్తహీనాశ్చ స్వైరిణ్యశ్చ స్త్రియో౽సతీః 31

అ. యస్మాత్ = ఏ కలియుగ ప్రభావము వలన; మర్త్యాః = మానవులు; క్షుద్రదృశః = అల్ప జ్ఞానము కలవారు; క్షుద్రభాగ్యాః = మందభాగ్యులు; మహాశనాః = అతిభోజనులు; కామినః = కాముకులు

వి త్తహీనాశ్చ=ధనములేని వారు; స్త్రియః=స్త్రీలు; స్వైరిణ్యః=స్వేచ్ఛగా వర్తించువారుగా; అసతీః చెడు నడక గలవారుగా ఉందురు.

తా. ఈ కలిప్రభావము వలన మానవులు మందమతులు, మందభాగ్యులు, అతి భోజనులు, కాముకులు, ధనహీనులు అగుదురు స్త్రీలు స్వేచ్ఛావర్తనము కలవారు, చెడునడక గల వారుగా ఉందురు.

శ్లో. దస్యూత్కృష్టా జనపదా వేదా పాషండ దూషితాః
రాజానశ్చ ప్రజాభక్షాః శిశ్నోదర పరా ద్విజాః 32

అ. జనపదాః=దేశవాసులు; దస్యు+ఉత్కృష్టాః=చౌర్యము ఎక్కువగా కలవారు; వేదాః= వేదములు; పాషండ దూషితాః=నాస్తిక మతముతో దూషించబడినవి; రాజానశ్చ=రాజులు కూడా; ప్రజాభక్షాః=ప్రజలను పీడించువారు; ద్విజాః=బ్రాహ్మణాది వర్ణత్రయములోని వారు; శిశ్న+ ఉదరపరాః=శిశ్నమునకు; ఉదరమునకు సంతృప్తికై ప్రయత్నించు వారగుదురు.

తా. దేశవాసులలో చౌర్యస్వభావము పెరుగును. వేదములు నాస్తిక మతముతో దూషితములగును. రాజులు ప్రజలను పీడించు చుందురు. బ్రాహ్మణాది వర్ణత్రయములోనివారు శిశ్నమునకై ఉదరపోషణకై ప్రయత్నించుచుందురు.

శ్లో. అవ్రతా వటవోఽశౌచా భిక్షవశ్చ కుటుంబినః
తపస్వినో గ్రామవాసా న్యాసినోఽత్యర్థ లోలుపాః 33

అ. వటవః=బ్రహ్మచారులు; అవ్రతాః=విహితమైన ఆచారము లేనివారు; అశౌచాః=అపరిశుద్ధులు; కుటుంబినః=గృహస్థులు; భిక్షవః=భిక్షాటన చేయువారు; తపస్వినః=వానప్రస్థులు; గ్రామవాసాః=గ్రామము లందుండు వారుగా; న్యాసినః=సన్యాసులు; అత్యర్థలోలుపాః=మిక్కిలి అర్థము నందు ఆశగలవారు.

తా. ఈ కలియుగమున బ్రహ్మచారులు వేదవిహితాచార శూన్యులగుదురు. గృహస్థులు తాము భిక్ష ఇచ్చుట మాని తామే భిక్షాటన చేయుదురు. వానప్రస్థులు వనములో నివసించుట మాని గ్రామములో నివసించెదరు. సన్యాసులు అర్థకామములను వదలక ఎక్కువ అర్థము నందు ఆశ కలవారగుదురు.

అవ. కలియుగము నందలి స్త్రీల స్వరూపమును తెలుపు చున్నారు.

శ్లో. హ్రస్వకాయా మహాహారా భూర్యపత్యా గతహ్రియః
స్త్రియః కటుక భాషిణ్య శ్చౌర్య మాయోరు సాహసాః 34

అ. స్త్రియః=స్త్రీలు; హ్రస్వకాయాః=కురుచైనట్టి శరీరము కలవారు; (పొట్టివారు) మహా+ ఆహారాః=తిండి పోతులు; భూర్యపత్యాః=ఎక్కువ సంతానము గలవారు; గతహ్రియః=సిగ్గు వదలినవారు, కటుకభాషిణ్యః=పరుషముగా మాటలాడువారు; చౌర్య=దొంగతనము; మాయా= మోసము; ఉరుసాహసాః=అతిసాహసము గలవారు.

తా. కలియుగము నందలి స్త్రీలు పొట్టివారు, తిండిపోతులు, అతి సంతానముగలవారు, సిగ్గువిడినవారు, పరుషముగా మాటలాడువారు, దొంగతనము మోసము అతి సాహసము గల వారుగా ఉండెదరు

శ్లో. పణయిష్యంతి వై క్షుద్రాః కిరాటాః కూటమాయినః
అనాపద్యపి మన్యంతే వార్తాం సాధు జుగుప్సితామ్ 35

అ. క్షుద్రాః = నీచ స్వభావము గలవారు; కిరాటాః = వణిజులు; కూటమాయినః = కపటము మోసము చేయువారు; పణయిష్యంతి = క్రయ విక్రయాది వ్యాపారము చేసెదరు. అనాపద్యపి = ఆపదలేనపుడు కూడా; జుగుప్సితాః = నిందించబడు; వార్తాం = వృత్తిని; సాధు = మంచిదిగా; మన్యంతే = తలచెదరు

తా. నీచస్వభావము గలిగి కపటము మోసము చేయువారు క్రయ విక్రయాదికమును నిర్వహించెదరు. ఆపదలేనపుడు కూడా నిందితమైన వృత్తినే మంచిదిగా భావింతురు.

శ్లో. పతిం త్యక్ష్యంతి నిర్ద్రవ్యం భృత్యా అప్యఖిలోత్తమం
భృత్యం విపన్నం పతయః కౌలం గా శ్చాపయస్వినీః 36

అ. అఖిలోత్తమం + అపి = అందరిలో ఉత్తముడైనను; నిర్ద్రవ్యం = ధనహీనుడైన; పతిం = యజమానిని; భృత్యాః = సేవకులు; త్యక్ష్యంతి = వదిలి వెళ్ళెదరు. కౌలం = కుల పరంపరగా వచ్చుచున్న; భృత్యం = సేవకుని; విపన్నం = రోగాదులతో సేవ చేయలేని వానిని; పతయః = యజమానులు; (వదిలెదరు) అపయస్వినీః = పాలీయని; గాశ్చ = ఆవులను కూడా విడిచెదరు.

తా. ఎంత ఉత్తముడైన యజమానియైనను ధనహీనుడైన యజమానిని సేవకులు వదిలివేతురు. అటులనే కులపరంపరగా వచ్చు సేవకుని కూడా రోగాదులతో సేవ చేయలేకున్నచో యజమాని వదలును. పాలీయని ఆవులను కూడా వదిలివేతురు.

శ్లో. పితౄన్ భ్రాతౄన్ స్వ స్వార్జ్ఞా తీన్ హిత్వా సౌరత సౌహృదాః
ననాంద్ర స్యాల సంవాదా దీనా స్త్రైణాః కలౌ నరాః 37

అ. కలౌ = కలియుగము నందు; నరాః = మానవులు; సౌరత సౌహృదాః = సురతము (స్త్రీ సమాగమము) కొఱకై స్నేహమును పెంచుకొనువారై; పితౄన్ = తండ్రులను; భ్రాతౄన్ = సోదరులను, స్వస్రూః = అక్కచెల్లెళ్ళను; జ్ఞాతీన్ = బంధువులను; హిత్వా = వదిలి; ననాంద్ర = మరదలు (భార్య చెల్లెలు)తో; స్యాల = బావమరదులతో = సంవాదాః = మంత్రాలోచన చేయు వారుగా; దీనాః = దీనులు; స్త్రైణాః = స్త్రీలోలురు.

తా. కలియుగము నందలి మానవులు సురతము (స్త్రీమాగమము)కొఱకై స్నేహము చేసెదరు. తండ్రులను, సోదరులను, అక్కాచెల్లెళ్ళను. బంధువులను, వదలి, భార్యచెల్లెళ్ళతో భార్య సోదరులతో ఆలోచన చేయుదురు. సురతము లభించనిచో దీనులగుదురు. స్త్రీలోలురుగా ఉందురు.

శ్లో. శూద్రా ప్రతిగ్రహిష్యంతి తపోవేషోపజీవినః
ధర్మం వక్ష్యంత్య ధర్మజ్ఞా అధిరుహ్యోత్తమాసనమ్ 38

అ. తపోవేష = తాపస వేషముతో; ఉపజీవినః = బ్రతుకు తెరువునుగడుపు; శూద్రాః = శూద్రులు ప్రతిగ్రహిష్యంతి = దానమును తీసుకుందురు; అధర్మజ్ఞాః = ధర్మ తత్త్వము తెలియనివారు; ఉత్తమాసనం = ఉత్తమాసనమును; అధిరుహ్య = అధిష్ఠించి; ధర్మం = ధర్మమును; వక్ష్యంతి = చెప్పగలరు

తా. తాపసవేషముతో బ్రతుకును వెళ్ళబుచ్చు శూద్రులు దానమును స్వీకరించెదరు. ధర్మము తెలియని వారే ఉత్తమాసన మధిరోహించి ధర్మమును చెప్పెదరు.

శ్లో. నిత్యముద్విగ్న మనసో దుర్భిక్ష భయ కర్శితాః
నిరన్నే భూతలే రాజన్! అనావృష్టి భయాతురాః 39

అ. రాజన్! = ఓ పరీక్షిన్మహా రాజా!; అనావృష్టి భయాతురాః = అనావృష్టిభయముతో పీడించబడినవారై; దుర్భిక్ష భయకర్శితాః = కరువు భయముతో కృశించినవారై నిరన్నే = అన్నములేని; భూతలే = భూమియందు; నిత్యం = ఎల్లపుడు; ఉద్విగ్నహృదయాః = కలత చెందిన మనసు కలవారగుదురు.

తా. అనావృష్టితో కరువుతో పీడించబడిన మానవులు ఆహారము దొరకక ఈ భూమి మీద ఎప్పుడూ కలత చెందు చుందురు

శ్లో. వాసోఽన్నపాన శయన వ్యవాయ స్నాన భూషణైః
హీనా పిశాచ సందర్శా భవిష్యంతి కలౌ ప్రజాః 40

అ. కలౌ = కలియుగమునందు; ప్రజాః = ప్రజలు; వాస = వస్త్రములచే; అన్న = అన్నముచే; పాన = నీరుచే; శయన = పడకచే; వ్యవాయ = సంగమముచే; స్నాన = స్నానముచే; భూషణైః = అలంకారములచే, హీనాః = రహితులై; పిశాచసందర్శాః = పిశాచములవలెకనవడువారుగా; భవిష్యంతి = కాగలరు.

తా. కలియుగమునందలి ప్రజలు వస్త్రము, అన్నము, పానము. శయనము, సంగమము స్నానము, అలంకారములు లేనివారై పిశాచముల వలె కనపడెదరు.

శ్లో. కలౌ కాకణికేఽప్యర్థే నిగృహ్య త్యక్త సౌహృదాః
త్యక్ష్యంతి హి ప్రియాన్ ప్రాణాన్ హనిష్యంతి స్వకానపి 41

అ. కలౌ = కలియుగమునందు; కాకణికే = (20) ఇరువది గవ్వల విలువగల; అర్థేఽపి = ద్రవ్య విషయములో కూడా; త్యక్త సౌహృదాః = స్నేహమును వీడినవారై; నిగృహ్య = విరోధము తెచ్చుకొని; ప్రియాన్ = ప్రీతికరములైన; ప్రాణాన్ = ప్రాణములను; త్యక్ష్యంతి = విడిచెదరు; స్వకాన్ = అపి = తన వారిని కూడా; హనిష్యంతి = చంపెదరు

తా. కలియుగములోని మానవులు ఇరువది గవ్వల విలువగల విత్తమునకై కూడా స్నేహమును విడిచి అత్యంత ప్రియములైన ప్రాణములను విడుతురు. తనవారిని కూడా చంపుకొందురు.

శ్లో. న చ రక్షంతి మనుజా స్థ్సవిరౌ పితరావపి
పుత్రాన్భార్యాశ్చ కులజా క్షుద్రా శ్శిశ్నోదరంభరాః 42

అ. మనుజాః = మానవులు; స్థవిరౌ = ముసలివారైన; పితరావపి = తలిదండ్రులను కూడా; నరక్షంతి = కాపాడరు; కులజాః = మంచి కులములోని; భార్యాః = భార్యలను; పుత్రాంశ్చ = పుత్రులను కూడా; శిశ్న + ఉదరంభరాః = స్త్రీసంగమమునందు; కడుపు నింపుకొనుటయందు ఆసక్తి కలవారై, నరక్షంతి = కాపాడరు.

తా. కలియుగమున మానవులు స్త్రీ సంగమమునందు పొట్ట, నింపుకొనుటయందు ఆసక్తులై వృద్ధులైన తల్లిదండ్రులను, కుల స్త్రీలగు భార్యలను, పుత్రులను కూడా పోషించరు.

అవ. గొప్ప అనర్థమును అన్యాయమును రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

శ్లో. కలౌ న రాజన్ జగతాం పరం గురుం త్రిలోక నాథానత పాద పంకజమ్
ప్రాయేణ మర్త్యా భగవంత మచ్యుతం యక్ష్యంతి పాషండ విభిన్న చేతసః **43**

అ. రాజన్! = ఓ పరీక్షిన్మహా రాజా!; జగతాం = జగత్తులకు; పరం = ఉన్నతుడైన; గురుం = గురువైన; త్రిలోకనాథ = మూడులోకములకు ప్రభువైన బ్రహ్మచేత; ఆనత = నమస్కరించబడిన; పాదపంకజం = పాదపద్మములు గల; భగవంతం = భగవంతుడైన; అచ్యుతం = శ్రీమన్నారాయణుని; పాషండ = నాస్తికులచేత; విభిన్న = భేదించబడిన; చేతసః = మనస్సుగల; మర్త్యాః = మానవులు; ప్రాయేణ = తరచుగా; న యక్ష్యంతి = పూజించరు.

తా. ఓ పరీక్షన్మహారాజా! ఈ కలియుగము నందలి మానవులు నాస్తికులచే భేదించబడిన మనసు గలవారై, ఈ ప్రపంచమున ఉన్నతుడు, జగములకు గురువు, త్రిలోకాధీశ్వరుడైన బ్రహ్మచే కూడ నమస్కరింపబడు శ్రీమన్నారాయణుని పూజింపరు.

శ్లో. యన్నామధేయం మ్రియమాణ ఆతురః పతన్ స్ఖలన్వా వివశో గృణన్నరః
విముక్త కర్మార్గళ ఉత్తమాం గతిం ప్రాప్నోతి యక్ష్యంతి న తం కలౌజనాః **44**

అ. మ్రియమాణః = చనిపోవుచు; ఆతురః = రోగముచే బాధపడుచున్న; పతన్ = పడుచు; స్ఖలన్ = జారుచు; వివశః = వశములో లేకను; నరః = మానవుడు; యన్నామధేయం = ఏ భగవంతుని పేరును గృణన్ = తలుచుచు; విముక్త = విడువబడిన; కర్మార్గళః = కర్మ బంధములు గలవాడై; ఉత్తమాం గతిం = పరమ పదమును; ప్రాప్నోతి = పొందునో; తం = ఆ భగవంతుని; కలౌ = కలియుగమునందు; జనాః = జనులు; న యక్ష్యంతి = పూజించరు.

తా. మానవుడు చనిపోవుచు, రోగార్తుడై పడుచు, జారుచు, వశము తప్పుచు ఒకసారి పేరు పలికినంత మాత్రముననే అన్ని కర్మబంధములను బోనాడి పరపదమును జేర్చు భగవంతుని ఈ కలియుగములోని మానవులు పూజించరు. ఇది ఎంత అన్యాయమో చూడుడు అని భావము.

అవ. ఇటుల కలిదోషములను తెలిపి ఇపుడు ఆ దోషములనుండి తప్పుకొను ఉపాయమును ఆరు శ్లోకములతో చెప్పుచున్నారు.

శ్లో. పుంసాం కలి కృతాన్దోషాన్ ద్రవ్య దేశాత్మ సంభవాన్
సర్వాన్ హరతి చిత్తస్థో భగవాన్ పురుషోత్తమః **45**

అ. చిత్తస్థః = చిత్తమున స్ఫురించిన; భగవాన్ = భగవంతుడగు; పురుషోత్తమః = శ్రీమన్నారాయణుడు; పుంసాం = పురుషులయొక్క; కలికృతాన్ = కలిప్రభావముచే కలిగిన; ద్రవ్యదేశాత్మ సంభవాన్ = అన్నాది ద్రవ్యములచేత; కీకటాది దేశములచేత; ఇంద్రియముల చేత కలిగిన; సర్వాన్ = అన్ని; దోషాన్ = దోషములను; హరతి = హరించును.

తా. మానవులను కలి ప్రభావమువలన కలిగెడు దోషములను, నిషిద్ధమైన ద్రవ్యములను దేశమును సేవించుట వలన, ఇంద్రియములు వలన కలిగెడు అన్ని దోషములను ఒకసారి చిత్తమున స్ఫురించిన శ్రీమన్నారాయణుడు హరించును.

**శ్లో. శ్రుత స్సంకీర్తితో ధ్యాతః పూజితశ్చాదృతోఽపివా**
**నృణాం ధునోతి భగవాన్ హృత్స్థో జన్మాయుతాఽశుభమ్ 46**

అ. శ్రుతః = వినినను; సంకీర్తితః = కీర్తించినను; ధ్యాతః = ధ్యానించినను; పూజితః = పూజించినను; ఆదృతోఽపివా = ఆదరించినను; హృత్స్థః = హృదయమున ఉండెడి; భగవాన్ = భగవంతుడు; నృణాం = మానవుల యొక్క; జన్మాయుతాశుభమ్ = పదివేల జన్మల దోషములను; ధునోతి = తొలగించును,

తా. హృదయమున ఉన్న భగవంతుని ఒకసారి వినినను, కీర్తించినను, ధ్యానించినను, పూజించినను. ఆదరించినను, పదివేల జన్మలనుండి ఉండెడి దోషములను హరించును.

అవ. ఇదికాక దోషములను బోనాడు మరియొక యుపాయము లేదని దృష్టాంతముతో చెప్పుచున్నారు.

**శ్లో. యథా హేమ్ని స్థితో వహ్నిః దుర్వర్ణం హంతి ధాతుజం**
**ఏవ మాత్మగతో విష్ణు ర్యోగినా మశుభాశయమ్ 47**

అ. యథా = యే ప్రకారముగా; హేమ్ని = బంగారమునందు; స్థితః = ఉన్న; వహ్నిః = అగ్ని; ధాతుజం = ఇతరములైన తామ్రము మొదలగు వాటి వలన కలిగెడు; దుర్వర్ణం = మాలిన్యమును; హంతి = హరించునో; ఏవం = ఇటులనే. ఆత్మగతః = మనసుననుండు; విష్ణుః = విష్ణువు; యోగినాం = యోగుల యొక్క; అశుభాశయం = చెడు తలపును; హంతి = పోనాడును.

తా. బంగారమున అగ్ని అ బంగారమున రాగి మొదలగు ఇతరలోహముల వలన కలిగిన మాలిన్యమును బోనాడునో ఆటులే మనసులో ఉండెడి శ్రీమన్నారాయణుడు యోగుల చెడు తలపును తొలగించును.

**శ్లో. విద్యా తపః ప్రాణ నిరోధమైత్రీ తీర్థాభిషేక వ్రతదాన జప్యైః**
**నాత్యంత శుద్ధిం లభతేఽంతరాత్మా యథా హృదిస్థే భగవత్యనంతే 48**

అ. విద్యా = నానాదేవతోపాసనచే; తపః = తపస్సుతో; ప్రాణ నిరోధ = ప్రాణాయామముతో; మైత్రీ = అహింసచే; తీర్థాభిషేక = పుణ్య తీర్థములలో స్నానముచే; వ్రత = ఏకాదశ్యాది వ్రతములచే; దాన = దానములచే; జప్యైః = జపములచే; అంతరాత్మా = మనస్సు; అత్యంత శుద్ధిం = మిక్కిలి శుద్ధిని; నలభతే = పొందదు. యథా = ఏ విధముగా; భగవతి = భగవంతుడగు; అనంతే = శ్రీమన్నారాయణుడు; హృదిస్థే = హృదయమున నుండగా (పొందునో).

శ్రీమన్నారాయణుడు హృదయమున ఉన్నపుడు మనస్సు ఎట్లు శుద్ధి పొందునో అట్లు నానాదేవతోపాసనతో, తపస్సుతో, ప్రాణాయామముతో, అహింసతో, తీర్థస్నానముతో, ఏకాదశ్యాది వ్రతములతో, దానములతో, జపములతో ఆత్యంత శుద్ధిని పొందదు.

**శ్లో. తస్మాత్సర్వాత్మనా రాజన్: హృదిస్థం కురు కేశవమ్**
**మ్రియమాణోఽవ్యవహిత స్తతోయాతి పరాంగతిమ్ 49**

అ. రాజన్ = ఓ పరీక్షిన్మహారాజా!; తస్మాత్ = అందువలన; సర్వాత్మనా = అన్ని విధములుగా; కేశవం = శ్రీమన్నారాయణుని; హృదిస్థం = హృదయమున ఉన్న వానినిగా; కురు = చేయుము;

మ్రియమాణః = చనిపోవుచును; అ వ్యవహితః = ఎడతెగక ధ్యానించినచో; తతః = అధ్యానము వలన; పరాం గతిం = పరమ పదమును; యాతి = పొందును.

తా. ఓ పరీక్షన్మహా రాజా! అందువలన అన్నివిధములుగా శ్రీమన్నారాయణుని హృదయమున ఉంచుకొనుము. చనిపోవు వాడైనను ఎడతేగక హరిని ధ్యానించినచో పరమ పదమును పొందును,

**శ్లో. మ్రియమాణై రభిధ్యాతో భగవాన్ హరిరీశ్వరః**
**ఆత్మభావం నయత్యంగ సర్వాత్మా సర్వ సంభవః** **50**

అ అంగ = ఓయీ!; మ్రియమాణైః = చనిపోవు వారిచే; అభిధ్యాతః = ధ్యానము చేయబడిన; భగవాన్ = భగవంతుడగు; ఈశ్వరః = ప్రభువగు; సర్వాత్మా = జీవులందరికి ఆత్మయగు; సర్వ సంభవః = ప్రపంచమునకు మూలకారణమగు; హరిః = శ్రీమన్నారాయణుడు; ఆత్మభావం = స్వస్వరూపమును; నయతి = పొందించును.

తా. ఓ రాజా! చనిపోవువారు ప్రార్థించినచో సర్వజగత్కారణుడు సర్వాత్మయగు శ్రీమన్నారాయణుడు స్వ స్వరూపమును పొందించును.

అవ. ఇపుడు రెండు శ్లోకములతో కలినిస్తుతించుచున్నారు.

**శ్లో. కలేర్దోష నిధే రాజ న్నస్తి హ్యేకో మహాగుణః**
**కీర్తనాదేవ కృష్ణస్య ముక్త బంధః పరం వ్రజేత్** **51**

అ. రాజన్ = ఓ రాజా ! దోషనిధేః = దోషము లకు నిలయమైన; కలేః = కలికి; ఏకః = ఒక; మహాగుణః = గొప్పగుణము; అస్తి = ఉన్నది; కృష్ణస్య = శ్రీకృష్ణునియొక్క; కీర్తనా దేవ = సంకీర్తనము వలననే; ముక్తబంధః = సంసార బంధమునుండి విడివడి; పరం = పరమపదమును; వ్రజేత్ = పొందును.

తా. ఓ రాజా! అన్ని దోషములకు నిలయమైన కలికి ఒక గొప్ప గుణమున్నది. శ్రీ కృష్ణుని నామ సంకీర్తనము వలననే సంసార బంధము తొలగి మోక్షమును బొందును.

**శ్లో. కృతేయద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః**
**ద్వాపరే పరి చర్యాయాం కలౌ తద్ధరి కీర్తనాత్** **52**

అ. కృతే = కృతయుగమునందు; విష్ణుం = విష్ణువును; ధ్యాయతః = ధ్యానించువానికి; త్రేతాయాం = త్రేతాయుగమునందు; మఖైః = యజ్ఞములతో; యజతః = పూజించువానికి; ద్వాపరే = ద్వాపరయుగమునందు; పరిచర్యాయాం = సేవించుటలో; యత్ = ఏ ఫలము సిద్ధించునో, తత్ = ఆ ఫలము; కలౌ = కలియుగమునందు; హరికీర్తనాత్ = హరికీర్తనవలన కలుగును.

---

వ. అనిన శుకయోగీన్ద్రునకు రాజేంద్రుండిట్లనియె. కలియుగంబతిపాప సమ్మిశితంబు గాన దురితంబు లేలాగున నరులొంద కుండెదరు ? కాలంబే క్రమమున నడచు ? గాల స్వరూపకుండయిన హరి ప్రభావంబెలాగునంగానఁబడు. ఈ జగజ్జాలం బెవ్విధంబున నిలుచు. అని యడిగిన, రాజునకు శుక యోగీన్ద్రుండిట్లనియె. కృతత్రేతా ద్వాపర కలియుగంబులను యుగచతుష్టయంబును, క్రమముగా ప్రవర్తించు. ధర్మంబునకు సత్యదయా తపోదానంబులు నాలుగు పాదంబులై నడచు శాంతిదాంతి వర్ణాశ్రమాచారంబులు మొదలయినవి కలిగి, ధర్మంబు మొదటి యుగంబున నాలుగు పాదంబులం బరిపూర్ణంబై

తా. కృతయుగమున విష్ణువును ధ్యానించు వానికి, త్రేతాయుగమున యజ్ఞము చేయు వానికి, ద్వాపరయుగమున పరిచర్య చేయువానికి కలుగు ఫలితము కలియుగమున హరికీర్తన చేయువానికి లభించును.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
తృతీయోఽధ్యాయః

ఇది శ్రీ మద్భాగవతమున ద్వాదశ స్కంధమున
**మూ**డవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్

---

ప్రవర్తిల్లు. శాంతిదాంతి కర్మాచరణాది రూపంబగు ధర్మంబు మూడుపాదంబుల రెండవ యుగంబునం బ్రవర్తిల్లు. విప్రార్చనాహింసావ్రత జపానుష్ఠానాది లక్షణంబులు కలిగి ధర్మంబు రెండు పాదంబుల **మూ**డవయుగంబునం దేజరిల్లు. మరియు, జనులు కలియుగంబున ధర్మరహితులును, అన్యాయ కారులును, క్రోధ మాత్సర్య లోభ మోహాది దుర్గుణ విశిష్టులును, వర్ణాశ్రమాచార రహితులును, దురాచారులును, దురన్న భక్షకులును, శూద్ర సేవారతులును, నిర్దయులును, నిష్కారణ వైరులును, దయా సత్య శౌచాది విహీనులును, ననృతవాదులును, మాయోపాయులును, ధనవిహీనులును, దోషైకదృక్కులును నై పాపచరితులగు రాజుల సేవించి, జననీ జనక సుత సోదర బంధు దాయాద సుహృజ్జనులం బరిత్యజించి, సురతాపేక్షులై, కులంబులం జెరుపు చుండెదరు మఱియు, క్షామడాంబరంబులం బ్రజాక్షయంబగు, బ్రాహ్మణులు దుష్ప్రతిగ్రహ విహారులై యజ్ఞాదికర్మంబులు పరార్థ పరులై చేయుచు హీనులై నశించెదరు. అట్లుగాన, నీకలియుగంబున నొక్క ముహూర్త మాత్రంబయిన నారాయణ స్మరణ పరాయణులై మనంబున శ్రీ నృసింహవాసుదేవ సంకర్షణాది నామంబుల నచంచల భక్తి దలంచెడు వారలకు గ్రతుశతఫలంబు గలుగు. అట్లుగావున రాజశేఖరా! నీ మది ననవరతంబు హరి దలంపుము. కలియనేక దురితాలయంబు గాన నొక్క నిమిషమాత్రంబు ధ్యానంబు చేసినం బరమ పావనత్వంబు నొంది కృతార్థుండ వగుదువు, అని పలికి మఱియును. 20

కం. **మూ**డవ యుగమున నెంతయు వేడుక హరికీర్తనంబు వెలయగ లెస్సన్
బాడుచు గృష్ణా! యనుచుం గ్రీడింతురు కలిన దలచి కృతమతులగుచున్. 21

# చతుర్థోఽధ్యాయః

## నాలుగవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**శ్లో. చతుర్థేతు చతుర్థోక్తా లయా నైమిత్తికాదయః**
**తత్ర సంసార విస్తారో హరి కీర్త్యైవ వర్ణ్యతే.**

తా. ఈ నాలుగవ అధ్యాయమందు నైమిత్తికాది ప్రళయము నాలుగు విధములుగ చెప్పబడును. అందు సంసారవిస్తారము హరికీర్తిచే వర్ణింపబడును.

అవ. హరినామ సంకీర్తనమే అన్ని కలిదోషములను నివర్తించును అని, హరినామ సంకీర్తనమే పరమధర్మమని మొదట అడిగిన రెండు ప్రశ్నలకు సమాధానము చెప్పబడినది. ఇదికాక ప్రళయము యొక్క ప్రమాణమును చెప్పుమని కల్పము యొక్క ప్రమాణము చెప్పుమని అడిగిన ఇతర ప్రశ్నలకు ఇపుడు తృతీయస్కంధమున చెప్పిన కాలమానమును అనువదించి చెప్పుచున్నారు. అచట అనగా తృతీయ స్కంధమున "సకాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతాం" అని మొదలిడి కాలము చెప్పబడినది. "చత్వారి త్రీణి ద్వే చైకం కృతాదిషు యథాక్రమం, సంఖ్యాతాని సహస్రాణి ద్విగుణాని శతాని చ" అని యుగమానము కూడా చెప్పబడినది. దానినే ఇందు అనువదించు చున్నారు,

**శ్లో. కాలస్తే పరమాణ్వాది ర్ద్విపరార్థా వధిర్నృప**
**కథితో యుగమానం చ శృణు కల్పలయావపి** **1**

అ. నృప ! = ఓ రాజా ! పరమాణు + ఆదిః = పరమాణువు మొదలుకొని; ద్విపరార్ధావధిః = రెండు పరార్థములు హద్దుకాగల; కాలః = కాలము; తే = నీకు; కథితః = చెప్పబడినది; యుగమానం = యుగప్రమాణమును; కల్పలయావపి = కల్పము లయములను కూడా; శృణు = వినుము.

తా. ఓ రాజా! పరమాణువు మొదలు రెండు పరార్థములు అవధిగా గల కాల ప్రమాణమును నీకు ఇదివరకే చెప్పితిని. ఇపుడు యుగ ప్రమాణమును కల్పలయములను కూడా ఇది వరకు చెప్పిన వాటినే అనువాదము చేసెదను వినుము. వాటిలో మొదటిది అయిన

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కృతయుగము | సంధి | సంధ్యంశలు | చేరి | —4800 | దివ్యసంవత్సరములు | |
| త్రేతా యుగము | ,, | ,, | ,, | 3600 | ,, | ,, |
| ద్వాపరయుగము | ,, | ,, | ,, | 2400 | ,, | ,, |
| కలియుగము | ,, | ,, | ,, | 1200 | ,, | ,, |
| | | | | 12000 | | |

ఇటుల నాలుగు యుగముల ప్రమాణము 12 వేల దివ్యసంవత్సరములని నీకు మొదటనే చెప్పి యుంటిని. ఇపుడు కల్పమానము ప్రళయమును వాని ప్రమాణమును చెప్పెదను వినుము.

అవ. వాటిలో మొదట కల్పమానమును తెలుపు చున్నారు.

**శ్లో. చతుర్యుగ సహస్రంతు బ్రహ్మణో దినముచ్యతే**
**స కల్పో యత్ర మనవ శ్చతుర్దశ విశాంపతే** **2**

అ. విశాంపతే ! = ఓ రాజా ! ; చతుర్యుగ సహస్రం = నాలుగు యుగములు వేయిమార్లు ఆవృత్తమగుట; బ్రహ్మణః=బ్రహ్మకు; దినం=ఒకరోజు; ఉచ్యతే=చెప్పబడును. సః=అది; కల్పః=కల్పము; యత్ర=యే కల్పమున; చతుర్దశ=పదునాలుగుమంది; మనవః=మనువులు (పాలింతురు)

తా. కల్పము రెండు విధములు. దైనందిన కల్పము, మహా కల్పము అని. వాటిలో మొదటిదైన దైనందిన కల్పము ఇచట చెప్పబడుచున్నది. ఓ రాజా! నాలుగు యుగములు వేయిమార్లు అవృత్తమగునపుడు బ్రహ్మకు ఒక దినమని చెప్పబడినది. ఈ సమయముననే 14 మంది మనువులు భూమని పరిపాలింతురు. ఈ సమయమునే కల్పమందురు.

అవ. ప్రళయము నాలుగు విధములు. నైమిత్తికము. ప్రాకృతికము. అత్యంతికము, నిత్యము, అని వాటిలో నైమిత్తిక ప్రళయమును ప్రమాణములను రెండు శ్లోకములతో చెప్పు చున్నారు.

**శ్లో. తదంతే ప్రళయస్తావాన్ బ్రాహ్మీ రాత్రి రుదాహృతా**
**త్రయో లోకా ఇమే యత్ర కల్పంతే ప్రళయాయ హి** **3**

అ. తదంతే=ఆ కల్పము చివర; ప్రళయః = ప్రళయము; తావాన్ = అంత ప్రమాణమే. అనగా 4 యుగముల సహస్రకాలము. బ్రాహ్మీ=బ్రహ్మయొక్క; రాత్రిః=రాత్రియని; ఉదాహృతా= చెప్పబడినది. యత్ర = ఏ కాలమందు; ఇమే = ఈ; త్రయః = మూడు; లోకాః = లోకములు; ప్రళయాయ=ప్రళయముకొఱకు; కల్పంతే హి=పాల్పడును గదా.

తా. ఆ కల్పము పూర్తిఅయినంత మరి అంత ప్రమాణము అనగా 4 యుగ సహస్ర ముల కాలము బ్రహ్మదేవునికి రాత్రియగును. ఈ రాత్రియందు మూడు లోకములు ప్రళయ మునకు గురియగును.

అవ. పైన చెప్పబడిన ప్రళయము నైమిత్తికము అని తెలుపుచున్నారు

**శ్లో. ఏషనైమిత్తికః ప్రోక్తః ప్రళయో యత్ర విశ్వసృట్**
**శేతేఽనంతాసనో విశ్వ మాత్మసాత్కృత్య చాత్మభూః** **4**

అ. ఏషః=ఈ; ప్రళయః=ప్రళయము; నైమిత్తికః=నైమిత్తికము అని; ప్రోక్తః=చెప్ప బడినది. యత్ర=ఏనైమిత్తిక ప్రళయమునందు; విశ్వసృట్=విశ్వమును సృజించువాడు; ఆత్మభూః= తనకు తానుగా పుట్టువాడగు బ్రహ్మః విశ్వం=ప్రపంచమును; ఆత్మసాత్కృత్య=తనలోకి ఉప సంహరించుకొని; అనంతాసనః=ఆదిశేషుడు పీఠముగలవాడై; శేతే=పరుండును. (నిద్రించును)

తా. ఇది నైమిత్తికమను ప్రళయము. ఇందు విశ్వస్రష్ట స్వయంభువు ఆగు నారాయణుడు సర్వప్రపంచమును తనలో నిముడ్చుకొని ఆది శేషాసనమందు పరుండి నిద్రించును.

అవ. ప్రాకృతిక ప్రళయమును రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. ద్విపరార్ధే త్వతిక్రాంతే బ్రహ్మణః పరమేష్ఠినః**
**తదా ప్రకృతయ స్సప్త కల్పతే ప్రళయాయహి. 5**

అ. పరమేష్ఠినః=అన్నిటికిపైనున్న; బ్రహ్మణః=బ్రహ్మకు; ద్విపరార్ధే = పగలురాత్రియను రెండు పరార్ధముల కాలము; అతిక్రాంతే తు=దాటినది కాగా:తదా=అపుడు; సప్తప్రకృతయః=ఏడు ప్రకృతులు; అనగా మహత్తు, అహంకారము, పంచభూతములు. ప్రళయాయ = ప్రళయమునకు కల్పతే హి=లోనగును.

తా. అన్ని లోకములకు పైనున్న సత్యలోకమున నున్న బ్రహ్మదేవునికి పగలు రాత్రియైన రెండు పరార్ధముల కాలము దాటినంతనే బ్రహ్మ ఆయుపు పూర్తి అయినంతనే మహదహంకారములు పంచభూతములను సప్త ప్రకృతులు ప్రళయమునకు లోనగును.

**శ్లో. ఏష ప్రాకృతికో రాజన్ ప్రళయో యత్ర లీయతే**
**అండకోశస్తు సంఘాతో విఘాత ఉపసాదితే. 6**

అ. రాజన్=ఓ రాజా! ఏషః=ఈ; ప్రళయః=ప్రళయము; ప్రాకృతికః=ప్రాకృతికము; యత్ర=యే ప్రాకృతిక ప్రళయమునందు; విఘాతే=సంహారణ కారణము; ఉపసాదితే = కాలముచే ప్రాప్తముకాగా; సంఘాతః=మహదాదికము; అండకోశః=బ్రహ్మాండము; లీయతే=లయమగును.

తా. ఓ రాజా! ఇది ప్రాకృతిక ప్రళయమందురు. దీనిలో కాలముచే సంహార కారణము సంప్రాప్తము కాగా మహదాదికము బ్రహ్మాండము లయమగును.

**శ్లో. పర్జన్యశ్శతవర్షాణి భూమౌ తావన్న వర్షతి**
**తదా నిరన్నా హ్యన్యోన్యం భక్ష్యమాణాః క్షుధార్దితాః**
**క్షయం యాస్యంతి శనకైస్తకాలోపద్రుతాః ప్రజాః 7**

అ. భూమౌ=భూమియందు; పర్జన్యః=ఇంద్రుడు, శతవర్షాణి తావత్=నూరు సంవత్సరములు; నవర్షతి=వర్షించడు; తదా=అపుడు; ప్రజాః = ప్రజలు; నిరన్నాః = అన్నము లేనివారై; అన్యోన్యం=ఒకరినొకరు; భక్ష్యమాణాః=భక్షించుచు; క్షుధార్దితాః = ఆకలిచే పీడితులై; తత్కాలోపద్రుతాః = ఆ కాలముచే తరుమబడినవారై; శనకైః = మెల్లగా; క్షయం = నాశమును; యాస్యంతి=పొందుదురు.

తా. ఆ ప్రాకృతిక ప్రళయమునందు పర్జన్యుడు నూరు సంవత్సరములు భూమిపై వర్షించడు. అపుడు ప్రజలు ఆకలిచే పీడించబడుచు అన్నము లేక ఒకరినొకరు చంపుకొనుచు మెల్లగా కాలగతిని నాశము నొందుదురు,

**శ్లో. సాముద్రం దైహికం భౌమం రసం సంవర్తకో రవిః**
**రశ్మిభిః పిబతే ఘోరైస్సర్వం నైవ విముంచతి 8**

అ. సంవర్తకో రవిః = ప్రళయరూపుడైన సూర్యుడు; సాముద్రం = సముద్రములో నుండెడి; రసం = జలమును; దైహికం = దేహమునందుండెడి; రసం = రక్తమును; భౌమం = భూమియందుండెడి; రసం = జలమును (సారమును) ఘోరైః = తీవ్రమైన; రశ్మిభిః = కిరణములచేత; సర్వం = అంత యును; పిబతే = పీల్చును (త్రాగును) నైవ విముంచతి = మరల విడువడు.

తా. ప్రళయ కాలపు సూర్యుడు తన వేడి కిరణములతో సముద్రములోని నీటిని దేహములోని రక్తమును భూమి మీద జలమును మొత్తము పీల్చును కాని తిరిగి విడువడు,

**శ్లో. తతస్సంవర్తకో వహ్ని స్సంకర్షణముఖోద్గతః**
**దహత్య నిలవే గోత్థః శూన్యా న్భూవివరానథ. 9**

అ. తతః = అంత; సంవర్తకో వహ్నిః = ప్రళయాగ్ని; సంకర్షణ ముఖోద్గతః = పాతాళ మందు వసించు సంకర్షణుడైన ఆదిశేషుని నోటినుండి వెలువడినదై; అనిలవేగోత్థః = వాయువేగముచే మండుచు; శూన్యాన్ = ప్రాణిరహితములైన; భూవివరాన్ = పాతాళాదులగు అధోలోకములను, దహతి = కాల్చివేయును

తా. అంత ప్రళయాగ్ని పాతాళవాసి యగు ఆదిశేషుని నోటినుండి వెలువడి వాయు వేగముచే బాగుగామండుచు ప్రాణిరహితములగు పాతాళాది అధోలోకములను దహించివేయును.

**శ్లో. ఉపర్యధ సమంతాచ్చ శిఖాభిర్వహ్ని సూర్యయోః**
**దహ్యమానం విభాత్యండం దగ్ధగోమయ పిండవత్. 10**

అ. ఉపరి = పైన; అధః = క్రింద; సమంతాచ్చ = అంతటను; వహ్నిసూర్యయోః = అగ్ని సూర్యులయొక్క; శిఖాభిః = జ్వాలలచే; దహ్యమానం = దగ్ధమగుచున్న; అండం = బ్రహ్మాండము; దగ్ధ గోమయ పిండవత్ = కాలుచున్న పేడముదలవలె; విభాతి = కన్పట్టును.

తా. పైను క్రిందను అంతట అగ్ని సూర్యుల జ్వాలలచే కాలుచున్న బ్రహ్మాండము కాలుచున్న పేడముద్దవలె తోచును (కన్పట్టును)

**శ్లో. తతః ప్రచండ పవనో వర్షా ణా మధికం శతం**
**పరస్సంవర్తకో వాతి ధూమ్రం ఖం రజసావృతమ్. 11**

అ. తతః = అంత; ప్రచండపవనః; తీవ్రమైన పెనుగాలి; వర్షాణాం అధికం శతం = నూరు సంవత్సరములకించుక ఎక్కువగా; సంవర్తకః = ప్రళయకాలమున; పరః = ఉద్ధతుడై; రజసా = ధూళిచేత; వృతం = కప్పబడిన; ధూమ్రం = బూడిదవన్నెగల, ఖం = ఆకాశమును; వాతి = వీచును.

తా. అంత ప్రళయ కాలమున ఉద్ధతుడై తీవ్రమైన వేగముతో పెనుగాలి నూరు సంవత్సరముల కించుక ఎక్కువగా ధూళిచే కప్పబడిన బూడిద వన్నెగల ఆకాశమును వీచును.

---

వ. అంత గల్పప్రళయ ప్రకారంబెట్లనిన, నతండట్లనియె. చతుర్యుగ సహస్రంబులు చనిన నది బ్రహ్మకు నొక్క పగలగును. అదే క్రమంబున రాత్రియు వర్తిల్లును. అంత బ్రహ్మకు నొక్క దినంబగుట వలన నది నైమిత్తిక ప్రళయంబనం బడును. అందు విధాత సమస్త లోకంబులం దనయాత్మయందు నిలిపి శయనింపం, బ్రకృతి వినష్టంబయిన, నది ప్రాకృత ప్రళయంబని చెప్పం బడును. ఆ ప్రళయ ప్రకారంబు వినుము. ఇట్లు పగలు నైమిత్తిక ప్రళయంబును, రాత్రి ప్రాకృత ప్రళయంబును, ననుట గలిగిన నజునకు నది దినప్రమాణంబు, అట్టి దినప్రమాణంబున మున్నూట

శ్లో. తతోమేఘకులాన్యంగ చిత్రవర్ణాన్యనేకశః
శతవర్షాణి వర్షంతి నదంతి రభస స్వనైః. **12**

అ. అంగ = ఓ రాజా; తతః = అటు తరువాత; మేఘకులాని = మబ్బుల సమూహములు; అనేకశః = చాలా; చిత్రవర్ణాని = వివిధ వర్ణములు గలవై ; శతవర్షాణి = నూరు సంవత్సరములు; వర్షంతి = వర్షించును; రభస స్వనైః = తీవ్రగర్జనల చేత; నదంతి = మ్రోగును.

తా. ఓ రాజా' అటుల వాయువు వీచిన తరువాత వివిధ వర్ణములు గల చాలా మేఘ సమూహములు తీవ్రమైన ధ్వని చేయుచు నూరు సంవత్సరములు వర్షించును.

శ్లో. తత ఏకోదకం విశ్వం బ్రహ్మాండ వివరాంతరమ్. **13**

అ. తతః = అటు తరువాత; బ్రహ్మాండ వివరాంతరం= బ్రహ్మాండ వివరము యొక్క; విశ్వ = ప్రపంచము; ఏకోదకం = జలముచే మాత్రమే నిండియుండును.

తా. అటుల వర్షించిన తరువాత బ్రహ్మాండ వివరము మధ్యలో నున్న ప్రపంచ మంతయూ జలమయమగును.

శ్లో. తదా భూమేర్గంధ గుణం గ్రసంత్యాప ఉదాప్లవే
గ్రస్తగంధాతు పృథివీ ప్రళయత్వాయ కల్పతే. **14**

అ. తదా = అపుడు, భూమేః = భూమి యొక్క; గంధ గుణం = గంధ గుణమును; ఆపః = జలము; గ్రసంతి గ్రసించును. ఉదాప్లవే= జలప్రళయ మందు; గ్రస్తగంధా = గబళించబడిన గంధ గుణముగల :పృథివీ = భూమి; ప్రళయత్వాయ = ప్రళయము కొఱకు; (అభావమునకు) కల్పతే = లోనగును.

తా. అపుడు అనగా జలప్రళయము కాగా నీరు భూమియొక్క గంధ గుణమును కబళించును. ఆ జలప్రళయములో గంధ గుణమును కోల్పోయిన భూమి ప్రళయ జలమందు గలిసి శూన్యమగును.

శ్లో. అపాం రసం హరే త్తేజ తాలియం తేఽథ నీరసాః
గ్రసతే తేజసాం రూపం వాయు స్తద్రహితం తదా. **15**

---

యఱువది దినంబులయిన నలువదు నొక్క సంవత్సరము పరిపూర్ణంబగును. తద్వత్సరంబులుశతపరిమితంబులయిన. **22**

సీ. అంత లోకేశున కవసాన కాలంబువచ్చిన నూరేండ్లు వసుధలోన
వర్షంబులుడిగిన వడిదప్పి మానవుల్ దప్పినాకట జిక్కి నొప్పినంది
యన్యోన్యభక్షులై యాకాలవశమున నాశమొందెదరంత నలిన సఖుడు
సాముద్ర భౌతిక క్ష్మాజాత రసముల జాతురి గిరణాళి చేత గొల్ప

నంత గాలాగ్ని సంకర్షణాఖ్య మగుచు
మిన్ను గలయగ నది యాక్రమించు నట్టి
యెడను శతవర్షములు దడబడక గూడి
పీకతోడుత వాయువుల్ వీచునపుడు.

అ. అపాం = నీటి యొక్క; రసం = రసమును; తేజః = అగ్ని; హరేత్ = హరించును; తాః = ఆ జలములు; అథ = అటుపిట; నీరసాః = రసహీనములై; లీయంతే = లయించును; తేజసాం = అగ్ని యొక్క; రూపం = రూపమును వాయుః = వాయువు, గ్రసతే = కబళించును; తదా = అపుడు; తత్ = ఆ యగ్ని; రహితం = లేనిదగును

తా. నీటి యొక్క రసమును అగ్ని హరించగా నీరసములైన జలములు లయమగును. అటులనే అగ్నిరూపమును వాయువు కబళించగా అగ్నికూడా లేనిదగును.

శ్లో. లీయతేఽథానిలే తేజో వాయోఃఖం గ్రసతే గుణం
నవై విశతి ఖం రాజం స్తతశ్చ నభసో గుణమ్. **16**

అ. అథ = అంతట; అనిలే = వాయువునందు; తేజః = అగ్ని; లీయతే = లీనమగుచు; వాయోః = వాయువు యొక్క; గుణం = స్పర్శ గుణమును; ఖం = ఆకాశము; గ్రసతే = కబళించును; రాజన్! = ఓరాజా? సః = ఆ వాయువు; ఖం = అకాశమునందు; విశతి = లీనమగును: తతశ్చ = ఆ తరువాత; నభసః = ఆకాశము యొక్క: గుణః = గుణము; (ముందు శ్లోకముతో అన్వయము)

తా. వాయువులో అగ్ని లీనము కాగా వాయువు గుణమును ఆకాశము కబళించగా వాయువు అకాశమున లీనమగును. అపుడు ఆకాశ గుణమైన శబ్దము తామసాహంకారము గ్రసించునని ముందు శ్లోకముతో అన్వయము.

శ్లో. శబ్దం గ్రసతి భూతాది నభ స్త మను లీయతే
తైజసా నీంద్రియాణ్యంగ దేవాన్ వైకారికో గుణాన్. **17**

అ. శబ్దం = ఆకాశము యొక్క శబ్ద గుణమును: భూతాదిః = తామసాహంకారము; గ్రసతి = కబళించును; నభః = ఆకాశము: తం = తామసాహంకారమును; అనులీయతే = అనుసరించి లీనమగును అంగ = ఓరాజా! తైజసాని = రాజసాహంకారకార్యములైన; ఇంద్రియాణి = ఇంద్రియములు; గుణైః = శబ్దాది గుణములతో; దేవాన్ = దేవతలను; వైకారికః = సాత్వికాహంకారము మ్రింగునని తాత్పర్యము.

తా. ఆకాశగుణమైన శబ్దమును తామసాహంకారము కబళించును. అపుడుఆకాశము తామసాహంకారమున లీనమగును. రాజ సాహంకార కార్యములైన శ్రోత్రాది ఇంద్రియములు తమ తమ శబ్దాది గుణవృత్తులతో ఇంద్రియాది దేవతలను సాత్వికాహంకారము గ్రసించును అపుడు ఇంద్రియములు శబ్దాది గుణములతో సాత్వికాహంకారమున లయమగును.

శ్లో. మహాన్ గ్రసత్యహంకారం గుణాన్సత్త్వాదయశ్చతమ్
గ్రసతేఽవ్యాకృతం బీజం గుణాన్కాలేన చోదితమ్. **18**

అ. మహాన్ = మహత్తత్త్వము; అహంకారం = సాత్త్విక రాజస తామసాహంకారములను; గ్రసతి = కబళించును; సత్త్వాదయః = సత్త్వము మొదలగు; గుణాః = త్రిగుణములు; తం = ఆ మహత్తమును; కబళించును; కాలేన = కాలము చేత ; చోదితం = ప్రేరేపించబడిన; బీజం = మూలకారణమైన అవ్యాకృతం = ప్రధానము; గుణాన్ గుణములను గ్రసతే = కబంళిచును.

తా. మహత్తత్త్వము సాత్త్విక రాజస తామస రూపమైన అహంకారమును కబళించును. ఆ మహత్తత్త్వమును సాత్త్విక రాజస తామస గుణములు కబళించును. కాలముచే ప్రేరితమై మూలకారణమైన ప్రధానము ఆ గుణములను కబళించును.

అవ. ఆ ప్రధానమునకు లయము లేదని చెప్పుచున్నారు.

శ్లో. న తస్య కాలావయవైః పరిణామాదయో గుణాః
అనాద్యనంతమవ్యక్తం నిత్యం కారణ మవ్యయమ్. 19

అ. తస్య=ఆ ప్రధానమునకు; కాలావయవైః=కాలము యొక్క అవయవములైన అహోరాత్రముల చేత; పరిణామాదయః=పరిణామము మొదలగు; గుణాః=గుణములు; న=లేవు; అనాది=ఆదిలేనిది; అనంతం=నాశములేనిది; అవ్యక్తం=ఇంద్రియ గోచరము కాదు; నిత్యం=సర్వదా ఏక రూపము కలది; కారణం=అన్నిటికి కారణము; అవ్యయం=కార్యగత దోషములచే వైవిధ్యము నొందనిది.

తా. ఆ ప్రధానమునకు కాలావయవములగు అహోరాత్రములకే ఉండుట, పుట్టుట పెరుగుట, వృద్ధిచెందుట, తగ్గుట, నశించుట అను ఆరు వికారములు కలుగవు, ఆ ప్రధానమునకు ఆదిలేదు. అంతములేదు. అది ఇంద్రియ గోచరముకాదు. ఎప్పుడూ ఒకే రూపముతో నుండును. అన్నిటికి కారణమైనది కార్యగత దోషములతో వైవిధ్యము నొందదు.

అవ. మరియు వాగాదీన్ద్రియ గోచరమైన దానికి విశేషములతో కూడి యున్న దానికి వికారములు సంభవించును; కాని ఈ ప్రధానము అటుల కాదని తెలుపుచున్నారు.

శ్లో. న యత్ర వాచో న మనో న సత్త్వం
తమో రజో వా మహదాదయోఽమీ
న ప్రాణ బుద్ధీన్ద్రియ దేవతా వా
న సన్నివేశః ఖలు లోకకల్పః. 20

అ. యత్ర=ఏ ప్రధానము నందు; వాచః=వాక్కులు; న=లేవు; మనః=మనసు; న=లేదు; సత్త్వం=సత్త్వగుణము; తమః=తమోగుణము; రజో వా=రజోగుణము; న=లేదు; అమీ=ఈ; మహదాదయః=మహత్తత్త్వము మొదలగునవి; న=లేవు; ప్రాణ=ప్రాణములు; బుద్ధి=బుద్ధి; ఇంద్రియదేవతాః=ఇంద్రియాధిష్ఠాన దేవతలు; సన్నివేశః=రచనా విశేషము; న=లేదు; లోకకల్పః=లోకరూపము; ఖలు=ఎక్కడిది

తా. ఆ ప్రధానమందు వాక్కు, మనసు, సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము మహదాదితత్త్వములుకాని, ప్రాణములు, బుద్ధి, ఇంద్రియములు, అధిష్ఠాన దేవతలు లేవు. అటులనే సృష్టిరచనే లేదు. ఇక లోకకల్పము ఎటులుండును? అనగా లేదని భావము.

శ్లో. న స్వప్న జాగ్రన్న చ తత్సుషుప్తం నఖం జలం భూరనిలోఽగ్ని రర్కః
సుషుప్తవచ్ఛూన్యవదప్రతర్క్యం తన్మూలభూతం పద మామనంతి. 21

అ. స్వప్నజాగ్రత్=స్వప్నము, జాగ్రదవస్థ; న=లేదు; తత్=అది; సుషుప్తం=సుషుప్తి కలది; న=కాదు; ఖం=ఆకాశము; న=లేదు; జలం=జలము; న=లేదు; భూః=భూమి; న=లేదు; అనిలః=వాయువు; న=లేదు; అగ్నిః=అగ్ని; న=లేదు; అర్కః=సూర్యుడు; న=

లేడు; సుషుప్తవత్=సుషుప్తిలో ఉన్నటుల; అనగా ఇంద్రియ వ్యాపారము లేనట్లుగా; శూన్యవత్=శూన్యమువలె; అప్రతర్క్యం=ఊహించుటకు శక్యము కానిది; తత్=ఆ ప్రధానము; మూలభూతం=మూలమైన; పదం=కారణముగా; అమనంతి=చెప్పెదరు.

తా. ఆ ప్రధానమునకు స్వప్నావస్థ, జాగ్రదవస్థ, సుషుప్త్యవస్థ లేదు. అటులనే అచట ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి కూడలేవు. ఆ ప్రధానము సుషుప్తివలె శూన్యమువలె ఊహించలేనిదిగా ఉండును. అటులని ఏమీ లేనిదికాదు ఆ ప్రధానమే అన్నిటికి మూల కారణమని తలచెదరు.

**శ్లో. లయః ప్రాకృతికో హ్యేష పురుషావ్యక్తయోర్యదా**
**శక్తయ స్సంప్రలీయన్తే వివశాః కాలవిద్రుతాః. 22**

అ. ఏషః=ఇది; ప్రాకృతికః=ప్రాకృతికమను; లయః=ప్రళయము; యదా=ఎపుడు; పురుషావ్యక్తయోః=పురుషుడు ప్రకృతుల యొక్క; శక్తయః=సత్త్వాది గుణములు; కాలవిద్రుతాః=కాలవేగమునకు లోనై; వివశాః=పరవశములై; సంప్రలీయన్తే=చక్కగా లీనమగును.

తా. దీనినే ప్రాకృతిక లయమందురు. ఈ ప్రళయమందు ప్రకృతి పురుషుల శక్తులగు సత్త్వాది గుణములు కాలవేగమునకు గురియై పరవశములై అనగా అస్వతంత్రములై పూర్తిగా లయమగును.

అవ. ఆత్యంతిక ప్రళయమును పన్నెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. బుద్ధీన్ద్రియార్థ రూపేణ జ్ఞానం భాతి తదాశ్రయం**
**దృశ్యత్వావ్యతిరేకాభ్యాం ఆద్యంత వదవస్తు యత్. 23**

అ. బుద్ధీన్ద్రియార్థరూపేణ=బుద్ధి, ఇంద్రియములు, వాని అర్థములగు శబ్దాదులు (అనుగ్రాహకములగు కరణములు వాని వృత్తులు శబ్దాదులు) వీటితో; తదాశ్రయం = వాని కాశ్రయమగు; జ్ఞానం = జ్ఞానము; భాతి = ప్రకాశించును. దృశ్యత్వ + అవ్యతిరేకాభ్యాం=ఇంద్రియ గోచరమగుట, కారణమునకు వ్యతిరేకము గాకుండుట అను వానిచే; యత్=ఏది; ఆద్యంతవత్ = మొదలు తుది గలదో అది; అవస్తు=సత్యము అగు వస్తువుగాదు.

తా ఆత్యన్తిక లయమనగా మోక్షము. ఈ మోక్షము బ్రహ్మజ్ఞానము సకల ప్రపంచ లయాత్మకము. ఆత్మవలె ప్రపంచము కూడా సత్యమైనచో లయమగుట కుదరదు. గాన జ్ఞాన రూపమైన బ్రహ్మకంటె వేరైనదంతయు అసత్యమని ప్రతిపాదించవలయును గాన ఇచట అసత్యత్వమును నిరూపించు చున్నారు.

బుద్ధి ఇంద్రియములు వాని అర్థములగు శబ్దాదులు అనగా అనుగ్రాహకములగు కరణములు వాని వృత్తులు శబ్దాదులు, ఈ శబ్దాదులకు ఆశ్రయమగు జ్ఞానము భాసించును. అనగా జ్ఞానము మాత్రమే భాసించును. ఇతరము భాసించదు. ఏలయనగా ఏది కన్పట్టునో, కారణమునకు వ్యతిరేకము కానిదై ఆద్యంతములు గలిగి యుండునో అది యంతయూ సత్యముకాదు, ఇచట బ్రహ్మవ్యతిరిక్తమైన దంతయు అసత్యము అని నిరూపించుటకు రెండు అనుమాన ప్రకారములు గలవు "యత్ ఆదద్యంతవత్ తత్ అవస్తు" అనునది ఒకటి. అనగా ఏది ఆద్యంత

ములు గలదో అది సత్యము కాదు అని. లేదా ఇటుల చెప్పవలయును. వివమతం సన్నభవతి. దృశ్యత్వాత్, కారణావ్యతిరేకాత్ ఆద్యంత వత్వాచ్చ రజ్జు సర్పాదివత్" ఇటుల బ్రహ్మవ్యతిరిక్తమైనది అంతయూ అసత్యము అని ప్రతిపాదించ బడినది.

అవ. ఆ వ్యతిరేకత్వమును దృష్టాంతముతో వివరించు చున్నారు.

శ్లో. దీపశ్చక్షుశ్చ రూపం చ జ్యోతిషా న పృథగ్భవేత్
ఏవం ధీః ఖాని మాత్రాశ్చ నస్యు రన్యతమాదృతాత్. **24**

అ. దీపః=దీపము; చక్షుశ్చ=చక్షురింద్రియము; రూపంచ=రూపగుణము అనునవి; జ్యోతిషః=తేజస్సుకంటే; న పృథక్ భవేత్=వేఱుగావో; ఏవం=ఈ ప్రకారముగా; ధీః=బుద్ధి; ఖాని=ఇంద్రియములు; మాత్రాశ్చ=పంచతన్మాత్రలు శబ్దాదులు; ఋతాత్=సత్యమగు బ్రహ్మకంటె; నస్యుః వేఱుగావు; అన్యతమాత్ = కార్యము కంటె; అత్యంతము వ్యతిరిక్తమైన బ్రహ్మము కంటె; నస్యుః = వేఱుగా నుండవు.

తా. దీపము చక్షురింద్రియమురూపగుణము అనునవి మూడునుతేజోవిశేషములే యగును అవి ఎట్లు తేజస్సుకంటే వేఱుగావో, అట్లే కర్తయగు బుద్ధియు, కరణములగు ఇంద్రియములు శబ్దాదులగు విషయములును, జగత్కార్యము కంటె మిక్కిలి వ్యతిరిక్తమై సత్యమైన బ్రహ్మ కంటె వేఱుగావు. ఇవి బ్రహ్మకార్యములగుట దానికి హేతువు.

ఇట్లు కార్యకారణములకు అభేదము చెప్పినచో కార్యము అసత్తు అగుచు కారణమగు బ్రహ్మమునకు అసత్యత్వము ప్రసక్తమగుచున్నది గదా అని పూర్వపక్షము వచ్చును. అపుడు ఇటుల సిద్ధాన్తము చెప్పవలయును. ప్రపంచము కంటె బ్రహ్మము వ్యతిరిక్తమైనది. ప్రపంచము బ్రహ్మకంటె వ్యతిరిక్తము గాదు. రజ్జువునందు సర్పమువలె. సర్పము భ్రాంతియగును. రజ్జువు సర్పముకంటె వేరని తోచిన సర్పము భ్రాంతియై అసత్యమగును. అటులనే బ్రహ్మము ప్రపంచము కంటె వేరని తోచిన, ప్రపంచము అసత్యమగును.

అవ: ఎపుడు బుద్ధికి ఉనికిలేదో అపుడు తదవస్థలకు కూడా ఉనికి లేదని చెప్పుచున్నారు.

శ్లో. బుద్ధేర్జాగరణం స్వప్నం సుషుప్తిరితి చోచ్యతే
మాయామాత్రమిదం రాజన్ నానాత్వం ప్రత్యగాత్మని **25**

అ. జాగరణం=మేల్కొనుట; స్వప్నం=కలగనుట; సుషుప్తిః=నిద్రించుట. అనునవి, బుద్ధేః=బుద్ధియొక్క అవస్థలు; ఇతి=అని; ఉచ్యతే=చెప్పబడును; రాజన్=ఓ రాజా!; ప్రత్యగాత్మని=జీవుని యందు; ఇదం=ఈ; నానాత్వం=విశ్వ,తైజస, ప్రాజ్ఞులను భేదములు; మాయా మాత్రములే.

తా. మేల్కొనుట, కలగనుట, నిద్రించుట అనునవి మూడు బుద్ధి అవస్థలు. బుద్ధియే అసత్యమగుచో బుద్ధి అవస్థ లెటులుండును?. ఈ మూడు అవస్థలు బుద్ధివికావు. విశ్వతైజస ప్రాజ్ఞులవి. అనినచో జీవునందు చెప్పెడి విశ్వతైజస ప్రాజ్ఞులను భేదములు మాయామాత్రములే కాని సత్యములు కావు.

అవ. "ఆద్యంత వత్వాత్" అని చెప్పిన హేతువునకు అసిద్ధిని శంకించి సావయవత్వముతో సాధించు చున్నారు.

శ్లో. యథా జలధరా వ్యోమ్ని భవంతి న భవంతి చ
బ్రహ్మణీదంతథా విశ్వం అవయవ్యుదయాప్యయాత్. **26**

అ. యథా = ఎట్లు; వ్యోమ్ని = ఆకాశము నందు; జలధరాః = మేఘములు; భవంతి = కలుగు చున్నవి న భవంతి = మాయమగు చున్నవో; తథా = అటులే; ఇదం = ఈ; అవయవి = అవయవములు గల; విశ్వం = ప్రపంచము; ఉదయాప్యయాత్ = పుట్టుక - నాశము కలదగుట వలన (ఆద్యంతములు గలదగుట వలన) బ్రహ్మణి = బ్రహ్మమునందు (ఉండుట లేకుండుట అని తెలియవలయును)

తా. ఆకాశమునందు మేఘములు ఏ విధముగా రూపొందుచు మాయమగుచుండునో అట్లే విశ్వము బ్రహ్మమునందు రూపొందుచు మాయమగుట వలన మిథ్యయగుచున్నది. బ్రహ్మము కంటె వేఱుగా జనించుట లయించుట వలన జగము మిథ్యయగును. మఱియు ఈ విశ్వమునకు బ్రహ్మము అవధియై యున్నది. సర్పము తోచుటకు రజ్జువు స్థిరమైయున్నది. ఇచట మేఘదృష్టాంతము రాకపోకలకు మాత్రమే కాని మిథ్యాత్వమునకు కాదు.

అవ. కారణమునకు సత్యత్వమును ప్రతిపాదించుచున్నారు.

శ్లో సత్యం హ్యవయవః ప్రోక్తః సర్వావయవినా మిహ
వినార్థేన ప్రతీయేరన్ పటస్యేవాంగ తంతవః. **27**

అ. అంగ = ఓ రాజా !; ఇహ = ఇందు; సర్వావయవినాం = ఎల్లకార్యములకు; అవయవః = కారణము; సత్యం = సత్యమని; ప్రోక్తః = చెప్పబడినది; పటస్య = వస్త్రము యొక్క; తంతవ ఇవ = దారములవలె; వినా అర్థేన = కార్యము లేకున్నను; (కార్యము కంటే వేఱుగను) ప్రతీయేరన్ = తోచు చున్నవి.

తా. ఈ ప్రపంచమున అన్ని కార్యముల కారణము సత్యమని చెప్పబడినది. పటము అనగా వస్త్రము లేకున్నను దానికి కారణమగుతంతువులు అనగా దారములు ఎట్లుకనబడు చున్నవో వేఱుగా ఉండునో అటులే కార్యమును వీడి కారణము ఎప్పుడూ వేరుగా నుండును. అట్లే ఈ ప్రపంచమును వీడి కారణమగు బ్రహ్మము వేఱుగా కన్పట్టును.

అవ. కార్యమగు ప్రపంచము లేనిదే బ్రహ్మకు ప్రపంచ కారణత్వము ఎటుల కుదు రును అనగా అది కూడా అంతగా సత్యము కాదని చెప్పుచున్నారు.

శ్లో. యత్సామాన్య విశేషాభ్యా ముపలభ్యేత స భ్రమః
అన్యోన్యాపాశ్రయాత్సర్వ మాద్యంత వదవస్తు చ. **28**

అ యత్ = ఏది; సామాన్య విశేషాభ్యాం = కారణ కార్యరూపములతో; ఉపలభ్యేత = ఇంద్రియ గోచరమగు చున్నదో, సః = అది యంతయు; భ్రమః = భ్రాంతి మాత్రమే; అన్యోన్య + అపాశ్రయాత్ = ఒకదాని నొకటి అపేక్షించుట వలన; అనగా ఒకదానితో మఱియొకటి నిరూపింప దగుటవలన; ఆద్యంతవత్ = పుట్టుక; నాశము గల; సర్వం = అంతయు; అవస్తు = వాస్తవముగాదు.

తా. కారణ కార్యరూపములతో నేది ఇంద్రియ గోచరమగు చున్నదో-అది యంతయు భ్రాంతియే యగుచున్నది కారణ కార్యములు ఒక దానిని ఒకటి అపేక్షించి యుండునవగుట వలన సర్వపదార్థములు ఆద్యంతములు కలవిగ నున్నవి. కావున ఇది వాస్తవముకాదు. కారణ

కార్యరూపముననుండునవి పరస్పరాపేక్ష గలవగుట వలన నిరూపింప ననర్థమగుచున్నవి. అందువలన కారణత్వము అవధిత్వము వ్యాపకత్వము అను నిత్యాదికము సైతము పరాపేక్ష కలదగుట వలన ఆద్యంత వంతమేయగును. కావున ఆద్యంతములు కలదంతయు వాస్తవము కాదు. లేదా ఇందే ఇది మఱియొక హేతువగును. గుణ-గుణులు, విశేషణ-విశేష్యములు, వ్యాప్య-వ్యాపకములు, విశేషావధులు, కార్యకారణములు లోనగు వాని రూపమున పరస్పరాధీనములై సిద్ధించుట వలన, ఆ ప్రకారముగా నుండు స్వప్నమువలె అవాస్తవములు అని తీర్మానము. అనగా ఉపసంహారము. అందువలన ఏది పుట్టుకనాశము కలదో అది యంతయు అసత్తు అనునది సిద్ధాంతము.

అవ. ఇటుల అనేక హేతువులచే ప్రపంచము అసత్యమని నిరూపించబడినది. కాని ప్రపంచము కూడా ప్రకాశించుచున్నది కాన ఆత్మవలె ప్రపంచము కూడా సత్యమెందులకు కాదు? అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

శ్లో. వికారః ఖ్యాయమానోఽపి ప్రత్యగాత్మాన మంతరా
న నిరూప్యోఽస్త్యణురపి స్యాచ్చేచ్చిత్సమ ఆత్మవత్. **29**

అ. వికారః = వివిధముగా గనపడు ప్రపంచము; ఖ్యాయమానః + అపి = ప్రకాశించుచున్ననూ; (ఇంద్రియ గోచరమగు చున్నను) ప్రత్యగాత్మానం అంతరా = పరమాత్మ లేనిదే; అణుః + అపి = ఒక్క అణువు సైతము; నిరూప్యః = నిరూపించ దగినది, న + అస్తి = లేదు; స్యాత్ + చేత్ = అట్లు ఆత్మ లేకున్ననూ నిరూపించదగినది ఉన్నచో; చిత్ + సమః = చిత్తుతో సమమగును; చిద్రూపుడైన; ఆత్మవత్ = ఆత్మతో సమమై ప్రకాశమగును. అట్లుకాదు. అదియు ఏకరూపమగును.

తా. ఈ ప్రపంచము ప్రకాశించుచున్నను ప్రత్యగాత్మలేక ఒక అణువుకూడా నిరూపింప దగినదిగా నుండనేరదు. ఆత్మలేకనే నిరూప్యమగునేని అపుడదియే చిద్రూపుడగు నాత్మయగుచు స్వప్రకాశమగును అట్లగుచో ఆత్మవలె నేకరూపమగును.

శ్లో. నహి సత్త్వస్య నానాత్వ మవిద్వాన్యది మన్యతే
నానాత్వం ఛిద్రయోర్యద్వజ్జ్యోతిషోర్వాతయోరపి. **30**

అ. సత్త్వస్య = సత్యవస్తువునకు; నానాత్వం = నానాత్వము; నహి = లేదు; అవిద్వాన్ = విద్వాంసుడు కానివాడు; యది = ఒకవేళ, మన్యతే = నానాత్వమున్నదని తలచినచో; అభేదము ఉపాధికృతమే కాని వాస్తవముకాదు; ఎట్లనగా; నానాత్వం = నానాత్వము; ఛిద్రయోః = ఘటాకాశము మహాకాశములకును; జ్యోతిషోః = ఆకాశమునందు; నీటిలో నున్న సూర్యులకును; వాతయోః = బాహ్యములో నున్న; శరీరములో నున్న వాయువులకు; యత్ యత్ = యే యే నానాత్వము కలదో అది యంతయా అవాస్తవమేయని భావము.

తా. సత్యవస్తువునకు నానాత్వము లేదు. సత్యవస్తువునకు నానాత్వమున్నదని తలంచువాడు పండితుడు కాడు. ఉపాధివశమున నానాత్వము కనపడును. వాస్తవముగా ఆకాశము ఒకటే అయినను ఘటాకాశము పటాకాశము మహాకాశము అనితోచు నానాత్వము ఉపాధివశమే ఇటులనే ఆకాశములో నున్న సూర్యుడు, జలములో నున్న సూర్యుడు అని సూర్యునికి నానా

త్వము, శరీరములో నున్న వాయువు బాహ్యమైన వాయువు అని వాయుగత నానాత్వము కూడా ఉపాధికృతమే. అటులనే ఆత్మ ఒకటే యైనను జీవ బ్రహ్మలుగా నానాత్వము తోచు చున్నది. గాన తోచునదంతయూ సత్యము కాదని తాత్పర్యము.

అవ. బ్రహ్మకు కూడా ప్రపంచ వ్యవహారాలంబనత్వమును దృష్టాంతముతో ఉప పాదించుచున్నారు.

శ్లో. యథా హిరణ్యం బహుధా సమీయతే నృభిః క్రియాభిః వ్యవహార వర్త్మసు
ఏవం వచోభి ర్భగవానధోక్షజో వ్యాఖ్యాయతే లౌకిక వైదికై ర్జనైః. **31**

అ. యథా = ఎట్లు; హిరణ్యం = సువర్ణము; నృభిః = నరులచే; వ్యవహార వర్త్మసు = వ్యవహార మార్గములందు; క్రియాభిః = కటక కుండలాది రచనలచే; బహుధా = పెక్కువిధములుగా; సమీయతే = పేర్కొనబడుచున్నదో; ఏవం = ఈ ప్రకారముగా; భగవాన్ = భగవంతుడగు; అధోక్షజః = నారాయణుడు; (ఇంద్రియముల నధః కరించినవాడు) లౌకిక వైదికైః = లౌకికులు వైదికులు అగు; జనైః = నరులచే; వచోభిః = వాక్కులచే; బహుధా = పెక్కు విధములుగా; వ్యాఖ్యాయతే = పేర్కొనబడు చున్నాడు.

తా. సువర్ణమొక్కటే అయినను కుండలములు కటకములు హారములు మొదలగు రచనా భేదములచే మానవులు వానిని వ్యవహార మార్గములందు పెక్కుగా నెట్లు వ్యవహరించు చున్నారో, అట్లే విష్ణుభగవానుడు అధోక్షజుడు అనగా ఇంద్రియముల నధః కరించినవాడు అహంకార పూరితులైన నరులచే లోక వార్తలచే వేదవాక్యములచే పెక్కురూపులుగ తలంప బడుచున్నాడు.

అవ. అహంకారము బ్రహ్మస్వరూపమును ఎటుల కప్పివేసి భేదవ్యవహారమునకు హేతు వగుచున్నది? తనకు కారణమైన బ్రహ్మను అహంకారము కప్పిపుచ్చ లేదుగదా! ఒకవేళ కప్పి పుచ్చినచో అహంకారమునకు ఉనికి ఉండదు కదా, అను శంకకు దృష్టాంతముతో సమాధానము చెప్పుచున్నారు.

శ్లో యథా ఘనోఽర్క ప్రభవోఽర్కదర్శితో
హ్యర్కాంశభూతస్య చ చక్షుష స్తమః
ఏవం త్వహం బ్రహ్మగుణ స్తదీక్షితో
బ్రహ్మాంశకస్యాత్మన ఆత్మబంధనః. **32**

అ. అర్కప్రభవః = సూర్యుని వలన జనించినదై; అర్కదర్శితః = సూర్యునిచే కన్పుచబడిన దైన ఘనః = మేఘము; యథా = ఏ ప్రకారము; అర్క + అంశభూతస్య = ఆ సూర్యుని అంశమున జనించిన; చక్షుషః = నేత్రమునకు; తమః = స్వరూప భూతమైన ఆ సూర్యుని చూచుటకు ప్రతిబంధకమగు చున్నది. ఏవం = ఈ ప్రకారము; బ్రహ్మగుణః = బ్రహ్మ కార్యమైన; అహం = అహంకారము; తదీక్షితః = ఆ బ్రహ్మముచే ప్రకాశించబడిన వాడై; బ్రహ్మాంశకస్య = బ్రహ్మయొక్క అంశమైన; ఆత్మనః = జీవునికి; ఆత్మబంధనః = బ్రహ్మస్వరూప దర్శన ప్రతిబంధ కమగు చున్నది.

తా. సూర్యునివలన జనించి, ఆ సూర్యునిచే గన్పరచబడును మేఘము. అది ఎటుల నగా? సూర్యరశ్మలే పరిణవములై వర్షించును.

"అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యక్ ఆదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః" అని చెప్పబడి యున్నది. అగ్నిలో సమర్పించబడిన హవిస్సు సూర్యుని పొందును. ఆ సూర్యునివలన వర్షము కురియును. వర్షము వలన అన్నము, అన్నము వలన ప్రజలు జనింతురు. అని పైశ్లోకమునకు తాత్పర్యము. కావున సూర్యునివలన జనించి, ఆ సూర్యునిచే గన్పఱచ బడిన మేఘము సూర్యుని అంశమున జనించిన నేత్రములకు స్వస్వరూపుడైన సూర్యుని దర్శించుటకు ఎట్లు ప్రతిబంధక మగుచున్నదో, అట్లే బ్రహ్మకార్యమై బ్రహ్మచే ప్రకాశించు అహంకారము బ్రహ్మాంశమైన జీవునికి బ్రహ్మ స్వరూప దర్శనమునకు ప్రతిబంధక మగుచున్నది.

అవ. అందువలననే అహంకారము నశించినచో బ్రహ్మస్వరూపము ప్రకాశించును. అని అదే దృష్టాంతముతో తెలుపుచున్నారు.

శ్లో. ఘనో యదార్క ప్రభవో విదీర్యతే చక్షుస్స్వరూపం రవి మీక్షతే తదా
యదాహ్యహంకార ఉపాధి రాత్మనో జిజ్ఞాసయా నశ్యతి తర్హ్యను స్మరేత్. 33

అ. యదా=ఎపుడు; అర్క ప్రభవః=సూర్యుని వలన జనించిన, ఘనః=మేఘము; విదీర్యతే =చీలిపోవునో; తదా=అపుడు; చక్షుః=నేత్రము; స్వరూపం రవిం=తన రూపమగు రవిని; ఈక్షతే=చూచుచున్నది; యదా=ఎపుడు; ఆత్మనః=జీవునకు; ఉపాధిః=ఉపాధియైన; అహంకారః= అహంకారము; జిజ్ఞాసయా=జిజ్ఞాసచే; నశ్యతి=నశించునో, తర్హి=అపుడు; అనుస్మరేత్=బ్రహ్మము నేనని స్మరించును

తా. సూర్యుని వలన జనించిన మేఘము ఎపుడు చీలికలగుచున్నదో అపుడు చక్షువు తన స్వరూపమగు సూర్యుని జూచుచున్నది. అట్లే జీవునకు ఉపాధిభూతమగు అహంకారమెపుడు ఆత్మవిచారముచే నశించునో అపుడు జీవుడు బ్రహ్మమేనేనని తెలియుచున్నాడు.

అవ. ఇదియే ఆత్యంతిక ప్రళయమని ఉపసంహరించు చున్నారు.

శ్లో. యదైవమేతేన వివేక హేతినా మాయామయాహం కరణాత్మ బంధనమ్
ఛిత్వాఽచ్యుతాత్మానుభవోఽవ తిష్ఠతే తమాహురాత్యంతిక మంగ విప్లవమ్ 34

అ. అంగ!=ఓ రాజా!, యదా=ఎపుడు; ఏవం=ఈ ప్రకారము; ఏతేన=ఈ; వివేక హేతినా =వివేకమను ఖడ్గము చేత; మాయా మయ+అహంకరణ+ఆత్మబంధనం=మాయా స్వరూపమైన అహంకారమనుజీవుని ప్రతి బంధకమును; ఛిత్వా=ఛేదించి; అచ్యుత+ఆత్మానుభవః=చ్యుతిలేక పరిపూర్ణమైన ఆత్మయొక్క అనుభూతి గలవాడై; అవతిష్ఠతే=ఉండును; తం=దానిని; ఆత్యంతికం విప్లవం=ఆత్యంతిక ప్రళయమని; ఆహుః=వచింతురు.

తా. ఓ రాజా! మాయాకార్యమైన జీవునికి ప్రతిబంధకమైన అహంకారమును ఈ ఆత్మ జ్ఞానమను ఖడ్గముచేత ఖండించి ఎప్పుడు పరిపూర్ణాత్మనుభవము పొందియుండునో అదియే ఆత్యంతిక ప్రళయమని చెప్పుదురు.

అవ. నిత్యప్రళయమును చెప్పుచున్నారు.

శ్లో. నిత్యదాసర్వభూతానాం బ్రహ్మాదీనాం పరంతప!
ఉత్పత్తి ప్రళయావేవ సూక్ష్మజ్ఞాః సంప్రచక్షతే. 35

అ. పరంతప = ఓ శత్రు నాశకుడా! బ్రహ్మాదీనాం = బ్రహ్మ మొదలగు; సర్వభూతానాం = అన్ని భూతముల యొక్క; ఉత్పత్తి ప్రళయావేవ = జన్మము లయములనే; నిత్యదా = నిత్య ప్రళయమని; సూక్ష్మజ్ఞాః = సూక్ష్మదర్శనులు; సంప్రచక్షతే = చెప్పుచుందురు.

తా. ఓ శత్రునాశకుడా! బ్రహ్మ మొదలగు సర్వభూతములకు ప్రతిక్షణము కలుగు ఉత్పత్తి ప్రళయములే నిత్యప్రళయమని సూక్ష్మదర్శనులు చెప్పుచుందురు. ప్రతిప్రాణికి ప్రతిక్షణము ఒక అవస్థ పోయి మరియొక అవస్థకలుగు చుండును. మొదటి అవస్థ పోవుటయే ప్రళయమని, తరువాతి అవస్థ వచ్చుటయే ఉత్పత్తి. ఇది నిరంతరము జరుగు ప్రక్రియ కావున అందరు తెలియలేరు, సూక్ష్మదర్శులు మాత్రమే తెలియగలరని చెప్పుచున్నారు.

శ్లో. కాలస్రోతో జవేనాశు హ్రియమాణస్య నిత్యదా
పరిణామినా మవస్థాస్తా జన్మప్రళయహేతవః 36

అ. పరిణామినాం = ఎప్పుడూ పరిణామ శీలములైన నదీప్రవాహ దీపజ్వాలలోనగు వానియొక్క అవస్థాః = ఏ ఉచ్చనీ చావస్థలు కలుగునో; తాః = అవియే; జన్మప్రళయములకు కారణములు, కాలస్రోతోజవేన = కాలప్రవాహ వేగముతో; ఆశు = త్వరగా; హ్రియమాణస్య = హరింపబడు దేహాదికమునకు; నిత్యదా = జన్మ ప్రళయములు నిత్యమైయున్నవి.

తా. ఇచట "దేహః ప్రతిక్షణం విధ్వంసీ. ప్రతిక్షణం అవస్థాభేదాస్పదత్వాత్ ప్రదీపాదివత్" అనునది అనుమానప్రకారము. అ గా దేహము ప్రతిక్షణము ధ్వంసము గలది. అవస్థాభేదములకు ఆస్పదమగుటవలన ప్రదీపాదులవలే" అని తాత్పర్యము. నదీప్రవాహము దీపజ్వాలలోనగునవి ఎట్లు హెచ్చుచు తగ్గిపోవుచు ఉచ్చనీచావస్థలు గలుగు చున్నవో అట్లే కాలప్రవాహ వేగముచే హరింప బడుదేహాదులకు జన్మప్రళయ హేతువులు నిత్యము కన్పట్టుచున్నవి. దీపమెట్లు ప్రతిక్షణము వెలుగుచు ఆరిపోవుచున్నదో అట్లే దేహము ప్రతిక్షణము ధ్వంసమగుచున్నదై ప్రతిక్షణమవస్థా భేదమున కాస్పదమైయున్నది. ఇదియే నిత్యప్రళయమని అందురు.

అవ దేహాదులలో ప్రతిక్షణము అవస్థలు కలుగుచున్నచో ఏల కనిపించవు? కావున ఇచట చెప్పినహేతువు అసిద్ధము. అను శంకకు సమాధానమును చెప్పుచున్నారు.

శ్లో. అనాద్యంత వతా తేన కాలేనేశ్వరమూర్తినా
అవస్థా నైవ దృశ్యంతే వియతి జ్యోతిషామివ 37

అ. అనాది + అంతవతా = మొదలు తుది లేనిదియు, ఈశ్వరమూర్తినా = పరమేశ్వర స్వరూపమైన; తేన కాలేన = ఆకాలముచే; అవస్థాః = జన్మాద్యవస్థలు; వియతి = ఆకాశమందు; జ్యోతిషామివ = చంద్రాదుల గమనాద్య వస్థావిశేషముల వలె; నైవ దృశ్యంతే = కన్పట్టవు.

తా. ఆద్యంతములు లేనిదై పరమేశ్వర స్వరూపమైన ఆ కాలముచే కలుగు జన్మాద్యవస్థలు ఆకాశమున సంచరించు చంద్రాదుల గమనాద్యవస్థలట్లు కన్పించవు. చంద్రాదులు ఆకాశమున ప్రదేశాంతర ప్రాప్తిచే ప్రతిక్షణము గమనాద్యవస్థలు ఊహించబడుచున్నవో అట్లు

దేహమునందు బాల్యతారుణ్యాదుల దర్శనముచే మధ్యన ఉండెడి ఈ యవస్థలు కల్పించబడు చున్నవి. కావున హేతువు అసిద్ధము కానేరదు.

అవ ప్రళయ స్వరూపములను వివరించి ఉపసంహరించుచున్నారు.

శ్లో. నిత్యోనైమిత్తి కశ్చైవ తథా ప్రాకృతి కో లయః
ఆత్యంతికశ్చ కథితః కాలస్య గతిరీదృశీ. 38

అ. నిత్యః=నిత్యము; నైమిత్తికః=నైమిత్తికము: తథా=అటులనే; ప్రాకృతికః=ప్రాకృతికము; ఆత్యంతికశ్చ=అత్యంతికము; లయః=ప్రళయము; కథితః=చెప్పబడినది. కాలస్య=కాలము యొక్క; గతిః=నడక; ఈదృశీ=ఇటువంటిది.

తా. నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యంతికము, అయిన ప్రళయముల గురించి నీకు చెప్పితిని. కాలగమనము ఇటువంటిదని తెలియుము.

అవ. పురాణార్థమును ఉపసంహరించుచున్నారు.

శ్లో. ఏతాః కురుశ్రేష్ఠ జగద్విధాతుః నారాయణస్యాఖిల సత్త్వధామ్నః
లీలాకథాస్తే కథితా స్సమాసతః కార్త్స్న్యేన నాజోఽప్యభిధాతు మీశః 39

అ. కురుశ్రేష్ఠ!=ఓ కురుశ్రేష్ఠుడా!; జగద్విధాతుః=జగములను సృజించు; అఖిల సత్త్వ ధామ్నః=ఎల్ల ప్రాణులకు ఆశ్రయమైన; లేక సమస్త సత్త్వగుణమునకు స్థానమైన వాడునగు; నారాయణస్య=నారాయణుని యొక్క; ఏతాః=ఈ; లీలా కథాః=లీలా విషయములైన కథలు; తే=నీకు; సమాసతః=సంగ్రహముగా; కథితాః=చెప్పబడినవి. కార్త్స్న్యేన=పూర్తిగా; అభిధాతుం =చెప్పుటకు; అజః+అపి=బ్రహ్మ సైతము, న+ఈశః=సమర్థుడుకాడు.

ఓ కురువంశోత్తమా! ఎల్ల ప్రాణుల కాశ్రయుడు సత్త్వ గుణస్థానమును అగు శ్రీనారాయణుని అవతారలీలల కథలు నీకు సంగ్రహముగా వచించితిని. ఆ నారాయణుని లీలలు పూర్తిగా జెప్పుటకు బ్రహ్మకూడా సమర్థుడు కాడు.

అవ. సంపూర్ణముగా జెప్పుటకు ఎవరికి శక్యముకానిచో అటువంటి కథను అసలు ఏల చెప్పవలయును అను శంకకు సమాధానము చెప్పుచున్నారు.

శ్లో. సంసారసింధు మతి దుస్తర ముత్తితీర్షోః నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య
లీలాకథా రసనిషేవణ మంతరేణ పుంసో భవే ద్వివిధ దుఃఖ దవార్దితస్య 40

అ. వివిధ దుఃఖ దవార్దితస్య=పలు దుఃఖములను దవాగ్నిచే పీడితుడైన; పుంసః=పురుషునికి; అతిదుస్తరం=మిక్కిలి దాట శక్యముకాని, సంసార సింధుం=సంసారసాగరమును; ఉత్తితీర్షోః=దాటగోరువానికి; భగవతః=భగవంతుడైన; పురుషోత్తమస్య = పురుషోత్తముడైన నారాయణుని యొక్క; లీలాకథా రసనిషేవణం అంతరేణ=అవతారలీలల కథల రసానందము సేవించుటకన్నా; అన్యః ప్లవః=ఇతరమగుతరించు సాధనమగు తెప్ప; నభవేత్=ఉండదు.

తా. పలువిధములైన దుఃఖములను కార్చిచ్చునంబడి కాలుచు సంసారసాగరమును దాటగోరిన పురుషునికి పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని అవతార కథలను శ్రవణానందముగ

సేవించుట కంటె ఇతరము తరించు సాధనము తెప్ప మరియొకటి లేదు. కావున యథాశక్తి భగవత్కథా శ్రవణము చేయవలెను.

అవ. శ్రోతకు ఆదరము దృఢమగుటకు మూడు శ్లోకములతో సంప్రదాయ ప్రవృత్తిని చెప్పుచున్నారు.

శ్లో. పురాణ సంహితామేతాం ఋషిర్నారాయణోఽవ్యయః
నారదాయ పురాప్రాహ కృష్ణద్వైపాయనాయ సః **41**

అ. ఏతాం=ఈ; పురాణ సంహితాం=పురాణ సంహితను; అవ్యయః=అవ్యయుడైన; నారాయణః ఋషిః=నారాయణ ఋషి; పురా=పూర్వము; నారదాయ=నారదునికి; ప్రాహ=చెప్పెను సః=ఆ నారద మహర్షి; కృష్ణద్వైపాయనాయ=వ్యాసమహర్షికి చెప్పెను.

తా. ఈ పురాణ సంహితను పూర్వము నారాయణ మహర్షి నారదునికి చెప్పెను. నారదమహర్షి వేదవ్యాస మహర్షికి చెప్పెను.

శ్లో. స వై మహ్యం మహాభాగ భగవాన్ బాదరాయణః
ఇమాం భాగవతీం ప్రీత స్సంహితాం వేద సమ్మితామ్ **42**

అ మహాభాగ ! = ఓ మహాభాగుడా! ఇమాం = ఈ; వేదసమ్మితాం = వేదతుల్యమైన; భాగవతీం సంహితాం = భాగవత సంహితను; ప్రీతః = ప్రీతిపొందిన; సః = ఆ; భగవాన్ = భగవంతుడు బాదరాయణః = వ్యాస భగవానుడు; మహ్యం = నాకు చెప్పెను.

తా. వేదసమ్మితమైన ఈ భాగవత సంహితను వ్యాసభగవానుడు నాకు చెప్పెను.

శ్లో. ఏతాం వక్ష్యత్యసౌ సూత ఋషిభ్యో నైమిశాలయే
దీర్ఘసత్రే కురుశ్రేష్ఠ సంపృష్ట శ్శౌనకాదిభిః **43**

అ. అసౌ = ఈ, సూతః = సూత మహర్షి; నైమిశాలయే = నైమిశారణ్యము నందు; దీర్ఘసత్రే = సత్రయాగమునందు; శౌనకాదిభిః = శౌనకాదులచే; సంపృష్టః = ప్రశ్నింపబడి; ఋషిభ్యః = ఋషులకొఱకు; ఏతాం = ఈ భాగవత సంహితను; వక్ష్యతి = చెప్పగలడు.

---

వ. వ ఇట్లు వర్షశతంబు వర్షశూన్యంబగును. అంత శత వర్షంబు ద్వాదశ భాస్కర ప్రచండ కిరణ తాండవంబగును. పిదప శతవర్షంబులు ప్రళయాగ్ని దందహ్యమానంబగును. పిమ్మట సప్త మారుత ఝంఝానిల వేగతాడితంబగును. అందు మీద శతహాయనంబులు నవధారాధరంబులు మహాఘోషంబుల తోడం గరికరోప మానంబులయిన నీరధారల నిఖిల జగంబును శంబరమయంబు చేసిన, బ్రహ్మాండంబెల్ల జలమయంబగుటం జేసి; భూమి హృత గంధగుణంబై కబంధంబున లీనంబగును. అన్నీరంబును జీర్ణరసగుణంబై తేజంబున నణంగును ఆతేజంబు వాయువందు నష్టరూపంబై కలయును. ఆ పవనుండు గతస్పర్శగుణుండయి నభంబున సంక్రమించును. ఆయాకాశంబు విగత శబ్దంబయి; భూతాది ప్రకృతి యందు నణంగును. ఆ ప్రకృతియు ననాదియై వాఙ్మనస గోచరంబు గాక సత్త్వరజస్తమో గుణరహితంబై, మహదాది సన్నివేశంబు లేక; స్వప్నాద్య వస్థారహితంబై, యప్రతర్క్యంబగు నాత్మయందు లయంబగు. అదియె సర్వాధార భూతంబయిన పదంబని చెప్పంబడు. కాల విపర్యయంబయి పురుషా వ్యక్తులు లీనంబగును. అది ప్రాకృత ప్రళయంబనంబరగు. అని చెప్పి మఱియు నొక్క విశేషంబు వినుము. బుద్ధీంద్రియార్థ రూపంబులచే జ్ఞానంబు తదాశ్రయంబు వెలుంగు.

తా. ఈ సూతమహర్షి నైమిశారణ్యమున దీర్ఘసత్రమునందు శౌనకాదులు ప్రశ్న చేయగా ఈ భాగవత సంహితను చెప్పను.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
చతుర్థోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశ స్కంధమున
నాలుగవ అధ్యాయము ముగిసినది.

ఓమ్ తత్ సత్.

---

దృశ్యత్వావ్యతి రేకంబులచే నది యాద్యంతములు గలదై యుండు. తేజంబు దీప చక్షుస్స్వరూపంబులకు వేఱుగాని యట్లు, బుద్ధీంద్రియార్థంబులు పరార్థమూర్తికి నన్యంబులుగావు. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు బుద్ధి ధర్మంబులగు ప్రత్యగాత్మయందు నానాప్రకారంబులందోచు; నీదృశ్య ప్రపంచంబంతయు మిథ్యయని తెలియుము. ఒక్కతేజంబు బహురంధ్రంబుల గానంబడు తెఱంగున నొక్కయాత్మ పెక్కు దేహంబుల దోచంబడు. హాటకంబు పెక్కురూపంబులు గలదై యనేకంబయిన తెఱంగున, బరమాత్మ వివిధ చేతనా శరీరముల యందు బెక్కువిధంబులన్ గనబడి నన్నేకంబుగా భావింపవలయు నేత్రంబులకు మేఘావరణంబు దలంగినప్పుడు భాస్కర మండలంబు గమపించు తెఱంగున బంధహేతువయిన యహంకారంబాత్మ జ్ఞానంబున దిరస్కృతంబయిన యప్పుడే పరమాత్మ నిర్మలంబయితోచు. ఆపరమాత్మనునిరంతరంబును దలంచుచుయోగులు తదేకాయత్తచిత్తులైయుండుదురు, కాలంబును వేగంబునన్ సర్వ ప్రపంచమునకు నవస్థాంతరంబులం గల్పించుచుండు. పరమేశ్వరమూర్తియైన కాలంబు. నభంబునం గలుగు తారకంబులు గానరానికరణింగానబడక; కల్పావస్థలంజరించు. నిత్యనైమిత్తిక ప్రాకృతికాత్యంతి కంబులను ప్రళయంబులు చతుర్విధంబులయి పరగు. అందుగల నారాయణు లీలావతారలంబుల గమ్మలభవభవాదులయినను వచింపలేరు. నే నెఱింగి నంతయుం జెప్పితి. సంసారసాగరంబు దాట హరి కథయనెడి నావయె సహాయంబు గాని వేఱొకటి లేదని చెప్పి.

# పంచమోఽధ్యాయః

## ఐదవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

శ్లో. పంచమేతు సమాసేన పరబ్రహ్మోప దేశతః
రాజ్ఞ స్తక్షక సందంశా న్మృత్యుభీతి నివారణమ్

తా. ఈ పంచమాధ్యాయమునందు పరీక్షన్మహారాజునకు పరబ్రహ్మోపదేశమును సంగ్రహముగా చేసి తక్షకుడు కఱచుట వలన కలుగు మృత్యుభయమును నివారించు చున్నాడు.

అవ. ఈ పురాణ శ్రవణము చేయుచు నరుడభయమును పొందు చున్నాడని సమ్మతించి పురాణార్థమును అనుస్మరించుచున్నారు.

శ్రీ శుక ఉవాచ = శ్రీ శుకులు పలికిరి

శ్లో. అత్రానువర్ణ్యతేఽభీక్ష్ణం విశ్వాత్మా భగవాన్ హరిః
యస్య ప్రసాదజో బ్రహ్మా రుద్రః క్రోధ సముద్భవః 1

అ. అత్ర = ఈ భాగవతము నందు; అభీక్ష్ణం = అంతట; విశ్వాత్మా = విశ్వరూపుడైన; భగవాన్ భగవంతుడగు; హరిః = శ్రీమన్నారాయణుడు; అనువర్ణ్యతే = వర్ణింపబడును; యస్య = ఏ భగవంతుని యొక్క; ప్రసాదజః = అనుగ్రహము వలన పుట్టినవాడు; బ్రహ్మా = బ్రహ్మ; రుద్రః = శంకరుడు; క్రోధసముద్భవః = కోపము వలన పుట్టిన వాడు.

తా. తన అనుగ్రహము వలన బ్రహ్మసృష్టిని, కోపము వలన రుద్రుని సృష్టిని చేసిన శ్రీమన్నారాయణుడు ఈ భాగవతము నందంతట వర్ణింపబడుచున్నాడు.

అవ. ఈ భాగవతమును వినినందున నీవు కృతార్థుడివే యని చెప్పుచున్నారు,

శ్లో. త్వంతు రాజ న్మరిష్యేతి పశుబుద్ధి మిమాంజహి
న జాతః ప్రాగభూతోఽద్య దేహవ త్త్వం న నంక్ష్యసి 2

అ. రాజన్! = ఓరాజా!; త్వంతు = నీవు మాత్రము; మరిష్యే ఇతి = చనిపోవుదునని; ఇమాం = ఈ; పశుబుద్ధిం = అవివేకమును; జహి = విడువుము; ప్రాక్ = మొదట; అభూతః = లేనిదై; అద్య = ఇపుడు; దేహవత్ = దేహమువలె; త్వం = నీవు; న జాతః = జనించలేదు; న నంక్ష్యసి = నశించవు.

తా. ఓ రాజా! నీవు చనిపోవుదునను అవివేకమును విడువుము. పూర్వము లేనిదై ఇపుడు జనించిన దేహమువలె నీవు నశింపవు. కావున నీవు పూర్వము లేనివాడవుకావు. ఇపుడు

పుట్టినవాడవు కావు. ఇక మీద లేనివాడవు కావు. దేహధర్మమును నీ యందు ఆరోపించుకొని దుఃఖించుచున్నావు. అట్టి అవివేకమును వీడుము.

అవ. ఓయీ! బీజము నుండి అంకురము జనించునట్లు తనవలన పుత్రరూపమున తానే జనించు చున్నాడు. ఈ విషయమునే శ్రుతికూడా చెప్పుచున్నది.

"అంగాదంగాత్సంభవతి హృదయా దధిజాయతే
ఆత్మావై పుత్రనామాసి స జీవ శరదశ్శతమ్"

"దేహము వలన దేహము జనించుచున్నది. హృదయమువలన నీవు జనించుచున్నావు. ఆత్మ యగు, నేనగు నీవు పుత్రనాముడవగు చున్నావు. ఆ నీవు నూఱు సంవత్సరములు జీవించుము" అని పై శ్రుతి సారాంశము.

అటులనే మరల అంకురము వలన బీజము వలెనే పౌత్రాది రూపమున తానే అగు చున్నాడు. "పితా పుత్రేణ పితృమాన్యోనియోనౌ" అనికదా శ్రుతి.

పిత పుత్రరూపము, పుత్రుడు ప్రతి యోని యందు జనించును. అందువలన వారు నశించునపుడు నేను నశింతు నందువేని అందుకు చెప్పుచున్నారు.

**శ్లో. న భవిష్యసి భూత్వా త్వం పుత్ర పౌత్రాది రూపవాన్**
**బీజాదంకుర వద్దే హాద్వ్యతిరిక్తో యథానలః 3**

అ. త్వం=నీవు; పుత్ర పౌత్రాదిరూపవాన్=పుత్రులు పౌత్రులు మొదలగు వారి రూపము గల వాడవై; భూత్వా=పూర్వముండి; నభవిష్యసి=ఇకమీద నుండబోవు; బీజాత్=బీజము నుండి; అంకురవత్=అంకురమువలె; అంకురము నుండి బీజము వలె ఉండబోవు. దేహాత్=దేహము కంటె; వ్యతిరిక్తః=వేరైన వాడవు; యథా=ఏ ప్రకారము; అనలః=కాష్టము కంటె వేరైన అగ్నియో; అట్లు.

తా. బీజము నుండి అంకురమువలె అంకురము నుండి బీజమువలె నీవు పుత్రపౌత్రాది రూపముగలవాడవై మొదట యుండి యుండలేదు. ఇకముందు ఉండబోవు. దారువు కంటె అగ్ని వేరగునట్లు దేహముకంటె నీవు వేఱైన వాడవు. దేహము నుండి దేహము జనించును కాని ఆత్మజనించదు. ఒక దారువు నాశమైనను అగ్ని మరియొక దారువునందుండును: అట్లే ఈ దేహము నశించినను ఆత్మ మరియొక దేహమున ప్రవేశించును.

అవ. జన్మాదులు దేహధర్మములే కాని ఆత్మ ధర్మములు కావని దృష్టాంతముతో చెప్పు చున్నారు.

---

ఉ. ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవకోట్లకు జావు నిత్యమౌ
గానహరిందలంపుమిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ పొందెదవు మాధవ లోకనివాస సౌఖ్యముల్ః

శ్లో. స్వప్నే యథా శిరచ్ఛేదం పంచత్వాద్యాత్మన స్స్వయమ్
యస్మాత్పశ్యతి దేహస్య తస్మాదాత్మా హ్యజోఽమరః 4

స్వప్నే = స్వప్నము నందు; యథా = ఏ ప్రకారము; ఆత్మనః = తనయొక్క; శిరచ్ఛేదం = శిరచ్ఛేదమును; పంచత్వాది = జాగరణము నందు మరణించుట లోనగు వానిని; యస్మాత్ = ఎందు వలన; స్వయం = స్వయముగా; పశ్యతి = చూచుచున్నాడో; తస్మాత్ = అందు వలన; ఆత్మా = ఆత్మ; అజః = పుట్టుక లేనివాడు: అమరః = మరణ లేనివాడు.

తా. తాను స్వయముగా స్వప్నమునందు తన శిరచ్ఛేదమును, జాగరణము నందు మరణాదికమును చూచుచున్నాడు గాన ఆత్మ పుట్టుక లేనిది మరణము లేనిదని తెలియము. ఈ విషయమునే ఈ శ్లోకము చెప్పుచున్నది. చూడుడు

ఆత్మనః పితృపుత్రాభ్యాం అనుమేయౌ భవాప్యయౌ
న భవా ప్యయ వస్తూనా మభిజ్ఞోఽద్వయ లక్షణః

తండ్రి కొడుకుల రూపమున వర్తించు దేహమునకు జనన మరణము లూహింపదగును. జనన మరణములెరింగిన అద్వయుడైన బ్రహ్మమునకు ఆ జననమరణములు ఉండనేరవు.

ఈ ఆత్మను దేహమను ఉపాధి వలననే జన్మమురణములు సంసారభ్రమ ఏర్పడును. కావున ఉపాధి తొలగినచో భ్రమ తోలగునని దృష్టాంతముతో తెలుపు చున్నారు.

శ్లో. ఘటే భిన్నే యథాఽఽకాశ ఆకాశస్స్యాద్యథా పురా
ఏవం దేహే మృతే జీవో బ్రహ్మ సంపద్యతే పునః 5

అ. యథా పురా = ఘటోపాధికి పూర్వమువలె మరల; ఘటేభిన్నే = ఘటము పగిలిపోగా; ఆకాశః = ఘటములోపల నున్న ఆకాశము; యథా = ఎటుల; ఆకాశస్స్యాత్ = మహాకాశమగునో; ఏవం = ఈ విధముగనే; దేహే = దేహము; మృతే = మరణించగా; జీవః = జీవుడు; పునః = మరల; బ్రహ్మ సంపద్యతే = బ్రహ్మయగు చున్నాడు.

తా. ఘటము పగిలిపోగా ఘటములో నున్న అకాశము మొదటి వలె మహాకాశ మగునో అట్లే దేహము మరణించగా జీవుడు బ్రహ్మయగును.

అవ. జ్ఞానముతో లయమును తెలియుటకు దేహాది ఉపాధివలన కలిగడు సంబంధము మాయవలన ఏర్పడునని తెలుపు చున్నారు.

శ్లో. మనస్సృజతి వైదేహా న్గుణాన్కర్మాణి చాత్మనః
తన్మన స్సృజతే మాయా తతో జీవస్య సంసృతిః 6

అ, మనః వై = మనస్సే; ఆత్మనః = ఆత్మకు; దేహాన్ = దేహములను; గుణాన్ = సత్వాది గుణములను; కర్మాణి = కర్మలను; సృజతి = సృజించును; తన్మనః = ఆ మనస్సును; మాయా = మాయ; సృజతే = సృజించును; తతః = ఆ మాయవలన; జీవస్య = జీవునకు; సంసృతిః = సంసారము.

తా. మనస్సే అత్మకు దేహమును, సత్వాదిగుణత్రయమును, జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను సృజించును. అట్టి మనసును మాయ సృజించును. ఆ మాయోపాధి వలననే జీవునకు సంసారమేర్పడు చున్నది.

అవ. ఈ విషయమునే దృష్టాంతముతో ఒకటిన్నర శ్లోకములో చెప్పుచున్నారు.

శ్లో. స్నేహాధిష్ఠాన వర్త్యగ్ని సంయోగో యావదిష్యతే
తతో దీపస్య దీపత్వం ఏవం దేహకృతో భవః
రజస్సత్వ తమోవృత్యా జాయేతైధేత నశ్యతి 7

అ. స్నేహాధిష్ఠాన వర్త్యగ్ని సంయోగః, స్నేహ=తైలమునకు; అధిష్ఠాన=ఆధారమైన ప్రమిదలో, వర్తి=వత్తియొక్క; అగ్ని సంయోగః = అగ్నియొక్క కూడిక; యావత్=ఎంతవరకు; ఇష్యతే=కోరబడునో; తతః=అంతవరకు; దీపస్య=దీపమునకు: దీపత్వం=దీప ధర్మముండును, ఏవం=ఈ ప్రకారము; దేహకృతః=దేహధారియగు జీవునకు; భవః=సంసారము; రజస్సత్వతమో వృత్యా=రజస్సత్వతమో వృత్తులచే; జాయేత=పుట్టును; ఏధేత= పెరుగును; నశ్యతి=నశించును. ఇది కూడా మనస్సునకే కాని ఆత్మకుకాదు.

తా. నూనెకు అధారమైన ప్రమిదలో వత్తికి అగ్నికి సంబంధము ఎంతవరకు ఉండునో అంతవరకు దీపమునకు దీపధర్మము జ్వాలరూపమున పరిణమించి ప్రకాశించు చుండును. ఇట్లే రజోగుణముచే జనించి, సత్త్వమున వృద్ధిపొంది, తమస్సున నశించునదైన దేహబంధన రూపమగు సంసారము మనస్సునకు మాత్రము కలుగుచున్నది, ఆత్మకుకాదు. అందు కర్మతైలమగును. దానికధిష్టానమగు ప్రమిదవంటిది. మనస్సు. వత్తివంటిది. దేహము. అగ్నిసంయోగము చైతన్యాధ్యాసము. దీపస్థానీయము సంసారము అని తెలియవలయును,

అవ, అందువలన దీపమువలె సంసారమే నశ్ంచును కాని జ్యోతివలె ఆత్మనశించదని తెలుపు చున్నారు.

శ్లో. న తత్రాత్మా స్వయం జ్యోతిః యో వ్యక్తా వ్యక్తయోః పరః
ఆకాశ ఇవ చాధారో ధ్రువోఽనంతోపమో విభుః 8

అ. తత్ర =ఆదేహమునందు; యః=ఎవడు; వ్యక్తావ్యక్తయోః=స్థూల సూక్ష్మ శరీరములకు; పరః=అన్యుడు; స్వయం జ్యోతిః=స్వయం ప్రకాశము; అకాశ ఇవ=అకాశమువలె; ఆధారః= ఆధారభూతుడు; ధ్రువః=ధ్రువుడు; అనంత+ఉపమః=తనకు సాటిలేనువాడగు; ఆత్మా=ఆత్మ; న=నశించడు.

తా. దేహాదికమునందు దోచుచు స్థూల సూక్ష్మ శరీరములకంటె ఇతరుడై స్వయం జ్యోతియై, ఆకాశము వలె దేహాది ప్రపంచములకు ఆధారమై, నిర్వికారుడై అసమానుడై సర్వ వ్యాపియై, సర్వ సమర్థుడగు విభుడైన ఆత్మ నశించదు.

అవ. అందు వలవ ఆ ఆత్మనే చింతింపుము, ఆనుచున్నారు.

శ్లో. ఏవ మాత్మాన మాత్మస్థ మాత్మనైవా మృశప్రభో
బుద్ధ్యానుమాన గర్భిణ్యా వాసుదేవాను చింతయా 9

అ. ప్రభో! =ఓ రాజా! ఏవం=ఈ ప్రకారము; ఆత్మస్థం=దేహాద్యుపాధియందున్న; ఆత్మానం =ఆత్మను; ఆత్మనైవ=మనస్సు చేతనే; అనుమాన గర్భిణ్యా=పొగయున్నచో; అగ్నియుండును. అగ్ని లేకున్నచో పొగయుండదు; జగము దృశ్యము కావున ద్రష్టగలడు. ద్రష్టలేనిచో దృశ్యములేదు. అనునట్టి అనుమానముతో గల; బుద్ధ్యా=బుద్ధిచేతనే; వాసుదేవానుచింతయా=వాసుదేవుని చింతించుట చేతనే; ఆమృశ=విచారించుము.

తా. ఓ రాజా! పైన జెప్పిన విధముగా దేహాద్యుపాధియందున్న ఆత్మను మనిసుచేత, పొగయున్నచో అగ్నియుండును. అగ్ని లేనిచో పొగ ఉండదు. జగము దృశ్యము కావున ద్రష్ట గలడు, ద్రష్టలేనిచో దృశ్యము ఉండదు. అని అనుమానముతో నున్న బుద్ధి చేత, వాసుదేవుని చింతించుచు విచారించుము.

అవ, ఇటుల చేసినచో తక్షకుడు నిన్ను దహింపడను చున్నాడు.

శ్లో. చోదితో విప్రవాక్యేన న త్వాం ధక్ష్యతి తక్షకః
మృత్యవో నోపసర్పంతి మృత్యూనాం మృత్యు మీశ్వరమ్ 10

అ. విప్రవాక్యేన=బ్రాహ్మణ వాక్యముతో; చోదితః=పురికొల్పబడి; తక్షకః=తక్షకుడు; త్వాం=నిన్ను; నధక్ష్యతి=దహింపడు; మృత్యూనాం=మృత్యువులకు; ఈశ్వరం=ప్రభువైన బ్రహ్మను; మృత్యవః=మృత్యువులు; న+ఉపసర్పంతి=సమీపించవు.

తా. ఇట్లు ఆత్మ విమర్శ చేయుచున్న నిన్ను బ్రాహ్మణ వాక్యముతో ప్రేరేపించబడిన తక్షకుడు దహింపడు. మృత్యువులకు ఈశ్వరుడు అనగా నియమించు వాడగు శ్రీమన్నారాయణుని మృత్యువు సమీపించలేదు,

అవ. విమర్శ ప్రకారమును తెలుపుచు తక్షకుడు కనిపించడు అని చెప్పుచున్నారు.

శ్లో. అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాఽహం పరమం పదమ్
ఏవం సమీక్షన్నాత్మానం అత్మన్యాధాయ నిష్కలే 11

అ. అహం=నేను; పరంధామ=పరంజ్యోతియగు; బ్రహ్మ=బ్రహ్మను; పరం పదం=పరమ పదమైన; బ్రహ్మ=బ్రహ్మ; అహం=నేనే; ఏవం=ఈ ప్రకారముగా; ఆత్మానం=ఆత్మను, సమీక్షన్=దర్శించుచు; నిష్కలే=నిరుపాధికమైన; ఆత్మని=బ్రహ్మయందు; ఆత్మానం=ఆత్మను; అధాయ=ఉంచి;

తా. నేను పరంజ్యోతియగు బ్రహ్మను. పరమపదమగు బ్రహ్మ నేనే. ఇట్లు భావించుచు పరమాత్మయందు ఆత్మను నిలుపుము. నేను బ్రహ్మను అను భావనచే జీవునికి శోకాదికము నివృత్తి యగును, బ్రహ్మము నేను అనుభావనచే బ్రహ్మము యొక్క పారోక్ష్యనివృత్తి కలుగును.

శ్లో. దశంతం తక్షకం పాదే లేలిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ విశ్వంచ పృథగాత్మనః 12

అ. లేలిహానం=నాలుకలచే పెదవులను స్పృశించుచు; విషాననైః=విషముతో నిండిన ఆననములచే, పాదే=పాదమునందు; దశంతం=కఱచుచున్న; తక్షకంచ=తక్షకుని; శరీరం చ=శరీరమును; విశ్వం చ=ప్రపంచమును కూడా; ఆత్మనః=ఆత్మకంటె, పృధక్=వేఱుగా; నద్రక్ష్యసి=చూడవు.

తా, ఇట్లు ఆత్మభావన చేసినచో నీవు నాలుకలు చాపుచు విషాగ్నులచే నీ పాదమును కఱచు తక్షక నాగుని, నీ శరీరమును, ఈ ప్రపంచమును కూడా ఆత్మకంటె వేఱుగా చూడవు,

శ్లో. ఏతత్తే కథితం తాత యదాత్మా పృష్టవాన్నృప
హరే ర్విశ్వాత్మనశ్చేష్టాం కిం భూయ శ్రోతుమిచ్ఛసి 13

తాత! = నాయనా! నృప! = ఓ రాజా!; ఆత్మా = నీవు; విశ్వాత్మనః = విశ్వరూపుడైన; హరేః = శ్రీహరియొక్క; చేష్టాం = లీలను, యత్ = దేనిని; పృష్టవాన్ = అడిగితివో, ఏతత్ = ఇది యంతయు; తే = నీకు; కథితం = చెప్పబడినది భూయః = మరల (ఇంకను) కిం = దేనిని శ్రోతుం = వినుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావు

తా. నాయనా! రాజా! విశ్వరూపుడైన శ్రీహరి లీలల గురించి నీవడిగినవన్నియు చెప్పితిని. ఇంకనూ ఏమి వినగోరుచున్నావో తెలుపుము.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
పంచమోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
అయిదవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్

---

వ. జరామరణహేతుకంబయిన శరీరంబున నుండు జీవుండు ఘటంబులలో గనబడెడు నాకాశంబు ఘటనాశంబయిన మహాకాశంబునం జేరు చదంబున నీశ్వరుంగలయు; తైలనాశన పరంజ్యోతంబు వర్తితేజంబుతోడ వెలుంగుకరణి, దేహకృతంబగు భవంబు రజస్సత్త్వతమో గుణంబులచేత బ్రవర్తించు ఆత్మ నభంబు మాడ్కి ధ్రువంబై; వ్యక్తావ్యక్తంబులకు బరంబై యుండు. ఇట్లాత్మ స్వరూపునిగా హరిని నిరంతరంబు భావించుచుండుట విశేషంబు నిన్ను దక్షకుండు గఱచునను భయంబు నొందవలదు. హరిం దలంపుము. ధన గృహదారాపత్యక్షేత్ర పశు ప్రకరంబుల వర్జించి, సమస్తంబును నారాయణార్పణంబు చేసి విగత శోకుండవై నిత్యంబును హరి ధ్యానంబు సేయుము. అని వినిపించిన రాజేంద్రుండును గుశాసనాసీనుండై జనార్దనుం జింతింపు చుండెను. అంత శుకుండును యధేచ్ఛావిహారుండై చనియె.

# షష్ఠోఽధ్యాయః

## ఆరవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**షష్ఠే పరీక్షితో మోక్ష స్సర్పహోమాది తత్సుతాత్**
**వేద శాఖా విభాగోక్తా త్రివేద వ్యాస వర్ణనమ్**

ఈ ఆరవఅధ్యాయమందు పరీక్షిత్తు మోక్షము, అతని సుతుడు సర్పయాగము చేయుట వేదశాఖల విభాగము, మూడువేదముల విస్తారము అనువానిని చెప్పిరి.

శ్రీసూత ఉవాచ = శ్రీసూతులు పలికిరి.

శ్లో. **ఏతన్నిశమ్య మునినాభిహితం పరీక్షిద్వ్యాసాత్మజేన నిఖిలాత్మదృశా సమేన**
**తత్పాదమూల ముపసృత్య నతేన మూర్ధ్నా బద్ధాంజలి స్తమిద మాహ సవిష్ణురాతః 1**

అ. నిఖిలాత్మదృశా = సర్వాత్ముడగు హరిని తనయందు చూచువాడును; సమేన = సర్వసముడైన, మునినా = మునియగు; వ్యాసాత్మజేన = వ్యాసపుత్రుడగు శుకమహర్షి చేత; అభిహితం = చెప్పబడిన; ఏతత్ = ఈ ప్రకారముగా చెప్పిన హరి మహిమను; నిశమ్య = విని; సః విష్ణురాతః = అవిష్ణువుచే కాపాడబడిన; పరీక్షిత్ = పరీక్షిన్మహా రాజు; తత్పాదమూలం = ఆ శుకమహర్షి పాదమూలమును, ఉపసృత్య = సమీపించి, బద్ధాంజలిః = చేతులు మోడ్చి; నతేన మూర్ధ్నా = వంచిన శిరస్సుచే; తం = ఆశుకమహర్షిని గూర్చి; ఇదం = ఈ మాటను; ఆహ = పలికెను.

తా. సర్వభూతాత్ముడగు శ్రీహరిని తనయందు చూచుటచే సర్వసముడైన శ్రీ శుకయోగీన్ద్రులు చెప్పిన శ్రీహరిమహిమను వినిన పరీక్షిన్మహారాజు శుకయోగీన్ద్రునిపాదమూలమును సమీపించి, చేతులుమోడ్చి, అతనితో ఇట్లు పలికెను.

శ్లో **సిద్ధోఽస్మ్యను గృహీతోఽస్మి భవతా కరుణాత్మనా**
**శ్రావితో యచ్చ మే సాక్షాత్ అనాది నిధనోహరిః 2**

అ. కరుణాత్మనా = దయతో నిండిన చిత్తము గల; భవతా = మీచే; యత్ = ఏ కారణముచే; అనాది నిధనః = అద్యంతములు లేని; హరిః = శ్రీహరి; సాక్షాత్ = ప్రత్యక్షముగా; శ్రావితః = వినిపింపబడితిని, కనుక; సిద్ధోఽస్మి = కృతార్థుడనైతిని; అనుగృహీతోఽస్మి = అనుగ్రహించబడితిని.

తా. ఓకరుణామయా! మీరు ప్రత్యక్షముగా శ్రీహరి కథను వినిపించి నన్ను కృతార్థుల చేసితిరి. మీ వలన అనుగ్రహింపబడితిని.

అవ. శ్రీశుకయోగీన్ద్రుల కరుణను రెండు శ్లోకములతో అభినందించుచున్నారు.

శ్లో. నా త్యద్భుత మిదం మన్యే భవతా మచ్యుతాత్మనామ్
అజ్ఞేషు తాపతప్తేషు భూతేషు యదనుగ్రహః 3

అ. అచ్యుతాత్మనాం=విష్ణువును ఆత్మగా తెలిసికొనిన; భవతాం=మీకు; తాపతప్తేషు=సంసార తాపముల తప్తులైన; అజ్ఞేషు=జ్ఞానములేని, భూతేషు=ప్రాణులందు; యత్=ఏ మీ; అనుగ్రహః= అనుగ్రహము గలదో; ఇదం=ఇది; అత్యద్భుతం=అత్యద్భుతమని; నమన్యే=తలచను అనగా సహజమే అనుట.

తా. మహావిష్ణువు సర్వాత్మయని తెలిసిన మీరు సంసారతాపమున మాడుచు,అజ్ఞానులగు ప్రాణులందు దయతలచుట ఆశ్చర్యకరమని నేను తలచను. ఏలయన అది మీకు సహజ స్వభావము.

శ్లో. పురాణ సంహితమేతా మశ్రౌష్మ భవతో వయమ్
యస్యాం ఖలూత్తమ శ్లోకో భగవాననువర్ణ్యతే 4

అ. ఏతాం=ఈ; పురాణ సంహితాం=వేదతుల్యమైన; పురాణ సంహితను; వయం=మేము; భవతః=మీవలన; అశ్రౌష్మ=వినియుంటిమి; యస్యాం=ఏ పురాణ సంహితయందు; ఉత్తమ శ్లోకః =పవిత్ర చరిత్రగల; భగవాన్=పరమాత్మ; అనువర్ణ్యతేఖలు=వర్ణించబడునుకదా.

తా. పవిత్ర చరిత్రుడగు భగవంతుని వర్ణించు, వేదతుల్యమైన పురాణ సంహితను మీవలన మేము వినగలిగితిమి.

అవ. సిద్ధుడనైతినని ఇదివరకు చెప్పిన దానినే మరల ప్రకటించుచున్నారు.

శ్లో. భగవం స్తక్షకాదిభ్యో మృత్యుభ్యో న బిభేమ్యహమ్
ప్రవిష్టో బ్రహ్మ నిర్వాణ మభయం దర్శితం త్వయా 5

అ. భగవన్! ఓ పూజ్యుడా!; అహం=నేను; మృత్యుభ్యః=మృత్యువు హేతువులైన; తక్షకాదిభ్యః=తక్షకుడు మొదలగు వాటివలన; న బిభేమి=భయపడను; త్వయా=నీ చేత; దర్శితం=చూపబడిన; అభయం=భయరహితమైన; నిర్వాణం=కైవల్య రూపమైన; బ్రహ్మ=పర బ్రహ్మను; ప్రవిష్టః=ప్రవేశించితిని.

తా. ఓ భగవంతుడా! నేను మృత్యుహేతువులైన తక్షకాదుల వలన భయపడను. ఏలనన మీరు చూపిన అభయ స్వరూపమున కైవల్యరూపము అయిన పరబ్రహ్మలో ప్రవేశించితిని

అవ. ఇంకను ఏమి వినగోరెదవు అని శుకమహర్షి అడిగిన ప్రశ్నకు నేను కృతార్థుడ నైతిని. ఇక వినవలసినదేమియునులేదు. కేవలము మీఅనుజ్ఞను కోరుచున్నాను అనుచున్నాడు.

శ్లో. అనుజానీహి మాం బ్రహ్మన్వాచం యచ్ఛామ్యధోక్షజే
ముక్తకామాశయం చేతః ప్రవేశ్య విసృజామ్యహమ్ 6

అ. బ్రహ్మన్! =ఓ బ్రాహ్మణోత్తమా ; మాం=నన్ను; అనుజానీహి=అనుమతించుము; వాచం=వాక్కును; అన్ని ఇంద్రియములను యచ్ఛామి=నియమించెదను; ముక్తకామాశయం= విడువబడిన కామవాసనలుగల; చేతః=చిత్తమును; అధోక్షజే=విష్ణువునందు ప్రవేశ్య=ప్రవేశపెట్టి అసూన్=ప్రాణములను; విసృజామి=విడిచెదను.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నన్ను అనుమతింపుము. వాక్కు మొదలగు నింద్రియముల నన్నింటిని నియమించి, కామవాసనలను వదలిన చిత్తము శ్రీమన్నారాయణునియందు ప్రవేశింపచేసి ప్రాణములను విడిచెదను.

అవ. ప్రాణత్యాగముచేయనేల? కొంతకాలము జ్ఞాననిష్ఠుడవుకమ్ము అనగా చెప్పుచున్నాడు.

శ్లో. అజ్ఞానం చ నిరస్తంమే జ్ఞాన విజ్ఞాన నిష్ఠయా
భవతా దర్శితం క్షేమం పరం భగవతః పదమ్ 7

అ. మే = నా యొక్క; అజ్ఞానం = అజ్ఞానము; జ్ఞాన విజ్ఞాన నిష్ఠయా = ఆత్మ నిష్ఠచే; నిరస్తం = తొలగించబడినది; భవతా = తమచేత; భగవతః = భగవంతుని యొక్క; క్షేమం = క్షేమప్రదమైన పరం పదం = పరమ పదము; దర్శితం = చూపబడినది

తా. ఆత్మనిష్ఠచే నా అజ్ఞానము నశించినది, మీరు క్షేమప్రదమైన భగవంతుని పరమ పదమును చూపితిరి.

సూత ఉవాచ = సూతమహర్షి పలికెను.

శ్లో. ఇత్యుక్త స్త మనుజ్ఞాయ భగవాన్బాదరాయణిః
జగామ భిక్షు భిస్సాకం నరదేవేన పూజితః 8

అ. ఇతి = ఈ ప్రకారముగా; ఉక్తః = పలుకబడినవాడై, తం = ఆ పరీక్షిత్తును, అనుజ్ఞాయ = అనుమతించి; నరదేవేన = పరీక్షిత్తుచే; పూజితః = పూజించబడి; భగవాన్ = పూజ్యుడైన; బాదరాయణిః వ్యాసపుత్రుడైన శుకమహర్షి; భిక్షుభిస్సాకం = యతులతో కలసి జగామ = వెళ్ళెను

తా. పరీక్షిన్మహారాజు ఇటుల పలుకగా శుకమహర్షి అతనిని అనుమతించి అతనిచే పూజింపబడి యతులతో కలసి వెడలిపోయెను.

శ్లో. పరీక్షిదపి రాజర్షి రాత్మన్యాత్మాన మాత్మనా
సమాధాయ పరం దధ్యా వస్పందాసు ర్యథా తరుః 9

అ రాజర్షిః = రాజర్షియైన; పరీక్షిత్తుకూడా; ఆత్మని = ప్రత్యక్ప్రకాశమందు; ఆత్మానం = మనస్సును, ఆత్మనా = బుద్ధిచే, సమాధాయ = చక్కగా ఉంచి, అస్పంద + అసుః = లీనమైన ప్రాణము గలవాడై; తరుః యథా = చెట్టుమొద్దువలె; పరం = పరమాత్మను; దధ్యౌ = ధ్యానించెను.

తా. రాజర్షియగు పరీక్షిత్తుకూడా బుద్ధిచే తన మనస్సును మరల్చి, హృదయమును ప్రకాశస్వరూపమందు జేర్చి చెట్టుబోదెవలె చలించక, అంతర్లీనమైన ప్రాణముగలవాడై పరమాత్మను ధ్యానించెను.

శ్లో. ప్రాక్కూలే బర్హిష్యాసీనో గంగాకూల ఉదఙ్ముఖః
బ్రహ్మభూతో మహాయోగీ నిస్సంగ శ్ఛిన్న సంశయః 10

అ. గంగాకూలే = గంగా తీరమున; ప్రాక్కూలే = తూర్పుకొనలుగల; బర్హిషి = దర్భాసన మందు

ఆసీనః = కూర్చున్నవాడై; మహాయోగీ = మహాయోగము కలవాడై; నిస్సంగః = సంగరహితుడై, ఛిన్న సంశయః = సంశయములు తొలగినవాడై; బ్రహ్మభూతః = బ్రహ్మమేయైయుండెను.

తా గంగాతీరమున తూర్పుకొనలుగల దర్భాసనమందు కూర్చొని, మహాయోగముతో సంగరహితుడై సంశయములు తొలగినవాడై బ్రహ్మమే అయియుండెను.

అవ. ఇటుల తానే బ్రహ్మ అయిన పరీక్షిత్తునకు తక్షకుని రాక మొదలగునవి పిష్టపేష ణమువలె (పిండిని ఇసిరినట్లు) ఉండునని మూడుశ్లోకములతో చెప్పుచున్నాడు.

శ్లో. తక్షకః ప్రహితో విప్రాః క్రుద్ధేన బ్రహ్మసూనునా
హంతుకామో నృపం గచ్ఛన్ దదర్శ పథి కాశ్యపమ్ 11

అ. విప్రాః ; = ఓ బ్రాహ్మణోత్తములారా !; క్రుద్ధేన = కోపించిన బ్రహ్మసూనునా = బ్రాహ్మణ కుమారునితో; ప్రహితః = పంపబడిన; తక్షకః = తక్షకుడు; నృపం = రాజును; హంతుకామః = చంపగోరి; గచ్ఛన్ = వెళ్ళుచు; పథి = మార్గము నందు; కాశ్యపం = కాశ్యపుడను బ్రాహ్మణుని; దదర్శ చూచెను.

తా ఓ బ్రాహ్మణోత్తములారా! కోపించి బ్రాహ్మణకుమారునిచే పంపబడిన తక్షకుడు రాజును చంపగోరి వెళ్ళుచు మార్గమధ్యమున కాశ్యపుడను బ్రాహ్మణుని జూచెను.

శ్లో. తం తర్పయిత్వా ద్రవిణైః నివర్త్య విషహారిణమ్
ద్విజరూప ప్రతిచ్ఛన్నః కామరూపోఽదశన్నృపమ్ 12

అ. విషహారిణం = విషవైద్యుడగు; తం = ఆకాశ్యపుని; ద్రవిణైః = ధన కనకాదులచే, తర్ప యిత్వా = తృప్తిపరచి; నివర్త్య = మరల్చి; కామరూపీ = కోరిన రూపమును దాల్చగల ఆ తక్షకుడు; ద్విజరూప ప్రతిచ్ఛన్నః = బ్రాహ్మణ రూపమున తనరూపును కప్పి పుచ్చినవాడై; నృపం = రాజును; అదశత్ = కాటువేసెను.

తా. ఆ విషచికిత్స చేసి పరీక్షిత్తును బ్రతికించి ద్రవ్యార్జన చేయవలయునని వెళ్ళుచున్న ఆకాశ్యపుని చూచి. అతని శక్తిని పరీక్షించుటకు ఒకమహావృక్షమును కాటువేసి భస్మము చేయగా, అవిప్రుడు మరల దానిని తన చికిత్సచే అంకురాదిక్రమముగ యథాప్రకారము పెరు గునట్లు చేయగా చూచి, ఆవిప్రునికి వలయుద్రవ్యమునిచ్చి పంపించి, కామరూపియైన తక్షకుడు బ్రాహ్మణ వేషముతో తనరూపుగాననీయక వచ్చి పరీక్షిత్తును కాటువేసెను.

అవ. ఆ తక్షక కృత్యము పుత్రకృత్యము వలె ఆయెనని రెండుశ్లోకములతో చెప్పు చున్నాడు.

శ్లో. బ్రహ్మభూతస్య రాజర్షేః దేహోఽహి గరళాగ్నినా
బభూవ భస్మసాత్సద్యః పశ్యతాం సర్వదేహినామ్ 13

అ. సర్వదేహినాం = ఎల్లప్రాణులు; పశ్యతాం = చూచుచుండగా; బ్రహ్మభూతస్య = బ్రహ్మమే తానయిన; రాజర్షేః = రాజర్షియగు పరీక్షిత్తు యొక్క; దేహః = దేహము; అహిగరళాగ్నినా = సర్పము యొక్క విషాగ్నిచే సద్యః = వెంటనే; భస్మసాత్ = భస్మముగా; బభూవ = ఆయెను.

తా. ప్రాణులందరు చూచు చుండగా, బ్రహ్మయే అయిన రాజర్షియగు పరీక్షిత్తుదేహము తక్షక విషాగ్నిచే వెంటనే భస్మమాయెను చనిపోయిన తండ్రిని పుత్రుడు దహించినట్లు తక్షకుడు పరీక్షిత్తును దహించెను.

అవ. అచట క్షణకాలము ఎల్లరకు దుఃఖము, తరువాత మహోత్సవము జరిగినదని రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. హాహాకారో మహానాసీద్భువి ఖే దిక్షు సర్వతః**
**విస్మితా అభవన్సర్వే దేవాసురనరాదయః 14**

అ. భువి = భూమి మీద; ఖే = ఆకాశము నందు; దిక్షు = దిక్కులలో; సర్వతః = అంతట; మహన్ = గొప్ప; హాహాకారః = హాహాకారము; అసీత్ = ఆయెను; దేవాసురనరాదయః = దేవతలు; రాక్షసులు; మానవులు మొదలగు; సర్వే = ప్రాణులందరు; విస్మితాః = ఆశ్చర్యమును పొందినవారై; అభవన్ = ఆయిరి.

తా. భూమి మీద ఆకాశములో దిక్కులలో అంతట భస్మమైన పరీక్షిత్తును చూచి గొప్ప హాహాకారమాయెను దేవతలు రాక్షసులు మానవులు మొదలగు ప్రాణులందరు ఆశ్చర్యమును పొందిరి.

**శ్లో. దేవ దుందుభయో నేదు ర్గంధర్వాప్సరసో జగుః**
**వవృషుః పుష్ప వర్షాణి విబుధాస్సాధువాదినః 15**

అ. దేవ దుందుభయః = దేవదుందుభులు; నేదుః = మ్రోగినవి; గంధర్వాప్సరసః = గంధర్వులు అప్సరసలు; జగుః = గానము చేసిరి, పుష్ప వర్షాణి = పూలవానలు; వవర్షుః = కురిసినవి; విబుధాః = దేవతలు; సాధువాదినః = మెచ్చుకొనుచు అభినందించిరి

తా. ఆ సమయమున దేవదుందుభులు మ్రోగినవి. గంధర్వులు అప్సరసలు గానము చేసిరి. పూలవానలు కురిసినవి. దేవతలు అభినందించిరి

**శ్లో. జనమేజయ స్స్వపితరం శ్రుత్వా తక్షక భక్షితమ్**
**యథా జుహావ సంక్రుద్ధ స్సర్పాన్ సత్రే సహద్విజైః 16**

అ. జనమేజయః = జనమేజయుడు; స్వపితరం = తన తండ్రియగు పరీక్షిత్తును; తక్షక భక్షితం = తక్షకుని కాటుచే వేయబడుటను, శ్రుత్వా = విని; సంక్రుద్ధః = మిక్కిలి కోపించి; సత్రే = సత్ర యాగమున; ద్విజైః సహ = బ్రాహ్మణులతో గూడి; యథా = శాస్త్రవిహితముగా; సర్పాన్ = సర్పములను జుహావ = హోమము చేసెను.

తా. జనమేజయమహారాజు తన తండ్రియగు పరీక్షిన్మహారాజు తక్షకుని కాటుకు గురి యగుట విని మిక్కిలి కోపించి, సత్రయాగమున బ్రాహ్మణులతో గూడి విధి విధానముతో సర్పములను హోమము చేసెను.

**శ్లో. సర్పసత్రే సమిద్ధేఽగ్నౌ దహ్యమానాన్మహోరగాన్**
**దృష్ట్వేన్ద్రం సర్ప ఉద్విగ్న స్తక్షక శ్శరణం యయౌ 17**

అ. సర్పసత్రే=సర్పయాగమందు, సమిద్ధే = ప్రజ్వలించుచున్న, అగ్నౌ = అగ్నియందు, దహ్యమానాన్=కాలిపోవుచున్న, మహోరగాన్=గొప్పసర్పములను, దృష్ట్వా=చూచి, తక్షకః సర్పః= తక్షక సర్పము, ఉద్విగ్నః=కలతనొంది, ఇంద్రం=ఇంద్రుని, శరణంయయౌ=శరణుజొచ్చెను.

తా. సర్పయాగమందు బాగుగా ప్రజ్వలించుచున్న అగ్నిలో పడి కాలిపోవుచున్న మహాసర్పములను చూచిన తక్షకుడు కలత నొంది ఇంద్రుని శరణు జొచ్చెను.

శ్లో. నాగతం తక్షకం తత్ర దృష్ట్వా పారీక్షితో ద్విజాన్
ఉవాచ తక్షకః కస్మాన్న దహ్యేతోరగాధమః 18

అ. పారీక్షితః = పరీక్షిన్మహారాజుపుత్రుడైన జనమేజయుడు; తత్ర = ఆ అగ్నియందు; తక్షకం=తక్షకుని. నాగతం = రాని వానినిగా; దృష్ట్వా=చూచి; ద్విజాన్ = బ్రాహ్మణులను ఉద్దేశించి; ఉరగాధమః = సర్పములలో అధముడైన; తక్షకః=తక్షకుడు; కస్మాత్=ఎందువలన, న దహ్యేత =దహింపబడడు అని; ఉవాచ = పలికెను.

తా. ఆ సర్పయాగములో తక్షకుడు రాకపోవుటను చూచి, తక్షకుడు ఎందుకు దహింప బడుట లేదని బ్రాహ్మణుని అడిగెను.

శ్లో. తం గోపాయతి రాజేన్ద్ర శక్రశ్శరణమాగతమ్
తేన సంస్తంభిత స్సర్ప స్తస్మాన్నాగ్నౌ పతత్యసౌ 19

అ. రాజేన్ద్ర ,=ఓ మహారాజా !; శరణం + ఆగతం = శరణు జొచ్చిన; తం = ఆ తక్షకుని; శక్రః = ఇంద్రుడు; గోపాయతి = కాపాడుచున్నాడు తేన = ఆ ఇంద్రునిచే, సంస్తంభితః = స్తంభింప చేయబడి; అసౌ = ఈ; సర్పః = తక్షకుడు; అగ్నౌ = అగ్నియందు; తస్మాత్ = ఆ కారణము వలన; న పతతి = పడుటలేదు.

తా. ఓ మహారాజా! ఆ తక్షకుడు ఇంద్రుని శరణు జొచ్చెను ఇంద్రుడు తక్షకుని అగ్నిలో పడకుండా కాపాడు చున్నాడు. అందువలన తక్షకుడు అగ్నిలో పడుట లేదని బ్రాహ్మణులు రాజునకు తెలిపిరి.

శ్లో. ఇతి పారీక్షితశ్శ్రుత్వా ప్రాహర్త్విజ ఉదారధీః
సహేన్ద్ర స్తక్షకో విప్రా నాగ్నౌ కిమితి పాత్యతే 20

అ ఉదారధీః = విపులమైన బుద్ధిగల; పారీక్షితః = జనమేజయుడు; ఇతి = ఈ మాటలను, శ్రుత్వా = విని; ఋత్విజః = ఋత్విక్కులను గూర్చి; విప్రాః = ఓ బ్రాహ్మణులారా; సహేన్ద్రః = ఇంద్రునితో గూడిన; తక్షకః = తక్షకుడు: అగ్నౌ = అగ్ని యందు; కిమితి = ఎందువలన; నపాత్యతే = పడవేయబడుట లేదు అని; ప్రాహ = పలికెను.

తా. ఆ బ్రాహ్మణుల మాటలు విని విపుల బుద్ధిగల జనమేజయుడు ఆ విప్రులతో, ఇంద్రునితో కూడిన తక్షకుని అగ్నిలో ఏల పడవేయుట లేదని అడిగెను

శ్లో. తచ్ఛ్రుత్వా జుహువు ర్విప్రా స్సహేన్ద్రం తక్షకం మఖే
తక్షకాశు పతస్వేహ సహేన్ద్రేణ మరుత్వతా 21

అ. తత్ = ఆ రాజు మాటను; శ్రుత్వా = విని; విప్రాః = బ్రాహ్మణులు; మఖే = యజ్ఞమునందు సహేన్ద్రం = ఇంద్రునితో కూడిన; తక్షకం = తక్షకుని; జుహువుః = హోమము చేసిరి మరుత్వతా = మరుద్గణముతో కూడిన; ఇన్ద్రేణ సహ = ఇంద్రునితో కూడి; తక్షక ! = ఓ తక్షకా !; ఆశు = త్వరగా; ఇహ = ఈ అగ్నియందు; పతస్వ = పడుము.

తా. ఆ రాజు మాటలను వినిన బ్రాహ్మణులు తక్షకా! మరుద్గణములతో కూడిన ఇంద్రునితో కలిసి ఈ అగ్నిలో పడుము అని ఇంద్రునితో కూడిన తక్షకుని హోమములో ఆహ్వానించిరి.

శ్లో. ఇతి బ్రహ్మోదితాక్షేపైః స్థానాదింద్రః ప్రచాలితః
బభూవ సంభ్రాన్తమతిః సవిమాన స్సతక్షకః **22**

అ. ఇతి = ఈవిధముగా; బ్రహ్మోదితాక్షేపైః = బ్రాహ్మణులచే పలుకబడిన పరుషవాక్యములచే ఇంద్రః = ఇంద్రుడు; స్థానాత్ = తన స్థానము నుండి; సవిమానః = విమానముతో; సతక్షకః = తక్షకునితో కూడి; ప్రచాలితః = చలించినవాడై; సంభ్రాన్తమతిః = కలవరపాటు కల మనస్సు కలవాడై; బభూవ = ఆయెను.

తా. ఈవిధముగా బ్రాహ్మణుల మాటలతో, విమానముతో తక్షకునితో ఇంద్రుడు కదలి కలవరపడెను.

శ్లో. తం పతంతం విమానేన సహ తక్షక మంబరాత్
విలోక్యాంగిరసః ప్రాహ రాజానం తం బృహస్పతిః **23**

అ. విమానేన = విమానముతో; అంబరాత్ = ఆకాశము నుండి; సహతక్షకం = తక్షకునితోకూడి పతంతం = పడుచున్న, తం = ఆ ఇంద్రుని; విలోక్య = చూచి, తం = ఆ; రాజానం = జనమేజయుని గూర్చి; ఆంగిరసః = ఆంగిరసుని కొడుకైన; బృహస్పతిః = బృహస్పతి; ప్రాహ = పలికెను.

తా. విమానముతో తక్షకునితో అకాశమునుండి పడుచున్న ఇంద్రుని చూచిన అంగిరసుని పుత్రుడగు బృహస్పతి జనమేజయుని గూర్చి ఇటుల పలికెను.

శ్లో. నైష త్వయా మనుష్యేన్ద్ర వధమర్హతి సర్పరాట్
అనేన పీతమమృతం అతోఽయ మజరామరః **24**

---

వ. ఇట్లు క్రుద్ధుండయిన బ్రాహ్మణోత్తమునిచే బ్రేరితుండయిన తక్షకుండు; ద్విజరూపంబు దాల్చి; పరీక్షిద్వధార్థంబుగా నేతెంచుచుండి: మధ్యమార్గంబున గాశ్యపుండగు సర్ప విషహరణ సమర్థుండగు వేఱొక విప్రునిం గని; యతని నపరిమిత ధనప్రదానంబున దృప్తుంగావించి; పరీక్షిన్నికటంబునకు రాకుండునట్లు నొనర్చి; యంతట పరీక్షిన్మహా రాజు చెంతకుం జని; కామరూపుండగుటం జేసి; యురగంబై; రాజుం గఱచిన; నతండు నాక్షణంబ విషాగ్నిచే భస్మీభూతుండయ్యె. అట్టి యవసరంబున భూమ్యంతరిక్షంబుల నుండు నిఖిలప్రాణులాశ్చర్య కరంబగు తన్మరణంబు గని హాహారవంబులు సేసిరి. అంత నీయర్థంబు నతని తనయుండైన జనమేజయుండు విని, క్రోధావేశంబున సర్ప ప్రళయంబగునట్లు యజ్ఞంబు సేయుచుండ; సహస్ర సంఖ్యలం గల సర్పంబులు హతంబులయ్యె. ఆ సమయంబున తక్షకుండు రాకుండుట నెఱింగి "సహేన్ద్ర తక్షకాయానుబ్రూహి" అను ప్రేషవాక్యము నాడువ; నంత

అ మనుష్యేన్ద్ర = ఓ మహారాజా !; త్వయా = నీచేత; ఏషః = ఈ, సర్పరాట్ = సర్పరాజైన తక్షకుడు; త్వయా = నీ చేత; వధం = వధను; నార్హతి = తగడు; అనేన = ఈతక్షకునచే; అమృతం = అమృతము; పీతం = త్రాగబడినది; అతః = ఇందు వలన; అయం = ఇతను; అజర + అమరః = జరామరణములు లేనివాడు.

తా ఓ జనమేజయ మహారాజా! ఈ సర్పరాజైన తక్షకుని నీవు వధింపదగదు. ఈ తక్షకుడు అమృతము త్రాగినందున జరామరణములు లేనివాడు.

అవ. అజరామరణుడైనను నా తండ్రిని చంపిన వానిని నేను దహింపచేతుననగా చెప్పుచున్నారు.

**శ్లో. జీవితం మరణం జంతో ర్గతి స్స్వేనైవ కర్మణా**
**రాజం స్తతోఽన్యో నాస్త్యన్య ప్రదాతా సుఖదుఃఖయోః 25**

అ. జంతోః = ప్రాణికి; జీవితం = బ్రతుకు; మరణం = చావు; గతిః = పరలోకగమనము; స్వేన = తన; కర్మణా + ఏవ = కర్మ చేతనే; రాజన్ ! = ఓరాజా; తతః = అందువలన; అస్య = ఈ ప్రాణికి; సుఖ దుఃఖయోః = సుఖదుఃఖముల; ప్రదాతా = ఇచ్చువాడు; అన్యః = ఇతరుడు; నాస్తి = లేడు.

తా. ఓ రాజా! ప్రతిప్రాణికి చావు బ్రతుకులు పరలోకప్రాప్తి తనకర్మ వలననే వచ్చును. కావున ప్రాణులకు ఇతరులెవ్వరూ సుఖదుఃఖముల నీయజాలరు. కావున నీ తండ్రి మరణము తక్షకునిచే కలిగినదని భావించరాదని భావము.

అవ సుఖదుఃఖములనిచ్చువారు ఇతరులేల లేరు. సర్పములు చోరులు మొదలగువారు గలరు. కదా అనినచో చెప్పుచున్నారు.

**శ్లో. సర్ప చోరాది వహ్న్యంబు క్షుత్తృడ్వ్యాధ్యాది భిర్నృప!**
**పంచత్వ మృచ్ఛతే జంతు ర్భుంక్తే హ్యారబ్ధ కర్మచ. 26**

అ. సర్ప = పాములు; చోర = దొంగలు; ఆది = మొదలగునవి; వహ్ని = అగ్ని; అంబు = జలము; క్షుత్ = ఆకలి; తృట్ = దప్పిక; వ్యాధి = రోగము; ఆదిభిః = మొదలగు వాటిచే నృప! = ఓ రాజా ! జంతుః = ప్రాణి; పంచత్వం = మృతిని; ఋచ్ఛతే = పొందును; ఆరబ్ధ కర్మ = ప్రారబ్ధ కర్మను; భుంక్తేచ = అనుభవించును.

తా. ఓ రాజా! ప్రాణి పాములు, దొంగలు, అగ్ని, నీరు, ఆకలి, దప్పి రోగములు మొదలగు వానితో మృతిబొందును తన ప్రారబ్ధకర్మను అనుభవించును. అనగా పాములు మొదలగునవి తన కర్మవశమున వచ్చినవే కానీ స్వతంత్రములు కావని భావము.

**శ్లో. తస్మాత్సత్ర మిదం రాజన్! సంస్థీయే తాభి చారకమ్**
**సర్పా అనాగసో దగ్ధా జనైరిష్టంహి భుజ్యతే 27**

---

తక్షక సహితుండయి విమానముతో నింద్రుండు స్థానభ్రంశంబు నొంది పడుచుండ నత్తఱి బృహస్పతి యేతెంచి; పరీక్షిత్తనయునిం గీర్తింప దొణంగె. 28

అ. రాజన్! ఓ రాజా!; తస్మాత్ = అందువలన; ఆభిచారికం = హింసఫలముగా గల; ఇదం = ఈ; సత్రం = సర్పయాగము; సంస్థీయేత = సమాప్తి పొందుగాక; అనాగసః = నిరపరాధులైన; సర్పాః = పాములు; దగ్ధాః = దహించబడినవి; జనైః = ప్రాణుల చేత; దిష్టం = పూర్వజన్మ కర్మ; భుజ్యతే హి = అనుభవించబడును.

తా. ఓ రాజా! అందువలన సర్పహింస చేయు ఈ సత్రమును సమాప్తి చేయుము. నిరపరాధులైన సర్పములు దహించబడినవి. అన్ని ప్రాణులు పూర్వ జన్మ కర్మనే అనుభవించును. కావున సర్పముల దహింప చేయుట సర్పముల పూర్వకర్మయే కాని నీ అపరాధ మేమియును లేదని భావము.

శ్లో. ఇత్యుక్తస్స తథేత్యాహ మహర్షేర్మానయన్వచః
సర్ప సత్రా దుపరతః పూజయామాస వాక్పతిమ్ 28

అ. ఇతి = ఈవిధముగా; ఉక్తః = చెప్పబడినవాడై; సః = ఆజనమే జయమహారాజు; మహర్షేః = మహర్షియైన బృహస్పతి యొక్క; వచః = మాటను; మానయన్ = మన్నించుచు; తథేతి = అటులనే అని; అహ = పలికెను; సర్పసత్రాత్ = సర్పయాగము నుండి; ఉపరతః = విరమించినవాడై; వాక్పతిం = బృహస్పతిని; పూజయా మాస = పూజించెను.

తా. ఈ విధముగా బృహస్పతి చెప్పిన మాటలను మన్నించి ఆ జనమేజయుడు అటులనే అని సర్పయాగమును విరమించి బృహస్పతిని పూజించెను.

అవ. ఎవరి కర్మఫలము వారే అనుభవింతురని తెలిసిననూ బ్రాహ్మణుని కోపము వలన పరీక్షిత్తు మృతిచెందెనని, జనమేజయుని కోపము వలన సర్పములు నశించినవని పండితులుకూడా ఏలపలికెదరనగా చెప్పుచున్నారు.

శ్లో. సైషా విష్ణోర్మహామాయా బాధ్యయా చాప్య లక్షణా
యయా ముహ్యంత్యాత్మభూతా భూతేషు గుణవృత్తిభిః 29

అ. సా + ఏషా = అందుకు కారణమైన ఆ ఇది; విష్ణోః = విష్ణువుయొక్క; మహామాయా = గొప్పమాయ, అలక్షణా = లక్షణము చెప్పరానిది అబాధ్యయా = బాధింప శక్యముకాని; యయా = ఏవిష్ణుమాయచే; ఆత్మభూతాః = విష్ణువు యొక్క అంశభూతులైన వారు; గుణ వృత్తిభిః = రజ స్తమో గుణ వృత్తులగుకామ క్రోధాదులచే; భూతేషు = ఇతరుల దేహములందు; ముహ్యంతి = మోహమును పొందుచున్నారు.

తా. ఇట్టిదని ఊహింప శక్యము కానిది, దేనిచేత బాధింప శక్యము కానిది అగు విష్ణుమాయచే, విష్ణ్వంశభూతులైన వారుకూడా, రజస్తమోగుణవృత్తులగు కామక్రోధాదులచే పరుల దేహములందు బాధ్య బాధక భావమును ఆరోపించి మోహమును పొందెదరు.

అవ. అటులైనచో ఈ విష్ణుమాయను ఆ మాయవలనకలిగెడి మోహమును ఎటుల జయించవలయును అని శంకించి, విష్ణుస్వరూపమును నిరూపించి ఆ విష్ణువును భజియించుట వలన అన్ని అనర్థములు తొలగి పోవునని శాస్త్రార్థమును ఉపసంహరించుచున్నారు.

శ్లో. న యత్ర దంభీత్య భయా విరాజితా మాయాత్మవాదేన కృతాత్మవాదిభిః
న యద్వివాదో వివిధ స్తదాశ్రయో మనశ్చ సంకల్ప వికల్ప వృత్తి యత్. 30

అ. దంభీ ఇతి=ఇతడు మోసగాడు కపటి ఈ పురుషుడు అని; యత్ర=ఏ బుద్ధి యందు; మఱి మఱి ఏ విధముగా నేది వర్ణింపబడునో ఉల్లేఖ్యమానమగు నదేదో; అది; మాయా = మాయ, ఆ మాయ ఆత్మవాదే=ఆత్మనుగురించి మీమాంసలో; అభయా=భయరహితమై; ఆత్మవాదిభిః=ఆత్మను గురించి మీమాంస చేయువారిచే; యత్ర = ఎందు; నవిరాజితా = ప్రకాశించబడదు. భీతి చెందినదై స్వకార్యమైన మోహాదికమును జేయనిదై వర్తించుచున్నదని ప్రతిపాదించబడినదని యర్థము; యత్ = ఏ; తదాశ్రయః = ఆ మాయాశ్రయమైన; వివిధః=పలురకములైన; వివాదః = విరోధము; న=లేదు; సకంల్ప వికల్ప వృత్తి=సంకల్పములకు వికల్పములకు నెలవైన; మనశ్చ=మనసు కూడా; యత్=యెచ్చట; న= లేదో.

తా. ఈ పురుషుడు మోసగాడు కపటి అని యిట్లు పలుమారు బుద్ధియందు తలంచుట యంతయు మాయ. ఈమాయ ఆత్మజ్ఞానులు ఆత్మనుగురించి విచారణ చేయునపుడు భయము వీడి ప్రకాశించదు. అనగా అచట కన్పట్టదు. భీతిచెందినదై స్వకార్యమైన మోహాదికమును కలిగించక కష్టముతో వర్తించుచున్నదని తాత్పర్యము. ఆమాయను ఆశ్రయించి కలిగెడిపలు వివాదములు కూడా ఉండవు. అచట సంకల్పముల వికల్పములకు నిలయమైన మనస్సు కూడా ఉండదు, భేదదృష్టిని పురస్కరించుకొని వచ్చు విశేష వివాదములు కలుగవు. వివాదములు విశేషవిషయములగుట వలన, ఆత్మ విశేషములకు ఆతీయమైనదగుట వలన అచటఉండనేరవు అని అభిప్రాయము. అటులనే సంకల్ప వికల్పములు కూడా విశేషవిషయములగుటవలన వాని కాశ్రయమైన మనస్సుకూడా ఉండదని భావము. ఈ భావమే ఇచట శ్లోకములో చెప్పబడినది.

"తస్మైనమో భగవతే వాసుదేవాయ ధీమహి
యన్మాయయా దుర్జయయా మాం బ్రువంతి జగద్గురుమ్
విలజ్జమానయా యస్య స్థాతు మీక్షాపథేఽముయా
విమోహితా వికత్థంతే మమాహమితి దుర్ధియః" అని

భగవానుడగు వాసుదేవునకు నమస్కారము. ఆ వాసుదేవుని ధ్యానింతుము. జయింపశక్యము కానివాసుదేవుని మాయచే నన్ను జగద్గురువందురు. ఆ వాసుదేవుని ముందు సిగ్గుపడుచు నిలువ లేనిమాయచే మోహించబడినవారై నాది, నేను యని దుర్బుద్ధులగుదురు.

**శ్లో. న యత్ర సృజ్యం సృజతోభయోః పరం శ్రేయశ్చ జీవస్త్రిభిరన్విత స్స్వయమ్**
**తదేత దుత్సాదిత బాధ్య బాధకం నిషిధ్య చోర్మీన్విరమేత తన్మునిః 31**

అ. సృజ్యం = కర్మ. సృజతా సహ=సృజించు కారక వర్గముతో గూడా; ఉభయోః=ఆ సృజ్య స్రష్టల కంటే; (ఆ కర్మ కారకముల కంటె) పరం = సాధ్యమైన; శ్రేయః = ఫలము; త్రిభిః= ఈ కర్మ కారక ఫలములు మూటితో; అన్వితః=కూడిన; జీవః = జీవుడు; అహంకారాత్మకుడు; యత్ర న=ఏ ఆత్మయందు లేదో; ఇందువలన, ఉత్సాదిత బాధ్యబాధకం=నిరసింపబడిన బాధ్య బాధకములు గల; తత్ + ఏ తత్ =స్వయమైన ఆత్మ స్వరూపమును; తత్ =దాని వలన; ఊర్మీన్ = అహంకారా దులను; నిషిధ్య=నిషేధించి; స్వయం=స్వయముగా; మునిః= ముని; విరమేత = విశేషించి క్రీడించ వలెను.

తా. కర్మ కాని, కర్మను విధించు కారకమగు వేదవాక్యముకాని, ఈ రెండింటిచే సాధించ దగిన స్వర్గాది ఫలముకాని ఈ కర్మకారకము, ఫలము అను మూటితో గూడి అహంకారోపాధికుడై జీవుడు కాని ఏ పరమాత్మతత్త్వమందు లేదో బాధ్యబాధకత్వములను దూరీకరించి ఏడివెలుగునో(ఆయాత్మస్వరూపమందు)ముని తన యహంకారాదులను అన్నింటిని నిషేధించి ఆయాత్మస్వరూపమందు నిరంతరము క్రీడించవలెను.

శ్లో. పరం పదం వైష్ణవ మామనన్తి తద్యన్నేతి నేతీత్యత దుత్సిసృక్షవః
విసృజ్య దౌరత్మ్య మనన్య సౌహృదా హృదోప గూహ్యావసితం సమాహితైః 32

అ. అతదుత్సి సృక్షవః=ఆత్మ వ్యతిరిక్తమైన దానిని త్యజింపగోరువారు; అనన్యసౌహృదాః=ఇతరమైన దానియందు స్నేహము లేనివారై; దౌరాత్మ్యం=దేహాద్యహం భావమును; విసృజ్య=విసర్జించి దేహము నందు అహంకారము లేదు కదా; ఇతరము నందు స్నేహము లేదు. అందువలన త్యజింప గోరినవారైన+ఇతి; న+ఇతి=ఈ స్థూల ప్రపంచము ఆత్మకాదు; దీనికి కారణము మాయకాదు, అని; సమాహితైః=నిశ్చల చిత్తము గలవారి చేత; హృదా=మానసిక ధ్యానముచే; ఉపగూహ్య=అభ్యసించి; అవసితం=నిశ్చయించినది; (నిశ్చితమైనది) యత్=ఏదో; తం=దానిని; పరం=ఉత్కృష్టమైన; వైష్ణవం=విష్ణువు యొక్క; పదం=పరమ పదమును; అమనంతి=చెప్పుదురు.

తా. ఆత్మ వ్యతిరిక్తమైన సంసారాదికమును వీడగోరినవారు ఇతరమైన దారాపుత్ర బంధుమిత్ర విత్తాదికమందు స్నేహము లేనివారును దేహాదికమందు అహంభావమును విసర్జించిన వారును కార్యమగు జగత్తుకాని కారణమగుమాయకాని అత్మకాదని చిత్తసమాధానముగలవారై ధ్యానము నెఱింగి నిశ్చయింప బడినదో దానిని వైష్ణవమగు పరమపదమని చెప్పుదురు.

అవ. ఈ పరమ పదము పొందు అధికారిని చూపుచున్నారు.

శ్లో. త ఏతదధి గచ్ఛంతి విష్ణోర్యత్పరమం పదమ్
అహం మమేతి దౌర్జన్యం న యేషాం దేహ గేహజమ్ 33

అ యత్=ఏ; ఏతత్=ఈ; విష్ణోః=విష్ణువుయొక్క; పరమం పదం=పరమపదమును; తే=వారు; అధిగచ్ఛంతి=పొందుచున్నారు. యేషాం=ఎవరికి; దేహ గేహజం=దేహాభిమానము వలన; గృహాభిమానమువలన జనించిన; అహం మమ+ఇతి దౌర్జన్యం=నేను నాదిఅను అజ్ఞానము; న=లేదో.

తా. దేహమువలన జనించిన అహంకారమును గృహాదులవలన జనించిన మమకారము లేనివారు ఆ విష్ణువు యొక్క పరమపదమును పొందగలరు.

అవ. ఈ పరమ పదమును పొందుటకు ఉపాయమును చెప్పుచున్నారు.

శ్లో. అతి వాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన
న చేమం దేహ మాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్ 34

అ. అతివాదం=విరుద్ధవాదములను (పరుషమైన మాటలను) తితిక్షేత=సహించవలెను; కంచన=ఏ ఒక్కరిని; న+అవమన్యేత=అవమానించవలదు; ఇమం=ఈ; దేహం=శరీరమును; ఆశ్రిత్య=ఆశ్రయించి; కేన చిత్=ఎవ్వని తోను; వైరం=వైరమును; న కుర్వీత=చేయవలదు.

తా. ఇతరులు చేయు విరుద్ధవాదమును అనగా పరుషమైన మాటలను సహించవలెను ఏ ఒక్కరిని అవమానించరాదు. ఈ దేహమును ఆశ్రయించి ఎవరితోనూ వైరముచేయరాదు

అవ. శాస్త్ర సమాప్తి చేయుచు గురువును నమస్కరించుచున్నారు

శ్లో. నమో భగవతే తస్మై కృష్ణాయాకుంఠమేధసే
యత్పాదాంబురుహధ్యానాత్ సంహితా మధ్యగామిమామ్ 35

అ. అకుంఠమేధసే = మొక్కవోని మేధస్సుగల; భగవతే = భగవంతుడైన; తస్మై = ఆ; కృష్ణాయ = కృష్ణుని కొఱకు; నమః = నమస్కారము; యత్ = యెవని యొక్క; పాదాంబురుహ = పాదపద్మముల యొక్క; ధ్యానాత్ = ధ్యానము వలన; ఇమాం = ఈ; సంహితాం = భాగవత సంహితను = అధ్యగామ్ = అధ్యయనము చేసితిని

తా. శ్రీకృష్ణుని పాదపద్మముల ధ్యానము వలన ఈ భాగవత సంహితను అధ్యయనము చేసితిని. ఆమొక్కవోని మేధస్సుగల శ్రీకృష్ణభగవానునకు నమస్కారము.

అవ. ఈపురాణసంహితను అధ్యయనము చేసితినని చెప్పుటవలన, పురాణములగురించి సంహితల గురించి విభాగమును విశేషముగా తెలియగోరి, ప్రసంగవశమున వేద విభాగమును కూడా అడుగుచున్నారు.

శ్రీ శౌనక ఉవాచ = శ్రీశౌనకమహర్షి పలికెను.

శ్లో. పైలాదిభిర్వ్యాస శిష్యై ర్వేదా చార్యైర్మహాత్మభిః
వేదాశ్చ కతిధా వ్యస్తా ఏతత్ సౌమ్యాభి ధేహినః 36

అ. సౌమ్య ! = ఓ సౌమ్యుడా !; వ్యాస శిష్యైః = వ్యాస శిష్యులైన; వేదా చార్యైః = వేదాచార్యులైన; మహాత్మభిః = మహాత్ములైన; పైలాదిభిః = పైలుడు మొదలగు నారి చేత; వేదాః = వేదములు; కతిధా = ఎన్ని విధములుగా; వ్యస్తాః = విభజింపబడినవి; ఏతత్ = దీనిని; నః = మాకు; అభిధేహి = చెప్పుము.

తా. ఓ సౌమ్యుడా! వేదాచార్యులు మహాత్ములు వ్యాస శిష్యులు అయిన పైలుడు మొదలగువారు వేదములను ఎన్ని విధములుగా విభజించిరో మాకు తెలుపుము.

---

చం. మృతియును జీవనంబు నివిమేదిని లోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహజంబిది ఘోరహుతాశ సర్పసం
హతులను దప్పి యాకటను బంచత నొందెదు నట్టి జీవుడున్
వెతలను బూర్వకర్మభవ వేదనలొందుచు గుందు నెప్పుడున్ 27

వ. అట్లు గావున న సంఖ్యంబులయిన దంద శూకంబులు హతంబులయ్యె శాంత మానసుండవై క్రోధంబు వర్జించుము. అన గురూపదిష్ట ప్రకారంబున సర్పయాగంబు మానియుండె. అంత దేవతలు కుసుమ వృష్టి గురియించిరి. ఆరాజన్యుండును మంత్రి సమేతుండై నగర ప్రవేశంబు సేసె. బాధ్య బాధక లక్షణంబులు గల విష్ణుమాయా గుణ వ్యాపారంబుల నాత్మమోహింపబడుం గావున; నట్టి మాయా వికారంబులం బరిత్యజించి; నిర్మలమానసుండై వర్తించు వాడును బరనింద సేయక; వైరంబు వర్జించి; భగవత్పాదాం భోజభక్తి సంయుక్తుండై తిరుగు నతండును; హరి పదంబు జేరు; అని చెప్పి, మఱియు సూతుండు పరమ హర్ష సమేతుండై శౌనకున కిట్లనియె.

అవ. మొదటి 8 శ్లోకములతో వేదావిర్భావ ప్రకారమును తెలుపుచున్నారు.

సూత ఉవాచ = సూతమహర్షి పలికెను.

**శ్లో. సమాహితాత్మనో బ్రహ్మన్ ! బ్రహ్మణః పరమేష్ఠినః**
**హృదాకాశాదభూన్నాదో వృత్తిరోధా ద్విభావ్యతే 37**

అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా !; సమాహితాత్మనః = నిశ్చల చిత్తుడైన; **పరమేష్ఠినః** = అన్నిటికి పైన ఉన్న సత్యలోకమున నుండు; బ్రహ్మణః = బ్రహ్మ యొక్క; **హృదాకాశాత్** = హృదయా కాశమునుండి; నాదః = శబ్దము; అభూత్ = కలిగెను; వృత్తిరోధాత్ = శ్రోత్ర ప్రవృత్తి నిరోధము వలన; విభావ్యతే = వినగలుగుట ఊహింపబడుచున్నది.

తా. నిశ్చల చిత్తుడు అన్నింటికి పైననున్న సత్యలోకమున నుండు బ్రహ్మహృదయా కాశము నుండి నాదము వినవచ్చెను. ఈ నాదమును మనము సైతము **చెవులు మూసికొని** శ్రోత్రియ గుణమగు శబ్దమును నిరోధించినచో వినగలుగుదుము.

అవ. ప్రసంగవశమున నాదోపాసన **చేసినచో** మోక్షము కలుగుననే చెప్పుచున్నారు.

**శ్లో. యదుపాసనయా బ్రహ్మన్యోగినో మలమాత్మనః**
**ద్రవ్య క్రియాకారకాఖ్యం హిత్వా యాన్త్యపునర్భవమ్ 38**

అ. బ్రహ్మన్! = బ్రాహ్మణోత్తమా! యదుపాసనయా = ఏనాదమును ఉపాసించుటచే; ఆత్మనః మనస్సుయొక్క; ద్రవ్య క్రియాకారకాఖ్యం = ఆధిభౌతిక; ఆధ్యాత్మిక; ఆధిదైవికమను పేరుగల; మలం = మాలిన్యమును; హిత్వా = వీడి; అపునర్భవం = పునర్జన్మ రహితమైన మోక్షమును; యాన్తి = పొందుదురు.

తా. బ్రాహ్మణోత్తమా! ఈ నాదమును ఉపాసించుటచే మానసికమైన ఆధ్యాత్మిక అధి భౌతిక ఆధిదైవికమైన మాలిన్యమును వీడి పునర్జన్మరహితమైన మోక్షమును పొందెదరు.

**శ్లో. తతో౽భూత్త్రివృదోంకారో యో౽వ్యక్తప్రభవస్స్వరాట్**
**యత్తల్లింగం భగవతో బ్రహ్మణః పరమాత్మనః 39**

అ. తతః = ఆనాదము వలన; త్రివృత్ = మూడు మాత్రలుగల; ఓంకారః = ఓంకారము; అభూత్ = కలిగెను; యః = యే ఓంకారము; అవ్యక్త ప్రభవః = అవ్యక్తమైన జన్మగలది; స్వరాట్ = స్వయం ప్రకాశముగలది; యత్ = ఏదైతే; పరమాత్మనః = పరమాత్మయైన; బ్రహ్మణః = బ్రహ్మయైన; భగవతః భగవంతునికి; లింగం = చిహ్నమో; తత్ = అది.

తా. మనము తెలియలేని జన్మగలది స్వయంప్రకాశము, పరమాత్మకు చిహ్నమైన ఓంకారము ఆ నాదమువలన కలిగెను.

అవ. పరమాత్మయనగా ఎవరో చెప్పుచున్నారు.

**శ్లో. శృణోతి య ఇమం స్ఫోటం సుప్తశ్రోత్రే౽పి శూన్యదృక్**
**యేన వాగ్వ్యజ్యతే యస్య వ్యక్తిరాకాశ ఆత్మనః 40**

అ. సుప్తశ్రోత్రే + అపి = శ్రోత్రేంద్రియ వ్యాపారము నిరుద్ధమైనను; శూన్యదృక్ = ఇంద్రియ వర్గము శూన్యముకాగా చూచువాడు; ఇమం = ఈ; స్ఫోటం = అవ్యక్తమైన ఓంకారమును; శృణోతి = వినుచున్నాడో; యేన = యే ఓంకారముచే; వాక్ = బృహతీ వాక్కు; వ్యజ్యతే = ప్రకటమగుచున్నదో; యస్య = యే ఓకాంరమునకు; ఆకాశే = హృదయాకాశము నందు; ఆత్మనః = ఆత్మ నుండి; వ్యక్తిః = అభివ్యక్తియగునో.

తా. అవ్యక్తమైన ఓంకారమును శ్రోత్రేంద్రియవ్యాపారము నిరుద్ధమైనపుడు కూడా ఇంద్రియ వర్గము శూన్యము అయిననూ వినువాడు, బృహతీవాక్కును వ్యక్తము చేయువాడు హృదయాకాశమునందు ఆత్మ సంబంధము వలన వ్యక్తమగుచున్నదో ఆదియే పరమాత్మ. ఈ పరమాత్మ జీవుని ప్రబోధించును.

శ్లో. స్వధామ్నో బ్రహ్మణస్సాక్షాత్ వాచకః పరమాత్మనః
స సర్వమంత్రోపనిషద్వేద బీజం సనాతనమ్ **41**

అ. సః = ఆ ఓంకారము; స్వధామ్నః = తన కాశ్రయమైన; పరమాత్మనః = పరమాత్మయైన; బ్రహ్మణః = బ్రహ్మకు; సాక్షాత్ = ప్రత్యక్షముగా; వాచకః = నామము; సర్వమంత్రోపనిషద్వేద బీజం = సమస్తదేవతా వాచకములగు ఎల్ల మంత్రములకు వేదములకు కారణమైన; సనాతనం = ఎప్పటికీ ఒకే రూపుతో ఉండునది.

తా. ఆ ఓంకారము తనకాశ్రయమైన పరమాత్మయగు బ్రహ్మమునకు సాక్షాత్తుగా నామ వాచకము. సమస్తదేవతావాచకములగు మంత్రములకు సమస్తవేదములకు ఉపనిషత్తులకు కారణము, ఎప్పుడూ ఒకేరూపుతో ఉండునది.

అవ. ఇపుడు ఓంకారమునుండే సమస్త ప్రపంచము ఆవిర్భించునని తెలుపుచున్నారు.

శ్లో. తస్య హ్యాసం స్త్రియో వర్ణాః అకారాద్యా భృగూద్వహ!
ధార్యంతే యైస్త్రయో భావా గుణ సామార్థవృత్తయః **42**

అ. భృగూద్వహ = ఓ భృగువంశ శ్రేష్ఠుడా తస్య = ఆ ఓంకారమునకు; అకారాద్యా = అకారము మొదలగునవి "అ – ఉ – మ – అనునవి; త్రయః = మూడు; వర్ణాః = వర్ణములు; ఆసన్ = ఉన్నవి; యైః = ఏమూడు వర్ణములచే; త్రయః భావాః = మూడు భావములైన; గుణ = త్రిగుణములు; సామ = సామాదివేదములు; అర్థ = భూర్భువస్స్వ ర్లోకములు; వృత్తయః = జాగ్రదాది అవస్థలు; ధార్యంతే = ధరించబడుచున్నవి.

తా. ఈ ఓంకారమునకు అ-ఉ-మ అను మూడు వర్ణములున్నవి. ఈ మూడు వర్ణముల చేతనే మూడు భావములైన త్రిగుణములు, సామాది వేదములు, భూర్భువస్స్వర్లోకములు, జాగ్రదాద్యవస్థలు ధరించ బడుచున్నవి.

శ్లో. తతోఽక్షర సమామ్నాయ మసృజద్భగవానజః
అంతస్థోష్మస్వర స్పర్శ హ్రస్వ దీర్ఘాది లక్షణమ్ **43**

అ. భగవాన్ = భగవంతుడగు; అజః = బ్రహ్మ; తతః = ఆ ఓంకారము వలన; అంతస్థ = యరలవలు; ఊష్మ = శషసహలు; స్వర = అచ్చులు; స్పర్శ = కకారము నుండి మకారము వరకుండెడి

వర్ణములు; హ్రస్వ = హ్రస్వములు; దీర్ఘ = దీర్ఘములు; ఆది = మొదలుగా గలవి. లక్షణం = స్వరూప ముగా గల; అక్షర సమామ్నాయం = అక్షర సమూహమును; అసృజత్ = సృజించెను.

తా. భగవంతుడగు బ్రహ్మ, ఆ ఓంకారమునుండి యరలవలు, శషసహలు, అచ్చులు, కాది మాంత వర్ణములు, హ్రస్వములు, దీర్ఘములు మొదలుగా గల అక్షరసమూహమును సృజించెను.

శ్లో. తతోఽసౌ చతురో వేదాన్ చతుర్భిర్వదనైర్విభుః
సవ్యాహృతీంశ్చ సోంకారాం శ్చాతుర్హోత్ర వివక్షయా **44**

తతః = అటు తరువాత; విభుః = సమర్థుడగు; అసౌ = ఈ బ్రహ్మ; చతుర్భిః వదనైః = నాలుగు ముఖములతో; స + ఓంకారాన్ = ఓంకారముతో కూడిన; స వ్యాహృతీన్ = భూః భువః సువః అను మూడు వ్యాహృతులతో కూడిన, చాతుర్హోత్ర వివక్షయా = హోత మొదలగు నలుగురు ఋత్విజుల వివక్షతో, చతురః; వేదాన్ = నాలుగు వేదములను; అసృజత్ = సృజించెను

తా. అంత ప్రభువగు బ్రహ్మ తన నాలుగు ముఖములతో ఓంకారముతో కూడిన, "భూః భువః సువః" అను వ్యాహృతులతో కూడిన, హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ అను నలుగురు హోతలను వివరించుట ద్వారా నాలుగు వేదములను సృజించెను.

శ్లో. పుత్రా నధ్యాపయామాస తా నృషిర్బ్రహ్మ కోవిదాన్
తేతు ధర్మోప దేష్టార స్స్వపుత్రేభ్య స్సమాదిశన్ **45**

అ. ఋషిః = ఋషియైన; బ్రహ్మ; బ్రహ్మకోవిదాన్ = వేదోచ్చారణ సమర్థులగు; తాన్ = ఆ; పుత్రాన్ = మరీచ్యాదులగు పుత్రులను; అధ్యాపయామాస = వేదాధ్యయనము చేయించెను. తేతు = ఆ మరీచ్యాది పుత్రులు కూడా; ధర్మోపదేష్టారః = ధర్మమును ఉపదేశించువారు; స్వపుత్రేభ్యః = తమ పుత్రులకు; సమాదిశన్ = ఆ వేదములను చెప్పిరి.

తా. ఋషియైన బ్రహ్మ వేదోచ్చారణ సమర్థులగు తన పుత్రులను మరీచ్యాదులను వేదములను చదివించెను. ధర్మమును ఉపదేశించు ఆ మరీచ్యాదులు కూడా తమ పుత్రులకు వేదములను చెప్పిరి.

శ్లో. తే పరంపరయా ప్రాప్తా స్తత్త చ్ఛిష్యైర్ధృత వ్రతైః
చతుర్యుగేష్వథ వ్యస్తా ద్వాపరాదౌ మహర్షిభిః **46**

అ. తే = ఆ వేదములు; ధృతవ్రతైః = వ్రతదీక్షగల; తత్ + తత్ + శిష్యైః = వారి వారి శిష్యులైన; మహర్షిభిః = వ్యాసాది మహర్షులచే; పరం పరయా = పరంపరచే, ప్రాప్తాః = పొంద బడినవై; చతుర్యుగేషు = నాలుగు యుగములందు; అథ = తరువాత; ద్వాపరాదౌ = ద్వాపరము ఆది గాగల; అనగా ద్వాపరయుగము చివర; = వ్యస్తాః విభజించబడినవి.

తా. ఆ నాలుగు వేదములు నాలుగు యగములందు వ్రత దీక్షాపరులగు మహర్షులచే వారి వారి శిష్యులచే పరంపరచే పొందబడినవై ద్వాపరయుగాంతమునందు వేదములు విభజింపబడినవి.

అవ. వేదములను విభజించుటకు హేతువును వివరించు చున్నాను.

శ్లో. క్షీణాయుషః క్షీణసత్త్వాన్ దుర్మేధాన్వీక్ష్య కాలతః
వేదాన్ బ్రహ్మర్షయో వ్యస్యన్ హృదిస్థాచ్యుత చోదితాః 47

అ. కాలతః = కాలవశమున; క్షీణాయుషః = తక్కువ ఆయుష్యము గలిగిన; క్షీణసత్త్వాన్ = అల్ప బలముగల; దుర్మేధాన్ = మందబుద్ధులైన వారిని; వీక్ష్య–చూచి; హృదిస్థాఽచ్యుత చోదితాః– హృదయమునందున్న విష్ణువుచే ప్రేరితులై, బ్రహ్మర్షయః – బ్రహ్మఋషులు; వేదాన్–వేదములను; వ్యస్యన్–విభజించిరి.

తా. కాలవశమున అల్పాయుష్కులు అల్పబలులు, అల్పబుద్ధులు, అయిన నరులను చూచి, హృదయమునందున్న విష్ణువుచే ప్రేరితులైన బ్రహ్మర్షులు వేదములను విభజించిరి.

అవ. ఇటుల సామాన్యముగా వేదవిభాగ క్రమమును వివరించి వైవస్వత మన్వంతర మున జరిగిన విశేష వేదవిభాగమును నిరూపించుటకు చెప్పుచున్నారు.

శ్లో. అస్మిన్నప్యంతరే బ్రహ్మన్ భగవాన్ లోక భావనః
బ్రహ్మేశాద్యైర్లోక పాలైర్యాచితో ధర్మ గుప్తయే 48

అ. బ్రహ్మన్=ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా; అస్మిన్–ఈ; అంతరే+అపి=వైవస్వత మన్వంతరము నందుకూడా; భగవాన్=భగవంతుడగు; లోక భావనః=లోకములను సృష్టించిన శ్రీమన్నారయణుడు; బ్రహ్మ+ఈశ+అద్యైః=బ్రహ్మఈశ్వరుడు మొదలగు; లోకపాలైః=లోకపాలురచేత; ధర్మగుప్తయే =ధర్మరక్షణకు; యాచితః=యాచించబడెను.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా ! ఈ వైవస్వత మన్వంతరమున కూడా లోకకారణుడగు శ్రీమన్నారాయణుని, బ్రహ్మ ఈశ్వరుడు మొదలగు లోకపాలురు ధర్మరక్షణ చేయుమనివేడిరి.

శ్లో. పరాశరాత్సత్యవత్యాం అంశాంశకలయా విభుః
అవతీర్ణో మహాభాగో వేదం చక్రే చతుర్విధమ్. 49

అ. విభుః=ప్రభువగువిష్ణువు; అంశాంశకలయా = మాయయొక్క సత్త్వగుణాంశముచే; పరాశరాత్=పరాశరునివలన; సత్యవత్యాం=సత్యవతియందు; మహాభాగః=పూజ్యుడు; అవతీర్ణః= వ్యాసుడై అవతరించి; వేదం=వేదమును; చతుర్విధం=నాలుగువిధములుగా; చక్రే=చేసెను.

తా. ప్రభువగు శ్రీ విష్ణువు మాయయొక్క సత్త్వగుణాంశముచే పరాశరుని వలన సత్యవతియందు వ్యాసునిగా అవతరించి వేదమును నాలుగు విధములుగా విభజించెను.

అవ. ఆ నాలుగు విధములను వివరించుచున్నారు.

శ్లో. ఋగథర్వ యజుస్సామ్నాం రాశీనుద్ధృత్య వర్గశః
చతస్రస్సంహితాశ్చక్రే సూత్రే మణిగణానివ. 50

అ. ఋగథర్వయజుసామ్నాం=ఋక్, అథర్వ, యజుస్, సామములయొక్క; రాశీన్=రాశులను వర్గశః=వేరువేరువర్గములుగా, ఉద్ధృత్య=ఉద్ధరించి; సూత్రే=దారమునందు; మణిగణాన్ ఇవ= మణుల సమూహములనువలె; చతస్రః=నాలుగు; సంహితాః=సంహితలను చక్రే=చేసెను.

తా. ఋక్కు, అథర్వము, యజుస్సు, సామము అను వేదములరాశులను వర్గములుగ ఆయా ప్రకరణ భేదములచే నుద్ధరించి, బహువిధములైన మణుల రాశినుండి మణిగణములను పద్మరాగాదులను వేఱుపరచి నుద్ధరించబడునటుల వేదమంత్రములచే నాలుగు సంహితలనుగా విభజించెను.

శ్లో. **తాసాం స చతుర శ్శిష్యా నుపహూయ మహామతిః**
**ఏకైకాం సంహితాం బ్రహ్మన్నేకైకస్మై దదౌ విభుః.** **51**

అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా!; సః = ఆ, మహామతిః = గొప్పబుద్ధిమంతుడు; విభుః = సమర్థుడగు వ్యాసుడు; చతురః = నలుగురని: శిష్యాన్ = శిష్యులను; ఉపహూయ = పిలిచి; ఏకైకస్మై = ఒక్కొక్కనికి; ఏకైకాం = ఒక్కొక్క; సంహితాం = సంహితను దదౌ = ఇచ్చెను.

తా. ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! గొప్పబుద్ధిమంతుడు సమర్థుడగు ఆ వ్యాస భగవానుడు నలుగురు శిష్యులను పిలిచి, ఒక్కొక్కరికి ఒక్కొక్క సంహితను ఇచ్చెను.

శ్లో. **పైలాయ సంహితా మాద్యాం బహ్వృ చాఖ్యా మువాచ హ**
**వైశంపాయన సంజ్ఞాయ నిగదాఖ్యం యజుర్గణమ్.** **52**

అ. పైలాయ = పైలుడను శిష్యునకు; బహ్వృచాఖ్యాం = ఋక్ సమూహముల రూపమైన బహ్వృచమను పేరుగల; ఆద్యాం = మొదటిదగు; సంహితాం = ఋక్సంహితను; ఉవాచ = చెప్పెను. వైశంపాయనసంజ్ఞాయ = వైశంపాయనుడను పేరుగల వానికి; నిగదాఖ్యం = మిక్కిలి కలసి గద్య రూపము గలదైన; యజుర్గణం = యజుస్సంహితను; ఉవాచ = చెప్పెను.

తా. ఎక్కువ ఋక్కులుండుటచే బహ్వృచమను పేరుగల ఋక్సంహితను పైలుడను శిష్యునకు చెప్పెను. అటులనే ఎక్కువగా గద్యములున్న నిగదము అనుపేరు గల యజుస్సమూహమును వైశంపాయనుడను శిష్యునికి చెప్పెను.

శ్లో **సామ్నాం జైమినయే ప్రాహ తథా చంధోగ సంహితామ్**
**అథర్వాంగిరసం నామ స్వశిష్యాయ సుమంతవే.** **53**

అ తథా = ఆ ప్రకారముగా; జైమినయే = జైమినియను శిష్యునికి; సామ్నాం = సామమంత్రముల సంబంధముగల; చందోగసంహితాం = ఛందస్సు గానము చేయబడు సామసంహితను చెప్పెను. అథర్వాంగిరసంనామ = అథర్వాంగిరసమను పేరుగల అథర్వసంహితను స్వశిష్యాయ = తన శిష్యుడైన, సుమంతవే = సుమంతునికి; ప్రాహ = చెప్పెను.

తా. సామ మంత్రములకు సంబంధించిన ఛందోగ సంహితను జైమినికి, అథర్వాంగిరసమను పేరుగల అథర్వసంహితను తన శిష్యుడైన సుమంతునికి చెప్పెను.

అవ. ఋగ్వేద శాఖా విభాగమును చెప్పుచున్నారు.

శ్లో. **పైల స్స్వ సంహితా మూచే ఇంద్ర ప్రమితయే మునిః**
**బాష్కలాయ చ సోఽప్యాహ శిష్యేభ్య స్సంహితాం స్వకామ్.** **54**

అ పైలః = పైలుడు; స్వసంహితాం = తనకు చెప్పిన ఋక్సంహితను; ఇంద్రప్రమితయే = ఇంద్రప్రమితుడను వానికి, బాష్కలాయచ = బాష్కలుడను వానికి కూడా; ఊచే = చెప్పెను. సోఽపి = ఆ

బాష్కలుడు కూడా; స్వాం = తనదైన; సంహితాం = సంహితను, శిష్యేభ్యః = తనశిష్యులకు; ఆహ = చెప్పెను

తా. మునియైన పైలుడు తనకు చెప్పిన ఋక్సంహితను రెండు భాగములుగా చేసి ఇంద్రప్రమితునికి, బాష్కలునికి చెప్పెను. ఆ బాష్కలుడు తన సంహితను తన శిష్యులకు చెప్పెను.

శ్లో॥ చతుర్ధా వ్యస్య బోధ్యాయ యాజ్ఞవల్క్యాయ భార్గవ
పరాశరా గ్ని మిత్రాభ్యా మింద్ర ప్రమితి రాత్మవాన్ **55**

అ. భార్గవ ! = ఓ శౌనకా! చతుర్ధా = నాలుగుభాగములుగా; వ్యస్య = విభజించి; బోధ్యాయ = బోధ్యునికి; యాజ్ఞవల్క్యాయ = యాజ్ఞవల్క్యునికి, పరాశరాగ్నిమిత్రాభ్యాం = పరాశరునికి, అగ్నిమిత్రునికి ప్రాహ = చెప్పెను ఆత్మవాన్ = జ్ఞానముగల, ఇంద్రప్రమితిః = ఇంద్రప్రమితియనువాడు, (తనశిష్యులకు బోధించెనని ముందుశ్లోకముతో అన్వయము.)

తా. బాష్కలుడు తనకు చెప్పిన ఋక్సంహితను, నాలుగు భాగములుగా విభజించి బోధ్యునికి, యాజ్ఞవల్క్యునికి, పరాశరునికి, అగ్నిమిత్రునికి, బోధించెను. అటులనే జ్ఞానియగు ఇంద్రప్రమితి కూడా తన శిష్యులకు బోధించెను. అని ముందు శ్లోకముతో చెప్పెను.

శ్లో॥ అధ్యాపయ త్సంహితాం స్వాం మాండూకేయం ఋషిం కవిం
తస్య శిష్యో దేవమిత్ర స్సౌభర్యాదిభ్య ఊచివాన్. **56**

అ. స్వాం = తనదైన; సంహితాం = సంహితను; ఋషిం = ఋషియైన; కవిం = జ్ఞానియైన; మాండూకేయం = మాండూకేయుని; అధ్యాపయత్ = చదివించెను. తస్య = ఆమాండూకేయునికి: దేవమిత్రః = దేవమిత్రుడు; శిష్యః = శిష్యుడు సౌభర్యాదిభ్యః = సౌభరి మొదలగువారికి; ఊచివాన్ = చెప్పెను.

తా. జ్ఞానియైన ఇంద్రప్రమితి ఋక్సంహితను, పండితుడు ఋషియైనమాండూకేయునికి చెప్పెను. మాండూకేయుడు తన శిష్యుడగు దేవమిత్రునికి, దేవమిత్రుడు సౌభరి మొదలగు వారికి దెలిపెను.

శ్లో॥ శాకల్య స్త త్సుత స్స్వాంతు పంచధా వ్యస్య సంహితాం
వాత్స్య మౌద్గల్య శాలీయ గోఖల్య శిశిరేష్వధాత్. **57**

అ. తత్సుతః = అమాండూకేయుని పుత్రుడైన; శాకల్యః = శాకల్యుడు; స్వాం = తనదైన ఋక్సంహితను; పంచధా = అయిదు విధములుగా; వ్యస్య = విభాగముచేసి; వాత్స్యమౌద్గల్య శాలీయ గోఖల్య శిశిరేషు = వాత్స్యునిలో, మౌద్గల్యునిలో, శాలీయునిలో, గోఖల్యునిలో, శిశిరునిలో; అధాత్ = ధరింపజేసెను.

తా. మాండూకేయుని పుత్రుడగు శాకల్యుడు తన ఋక్సంహితను అయిదు భాగములుగా విభజించి, వాత్స్య మౌద్గల్య, శాలీయ, గోఖల్య, శిశిరులకు బోధించెను,

శ్లో॥ జాత కర్ణస్తు తచ్ఛిష్య స్సనిరుక్తాం స్వసంహితామ్
బలాక పైంగ పైతాళ విరజేభ్యో దదౌ మునిః. **58**

అ. మునిః = మునియగు; తత్ + శిష్యః = ఆశాకల్యుని శిష్యుడు; జాతకర్ణః = జాతకర్ణుడు; సనిరుక్తాం = వైదికపదార్థవ్యాఖ్యా నరూపమైన; స్వసంహితాం = తన సంహితను; బలాకపైంగ వైతాళ విరజేభ్యః = బలాకపైంగవైతాళ విరజులకు; దదౌ = ఇచ్చెను.

తా. శాకల్యుని శిష్యుడు మునియైన జాతకర్ణుడు, వైదిక పదార్థవ్యాఖ్యానముతోనున్న తన సంహితను బలాక పైంగవైతాళ విరజులను తన శిష్యులకు చెప్పెను.

శ్లో. బాష్కలిః ప్రతిశాఖాభ్యో వాలఖిల్యాఖ్య సంహితామ్
చక్రే బాలాయని ర్గార్గిః కాసారశ్చైవ తాం దధుః. 59

అ. బాష్కలిః = పూర్వము చెప్పబడిన బాష్కలుని పుత్రుడు; ప్రతిశాఖాభ్యః = అన్నిఋక్ శాఖలనుండి; వాలఖిల్యాఖ్యసంహితాం = వాలఖిల్యమను పేరుగల సంహితను; చక్రే = రచించెను. తాం = ఆవాలఖిల్య సంహితను; బాలాయనిః = బాలయని; గార్గిః = గార్గి; కాసారశ్చ = కాసారుడనువాడు దధుః = ధరించిరి (నేర్చిరి)

తా. బాష్కలుని పుత్రుడు పూర్వము చెప్పిన అన్ని ఋక్ శాఖలనుండి వాలఖిల్యమను పేరుగల సంహితను రచించెను. ఈ వాలఖిల్యసంహితను అతని శిష్యులగు బాలాయని గార్గి కాసారుడు అను వారలు నేర్చిరి.

శ్లో. బహ్వృచా స్సంహితా హ్యేతా ఏభిర్బ్రహ్మర్షిభి ర్ధృతాః
శ్రుత్వైత చ్ఛందసాం వ్యాసం సర్వ పాపైః ప్రముచ్యతే. 60

అ. ఏతాః = ఈ; బహ్వృచాః = ఋక్ శాఖకు సంబంధించిన; సంహితాః = సంహితలు ఏభిః = ఈపైనచెప్పిబడిన; బ్రహ్మర్షిభిః = బ్రహ్మఋషులచే, ధృతాః = ధరింపబడినవి. ఏతత్ = ఈ; ఛందసాం = వేదములయొక్క; వ్యాసం = విభాగమును; శ్రుత్వా = విని; సర్వపాపైః = అన్నిపాపములచే; ప్రముచ్యతే = విముక్తుడగును.

తా. ఋక్ శాఖకు సంబంధించిన ఈ సంహితలను పైన చెప్పబడిన బ్రహ్మఋషులు ధారణ చేసిరి. ఈ వేదశాఖల విభాగమును వినినవాడు అన్నిపాపముల నుండి విముక్తుడగును.

అవ. యజుర్వేదమున తైత్తిరీయశాఖ ఉత్పత్తి ప్రకారమును తెలుపుచున్నారు.

శ్లో. వైశంపాయన శిష్యా వై చరకా ధ్వర్యవోఽభవన్
యచ్చేరు ర్బ్రహ్మహత్యాంహః క్షపణం స్వగురోర్వ్రతమ్ 61

అ. వైశంపాయన శిష్యాః = వైశంపాయనుని శిష్యులు; చరకాధ్వర్యవః = చరకులు, అధ్వర్యులు అభవన్ = అయిరి. యత్ = ఏ; స్వగురోః = తమగురువుయొక్క, బ్రహ్మహత్యాంహః = బ్రహ్మహత్య వలన కలిగినపాపమును; క్షపణం = తొలగించు; వ్రతం = వ్రతమును చేరుః = ఆచరించిరి.

తా. వైశంపాయనుని శిష్యులు తమ గురువుగారికి ప్రాప్తించిన బ్రహ్మహత్యపాతకమును తొలంగించు వ్రతమును ఆచరించినందువలన చరకులు అధ్వర్యులు అయిరి.

శ్లో. యాజ్ఞవల్క్యస్తు తచ్ఛిష్య స్స ఆహ భగవ న్కియత్
చరితే నాల్పసారాణాం చరిష్యేఽహం సుదుశ్చరమ్. 62

తచ్ఛిష్యః = ఆ వైశంపాయనుని శిష్యుడగు; యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు; భగవన్ = పూజ్యుడగు గురువర్యా!; అల్పసారాణాం = బ్రహ్మతేజస్సు సారములేని ఈబ్రాహ్మణులయొక్క; చరితేన = వ్రతాచరణచేత; కియత్ = ఎంతఫలము కలుగును; అహం = నేను; సుదుశ్చరం = మిక్కిలి కష్టతరమైన వ్రతమును; చరిష్యే = ఆచరించెదను అని; ఆహ = పలికెను.

తా. వైశంపాయనుని శిష్యుడగు యాజ్ఞవల్క్యుడు, తమగురువు గారితో, ఓ గురువర్యా! అల్పసారులగు ఈ బ్రాహ్మణులు ఆచరించిన వ్రతము వలన ఏమిఫలితము కలుగును. నేను మిక్కిలి కష్టసాధ్యమైనవ్రతమును ఆచరించెదను అని పలికెను.

శ్లో. ఇత్యుక్తో గురురప్యాహ కుపితో ఒహమలం త్వయా
విప్రావమంత్రా శిష్యేణ మదధీతం త్యజాశ్వితి. 63

అ. ఇతి = ఈప్రకారముగా; ఉక్తః = చెప్పబడిన, గురురపి = గురువుకూడా; అహం = నేను కుపితః = కోపించితిని; విప్రావమంత్రా = బ్రాహ్మణులనవమానించు; శిష్యేణ = శిష్యుడవైన; త్వయా = నీచేత; అలం = చాలును; మదధీతం = నావలన అధ్యయముచేసినవేదమును, ఆశు = త్వరగా; త్యజ = విడువుము; ఇతి = అని; ఆహ = పలికెను.

తా యాజ్ఞవల్క్యుడు ఇటుల పలుకగా వినిన వైశంపాయనుడు నేను కోపించితిని బ్రాహ్మణులనవమానించు శిష్యుడు నాకవసరములేదు. కావున నావద్ద అధ్యయనము చేసిన వేదమును త్వరగా విడువుము అని పలికెను.

శ్లో. దేవరాత సుతస్సోఽపి ఛర్దిత్వా యజుషాం గణమ్
తతో గతోఽథ మునయో దదృశుస్తా న్యజుర్గణాన్. 64

అ. సః = ఆ, దేవరాతసుతః + అపి = దేవరాతునిపుత్రుడైన యాజ్ఞవల్క్యుడు గూడా; యజుషాం గణం = యజుర్వేదమంత్రముల సమూహమును; ఛర్దిత్వా = వెడలగ్రక్కి; తతః = అటుతరువాత; గతః = వెడలిపోయెను. అథ = అంత; మునయః = మునులు; తాన్ = ఆ; యజుర్గణాన్ = యజుర్మన్త్రగణములను; దదృశుః = చూచిరి.

తా అంత దేవరాతుని పుత్రుడగు యాజ్ఞవల్క్యుడు యజుర్మంత్రములను వెడలగ్రక్కి వెడలిపోయెను. అచటిమునులందరు ఆ యజుర్మన్త్ర గణములను చూచిరి.

శ్లో. భూత్వా తిత్తిరయో బ్రహ్మం స్తల్లోలుపతయా దదుః
తైత్తిరీయా ఇతి యజుశ్శాఖా ఆసన్ సుపేశలాః. 65

అ. బ్రహ్మన్! = ఓబ్రాహ్మణ శ్రేష్ఠుడా; తల్లోలుపతయా = ఆయజుర్మన్త్రగణములందలి ఆసక్తిచే తిత్తిరయః = తిత్తిరి పక్షులుగా; భూత్వా = అయ్యి; ఆదదుః = వెడలగ్రక్కిన దానిని స్వీకరించిరి. అంత తైత్తిరీయా ఇతి = తైత్తిరీయములుఅను, సుపేశలాః = అతి రమ్యములైన; యజుశ్శాఖాః = యజుర్వేద శాఖలు; ఆసన్ = అయినవి.

తా. ఓ విప్రవరా! వెడలగ్రక్కిన యజుర్మన్త్ర గణములయందలి ఆసక్తిచే ఆ మునులు తిత్తిరి పక్షుల రూపమునుచెంది ఆమంత్రగణములను స్వీకరించిరి. తిత్తిరి పక్షుల స్వీకరించుటచే అతి సుందరములైన తైత్తిరీయములను పేర యజుశ్శాఖ లేర్పడినవి.

ఆప: కాణ్వ మాధ్యందిన శాఖలను గూర్చి చెప్పుచున్నారు.

శ్లో॥ **యాజ్ఞవల్క్య స్తతో బ్రహ్మం శ్ఛందాంస్యధి గవేషయన్**
**గురో రవిద్యమానాని నూపతస్థేఽర్క మీశ్వరమ్.** **66**

అ. బ్రహ్మన్! = ఓ బ్రాహ్మణుడా!; తతః = అటుతరువాత; యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు గురోః = గురువైన వైశంపాయనునికి; అవిద్యమానాని = వ్యాసునిచే విభజించి చెప్పబడకుండువానిని; అధి = అధికములైన; ఛందాంసి = వేదములను; గవేషయన్ = అన్వేషించుచు, ఈశ్వరం = ప్రభువైన అర్కం = సూర్యుని; నూపతస్థే = చక్కగా స్తుతించెను

తా. అంత యాజ్ఞవల్క్యుడు తన గురువగు వైశంపాయనునికి వేదవ్యాసుడు ఉపదేశించని అధికములైన వేదములను అన్వేషించుచు, వేదములకు ఈశ్వరుడైన సూర్యభగవానుని స్తోత్రము చేసెను. వేదములకు ప్రభువు సూర్యుడు అనుటకు ఈ క్రింది ప్రమాణము సరిపోవును. "ఋగ్భి: పూర్వాహ్ణే దివిదేవ ఈయతే. యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః. సామవేదేనాస్తమయే మహీయతే వేదై రశూన్య స్త్రిభిరేతి సూర్యః"

ప్రాత: కాలమందు ఋఙ్మన్త్రములలో ప్రకాశించును. మధ్యాహ్న కాలమందు యజుర్వేదమునందు నిలిచియుండును. అస్తమయమందు సామవేదమున ఉండి పూజింపబడును. ఈ మూడు వేదములచే సూర్యుడెప్పుడు శూన్యుడు కాకుండ వెలుగును. వేదములతో ప్రకాశించుట నిరంతరముండును. అని పై శ్రుతికి తాత్పర్యము.

యాజ్ఞవల్క్యఉవాచ = యాజ్ఞవల్క్యుడు పలికెను.

గ **ఓం నమో భగవతే ఆదిత్యాయాఖిల జగతా మాత్మస్వరూపేణ కాల స్వరూపేణ చ చతుర్విధ భూత నికాయానాం బ్రహ్మాది స్తంబ పర్యంతానా మంత ర్హృదయేషు బహిర ప్యాకాశ ఇవోపాధినా వ్యవధీయమానో భవానేక ఏవ క్షణ లవ నిమేషాద్యవయవోపచిత సంవత్సర గణేనా పామాదాన విసర్గాభ్యా మిమాం లోక యాత్రా మనువహతి.** **67**

అ ఓం నమో భగవతే ఆదిత్యాయ = ఆదిత్యభగవానునికి ఓంకారపూర్వకముగా నమస్కారము అఖిలజగతాం = ఎల్లలోకములకు; చతుర్విధభూత నికాయానాం = జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజ్జములను నాలుగువిధములైన ప్రాణికోట్లకు: బ్రహ్మ + ఆది స్తంబపర్యంతానాం = బ్రహ్మ మొదలుగడ్డిపోచ వరకుగల ప్రాణులయొక్క; అంతర్హృదయేషు = లోపల హృదయములందు; ఆత్మస్వరూపేణ = ఆత్మస్వరూపముతో; బహిః అపి = వెలుపలకూడా; కాలస్వరూపేణ = కాలస్వరూపముతో; ఆకాశ ఇవ = ఆకాశమువలె; ఉపాధినా = ఉపాధిచే; అవ్యవధీయమానః = హృదయములలోపలనున్నవాడవై జీవుడులేక ఆ ఉపాధిచే జీవుడువలె కప్పబడినవాడవగుచు; భవాన్ ఏకఎవ = నీవు ఒకడవే; క్షణలవ నిమేషాద్యవయవోపచిత సంవత్సర గణేన = క్షణము, లవము, నిమేషము, మొదలగుఅవయవములచే వృద్ధిపొందు సంవత్సరగణములచేత; అపాం = ఉదకములయొక్క; ఆదానవిసర్గాభ్యాం = స్వీకరించుట విడుచుట చేత, ఎండించుట వర్షించుట అనువానిచే; ఇమాం = ఈ; లోకయాత్రాం = లోకయాత్రను జీవులజీవయాత్రను; అనువహతి = నిర్వహించుచున్నావు.

తా. ఆదిత్యభగవానునకు ఓంకారపూర్వకముగా నమస్కారము చేయుచున్నాను ఓ సూర్యభగవానుడా! నీవు ఒక్కడవే ఈ యెల్ల జగములకు, జరాయుజముల (మావిచే బుట్టు మనుజులు మృగములు) అండజములు (గ్రుడ్డువలన బుట్టు పక్షిసర్పాదులు) స్వేదజములు (చెమటవలన బుట్టు పేలు నల్లులు మొదలగునవి) ఉద్భిజ్జములు (భూమిని పెళ్ళగించుకొని బుట్టు వృక్షములు లతలు మొదలగునవి) అను నాలుగు విధములైన ప్రాణులకు బ్రహ్మ మొదలు గడ్డిపోచవఱకు గల అన్ని ప్రాణులకు ఆత్మస్వరూపముతో హృదయములోపల, కాలస్వరూపముతో వెలుపల నుండుచు, ఆకాశమువలె ఆయా ఉపాధిచే ఆచ్ఛాదింపబడని వాడ వగుచు నుండుచు, క్షణము లవము నిముసము మొదలగు అవయవములు గల సంవత్సరముల గణముచే ప్రతి సంవత్సరము జలముల నాకర్షించుచు. విడుచుచు' అనగా నీరును ఎండించుట, మరల వర్షరూపమున జలముల వర్షించుచు ఎల్లజీవుల జీవయాత్రనునిర్వహింపజేయుచున్నావు. ఇట్లు చెప్పుటచే గాయత్రీ ప్రథమ పాదోక్తమైన వరేణ్యత తెలుపబడినది.

అవ. పై గద్యమందు గాయత్రీ ప్రథమపాదోక్తమైన వరేణ్యత్వము చెప్పబడినది. ఇపుడు ఈ గద్యమందు గాయత్రీ ద్వితీయ పాదార్థమును వర్ణించుటద్వారా స్తోత్రము చేయుచున్నారు.

గ **యదుత హవావ విబుధర్షభ సవిత రదస్తపత్యను సవన మహారహ రామ్నాయ విధినా ఉపతిష్ఠమానానా మఖిల దురిత వన బీజావభర్జన భగవతస్సమభి ధీమహి తపన తవ మండలమ్. 68**

అ. విబుధర్షభ = ఓ దేవ శ్రేష్ఠుడా ; సవితః = ఓ సవితా; తపన = తపింపజేయు ఓ సూర్య భగవానుడా; భగవ ః = భగవంతుడవైన; తవ = నీయొక్క; మండలం = మండలము; తపతి = తపింప జేయుచున్నది అహః + అహః = ప్రతిదినము; అనుసవనం = మూడుకాలములందు అనగా ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములందు; ఆమ్నాయవిధినా = వేదోక్తవిధిచే; ఉపతిష్ఠమానానాం = సేవించు వారలయొక్క; అఖిలదురిత = ఎల్లపాపము లను; వనబీజ = అడవిలోవృక్షములకు విత్తనము అనగా కారణమైన అవిద్యను; అవభర్జన = మాడ్చువాడా; భగవతః తవ మండలం = భగవంతుడవైన నీ మండలమును, సమభీమహి = చక్కగా ధ్యానించెదము యత్ + ఉతహవావ = ఏ నిన్ను పూజింతుము.

తా ఓ దేవ శ్రేష్ఠుడా! ఓ సవితా! ఓ తపనా! ప్రతిదినము ప్రాతఃకాలము మధ్యాహ్నము సాయంకాలము వేదోక్త విధానముచే కర్మానుష్ఠానము చేయుచు నిన్ను సేవించు భక్తుల సర్వ పాపములను వనబీజములను అనగా వనవృక్షముల విత్తనములను అనగా కారణమైన అవిద్యను మాడ్చువాడవు, భగవంతుడవగు నీ మండలమును చక్కగా ధ్యానించుచున్నాము.

అవ ఇపుడు గాయత్రీ మంత్రములోని మూడవపాదముయొక్క అర్థముచే స్తోత్రము చేయుచున్నారు.

గ. **య ఇహవావ స్థిర చర నికరాణాం నిజ నికేతనానాం మన ఇంద్రియాసుగణాన నాత్మనశ్శ స్వయ మాత్మాం తర్యామీ ప్రచోదయతి. 69**

యః = ఏ నీవు; ఇహవావ = ఈ లోకమునందు; స్థిర చర నికరాణాం = స్థావర జంగమ సమూహములయొక్క; నిజనికేతనానాం = నీవు ఆశ్రయముగాగల ప్రాణులయొక్క; మన ఇంద్రియాసుగణాన్ = మనస్సు ఇంద్రియములు ప్రాణములను; అనాత్మనః = జడములను; స్వయం = స్వయముగా ఆత్మా = ఆత్మవై; అంతర్యామీ = అంతర్యామివై; ప్రచోదయతి = ప్రేరేపించుచున్నావు.

తా. ఓ సూర్యభగవానుడా!, ఈ లోకమందు నిన్ను ఆశ్రయించి యున్న స్థావర జంగమ ప్రాణుల జడములైన మనస్సు ఇంద్రియములు ప్రాణములు అనువానిని స్వయముగా జీవుడవై, అంతర్యామివై ఈశ్వరుడవై, పరమాత్మవై, ప్రేరేపించుచున్నావు. అనగా వాని వాని వృత్తులయందు ప్రవర్తింప జేయుచున్నావు.

అవ. మూడవపాదమునే మండలమునందు పరమాత్మగా స్తుతించుచున్నారు.

**గ యఏక ఏవేమం లోక మతి కరాళ వదనాంధకార సంజ్ఞాజగర గ్రహ గృహీతం మృతక మివ విచేతన మవలోక్య అనుకంపయా పరమ కారుణికః ఈక్షయైవోత్థాప్యా హరహ రను సవనం శ్రేయసి స్వధర్మాఖ్యావస్థానే ప్రవర్తయత్యవనిపతి రివాసాధూనాం భయ ముదీర యన్నటతి పరిత ఆశాపాలై స్తత్ర తత్ర కమలకోశాంజలిభి రుపహృతార్హణః**

అ. యః = ఏ; ఏక ఏవ = ఒకడవే; అతి కరాళవదనాంధకార సంజ్ఞా జగరగ్రహగృహీతం, అతికరాళవదన = మిగులభయంకరమైన ముఖము గలిగి; అంధకారసంజ్ఞా = అంధకారమను పేరు గలిగిన; అజగర గ్రహ గృహీతం = కొండచిలువఅను గ్రహముచే పట్టబడినదై; మృతకం ఇవ = చచ్చినదానివలె: విచేతనం = ప్రాణము, జ్ఞానములేని, ఇమం లోకం = ఈలోకమును; అవలోక్య = చూచి; అనుకంపయా = దయచే; పరమకారుణికః = మిక్కిలి దయగలవాడవు గాన; ఈక్షయా ఏవ చూపుచేతనే; ఉత్థాప్య = లేపి, అహః అహః = ప్రతిదినము, అనుసవనం = మూడుకాలములందు, స్వధర్మాఖ్యావస్థానే-స్వధర్మమను పేరుగల ఆత్మస్వరూపమునందు నిల్చుట. ప్రత్యక్ప్రవణము కలిగి యుండుట; శ్రేయసి = ఆ శ్రేయస్సునందు, అవని పతిః ఇవ = రాజువలె, అసాధూనాం = దుష్టులకు, భయం = భయమును ఉదీరయన్ = కలిగించుచు, ఆశాపాలైః ఇంద్రాదిదిక్పాలురచే; కమలకోశాంజలిభిః పద్మ = కోశములవంటి దోసిళ్ళచే, తత్ర తత్ర = అచ్చటచ్చట; ఉపహృతార్హణః = ఇయ్యబడిన అర్ఘ్యము గలవాడవై, పరితః = అంతట, నటతి = సంచరించుచున్నావు.

తా. నీవు ఒక్కడవే మిగుల భయంకరమయిన మొగము గలిగిన అంధకారమను కొండచిలువ అను గ్రహముచే బట్టువడి చన్నినది వలె, ప్రాణము జ్ఞానము లేనిదైన ఈలోకమును చూచి మిగుల దయగలవాడవై, కనికరముతో చూపు మాత్రమున ఈ ప్రాణిలోకమును నిద్ర లేపి, లేవనెత్తి, ప్రతిదినము మూడుకాలములందు మేలు గలిగించు స్వధర్మమను పేరుగల ఆత్మసంస్థానమునందు, పరమాత్మానుసంధానమునందు ప్రవర్తింపజేయుచు, రాజువలె దుష్టులకు భయము కలిగించుచు, ఇంద్రాది దిక్పాలురచేత ఆయా కాలములందు కమలకోశముల వలె మృదువైన దోయిళులచే సమర్పించు అర్ఘ్యములను గ్రహించుచు, లోకమంతట తిరుగు చున్న నీకు నమస్కారము.

**గం. అథ హ భగవం స్తవ చరణ నళిన యుగళం త్రిభువన గురుభి రభివందిత మహమ యాత యామ యజుష్కామ ఉపసరామీతి.**

అ. అథహ = మఱియు, భగవన్! = సూర్యభగవానుడా!; త్రిభువనగురుభిః = ముల్లోకములకు గురువులగు బ్రహ్మాదులచే; అభివందితం = నమస్కరింపబడిన; తవ = నీ యొక్క; చరణ నళిన యుగళం = పాద పద్మముల జంటను; అహం = నేను; అయాతయామ యజుష్కామః = ఇతరులకు ఉన్నది ఉన్నట్లుగా తెలియబడని యజుర్మంత్రములను నేర్వగోరినవాడనై, ఉపసరామి = సేవించు చున్నాను; ఇతి = అని స్తుతించెను.

తా. ఓ భగవానుడా! ముల్లోకములకు గురువులగు బ్రహ్మేంద్రాదులచే నమస్కరించ బడిన నీయడుగుదామరలజంటను ఇతరులకు ఉన్నది ఉన్నట్లుగా తెలియని యజుర్మంత్రము లను నేర్వగోరి సేవించుచున్నాను అని స్తుతించెను.

శ్రీసూత ఉవాచ = శ్రీసూతమహాముని పలికెను.

శ్లో. ఏవం స్తుత స్స భగవాన్ వాజిరూప ధరో రవిః
యజూంష్య యాత యామాని మునయే ఒదాత్ప్రసాదితః. 72

అ. ఏవం = ఈప్రకారముగా; స్తుతః = స్తుతింపబడిన; ప్రసాదితః = ప్రసన్నుడు చేయబడిన; సః = ఆ; భగవాన్ = భగవంతుడగు; రవిః = సూర్యుడు; వాజిరూపధరః = అశ్వరూపమును ధరించి; మునయే = మునికి; అయాతయామాని = ఇతరులు తెలియని; యజూంషి = యజుర్మంత్రములను, అదాత్ = ఇచ్చెను.

తా. ఈ విధముగా స్తుతింపబడి ప్రసన్నుడు చేయబడిన సూర్యభగవానుడు అశ్వ రూపముధరించి ఆయాజ్ఞవల్క్యునికి ఇతరులు తెలియని యజుర్మంత్రములను అనుగ్రహించెను.

శ్లో. యజుర్భి రకరో చ్ఛాఖా దశ పంచ శతైర్విభుః
జగృహు ర్వాజస న్యస్తాః కాణ్వ మాధ్యందినాదయః, 73

అ. విభుః = సమర్థుడైన ఆ యాజ్ఞవల్క్యుడు; శతైః = అపరమితములైన; యజుర్భిః = ఆ యజుర్మంత్రములచేత; దశపంచ = పదునైదు శాఖాః = శాఖలను; అకరోత్ = చేసెను; వాజసన్యస్తాః వాజిరూపుడైన రవిచే కేసరమురనుండి లేక వేగముచే వదలబడిన ఆమంత్రములను; కాణ్వమాధ్యంది నాదయః = కాణ్వులు మాధ్యందినులు అనువారు; జగృహుః = గ్రహించిరి.

తా. ముని సమర్థుడు అయిన యాజ్ఞవల్క్యుడు అపరిమితములైన ఆయజుర్మంత్రముల నుండి 15 పదునైదు శాఖలుచేసెను, అశ్వరూపము ధరించిన సూర్యుని జూలునుండి వేగముగా వెలువడిన ఆ శాఖలను కాణ్వులు మాధ్యందినులు అనువారు గ్రహించిరి. ఇవియే వాజసనేయ శాఖలు.

అవ. సామశాఖా విభాగమును చెప్పుచున్నారు.

శ్లో. జైమినే స్సామగస్యాసీ త్సుమంతు స్తనయో మునే
సుకర్మా తత్సుత స్తాభ్యా మేకైకాం ప్రాహ సంహితామ్. 74

అ మునే = ఓమునీ!; సామగస్య = సామవేదమును గ్రహించిన; జైమినేః = జైమినికి; సుమంతుః = సుమంతుడు; తనయః = తనయుడు; ఆసీత్ = ఉండెను తత్సుతః; = ఆసుమంతుని కొడుకు, సుకర్మ

సుకర్మ తాభ్యాం=ఆసుమంత సుకర్ములిరువురికి; ఎకైకాం=ఒక్కొక్క; సంహింతాం=సంహితను; ప్రాహ=చెప్పెను.

తా. ఓమునీ! సామవేదములను గ్రహించిన జైమినికి సమంతుడను పుత్రుడు కలిగెను. ఆ సుమంతునకు సుకర్మయను కుమారుడు కలిగను ఆ సుమంత సుకర్ములిరువురికి జైమిని ఒక్కొక్క సంహితను చెప్పెను.

శ్లో. సుకర్మా చాపి తచ్ఛిష్య స్సామవేద ధరో మహాన్
సహస్రం సంహితాభేదం చక్రే సామ్నాం తతస్తు తమ్. 75

అ. తచ్ఛిష్యః=ఆజైమిని శిష్యుడైన; సుకర్మాచ=సుకర్మయును; సామవేదధరః=సామవేదమును ధరించినవాడు; మహాన్=గొప్పవాడు; సామ్నాం = ఆసామ మంత్రములయొక్క; సంహితాభేదం = సంహితాభేదములను సహస్రం = ఒకవేయి; చక్రే = చేసెను; తతస్తు = అంత; తం = ఆ భేదమును

తా. ఆ జైమిని శిష్యుడు, సామవేదమును ధరించినవాడు, గొప్పవాడు అయిన సుకర్మ సామమంత్రములను వేయి శాఖలుగా చేసెను.

శ్లో. హిరణ్యనాభః కౌసల్యః పౌష్యంజిశ్చ సుకర్మణః
శిష్యౌ జగృహతు శ్చాన్య ఆవంత్యో బ్రహ్మవిత్తమః. 76

అ. సుకర్మణః=సుకర్మయొక్క; శిష్యౌ = శిష్యులగు; కౌసల్యః = కోసలునికుమారుడగు; హిరణ్యనాభః; హిరణ్యనాభుడు; పౌష్యంజిశ్చ = పౌష్యంజి అనువాడును; జగృహతుః = గ్రహించిరి; అన్యః = మరియొకడు; బ్రహ్మవిత్తమః = వేదజ్ఞులలోశ్రేష్ఠుడగు; ఆవంత్యః = ఆవంత్యుడు గ్రహించెను.

తా. సుకర్మ శిష్యులగు కోసలుని కుమారుడు హిరణ్యనాభుడు పౌష్యంజి అనువారలు ఆసామ మంత్రముల భేదములను గ్రహించిరి. మరియొక శిష్యుడు ఆవంత్యుడు కూడా గ్రహించెను.

శ్లో. ఉదీచ్యా స్సామగా శిష్యా ఆస న్పంచ శతానివై
పౌష్యంజ్యావంత్యయో శ్చా ఒపి తాం శ్చోదీచ్యా న్ప్రచక్షతే. 77

అ పౌష్యంజి ఆవంత్యయోశ్చ = పౌష్యంజి ఆవంత్యుడు; చకారమువలన హిరణ్యనాభునికి ఉదీచ్యాః = ఉత్తరదేశమువారు; సామగాః = సామమంత్రములను; నేర్చినవారు; శిష్యాః = శిష్యులు; పంచశతాని = అయిదువందలు; ఆసన్ = అయిరి. తాంశ్చ = వారిని; ఉదీచ్యాన్ = ఉదీచ్యులని, ప్రచక్షతే = చెప్పెదరు.

తా. ఆ హిరణ్యనాభునికి పౌష్యంజికి ఆవంత్యునికి సామవేదమును అధ్యయనము చేసినవారు అయిదువందలమంది శిష్యులుండిరి. వీరిని ఉదీచ్యులందురు, కాలక్రమమున ప్రాచ్యులనియు పిలిచెదరు. ఈ విషయమును విష్ణుపురాణము చెప్పినది.

"ఉదీచ్యా స్సామగా శ్శిష్యా స్తస్య పంచ శతం స్మృతా;
హిరణ్యనాభా త్తావత్య స్సంహితా యై ర్ద్విజోత్తమైః
గృహీతాస్తేఒపి చోచ్యంతే పండితైః ప్రాచ్యసామగాః"

హిరణ్యనాభునికి ఉదీచ్యులు సామగులు అయిదువందలమంది శిష్యులైరి. వీరిని ప్రాచ్యులని సామగులని పండితులు చెప్పెదరు అని పై శ్లోకములకు భావము.

అవ. మరల సుకర్మ శిష్యులైన ఈ మువ్వురి శిష్యులతో వృద్ధిచెందిన శాఖల వివరములను రెండు శ్లోకములతో తెలుపుచున్నారు.

శ్లో. లోకాక్షి ర్లాఙ్గలిః కుల్యః కుసీదః కుక్షిరేవ చ
పౌష్యంజి శిష్యా జగృహు స్సంహితానాం శతమ్ శతం. 78

అ. పౌష్యంజి శిష్యాః = పౌష్యంజిశిష్యులైన; లోకాక్షిః = లోకాక్షి; లాంగలిః = లాంగలుడు; కుల్యః = కుల్యుడు; కుసీదః = కుసీదుడు; కుక్షిః + ఎవ = కుక్షికూడా, సంహితానాం = సామ సంహితలయొక్క; శతం శతం = పదివేల శాఖలను; జగృహుః = గ్రహించిరి.

తా. పౌష్యంజి శిష్యులైన లోకాక్షి, లాంగలుడు, కుల్యుడు, కుసీదుడు, కుక్షియను వారలు సామవేద సంహితల పదివేల శాఖలను గ్రహించిరి.

శ్లో. కృతో హిరణ్యనాభస్య చతుర్వింశతి సంహితాః
శిష్య ఊచే స్వశిష్యేభ్య శ్శేషా ఆవంత్య ఆత్మవాన్. 79

అ. హిరణ్యనాభస్య = హిరణ్యనాభునియొక్క శిష్యః = శిష్యుడైన; కృతః = కృతుడనువాడు స్వశిష్యేభ్యః = తనశిష్యులకు; చతుర్వింశతి = ఇరువదినాలుగు; సంహితాః = సామవేదసంహితలను; ఊచే = చెప్పెను; ఆత్మవాన్ = జ్ఞానముగల; ఆవంత్యః = అవంత్యుడు; శేషాః = మిగిలినశాఖలను; ఊచే = చెప్పెను.

తా. హిరణ్యనాభుని శిష్యుడు కృతుడు తన శిష్యులకు ఇరువదినాలుగు సామసంహితలను చెప్పెను. ఆత్మజ్ఞానముగల ఆవంత్యుడు తన శిష్యులకు మిగిలిన శాఖలను చెప్పెను.

---

కం. ధారుణి బారాశరికిను చారులు పైలుడు సుమంతు జైమిని మునులున్
ధీరుడు వైశంపాయను డారయ నలువురును శిష్యులై యుండిరిలన్ 29

వ. వారలు ఋగ్యజు స్సామాథర్వణంబులని యెడు నాలుగు వేదంబులును, వ్యాసోపదిష్టక్రమంబున లోకంబులం బ్రవర్తింపజేసిరి. అని చెప్పిన నాక్రమం బెట్లని శౌనకుండడిగిన, సూతుండు సెప్పం దొడంగె. ఆది యందు చతుర్ముఖుని హృదయంబున నొక నాదంబుద్భవించె. అది వృత్తి నిరోధంబువలన మూర్తీభవించి వ్యక్తంబుగా గనబడె అట్టి నాదోపాసన వలన యోగిజనంబులు నిష్పాపులై ముక్తి నొందుదురు. అందున నోంకారంబు జనియించె. అదియె సర్వమంత్రోపనిషన్మూల భూతయగు వేదమాతయని చెప్పబడు. ఆయోంకారంబు త్రిగుణాత్మకంబై. అకార ఉకార మకారంబులనెడు త్రివర్ణ రూపంబయి ప్రకాశింపుచుండె. అంతభగవంతుండగు నజుండా ప్రణవంబువలన స్వరస్వర్యాంతస్థోష్మాది లక్షణ లక్షితంబగు నక్షరసమామ్నాయంబు గల్పించి, తత్సహాయంబుననే తనవదన చతుష్టయంబువలన వేద చతుష్టయంబు గలుగజేసె. అంత నతని పుత్రులగు బ్రహ్మవాదులా వేదంబులం దదుపదిష్ట ప్రకారంబుగా నభ్యసించి, యాక్రమంబున దామును శిష్య పరంపరలకు నుపదేశించిరి. ఇట్లు వేదంబుల సమగ్రంబుగా బ్రతియుగంబునను మహర్షులచే నభ్యసింపబడును. అట్టి వేదంబుల సమగ్రంబుగ బఠియింప నశక్తులగు వారలకు సహాయంబు సేయుటకై ద్వాపరయుగాది యందు భగవంతుండు సత్యవతీదేవి యందు బరాశర మహర్షికి సుతుడుగా నవతరించి యావేదరాశిం గ్రమమున ఋక్కు యజుస్సామము

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశ స్కంధే
షష్ఠోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవత మందు ద్వాదశ స్కందమునందు
ఆఱవ అధ్యాయము ముగిసినది.

ఓమ్ తత్ సత్

---

అధర్వణము అను నాలుగు విధంబులుగ విభజించి పైల, వైశంపాయన జైమిని సుమంతునియెడు శిష్యవరులకు క్రమంబుగ నా ఋగాది వేదంబుల నుపదేశించె. అందు పైల మహర్షి చేకొన్న ఋగ్వేదం బనంతంబులగు ఋక్కులతో జేరి యుండుటం జేసి, బహ్వృచ శాఖయని చెప్పంబడు, అంత నా పైలుండు ఇంద్ర ప్రమితికి బాష్కలునకు నుపదేశించె. అతండా సంహితం జతుర్వేదంబులు గావించి, బోధ్యుండు యాజ్ఞవల్క్యుడు పరాశరుడు అగ్నిమిత్రుడు ననువారికి నుపదేశించె. ఇంద్ర ప్రమితికి తన సంహిత మాండుకేయున కుపదేశించె. మాండుకేయుడు దేవమిత్రుండను వానికిం జెప్పె. అతనికి సౌభర్యాది శిష్యులనేకులై ప్రవర్తిల్లిరి అందు సౌభరి సుతుండగు శాకల్యుడు తానభ్యసించిన శాఖ నైదు తెఱగులుగ విభజించి, వాత్స్యుడు మౌద్గల్యుడు శాలీయుడు గోముఖుడు శిశిరుడు ననెడు శిష్యుల కుపదేశించె. అంత జాతుకర్ణియను వానికి వారుపదేశింప. నతడు బలాకుడు పైంగుడు వైతాళుండు విరజుండు ననువారి కుపదేశించె. ఇదియునుంగాక ముందు చెప్పిన బాష్కలుని కుమారుడయిన బాష్కలి వాలఖిల్యాఖ్య సంహితం బాలాయని, గార్గ్యుడు, కాసారుండను వారలకుం జెప్పె. ఈ తెఱంగున బహ్వృచ సంహిత లనేక ప్రకారంబులం బూర్వోక్త బ్రహ్మర్షులచే ధరియింపబడె. అంత యజుర్వేద ధరుండగు వైశంపాయనుని శిష్యసంఘంబు నిఖిల క్రతుల నాధ్వర్యవకృత్యంబుచే దేజరిల్లిరి. మరియు నతని శిష్యుండగు యాజ్ఞవల్క్యుండు గుర్వపరాధంబు చేసిన, నా గురువు కుపితుండై యధీత వేదంబుల మరలం దనకిచ్చి పొమ్మనిన, నతండు దాను జదివిన యజుర్గణంబును, దదుక్తక్రమంబున గ్రక్కన నవి రుధిరాక్తంబగు రూపంబు దాల్చిన నా యజుర్గణాధిష్ఠిత శాఖాధి దేవతలు తిత్తిరి పక్షులయి, వాటిని భుజియించిరి. దానం జేసి యా శాఖలు తైత్తిరీయంబులయ్యె. అంత నిర్వేదియగు నా యాజ్ఞవల్క్యుడ పరిమిత నిర్వేదంబు నొంది యుగ్రతపంబున సూర్యుని సంతుష్టుం గావింప, నతండు సంతసిల్లి, హయరూపంబుదాల్చి యజుర్గణంబు నాతని కుపదేశించె. కాన యవి వాజసనేయశాఖ యని చెప్పంబడె. అంత నా యజుర్గణంబు కాణ్వమాధ్య దినాదులచే నభ్యసింపబడె. ఇట్లు యజుర్వేదంబు లోకంబునం బ్రవర్తిల్లె, సామవేదాధ్యేతయగు జైమిన మహర్షి తన సుతుండగు సుమంతుని కుపదేశించె. అతండును సుకర్ముడను తన కుమారునికి దెలిపె. అతండా వేదమును సహస్ర సాఖలుగా విభజించి; కోసలుని కుమారుడయిన హిరణ్యనాభునికిం దనకుమారుండగు పౌష్యంజి యనువాని కుపదేశించె. అంతట వారిరువురును బ్రహ్మవేత్తలగు నావంత్యులు, నుదీచ్యులు నను నేనూర్గురికి నుపదేశించి వారిని సామవేదపారగులుగా జేసిరి. ఇట్లు సామవేదంబు లోకంబున వినుతి నొందె.

# సప్తమోఽధ్యాయః

## ఏడవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**సప్తమే ధర్మ విస్తారః పురాణ వ్యసనం తతః**
**పురాణ లక్షణాదీని ఫలం భాగవత శ్రుతేః.**

తా. ఈ సప్తమాధ్యాయమందు ధర్మవిస్తారము, పురాణవిభాగము, పురాణలక్షణము మొదలగునవి మరియు భాగవత శ్రవణ ఫలము చెప్పబడినవి

అవ యథాక్రమముగా అథర్వ వేదవిభాగమును చెప్పుచున్నారు

సూత ఉవాచ—సూతులు పలికిరి.

శ్లో. **అథర్వ విత్సుమంతశ్చ శిష్యమధ్యాపయత్స్వకామ్**
**సంహితాం సోఽపి పథ్యాయ వేదదర్శాయ చోక్తవాన్.**

అ. అథర్వవిత్ = అథర్వవేదమునెఱింగిన; సుమంతశ్చ = సుమంతుడుకూడా; స్వకాం = తనదైన సంహితాః = సంహితను; శిష్యం = శిష్యుడైన కబంధుని, అధ్యాపయత్ = చదివించెను. సః అపి = ఆ కబంధుడు కూడా; సంహితాం = అథర్వవేద సంహితను; పథ్యాయ = పథ్యునికి; వేదదర్శాయ = వేదదర్శునికి; ఉక్తవాన్ = చెప్పెను.

అథర్వవేదము నెరింగిన సుమంతుడు తన అథర్వవేద సంహితను తన శిష్యుడగు కబంధునికి చెప్పెను. ఆ కబంధుడు కూడా అథర్వవేదమును రెండువిధములుగా విభజించి పథ్యునికి వేదదర్శునికి చెప్పెను. ఈ విషయమును విష్ణుపురాణమున కూడా వివరించిరి.

"అథర్వవేదం సమునిః సుమంతు రమితద్యుతిః
శిష్యమధ్యాపయామాస కబంధం సోఽపి తద్ద్విధా
కృత్వాతు వేదదర్శాయ తథా పథ్యాయ దత్తవాన్"

అమితతేజస్సు గల సుమంతుడు తన అథర్వవేదమును శిష్యుడగు కబంధునికి బోధించెను. కబంధుడు కూడా దానిని రెండుగా విభజించి వేదదర్శునికి కబంధునికి బోధించెను. అని పై శ్లోకములకు భావము.

అవ. వేదదర్శుడు తన అథర్వవేద సంహితను నాలుగుగా విభజించి నలుగురు శిష్యులకు బోధించెను పథ్యుడు మూడుభాగములుగా విభజించి ముగ్గురు శిష్యులకు బోధించెనని ఒకటిన్నర శ్లోకముతో చెప్పుచున్నారు.

శ్లో. శౌల్కాయని బ్రహ్మబలిః నిర్దోషః పిప్పలాయనః
వేదదర్శన శిష్యాస్తే పథ్య శిష్యా నథో శృణు
కుముద శ్శునకో బ్రహ్మన్ జాబాలి శ్చాప్యథర్వవిత్. 2

అ. బ్రహ్మన్! = ఓ బ్రాహ్మణోత్తమా!; శౌల్కాయనిః = శౌల్కాయని; బ్రహ్మబలిః = బ్రహ్మబలి; నిర్దోషః = నిర్దోషుడు; పిప్పలాయనః = పిప్పలాయనుడు; తే = ఆ నలుగురు; వేదదర్శన శిష్యాః = వేదదర్శనుని శిష్యులు; అథ = మఱియు; పథ్యశిషాన్ = పథ్యుని శిష్యులను; శృణు = వినుము; కుమదః = కుముదుడు; శునకః = శునకుడు; జాబాలిశ్చ = జాబాలి కూడా; అథర్వవిత్ = అథర్వ వేదమును తెలిసినవాడు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! శౌల్కాయని, బ్రహ్మబలి, నిర్దోషుడు, పిప్పలాయనుడు అను వారలు నలుగురు వేదదర్శనుని శిష్యులు. కుముదుడు శునకుడు జాబాలి అనువారు పథ్యుని శిష్యులు.

శ్లో. బభ్రు శ్శిష్యో ఒథాంగిరస సైంధవాయన ఏవ చ
అధీయేతాం సంహితే ద్వే సావర్ణాద్యా స్తథా పరే. 3

అ. అథ = మఱియు; అంగిరసః = శునకునికి; బభ్రుః = బభ్రువు అనువాడు; శిష్యః = శిష్యుడు సైంధవాయన ఏవచ = సైంధవాయనుడుకూడాశునకుని శిష్యుడు; ద్వే సంహితే = రెండు సంహితలను; అధీయేతాం = చదివిరి; తథా = అటులనే; అపరే = ఇతరులు; సావర్ణాద్యాః = సావర్ణుడు మొదలగువారు సైంధవాయనుని శిష్యులు కూడా చదివిరి.

తా. శునకుడు తన శిష్యులైన బభ్రువు సైంధవాయనుడను వారలకు తన సంహితను రెండు శాఖలుగా విభజించి బోధించెను. సైంధవాయనుడు తన శిష్యులైన సావర్ణుడు మొదలగు వారలకు బోధించెను. ఈ విషయమే ఈ క్రింది శ్లోకములో చెప్పబడినది.

"శునకస్తు ద్విధా కృత్వా దిదా వేకాం తు బభ్రవే
ద్వితీయాం సంహితాం ప్రాదా త్సైంధవాయన సంజ్ఞినే"

శునకుడు అథర్వవేదమును రెండుగా విభజించి ఒకటి బభ్రువునకు ఇచ్చెను. మరియొకటి సైంధవాయనునికి ఇచ్చెను.

శ్లో. నక్షత్ర కల్ప శ్శాంతిశ్చ కాశ్యపాంగిరసాదయః
ఏతే చా థర్వణాచార్యాః శృణు పౌరాణికాన్మునే. 4

అ. నక్షత్ర కల్పః = నక్షత్ర కల్పుడు శాంతిః = శాంతి; కాశ్యపాంగిరసాదయః = కాశ్యపుడు అంగిరసుడు మొదలగువారు; ఏతే = వీరు; అథర్వణాచార్యః = అథర్వవేదమును అధ్యయమును చేసిరి. మునే = ఓ మునీ! పౌరాణికాన్ = పురాణములను రచించిన వారిని; శృణు = వినుము.

తా. నక్షత్ర కల్పుడు, శాంతి, కాశ్యపుడు, అంగిరసుడు మొదలగువారు అథర్వవేదమును చదివినవారు. ఇక పురాణములను రచించినవారిని చెప్పెద వినుము. నక్షత్రకల్పము శాంతి అనువాటిని ఏర్పరచినవారలు ఆ యా పేర్లతో వ్యవహరింప బడుచున్నారు. ఈవిషయమే ఈ శ్లోకమున చెప్పబడినది.

"నక్షత్రకల్పో వేదానాం సంహితానాం తథైవ చ
చతుర్థ స్స్యాదాంగిరస శ్శాంతి కల్పశ్చ పంచమః"

నక్షత్రకల్పుడు వేదములను సంహితలను విభజించినవాడు. అట్లే అంగిరసుడు నాలగవవాడు, శాంతి కల్పుడు అయిదవవాడు అని దీని భావము.

శ్లో. త్రయ్యారుణిః కశ్యపశ్చ సావర్ణిరకృతవ్రణః
వైశంపాయన హారీతౌ షడ్వై పౌరాణికా ఇమే. **5**

తా. త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, వైశంపాయనుడు, హారీతుడు అను వీరు ఆరుగురు పౌరాణికులు అనగా పురాణకర్తలు.

శ్లో **అధీయంత వ్యాసశిష్యాత్సంహితాం మత్పితుర్ముఖాత్**
**ఏకైకా మహమేతేషాం శిష్య స్సర్వా స్స మధ్యగామ్** **6**

అ వ్యాస శిష్యాత్=వ్యాసుని శిష్యుడైన; మత్పితుః=మాతండ్రియైన రోమహర్షణుని; ముఖాత్=ముఖమునుండి; ఏకైకాం=ఒక్కొక్క సంహితాం=పురాణ సంహితను; అధీయంత= అధ్యయనము చేసిరి; ఏతేషాం=ఈ త్రయ్యారుణి మొదలగు వారికి, శిష్యః=శిష్యుడనై; అహం= నేను: సర్వాః=అన్నిపురాణ సంహితలను; సమధ్యగాం=అధ్యయనమ చేసితిని

తా. మొదట వ్యాసభగవానుడు పురాణమును ఆరు సంహితలుగా విభజించి మా తండ్రి యైన రోమహర్షణునకు జెప్పెను. మాతండ్రివలన త్రయ్యారుణి మొదలగు వారు ఆరుగురు ఒక్కొక్క సంహితను చదివిరి. వారికి శిష్యుడనై నేను ఆరు సంహితలను అధ్యయనము చేసితిని.

శ్లో **కాశ్యపోఽహం చ సావర్ణి రామశిష్యో ఒకృత వ్రణః**
**అధీమహి వ్యాసపుత్రా చ్చతస్రో మూల సంశ్రితాః.** **7**

అ కాశ్యపః=కాశ్యపుడు; అహం=నేను; సావర్ణిః=సావర్ణి; రామశిష్యః=పరశురాముని శిష్యుడగు; అకృతవ్రణః=అకృతవ్రణుడు; చతస్రః=నలుగురము, వ్యాస పుత్రాత్=వ్యాసుని పుత్రుడైన శుకుని వలన; మూల సంశ్రితాః=మూల సంహితలను; అధీమహి=అధ్యయనము చేసితిమి.

తా. కాశ్యపుడు, నేను, సావర్ణి, పరశురాముని శిష్యుడైన అకృతవ్రణుడను మేము నలుగురము వ్యాసపుత్రుడైన శుకమహర్షివలన మూల సంహితలను చదివితిమి.

అవ. శుక పరీక్షిత్సంవాదమున పురాణలక్షణము నిరూపించబడిననూ దానిభేదమును తెలుపుటకు మరల చెప్పుచున్నారు.

శ్లో. పురాణ లక్షణంబ్రహ్మన్ బ్రహ్మర్షిభిర్నిరూపితమ్
శృణుష్వ బుద్ధిమాశ్రిత్య వేదశాస్త్రానుసారతః. **8**

అ. బ్రహ్మన్!=ఓ బ్రాహ్మణోత్తమా!; బ్రహ్మర్షిభిః=బ్రహ్మర్షుల చేత; పురాణ లక్షణం= పురాణ లక్షణము; వేదశాస్త్రానుసారతః=వేదశాస్త్రములననుసరించి; నిరూపితం=నిరూపించబడినది; బుద్ధిం=బుద్ధిని; ఆశ్రిత్య=నిలిపి; శృణుష్వ=వినుము.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! వేదశాస్త్రములననుసరించి బ్రహ్మఋషులు పురాణలక్షణమును నిరూపించిరి. ఆ లక్షణమునే బుద్ధిని నిలిపి వినుము.

శ్లో. సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తి రక్షాంతరాణి చ
వంశో వంశాను చరితం సంస్థా హేతురపాశ్రయః. 9

అ. అస్య=ఈ విశ్వము యొక్క; సర్గః=సృష్టి; విసర్గః+చ=లయముకూడా; వృత్తిః=స్థానము; రక్షా=పోషణము; అంతరాణి చ=మన్వంతరములు; వంశః=దేవదానవ వంశములు, వంశాను చరితం=సూర్య చంద్రవంశముల చరిత్ర; సంస్థా=నిరోధము; హేతుః=జీవాశ్రయ వాసనలు; అపాశ్రయః=ఆశ్రయము.

తా. ఈ విశ్వము యొక్క సృష్టి, లయము, వృత్తి, రక్షణము, మన్వంతరములు దేవ దానవుల వంశములు, సూర్య చంద్రవంశముల చరిత్ర, నిరోధము,జీవాశ్రయవాసనలు, ఆశ్రయము అను నీ పది పురాణముననుండునని ముందుశ్లోకముతో అన్వయము. ఇదే విషయమును మరొకచోట చెప్పియున్నారు. "అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణమూతయః, మన్వంతరేశాను కథా నిరోధోముక్తిరాశ్రయః" అని ఈ పదివిధములే చెప్పబడినవి. ఈ శ్లోకమున చెప్పిన స్థానపోషణలు పై శ్లోకమున వృత్తి రక్షాశబ్దములచే చెప్పబడినవి. అంతర శబ్దముచే చెప్పబడిన దానిని మన్వంతర శబ్దముచే చెప్పిరి. ఈశానుకథా శబ్దముచే వంశము వంశాను చరితము చెప్పబడినది. సంస్థాశబ్దార్థమును నిరోధక శబ్దముచే చెప్పబడినది. ఈ నిరోధక శబ్దము చెప్పుటచే ఆత్యంతిక లయరూపమగు ముక్తికూడా చెప్పబడినది. ఈశ్లోకమున చెప్పిన ఊతి శబ్దముచే హేతువులైన జీవాశ్రయవాసనలు చెప్పబడినవి.

శ్లో. దశభి ర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః
క్వచి త్పంచ విధం బ్రహ్మన్ మహదల్ప వ్యవస్థయా 10

అ. దశభిః లక్షణైః=పది లక్షణములతో; యుక్తం=కూడిన దానిని; పురాణం=పురాణముగా; తద్విదః=దానినెరిగిన వారు; విదుః=తెలిపెదరు; బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా!; మహదల్పవ్యవస్థయా=గొప్ప చిన్నయను భేదముచే; క్వచిత్=ఒకచో; పంచవిధం=అయిదు విధములుగా; విదుః=తెలియుదురు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! పురాణలక్షణములు తెలిసినవారు ఈ పదిలక్షణములు గలది పురాణమని చెప్పెదరు. మహాపురాణము, అల్పపురాణమను వ్యవస్థచే కొన్నిచోట్ల అయిదులక్షణములుకూడా చెప్పబడినవి. అనగా పదిలక్షణములతో కూడినది మహాపురాణము అయిదులక్షణములతోనున్నది అల్పపురాణముఅని వ్యవస్థచేయబడినది. అయిదేమన—"సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణి చ వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్" సృష్టి, లయము, వంశము, మన్వంతరము, వంశాను చరితము అనునవి అయిదులక్షణములు.

అవ. సర్గము మొదలగు వాటి లక్షణములు చెప్పుచున్నారు.

శ్లో. అవ్యాకృత గుణక్షోభా న్మహత స్త్రివృతోఽహమః
భూత సూక్ష్మేంద్రియార్థానాం సంభవ స్సర్గ ఉచ్యతే. 11

అ. అవ్యాకృత గుణక్షోభాత్ = ప్రకృతి యొక్క త్రిగుణముల వైషమ్యము కలత; చెందుట వలన; మహతః = మహత్తత్త్వము వలన; త్రివృతః = త్రివృతమగు; అహమః . అహంకారము, దాని వలన; భూతసూక్ష్మేంద్రియార్థానాం = భూతసూక్ష్మముల యొక్క; అనగా పంచతన్మాత్రల యొక్క; ఇంద్రియముల యొక్క; స్థూలభూతముల యొక్క; ఆయా దేవతల యొక్క. సంభవః = పుట్టుక; సర్గః = సర్గము అని; ఉచ్యతే = చెప్పబడును.

తా. నామ రూప విభాగములేని ప్రధానము లేక ప్రకృతి నుండి సత్త్వాది త్రిగుణముల ప్రకోపమువలన మహత్తత్త్వమును, ఆమహత్తత్త్వమువలన త్రిగుణాత్మకమగు అహంకారమును ఆ అహంకారమునుండి భూత సూక్ష్మములైన పంచ తన్మాత్రలు శబ్ద స్పర్శ రూప రస గంధములు, వీనినుండి ఇంద్రియములు, ఇంద్రియార్థములగు స్థూలములగు శబ్దాదులు లేక పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములు, ఇంద్రియాధిదేవతలగు ఆదిత్యాదులు జనించుట సర్గమని చెప్పబడును. అనగా కారణ సృష్టి సర్గమని భావము.

అవ. విసర్గమును చెప్పుచున్నారు

**శ్లో. పురుషాను గృహీతానా మేతేషాం వాసనామయః**
**విసర్గోఽయం సమాహారో బీజాద్బీజం చరాచరమ్. 12**

అ. పురుష + అనుగృహీతానాం = ఈశ్వరునిచే అనుగ్రహించబడిన; ఏతేషాం = ఈ మహదాదుల యొక్క; వాసనామయః = పూర్వ కర్మవాసనా ప్రధానమైన; అయం = ఈ; సమాహారః = చరాచరప్రాణి సమూహము; బీజాత్ = బీజము నుండి, బీజం = బీజమువలె; ప్రవాహ రూపమైన; చరాచరం = చరాచర ప్రపంచము; విసర్గః = విసర్గము.

తా. ఈశ్వరునిచే అనుగ్రహించబడిన మహదాదుల పూర్వకర్మ వాసనాప్రధానమై బీజమునుండి బీజమువలె జనించు కార్యభూతమైన ఈ చరాచరప్రాణి రూపము విసర్గమనబడును.

**శ్లో. వృత్తిర్భూతాని భూతానాం చరాణా మచరాణి చ**
**కృతా స్వేన నృణాం తత్ర కామా చ్చోదనయాఽపి వా. 13**

అ. చరాణాం = చరించు; భూతానాం = భూతములకు (ప్రాణులకు) అచరాణి చ = చరించని; భూతాని = భూతములు; తత్ర = ఈ రెంటిలో, నృణాం = నరుల యొక్క; స్వేన = తమ భావనచే; కామాత్ = కోరిక వలనను; చోదనయా + అపి వా = వేదవిధిచే కాని; కృతా = చేయబడినది; వృత్తిః = వృత్తియనబడును.

తా. సంచారము చేయు నరమృగ పక్ష్యాదులకు సంచారము చేయని వృక్ష సస్యలతాదులు లేక చరించు మృగాదులును సామాన్యముగానేది జీవనమగునో అది వృత్తియగును. మరియు నరులకు తమ ఇచ్ఛచే కాని వేదవిధిచేకాని నియతిగా జీవికయయినది వృత్తియనబడును.

**శ్లో. రక్షా చ్యుతావతారేహా విశ్వస్యాను యుగే యుగే**
**తిర్యఙ్మర్త్యర్షి దేవేషు హన్యన్తే యై స్త్రయీ ద్విషః. 14**

అ యుగే యుగే అను = ప్రతి యుగమునందు అనుసరించి; తిర్యక్ + మర్త్య + ఋషి దేవేషు = జంతువు; నరుడు; ఋషి, దేవతలందు, అచ్యుత + అవతార + ఈహా = శ్రీ మహావిష్ణువు యొక్క అవతారముల లీల విశ్వస్య = విశ్వము యొక్క; రక్షా = రక్షయవబడును; యైః = ఏయవతారములచే; త్రయీద్విషః = వేదములను ద్వేషించు దైత్యులు హన్యంతే = చంపబడుచున్నారో.

తా. ప్రతియుగమునందు యుగానుసారముగా వేదములను ద్వేషించు దైత్యులను చంపుటకు శ్రీమహావిష్ణువు అవతరించి చేయులీలలు రక్షయనబడును.

అవ. మన్వంతరములయొక్క అరువిధములను చెప్పుచున్నారు

శ్లో. **మన్వంతరం మనుర్దేవాః మనుపుత్రాః సురేశ్వరః**
**ఋషయో ఒంశావతారాశ్చ హరేః షడ్విధ ముచ్యతే.** **15**

అ. మనుః = మనువు; దేవాః = దేవతలు; మనుపుత్రాః = మనుపుత్రులు; సురేశ్వరః = ఇంద్రుడు. ఋషయః = సప్తర్షులు; హరేః = శ్రీ మహావిష్ణువు యొక్క; అంశావతారాశ్చ = అంశావతారములు అని; మన్వంతరం = మన్వంతరము; షడ్విధం = ఆరువిధములుగా; ఉచ్యతే = చెప్పబడును.

తా. స్వాయంభువ మనువు, దేవతలగు మరుత్తులు. ఉత్తానపాదుడు ఉత్తముడు మొదలగు మను పుత్రులు, ఇంద్రుడు, వసిష్ఠాది సప్తర్షులు, వామనాది అంశావతారములు అని ఇట్లు ఆఱు విధముల సృష్టి గలది మన్వంతరమని చెప్పబడుచున్నది.

అవ. వంశమును చెప్పుచున్నారు.

శ్లో. **రాజ్ఞాం బ్రహ్మప్రసూతానాం వంశస్త్రైకాలికో ఒన్వయః**
**వంశాను చరితం తేషాం వృత్తం వంశధరాశ్చయే.** **16**

అ. బ్రహ్మప్రసూతానాం = బ్రహ్మవలన జనించి శుద్ధమైన; రాజ్ఞాం = రాజులయొక్క; త్రైకాలికః మూడుకాలములకు సంబంధించిన; అన్వయః = సంతతి; వంశః = వంశము; యే = ఎవరు; వంశధరాశ్చ = వంశోద్ధారకులో; తేషాం = వారియొక్క; వృత్తం = వర్తనము; వంశాను చరితం = వంశాను చరిత మనబడును.

తా. బ్రహ్మదేవుని వలన జనించి, పావనమైన రాజులసంతతి వంశమనబడును. ఆ వంశమునుద్ధరించిన రాజులవంశమును వారి కథలు వంశాను చరిత మనబడును.

శ్లో. **నైమిత్తికః ప్రాకృతికో నిత్య ఆత్యంతికో లయః**
**సంస్థేతి కవిభిః ప్రోక్తా చతుర్ధాస్య స్వభావతః.** **17**

అ. అస్య = ఈ విశ్వము యొక్క; స్వభావతః = తన మాయవలన నిష్పన్నమైన; నైమిత్తిక; = నైమిత్తికము; ప్రాకృతికః = ప్రాకృతికము; నిత్యః = నిత్యము; ఆత్యంతికః = ఆత్యంతికము; అని; చతుర్ధా = నాలుగు విధములగు; లయః = ప్రళయము; సంస్థా + ఇతి = సంస్థా అని కవిభిః = జ్ఞానుల చేత; ప్రోక్తా = చెప్పబడినది.

తా. ఈ విశ్వము యొక్క నైమిత్తికము, ప్రాకృతికము, నిత్యము, ఆత్యంతికము అను నాలుగు విధముల ప్రళయము సంస్థయని జ్ఞానులు చెప్పెదరు.

శ్లో. హేతుర్జీవో௨స్య సర్గాదే రవిద్యాకర్మకారకః
యం చానుశయినం ప్రాహు రవ్యాకృత ముతాపరే. **18**

అ. అస్య = ఈ విశ్వము యొక్క; సర్గాదేః = సృష్టికి మొదట; అవిద్యా కర్మకారకః = అవిద్యచే కర్మ చేయువాడైన; జీవః = జీవుడు; హేతుః = హేతువగును. నిమిత్తము విశ్వ విసర్గాదకము జీవుల అదృష్టముతో గూడిన ఉగుటవలన హేతువగును. జీవుని కొందఱు అనుశయి అని; నిమిత్తమని కొందఱు చెప్పుచున్నారు. అవ్యాకృతమని మరి కొందఱు చెప్పుదురు. అందువలన ఈ క్రింది వాక్యమును చెప్పుచున్నారు యంచ = ఎవరిని; అనుశయినం = చైతన్య ప్రాధాన్యముచే జీవుడనియు; అవ్యాకృతం = ఉపాధి ప్రాధాన్యముచే అవ్యాకృతమనియు; అపరే = ఇతరులు; ప్రాహుః = చెప్పెదరు.

తా ఈ విశ్వము యొక్క సృష్టికి మొదట అవిద్యచే కర్మలు చేయు జీవుడు కర్త యగును. ఈ విశ్వసృష్టి జీవుల అదృష్టము ప్రాధాన్యముగ గలదైయున్నది. పూర్వ కర్మ వాసనా విశిష్టుడై చైతన్యప్రాధాన్యముచే జీవుడనియు ఉపాధి ప్రాధాన్యముచే ప్రధానము హేతువనియు కొందరు చెప్పెదరు.

అవ. అపాశ్రయమును చెప్పుచున్నారు.

శ్లో. వ్యతిరేకాన్వయౌ యస్య జాగ్రత్స్వప్న సుషుప్తిషు
మాయా మయేషు తద్బ్రహ్మ జీవవృత్తి ష్వపాశ్రయః. **19**

అ. మాయామయేషు = మాయామయములైన; జాగ్రత్ స్వప్న సుషుప్తిషు = జాగ్రదవస్థ స్వప్నావస్థ; సుషుప్త్యవస్థలైన: జీవవృత్తిషు = జీవుడుగా వర్తించు విశ్వతైజస ప్రాజ్ఞులు అనువారి వృత్తులందు; వ్యతిరేక + అన్వయౌ = సాక్షిగా వర్తించుటచే అన్వయము; సమాధి యందు లేకుండుటచే వ్యతిరేకము; యస్య = ఎవనికో; తత్ = ఆ; బ్రహ్మ = సంసార ప్రతిబాధలకు అధిష్ఠానమై అవధిభూతమైన ఆబ్రహ్మము; అపాశ్రయః = అపాశ్రయమని చెప్పెదరు

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులందు జీవ వృత్తులుగా వర్తించు విశ్వతైజస ప్రాజ్ఞులందు మాయకృతరూపములందు సాక్షిభూతుడుగా నుండుటచే అన్వయము, సమాధియందు లేకుండుటచే అనగా ఆస్వరూపములు లేకుండుటచే వ్యతిరేకత గలవాడు, సంసారప్రతీతి బాధలకు అధిష్ఠానమై, అవధి భూతమైయుండునో అతడే బ్రహ్మము అపాశ్రయమగును.

అవ. ఈ అపాశ్రయమునే దృష్టాంతముతో చెప్పుచున్నారు.

శ్లో. పదార్థేషు యథా ద్రవ్యం సన్మాత్రం రూపనామసు
బీజాది పంచతాం తాసు హ్యవస్థాసు యుతాయుతమ్ **20**

అ. పదార్థేషు = ఘటాది పదార్థములందు, యథా = ఎటుల; ద్రవ్యం = మృత్తికాది ద్రవ్యమున్నదో; రూపనామసు = రూపములందు, నామములయందు; యథా = ఎటుల; సన్మాత్రం = ద్రవ్యమున్నదో; తాసు = ఆయా; అవస్థాసు = అవస్థలయందు; బీజాది పంచతాం = గర్భాధానం మొదలు మరణ పర్యంతము; యథా = ఎటులనో, అటులనే; యుతాయుతం = అన్వయవ్యతిరేకములుండును

తా. ఘటాది వస్తువులందు మన్ను ఏవిధముగా కూడినదైనను నామరూపములతో కూడక రూపనామములందు సత్తామాత్రముండునటుల, వీర్య సేచనము గర్భధారణము లోనగు

తొమ్మిది అవస్థలందును అధిష్ఠానమై అనిత్యము, సాక్షిభూతమై వ్యతిరేకమున్నై ఆత్మయుండుటయే ఆపాశ్రయమనబడును. వీర్యసేచనమునుండి మరణము వఱకున్న అవస్థలు తొమ్మిది యని ఈ శ్లోకమున చెప్పబడినది.

"నిషేక గర్భ జన్మాది బాల్య కౌమార యౌవనమ్
వయోమధ్యంజరా మృత్యు రిత్యవస్థాస్తనోర్నవ"

వీర్యసేచనము, గర్భధారణము, జన్మము. బాల్యము, కౌమారము, యౌవనము, మధ్య వయస్సు, ముదిమి, మృత్యువు అని ఈ దేహమునకు అవస్థలు తొమ్మిది గలవు అని దీని భావము.

అవ. ఇటుల పదిలక్షణములను వివరించి ఇపుడు "దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహ లక్షణం వర్ణయంతి మహాత్మానః" అని "పదియవదియైన అపాశ్రయము శుద్ధి కొఱకు మహాత్ములు 9 లక్షణములు వర్ణింతురు" అని చెప్పిన దానిని వివరించుచున్నారు.

**శ్లో. విరమేత యదా చిత్తం హిత్వా వృత్తిత్రయం స్వయం**
**యోగేన వా తదాత్మానం వేదేహాయా నివర్తతే. 21**

అ. యదా = ఎపుడు అనగా సర్గాదులు తొమ్మిది మాయామయములని అనుసంధానము చేయుట చేత వామదేవాదులవలెకాని; చిత్తం = చిత్తము; స్వయం = స్వయముగనే; వృత్తిత్రయం = త్రిగుణముల వృత్తులగు మూడింటిని; హిత్వా = విడిచి, విరమేత = విరమించునో, (అపుడు శాంతిని బొందును యోగేనవా = యోగము అనుష్ఠించుటచే దేవాహూతి వలెకాని; తదా = అపుడు అనగా విక్షేపము లేనపుడు; ఆత్మానం = ఆత్మను; వేద = తెలియుచున్నాడు. అపుడు అవిద్యా నివృత్తివలన; ఈహాయాః = కోరికనుండి, సంసారరూపమైనమోహమునుండి; నివర్తతే = నివర్తించును.

తా. సర్గాదులు తొమ్మిది మాయామయములని అను సంధానము చేయుటవలన వామదేవాదులవలె చిత్తము స్వయముగా త్రిగుణముల వృత్తులగు శాంతఘోర మూఢములనుండి విరమించును. దానివలన శాంతి బొందును. లేదా యోగముచేత దేవహూతి వలె విక్షేపాదులు లేకుండగా ఆత్మజ్ఞానమును బొంది అవిద్యానివృత్తి యగుట వలన కొరికలనుండి సంసార రూప మోహమునుండి నివృత్తి చెందుచున్నాడు.

అవ. పురాణ విభాగ ప్రసంగ వశమున పురాణ లక్షణములుచెప్పి ఇపుడు ప్రస్తుతమైన పురాణ విభాగమును చెప్పుచున్నారు.

**శ్లో. ఏవం లక్షణ లక్ష్యాణి పురాణాని పురావిదః**
**మునయోఽష్టాదశ ప్రాహుః క్షుల్లకాని మహాన్తి చ. 22**

అ. ఏవం = ఈ ప్రకారముగా; పురావిదః = పూర్వమునుండి ఎరిగిన; మునయః = మునులు; లక్షణ లక్ష్యాణి = లక్షణములతో గూడిన లక్ష్య గ్రంథములైన; పురాణాని = పురాణములు; క్షుల్లకాని = చిన్నవి; మహాన్తిచ = పెద్దవి; అష్టాదశ = పదునెనిమిది; ప్రాహుః = చెప్పెదరు.

తా. పురా వేత్తలైన మునులు అయిదు లక్షణములతో పదిలక్షణములతో గూడిన గ్రంధములు పురాణములు చిన్నవి పెద్దవి అన్నీ చేరి పదునెనిమిది సంఖ్య గలవని చెప్పెదరు.

శ్లో. బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైంగం చ గారుడమ్
నారదీయం భాగవతం ఆగ్నేయం స్కాందసజ్ఞితమ్. **23**

శ్లో. భవిష్యద్బ్రహ్మవైవర్తం మార్కండేయం స వామనమ్
వారాహ మాత్స్యం కౌర్మాణి బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్. **24**

తా. 1. బ్రహ్మపురాణము, 2. పద్మపురాణము, 3. విష్ణుపురాణము, 4. శివపురాణము, 5. లింగపురాణము, 6. గరుడపురాణము, 7. నారదపురాణము, 8. భాగవతపురాణము, 9. అగ్నిపురాణము, 10. స్కాందపురాణము, 11. భవిషత్పురాణము, 12. బ్రహ్మవైవర్త పురాణము, 13. మార్కండేయపురాణము, 14. వామనపురాణము, 15. వరాహపురాణము, 16. మత్స్యపురాణము, 17. కూర్మపురాణము, 18. బ్రహ్మాండపురాణము అని పదునెనిమిది. పురాణములు.

అవ. ఉపసంహరించుచున్నారు.

శ్లో. బ్రహ్మన్నేత త్సమాఖ్యాతం శాఖాప్రణయనం మునేః
శిష్యాణాం చ ప్రశిష్యాణాం బ్రహ్మతేజో వివర్ధనమ్. **25**

అ. బ్రహ్మన్! ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా!; ఏతత్ = ఈ; మునేః = వ్యాసముని యొక్క; శిష్యాణాం = శిష్యులయొక్క; ప్రశిష్యాణాం = ప్రశిష్యుల యొక్క; శాఖాప్రణయనం = వేదవిభాగమును; బ్రహ్మతేజో వివర్ధనం = వినువారికి బ్రహ్మతేజస్సును పెంపొందించు దానిని; సమాఖ్యాతం = చెప్పబడినది.

---

వ. మఱియు నథర్వవేత్తయగు సుమంతు మహర్షి దానిన్ దన శిష్యున కుపదేశింప నతండు, పథ్యుడు వేదదర్శుడు నను శిష్యులకుపదేశించె. అందు వేదదర్శుడనువాడు శౌల్కాయని బ్రహ్మబలి నిర్ధోషుండు పిప్పలాయనుండు అనువారలకును; బధ్యుండనువాడు కుముదుడు శునకుడు జాబాలి బభ్రువు అంగిరసుడు సైంధవాయనుడు అనువారలకును నుపదేశించి, ప్రకాశంబు నొందించిరి. ఇత్తెఱంగున నథర్వవేదంబు వృద్ధినొందె. ఇట్లఖిల వేదంబుల యుత్పత్తి ప్రచారక్రమం బెఱింగించితి. ఇక బురాణ క్రమం బెట్టులనిన; వినిపింతునని, చెప్పదొడంగె. లోకంబున బురాణ ప్రవర్తకులనం బ్రసిద్ధులగు త్రయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృత వ్రణుడు; వైశంపాయనుడు; హారీతుడు నను వార్గురు మజ్జనకుండును, వ్యాస శిష్యుండు నగు రోమహర్షణుని వలన గ్రహించిరి. అట్టి పురాణంబు సర్గాది దశలక్షణ లక్షితంబుగానుండు. మఱియు కొందరా పురాణంబు పంచ లక్షణ లక్షితంబనియు నొడువుదురు. అట్టి పురాణనామానుక్రమంబు బురాణ విదులగు ఋషులు సెప్పెడు తెఱంగున నేనెఱింగింతు వినుము. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యోత్తరము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, బ్రహ్మాండము, గారుడము, అను పదునెనిమిదియు మహాపురాణంబులు, మఱియు నుప పురాణంబులుం గలవు. వీటిని లిఖియించినం జదివిన, వినిన దురితంబు లణంగు. అని సూతుండు శౌనకాదులకుం జెప్పిన వారును, నారాయణ గుణవర్ణనంబును, దత్కథలును జెప్పితివి. ఇంక దోష

తా. ఓ బ్రాహ్మణోత్తమా! వినువారికి బ్రహ్మతేజస్సును పెంపొందించు, వ్యాసముని చేసిన, అతని శిష్యులు ప్రశిష్యులు చేసిన వేదవిభాగము చెప్పబడినది.

ఇతి శ్రీమధ్భాగవతే ద్వాదశస్కంధే
సప్తమోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమందు ద్వాదశస్కంధమున
ఏడవ అధ్యాయము ముగిసినది.

ఓమ్ తత్ సత్

---

కారులును, దానరతులు న్నెవ్విధంబునం భవాబ్ధిం దరితు రాక్రమంబు చెప్పవే. అని యడిగిన, నెఱిం
గింపం దలంచి, యిట్లనియె. 30

క. తొల్లిటి యుగమున దపముల బల్లిదులగు ఋషులు మహిమ భాషింపగరం
జిల్లెడు మార్కండేయుండుల్లంబున హరిని నిలిపి యుడుగక బ్రతికెన్. 31

# అష్టమోఽధ్యాయః

## ఎనిమిదవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**శ్లో. అష్టమేతు తపశ్చర్యా మార్కండేయస్య మోహకైః
కామాదిభి రసం మోహో నరనారాయణ స్తుతిః.**

ఈ అష్టమాధ్యాయమునందు మార్కండేయ మహర్షియొక్క తపస్సు, మోహమును కలిగించు కామాదులచే విఫలుడు కాక నరనాయయణులను స్తుతించుట చెప్పబడును.

అవ. పురాణ విభాగ ప్రసంగముతో పురాణకర్తయైన మార్కండేయ మహర్షియొక్క చరిత్రను అడుగుచున్నాడు.

శౌనక ఉవాచ = శౌనకమహర్షిపలికెను.

**శ్లో. సూత జీవ చిరం సాధో! వద నో వదతాం వర
తమస్యపారే భ్రమతాం నృణాం త్వం పారదర్శనః. 1**

అ. సాధో = సజ్జనుడా!; వదతాం = చెప్పువారలలో; వర = శ్రేష్ఠుడా; సూత = ఓ సూత మహర్షి; చిరంజీవ = చాలాకాలము జీవింపుము; అపారే; అంతములేని = తమసి = అంధకారమైన సంసారమందు; భ్రమతాం = భ్రమించుచున్న; నృణాం = నరులకు; త్వం = నీవు; పారదర్శనః = భ్రాంతిని బోవాడి తీరమును చూపు వాడవు; నః = మాకు; వద = చెప్పుము.

తా. అంతములేని అంధకారరూపమైన సంసారమునందు భ్రమించు నరులకు భ్రాంతిని తొలగించి, తీరమును చూపువాడా!, సజ్జనుడా!, చెప్పువారలలో శ్రేష్ఠుడా! నీవు చాలాకాలము జీవించుచు మేమడుగు దానిని చెప్పుము.

అవ. చెప్పవలసిన దానిని వివరించుచున్నారు.

**శ్లో. ఆహు శ్చిరాయుషమృషిం మృకండు తనయం జనాః
యః కల్పాంతే ఒప్యుర్వరితో యేన గ్రస్త మిదం జగత్. 2**

అ. మృకండు తనయం = మృకండుని కొడుకైన; ఋషిం = మార్కండేయ ఋషిని; జనాః = జనులు; చిరాయుషం = చిరంజీవిగా; అహుః = చెప్పెదరు; యః = ఏ మార్కండేయుడు; కల్పాంతే + అపి = కల్పాంతమందు కూడా; ఉర్వరితః = శేషించియుండును; యేన = ఏ ప్రళయముచే; ఇదం = ఈ; జగత్ = జగత్తు, గ్రస్తం = కబళింపబడునో

తా. జగమునంతను కబళించే ప్రళయమునందు కూడా నాశమొందక మార్కండేయుడు చిరంజీవుడని జనులు చెప్పెదరు.

అవ. ప్రళయములేకున్నను ఇది కుదరదని చెప్పుచున్నారు.

శ్లో. న వా అస్మత్కులోత్పన్నః కల్పేఽస్మిన్ భార్గవర్షభః
నైవాధునాపి భూతానాం సంప్లవః కోఽపి జాయతే. **3**

అ. సః వా = ఆ మార్కండేయుడు; భార్గవర్షభః = భృగువంశశ్రేష్ఠుడు; అస్మత్కుల + ఉత్పన్నః = మా వంశమునందు జన్మించినవాడు; అస్మిన్ కల్పే = ఈ కల్పమునందు; అధునాపి = ఇప్పటికిని; భూతానాం = ప్రాణులకు; కః సంప్లవః = ఏ ప్రళయము గూడా; న జాయతే = కలుగ లేదు.

తా. ఆ మార్కండేయుడు భృగుకుల శ్రేష్ఠుడు మా వంశమున జన్మించిన వాడు, ఈ కల్పమందున్నవాడు. ఇప్పటికి ప్రాకృతముకాని నైమిత్తికముకాని ఏ ప్రళయము కలుగలేదు. అతడెట్లుండెను? ఇది ఎట్లు కుదురును? చెప్పుము.

అవ. మఱియొకటి కూడా కుదరదని చెప్పుచున్నారు.

శ్లో. ఏక ఏవార్ణవే భ్రామ్యన్ దదర్శ పురుషం కిల
వటపత్రపుటే తోకం శయానం త్వేక మద్భుతమ్ **4**

అ. ఏకః ఏవ = ఒక్కడే; అర్ణవే = ప్రళయసాగరమునందు; భ్రామ్యన్ = సంచరించుచు; వటపత్రపుటే = మఱ్ఱియాకు దొప్పయందు; శయానాం = శయనించియున్న; తోకం = శిశువైన; ఏకం ఒక; అద్భుతం = అద్భుతస్వరూపుడైన; పురుషం = పరమపురుషుని; దదర్శకిల = చూచెనని చెప్పుదురు.

ఆ మార్కండేయుడు తాను ఒక్కడే ప్రళయసాగరమునందు దిరుగుచు మఱ్ఱియాకు దొప్పపై శిశువై జనించి బాలుడై పవళించియున్న అద్భుతుడైన ఒక పరమపురుషుని దర్శించె నని చెప్పెదరు.

శ్లో. ఏష నస్సంశయో భూయాన్ సూత కౌతూహలం యతః
తం నశ్ఛింధి మహాయోగిన్ పురాణేష్వపి సమ్మతః. **5**

అ. మహాయోగిన్ = ఓ గొప్పయోగీ; సూత = సూతమహర్షి; నః = మాకు; ఏషః = ఇది; భూయాన్ = గొప్పనైన; సంశయః = సంశయము; యతః = ఏ సంశయమువలన; కౌతూహలం = ఔత్సుక్యము కలిగినది. పురాణేష్వపి = ఎల్లపురాణములందును; సమ్మతః = సమ్మతుడవు, అనగా విషయముల నెఱింగినవాడవు; నః = మాకు; తం = ఆ సంశయమును; ఛింధి = బోనాడుము.

తా. ఓ మహాయోగీ! సూతమహర్షీ! అన్నిపురాణముల విషయములు తెలిసినవాడవు గాన, మాకు కలిగిన ఈ సంశయమును తొలగించి మా ఔత్సుక్యమును తీర్చుము.

వ లోకంబులు కల్పాంత సమయంబునం, గబాధ మయంబులై, యంధకార బంధురంబులై యున్నయెడ, నేకాకియై చరింపుచుం, బాలార్కకోటి తేజుండయిన బాలుని హృదయంబునం బ్రవేశించి

అవ. శౌనక మహర్షి ప్రశ్నను అభినందించుచున్నారు.

సూత ఉవాచ = సూత మహర్షి పలికెను.

శ్లో. ప్రశ్న స్త్వయా మహాభాగ౽యం కృతో లోకభయాపహః
నారాయణ కథా యత్ర గీతాః కలిమలాపహాః. **6**

అ. మహాభాగ = ఓ శౌనక మహర్షీ; త్వయా = నీచేత; అయం = ఈ; లోకభయాపహః = లోకుల సంసారమును తొలగించునట్టి; ప్రశ్నః = ప్రశ్న; కృతః = చేయడిడినది. యత్ర = ఏ ప్రశ్నలో; కలిమలాపహాః = కలిదోషములను పోగొట్టునట్టి; నారాయణకథాః = నారాయణుని కథలు; గీతాః = గానము చేయబడినవి.

తా. ఓ శౌనక మహర్షీ నీవు లోకుల భయమును పోగొట్టి కలి దోషములను తొలగించు నారాయణుని కథలు గానము చేయబడిన చక్కని ప్రశ్న అడిగితివి.

అవ. మార్కండేయ మహర్షి తపస్సుచే భగవంతుని ఆరాధించి, భగవంతుని మాయను చూడగోరి, ఆ భగవంతుని మాయచే ఏడు కల్పములను చూచెను. ఇటుల ఏడు కల్పముల చూచినవాడు మరియొకడు లేడని తెలుపుటకు మొదటినుండి మార్కండేయుని చరితమును చెప్పుచున్నారు.

శ్లో. ప్రాప్త ద్విజాతి సంస్కారో మార్కండేయః పితుః క్రమాత్
ఛందాంస్యధీత్య ధర్మేణ తపస్స్వాధ్యాయ సంయుతః. **7**

అ. మార్కండేయః = మార్కండేయుడు ప్రాప్త = పొందబడిన; ద్విజాతి సంస్కారః = ఉపనయన సంస్కారము గలవాడై; పితుః = తండ్రివలన; క్రమాత్ = గర్భాదానాదిక్రమమున; ఛందాంసి = వేదములను; అధీత్య = అధ్యయనము చేసి; ధర్మేణ = ధర్మమార్గముతో; తపస్స్వాధ్యాయ సంయుతః = తపస్సుతో అధ్యయనముతో గూడినవాడాయెను.

తా. మార్కండేయుడు ఉపనయన సంస్కారమును పొంది, తండ్రివలన క్రమముగా, వేదములనధ్యయనము చేసి, ధర్మముతో తపస్సుతో నొప్పెను.

శ్లో. బృహద్వ్రతధర శ్శాంతో జటిలో వల్కలాంబరః
బిభ్ర త్కమండలుం దండ ముపవీతం సమేఖలమ్. **8**

అ బృహద్వ్రతధరః = గొప్పవ్రతమును ధరించి; అనగా నైష్ఠిక బ్రహ్మచారియై శాంతః = శాంతుడై; వల్కలాంబరః = నారవస్త్రములను ధరించినవాడై; సమేఖలం = మొలత్రాటితో; ఉపవీతం యజ్ఞోపవీతమును, దండం = బ్రహ్మదండమును; కమండలుం = కమండలమును; బిభ్రత్ = ధరించిన వాడాయెను.

తా. ఆ మార్కండేయుడు నైష్ఠిక బ్రహ్మచారియై, శాంతుడై, జడలను నారవస్త్రములను కమండలమును. దండమును, యజ్ఞోపవీతమును మొలతాడును ధరించెను.

---

యనేక సహస్ర వర్షంబులు తిరిగి, వటపత్రశాయి యయిన యబ్బాలుని గ్రమ్మఱం గనియె అని చెప్పిన శౌనకాదులు సూతుని సన్నుతించి, యామునీంద్రునకు నీ ప్రభావం బెట్లు గలిగె? అని యడిగిన, నతండిట్లనియె.

శ్లో. కృష్ణాజినం సాక్షసూత్రం కుశాన్ సన్నియమర్థయే
అగ్న్యర్క-గురు విప్రాత్మస్వర్చయన్ సంధ్యయోర్హరిమ్. 9

అ సాక్షసూత్రం = జపమాలతో; కృష్ణాజినం = జింకచర్మమును; కుశాన్ = దర్భలను ధరించుచు; సన్నియమ+ఋద్ధయే = చక్కని ధర్మము అభివృద్ధి చెందుటకు; అగ్న్యర్క గురువిప్రాత్మసు = అగ్ని సూర్యుడు, గురువులు, బ్రాహ్మలు, తనయందు, సంధ్యయోః = రెండు సంధ్యలయందు హరిం = శ్రీమన్నారాయణుని; అర్చయన్ = పూజించుచు ఉండెను.

తా. ఆ మార్కండేయుడు జపమాలను జింకచర్మమును, దర్భలను ధరించి, చక్కని నియమము అభివృద్ధి చెందుటకు అగ్నియందు, సూర్యునియందు, గురువులయందు, బ్రాహ్మణులందు తనయందు, రెండు సంధ్యలలో కూడా శ్రీమన్నారాయణుని పూజించు చుండెను.

శ్లో. సాయం ప్రాత స్స్వ గురవే భైక్షమాహృత్య వాగ్యతః
బుభుజే గుర్వనుజ్ఞాత: సకృన్నోచేదుపోషిత:. 10

అ. వాగ్యతః = వాక్కును నియమించిన వాడై; అనగా మౌనియై; గురవే = గురువు కొఱకు సాయం = సాయంకాలము; ప్రాతః = ఉదయము; భైక్షం = భిక్షను; ఆహృత్య = తెచ్చి; గురు+అనుజ్ఞాతః = గురువుగారి అనుమతి పొందినవాడై; బుభుజే = భుజించును; సకృత్ = ఒకసారి; నో చేత్ = గురువు అనుమతి లేనిచో; ఉపోషితః = ఉపవాసముండును.

తా. ఆమార్కండేయుడు మౌనియై గురువుగారి కొఱకు ప్రాతః కాలము సాయంత్రము మధుకరమెత్తి తెచ్చి, గురువుగారనుమతించినచో భుజించెడివాడు. గురువుగారి అనుమతి లభించనిచో ఉపవసించెడి వాడు.

శ్లో. ఏవం తపస్స్వాధ్యాయ రతో వర్షాణా మయుతా యుతమ్.
ఆరాధయన్ హృషీకేశం జిగ్యే మృత్యుం సుదుర్జయమ్. 11

అ. ఏవం = ఈ ప్రకారముగా; తపస్స్వాధ్యాయరతః = మితాహారము; తపస్సు, వేదాధ్యయనము లోనగు వాని యందు ఆసక్తుడై; వర్షాణాం = సంవత్సరముల యొక్క; అయుత+అయుతం = పదివేల యొక్క పదివేలు; హృషీకేశం = విష్ణువును; ఆరాధయన్ = ఆరాధించుచు; సుదుర్జయం = జయింప శక్యముగాని; మృత్యుం = మృత్యువును; జిగ్యే = జయించెను.

తా ఈ ప్రకారము మితాహారము తపస్సు వేదాధ్యయనము లోనగు వానియందు ఆసక్తుడై అనేకవేల సంవత్సరముల విష్ణుపు నారాధించుచు, జయింప శక్యముకాని మృత్యువును జయించెను.

శ్లో. బ్రహ్మ భవో భృగు ర్దక్షో బ్రహ్మపుత్రాశ్చ యేఽపరే
నృదేవ పితృభూతాని తేనాసన్నతి విస్మితాః. 12

తా. బ్రహ్మ, రుద్రుడు, భృగువు, దక్షుడు, ఇతరులైన బ్రహ్మపుత్రులు, నరులు, దేవతలు, పితృదేవతలు, ఇతర ప్రాణులు ఆ మృత్యుంజయుని చూచి విస్మయము చెందిరి.

శ్లో. ఇత్థం బ్రహ్మవ్రతధరః తపస్స్వాధ్యాయ సంయమైః
దధ్యావధోక్షజం యోగధ్వస్త క్లేశాంతరాత్మనా. 13

అ. ఇత్థం = ఈ ప్రకారముగా; బ్రహ్మ వ్రతధరః = బ్రహ్మచారి వ్రతమును ధరించి, తపస్స్వాధ్యాయ సంయమైః = నియతాహారము; అధ్యయనము ఇంద్రియ నిగ్రహము అనువానిచేత; యోగధ్వస్తక్లేశాంతరాత్మనా = ధ్యానయోగముచే నశించిన రాగాది క్లేశములుగల మనస్సుచేత; అధోక్షజం = శ్రీమన్నారాయణుని; దధ్యౌ = ధ్యానము చేసెను.

తా. ఈ ప్రకారము బ్రహ్మచారి వ్రతమును ధరించి తపస్సు, స్వాధ్యాయము, ఇంద్రియ జయము గలిగి ధ్యానముచే రాగాదిక్లేశములు నశించిన మనస్సు గలవాడై శ్రీమహావిష్ణువును ధ్యానించెను

శ్లో. తస్యైవం యుంజతశ్చిత్తం మహాయోగేన యోగినః
వ్యతీయాయ మహాన్కాలో మన్వంతర షడాత్మకః **14**

అ. ఏవం = ఈ ప్రకారము, మహాయోగేన = గొప్పధ్యాన యోగముచే; చిత్తం = మనస్సును; యుంజతః = కూర్చుచున్న; తస్య యోగినః = ఆ యోగికి; మన్వంతర షడాత్మకః = ఆరు మన్వంతరముల రూపమైన; మహాన్‌కాలః = చాలా కాలము; వ్యతీయాయ = గడచెను.

తా. ఇట్లు గొప్పధ్యానము చేయుచున్న ఆ మార్కండేయ యోగికి, ఆరు మన్వంతరముల రూపమైన చాలాకాలము గడచెను. కృత త్రేతా ద్వాపర కలియుగములు నాలుగు చేరినచో ఒక మహాయుగము, 71 మహాయుగములు ఒక్క మన్వంతరము. ఇటువంటి మన్వంతరములు ఆరు గడచెను. అని తాత్పర్యము, ఒక మహాయుగమునకు 43, 20, 000 సంవత్సరములు. ఇటువంటి 71 మహాయుగములు అనగా 43, 20, 000 × 71 × 6 = 184, 03, 20,000, లగును. నూట ఎనుబదినాలుగు కోట్ల మూడు లక్షల ఇరువదివేల సంవత్సరములు గడచెను అని భావము.

అవ అతని తపోనిష్ఠను ఇతిహాసముగా వర్ణించుచున్నాడు.

శ్లో. ఏతత్పురందరో జ్ఞాత్వా సప్తమేఽస్మిన్ కిలాంతరే
తపో విశంకితో బ్రహ్మన్నారేభే తద్విఘాతనమ్ **15**

అ. బ్రహ్మన్! = ఓ బ్రాహ్మణోత్తమా!; అస్మిన్ = ఈ; సప్తమే = ఏడవ; అంతరే = మన్వంతరమునందు; పురందరః = ఇంద్రుడు; ఏతత్ = ఈ తపోనిష్ఠను; జ్ఞాత్వా = తెలుసుకొని; తపోవిశంకితః = తపస్సుచే నాస్థానము గ్రహింప గలడని సంశయము పొందినవాడై; తద్విఘాతనం = అతని తపస్సునకు విఘ్నము చేయుటకు; ఆరేభే = ప్రారంభించెను.

తా. ఓ బ్రాహ్మణోత్తమా!, ఇటుల ఆరు మన్వంతరములు గడవగా ఏడవ మన్వంతరమున మార్కండేయుడు చేయుచున్న తపస్సును తెలిసిన ఇంద్రుడు, ఇతడు నాపదవి నాశించుచున్నాడని శంకించి మార్కండేయుని తపస్సునకు విఘ్నము చేయ నారంభించెను.

శ్లో. గంధర్వాప్సరసః కామం వసంతం మలయానిలమ్
మునయే ప్రేషయామాస రజస్తోక మదౌ తదా. **16**

అ. తదా = అపుడు; మునయే = ముని తపస్సును విఘ్నము చేయుటకు; రజస్తోకమదౌ = రజోగుణమునకు ప్రియ సంతానమైన లోభుడు మదుడు అను వానిని; గంధర్వాప్సరసః = గంధర్వులను;

అప్సరసలను; కామం = మన్మధుని; వసంతం = వసంతుని; మలయానిలం = మలయమారుతమును; ప్రేషయామాస = పంపెను.

తా. అపుడు మునితపస్సును విఘ్నము చేయుటకు లోభమును, మదమును, గంధర్వులను, అప్సరసలను, మన్మధుని, వసంతుని, మలయమారుతమును పంపెను.

శ్లో. తే వై తదాశ్రయం జగ్ముర్హిమాద్రేః పార్శ్వ ఉత్తరే
పుష్పభద్రా నదీ యత్ర చిత్రాఖ్యా చ శిలా విభో 17

అ. తేవై = వారలు; హిమాద్రేః = హిమవత్పర్వతమునకు; ఉత్తరేపార్శ్వే = ఉత్తరమువైపు; యత్ర = ఎక్కడ; పుష్పభద్రా = పుష్పభద్ర; చిత్రాఖ్యా = చిత్రయను పేరుగల; శిలా = శిలాయను; నదీ = నది యున్నదో; తదాశ్రమం = ఆ మార్కండేయుని ఆశ్రమమును, జగ్ముః = వెళ్ళిరి.

తా. వారందరు హిమవత్పర్వతమునకు ఉత్తరప్రాంతమున పుష్పభద్రానది, చిత్రానది, శిలానది యున్న ఆ మార్కండేయాశ్రయమును చేరిరి.

శ్లో. తదాశ్రమపదం పుణ్యం పుణ్యద్రుమ లతార్చితం
పుణ్యద్విజ కులాకీర్ణం పుణ్యామల జలాశయమ్, 18

అ. తదాశ్రమ పదం = ఆ మార్కండేయుని ఆశ్రమము, పుణ్యం = పవిత్రమైనది. పుణ్య = పావనమైన; ద్రుమ = వృక్షములతో; లతా = తీగలతో; అర్చితం = శోభించెడు; పుణ్య = పావనమైన; ద్విజకుల = పక్షిసమూహములతో మరియు ఋషిసమూహముతో, ఆకీర్ణం = కూడిన; పుణ్య = పావనమైన; అమల = స్వచ్ఛమైన; జలాశయం = సరస్సులు గలది.

తా. ఆ మార్కండేయుని ఆశ్రమము పవిత్రమైనది. పవిత్రమైన వృక్షములతో కూడి యున్నది. పవిత్రమైన పక్షిసమూహములతో స్వచ్ఛమైన సరస్సులతో కూడి యున్నది. అటులనే పవిత్రులైన ఋషులలో కూడి యున్నది.

శ్లో. మత్తభ్రమర సంగీతం మత్తకోకిల కూజితమ్
మత్త బర్హినటాటోపం మత్తద్విజ కులాకులమ్. 19

తా. ఆ మార్కండేయముని ఆశ్రమమున మదించిన తుమ్మెదల సంగీతము, మదించిన కోకిలల గానము, మదించిన నెమళ్ళ ఆటల ఆడంబరము, పలురకములైన మదించిన పక్షుల సమూహములు గలిగి యుండెను.

శ్లో. వాయుః ప్రవిష్ట ఆదాయ హిమ నిర్ఝర శీకరాన్
సుమనోభిః పరిష్వక్తో వవావుత్తం భయన్ స్మరమ్. 20

అ. వాయుః = వాయువు; హిమ నిర్ఝరశీకరాన్ = మంచు కొండ సెలయేళ్ళ నీటితుంపరలను; ఆదాయ = గ్రహించి; సుమనోభిః = పూవులచే; పరిష్వక్తః = కౌగిలించుకోబడి; ప్రవిష్టః = ప్రవేశించి; స్మరం = మన్మధుని; ఉత్తంభయన్ = ఉద్దీపింపజేయుచు, వవౌ = వీచెను.

తా. మంచుకొండ సెలయేళ్ళ నీటిని తీసుకొని, పూవులతో తాకబడిన వాయువు ఆ యాశ్రమములోనికి ప్రవేశించి, మన్మధుని ఉద్దీపింప జేయుచు వీచెను. ఇచట నీటి తుంపరలను

తీసుకొని యని చెప్పుటచే చల్లదనము, పూవులు తాకినయని చెప్పుటచే సుగంధత్వము, ఆశ్రమ ప్రవేశముతో మందత్వము సూచించబడినది.

శ్లో. ఉద్యచ్చంద్ర నిశావక్త్రః ప్రవాళ స్తబకాళిభిః
గోపద్రుమ లతా జాలై స్తత్రాసీత్కుసుమాకరః 21

అ. ఉద్యచ్చంద్ర నిశావక్త్రః = ఉదయించు చంద్రుడు గల రజనీ ముఖముగలవాడును; ప్రవాళ స్తబకాళిభిః = చిగుళ్ళు పూగుత్తులు అనువాని శ్రేణులతోడను; గోపద్రుమలతాజాలైః = ఒండొంటిని పైన వేసుకొన్న వృక్షముల లతల మొత్తముల తోడను, కుసుమాకరః = వసంతుడు; తత్ర = ఆయాశ్రమమున; ఆసీత్ = ఆవిర్భవించెను.

తా. ఉదయించిన చంద్రుడను రేయి మొగము గలవాడై, చిగుళ్ళ పూగుత్తుల వరుసల తోడను. ఒండొంటిని పెనుగొన్న చెట్లు తీగలు గలవాడై వసంతుడు ఆ ఆశ్రమమున ప్రవేశించెను.

శ్లో. అన్వీయమానో గంధర్వైర్గీత వాదిత్ర యూథికైః
అదృశ్యతాత్త చాపేషుః స్వస్త్రీ యూథపతి స్స్మరః 22

అ. గీత వాదిత్రయూథికైః = గాయకులు; సంగీత వాద్యములు అను సముదాయము గల; గంధర్వైః = గంధర్వులచే; అన్వీయమానః = వెంబడింపబడుచు; ఆత్తచాపేషుః = ధరించిన విల్లు అమ్ములు గలవాడై; స్వస్త్రీయూథపతిః = స్వర్గమందలి స్త్రీలు అనగా అప్సరసల సమూహమునకు ప్రభువైన స్మరః = మన్మథుడు; అదృశ్యత = కన్పడెను.

తా. గాయకులు సంగీత వాద్యములతో కూడి గంధర్వులు వెంటరాగా, విల్లు అమ్ములను ధరించి స్వర్గ స్త్రీలకు ప్రభువైన మన్మథుడు ఆ ఆశ్రమమునకు చేరెను.

శ్లో. హుత్వాగ్నిం తముపాసీనం దదృశు శ్శక్ర కింకరాః
మీలితాక్షం దురాధర్షం మూర్తిమంత మివానలమ్. 23

అ. అగ్నిం = అగ్నిహోత్రమును; హుత్వా = హోమము చేసి; ఉపాసీనః = అగ్నిని ఉపాసించుచున్న; మీలితాక్షం = మూసిన కనులు గలిగిన; దురాధర్షం = చెనకరానివాడై; మూర్తిమంతః = రూపము గల, అనలం ఇవ = అగ్నివలె ఉన్న, తం = ఆ మార్కండేయుని; శక్రకింకరాః = ఇంద్రుని సేవకులు దదృశుః = దర్శించిరి.

తా. హోమము చేసి అగ్నిని ఉపాసించుచు కనులు మూసుకొని, ఇతరులచే చెనకరాని రూపుగొన్న అగ్నిహోత్రమువలెనున్న ఆ మార్కండేయుని ఇంద్రుని సేవకులు చూచిరి.

శ్లో. ననృతు స్తస్య పురతః స్త్రియో వై గాయకా జగుః
మృదంగవీణా పణవై ర్వాద్యం చక్రుర్మనోహరమ్. 24

అ. తస్య = ఆ మార్కండేయుని; పురతః = ముందు; స్త్రియః = అప్సరసస్త్రీలు; ననృతుః = నాట్యము చేసిరి. గాయకాః = పాటగాండ్రు; జగుః = పాడిరి, మృదంగవీణా పణవైః = మద్దెల, వీణ, ఉడుక అనువాద్యములచే; మనోహరం = మనసును హరించునట్లుగా, వాద్యం = మంగళవాద్యమును, చక్రుః = చేసిరి.

తా. ఆ మార్కండేయుని ముందు అప్సరసలు ఆడిరి. గంధర్వులు గానము చేసిరి. మృదంగము వీణ ఉడుక మొదలగు వాద్యములతో మనోహరముగా మ్రోగించిరి.

శ్లో. సందధేఽస్త్రం స్వధనుషి కామః పంచముఖం తదా
మధుర్మనో రజస్తోక ఇంద్రభృత్యా వ్యకంపయన్. **25**

అ. తదా=అపుడు; కామః=మన్మథుడు; పంచముఖం=శోషణ; మోహన, సందీపన; తాపన, ఉన్మాదనములను ఐదు విధములు గల; అస్త్రం=బాణమును; స్వధనుషి=తన ధనుస్సునందు; సందధే=సంధించెను; మధుః=వసంతుడు; రజస్తోకః=రజోగుణమునకు ప్రియుడైన మదుడు; ఇంద్ర భృత్యాః=ఇంద్రుని సేవకులు; మనః=ఆ మార్కండేయుని మనస్సును; వ్యకంపయన్=మిగుల వడకించిరి.

తా. అపుడు మన్మథుడు, శోషణ, మోహన సందీపన, తాపన, ఉన్మాదములు అను ఐదు విధముల బాణములను తన ధనుస్సున సంధించెను. వసంతుడు. మధుడు మొదలగు ఇంద్రుని సేవకులు ఆ మార్కండేయుని మనస్సును వడకించిరి.

శ్లో. క్రీడంత్యాః పుంజికస్థల్యాః కందుకైః స్తనగౌరవాత్
భృశముద్విగ్నమధ్యాయాః కేశవిస్రంసిత స్రజః **26**

శ్లో. ఇతస్తతో భ్రమ ద్దృష్టే ర్వల్గంత్యా అనుకందకం
వాయుర్జహార తద్వాస స్సూక్ష్మం త్రుటిత మేఖలమ్ **27**

అ. కందుకైః=బంతులతో, క్రీడంత్యాః=ఆడుచున్న; స్తనగౌరవాత్=చనుగవ బరువువలన భృశం=మిక్కిలి; ఉద్విగ్న మధ్యాయాః=కదలాడు నడుముగలదై ; కేశ విస్రంసిత స్రజః=వెంట్రుకల నుండి జారిన పూలదండిగల; అనుకందుకం=బంతివెంట; వల్గంత్యాః=గంతులు వేయుచున్న; ఇతస్తతః=ఇటునటు; భ్రమత్ + దృష్టేః=తిరుగుచున్నచూపుగల; పుంజికస్థల్యాః =పుంజికస్థల యొక్క; త్రుటిత మేఖలం=తెగిన మొలనూలు గల సూక్ష్మం=పలుచని; తత్ + వాసః=ఆ వస్త్రమును; వాయుః=గాలి; జహార=తొలగించెను.

తా. ఆ మార్కండేయుని ముందర బంతులతో ఆడుచు చనుగవ బరువుతో నడుము కదులు చుండగా, వెంట్రుకల నుండి పూలదండ జారుచుండగా, బంతివెంట గంతులు వేయుచు ఇటునటు చూచుచున్న. మొలనూలు తెగిన పుంజికస్థలయొక్క పలుచని వస్త్రమును గాలి తొలగించెను.

శ్లో. విససర్జ తదా బాణం మత్వా తం స్వజితం స్మరః
సర్వం తత్రాభవన్మోఘ మనీశస్య యథోద్యమః **28**

అ. స్మరః=మన్మథుడు; తదా=అపుడు; తం=ఆ మార్కండేయుని; స్వజితం=తనచే జయింపబడిన వానిగా; మత్వా=తలచి; బాణం=బాణమును; విససర్జ=విడిచెను; అనీశస్య=ఈశ్వరుడు లేదను వాని ఉద్యమః=ప్రయత్నము; యథా=యే ప్రకారము; మోఘం=వ్యర్థమగునో అటులే; తత్ర=ఆమార్కండేయుని విషయములో, సర్వం=వారు చేసిన దంతయు; మోఘం=వ్యర్థము అభవత్=అయెను.

తా. ఆ సమయములో మార్కండేయుడు తనతో జయింపబడెనని తలంచి బాణమును విడిచెను. కాని భగవంతుడు లేడనువాని ఉద్యమము వ్యర్థమగునటుల వారి ప్రయత్నమంతయు వ్యర్థమాయెను.

శ్లో. త ఇత్థ మపకుర్వంతో మునే స్తత్తేజసా మునే!
దహ్యమానా నివవృతుః ప్రబోధ్యాహిమివార్భకాః 29

అ. మునే! = ఓ శౌనకమునీ! తే = వారు; ఇత్థం = ఈ ప్రకారముగా; మునేః = మార్కండేయ మునికి; అపకుర్వంతః = అపకారము చేసినవారై; అహిం = సర్పమును; ప్రబోధ్య = మేల్కొలిపి; అర్భకాః = పసివారివలె; త త్తేజసా = ఆ మార్కండేయుని తేజస్సుచే దహ్యమానాః = దహింపబడుచు నివవృతుః = మరలిపోయిరి.

తా. ఓ శౌనకమునీ! ఆ ఇంద్రుని సేవకులు మార్కండేయ మహర్షికి అపకారము చేసి పామును మేల్కొల్పిన పసివారివలె ఆ మార్కండేయుని తేజస్సుతో దహించబడి మళ్ళి పోయిరి

శ్లో. స ఇంద్రాను చరై ర్బ్రహ్మన్ ధర్షితో ఒపి మహామునిః
యన్నాగాదహమో భావం నత చ్చిత్రం మహత్సుహి 30

అ బ్రహ్మన్! = ఓ బ్రాహ్మణోత్తమా!; సః = ఆ; మహామునిః = గొప్పమునియైన మార్కండే యుడు; ఇంద్రానుచరైః = ఇంద్రుని సేవకులచే; ధర్షితో ఒపి = చెదర గొట్టబడినను; యత్ = ఏమని; అహమో ఒభావం = అహంకారమును; నాగాత్ = పొందలేదు; మహత్సు = గొప్పవారి విషయములో; తత్ = ఆ విషయము; న చిత్రం హి = ఆశ్చర్యము కాదు కదా.

తా. ఇంద్రుని సేవకులు ఆ మార్కండేయమహర్షి మనసును చెదరగొట్ట ప్రయత్నించి ననూ ఆ మహర్షికి అహంకారము కలుగలేదు. మహాత్ముల విషయములో ఇది వింత కాదు కదా!

శ్లో. దృష్ట్వా నిస్తేజసం కామం సగణం భగవాన్ స్వరాట్
శ్రుత్వాను భావం బ్రహ్మర్షే ర్విస్మయం సమగాత్పరమ్. 31

అ. సగణం = పరివారముతో గూడిన; కామం = మన్మధుని; నిస్తేజసం = వాడిన మోముగలవాని నిగా దృష్ట్వా = చూచి; భగవాన్ = భగవంతుడగు; స్వరాట్ = స్వర్గాధిపతియైనఇంద్రుడు; బ్రహ్మర్షేః = బ్రహ్మర్షియైన మార్కండేయుని యొక్క; అనుభావం = ప్రభావమును; శ్రుత్వా = విని; పరం = మిక్కిలి విస్మయం = ఆశ్చర్యమును; సమగాత్ = పొందెను.

తా. పరివారముతో కూడిన మన్మధుడు వాడిన మోముతో రాగా చూచి, బ్రహ్మర్షియైన మార్కండేయమాహర్షి ప్రభావమును విని స్వర్గాధి పతియైన ఇంద్రుడు మిక్కిలి ఆశ్చర్యమును పొందెను.

శ్లో. తస్యైవం యుంజత శ్చిత్తం తపస్స్వాధ్యాయ సంయమైః
అనుగ్రహాయా విరాసీన్నర నారాయణో హరిః 32

అ తపస్స్వాధ్యాయ సంయమైః = శరీర శోషణము, వేదాధ్యయనము, మనో నిగ్రహముతో చిత్తం = మనస్సును; ఏవం ఈ ప్రకారముగా; యుంజతః = యోగములో చేర్చుచున్న; తస్య = ఆ మార్కండేయముని యొక్క; అనుగ్రహాయ = అనుగ్రహించుట కొఱకు; నరనారాయణః = నరనారాయణుల రూపముననున్న; హరిః = శ్రీమన్నారాయణుడు; ఆవిరాసీత్ = ప్రత్యక్షమాయెను

తా. ఇట్లు తపస్సు అధ్యయనము మనోనిగ్రహములతో మనసును యోగముతో కూర్చుచున్న ఆ మార్కండేయుని అనుగ్రహించుటకు నరనారాయణరూపములోనున్న శ్రీహరి ప్రత్యక్షమాయెను.

అవ. ఆ నరనారాయణులను రెండు శ్లోకములతో వర్ణించుచున్నారు.

**శ్లో. తౌ శుక్ల కృష్ణౌ నవకంజ లోచనౌ చతుర్భుజౌ రౌరవవల్కలాంబరౌ**
**పవిత్రపాణీ ఉపవీతకం త్రివృత్ కమండలుం దండమృజుం చ వైణవమ్. 33**

అ. తౌ = ఆ నరనారాయణులు; శుక్ల కృష్ణౌ = తెలుపు నలుపు వన్నెగలవారు; నవకంజలోచనౌ = అపుడే విచ్చుకున్న పద్మముల వంటి కన్నులు గలవారు; చతుర్భుజౌ = నాలుగు భుజములు గలవారు రౌరవ వల్కల + అంబరౌ = జింక చర్మము నార వస్త్రములు ధరించిన వారు; పవిత్రపాణీ = పవిత్రములను హస్తములో ధరించిన వారు; త్రివృత్ = ముప్పేట తొమ్మిది తంతువులు గల; ఉపవీతం = యజ్ఞోపవీతమును; కమండలుం = కమండలమును; ఋజుం = చక్కని; వైణవం = వెదురుకు సంబంధించిన; దండం = దండమును ధరించిన వారు.

తా. ఆ నరనారాయణులు తెలుపు నలుపు వన్నెగలవారు. అపుడే విచ్చుకున్న పద్మములవంటి కనులు గలవారు. నాలుగుబాహువులు గలవారు, జింక చర్మము నారబట్టలు ధరించిన వారు, పవిత్రమును ధరించినవారు. ముప్పేట తొమ్మిది తంతువులుగల యజ్ఞోపవీతమును ధరించినవారు. కమండలమును, చక్కని వెదురు దండమును ధరించి యుండిరి.

**శ్లో. పద్మాక్షమాలా ముత జంతు మార్జనం వేదం చ సాక్షాత్తప ఏవ రూపిణౌ**
**తపత్తటి ద్వర్ణపిశంగరోచిషా ప్రాంశూ దధానౌ విబుధర్షభార్చితౌ. 34**

అ. పద్మాక్షమాలాం = తామర పూవులజపమాలను; ఉత జంతు మార్జనం = సన్నని పోగులుగల వేదం = దర్భముష్టిని; దధానౌ = ధరించిన వారు; సాక్షాత్ = ప్రత్యక్షముగా; తప ఏవ = తపస్సే; రూపిణౌ = రూపముగా గలవారు; తపత్ = మెఱయుచున్న, తటిత్ = మెరుపువలె; వర్ణ = వన్నెగల; పిశంగరోచిషా = పసుపు కాంతిచే; ప్రాంశూ = పొడగరులై; విబుధ + ఋషభ + అర్చితౌ = సుర ముఖ్యులచే పూజింపబడిన వారు.

తా. నరనారాయణులు తామర పూసల జపమాలను, సన్నని పోగులు గల దర్భముష్టిని ధరించినవారు, ప్రత్యక్షముగా తపస్సే రూపముగా గలవారు, మెఱయుచున్న మెరుపువన్నెవలె పచ్చని కాంతి గలవారు, పొడగరులు, దేవాధి పతులచే పూజలందువారు.

**శ్లో. తౌ వై భగవతో రూపే నరనారాయణా వృషి**
**వీక్ష్యోత్థాయాదరేణోచ్చైర్నానామాంగేన దండవత్. 35**

అ. భగవతః = భగవంతుని; రూపే = రూపముగల; తౌ = ఆ; ఋషీ = ఋషులైన; నరనారాయణౌ = నరనారాయణులను; వీక్ష్య = చూచి; ఉచ్చైః = ఎక్కువ; ఆదరేణ = ఆదరముతో; ఉత్థాయ = లేచి; దండవత్ = దండమువలె, అంగేన = శరీరముతో; ననామ = నమస్కరించెను.

తా. భగవద్రూపులు ఋషులు అయిన ఆ నరనారాయణులను చూచిన మార్కండేయుడు ఎక్కువ ఆదరముతో లేచి. దండవత్ప్రణామము చేసెను.

శ్లో. సతత్సందర్శనానంద నిర్వృతాత్మేంద్రియాశయః
హృష్టరోమాశ్రుపూర్ణాక్షో నసేహే తావుదీక్షితుమ్ **36**

అ. సః = ఆమార్కండేయ మహర్షి; తత్సందర్శన;ఆనంద = ఆనరనారాయణులదర్శనమువలన కలిగిన ఆనందముచే, నిర్వృత = ప్రశాంతమైన; ఆత్మ = దేహము; ఇంద్రియ = ఇంద్రియములు; ఆశయః = మనస్సుగలవాడై; హృష్టరోమ = సంతోషముతో పులకింతలు; అశ్రుపూర్ణాక్షః = ఆనంద బాష్పములతో నిండినకనులు గలవాడై; తౌ = ఆ నరనారాయణులను;ఉదీక్షితుం = చూచుటకు; నసేహే = సమర్థుడుకాకపాయెను.

తా. ఆ నరనారాయణులను చూచుటవలన ప్రశాంతమైన శరీరము, ఇంద్రియములు, మనస్సుగలవాడై, ఆనందముతో పులకింతలు, ఆనందబాష్పములతో నిండిన కనులుగలవాడై ఆ మార్కండేయ మహర్షి నరనారాయణులను చూడలేకపోయెను,

శ్లో. ఉత్థాయ ప్రాంజలిః ప్రహ్వ ఔత్సుక్యాదాశ్లిషన్నివ
నమో నమ ఇతీశానౌ బభాషే గద్గదాక్షరః **37**

అ. ఉత్థాయ = లేచి; ప్రాంజలిః = చేతులు జోడించి; ప్రహ్వః = వినయముతో మేనువంచి; ఔత్సుక్యాత్ = కుతూహలమువలన; ఆశ్లిషన్నివ = ఆలింగనము చేసుకుంటున్నట్లుగా; ఈశానౌ = ఈశ్వరులారా!; నమః నమః = నమస్సు,నమస్సు; ఇతి = అని;గద్గదాక్షరః = తొట్రుపడు అక్షరములు గలవాడై; బభాషే = పలికెను.

తా. ఆ మార్కండేయమహర్షి లేచి, చేతులు జోడించి, వినయముతో మేనువంచి, కుతూహలముతో ఆలింగనము చేసుకుంటున్నట్లుగా, ఈశ్వరులారా! మీకు నమస్కారము అని తొట్రుపడుచున్న అక్షరములతో పలికెను,

శ్లో. తయోరాసనమానీయ పాదయోరవనిజ్యచ
అర్హణేనానులేపేన ధూపమాల్యైరపూజయత్. **38**

అ. తయోః = ఆ నరనారాయణులకు; ఆసనం = పీఠమును; ఆనీయ = గొనివచ్చి; పాదయోః పాదములను; అవనిజ్య చ = కడిగి అర్హణేన+అనులేపేన = తగినగంధపు పూతచేత; ధూపమాల్యైః = ధూపము, పూలమాలలచే, అపూజయత్ = పూజించెను.

తా ఆ మార్కండేయ మహర్షి నరనారాయణులకు పీఠము గొని వచ్చి, కాళ్ళు కడిగి గంధము పూసి. ధూపముతో పూల మాలలతో పూజించెను

శ్లో. సుఖమాసనమాసీనౌ ప్రసాదాభిముఖౌ మునిః
పునరానమ్య పాదాభ్యాం గరిష్ఠావిద మబ్రవీత్. **39**

అ. ఆసనం = పీఠమునందు: సుఖం = సుఖముగా; ఆసీనౌ = కూర్చున్నవారిని; ప్రసాదాభిముఖౌ = అనుగ్రహముతో చూచుచున్నవారిని; మునిః = మార్కండేయ మహర్షి; పాదాభ్యాం = పాదములకు; పునః = మరల; ఆనమ్య = నమస్కరించి; గరిష్ఠౌ = పూజ్యతములైన ఆనరనారాయణులను గూర్చి; ఇదం = ఈవిధముగా; అబ్రవీత్ = పలికెను.

తా. పీఠమునందు సుఖముగా కూర్చొని, తనవైపు అనుగ్రహముతో చూచుచున్న, పూజ్యతములైన ఆ నరనారాయణుల పాదములకు మరియొకసారి నమస్కరించి, వారితో ఇటుల పలికెను.

అవ. అంతర్యామియైన ఆ పరమాత్మయే ప్రాణాదులను ప్రవర్తింప చేయువాడు గాన తనకు స్తోత్రము చేయుటలో స్వాతంత్ర్యము లేకపోవుట నెఱింగి పలుకుచున్నారు

మార్కండేయ ఉవాచ = మార్కండేయ మహర్షి పలికెను.

**శ్లో. కిం వర్ణయే తవ విభో యదుదీరితోఽసు స్సంస్పందతే తమను వాఙ్మన ఇంద్రియాణి స్పందంతి వై తను భృతామజశర్వయోశ్చ స్వస్యాప్యథాపి భజతామసి భావబంధుః**

అ. విభో = ఓ ప్రభూ! తవ = నిన్ను; కిం = ఏమి; వర్ణయే = స్తుతింపగలను; యత్ = ఎవనిచే; ఉదీరితః = ప్రేరేపింపబడి; అసుః = ప్రాణము, సంస్పందతే = ప్రవర్తించు చున్నది; తం అను, ఆ ప్రాణమునను సరించి; వాక్ = వాక్కు; మనః = మనస్సు; ఇంద్రియాణి = ఇంద్రియములు; స్పందంతి = ప్రవర్తించుచున్నవి; తనుభృతాం = దేహధారులకు,అజ శర్వయోః చ = బ్రహ్మశివులకును స్వస్య అపి = నాకును, అథ = మఱియు, భజతాం = నిన్ను సేవించువారికి, భావ బంధుః ఆత్మబంధువు అసి = అగుచున్నావు.

తా. ఓ ప్రభూ! నిన్నేమని స్తుతింతును. నీ ప్రేరణచే ప్రాణము ప్రవర్తించుచున్నది. ప్రాణము ననుసరించి వాక్కు మనస్సు ఇంద్రియములు ప్రవర్తించు చున్నవి. దేహధారులకు బ్రహ్మరుద్రాదులకు నాకు మరియు నిన్ను సేవించువారికి నీవే ఆత్మబంధువగుచున్నావు. ఇటుల చెప్పుటచే. తనకును దేహధారులకు, బ్రహ్మరుద్రాదులకు కూడా స్వాతంత్ర్యము లేదని తెలియుచున్నది. నీచే ప్రవర్తింప చేయబడిన దేహేంద్రియాదులతో నిన్ను స్తోత్రముచేసిన వారికి కూడా నీవు ఆత్మబంధువవేకాని, పిత్రాదులవలె దేహబంధువు కావుగదా? అహా! ఎంత దయామయుడవు అని అచ్చెరువొందుచున్నాడు.

అవ, ఓయీ! ప్రాణాదులకు మేమెటుల ప్రవర్తకుల మగుదము, మేము ధర్మపుత్రులము గదా! అనినచో మీరెవరికీ పుత్రులుకారు. అని చెప్పుచున్నారు,

**శ్లో. మూర్తీ ఇమే భగవతో భగవంస్త్రిలోక్యాః క్షేమాయ తాపవిరమాయచ మృత్యుజిత్యై నానాబిభర్ష్యవితుమన్యతనూర్యథేదం సృష్ట్వాపునర్గ్రసపి సర్వమివోర్ణనాభిః 41**

అ. భగవన్! = ఓ భగవంతుడా! భగవతః = భగవంతుడవైననీ; ఇమే = ఈ; మూర్తీ = ఆకారములు, త్రిలోక్యాః = మూడులోకములయొక్క, క్షేమాయ = క్షేమముకొఱకు, తాప విరమాయచ = దుఃఖనివృత్తికిని, మృత్యుజిత్యై = మోక్షమునకును అగుచున్నవి కావున మీరు ఎవరి పుత్రులను కారు. ఇందుకు దృష్టాంతము యథా = ఏప్రకారము ఇదం = ఈవిశ్వమును, అవితుం కాపాడుటకు, నానా =

పలువిధములైన, అన్యతనూః = ఇతరములైన మత్స్య కూర్మాదిశరీరములను, బిభర్షి = ధరించుచున్నావు. ఇటుల కేవలము పాలనాదికము మాత్రమే నీపనికాదు, మఱేమన? సృష్ట్వా = సృజించి, పునః = మరల, సర్వం = సర్వ ప్రపంచమును, ఊర్ణనాభిః ఇవ = సాలెపురుగువలె, గ్రససి = కబళింతువు, కనుకసృష్టి స్థితి ప్రళయములు మూడును నీ కృత్యములే.

తా. ఓ భగవంతుడా! నీ ఈరెండుమూర్తులు మూడులోకముల క్షేమమునకు, సంసార దుఃఖ నివృత్తికి మోక్షము నిచ్చుటకు మాత్రమే. అటులనే ఈ ప్రపంచము కాపాడుటకు మత్స్య కూర్మాదులైన పలుదేహములు ధరింతువు. మరియు ఈ ప్రపంచమును సృజించి సాలెపురుగు వలె మరలా అంతయు గ్రసింతువు. సాలెపురుగు తన గర్భమునుండి దారమును సృజించి ఒక గూడును కట్టును. తరువాత మరల ఆగూడును తన నోటితో మింగి వేయును. అట్లే భగవంతుడును ఇతరుల సాయమపేక్షింపకనే విశ్వమును సృజించి నశింపజేయునని భావము. ఇటుల చెప్పుటచే నరనారాయణులు ఎవరి పుత్రులును కారు. ప్రపంచము యొక్క సృష్టిస్థితిలయముల కొఱకు మోక్షమిచ్చుటకు ఆయా దేహములు ధరింతురని తాత్పర్యము.

అవ. నీవు ఇటువంటి వాడవుగాన నీ పాదములను సేవింతునని చెప్పుచున్నారు.

**శ్లో. తస్యావితు స్థిర చరేశితు రంఘ్రిమూలం యత్థ్సం న కర్మగుణకాలరజస్స్పృశంతి యద్వైస్తువంతి వినమంతి యజన్త్యభీక్ష్ణం ధ్యాయ న్తివేదహృదయా మునయ స్తదాప్త్యై**

అ. అవితుః = ఈ ప్రపంచమును కాపాడు, తస్య = ఆ, స్థిరచరేశితుః = స్థావర జంగమాత్మక ప్రపంచమునకు ప్రభువైన శ్రీమన్నారాయణునియొక్క, అంఘ్రిమూలం = పాదమూలమును సేవింతునని ముందు శ్లోకముతో అన్వయము. యత్థ్సం = యేపాదపద్మములవద్ద ఉన్నవానిని, కర్మ = కర్మలయొక్క గుణ = సత్వాదిగుణములయొక్క, కాల = కాలముయొక్క, రజః = మాలిన్యము, నస్పృశంతి = అంటవో వేదహృదయాః = వేదతాత్పర్యము నెఱింగిన, మునయః = మునులు, తదాప్త్యై = అతని పాదపద్మములనుపొందుటకు, అభీక్ష్ణం = మిక్కిలి, యత్ = ఎవనిని, స్తువంతి = స్తోత్రముచేయుచున్నారు, వినమంతి = నమస్కరించుచున్నారు. యజంతి = పూజించుచున్నారు. ధ్యాయంతి = ధ్యానము చేయుచున్నారు.

తా. ఓ భగవంతుడా! స్థావరజంగమాత్మకమగు ఈ విశ్వమునకు ప్రభువు, పాలకుడవైన నీ పాదమూలమును సేవింతును. నీ పాదమూలమును చేరిన వానిని కర్మగతదోషములు, గుణగత దోషములు, కాలగత దోషములు అంటజాలవు. కావుననే నీ పాదమూలమును చేరుటకు వేదతాత్పర్యమును తెలిసిన మునులు నిన్ను మాటిమాటికి స్తుతించుచున్నారు. నమస్కరించు చున్నారు. పూజించు చున్నారు. ధ్యానించు చున్నారు. కావున నేనూ నీపాదమూలమును సేవింతునని తాత్పర్యము.

అవ. నీ పాదమూలమును చేరుటకన్న వేరు పురుషార్థము లేదని చెప్పుచున్నారు.

**శ్లో. నాన్యం తవాంఘ్ర్యుపనయా దపవర్గమూర్తేః క్షేమం జనస్య పరితోభియ ఈశవిద్మః బ్రహ్మా బిభేత్యల మతో ద్విపరార్ధ ధిష్ణ్యః కాలస్యతే కిముత తత్కృతభౌతికానామ్. 43**

అ. ఈశ = ఓఈశ్వరుడా! అపవర్గమూర్తేః = మోక్షస్వరూపుడవైన, తవ = నీయొక్క, అంఘ్రి + ఉపనయాత్ = పాదమూలమునుచేరుటకంటే, పరితః = అంతట, భియః = భయముగలిగిన, జనస్య

జనమునకు, అన్యం = ఇతరమైన, క్షేమం = క్షేమకరమైనదానిని, న విద్మః = తెలియము ద్విపరార్థ ధిష్ణ్యః = రెండు పరార్థములు స్థానముగల, బ్రహ్మ = బ్రహ్మ కాలస్య = భ్రూ విజృంభణ రూపమైన కాలస్వరూపుడవైన, తే = నీకు, అలంబిభేతి = మిక్కిలి భయపడుచున్నాడు, అతః = ఇందువలన, తత్కృతభౌతికానాం = ఆ బ్రహ్మచే సృజించబడిన ప్రాణుల విషయము కిముత = ఏమి చెప్పవలెను.

తా. అంతటా భయమును చూచు జనులకు మోక్షస్వరూపుడవైన నీపాదమూలమును చేరుట కంటె వేరైనక్షేమము మఱియొకటి లేదు. రెండుపరార్థకాలముండు బ్రహ్మకూడా కాలస్వరూపుడవైన నీకు మిక్కిలి భయపడును. ఇక ఆ బ్రహ్మచే చేయబడిన ప్రాణుల విషయములో ఏమి చెప్పవలయును.

**శ్లో. తద్వై భజామ్యృతధియస్తవ పాదమూలం హిత్వేదమాత్మచ్ఛది మాత్మ గురోః పరస్య**
**దేహాద్యపార్థ మసదంత్య మభిజ్ఞమాత్రం విందేత తర్హి సతు సర్వమనీషితార్థమ్ 44**

అ. తత్ = అందువలన; ఇదం = ఈ; ఆత్మచ్ఛదిం = ఆత్మకు ఆవరణమైన; అపార్థం = నిష్ఫలమైన; అసత్ = తుచ్ఛమైన; అంత్యం = నశ్వరమైన. అభిజ్ఞమాత్రం = తోచునది మాత్రమే అయిన; దేహాది = దేహము గృహము మొదలగు వాటిని; హిత్వా = వదిలి; ఆత్మగురోః = జీవుని నియమించు; పరస్య = అందరికంటె పరుడైన; ఋతధియః = సత్యజ్ఞానస్వరూపుడవైన, తవ = నీయొక్క; పాదమూలం = పాదమూలమును; భజామి = సేవించెదను, తర్హి = అటుల భజించుట వలన; సః = అటుల భజించువాడు; సర్వమనీషితార్థం = కోరిన అన్ని పురుషార్థములను; విందేత = పొందును.

తా. ఓభగవంతుడా! ఆత్మకు ఆవరణమైన, నిష్ఫలమైన, తుచ్ఛము, నశ్వరముతోచునది మాత్రమే అయిన ఈదేహగేహాదికమును వదలిపెట్టి జీవుని నియమించువాడు అందరికంటె ఉన్నతుడు, సత్యజ్ఞాన స్వరూపుడు అయిన నీపాదమూలమును భజించెదను. అటుల భజించుట వలన కోరిన అన్ని పురుషార్థములను పొందును

అవ. బ్రహ్మరుద్రాదులు కూడా నామూర్తులే. అయినపుడు నన్నే ఎందుకు ఎక్కువగా ఆదరించు చున్నావు? అనగా చెప్పు చున్నారు

**శ్లో. సత్త్వం రజస్తమ ఇతీశ తవాత్మబంధోర్మాయామయాః స్థితిలయోద్భవహేతవోఽస్య**
**లీలాధృతా యదపి సత్త్వమయీం ప్రశాంత్యై నాన్యే నృణాం వ్యసనమోహభియశ్చ యాభ్యామ్. 45**

అ. ఈశ! = ఓ ఈశ్వరా!; సత్త్వం = సత్త్వగుణము; రజః = రజోగుణము; తమః = తమోగుణము; ఇతి = అనునవి; ఆత్మబంధోః = ఆత్మకు బంధువైన, తవ = నీ యొక్క; మాయాకృతాః = మాయచే చేయబడినవి; అస్య = ఈ విశ్వము యొక్క; స్థితిలయోద్భవహేతవః = ఉనికి; లయము; సృష్టి అనువాటికి కారణములు; లీలాధృతాః = లీలగా ధరింపబడినవి; యదపి = అట్లయిననూ; యాభ్యాం = యే రెండుమూర్తులచే అనగా బ్రహ్మరుద్రమూర్తులచే; నృణాం = నరులకు; అన్యే = ఇతరములైన; వ్యసనమోహభియశ్చ = శోకము; మోహము, భయము, అనునవి; న = కలుగవు; సత్త్వమయీం = సాత్త్వికగుణరూపమైన విష్ణుమూర్తిని; ప్రశాంత్యై = మోక్షమునకు కొలిచెదము.

ఓ ఈశ్వరా! ఈ ప్రపంచము పుట్టుటకు, ఉనికికి లయమునకు, కారణములైన సత్త్వ రజస్తమో గుణములు ఆత్మబంధువైన నీ మాయచే ధరించబడినవే. అయిననూ బ్రహ్మ

రుద్ర మూర్తులు నరుల శోక మోహ భయములను తొలంగించునే కాని మోక్షము నీయ జాలవు అటుల మోక్షము నిచ్చునది ఒక్క విష్ణుమూర్తే. అందుకే మోక్షకాములు విష్ణు స్వరూపమునే కొలిచెదరు.

అవ. దానినే సదాచారముతో ధృడము చేయుచున్నాడు.

శ్లో. **తస్మాత్త వేహ భగవన్నథ తావకానాం శుక్లాం తనుం చ దయితాం కుశలాభజంతి యత్సాత్త్వతాః పురుషరూపముశంతి సత్త్వం లోకో యతోఽభయముతాత్మ సుఖం న చాన్యత్. 46**

అ. భగవన్! = ఓ భగవంతుడా!; తస్మాత్ = అందువలన; తావకానాం = నీ భక్తులలో; కుశలాః = నిపుణులు; ఇహ = ఈ విశ్వములో; అథ = మరి; తవ = నీయొక్క; దయితాం = ప్రియమైన శుక్లాం = తెల్లని; తనుం = శరీరమును; అనగా నరనారాయణత్వమును, భజంతి = భజించుచున్నారు; యత్ = ఎందువలన; సాత్త్వతాః = విష్ణుభక్తులు, సత్త్వం = సాత్త్విక స్వరూపమును; పురుషరూపం = అధీశ్వరుని రూపమును; ఉశంతి = తలంచుచున్నారు; యతః = ఏ పురుషరూపమును ఉపాసించుటవలన లోకః = వైకుంఠలోకము; అభయం = ఉత్తమము, ఆత్మసుఖం = ఆత్మసుఖమును కూడా పొందుదురు అన్యత్ = రజోమూర్తిని; తమోమూర్తిని; న = ఉపాసించరు.

తా. ఓ భగవంతుడా! అటులగుటచే నీ భక్తులలో బుద్ధిమంతులైన వారు ఈ ప్రపంచములో తమకు అత్యంత ప్రియమైన నీ నరనారాయణ స్వరూపమును సేవించు చున్నారు మరియు విష్ణు భక్తులు సాత్త్విక గుణస్వరూపమైన విష్ణు స్వరూపము నే ఉపాసించెదరు అటుల ఉపాసించుట వలన వైకుంఠంలోక ప్రాప్తి భయరాహిత్యము, ఆత్మసుఖముకలుగును. అందువలన ఇతరములైన రజోమూర్తిని తమోమూర్తిని ఉపాసించరు.

అవ. అందువలన ఆ సాత్త్విక మూర్తిని నమస్కరించు చున్నాను.

శ్లో. **తస్మైనమో భగవతే పురుషాయభూమ్నే విశ్వాయ విశ్వగురవే పరదేవతాయై నారాయణాయ ఋషయే చ రోనత్తమాయ హంసాయ సంయతగిరే నిగమేశ్వరాయ**

అ. తస్మై = అటువంటి; భగవతే = భగవంతుడగు, పురుషాయ = పురుషుడైన భూమ్నే = విస్తృతమైన ఆనంద స్వరూపుడైన; విశ్వాయ = విశ్వరూపుడైన; విశ్వగురవే = విశ్వమునకు గురువైన పరదేవతాయై = దేవతలందరిలో పరదేవతయైన; ఋషయే = ఋషియైన, నరోత్తమాయ = నరులలో ఉత్తముడైన; హంసాయ = శుద్ధుడైన; సంయతగిరే = వాఙ్నియమముగల; నిగమేశ్వరాయ = వేదమార్గ ప్రవర్తకుడైన; నారాయణాయ = నారాయణమూర్తికి, నమః = నమస్కారము.

తా. భగవంతుడు, పూర్ణపురుషుడు, బహు ఆనందస్వరూపుడు, విశ్వరూపుడు, విశ్వగురువు, దేవతలందరిలో ఉన్నతుడు, ఋషి, నరోత్తముడు, వాఙ్నియమము గలవాడు, వేద మార్గప్రవర్తకుడు అయిన నారాయణమూర్తికి నమస్కారము.

అవ. వేదార్థ సంప్రదాయ ప్రవర్తనకు కారణమును తెలుపుచున్నాడు.

శ్లో. **యంవైన వేద వితథాక్షపథైర్భ్రమద్ధీస్సంతం స్వతేష్వసుషు హృద్యపి దృక్పథేషు తన్మాయయావృతమతి స్స ఉవేద సాక్షాత్ ఆద్యస్తవాఖిల గురోరుపసాద్యవేదమ్**

అ వితథాక్షపథైః = కపటములైన ఇంద్రియ మార్గములచే; భ్రమత్ + ధీః = విక్షిప్తచిత్తుడగు పురుషుడు, స్వకేషు = తనవైన; అసుషు = ఇంద్రియములందు నియంతయై, హృది = హృదయము నందు; దృక్షు ఏధేషు సంతం = విషయములందు ఉన్నవానిని; నవేద = ఎరుగడు; తన్మాయయా = ఆ నీ యొక్క మాయచేత; ఆవృత మతిః = ఆవరించబడిన బుద్ధిగలవాడై; స ఉ = అతడును, నవేద = తెలియడు, ఆద్యః = ఆ మొదటివాడు అనగా పూర్వము తెలియనివాడే; అఖిలగురోః = అందరికి గురువైన తవ = మీ నుండి ప్రవర్తింపబడిన; వేదం = వేద విద్యను; ఉపసాద్య = పొంది; యం = ఏ పరమాత్మ వైన నిన్ను; సాక్షాత్ = స్వయముగా, వేద = తెలియుచున్నాడు.

తా. కపటములైన ఇంద్రియ మార్గములచే విక్షిప్తచిత్తుడైన పురుషుడు తన ఇంద్రియ ములందు, ఇంద్రియవిషయములందు, హృదయమందు నియంతగా ఉన్నవానిని ఆభగవంతుని మాయచే ఆవరించబడిన బుద్ధిగలవాడై తెలియుటలేదు. అటులతెలియని ఆ మొదటివాడే, విశ్వమునకు గురువైన నీచే ప్రవర్తింప చేయబడినవేదమును నీనుండి తెలుసుకొని ఆ పురుషోత్త ముని సాక్షాత్తుగా తెలియుచున్నాడు.

అవ. వేదనయే అతనిని తెలియుట అని చెప్పుచున్నారు.

**శ్లో. యద్దర్శనం నిగమ ఆత్మరహః ప్రకాశం ముహ్యంతి యత్ర కవయోఽజపరా యతంతః**
**తం సర్వవాదవిషయప్రతిరూపశీలం వందే మహాపురుష మాత్మనిగూఢ బోధమ్. 49**

అ. యత్ + దర్శనం = ఏ నీ దర్శనము; నిగమ ఆత్మరహః ప్రకాశం = వేదమునందు ఆత్మ వగు నీయొక్క రహస్యమును తెలియజేయునో; యత్ర = ఏ నీ విషయమున; అజపరాః = బ్రహ్మ మొదలగు; కవయః = సాంఖ్యయోగముచే ఉపాసించు కపిలాదులు; యతంతః అపి = ప్రయత్నించుచును ముహ్యంతి = మోహమును పొందుచున్నారు, అనగా తెలియకున్నారు. ఎందుకనగా తెలుపుచున్నారు. సర్వవాదవిషయ ప్రతిరూపశీలం = సాంఖ్యాది సమస్తవాదములకు విషయములైన అన్నిభేదములకు అనుగుణమైన స్వభావముగల, ఆత్మ నిగూఢ బోధం = దేహాది సంఘాతముచేత తెలియరాక నిగూఢ మైన జ్ఞానస్వరూపుడైన; మహాపురుషం = మహాపురుషుడవైన; తం = ఆ; నిన్ను; వందే = నమస్క రించు చున్నాను.

తా. నీ దర్శనము వేదమునందున్న ఆత్మరహస్యమును తెలియజేయును. నిన్ను తెలుసుకొనుటకు బ్రహ్మ మొదలగువారు, సాంఖ్యవాదమును ఆశ్రయించు కపిలాదులు ప్రయ త్నించుచును మోహమును పొందుచు తెలియకున్నారు. ఎందుకనగా నీ స్వరూపము అన్ని వాదములలో నుండెడి అన్నిభేదములకు అనుగుణముగా ఉండును. మఱియు దేహాది సంఘాత ముచే తెలియరాక నిగూఢమైనజ్ఞానస్వరూపుడవు, మహాపురుషుడవు అయిన నిన్ను నమస్క రించు చున్నాను.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
అష్టమోఽధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
ఎనిమిదవ అధ్యాయము ముగిసినది
ఓమ్ తత్ సత్

# నవమోఽధ్యాయః

## తొమ్మిదవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**నవమే భగవన్మాయా దిదృక్షోర్దర్శనం ముహుః**
**మాయా శిశోర్లయాబ్ధౌచ మునేన్నిర్వేశ నిర్గమైః**

తా. ఈ నవమాధ్యాయమందు శ్రీమన్నారాయణుని మాయను చూడగోరిన మార్కండేయ మహర్షికి భగవంతుడు తన మాయను చూపుట ప్రళయ సాగరములో మాయా శిశువును చూచుట చెప్పబడినది.

అవ. భగవంతుడు శ్రీమన్నారాయణుడు సంతోషముతో మార్కండేయడు అడిగిన వరము నిచ్చుటను పలుకుచున్నాడు,

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూత మహర్షి పలికెను.

శ్లో. **సంస్తుతో భగవానిత్థం మార్కండేయేన ధీమతా**
**నారాయణో నరసఖః ప్రీతః ప్రాహ భృగూద్వహ** **1**

అ. భృగూద్వహ!=ఓ భృగువంశ శ్రేష్ఠుడా; ధీమతా=జ్ఞానముగల; మార్కండేయేన= మార్కండేయ మహర్షి చే; ఇత్థం=ఈ విధముగా; సంస్తుతః=చక్కగా స్తుతించబడి; నరసఖః= రసఖుడైన; నారాయణః=నారాయణుడు; ప్రీతః=సంతోషించినవాడై; ప్రాహ=పలికెను.

తా. ఓ భృగువంశ శ్రేష్ఠుడా!, జ్ఞానియైన మార్కండేయ మహర్షి చక్కగా స్తుతించగా నరసఖుడైన నారాయణుడు సంతోషించి ఇటుల పలికెను.

శ్రీ భగవానువాచ = శ్రీ భగవంతుడు పలికెను.

శ్లో. **భో! భో! బ్రహ్మర్షి వర్య త్వం సిద్ధ ఆత్మ సమాధినా**
**మయి భక్త్యా నపాయిన్యా తపస్స్వాధ్యాయ సంయమైః** **2**

అ. భో! భో!=ఓయీ, బ్రహ్మర్షి వర్య=బ్రహ్మర్షిశ్రేష్ఠుడా; త్వం=నీవు; ఆత్మసమాధినా=ఆత్మసమాధిచే మయి=నాయందు; అనపాయిన్యా=ఎడతెగని; భక్త్యా=భక్తిచేత; తపస్స్వాధ్యాయ సంయమైః=తపస్సు, స్వాధ్యాయము:ఇంద్రియ నిగ్రహములచేత; సిద్ధః=సిద్ధిపొందితివి.

తా. ఓ బ్రహ్మర్షి శ్రేష్ఠుడా! నీవు ఆత్మ సమాధితో, నాయెడల అవిచ్ఛిన్నమైన భక్తిచే. తపస్సుతో, స్వాధ్యాయముతో, ఇంద్రియ నిగ్రహముతో సిద్ధిపొందితివి.

శ్లో. వయం తే పరితుష్టా స్మత్వద్బ్రహ్మవ్రత చర్యయా
వరం ప్రతీచ్ఛ భద్రంతే వరదేశాదభీప్సితమ్. 3

అ. త్వద్బ్రహ్మవ్రత చర్యయా=నీ బ్రహ్మచర్యవ్రతముచే; తే=నీకు; వయం=మేము; పరితుష్టాః స్మ=సంతోషించితిమి; వరదేశాత్=వరమునిచ్చువారలకు ప్రభువునుండి; అభీప్సితం=ఇష్టపడిన; వరం=వరమును; ప్రతీచ్ఛ=కోరుము; తే=నీకు; భద్రం=శుభమగును.

తా. ఓ మార్కండేయ మహర్షి! నీ బ్రహ్మచర్యవ్రతముచే మేము సంతోషించితిమి వరమునిచ్చువారలకు ప్రభువైన నానుండి నీకు ఇష్టమైన వరమును కోరుకొనుము. నీకు శుభమగును.

మార్కండేయ ఉవాచ = మార్కండేయ మహర్షి పలికెను.

శ్లో. జితంతే దేవదేవేశ! ప్రపన్నార్తిహరాచ్యుత
వరేణైతావతాలం నో యద్భవాన్ సమదృశ్యత 4

అ. దేవదేవేశ=దేవదేవులకు ఈశ్వరుడా; ప్రపన్నార్తిహర=నిన్ను పొందిన వారి ఆపదలను హరించువాడా; అచ్యుత=అచ్యుతుడా; తే=నీచే; జితం=ఉత్కర్షచూపబడినది; ఏతావతా=ఇంత మాత్రము; వరేణ=వరముచేత; అలం=చాలును, యత్=ఏకారణముచే; భవాన్=నీవు; నః=మాకు సమదృశ్యత=దర్శన మిచ్చితివి.

తా. ఆపన్నుల ఆర్తిని హరించు ఓ అచ్యుతా; నీచే ఉత్కర్ష చూపబడినది. నీవు మాకు దర్శనమిచ్చుటయే గొప్ప వరము. అదియే మాకు చాలును.

శ్లో. వాంఛత్యజాదయో యస్య శ్రీమత్పాదాబ్జదర్శనమ్.
మనసా యోగపక్వేన స భవాన్మేఽక్షిగోచరః 5

అ అజ+ఆదయః=బ్రహ్మ మొదలగువారు; యస్య=ఎవనియొక్క; శ్రీమత్+పాద+అబ్జదర్శనం=శ్రీమంతమైన పాదపద్మముల దర్శనమును; వాంఛంతి=కోరుదురో; సః భవాన్=ఆ నీవు; యోగపక్వేన=యోగముచే పరిపక్వమైన. మనసా=మనస్సుచే, మే=నా;అక్షిగోచరః=కనుల కగుపడితివి

తా బ్రహ్మాదులుకూడా శ్రీమంతమైన నీపాదపద్మముల దర్శనము కోరుదురు. అంతటి నీవు యోగముచే పరిపక్వమైన మనముగల నాకనులకగుపడితివి. ఇంకా ఇంతకన్ననూ వేరే వరమందులకని తాత్పర్యము.

శ్లో. అథాఽప్యంబుజ పత్రాక్ష! పుణ్యశ్లోక శిఖామణే!
ద్రక్ష్యే మాయాం యయా లోకస్సపాలో వేద సద్భిదామ్. 6

అథాఽపి=అయిననూ; అంబుజపత్రాక్ష=తామర రేకులవంటి కనులు గలవాడా; పుణ్యశ్లోక శిఖామణే=పవిత్రమైన కీర్తి గలవారిలో ఉత్తముడా; యయా=దేనిచే; స పాలః=దిక్పాలురతోకూడిన లోకః=పంచము; సద్భిదాం=సద్వస్తువునందు భేదభావమును; వేద=ఎఱుగుచున్నదో; మాయాం=ఆ నీమాయను; ద్రక్ష్యే=చూడగోరుచున్నాను.

తా. తామరరేకులవంటి కన్నులుగలవాడా! పవిత్రమైన కీర్తిగలవారిలో ఉత్తముడా! నీదర్శనము కన్ననూ మరే వరము కోరదగినది లేకున్ననూ, దిక్పాలురతో కూడిన ప్రపంచ మంతయూ సద్వస్తువునందు భేదమును చూచునట్లు చేయు నీమాయను చూడ గోరుచున్నాను.

శ్రీ సూత ఉవాచ = శ్రీసూతమహర్షి పలికెను.

శ్లో. ఇతీడితోఽర్చితః కామమృషిణా భగవాన్మునే
తథేతి స స్మయన్ ప్రాగాద్బదర్యాశ్రమ మీశ్వరః 7

అ. మునే=ఓ శౌనక మహామునీ; ఋషిణా=మార్కండేయ మహర్షిచే; ఇతి ఈ ప్రకారముగా కామం=మిక్కిలి; ఈడితః స్తుతింపబడిన; భగవాన్ శ్రీమన్నారాయణుడు; స్మయన్ చిరునవ్వు నవ్వుచు; తథేతి=అటులనే అని; ఈశ్వరః భగవంతుడు; బదర్యాశ్రమం=బదరికాశ్రమమును; ప్రాగాత్ వెళ్ళెను.

తా. ఓ శౌనకా! ఆ మార్కండేయ మహర్షి ఇటుల స్వామిని స్తుతించి పూజించి తన కోరికను తెలుపగా శ్రీమన్నారాయణుడు నవ్వుచు అటులనే చూడగలవని పలికి బదరికాశ్రమమునకు వెళ్ళెను.

శ్లో. తమేవ చింతయన్నర్థమృషిస్స్వాశ్రమ ఏవ సః
వసన్నగ్న్యర్క సోమాంబు భూవాయు వియదాత్మసు. 8

అ. సః ఋషిః ఆ ఋషి. స్వ+ఆశ్రమే ఏవ తన ఆశ్రమము నందే; తం అర్థం ఏవ ఆ మాయా దర్శన రూపమైన ప్రయోజనమునే; చింతయన్ చింతించుచు; అగ్ని+అర్క+సోమ+అంబు; భూ వాయు వియత్+ఆత్మసు=అగ్ని, సూర్యుడు, చంద్రుడు, జలము, భూమి, వాయువు ఆకాశము, ఆత్మ అనువాని స్వరూపమునందు; వసన్=వసించుచు.

తా. ఆ మార్కండేయ మహర్షి తన యాశ్రమమందేయుండి, భగవంతుని మాయను చూడగోరి దానినే చింతించుచు, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, జలము, భూమి, వాయువు, ఆకాశము, ఆత్మ (అంతఃకరణము) అను వానియందు భగవంతుని దర్శించుచు వసించెను,

శ్లో. ధ్యాయన్ సర్వత్ర చ హరిం భావద్రవ్యైరపూజయత్
క్వచిత్పూజాం విసస్మార భక్తిప్రసరసంప్లుతః 9

అ సర్వత్రచ=ప్రపంచ మంతటను; హరిం=శ్రీహరిని; ధ్యాయన్ = ధ్యానించుచు; భావ ద్రవ్యైః=మనస్సంకల్పిత పుష్ప ఫలాది ద్రవ్యములచే; అపూజయత్ = పూజించెను భక్తి ప్రసర సంప్లుతః=భక్తి రసప్రవాహమునందు మునింగినవాడై; క్వచిత్ = ఒకపుడు; పూజాం=భగవంతుని పూజను విసస్మార = మరచెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ప్రపంచమంతటను శ్రీమన్నారాయణునే ధ్యానించుచు, మనస్సుతో సంకల్పించిన పుష్ప ఫలాది ద్రవ్యములచే శ్రీహరిని పూజించెను. భక్తిరస ప్రవాహములో మునిగి ఒకప్పుడు భగవంతుని పూజనే మఱచెను.

అవ. మాయా దర్శనమును చెప్పుచున్నారు.

**శ్లో. తస్యైకదా భృగుశ్రేష్ఠ పుష్పభద్రా నదీతటే**
**ఉపాసీనస్య సంధ్యాయాం బ్రహ్మన్వాయురభూన్మహాన్ 10**

అ బ్రహ్మన్! ఓ బ్రాహ్మణోత్తమా!; భృగుశ్రేష్ఠ! ఓ భృగువంశశ్రేష్ఠుడా! ఏకదా ఒకపుడు; సంధ్యాయాం సంధ్యవేళ; పుష్పభద్రానదీతటే పుష్పభద్రానదీ తీరమున; ఉపాసీనస్య=ఉపాసించుచున్న; తస్య=ఆ మార్కండేయ మహర్షికి. మహాన్ వాయుః=పెనుగాలి, అభూత్=వీచెను.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! భృగువంశశ్రేష్ఠుడా! ఆ మార్కండేయ మహర్షి సంధ్యవేళ పుష్పభద్రా నదీతీరమున ఉపాసించుచుండగా పెనుగాలి వీచెను

**శ్లో. త చండశబ్దం సముదీరయంతం బలాహకా అన్వభవన్ కరాళాః**
**అక్షస్థవిష్ఠా ముముచుస్తటిద్భిస్స్వనంత ఉచ్చైరభి వర్షధారాః 11**

అ. తం ఆ వాయువును; అను అనుసరించి; చండశబ్దం=భయంకరమైన ధ్వనిని; సముదీరయంతః ఘోషింపచేయుచు; కరాళాః=భయంకరములైన, బలాహకాః మేఘములు; అభవన్=అయెను; అక్షస్థవిష్ఠాః ఇరుసువలె ధృఢములై; తటిద్భిః మెరుపులతో గూడి; ఉచ్చైః స్వనంతః=పెద్దగా ఉరుముచు; వర్షధారాః=వాననీటి ధారలను; అభి అంతట; ముముచుః విడిచినవి.

తా. ఆ వాయువును అనుసరించి భయంకరమైన ధ్వని చేయుచు భయంకరములైన మేఘములు పుట్టి, మెరుపులతో పెద్దగా ఉరుముచు, ఇరుసువలె దృఢములైన వాననీటిధారలను అంతటను విడిచినవి

**శ్లో. తతోఽభ్యదృశ్యంత చతుస్సముద్రాః సమంతతః క్ష్మాతల ముద్గ్రసంతః**
**సమీరవేగోర్మిభిరుగ్రనక్రా భయనకావర్త గభీరఘోషాః 12**

అ. తతః అంత, చతుస్సముద్రాః నాలుగు సముద్రములు సమంతతః=అంతట; క్ష్మాతలం భూమిని ఉద్గ్రసంతః కబళించుచు, సమీరవేగోర్మిభిః=వాయువేగముచే వేగమునందిన అలలచే ఉగ్రనక్రాః భయంకరములైన మొసళ్ళుగలవై; భయానకావర్త గభీరఘోషాః భయమును కలిగించు సుళ్ళతో గంభీరమైన ధ్వనిగలవై; అభ్యదృశ్యంత కనిపించెను.

తా. అంతట నాలుగు సముద్రములు భూమినంతను కబళించుచు, వాయువేగముచే వేగమునందిన అలలతో, భయంకరమైన మొసళ్ళతో, భయమును కలిగించు సుడిగుండములతో, గంభీరమైన ధ్వని గలవై కనబడెను,

**శ్లో. అంతర్బహిశ్చాద్భిరతిద్యుభిః ఖరైః శతహ్రదాభిరుపతాపితం జగత్**
**చతుర్విధం వీక్ష్య సహాత్మనా మునిర్జలాప్లుతాం క్ష్మాం విమనాస్సమత్రసత్. 13**

అ అంతః బహిః చ లోపల వెలుపలను; అద్భిః=నీళ్ళచేత; అతిద్యుభిః ఆకాశమును అతిక్రమించిన; ఖరైః=వేడికలవైన, సూర్యరశ్ముల చేత, శతహ్రదాభిః=మెరుపులచేత: ఉపతాపితం సంతాపమును పొందించిన; చతుర్విధం జరాయుజాది నాలుగు విధములైన జగత్ జగతును; వీక్ష్య చూచి; విమనాః కలత చెందిన మనస్సుగలవాడై; సమత్రసత్ మిగుల భీతిచెందెను.

తా. లోపల వెలుపల ఆకాశమునతిక్రమించిన సూర్యకిరణములతో మెరుపులతో జరాయు జాది చతుర్విధ జగత్తు తపించగా, తనతోకూడ భూమినంతయు నీరుముంచివేయగా చూచి కలత చెంది మిగుల భీతినందెను,

శ్లో. తస్యైవ ముద్వీక్షత ఊర్మిభీషణః ప్రభంజనా ఘూర్ణిత వార్మహార్ణవః
ఆపూర్యమాణో వర్షద్భి రంబుదైః క్ష్మాం ద్వీపవర్షాదిభి రప్యధాత్సమమ్. 14

అ. ఏవం = ఈ ప్రకారము; ఉద్వీక్షతః = చూచుచున్న · తస్య = ఆ మార్కండేయ మహర్షికి; ఊర్మిభీషణః = అలలచే భయంకరమైన ప్రభంజనాఘూర్ణితవాః = వాయువుచే ఘోషించుచున్న నీరు గలి మహార్ణవః = గొప్ప సముద్రము, వర్షద్భిః = కురియుచున్న; అంబుదైః = మేఘములచే; ఆ పూర్యమాణః = నింపబడుచునదై; ద్వీపవర్షాదభిః సమం = ద్వీపవర్షములతో కూడ; క్ష్మాం = భూమిని; అప్యధాత్ కప్పెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ఇటుల చూచు చుండగనే, అలలచే భయంకరమై పెనుగాలచే ఘోషించు చున్న నీరుగలదై కురియుచున్న మేఘములచే నింపబడు సముద్రము ద్వీప వర్షములతో కూడిన భూమిని కప్పివైచెను.

శ్లో. స క్ష్మాంతరిక్షం సదివం సభాగణం త్రైలోక్యమాసీత్సహసాద్భిరాప్లుతమ్
స ఏక ఏవోర్మి జలే మహాముని ర్బభ్రామ విక్షిప్య జటా జడాంధవత్ 15

అ. సక్ష్మా + అంతరిక్షం = భూమియందును; అంతరిక్షము నందును ఉండు ప్రాణులతో గూడ సదివం = స్వర్గము నందలి దేవతలతో కూడను; స భాగణం = సూర్య చంద్రనక్షత్రాది జ్యోతిర్గణము లతోడను; త్రైలోక్యం = ముల్లోకములు; సహసా = శీఘ్రముగా; అద్భిః = నీటిచే; ఆప్లుతః = కప్పబడి అసీత్ = ఆయెను; సః = ఆ మహామునిః = గొప్పమునియైన మార్కండేయుడు, ఏకఏవ = ఒక్కడే జటాః = జడలను విక్షిప్య = విఱబోసికొని; ఊర్మిజలే = అలలతో గూడిన; ఆ మహాసముద్రమునందు జడ + అంధవత్ = మందుడువలె అంధుడువలె బభ్రామ = పరిభ్రమించెను.

తా. భూమియందు అంతరిక్షమునందు స్వర్గమునందు ఉండు ప్రాణులతోకూడిన ముల్లోకములు నీట మునిగెను. ఆ సముద్ర జలములో మార్కండేయ మహర్షి ఒక్కడే జటలు విఱబోసికొని మందునివలె అంధునివలె తిరిగెను.

శ్లో. క్షుత్తృట్పరీతో మకరై స్తిమింగిలై రుపద్రుతో వీచినభస్వదాహతః
తమస్యపారే పరితో భ్రమన్ దిశో నవేద ఖం గాంచ పరిశ్రమేషితః 16

అ. క్షుత్ తృట్ పరీతః = ఆకలి దప్పులచే వ్యాకులుడై; మకరైః = మొసళ్ళచేత; తిమింగిలైః = తిమింగిలములచేత; ఉపద్రుతః = తఱుమబడుచు; వీచినభస్వత్ + ఆహతః = అలలగాలిచే గొట్టబడుచు; అపారే = అంతములేని; తమసి = చీకటియందు; పరితః = అంతట; భ్రమన్ = తిరుగుచు; పరిశ్రమ + ఈషితః = మిగుల బడలిక పొందినవాడై; దిశః = దిక్కులను; ఖం = ఆకాశమును; గాంచ = భూమిని కూడా; నవేద = ఎఱుగడయ్యెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ఆకలి దప్పులచే వ్యాకులుడై, మొసళ్ళు తిమింగిలములు తఱుముచుండగా, అలల గాలిచే కొట్టబడుచు, అంతులేని చీకటిలో అంతట తిరుగుచు మిక్కిలి బడలిక పొంది దిక్కులను ఆకాశమును భూమిని సైతము తెలియకపోయెను.

శ్లో. క్వచిన్మగ్నో మహావర్తే తరంగైస్తాడితః క్వచిత్
యాదోభిర్భక్షితః క్వాపి స్వయమన్యోన్యఘాతిభిః 17

అ. క్వచిత్ = ఒక్కచో; నగ్నః = దిగంబరుడై; మహావర్తే = గొప్పసుడియందు; క్వచిత్ = ఒక్కచో; తరంగైః = అలలచే; తాడితః = కొట్టబడుచు; క్వాపి = ఒక్కచో; స్వయం = తమకుతాము అన్యోన్యఘాతిభిః = ఒండొంటిని చంపుకొనుచున్న, యాదోభిః = జలజంతువులచే; భక్షితః = భక్షింపబడుచు.

తా. ఆ మార్కండేయ మహర్షి ఒకచోట దిగంబరుడై తిరుగుచు, మరియొకచోట; గొప్ప సుడిగుండములో అలలచే కొట్టబడుచు, వేరొక చోట తమలో తాము ఒకరినొకరిని చంపుకొనుచున్న జలజంతువులచే తినబడుచుండెను,

శ్లో. క్వచి చ్ఛోకం క్వచిన్మోహం క్వచి ద్దుఃఖం సుఖం భయం
క్వచి న్మృత్యుం సమాప్నోతి వ్యాధ్యాదిభి రుపద్రుతః **18**

తా. ఒకచో శోకమును, ఒకచో మోహమును, మరియొకచోట దుఃఖమును, సుఖమును భయమును, వేరొకచో మృత్యువును మరొకచో రోగములను పొందుచుండెను.

శ్లో. అయుతాయుత వర్షాణాం సహస్రాణి శతాని చ
వ్యతీయుర్భ్రమత స్తస్మిన్ విష్ణుమాయా వృతాత్మనః **19**

అ. అయుత + అయుత వర్షాణాం = పదివేల యొక్క పదివేలసంవత్సరములయొక్క; సహస్రా = వేలు; శతాని చ = నూర్లు; విష్ణుమాయా + ఆవృత + ఆత్మనః = విష్ణుమాయచే ఆవరించబడినమనసు గలిగిన; భ్రమతః = తిరుగుచున్న ఆమునికి; వ్యతీయుః = గడచినవి,

తా. విష్ణుమాయ ఆవరించిన మనసు గలిగిన ఆముని అలా తిరుగుచుండగా నూర్లువేలు. లక్షలు. కోట్ల సంవత్సరములు గడచెను.

శ్లో. స కదాచిద్భ్రమం స్తస్మిన్ పృథివ్యాః కకుది ద్విజః
న్యగ్రోధ పోతం దదృశే ఫలపల్లవ శోభితమ్. **20**

అ సః = ఆ ద్విజః = బ్రాహ్మణుడు, తస్మిన్ = ఆ ప్రళయ సాగరమందు; భ్రమన్ = తిరుగుచు; కదాచిత్ = ఒకపుడు; పృథివ్యాః = భూమియొక్క; కకుది = ఉన్నత ప్రదేశమందు; ఫలపల్లవ పండ్లు చిగుళ్ళచే, శోభితం = శోభించుచున్న; న్యగ్రోధపోతం = లేతమఱ్ఱిచెట్టును; దదృశే = చూచెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ప్రళయసాగరమున తిరుగుచు ఒకపుడు భూమియొక్క ఉన్నత ప్రదేశమున పండ్లు చిగుళ్ళు ఉండి అలరారుచున్న ఒక లేత మఱ్ఱిచెట్టును చూచెను.

శ్లో. ప్రాగుత్తరస్యాం శాఖాయాం తస్యాఽపి దదృశే శిశుమ్
శయానం పర్ణపుటకే గ్రసంతం ప్రభయా తమః **21**

అ తస్య = ఆమఱ్ఱి చెట్టుయొక్క; ప్రాగుత్తరస్యాం = ఈశాన్య దిక్కునయున్న శాఖాయాం = కొమ్మయందు; ప్రభయా = తనతేజముచే తమః = చీకటిని; గ్రసంతం = కబళించుచున్న పర్ణపుటకే = ఆకు దొప్పయందు; శయానం = పరుండిన; శిశుం = శిశువును; దదృశే = చూచెను.

తా. మార్కండేయ మహర్షి ఆ మఱ్ఱిచెట్టును ఈశాన్యపు దిక్కునయున్న కొమ్మయందు తన తేజముచే చీకటిని పారద్రోలుచు ఆకు దొప్పయందు పరుండిన శిశువును చూచెను.

శ్లో. మహామరకత శ్యామం శ్రీమద్వదన పంకజమ్.
కంబుగ్రీవం మహోరస్కం సునాసం సుందరభ్రువమ్. **22**

అ. మహామరకతశ్యామం = గొప్పమరకత రత్నమువలె నల్లని వానిని; శ్రీమత్ = శోభగలిగిన; వదన పంకజం=పద్మమువంటి ముఖముగల వానిని; కంబుగ్రీవం=శంఖమువలె మూడురేఖలుగల మెడ గలవానిని; మహోరస్కం=విశాలమైన వక్షస్థలముగలవాని; సునాసం = చక్కనిముక్కుగల వానిని; సుందరభ్రువం=సుందరమైన కనుబొమలు గలవానిని; చూచెనని పూర్వ శ్లోకముతో అన్వయము లేదా "వీక్ష్య విస్మితః" అని ముందు శ్లోకముతో కాని అన్వయము చెప్పుకొన వచ్చును.

తా. ఆ శిశువు మరకతము వలె నల్లని వర్ణము గలవాడు, శోభించెడి పద్మము వంటి ముఖము గలవాడు, శంఖము వలె మూడు రేఖలు గల కంఠము గలవాడు, విశాలమైన వక్షస్థలము గలవాడు, చక్కనిముక్కు సుందరమైన కనుబొమలు గలవాడుగా నుండెను.

శ్లో. శ్వాసైజ దలకాభాతం కంబు శ్రీకర్ణదాడిమమ్
విద్రుమాధర భాసేష చ్ఛోణాయిత సుధాస్మితమ్. 23

అ. శ్వాస + ఏజత్ + అలక + ఆభాతం = ఊర్పులచే కదలుచున్న ముంగురులు కలవాడును కంబుశ్రీకర్ణదాడిమం = శంఖమువలె వలయాకారముగానున్న చెవులయందు దానిమ్మపూవులు గల వాడును; విద్రుమ + అధర భాసా = పగడమువంటి కెంజాయగల పెదవియొక్క కాంతిచేత; ఈషత్ + శోణాయిత సుధాస్మితః = కొంచెము నెఱ్ఱ నగుచున్న అమృతంపు లేనగవుగలవాడును

తా. మఱియు ఆశిశువు తన నిట్టూర్పులచే కదలుచున్న ముంగురులు, శంఖమువలె వలయాకారముగానున్న చెవులయందు దానిమ్మపూలు గలవాడును, పగడమువలె కెంజాయ గల పెదవికాంతి చేత కొంచెము ఎఱ్ఱనైన అమృతము వంటి చిరునగవు గలవాడుగా నుండెను.

శ్లో. పద్మగర్భారుణాపాంగం హృద్యహాసావలోకనమ్
శ్వాసైజ ద్వళిసంవిగ్న నిమ్ననాభి దళోదరమ్. 24

అ. పద్మగర్భ + అరుణ × అపాంగం = పద్మము యొక్క గర్భమువలె ఎఱ్ఱనైన కడగంటి చూపు గలవాడు, హృద్యహాస × అవలోకనం = మనస్సును హరించెడి నవ్వుతోటి చూపుగలవాడును; శ్వాస = ఊర్పులచే, ఏజత్ = కదలుచున్న; వళి = త్రిదళులచే; సంవిగ్న = చంచలమైన; నిమ్న = లోతైన; నాభి = బొడ్డు' దళ × ఉదరం = రాగియాకు వలె పలుచనైన ఉదరము కలవాడు

తా. మఱియు ఆశిశువు పద్మగర్భమువలె ఎఱ్ఱని కడకంటి చూపుగలవాడును, నిట్టూర్పులచే కదలుచున్న త్రివళులచే చలించు లోతైన నాభి, రాగియాకువలె పలుచని కడుపుగల వాడుగా నుండెను,

శ్లో. చార్వంగుళిభ్యామ్ పాణిభ్యాం ఉన్నీయ చరణాంబుజమ్
ముఖే నిధాయ విప్రేంద్ర! ధయంతం వీక్ష్య విస్మితః. 25

అ. విప్రేన్ద్ర = ఓ బ్రాహ్మణోత్తమా; చారు × అంగుళిభ్యాం = సుందరమయిన వేళ్ళుగల; పాణిభ్యాం = చేతులతో; చరణాంబుజం = పాదపద్మమును; ఉన్నీయ = తీసుకొని; ముఖే = నోటి యందు; నిధాయ = ఉంచుకొని; ధయంతం = కుడుచుచున్నవానిని; వీక్ష్య = చూచి; విస్మితః = ఆశ్చర్యము నొందెను.

తా. సుందరమైన వేళ్ళుగల చేతులతో పాదపద్మమును నోటిలో ఉంచుకొని కుడుచు చున్న శిశువును చూచిన మార్కండేయుడు ఆశ్చర్యము నొందెను

శ్లో. తద్దర్శనాద్వీత పరిశ్రమో ముదా ప్రోత్ఫుల్ల హృత్పద్మ విలోచనాంబుజః
ప్రహృష్ట రోమాద్భుత భావశంకితః ప్రష్టుం పురస్తం ప్రససార బాలకమ్. 26

అ. తద్దర్శనాత్ = ఆ బాలకుని చూచుటవన; వీత పరిశ్రమః = బడలిక పోయినవాడై; ముదా = సంతోషముచే. ప్రోత్ఫుల్ల = వికసించిన; హృత్పద్మ = హృదయపద్మము; విలోచనాంబుజః = తామర కన్నులు గలవాడునునై; ప్రహృష్ట = గగుర్పొడిచిన; రోమ = రోమములు గల; అద్భుత = ఆశ్చర్య మయిన; భావ = భావముచే; శంకితః = శంకనొందినవాడై; తం = ఆ; బాలకం = బాలకున్ని; ప్రష్టుం = అడుగుటకు; పురః = ముందుకు; ప్రససార = చేరవచ్చెను.

తా. ఆ బాలుని చూచుట వలన అలసటపోయి హృదయము కనులు వికసించినవాడై, సంతోషముతో పులకింతలురాగా ఆశ్చర్యముతో శంక గలవాడై ఆబాలునే అడుగుటకు ముందుకు చేరవచ్చెను.

శ్లో. తావ చ్ఛిశోర్వై శ్వసితేన భార్గవ సోఽంత శ్శరీరం మశకో యథా ఽవిశత్
తత్రాప్యదో న్యస్త ముదీక్ష్య కృత్స్నశో యథా పురా ముహ్యదతీవ విస్మితః 27

అ. తావత్ = అపుడు; శిశోః = బాలునియొక్క; నిశ్వసితేన = నిట్టూర్పుచేత; సః = ఆ; భార్గవః = మార్కండేయుడు; అంతశ్శరీరం = ఆ బాలుని శరీరములోపలికి యథా మశకః = దోమవలె అవిశత్ = చొచ్చెను; తత్ర + అపి = ఆ శరీరములోపలను అదః = ఈ ప్రపంచమును యథాపురా = పూర్వమువలె, న్యస్తం = ఉంచబడినదానిని; కృత్స్నశః = సంపూర్ణముగా, ఉదీక్ష్య = చూచి; అతీవ = మిక్కిలి; విస్మితః = అచ్చెరువొంది; అముహ్యత్ = మోహమును పొందెను.

తా. అపుడు ఆ బాలుని నిట్టూర్పుతో మార్కండేయుడు దోమవలె ఆ బాలుని శరీర ములోనికి ప్రవేశించి అచట కూడా ఈ జగత్తునంతను మొదట ఉన్నట్టుగా ఉన్నదానిని చూచి మిక్కిలి ఆశ్చర్యమునొంది మోహమును బొందెను.

అవ. పూర్ణముగా చూచుటను వివరించుచున్నారు.

శ్లో. ఖం రోదసీ భగణా నద్రి సాగరాన్ ద్వీపాన్ సవర్షాన్ కకుభ స్సురాసురాన్
వనాని దేశాన్ సరితః పురాకరాన్ ఖేటాన్ వ్రజా నాశ్రమ వర్ణవృత్తయః. 28

తా. ఆమార్కండేయ మహర్షి ఆబాలుని శరీరములో భూమిని, ఆకాశమును, అంతరిక్ష మును, పర్వతములను, సముద్రములను, ద్వీపములను వర్షములను, దిక్కులను, దేవతలను, అసురులను, వనములను, దేశములను, నదులను, పురములను, నిధులను కర్షకగ్రామములను, గోకులములను, బ్రహ్మచర్యాది ఆశ్రమములు గల బ్రాహ్మణ క్షత్రియాది వర్ణములను, ఆ వర్ణ ములు చేయు వేదాధ్యయనాది వృత్తులను చూచెను.

శ్లో. మహాన్తి భూతాన్యథ భౌతికాన్యసౌ కాలంచ నానాయుగ కల్పకల్పనమ్
యత్కించి దన్య ద్వ్యవహారకారణం దదర్శ విశ్వం స దివావభాసితమ్. 29

అ. అసౌ = ఈ మార్కండేయమహర్షి; మహాన్తి భూతాని = గొప్పవైన పృథివ్యాది పంచభూత ములను; అథ = మరియు; భౌతికాని = ఆ భూతములచే నేర్పడిన ప్రాణుల శరీరములను; నానాయుగ కల్ప కల్పనం = వివిధములగు కృతాదియుగములను, మహాయుగములను, కల్పములను కల్పించు;

కాలం = కాలమును; అస్వ్గత్ = ఇ ద మైన; యత్కించిత్ = ఏ యించుకయైనను, వ్యవహారకారణం = జనుల జీవయాత్రకు కారణమైన; విశ్వం = జగత్తును; సత్ + ఇవ = వాస్తవముగ నున్నదానివలె; అవ భాసితం = ఆ బాలునిచే కన్పరచబడిన దానిని; దదర్శ = చూచెను.

తా. ఆమార్కండేయ మహర్షి ఆ బాలుని శరీరములో పృథివ్యాది పంచభూతములను, పంచభూతములచేనేర్పడు ప్రాణుల శరీరములను, పలువిధములైన కృతాదియుగములను మహా యుగములను కల్పములను కల్పించు కాలమును, ప్రాణుల జీవయాత్రకు కారణమైన ప్రతి చిన్నదానిని వాస్తవముగా నున్నదానివలె ఆ బాలుడు చూపగా చూచెను.

శ్లో. హిమాలయం పుష్పవహాం చ తాం నదీం నిజాశ్రమం యత్ర ఋషి స్వపశ్యత
విశ్వం విపశ్యం చ్ఛ్వసితా చ్ఛిశోర్వై బహిర్నిరస్తో న్యపతల్లయాబ్ధౌ. 30

అ. యత్ర = ఏబాలుని ఉదరమందు; ఋషిః = మార్కండేయమహర్షి; హిమాలయం = హిమ వత్పర్వతమును; తాం = ఆ; పుష్పవహాం నదీం = పుష్పవహానదిని; నిజాశ్రమం = తన యాశ్రమమును అపశ్యత = చూచెను. విశ్వం = జగత్తును విపశ్యన్ = చూచుచు శిశోః = బాలునియొక్క, శ్వసితాత్ = శ్వాస విడుచుట వలన బహిః = వెలుపలికి; నిరస్తః = పంపబడినవాడై, లయాబ్ధౌ = ప్రళయసాగర మున అపతత్ = పడెను.

తా. ఆ మార్కండేయ మహర్షి బాలుని ఉదరములో హిమాలయమును పుష్పవహానదిని తన ఆశ్రమమును చూచెను ఇటుల ప్రపంచమును చూచుచున్న ఆ ఋషి ఆ బాలుడు శ్వాస విడుచుట వలన బయటకి వచ్చి ప్రళయసాగరములో పడెను.

శ్లో. తస్మిన్ పృథివ్యాః కకుది ప్రరూఢం వటం చ తత్పత్ర పుటే శయానమ్
బాలం చ తత్ప్రేమ సుధాస్మితేన నిరీక్షితో౽పాంగ నిరీక్షణేన. 31

అ. తస్మిన్ = ఆ; పృథివ్యాః = భూమియొక్క; కకుది ఉన్నత ప్రదేశమునందు; ప్రరూఢం = పుట్టిన; వటం = మఱ్ఱిచెట్టును; తత్ పత్రపుటే = ఆమఱ్ఱియాకు దొప్పయందు, శయానం = పడుకొని యున్న బాలంచ శిశువును కూడా, చూచి; తత్ప్రేమ సుధాస్మితేన = ఆ బాలుని ప్రేమామృతముతో లేత నవ్వుగల; అపాంగ నిరీక్షణేన = కడగంటి చూపుతో; నిరీక్షితః = చూడబడెను.

తా, వెలుపలికి వచ్చిన మార్కండేయ మహర్షి ఆ భూమి ఉన్నత ప్రదేశమున మొల చిన మఱ్ఱి చెట్టును, మఱ్ఱియాకు దొప్పయందు పడుకొనియున్న శిశువునుచూచి, ఆ శిశువు ప్రేమా మృతమునిండిన లేనగవుగల కడగంటి చూపుతో చూడబడెను.

శ్లో. అథ తం బాలకం వీక్ష్య నేత్రాభ్యాం ధిష్ఠితం హృది
అభ్యయా దతిసంహృష్టః పరిష్వక్తు మధోక్షజమ్. 32

అ. అథ = అంతట హృది = హృదయమునందు; ధిష్ఠితం = అధిష్ఠించియున్న, తం = ఆ; బాలకం = పిల్లవానిని; నేత్రాభ్యాం = కనులతో; వీక్ష్య = చూచి; అతిసంహృష్టః = మిక్కిలిసంతోషించిన వాడై; అధోక్షజం = విష్ణువైన ఆబాలుని; పరిష్వక్తుం = ఆలింగనము చేసుకొనుటకు; అభ్య యాత్ = సమీపించెను.

తా. అపుడు ఆ మార్కండేయ మహర్షి తన హృదయములో నివాసమేర్పరుచుకొనిన ఆ బాలుని తన కనులతో చూచి మిగుల ఆనందించినవాడై ఆ బాలకుని ఆలింగనము చేసి కొనుటకు సమీపించెను.

శ్లో. తావత్స భగవాన్సాక్షా ద్యోగాధీశో గుహాశయః
అంతర్దధే ఋషే స్తస్య యథే హానీశ నిర్మితా 33

అ. తావత్ = అంతలోనే; సాక్షాత్ = సాక్షాత్తుగా; యోగాధీశః = ధ్యానాదియోగములకు ప్రభువు అయిన- ఫలము నిచ్చువాడును; గుహాశయః = ప్రాణుల హృదయ కుహరమందు ఉండువాడును; భగవాన్ = భగవంతుడగు శ్రీమన్నారాయణుడు; తస్యఋషేః = ఆ మార్కండేయుడు చూచుచుండగనే; అనీశనిర్మితా = దైవబలము లేనివాడు నిర్మించిన; ఈహా యథా = క్రియవలె; అంతర్దధే = అంతర్ధానము చెందెను.

తా. ధ్యానాది యోగములకు ప్రభువు యోగాదుల ఫలములనిచ్చు శ్రీమన్నారాయణుడు ఆ మార్కండేయ మహర్షి ఆలింగనము చేసుకొనేలోపే దైవబలములేని వాని క్రియవలె అంతర్ధానము నొందెను.

శ్లో. త మన్వథ వటో బ్రహ్మన్ సలిలం లోకసంప్లవః
తిరోధాయి క్షణాదస్య స్వాశ్రమే పూర్వవత్ స్థితః. 34

అ. బ్రహ్మన్! = ఓ బ్రాహ్మణోత్తమా!, అథ = అంతట; తం అను = ఆబాలుని అనుసరించి; వటః = మఱ్ఱిచెట్టు, సలిలం = నీరు; లోకసంప్లవః = లోక ప్రళయము; క్షణాత్ = క్షణములోనే, తిరోధాయి = అంతర్ధానము నొందెను; అస్య = ఆముని చూచుచుండగనే, స్వాశ్రమే = తన యాశ్రమమున; పూర్వవత్ = మునుపటివలె; స్థితః = ఉండెను.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! అంత ఆ బాలుని అనుసరించియే మఱ్ఱిచెట్టు జలము లోక ప్రళయము క్షణములో అంతర్థానము చెందెను. ఆ మార్కండేయ మహర్షి చూచు చుండగనే మొదటివలె తన ఆశ్రమములో నుండెను.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
నవమోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
తొమ్మిదవ అధ్యాయము
ముగిసినది.

ఓమ్ తత్ సత్

# దశమోఽధ్యాయః

## పదియవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

**దశమే శివ ఆగత్య మునేస్తుష్టో వరానదాత్**
**తేన సాకమితి ప్రీత్యా సమాభాష్య సభాజయన్**

తా. ఈదశమాధ్యాయమందు శివుడు సంతుష్టుడై వచ్చి ఆ మార్కండేయ మహర్షికి వరమిచ్చి అతనితో మాటలాడి ఆనందపరచెను.

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూతమహర్షి పలికెను.

శ్లో. **స ఏవ మను భూయేదం నారాయణ వినిర్మితమ్**
**వైభవం యోగమాయాయా స్తమేవ శరణం యయౌ** 1

అ. సః = ఆ మార్కండేయ మహర్షి; నారాయణ వినిర్మితం = నారాయణ ఋషిచే నిర్మించబడిన; ఇదం = ఈ; యోగమాయాయాః = యోగమాయయొక్క; వైభవం = ప్రభావమును; ఏవం = ఈ విధముగా; అనుభూయ = అనుభవించి; తమేవ = ఆనారాయణ ఋషినే; శరణం = శరణును; యయౌ = పొందెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ఈ విధముగా నారాయణ ఋషిచే నిర్మించబడిన యోగమాయాప్రభావమును అనుభవించి ఆ నారాయణఋషినే శరణు పొందెను.

ఋషి రువాచ = మార్కండేయ మహర్షి పలికెను.

శ్లో. **ప్రపన్నోఽస్మ్యంఘ్రిమూలంతే ప్రపన్నాభయదం హరే!**
**యన్మాయయాఽపి విబుధా ముహ్యంతి జ్ఞానకాశయా.** 2

అ. హరే! = ఓ శ్రీమన్నారాయణా!; ప్రపన్న + అభయదం = శరణుపొందిన వారికి అభయము నిచ్చు, తే = నీయొక్క; అంఘ్రిమూలం = పాదమూలమును; ప్రపన్నః అస్మి = శరణుపొందితిని; యత్ + మాయయా = ఎవనిమాయచేత; విబుధా అపి = దేవతలు సైతము; జ్ఞానకాశయా = మేము జ్ఞానులము అను అహంకారముచే; ముహ్యంతి = మోహమును పొందుచున్నారు.

తా. ఓ శ్రీహరీ! నీ మాయచే దేవతలు సైతము మేము జ్ఞానులము అను అహంకారముచే మోహమును పొందుచున్నారు. కావున శరణు పొందిన వారికి అభయము నిచ్చు నీ పాదమూలమును శరణు పొందుచున్నాను.

అవ. శ్రీమన్నారాయణుడే తన మాయను చూచి మోహమును పొందిన మార్కండేయ మహర్షిని ఓదార్చెనని చెప్పుచున్నారు.

సూత ఉవాచ = సూతమహర్షి పలికెను.

శ్లో. తమేవం నిభృతాత్మానం వృషేణ దివి పర్యటన్
రుద్రాణ్యా భగవాన్ రుద్రో దదర్శ స్వగణావృతః 3

అ. ఏవం=ఈ ప్రకారముగా; నిభృతాత్మానం=సమాహిత చిత్తుడైన; తం=ఆ మునిని; వృషేణ=ఆ బోతుతో; రుద్రాణ్యా=గౌరితో, స్వగణావృతః=తన ప్రమథ గణములతో గూడిన; రుద్రః=రుద్రుడు; దివి=ఆకాశమున; పర్యటన్=పర్యటించుచు; దదర్శ=చూచెను.

తా. ఇట్లు భగవంతునియందు నిశ్చలముగా చిత్తమును నిల్పిన మార్కండేయుని, గౌరితో ఆబోతు నెక్కి, ప్రమథగణముతో ఆకసమునందు పర్యటించుచున్న రుద్రుడు చూచెను.

శ్లో. అథోమా తమృషిం వీక్ష్య గిరిశం సమభాషత
పశ్యేమం భగవన్విప్రో నిభృతాత్మేంద్రియాశయః 4

అ. అథ=అంత; ఉమా=పార్వతి; తం=ఆ; ఋషిం=మార్కండేయ ఋషిని; వీక్ష్య=చూచి, గిరిశం=శివుని గూర్చి; సమభాషత=మాటలాడెను. భగవన్!=ఓభగవంతుడా!; ఇమం=ఇతనిని; పశ్య=చూడుము; విప్రః=ఈ బ్రాహ్మణుడు; నిభృతాత్మేన్ద్రియాశయః=నిశ్చలములైనదేహము ఇంద్రియములు మనస్సుగలవాడై యున్నాడు.

తా. అంతట పార్వతి ఆ ఋషిని చూచి శంకరునితో నిటులనెను. ఓ శంకరా! ఈ బ్రాహ్మణుడు నిశ్చలమైన దేహము ఇంద్రియములు మనస్సు గలవాడుగా ఉన్నాడు. ఈ బ్రాహ్మణుని చూడుము.

శ్లో. నిభృతోర్మిఝుషవ్రాతో వాతాపాయే యథార్ణవః
కుర్వస్య తపసస్సాక్షాత్ సంసిద్ధిం సిద్ధిదో భవాన్ 5

అ. వాతాపాయే=గాలిలేనపుడు; అర్ణవః=సముద్రము; యథా=ఎటుల; నిభృతోర్మిఝుషవ్రాతః నిశ్చలములైన అలలు మత్స్యములు గలదిగా నుండునో అటుల ఈ మార్కండేయుడు ఉన్నవాడు, అస్య=ఈ మార్కండేయుని యొక్క; తపసః=తపస్సునకు; సాక్షాత్=ప్రత్యక్షముగా; సంసిద్ధిం=సంసిద్ధిని; కురు=చేయుము. భవాన్=నీవు; సిద్ధిదః=సిద్ధినిచ్చువాడవు గదా.

తా. గాలి లేనపుడు నిశ్చలములైన అలలు మత్స్యములుగల సముద్రమువలె నున్న ఈ మార్కండేయుని తపస్సునకు నీవు ప్రత్యక్షముగా సిద్ధినొసంగుము. నీవు సిద్ధినిచ్చువాడవు గదా.

శ్రీ భగవానువాచ = శ్రీ శంకరుడు పలికెను.

శ్లో. నైవేచ్ఛత్యాశిషః క్వాపి బ్రహ్మర్షి ర్మోక్ష మప్యుత
భక్తిం పరాం భగవతి లబ్ధవాన్ పురుషేఽవ్యయే 6

అ. బ్రహ్మర్షిః=బ్రహ్మర్షి; క్వాపి=ఏవిధమైన; ఆశిషః=స్వర్గాదిఫలములు; న+ఇచ్ఛతి+ ఏవ=ఏమాత్రము కోరడు; ఉత = మరియు; మోక్షం అపి=మోక్షమును గూడ కోరడు, భగవతి= భగవంతుడైన; అవ్యయే=అవ్యయుడైన; పురుషే=పురుషునియందు; పరాం=ఉత్కృష్టమైన; భక్తిం=భక్తిని; లబ్ధవాన్=పొందెను.

తా. భగవంతునియందు ఉత్కృష్టమైన భక్తిని పొందిన బ్రహ్మర్షి స్వర్గాదులను చివరికి మోక్షమును కూడా కోరడు.

శ్లో. అథాఒపి సంవదిష్యామో భవాన్యైతేన సాధునా
అయంహి పరమో లాభో నృణాం సాధు సమాగమః 7

అ. భవాని!=ఓ పార్వతీ!; అథాఒపి=అటులైనను; ఏతేన=ఈ; సాధునా=సజ్జనునితో; సంవదిష్యామః=మాటలాడెదము; నృణాం=నరులకు; సాధు సమాగమః=సజ్జనులతో సమాగమమనెడి అయం=ఇదియే; పరమః లాభః=ఉత్కృష్టమైన లాభము.

తా. ఓ పార్వతీ! అటులైనను ఈ సజ్జనునితో మాటలాడెదము. నరులకు సజ్జన సమా గమమే మంచి లాభము.

శ్లో. ఇత్యుక్త్వా తముపేయాయ భగవాన్ స సతాం గతిః
ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వర స్సర్వదేహినామ్ 8

అ. ఇతి=ఈ ప్రకారము; ఉక్త్వా=పలికి; సః=ఆ; సర్వవిద్యానాం=అన్ని విద్యలకు; ఈశానః=ప్రభువు; సర్వదేహినాం=జీవులందరికి; ఈశ్వరః=ఈశ్వరుడు; సతాం=సత్పురుషులకు; గతిః=శరణ్యుడైన; భగవాన్=భగవంతుడగు శంకరుడు; తం=ఆ మార్కండేయ మునిని; ఉపే యాయ=సమీపించెను.

తా. సత్పురుషులకు శరణ్యుడు, అన్ని విద్యలకు ప్రభువు, జీవులందరికి ఈశ్వరుడు, భగవంతుడును, శంకరుడు ఇటుల చెప్పి ఆ మార్కండేయ మునిని సమీపించెను.

శ్లో. తయో రాగమనం సాక్షాదీశయో ర్జగదాత్మనోః
నవేద రుద్ధధీవృత్తిరాత్మానం విశ్వమేవచ 9

అ. జగదాత్మనోః=జగత్స్వరూపులును; ఈశయోః=ప్రభువులును అగు; వారి; సాక్షాత్= స్వయముగ; ఆగమనం=వచ్చుటను; రుద్ధధీ వృత్తిః=అరికట్టబడిన మనోవ్యాపారముగల ఆ ముని; ఆత్మానం=తనను; విశ్వం ఏవ చ=జగత్తునుగూడ; నవేద=తెలియలేదు.

తా. మనోవ్యాపారము నరికట్టిన ఆ మార్కండేయ మహర్షి జగత్స్వరూపులు ప్రభు వులు అయిన పార్వతీ పరమేశ్వరుల రాకను,తనను ఈ ప్రపంచమును కూడా తెలియడాయెను.

శ్లో. భగవాం స్తదభిజ్ఞాయ గిరిశో యోగమాయయా
ఆవిశ త్తద్గుహాకాశం వాయు శ్ఛిద్రమివేశ్వరః 10

అ. భగవాన్=భగవంతుడగు; ఈశ్వరః=శంకరుడు; తత్=ఆ విషయమును; అభిజ్ఞాయ= తెలుసుకొని, గిరిశః=శంకరుడు; యోగమాయయా=యోగమాయచే; వాయుః=వాయువు; ఛిద్ర మివ=రంధ్రమునువలె; తత్ గుహాకాశం=అతని హృదయాకాశమును; ఆవిశత్=ప్రవేశించెను.

తా. భగవంతుడు శంకరుడు ఆవిషయమును తెలిసికొని, తన యోగమాయా బలముచే ఆ మార్కండేయుని హృదయమున ప్రవేశించెను.

శ్లో. ఆత్మన్యపి శివం ప్రాప్తం తటిత్పింగ జటాధరం
త్ర్యక్ష మష్టభుజం ప్రాంశు ముద్యంతమివ భాస్కరమ్. 11

అ. ఆత్మన్యపి=తనయందే; ప్రాప్తం=ప్రవేశించిన; తటిత్ పింగజటాధరం=మెరుపువలె పసుపు పచ్చని జటలు ధరించిన; త్ర్యక్షం=మూడుకన్నులు గలవాడిని; అష్టభుజం=ఎనిమిది భుజములు గలిగిన; ప్రాంశుం=పొడగరియైన; ఉద్యంతం=ఉదయించుచున్న; భాస్కరం ఇవ=సూర్యుని వలెనున్న; శివం=శివుని.

తా. మెఱుపు వలె పసుపు పచ్చని జటలు ధరించి, మూడు కన్నులు ఎనిమిది బాహువులు గలిగి పొడగరియై ఉదయించుచున్న సూర్యునివలె ఉంది తనహృదయములో ప్రవేశించిన శివుని చూచి ఆశ్చర్యము నొందెనని ముందుశ్లోకముతో అన్వయము.

శ్లో. వ్యాఘ్రచర్మాంబరం శూల ధనురిష్వసి చర్మభిః
అక్షమాలా డమరుగ కపాల పరశుం సహ
బిభ్రాణం సహసాభాంతం విచక్ష్య హృది విస్మితః 12

అ. వ్యాఘ్రచర్మాంబరం=వ్యాఘ్రచర్మము వస్త్రముగాగల; శూలధను రిష్వసి చర్మభిః=త్రిశూలము ధనువు; బాణము; ఖడ్గము, పులక అనువానితో, అక్షమాలాడమరుగ కపాల పరశుం=జపమాల డమరుక; కపాలము, గొడ్డలిని, సహ బిభ్రాణం=కూడ ధరించిన వాడును; సహసా=ఆకస్మాత్తుగా హృది=హృదయమునందు; భాంతం=తోచిన వానిని; విచక్ష్య=చూచి; విస్మితః=అచ్చెరువొందెను

తా. పులి చర్మమును వస్త్రముగాధరించి, శూలము ధనువు, బాణము ఖడ్గము, పులక; జపమాల, డమరుక. కపాలము, గొడ్డలని కూడా ధరించి ఆకస్మాత్తుగా హృదయమునందు తోచిన శంకరుని చూచి అచ్చెరువొందెను,

అవ. ఆశ్చర్యముతో బయటి ప్రపంచమును చూచుటను చెప్పుచున్నారు.

శ్లో. కిమిదం కుత ఏవేతి సమాధి విరతో మునిః
నేత్రే ఉన్మీల్య దదృశే సగణం సోమమాగతమ్. 13

అ ఇదం=ఇది; కిం=ఏమి?; కుత; ఏవ=ఎక్కడినుండి వచ్చినది; ఇతి=అని; మునిః=మార్కండేయ మహర్షి; సమాధి విరతః=సమాధిని చాలించి; నేత్రే=కనులను; ఉన్మీల్య=తెరిచి ఆగతం=వచ్చిన; సగణం=ప్రమథ గణముతో కూడిన; సోమం=పార్వతితో కూడిన శంకరుని; దదృశే=చూచెను.

తా, ఇదేమి? ఎటనుండి వచ్చినది? అని అచ్చెరువందిన మార్కండేయ మహర్షి సమాధిని చాలించి కనులు తెరచి ప్రమథగణముతో పార్వతితో కూడివచ్చిన శివుని చూచెను.

శ్లో. రుద్రం త్రిలోకైకగురుం ననామ శిరసామునిః 14

అ: మునిః=మార్కండేయ మహర్షి; త్రిలోకైక గురుం=మూడులోకములకు గురువైన; రుద్రం=శంకరుని; శిరసా=శిరస్సువంచి; ననామ=నమస్కరించెను.

తా. ఆ మార్కండేయ మహర్షి మూడులోకములకు గురువైన శంకరుని శిరము వంచి నమస్కరించెను.

శ్లో. తస్మై స పర్యాం వ్యదధాత్సగణాయ స హోమయా
స్వాగతాసన పాద్యార్ఘ్య గంధ స్రగ్ధూప దీపకైః 15

అ. సహ + ఉమయా = పార్వతితో కూడియున్న; సగణాయ = ప్రమధ గణముతో కూడియున్న; తస్మై = ఆ శంకరునికి; స్వాగత + ఆసనపాద్య + అర్ఘ్య గంధస్రగ్ధూప దీపకైః = స్వాగత వచనములలో; పీఠము వేయుటతో; పాద్యమొసంగి; అర్ఘ్యమిచ్చి గంధము; పూలమాలలతో; ధూప దీపములతో; సపర్యాం = శుశ్రూషను; వ్యదధాత్ = చేసెను.

తా. ఆ మార్కండేయ మహర్షి ప్రమథగణముతో పార్వతితో కూడిన శంకరునికి స్వాగతముపలికి, పీఠము వేసి, పాద్యమొసంగి, అర్ఘ్యమిచ్చి, గంధము పూలమాలలు ధూప దీపములతో శుశ్రూష చేసెను.

శ్లో. ఆహ చాత్మానుభావేన పూర్ణకామస్య తే విభో.
కరవాణి కి మీశాన యేనేదం నిర్వృతం జగత్ 16

అ. ఆత్మాను భావేన = స్వీయ ప్రభావముచే; పూర్ణకామస్య = పూర్ణకాముడవైన; యేన = యేనితో ఇదం = ఈ; జగత్ = ప్రపంచము; నిర్వృతం = సుఖశాంతులు కలిగియున్నది; అటువంటి; తే = నీకు ఈశాన! = ఓ ఈశ్వరా!; విభో! = ఓప్రభూ!; కింకరవాణి = ఏమి చేయుదును; అని ఆహచ = పలికెను

తా. సపర్యలు చేసిన మార్కండేయ మహర్షి శంకరునితో ఇటుల పలికెను. ఈ జగమును సుఖశాంతులతో ఉంచి, స్వయముగా పూర్ణకాముడవైన నీకు ఏమిచేయుదును ప్రభూ!

అవ. నిర్గుణునిగా సగుణునిగా శంకరుని స్తుతించి నమస్కరించు చున్నారు.

శ్లో. నమశ్శివాయ శాంతాయ సత్త్వాయ ప్రమృడాయచ
రజోజుషేఽథ ఘోరాయ నమస్తుభ్యం తమోజుషే 17

అ. శివాయ = శివునికి; శాంతాయ = శాంతునికి; సత్త్వాయ = సత్త్వగుణమును అధిష్ఠించినవానికి. ప్రమృడాయ = అత్యంత సుఖ స్వరూపుడు; రజోజుషే = రజోగుణమును పొందిన వానికి; ఘోరాయ = ఘోరస్వరూపునికి; (భయమును కలిగించు స్వరూపము కలిగివానికి) తమోజుషే = తమోగుణమును పొందిన; తుభ్యం = నీకు; నమః = నమస్కారము.

తా. శాంతుడు, సత్వగుణాధిష్ఠితుడు, అత్యంతసుఖస్వరూపుడు, రజోగుణమును తమోగుణమును పొంది భయమును కలిగించు స్వరూపముగల నీకు నమస్కారము.

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూత మహర్షి పలికెను.

శ్లో. ఏవం స్తుతస్స భగవాన్ మహాదేవ స్సతాం గతిః
పరితుష్టః ప్రసన్నాత్మా ప్రహసం స్తమభాషత. 18

అ. ఏవం = ఈ విధముగా. స్తుతః = స్తుతించబడినవాడై; సతాంగతిః = సత్పురుషులకు శరణ్యుడు; భగవాన్ = భగవంతుడైన; సః = ఆ, మహాదేవః = శంకరుడు; పరితుష్టః = సంతుష్టుడై;

ప్రసన్నాత్మా=ప్రసన్నమైన మనస్సు గలవాడై; ప్రహసన్=నవ్వుచు; తం=ఆ మార్కండేయ మహర్షినిగూర్చి; అభాషత=పలికెను.

తా. ఇటుల మార్కండేయునిచే స్తుతించబడిన శంకరుడు సంతోషించి, ప్రసన్నమైన మనస్సు గలవాడై ఆ మార్కండేయ మహర్షిని గూర్చి ఇటుల పలికెను.

శ్రీ భగవానువాచ=శ్రీ భగవంతుడు పలికెను,

శ్లో. **వరం వృణీష్వ తే కామం వరదేశా వయం త్రయః**
**అమోఘం దర్శనం యేషాం మర్త్యో యద్విందతేఽమృతమ్** **19**

అ. తే=నీకు; కామం=ఇష్టమైన; వరం=వరమును; వృణీష్వ=కోరుకొనుము; వయం=మేము అనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులము; త్రయః=ముగ్గురము; వరదేశాః=వరము నిచ్చు ప్రభువులము; యేషాం=ఏముమ్వురి; దర్శనం=దర్శనము; అమోఘం=విఫలముకాదో; మర్త్యః=మానవుడు, యత్=ఎవరి దర్శనము వలన; అమృతం=మోక్షమును; విందతే=పొందునో.

తా. ఓ మార్కండేయ మహర్షీ! నీకు ఇష్టమైన వరమును కోరుకొనుము, బ్రహ్మ విష్ణు మహేశ్వరులమైన మేము ముమ్వురము వరము నిచ్చువారము. మాదర్శనము ఎపుడు విఫలము కాదు. మాదర్శనము వలన మానవుడు మోక్షమును పొందును.

అవ. వరము నిచ్చుట మీ సేవయే కాని మిమ్ముల ననుగ్రహించుట కాదు. మీరు ప్రపంచమునకే పూజ్యులు అని బ్రాహ్మణులను స్తుతించుచున్నారు.

శ్లో. **బ్రాహ్మణాః సాధవః శాంతా నిస్సంగా భూతవత్సలాః**
**ఏకాంత భక్త్యా హ్యస్మాసు నిర్వైరాః సమదర్శినః** **20**

అ. బ్రాహ్మణాః=బ్రాహ్మణులు; సాధవః=సదాచారము గలవారు, శాంతాః=మత్సరాదికము లేనివారు: నిస్సంగాః=నిష్కాములు; భూతవత్సలాః=భూతదయ గలవారు; అస్మాసు=మాయందు; ఏకాంతభక్త్యా=అనన్యమైన భక్తిచే; నిర్వైరాః=వైరములేనివారు; సమదర్శినః=అన్నిప్రాణులను సమముగా చూచువారు.

తా. బ్రాహ్మణులు సదాచారము గలవారు. మత్సరాదికము లేనివారు. నిష్కాములు, భూతదయ గలవారు. మాయందు అనన్యమైన భక్తి గలవారు. సమదర్శనులు.

శ్లో. **సలోకా లోకపాలాస్తాం స్తువంత్యర్చంత్యుపాసతే**
**అహంచ భగవాన్బ్రహ్మా స్వయంచ హరిరీశ్వరః** **21**

అ. సలోకాః=లోకములతోకూడిన; లోకపాలాః=లోకపాలకులు; అహం=నేను, భగవాన్=భగవంతుడగు; బ్రహ్మా=బ్రహ్మ; స్వయం=స్వయముగ; ఈశ్వరః=ప్రభువైన; హరిః చ=విష్ణువు కూడా; తాన్=ఆ బ్రాహ్మణులను, స్తువంతి=స్తుతించుచున్నారు. అర్చంతి = పూజింతురు. ఉపాసతే = సేవింతురు.

తా. లోకములు, లోకపాలకులు, నేను, బ్రహ్మ, ప్రభువైన విష్ణువు కూడా ఆ బ్రాహ్మణులను స్తుతింతురు. పూజింతురు సేవింతురు.

అవ. బ్రాహ్మణులు పూజ్యతములనుటకు మరొక హేతువును చెప్పుచున్నారు.

శ్లో. న తే మయ్యచ్యుతేఽజే చ భిదా మణ్వపి చక్షతే
నాత్మనశ్చ పరస్యాపి తద్యుష్మాన్వయ మీమహి 22

అ. తే = ఆ బ్రాహ్మణులు; మయి = నాయందు; అచ్యుతే = విష్ణువునందు; అజేచ = బ్రహ్మయందు కూడా; అణ్వపి = కొంచెమైనను; భిదాం = భేదమును; న చక్షతే = చెప్పరు. ఆత్మనః = తనకు; పరస్య అపి = ఇతరునికిని; భేదమును చెప్పరు. తత్ = అందువలన; వయం = మేము; యుష్మాన్ = మిమ్ములను; ఈమహి = భజింతుము.

తా. బ్రాహ్మణులు నాలో, బ్రహ్మలో, విష్ణువులో ఏ కొంచెము భేదమును కూడా చెప్పరు- వారు తమకు ఇతరులకు కూడా భేదమును చెప్పరు. అందువలననే మేము మిమ్ము లను భజింతుము.

శ్లో. నహ్యమ్మయాని తీర్థాని న దేవాశ్చేతనోజ్ఝితాః
తే పునంత్యురు కాలేన దర్శనాదేవ సాధవః 23

అ. అమ్మయాని = జలరూపములైన; తీర్థాని = పుణ్యతీర్థములు; న = కావు; చేతన + ఉజ్ఝితాః చైతన్యమును వీడిన; జడములైన; దేవాః = దేవతలు; న = విగ్రహరూపములు కాదు. తే = ఆ పుణ్య తీర్థములు; దేవతలు; ఉరుకాలేన = చాలా కాలమునకు; పునంతి = పవిత్రులను జేతురు. సాధవః = భగవద్భక్తులైన సజ్జనులు; దర్శనాత్ ...ఏవ = దర్శన మాత్రముననే అనగా దర్శనమిచ్చిన వెంటనే; పునంతి = పవిత్రులను చేతురు. ఇచట ఈ శ్లోకము రెండవ పాదములో ''తేపునంత్యురుకాలేన యూయం దర్శనమాత్రతః'' అనియు పాఠాంతరము కలదు. ఆ పాఠమున; యూయం = మీరు, దర్శనమాత్రతః = దర్శనమాత్రముననే పవిత్రులను చేతురు అని అర్థము చెప్పుకొనవలయును.

తా. జలరూపము లైనవి తీర్థములు కావు. చైతన్యము లేక జడ రూపములైన విగ్రహ రూపములు దేవతలు కారు, ఆదేవతలు తీర్థములు చాలాకాలమునకు పవిత్రులను చేతురు. కాని మీలాంటి సాధువులు దర్శన మాత్రముననే పవిత్రులను చేతురు.

శ్లో. బ్రాహ్మణేభ్యో నమస్యామో యేఽస్మద్రూపం త్రయీమయమ్
బిభ్రత్యాత్మ సమాధాన తపస్స్వాధ్యాయ సంయమైః 24

అ. బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు; నమస్యామః = నమస్కరింతుము; యే = ఏబ్రాహ్మణులు ఆత్మసమాధాన = సమాహిత చిత్తముతొ; తపస్ = నియతాహారాది రూపమగు తపస్సు చేతను; స్వాధ్యాయ = వేదాధ్యయనము చేతను; సంయమైః = ఇంద్రియ నిగ్రహము చేతను; త్రయీమయం = వేదస్వరూపమైన అస్మద్రూపం = మారూపమును; బిభ్రతి = ధరించుచున్నారు

సమాహిత చిత్తముతో, నియతాహారాది రూపమగు తపస్సుతో, వేదాధ్యయనముతో, ఇంద్రియ నిగ్రహముతో వేదమయమైన మారూపమును ధరించు బ్రాహ్మణులకు నమస్క రింతుము

శ్లో. శ్రవణా ద్దర్శనాద్వాపి మహాపాతకినోఽపియే
శుద్ధ్యేరన్నంత్యజాశ్చాఽపి కిము సంభాషణాదిభిః 25

అ. యే = ఎవరు; మహాపాతకినః...అపి = బ్రహ్మహత్యాది పాపములు చేసినవారైనను; అంత్యజాః చ = చండాలురు కూడా; శ్రవణాత్ = ఉత్తమ బ్రాహ్మణుల గురించి వినుటవలన; దర్శనాద్వా అపి = చూచుట వలనను; శుద్ధ్యేరన్ = పవిత్రులగుదురు. సంభాషణాదిభిః = మాటలాడుట మొదలగు వాటిచే; కిము = పవిత్రులగుదురని వేరే చెప్పవలయునా?

తా. బ్రహ్మహత్యాది పాపములు చేసినవారు చండాలురు కూడా బ్రాహ్మణుల గురించి విన్నను బ్రాహ్మణులను చూచినను పవిత్రులగుదురనిన వారితో మాటలాడుట మొదలగునవి చేసినచో ఇంకా పవిత్రులగుదురని వేరే చెప్పవలయునా? వెంటనే పవిత్రులగుదురని తాత్పర్యము.

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూత మహర్షి పలికెను.

శ్లో. ఇతి చంద్రలలామస్య ధర్మగుహ్యోప బృంహితమ్
వచోఽమృతాయన మృషి ర్నాతృప్యత్కర్ణయోః పిబన్ 26

అ. ఇతి = ఇట్లు; చంద్రలలామస్య = చంద్రశేఖరుడైన శివుని యొక్క; ధర్మగుహ్య+ఉప బృంహితం = ధర్మరహస్యమును వివరించు; అమృతాయనం = అమృతమునకు ఆస్పదమైన; వచః = వచనమును; కర్ణయోః పిబన్ = వీనులచే ద్రావుచు; ఋషిః = మార్కండేయ మహర్షి; న+అతృప్యత్ = తనివి పొందకపాయెను.

తా. ఇట్లు చంద్రశేఖరుడు ధర్మరహస్యమును విస్తరించు, అమృతమును కురిపించు మాటలను పలుకగా, ఆ వాగమృతమును చెవులతో పానము చేయుచున్న మార్కండేయ మహర్షి తనివి నొందకపాయెను.

శ్లో. సచిరం మాయయా విష్ణో ర్భ్రామితః కర్శితో భృశమ్
శివవాగమృత ధ్వస్తక్లేశ పుంజ స్త మబ్రవీత్ 27

అ. సః = ఆమార్కండేయ మహర్షి విష్ణోః = విష్ణువుయొక్క:మాయయా = మాయచే; చిరం = చాలాకాలము; భ్రామితః = భ్రమించినవాడై; భృశం = మిక్కిలి, కర్శితః = కృశించినవాడై ; శివ = శివునియొక్క; వాగామృత = వాక్కుఅనెడు అమృతముచే; ధ్వస్త = నశించిన, క్లేశపుంజః = మనః ఖేదము గలవాడై, తం = ఆ శివునిగూర్చి అబ్రవీత్ = పలికెను.

తా. విష్ణుమాయతో చాలాకాలము భ్రమించి కృశించిన మార్కండేయ మహర్షి శివ వాగమృతముతో మనఃఖేదమును బోనాడి ఆశివునితో ఇటుల పలికెను.

మార్కండేయ ఉవాచ = మార్కండేయ మహర్షి పలికెను.

శ్లో. అహో ఈశ్వర చర్యేయం దుర్విభావ్యా శరీరిణామ్
యన్నమంతీశితవ్యాని స్తువంతి జగదీశ్వరాః 28

అ. అహో = ఔరా!; = ఇయం = ఈః ఈశ్వర చర్యా = భగవంతుని లీలః శరీరిణాం = దేహధారులకు: దుర్విభావ్యా = ఊహింప శక్యముకానిది, యత్ = ఏలీల వలనః ఈశితవ్యాని = తమచే నియమింపబడు మావంటి జీవులను; జగదీశ్వరాః = లోకపాలకులగు ఇంద్రాదులుసైతము; స్తువంతి = స్తోత్రము చేతురు.; నమంతి = నమస్కరింతెదరు.

తా. ఈశ్వరునిలీల శరీరధారుల ఊహకందనిది. ఆలీలచేతనే తమచే నియమింపబడు వారిని కూడా ఇంద్రాది లోక పాలకులు సైతము స్తుతింతురు, నమస్కరింతురు.

అవ, ఇది యంతయు లోక సంగ్రహము కొఱకే యని చెప్పుచున్నారు.

శ్లో ధర్మంగ్రాహయితుం ప్రాయః ప్రవక్తారశ్చ దేహినామ్
ఆ చరంత్యను మోద న్తే క్రియమాణం స్తువంతి చ **29**

అ. ప్రవక్తారః = ధర్మమును ప్రవచించు గురువులు; దేహినాం = దేహధారులగు మానవులకు; ధర్మం = ధర్మమును; గ్రాహయితుం = గ్రహింపజేయుటకు; ప్రాయః తఱచుగా; ఆచరంతి = తాము మార్గదర్శకులై ధర్మమును ఆచరింతురు. క్రియామాణం = ఇతరులచే చేయబడు ధర్మమును అను మోదంతే = ఆమోదించెదరు. స్తువంతిచ = స్తుతించుచున్నారు కూడా

తా. ధర్మమును ఉపదేశించువారు నరులు మొదలగువారు ధర్మమార్గమును గ్రహింపవలయు నను తలంపుతో తాము మార్గదర్శకులై ధర్మమును ఆచరింతురు. ఇతరులాచరించు ధర్మమును ఆమోదింతురు. ఆచరించువానిని స్తుతింతురు

అవ. ఓయీ ఇది నాప్రభావమును తిరస్కరించునదికదా! దీనిని నేనెటులాచరింతును. అనగా చెప్పుచున్నారు.

శ్లో. నైతావతా భగవత స్స్వమాయామయ వృత్తిభిః
న దుష్యేతాను భావస్తైర్మాయినః కుహకం యథా **30**

అ. ఏతావతా = ఇంత మాత్రముచేతనే, అనగా లోకసంగ్రహము చేతనే, స్వమాయా మయవృత్తిభిః = తనమాయస్వరూపములైన వర్తనలచే, అనగా నమస్కరించుట స్తుతించుట మొదలగు వానిచే భగవతః = భగవంతునియొక్క అనుభావః = ప్రభావమున, దుష్యేత = దూషింపబడదు. ఎటులనగా మాయినః = మాయచేయువానియొక్క కుహకం = కపట వర్తనము యథా = ఎట్లో.

తా. ఓ స్వామీ! మీరిటుల లోక సంగ్రహము కొఱకు మీ మాయా స్వరూపములైన నమస్కరించుట స్తుతించుట మొదలగువానిచే మీ ప్రభావములు తిరస్కరించబడవు. మాయ చేయువాడు తన మాయాకృత్యములకు తాను లోను కాడు కదా? ఇదియు అంతియే.

అవ. మాయా చేష్టనే వివరించు చున్నారు,

శ్లో. సృష్ట్వేదం మనసా విశ్వం ఆత్మనాను ప్రవిశ్యయః
గుణైః కుర్వద్భిరాభాతి కర్తేవ స్వప్నదృగ్యథా **31**

అ యః = ఎవడు; మనసా = మనస్సంకల్పముచే; ఇదం = ఈ; విశ్వం = ప్రపంచమును; సృష్ట్వా = సృజించి; ఆత్మనా = స్వయముగా అనుప్రవిశ్య = ప్రవేశించి కుర్వద్భిః = సృష్టాదికార్యములుచేయుచున్న; గుణైః = త్రిగుణములచే; కర్తా + ఇవ = కర్తవలె యథా = ఎటుల, స్వప్నదృక్ = స్వప్నము చూచు సాక్షివలె; ఆభాతి = ప్రకాశించుచున్నాడు.

స్వప్నమును చూచు జీవునివలె, తాము మనస్సంకల్పమున ఈ విశ్వమును సృజించి, అందు ప్రవేశించి త్రి గుణములచే చేయబడు స్వప్నాదికార్యములకు తానే కర్తయైనట్లు తోచుచున్నాడు.

శ్లో. తస్మై నమో భగవతే త్రిగుణాయ మహాత్మనే
కేవలాయాద్వితీయాయ గురవే బ్రహ్మమూర్తయే 32

అ. భగవతే = భగవంతుడగు, త్రిగుణాయ = మూడుగుణములు కలవాడు; మూడు గుణములను నియమించువాడు, మహాత్మనే = త్రిగుణములను నియమించువాడగుటచే మహాత్ముడు అయిన; కేవలాయ = ఒక్కడు (కేవలుడు) అద్వితీయాయ = తనకు రెండవది లేనివాడు; గురవే = జగద్గురువు అయిన; బ్రహ్మమూర్తయే = బ్రహ్మస్వరూపుడగు తస్మై = ఆ భగవంతునికి; నమః = నమస్కారము,

తా. భగవంతుడు మూడుగుణములు కలవాడై నను జీవునివలె మూడుగుణములచే తిరస్కృతుడు కాక మూడు గుణములను నియమించుటచే మహాత్ముడు, ఒక్కడు, తనకు రెండవది లేనివాడు, జగద్గురువు బ్రహ్మమూర్తి అయిన స్వామికి నమస్కారము.

అవ. వరమును కోరుమని చెప్పిన విషయమున తన అభిప్రాయమును తెలుపుచున్నారు.

శ్లో. కం వృణే ను వరం బ్రహ్మన్ పరం త్వద్వర దర్శనాత్
యద్దర్శనాత్పూర్ణకామ స్సత్యకామః పుమాన్ భవేత్ 33

అ. బ్రహ్మన్! = బ్రహ్మమగు ఓదేవా!; త్వత్ వరదర్శనాత్ = నీ యొక్క శ్రేష్ఠమైన దర్శనము కంటే; పరం = అధికమైన; కం ను వరం = ఏ వరమును, వృణే = కోరుదును; యత్ దర్శనాత్ = ఏ నీ దర్శనము వలన; పుమాన్ = పురుషుడు; పూర్ణకామః = స్వేచ్ఛగా సంప్రాప్తమైన సర్వానందములు గలవాడు; సత్యకామః = సత్యకాముడు; భవేత్ = అగును.

తా. ఓ దేవా! నీదర్శనము కంటె అధికమైన వరమేమి యున్నది కోరుటకు-నీదర్శనము వలననే పురుషుడు తమకు తాముగా స్వేచ్ఛతో పొందిన ఆనందము గలవాడగును.

శ్లో. వరమేకం వృణే ఒథాపి పూర్ణకామాభివర్షణాత్
భగవత్యచ్యుతే భక్తిం తత్పరేషు యథా త్వయి 34

అ. అథ + అపి = అట్లైనను; పూర్ణకామాభి వర్షణాత్ = సంపూర్ణముగ ఎల్లకోరికలను ఇచ్చు నీ వలన; ఏకం = ఒక; వరం = వరమును; వృణే = కోరుచున్నాను; భగవతి = భగవంతుడగు; అచ్యుతే = శ్రీమహావిష్ణువు నందు; తత్పరేషు = ఆ విష్ణుభక్తులందు; త్వయి యథా = నీ యందు వలె; భక్తిం = భక్తిని; వృణే = కోరుచున్నాను.

తా. నీ దర్శనము కన్న వేరే అవసరము లేకున్నను అన్నివరములను సంపూర్ణముగా నిచ్చు నీ నుండి ఒక వరమును కోరుచున్నాను. భగవంతుడు విష్ణువు నందు అతని భక్తుల యందు నీ యందువలె భక్తియుండునట్లు అనుగ్రహింపుము.

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూతమహర్షి పలికెను.

శ్లో. ఇత్యర్థితో ఒభిష్టుతశ్చ మునినా సూక్తయా గిరా
తమాహ భగవాన్శర్వ శ్శర్వాణ్యాచాభినందితః 35

అ. ఇతి = ఈ విధముగా; మునినా = మునిచేత; అర్థితః = అర్థించబడినవాడై; సూక్తయా = చక్కగా పలుకబడిన; గిరా = వాక్కుచేత; అభిష్టుతశ్చ = స్తుతించబడిన వాడునునై; శర్వాణ్యా = పార్వతి చేత; అభినందితః = అభినందించబడినవాడై, భగవాన్ = భగవంతుడగు, శర్వః = శంకరుడు; తం = ఆమార్కండేయ మహర్షిని గూర్చి, ఆహ = పలికెను.

తా. ఇటుల మార్కండేయ మహర్షిచే కోరబడినవాడై, మంచి వాక్కులతో స్తుతించబడి పార్వతితో అభినందించబడిన శంకరుడు ఆ మునితో ఇటుల పలికెను.

శ్రీ భగవానువాచ = శంకరుడు పలికెను.

**శ్లో. కామస్సర్వో మహార్షేర్భో భక్తిమాం స్త్వమధోక్షజే**
**ఆ కల్పం తే యశః పుణ్య మజరామరతా తథా** **36**

యః = ఏ; త్వం = నీవు; అధోక్షజే = శ్రీమన్నారాయణుని యందు; భక్తిమాన్ = భక్తికలవాడవు గాన, మహర్షేః = మహర్షివైన; తే = నీకు; సర్వః = అన్ని విధములుగా; కామః = కోరిక (నెరవేరునుగాక) తే = నీకు; పుణ్యం = పవిత్రమైన; యశః = కీర్తి; తథా = అటులనే; అజరామరతా = వార్ధక్యము మరణము లేకుండగా; ఆ కల్పం = కల్పాంతము (ఉండును గాక).

తా. ఓ మహర్షీ! నీవు శ్రీమన్నారాయణుని యందు భక్తిగలవాడవుగాన నీ కోరికలన్నియు తీరును. అటులనే పవిత్రమైన నీకీర్తి కల్పాంతరము వరకు స్థిరముగా నుండును. నీకు కల్పాంతరము వరకు చావు ముసలితనము ఉండవు.

**శ్లో. జ్ఞానం త్రైకాలికం బ్రహ్మన్ విజ్ఞానంచ విరక్తిమత్**
**బ్రహ్మ వర్చస్వినో భూయాత్పురాణాచార్యతాస్తు తే** **37**

అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా!; బ్రహ్మవర్చస్వినః = బ్రహ్మతేజముగల; తే = నీకు; త్రైకాలికం = భూతభవిష్యద్వర్తమానకాలములకు సంబంధించిన; జ్ఞానం = జ్ఞానము; విరక్తిమత్ = విరక్తిగల; విజ్ఞానం = ఆత్మానుభవము అస్తు = ఉండుగాక; పురాణాచార్యతా = పురాణమును ఉపదేశించగల ఆచార్యత్వము; భూయాత్ = కలుగుగాక.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! బ్రహ్మవర్చస్సు గల నీకు భూతభవిష్యద్వర్తమానములను తెలియు జ్ఞానము, విరక్తి కలుగు ఆత్మానుభవము, పురాణములనుపదేశించు ఆచార్యత్వము కలుగు గాక

సూత ఉవాచ = సూతమహర్షి పలికెను.

**శ్లో. ఏవం వరాన్సమునయే దత్వాఽగాత్ర్యక్ష ఈశ్వరః**
**దేవ్యై తత్కర్మ కథయన్ననుభూతం పురాఽమునా** **38**

అ. సః = ఆ; త్ర్యక్షః = ముక్కంటియైన; ఈశ్వరః = శివుడు; ఏవం = ఈ ప్రకారము; మనయే మార్కండేయ మునికి; వరాన్ = వరములను; దత్వా = ఇచ్చి; దేవ్యై = పార్వతీదేవికి; తత్కర్మ = ఆమార్కండేయ మహర్షి చేసిన తపస్సు మొదలగు పనిని; పురా = పూర్వము; అమునా = ఈ మార్కండేయ మహర్షి చేత; అనుభూతం = అనుభవించబడిన విష్ణుమాయా వైభవమును; కథయన్ = చెప్పుచు; అగాత్ = వెళ్ళెను.

తా. ఆ శంకరుడు ఇటుల మార్కండేయ మహర్షికి వరములనిచ్చి, ఈ మహర్షి చేసిన తపస్సును, చూచిన విష్ణుమాయా వైభవమును పార్వతీ దేవితో చెప్పుచు, కైలాసమునకు వెళ్ళెను.

శ్లో. సోఽప్యవాప్త మహాయోగమహిమా భార్గవోత్తమః
విచర త్యధునా ప్యద్ధా హరావేకాంతతాం గతః 39

అ. సః=అ; భార్గవోత్తమః అపి=భార్గవవంశ శ్రేష్ఠుడగు మార్కండేయమహర్షి కూడా; అవాప్త మహాయోగ మహిమా=పొందబడిన మహాయోగ ప్రభావము గలవాడై; హరౌ=శ్రీహరి యందు, ఏకాంతతాం=ఏకాంత భక్తిని; గతః=పొందినవాడై; అధునా+అపి=ఇప్పుడు కూడా; విచరతి=సంచరించుచున్నాడు; అద్ధా=ఆశ్చర్యము.

తా భృగువంశ శ్రేష్ఠుడైన ఆ మార్కండేయ మహర్షి కూడా మహాయోగవైభవమును పొంది, శ్రీ హరియందు ఏకాంతభక్తి కలిగి ఇపుడు సంచరించుచున్నాడు. ఎంత ఆశ్చర్యము.

శ్లో అను వర్ణితమేత త్తే మార్కండేయస్య ధీమతః
అనుభూతం భగవతో మాయావైభవ మద్భుతమ్. 40

అ. ధీమతః=బుద్ధిమంతుడైన; మార్కండేయస్య=మార్కండేయుని యొక్క; అనుభూతం=అనుభవించబడిన; అద్భుతం=ఆశ్చర్యజనకమైన; భగవతః శ్రీమన్నారాయణుని యొక్క; మాయా వైభవం=మాయావైభవముగల; ఏతత్=ఈ చరితము; తే=నీకు; అనువర్ణితం=వర్ణించబడినది.

తా బుద్ధిమంతుడైన మార్కండేయ మహర్షి అనుభవించిన అత్యద్భుతమైన విష్ణుమాయా వైభవమును మార్కండేయుని చరిత్రను నీకు చెప్పితిని.

అవ. ఇటులైనను మాకులములో పుట్టిన మార్కండేయ మహర్షి ఏడు కల్పములు యుండునని చెప్పుట కుదరదు గదా అనగా చెప్పుచున్నారు.

శ్లో. ఏతత్కేచిదవిద్వాంసో మాయా సంసృతిరాత్మనః
అనాద్యావర్తితం నృణాం కాదాచిత్కం ప్రచక్షతే 41

అ. ఏతత్=దీనిని; కేచిత్=కొందరు; అవిద్వాంసః విద్వాంసులు కానివారు; ఆత్మనః=భగవంతుని యొక్క; మాయాసంసృతిః=సృష్టిప్రళయరూపమైన మాయా సంసారము; నృణాం=నరులకు; అనాది=పుట్టుక లేనిది; ఆవర్తితం=చాలాకాలము పరిభ్రమించునది అని; కాదాచిత్కం=అకస్మాత్ గాజరిగిన దానినిగా; ప్రచక్షతే=చెప్పెదరు.

తా. ఈ మార్కండేయ మహర్షి యనుభవించిన విష్ణుమాయా వైభవము ఈశ్వరేచ్ఛచే అకస్మాత్తుగా కలిగిన ప్రళయమని, ఈ జల ప్రళయము సర్వసాధారణమని, ఇదియే దివ్యముగా సహస్రద్వయము మరల మరల తిరిగినదని కొందరు అవిద్వాంసులు చెప్పెదరు. కాని విద్వాంసులు మాత్రము మాయా శిశువుయొక్క ఏడు శ్వాసోచ్ఛ్వాసలచే ఏడు మారులు ప్రవేశ నిర్గమనులు (లోపలికి వెళ్ళి వెలుపలకు వచ్చుట) మాత్రమే సప్తకల్ప లక్షణమని చెప్పెదరు. అందువలన ఏడు కల్పములు ఉండుట కుదురును. ఏ విరోధము లేదు.

శ్లో య ఏవ మేతద్భృగు వర్యవర్తితం రథాంగపాణేరనుభావభావితం
సంశ్రావయే త్సం శృణుయాదుతోభయో స్తయోర్న కర్మాశ్రయ సంసృతిర్భవేత్

అ. యః=ఎవడు; ఏవం=ఇటుల; ఏతత్=ఈ; భృగువర్య వర్తితం=మార్కండేయ మహర్షిచరిత్రను; రథాంగపాణేః=చక్రపాణియగు శ్రీమహావిష్ణువుయొక్క; అనుభావభావితం=ప్రభావ

ముచే భావించబడిన దానిని; సంశ్రావయేత్ = వినుపించునో; ఉత = లేక; సంశృణుయాత్ = చక్కగా వినునో; తయోః = ఆ; ఉభయోః = ఇద్దరికి; కర్మాశ్రయ సంసృతిః = కర్మవాసనలను ఆశ్రయించు సంసారము; నభవేత్ = కలుగదు,

తా. శ్రీ మహావిష్ణు ప్రభావముచే భావించబడిన ఈ మార్కండేయ మహర్షి చరితమును చెప్పినవారికి వినినవారికి కర్మవాసనలచే ఏర్పడు సంసారము కలుగదు, అనగా మోక్షము కలుగునని తాత్పర్యము.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
దశమోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
పదియవ అధ్యాయము ముగిసినది

ఓం తత్ సత్

# ఏకాదశోఽధ్యాయః

## పదునొకండవ అధ్యాయము

### సంగ్రహ శ్లోకము

శ్లో. **ఏకాదశేతు పూజార్థం మహాపురుషవర్ణనమ్**
**రవేర్వ్యూహస్యచాఖ్యానం ప్రతిమాసం పృథక్ పృథక్**
**యేనామర్త్యత్వ మాపన్నో మర్త్యోసౌ భార్గవోత్తమః**
**తం పృచ్ఛతి క్రియా యోగం సాంగోపాంగాది కల్పితమ్.**

తా. ఈ ఏకాదశాధ్యాయమునందు పూజించుట కొఱకు మహాపురుష స్వరూపవర్ణనము, సూర్యుడు సపరివారుడై ప్రతిమాసమును వేరు నామములతో ఆకాశమునందు ఉదయించుచు నస్తమించుచు గన్పట్టుటను వర్ణించుట చేయబడినది. భృగుకులోత్తముడు మార్కండేయుడు మర్త్యుడై అమర్త్యమునుపొందిన క్రియాయోగమును సాంగోపాంగముగా వివరించమని శౌనకుడు సూతమహర్షిని ప్రశ్నించుచున్నాడు.

శ్రీ శౌనక ఉవాచ = శ్రీ శౌనక మహర్షి పలికెను.

శ్లో. **అథేమ మర్థం పృచ్ఛామో భవంతం బ్రహ్మవిత్తమమ్**
**సమస్త తంత్ర రాద్ధాంతే భవాన్భాగవత తత్త్వవిత్.**

అ. భాగవత=ఓ భాగవతోత్తమ! బ్రహ్మవిత్తమం=వేదము తెలిసిన వారిలో శ్రేష్ఠుడవైన భవంతం=మిమ్ములను; అథ=మరియు; ఇమం=ఈ; అర్థం=విషయమును; పృచ్ఛామః=అడుగుచున్నాము; భవాన్=మీరు; సమస్త తంత్రరాద్ధాంతే=సమస్త శాస్త్ర సిద్ధాంతములలో; తత్త్వవిత్=సత్యము తెలిసినవారు.

తా. భగవతోత్తమా! మీరు సమస్తశాస్త్రముల తత్త్వము తెలిసినవారు· వేదవేదాంగములు తెలిసినవారు. కావున మిమ్ములను ఈ విషయమును అడుగు చున్నాము.

అవ. అడుగవలసినది చెప్పుచున్నారు.

శ్లో. **తాంత్రికాః పరిచర్యాయాం కేవలస్య శ్రియః పతేః**
**అంగోపాంగా యుధాకల్పం కల్పయన్తి యదైవయైః.** 2

అ. తాంత్రికాః=పాంచరాత్రాగమము ననుసరించు విష్ణుభక్తులు; పరిచర్యాయాం=ఉపాసనా విషయమున; కేవలస్య=ఒక్కడే అయి అద్వితీయుడైన చైతన్యఘనుడైన; శ్రియః పతేః=లక్ష్మీపతికి సాంగ+ఉపాంగాః=పాదాది అంగములను అవయవములను, గరుడాదులను; సుదర్శనాది ఆయుధ

ములను; ఆకల్పం=కౌస్తు భాది ఆభరణములను; యథా కల్పం=ఏ ప్రకారముగా; యైః=ఏతత్త్వముల చేత; కల్పయంతి=కల్పించుచున్నారు.

పాంచరాత్రాగమమునననుసరించి విష్ణుభక్తులు ఒక్కడు, అద్వితీయుడు, చైతన్యఘనుడు అయిన లక్ష్మీపతికి కరచరణాది అవయవములను, గరుడాది వాహనములను, సుదర్శనాద్యాయుధములను, కౌస్తుభాద్యాభరణములను ఏవిధముగా ఏతత్త్వములచే కల్పించుచున్నారో తెలుపుము.

**శ్లో. తన్నో వర్ణయ భద్రంతే క్రియా యోగం బుభుత్సతాం**
**యేన క్రియానైపుణేన మర్త్యో యాయా దమర్త్యతామ్. 3**

అ. క్రియాయోగం=కర్మయోగమును; బుభుత్సతాం=తెలియగోరు; నః=మాకు; తత్=దానిని; వర్ణయ=తెలుపుము; తే=నీకు; భద్రం=శుభమగును; యేన=యే; క్రియానైపుణేన=కర్మయోగనైపుణ్యముచే; మర్త్యః=మరణ ధర్మముగల; నరుడు; అమర్త్యతాం=మరణ ధర్మములేకుండుట అనగా మోక్షమును; యాయాత్=పొందును.

తా, మరణ ధర్మముగల మానవుడు మరణ ధర్మములేని మోక్షమును పొందెడి కర్మయోగ నైపుణ్యమును పొందగల కర్మయోగమును తెలియగోరు మాకు ఆకర్మయోగమును వివరించుము. నీకు శుభమగును.

అవ. ఈ విషయము గురూపదేశము వలననే తెలియదగినదిగాన గురువులను నమస్కరించుచు చెప్పుచున్నాను.

శ్రీ సూత ఉవాచ = శ్రీ సూతమహర్షి చెప్పుచున్నారు.

**శ్లో. నమస్కృత్య గురూన్వక్ష్యే విభూతీర్వైష్ణవీరపి**
**యాః ప్రోక్తా వేదతంత్రాభ్యాం ఆచార్యైః పద్మజాదిభిః. 4**

అ. గురూన్=నా గురువులగు వ్యాసాదులను; నమస్కృత్య=నమస్కరించి; వేదతంత్రాభ్యాం=వేదములచే; ఆగమములచే; ఆచార్యైః=ఆచార్యులైన; పద్మజాదిభిః=బ్రహ్మ మొదలగు వారిచే; ప్రోక్తాః=చెప్పబడిన; యాః=యే; వైష్ణవీః=విష్ణువుకు సంబంధించిన; విభూతీః=ఐశ్వర్యములను విరాడ్విగ్రహాదులను గూడా; వక్ష్యే=చెప్పెదను.

తా నా గురువులగు వ్యాసాదులను నమస్కరించి, ఆచార్యులగు బ్రహ్మాదులు వేదములు ఆగమములు చెప్పిన విష్ణువునకు సంబంధించిన ఐశ్వర్యములను, విరాడ్విగ్రహాదులను కూడా చెప్పెదను.

అవ. భూమిమొదలగు వాటిచే అంగాది కల్పనను చెప్పుటకు మొదట "ఎటులకల్పించుచున్నారు" అను ప్రశ్నకు విరాట్ రూపముతో సమాధానము చెప్పుటకు విరాడ్విగ్రహమును తెలుపు చున్నారు.

**శ్లో. మాయాద్యైర్నవభి స్తత్త్వైః సవికారమయో విరాట్**
**నిర్మితో దృశ్యతే తస్మిన్ స చిత్కే భువనత్రయమ్. 5**

అ. మాయాద్యైః=మాయ మొదలగు; నవభిః=ప్రకృతి సూత్ర మహదహంకార పంచతన్మాత్రలను తొమ్మిది, సత్త్వైః=సత్త్వములచే కూడిన; సవికారమయః=ఏకాదశేంద్రియములు పంచమహాభూతములు కలిసిన షోడశ వికార స్వరూపుడైన; విరాట్=విరాట్పురుషుడు; నిర్మిత;=సృజింపబడి; దృశ్యతే=కన్పట్టుచున్నాడు; తస్మిన్=ఆ; స చిత్కే=చేతనాధిష్ఠితమైన పురుషుని యందు; భువనత్రయం=మూడులోకములు; దృశ్యతే=కన్పట్టు చున్నది.

తా. ప్రకృతి మహత్తత్త్వము, సూత్రాత్మ (హిరణ్యగర్భుడు) అహంకారము, పంచ తన్మాత్రలు అను తొమ్మిది తత్త్వములతో కూడినది, త్వక్ చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము, లను జ్ఞానేంద్రియములైదు. వాక్ పాణి పాద పాయు ఉపస్థలను కర్మేంద్రియము లైదు, మనసు ఒకటి, భూమి, జలము, అగ్ని వాయువు ఆకాశము అనుభూతము లైదు చేరి (షోడశ వికారములు) పదునారు వికారములు చేరినదై విరాట్పురుషుని విగ్రహము కన్పట్టును. ఆ విరాట్పురుషునందే ప్రాణికోటుల సమూహముతో గూడిన స్వర్గమర్త్యపాతాళము లను మూడు లోకములు కన్పట్టు చుండును. ఇవి చైతన్యాధిష్టితములు. చైతన్యము అనగా జ్ఞానము ప్రాణము. అవి కలవని తాత్పర్యము. ఇటుల విరాట్పురుషుని చెప్పుటచే అంగాది కల్పన సులభమని తెలియజేసెను.

శ్లో. ఏతద్వై పౌరుషం రూపం భూఃపాదౌ ద్యౌశ్శిరో నభః
నాభి స్సూర్యోఽక్షిణీ నాసే వాయుః కర్ణౌ దిశః ప్రభోః. **6**

అ. ప్రభోః=విరాట్ ప్రభువునకు; భూః=భూమి; పాదౌ = పాదములు; ద్యౌః = స్వర్గము; శిరః = శిరస్సు; నభః = ఆకాశము; నాభిః = బొడ్డు; సూర్యః = సూర్యుడు; అక్షిణీ = నేత్రములు; వాయుః = వాయువు; నాసే = నాసికా రంధ్రములు; దిశః = దిక్కులు; కర్ణౌ = కర్ణములు; ఏతత్ = ఇది; పౌరుషం = విరాట్పురుషుని, రూపం = రూపము

తా. ఈ విరాట్పురుషునికి పాదములు భూమి, శిరస్సు స్వర్గము, నాభి ఆకాశము, కనులు సూర్యుడు, నాసిక వాయువు, కర్ణములు దిక్కులు. ఇది విరాట్పురుషుని రూపము.

శ్లో. ప్రజాపతిః ప్రజననం అపానం మృత్యురీశితుః
తద్బాహవో లోకపాలా మనశ్చంద్రో భ్రువౌ యమః. **7**

అ. ఈశితుః = ఈశ్వరునకు; ప్రజాపతిః = ప్రజాపతి. ప్రజననం = మేఢ్రము; మృత్యుః = మృత్యువు: అపానం = అపానము; లోకపాలాః = లోకపాలకులు; తద్బాహవః = ఆ విరాట్పురుషుని బాహువులు; చంద్రః = చంద్రుడు; మనః = మనస్సు; యమః = యముడు; భ్రువౌ = కనుబొమలు.

తా, ఆ విరాట్పురుషునికి ప్రజాపతి శిశ్నము, మృత్యువు అపానము, లోకపాలకులు బాహువులు, చంద్రుడు మనస్సు, యముడు కనుబొమలు.

శ్లో. లజ్జోత్తరోఽధరో లోభో దంతా జ్యోత్స్నా స్మయో భ్రమః
రోమాణి భూరుహా భూమ్నో మేఘాః పురుషమూర్ధజాః. **8**

అ. లజ్జా సిగ్గు; ఉత్తరః+అధరః = పైపెదవి; లోభః = లోభము క్రిందిపెదవి; జ్యోత్స్న = వెన్నెల; దంతాః దంతములు; స్మయః = గర్వము; భ్రమః = భ్రాంతి, భూమ్నః = ఆనంద స్వరూపునికి; భూరుహాః = వృక్షములు; రోమాణి = రోమములు; మేఘాః = మేఘములు; పురుష మూర్ధజాః = విరాట్పురుషుని తలవెంట్రుకలు.

తా, ఆ విరాట్పురుషునికి సిగ్గు పైపెదవి, లోభము క్రిందపెదవి, వెన్నెల దంతములు గర్వము భ్రాంతి, వృక్షములు రోమములు మేఘములు తలవెంట్రుకలు.

అవ, ఇంకను చెప్పని ఇతరావయవములను ఇటులనే ఊహించుకొనవలయునని చెప్పుచున్నారు.

శ్లో. యావానయం వై పురుషో యావత్యా సంస్థయా మితః
తావానసావపి మహాన్ పురుషో లోకసంస్థయా. 9

అ. యావాన్ = ఎంతమాత్రము; అయం = ఈ; పురుషః = వ్యష్టి పురుషుడు; యావత్యా = ఎంత మాత్రము తన మానమును బట్టి; సంస్థయా = ఏడు జేనలు పొడవుగల శరీరముతో నున్నాడో; అట్లే, అసౌ మహాన్ పురుషః అపి = ఈ విరాట్పురుషుడు కూడా; తావాన్ = తన మానమును బట్టి; లోక సంస్థయా = ఏడులోకములు గూడి ఏడు జేనలు పొడవుగల తన శరీరముతో అనగా అవయవములు గూడిన దానితో; మితః = పరిమితమై యున్నాడు

తా. సామాన్యముగా వ్యష్టి పురుషుడు తన మానముతో ఎంత మాత్రముండునో అనగా ఏడు జేనలు పరిమితితో నుండునో అటులనే ఈ విరాట్పురుషుడు కూడా తన మానముచే ఏడు లోకములతో కూడి అన్ని అవయవములతో ఏడు జేనలు పరిమితి గల మానముతోనే యుండును.

అవ. ఆభరణములు మొదలగు వాటిని చెప్పుచున్నారు.

శ్లో. కౌస్తుభవ్యపదేశేన స్వాత్మజ్యోతి ర్బిభ ర్త్యజః.
తత్ప్రభాం వ్యాపినీం సాక్షాత్ శ్రీవత్సమురసా విభుః. 10

అ. అజః = జన్మాదులు లేని; విభుః = ప్రభువైన విష్ణువు; కౌస్తుభ వ్యపదేశేన = కౌస్తుభమణి యను వ్యాజమున; స్వాత్మజ్యోతిః = స్వీయమైన ఆత్మజ్యోతిని, అనగా శుద్ధమైన జీవచైతన్యమును; బిభర్తి = భరించుచున్నాడు; వ్యాపినీం = వ్యాపించిన; తత్ప్రభాం = ఆకౌస్తుభమణి తేజమును; సాక్షాత్ = ప్రత్యక్షముగా; ఉరసా = వక్షః స్థలముచే; శ్రీవత్సం = శ్రీవత్సమను పుట్టుమచ్చను; బిభర్తి = భరించుచున్నాడు.

తా. జన్మములేని మహా విష్ణువు కౌస్తుభమను వ్యాజమున శుద్ధమైన జీవ చైతన్యమును ఆ కౌస్తుభమణి తేజమును వక్షస్థలమున శ్రీవత్సమను పుట్టు మచ్చగా ధరించుచున్నాడు.

శ్లో. స్వాం మాయాం వనమాలాఖ్యాం నానాగుణమయీం దధత్
వాసశ్ఛందోమయం పీతం బ్రహ్మసూత్రం త్రివృత్స్వరమ్. 11

అ. నానా గుణమయీం = సత్త్వరజస్తమో గుణముల స్వరూపమైన; స్వాం = తన; మాయాం = యోగమాయను; వనమాలాఖ్యాం = వనమాలయను పేరు పుష్పమాలగా; ఛందోమయం = వేదముల స్వరూపమును; పీతం వాసః = పీతాంబరముగను; (పసుపుపచ్చ వస్త్రము) త్రివృత్ స్వరం = అ + ఉ + మ అనుమూడు వర్ణములుగల ప్రణవమును;(ఓంకారమును) బ్రహ్మసూత్రం = యజ్ఞోపవీతముగను; దధత్ = ధరించును.

తా. ఆ మహా విష్ణువు సత్త్వ రజస్తమో గుణముల స్వరూపమైన తన యోగమాయను వనమాలయను పుష్పమాలగా, వేదముల స్వరూపమును పీతాంబరముగా అ + ఉ + మయను మూడు వర్ణములు గల ఓంకారమును యజ్ఞోపవీతముగా ధరించుచున్నాడు.

**శ్లో. బిభర్తి సాంఖ్యం యోగం చ దేవో మకరకుండలే**
**మౌళిం పదం పారమేష్ఠ్యం సర్వలోక నమస్కృతమ్. 12**

అ. దేవః = ఆ విష్ణువు; సాంఖ్యం = సాంఖ్య శాస్త్రమును; యోగం చ = యోగశాస్త్రమును; మకర కుండలే = కర్ణములకు మకరకుండలములుగా; సర్వలోక నమస్కృతం = అన్నిలోకములచే నమస్కరించబడు; పారమేష్ఠ్యం = బ్రహ్మయొక్క; పదం = స్థానమైన సత్యలోకమును; మౌళిం = కిరీటముగా; బిభర్తి = ధరించుచున్నాడు.

తా. ఆ మహావిష్ణువు సాంఖ్య శాస్త్రమును యోగశాస్త్రమును కర్ణములకు మకర కుండలములుగా, అన్నిలోకములచే నమస్కరించబడు బ్రహ్మలోకమైన సత్యలోకమును కిరీటముగా ధరించుచున్నాడు.

**శ్లో. అవ్యాకృత మనంతాఖ్య మాసనం యదధిష్ఠితః**
**ధర్మజ్ఞానాదిభిర్యుక్తం సత్త్వం పద్మమిహోచ్యతే. 13**

అ. అవ్యాకృతం = నామరూప రహితమైన ప్రకృతి లేక ప్రధానము; అనంతాఖ్యం = అనంతుడను పేగల ఆదిశేషుడు; ఆసనం = పీఠముగనున్నది. యత్ + అధిష్ఠితః = దేనిని అధిష్ఠించియున్నవాడు; ధర్మజ్ఞాన + ఆదిభిః = ధర్మము జ్ఞానము మొదలగువానితో; యుక్తం = కూడియున్న; సత్త్వం = సత్త్వ గుణము; పద్మం = నాభియందున్న కమలమని; ఇహ = ఇందు; ఉచ్యతే = చెప్పబడుచున్నది

తా. నామరూపరహితమైన ప్రకృతి లేదా ప్రధానము అనంతుడను పేరుగల శేషుడను; పీఠముగ, ధర్మము జ్ఞానము మొదలగువానితో కూడిన సత్త్వగుణము ఆ విష్ణువు నాభికమలమని చెప్పబడుచున్నది.

**శ్లో. ఓజస్సహోబలయుతం ముఖ్యతత్త్వం గదాం దధత్.**
**అపాంతత్త్వం దరవరం తేజస్తత్త్వం సుదర్శనమ్. 14**

అ. ఓజన్ = తేజము; సహః = శక్తి; బల = బలముతో; యుతం = కూడిన; అనగా మనస్సు ఇంద్రియములు; శరీర శక్తితో కూడిన; ముఖ్యతత్త్వం = ప్రాణ తత్త్వమును; గదాం = గదగా; అపాం తత్త్వం = జలతత్త్వమును; దరవరం = ఉత్తమ శంఖముగా; తేజస్తత్త్వం = అగ్ని తత్త్వమును సుదర్శనం = చక్రముగా; దధత్ = ధరించుచున్నాడు.

తా. తేజము శక్తి బలములు అనగా మనస్సు ఇంద్రియములు శరీరముతో కూడిన ముఖ్య తత్త్వమును అనగా ప్రాణతత్త్వమును గదగా ధరించెను. "ప్రాణోవై ముఖ్యః" అను శ్రుతిచే ప్రాణము ముఖ్యతత్త్వమని చెప్పబడుచున్నది. జలతత్త్వమును శంఖముగా, అగ్ని తత్త్వమును చక్రముగా ధరించెను.

**శ్లో. నభో నిభం నభస్తత్త్వం అసిం చర్మ తమోమయమ్**
**కాలరూపం ధనుశ్శార్ఙ్గం తథా కర్మమయేషుధిమ్. 15**

అ. నభోనిభం = ఆకాశమువలె నిర్మలమైన; నభ స్తత్త్వం = ఆకాశత త్త్వమును: అసిం = ఖడ్గము గను; తమోమయం = అజ్ఞాన రూపమును; చర్మ = డాలుగను; కాలరూపం = కాలరూపమును; శార్ఙ్గం శార్ఙ్గమను; ధనుః = ధనుస్సుగను; తథా = అటులనే; కర్మమయ + ఇషుధిం = కర్మరూపమైన అమ్ముల పొదిగను; ధరించెను, అని అన్వయము.

తా. ఆకాశము వలె నిర్మలమైన ఆకాశతత్త్వమును ఖడ్గముగను, అజ్ఞానమును డాలు గను, కాలమును శార్ఙ్గమను ధనువుగను, కర్మరూపమును అమ్ముల పొదిగను ధరించెను,

శ్లో. ఇంద్రియాణి శరానాహు రాకూతి ర్యస్య స్యందనం
తన్మాత్రాణ్యస్యాభివ్యక్తి ర్ముద్రయార్థ క్రియాత్మతామ్. 16

అ. ఇంద్రియాణి = ఇంద్రియములను; శరాన్ = బాణములనుగా, ఆకూతిః = క్రియాశక్తియుక్తమైన మనస్సును; యస్య = ఏ విష్ణువునకు; స్యందనం = రథముగా; తన్మాత్రాణి = పంచతన్మాత్రలు; అస్య = ఈ రథముయొక్క; అభివ్యక్తిః = ప్రకటమైన రూపము; ముద్రయా = ధరించిన ముద్రచే; అర్థక్రియాత్మతాం = వరదాభయ రూపముగను; ఆహుః = చెప్పెదరు.

తా. ఇంద్రియములు బాణములుగా, క్రియాశక్తియుక్తమైన మనస్సు రథముగా పంచ తన్మాత్రలు ఆ రథముయొక్క ప్రకట రూపముగా ధరించిన ముద్ర వరదాభయ రూపముగా చెప్పెదరు.

శ్లో. మండలం దేవయజనం దీక్షా సంస్కార ఆత్మనః
పరిచర్యా భగవతః ఆత్మనో దురితక్షయః. 17

అ. మండలం = సూర్యమండలము లేక లోపలి అగ్నిమండలము; దేవయజనం = దేవపూజా భూమిగను; ఆత్మనః = మనస్సుయొక్క; సంస్కారః = సంస్కారము; దీక్షా = గురుకృతమైన మంత్రదీక్షగను; భగవతః = భగవంతుని యొక్క; పరిచర్యా = సేవ; ఆత్మనః = తనయొక్క; దురితక్షయః = సకల పాపక్షయమని భావించవలెను.

తా. సూర్యమండలము లేదా లోపల అగ్నిమండలము దేవపూజాప్రదేశముగను, మన శ్శుద్ధి గురువుచేత ఈయబడిన మంత్రదీక్షగను, భగవంతుని సేవ సకల పాపక్షయముగను భావించవలయును.

అవ. మొదట పీఠముగా నున్న పద్మమును గూర్చి చెప్పిరి. ఇపుడు లోపలనున్న పద్మ మును చెప్పుచున్నారు,

శ్లో. భగవాన్ భగ శబ్దార్థ లీలా కమల ముద్వహన్. 18

అ. భగవాన్ = భగవంతుడగు శ్రీమన్నారాయణుడు; భగశబ్దార్థలీలాకమలం = సమగ్రమైన ఐశ్వర్యము; ధర్మము, యశస్సు, లక్ష్మి; జ్ఞానము; వైరాగ్యము అని భగశబ్దమునకు ఆఱు అర్థములు గలవు. అట్టి అర్థములనే విలాసార్థమైన పద్మముగా; ఉద్వహన్ = వహించుచుండెను.

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు భగశబ్దమునకు అర్థమైన ఐశ్వర్యము, ధర్మము,

యశస్సు లక్ష్మి, జ్ఞానము వైరాగ్యములను, విలాసార్థమై ధరించు పద్మముగా వహించు చుండెను.

శ్లో. ధర్మం యశశ్చ భగవాన్ చామరవ్యజనేఽభజత్
అత ప్రతంతు వైకుంఠం ద్విజా ధామా కుతోభయమ్. 19

అ. భగవాన్ = భగవంతుడైన శ్రీమన్నారాయడు; ధర్మం = ధర్మమును; యశః = కీర్తిని; చామరవ్యజనే = వింజామరగా; వీవనగా; అకుతోభయం = దేని వలనను భయములేని; ధామ = నివాసమైన; వైకుంఠం = వైకుంఠమును; అతప్రతం = గొడుగుగాను; అభజత్ = భజించెను.

తా. శ్రీమన్నారాయణుడు ధర్మమును వింజామరగా, కీర్తిని విసన కఱ్ఱగా, దేనివలన భయములేని తన నివాసమైన వైకుంఠమును ఛత్రముగా ధరించెను.

శ్లో. త్రివృద్వేద స్సుపర్ణాఖ్యో యజ్ఞం వహతి పూరుషమ్.
అనపాయినీ సాక్షాత్ శ్రీ స్సాక్షాదాత్మనో హరేః 20

అ. త్రివృత్ వేదః = ఋగ్యజుస్సామములను మూడు వేదములు; సుపర్ణాఖ్యః = గరుత్మంతుడు; యజ్ఞం = యజ్ఞపురుషుడైన శ్రీమన్నారాయణుని; వహతి = వహించుచున్నాడు; సాక్షాత్ = సాక్షాత్తుగా; ఆత్మనః = పరమాత్మయైన; హరేః = శ్రీమన్నారాయణునికి; అనపాయినీ = వీడని; శక్తిః = శక్తి; శ్రీః = ప్రత్యక్షముగా నుండు లక్ష్మియగును.

తా. ఋగ్యజుస్సామవేదములు అను గరుత్మంతుడు యజ్ఞపురుషుడైన శ్రీమన్నారాయణుని వహించుచున్నాడు. ఇచట వేదములే గరుడు డనుటకు "సువర్ణోఽసి గరుత్మాన్ త్రివృత్తే శిరః" అను శ్రుతి ప్రమాణము. అటులనే శ్రీమన్నారాయణుడు యజ్ఞపురుషుడు అనుటకు "యజ్ఞోవై విష్ణుః" అను శ్రుతిప్రమాణము. సాక్షాత్తుగా పరమాత్మస్వరూపుడైన శ్రీహరిని ఎడబాయని శక్తియే లక్ష్మి ఇచట పరమాత్మ చిద్రూపుడగుటవలన, అతనిని ఎడబాయని దగుట వలన లక్ష్మి. అతని శక్తియైయున్నది.

శ్లో. విష్వక్సేన స్తంత్రమూర్తి ర్విదితః పార్షదాధిపః
నందాదయోఽష్టౌ ద్వాస్థాశ్చ తేఽణి మాద్యాహరేర్గుణాః 21

అ. తంత్రమూర్తిః = పాంచరాత్రాగమ స్వరూపుడైన; విష్వక్సేనః = విష్వక్సేనుడు; పార్షదాధిపః = సేనాపతిగా; విదితః = తెలియుము; తే = ఆ; హరేః = శ్రీవిష్ణువు యొక్క; గుణాః = గుణములైన, అష్టౌ = ఎనిమిదైన; అణిమాద్యాః = అణిమాది శక్తులు; హరేః = శ్రీహరి యొక్క; ద్వాస్థాః = ద్వారపాలకులగు; నందాదయః = నందాదులు.

తా. పాంచరాత్రాగమ స్వరూపుడైన విష్వక్సేనుడు శ్రీహరికి సేనాపతి. శ్రీహరిగుణములైన అణిమాద్యష్టసిద్ధులు శ్రీహరిద్వారపాలకులగు నందాదులుగా తెలియును.

అవ. ఆ శ్రీమన్నారాయణునే చతుర్వ్యూహములుగా ఉపాసింతురని తెలుపుచున్నారు.

శ్లో. వాసుదేవ స్సంకర్షణః ప్రద్యుమ్నః పురుషస్స్వయం
అనిరుద్ధ ఇతి బ్రహ్మన్ మూర్తివ్యూహోఽభిధీయతే 22

అ. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణోత్తమా!; స్వయం = స్వయముగా; పురుషః = శ్రీమన్నారాయణుడే వాసుదేవః = వాసుదేవుడు; సంకర్షణః = సంకర్షణుడు; ప్రద్యుమ్నః = ప్రద్యుమ్నుడు; అనిరుద్ధః = అనిరుద్ధుడు, ఇతి = అని మూర్తివ్యూహే = మూర్తివ్యూహమునందు; ఉపాస్యునిగా; అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! స్వయముగా శ్రీమన్నారాయణుడే వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు అనిమూర్తివ్యూహమునందు ఉపాసించవలయునని చెప్పుచున్నారు.

అవ. ఆ భగవంతునికే ఆధ్యాత్మమైన చతుర్విధోపాసనను తెలుపుచున్నారు,

శ్లో. స విశ్వస్తైజసః ప్రాజ్ఞ స్తురీయ ఇతి వృత్తిభిః
అర్థేంద్రియాశయ జ్ఞానైర్భగవాన్ పరిభాష్యతే. **23**

అ. సః = ఆ భగవంతుడు; విశ్వః = విశ్వుడు; తైజసః = తైజసుడు; ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు; తురీయః = తురీయుడు; ఇతి = అని; వృత్తిభిః = జాగ్రత్ సుషుప్తి స్వప్నాద్య వస్థలచేత; అర్థేంద్రియాశయజ్ఞానైః; అర్థ = బాహ్యములైన శబ్దాదులు; ఇంద్రియ = మనస్సు; ఆశయ = అర్థ మనస్సుల సంస్కారము చేత కలిగిన అజ్ఞానము; జ్ఞానైః = జ్ఞానముచేత; భగవాన్ = భగవంతుడు; పరిభాష్యతే = చెప్పబడుచున్నాడు.

తా. భగవంతుడు జాగ్రదాది అవస్థలచేతను, ఆయవస్థలకు ఉపాధులైన అర్థేంద్రియాశయజ్ఞానములచేతను విశ్వుడు తైజసుడు ప్రాజ్ఞుడు తురీయుడు అని చెప్పబడుచున్నాడు. ఇచట జాగ్రదవస్థాభిమాని విశ్వుడు, స్వప్నావస్థాభిమాని తైజసుడు, సుషుప్త్యవస్థాభిమాని ప్రాజ్ఞుడు, ఈ మూడవస్థలకు సాక్షియై తురీయుడు అని. శబ్దాదులగు విషయములచేత, మనస్సుచేత, విషయముల మనస్సుయొక్క సంస్కారముచే కలిగిన అజ్ఞానముచేత, వీటికి సాక్షియైన జ్ఞానము చేత చెప్పబడు చున్నాడు అని గ్రహించవలయును.

అవ. పైన చెప్పబడిన రెండువిధములైన చతుర్వ్యూహముల ఉపాసనచేసినను అంగాద్యుపాసన కూడా చెయవలయుననియే చెప్పుచున్నారు.

శ్లో. అంగోపాంగాయుధా కల్పైః భగవాం స్తచ్చతుష్టయమ్
బిభర్తిస్మ చతుర్మూర్తి ర్భగవాన్ హరిరీశ్వరః **24**

అ. భగవాన్ = భగవంతుడు; ఈశ్వరః = ప్రభువు అయిన; మూర్తిః = వాసుదేవ; సంకర్షణ; ప్రద్యుమ్న; అనిరుద్ధరూపుడైన చతుర్మూర్తియగు శ్రీమన్నారాయణుడు; అంగ + ఉపాంగ + ఆయుధ + ఆకల్పైః = కరచరణాద్యవయవములు: గరుడ విష్వక్సేనాది ఉపాంగములు; శంఖచక్రాద్యాయుధములు; కౌస్తుభ శ్రీవత్సాది భూషణములు అనువానితో; తత్ + చతుష్టయం = విశ్వతైజస ప్రాజ్ఞ తురీయులను నలువురను; బిభర్తిస్మ = భరించుచుండెను.

తా. వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధులను చతుర్మూర్తులతో నున్న శ్రీమన్నారాయణుడు కరచరణాద్యవయవములతోను, గరుడ విష్వక్సేనాది ఉపాంగములతోను, శంఖచక్రాది ఆయుధములతోను, కౌస్తుభ శ్రీవత్సాదిభూషణములతోను, విశ్వతైజస ప్రాజ్ఞతురీయులను భరించు చున్నాడు.

ఇటుల విశ్వతైజసాది చతుర్మూర్తిధారియగు స్వామియే బ్రహ్మాది త్రిమూర్తి రూపములను కూడా ధరించునని చెప్పుచున్నారు.

శ్లో. ద్విజ ఋషభ స ఏవ బ్రహ్మయోనిః
స్వయం దృక్ స్వమహిమ పరిపూర్ణో మాయయా చ స్వయైతత్
సృజతి హరతి పాతీత్యాఖ్యయానావృతాక్షః
వివృత ఇవ నిరుక్త స్తత్పరై రాత్మలభ్యః 25

అ. ద్విజ ఋషభ=ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా!; సః ఏషః=అయీ భగవంతుడు; బ్రహ్మయోనిః=వేదమునకు కారణము; స్వయందృక్=స్వయం ప్రకాశుడు; స్వమహిమ పరిపూర్ణః=తన మహిమచే పరిపూర్ణుడు; స్వయా=తనదైన; మాయయా=మాయచేతనే; ఏతత్=ఈ ప్రపంచమును; సృజతి=సృజించుచున్నాడు; పాతి=పాలించుచున్నాడు; హరతి=హరించుచున్నాడు; ఇతి ఆఖ్యయా=ఈ పనులు చేయు బ్రహ్మ విష్ణువు శివుడు అను పేర్ల చే; అనావృతాక్షః=పరిచ్ఛిన్నముగాని జ్ఞానము గలవాడవై; వివృత ఇవ=భిన్నుడని; నిరుక్తః=శాస్త్రములందు చెప్పబడినను; తత్పరైః=ఆ హరిభక్తులచే ఆత్మలభ్యః=ఆత్మ స్వరూపునిగనే పొందబడుచున్నాడు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! ఆ భగవంతుడే వేదమునకు మూలకారణము. స్వయం ప్రకాశుడు. స్వమహిమచే పరిపూర్ణుడు. తనమాయచే ఈ విశ్వమును బ్రహ్మయై సృజించును. విష్ణువై పాలించును. రుద్రుడై హరించుచున్నాడు. అపరిచ్ఛిన్నజ్ఞానముకల భగవంతుని శాస్త్రములు భిన్నుడని చెప్పినను అతని భక్తులు మాత్రము అతనిని ఆత్మస్వరూపునిగనే పొందుచున్నారు.

అవ. ఎవరి ఉపాసన చెప్పబడినదో ఆ భగవంతుని ప్రార్థించు చున్నారు.

శ్లో. శ్రీకృష్ణ! కృష్ణసఖ! వృష్ణ్యృషభావనిధ్రుగ్రాజన్యవంశ దహనానపవర్గవీర్య!
గోవింద! గోపవనితావ్రజ భృత్యగీత తీర్థశ్రవః శ్రవణమంగళ పాహి భృత్యాన్ 26

అ. శ్రీ కృష్ణ!=ఓ శ్రీ కృష్ణా!; కృష్ణసఖ!=అర్జునుని సఖుడా!; వృష్ణ్యృషభ=వృష్ణివంశోత్తమా!; అవని=భూమికి; ధ్రుక్=ద్రోహము చేయు; రాజన్య=రాజుల యొక్క; వంశ=వంశములను వెదురు పొదలను; దహన=దహింపచేయుట యందు; అనపవర్గ=తరగని; వీర్య=బలము గలవాడా!; గోవింద!=ఓ గోవిందా!; గోపవనితావ్రజ=గోపాంగనా సమూహము చేత; భృత్య=నీ భక్తులగు నారదాదుల చేతను; గీత=గానము చేయబడిన; తీర్థశ్రవః=పవిత్రమైన కీర్తిగలవాడా!; శ్రవణ మంగళ!=నీ కథాశ్రవణమును మంగళము గలవాడా! భృత్యాన్=నీ భక్తులను; పాహి=రక్షించుము.

తా. ఓ కృష్ణా! అర్జునుని మిత్రమా! వృష్ణివంశోత్తమా! భూమికి ద్రోహము చేయు రాజుల వంశములను దహింప చేయుటలో తరగని బలము కలవాడా! గోపవనితా సమూహము చేత భృత్యులగు నారదాదులచేత కీర్తించబడు పవిత్రమైన కీర్తిగలవాడా,! నీ కథాశ్రవణమే మంగళముగా గలవాడా! ఓ గోవిందా! నీ భక్తులను రక్షింపుము.

అవ. ఈ మహాపురుష లక్షణమును జపించువానికిని బ్రహ్మజ్ఞానము కలుగునని చెప్పుచున్నారు,

శ్లో. య ఇదం కల్య ఉత్థాయ మహాపురుష లక్షణమ్
తచ్చిత్తః ప్రయతో జప్త్వా బ్రహ్మ వేద గుహాశయమ్ 27

అ. యః=ఎవడు; కల్యే=ఉషః కాలమందు; ఉత్థాయ=లేచి; తచ్చిత్తః=ఆభగవంతునియందు చిత్తము కలవాడై; ప్రయతః=శుచియగుచు; ఇదం=ఈ; మహాపురుష లక్షణం=పూర్వోక్తమైన మహాపురుష స్వరూప స్వభావములు గల లక్షణమును; జప్త్వా=జపించి; గుహాశయం=హృదయ గుహయందున్న; బ్రహ్మ=బ్రహ్మమును; వేద=దర్శించుచున్నాడు.

తా. ప్రాతఃకాలమేలేచి, శుచియు, భగవంతునియందే, చిత్తమునుంచి, మహాపురుషుని స్వరూపమును స్వభావమును తెలుపు లక్షణమును జపించువాడు హృదయ గుహయందున్న బ్రహ్మమును తెలియును

అవ. వాసుదేవుడు సంకర్షణుడు మొదలగు వ్యూహములను చెప్పుటద్వారా సూరవి వ్యూహము స్మరించ బడినందున ఆ సూర్యుని గురించి ప్రశ్నించుచున్నారు.

శౌనక ఉవాచ = శౌనక మహర్షి పలికెను.

శ్లో. శుకో యథాహ భగవాన్ విష్ణురాతాయ శృణ్వతే
సౌరో గణోమాసి మాసి నానావసతి సప్తకః 28

అ. భగవాన్=భగవంతుడగు; శుకః=శుకమహర్షి; శృణ్వతే=భాగవత కథాశ్రవణము; చేయుచున్న! విష్ణురాతాయ=పరీక్షిన్మహా రాజునకు; యత్=దేనిని; ఆహ=చెప్పెనో; మాసి మాసి= ప్రతిమాసము నందు; సౌరః=సూర్యసంబంధమైన; గణః=గణము; నానా=నానా విధములైన; సప్తకః=సప్త సంఖ్య దేవతలు గలదై; వసతి=ఉండుచున్నదో.

తా. శుక మహర్షి భాగవత కథాశ్రవణము చేయుచున్న పరీక్షిన్మహారాజునకు ప్రతి మాసమున సూర్యగణము సప్తసంఖ్యగల దేవతలతో నివసించుట గురించి ఏది తెలిపెనో దానిని మాకు తెలుపుము.

శ్లో. తేషాం నామాని కర్మాణి సంయుక్తానా మధీశ్వరైః
బ్రూహి న శ్శ్రద్దధానానాం వ్యూహం సూర్యాత్మనో హరేః 29

అ. అధీశ్వరైః=ఆ యా ప్రభువులచే; సంయుక్తానాం=కూడియున్న; తేషాం=ఆదేవతల యొక్క; నామాని=పేర్లను; కర్మాణి=వారు చేయు పనులను; సూర్యాత్మనః=సూర్యస్వరూపుడైన హరేః=శ్రీమహా విష్ణువుయొక్క; వ్యూహం = విభాగమును; శ్రద్ధధానానాం = శ్రద్ధగల; నః = మాకు; బ్రూహి = చెప్పుము.

తా. ఆయా యధీశ్వరులచే కలసిన ఆ దేవతల పేర్లు, వారు చేయుపనులు, సూరవి స్వరూపుడైన శ్రీహరి విభాగమును శ్రద్ధతో విను మాకు చెప్పుము.

అవ, సూర్యవిభాగమును నిరూపించుటకు మొదట సూర్యస్వరూపమును చెప్పుచున్నారు.

సూత ఉవాచ = సూత మహర్షి పలికెను.

శ్లో. అనాద్య విద్యయా విష్ణో రాత్మన స్సర్వదేహినామ్
నిర్మితో లోక తంత్రోయం లోకేషు పరివర్తతే. 30

అ. ఆత్మనః = పరమాత్మయైన; విష్ణోః = శ్రీమహా విష్ణువు యొక్క: అనాది + అవిద్యయా = ఆదిలేని యోగమాయచే; సర్వదేహినాం = సర్వజీవులకును; అయం = ఈ సూర్యుడు; లోక తంత్రః = లోకయాత్రా ప్రవర్తకుడై; లోకేషు = అంతరిక్ష లోకములందు; పరివర్తతే = భ్రమణము చేయుచున్నాడు.

తా. మహావిష్ణువుయొక్క అనాదిమాయచే ఈ సూర్యుడు సమస్తజీవులకు లోకయాత్రాప్రవర్తకుడై, అంతరిక్షలోకములందు సదా భ్రమణము చేయుచున్నాడు.

అవ. అందువలన ఆ సూర్యునికి క్రియాభేదమును ఉపాధిచేతనే నానాతత్వము కాని స్వయముగా కాదని తెలుపుచున్నారు.

శ్లో. ఏక ఏవహి లోకానాం సూర్య ఆత్మాది కృద్ధరిః
సర్వవేదక్రియామూల మృషిభిర్బహుధోదితః 31

అ. లోకానాం = లోకములకు; ఆత్మా = ఆత్మ; ఆదికృత్ = సృష్టి కర్తయునగు; హరిః = శ్రీహరియే; సూర్యః = సూర్యుడు; ఏకఏవ = ఒక్కడే; ఋషిభిః = ఋషులచేత; సర్వవేదక్రియామూలం = వేదోక్తమైన యజ్ఞాది సర్వకర్మలకు కారణము అని; బహుధా = పెక్కు విధములుగా; ఉదితః = చెప్పబడినది.

తా. లోకములను ఆత్మయు సృష్టికర్తయు అయిన హరియే సూర్యుడు. అతను ఒక్కడే వేదములలో చెప్పబడిన యజ్ఞాది సర్వకర్మలకు మూలకారణమని ఋషులు పెక్కు విధములుగా చెప్పిరి.

అవ. కాలరూపధారియైన శ్రీహరియొక్క ద్వాదశాదిత్యరూపమగు భేదము క్రియోపాధికమే అని చెప్పుటకు మొదట అన్ని కర్మల ప్రవృత్తికి మాయవలన నేర్పడు తొమ్మిది భేదములను తెలుపుచున్నారు.

శ్లో. కాలో దేశః క్రియా కర్తా కరణం కార్యమాగమః
ద్రవ్యం ఫలమితి బ్రహ్మన్నవ వంజ్ఞో జయా హరిః 32

అ బ్రహ్మన్ = ఓబ్రహ్మణోత్తమా, కాలః = ప్రాతరాదికాలము; దేశః = సమమైన ప్రదేశము క్రియా = అనుష్ఠానము; కర్తా = బ్రాహ్మణాదికము; కరణం = స్రుక్స్రువాది కరణము; కార్యం = కర్తవ్యమైన విధానము; ఆగమః = వేదమంత్రాదికము; ద్రవ్యం = వ్రీహ్యాది ద్రవ్యము; ఫలం = స్వర్గాది ఫలము, ఇతి = అని; నవసంజ్ఞః = తొమ్మిది సంజ్ఞలు గలవాడుగా; హరిః = శ్రీమహా విష్ణువు.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! శ్రీ మహావిష్ణువు ప్రాతరాదికాలము, సమమైనప్రదేశము, అనుష్ఠానము, బ్రాహ్మణాదికర్త, స్రుక్స్రువాదిరూపమైన కరణము, కర్తవ్యమైన విధానము, వేదమంత్రాదికమగు ఆగమము, వ్రీహ్యాది ద్రవ్యము, స్వర్గాది ఫలము అని తొమ్మిది సజ్ఞలు కలిగి యుండును.

శ్లో. మధ్వాదిషు ద్వాదశసు భగవాన్ కాలరూప ధృక్
లోక తంత్రాయ చరతి పృథక్ ద్వాదశభి ర్గణైః 33

అ. కాలరూపధృక్ = కాలరూపధారియైన, భగవాన్ = సూర్య భగవానుడు; మధ్వాదిషు = చైత్రము మొదలగు; ద్వాదశసు = పండ్రెండు మాసములందు; ద్వాదశభిః = పండ్రెండు; గణైః = గణములతో; పృథక్ = వేరు వేరుగా; లోక తంత్రాయ = లోకయాత్రా నిర్వహణకు; చరతి = సంచరించుచున్నాడు.

తా. కాలరూప ధారియైన సూర్యభగవానుడు చైత్రము మొదలగు పండ్రెండుమాసములందు పండ్రెండు గణములతో వేరువేరుగా లోకయాత్రానిర్వహణకు సంచరించుచున్నాడు.

అవ, ఆ పండ్రెండు గణములను చెప్పుచున్నారు

శ్లో. ధాతా కృతస్థలీ హేతి ర్వాసుకి రథ కృన్మునే
పులస్త్య స్తుంబురురితి మధుమాసం నయ న్త్యమీ 34

అ. ధాతా = ధాతయనువాడు సూర్యుడు; కృతస్థలీ = కృతస్థలి యను యప్సరస; హేతిః = హేతి యను రాక్షసుడు; వాసుకిః = వాసుకియను నాగుడు; రథకృత్ = రథకృత్ అనుయక్షుడు; పులస్త్యః = పులస్త్య మహర్షి; తుంబురుః = తుంబురడను గంధర్వుడు; ఇతి = అని; అమీ = వీరు ఏడుగురు; మధుమాసం = చైత్ర మాసమును; నయంతి = అనువర్తింప జేయుచున్నారు.

తా. ధాతయను సూర్యుడు, కృతస్థలియను యప్సరస, హేతియను రాక్షసుడు, వాసుకి యను నాగుడు, రథకృత్ యను యక్షుడు, పులస్త్య మహర్షి, తుంబురుడను గంధర్వుడు, అను, ఈ యేడుగురు చైత్రమాసమును అనువర్తింప చేయుచున్నారు.

శ్లో. అర్యమా పులహోఽథౌజాః ప్రహేతిః పుంజికస్థలీ
నారదః కచ్ఛనీరశ్చ నయన్త్యేతే స్మ మాధవమ్. 35

అ. అర్యమా = అర్యమయను పేగల సూర్యుడు; పులహః = పులహుడను ఋషి, అథౌజాః = అథౌజుడను యక్షుడు; ప్రహేతిః = ప్రహేతియను రాక్షసుడు; పుంజికజికస్థలీ = పుంజస్థలియను యప్సరస; నారదః = నారదుడను గంధర్వుడు; కచ్ఛనీరః = కచ్ఛ నీరుడను నాగుడు; ఏతే = ఈ యేడుగురు; మాధవం = వైశాఖమాసమును, నయన్తి = అనువర్తింప చేయుచున్నారు.

తా. ఆర్యమయను సూర్యుడు, పులహమహర్షి, అథౌజుడను యక్షుడు, ప్రహేతియను రాక్షసుడు, పుంజికస్థలి యను యప్సరస, నారదుడను గంధర్వుడు, కచ్ఛనీరుడను నాగుడు ఈ ఏడుగురు వైశాఖమాసమును అనువర్తింపజేయుదురు.

శ్లో. మిత్రోఽత్రిః పౌరుషేయోఽథ తక్షకో మేనకా హహాః
రథస్వన ఇతి హ్యేతే శుక్రమాసం నయన్త్యమీ 36

అ. మిత్రః = మిత్రుడను సూర్యుడు; అత్రిః = అత్రియను ఋషిః పౌరుషేయః = పౌరుషేయుడను రాక్షసుడు; అథ = మఱియు; తక్షకః = తక్షకుడను నాగుడు; మేనకా = మేనకయను యప్సరస; హహాః = హహాయను గంధర్వుడు; రథస్వనః = రథస్వనుడను యక్షుడు; ఇతి = అని; ఏతే = ఈ యేడుగురు; శుక్రమానం = జ్యేష్ఠమాసమును; నయన్తి = అనువర్తింప చేతురు.

తా. మిత్రుడను సూర్యుడు, అత్రిమహర్షి, పౌరషేయుడను రాక్షసుడు, తక్షకుడను నాగుడు, మేనకయను అప్సరస, హాహాయను గంధర్వుడు, రథస్వనుడను యక్షుడు ఈయేడు గురు జ్యేష్ఠమాసమును అనువర్తింప చేతురు.

శ్లో. వసిష్ఠో వరుణో రంభా సహజన్య స్తథా హుహూః
శుక్రశ్చిత్ర స్వనశ్చైవ శుచిమాసం నయన్త్యమీ **37**

అ. వరుణః = వరుణుడను పేరుగల సూర్యుడు; వసిష్ఠః = వసిష్ఠ మహర్షి; రంభా = రంభయను యప్సరస, సహజన్యః = సహజన్యుడను యక్షుడు; తథా = అటులనే; హుహూః = హుహూయను గంధర్వుడు; శుక్రః = శుక్రుడను నాగుడు; చిత్రస్వనః = చిత్రస్వనుడను రాక్షసుడు; అమీ = ఈ యేడుగురు; శుచిమాసం = ఆషాఢ మాసమును; నయన్తి = అనువర్తింప చేసెదరు.

తా. వరుణుడను సూర్యుడు వసిష్ఠమహర్షి, రంభయను అప్సరస, సహజన్యుడను యక్షుడు, హుహూయను గంధర్వుడు, శుక్రుడను నాగుడు, చిత్రస్వనుడను రాక్షసుడు ఈ యేడుగురు ఆషాఢమాసమును అనువర్తింప చేతురు.

శ్లో. ఇంద్రో విశ్వావసుః శ్రోతా ఏలాపత్ర స్తథాఽంగిరాః
ప్రమ్లోచా రాక్షసో వర్యో నభోమాసం నయన్త్యమీ **38**

అ. ఇంద్రః = ఇంద్రుడను సూర్యుడు; విశ్వావసుః = విశ్వావసువు గంధర్వుడు; శ్రోతా = శ్రోతయను యక్షుడు; ఏలాపత్రః = ఏలాపత్రుడను నాగుడు; తథా = అటులనే; అంగిరాః = అంగిరఋషి; ప్రమ్లోచా = ప్రమ్లోచ యను అప్సరస; రాక్షసః = రాక్షసుడైన వర్యః = వర్యుడు; అమీ = ఈ యేడుగురు; నభోమాసం శ్రావణమాసమును; నయన్తి అనువర్తింప జేసెదరు.

తా. ఇంద్రుడను సూర్యుడు, విశ్వావసువు అను గంధర్వుడు, శ్రోతయను యక్షుడు ఏలాపత్రుడను నాగుడు, అంగిర ఋషి, ప్రమ్లోచయను యప్సరస, రాక్షసుడైన వర్యుడు అను ఈ యేడుగురు శ్రావణమాసమును అనువర్తింప చేతురు.

శ్లో. వివస్వానుగ్రసేనశ్చ వ్యాఘ్ర ఆసారణో భృగుః
అనుమ్లోచా శంఖపాలో నభస్యాఖ్యం నయన్త్యమీ **39**

అ. వివస్వాన్ = వివస్వానుడగు సూర్యుడు; ఉగ్రసేనః = ఉగ్రసేనుడను గంధర్వుడు; వ్యాఘ్రః = వ్యాఘ్రుడను రాక్షసుడు, ఆసారణః = ఆసారణుడను యక్షుడు; భృగుః = భృగుమహర్షి; అనుమ్లోచా అనుమ్లోచయను అప్సరస; శంఖపాలః = శంఖపాలుడను నాగుడు; అమీ = ఈయేడుగురు; నభస్యాఖ్యం = భాద్రపదమాసమును; నయన్తి = అనువర్తింప చేసెదరు.

తా. వివస్వంతుడను సూర్యుడు, ఉగ్రసేనుడను గంధర్వుడు, వ్యాఘ్రుడను రాక్షసుడు ఆసారణుడను యక్షుడు, భృగుమహర్షి. అనుమ్లోచయను అప్సరస, శంఖపాలుడను నాగుడు, అను ఈ యేడుగురు భాద్రపదమాసమును అనువర్తింప చేసెదరు

---

వ. అదియెయ్యది యనిన. లోక చక్షువు చైత్రమాసంబున మొదలుగా నేయే మాసంబుననేయే నామంబున ప్రవర్తించు చెప్పవే అని యడిగిన జైత్రము మొదలగు ద్వాదశ మాసంబుల పౌరగణ సప్తకంబీశ్వర నియుక్తంబై, నానా ప్రకారంబుల సంచరించెడు క్రమము తొల్లి శుకుండు విష్ణురాతునికి

శ్లో. పూషా ధనంజయో వాతః సుషేణ స్సురుచి స్తథా
ఘృతాచీ గౌతమశ్చేతి తపోమాసం నయ న్త్యమీ 40

అ. పూషా = పూషయను పేరుగల సూర్యుడు; ధనంజయః = ధనంజయుడను నాగుడు; వాతః వాతుడను రాక్షసుడు; సుషేణః = సుషేణుడను గంధర్వుడు; సురుచిః = సురుచియను యక్షుడు; ఘృతాచీ = ఘృతాచియను అప్సరస; గౌతమః = గౌతమ మహర్షి; అమీ = ఈ యేడుగురు; తపో మాసం = మాఘమాసమును; నయ న్తి = అనువర్తింప చేసెదరు.

తా. పూషయను పేరునుసూదాల్చిన సూర్యుడు, ధనుంజయుడను నాగుడు, వాతుడను, రాక్షసుడు సుషేణుడను గంధర్వుడు, సురిచి యను యక్షుడు, ఘృతాచి యను యప్సరస, గౌతమ మహర్షి అను ఈ యేడుగురు మాఘమాసమును గడుపుచుందురు.

శ్లో. క్రతుర్వర్చా భరద్వాజః పర్జన్యః సేనజిత్తథా
విశ్వ ఐరావతశ్చైవ తపస్యాఖ్యం నయన్త్యమీ. 41

అ. పర్జన్యః = పర్జన్యుడను పేరుగల సూర్యుడు; క్రతుః = క్రతువను యక్షుడు; వర్చా = వర్చుడను రాక్షసుడు; భరద్వాజః = భరద్వాజ మహర్షి; సేనజిత్ = సేనజిత్ అను అప్సర; విశ్వః = విశ్వుడను యక్షుడు ఐరావతః = ఐరావతుడను నాగుడు; అమీ = ఈ యేడుగురు; తపస్యాఖ్యం = ఫాల్గుణ మాసమును; నయంతి = గడిపెదరు

తా పర్జన్యుడను పేరుగల సూర్యుడు, క్రతువను యక్షుడు, వర్చుడను రాక్షసుడు, భరద్వాజ మహర్షి, సేనజిత్ అను యప్సరస, విశ్వుడను యక్షుడు, ఐరావతుడను నాగుడు, ఈ యేడుగురు ఫాల్గుణమాసమును గడిపెదరు.

శ్లో. అథాంశుః కశ్యప స్తార్క్ష్య ఋతసేన స్తథోర్వశీ
విద్యు చ్ఛత్రుర్మహాశంఖ స్సహో మాసం నయ న్త్యమీ. 42

అథ = మఱియు; అంశుః = అంశువను పేరుగల సూర్యుడు; కశ్యపః = కశ్యపమహర్షి; తార్క్ష్యః తార్క్ష్యుడను యక్షుడు; ఋతసేనః = ఋతసేనుడను గంధర్వుడు; తథా = అటులనే; ఊర్వశీ = ఊర్వశి

దెలిపిన చందంబున జెప్పెద, అని సూతుండిట్లనియె. శ్రీమన్నారాయణ స్వరూపుండగు మార్తాండుండే క స్వరూపుండైన. నతనిం గాలదేశక్రియాది భేదంబులం బట్టి ఋషులనేక క్రమంబుల నభివర్ణించి భావింపు చున్నారు. ఆ ప్రకారం బెట్లనిన, చైత్రంబున సూర్యుండు ధాతయును నామంబు దాల్చి కృత స్థలి హేతి వాసుకి రథకృత్తు పులస్త్యుడు తుంబురుడు అనెడు పరిజనులతో జేరికొని సంచరింపుచుండు వైశాఖంబున ఆర్యముండను పేరు వహించి, పులహుడు ఓజుడు ప్రహేతి పుంజికస్థల నారదుడు కంజనీరుండను ననుచర సహింతుడై, కాలంబు గడుపుచుండు జ్యేష్ఠంబున మిత్రుండను నభిధేయ ధరుండై, అత్రి పౌరుషేయుడు తక్షకుండు మేనక హాహా రథస్వనుడు అనెడు వారితో చేరి కాలయాపన సేయుచుండు ఆషాఢంబున వరుణుండను నాహ్వయంబునొంది, వసిష్ఠుడు రంభ సహజన్యుండు హూహువు శుక్రుండు చిత్ర స్వనుండు అను సహచర సహితుండై; కాలక్షేపణము సేయుచుండును. శ్రావణంబున ఇంద్రుండను నామముచే వ్యవహృతుడై; విశ్వావసువు శ్రోత యేలా పుత్రుండు అంగిరస్సు ప్రమ్లోచ రాక్షసుడు చర్యుడు అను సభికులతో జేరి కాలంబు నడుపుచుండు. భాద్రపదంబునవివస్వంతు డనునామంబుదాల్చి, ఉగ్రసేనుండు వ్యాఘ్రుండు ఆసారణుండు భృగువు అనుమ్లోచ శంఖపాలుండు అను పరిజనావృతుండై కాలయాపనంబు సేయుచుండు.

యనుయప్సరస; విద్యుచ్ఛత్రుః=విద్యుచ్ఛత్రుడను రాక్షసుడు; మహాశంఖః=మహాశంఖుడనునాగుడు; అమీ=ఈ యే డుగురు;సహోమాసం=మార్గ శిరమాసమును; నయన్తి=ప్రవర్తింపజేయుదురు.

అంశువను పేరును ధరించిన సూర్యుడు, కశ్యప మహర్షి తార్క్ష్యుడను యక్షుడు, ఋత సేనుడను గంధర్వుడు ఊర్వశి యను యప్సరస, విద్యుచ్ఛత్రుడను రాక్షసుడు, మహాశంఖు డను నాగుడు ఈ యేడుగురు మార్గశిరమాసమును ప్రవర్తింప చేయుదురు.

శ్లో. భగస్స్ఫూర్జోఽరిష్టనేమి రూర్ణ ఆయుశ్చ పంచమః
కర్కోటకః పూర్వచిత్తిః పౌషమాసం నయన్త్యమీ. 43

అ. భగః=భగుడను సూర్యుడు; స్ఫూర్జః=స్ఫూర్జుడను రాక్షసుడు; అరిష్టనేమిః=అరిష్ట నేమియను గంధర్వుడు; ఊర్ణః=ఊర్ణుడను యక్షుడు; ఆయుః=ఆయువను ఋషి; కర్కోటకః= కర్కోటకుడను నాగుడు; పూర్వచిత్తిః=పూర్వచిత్తియను అప్సరస; అమీ=ఈ యేడుగురు; పౌష మాసం=పుష్యమాసమును; నయన్తి=ప్రవర్తింప చేతురు.

తా. భగుడను సూర్యుడు, స్ఫూర్జుడను రాక్షసుడు, అరిష్టనేమియను గంధర్వుడు, ఊర్ణుడను యక్షుడు. ఆయుమహర్షి, కర్కోటకుడను నాగుడు, పూర్వచిత్తి యను యప్సరస ఈ యేడుగురు పుష్యమాసమును ప్రవర్తింప చేతురు.

శ్లో. త్వష్టా ఋచీక తనయః కబళాశ్వస్తిలోత్తమా
బ్రహ్మపేతోఽథ శతజిద్ధృతరాష్ట్ర ఇషంభరాః. 44

అ. త్వష్టా=త్వష్టయను సూర్యుడు; ఋచీకతనయః=ఋచీకుని పుత్రుడగు జమదగ్ని మహర్షి కబళాశ్వః=కబళాశ్వుడను నాగుడు; తిలోత్తమా=తిలోత్తమయను అప్సరస; బ్రహ్మపేతః=బ్రహ్మ పేతుడను రాక్షసుడు; అథ=మఱియు; శతజిత్=శతజిత్తు అను:యక్షుడు ధృతరాష్ట్రః=ధృతరాష్ట్రు డను గంధర్వుడు; ఇషంభరాః=ఆశ్వయుజ మాసమును భరంచెడువారు.

తా. త్వష్టయను పేరుగల సూర్యుడు, ఋచీకుని కుమారుడగు జమదగ్ని మహర్షి, కబ, ళాశ్వుడను నాగుడు, తిలోత్తమ యను యప్సరస, బ్రహ్మపేతుడను రాక్షసుడు, శతజిత్తు యను యక్షుడు. ధృతరాష్ట్రుడను గంధర్వుడు ఈ యేడుగురు ఆశ్వయుజమాసమును ప్రవ ర్తింప జేయువారు.

శ్లో. విష్ణురశ్వతరో రంభా సూర్యవర్చాశ్చ సత్యజిత్
విశ్వామిత్రో మఖాపేతో ఊర్జమాసం నయన్త్యమీ. 45

అ. విష్ణుః=విష్ణువనుపేరుగల సూర్యుడు; అశ్వతరః=అశ్వతరుడను నాగుడు, రంభా=రంభ యను అప్సరస;సూర్యవర్చాః=సూర్యవర్చుడను గందర్వుడు; సత్యజిత్=సత్యజిత్ యను యక్షుడు; విశ్వామిత్రః=విశ్వామిత్ర మహర్షి; మఖాపేతః=మఖాపేతుడను రాక్షసుడు; అమీ=ఈ యేడుగురు ఊర్జమాసం=కార్తికమాసమును నయన్తి=ప్రవర్తింప చేయుదురు.

తా. విష్ణువను పేరుగల సూర్యుడు, అశ్వతరుడను నాగుడు, రంభయను యప్సరస సూర్యవర్చుడను గంధర్వుడు, సత్యజిత్తుడను యక్షుడు, విశ్వామిత్ర మహర్షి, మఖాపేతుడను రాక్షసుడు. అను ఈ యేడుగురు కార్తిక మాసమును ప్రవర్తింప చేయుదురు.

శ్లో. ఏతా భగవతో విష్ణో రాదిత్యస్య విభూతయః
స్మరతాం సంధ్యయోర్నౄణాం హరంత్యంహో దినేదినే. 46

అ. ఏతాః = వీరు; ఆదిత్యస్య = ఆదిత్యుడైన; విష్ణోః భగవతః = విష్ణు భగవానుని యొక్క; విభూతయాః = విభూతులు; దినే దినే = ప్రతిదినమున; సంధ్యయోః = ప్రాతః సాయం సంధ్యలయందు స్మరతాం = స్మరించు. నౄణాం = నరులయొక్క; అంహః = పాపమును; హరంతి = హరింతురు.

తా. పైన చెప్పబడిన వీరు సూర్యరూపుడైన విష్ణుభగవానుని విభూతులు. ఈ విభూతులను ప్రాతఃకాలము సాయంకాలము స్మరించు నరుల పాపములు తొలగిపోవును,

అవ. వీరు చేయు వేరు వేరు పనులను విడిగా చెప్పుచున్నారు.

శ్లో. ద్వాదశ స్వపి మాసేషు దేవోఽసౌ షడ్భిరస్యవై
చరన్సమంతాత్తనుతే పరత్రేహ చ సన్మతిమ్. 47

అ. ద్వాదశసు = పండ్రెండు; మాసేషు + అపి = నెలలందును; అసౌ = ఈ; దేవః = సూర్య భగవానుడు: అస్య = ఇతని యొక్క షడ్భిః = ఆరుగణములచే; సమంతాత్ = అంతటః చరన్ = తిరుగుచు; పరత్ర = పరలోకమందును; ఇహ చ = ఈ లోకమందును; సన్మతిమ్ = వివేకమును; తనుతే = విస్తరించుచున్నాడు.

తా. ఈ సూర్యభగవానుడు తన ఆరుగురితో పండ్రెండు మాసములలోను అంతటతిరుగుచు ఈలోకమున, పరలోకమున వివేకమును కలిగించును.

శ్లో. సామర్గ్యజుర్భిస్తల్లింగైః ఋషయః సంస్తువన్త్యముమ్
గంధర్వాస్తం ప్రగాయన్తి నృత్యన్త్యప్సరసోఽగ్రతః. 48

అ. ఋషయః = ఋషులు; తల్లింగైః = ఆ సూర్యసంబంధమైన; సామ + ఋక్ = యజుర్భిః = సామము ఋక్ యజస్సు అనుమూడువేదములచే; అముం = ఈ సూర్యభగవానుని; స్తువంతి = స్తుతించుచున్నారు; గంధర్వాః = గంధర్వులు; తం = ఆ సూర్యునిగూర్చి; ప్రగాయన్తి = పాడుదురు; అప్సరసః = అప్సరసలు, అగ్రతః = ఆ సూర్యునిముందు; నృత్యన్తి = నాట్యము చేయుదురు.

తా. ఋషులు సూర్యసంబంధమైన సామఋక్ యజుర్వేదములతో సూర్యుని స్తుతించెదరు. గంధర్వులు సూర్యునిగురించి గానము చేతురు అప్సరసలు అతని ముందు నృత్యము చేతురు.

శ్లో. ఉన్నహ్యన్తి రథం నాగా గ్రామణ్యో రథయోజకాః
చోదయన్తి రథంపృష్ఠే నైరృతా బలశాలినః 49

అ. రథయోజకాః = రథమునకు పగ్గములుగా గూర్చబడిన; గ్రామణ్యః = శ్రేష్ఠములైన = నాగాః = నాగులు; రథం = రథమును; ఉన్నహ్యంతి = పట్టియుందురు, లేదా వహింతురు.; బలశాలినః = బలవంతులైన నైఋతాః = రాక్షసులు; పృష్ఠే = వెనుకనుండి; రథం = రథమును; చోదయంతి = నెట్టుదురు.

తా. రథమునకు పగ్గములుగా గూర్చబడిన నాగశ్రేష్ఠులు రథమును వహింతురు. బలవంతులైన రాక్షసులు రథమును వెనుకనుండి నెట్టుదురు.

శ్లో. వాలఖిల్యా సహస్రాణి షష్టిర్బ్రహ్మర్షయోఽమలాః
పురతోఽభిముఖం యాన్తి స్తువన్తి స్తుతిభిర్విభుమ్. 50

అ. షష్టిః సహస్రాణి = అరువదివేలు; వాలఖిల్యాః = వాలఖిల్యులను; అమలాః = నిర్మలస్వభావులు అయిన, బ్రహ్మర్షయః = బ్రహర్షులు; పురతః = ముందు; అభిముఖం = ఎదురుగా నుండుచు; యాంతి = వెళ్ళుదురు; స్తుతిభిః = స్తుతిమంత్రములచేత; విభుం = సూర్యభగవానుని; స్తువన్తి = స్తోత్రముచేయుదురు

తా. నిర్మలస్వభావులైన అరువదివేలమంది వాలఖ్యిల మహర్షులు సూర్యభగవానునకు అభిముఖముగా వెళ్ళుచు స్తుతిమంత్రములచే స్తోత్రము చేయుదురు.

శ్లో. ఏవం హ్యనాది నిధనో భగవాన్ హరిరీశ్వరః
కల్పే కల్పే స్వమాత్మానం వ్యూహ్య లోకానవత్యజః 51

అ. ఏవం = ఈప్రకారముగా; అనాది నిధనః = ఆద్యంతములేని; అజః = పుట్టుకలేని; భగవాన్ = భగవంతుడు, ఈశ్వరః = ప్రభువగు; హరిః = శ్రీ మహావిష్ణువు, కల్పే కల్పే = ప్రతి కల్పమునందు; స్వం ఆత్మానం = పరమాత్మయైన తనను, వ్యూహ్య = విభజించి; లోకాన్ = లోకములను; అవతి = రక్షించును.

తా. ఈ ప్రకారముగా ఆద్యంతములు లేనివాడు, భగవంతుడు, ప్రభువు అగు శ్రీమహావిష్ణువు ప్రతికల్పమునందు తనను విభజించి లోకములను కాపాడును.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
ఏకాదశోఽధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమున ద్వాదశస్కంధమున
పదునొకొండవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్.

---

కం. ధరలో ద్వష్టాహ్వయము ను బిరుదుగ ధరియించి యెపుడు బెంపు దలర్పన్
జరియించుచు నభమందును సరసిజహిత డాశ్వయుజము చయ్యన గడపున్.

వ. ఈ మాసంబున ఋచీకతనయుండు కబళాశ్వుండు తిలోత్తమ బ్రహ్మపేతుండు, శతజిత్తు; ధృతరాష్ట్రుండు అను సభ్యులతో జేరికొని, కాలంబున నడుపుచుండు, కార్తికమాసంబునందు విష్ణువని వ్యవహరింపబడి; అశ్వతరుడు రంభ సూర్యవర్చస్సు సత్యజిత్తు విశ్వామిత్రుడు మఖాపేతుడు అను పరిజన వర్గముతో గూడి కాలంబు నడుపుచుండు. మార్గశిరంబునందు అర్యమనామ వ్యవహృతుడై కశ్యపుండు తార్క్ష్యుండు ఋతసేనుండు ఊర్వశి విద్యుచ్ఛత్రుండు మహాశంఖుండు అనెడు నను చరులం గూడి చరింపుచునుండు. పుష్యమాసంబున భగుండను నామంబుదాల్చి, స్ఫూర్జుండు అరిష్టనేమి ఊర్ణుండు ఆయువు కర్కోటకుండు పూర్వచిత్తి అనెడుసభ్యజన పరివృత్తుండై కాలక్షేపణము సేయుచుండు. మాఘమాసంబునందు పూషాహ్వయము వహించి ధనంజయుండు వాతుండు సుషేణుడు సురుచి ఘృతాచి గౌతముండు అను పరిజన పరివృతుండై చరియింపుచుండు.

క. క్రతునామంబు ధరించియు జతురత బాలింపుచుండు జాతుర్యకళా
రతుడై సహస్ర కిరణుడు మతియుతులౌ నన దపస్య మానము లీలన్.

వ. అందు వర్చసుండు భరద్వాజుండు పర్జన్యుండు సేనజిత్తు విశ్వేదేవతలు ఐరావతుండు అను వారలతో జేరుకొని కాలయాపనంబు సేయుచుండు. ఇట్లు ద్వాదశ మాసంబుల నపరి మేయ విభూతులచే దేజరిల్లుచు, నుభయసంధ్యల నుపాసించుచు జనుల పాప సంఘంబుల నున్మూలంబు సేయుచు బ్రతిమాసంబును పూర్వోక్త పరిజన షట్కంబు వెంటనంట నుభయలోక నివాసులగు జనంబుల కైహికాముష్మిక ఫలంబుల నొసంగుచు, ఋగ్యజుస్సామథర్వ మంత్రంబుల బఠియింపుచు ఋషి సంఘంబులు స్తుతియింప, బురోభాగంబున నప్సరసలాడ, గంధర్వులు పాడ, బ్రహ్మవేత్తలగు నరువది వేల వాలఖిల్య మహర్షు లభిముఖులై స్తుతియింపుచు నరుగ, నధిక బలవేగ రాజమానంబులగు నాగరాజంబులు రథోన్నయనంబు సలుప బాహాబల ప్రతిష్ఠా గరిష్ఠులగ నైరృత శ్రేష్ఠులు రథపృష్ఠ భాగంబు మోచి త్రోయుచుండ, ననాది నిధనుండు నాదిత్యుండు ప్రతి కల్పంబున నిట్లు కాలయాపనంబు సేయుచు దేజరిల్లుచుండు. అట్లు గావున నివియన్నియు వాసుదేవ మయంబులుగా దెలియుము. అని పౌరాణికోత్తముండగు సూతుండు, శుకయోగీంద్రుండు ప్రాయోపవిష్టుండగు పరీక్షిన్నరపాలునకు పదేశించు తెఱంగున, నైమిశారణ్య వాసులగు శౌనకాది ఋషిశ్రేష్ఠులకు దెలిపి మఱియు నిట్టి పురాణ రత్నంబగు భాగవతంబు వినువారును బఠించు వారును లిఖించు వారను నాయురారోగ్యైశ్వర్యంబుల గలిగి విష్ణు సాయుజ్యంబునొందుదురు.

# ద్వాదశోఽధ్యాయః

## పన్రెండవ ఆధ్యాయము

## సంగ్రహ శ్లోకము

**ద్వాదశేతు పురాణోక్త సర్వార్థాక్రమః కృతః**
**ప్రథమ స్కంధమారభ్య ప్రాధాన్యేన సమాసతః**

ఈ ద్వాదశాధ్యాయమున ఈ భాగవతమున ప్రథమస్కంధమునుండి ఇప్పటివరకు చెప్పిన విషయములన్నింటిని ప్రధానముగా సంక్షేపముగా చెప్పు చున్నారు.

తా. ఈగ్రంథమున ఇంతవరకు విస్తరముగా చెప్పిన విషయములనే సంగ్రహముగా చెప్పబోవుచు మొదట ధర్మాదులను నమస్కరించుచున్నారు.

సూత ఉవాచ = సూత మహర్షి పలికెను.

శ్లో. **నమో ధర్మాయ మహతే నమః కృష్ణాయ వేధసే**
**బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యే సనాతనాన్** 1

అ. మహతే ధర్మాయ = శ్రీహరి భక్తిరూపమైన గొప్పధర్మమునకు; నమః = నమస్కారము; వేధసే = విశ్వస్రష్టయగు; కృష్ణాయ = కృష్ణభగవానునకు; నమః = నమస్కారము; బ్రాహ్మణేభ్యః బ్రాహ్మణులకు; నమస్కృత్య = నమస్కరించి; సనాతనాన్ = పురాణోక్తములైన; ధర్మాన్ = ధర్మములను; వక్ష్యే = చెప్పెదను.

తా. శ్రీహరి భక్తిరూపమైన ధర్మమునకు నమస్కారము. విశ్వమును సృజించిన శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కారము. బ్రాహ్మణులకు నమస్కరించి పురాణోక్తములైన ధర్మమును చెప్పెదను.

శ్లో. **ఏతద్వః కథితం విప్రా విష్ణోశ్చరిత మద్భుతమ్.**
**భవద్భి ర్యదహం పృష్టో నరాణాం పురుషోచితమ్.** 2

అ. విప్రాః = ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా!; నరాణాం = నరులలో; పురుష + ఉచితం = పురుషునకు శ్రవణము చేయదగినది; యత్ = ఏది; భవద్భిః = మీచే; అహం = నేను; పృష్టః = అడుగబడిడిది ప్రశ్నించబడితిని; ఏతత్ = ఈ; విష్ణోః = విష్ణువుయొక్క; అద్భుతం అద్భుతమైన; చరితం = చరిత్రను; వః = మీకు; కథితం = చెప్పబడినది.

తా. ఓ విప్రులారా! నరులలో పురుషులు వినదగినది అద్భుతమైన శ్రీహరి చరితము మీరడిగితిరి. ఆ శ్రీహరి చరిత్రను మీకు తెలిపితిని.

అవ. ఈ విషయమునే వివరించుచున్నారు.

శ్లో. అత్ర సంకీర్తిత స్సాక్షాత్ సర్వపాపహరో హరిః
నారాయణో హృషీకేశో భగవాన్ సాత్వతాంపతిః 3

అ. అత్ర = ఈ భాగవతమునందు; సాక్షాత్ = ప్రత్యక్షముగా; సర్వపాపహరః = అన్నిపాపములను హరించెడి; నారాయణః = నరులకు ప్రాప్యమైన వాడు; హృషీకేశః = ఇంద్రియములను ప్రవర్తింప చేయువాడు; భగవాన్ = జ్ఞానశక్త్యాది షడ్గుములు కలవాడు; సాత్వతాం = ఎల్లప్రాణులకు; పతిః = జీవనాధారమైన; హరిః = శ్రీమహావిష్ణువు. సంకీర్తితః = చక్కగా కీర్తించబడెను.

తా. అన్నిపాపములను హరించువాడు. నరులకు ప్రాప్యమైనవాడు, ఇంద్రియములను ప్రవర్తింపచేయువాడు, జ్ఞానాదిషడ్గుణములు కలవాడు, ఎల్లప్రాణులకు జీవనాధారమైన శ్రీమహా విష్ణువు ఈ భాగవతమునందు ప్రత్యక్షముగా కీర్తించబడెను. ఇటుల చెప్పుటతో దేవకాండార్థము చెప్పబడినది.

అవ. బ్రహ్మకాండార్థము వివరించుచున్నారు.

శ్లో. అత్ర బ్రహ్మ పరం గుహ్యం జగతః ప్రభవాప్యయమ్.
జ్ఞానంచ తదుపాఖ్యానం ప్రోక్తం విజ్ఞాన సంయుతమ్ 4

అ. అత్ర = ఈ భాగవతము నందు; గుహ్యం = పరమ రహస్యము; గోపనీయము (నిర్గుణమైన) పరంబ్రహ్మ = పరబ్రహ్మ తత్త్వము; జగతః = జగత్తునకు; ప్రభవ + అప్యయం = ఉత్పత్తిలయ కారణము; విజ్ఞాన సంయుతం = అనుభవ జ్ఞానముతో గూడిన; (అపరోక్ష జ్ఞానముతో కూడిన) జ్ఞానం ఆత్మజ్ఞానము; తదుపాఖ్యానం = ఆజ్ఞాన సాధనము; ప్రోక్తం = చెప్పబడినది

తా ఈ భాగవతమునందు నిర్గుణము పరబ్రహ్మతత్త్వము చెప్పబడినది. మరియు ఈ ప్రపంచమునకు ఉత్పత్తి లయ కారణము, అపరోక్షజ్ఞానము వరకు వ్యాపించు ఆత్మజ్ఞానము, ఆ ఆత్మజ్ఞానమును సాధించు మార్గమును కూడా చెప్పబడినది.

అవ. కర్మకాండార్థమును వివరించు చున్నారు.

శ్లో. భక్తియోగ స్సమాఖ్యాతః వైరాగ్యం చ తదాశ్రయమ్.
పారీక్షిత ముపాఖ్యానం నారదాఖ్యాన మేవచ. 5

అ. భక్తియోగః = సాధ్యసాధన రూపమైన భక్తియోగము; సమాఖ్యాతః = చక్కగాచెప్పబడినది; తదాశ్రయం = ఆ భక్తికి ఆశ్రయమైన; వైరాగ్యం చ = వైరాగ్యము కూడా చెప్పబడినది. పారీక్షితం పరీక్షిన్మహారాజునకు సంబంధించిన; ఉపాఖ్యానం = చరిత్ర; నారదాఖ్యానం + ఏవ + చ = నారదుని చరిత్రకూడా చెప్పబడినది.

తా. ఈ భాగవతమునందు సాధ్యసాధన రూపమైన భక్తి, ఆ భక్తికి ఆశ్రయమైన వైరాగ్యము, పరీక్షిన్మహారాజు కథ. నారద మహర్షి కథ చెప్పబడినది.

శ్లో. ప్రాయోపవేశః రాజర్షేః విప్రశాపాత్ పరీక్షితః
శుకస్య బ్రహ్మర్షభస్య సంవాదశ్చ పరీక్షితః 6

అ. విప్రశాపాత్ = బ్రాహ్మణ శాపమువలన; రాజర్షేః = రాజర్షియైన పరీక్షితః = పరీక్షిత్తు యొక్క; ప్రాయోపవేశః = మరణించ నిశ్చయించుకొని ఆహార పానీయముల విసర్జించి యుండు వ్రతమును పరీక్షితః = పరీక్షిన్మహా రాజునకు, బ్రహ్మర్షిభస్య = బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైన శుకస్య = శుకునకు; స వాదః = జరిగిన సంవాదము; చెప్పబడినది అని ముందు శ్లోకముతో అన్వయము.

తా. బ్రాహ్మణ శాపమువలన రాజర్షియైన పరీక్షిన్మహారాజు మరణించ నిశ్చయించి ఆహార పానీయములను విసర్జించి యుండు వ్రతమును స్వీకరించుట, పరీక్షిన్మహారాజునకు, బ్రహ్మర్షులలో శ్రేష్ఠుడైన శుకయోగస్వామికు జరిగిన సంవాదము ఇందు చెప్పబడినది ఇటుల చెప్పుట వలన ప్రథమస్కంధమున చెప్పిన విషయమును సంగ్రహముగా చెప్పెను.

**శ్లో. యోగధారణ యోత్క్రాన్తిః సంవాదో నారదాజయోః**
**అవతారాను గీతం చ సర్గః ప్రాధానికోఽగ్రతః** **7**

అ. యోగధారణయా = ప్రాణాయామ రూపమగు యోగముతో; ఉత్క్రాన్తిః = శరీరత్యాగము చేయుట. నారద + అజయోః = నారద బ్రహ్మలకు; సంవాదః = జరిగిన సంవాదము అవతారానుగీతం చ = శ్రీమహా విష్ణువు యొక్క ఏకవింశతి అవతారముల కీర్తనము; ప్రాధానికః = ప్రధానము నుండి అనగా మహత్తత్త్వము మొదలుకొని; అగ్రతః = క్రమముగా; సర్గః = సృష్టి, చెప్పబడినది.

తా. ప్రాణాయామ రూపమగు యోగమాయచే శరీరమును విడుచుట, బ్రహ్మనారదుల మధ్య జరిగిన సంవాదము. శ్రీ మహావిష్ణువు యొక్క ఏకవింశతి అవతారముల కీర్తనము మహత్తత్త్వము నుండి క్రమముగా జరిగిన సృష్టి చెప్పబడినది ఇది ద్వితీయ స్కంధమున చెప్పబడిన విషయము.

**శ్లో. విదురోద్ధవ సంవాదః క్షత్తృమైత్రేయ యోస్తతః**
**పురాణ సంహితా ప్రశ్నః మహాపురుష సంస్థితిః.** **8**

అ. విదుర + ఉద్ధవ సంవాదః = విదురునికి ఉద్ధవునికి జరిగిన సంవాదము; క్షత్తృమైత్రేయయోః విదురమైత్రేయుల సంవాదము. తతః = తరువాత పురాణ సహింతా ప్రశ్నః = పురాణసంహితల గురించి అడుగుట; మహాపురుష సంస్థితిః = విరాట్పురుషుని స్వరూపము; లేదా ప్రళయ కాలమందు పరమాత్మ స్థితి చెప్పబడినది.

తా. తృతీయ స్కంధమునందు విదుర ఉద్ధవుల మధ్య జరిగిన సంవాదము, విదుర మైత్రేయుల మధ్య జరిగిన సంవాదము, పురాణసంహితలగురించి అడుగుట, ప్రళయకాలమందు పరమాత్మ స్వరూపము చెప్పబడినది.

**శ్లో. తతః ప్రాకృతిక స్సర్గ స్సప్తవైకృతికాశ్చ యే**
**తతో బ్రహ్మాండ సంభూతి ర్వైరాజః పురుషో యతః** **9**

అ. తతః = తరువాత, ప్రాకృతికః = గుణముల సంక్షోభముచే ప్రకృతి నుండి కలిగిన; సర్గః సృష్టి; సప్త మహదహంకారములు పంచతన్మాత్రలు అను ఏడు; వైకృతికాః చ = వైకృతికములు జనించుట; తతః = తరువాత; బ్రహ్మాండ సంభూతిః = బ్రహ్మాండము యొక్క ఉత్పత్తి; యతః = ఏ బ్రహ్మాండము వలన; వైరాజః పురుషః = విరాట్పురుషుని స్వరూపా విర్భావము.

తా. ప్రళయ కాలమునందు పరమాత్మ స్వరూపము చెప్పబడిన తరువాత గుణ సంక్షోభము చే ప్రకృతినుండి కలిగెడు సృష్టి, మహదహంకారములు పంచతన్మాత్రలు అను ఏడు వైకృతికములు జనించుట. అటు తరువాత బ్రహ్మాండము పుట్టుట, ఆ బ్రహ్మాండము నందు విరాట్పురుషావిర్భావము చెప్పబడినది.

శ్లో. కాలస్య స్థూల సూక్ష్మస్య గతిః పద్మసముద్భవః
భువ ఉద్ధరణేఽంభోధే ర్హిరణ్యాక్ష వధో యతః. 10

అ. స్థూల సూక్ష్మస్య=స్థూలరూపము సూక్ష్మరూపమును అయిన; కాలస్య=కాలముయొక్క; గతిః=స్వరూపము; పద్మసముద్భవః=లోక పద్మముయొక్క ఉత్పత్తి, (లోకములు పద్మ స్వరూపమున నుండుట) అంభోధేః=ప్రళయసాగరము నుండి, భువః=భూమియొక్క; ఉద్ధరణే=ఉద్ధరించు సమయమున; యతః=ఏ ఆది వరాహమువలన; హిరణ్యాక్ష వధః=హిరణ్యాక్షుని సంహారము.

తా. స్థూల సూక్ష్మరూపమైన కాల స్వరూపము, లోక పద్మము పుట్టుట. ప్రళయ సాగరమునుండి భూమినుద్ధరించు ఆదివరాహమూర్తి హిరణ్యాక్షుని సంహరించుట చెప్పబడినది.

శ్లో. ఊర్ధ్వతిర్యగవాక్సర్గః రుద్రసర్గ స్తథైవ చ
అర్ధనారీ నరస్యాథ యత్ర స్వాయంభువో మనుః. 11

అ. ఊర్ధ్వ=స్వర్గమునందుండు; తిర్యక్=పశుపక్ష్యాదుల; అవాక్సర్గః=క్రిందికి వీర్యమును వదులు మానవుల సృష్టి; తథైవ=అటులనే; రుద్ర సర్గః చ=రుద్రుని సృష్టియును; అథ=తరువాత అర్థనారీనరస్య=అర్థనారీశ్వరుని స్వరూపము; యతః=దేనివలన; స్వాయం భువః=స్వాయంభువ మనువు పుట్టుట.

తా. స్వర్గమున నుండు పశుపక్ష్యాదుల సృష్టి, క్రిందికి వీర్యమును వదులు మానవుని సృష్టి, తరువాత రుద్రసృష్టి అటులనే అర్థనారీశ్వరుని సృష్టి, దానివలన స్వాయంభువ మనువు పుట్టుట చెప్పబడినది.

శ్లో. శతరూపాచ యా స్త్రీణా మాద్యా ప్రకృతి రుత్తమా
సంతానోధర్మపత్నీనాం కర్దమస్య ప్రజాపతేః. 12

అ. ఆద్యా=మొదటి; ప్రకృతిః=ప్రకృతియైన; స్త్రీణాం=స్త్రీలలో; ఉత్తమా=ఉత్తము రాలైన; శతరూపా=శతరూప యొక్క సృష్టి; కర్దమస్య ప్రజాపతేః=కర్దమ ప్రజాపతి యొక్క ధర్మపత్నీనాం=భార్యలకు; సంతానః=సంతానము కలుగుట.

తా. మొట్టమొదటి ప్రకృతి, స్త్రీలలో ఉత్తమురాలైన శతరూప పుట్టుట, కర్దమ ప్రజాపతి భార్యలకు సంతానము కలుగుట చెప్పబడినది.

శ్లో. అవతారో భగవతః కపిలస్య మహాత్మనః
దేవహూత్యాశ్చ సంవాదః కపిలేన చ ధీమతః. 13

అ. మహాత్మనః=మహానుభావుడైన; భగవతః=భగవంతుడైన; కపిలస్య=కపిల మహర్షి యొక్క; అవతారః=అవతారము; దేవహూత్యాః=దేవహూతికి; ధీమతా=జ్ఞానము గల; కపిలేన=కపిలమహర్షితో; సంవాదః చ=సంవాదము కూడా చెప్పబడినది.

తా. మహాత్ముడు భగవంతుడు అయిన కపిల మహర్షి అవతారము. కపిల మహర్షితో దేవహూతికి జరిగిన సంవాదము చెప్పబడినది. ఇంతవరకు తృతీయస్కంధమున జరిగిన దానిని చెప్పియున్నారు.

శ్లో. నవబ్రహ్మ సముత్పత్తి ర్దక్షయజ్ఞవినాశనమ్
ధ్రువస్య చరితంచైవ పృథోః ప్రాచీన బర్హిషః. 14

తా. మరీచి అత్రి మొదలగు నవబ్రహ్మల సృష్టి, దక్షయజ్ఞ వినాశనము, ధ్రువుని చరిత్ర, పృథుచక్రవర్తి చరిత్ర ప్రాచీన బర్హిచరిత్ర చతుర్థస్కంధమునందుచెప్పబడినది

శ్లో. నారదస్య చ సంవాద స్తతః ప్రైయవ్రతం ద్విజాః
నాభేస్తతోను చరితం భరతస్యర్షభస్య చ 15

తా. నారదునికి ప్రాచీనబర్హికి జరిగిన సంవాదము, నాభి చరితము, భరతుని చరితము ఋషభుని చరితము, పంచమస్కంధమునందు చెప్పబడినది.

శ్లో. ద్వీప వర్ష సముద్రాణాం గిరినద్యుపవర్ణనమ్
జ్యోతి శ్చక్రస్య సంస్థానం పాతాళ నరకస్థితిః 16

తా. ద్వీపములు, వర్షములు, సముద్రములు, పర్వతములు, నదులు, అనువానిని వర్ణించుట, ఖగోళము, సూర్యచంద్రాది గ్రహములు, అశ్విన్యాది నక్షత్రములు మొదలగువాని స్థితి అతలము మొదలుకొని పాతాళము వఱకున్న ఏడు అధోలోకముల వర్ణన, రౌరవాది నరకముల స్థితి కూడా పంచమస్కంధముననే చెప్పబడినది.

శ్లో. దక్షజన్మ ప్రచేతోభ్య స్తత్పుత్రీణాం చ సంతతిః
యతో దేవాసుర నరాస్తిర్యఙ్నాగ ఖగాదయః 17

తా. ప్రచేతసులవలన దక్ష ప్రజాపతి జన్మ, ఆ దక్షుని పుత్రికల సంతానము దేవతలు అసురులు, నరులు, పశుపక్ష్యాదులు, సర్పములు మొదలగునవి పుట్టుట ఆరవ స్కంధమున చెప్పబడినది.

శ్లో. త్వాష్ట్రస్య జన్మ నిధనం పుత్రయోశ్చ దితేః ద్విజాః
దైత్యేశ్వరస్య చరితం ప్రహ్లాదస్య మహాత్మనః. 18

తా. వృత్రాసురుని పుట్టుక మరణము కుడా ఆరవ స్కంధముననే చెప్పబడినది. ఇక సప్తమసంధమునందు దితిపుత్రులైన హిరణ్యకశ్యపుడు హిరణ్యాక్షుడు అనువారలు పుట్టుట, వారిలో దైత్యేశ్వరుడైన హిరణ్యకశ్యపుని చరితము; మహానుభావుడైన ప్రహ్లాదుని చరితము వర్ణించబడినది,

శ్లో. మన్వంతరాను చరితం గజేంద్రస్య చ మోక్షణమ్
మన్వంతరావతారశ్చ విష్ణోర్హయ శిరోదయః. 19

తా. స్వాయంభువుడు మొదలగు 14 మన్వంతరముల వర్ణనము, గజేన్ద్రమోక్షము, ఆ యా మన్వంతరములందు శ్రీ మహావిష్ణువు యొక్క హయగ్రీవావతారము మొదలగు అవతారముల వర్ణన అష్టమస్కంధమునందు చెప్పబడినది. ఈ విషయములో కొన్నింటిని చెప్పుట కొన్నింటిని ముందువెనుకలుగా చెప్పుట భక్తిపారవశ్యముతో నని గ్రహించవలయును.

శ్లో. కౌర్మం ధాన్వంతరం మాత్స్యం వామనం చ జగత్పతేః
క్షీరోదమథనం తద్వదమృతార్థే దివౌకసామ్. **20**

తా. జగత్ప్రభువైనశ్రీమహావిష్ణువుయొక్క కూర్మావతార చరిత్రము, ధన్వంతరీ అవతారము, మత్స్యావతారము, వామనావతారము, దేవతలకు అమృతము నిప్పించుటకు క్షీరసాగరమథనము కూడా అష్టమస్కంధమున చెప్పబడినది.

శ్లో. దేవాసుర మహాయుద్ధం రాజవంశానుకీర్తనమ్
ఇక్ష్వాకు జన్మ తద్వంశే సుద్యుమ్నస్య మహాత్మనః. **21**

తా. దేవతలకు అసురులకు జరిగిన మహాయుద్ధముకూడా అష్టమస్కంధమునందు వర్ణించబడినది. ఇక నవమస్కంధమునందు సూర్య చంద్ర వంశముల రాజుల చరిత్ర, ఇక్ష్వాకు పుట్టుక, అతని వంశమును వర్ణించుట, మహాత్ముడైన సుద్యుమ్నుని చరితము చెప్పబడినది.

శ్లో. ఇలోపాఖ్యాన మత్రోక్తం తారోపాఖ్యానమేవ చ
సూర్యవంశాను చరితం శశాదాద్యా నృపాయతః. **22**

తా. మఱియు ఈ నవమస్కంధమునందు ఇలోపాఖ్యానము, తారాచరితము, సూర్య వంశము యొక్క చరిత్ర, శశాదుడు నృగుడు మొదలగు రాజుల చరిత్ర చెప్పబడినది.

శ్లో. సౌకన్యం చాథ శర్యాతేః కకుత్స్థస్య చధీమతః
ఖట్వాంగస్య చ మాంధాతు సౌభరే స్సగరస్య చ. **23**

తా. సుకన్యా చరితము, శర్యాతి చరితము, జ్ఞానియైన కకుత్సుని చరితము, ఖట్వాంగుని చరితము, మాంధాతృ చరిత్ర, సౌభరి చరిత్ర, సగరుని చరిత్ర నవమస్కంధమందు చెప్పబడినది.

శ్లో. రామస్య భార్గవేంద్రస్య నిః క్షత్రీకరణం భువః
ఐళస్య సోమవంశస్య యయాతేః నహుషస్య చ **24**

తా. భృగువంశ శిరోమణియగు పరశురాముడు భూమండలమున నున్న రాజుల నెల్ల సంహరించుట, ఇలాపుత్రుడైన పురూరవుని చరిత్రము, యయాతి చరిత్రము, నహుషుని చరితము కూడా నవస్కంధమునందు చెప్పబడినది.

శ్లో. రామస్య కోసలేంద్రస్య చరితం కిల్బిషాపహమ్
నిమేరంగపరిత్యాగో జనకానాం చ సంభవః **25**

తా. పాపములను తొలగించు, కోసలదేశ ప్రభువగు శ్రీరామచంద్రుని చరిత్ర, నిమి శరీరమును త్యజించుట, జనకరాజు పుట్టుక నవమస్కంధము సంబంధించిన కొన్ని విషయములు

శ్లో. దౌష్యంతే ర్భరతస్యాపి శతనోస్తత్సుతస్య చ
యయాతేర్జ్యేష్ఠపుత్రస్య యదోర్వంశానుకీర్తనమ్. 26

తా. దుష్యంతుని పుత్రుడైన భరతుని చరితము, శంతనుని చరిత్ర, శంతనుని పుత్రుడైన భీష్ముని చరిత్ర, యయాతి పెద్దకొడుకైన యదువంశకీర్తనము నవమస్కంధమునందు చెప్పబడినవి.

శ్లో. యత్రావతీర్ణో భగవాన్ కృష్ణాఖ్యో జగదీశ్వరః
వసుదేవ గృహే జన్మ తస్య వృద్ధిశ్చ గోకులే. 27

తా. భగవంతుడు జగదీశ్వరుడు అయిన శ్రీ కృష్ణుడు వసుదేవుని ఇంట బుట్టి గోకులమున పెరుగుట చెప్పబడినది. ఇటనుండి దశమస్కంధమున చెప్పబడిన కృష్ణ చరిత్రను వివరించుచున్నారు.

శ్లో. తస్య కర్మాణ్యుదారాణి కీర్తితాన్యసురద్విషః
పూతనాసు పయః పానం శకటోచ్చాటనం శిశోః. 28

తా. అసురకుల వైరియగు శ్రీకృష్ణుడు చేసిన ఉదారములైన పనులు దశమస్కంధమునందు కీర్తింపబడినవి. అవి పూతన స్తన్యముతో పాటు ప్రాణములను సైతము గ్రోలుట, శిశువుగానుండియే శకటాసురుని సంహరించుట చెప్పబడినది.

శ్లో. తృణావర్తస్య నిష్పేష స్తథైవ బకవత్సయోః
అఘాసురస్య సంహారః కస్య మాయా ప్రదర్శనమ్. 29

తా. తృణావర్తుని, బకాసురుని, వత్సాసురుని సహరించుట, బ్రహ్మకు తనయోగ మాయను చూపుట చెప్పబడినది

శ్లో. ధేనుకస్య సహభ్రాతుః ప్రలంబస్య చ సంక్షయః
గోపానాంచ పరిత్రాణం దవాగ్నేః పరిసర్పతః 30

తా. సోదరునితో కూడిన ధేనుకాసురుని, ప్రలంబాసురుని సంహరించుట, అరణ్యమున నాలుగు దిక్కులు ప్రసరించుచున్న కారుచిచ్చునుండి గోపాలురను కాపాడుట చెప్పబడినది.

శ్లో. దమనం కాళియస్యాహే ర్మహాహేర్నందమోక్షణమ్
వ్రతచర్యాచ కన్యానాం యత్రతుష్టోఽచ్యుతో వ్రతైః. 31

తా. కాళియ సర్పము యొక్క గర్వము నణుచుట, కొండచిలువ నోటినుండి నందుని విడిపించుట. గోపకన్యలు కాత్యాయనీ వ్రతమాచరించుట, ఆవ్రతముచే శ్రీకృష్ణుడు సంతుష్టుడగుట చెప్పబడినది.

శ్లో. ప్రసాదో విప్రపత్నీభ్యో విప్రాణాం చానుతాపనమ్
గోవర్ధనోద్ధారణం చ శక్రస్య సురభేరథ. 32

తా. విప్రపత్నులను అనుగ్రహించుట, విప్రులు పశ్చాత్తాపమునొందుట, శ్రీకృష్ణుడు గోవర్ధన గిరిని ఎత్తుట వర్ణించబడినది,

శ్లో. యజ్ఞాభిషేకం కృష్ణస్య స్త్రీభిః క్రీడా చ రాత్రిషు
శంఖచూడస్య దుర్బుద్ధేః వధోఽరిష్టస్య కేశినః. 33

తా. ఇంద్రుడు కామధేనువు కలసి శ్రీకృష్ణుని అభిషేకము చేసి గోవింద అని నామకరణము చేయుట, గోపికాస్త్రీలతో రాత్రులయందు రాసక్రీడలాడుట దుర్బుద్ధియైన శంఖచూడుని అరిష్టుని కేశిని సంహరించుట చెప్పబడినది.

శ్లో అక్రూరగమనం పశ్చాత్ ప్రస్థానం రామకృష్ణయోః
వ్రజస్త్రీణాం విలాపశ్చ మధురాలోకనం తతః. 34

తా. అక్రూరుడు వ్రేపల్లెకు వచ్చుట, రామకృష్ణులు మధురానగరమునకు బయలుదేరుట, గోపికల విలాపము, రామకృష్ణులు మధురను చూచుట చెప్పబడినది.

శ్లో గజ ముష్టిక చాణూర కంసాదీనాం చ యో వధః
మృతస్యానయనం సూనోః పునస్సాందీపనేర్గురోః 35

తా కువలాయపీడమను గజమును,చాణూర ముష్టికులను మల్లురను కంసుని వధించుట తన గురువగు సాందీపుని పుత్రుడు చనిపోగా మరల తెచ్చుట చెప్పబడినది.

శ్లో. మధురాయాం నివసతో యదుచక్రస్య యత్ప్రియమ్
కృతముద్ధవ రామాభ్యాం యుతేన హరిణా ద్విజాః. 36

తా. శ్రీకృష్ణుడు బలరామునితో ఉద్ధవునితో కలసి మధురలో నివసించి, యదువంశపు రాజులకు ప్రియమాచరించుట వర్ణించబడినది.

శ్లో. జరాసంధ సమానీత సైన్యస్య బహుశో వధః
ఘాతనం యవనేంద్రస్య కుశస్థల్యా నివేశనమ్. 37

తా. జరాసంధుడు పలుమార్లు తీసుకొనివచ్చిన సైన్యమును వధించుట కాలయవనుని ముచుకుందునితో చంపించుట, రాత్రికి రాత్రియే సముద్ర మధ్యమున ద్వారకానగరమును నిర్మించి మధురనుండి ప్రజలను ద్వారకకు చేర్చుట చెప్పబడినది.

శ్లో. ఆదానం పారిజాతస్య సుధర్మాయాః సురాలయాత్
రుక్మిణ్యాహరణం యుద్ధే ప్రమథ్య ద్విషతో హరేః 38

తా. శ్రీకృష్ణభగవానుడు స్వర్గమునుండి పారిజాత వృక్షమును, సుధర్మయను సభను తెచ్చుట. యుద్ధమున శత్రువులనోడించి రుక్మిణిని గొని తెచ్చుట చెప్పబడినది.

శ్లో. హరస్య జృంభణం యుద్ధే బాణస్య భుజ కృంతనమ్
ప్రాక్ జ్యోతిష పతింహత్వా కన్యానాం హరణం తథా- 39

తా. యుద్ధమునందు బాణునికి సహాయముగా వచ్చిన శివుడు విజృంభించగా అతనిని నిర్జించి బాణాసురుని బాహువులను చక్రముతో ఖండించుట, ప్రాక్ జ్యోతిష నగరాధీశ్వరుడగు నరకాసురుని సంహరించి, అతను చెరబట్టిన 16వేల కన్యలను గొనితెచ్చుట చెప్పబడినది

శ్లో. చైద్య పౌండ్రక సాల్వానాం దంత వక్త్రస్య దుర్మతేః
శంబరో ద్వివిదః పీఠో మురః పంచ జనాదయః 40

మాహాత్మ్యం చ వధస్తేషాం వారాణస్యాశ్చ దాహనమ్
భారావతరణం భూమే ర్నిమిత్తీకృత్య పాండవాన్. 41

తా. శిశుపాలుడు, దంతవక్త్రుడు, పౌండ్రకుడు, సాల్వుడు, శంబరుడు, ద్వివిదుడు, పీఠుడు, మురాసురుడు, పంచజనుడు మొదలగు వారల బల పరాక్రమములను వర్ణించుట, శ్రీకృష్ణుడు వారిని వధించుట, వారణాసీనగరమును దహించుట, పాండవులను నిమిత్తముగా చేసుకొని భూభారమును తొలగించుట చెప్పబడినది.

శ్లో విప్రశాపాపదేశేన సంహారం స్వకులస్య చ
వసుదేవస్య సంవాదో నారదేన సురర్షిణా. 42

తా. విప్రశాపమను నెపమున యాదవకుల సంహారము, వసుదేవునికి నారదునికి జరిగిన సంవాదము ఏకాదశ స్కంధమున చెప్పబడినది.

శ్లో. ఉద్ధవస్య చ సంవాదో వాసుదేవస్య చాద్భుతః
యత్రాత్మ విద్యా హ్యఖిలా ప్రోక్తా ధర్మవినిర్ణయః 43

తా. శ్రీకృష్ణభగవానునకు ఉద్ధవునికి జరిగిన సంవాదములో సంపూర్ణమైన ఆత్మవిద్య, అద్భుతమైన ధర్మనిర్ణయము చెప్పబడినది.

శ్లో. తతో మర్త్య పరిత్యాగః ఆత్మయోగానుభావతః
యుగలక్షణ వృత్తిశ్చ కలౌ నౄణా ముపప్లవః. 44

శ్రీకృష్ణ భగవానుడు ఆత్మయోగముచే మర్త్యలోకమును విడుచుట ఏకాదశస్కంధమున చెప్పబడినది. ఇక ద్వాదశస్కంధమునందు కృతాది చతుర్యుగముల లక్షణములు, అందు నివసించు జనుల నిత్యవ్యవహారములు చెప్పబడినవి.

శ్లో. చతుర్విధశ్చ ప్రళయః ఉత్పత్తిస్త్రివిధా స్మృతా
దేహత్యాగశ్చ రాజర్షేః విష్ణురాతస్య ధీమతః. 45

తా. నాలుగు విధములైన ప్రళయ లక్షణములు, ప్రాకృతికీ, నైమిత్తికీ నిత్యములను మూడువిధములగు సృష్టిలక్షణములు, జ్ఞాని రాజర్షియైన పరీక్షిన్మహారాజు దేహమునువిడుచుట చెప్పబడినది.

శ్లో. శాఖాప్రణయన మృషే ర్మార్కండేయస్య సత్కథా
మహాపురుష విన్యాసః సూర్యస్య జగదాత్మనః. 46

తా. వేద శాఖల విభాగము, మార్కండేయ మహర్షికథ, విరాట్పురుషుని స్వరూప వర్ణనము, జగమునకు ఆత్మయైన సూర్యభగవానుని గుణ వ్యూహములు చెప్పబడినవి. ఇంతటితో ద్వాదశస్కందార్థము ముగిసినది.

శ్లో. ఇతి చోక్తం ద్విజశ్రేష్ఠా! యత్పృష్టోఽహ మిహాస్మి వః
లీలా వతార కర్మాణి కీర్తితానీహ సర్వశః. 47

అ. ద్విజశ్రేష్ఠాః! = ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా; ఇహ = ఇచట; వః = మీ చేత; అహం = నేను; యత్ = దేనిని; పృష్టః = అడుగబడితినో, దానిని; ఇతి = ఈ విధముగా; ఉక్తం = చెప్పబడినది; సర్వశః = సంపూర్ణముగా; లీలావతారకర్మాణి = శ్రీమహా విష్ణువు అవతారలీలల కర్మలు; కీర్తితాని = కీర్తించబడినవి.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! మీరు నన్ను అడిగిన అన్ని విషయములను, శ్రీమహా విషువు అవతరించి చేసిన పనులను లీలలను సంపూర్ణముగా వివరించితిని.

అవ. శ్రీహరి అవతార లీలల వర్ణించుట వలన కలుగు ఫలమును రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

శ్లో. పతితః స్ఖలితో వార్తః క్షుత్త్వాపి వివశో బ్రువన్
హరయే నమ ఇత్యుచ్చైః ముచ్యతే సర్వపాతకైః. 48

అ. పతితః = పడుచు, స్ఖలితః = జారుచు; ఆర్తః = దుఃఖము పొందుచు; క్షుత్త్వా = ఆవలించుచు; వివశః = వశము తప్పుచు; హరయే నమః = హరికి నమస్కారము, ఇతి = అని; ఉచ్చైః = పెద్దగా; బ్రువన్ = పలుకుచు; సర్వపాతకైః = అన్నివిధములైన పాపములచే; ముచ్యతే = విడువబడును.

తా. పడుచు, జారుచు, ఆవలించుచు, వశము తప్పియు శ్రీహరికి నమస్కారము అని పెద్దగా పలుకువాడు అన్నిపాపముల నుండి విముక్తుడగును.

శ్లో. సంకీర్త్యమానో భగవాననంత శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం యథా తమోఽర్కోఽభ్రమివాతివాతః 49

అ. అనంతః = దేశకాల వస్తువులకు పరిచ్ఛిన్నుడు కాని; భగవాన్ = భగవంతుడగు శ్రీమన్నారాయణుడు; శ్రుతానుభావః = వినబడిన కీర్తిగలవాడై; సంకీర్త్యమానః = చక్కగా కీర్తించబడి; చిత్తం = హృదయమును; ప్రవిశ్య = ప్రవేశించి పుంసాం = మానవులయొక్క; అశేషం = సమస్తమైన; వ్యసనం = పాపమును; అర్కః = సూర్యుడు; యథా = ఎటుల; తమః చీకటిని; అతివాతః = ఝుంఝూమారుతము; అభ్రం ఇవ = మేఘమును వలె; విధునోతి = బోదోలుచున్నాడు.

తా. దేశకాల వస్తువులకు పరిచ్ఛిన్నుడుగాని భగవంతుని ప్రభావమును వినిననూ కీర్తించిననూ. సూర్యుడు చీకటిని బోదోలినట్లు పెనుగాలి మబ్బును బోదోలునట్లు పురుషుని పాపరాశిని బోదోలును.

అవ. హరి సంకీర్తనమే మహాఫలము నిచ్చునది. ఇతరములన్నియు మిథ్యాలాపములు మాత్రమేనని నాలుగు శ్లోకములతో వివరించుచున్నారు.

శ్లో॥ మృషాగిరస్తా హ్యసతీ రసత్కథా నకథ్యతే యద్భగవానధోక్షజః
తదేవ సత్యం తదుహైవ మంగలం తదేవ పుణ్యం భగవద్గుణోదయమ్. 50

అ. మృషాగిరః = అసత్యపు మాటలు అసతీః = చెడును చెప్పునవి తాః = అవి; అసత్కథాః = దుష్టుల కథలు; యత్ = ఎక్కడ; భగవాన్ = భగవంతుడైన; అధోక్షజః = ఇంద్రియములను అధఃకరించు శ్రీమన్నారాయణుడు; నకథ్యతే = చెప్పబడుటలేదో; తత్ = ఆ భగవద్గుణోదయం; ఏవ = భగవంతుని గుణములను కీర్తించుటయే; సత్యం = నిజమైనది. తత్ ఉహ ఏవ = ఆ భగద్గుణకీర్తనమే మంగలం = శుభప్రదము; తదేవ = ఆ భగవద్గుణగానమే; పుణ్యం = పవిత్రమైనది.

తా॥ ఇంద్రియములను ఇంద్రియ ప్రవృత్తులను నియమించుచువాడు, భగవంతుడు అయిన శ్రీమన్నారాయణుని కథలు చెప్పని ఇతరములైన మాటలు మిథ్యాప్రలాపములు, అసత్యములు అసత్కథలు మాత్రమే. భగవంతుని గుణములను పాడుటయే సత్యము, శుభప్రదము, పవిత్రము.

శ్లో. తదేవ రమ్యం రుచిరం నవన్నవం తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్
తదేవ శోకార్ణవ శోషణం నృణాం యదుత్తమ శ్లోకయశోఽనుగీయతే. 51

తా యత్ = ఏదైతే ఉత్తమ శ్లోకయశః = పవిత్రచరిత్రుడగు భగవంతునికీర్తి; అనుగీయతే = గానము చేయబడు చున్నదో; తదేవ = అదియే; నృణాం = నరులకు రమ్యం = సుందరమైనది.; తదేవ అదియే; నవం నవం = క్రొంగ్రొత్త; రుచిరం = రుచికలిగించునది; శశ్వత్ = మాటి మాటికి; మనసః = మనస్సునకు; మహోత్సవం = గొప్ప పండుగ; తదేవ = ఆ భగవద్గుణాను సంధానమే; శోకార్ణవ శోషణం = శోకసాగరమును ఎండింప చేయునది,

తా. పవిత్ర చరిత్రుడగు శ్రీమన్నారాయణుని గుణాను సంధానమే సుందరము. క్రొంగ్రొత్తరుచికని కలిగించునది. మాటి మాటికి మనసునకు గొప్ప పండుగ జేయునది. మానవుల శోకసాగరమును ఎండింప చేయునది.

శ్లో. న తద్వచ శ్చిత్ర పదం హరేర్యశో జగత్పవిత్రం ప్రగృణీత కర్హిచిత్
తద్ధ్వాంక్ష తీర్థం నతు హంససేవితం యత్రాచ్యుత స్తత్ర హి సాధవోఽమలాః. 52

అ. జగత్పవిత్రం = జగత్తును పవిత్రముచేయు; హరేః = శ్రీ మహావిష్ణువు యొక్క; యశః = కీర్తిని; కర్హచిత్ = ఒకపుడు కూడా; నప్రగృణీత = కీర్తించదో; తత్ వచః = ఆ వాక్యము; చిత్ర పదం = రసభావాదులలో కూడియున్న పదములు కలదైనను; ధ్వాంక్షతీర్థం = కాకులవంటి మానవులకు ప్రీతికలిగించునదేకాని; నతుహంససేవితం = జ్ఞానులచే సేవింపబడునది కాదు; యత్ర = ఎచట; అచ్యుతః = శ్రీమన్నారాయణుడుండునో; తత్ర = అచటనే; అమలాః = పరిశుద్ధులైన; సాధవః = జ్ఞానులైన సజ్జనులుందురు.

తా. జగత్తును పవిత్రము చేయు శ్రీహరి గుణములను ఏ ఒకప్పుడు కూడా వర్ణించని వాక్యము ఎంతటి రసభావ అలంకారములు కలదైననుకాక తీర్థమువలె అపవిత్రమేకానిజ్ఞానులు సేవించునది కాజాలదందురు. శ్రీమన్నారాయణుడున్న చోటనే పరిశుద్ధులైన సజ్జనులుందురు.

శ్లో. స వాగ్విసర్గో జనతాఘ సంప్లవో యస్మిన్ప్రతి శ్లోక మబద్ధవత్యపి
నామాన్యనన్తస్య యశోంఽకితాని యచ్ఛృణ్వంతి గాయన్తి గృణంతి సాధవః 53

అ. సః = అది; వాగ్విసర్గః = వాక్ప్రయోగము; జనతాఘ సంప్లవః = జన సమూహముయొక్క పాపమును నశింప చేయునది; యస్మిన్ = ఏ వాక్యమునందు; అబద్ధవత్యపి = వ్యాకరణబద్ధము కాని దైనను; ప్రతి శ్లోకం = ప్రతిశ్లోకమునందు; అనంతస్య = శ్రీమన్నారాయణుని; యశోఽంకితాని = కీర్తిని చెప్పెడు; నామాని = పేర్లు కలవో; యత్ = ఏ వాక్యప్రయోగమును; సాధవః సజ్జనులు; శృణ్వన్తి = వినెదరు; గాయన్తి = గానము చేసెదరు; గృణన్తి = సంకీర్తనము చేతురు.

తా. వ్యాకరణ బద్ధముకాని వాక్యప్రయోగము కూడా ప్రతి శ్లోకమునందు శ్రీమన్నారాయణుని గుణగానము చేసినచో అది సరియైన వాక్యప్రయోగమే అటువంటి వాక్యములను సాధువులు వినెదరు. గానము చేసెదరు. కీర్తన చేసెదరు.

అవ. ఇపుడు జ్ఞానమునందు కర్మయోగమునందు చూపు ఆదరముకంటె భగవత్కీర్తనాదులలోనే ఎక్కువ ఆదరము చూపవలయునని మూడుశ్లోకములతో చెప్పుచున్నారు.

శ్లో. నైష్కర్మ్య మప్యచ్యుత భావవర్జితం న శోభతే జ్ఞానమలం నిరంజనమ్
కుతః పునః శశ్వదభద్రమీశ్వరే నహ్యర్పితం కర్మ యదప్యనుత్తమమ్. 54

అ. నైష్కర్మ్యం = కర్మలకు దూరమైన మోక్షము;నిరంజనం = ఉపాధి రహితమైన;జ్ఞానమపి = జ్ఞానముకూడా; అచ్యుతభావ వర్జితం = శ్రీహరి భక్తిలేనిదైనచో నశోభతే = ప్రత్యక్షమునకు ఉపకరించదు. అనగా భగవత్సాక్షాత్కారమును కలిగించదని భావము, యత్ = ఏ;కర్మ = కర్మయోగము అనుత్తమం + అపి = సర్వోత్తమమైనదైనను; ఈశ్వరే = భగవంతునియందు నహి + అర్పితం = అర్పించబడనిచో, శశ్వత్ = సర్వకాలము; అభద్రం = శుభకరముకాదు. అనగా సాధనకాలమున ఫలకాలమున దుఃఖాత్మకము;పునః = మఱియు కుతః ఎటుల శోభతే = శోభించును.

తా. కర్మలకు దూరమైన మోక్షముకాని, ఉపాధిరహితమైన జ్ఞానముకాని శ్రీహరి భక్తిలేనిచో భగవత్సాక్షాత్కారమునకు ఉపకరించదు. సర్వోత్తమమైన కర్మయైనను భగవదర్పణము చేయనిచో, సాధనకాలమందు ఫలకాలమందు, దుఃఖము కలిగించునదై శోభించదు.

శ్లో. యశశ్శ్రియామేవ పరిశ్రమః పరో వర్ణాశ్రమాచార తపః శ్రుతాదిషు
అవిస్మృతిః శ్రీధరపాద పద్మయో ర్గుణానువాదః శ్రవణాదిభి ర్హరేః. 55

అ. వర్ణాశ్రమాచార తపః శ్రుతాదిషు = బ్రాహ్మణాది వర్ణములందు, బ్రహ్మచర్యాది ఆశ్రమములందు, సదాచారమునందు, తపస్సు స్వాధ్యాయములందు; పరః = అధికమైన; పరిశ్రమః = పరిశ్రమ యశశ్శ్రియామేవ = కీర్తికి, సంపదకు మాత్రమే ఉపకరించుచున్నది. అనగా పరమ పురుషార్థమునకు కాదని భావము హరేః = శ్రీహరియొక్క శ్రవణాదిభిః = అవతారలీలలువినుటచే గుణానువాదః = గుణానుసంధానము; శ్రీధర పాదపద్మయోః = లక్ష్మిని ఉరమున ధరించిన శ్రీమహావిష్ణువుయొక్క పాదపద్మములందు; అవిస్మృతిః = అచంచలమైన స్మృతి కలుగును.

తా. బ్రాహ్మణాది వర్ణములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు, సదాచారము తపస్సు, స్వాధ్యాయములందలి పరిశ్రమ, కీర్తిసంపదలు కలిగించునవేకాని పరమపురుషార్థము నిచ్చునది

కాదు. శ్రీమన్నారాయణుని అవతార లీలలు వినుట, గుణసంకీర్తనము చేయుటవలన శ్రీధరుని పాదపద్మములందు అవిస్మృతి కలుగును.

అవ. అవిస్మృతి వలన ఏమి జరుగుననగా చెప్పుచున్నారు.

**శ్లో. అవిస్మృతి: కృష్ణపదారవిందయోః క్షిణోత్యభద్రాణి శమం తనోతి చ**
**సత్త్వస్య శుద్ధిం పరమాం చ భక్తిం జ్ఞానం చ విజ్ఞాన విరక్తి యుక్తమ్ః 56**

అ, కృష్ణపదారవిందయోః=శ్రీకృష్ణపాదపద్మములందలి అవిస్మృతిః=అచంచలమైనస్మృతి అభద్రాణి=అశుభములను క్షిణోతి=పారద్రోలును; శమం=పరమశాంతిని, తనోతి=కలిగించును. సత్త్వస్య అంతః=కరణము యొక్క; శుద్ధిం=పరశుద్ధిని; పరమాం=ఉత్కృష్టమైన; భక్తిం=భక్తిని విజ్ఞానవిరక్తియుక్తం=వైరాగ్యములతోకూడిన;జ్ఞానం=భగవత్స్వరూపజ్ఞానమును;తనోతి=విస్తరింప చేయును.

తా. శ్రీకృష్ణుని పాదపద్మములయందలి కలిగిన అచంచలమైన స్మృతిఅన్ని అశుభములను తొలగించి పరమశాంతిని కలిగించును. అంతఃకరణమును పరిశుద్ధము చేయును. శ్రీవిష్ణువుయందు పరమ భక్తిని కలిగించును. భగవత్స్వరూప జ్ఞానమువిరక్తితో కూడిన భగవదనుభవమును కలిగించును.

అవ. ఇపుడు భగవత్కథలను వినెడివారిని, చెప్పిన తనను అభినందించుచు రెండు శ్లోకములతో చెప్పుచున్నారు.

**శ్లో. యూయం ద్విజాగ్ర్యా బత భూరి భాగా య చ్ఛశ్వదాత్మన్యఖిలాత్మభూతమ్**
**నారాయణం దేవ మదేవ మీశం అనన్యభావా భజతాధివేశ్య. 57**

అ. హేద్విజాగ్ర్యాః=ఓ బ్రాహ్మణోత్తములారా! యూయం=మీరు;భూరిభాగా.=బహుపుణ్యము గలవారు. యత్=ఎందువలన; శశ్వత్=ఎల్లపుడు; ఆత్మని=అంతఃకరణమునందు; అఖిలాత్మభూతం=సర్వాంతర్యామియైన; దేవం=అందరిచే ఉపాసించబడు; అదేవం=మరియొక అరాధ్య దెవుడులేని; ఈశం=ప్రభువైన;నారాయణం=శ్రీమన్నారాయణుని; అధివేశ్య=నిలుపుకొని భజత=భజించుడు.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! మీరు గొప్ప పుణ్యాత్ములుగాన, సర్వాంతర్యామి అందరిచే ఉపాస్యుడు, మఱియొక దైవములేనివాడు, జగత్ప్రభువైన శ్రీమన్నారాయణుని అంతఃకరణమునందు నిలిపి ఎల్లప్పుడు భజించుడు.

**శ్లో. అహం చ సంస్మారిత ఆత్మ తత్త్వం శ్రుతం పురా మే పరమర్షి వక్త్రాత్**
**ప్రాయోపవేశే నృపతేః పరీక్షితః సదస్యృషీణాం మహతాం చ శృణ్వతామ్. 58**

అ. పురా=పూర్వము పరీక్షితః నృపతేః=పరీక్షిన్మహారాజుయొక్క ప్రాయోపవేశే=ప్రాయోపవేశ సమయమునందు; ఋషీణాం=మహర్షులయొక్క; సదసి=సభయందు; మహతాం=పెద్దలు శృణ్వతాం=వినుచుండగా; పరమ వర్షి వక్త్రాత్=శుకయోగి ముఖమునుండియే మే=నాచేత శ్రుతం=వినబడిన; ఆత్మతత్త్వం=పరమాత్మతత్త్వమును అహంచ=నేను గూడా; సంస్మారితః=స్మరింపచేయ బడితని.

తా. పూర్వము పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశము చేసిన సమయమున మహర్షులందరు చేరియున్నసభలో మహాత్ములందరు వినుచుండగా శుకయోగీన్ద్రుని వలన నేను వినిన ఆత్మతత్త్వమును ఇపుడు మీరడగి మరల స్మరించుకొనునటుల చేసి చాలా అనుగ్రహము చూపితిరి.

అవ. ఈ భాగవతమును కీర్తించుటవలన వినుటవలన కలుగు ఫలమును ఎనిమిది శ్లోకములలో చెప్పుచున్నారు.

**శ్లో. ఏతద్వః కథితం విప్రాః కథనీయోరు కర్మణః**
**మాహాత్మ్యం వాసుదేవస్య సర్వాశుభ వినాశనం. 59**

అ, విప్రాః! = ఓ బ్రాహ్మణోత్తములారా! కథనీయ × ఉరుకర్మణః = చెప్పదగిన గొప్పపనులు చేసిన; వాసుదేవస్య = శ్రీమన్నారాయణుని యొక్క; సర్వాశుభవినాశనం = ఎల్ల అశుభములను నశింపజేయు; ఏతత్ = ఈ; మహాత్మ్యం = మాహాత్మ్యమును వః = మీకు కథితం = చెప్పబడినది.

తా. ఓ బ్రాహ్మణోత్తములారా! కీర్తించదగిన గొప్పపనులు చేసిన శ్రీమన్నారాయణుని మాహాత్మ్యమును మీకు తెలిపితిని.

**శ్లో. య ఇదం శ్రావయేన్నిత్యం యామ క్షణ మనన్యధీః**
**శ్లోకమేకం తదర్థం వా పాదం పాదార్థమేవవా**
**శ్రద్ధావాన్ యో ను శృణు యా త్పునాత్యాత్మానమేవ సః. 60**

అ, అనన్యధీః = ఏకాగ్రచిత్తుడై యః = ఎవడు; ఏవం = ఈ ప్రకారముగా; యామక్షణం = ఒక ఝాముగాని, ఒకక్షణముగాని; నిత్యం = ప్రతిరోజు; శ్రావయేత్ = వినిపించునో; ఏకం = ఒక; శ్లోకం = శ్లోకమునుగాని; తదర్థంవా = సగముశ్లోకమునుగాని; పాదం = శ్లోకములోని ఒకపాదమునుకాని; పాదార్థం ఏవవా = సగమ పాదమునుకాని; శ్రద్ధవాన్ = శ్రద్ధగలవాడు; యః = ఎవడు; శృణుయాత్ = వినునో; సః = వాడు, ఆత్మాన మేవ = ఆత్మనే; పునాతి = పవిత్రము చేయుచున్నాడు.

తా. ఏకాగ్రచిత్తముతో ఒకఝాముకాని ఒకక్షణముకాని ఈ భాగవత కథను వినిపించిన వాడు శ్రద్ధతో ఒకశ్లోకముగాని శ్లోకములోని ఒకపాదముగాని సగము పాదమును కాని వినినవాడు శరీరమునే కాక ఆత్మను కూడా పవిత్రము చేయుచున్నాడు.

**శ్లో. ద్వాదశ్యామేకాదశ్యాం వాశృణ్వన్నాయుష్మవాన్ భవేత్**
**పఠత్యన శ్నన్ప్రయతః పూతో భవతి పాతకీ. 61**

అ. ద్వాదశ్యాం = ద్వాదశినాడు; ఏకాదశ్యాం వా = ఏకాదశినాడు కాని; శృణ్వన్ = ఈ భాగవత కథను వినుచు; ఆయుష్మవాన్ = ఆయుష్మంతుడు; భవేత్ = అగును; పాతకీ = పాపియైనవాడు; ప్రయతః ఇంద్రియ నిగ్రహముగలవాడై; అనశ్నన్ = ఉపవసించుచు; పఠతి = చదువునో; పూతః = పవిత్రుడు (పాపములు తొలగినవాడుగా) భవతి = అగును.

తా. ద్వాదశినాడు కాని ఏకాదశినాడుకాని ఈభాగవత కథ వినినినవాడు ఆయుష్మంతుడగును. పాపములు కలవాడైనను ఇంద్రియనిగ్రహముతో ఉపవసించి ఈ భాగవతమును చదివినచో పాతకములు తొలగి పవిత్రుడగును.

శ్లో. పుష్కరే మధురాయాం వా ద్వారవత్యాం యతాత్మవాన్
ఉపోష్య సంహితా మేతాం పఠిత్వా ముచ్యతే భయాత్. 62

అ, యతాత్మవాన్ = మనస్సును నిగ్రహించినవాడు; పుష్కరే = పుష్కరమునందు; మధురాయాం వా = మధురయందుకాని; ద్వారవత్యాం = ద్వారకయందుకాని; ఉపోష్య = ఉపవసించి; ఏతాం = ఈ; సంహితాం = భాగవత సంహితనుపఠిత్వా = చదివి;భయాత్ = సంసారభయమునుండి;ముచ్యతే = విడువబడును.

తా. మనోనిగ్రహము గలవాడై పుష్కరమునందుకాని మధుర యందు కాని, ద్వారక యందు కాని ఉపవసించి ఈ భాగవత సంహితను చదివినచో సంసారభయము తొలగిపోవును.

శ్లో. దేవతా మునయ స్సిద్ధాః పితరో మనవో నృపాః
యచ్ఛంతి కామాన్ గృణతః శృణ్వతః యస్య కీర్తనాత్. 63

అ, యస్య = ఏ శ్రీమన్నారాయణుని యొక్క; కీర్తనాత్ = కీర్తనము వలన; శృణ్వతః = శ్రవణమువలన; గృణతః = పఠనమువలన; దేవతాః = దేవతలుః మునయః = మునులు; సిద్ధాః = సిద్ధులు; పితరః = పితృదేవతలు; మనవః = మనువులు; నృపాః = రాజులు; కామాన్ = కోరికలను; యచ్ఛంతి = ఇచ్చెదరు,

తా. శ్రీమన్నారాయణుని కథలు వినువారికి, చదువు వారికి, కీర్తించు వారికి దేవతలు మునులు సిద్ధులు, పితృదేవతలు, మనువులు, రాజులు, కోరికలను తీర్చెదరు.

శ్లో. ఋచో యజూంషి సామాని ద్విజోఽధీత్యాను విందతే
మధు కుల్యాః ఘృత కుల్యాః పయః కుల్యాశ్చ తత్ఫలమ్. 64

అ. ద్విజః = బ్రాహ్మణుడు; ఋచః = ఋగ్వేద మంత్రములను; యజూంషి = యజుర్వేదమంత్రములను; సామాని = సామవేద మంత్రములను; అధీత్య = అధ్యయనముచేసి; మధుకుల్యాః = తేనే ప్రవహించు నదులను; ఘృతకుల్యాః = నేయి ప్రవహించు నదులు; పయః కుల్యాః = పాలు ప్రవహించు నదులను; అనువిందతే = పొందును; తత్ఫలం = ఆ ఫలమును; అనువిందతే = ఈభాగవతమును చదివినవాడు వినినవాడు కూడా పొందును.

తా. బ్రాహ్మణుడు ఋగ్వేదమును, యజుర్వేదమును, సామవేదమును చదివి తేనే, నేయి, పాలు, ప్రవహించు నదులను ఫలముగా పొందును. ఆ ఫలమును భాగవత సంహితను చదివినవారు వినిన వారు కూడా పొందెదరు. అనగా వేదాధ్యయనము చేసినవారు పొందెడు సర్వసుఖ సమృద్ధిని భాగవతాధ్యయనము శ్రవణము చేయువారు కూడా పొందెదరని భావము.

శ్లో. పురాణ సంహితా మేతాం అధీత్య ప్రయతో ద్విజః
ప్రోక్తం భగవతా యత్తు తత్పదం పరమం వ్రజేత్. 65

అ. ప్రయతః = ఇంద్రియ నిగ్రహము కలిగిన; ద్విజః = బ్రాహ్మణుడు; ఏతాం = ఈ; పురాణ; సంహితాం = ఈ భాగవత పురాణసంహితను; అధీత్య = అధ్యయనము చేసి; యత్ = ఏది; భగవతా = భగవంతునిచే; ప్రోక్తం = చెప్పబడిన; తత్ = ఆ; పరమం పదం = పరమ పదమును; వ్రజేత్ = పొందును.

తా. బ్రాహ్మణుడు ఏకాగ్రచిత్తముతో ఈ భాగవత పురాణసంహితను అధ్యయనము చేసినచో భగవంతుడు స్వయముగా చెప్పిన పరమ పదమును పొందును.

అవ. ఆయావర్ణములకు యోగ్యములైన ఫలములను పొందుదురని చెప్పుచున్నారు.

శ్లో. విప్రోఽధీత్యాప్నుయాత్ప్రజ్ఞాం రాజన్యోదధిమేఖలామ్
వైశ్యో నిధి పతిత్వం చ శూద్ర శ్శుధ్యేత పాతకాత్. 66

అ. విప్రః = బ్రాహ్మణుడు; అధీత్య = చదివి ప్రజ్ఞాం = తత్త్వజ్ఞానము; కలిగించు బుద్ధిని; అప్నుయాత్ = పొందును; రాజన్యః = క్షత్రియుడు; అధీత్య = ఈ భాగవతమును చదివి; ఉదధిమేఖలాం = నాలుగు సముద్రములు మొలనూలుగా గల భూమిని; అప్నుయాత్ = పొందును; వైశ్యః = వైశ్యుడు; అధీత్య = చదివి నిధిపత్యం; చ = నిధికి అధిపత్యమును; అప్నుయాత్ = పొందును; శూద్రః = శూద్రుడు; అధీత్య = చదివి, పాతకాత్ = పాపమునుండి; శుద్ధ్యేత = శుద్ధి పొందును.

తా. ఈ భాగవతసంహితను బ్రాహ్మణుడు చదివినచో తత్త్వజ్ఞానమును కలిగించు బుద్ధిని పొందును. రాజు చదివినచో సమస్త భూమండలమునకు చక్రవర్తియగును. వైశ్యుడు చదివినచో నిధిపతియగును. శూద్రుడు చదివినచో పాపములు నశించును.

అవ. ఈభాగవత పురాణమునకు ఇంతటిప్రభావముండుటకు కారణమును చెప్పుచున్నారు.

శ్లో. కలిమల సంహతి కాలనోఽఖిలేశో హరిరితరత్ర నగీయతే హ్యభీక్ష్ణమ్
ఇహ తు పున ర్భగవా నశేషమూర్తిః పరి పఠితోఽనుపదం కథాప్రసంగైః. 67

అ. కలిమల సంహతి కాలనః = కలికల్మషము నెల్ల నశింప జేయువాడు, అఖిలేశః = సర్వజగత్తునకు ప్రభువైన; హరిః = శ్రీమన్నారాయణుడు; ఇతరత్ర = వేరువేరు పురాణములందు, అభీక్ష్ణం = మాటిమాటికి; నగీయతే = కీర్తించబడడు ఇహతు; పునః = ఇక్కడైతేనో; భగవాన్ = భగవంతుడు; అశేష మూర్తిః = సర్వజగత్స్వరూపముగల శ్రీమన్నారాయణుడు; అనుపదం = మాటి మాటికి కథాప్రసంగైః కథలు చెప్పుచు ప్రసంగవశమున; పరిపఠితః = అంతటా కీర్తించబడియున్నాడు.

తా. ఇతరములగు పురాణములందు కలికల్మషములనునాశనముచేయు వాడుజగదీశ్వరుడు అయిన శ్రీమన్నారాయణుడు మాటిమాటికి కీర్తించబడలేదు. ఈభాగవతమునందు మాత్రము సర్వస్వరూపియైన భగవంతుడు కథాప్రసంగములలో మాటిమాటికిగానము చేయబడెను.

అవ. శాస్త్రములచే ప్రతిపాదించబడిన భగవంతుని నమస్కరించుచున్నారు.

శ్లో. తమహ మజ మనన్త మాత్మతత్వం జగదుదయ స్థితి సంయమాత్మ శక్తిమ్
ద్యుపతి భిరజ శక్ర శంకరాద్యై ర్దురవసితస్తవ మచ్యుతం నతోఽస్మి. 68

అ. అజం = జన్మమరణాది వికారములేనివాడు; అనన్తం = దేశకాల వస్తుపరిచ్ఛిన్నుడు కానివాడు; ఆత్మతత్త్వం = ఆత్మతత్త్వమునైన; జగదుదయస్థితి; సంయమాత్మ శక్తిం = జగత్తు యొక్క సృష్టి స్థితిలయములుగావించు సత్త్వరజోస్తమోశక్తులు గలవాడు; ద్యుపతిభిః = స్వర్గాదిలోకపాలురగు అజ శక్రశంకరాద్యైః = బ్రహ్మ ఇంద్రుడు శంకరుడు మొదలగు వారిచేత దురవసిత; స్తవం = తెలియరేని స్తోత్రము గల; తం = ఆ; అచ్యుతం = దేనినుండి చ్యుతుడుకాని శ్రీమన్నారాయణుని నతః; అస్మి = నమస్కరించు చున్నాను.

తా. జన్మమరణాదివికారములులేనివాడు, దేశకాలవస్తువులచేపరిచ్ఛిన్నుడుకానివాడు, ఆత్మతత్త్వమైనవాడు జగత్తును సృష్టించు రక్షించు నశింపచేయు సత్త్వరజస్తమశ్శక్తులు గలవాడు, స్వర్గాద లోకపాలురగు బ్రహ్మ ఇంద్రుడు శంకరుడు మొదలగువారిచేతను స్తుతింప శక్యముకానివాడు, అయిన అచ్యుతుని నమస్కరించుచున్నాను.

**శ్లో. ఉపచిత నవశక్తిభి స్స్వ ఆత్మన్యుపరచిత స్థిరజంగమాలయాయ**
**భగవత ఉపలబ్ధి మాత్రధామ్నే సురఋషభాయ నమస్సనాతనాయ 69**

అ. ఉపచిత నవశక్తిభిః=వృద్ధిపొందిన ప్రకృతి పురుషమహదహంకార తన్మాత్రలను తొమ్మిది శక్తులతో; స్వ ఆత్మని=తనయందే ఉపరిచిత స్థిర: జంగమాలయాయ=సృష్టించబడిన స్థావర జంగమములకు నివాసమైన ఉపలబ్ధిమాత్ర; ధామ్నే=కేవలము అనుభూతియే స్వరూపమైన పరమ పదము నివాసముగాగల; సురఋషభాయ=దేవ శ్రేష్ఠుడైన; సనాతనాయ=సనాతనుడైన; భగవతే=భగవంతుడగు శ్రీమన్నారాయణునకు; నమః=నమస్కరించుచున్నాను.

తా. వృద్ధి పొందిన ప్రకృతి పురుష మహదహంకారములు పంచ తన్మాత్రలు అను తొమ్మిది శక్తులచే తనయందే స్థావర జంగమములను సృష్టించి, అనుభూతియే స్వరూపమైన పరమ పదమున నివసించుదేవతా శ్రేష్ఠుడు, సనాతనుడు, భగవంతుడు అయిన శ్రీమన్నారాయణునకు నమస్కారము.

అవ. గురువందనము చేయుచున్నారు

**శ్లో. స్వసుఖ నిభృత చేతా స్తద్వ్యుదస్తాన్యభావో**
**వ్యజితరుచిర లీలా కృష్ణసారస్తదీయమ్**
**వ్యతనుత కృపయా య స్తత్త్వదీపం పురాణమ్**
**తమఖిల వృజి నఘ్నం వ్యాససూనుం నతోఽస్మి 70**

అ. స్వసుఖనిభృత చేతాః=ఆత్మానందముతో పరిపూర్ణమైన చిత్తము గలవాడు; తత్ వ్యుదస్త అన్యభావః=ఆ చిత్తముచే దూరీకరించిన లౌకిక భావములు కలవాడై అజిత రు చిర; లీలా కృష్టసారః=భగవంతుని రమ్యమైన లీలచే ఆకర్షించబడిన చిత్తముగలవాడై, తదీయం=ఆభగవంతుని గుణములను చెప్పునట్టి; తత్త్వదీపం=ఆత్మతత్వమును ప్రకాశింపచేయు దీ మైన, పురాణం=భాగవతపురాణమును; కృపయా=దయచే వ్యతనుత విస్తరించిచెప్పెనో; తం=ఆ అఖిలవృజినఘ్నం సమస్తపాపములను నశింపచేయు; వ్యాససూనుం=వ్యాసపుత్రుడైన శుకయోగీన్ద్రుని నతోఽస్మి నమస్కరించు చున్నాను.

తా. ఆత్మానందముతో పరిపూర్ణమైన చిత్తముతో లౌకికభావములను దూరము చేసుకొనినవాడు, భగవంతుని రమ్యమైనలీలలతో ఆకర్షించబడిన చిత్తముగలవాడు, ఆభగవంతుని గుణములను వర్ణించు తత్త్వదీపమైన భాగవతపురాణమును దయతో విస్తరించినవాడు సమస్త పాపములను నశింపచేయువాడు వ్యాసపుత్రుడు అయిన శుకమహర్షిని నమస్కరించుచున్నాను.

ఇతి శ్రీమద్భాగవతే ద్వాదశస్కంధే
ద్వాదశోఽధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమున పంన్రెడవ స్కంధమున
పంన్రెండవ అధ్యాయము ముగిసినది
—ఓం తత్ సత్—

# త్రయోదశోఽధ్యాయః

## పదమూడవ అధ్యాయము

## సంగ్రహ శ్లోకము

**త్రయోదశే పురాణానాం సంఖ్యామాహ యథాక్రమమ్**
**దానం దానస్య మాహాత్మ్యం శ్రీ మద్భాగవతస్య చ.**

తా. ఈ త్రయోదశాధ్యాయమునందు క్రమముగా అన్ని పురాణములయందుండెడి శ్లోక సంఖ్యను, దానమును, దానమహాత్మ్యమును, శ్రీమద్భాగవత మాహాత్మ్యమును చెప్పి యున్నారు.

అవ. అన్నిపురాణముల శ్లోక సంఖ్యను చెప్పబోవుచు, పురాణ ప్రతిపాద్యుడైన శ్రీమన్నారాయణుని నమస్కరించుచున్నారు.

సూత ఉవాచ = సూత మహర్షి పలికెను.

శ్లో. **యం బ్రహ్మ వరుణేన్ద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైఃస్తవైః**
**వేదైః సాంగ పదక్రమోపనిషదైర్గాయన్తి యం సామగాః**
**ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యం యోగినః**
**యస్యాన్తం న విదుస్సురాసురగణాః దేవాయ తస్మైనమః.** 1

అ. యం =ఏ భగవంతుని; బ్రహ్మ బ్రహ్మ; వరుణ=వరుణుడు; ఇంద్ర=ఇంద్రుడు; రుద్ర=రుద్రుడు; మరుతః=మరుద్గణములు; దివ్యైః=దివ్యములైన అనగా సారవంతములైన స్తవైః=స్తోత్రములచేత; స్తున్వన్తి = స్తుతించుచున్నారో, సామగాః=సామవేదము గానముచేయువారు; సాంగపదక్రమోపనిషదైః =శిక్షాధి వేదాంగములు; ఆరుతెలిసి శ్రుతి పదక్రమ ఉపనిషత్తులతో కూడిన; వేదైః = వేదములచే; యం=ఏ భగవంతుని; గాయన్తి =గానముచేయు చున్నారో; యం = యే భగవంతుని: యోగినః = యోగులు; ధ్యానావస్థిత తద్గతేన = ధ్యానమగ్నులై భగవంతుని యందే నిలిపిన; మనసా =మనస్సు చేత పశ్యన్తి =చూచుచున్నారో; యస్య=ఏ భగవంతుని యొక్క; అంతం = పరిపూర్ణస్వరూపమును; సుర + అసురగణాః=దేవరాక్షస గణములు; న విదుః =తెలియవో; తస్మై=ఆ; దేవాయ=శ్రీ మన్నారాయణునకు; నమః =నమస్కారములు

తా. బ్రహ్మ, ఇంద్రుడు, వరుణుడు, రుద్రుడు, మరుద్గణములు సారవంతములైన స్తోత్రములచే స్తుతించ బడువాడు, వేదాంగములు ఉపనిషత్తులు పదము క్రమములతో కూడిన వేదములచే సామగానము చేయువారిచే గానము చేయబడువాడు, ధ్యానమగ్నులై భగవంతుని యందే నిలిపిన మనసుచే చూడబడువాడు, దేవదానవ గణములు కూడా అంతుచిక్కని స్వరూపము గలవాడు అయిన ఆ శ్రీమన్నారాయణునకు నమస్కారము.

శ్లో. పృష్ఠే భ్రామ్యదమంద మందరగిరి గ్రావాగ్ర కండూయనాత్
నిద్రాళోః కమఠాకృతే ర్భగవతో శ్వాసానిలాఃపాంతు వః
యత్సంస్కార కలానువర్తనవశాత్ వేలానిభేనాంభసామ్
యాతా యాత మతంద్రితం జలనిధే ర్నాద్యాపి విశ్రామ్యతి. 2

అ. పృష్ఠే=వీపునందు; భ్రమ్యాత్=తిరుగుచున్న;అమంద=గొప్పనైన;మందగిరి=మందర పర్వతము యొక్క; గ్రావాగ్ర=శిలల మొదటి భాగము యొక్క; కండూయనాత్=రాపిడివలన; నిద్రాళోః=దురదపోయి నిద్రించుచున్న; కమఠా కృతేః=కూర్మావతారమును ధరించిన శ్రీమన్నారాయణుని యొక్క; శ్వాసానిలాః=శ్వాసవాయువులు; వః=మిమ్ములను; పాంతు కాపాడుగాక. యత్=ఏ శ్వాసవాయువుల యొక్క; సంస్కార = పలుమారులు తాకిన సంస్కార వశము చేత; కలానువర్తనవశాత్ = ఆ కదలిక అను కలను అనుసరించుట వలన; జలనిధేః=సముద్రము యొక్క; అంభసాం=జలము యొక్క; వేలానిభేన = చెలియలి కట్ట అనెడు మిషచేత; అతంద్రితం = ఎడతెగని; యాతాయాతం=రాకపోకలు; అద్యాపి = నేటికిని; న విశ్రామ్యతి = ఆగుటలేదు.

తా. దేవదానవులు అమృతము కొఱకు క్షీరసాగరమున మందర పర్వతమును కవ్వముగా చేసి చిలుకునపుడు మందరగిరి క్రుంగగా శ్రీమన్నారాయణుడు కూర్మావతారమున ఆ పర్వతమును తన వీపున మోసెను. ఆ సమయమున దేవదానవులు చిలుకుచుండగా మందర గిరి శిలలరాపిడిచే స్వామికి దురద తీరగా నిద్రవచ్చెను. అటుల నిద్రించుచున్న స్వామి శ్వాస వాయువులు మిమ్ములను రక్షించుగాక.మఱియు నిద్రించుచు శ్వాసవాయువులు వదలినపుడు ఆ వాయువుల తాకిడికి సముద్రమున అలలు పొంగిచెలియలికట్టవరకువెళ్ళుచు తిరిగివెనుకకు పోవుచుండెను. అటుల సముద్రజలమున రాకపోకలు అలవడుటవలన నేటికిని సముద్రమున అలలు చెలియలి కట్టవరకు వచ్చుట, తిరిగి వెళ్ళుట మానలేదు.

శ్లో. పురాణ సంఖ్యా సంభూతి మస్య వాచ్యం ప్రయోజనమ్
దానం దానస్య మాహాత్మ్యం పాఠాదేశ్చ నిబోధత. 3

అ. పురాణ సంఖ్యా సంభూతిః=పురాణముల సంఖ్య వాటి పుట్టుక; అస్య=ఈ భాగవతము యొక్క; వాచ్యం=చదువుట వలన; ప్రయోజనం=ఫలము; దానం=శ్రీమద్భాగవతమును దానము చేయుట; దానస్య=దానము యొక్క; మాహాత్మ్యం=ప్రభావము; పాఠాదేః చ=చదువుట వినుట మొదలగు వాటినలన కలుగు ప్రయోజనమును కూడా; నిబోధత=తెలిసికొనుడు.

తా. పురాణముల శ్లోకసంఖ్య, వాటి పుట్టుక, పురాణములు చదువుట వినుట వలన కలుగు ప్రయోజనము, శ్రీమద్భాగవతమును, దానము చేయుట, దానప్రభావము, భాగావతము చదువుట వలన వినుట వలన కలుగు ప్రయోజనమును కూడా తెలియుడు.

శ్లో. బ్రాహ్మం దశ సహస్రాణి పాద్మం పంచోనషష్టి చ
శ్రీవైష్ణవం త్రయోవింశ చ్చతుర్వింశతి శైవకమ్. 4

తా. బ్రహ్మ పురాణమున పదివేల శ్లోకములు, పద్మపురాణమున ఏబది యైదువేల శ్లోకములు, శ్రీ విష్ణుపురాణమున ఇరువది మూడు వేలు, శివపురాణమున ఇరువది నాలుగువేల శ్లోకములు కలవు.

శ్లో. దశాష్టౌ శ్రీ భాగవతం నారదం పంచవింశతి
మార్కండేయం నవాగ్నేయం దశ పంచ చతుశ్శతమ్. 5

తా. శ్రీమద్భాగవత పురాణమున పదునెనిమిది వేల శ్లోకములు, నారదపురాణమున ఇరువదియైదువేలు. మార్కండేయ పురాణము న తొమ్మిదివేలు, అగ్నిపురాణమున 15 400 పదునైదువేల నాలుగువందల శ్లోకములు కలవు.

శ్లో. చతుర్దశ భవిష్యత్స్యాత్తథా పంచశతాని చ
దశాష్టౌ బ్రహ్మవైవర్తం లైంగ మేకాదశైవతు. 6

తా. భవిష్యత్పురాణమున పదునాలుగువేల అయిదువందల శ్లోకములు, బ్రహ్మవైవర్తమున పదునెనిమిదివేలు, లింగపురాణమున పదునొకొండువేలు శ్లోకములు కలవు.

శ్లో. చతుర్వింశతి వారాహం ఏకాశీతి సహస్రకం
స్కాందం తథా శతం చైకం వామనం దశకీర్తితమ్. 7

తా. వరాహపురాణమున ఇరువదినాలుగువేలు, స్కాంద పురాణమున యెనుబది ఒక వేల నూరు శ్లోకములు, వామన పురాణమున పదివేలు కలవు.

శ్లో. కౌర్మం సప్త దశాఖ్యాతం మాత్స్యం తత్తు చతుర్దశ
ఏకోనవింశత్సౌపర్ణం బ్రహ్మాండం ద్వాదశైవతు. 8

తా. కూర్మ పురాణమున 17000 పదునేడు వేలు, మత్స్య పురాణమున పదునాలుగు వేలు, గరుడపురాణమున 19 000 పందొమ్మిదివేలు, బ్రహ్మాండ పురాణమున పంద్రెండువేలు కలవు.

శ్లో. ఏవం పురాణ సందోహ శ్చతుర్లక్ష ముదాహృతమ్. 9

తా. ఇటుల పదునెనిమిది పురాణములలో నాలుగు లక్షల శ్లోకములు చెప్పబడినవి చూడుడు.

1. బ్రహ్మపురాణము — 10,000
2. పద్మపురాణము — 55,000
3. శ్రీవిష్ణుపురాణము — 23,000
4. శివపురాణము — 24,000
5. శ్రీమద్భాగవతము — 18,000
6. నారదపురాణము — 25,000
7. మార్కండేయ పురాణము — 9,000
8. అగ్ని పురాణము — 15,400
9. భవిష్యత్పురాణము — 14,500
10. బ్రహ్మవైవర్తము — 18,000
11. లింగపురాణము — 11,000

12. వరాహ పురాణము — 24,000
13. స్కాందపురాణము — 81,000
14. వామన పురాణము — 10,000
15. కూర్మ పురాణము — 17,000
16. మత్స్య పురాణము — 14,000
17. గరుడ పురాణము — 19,000
18. బ్రహ్మాండ పురాణము — 1,200

4 00 000

శ్లో. తత్రాష్టా దశ సాహస్రం శ్రీభాగవతముచ్యతే
ఇదం భగవతా పూర్వం బ్రహ్మణే నాభిపంకజే
స్థితాయ భవ భీతాయ కారుణ్యాత్సంప్రదర్శితమ్. 10

అ తత్ర=ఆపురాణములలో, అష్టా=యెనిమిది; దశ=పది సాహస్రం=వేలు; శ్రీభాగవతం=శ్రీమద్భాగవత పురాణము; ఉచ్యతే=చెప్పబడినది.; ఇదం=ఈ భాగవత పురాణము; పూర్వం=మొదట; భగవతా=శ్రీమన్నారాయణుని చేత; నాభి పంకజే=నాభి పద్మమున; స్థితాయ=ఉన్నట్టి; భవభీతాయ=సంసారమునకు భయపడిన; బ్రహ్మణే=చతుర్ముఖ బ్రహ్మకొఱకు; కారుణ్యాత్=దయ వలన; సంప్రదర్శితం=చక్కగా తెలుపబడినది.

తా. ఆ పదునెనిమిది పురాణములలో శ్రీమద్భాగవత పురాణము పదునెనిమిదివేల శ్లోకములు కలిగి యున్నది. ఈ భాగవత పురాణమును శ్రీమన్నారాయణుడు తన నాభి పద్మమున ఉండి సంసారమునకు భయపడుచున్న బ్రహ్మకు దయతో తెలిపెను.

శ్లో. ఆది మధ్యావసానేషు వైరాగ్యాఖ్యా సంయుతమ్
హరిలీలా కథావ్రాతామృతా నందిత సత్సురమ్. 11

అ. ఆది మధ్యావసానేషు=మొదట, నడుమ, చివరలలో; వైరాగ్యాఖ్యాన సంయుతం=వైరాగ్యమును బోధించు కథలతో కూడినది; హరిలీలా కథావ్రాతా+అమృత+ఆనందిత సత్+సురమ్=శ్రీమన్నారాయణుని అవతారలీలం కథల సమూహములనెడు అమృతముచే ఆనందింప చేయబడిన దేవతోత్తములు గలది;

తా. ఈ భాగవత పురాణమున మొదట మధ్యన చివరలో వైరాగ్యమును బోధించు కథలు గలది. శ్రీమన్నారాయణుని అవతార లీలా కథామృతమును పానము చేసి ఉత్తమ దేవతలు ఆనందించిరి.

శ్లో. సర్వవేదాన్త సారం యద్బ్రహ్మాత్మైకత్వలక్షణమ్
వస్త్వద్వితీయం తన్నిష్ఠం కైవల్యైకప్రయోజనమ్. 12

అ సర్వవేదాన్త సారం=సమస్త ఉపనిషత్తుల సారము; బ్రహ్మ+ఆత్మ+ఏకత్వ లక్షణమ్ పరమాత్మకు జీవాత్మకు ఏకత్వమును ప్రసాదించునది; తన్నిష్ఠం ఆ భాగవతమునందున్న

వస్తు=విషయము; అద్వితీయం=రెండవది లేని బ్రహ్మను ప్రతిపాదించునది; కైవల్యైక ప్రయోజనం =మోక్షమొక్కటే పరమ పురుషార్థమని ప్రతిపాదించినది.

తా. ఈ భాగవతపురాణము సకలోపనిషత్తుల సిద్ధాన్తసారము. జీవాత్మ పరమాత్మలకు ఐక్యమును ప్రతిపాదించునది. ఇందలి విషయము అద్వితీయమైన బ్రహ్మము. ఈ భాగవతము మోక్షమొక్కటే పరమపురుషార్థమని ప్రతిపాదించినది.

శ్లో. **ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం హేమసింహ సమన్వితమ్**
**దదాతి యో భాగవతం స యాతి పరమాంగతిమ్.** **13**

అ, ప్రోష్ఠపద్యాం=భాద్రపదమాసమున; పౌర్ణమాస్యాం=పూర్ణిమనాడు హేమసింహ సమన్వితం=బంగారు సింహము ప్రతిమతో కూడిన; భాగవతం=శ్రీమద్భాగవతమును: యః=ఎవడు; దదాతి=దానముచేయునో; సః=అతను: పరమాంగతిం=పరమపదమును; యాతి=పొందును.

తా. భాద్రపద శుద్ధ పూర్ణిమనాడు బంగారు సింహము ప్రతిమతో కూడిన భాగవతమును దానము చేసిన వాడు పరమ పదమును పొందును.

శ్లో. **రాజంతే తావదన్యాని పురాణాని సతాంగణే**
**యావన్నదృశ్యతే సాక్షాత్ శ్రీ మద్భాగవతం పరమ్.** **14**

అ. యావత్=ఎంతవఱకు, పరం=ఉత్తమమైన; శ్రీమద్భాగవతం=శ్రీమద్భాగవత పురాణము; సాక్షాత్=ప్రత్యక్షముగా; న దృశ్యతే=ప్రకాశించదో; తావత్ = అంతవఱకు; సతాంగణే = ఉత్తమమైన సమూహమునందు; అన్యాని = ఇతరములైన; పురాణాని = పురాణములు; రాజంతే = ప్రకాశించును

తా. ఉత్తమోత్తమమైన శ్రీమద్భాగవత పురాణము ప్రత్యక్షముగా ప్రకాశించనంత వరకే ఇతర పురాణములు ప్రకాశించును. అనగా శ్రీమద్భాగవత పురాణము ప్రకాశించిన వెంటనే ఇతర పురాణములు తగ్గెనని తాత్పర్యము.

శ్లో. **సర్వవేదాంతసారం య చ్ఛ్రీభాగవత ముచ్యతే**
**తద్రసామృత తృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్.** **15**

అ. శ్రీభాగవతం=శ్రీమద్భాగవత పురాణము; సర్వవేదాంతసారం=సకల ఉపనిషత్తుల సారముగా; ఉచ్యతే=చెప్పబడినది. తత్ ✕ రస + అమృత తృప్తస్య భాగవతరసమను అమృతముచే తృప్తిపొందిన వానికి; అన్యత్ర మరియొకచోట; క్వచిత్=ఎక్కడ; రతిః =ప్రీతి; న స్యాత్=కలుగదు,

తా. శ్రీమద్భాగవత పురాణము ఎల్ల ఉపనిషత్తుల సారము. శ్రీమద్భాగవత రసామృతముతో తృప్తినొందిన వారికి మఱియొకచోట ప్రీతి కలుగదు.

శ్లో. **నిమ్నగానాం యథా గంగా దేవానామచ్యుతో యథా**
**వైష్ణవానాం యథా శంభుః పురాణానా మిదంతథా.** **16**

అ. నిమ్నగానాం=నదులలో; యథా=ఎట్లు; గంగా= గంగానది ఉత్తమమో; దేవానాం= దేవతలలో; యథా = ఎటుల; అచ్యుతః=శ్రీమహావిష్ణువు = శ్రేష్ఠుడో; వైష్ణవానాం = విష్ణుభక్తులలో;

యథా = ఎటుల; శంభుః = శంకరుడు శ్రేష్ఠుడో; తథా = అటులే; పురాణానాం = పురాణములలో; ఇదం = ఈ శ్రీమద్భాగవతము శ్రేష్ఠము.

తా. నదులలో గంగ, దేవతలలో శ్రీమహావిష్ణువు విష్ణుభక్తులలో శంకరుడు ఎటుల శ్రేష్ఠులో అటుల పురాణములలో శ్రీమద్భాగవతము శ్రేష్ఠమైనది.

శ్లో. శ్రీ మద్భాగవతం పురాణ మమలం యద్వైష్ణవానాం ప్రియమ్
యస్మిన్పారమహంస్య మేతదఖిలం జ్ఞానం పరం గీయతే
యత్ర జ్ఞాన విరాగ భక్తి సహితై ర్నైష్కర్మ్య మావిష్కృతమ్
తచ్ఛృణ్వన్విపఠన్విచారణ పరో భక్త్యా విముచ్యేన్నరః 17

అ. శ్రీమద్భాగవతం = శ్రీమద్భాగవతమను; పురాణం = పురాణము; అమలం = దోషరహితము యత్ = ఏ భాగవతము; వైష్ణవానాం = విష్ణుభక్తులకు: ప్రియం = ప్రీతికరము; యస్మిన్ = ఏభాగవతమునందు; ఏతత్ ఈ; పారమహంస్యం = పరమహంసులు అనగా జ్ఞానము పొందదగిన; అఖిలం = సమస్తమైన; పరం జ్ఞానం = పరమజ్ఞానమును; గీయతే = కీర్తించబడుచున్నది; యత్ర = ఏభాగవతమునందు; జ్ఞానవిరాగ భక్తిసహితైః = జ్ఞానము విరక్తి భక్తులతో కూడిన; నైష్కర్మ్యం = కర్మలకు ఆత్యన్తిక నివృత్తిగల మోక్షము; ఆవిష్కృతం = ప్రకటించటడినది తత్ = ఆ భాగవతమును భక్త్యా = భక్తిచేత; శృణ్వన్ = వినుచు; విపఠన్ = చదువుచు; విచారణ పరః = పరిశీలన చేయు; నరః = మానవుడు; విముచ్యతే = మోక్షమును పొందును.

తా. ఈ భాగవత పురాణము నిర్దోష ము. ఈ పురాణము విష్ణుభక్తులకు మిక్కిలి ప్రియమైనది. ఈ భాగవతమున పరమజ్ఞానులు పొందదగిన పరజ్ఞానము కీర్తించబడినది ఇందు జ్ఞాన భక్తివైరాగ్యములచే పొందదగిన మోక్షము ప్రకటించబడినది. భక్తితో ఈభాగవతమును వినువాడు, చదువువాడు, పరిశీలించువాడు సంసారమును విడిచి మోక్షమునుపొందును.

అవ. శ్రీమద్భాగవత సంప్రదాయమును ప్రవర్తింప చేయుచు భగవద్ధ్యాన రూపమైన మంగళమును ఆచరించుచున్నారు.

శ్లో. కస్మై యేన విభాసితోఽయ మతులో జ్ఞానప్రదీపః పురా
తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయ తద్రూపిణా
యోగీన్ద్రాయ తదాత్మనా చ భగవద్రాతాయ కారుణ్యతః
తచ్ఛుద్ధం విమలం విశోక మమృతం సత్యం పరం ధీమహి. 18

అ. పురా = పూర్వమున; అయం = ఈ; అతులః = సాటిలేని; జ్ఞానప్రదీపః = జ్ఞానదీపమైన ఈ భాగవతము; యేన = ఏ భగవంతునిచే; కస్మై = బ్రహ్మకొఱకు; విభాసితః = ప్రకాశింప చేయబడినది. తద్రూపేణ = ఆ బ్రహ్మరూపముతో శ్రీమన్నారాయణుడే; మునయే = మునియైన; నారదాయ = నారదునికి; తద్రూపిణా = ఆ నారదరూపముతో; కృష్ణాయ = వ్యాసమహర్షికి; తద్రూపిణా = ఆ వ్యాస రూపముతో; తదాత్మజాయ = వ్యాసమహర్షి కుమారులైన; యోగీన్ద్రాయ = శుకయోగీంద్రునకు తదాత్మనా = శుకమహర్షి రూపముతో; కారుణ్యతః = దయవలన; భగవద్రాతాయ = పరీక్షిన్మహారాజునకు; చెప్పబడినది. తత్ = ఆ భాగవతమును బోధించిన విష్ణుస్వరూపము; శుద్ధం = పవిత్రమైనది, విమలం = దోషరహితము; విశోకం = శోకమురాదు; అమృతం = మరణములేనిది; సత్యం = సత్యమైనది పరం సర్వోత్తమమైన స్వరూపమును; ధీమహి = ధ్యానించెదము.

తా. పూర్వము శ్రీమన్నారాయణుడు బ్రహ్మదేవునకు సాటిలేని జ్ఞానదీపమైన భాగవతమును ఉపదేశించెను. ఆ నారాయణుడే బ్రహ్మరూపమున నారదునకు, నారదరూపమున వ్యాసమహర్షికి, వ్యాసరూపమున శుకయోగీంద్రునకు, శుక యోగీన్ద్రుని రూపమున పరీక్షిన్మహారాజునకు ఉపదేశించెను. ఇటుల పలురూపములతో భాగవతమును ఉపదేశించిన శ్రీమన్నారాయణ స్వరూపము శుద్ధసాత్త్వికము, దోషరహితము, శోకము మృత్యువులేనిది. వికారములు కలుగనిది. సర్వోన్నతమైనది. అటువంటి శ్రీమన్నారాయణ తత్త్వమును ధ్యానించెదము.

అవ ఆ శ్రీమన్నారాయణునే దైవరూపముగా రెండు శ్లోకములచే నమస్కరించుచున్నారు.

శ్లో. **నమస్తస్మై భగవతే వాసుదేవాయ సాక్షిణే**
**య ఇదం కృపయా కస్మై వ్యాచ చక్షే ముముక్షవే.** **19**

అ, తస్మై = ఆ; భగవతే = భగవంతుడైన; సాక్షిణే = సర్వసాక్షియైన; వాసుదేవాయ = శ్రీమన్నారాయణునకు; నమః = నమస్కారము; యః = యేశ్రీమన్నారాయణుడు; ఇదం = ఈభాగవతమును; కృపయా = దయతో; ముముక్షవే = మోక్షమును కోరు; కస్మై = బ్రహ్మకు; వ్యాచ చక్షే = చెప్పెనో.

తా. దయతో మోక్షమును కోరు బ్రహ్మకు భాగవతమును ఉపదేశించిన శ్రీమన్నారాయణునకు సర్వసాక్షికి భగవంతునకు నమస్కారము.

శ్లో. **యోగీన్ద్రాయ నమస్తస్మై శుకాయ బ్రహ్మరూపిణే**
**సంసార సర్ప దష్టం యో విష్ణురాత మమూ ముచత్.** **20**

అ. తస్మై = ఆ; బ్రహ్మరూపిణే = బ్రహ్మస్వరూపియైన; యోగీన్ద్రాయ = యోగులలో శ్రేష్ఠుడైన; శుకాయ = శుక మహర్షికి; నమః = నమస్కారము; యః = ఏ శుక మహర్షి సంసార సర్ప దష్టం = సంసారమను సర్పచే కాటువేయబడిన; విష్ణురాతం = పరీక్షిన్మహారాజును; అమూముచత్ = మోక్షము పొందించెను.

తా. సంసారమను సర్పము కాటువేసిన పరీక్షిన్మహారాజునకు మోక్షము నిప్పించిన బ్రహ్మస్వరూపుడు యోగీన్ద్రుడు అయిన శుక మహర్షికి నమస్కారములు.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమ హంస్యాం
అష్టాదశ సాహస్రికాయాం సంహితాయాం
శ్రీవైయాసిక్యాం శ్రీహయగ్రీవ బ్రహ్మవిద్యాయాం
ద్వాదశస్కంధే త్రయోదశాధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమను మహాపురాణమున, జ్ఞానప్రదము, 18వేలశ్లోకములు గల
సంహితలో వ్యాసప్రోక్తమున హయగ్రీవ బ్రహ్మవిద్యలో
పంద్రెండవ స్కంధమున పదమూడవ అధ్యాయము ముగిసినది
శ్రీమద్భాగవత గ్రంథః పరిసమాప్తః
శ్రీమద్భాగవత గ్రంథము సమాప్తమైనది.
శ్రీ కృష్ణార్పణమస్తు
—ఓమ్ తత్ సత్—

తే. పుష్కరంబందు ద్వారకా పురమునందు
మధురయందును బవిదినమందు నెవఁడు
పఠనసేయును రమణతో భాగవతము
వాఁడు దరియించు సంసారవార్ధి నపుడ. 46

కం శ్రీరమణీ రమణకథా, పారాయణ చిత్తునకును బతికిఁ బరీక్షి
ద్భూరమణున కెఱిఁగించెను, సారమతిన్ శుకుఁడు ద్వాదశస్కంధములన్. 47

వ. మఱియు నష్టాదశపురాణంబు లందలి గ్రంథ సంఖ్య లెట్లనిన బ్రహ్మపురాణంబు దశ సహస్ర గ్రంథంబు పాద్మం బేఁబది యైదువేలు విష్ణుపురాణం బిరువది మూఁడు సహస్రంబులు శైవంబు చతుర్వింశతి సహస్రంబులు శ్రీభాగవతం బష్టాదశ సహస్రంబులు నారదంబు పంచవింశతి సహస్రంబు. మార్కండేయంబు నవసహస్రంబులు. ఆగ్నేయంబు పదియేనువేల నన్నూఱు. భవిష్యోత్తరంబు పంచశతాధిక చతుర్దశ సహస్రంబులు. బ్రహ్మకైవర్తం బష్టాదశసహస్రంబులు. లైంగం బేకాదశ సహస్రంబులు. వారాహంబు చతుర్వింశతి సహస్రంబులు. స్కాందం బెనుబదివేల నూఱు. వామనంబు దశసహస్రంబులు. కౌర్మంబు దశసహస్రంబులు. మాత్స్యంబు చతుర్దశ సహస్రంబులు. గారుడంబు పందొమ్మిది సహస్రంబులు బ్రహ్మాండంబు ద్వాదశ సహస్రంబులు. ఇట్లు పురాణగ్రంథ సంఖ్యా ప్రమాణంబులు ప్రవర్తిల్లు. ఈ పదునెనిమిది పురాణంబుల మధ్యంబున నదులయందు భాగీరథివిధంబున దేవతలయందుఁ బద్మగర్భుని మాడ్కిఁ దారకలందు గళానిధిగరిమ సాగరంబులందు దుగ్ధార్ణవంబు చందంబున నగంబులందు హేమనగంబు భాతి గ్రహంబుల విభావసుకరణి దైత్యులందుఁ బ్రహ్లాదుని భంగి మణులయందుఁ బద్మరాగంబు రేఖ వృక్షంబులందు హరిచందనతరువు రీతి ఋషులందు నారదుమాడ్కి ధేనువులందుఁ గామధేనువు పోల్కి సూక్ష్మంబులందు జీవుని తెఱంగున దుర్జయంబులందు మనంబు చొప్పున వసువులందు హవ్యవాహనుని పోఁడిమి నాదిత్యులందు విష్ణువు కరణి రుద్రులయందు నీలలోహితునిరీతిని బ్రహ్మలయందు భృగువు సొబగున సిద్ధులయందుఁ గపిలుని లీల నశ్వంబులందు నుచ్చైశ్శ్రవంబు లాగున దర్వీకరంబులందు వాసుకి రూపున మృగములందుఁ గేసరి చెలువున నాశ్రమంబులందు గృహస్థాశ్రమంబు క్రియ వర్ణంబులలో నోంకారంబు నిరవున నాయుధంబులఁ గార్ముకంబు సోయగంబున యజ్ఞంబులలో జపయజ్ఞంబు చాడ్పున వ్రతంబులం దహింస కరణి యోగంబులం దాత్మయోగంబు రమణ నోషధులయందు యవల సొబగున భాషణంబులందు సత్యంబుతేవ ఋతువులందు వసంతంబు ప్రౌఢి మాసంబులందు మార్గశీర్షంబు మహిమ యుగంబులందుఁ గృతయుగంబు నోజఁ దేజరిల్లు. అట్టి భాగవత పురాణంబు పఠియించి విష్ణు సాయుజ్యంబుఁ బొందుదురు. అని మఱియు నిట్లనియె.

కం. సకలాగమార్థపారగుఁ, డకలంక గుణాభిరాముఁ డంచిత బృందా
రక వంద్య పాదయుగుఁ డగు, శుకయోగికి వందనంబు సొరిది నొనర్తున్. 48

సీ సకలగుణాత్మకు సర్వజ్ఞు సర్వేశు నఖిలలోకాధారు నాదిదేవుఁ
బరమదయారసోద్భాసితుఁ ద్రిదశాభి వందిత పాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంత శూన్యుని వేదాంతవేద్యుని విశ్వమయునిఁ
గౌస్తుభ శ్రీవత్స కమనీయవక్షుని శంఖ చక్ర గదాసి శార్ఙ్గధరుని

ఆ. శోభనాకారుఁ బీతాంబ రాభిరాము
రత్నరాజిత మకుట విభ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయ పుణ్యదేహుఁ
దలఁతు మతియంతు దేవకి తనయు నెపుడు. 50

మ. అని యీరీతి నుతించి భాగవత మాద్యంతంబు సూతుండు సె
ప్పిన సంతుష్టమనస్కులై విని మునుల్ ప్రేమంబునం బద్మనా
భునిఁ జిత్తంబున నిల్పి తద్గుణములన్ భూషించుచున్ ధన్యులై
చని రాత్మీయనికేతనంబులకు నుత్సాహంబు వర్ధిల్లఁగన్. 51

కం. జనకసుతా హృచ్చోరా!; జనకవచః పాలనాత్త.శైలవిహారా!
జనకామిత మందారా!; జననాదిక నిత్యదుఃఖచయసంహారా! 52

మాలిని. జగదవన విహారీ! శత్రులోక ప్రహారీ!
సుగుణవన విహారీ! సుందరీ మానహారీ!
విగత కలుష పోషీ! వీరవర్యాభిలాషీ!
స్వగురు హృదయ పోషీ! సర్వదా సత్యభాషీ. 53

గద్య. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య, పోతనామాత్య ప్రియశిష్య వెలిగందల నారాయణాఖ్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందు రాజుల యుత్పత్తియు, వాసుదేవ లీలావతార ప్రకారంబును, గలియుగ ధర్మప్రకారంబును, బ్రహ్మ ప్రళయ ప్రకారంబును, ప్రళయ విశేష బులును, దక్షకునిచే దష్టుండై పరీక్షిన్మహారాజు మృతినొందుటయు, సర్పయాగంబును, వేద విభాగక్రమంబును; బురాణానుక్రమణికయు, మార్కండేయోపాఖ్యానంబును,సూర్యుండు ప్రతి మాసంబును వేర్వేఱు నామంబుల వేర్వేఱు పరిజనులతోఁ జేరుకొని సంచరించు క్రమంబును, తత్తత్పురాణగ్రంధసంఖ్యలు నను కథలుగల ద్వాదశస్కంధము సంపూర్ణము. 54

శ్రీమహాభాగవతము సంపూర్ణము